

RAJAH SREE SURABHI VENKATA LAKSHMA ROW BAHADUR,

**RAJAH of JUTPROLE,**

**NIZAM'S DOMINIONS.**

ANANDA PRESS, MADRAS.

శ్రీ

శ్రీకవిసార్వభౌములగు మ-రా-రాశ్రీ రాయబహాదరు
కందుకూరు - వీరేశలింగంపంతులవా రిచ్చినయభిప్రాయము.

తాము దయతో నంపిన శ్రీకొల్లాపురాధీశ్వరమాధవరాయకృత చంద్రికాపరిణయమును నే నక్కడక్కడఁ జదివి చూచితిని. మూలము వసుచరిత్రము వలె శ్లేషభూయిష్ఠమయి మృదుపదఘటితమయి యత్యంత ప్రౌఢముగా నున్నది. శ్రీమద్వెల్లాల సదాశివశాస్త్రులవారిచేతను అవధానము శేషశాస్త్రివారిచేతను రచియింపఁబడిన వ్యాఖ్యానము సామాన్యముగఁ బండితులకు సహితము దురవగాహములుగా నుండుమూలభాగముల యర్థతాత్పర్యములను స్పష్టముగా వివరించునదియయి, వారి యసమానపాండిత్యమును వెల్లడించుచు సర్వవిధముల శ్లాఘాపాత్రమయి లోకోపకారార్థముగాఁ జంద్రికాపరిణయమును ముద్రింపింపఁ బూనినవర్తమాన కొల్లాపురాధీశ్వరు లగుశ్రీసురభిరాజావేంకటలక్ష్మారావు బహాదురుగారికిఁ గీర్తిదాయకమయి యున్నది. ఈసవ్యాఖ్యానచంద్రికాపరిణయ మాంధ్రమండలమునం దంతట వ్యాపించి శాశ్వతముగా నెలకొనుఁ గాక !

ఇట్లు విన్నవించు
భవద్విధేయాప్తుఁడు,
కందుకూరి - వీరేశలింగము.

శ్రీ

మద్రాసు క్రిస్టియన్ కాలేజ్ సంస్కృతప్రధానపండితులు విద్వత్సార్వభౌములు నగు బ్రహ్మశ్రీ వేదము-వేంకటరాయశాస్త్రులవా రిచ్చిన యభిప్రాయము.

శ్రీమత్కొల్లాపురీ సంస్థానాధీశ్వరులలో ప్రాక్తను లయినశ్రీమాధవనాయనివారు రచించిన చంద్రికాపరిణయం బనుప్రాచీనగ్రంథమును ముద్రాక్షరాంకితముగాఁ గనునట్టిభాగ్యము నేఁటి కొదవినది.

వసుచరిత్రకన్న శ్లేషగాంభీర్యంబు గల్గి రసనిష్యందనంబున విజయవిలాసముం బురణించుచు కల్పనాప్రౌఢియందు ఆముక్తమాల్యదం దలఁపించుచు అట నట న్యాయవైశేషికాది శాస్త్రమర్యాదల ననుసంధించుచు నుండునీయతి ప్రౌఢప్రబంధము వ్రాఁతపుస్తకములలో బహుదోషములపాలయి యుండినది. దీని యర్థమును భేదించుట సామాన్యపండితులకును అశాస్త్రజ్ఞులకును శక్యముగాదు. అట్టి యీ కఠినగ్రంథమును విద్వత్సార్వభౌము లగుశ్రీమద్వెల్లాల సదాశివశాస్త్రి శేషశాస్త్రులవారలు చేపట్టినందున దీనికి సమంజస మైనవ్యాఖ్య నిష్పన్నం బయి,యిది పండితులకు సుఖముగా నాస్వాదనీయంబయినది. ఇట్టి యీకావ్యమునకు వీరిచే వ్యాఖ్య చేయించి ముద్రింపించినప్రభువులకు శాశ్వతకీర్తియు ఆంధ్రపండితులకు వారింగూర్చి యఖండకృతజ్ఞతయు పృథివియందు నెలకొన్నవి.

మదరాసు
8-11-04.

వేదము-వేంకటరాయశాస్త్రి.

శ్రీరస్తు.

# భూమిక.



శ్రీమజ్జగదీశ్వరునిచే సృజయింపఁబడిన చరాచర ప్రపంచంబెల్ల నామ రూపాత్మకంబై విలసిల్లుచున్న దనియు, అందు రూపాదిసృష్టికన్న నామాత్మక ప్రపంచసృష్టి ప్రధానం బనియు, నది ధ్వనివర్ణపదవాక్యభేదముల నలుతెఱంగులుగాఁ దేజరిల్లుచుండినను భేర్యాదినాదరూపంబై నిరర్థకం బగుధ్వన్యాత్మకశబ్దంబునకన్న వర్ణపదవాక్యరూపం బగుశబ్దంబుముఖ్యంబై శ్రుతిస్మృతీతిహాసాదినానారూప విద్యాత్మకంబుగ విద్యోతమానం బగుచున్న దనియు, నిఖిలజగంబుల నుల్లసిల్లువిద్యలలోఁ గొన్ని ప్రభుసమ్మితంబులు గొన్ని సుహృత్సమ్మితంబులు గొన్ని కాంతాసమ్మితంబు లని ముత్తెఱంగులుగా విభజింపఁబడిన, నందుఁ బ్రభుసమ్మితంబులై శబ్దప్రధానంబు లగువేదాదులకన్నను, సుహృత్సమ్మితంబులై యర్థప్రధానంబు లగుపురాణాదులకన్నను గాంతాసమ్మితంబై లోకోత్తరవ్యంగ్యార్థప్రవణం బగుకావ్యంబు "కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే। సద్యః పరనిర్వృతయే కాన్తాసమ్మితత యోపదేశయుజే" అనునభియుక్తోక్తివలన, నిరతిశయశ్రేయంబును, నిరుపమధనచయంబును, రాజాదిగతోచితాచారపరిజ్ఞానంబును, నమంగళనివర్తనంబును స్వానుసంధానసమనంతరంబే విగళితవేద్యాంతరానందంబును, కాంతవలె సరసతనొందించి యుపదేశంబును, లోనగుప్రయోజనరత్నంబులు సంపాదించునది గావున సకలసహృదయసంసేవ్యం బనియు, నెల్లరకుఁ దెల్లంబే కదా! ఇట్టిదియెల్లం బరికించి శ్రీమద్భాగ్యనగరమహారాజ్య మధ్యవిద్యోతమానం బగుశ్రీమజ్జటప్రోలుసంస్థానంబును బాలించినవారును శ్రీమత్పిల్లలమఱ్ఱిబేతాళనాయనిగారి వంశీయులును, దర్కాలంకారవ్యాకరణాదినానాశాస్త్రపారీణులును, శ్రీరేచర్లగోత్రపవిత్ర సురభిమల్లక్ష్మాపాలసత్పుత్త్రులు నగుశ్రీమన్మాధవరాయప్రభుపుంగవులవారు చంద్రికాపరిణయం బనునీకావ్యరత్నమ్మును నిర్మించిరి.

ఈ ప్రబంధంబు వసుచరిత్రమునకు సమకాలికంబుగాఁ దెలియఁదగియున్నది, ఏలాగనిన, ఈమాధవరాయలవారు శ్రీమత్కృష్ణదేవరాయలవారియల్లుండగుట నళియరామారాయండని ప్రసిద్ధిం గాంచిన రామదేవరాయలవారివలన జటప్రోలుసంస్థానమును (1000) ఫసలిలోఁ గైకొన్నవా రగుటచేఁ దత్కాలి

కులుగా నిర్ణయింపఁబడినవారు. ఈరాయలవారు కర్నూలుమండలము నేలుచు "అనఘతరకందనోలిమహాపురీని, శాంతుఁ డగురామమేదినీకాంతుఁ డలరఁగ" అని వసుచరిత్రమునఁ జెప్పఁబడినవారు. వీరియాస్థానంబున కలంకారప్రాయుం డై యుండుటంబట్టి య బట్టుమూర్తి రామరాజభూషణుం డని ఖ్యాతిం గాంచినవాఁ డని యాంధ్రకవులచరితంబున వ్రాయంబడి యున్నది. దీనిఁ బట్టి చూడఁగా బట్టుమూర్తియు శ్రీమన్మాధవరాయలవారు నేకకాలపువారని నిర్ధారిత మగుటంజేసి యీ చంద్రికాపరిణయము వసుచరిత్రమునకు సమకాలిక మని స్థిరపడుచున్నది.

చంద్రిక యనునాయికయొక్క పరిణయమును ముఖ్యముగఁ జెప్పుటచే దీనికిఁ జంద్రికాపరిణయ మనునామం బన్వర్థంబై యమరె. ఈకావ్యరత్నంబు శృంగారరస ప్రధానంబై యాఱాశ్వాసములతో నమర్పఁబడియున్నది. ఇది యంతట శ్లేషభూయిష్ఠంబై చతుర్థాశ్వాసం బెల్ల యమకాలంకారములతో రాజిల్లుచు న్యాయవైశేషిక వేదాంతవ్యాకరణాది తంత్రప్రసిద్ధకల్పనానల్పం బై గ్రంథనిర్మాతృలోకోత్తరపాండితిని మెండుకొలుపుచున్నది. ఇందుఁ గృతిపతి శ్రీజటప్రోలుమదనగోపాలమూర్తి, కథానాయకుండు సుచంద్రుఁ డనుమహారాజు. ఈ భూపాలాగ్రణి సూర్యవంశీయుండై విశాలానగరాధీశుం డగువాఁడు. ఈ పుణ్యశ్లోకుండే శ్రీమద్రామాయణబాలకాండమునందు "విశాలస్య సుతో రామ హేమ చన్ద్రో మహాబలః। సుచన్ద్ర ఇతి విఖ్యాతో హేమచన్ద్రాదనన్తరః" అని చెప్పఁబడినరాజు. కథానాయిక చంద్రిక యనునామె. ఈమె వసంతుం డనుమునివరునిశాపవశంబున మనుష్యజాతిం బడసినచిత్రరేఖ యను దేవాంగన. ఈ భాగ్యవతికిఁ బాంచాలదేశాధీశుం డగుశుభోదయనరేంద్రుం డు జనకుండు, శ్యామ యనుభామ జనని. ఇట్టిలోకోత్తర నాయికానాయకుల సంఘటనంబుచేఁ దేజరిల్లునేతత్కావ్యగతకథ యందఱకు శ్రుతపూర్వంబు గామిం జేసి తత్సంగ్రహంబు వ్రాయంబడుచున్నయది. ఎట్టులనిన.

నైమిశ మనుపుణ్యారణ్యమున సుఖాసీనుం డగుసూతునిఁ గూర్చి శౌనకాదిమహర్షులు ఓ మహానుభావా! పుడమిలోఁ బుణ్యశ్లోకావతంసుండై ప్రజల నీతిబాధలు లేనట్లు చక్కఁగఁ బాలించిన నృపతిచరితంబు దయామతితోఁ దెల్పవే యని ప్రార్థింప నాసూతుం డిట్లనియె. ధరాతలంబున నశేషవిభవసమృద్ధంబై విశాల యనునొకనగరీలలామంబు గలదు. అందు సర్వాతిశాయి శౌర్యాదిగుణగణవిరాజితుండై సుచంద్రుఁ డనునరపాలరత్నంబు రాజిల్లుచుండె. ఆరాజశేఖరుం డొక్కనాఁడు హితపురోహితాది పరివృతుండై కొలువుకూటమున రత్నసింహాసనాసీనుండై యుండ శాండిల్యమునివరుండు విచ్చేసి రాజుచేత

సత్కారపూర్వకముగ నాసనోపవేశితుండై సుచంద్రుం డార్చి యిట్లు లనియె. ఓభూమిపతి! నీవు పుడమిని నిరుపద్రవముగ నేలుచుండగా నిన్నినాళ్ళు మేము సాంగోపాంగముగ సత్కర్మానుష్ఠానములు సేయుచుంటిమి. ఇప్పుడు తమిస్రుం డనునొక రాక్షసరాజు హిమవత్పర్వతగుహాలో వసించి మ[illegible]యులకుఁ గీడు సేయుచున్నాఁడు. వానిం గ్రక్కునఁ బరిమార్చి పరిపాలింపుమా. అని యభ్యర్థన ముఁజేయ నారాజు తమిస్రు నిపుడే పరిమార్చెద మీరా పనుఁడని యా మునిరాజును బనిచి సేనాసమేతుండై యుద్ధమునకు బయలుదేరె. అట్లు బయలు దేఱి మార్గమధ్యమున హేమకూటం బనునొకగిరివరము నీక్షించి యందు సే ననుడించి నెచ్చెలికయిదండఁబూని తద్గిరివరవిభవము లెల్లఁ [illegible]చుచుఁ బోయి పోయి యొకకోనం గనియె. అందు మణిమయమండపమ[illegible]యమున నున్నబం గరు వేదికపై రత్నపీఠమందుఁ గూర్చుండి యందలివి[illegible] గటాక్షించు చుండ నెల్లమృగంబులు దల్లడిల్ల నొకసింగము నికుంజముండి వెడలె. దాని నీక్షించి యా రాజశిఖామణి తనచంద్రహాసముతో దానితల ద్రుంచె. అంత నా సింగపుమేననుండి యొకపురుషమూర్తి లేచి యా రాజు పాదము లపై వ్రాల నారాజువాని నాదరముతో లేవ నెత్తి దివ్యశరీరుండ వగునీ కిట్టి మృగశరీర మెట్లమరె మరల నది యెట్లు నివర్తిల్లెఁ జెప్పు మనుడు నాతండు తనవృత్తాంతము మొదల నుండి చెప్పఁ దొడంగె. ఒకప్పుడు కమలాసనుండు సురేంద్రాది దేవబృందముచేఁ బరివేష్టితుండై పేరోలగం బుండునవసరంబున బ్రహ్మత్వసంపాదకము లగువేదమంత్రముల కధిదేవతలు గొందఱు వచ్చి యో జగదీశ్వరా! ధరాతలంబున వింధ్యాద్రియందుఁ బారిజాతారణ్యములో వసం తుం డనునొకమునివరుండు బ్రహ్మత్వము రాఁ గోరి యుగ్రతపంబు నాచరించు చున్నాఁడు. కావున నున్నసంగతి విన్నవించితి మనిరి. పలువ యాలోచించి చిత్రరేఖ యనుదేవాంగనను మరునితోఁ గూడఁ దన్మునితపోభంగమునకై ప నిచె. తదనంతరంబ వారలు వసంతమునిచెంత కేతెంచి పలువిధము లగు తపో భంగక్రియలు సల్పిన నామునిచలింపమిఁ గాంచి చిత్రరేఖ సాహసించి యే మైన వచ్చుఁ గాక యని తన్మునిహస్తముఁ బట్టిన దయ్యె. అంత నామునివరుం డు గన్నులు దెఱచి యాగ్రహసమగ్రుండై చిత్రరేఖను జూచి యోసీ! నీ కీ దేవత్వ ముడిగి మనుష్యయోనియందు జన్మము గల్గు నని శపించె. అపు డది మిక్కిలిదుఃఖముతో నా మునిపాదములపైఁబడి వేఁడికొనఁగాఁ గరుణించి యా మునివరుండు సుచంద్రరాజును వివాహమాడి శతసహస్రపరిమితవర్షములుమా త్రము మానుషభావము దాల్చి పిదప నిజరూపమును బొందఁ గల వని యను గ్రహించె. పిదప నాయచ్చరమిన్న పాంచాలదేశాధీశుం డగుసుణదోదయురాజు

సకు శ్యామయనురాణియందుఁ బుత్త్రికయై యుదయించె. ఆరాజు సంతసించి చంద్రికయనునామ ముంచె. ఇట్లుజరిగిన దంతియునలువ చిత్తగించి యయోధ్యా నాహనుపునం జనిన చిత్రరేఖ కింత కీడు ఘటిల్లెను గదా యని చింతించి యనేక దివ్య చిహ్నానికాయము లొసంగి సన్నిధానమున నున్న కుముదుండను నన్నా నామెకు వీణాభ్యాసమునకై పనిచె. తదనుజ్ఞచే నే నామెకు గానవిద్య నంతయు నేర్పివచ్చుచుం గొవ్రుచుండి యొకనాఁడు సరస్వతీదేవి యపూర్వరాగము నాలాపింపఁగా దానిం జంద్రిక కభ్యసింపఁ జేయ వచ్చుచు నీగిరియం దొకయాశ్రమపదంబున నొక మునిభామ వసించి యుండఁగాఁ దత్సంగమాభిలాషినై ముని వేషమును దాల్చి తద్గృహము సొచ్చి యామెతో మాటాడుచుండఁ దత్పతి వచ్చి చూచి కుపితుండై ఘోరారణ్యములోఁ గ్రూర మగుసింగమురూపము దాల్చి యుండుము గాక యని శపించె. అంత నేను బరితప్తాంతరంగుండనై యాముని పాదములమీఁద వ్రాలి బతిమాలఁగాఁ గరుణవచ్చి యైదు సంవత్సరములు సింహదేహము ననుభవించిన వెనుక నిజరూపము ఘటిల్లు నని యానతిచ్చె. ఆ సుదినము నేటికి ఘటిల్లినది. నేను గిన్నరుండను. అని తెల్పి వెండియు నిట్టులనియె. ఓ మహానుభావా! చిత్రరేఖావతార యగునాచంద్రికయొక్క లావణ్యాతిశయము సాకల్యముగ వర్ణించుటకు బ్రహ్మకైనం దరముగాదు. అయిన నాతోఁచినకొలంది వర్ణించెద నని తదవయవసౌందర్యము నభివర్ణించి యట్టి లోకోత్తర స్త్రీరత్నము నీకె తగు నని వక్కాణించె. అంత నారాజచంద్రునకుఁ దచ్చంద్రికావనితను గాంచువాంఛ గలిగి యోకిన్నరవరేణ్యా! నీవిపుడు దెల్పినచంద్రికోదయక్రమము తల్లావణ్యాతిశయము విననామది యానారిని జూడ వాంఛించుచున్నది. అది యెట్లు సిద్ధించు నని వచింపఁగా నాకుముదుండు తనవిమానమును స్మరించి యందు నరపతి నధిష్ఠింపు మని తనప్రభావముతోఁ బరులకుఁ గాన్పింపకుండ క్షణమాత్రమున క్షణదోదయరాజధానియందుఁ జంద్రికాసదనోద్యానమునకుఁ దోడ్కొని చని యచటఁ జెలియలతోఁ గూడి గానము సేయుచున్న చంద్రికను జూపించె. అంత నరపాలుండు తద్గానామృతపానమునకుఁ దృప్తి నొంది తత్సౌందర్యాతిశయమునకు మిగుల నాశ్చర్యసంభ్రమములఁ బొంది యావనిత ననేక భంగుల నభినుతించె. అనంతరంబున నాకుముదుండు రాజునాజ్ఞం గొని యాయువతిబృందముఁ జేరఁబోయె. అంత నాకాంత లందఱు సంతసించి సత్కారపూర్వకముగాఁ గూర్చుండఁబెట్టి యింత కాలము రాకుండుట కేమి కతం బని యడుగఁగా నతం డిదే సమయ మని చింతించి, విశాలాధీశుండై వసుచంద్రుఁ డనునరపతి గలఁడు, ఆరాజు నిరతిశయగుణగరిష్ఠుండు, అతని చెలిమిచే నిన్నినాళ్ళుంటి. ఇపుడు తదనుజ్ఞ నొంది

చంద్రికాదర్శనాభికాంక్షతో నిటకు వచ్చితి ననఁగాఁ జంద్రికాసఖియైన చకోరియనునది, ఓ గురువర్యుఁడా! చిరకాలమునుండి సుచంద్రనరపతిగుణరత్న శ్రవణమునఁ జంద్రికకుఁ దద్దర్శనోత్కంఠ గలిగి యున్నది,అది మాకేవిధముగ ఘటిల్లునని పలికె. అంతఁ గుముదుండు సంతుష్టుఁడై చకోరీ! అల్లన మీరు నాచెయిచాయం గాంచుఁడు ఆరాజు మీకునయనగోచరుం డగు నని తనపూర్వమాయను దొలంగించి హ స్తనిర్దేశము సేయఁగా'నందఱు విమానస్థనరపాలు నీక్షించి మిగుల నాశ్చర్యజలరాశిం దేలిరి. చంద్రిక చెలికయిదండఁ బూని నిలిచి యించుకలజ్జతో రాజు నీక్షించి యానంద సుధారససముద్రమున మునిఁగి రాజుం బలుతెఱంగుల నభివర్ణించి యనురాగాతిశయపరవశయై యుండునెడఁ జంద్రికాజననిపనుపున నొక్కతె వచ్చి చంద్రికను దోడ్కొని పోయె. అపుడు సుచంద్రనరపతి చంద్రికాగుణనుతి సేయుచుఁ జింతాకులితస్వాంతుఁడై యుండఁ గుముదుండు వచ్చి యావనితకై చింత పని లేదు, తత్పాణిగ్రహణంబు జాతప్రాయంబ యనియాశ్వాసించి సుచంద్రుని మరల విమానాధిరూఢుంగావించి హేమకూటమునం జేర్చి తదాజ్ఞచేఁ దననికేతనమునకు నెడలె. తర్వాత నరపాలుఁడు శాండిల్యమునితోడఁ బల్కిననిజవాక్యమును స్మరించి తమిస్రాసురనివాసభూమికిం జని ఘోరరణము సల్పి వాని సంహారించి నిజరాజధాని కేగి యవశ్యాచరణీయము లగుకృత్యములు నిర్వర్తించి శయ్యపైఁ బవ్వళించి చంద్రికను వరించుభాగ్య మేనాఁడు గల్గునో యని బహు ప్రకారములుగాఁ జింత సేయుచు మలయానిలాదులకు రూఢానురాగుండై యడలుచుండె. అటఁ జంద్రికయు మదనబాధావివశయై సుచంద్రు నెన్నఁడు వరింపఁ గల్గునో యని చింతించుచునుండె. అంత వలఱేనికి సహాయముగ వసంతోదయమై చంద్రికాసంతాపమును మిక్కుటమ్ముగాఁ జేసె. అపుడు చకోరి యనునెచ్చెలి వచ్చి బాలా! ఇట్లు మరుమార్గణముల కేల దుఃఖించెదు మరునిఁ బూజించినచో నిష్టసిద్ధు లెల్లఁ జేకూఱును రమ్ము క్రీడావనమున కేగుద మని తోడ్కొని పోయి తద్వనవిభవము నంతయు నేర్పడఁ జెప్పుచుండె. వచ్చినవనిత లందఱు పుష్పాపచయమ్ముఁ జేసి యొకకొలను సొచ్చి జలక్రీడలు సల్పి భక్తితోడ రతిని మన్మథుని న్నిలిపి పలువిధమ్ములఁ బూజించి చంద్రికను గేళీగృహమునకుఁ గొని తెచ్చి విరిసెజ్జపైఁ జేర్చిరి. అట్లు శయ్యఁ జేరిన చంద్రిక మదనానలసంతప్తయై తల్లడిల్లుచుండ సూర్యుం డస్తమించి చంద్రోదయమై యెల్లెడ జ్యోత్స్నావ్యాప్తి గలిగి దానివలన నిజసంతాపంబు మిక్కుటంబు గాఁగా నాచంద్రిక చంద్రుని దూఱి యట్లే మరుని మలయానిలాదులను దూఱి స్మరశరాహతికిఁ దాళఁ జాలక మరణవ్యవసాయము సేయఁగా సఖీవర్గంబు సాంత్వోక్తులతో నూ

ఆడించి శీతలోపచారంబులు సల్పి చంద్రాస్తమయకాలికవిభవంబులు దెల్పు చుఁ బ్రొద్దుగడపుచుండె. అంతఁ బ్రభాతం బగుటఁ జంద్రిక తత్సమయోచిత కృత్యంబులు నిర్వర్తించి సుచంద్రుని వరించుటను గాంక్షించుచుండె. అంత నంతఃపురనారీమణులవలన సుచంద్రనరపాలునందుఁ జంద్రికామనంబు గాఢ లగ్నం బైనట్లు క్షణదోదయుం డెఱింగి మిగుల సంతసించి స్వయంవరమహో త్సవమునకుఁ జాటింపఁ జేసె. అంత నిఖిలరాజశిఖామణులు తమతమవిభవం బులతో బయలుదేఱి వచ్చిరి. సుచంద్రనరపాలుండును బ్రహృష్టాంతరంగుండై యేతెంచె. క్షణదోదయుండు వారల నెల్ల నెదుర్కొని తోడితెచ్చి మణిపీఠము లపైఁ గూర్చుండఁ జేసి యారాజులగుణాతిశయము లేర్పఱుప జగజ్జనని యగు పార్వతిని గొని యాడఁగా నామె సాక్షాత్కరించి, తత్కాలోచితరూపము దాల్చి యాయారాజులగుణాతిశయంబు చంద్రికకుఁ దెల్పుట కుపక్రమించి తొ లుతఁ బుష్కరద్వీపాధిపతి లోనగుద్వీపాంతరరాజులను బిదప గౌడరాష్ట్రాధి పతి లోనగుజంబూద్వీపరాజులను దెల్పి యాయా రాజులపైఁ జంద్రికాను రాగము లేమిం దెలిసి సుచంద్రనరపతి వృత్తాంత మ్మంతయు వివరింపఁ జంద్రిక ప్రహృష్టాంతరంగయై సుచంద్రునికంఠంబునఁ బుష్పమాలిక వైచె. అంత సురదుందుభిధ్వానము పుష్పవృష్టి లోనగుమంగళము లెసంగె. పార్వ తీదేవి నిజరూపము దాల్చి సుచంద్రునిపై ననుగ్రహించి భువనేశ్వరీమంత్రము నుపదేశించిలక్ష్మ్యాదిదేవతాగణసేవితయై యాక్షణదోదయునగరనుఁ బ్రవేశించె. సుచంద్రుఁడు తనశిబిరంబు చేరె. వచ్చినరాజు లందఱు తద్వివాహమహోత్సవ దర్శనాభిలాషచేఁ దమతమశిబిరముల నెనసి యుండిరి. క్షణదోదయుండును ద్వి జోత్తముల రావించి యారాత్రి వివాహముహూర్తమును నిర్ణయించి నగరా లంకారాదివైవాహికమంగళములు నిర్వర్తించుటకు శిల్పకారుల కాజ్ఞాపించె. అంత సుచంద్రనరపాలునిం బురోహితులు పుణ్యాంగనలు పెండ్లికొమరుం గా వించి చంద్రిక నట్లే గావించి మంగళస్నానములు సేయించిరి. అపుడు సుచం ద్రున కింద్రాదిదిక్పాలకు లుచితభూషణములు చంద్రికకు శచీదేవి మొదలగు వార లుచితభూషణము లొసంగి వానిం గైసేయఁ జేసిరి. అటుపై సుచం ద్రుండు సురరాజదత్త మగునైరావతముపై నెక్కి క్షణదోదయుని నికేతన మునకుఁ జనియె. క్షణదోదయుండు భక్తితో నెదుర్కొని సుచంద్రునిఁ దో డ్కొని పోయి పాదములు గడిగి పీటపైఁ గూర్చుండఁజేసి కన్నె దారపోసె. అపుడు వృద్ధసువాసినీజనంబు తలిదండ్రులు లోనగువారలు చంద్రికకుఁ బతిసే వాభంగి నెఱింగించిరి. క్షణదోదయుండు తనపుత్రిక కసేక పారితోషికముల

నుసంగి పతిగృహంబునకుఁ బనిచె నని సూతుండు శౌనకాదులంగూర్చి వచించె. ఇది కావ్యకథాసంగ్రహము.

ఇట్టి సత్కావ్యరత్నంబు జీర్ణకల్పంబై యుండిన నీక్షించి జటప్రోలుసంస్థాన ప్రస్తుత ప్రభుపుంగవులై కొల్లాపురమురాజధానిలో వసించియుండుటం జేసి కొల్లాపురాధిపతు లనియు వ్యవహరింపఁబడుచున్న శ్రీ శ్రీ సురభి రాజా వేంకటలక్ష్మారావు బహాదురువారు తత్తద్దేశంబులందుఁ బుస్తకగవేషణంబు సేయించి యీ గ్రంథంబుదురవగాహం బగుటం జేసి యుచితవ్యాఖ్యతో నలంకరింపించి సర్వసహృదయ సౌలభ్యముగ ముద్రింపించి తమపూర్వు లగుశ్రీమన్మాధవరాయలవారియశంబు నెల్లెడల నుల్లసిల్లం గావించి మిగుల ఖ్యాతిపాత్రతే వహించిరి. ఇట్టి ఘనతరకార్యకరణ ధురీణు లగునీభూపాలాగ్రణులకు శ్రీజగదీశ్వరుండు సకలశ్రేయఃపరంపరలు గృపసేయుఁ గాత.

ఇట్లు
బుధజన విధేయుఁడు
తిరుమల సెట్టి-జగన్నాథకవి.

---

బిందుఁ బ్రమాణంబు. వక్షోజధర = పర్వతములవలెనున్నతంబులగు పాలిండ్లయందు; స్ఫురత్ = ప్రకాశించుచున్న; వరము = కుంకుమము "కాశ్మీరజన్మాగ్నిశిఖంవరమ్" అని యమరము. ఉరస్సీమన్ = వక్షస్థ్సలమందు; శంపావృత్తిన్ = మెఱపుయొక్క యునికివంటి యునికిచేత; ప్రకాశింపన్ = వెలుంగుచుండఁగా; సరసత్వము = రసికత్వము, మేఘపరమైనపుడు జలవత్త్వము; "ఆస్వాదనధ్వనిసుధాంబ్బరసాఖ్యధాతుష్విష్టోరసః" అనిరత్నమాల. ఒంది = పొంది; సుమనఃపాళి ప్రియఆత్మీయసద్భావస్ఫూర్తిన్ — సుమనఃపాళి = దేవసంఘమునకు, మేఘపరమైనపుడు జాజిగుమురులకు, "సుమనాః పుష్పమాలత్యో స్త్రియాం దేవేబుధేచనా" యని నానార్థరత్నమాల. ప్రియ = హితమగు; ఆత్మీయ = స్వీయమగు; సద్భావ = మంచిస్వభావముయొక్క, సత్తయొక్క, "భావస్స్వభావేసత్తాయామ్" అని విశ్వము, స్ఫూర్తిన్ = స్ఫురణమును; తనర్చు శ్రీమదనగోపాలాహ్వయ ఉజ్జృంభిత అంభోవాహంబు — తనర్చు = అతిశయింపఁజేయునట్టి; శ్రీ = శోభాశాలియగు; మదనగోపాలాహ్వయ = మదనగోపాలుండను నామంబుగల; ఉజ్జృంభిత = ఉప్పొంగినయట్టి; అంభోవాహంబు = మేఘము; సమస్తలోకములకున్ = ఎల్లజగంబులకు; ఆమోదప్రదంబు = సంతసమిచ్చునది; అయ్యెడున్ = అగుఁగాత.

మెఱపులతోఁగూడి యుజ్జృంభితమైనయట్టి సజలజలదం బెట్లు సర్వలోకంబుల కామోదమును జేయునో, యట్లు రుక్మిణీకుచకుంభకుంకుమాంకితవక్షస్కుఁడై యనఁగా నవాప్తమనోరథుండై యుజ్జృంభితుఁడైన భగవంతుండు సమస్తలోకంబులకు సంతసంబుఁ జేయునని తాత్పర్యము, "స్వయంతుష్టః పరాన్ తోషయతి" అనున్యాయమున భగవంతుండు స్వాభీష్ట రుక్మిణీపరిరంభతుష్టాంతరంగుఁడైనపిదప స్వాశ్రితసర్వలోకానందప్రదుండగుట సులభమని కవిహృదయము. లోకోత్తరశృంగారరసభూయిష్ఠంబగు నీగ్రంథము నాదిని శృంగారరసాధిదేవతయైన శ్రీకృష్ణమూర్తి సంభోగశృంగారాలంబనవిభావముగాఁ బ్రశంసింపఁబడియె.

ఇందు వ్యజ్యమానమగు సంభోగశృంగారంబు మదనగోపాల విషయక కవిరతి యనెడు భావమును గూర్చి యంగమగుటంజేసి రసవదలంకారము "శ్లో॥ అఙ్గభావం రసో యత్ర భావం ప్రత్యథవారసమ్। భవేత్సత్ర రసవదలంకారఉదీరితః॥" అని తల్లక్షణంబు. ఇట్లు కవీష్టదేవతావిషయకరతిభావంబును, ననుగ్రాహ్య సమస్తలోక విషయక కవిరతిభావమునుగూర్చి యంగమగుటం బ్రేయోలంకారము. "శ్లో॥ ప్రేయోలఙ్కృతిరఙ్గం చే ద్భావో భావాన్తరంప్రతి" అని తల్లక్షణంబు, భావమనఁగా దేవతామునిగురుపుత్రాదివిషయకరతియు, వ్యజ్యమాననిర్వేదాదిత్రయస్త్రింశ దన్యతమంబును, దీనింగూర్చి కావ్యప్రకాశమునందు. "శ్లో॥ రతిర్దేవాదివిషయా వ్యభిచారీతథాఞ్జితః। భావఃప్రోక్తః" అని చెప్పఁబడినది.

ఇఁక భగవంతుని మేఘముగరూపించినందున రూపకాలంకారము, అదియుఁ బరంపరితమగును. పరంపరితరూపకమనఁగా రూపకాంతరమునకు హేతువగురూపకంబు, ఇట భగవంతునియం దంభోవాహత్వరూపణము, సుమనఃపాళియనెడు సుమనఃపాళీత్వాది రూపకాంతర హేతువైనది గావునఁ బరంపరితంబయ్యె. "శ్లో॥ నియతారోపణోపాయస్స్యాదారోపః పరస్యయః। తత్పరంపరితం శ్లిష్టాశ్లిష్టశబ్దాద్ద్విధాథ వేత్" అనికావ్యదర్పణమందుఁ దల్లక్ష

ణము, మఱియు నారోపాంతరహేతుకారోపవిషయ సుమన ఆదిపదములు శ్లిష్టంబులగుటం జేసి శ్లిష్టపరంపరిత మనఁబడును. కొందఱు దీని నేకదేశవివర్తిరూపకభేదమండ్రు. మఱికొంద ఱు శ్లేషాలంకారమును శాబ్దకృముగఁ జెప్పి శ్లేషసంకీర్ణ రూపక మని వక్కాణింతురు. సుమన ఆదిశబ్దములు పర్యాయ పరివృత్త్యసహములుగాన నిది శబ్దార్థోభయాలంకారమనియుఁ జెప్పుదు రు. ఐన శ్లిష్టపరంపరితరూపక మనుటయే ముఖ్యము. దీనికి వక్షోజధరయనుచోటి యుప మతో సంసృష్టియు, శంపావృత్తిక్ అనుచోటి నిదర్శనతో సంకరము నని యెఱుంగునది.

వక్షోజధర స్ఫురద్వరముర స్సీమక్ అనుచో రేఫమునకుఁ బలుమా ఱావృత్తి వలన వృత్త్యనుప్రాసమను శబ్దాలంకారము. "శ్లో॥ వర్ణసామ్యమనుప్రాస శ్ఛేకవృత్తిగతో ద్విధా। సోనేకస్య సకృత్పూర్వ ఏకస్యాప్యసకృత్పరః" అని కావ్యప్రకాశమునందుఁ దల్లక్షణము.

పద్యాదియందు భూదేవతాకంబగు మగణము ప్రయుక్తమగుటంజేసి గ్రంథకర్తృశ్రోతృవ్యాఖ్యాతృశ్రోతలకు శుభఫలంబు చేకూరును. "శ్లో॥ మోభూమి స్త్రిగురు శ్శ్రియంవితను తే" అని తత్ప్రమాణము. రెండవదగు సగణంబు దుష్టఫలప్రదంబయ్యును "శ్లో॥ సర్వమూ లంతుమగణం ప్రాప్యసర్వేగణాశ్శుభాః" అనువచనమునుబట్టి మగణముతోఁ జేరుటవలన శు భఫలప్రదంబగును. "శ్లో॥ క్షుంవినాక్రూరసంయుక్త స్సామ్యస్త్ర్యక్షోవిషాన్నవత్। శ్లేషస్తు కషయోశ్శ్రియా్ శుచశ్రావణయోరివ" అనుటవలన శ్రీశబ్దమందు శవర్ణము సౌమ్యంబయి నను క్రూరంబగు రేఫముతోఁ జేరినందున దూష్యంబని తలంపరాదు. ఏలన, "శ్లో॥ దేవతా వాచకాశ్శబ్దా యేచభద్రాదివాచకాః। తేసర్వేనైవనిన్ద్యాస్స్యు ర్లిపితోగణతోపివా" అను టవలన దేవతావాచకంబగు శ్రీశబ్దంబున కట్టిదోషంబు ప్రసక్తింపదు.

సీ. అక్రాంతభువనవి♦ఖ్యాతసద్గోత్రుఁ డై, కనుపట్టు నేచాన♦కన్నతండ్రి
యలఘుకలాశాలి♦ యై సత్ప్రభుత్వంబు, తో మించు నేయింతి♦తోడఁబుట్టు
విబుధసంత్రాణప్ర♦వీణుఁ డై నిఖిలైక, నుతిఁ గాంచు నేమాన♦వతిధవుండు
రహి నాత్మసరసధ♦ర్మగుణపాళిస్ఫూర్తి, నలరించు నేకొమ్మ♦యనుఁగుపట్టి
తే. యరయ సత్యాదికీర్తనీ♦యస్వవృత్తి, నెనయుఁగల్యాణమూర్తి దా♦నేవధూటి
యట్టిసిరి రుక్మిణీరుచి♦రాభిధాన, చిరతరైశ్వర్యములు ♦కృప♦నేయుఁగాత.

ఈపద్యగీతిలో సిరిరుక్మిణీరుచిరాభిధాన యనుచోట రుక్మిణీదేవియందు లక్ష్మీత్వము నా రోపించుటంజేసి యర్థద్వయము దోఁచుచున్నది.

టీక. ఏచానకన్నతండ్రి=ఏస్త్రీయొక్క కన్నతండ్రి, భీష్మకుఁడును, సముద్రుఁడును; అ క్రాంతభువనవిఖ్యాతసద్గోత్రుఁడై— అక్రాంత=ఎల్లప్పుడును, "సతతానారతాక్రాంత సంతతా విరతానిశమ్" అని యమరము. భువన=లోకములయందు; విఖ్యాత=ప్రసిద్ధమగు; సద్గోత్రుఁడై= మంచికులముగలవాఁడై; అని రుక్మిణీపరమగునర్థము. అక్రాంత = నాశములేని; భువన=జల

మందు; విఖ్యాత=ప్రసిద్ధమగు; సద్గోత్రుఁడై = శ్రేష్ఠములైన మైనాకాదిపర్వతములుగలవాఁడై యని లక్ష్మీపరమైనయర్థము; "జీవనంభువనంవనమ్" అని యమరము. కనుపట్టుక్ = చూపట్టునో; ఏయింతితోడఁబుట్టు=ఏసతియొక్క సోదరుఁడు, రుక్మియు, చంద్రుఁడును; అలఘుకలాశాలిఐ=అధికములగు విద్యలచేత, కాంతులచేత, నొప్పుచున్నవాఁడై; సత్ప్రభుత్వంబుతోన్ = మంచి దొరతనముతోను, నక్షత్ర రాజత్వముతోడ. "సన్నక్షత్రేవిద్యమానేభ్యర్హితే" అనివిశ్వము. మించుక్=అతిశయించునో; ఏమానవతిధవుండు=ఏమానవతియొక్క పతి, కృష్ణుఁడును, నారాయణమూర్తియు; విబుధసంత్రాణప్రవీణుఁడై=పండితులయొక్క, దేవతలయొక్క, రక్షణమందునిపుణుఁడై; నిఖిలైకనుతిఁగాంచుక్ = ఎల్లవారిలోముఖ్యమానట్లుగా పొగడ్తనొందునో, "ఏకేముఖ్యాన్యకేవలాః" అని యమరము. ఏకొమ్మయనుఁగుపట్టి = ఏ స్త్రీయొక్క కూరిమిపుత్త్రుఁడు, ప్రద్యుమ్నుఁడును, మన్మథుఁడును; రహిక్=అసక్తిచేత; ఆత్మసరసధర్మగుణపాళిస్ఫూర్తిక్—ఆత్మ=తనయొక్క; సరస = శ్రేష్ఠములగు; ధర్మగుణ = ధర్మగుణములయొక్క; పాళి=పంక్తులయొక్క; స్ఫూర్తిక్=ప్రకాశమును; ఆత్మ=తనయొక్క; సరసధర్మ= మధురరసయుక్తమగు చెఱకువింటియొక్క, "ధర్మఃపుణ్యేయమే న్యాయే స్వభావాచారయోఃక్రతౌ । ఉపమాయామహింసాయాంచాపే చాపనిషద్యపి" అనివిశ్వము. గుణప=అల్లెనుపోషించుచున్న; అళిస్ఫూర్తిక్=తుమ్మెదలయొక్క స్ఫురణమును; అలరించుక్=విస్తరింపఁజేయునో; అరయక్ = విచారింపఁగా; ఏవధూటి = ఏకొమ్మ; సత్యాదికీర్తనీయస్వవృత్తిక్— సత్యా=సత్యభామ; ఆది=మొదలగువారిచేత; సతీ=పార్వతీదేవి; ఆది=మొదలుగాఁగలవారిచేత; కీర్తనీయ = కొనియాడఁదగు; స్వవృత్తిక్=తన దైనసద్వృత్తిని; ఎనయుక్=పొందియుండునో, తాక్=తాను; కల్యాణమూర్తి = మంగళవిగ్రహముగలదో; సువర్ణరూపయైనదో, "చన్ద్రాం హిరణ్మయీం లక్ష్మీమ్" అనిశ్రుతి. రుక్మిణీరుచిరాభిధాన=రుక్మిణియను మనోజ్ఞమగు నామముగల; అట్టిసిరి = పూర్వోక్తగుణములుగల లక్ష్మీదేవి; ఇందు సిరియే రుక్మిణీనామముగలదనుటకు, "రాఘవత్వేభవత్సీతా" అనుపూర్వోదాహృతవచనముప్రమాణము. చిరతరైశ్వర్యములు=అత్యంతచిరకాలస్థాయులగు నైశ్వర్యములు, శాశ్వతైశ్వర్యములనుట; స్థిరతరయనుపాఠము సుకరము. కృపసేయుఁగాతక్ = దయసేయుఁగాత నని యాశీర్వచనము.

రూపకాలంకారభేదము. ఇందు శ్రీరుక్మిణీదేవీ విషయకకవిరతియనెడు భావము వ్యజ్యమానమగుచున్నది గాన భావధ్వనియగును.

మ. పలుకుందొయ్యలిమోవితేనియలు శుం•భత్ప్రీతిమైఁ గ్రోలి ముం
గలిమోముం బొలయల్కపేర మరలం • గావించి పశ్చాత్తటో
జ్జ్వలవక్త్రంబున నాని తా నధికహా•ర్షం బూని యిష్టార్థము
ల్దలకొన్గాత యొసంగుఁ గాత శుభధీ•లాభంబు మా కెంతయున్. 3

టీక. పలుకుందొయ్యలిమోవితేనియలు=సరస్వతియధరమధువులను; శుంభత్ప్రీతిమైక్=అధికమైనప్రేమచేత; క్రోలి=పానముఁజేసి; పొలయల్కపేరక్ = ప్రణయమానముయొక్క

సాకుచేత; ముంగలిమోముక్ = ఎదుటనున్న ముఖమును; మరలంగావించి=మరల్చి; పశ్చాత్తటోజ్జ్వలవక్త్రంబునక్=వెనుకవెలయుచున్న మోముచేతి; ఆని=పానముచేసి; తాక్ ; అధిక హర్షంబు=అధికసంతోషమును; ఊని=వహించి; ఇష్టార్థముల్ = ఇష్టమైనయాలింగనాద్యర్థములను; తలకొన్నధాత=పొందునట్టిబ్రహ్మ; మాకుక్; శుభధీలాభంబు = మంచిబుద్ధియొక్క లాభమును; ఎంతయుక్ = మిక్కిలి; ఒసంగుఁగాతక్= ఇచ్చుఁగాక, ఇచటఁ దలకొన్నధాత యను చోట "పదాంతంబులగు ను ఉ రు ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగానగు" నను బాలవ్యాకరణసూత్రముచేఁ దలకొను నుకారలోపం బైనది.

ఈ పద్యమందు వాణీవిధాతల లోకోత్తర సంభోగశృంగారము వ్యక్తంబగుచున్నది. "శ్లో॥అనుకూలౌ నిషేవేతే యత్రాన్యోన్యం విలాసినౌ।స్పర్శనాలిఙ్గనాదీని ససంభోగ ఇతీరితః" అని తల్లక్షణము. ఇట్టి శృంగారము విధాతృవిషయకకవిరతినిగూర్చి యంగభావమునొంది నందున రసవదలంకారమగును. లక్షణము వ్రాయఁబడియె.

సీ. రమణీయతరపదా♦ర్థప్రకాశనిదాన, భాస్వత్ప్రసాదసం♦పద వహించి
పటుసారసానంద♦ఘటకైకచాతుర్య, ఘనకృతాలంకార♦కలన మెఱసి
యనుకూలకాలకం♦ఠాకుంఠకలనాద, వలమానమంజుల♦ధ్వనుల నలరి
యతివేలకవిజాల♦కామోదనాపాద, కారణరసభావ♦గరిమ నెనసి
తే. పరమయతియోగసంస్థాన♦పదమనోజ్ఞ
వైభవోన్నతిఁ దగునర♦స్వతి మదీయ
మానసాస్థానమందిర♦మధ్యవీథి
నిండుకొలువుండుఁ గాత ని♦ష్ఖండలీల. 4

ఈపద్యము గీతియందు నదీభారతులను బోధించుసరస్వతీశబ్దము కర్తృపదము గాఁజేసి యర్థద్వయము కల్పింపఁబడియె.

టీక. రమణీయతరపదార్థప్రకాశనిదానభాస్వత్ప్రసాదసంపదక్—రమణీయతర=అత్యంతమనోహరములగు; పదార్థ=శబ్దార్థములయొక్క;ముక్తాదిద్రవ్యములయొక్క;ప్రకాశ=ప్రకాశమునకు;నిదాన=ఆదికారణమగు, "నిదానంత్వాదికారణమ్" అనియమరము. భాస్వత్= ఒప్పుచున్న;ప్రసాద=ప్రసాదమనెడు కావ్యగుణముయొక్క, "శ్లో॥యశ్చిత్తంవ్యాప్నోతిహస్తి యఃశుష్కేన్ధనమివానలః । సప్రసాదో మత స్సర్వరససాధారణస్థితిః" అని సాహిత్యరత్నాకరము. నైర్మల్యముయొక్క, "ప్రసాదస్తు ప్రసన్నతా" అని యమరము. "కన్దారోధఃపతనకలుషా గఙ్గా తీవప్రసాదమ్" అనినైర్మల్యమందు విక్రమోర్వశీయమునఁ గాళిదాసప్రయోగము. సంపదక్=సమృద్ధిని; వహించి=పొంది; పటుసారసానందఘటకైక చాతుర్యఘనకృతాలంకారకలనక్—పటు=సమర్థమగు; సారస = రసికసమూహమునకు; సరసశబ్దము మీఁద సమూహార్థమందణ్ప్రత్యయము, బెగ్గురులకు; ఆనందఘటక = ఆనందముగూర్చునట్టి; ఏక=ముఖ్యమగు; చాతుర్య = నేర్పు చేత, నదీపరమైనయర్థమందు నేర్పుగల యని చాతుర్య

శబ్దాంతము బహువ్రీహి చేయవలెను. ఘన=అధికమగునట్లుగా, మేఘములచేత; కృత=చేయఁబడిన; అలంకార = ఉపమాదులయొక్క, ఒప్పిదములయొక్క; కలనన్=ప్రాప్తిచేత; మెఱసి=విలసిల్లి; అనుకూలకాలకంఠాకుంఠకలనాదవలమానమంజులధ్వనులన్ - అనుకూల=అనుకూలములగు,కూలానుసృతములగు; కాలకంఠ = కలకంఠీసంఘముయొక్క, స్త్రీసమూహముయొక్కయనుట, నెమిళ్లయొక్క; అకుంఠ=అడ్డములేని; కలనాద = అవ్యక్తమధుర శబ్దములభంగి, కలనాదములతోడను; వలమాన=ఒప్పుచున్న, కూడుకొన్న; మంజుల=మనోజ్ఞములగు; ధ్వనులన్= వ్యంగ్యార్థముల చేతను, తరంగధ్వనుల చేతను; అలరి=ఒప్పి; "శ్లో॥ కాంతాసమ్మితయా యయా సరసతా మాపాద్య కావ్యశ్రియా" అని ప్రతాపరుద్రీయమందుఁ జెప్పుటవలనఁ గావ్యధ్వనులకుఁ గాలకంఠాకుంఠ కలనాదవలమానత్వము గలుగుననిభావము. అతివేలకవిజాలకామోదనాపాదకారణరసభావగరిమన్ - అతివేల=అధికమగు; కవిజాలక=పండితమండలియొక్క; క=జలమందుండెడు, వి=పక్షులయొక్క, జాలక= సమూహముయొక్క; ఆమోదన=సంతసముయొక్క; ఆపాద = సంపాదనమునకు; కారణ = హేతువైన; రస=శృంగారాదిరసరూపములగు; భావ=రత్యాదిస్థాయి భావములయొక్క, "శ్లో॥ విభావైరనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః। ఆనీయమాన స్స్వాదుత్వం స్థాయీ భావో రసస్స్మృతః" అని స్థాయిభావమే రసరూపమగునని చెప్పఁబడినది గాన రసరూపములగు రత్యాదిస్థాయిభావములయొక్క యని వ్యాఖ్యాతంబయ్యె, కాదేని,శృంగారాదిరసములయొక్క వ్యజ్యమాననిర్వేదాదిసంచారిభావములయొక్క; నదీపరమగునపుడు, రసభావ=జలసత్తయొక్క, "భావస్స్వభావేసత్తాయామ్" అని విశ్వము. గరిమన్=అతిశయమును; ఎనసి= పొంది; పరమయతియోగసంస్థానపదమనోజ్ఞవైభవోన్నతిన్ - పరమ=ఉత్కృష్టమగు;యతి=పదవిచ్ఛేదముయొక్క, "యతిర్విచ్ఛేదసంజ్ఞకః" అనివృత్తరత్నాకరము, మునులయొక్క;యోగ=సంబంధముయొక్క; ధ్యానమునకు; సంస్థాన=సన్నివేశముగల ఆశ్రయములగు; పద=పద్యచతుర్థ భాగములయొక్క, ఆశ్రమస్థానములయొక్క; మనోజ్ఞ=మనోహరమగు; వైభవోన్నతిన్= విభవాతిశయము చేత; తగుసరస్వతి = ఒప్పుచున్న వాగ్దేవి, ఒకనది; మదీయమానసాస్థానమందిరమధ్యవీథిన్ —మదీయ=నాసంబంధియైన; మానస = హృదయమనెడు;ఆస్థానమందిర=సభామందిరముయొక్క; మధ్యవీథిన్=మధ్యప్రదేశమునందు; నిష్ఖండలీలన్ = అఖండవిలాసము చేత; నిండుకొలువుండుఁ గాతన్=నిండుకొలువునొందుఁగాత.

ఇందు శబ్దశక్తి ప్రకృతార్థమందు ప్రకరణాదినియంత్రితమైనందున నప్రకృత నదీపరమైనయర్థము వ్యంగ్యమని ప్రాచీనులు. అర్థద్వయము వాచ్యమె కావచ్చుఁగావున శ్లేషాలంకారమని కొందఱు నవీనులు చెప్పుచున్నారు. మతద్వయమునందు నుపమాలంకారము వ్యంగ్యము. మఱియు సరస్వతీదేవీవిషయక కవిరతిధ్వనితమగుచున్నది గాన భావధ్వని.

చ. పలుచఁదనంబు పూని జడ♦భావము నందినవారి మౌళిపై
నిలిపి స్వవిగ్రహైకగతి ♦ నిచ్చలు నార్య మహాగుణోన్నతం
గలయఁగఁ జేసి ధూర్తశి♦ఖామణి వై తని గోరి యల్లఁగా
నలఘుమృదూక్తి వేఁడుశివుఁ ♦ డాయతసౌఖ్యము మాకు నిచ్చుతన్. 5

టీక. పలుచఁదనంబు=లఘుత్వమును; పూని=వహించి; జడభావమును=మూర్ఖతను; ఒంది నవారిన్=పొందినట్టివారిని; మౌళిపైనిలిపి = నెత్తిమీఁద నెక్కించుకొని; స్వవిగ్రహైకగతిన్—స్వ=తనయొక్క; విగ్రహ=విరోధముయొక్క; ఏకగతిన్=ముఖ్యప్రాప్తిచేత; దీనికిఁగలయఁగఁజేసి యనుక్రియయందన్వయము; మహాగుణోన్నతిన్=ఉత్కృష్టములగు సౌశీల్యాదిగుణములచే నధికయగు; ఆర్యన్=యోగ్యురాలైననన్ను; కలయఁగఁజేసి=కలఁతపొందునట్లొనరించి; ధూర్తకశిఖామణివైతి=మోసకాండ్రయందు మొదటివాఁడవైతివి; అనఁగా శివుండు పలుచఁదనంబుపూని జడభావము నందినవారి ననఁగా చిక్కనిదిగాకుండి- జలరూపమునందియున్న యుదకప్రవాహరూపయైన గంగను శిరస్సునందు ధరించినాఁడనియు, మహాగుణోన్నతయు నార్యయునగు పార్వతిని తనశరీరమునం దేకీభావము నొందించినవాఁడనియు, ధూర్తకమనఁగా దుత్తూరకుసుమము, దానిని శిరోభూషణముగ నుంచినాఁడనియు, భావము, వెండియుఁ బలుచదనంబుపూని జడభావమునందినవారి లోనగువానిచేత గండస్థానాద్యవయవశైథిల్యముగలిగి జాడ్యమునొందినముదుసలిదానిని శిరంబునందునిల్పి యుత్తమగుణములు గలదై వెలయు నార్యననఁగాఁ బదునాఱు వత్సములుగల భార్యయందు దావీచుఁడవై సర్వకాలముఁ దగవులపాలై ధూర్తాగ్రేసరుండని యనిపించుకొన్నాఁడ వని వ్యంగ్యమాన మగుచున్నది. అని గౌరి అల్గఁగాన్ = అట్లు గౌరి కోపము వహింపఁగా; అలఘుమృదూక్తిన్=అధికమై మృదువైన వాక్కుచేత, జాత్యేకవచనము; వేఁడుశివుండు—ప్రార్థించుశంభుఁడు; మాకున్; ఆయతసౌఖ్యము = అధికమైనసుఖమును; ఇచ్చుతన్=ఇచ్చుఁగాఁత.

నాయిక యీర్ష్యాకషాయిత యయినపుడు నాయకుండు యథోచితముగ మానతారతమ్యముగని పెట్టి యాచరించు నత్యాద్యనునయప్రకారము అలంకారశాస్త్రములలో "హేతుజస్తుశమంయాతి యథాయోగ్యప్రకల్పితైః। సామ్నా భేదేనదానేన నత్యుపేక్షారసాన్తరైః॥" ఇత్యాదిగాఁ జెప్పఁబడినవి. ఇచట సామోపాయము ప్రయోగింపఁబడియె. ఇందు వ్యంగ్యమానమగు విప్రలంభశృంగారము శివవిషయకకవిరతియను భావముఁగూర్చి యంగమగుఁ గావున రసవదలంకారము.

చ. హిమధరణీధరాగ్రణికి ♦ నెమ్మె చిగుర్ప జనించి స్థాణుసం
గమరతిఁ బొల్చి పత్త్రికని♦కాయవిభూషిత యై శ్రుతీష్టవా
క్క్రమశుకముఖ్యసద్ద్విజవి♦రాజిత యయ్యు నపర్ణ నాఁగ ని
స్సమత రహించుకల్పలత ♦ సాంద్రఫలంబులు మాకు నిచ్చుతన్: ౬

ఇందుఁ బార్వతీదేవియందుఁ గల్పలతాత్వము నారోపించి యర్థద్వయంబు చెప్పఁబడుచున్నది.

టీక. హిమధరణీధరాగ్రణికిన్=హిమగిరిశ్రేష్ఠమునకు; ఎమ్మె=విలాసము; చిగుర్పన్=అంకురించునట్లుగా; జనించి=పుట్టి, పల్లవించునట్లు జన్మించి యని కల్పలతాపరమైనయర్థము; స్థాణుసంగమరతిన్.—స్థాణు=శివునియొక్క, ఆధారస్తంభముయొక్క, సంగమరతిన్ =సంగమాభిలాషచేత; పొల్చి=ఒప్పి; పత్త్రికనికాయవిభూషితయై—పత్త్రిక=మకరికాపత్త్రిము

లయొక్క, ఆకులయొక్క, నికాయ=సమూహము చేత, విభూషితయై=అలంకృతయై; శ్రుతీష్టవాక్క్రియశుకముఖ్య సద్ద్విజవిరాజిత అయ్యెన్.—శ్రుతి= వేదములకు, వీనులకు, ఇష్ట = హితమగు, వాక్క్రియ = వాక్కులయొక్క రీతిగల, శుకముఖ్య = శుకాచార్యుఁడు మొదలుగాఁగల, చిలుక మొదలుగాఁగల, సద్ద్విజ=మంచివిప్రుల చేత, శ్రేష్ఠములైనపక్షుల చేత; విరాజితయయ్యెన్ =మిక్కిలి రాజిల్లుచున్నదయ్యెను; అపర్ణ=అపర్ణయని పార్వతికి నామాంతరము, ఆకులు లేనిది; నాఁగన్ =అనఁగా; నిస్సమతన్ =సాటిలేనట్టుగా ; రహించుకల్పలత = ఒప్పుచుండెడుకల్పవల్లి; సాంద్రఫలంబులు=పూర్ణములగులాభములను, పండ్లను; మాకున్; ఇచ్చుతన్=ఇచ్చుఁగాత.

పార్వతీదేవి సకలేష్టఫలప్రదాయిని యనియు, గిరియందుజనించుట స్థాణుసంగమరతిఁబొల్చుట, పత్త్రికనికాయభూషితయగుట శుకముఖద్విజరాజితయగుట మొదలగుకల్పలతాధర్మములుగలదనియు, అందువలనఁగల్పలతారూపముగనధ్యవసితయయ్యెననియు తెలియంగునది. ఇందు విరోధాభాసరూపకములు. శ్లో॥ "ఆభాసత్వే విరోధస్య విరోధాభాస ఇష్యతే" అనియు, "విషయ్యభేదతాద్రూప్యరఞ్జనం విషయస్యయత్ రూపకం తత్" అనియుఁ దల్లక్షణములు. గౌరీవిషయకకవిరతి వ్యంజితమవుటంజేసి భావధ్వని.

శా. శ్రీగౌరీకుచహైమకుంభకలిత♦క్షీరంబులం గ్రోలి త
ద్భాగాసక్తనిజాననం బపుడు తా ♦ భావించి ప్రత్యాపత
న్నాగభ్రాంతిని దూఁటఁగా జనని తా ♦ నవ్యానురక్తిన్ నగన్
ద్రాగానందముఁ జెందునగ్గణపతిన్ ♦ బ్రార్థింతు వాక్సిద్ధికిన్. 7

టీక. శ్రీగౌరీకుచహైమకుంభకలితక్షీరంబులన్—శ్రీ=శోభాసంపన్నురాలైన, గౌరీ=పార్వతీదేవియొక్క, కుచహైమకుంభ=సువర్ణకలశములవలెనుండు స్తనములయందు, కలిత=ఒప్పుచున్న, క్షీరంబులన్=పాలను; గ్రోలి=పానముచేసి; తద్భాగాసక్తనిజాననంబు.—తద్భాగ=ఆస్తనప్రదేశమునందు, ఆసక్త=మిక్కిలిసంబంధించినట్టి, ప్రతిబింబించినట్టియనుట, నిజాననంబు=తనమోమును ; అపుడు=ఆసమయమందు ; తాన్=తాను ; భావించి—చూచియనుట ; ప్రత్యాపతన్నాగభ్రాంతిన్=ఎదిరించివచ్చుచుండు నేనుంగనుభ్రమముచేత ; దూఁటఁగాన్=పొడువఁగా; జనని=తల్లియగుపార్వతీదేవి ; తాన్ ; నవ్యానురక్తిన్ = తత్కాలోదితమగుప్రేమచేత ; నగన్=నవ్వఁగా ; ద్రాగానందమున్=శీఘ్రముగాసంతసించుటను ; చెందునగ్గణపతిన్ = పొందునట్టి ప్రసిద్ధుఁడైనవినాయకుని ; వాక్సిద్ధికిన్ = వాక్కులభించుటకు ; ప్రార్థింతున్=యాచింతును.

యాచించువాఁడు కేలుమోడ్చి వినయవంతుఁడై వర్తించుట ప్రసిద్ధమైనందునను, స్వావధికోత్కర్షప్రకాశక జ్ఞానానుకూల కరపుటసంవలనాదిరూప వ్యాపారమె నమశ్శబ్దార్థమైనందునను, "భారతీకవేర్జ్ఞయతి" యనుచోఁగావ్యప్రకాశములోఁ జెప్పినవిధంబుగనిందు నమస్కారము వ్యంగ్యముగాన నిది నమస్క్రియారూపమగు మంగళమని తెలియంగునది. నాగభ్రాంతిని దూఁటఁగాననుచో భ్రాంతిమదలంకారము. గణపతివిషయకకవిరతిరూపభావము వ్యజ్యమానమగుటవలన భావధ్వని.

సీ. వనరాశిభంగంబు ♦ గనఁజేసె నెవ్వాఁడు, కరముచేఁ బర్వతో♦త్కరముచేత
ఘనవలాహకశక్తిఁ ♦ గలఁగించె నెవ్వాఁడు, రుతముచే వేగమా♦రుతముచేత
నరిపురవిస్ఫూర్తిఁ ♦ బరిమార్చె నెవ్వాఁడు, హేతిచే నిజనఖ♦హేతిచేత
తతమహామిత్త్రవ♦ర్ధన మూన్చె నెవ్వాఁడు, క్షణముచే మధురవీ♦క్షణముచేత
తే. నవని నెవ్వాఁడు జానకీ♦స్వాత్మసూచ
నాంజనాత్మజవిఖ్యాతి ♦ నధిగమించె
నతని మామకకృతిచమ♦త్కృతికిఁ దలఁతు
మహితధీమంతు హనుమంతు ♦ మానవంతు. 8

టీక. వనరాశిన్ = ఉద్యానవనసమూహమును, అశోకవనమునను టవ; సముద్రమును అనియర్థాంతరము. భంగంబు = నాశమును, తరంగమును; జాత్యేకవచనము; ఎవ్వాఁడు; కరముచేన్ = హస్తముచేతను; పర్వతోత్కరముచేతన్ = కొండలయొక్క గుంపుచేతను; కనన్ = పొందునట్లుగా; చేసెన్ = ఒనరించెనో, అశోకవనమును హస్తముచేఁ గూల్చెను. సముద్రమును సేతుబంధసమయమున పర్వతముల చేత తరఁగలుగలదానినిఁగాఁ జేసెనని క్రమముగ నన్వయము. ఇట్లు తక్కినవాక్యములయందును జూడవలయు. "వనంకానననీరయోః" అని రత్నమాల. ఘనవలాహకశక్తిన్ — ఘన=గొప్పలయిన; వలాహక=పర్వతములయొక్కయు, మేఘములయొక్కయు; "గిరిమేఘావలాహకౌ" అనిరత్నమాల. శక్తిన్=సామర్థ్యమును; ఎవ్వాఁడు= ఎవఁడు; రుతముచేన్=సింహనాదముచేతను; వేగమారుతముచేతన్ = వేగమువలనఁ బుట్టినచండమారుతముచేతను; కలఁగించెన్=కలఁతపఱచెనో; అరిపురవిస్ఫూర్తిన్ — అరిపుర= శత్రుపురియగులంకయొక్కయు, శత్రుశరీరములయొక్కయు; "గేహేదేహేచనగరేపురంపాటలిపుత్త్రికే" అనిశబ్దస్తోమమహానిధి. విస్ఫూర్తిన్=ప్రకాశమును; ఎవ్వాఁడు=ఎవఁడు; హేతిచేన్=అగ్నిజ్వాలచేతను; "హేతిర్జ్వాలాయుధాంశుషు" అనిరత్నమాల. నిజనఖహేతిచేతన్= తనఖడ్గమువంటినఖముచేతను; జాత్యేకవచనము. పరిమార్చెన్=ఖండించెనో; తతమహామిత్త్రివర్ధనము—తత=విస్తృతమైనట్టి; మహాత్ = అధికమగు; అమిత్త్రి = శత్రువులయొక్కయు; మిత్త్రి = ఆప్తులయొక్కయు; వర్ధనము = ఛేదనము, అభివృద్ధిని; "వర్ధనంఛేదనేపిస్యాత్" అని యమరము. క్షణముచేన్=అల్పకాలముచేతను; మధురవీక్షణముచేతన్= ప్రసన్నమగుచూపుచేతను; ఊన్చెన్ = కలుగఁజేసెనో; అవనిన్=భూమియందు; ఎవ్వాఁడు = ఎవఁడు; జానకీస్వాత్మసూచనాంజనాత్మజవిఖ్యాతిన్ — జానకీ=సీతాదేవియొక్కయు; స్వ= ధనముయొక్క; ఆత్మ = రూపముయొక్క; సూచన = సూచించుటయందు; అంజనాత్మజ= అంజనముయొక్క కొడుకనెడు, చిన్నఅంజనమనుట; విఖ్యాతిన్ = ప్రసిద్ధిని, సీతయొక్క నిక్షేపధనముఁదెలుపుటయందు చిన్నఅంజనమను ప్రసిద్ధినచుట, అంజనాపుత్త్రుఁడను ప్రసిద్ధినని భావము; అధిగమించెన్=పొందెనో; అతనిన్=అట్టివానిని; మహితధీమంతున్=పూజ్యమగుబుద్ధిగలవానిని; మానవంతున్=అభిమానశాలియగువానిని; హనుమంతున్ = ఆంజనేయుని; మామకకృతిచమత్కృతికిన్=నాగ్రంథముయొక్క నేర్పునకై; తలఁతున్= స్మరించెదను.

ఆమహానుభావునియనుగ్రహమువలన మత్కృతి చమత్కృతి నొందఁగాత నని భావముగాన నిదియాశీరూపమంగళముగా నెలుంగునది.

ఈ పద్యమందు వనరాశిభంగం బిత్యాదిపూర్వవాక్యములయందు రెండర్థములు ప్రకృతంబులే కాన ప్రాచీన నవీనమతములయందు శ్లేషాలంకార మెకాని యొకయర్థము వాచ్యము మఱియొకటి వ్యంగ్యమను మతభేదములేదు. "నానార్థసంశ్రయశ్శ్లేషో వర్ణ్యావర్ణ్యోభయాశ్రితః" అనిలక్షణము. ఇఁకఁగరముచేఁ బర్వతోత్కరముచేత నిత్యాద్యుత్తరార్థములయందు,కరముచే నిత్యాదులకావృత్తి గలిగినందున యమకాలంకారము. "అనర్థకానాం భిన్నార్థా స్సార్థకానర్థకాశ్చ వా।ఆవర్త్యన్తే క్రమాద్వర్ణా యదా స్యాద్యమకం తదా" అని కావ్యదర్పణమ్మందుఁ దల్లక్షణము. భావధ్వనియుఁ బైపద్యములయందుంబలె నూహ్యంబు. పూర్వవాక్యార్థములకు నుత్తరవాక్యార్థములకుఁ గ్రమాన్వయంబుకలిమిం గ్రమాలంకారము.

సీ. సర్వతోముఖచర♦త్సారద్విజాలంబ, వాచానిరూఢిచే♦ వఱలె నెవ్వఁ
డతిపరాశరముదా♦హతిభారతోజ్జ్వల, ప్రక్రియావిస్ఫూర్తిఁ♦బరఁగె నెవ్వఁ
డభిరూపచక్రచి♦త్ప్రార్థగౌరవ, ప్రతిపాదనప్రౌఢిఁ ♦ బ్రబలె నెవ్వఁ
డవిగతఘనరస♦వ్యాయతహృదయంగ, మేరామహోన్నతి♦నెనఁగె నెవ్వఁ
తే. డతులితాత్మైక్యభావనా♦యత్తవాణి
కావిష్కృతి మించె నెవ్వఁ డా♦ఘనునిఁ బ్రథమ
కవిని గృష్ణునిఁ బ్రథితభా♦రవి మయూర
కవిని గాలిదాసు నుతింతుఁ ♦ గౌతుకమున. 9

ఈపద్యమందుఁ గవి వాల్మీకి మొదలగు నాదికవులను బ్రహ్మదేవాది విషయకమైన యర్థాంతరముగలుగునట్లు వర్ణించుచు గీతిలోఁ గ్రమము వచియించెను.

టీక. ఎవ్వఁడు=ఏమహాపురుషుండు; సర్వతోముఖ చర త్సార ద్విజాలంబవాచా నిరూఢిచేన్—సర్వతోముఖ=ఉదకమునందు; చరత్ = సంచరించుచున్న; సార = శ్రేష్ఠమైన; ద్విజ=క్రౌంచపక్షులు; ఆలంబ=అవలంబముగాఁగల; వాచా=వాక్కుయొక్క; "శ్లో॥ మానిషాద ప్రతిష్ఠాంత్వ మగమ శ్శాశ్వతీ స్సమాః।యత్క్రౌఞ్చమిథునా దేక మవధీః కామమోహితమ్" ఇత్యేతచ్ఛ్లోకరూపమగు ఛందోమయవాణియొక్కయని భావము. నిరూఢిచేన్=ప్రసిద్ధిచేత, నని వాల్మీకిపరమైన యర్థము. అంతటను ముఖములయందుఁ జరించుచున్నట్టివై శ్రేష్ఠవిప్రులాధారముగాఁ గలవై యున్న వేదరూపములైనవాక్కుల ప్రసిద్ధిచేత నని బ్రహ్మపరమైన యర్థము. వఱలెన్=ఒప్పెనో; ఎవ్వఁడు=ఏమహానుభావుఁడు; అతిపరాశరముదాహతిభారతోజ్జ్వలప్రక్రియావిస్ఫూర్తిన్— అతి=అధికమైన; పరాశర = పరాశరమునియొక్క; ముదా = సంతసముయొక్క; ఆహతి=అవిచ్ఛేదముయొక్కయు, పోషణముయొక్కయు ననుట; భారత = భారతముయొక్క; ఉజ్జ్వల=ప్రకాశించుచున్న; ప్రక్రియా=ప్రకృష్టకరణముయొక్కయు; విస్ఫూర్తిన్=అతిశయముచేతనని వ్యాసపరమైనయర్థము. అతి=అధికమైన; పర=శ

త్రువులగు; ఆశర=రక్కసులయొక్క; ముత్=సంతోషముయొక్క; ఆహతి=భంగమందలి; భా=సామర్థ్యమందు; "భాఃప్రభావేచ తేజసి" అని విశ్వము. రత=ఆసక్తమైన; ఉజ్జ్వలత్=ప్రకాశించుచున్న; ప్రక్రియా = యుద్ధాదిప్రక్రియలయొక్క; విస్ఫూర్తిన్ = అతిశయము చేతనని విష్ణుమూర్తిపరమైనయర్థము. ముదాశబ్దము వాచాశబ్దమువలె "శ్లో॥ వష్టిభాగురి రల్లోప మవాప్యో రుపసర్గయోః। ఆపం చైవహలంతానాం యథావాచానిశాదిశా" యను వచనమునుబట్టి యాకారాంతము. పరఁగెన్=ఒప్పెనో; ఎవ్వాఁడు=ఏఘనుఁడు; అభిరూపచక్రచిత్తార్హార్థగౌరవప్రతిపాదన ప్రౌఢిన్—అభిరూప = విద్వాంసులయొక్క; "ప్రాప్తరూపసురూపాభిరూపాబుధమనోజ్ఞయోః" అని యమరము. చక్ర=సమూహముయొక్క; చిత్త=హృదయములకు; అర్హా = తగినట్టి; అర్థ = అభిధేయముయొక్క; గౌరవ = గురుత్వము యొక్క; "భారవేరర్థగౌరవమ్" అని ప్రసిద్ధము. ప్రతిపాదన=చెప్పుటయొక్క; ప్రౌఢిన్=నేర్పు చేత నని భారవికవిపరమైన యర్థము. అభిరూప=మనోజ్ఞములగు; చక్ర=జక్కవలయొక్క; చిత్తార్హార్థగౌరవ=చిత్తములకుయోగ్యమగుసంఘటనరూపప్రయోజనాతిశయముయొక్క; ప్రతిపాదన=దానముయొక్క; "విశ్రాణనంవితరణం స్పర్శనంప్రతిపాదనమ్" అనియమరము. ప్రౌఢిన్=నేర్పుచేతనని సూర్యపరమైనయర్థము. ప్రబలెన్=అతిశయిల్లెనో; ఎవ్వాఁడు=ఏమహాత్ముండు; అవిగతఘనరసవ్యాయతహృదయంగమేరామహోన్నతిన్—అవి=సూర్యుని; గత=పొందినట్టి; ఘన=దట్టమైన; రస=శృంగారాదిరసములచేత, కాదేని, అధికరక్తిచేత; వ్యాయత=మిక్కిలియధికమైనట్టియు; హృదయంగమ=మనోహరమైనట్టి; ఇరా=సూర్యశతకమని ప్రసిద్ధమగు గ్రంథరూపమైనవాక్కుయొక్క; మహోన్నతిన్=మిక్కిలి యతిశయముచేతనని మయూరకవిపరమైనయర్థము. అవిగత=పోవని, కాదేని అవి=పర్వతములను; "అవయశ్శైలమేషార్కాః" అని యమరము. గత=పొందిన; ఘన=మేఘములయందు; రస=ఆసక్తిచేత "రసోగన్ధరసేస్వాదే" అనివిశ్వము. వ్యాయత=అధికము; హృదయంగమ=మనోహారమునగు; ఇరా=కేకాధ్వనియొక్క; మహోన్నతిన్=మిక్కిలియతిశయముచేత నని నెమ్మిపరమైనయర్థము. ఎసఁగెన్=అతిశయించెనో; ఎవ్వాఁడు = ఏయుత్తముండు; అతులితాత్మైక్యభావనాయత్తవాణికావిహృతిన్—అతులిత=నిస్సమానమగు; ఆత్మ=తనతోడి; ఐక్యభావనా=అభేదభావనయందు; ఆయత్త=వశంవదయైన; వాణికా=వాగ్దేవియొక్క; విహృతిన్=విహారముచేతనని కాళిదాసకవి పరమైనయర్థము. సరస్వతి కాళిదాసుఁడు నేనేయనెననుట ప్రసిద్ధము. అతులిత=నిస్సమానమైన; ఆత్మైక్యభావనా=బ్రహ్మైక్యానుసంధానమందు; ఆయత్తవాణికా= ఆయత్తములైన వేదాంతవాక్యములయొక్క; విహృతిన్=విహారముచేతనని యాత్మజ్ఞానిపరమైనయర్థము. మించెన్=అతిశయించెనో; అఘనులన్=అశ్రేష్ఠులను; ప్రథమకవిని=వాల్మీకిని, బ్రహ్మనని యర్థాంతరము. కృష్ణునిన్=వ్యాసుని, కృష్ణమూర్తిని; "కృష్ణస్సాస్యత్కేశవేవ్యాసే" అనివిశ్వము. ప్రథితభారవిని=ప్రసిద్ధభారవికవిని; ప్రథిత=ప్రసిద్ధమగు; భా=తేజముతోఁగూడిన; రవిని=సూర్యుని; మయూరకవిని=మయూరుఁడనుకవిని; మయూరక=నెమ్మియను; విని=పక్షిని; కాళిదాసునిన్=కాళిదాసుండనుమహాకవిని; క=మనస్సునందు; అలి=సమర్థుఁడైన; దాసునిన్ = ఆత్మజ్ఞాని, జితేంద్రియుండగు నాత్మజ్ఞాని ననుట; కౌతుకమునన్=సంతోషముచేత; నుతింతున్=ప్రశంసింతును.

ఇందుఁ బ్రకృతవాల్మీకివ్యాసాదిపర మగునర్థము వాచ్య మనియు, నప్రకృతబ్రహ్మాదిపర మైనయర్థము వ్యంగ్య మనియుఁ గావ్యప్రకాశాదిమతము, ప్రకృతాప్రకృతార్థములు రెండును వాచ్యములుగఁ జెప్పి శ్లేషాలంకార మని చెప్పువారు నవీనులలోఁ గొందఱు. ఉపమాలంకారధ్వని.

ఉ. భారతనామకామృత మ◆భంగురసద్ధ్వనియుక్తి మించ వి
స్ఫారకవిప్రతానముద ◆ సాంద్రత దాల్పఁగ నాంధ్రవాఙ్మహా
ధార ధరాతలంబున ను◆దారతఁ దాల్చురసాధరాంచితా
కారవిధారులం ఘనులఁ ◆ గాంతవచస్స్థితికై నుతించెదన్. 10

టీక. భారత నామకామృతము= భారతమను పేరుగల సుధ; అభంగురసద్ధ్వనియుక్తిన్— అభంగుర = అవిచ్ఛిన్నమైన; సత్ = శ్రేష్ఠమైన; ధ్వని = వ్యంగ్యములయొక్క, గర్జలయొక్క; యుక్తిన్ = సంబంధముచేత; మించన్ = అతిశయింపఁగా; విస్ఫారకవిప్రతానముద— విస్ఫార = అధికమగు; కవిప్రతాన = కవిసమూహముయొక్క, జలపక్షుల గుంపుయొక్క; ముద=హర్షము; సాంద్రతన్ =ఘనతను; తాల్పన్ =వహింపఁగా; ఆంధ్రవాఙ్మహాధారన్=ఆంధ్రవాక్కనెడు గొప్పధార చేత ; ధరాతలంబునన్ = భూతలమందు; ఉదారతన్ = గొప్పఁదనమును, దాతృత్వమును; "ఉదారోదాతృమహతోః" అని అమరము. తాల్చురసాధరాంచితాకారవిధారులన్—తాల్చు=వహించునట్టి;రసాధర= రాజులచేత,పర్వతములయందు; అంచిత=పూజింపఁబడిన, ఒప్పినట్టి; ఆకార=అకృతులను; విధారులన్ = మిక్కిలిధరించినవారిని, ఇటఁగర్త్రార్థమందణ్ప్రత్యయము;ఘనులన్ = గొప్పలైనవారిని, కవిత్రయమునను ట, మేఘములనని యర్థాంతరము. కాంతవచస్స్థితికై = మనోజ్ఞవాక్సిద్ధికై; నుతించెదన్=ప్రశంసించెదను.

ఈపద్యమందు రూపకాలంకారభేదము "రూపకం పూర్వసంసిద్ధం శ్లేష మర్థాపయే ద్యది । తదా రూపక మేవ స్యా దన్యథా శ్లేష ఇష్యతే" అను నలంకారసర్వస్వవ్యాఖ్యాకృదుదాహృతవచనం బిందుఁ బ్రమాణము. నన్నయభట్టును ఎఱ్ఱాప్రగ్గడయుఁ దిక్కన సోమయాజియు, నమృతస్వరూపమై లోకోత్తరధ్వనులతోఁ గూడి విద్వాంసుల నానందింపఁ జేయు నాంధ్రభారతమును భూతలమం దపూర్వముగ రచించి రాజపూజ్యత నొందినవారు గాన యట్టిఘనులనుతిచే నాకవితయు ఘనత గాంచునని వారల నుతించు ననిభావము.

చ. లలితరసోపబృంహణము◆లం గనఁబో దరసజ్ఞవృత్తిచే
మెలఁగి పదార్థకత్రయవి◆మేళన మెంచదు కాణరీతిచేఁ
జెలఁగి ప్రసాద మెన్నఁడును ◆ జేకొన దంచితదోషరూఢిచే
వెలసినయట్టి దుష్కవిక◆విత్వము నెంతురె ధీరపుంగవుల్. 11

ఇందుఁగుకవులకవిత్వస్వరూపము దుష్పక్షియగు జలకాకమువిషయమై యర్థాంతరము దోఁచునట్లు చెప్పఁబడుచున్నది.

టీక. అరసజ్ఞవృత్తిచేఁ=అరసికుని వృత్తివంటివృత్తిచేతను, నాలుకలేనివాని వృత్తి వంటివృత్తిచేతననియర్థాంతరము; మెలఁగి; లలితరసోపబృంహణములన్—లలిత=మనోజ్ఞము లగు; రస=శృంగారాదిరసములయొక్క, మధురాదిరసములయొక్కయని యర్థాంతరము. ఉపబృంహణములన్=అతిశయములను; కనఁబోదు=తెలియఁబోదు, కుత్సితజలపక్షి నాలుక యుండినను లేనివారి భంగి మధురాదిరసభేదములనుగానదని భావము. కాణరీతిచేఁ = అంధునిరీతివంటిరీతిచేత, జ్ఞానాంధునిరీతిచేతననుట, కాకిరీతిచేతనని యర్థాంతరము. "వాయసై కాక్షిణోఃకాణః" హలాయుధము. చెలఁగి= ఒప్పి; పదార్థకత్రయవిమేళనము =వాచ్యలక్ష్యవ్యంగ్యార్థత్రయముయొక్క యోగమును; పదార్థ=పదార్థములకు; క=ప్రకాశకమగు; త్రయ=సూర్యచంద్రాగ్నిరూపతేజస్త్రయముయొక్క; మేళనము=యోగము నని కాకపరమగు యర్థము. ఎంచదు=గణింపదు. జలకాకము నీటఁజరించుచు స్వభావముగ సూర్యాదితేజో విశేషము తెలియదనిభావము. అంచితదోషరూఢిచేఁ—అంచిత=ఒప్పుచున్న, దోష=అవిమృష్టవిధేయాంశాదికావ్యదోషములయొక్క, రూఢిచేఁ = స్ఫూర్తిచేతను, ఒప్పుచున్న పంకము మొదలగు దోషములరూఢిచేతననియర్థాంతరము. ప్రసాదము=ప్రసాదమనెడు కావ్యగుణమును, నైర్మల్యము ననియర్థాంతరము. ఎన్నఁడును; చేకొనదు=గ్రహింపదు, నీచజలపక్షులతఅచుగా బురదలోఁ బొరలుచుండుట స్వాభావికము. అందులో "శ్లో॥ కాకః పక్షిషు చణ్డాలః" అని పక్షులలో నింద్యమగుకాకము నైర్మల్యము నెన్నఁడును గన దనుట. వెలసిన యట్టిదుష్కవికవిత్వమున్= ఇట్లువెలయుచున్న కుకవియొక్క కావ్యమును, దుష్టమైన జలపక్షియొక్క జలపక్షిత్వము నని యర్థాంతరము. ధీరపుంగవుల్ = పండితోత్తములు; ఎంతురె=గణింతురా?

శృంగారాదిరసవిశేషములతోఁ గూడక వాచ్యలక్ష్యవ్యంగ్యార్థభేదములతో మెలఁగక ప్రసాదాదిగుణములు లేక దోషభూయిష్ఠ మగుకుకవికావ్యమును, మధురాదిరసవిశేషముల నెఱుఁగక సూర్యాదిలోకోత్తరవస్తువులఁ దెలియక బురదలోనుండు నీరుకాకమును బలెఁ బండితు లంగీకరింపరని భావము. ఇందుపమాలంకారధ్వని.

వ. అని యిష్టదేవతావందనంబును సుకవిజనాభినందనంబును గుకవినిందనంబును గావించి యేనొక్కమహాప్రబంధనిబంధనంబున కుద్యోగించి యున్నఁ దత్పుణ్యరాత్రంబున. 12

టీక. వందనం బనుచోట "వది అభివాదనస్తుత్యోః" అనుధాతువును బట్టి పైమంగళములలో యథాసంభవముగ నతిస్తుతుల గ్రహింప వలయు. పుణ్యరాత్రమను చోట "అహస్సర్వైకదేశసంఖ్యాత పుణ్యాచ్చరాత్రేః" అనుసూత్రముచేత రాత్రిశబ్ద మకారాంత మైనదని తెలియునది. దీనియర్థముస్పష్టము.

సీ. పరువంపుననగుంపు♦బలితంపుజిగిపెంపుఁ,
గని రొప్పపాణియు♦గ్మములతోడఁ
జెలువందునరవింద♦ములయందములు చింద,

సను వొందఁ గలకన్నుఁ♦గొనలతోడ
జగడంబు గనునంబు♦ముగయంబుజగడంబు,
మేలంబు లాడునె♦మ్మేనితోడఁ
దులకించు బలుమించుఁ ♦ దలఁకించునెఱమించు,
గమి మించుహేమాంశు♦కంబుతోడ
తే. మారుఁ బలుమాఱుఁ గేరుమై♦తీరుతోడ
సోము నలయించునెమ్మోము♦గోముతోడఁ
బరఁగుమాపాలిమదనగో♦పాలమూర్తి
యంచితస్ఫూర్తి సాక్షాత్క♦రించి పలికె. 13

టీక. పసవంపువనగుంపుబలితంపుజిగిపెంపున్—పసవంపు=నూతనమైన; నన = చిగురులయొక్క; గుంపు=సమూహముయొక్క; బలితంపు=హెచ్చైన; జిగి=మెఱుఁగులయొక్క; పెంపున్=అతిశయమును; కని=పొంది; ఒప్పుపాణియుగ్మములతోడన్=ఒప్పునట్టి కరద్వయములతోడను, విష్ణుమూర్తి చతుర్భుజుండు గనుక యుగ్మము లని బహువచన ప్రయోగము చేయఁబడినది; చెలువందు నరవిందములయందములు—చెలువందు=సుందరమగు; అరవిందముల=తామరలయొక్క; అందములు=సౌందర్యములు; చిందన్ = రాలునట్లు; అనువు=వైపును; ఒందన్ కలకన్నుఁగొనలతోడన్ = పొందఁగలయట్టి నేత్రాంతములతోడను; జగడంబు=వివాదమును; కనునంబుముగయంబుజగడంబు—కను = పొందునట్టి; అంబుముక్ = మేఘముయొక్క; అయంబు=శుభవిధిసంబంధమైన; జగ = అధికమగు; డంబు=గర్వమును; మేలంబులాడు నెమ్మేనితోడన్=పరిహసించునట్టి చక్కనిశరీరముతోడను; తులకించు బలుమించున్ = ప్రకాశించునట్టి అధికమైన మెఱపును; తలఁకించు నెఱమించుగమిన్ = భయపఱచునట్టి అధికములగు కాంతుల సమూహముచేత; మించుహేమాంశుకంబుతోడన్ = అతిశయించుచున్న కనకాంబరముతోడను; మారున్ = కాముని; పలుమాఱున్ = మాటిమాటికిని ; కేరుమైతీరుతోడన్ = పరిహసించునట్టి చక్కఁదనముతోడను ; సోమున్ = చంద్రుని; అలయించు నెమ్మోముగోముతోడన్ = తిరస్కరించునట్టి సుందరమైన ముఖముయొక్క సౌకుమార్యముతోడను; పరఁగుమాపాలిమదనగోపాలమూర్తి = ఒప్పుచున్న మాభాగధేయమగుమదనగోపాలస్వామి; అంచితస్ఫూర్తిన్ = పూజ్యమైన ప్రకాశముతో; సాక్షాత్కరించి=ప్రత్యక్షమై; పలికెన్.

ఇందు ఉపమాలంకార మర్థాలంకారము, వృత్త్యనుప్రాసము శబ్దాలంకారము.

చ. అనఘ తటాకముల్ వనచ♦యంబులు భూసురకోటిపాలనం
బును వసుగోపనంబు హరి♦భూరిని కేతనముల్ ఘటించి వే
తనయమహాహ్లాదయంబునను ♦ ధన్యత నొందిననీకు సత్కృతిన్
గననికొలంత యేల యది♦గ్రక్కునఁ గూర్పుము మాకుఁ బ్రీతిగన్. 14

టీక. అనఘ=పాపములు లేనివాఁడా! గ్రంథకర్తసంబోధనము. తటాకముల్=చెఱువులను; వనచయంబులు=వనసమూహములను; భూసురకోటిపాలనంబును=బ్రాహ్మణకోటిపాలనమును; వసుగోపనంబు=ధననిక్షేపమును; హరిభూరినికేతనముల్ = అనేకవిష్ణ్వాలయములను; ఘటించి=కావించి; వే=శీఘ్రముగా; తనయమహోదయంబునను=పుత్రోత్సవముచేతను; ధన్యతన్=కృతార్థతను; ఒందిననీకున్ = కాంచిన నీకు; సత్కృతిన్ = శ్రేష్ఠమగుగ్రంథమును; కననికొంతయేల=చేయనిలోపమేల? అది=ఆగ్రంథము; గ్రక్కునన్; మాకుఁబ్రీతిగన్; కూర్పుము.

సప్తసంతానములలో నాఱింటినొంది కృతి నిర్మాణము సేయకుంట యేల దానిం గూర్పుమని తాత్పర్యము. "శ్లో॥ బ్రహ్మప్రతిష్ఠా సన్తానం తటాకో వనమేవచ। కృతి ర్దేవాలయశ్చైవ నిక్షేప స్సప్తసన్తతిః" అని సప్తసంతానములు.

తే. వృత్తమే మన్నఁ ద్రేతయం ♦ దేము దశర
థాత్మజత్వము గని యున్న ♦ నమితరక్తిఁ
జాల మెప్పించె ధరణిను ♦ చంద్రువృత్త
మతనిచరితంబు వివరింపు ♦ మనఘచరిత. 51

టీక. వృత్తమేమన్నన్ = గ్రంథములో వర్ణనీయచరిత్రమేమనఁగా; "వృత్తం పద్యే చరిత్రే త్రిషు," అనియమరము. ఏము=మేము; త్రేతయందున్=త్రేతాయుగమందు; దశరథాత్మజత్వము.—దశరథ=దశరథచక్రవర్తియొక్క, ఆత్మజత్వము= పుత్రత్వమును; కనియున్నన్—రామావతారమెత్తియున్న యవసరంబున ననుట; సుచంద్రవృత్తము = సుచంద్రుండను రాజుచరిత్ర; అమితరక్తిన్=అధికమైన రసముచేత; ధరణిన్ = భూమిని; చాల మెప్పించెన్=మిక్కిలిసంతోషపెట్టెను. అనఘచరిత=పుణ్యచరిత్రుఁడవైన మాధవరాయా! అతనిచరితంబు; వివరింపుము.

ఇచట "విశాలస్యసుతో రామ హేమచన్ద్రో మహాబలః। సుచన్ద్ర ఇతి విఖ్యాతో హేమచన్ద్రాదనన్తరః" అను శ్రీమద్రామాయణ బాలకాణ్డస్థకథాసంవాదం బనుసంధేయము.

వ. అని యంతర్హితుం డయ్యె నంతఁ బ్రభాతం బగుటయు నేనును గాల్యకృత్యంబులు నిర్వర్తించి విద్వజ్జనంబుల రావించి పుండరీకాక్షసాక్షాత్కార ప్రకారంబు వివరించిన వారు నమందానందులై సత్కులప్రసూతుండవు సద్గుణగరిష్ఠుండవు నగునీకు నిట్టిమహోత్సవంబు లే మద్భుతంబు లవధరింపుము.

టీక. అని యంతర్హితుండయ్యెన్ = ఇట్లనియంతర్ధానమునొందినవాఁడాయెను. ఈక్రియయందుఁ బైమదనగోపాలమూర్తి యనునది కర్తృపదముగా నన్వయింపవలయు. అంతన్=అటుపిమ్మట; ప్రభాతంబు=వేకువ; అగుటయున్=కాఁగా; కాల్యకృత్యంబులు=కాలోచితములగు స్నానాదిక్రియలను; నిర్వర్తించి=నెఱవేర్చి; విద్వజ్జనంబులన్=పండితజనులను; రావించి=రప్పించి; పుండరీకాక్షసాక్షాత్కారంబు=మదనగోపాలస్వామివారియొక్క ప్రత్యక్షంబగుటను; వివరించినన్=తెలుపఁగా; వారున్=పండితులును; అమందానందులై=అధికమైన ఆనందముగలవారై; సత్కులప్రసూతుండవు—సత్=శ్రేష్ఠమగు, కుల=సర్వజ్ఞసింగభూపా

లుండు మొదలగు మహాశయులచేఁ బ్రకాశించువంశమందు, ప్రసూతుండవు = జన్మించిన వాఁడవు; సద్గుణగరిష్ఠుండవు=శ్రేష్ఠములగు దానక్షాత్త్రపాండిత్యాదిగుణములచేత నుత్కృష్టుండవు; అగుసీకుఁ; ఇట్టిమహోత్సవంబులు=భగవత్సాక్షాత్కారంబు గ్రంథకరణోపదేశంబు మొదలగు నిట్టియభ్యుదయంబులు; ఏమద్భుతంబులు—ఎంతమాత్రము నాశ్చర్యంబులు గావనుట. అవధరింపుము=ఎచ్చరికపడుము.

సీ. పద్మాహితకరప్ర♦భాభాసమానంబు, సురవాహినీభూతి♦శోభితంబు
కవిమండలగవీని♦కాయాతిగేయంబు, జగదేకపావనా♦చారయుక్త
ముజ్జ్వలత్సదనీక♦యోగావలంబంబు, చారుపుష్కరపద♦సంగతంబు
ఘనసర్వమంగళా♦కాంతరూపఖ్యాత, మనుగతానంతర♦త్నాంచితంబు

తే. చెలఁగు నట్టివిష్ణుపదం బ♦శేషభువన
మండలైకాభిపూర్ణ తా♦మహిత మగుచు
నింద్రియజ్ఞానవిషయతా♦తీతవృత్తి
యగు మ శ్రుతినివేద్యగుణాశ్ర♦యంబు నగుచు. 17

ఇందుఁ బ్రస్తుత విష్ణుపదవర్ణనము శబ్దశక్తిమూలవ్యంజనమున నప్రస్తుతగగనవిషయార్థము దోఁచునట్లు చేయఁబడుచున్నది.

టీక. పద్మాహితకరప్రభాభాసమానంబు—పద్మా=లక్ష్మిచేత, ఆహిత=ఉంపఁబడిన, కర=హస్తములయొక్క, పద్మాహితకర=చంద్రకిరణములయొక్క, ప్రభా=కాంతిచేత, భాసమానంబు=ప్రకాశించుచున్నదియు; సురవాహినీభూతిశోభితంబు.—సురవాహినీ= దేవనదియొక్క, భూతి=జన్మముచే, సంపదచే, శోభితంబు=ప్రకాశించునదియు; కవిమండలగవీనికాయాతిగేయంబు—కవిమండల=పండితమండలముయొక్క, శుక్రమండలముయొక్క, గవీ=వాక్కులయొక్క, కాంతులయొక్క, "స్వర్గేషుపశువాగ్వజ్రదిఙ్నేత్రఘృణిభూజలే" అని యమరము, గోశబ్దముమీఁద టచ్ప్రత్యయము జీప్ప్రత్యయముఁ వచ్చి గవీయనిరూపమైనది, నికాయ=సమూహముచేత, అతిగేయంబు=మిక్కిలిపాడఁదగినది, శ్లాఘ్యమైనదని యర్థాంతరము; జగదేకపావనాచారయుక్తము.—జగత్=భువనముయొక్క, ఏక = ముఖ్యమయిన, పావన=పరిశుద్ధము చేయుటయును, జగత్=జగమందు, ఏక=ముఖ్యమగు, పావన= పవననమూహముయొక్క, ఆచార=నడవడితోడ, సంచారముతోడ, యుక్తము=కూడినది; ఉజ్జ్వలత్సదనీకయోగావలంబంబు—ఉజ్జ్వలత్=ప్రకాశించుచున్న, సత్ = సత్పురుషులయొక్క, రిక్కలయొక్క, అనీక=సంఘములయొక్క, యోగ=ధ్యానమునకు, సంబంధమునకు, అవలంబంబు=ఆధారమును; చారుపుష్కరపదసంగతంబు.—చారు=ఒప్పుచున్న, పుష్కరపద=పద్మచిహ్నములతోడను, పుష్కరమనెడి పేరుతోడను, సంగతంబు = కూడినది; ఘనసర్వమంగళాకాంతరూపఖ్యాతము.—ఘన= గొప్పదియగు, సర్వమంగళైః = సకలశుభములచేత, ఆకాంత = మిక్కిలిమనోహరమైన, సర్వమంగళాకాంత = శివునియొక్క, రూప=రూపముచేతను, మూర్తివిశేషమని యని యర్థాంతరము, ఖ్యాతము=ప్రసిద్ధము; "ద్యోభూమిచంద్రయజ్వానో మూర్తయోఽష్టౌ ప్రకీర్తితాః" అనియీశ్వరుని మూర్త్యష్టకములో నాకాశము చేరినదని తెలియునది; అనుగతానంతరత్నాంచితంబు = అనుగతములు నధికములునగు రత్నములచేతఁబూజింపఁబడినది, అనుగతానంత

రత్నాంచితంబు =అనుగతశేషఫణామణిపూజితంబు,అనుగతుఁ డగు సూర్యునిచేత ఒప్పునది. అలవిష్ణుపాదంబు = అయినయానారాయణచరణము, ఆయాకాశము. అశేషభువన మండలైకాభిపూర్ణతామహితము.—అశేష=సమస్తమైన; భువనమండల=లోకసమూహమందు; ఏకాభిపూర్ణతా = కేవలపరిపూర్ణతచేత, అర్థాంతరమం దాకాశము విభువు గాన యంతట వ్యాపించి యుండుటచేత; మహితము=ఒప్పునది. అగుచున్. ఇంద్రియజ్ఞానవిషయతాతీతవృత్తి.—ఇంద్రియ= ఇంద్రియముల యొక్క.అనఁగా మనోనేత్రాద్యాన్తరబాహ్యేన్ద్రియంబుల యొక్క జ్ఞాన=జ్ఞానముయొక్క; విషయతా=విషయ మగుటను; అతీత=అతిక్రమించిన; వృత్తి=వర్తన ము గలది. అగుచున్. శ్రుతినివేద్య గుణాశ్రయంబున్.—శ్రుతి=వేదములచేతను, కర్ణముల చేతను; నివేద్య=బోధింపఁదగిన, ఆకాశపక్షమందు తెలియఁదగిన; గుణ = అనంతకల్యాణగుణములకు, శబ్దమునకు; ఆశ్రయంబు=ఉనికిపట్టు. అగుచున్. చెలఁగున్=ఒప్పును.

ఇందుఁ బ్రస్తుతవిష్ణుచరణపర మైనయర్థమందు శబ్దశక్తి సంయోగాదులవలన నియమిత కాఁగా నప్రస్తుతాకాశవిషయార్థస్ఫురణము వ్యంజనావృత్తిచేతఁగలుగుచున్నది. “శ్లో. అనేకార్థస్య శబ్దస్య వాచకత్వే నియన్త్రితే।సంయోగాద్యై రవాచ్యార్థధీకృద్వ్యాపృతిరంజనమ్” అని యిందులకుఁబ్రమాణము. అనేకార్థములు,ప్రస్తుతములు,అప్రస్తుతములు,ప్రస్తుతాప్రస్తుతములు నుండును, అందుఁ గేవలప్రస్తుతములైనపుడును గేవలాప్రస్తుతములైనపుడు నీయర్థమే వాచ్యము తక్కినది కా దనుటకు వినిగమకములేనందున నర్థద్వయము శబ్దశక్తిగమ్యమే యగును. ఇఁక నొకయర్థము ప్రకృతము మఱియొకటి యప్రకృతము నగునపుడు ప్రకరణాదులవలనఁ బ్రస్తుతార్థము బోధితముకాఁగా నప్రస్తుతమును బోధించునుపాయము లేక వ్యంజనావృత్తి నాశ్రయింప వలెనని భావము. సంయోగాదులు:—“శ్లో. సంయోగో విప్రయోగశ్చ సాహచర్యం విరోధితా। అర్థః ప్రకరణం లిఙ్గం శబ్దస్యాన్యస్య సన్నిధిః। సామర్థ్య మౌచితీ దేశః కాలో వ్యక్తిస్స్వరాదయః। శబ్దార్థస్యానవచ్ఛేదే విశేషస్మృతిహేతవః” అనునవి. ఇట్లు కావ్యప్రకాశకారాదిమతము. “శ్లో. నానార్థసంశ్రయశ్శ్లేషోవర్ణ్యావర్ణ్యోభయాశ్రితః” అనుచంద్రాలోకశ్లోకవ్యాఖ్యయందు “శ్లో. ఉచ్చరద్భూరికీలాల శ్శుశుభే వాహినీపతిః” అనుచోట శబ్దశక్తి యర్థద్వయమందుండి యుభయార్థములు వాచ్యము లగు చుండఁగా నొకటి వాచ్యము నొకటి వ్యంగ్య మనుట దగ దని వ్రాయఁబడియె. ఈమతద్వయమును విమర్శించి రసగంగాధరములో, “ఏవం స్థితే నానార్థస్థలే ప్యుపమాయాః ప్రాకరణికాప్రాకరణికార్థగతాయాః ప్రతిపత్తయె ఽవశ్యం వాచ్యయా వ్యంజనయైవా ప్రాకరణికార్థస్యాపి ప్రతిపత్తా వలం క్లిష్టకల్పన యే త్యాశయేన ప్రాచీనై రుక్తా న్నానార్థవ్యంజకత్వ మపి న దుష్యతి” అని వ్రాయఁబడినది, కావున ధ్వని యని వ్రాసినచోఁ బ్రాచీనమత మనియు, శ్లేష మని వ్రాసినచో నవీనమత మనియు దెలియునది.

చ. వికలితపంకజాతనవ•విభ్రమ మై ఘనగోత్రతాభిభూ
తకమతనాథ మై యరుణ•ధామవిభాసిత మై ద్విజోత్తమ
ప్రకటితహార్దయోగభర•భావుక మై ధరయందుఁ బద్మనా
యకకుల ముద్భవించె నట• నాత్మజనుమ్పదతుల్యవైఖరిన్. 18

టీ. ధరయందుఁ = భూమియందు. వికలితపంకజాతనవవిభ్రమమై.—వికలిత= వికలముచేయఁబడిన; పంకజాత = పాపకదంబముయొక్క, తామరలయొక్క; నవవిభ్రమమై=నూతనశోభగలదై, "విభ్రమో భ్రంశనే భ్రాన్తౌ శోభాయామ్" అని విశ్వము. ఘనగోధరితాభిభూతకమఠనాథమై.—ఘన=గొప్పదగు;గోధరితా = భూమిని ధరించువాఁడగుటచేత, కాంతినిభరించువాఁడగుటచేత; అభిభూత = తిరస్కరింపఁబడిన ; కమఠనాథమై = ఆదికూర్మముగలదై, కూర్మశ్రేష్ఠముగలదై. అరుణధామవిభాసితమై.— అరుణ= సూర్యతుల్యమగు ; ధామ = ప్రతాపముచేత, ఎఱ్ఱనికాంతిచేత; విభాసితమై= ప్రకాశించునదియై. ద్విజోత్తమ ప్రకటితహార్ద యోగభరభావుకమై.— ద్విజోత్తమ = బ్రాహ్మణోత్తములయందు ; ప్రకటిత = ప్రకటముచేయఁబడినదగు; హార్ద = స్నేహముయొక్క; యోగ = సంగతియొక్క; భర = అతిశయముచేత ; భావుకమై = మంగళముగలదై; విష్ణుపదపక్షమందు, ద్విజోత్తమప్రకటిత = బ్రాహ్మణోత్తములచేతఁ బ్రకటితమగు; హార్దయోగ = హృదయసంబంధిధ్యానముయొక్క; భర = అతిశయముచేత; భావుకమై = మంగళకరమై యని యర్థము, కాదేని ద్విజోత్తముఁ డనఁగా గరుత్మంతుండు, అతనిచేతఁ బ్రకటింపఁబడిన, హార్దయోగభర = హృదయసంబంధముయొక్క అతిశయముగలదై ; భావుకమై యనియర్థము. అటఁ = ఆవిష్ణుపదముననుండి. పద్మనాయకకులము = పద్మనాయకవంశము. ఆత్మజనుష్పదతుల్యవైఖరిఁ.—ఆత్మ=తనయొక్క ; జనుష్పద=జన్మస్థానమగువిష్ణుపాదముతోడ; తుల్యవైఖరిఁ = సమానమైనరీతిచేత. ఉద్భవించెఁ = ఆవిర్భవించెను.

పద్మనాయకకులము తనయుత్పత్తిహేతువగు విష్ణుపాదముతోఁ దుల్యగుణమై వర్తించెనని భావము. ఈపద్యమందుఁ దుల్యపద ముపమావాచకము గాన విష్ణుపదమునకుఁ బద్మనాయకకులమునకు సామ్యము వాచ్యమగుటచే నుపమాలంకారము. కావ్యప్రకాశకారాదులిట్టియుపమలను శబ్దాలంకారములలోఁ జేర్చియున్నారు. ఏలన ఇందుసాధారణధర్మము "శ్లో. సకలకలంపురమేతజ్జాతం సంప్రతి సుధాంశుబిమ్బమివ" ఇత్యాదులయందుంబలె శబ్దసామ్యరూపమైనది కాని యర్థసామ్యరూపమైనదికాదు, కావున నిది శబ్దాలంకారం బనవలయు. "శ్లో. స్ఫుట మర్థాలంకారా వేతా వుపమాసముచ్చయా కింతు।ఆశ్రిత్య శబ్దమాత్రం సాధర్మ్య మిహాపి సంభవతః"అని రుద్రటుండును వచియించెనని వారిగ్రంథమందు వ్రాయఁబడినది, ఇహాపి, అనఁగా శబ్దాలంకారప్రకరణమందు నని యర్థము. చిత్రమీమాంసయందు శబ్దమాత్రసాధర్మ్య ముండినే నర్థాలంకారము గా వచ్చునని వ్రాయఁబడినది.

క. ఆసంతతిఁ జాపకలా, వాసవి సెన్నొందె సింగ◆వసుధేంద్రుఁడు ఘో

రాసిమహోరాశిమహో, ద్భాసిహుతాశావలీఢ◆పరవంశకుఁడై.

టీక. ఆసంతతిఁ=ఆపద్మనాయకవంశమందు. చాపకలావాసవి=బాణవిద్యయం దర్జునితోసమానుఁడైనట్టి. సింగవసుధేంద్రుఁడు = సింగభూపాలుండు. ఘోరాసిమహోరాశిమహోద్భాసిహుతాశావలీఢపరవంశకుఁడై. — ఘోరాసి=భయావహ మగుఖడ్గముయొక్క; మహోరాశి=తేజఃకదంబ మనెడు; మహోద్భాసి = మిక్కిలిప్రకాశించుచున్న ; హుతాశ=అ

గ్నిచే; అవలీఢ=కాల్పఁబడిన; పరవంశసుఁడై = శత్రువంశములకెడు అధికములగు వెదుళ్లు గలవాఁడై. చెన్నొందెన్=ప్రకాశించెను.

ఇందు రూపకాలంకారము.

సీ. నిజకటకాశ్రిత♦ద్విజపోషణమున నె, వ్వనిసార్వభౌమత ♦ ఘనత గాంచుఁ
బరమహాహీనస♦ద్బలవిభేదనలీల, రమణ నెవ్వనినరేం♦ద్రత్వ మలరు
గంధాంకకైరవ♦ కాండలుంటాకధా, మమున నెవ్వనియిన♦త్వము సెలంగు
జాగ్రద్ఘనాఘన♦సాంద్రమదాపహా, శక్తి నెవ్వనిమహే♦శ్వరత పొసఁగు
తే. నతఁడు పొగ డొందు జయశాలి ♦ యహితసాల
కీలి యతిదీప్తినిర్ధూత♦ హేళి యమర
విసరసన్నుతనయకేళి ♦ యసమసుగుణ
విజితభువనాళి శ్రీసింగ♦వీరమాళి. 20

టీక. నిజకటకాశ్రితద్విజపోషణమునన్.—నిజ = స్వకీయ మగు; కటక= పురమును, గండస్థలమును "కటకోస్త్రీ రాజధానీ,గండః కటో మదో దానమ్" అని రెంటికినమరము: గండస్థలపక్షమందు కటశబ్దముమీఁద స్వార్థమందు కప్రత్యయంబువచ్చినది; ఆశ్రిత= ఆశ్రయించిన; ద్విజ=బ్రాహ్మణులయొక్క, తుమ్మెదలయొక్క; పోషణమునన్ =పోషించుటచేత. ఎవ్వనిసార్వభౌమత=ఎవని చక్రవర్తిత్వము, దిగ్గజత్వ మని వ్యంగ్యమానార్థాంతరము. ఘనత= గొప్పతనమును. కాంచున్=పొందునో. పరమహాహీనసద్బలవిభేదనలీలన్.—పర=శత్రువులయొక్క; మహాహీన=మిగుల నధిక మగు; సద్బల=మంచిసైన్యములయొక్క; విభేదనలీలన్= భేదనక్రియచేతను; పర=ఉత్కృష్టములగు; మహాహీన=గొప్పసర్పములయొక్క; సద్బల= మంచిబలముయొక్క; విభేదనలీలన్= భేదనక్రియచేత నని యర్థాంతరము. ఎవ్వనినరేంద్రత్వము=ఎవని రాజత్వము, విషవైద్యత్వము; "విషవైద్యేధరాధీశే నరేంద్రః"అని శాశ్వతము. అలరున్=ఒప్పునో. గంధాంకకైరవకాండలుంటాకధామమునన్.— గంధ=గర్వము,పరిమళ మని యర్థాంతరము, "గంధో గంధక ఆమోదే లేశే సంబంధగర్వయోః"అనివిశ్వము:అంక= చిహ్నముగాఁ గల; కైరవ=పిశునులయొక్క, కలువలయొక్క; కాండ=సమూహముయొక్క; లుంటాక=ఛేదకమగు; ధామమునన్=ప్రతాపముచేత,కాంతిచేత ననియర్థాంతరము.ఎవ్వనియినత్వము=ఎవ్వనిప్రభుత్వము,సూర్యత్వము. "ఇనస్సూర్యేప్రభౌ"అనియమరము: చెలంగున్= ప్రకాశించునో. జాగ్రద్ఘనాఘనసాంద్రమదాపహాశక్తిన్.—జాగ్రద్ఘనాఘన=జాగరూకులైన ఘాతుకులయొక్క, జాగరూకమైన మత్తగజముయొక్క, అనఁగా గజాసురునియొక్క "ఘనాఘనో ఘాతుకమత్తదన్తినో" అని విశ్వము:సాంద్రమద=ఘనమైనయహంకారమును,ఘనమైనమదమును; అపహా=పోఁగొట్టెడి; శక్తిన్=సామర్థ్యముచేత. ఎవ్వనిమహేశ్వరత=ఎవ్వనిప్రభుత్వము,ఈశ్వరత్వము. పొసఁగున్=ఒప్పునో. అతఁడు. జయశాలి=జయముచేత నొప్పునట్టివాఁడు. అహితసాలకీలి=శత్రువు లనుమ్రాఁకుల కగ్నిరూపుఁడు. అతిదీప్తినిర్ధూతహేళి=అధికప్రతాపముచేతఁ దిరస్కరింపఁబడినసూర్యుఁడుగలవాఁడు. అమరవిసరసన్నుతనయకేళి=దేవ

తాసంఘముచేతఁ గొనియాడఁబడిననీతివిద్యావిహారము గలవాఁడు. అసమసుగుణవిజితభువనాళి=అసమానము లైన మంచిగుణములచేత జయింపఁబడినలోకములు గలవాఁడు. శ్రీసింగక్షితిమాళి=శ్రీసింగభూపాలుండు. పొగడొందుక్=పొగడ్తగాంచును.

ఇచట సింగభూపాలునందు ద్విజపోషణ, పరబలవిభేదన, కైరవకాండలుంటన, ఘనాఘనమదహరణములచే, దిగ్గజవిశేష, విష్ణువైద్య, రవి, రుద్రులసామ్యము తోఁచుచున్నది. కావున నుపమాలంకారధ్వని. గీతిలో ళి శబ్దమునకుఁ బలుమా ఱావృత్తి యగుటవలనవృత్త్యనుప్రాసము.

చ. కరు లరిసంవృతాత్మకట•కంబులు విష్ణునిబద్ధవిగ్రహుం
డురగవిభుండు కూర్మవరుఁ • డుద్ధతభూభృదుదీర్ణమూర్తి భూ
ధరము లరాతికాండగణ•దారితగాత్రము లంచు మేదినీ
తరుణి వరించె సింగవసు•ధావరు నప్రతిమానవిక్రమున్. 21

టీక. కరులు=దిగ్గజములు. అరిసంవృతాత్మకటకంబులు.—అరి=శత్రువులచేత, తుమ్మెదలచేత; ఇచట రేఫలకారములకు, "శ్లో. డలయో రలయో శ్చైవ శసయో ర్బవయో స్తథా। వదన్త్యేషాం హి సాధర్మ్య మలంకారవిదో జనాః" అని సావర్ణ్యము: సంవృత=వ్యాప్తములగు; ఆత్మ=తమయొక్క; కటకంబులు=పట్టనములుగలవి, గండస్థలములుగలవి. ఉరగవిభుండు=ఆదిశేషుఁడు. విష్ణునిబద్ధవిగ్రహుండు.—విష్ణు=వ్యాపకునితోడను, నిబద్ధ=కూర్పఁబడిన; విగ్రహుండు=విరోధము గలవాఁడు, హరితోడఁగూర్పఁబడిన దేహము గలవాఁడు. కూర్మవరుఁడు=ఆదికూర్మంబు. ఉద్ధతభూభృదుదీర్ణమూర్తి.—ఉద్ధత=గర్వించిన; భూభృత్=రాజులచేత; ఉదీర్ణ=ఉబ్బిన; మూర్తి = శరీరముగలది, ఉద్ధతము లగుపర్వతములచే గొప్పదైన మూర్తి గలది. భూధరములు=కులాచలములు. అరాతికాండగణదారితగాత్రములు.—అరాతి=శత్రువులయొక్క; కాండ=బాణములయొక్క; గణ=సమూహముచేత; దారితగాత్రములు=భేదింపఁబడిన శరీరములుగలవి; అర=వేగముచేత; అతి=అధికమానట్లుగా; కాండగణ=ఉదకసమూహముచేత; దారిత గాత్రములు=భేదింపఁబడిన దేహములు గలవి యని భావము. అంచుక్=ఇట్లనుచు. మేదినీరమణి=భూకాంత. అప్రతిమానవిక్రముక్ = అసమాన మగుపరాక్రమము గలవాఁ డగు. సింగవసుధావరుక్ = సింగభూపాలుని. వరించెక్=వరియించెను.

ఇందు, దిక్కరి ప్రభృతులయందు సామర్థ్యహీనత్వాదిదోషము లుండుటంజేసి యసమానపరాక్రముఁ డగుసింగభూపాలుని భూరమణి వరించె ననఁగా సర్వభూమిని సింగభూపాలుం డేలె నని భావము. శ్లేషసముత్థాపితవ్యతిరేకాలంకారము.

సీ. అరిపురభేదనా•యతదోర్బలస్ఫూర్తి, నతరాజవర్ధన•వితతకీర్తిఁ
గనదహీనాంగద•కలితబాహాలీల, ఖండితాహితఘనా•ఘనవిహేల
సద్గణరక్షణా•త్తమచరణాసక్తిఁ, బటుచంద్రకోటీర•భానిషక్తిఁ
దతసర్వమంగళాం•చితగాత్రరుచిపాళి, నచలధర్మోన్నత•ప్రచయకేళిఁ

తే. ప్రకటదుర్గాధినాయక♦భావభూతి
వైరిదర్పకదాంబక♦వహ్ని హేతి
నవనిఁ బొగ డొందె సర్వజ్ఞుఁ♦ డనఁగ సింగ
ధరణిభృన్మౌళి తీవ్రప్ర♦తాపహేళి. 22

టీక. అరిపురభేదనాయతదోర్బలస్ఫూర్తిన్.—అరిపుర = శత్రుశరీరములయొక్క, త్రిపురములయొక్క యని యర్థాంతరము; భేదన = భేదించుటయందు; ఆయత=విపులమైన; దోర్బలస్ఫూర్తిన్=భుజబలాతిశయము చేతను. నతరాజవర్ధనవితతకీర్తిన్.—నత=ప్రణమిల్లిన; రాజ=నరపతులయొక్క; నతరాజ=వంగినచంద్రునియొక్క, బాలచంద్రునియొక్క యని యర్థాంతరము; వర్ధన=పోషణముచేత; వితత=విస్తీర్ణమగు; కీర్తిన్=యశస్సుచేతను. కనదహీనాంగదకలితబాహాలీలన్.—కనత్=ప్రకాశించుచున్న; అహీన=అధికమగు; అంగద=భుజకీర్తులతోడను, శివునిపక్షమందు ప్రకాశించుచున్న ఆదిశేషుఁడను భుజకీర్తులతోడ నని యర్థము; కలిత=కూడుకొన్న; బాహాలీలన్=భుజవిలాసముచేతను. ఖండితాహితఘనాఘనవిహేలన్.—ఖండిత=ఖండింపఁబడిన; అహిత=శత్రువులగు; ఘనాఘన=మాతుకులయొక్క, శత్రువైనగజాసురునియొక్క యని యర్థాంతరము; విహేలన్ = విశేషవిలాసముచేతను. సద్గణరక్షణక్షమచరణాసక్తిన్.— సద్గణ=సత్పురుషసంఘముయొక్క; రక్షణ = పోషణమందు; క్షమ=సమర్థమైన; చరణ=నడవడియందు; ఆసక్తిన్=ప్రీతిచేతను, శివునిపక్షమందు శ్రేష్ఠమగు ప్రమథగణముయొక్క. రక్షణమునందు సమర్థము లయినపాదములతోడి మిక్కిలి సంబంధముచేత నని యర్థము. పటుచంద్రకోటీరభానివసక్తిన్.—పటు=సమర్థమైన; చంద్ర=హిరణ్మయమగు; "కల్యాణ మర్జునం భూరి గైరికం వసు చన్ద్రికం" అని యమరము: కోటీర=కిరీటముయొక్క, శీతాంశుఘటితమైన కిరీటముయొక్క యని యర్థాంతరము; భా=కాంతియొక్క; నిషక్తిన్ = సంబంధముచేతను. తతసర్వమంగళాంచితగాత్రరుచిపాళిన్.—తత=విస్తృతమగు; సర్వమంగళ=సమస్తశుభములచేత; సర్వమంగళా=పార్వతిచేత; అంచిత=ఒప్పునట్టి; గాత్రరుచి = దేహకాంతులయొక్క; పాళిన్ = సమూహముచేతను. అచలధర్మోన్నతప్రచయకేళిన్.—అచలధర్మ=చెదరనిధర్మములయొక్క, మేరుధనువుయొక్క; ఉన్నతప్రచయ=అధికవృద్ధియందలి; కేళిన్=క్రీడచేతను. ప్రకటదుర్గాధినాయకభావభూతిన్.—ప్రకట=వ్యక్తమగు; దుర్గాధినాయకభావ= దుర్గాధ్యక్షత్వముయొక్క, గౌరీవల్లభత్వముయొక్క; భూతిన్=సంపదచేతను. వైరిదర్పకదాంబకవహ్నిహేతిన్.—వైరి=శత్రువులయొక్క; దర్పక=గర్వమును; ద=ఖండించెడు; అంబకవహ్ని=బాణములనెడు నిప్పుయొక్క; హేతిన్=జ్వాలచేతను; శివునిపక్షమందు: వైరి=శత్రువైన; దర్పక=మన్మథుని; ద=ఖండించెడు; అంబకవహ్నిహేతిన్=నేత్రాగ్నియొక్క జ్వాలచేతను. తీవ్రప్రతాపహేళి = ఉగ్రప్రతాపముచేత సూర్యతుల్యుండైన; సింగధరణిభృన్మౌళి=సింగభూపాలాగ్రణి. అవనిన్=భూమియందు. సర్వజ్ఞుఁ డనఁగన్= ఈశ్వరుం డనఁగా, సర్వము దెలిసినవాఁ డనఁగా. పొగడొందెన్=పొగడ్త గాంచెను.

సింగభూపాలుండు విద్యావిశారదుం డై రసార్ణవసుధాకరాదిగ్రంథప్రణేత యై సర్వజ్ఞుం డనుబిరుదమును గాంచి యుండఁగా, నిచటఁ గవి, యరిపురభేదన, నతరాజవర్ధ, నాహీనాంగదకలన, గజాసురఖండనా,ద్యఖిలజగదీశ్వరకార్యకరణముచే సర్వాంశములందును నీశ్వరునిఁ బోలి సర్వజ్ఞుం డను తన్నామమును వహించె నని వర్ణించెను. ఇందు శ్లిష్టరూపకాలంకారము.

తే. అర్థిసాత్కృతసురభి ప◆రాళిసురభి
సుగుణవల్లీప్రకాండైక◆సురభి కీర్తి
జితసురభి శౌర్యసురభి నా◆ సింగనృపతి
పరఁగ దద్వంశమును గాంచె◆ సురభిసంజ్ఞ. 23

టీక. అర్థిసాత్కృతసురభి.—అర్థిసాత్కృత= యాచకాధీనముగాఁ జేయఁబడిన; సురభి=సువర్ణము గలవాఁడు. పరాళిసురభి=శత్రువుల నెడుతుమ్మెదలకు సంపెఁగ యైనవాఁడు. సుగుణవల్లీప్రకాండైకసురభి.—సుగుణ=సద్గుణముల నెడు; వల్లీ=లతలయొక్క; ప్రకాండ=గుమురులకు; ఏక=ముఖ్యమైన; సురభి=వసంతుండైనవాఁడు. కీర్తిజితసురభి=కీర్తిచేత జయింపఁబడినకామధేనువు గలవాఁడు. శౌర్యసురభి=శౌర్యముచేత మనోజ్ఞుఁ డైనవాఁడు; నాన్=అనునట్లుగా; సింగనృపతి=సింగభూపాలుండు; పరఁగన్=ఒప్పఁగా; తద్వంశమును=ఆసింగభూపతివంశమును; సురభిసంజ్ఞన్=సురభిఅనునామమును. కాంచెన్=పొందెను.

ఇట్టిసింగభూపాలుం డుదయించుటచే వారివంశము సురభివంశ మనునభిఖ్యను బొందె నని తాత్పర్యము.

క. ఆరాజదన్వయంబున, ధీరాగ్రణి పెద్దశౌరి◆ దీప్తాసిమహా
స్ఫారాహతధారాహత,వీరాహితగోత్రుఁ డగుచు◆ వెలసెన్ ధరణిన్. 24

టీక. ఆరాజదన్వయంబునన్ =ఆప్రకాశించు చున్నసురభివంశమందు.ధీరాగ్రణి=ధైర్యవంతులయందు శ్రేష్ఠుం డగు. పెద్దశౌరి=పెద్దభూపాలుఁడు. దీప్తాసిమహాస్ఫారాహతధారాహతవీరాహితగోత్రుఁడు.—దీప్త=ప్రకాశించుచున్న; అసి=ఖడ్గముయొక్క; మహః=కాంతియొక్క, తేజస్సుచేత నని యర్థాంతరము; స్ఫార=అధికమై, మహాస్ఫార అనుపాతమందు తేజస్ఫారరూపమై యనియర్థము; అహత=అప్రతిహత మగు; ధారా=అలుఁగుచేత; హత=కొట్టఁబడిన; వీరాహిత=వీరు లగుశత్రువులయొక్క ; గోత్రుఁ డగుచున్=కులముల నెడు పర్వతములు గలవాఁ డగుచు. ధరణిన్=భూమియందు. వెలసెన్=ప్రకాశించెను.

ఇటవర్ణ్యనియం దింద్రత్వము. "శ్లో. శమయ త్యరితేజోగ్నిం ధారయా త్వత్కృపాణికా" అనుచోట కృపాణికయందు మేఘత్వమువలె నర్థసిద్ధము. కావున నేకదేశవివర్తిరూపకము. "శ్లో. శ్రౌతా ఆర్థాశ్చ తే యస్మి న్నేకదేశవివర్తి తత్" అని కావ్యప్రకాశమునందుఁ దల్లక్షణము.

సీ. ఏమాన్యునతిభీమ◆భీమప్రతాపంబు, తాపంబు శాత్రవ◆తతికిఁ గూర్చు
నేవీరుఘనసార◆హితకీర్తికాండంబు, కాండంబు నెల్లెడ◆ నలమి పొల్చు

నేరమ్యు నతిభూరి♦భూరినికాయంబు, కాయంబు నర్థుల♦కబ్బఁ జేయు
నేరాజునుత్సాహ♦ధీరాంతరంగంబు, రంగంబు నీతిన♦ర్తకికి నెన్న
తే. నతఁడు ధృతిమంతుఁ డతిదాంతుఁ♦డమలకాంతుఁ
డశ్వరేవంతుఁ డవితమ♦హాదిశాంతుఁ
డంగనాత్మాంబురుహభృంగ♦దంగజితజ
యంతుఁ డగుపెద్దవసుమతీ♦కాంతుఁ డెసఁగు. 25

టీక. ఏమాన్యునతిభీమభీమప్రతాపంబు.—ఏమాన్య=ఏమాననీయునియొక్క; అతిభీమ=శివునినతిక్రమించిన "వ్యోమకేశో భవో భీమః" అని యమరము: భీమ=భయంకరమగు; ప్రతాపంబు = తేజస్సు. శాత్రవతతికిన్ = శత్రుసంఘమునకు. తాపంబు = సంతాపమును. కూర్చున్=చేయునో. ఏవీరుఘనసారహితకీర్తికాండంబు.—ఏవీరు=ఏవీరునియొక్క; ఘనసార=కర్పూరముపగిది, కాదేని కర్పూరమునకు; హిత = హితమగు; కీర్తికాండంబు=కీర్తిసమూహము. కాండంబున్=బ్రహ్మాండంబును. అలమి=ఆక్రమించి. పొల్చున్ = ఒప్పునో. ఏరమ్యునతిభూరిభూరినికాయంబు.—ఏరమ్యు = ఏరమణీయునియొక్క; అతిభూరి = మిక్కిలిఅధికమగు; భూరి=సువర్ణముయొక్క "భూరిప్రాజ్యసువర్ణయోః" అనివిశ్వము: నికాయంబు=సమూహము. అర్థులకున్=యాచకులకు. కాయంబు.—క=చిత్తములకు; అయంబు = శుభావహవిధిని సంతోషము ననుట "అయ శ్శుభావహోవిధిః" అనియమరము. అబ్బఁజేయున్=అందఁజేయునో. ఏరాజునుత్సాహధీరాంతరంగంబు.—ఏరాజు=ఏరాజుయొక్క; ఉత్సాహ=ఉత్సాహవంతం బగు; అర్శఆద్యచ్: ధీర=ధైర్యవంతమగు; అంతరంగంబు=చిత్తము. నీతినర్తకికిన్ = నీతియనెడునటికి. ఎన్నన్=పరికింపఁగా. రంగంబు=నాట్యస్థలమో. అతఁడు. ధృతిమంతుఁడు=ధైర్యవంతుఁడు. అతిదాంతుఁడు = మిక్కిలి యింద్రియనిగ్రహము గలవాఁడు. అమలకాంతుఁడు=నిర్మలుఁడును మనోహరుఁడును, లేక నిర్మలులయందు మనోహరుఁడు. అశ్వరేవంతుఁడు=అశ్వములయెడ రేవంతతుల్యుండు. అవితమహాదిశాంతుఁడు = పాలింపఁబడిన గొప్పదిగంతములుగలవాఁడు. అంగనాత్మాంబురుహభృంగదంగజితజయంతుఁడు.—అంగనా=స్త్రీలయొక్క; ఆత్మ=మనస్సనెడు; అంబురుహ=కమలమునకు; భృంగత్=తుమ్మెదవలెనాచరించుచున్న ఇట "సర్వప్రాతిపదికేభ్యః క్విబ్వా వక్తవ్యః" అని క్విప్ప్రత్యయము. అంగ=దేహముచేత; జిత=జయింపఁబడిన; జయంతుఁడు=జయంతుఁడు గలవాఁడు. పెద్దవసుమతీకాంతుఁడు=పెద్దరాజు. ఎసఁగున్=అతిశయించును.

ఇందు తాపంబు తాపంబు లో నగువానియం దనేకవర్ణసముదాయము సామ్యమునొందుటంబట్టి యమకము. ఏరాజునుత్సాహధీరాంతరంగంబు రంగంబునీతినర్తకికి నెన్న ననువాక్యమందంతరంగమందు రంగత్వారోపముఁ జేయుటంజేసి రూపకాలంకారభేదము.

క. రాజులలో శ్రీదాంబుద, రాజులలో నెంచఁగా వి♦రాజిలు బహువీ
రాజులచే దానకలా, రాజులచేఁ బెద్దనృపతి♦రహిఁ బెద్ద యనన్. 26

టీక. పెద్దనృపతి=పెద్దభూపాలుఁడు. రాజులలోన్=దొరలలో. శ్రీదాంబుద రాజులలోన్=కుబేర మేఘ చంద్రులలో. ఎంచఁగాన్=గణింపఁగా. బహువీరాజులచేన్.—బహు=పెక్కులగు; వీర=వీరులయొక్క; ఆజుల చేన్=జగడంబుల చేతను. దానకలా రాజులచేన్.—దానకలా=వితరణవిద్యలయొక్క; రాజులచేన్=పరంపరల చేతను. రహిన్=ఒప్పిదము చే. పెద్దయనన్=అధికుఁ డనునట్లుగా. విరాజిలున్=ప్రకాశించును.

పెద్దరాజు దొరలలో వీరాజుల చేతను, కుబేర మేఘ చంద్రులలో దానకలారాజుల చేతను, 'పెద్ద' యనునట్లు విరాజిలె నని తాత్పర్యము. యథాసంఖ్యాలంకారము. "యథాసంఖ్యం క్రమేణైవ క్రమికాణాం సమన్వయః" అని తల్లక్షణము.

తే. అతనిసతి వల్లభాంబ నా • నలరుఁ గన్న
యిల్లు తనమన్నయిల్లు భా•సిల్ల నగుచుఁ
గన్నయిల్ పల్చఁ జేయుచు • మన్నయిల్ మ
హాపకీర్తియుక్తముఁ జేయు • నబ్జపాణి. 27

టీక. అతనిసతి=ఆపెద్దనృపాలుని భార్య. కన్నయిల్లు=తనపుట్టినయిల్లు. తనమన్నయిల్లు=తనయత్తగారిల్లు. భాసిల్లన్ = ప్రకాశించుచుండఁగా. కన్నయిల్పల్చఁ జేయుచున్ = పుట్టినయింటిని పలుచఁదనము నొందినదానిఁగా చేయుచు, ననగా లఘువైనదానిఁగాచేయుచు. మన్నయిల్మహాపకీర్తి యుక్తముఁ జేయునబ్జపాణిన్.—మన్నయిల్=అత్తయింటిని; మహాపకీర్తి=గొప్పయపయశస్సుతో; యుక్తమున్ = కూడినదానిఁగా; చేయునబ్జపాణిన్=చేయుచున్న లక్ష్మీదేవిని. నగుచున్=పరిహసించుచు. వల్లభాంబ నాన్=వల్లభాంబ యను పేర; అలరున్=ఒప్పును.

వల్లభాంబ లక్ష్మీదేవివలెఁ బుట్టినింటిని లఘువుగాను, అత్తగారియింటిని మహాపకీర్తిగలదానిగాను, జేయక పుట్టినిల్లునత్తగారియిల్లును, దనసద్వృత్తులచే భాసిల్లునట్లు చేసె నని తాత్పర్యము. లక్ష్మీదేవియొక్క పుట్టినిల్లగుసముద్రము జలరూపము గావున పలుచగామన్నదనియు మన్నయిల్లగుపద్మము, మహాపకీర్తియనఁగా గొప్పయుదకముతోఁగూడిన బురద, దానితోఁ గూడియున్నదనియు భావము. "కీర్తి ర్యశసి కర్దమే" అనివిశ్వము. అప్ శబ్దము, "ఋక్పూరబ్ధూఃపథామానక్షే" అను పాణిని సూత్రము చే టచ్ప్రత్యయము చేయఁగా మహాపయని యకారాంత మైన దని తెలియనది. కాదేని "అపాం సమూహ ఆపమ్" అనఁగా నీటిసమూహము ఆపగా అనుశబ్దంబునందుంబోలె గ్రహించునది.

క. ఆకాంతయందుఁ బెద్ద, క్ష్మాకాంతుఁడు గాంచె మల్ల•శౌరిని విలస
న్నాకాంతరమాకాంతర, సాకాంతరమావిశేషు • సజ్జనపోషున్. 28

టీక. ఆకాంతయందున్ = ఆవల్లభాంబయందు. పెద్దక్ష్మాకాంతుఁడు = పెద్దవసుమతీశుఁడు. విలసన్నాకాంతరమాకాంతరసాకాంతరమావిశేషున్.—విలసత్=ఒప్పుచున్న; నాక=పాపరహితమగు; "అకం పాపేచ దుఃఖేచ" అని విశ్వము: అంతర=హృదయమందలి;

మాకాంతరస=విష్ణుభక్తిచేతను; ఆకాంత=ఒప్పునట్టి; రమా=సంపదయొక్క, కావున విష్ణుభక్తియొక్క మనోజ్ఞసంపదయొక్క, అధికమగు విష్ణుభక్తియొక్కయనుట "శృంగారాదౌ విషే వీర్యే ద్రవే రాగే" అనియనుటచే రసశబ్దము రాగమందుఁ బ్రయోగింపఁబడినది అరాగము భక్తిరూప మగునని భావము: విశేషుఁడు = అతిశయముగలవానిని. సజ్జనపోషుఁడు = విద్వత్పోషకుని. మల్లశౌరిన్=మల్లరాయని. కాంచెన్=కనెను. యమకాలంకారము.

సీ. తనకలావిభవంబు ♦ తనకలావిభవంబు, కరణి సుదృగ్జాతి ♦ వఱలఁ జేయఁ
దనదానమహిమంబు♦తనదానమహిమంబు, గతిని బ్రత్యర్థిసం♦ఘములఁ బెంచఁ
దనసుమనోవృత్తి ♦ తనసుమనోవృత్తి, లీల సదాసవ♦హేలఁ గూర్పఁ [పఁ
దనమహామిత్రాళి ♦ తనమహామిత్రాళి, పగిది నానావనీ♦భరణ మూనఁ
తే. దనరు విషమాద్రిజిహ్మగ♦ స్తబ్ధరోమ
మత్తమాతంగకఠినకూ♦ర్మప్రసంగ
విరసవసుధావధూభోగ ♦ పరవిహారి
శాలిభుజకేళి మల్లభూ♦పాలమౌళి. 29

టీక. తనకలావిభవంబు=తనవిద్యలయొక్క వైభవంబు. తనక [illegible] కరణిన్=తన దేహకాంతులయొక్క విభవంబుభంగి. సుదృగ్జాతిన్=విద్వత్సంఘమును, దేహకాంతి పరమైనపుడు, స్త్రీసంఘమును. వఱలఁ జేయన్=ప్రకాశింపఁ జేయు చుండఁగా. తనదానమహిమంబు=తనత్యాగముయొక్క గొప్పఁదనము. తన దానమహిమంబుగతిని=తనయొక్క ఛేదనమహిమంబువలె. ప్రత్యర్థిసంఘములన్.—ప్రత్యర్థి=ప్రతియాచకులయొక్క, వైరులయొక్క; సంఘములన్=సమూహములను. పెంపన్=పోషింపఁగా, సంహరింపఁగా. తనసుమనోవృత్తి=తనమంచిమనోవృత్తి. తనసుమనోవృత్తిలీలన్=తనపండితవృత్తికరణి. సదాసవహేలన్.—సత్=సత్పురుషులయొక్క; ఆసవ=ప్రాణసంఘమునకు, అసువులు అనఁగా ప్రాణములు, వానిసంఘము ఆసవమనఁబడును, సమూహార్థమందు అణ్ప్రత్యయము; హేలన్=విలాసమును; సదా=ఎల్లపుడు; సవ=యజ్ఞములయందలి; హేలన్=క్రీడను. కూర్పన్=ఘటిల్లఁజేయఁగా. తనమహామిత్రాళి=తనయొక్క అధికులైనమిత్రులయొక్క గుంపు. తనమహామిత్రాళిపగిదిన్.—తన=తనయొక్క; మహత్=అధికులైన; అమిత్ర=శత్రువులయొక్క; ఆళిపగిదిన్=గుంపురీతి. నానావనీభరణము.—నానా=అనేకప్రకారమగు; అవనీభరణము=భూభరణమును; శత్రుపరమైనపుడు, వనీ=అరణ్యములయొక్క; భరణము. ఊనన్=వహింపఁగా. విషమాద్రిజిహ్మగస్తబ్ధరోమమత్తమాతంగకఠినకూర్మప్రసంగవిరసవసుధావధూభోగపరవిహారశాలిభుజకేళి.—విషమాద్రి=అసమాఖ్యములగుపర్వతములయొక్కయు, విషమసంఖ్య అనఁగా సప్తసంఖ్య గలకులాచలములయొక్కయనుట; జిహ్మగ=కౌటిల్యమునందిన శేషునియొక్కయు, జిహ్మయనునది భావప్రధాననిర్దేశము, వక్రస్వభావముగానడచు శేషునియొక్కయనుట "జిహ్మః కుటిలవక్రయోః" అనివిశ్వము: స్తబ్ధరోమ=నిక్కినవెండ్రుకలు గల అనఁగాఁ సురూపి యైన ఆదివరాహమూర్తియొక్కయు, వరాహమునకు రోమములు నిగుడుకొనియుండుట సహజ మని భావము; మత్తమాతంగ=మత్తుగొన్న నీచ

జాతివాంఛ్రడయొక్కయు, మదించినదిగ్గజములయొక్కయు; కఠినకూర్మ=కఠోరచిత్తుఁడగు నాదికూర్మమూర్తియొక్కయు, కూర్మములకు దేహము కఠినముగా నుండును గాన కఠోరదేహుఁడగు కూర్మమూర్తియొక్క యని భావము; ప్రసంగ=ప్రకృష్టమగు సంబంధమందు; విరస = పరాఙ్ముఖియగు; వసుధావధూ=భూకాంతయొక్క; భోగ=సుఖవిషయకమైన; పరవిహార=ఉత్కృష్టక్రీడలచేత; శాలి=ఒప్పుచుండెడు; భుజ=బాహువులయొక్క; కేళి=విలాసముగలవాఁడగు. మల్లభూపాలమౌళి=మల్లభూపాలాగ్రణి. తనరున్=ఒప్పును.

సాధారణధర్మము సుదృఙ్గాతి వఱలఁ జేయుట మొదలగునది. "శ్లో॥ సకలకలం పురమేత జ్జాతం సమ్ప్రతి సుధాంశుబిమ్బ మివ" అనుస్థలమందుబలె నర్థకృతము గాక శ్లేషకృతమై శాబ్దమైనది గాన, ఇందుఁ దనకలావిభవంబు తనకలావిభవంబుకరణి లోనగువానియందుపమాలంకారము శబ్దాలంకారములోఁ జేర్పఁదగినది. ఇందుకుఁ బ్రమాణము కావ్యప్రకాశమునందు "శ్లో॥ స్ఫుట మర్థాలఙ్కారా వేతా వుపమాసముచ్చయౌ కింతు। ఆశ్రిత్యశబ్దమాత్రం సాధర్మ్య మిహాపి సమ్భవతః" అనియున్నది. నానావనీభరణ మనుచోట శబ్దశ్లేషము. వసుధావధూవైరస్యమునుగూర్చి కులాచలాదులయందుఁ గలవిషమత్వాదులును దాదృశవసుధావధూభోగమును గూర్చి సుదృఙ్గాతిని వఱలఁజేయుట మొదలగునవియుఁ గారణములు గాన పదార్థవాక్యార్థహేతుక కావ్యలింగాలంకారములును యథాసంఖ్యముగా సంభవించును. "సమర్థనీయ స్యార్థస్య కావ్యలిఙ్గం సమర్థనమ్" అని తల్లక్షణంబు. విషమాద్రీత్యాదిస్థలముల శ్లేషోత్థాపితవ్యతిరేకము. తనకలావిభవంబు తనకలావిభవంబు మొదలగువానియందు యమకాలంకారము వ్యక్తము.

మ. అరిచక్రిధ్వజఖండనప్రబలబాహాభూతి దుశ్శాసనా
తిరయోన్మూలనపాండితీమహిమచే దీవ్యన్మహాభీమసం
గరకౌతూహలవృత్తి మించె లలనాకంజాతబాణుండు మ
ల్లరసేంద్రుండు నిజాసిశంబదళితేలాభృన్మహాపక్షుఁ డై. 30

టీక. లలనాకంజాతబాణుండు=స్త్రీలకు మదనప్రాయుం డగు. మల్లరసేంద్రుండు = మల్లభూపాలుండు, ఇంద్రుం డనుటచేత దేవేంద్రవిషయక మగునర్థాంతరము తోఁచుచున్నది. నిజాసిశంబదళితేలాభృన్మహాపక్షుఁడై.—నిజ=స్వకీయమగు; అసిశంబ=వజ్రాయుధతుల్య మగు ఖడ్గముచేత, ఖడ్గ మగువజ్రాయుధముచేత నని యింద్రపరమైనయర్థము; దళిత=ఖండింపఁబడిన; ఇలాభృత్=రాజులయొక్క, పర్వతములయొక్క; మహాపక్షుఁడై=అధికమైన సైన్యముగలవాఁడై, పర్వతపర మైనపుడు గొప్ప ఱెక్కలుగలవాఁడై యని యర్థము "పక్షః స్సహాయే గరుతి" అని విశ్వము. అరిచక్రిధ్వజఖండన ప్రబలబాహాభూతిదుశ్శాసనాతిరయోన్మూలనపాండితీ మహిమచేన్.—అరి=శత్రువులయొక్క; చక్రి=రథములయొక్కయు; ధ్వజ=టెక్కెములయొక్కయు; ఖండన=తునుముటయందు; ప్రబల=బలిష్ఠము లగు; బాహా=భుజములయొక్క; భూతి=సంపదయొక్కయు; దుశ్శాసన=దుర్మార్గులయొక్క; అతిరయ = అధికవేగముయొక్క; ఉన్మూలనపాండితీ=నాశవిషయకమైనపాండిత్యముయొక్కయు; మహిమచేన్=మహిమచేతను.

దీవ్యన్మహాభీమ సంగరకౌతూహలవృత్తిఁ.— దీవ్యత్ = ప్రకాశించుచున్న; మహాభీమ = మిక్కిలిభయంకరమగు; సంగర=యుద్ధమందు; కౌతూహలవృత్తిఁ=సంతోషవృత్తిచేతను. ఇట మహాభీమ యనుచోట భీమసేనవిషయార్థాంతర మగును గాన తత్పరమైనపుడు అరి=శత్రు వగు; చక్రిధ్వజ=సర్పధ్వజుఁడగు దుర్యోధనునియొక్క; ఖండన=తునుముటయందు; ప్రబల=ప్రబలమగు; బాహాభూతి=భుజసంపదయొక్కయు; దుశ్శాసన = దుశ్శాసనునియొక్కయు; అతిరయోన్మూలనపాండితీ = అధికవేగముయొక్క నాశముసేయుటయందలి పాండిత్యముయొక్కయు; మహిమచేఁ=మహిమచేతను. దీవ్యత్=ప్రకాశించుచున్న; మహత్=అధికమైన; భీమ=భీమసేనునియొక్క; సంగర=యుద్ధమువంటియుద్ధమునందు; కౌతూహలవృత్తిఁ=కౌతుకవృత్తిచేత. మించెఁ=అతిశయించెను.

ఇందు భీమేంద్రాదిశబ్దశక్తిప్రస్తుతార్థపరముగా సంయోగాదులచె నియంత్రితంబైనను వ్యంజనావృత్తిచేత నప్రస్తుతభీమసేనపాకశాసనాద్యర్థములు బోధితము లగుచుండుటచే ప్రకృతాప్రకృతార్థముల కౌపమ్యము ధ్వనిత మగును గాన వ్యంగ్యోపమ గాఁ దెలియవలయు. మతాంతరమున ప్రకృతాప్రకృతగోచరశ్లేషాలంకారము నగును. అనిశంబ యనుచోట రూపకము. "శతకోటి స్స్వరుశ్శమ్బో దమ్భోళి రశని ర్ద్వయోః" అని యమరము.

సీ. తా నెంతపుణ్యజనీనుఁడైనఁ దనధ, నంబు సూడ మహావరంబ కాదె
తా నెంతరాజైనఁ దనవసుస్పర్శనా, డంబరం బెంచ జడంబ కాదె
తా నెంతవారికిఁదాపైనఁ దనజీవ, నంబు సంప్రాప్తపంకంబ కాదె
తా నెంతఘనవృత్తిఁ దాల్చి మిన్నందిన, విపులమాతనయీగి విషమ కాదె
తే. యనుచు రారాజు రేరాజు నబ్ధిరాజు
నంబుదంబును నిరసించు ననఘదాన
మహిమ నాహిమగిరిసేతుమహితకీర్తి
పాళి సుగుణాళి మల్లభూపాలమౌళి. 31

టీ. ఆహిమగిరిసేతుమహితకీర్తిపాళి.—ఆహిమగిరిసేతు=ఆసేతుహిమాచలపర్యంతము; మహిత=ఒప్పుచున్న; కీర్తిపాళి=యశస్సమూహముగలవాఁడు. సుగుణాళి=శ్రేష్ఠమయినగుణముల సమూహముగలవాఁడు. మల్లభూపాలమౌళి=మల్లభూపాలశ్రేష్ఠుండు. రారాజుఁ=కుబేరుని. రేరాజుఁ=చంద్రుని. అబ్ధిరాజుఁ=క్షీరసముద్రమును. అంబుదంబును=మేఘమును. తా నెంత పుణ్యజనీనుఁడైనఁ = తా నెంతపుణ్యాత్ములకు హితముఁజేయువాఁడైనను, పుణ్యజను లనఁగా యక్షులు నగుదురు గాన యక్షులకు హితముఁ జేయువాఁడైనను అని యర్థాంతరము. తనధనంబు=తనయొక్కవిత్తము. చూడఁ=విచారింపఁగా. మహావరంబ.—మహత్=మిక్కిలి; అవరంబ=నికృష్టమైనదే; మహత్=అధికమైన; వరంబ=వరమనునిధిరూపమైనదె. కాదె=కదా. "వరశ్చ నిధయో నవ" అని అమరము. తా నెంతరాజైనఁ=తా నెంతదొరయైనను, తా నెంతచంద్రుఁడైనను. తనవసుస్పర్శనాడంబరంబు.—తనవసు=తనద్రవ్యముయొక్క; స్పర్శన=వితరణముయొ

క్కు; ఆడంబరంబు=అతిశయము; ఎంచన్=విచారింపఁగా; జడంబ కాదె=జాడ్యసంపాదకమె కదా. చంద్రునియొక్కవసువులు అనఁగా కిరణములయొక్క స్పర్శనతిశయము జడంబనఁగా జలమయమైనది, చల్లనిదనుట, కార్యకారణములకు నభేదము నవలంబించి యిట్లు వ్యపదేశము సేయఁబడియె. "వసుర్మయూఖాగ్ని ధరాధిపేషు యోక్త్రే లకే స్యాద్వసు హాటకేపి వృద్ధ్యౌషధాశ్వినధనేషు రత్నే" విశ్వప్రకాశిక. "స్పర్శనో మారుతే పుంసి దానే తు స్పర్శనం స్మృతమ్" అని విశ్వము. తానెంతవారికిన్=తానెంతదొడ్డవారలకు, ఎంతయుదకములకు. దాపైనన్=ఆధారమైనను. తనజీవనంబు=తనబ్రతుకు, ఉదకము "జీవనం భువనం వనమ్" అని యమరము. సంప్రాప్తపంకంబ=సంప్రాప్తమగుపాపముకలది. బురదగలది. కాదె. "పఙ్కంపాపేచ కర్దమే" అని విశ్వము. తానెంతఘనవృత్తిన్=తాను ఎంతఘనమైనవృత్తిని, ఎంతమేఘవృత్తిని. తాల్చి=వహించి. మిన్నందినన్=అతిశయించినను, ఆకాశమందినను. విపులమాతనయాగి=అధికమగుతనత్యాగము. విషమ=గరళమె, జలమె; "జీవనీయం కుశం విషమ్" అని అమరము: కాదె. అనుచున్=ఇట్లనుచు. అనఘదానమహిమన్= నిర్దోషమగుదానాతిశయముచేత; నిరసించున్= నిరాకరించును.

ఇందు నాలుగుచరణములయందుఁ జెప్పినయర్థము వరుసగా గీతియందున్న రారాజు రేరాజు అబ్ధిరాజు అంబుదము వీనితోనన్వయించుటచే యథాసంఖ్యాలంకారము. ఉపమానభూతకుబేరాది త్యాగములయందుదోషోద్భావనము చేసియుపమేయమల్లనృపాలత్యాగమందు నిర్దోషత్వరూపవిశేషముచెప్పుటచే శ్లేషోత్థాపితవ్యతిరేకాలంకారము, యథాసంఖ్యమునకు వ్యతిరేకమునకును బరస్పరనైరపేక్ష్యమువలన సంసృష్టి.

మ. అలమల్లక్షితిభృద్వతంసము సపక్షాభిఖ్యఁ జెన్నొంది రాఁ
జలముల్ మాని ప్రతీపవార్ధిరశనాజానీంద్రు లొక్కుమ్మడిం
గలితోద్యచ్ఛతకోటిసాధనబలఖ్యాతుల్ దిగం ద్రోచి స్వ
స్థలసౌఖ్యంబులు గోర కందిరి వనస్థానస్థితిం జిత్రతన్. 32

టీ. అలమల్లక్షితిభృద్వతంసము=అమల్లభూపాలాగ్రణి, పర్వతశ్రేష్ఠము అని అర్థాంతరము తోఁచుచున్నది. సపక్షాభిఖ్యన్=పక్షముతోఁగూడినది సపక్షము, పక్షమనఁగా విరోధము పత్త్రమును "పక్షస్సహాయే గరుతి విరోధే బలమిత్రయోః" అని హలాయుధము: శత్రువనెడు పేరిచేతను, పర్వతపరమైనపుడు ఱెక్కలుగల దనుప్రసిద్ధిచేతను. చెన్నొంది=ఒప్పి. రాన్=రాఁగా. ప్రతీపవార్ధిరశనాజానీంద్రులు.—ప్రతీప=శత్రువు లగు; వార్ధిరశనాజానీంద్రులు=రాజశ్రేష్ఠులు, వార్ధిరశనాజాని యనుచోట "వార్ధిరశనా జాయా యేషాం తే" అని విగ్రహము చేసినపుడు "జాయాయా నిఙ్" అనుసూత్రముచేత నిఙాదేశము: ఇచట నింద్రులు అనుపదముచేత దేవేంద్రరూపార్థాంతరము దోఁచుచున్నది. చలముల్= మాత్సర్యములను. మాని=వదలి. ఒక్కుమ్మడిన్=ఒకమొత్తముగా. కలితోద్యచ్ఛతకోటిసాధనబలఖ్యాతుల్.—కలిత=సంబంధించియున్నట్టి; ఉద్యత్=సన్నద్ధమగుచున్న; శతకోటి=శతకోటిసంఖ్యాకమయిన, ఇంద్రపరమైనపుడు వజ్రమనెడు అనియర్థము; సాధన=యుద్ధసాధనములుగల; బల=సైన్యములు గలవారను,

పరాక్రమముగలవారను అని ఇంద్రపరమైనయర్థము; ఖ్యాతుల్=యశస్సులను. దిగంద్రోచి=దిగువఁబడవైచి. స్వస్థలసౌఖ్యంబులు = తమయునికిపట్టునందలిసౌఖ్యములను, స్వర్గస్థలసౌఖ్యముల నని యింద్రపరమైనయర్థము. కోరక=అశింపక. వనస్థానస్థితిక్=వనస్థలనివాసమును. చిత్రతక్=ఆశ్చర్య మగునట్లుగా. అందిరి=పొందిరి.

సపక్షమైనయొకపర్వతము రాఁగా నింద్రులు వజ్రముఁ బడవైచి స్వర్గమును వదలి వనములకుఁ బోవుట చిత్రము. మల్లభూపతి యుద్ధమునకు బయలుదేఱి రాఁగా శత్రురాజు లందఱుఁ దమనివాసములం గలసర్వవిధసౌఖ్యములను సమస్తపరివారమును వదలి యడవులపాలైరని భావము. దీనివలన వర్ణ్యుఁడు లోకోత్తరవీరుం డని వ్యంగ్యంబు. స్వస్థలసౌఖ్య మనుచోట నింద్రపరమైనపుడు "స్వర్" అనుశబ్దములోని రేఫమునకు "ఖరవసానయోర్విసర్జనీయః" అనుసూత్రముచే రేఫమునకు విసర్గము వచ్చి "ఖర్పరే శరి వా విసర్గలోపో వక్తవ్యః" అను వార్తికముచే విసర్గమునకు లోపము వచ్చిన దని యెఱుంగునది.

క. ఆమల్లనృపతి చెన్నాం,బామానినియందుఁ గాంచె ♦ మల్లక్షితిపుక్
వ్యోమగవీసోమగవీ, రామగవీశాచ్ఛకీర్తి ♦ రాజన్మూర్తిన్. 33

టీ. ఆమల్లనృపతి= ఆమల్లభూపాలుఁడు. చెన్నాంబామానినియందుక్=చెన్నాంబికయందు. వ్యోమగవీసోమగవీరామగవీశాచ్ఛకీర్తిక్.—వ్యోమగవీ = కామధేనువువలె; సోమగవీ=చంద్రకిరణమువలె; రామ=బలరామునివలె; గో=వజ్రాయుధమువలె నని కాని సరస్వతివలె నని కాని; ఈశ=శివునివలె; అచ్ఛ=స్వచ్ఛమగు; కీర్తిక్=యశస్సుగలవాఁడును. రాజన్మూర్తిక్= ప్రకాశించుచున్నశరీరముగలవాఁడును, అగు. మల్లక్షితిపుక్=మల్లభూపాలుని. కాంచెక్=కనెను. వ్యోమగవీసోమగవీ యనుచోటుల గోశబ్దముమీఁద సమాసాంతటచ్ప్రత్యయము వచ్చి జీప్ప్రత్యయము రాఁగా గవీ యనురూపము సిద్ధించినది. గవీశ యనుచోట "గౌశ్చ ఈశశ్చ" యనుద్వంద్వసమాసమందు అవాదేశము వచ్చి గవీశ యని రూపమైనది.

సీ. తనయశశ్ఛద్మజీ ♦ వనజాతమునకుఁ దో,యదపథంబు మధుప్రి ♦ యంబు గాఁగఁ
దనకలాదంభన ♦ ర్తకికి వేలాగోత్ర, పరివృతాచల చారు ♦ ఖురళి గాఁగఁ
దనప్రతాపవ్యాజ ♦ దావవహ్నికిఁ దార,కాసంతతుల్ స్ఫులిం ♦ గములు గాఁగఁ
దనధర్మకైతవ ♦ ధారాళవల్లికిఁ, గాంచనాచల ముపఘ్నంబు గాఁగఁ
తే. దనమహోదారతోపధి ♦ వనదతతికిఁ
గాండరుహజాండకోటు ల ♦ ఖండకరక
కాండములు గాఁగ బెంకోలు ♦ గండబిరుద
కాంతుఁ డిల నేలె మల్లభూ ♦ కాంతుఁ డెలమి. 34

టీ. తనయశశ్ఛద్మజీవనజాతమునకుక్.—తన = తనయొక్క; యశః=కీర్తియ నెడు; ఛద్మ=నెపముగల; జీవనజాతమునకుక్=పుండరీకమునకు "జీవనం భువనం వనమ్" అని అమర

ము. తోయదపథంబు.—తోయద=మేఘములయొక్క; పథంబు=మార్గమగునాకాశము. మధుప్రియంబు=తుమ్మెద. కాఁగన్ =అగుచుండఁగా. తనకలాదంభనర్తకికిన్.—తన=తనయొక్క; కలా=విద్యయనెడు; దంభ=వ్యాజముగల; నర్తకికిన్=నటికి. వేలాగోత్రపరివృతాచల.—వేలాగోత్ర = లోకాలోకపర్వతముచేత ; పరివృత = పరివేష్టింపఁబడిన; అచల=భూమి. చాపుఖురళి కాఁగన్=మనోహర మగుగరిడి యగుచుండఁగా. తనప్రతాపవ్యాజదావవహ్నికిన్.—తనప్రతాప = తనయొక్క ప్రతాప మనెడు; వ్యాజ = కపటముగల ; దావవహ్నికిన్ = దావానలమునకు. తారకాసంతతుల్ = నక్షత్రసమూహములు. స్ఫులింగములు = మిడుఁగురులు. కాఁగన్ = అగు చుండఁగా. తన ధర్మకైతవధారాళవల్లికిన్.—తనధర్మ = తనయొక్క ధర్మ మనెడు; కైతవ = దంభము గల; ధారాళ = రూఢమైన; వల్లికిన్=లతకు. కాంచనాచలము = మేరుపర్వతము. ఉపఘ్నంబు= అంతికాశ్రయము, అనఁగా తీఁగ పాఁకుటకు సమీపమునఁ బాఁతినకొయ్యవంటిది "స్యా దుపఘ్నో న్తికాశ్రయే" అని యమరము. కాఁగన్ = అగుచుండఁగా. తనమహోదారతోపధివనదతతికిన్.— తన = తనయొక్క; మహోదారతా=ఉత్కృష్టదాతృత్వమనెడు; ఉపధి=నెపముగల; వనదతతికిన్ = మేఘసంఘమునకు. కాండరుహజాండకోటులు.-కాండరుహ =కమలమందు "కాణ్డోస్త్రీ దణ్డబాణార్వవర్గావసరవారిషు" అని యమరము: జ=పుట్టిన, బ్రహ్మదేవుని సంబంధులైన ; అండకోటులు = బ్రహ్మాండకోటులనుట. అఖండకరకకాండములు కాఁగన్ = అఖండము లగువర్షోపలములు కాఁగా. "వర్షోపలస్తు కరకః" అని యమరము. బింకోలుగండబిరుదకాంతుఁడు= బింకోలుగండ యనుబిరుదముచేత మనోహరుఁడు. మల్లభూపాలుఁడు = మల్లభూపతి. ఇలన్ = భూమిని. ఎలమిన్ = సంతోషముతో. ఏలెన్ = పాలించెను.

మల్లభూపతికీర్తి బ్రహ్మాండ మావరించిన దనియు, విద్యావిభవము లోకాలోకపర్వతమునకు లోనగుసప్తద్వీపములు వ్యాపించిన దనియు, ప్రతాపాగ్ని మిన్నంది మించుచున్న దనియు, ధర్మము మేరుపర్వతముదాఁక వ్యాపించిన దనియు, త్యాగము బ్రహ్మాండకోటుల నతిక్రమించి ప్రసరించినదనియు భావము.

ఇం దత్యుక్త్యలంకారము "శ్లో ॥ అత్యుక్తి రద్భుతాతథ్యశౌర్యౌదార్యాదివర్ణనమ్" అని లక్షణము. తోయదపథ వేలాగోత్ర పరివృతాచలా తారకాసంతతి కాంచనాచల బ్రహ్మాండములను, మధుప్రియత్వ ఖురళిత్వ స్ఫులింగ త్వోపఘ్నత్వ కరకత్వ రూపముగ రూపించుటచే రూపకాలంకారము. యశశ్ఛద్మ కలాదంభ ప్రతాపవ్యాజ ధర్మకైతవ మహోదారతోపధి యను స్థలములయందుఁ గైతవార్థకపదములచే యశఃప్రభృతుల నిహ్నవవ్యక్తి యగుటంజేసి కైతవాపహ్నుత్యలంకారము. "కైతవాపహ్నుతి ర్వ్యక్తౌ వ్యాజాద్యై ర్నిహ్నుతేః పదైః" అని లక్షణము.

మ. అరుదై మల్లిధరాధినాయకసము◆ద్యద్భూరిధారాధరం
బరిరాడాశుగభేదశక్తిఁ బటుమి◆త్రాలోకమోదప్రదో

త్తరలీలావిభవాప్తి శత్రువనితా•తాపాస్పదస్ఫూర్తిచే
ధరఁ దార్చుం బరవాహినీవితతికు•ద్భ్రాజత్కబంధాఢ్యతన్. 35

టీ. ఇచట మల్లభూపతిఖడ్గమును వర్ణింపఁగా మేఘపర మైనయర్థాంతరము దోఁచుచున్నది. మల్లధరాధినాయకసముద్యద్భూరిధారాధరంబు.—మల్లధరాధినాయక = మల్లభూపాలునియొక్క; సముద్యత్ = పైకిలేచిన; భూరి = సువర్ణమయ మగు "భూరి ప్రాజ్యసువర్ణయోః" అని విశ్వము: ధారాధరంబు = ఖడ్గము; మేఘ మని యర్థాంతరము "ధారాధరస్తోయధరే కృపాణే" అని విశ్వము. అరిరాడాశుగచ్ఛేదశక్తిన్.—అరిరాట్ = శత్రురాజులయొక్క; ఆశుగ = బాణములయొక్క, శత్రుశ్రేష్ఠ మైనవాయువుయొక్క; ఇచట వాయువు మేఘమునకు శత్రు వనుట. "శ్లో. ఉల్లాస్య కాలకరవాలమహాంబువాహం దేవేన యేనజరఠోర్జితగర్జితేన। నిర్వాపిత స్సకలఏవ రణే రిపూణాం ధారాజలైస్త్రిజగతిజ్వలితః ప్రతాపః" అనుదానిలోఁ బర్జన్యుఁడు దావానలమునకు శత్రు వను ప్రమాణము కావ్యదర్పణమందు వ్రాసినరీతిగఁ దెలియునది. ఛేద=భంగపఱచుటయందు; శక్తిన్ = సామర్థ్యముచేతను. పటుమిత్రాలోకమోదప్రదోత్తరలీలావిభవాప్తిన్.—పటు=సమర్థమగు; మిత్రాలోక = మిత్రులయొక్క చూపులకు, సూర్యతేజస్సునకు; మోదప్రద=సంతోషకరమగు; ఉత్తర=లోకోత్తర మైన; లీలావిభవ = విలాసాతిశయముయొక్క; ఆప్తిన్ = ప్రాప్తిచేత. శత్రువనితాతాపాస్పదస్ఫూర్తిచేన్.—శత్రువనితా = శత్రుస్త్రీలయొక్క; తాప = సంతాపమునకు, వేఁడిమికి; ఆస్పద= ఆధార మగు; స్ఫూర్తిచేన్ = ప్రకాశముచేతను. అరుదై = ఆశ్చర్యకర మై. ధరన్ = భూమియందు. పరవాహినీవితతికిన్.— పరవాహినీ = శత్రుసైన్యములయొక్క, గొప్పనదులయొక్క; వితతికిన్=గుంపునకు. ఉద్భ్రాజత్కబంధాఢ్యతన్.—ఉద్భ్రాజత్=మిక్కిలిప్రకాశించుచున్న; కబంధ=మొండెములచేత, ఉదకములచేత;ఆఢ్యతన్=పూర్ణతను. తార్చున్=కలిగించును.

మేఘమునకు స్వభావముగ వాయువుచేతఁ గొట్టఁబడుటయు సూర్యతేజస్సునకు ప్రకాశకంబుగ నుండుటయుఁ దాపశాంతిఁ జేయుటయుఁ గలిగి యుండఁగా దానికి విపరీతముగ నాశుగఛేదనము, మిత్రాలోకమోదప్రదత్వము, తాపకరణము, నాశ్చర్యకర మని యాశయము.

మల్లభూపతి ఖడ్గముచేత శత్రుల బాణపరంపరల నడఁచి వారిని సేనలతోఁ గూడ బీనుఁగుఁబెంటలు గావించి వారివనితలకు సంతాపమును గూర్చి మిత్రులకు నేత్రోత్సవము గావించె నని భావము. ఇట ఖడ్గమునందు వారిదసామ్యము వ్యజ్యమాన మగును. కావున వ్యంగ్యోపమ.

సీ. రాజచంద్రులు గాని • రాజచంద్రులు గారు
తర మూన్ప నరిదాన•దానపటిమ,
నచలేశ్వరులు గాని • యచలేశ్వరులు గారు
సరి సేయ ధృతిసంగ•సంగరముల,

నినకుమారులు గాని • యినకుమారులు గారు
కదియింప రుచికాండ•కాండకలన,
గోపాత్మజులు గాని • గోపాత్మజులు గారు
పాటి వాగనుభావ•భావగరిమ,
తే. ననుచు జగ మెన్నఁ బొగడొందు•హారిమండ
లాగ్రఖండితరిపుమండ•లప్రవీర
కాండనిర్భిన్నమార్తాండ•మండలాంత
రుండు పెదమల్లనాయకా•ఖండలుండు. 36

టీ. హారిమండలాగ్రఖండితరిపుమండలప్రవీరకాండనిర్భిన్నమార్తాండమండలాంతరుండు.—హారి = మనోహరమగు; మండలాగ్ర = ఖడ్గముచేత; ఖండిత = నఱకఁబడిన; రిపుమండలప్రవీరకాండ= శత్రువీరులగుంపుచేత; నిర్భిన్న=భేదింపఁబడిన; మార్తాండమండలాంతరుండు=సూర్యమండలమధ్యభాగముగలవాఁడగు "శ్లో. ద్వా వితౌ పురుషౌ లోకే సూర్యమండలభేదినౌ। పరివ్రాడ్యోగయుక్తశ్చ రణే చాభిముఖో హతః" అని మనువు. పెదమల్లనాయకాఖండలుండు = పెదమల్లభూపాలేంద్రుఁడు. జగము = లోకము. అరిదానదానపటిమన్.— అరిదాన = పగతురతునుముటయొక్క; దాన=త్యాగముయొక్క; పటిమన్= సమర్థతయందు. తర మూన్పన్ = సాటి చేయుటకు. రాజచంద్రులు గాని=ఇంద్రుఁడు చంద్రుఁడు గాని. రాజచంద్రులు గారు = నృపశ్రేష్ఠులు గారు "రాజా ప్రభౌ నృపే చన్ద్రే యక్షే క్షత్త్రియశక్రయోః" అని విశ్వము: ఇట నరిఖండనమందు నింద్రుఁడు వితరణమందు చంద్రుఁడు సము లగుదు రని క్రమాన్వయము. నాలుగుపాదములయందు నిట్లే చూడవలయు. ధృతిసంగసంగరములన్ = ధైర్యసంగమునందును, యుద్ధములందును. సరిసేయన్=పోల్చుటకు. అచలేశ్వరులు గాని = మేరుపర్వతము, రుద్రుండు గాని. అచలేశ్వరులు = భూమిపతులు. గారు = సరిగారు. రుచికాండకాండకలనన్.— రుచికాండ = కాంతిపరంపరయొక్క; కాండ = బాణములయొక్క; కలనన్ = కూడికయందు. కదియింపన్=పోల్చుటకు. ఇనకుమారులుగాని = సూర్యస్కందులు గాని. ఇనకుమారులు గారు = రాజపుత్రులు గారు "ఇన స్సూర్యే ప్రభౌ" అని అమరము. వాగనుభావభావగరిమన్.—వాగనుభావ= వాక్సామర్థ్యము యొక్క, భావ=విలాసముయొక్క; గరిమన్=అతిశయమునందు. పాటి= సమానులు. గోపాత్మజులుగాని=గీష్పతి మదనుండు గాని. గోపాత్మజులుగారు = భూపాలకుమారులు గారు. అనుచున్=ఇట్లనుచు. ఎన్నన్ = గణింపఁగా. పొగడొందున్ = ఘనతకెక్కును. ఇందు యథాసంఖ్య మలంకారము. దానదాన, సంగసంగ, లో నగువానియందు ఛేకానుప్రాసము. మండలాగ్ర ఖండితేత్యాదియందు బిందుపూర్వక డకారము పలుమాఱుఁ గూర్చుటచేత "ఏక స్యాప్యసకృత్పరః" అను లక్షణముచే వృత్త్యనుప్రాసము. రాజచంద్రులు మొదలగునవి రెండుమాఱులు వచ్చుటంజేసి యమకము.

ఉ. పూనిక బాలచాపలముఁ ♦ బొందు నిభప్రకరంబు గుడ్లలోఁ
గూన బిలేశయాధిపుఁడు ♦ గూర్మము సూడ శిరంబు నిల్ప లే
దానగపాళియున్ నడవ ♦ నైనను నేర దటంచు మేదినీ
మానిని సేరె నౌర పెద♦మల్లమహీను నహీనయౌవనున్. 37

టీ. ఇభప్రకరంబు=దిగ్గజసమూహము. పూనికన్=ప్రయత్నముచేత. బాలచాపలము.— బాల=బాలునియొక్క, తోఁకయొక్క యని భావము "శసయో ర్బవయో స్తథా" అనుటచేత నిచట బకారవకారముల కభేద మవలంబింపఁబడినది; చాపలము = చాంచల్యమును. పొందున్=పొందును. బిలేశయాధిపుఁడు=ఆదిశేషుఁడు. గుడ్లలోఁగూన=మిక్కిలి పసివాఁడనుట, సర్పము లండజములు కాన గుడ్లలోఁగూన శేషుఁ డగు నని భావము. కూర్మము = ఆదికూర్మము. చూడన్ = పరికింపఁగా. శిరంబు నిలుపలేదు=మెడలు నిలుపఁజాలనంతటి బాల్యము గల దనుట, కూర్మము స్వభావముగా శిరంబు నిల్పకుండుట ప్రసిద్ధము. ఆనగపాళియున్= ఆకులాచలసమూహమును. నడవనైనను నేరదు = నడచుటకు నేరనంత బాల్యముగలది, పర్వతములు నడవకుండుట స్వభావము. అటంచున్ = అట్లనుచు. మేదినీమానిని = భూరమణి. అహీనయౌవనున్ = పూర్ణయౌవనము గలయట్టి. పెదమల్లమహీనున్ = పెదమల్లభూపాలుని. చేరెన్ = పొందెను. ఔర. పెదమల్లభూపాలుం డెల్లధరణి నేలెనని భావము. ఇచట నుపమేయాధిక్యపర్యవసాయి యగుశ్లేషోత్థాపితవ్యతిరేకాలంకారము.

శా. ఆమల్లక్షితినాథరత్నకరదీ♦వ్యన్మండలాగ్రాంశుమ
ద్ధామస్థేమ రణాగ్రసీమ నరిగో♦త్రశ్రేణులం దూల్చు ను
ద్దామప్రౌఢిమఁ గేతువుం దునుము ను♦ద్యత్పుండరీకంబులన్
భూమిన్ వ్రాల్చు సురాళి గన్గొనఁ బురా♦భూతేతరప్రక్రియన్. 38

టీ. ఆమల్లక్షితినాథ రత్నకరదీవ్యన్మండలాగ్రాంశుమద్ధామస్థేమ.— ఆమల్లక్షితినాథ రత్న = ఆమల్లభూపాలుఁ డనురాజరత్నముయొక్క ; కర = హస్తమందు ; దీవ్యత్ = ప్రకాశించుచున్న ; మండలాగ్ర = ఖడ్గమనెడు ; అంశుమద్ధామ = సూర్యతేజముయొక్క; స్థేమ = స్థిరాంశము. రణాగ్రసీమన్ = యుద్ధాగ్రభాగమందు. సురాళి గన్గొనన్= దేవసంఘము చూచుచుండఁగా. పురాభూతేతరప్రక్రియన్.— పురా= పూర్వమందు; భూతేతర=పుట్టనట్టి; ప్రక్రియన్=వ్యాపారముచేతను, మునుపుతనకులేనినడవడిచేత ననుట. అరిగోత్రశ్రేణులన్.—అరి=చక్రవాకములయొక్క; గోత్ర=కులములయొక్క;శ్రేణులన్=సంఘములను, శత్రువంశసంఘముల నని యర్థాంతరము. తూల్చున్=తొలఁగించును. ఉద్దామప్రౌఢిమన్=ఉత్కృష్టమైన నేర్పుచేతను. కేతువున్=కేతుగ్రహమును, ధ్వజమును. తునుమున్ = ఖండించును. ఉద్యత్పుండరీకంబులన్ = ప్రకాశించుచున్న తెల్లదామెరలను, గొడుగులను. భూమిన్=భూమియందు. వ్రాల్చున్= పడవైచును. సూర్యతేజస్సునకు జక్కవలగుంపులు

మూల్చుట, కేతువును దునుముట, తెల్లదామరలను వ్రాల్చుట, స్వభావవిరుద్ధము గాన నపూర్వవ్యాపారముగా వర్ణితం బయ్యె నని భావింప వలయును. మల్లభూపాలుఁడు ఖడ్గముచే శత్రుసంఘమును దూల్చి వారిపతాకలను శ్వేతచ్ఛత్త్రిములను భూమిని వ్రాల్చి జయము గాంచె నని భావము. ఇందు శ్లిష్టశబ్దనిబంధనకేవలపరంపరితరూపకాలంకారము.

తే. అధరాధిపుసతులు లిం♦గాంబ కొమ్మ
మాంబికయు నలచిన్నలిం♦గాంబ వేంక
టాంబ మల్లాంబ నా మించి♦ రాత్మనాథ
సేవనాయత్తచిత్తతా♦స్థేమ నందు. 39

టీ. అధరాధిపుసతులు = ఆ మల్లభూపాలుని భార్యలు. లింగాంబ, కొమ్మమాంబికయు, అలచిన్నలింగాంబ, వేంకటాంబ, మల్లాంబ. నాన్ =అనఁగా. ఆత్మనాథసేవనాయత్తచిత్తతాస్థేమన్.—ఆత్మనాథ=తమప్రియునియొక్క; సేవనాయత్త=సేనాపరతంత్రమగు; చిత్తతా=చిత్తముగలుగుటయొక్క; స్థేమన్ =స్థితిచేత. మించిరి=అతిశయించిరి. అందున్ =వారలయందు. దీనికిఁ బాశ్చాత్యజడరాశి యనునగ్రిమపద్యముతో నన్వయంబు.

సీ. పాశ్చాత్యజడరాశిఁ♦బ్రాపించి నర్మద, యగుచు వర్తిలు రేవ♦నతకరించి
రాగభూయిష్ఠాత్మ♦రహి సర్వతోముఖ, వర్తన గలసర♦స్వతిని గేరి
బహులపంకోదిత♦పద్మోదయంబున, మలిన మై తగునర్య♦మసుత నాఁడి
నీచోపసర్పణ♦నియతభ్రంగావాప్తి, వెలవెల నౌజాహ్న♦విని హసించి
తే. సాధుభాషానుగతిఁ జారు♦చరితయుక్తి, నిత్యనిర్మలచిత్తత♦నిరుపమాన
కాంతిసంక్రాంతినుప్పొంగుఁ♦గవిజనాంత,రంగరంగద్గుణాలంబ♦లింగమాంబ.

టీ. కవిజనాంతరంగరంగద్గుణాలంబ.— కవిజనాంతరంగ = కవిహృదయములయందు; రంగత్ = నాట్యముచేయుచున్న; గుణ = సౌశీల్యాదిగుణములు; ఆలంబ = ఆలంబము గాఁగల. లింగమాంబ = లింగాంబిక. పాశ్చాత్యజడరాశిన్. — పాశ్చాత్య = పశ్చిమదేశము నందుఁబుట్టిన ‹‹దక్షిణాపశ్చాత్పురసస్త్యక్’’ అని పశ్చాచ్ఛబ్దముమీఁద భవార్థమున త్యప్రత్యయము. జడరాశిన్ = మూర్ఖసమూహమును. అనఁగా వేదబాహ్యు లగుటచే జడు లని చెప్పఁబడుహీనజాతులను. ప్రాపించి=పొంది. నర్మద యగుచున్=నర్మోక్తుల నిచ్చునది యగుచు. వర్తిలురేవన్ = వర్తించుచున్న రేవానదిని. డకార లకారముల కభేదము గనుక పశ్చిమదేశమం దున్న జలరాశి యనఁగా సముద్రమును ప్రాపించి నర్మద యనునామము గలదై వర్తిల్లు నట్టిరేవ యనిభావము. అతకరించి = తక్కువగాఁజేసి. రాగభూయిష్ఠాత్మన్ = అనురాగముచేత భూయిష్ఠ మగుమనస్సుచేత. రహిన్ = ఆసక్తితో. సర్వతోముఖవర్తన=నానాప్రకార మగువృత్తి. కలసరస్వతిని = కలిగినసరస్వతీనదిని. రక్తగుణముచేత భూయిష్ఠ మగు

ఆత్మ అనఁగా దేహము గలిగి సర్వతోముఖవర్తన మనఁగా జలరూపముగా నున్కి గలిగినట్టిసరస్వతీనది యని భావము, సరిస్వతీనదీజలము రక్త మగుట ప్రసిద్ధము. బహులపంకోదితపద్మోదయంబునక్.—బహుల = అధికమగు; పంక = పాతకములవలన; ఉదిత = కలిగినట్టి; పద్మా=సంపదయొక్క; ఉదయమునక్ = అభివృద్ధిచేత. మలినత్వైతగునర్వ్యమునుతక్ = పాపిష్ఠ యగు యమునను. బహుల మగుపంక మనఁగా బురద అందు జన్మించిన పద్మముల యొక్కయుదయమున నొప్పి మలిన యనఁగా నల్లని స్వరూపము గలదై తగునర్వమసులి నని భావము. ఆడి=నిందించి. నీచోపసర్పణనియతభంగావాప్తిక్.—నీచోపసర్పణ=క్షుద్రులన నువర్తించుటచేత; నియత = నియతమగు; భంగ=మర్యాదాదినాశముయొక్క; అవాప్తిక్ = పొందుటచేత. వెలవెలనై = చిన్నవోయిన. జాహ్నవిని = గంగను. హసించి = పరిహాసము సేసి. నిమ్నప్రదేశోన్ముఖి యై నియతము లగు తరఁగలయొక్క ప్రాప్తిచేత మిగులఁగెల్ల నౌజాహ్నవిని హసించి యని భావము. గీతయందు వ్యతిరేకవిశేషణములకుఁ గ్రమము. సాధుభాషానుగతిక్.— సాధుభాష = వేదవిద్యగలవారియొక్క. అనుగతిక్ = అనుసరణము చేతను. చారుచరితయుక్తిక్ = సచ్చరిత్రులయోగముచేతను. నిత్యనిర్మలచిత్తతక్ = నిరంతరము నిర్మల మగుచిత్తము గలిగియుండుటచేతను. నిరుపమానకాంతిసంక్రాంతిక్=అసమాన మగు కాంతితోఁ గూడియుండుటచేతను. ఉప్పొంగుక్=అతిశయించును. లింగమాంబ గంగా యమునా సరస్వతీ నర్మదానదులతోఁ దుల్య మగునిర్మలస్వభావము గల దనితాత్పర్యము. ఇందు శ్లేషోత్థాపితవ్యతిరేకాలంకారము.

సీ. ఆలింగమాంబిక♦యం దరాతిబలప్ర, భేదనచణు మల్ల♦భిదురపాణిఁ
దారకాత్మభయప్ర♦దప్రభావిస్ఫూర్తి, నతిశక్తియుతు వేంక♦టాద్రిగుహునిఁ
జినలింగమాంబయం♦దు నవీనపంకజా, తార్ధసు లింగనృ♦పాబ్జవైరి
వేంకటాంబికయందు ♦ విపులవనీపాల, నతమునుఁ జినలింగ♦నరపసురభి

తే. బహుళశార్వరపాటన♦పటువిహారి
నంతరస్థాపితాబ్జనే♦త్రాంచితాను
భావుఁ జినమల్లభూపాల♦పద్మహితుని
గాంచెఁ బెదమల్లమేదినీ♦కాంతుఁ డెలమి. 41

టీ. పెదమల్లమేదినీకాంతుఁడు = పెదమల్లభూపాలుఁడు. ఆలింగమాంబికయందుక్= ఆలింగాంబికయందు. అరాతిబలప్రభేదనచణుక్.—అరాతి=శత్రువగు; బల=బలాసురునియొక్క; ప్రభేదనచణుక్= భేదించుటచేతఁ బ్రఖ్యాతుని; అరాతి=శత్రువులయొక్క; బల=సైన్యముయొక్క; ప్రభేదన = భేదించుటచేఁ బ్రఖ్యాతుఁ డైన. మల్లభిదురపాణిక్ = మల్లభూపాలుం డనెడునింద్రుని. తారకాత్మభయప్రదప్రభావిస్ఫూర్తిక్.—తారకాసురునికి భయప్రదమగు తేజోతిశయము గలవాని; తారకా=నక్షత్రములయొక్క; ఆత్మ=స్వరూపములకు, భయప్రద

మగు కాంత్యతిశయము గలవాని. అతిశక్తియుతుక్=అధికమైనశక్తి యను నాయుధముతోఁ గూడినవాని(కుమారస్వామిని), అతి సామర్థ్యయుక్తుఁ డైయినవానిని. వేంకటాద్రిగుహునిక్= వేంకటాద్రినాయకుఁ డనుస్కందుని. చినలింగమాంబయందుక్=చినలింగాంబికయందు. నవీనపంకజాతార్దనుక్.—నవీన=నూతనమగు;పంకజాత=పద్మములను;అర్దనుక్=పీడించువానిని,నూతన మగు పాపసంఘనాశకుని నసుట. లింగనృపాబ్జవైరిక్=లింగనృపాలుం డనుచంద్రుని. వేంకటాంబికయందుక్=వేంకటాంబయందు. విపులవనీపాలనక్షముక్.—విపుల=అధికములగు;వనీ= వనములయొక్క; పాలన=రక్షణమందు; విపులమగు; వనీప=యాచకులయొక్క. అలన=అలంకరణమందు; క్షముక్=సమర్థుని. చినలింగనరపసురభిక్=చినలింగభూపాలుఁ డనువసంతుని. బహుళశార్వరపాటనపటువిహారిక్.— బహుళ = అధికమగు; శార్వర = అంధకారము యొక్క; పాటన = ఛేదించుటయందు, దుర్మార్గులయొక్క ఛేదనమందు "శార్వరంత్వన్థతమసే శార్వరో ఘాతుకే స్మృతః" అనివిశ్వము: పటువిహారిక్ = లెస్సగాఁ గ్రీడించువాని. అంతరస్థాపితాబ్జనేత్రాంచితానుభావుక్.— అంతరస్థాపిత = హృదయనిహితమగు; అబ్జనేత్ర=విష్ణువుయొక్క; అంచిత=ఒప్పునట్టి; అనుభావుక్ = ప్రభావముగలవానిని, పక్షద్వయమం దిదియర్థము. చినమల్లభూపాలపద్మహితునిక్=చినమల్లభూపాలుఁ డనుసూర్యుని. కాంచెక్ = కనెను. ఈపద్యమునందు శ్లిష్టశబ్దనిబంధనకేవలపరంపరితరూపకాలంకారములైదు. వానికిఁ బరస్పరనిరపేక్షతనుబట్టి సంసృష్టి.

ఉ. అందును వేంకటాద్రివిభుఁ ♦ డచ్యుతసాయకనాయకాగ్రిమ
స్పందనిపాతితారిపుర♦సంతతి యై కమలాధిపాంచితా
మందమహాశయాంకుఁ డయి ♦ మాన్యగణావనలోలచిత్తసం
బంధపరీతుఁ డై జగతి ♦ భాసిలె నార బుధుల్ నుతింపఁగన్. 42

టీ. అందును=అపుత్రులలో. వేంకటాద్రివిభుఁడు=వేంకటాద్రిరాజు,ఇచట "విభుశ్శివే ప్రభౌనిత్యే"అను విశ్వనిఘంటువువలన శివరూపార్థముగూడ స్ఫురించుచున్నది. వేంకటాద్రి శివుఁడు;అచ్యుతసాయకనాయకాగ్రిమస్పందనిపాతితారిపురసంతతియై.—అచ్యుత=చెడనట్టి విష్ణుమూర్తియనెడు; సాయకనాయక=బాణశ్రేష్ఠముయొక్క; అగ్రిమస్పంద =ప్రథమచలనముచేత; నిపాతిత=నశింపఁజేయఁబడిన;అరిపుర=శత్రుశరీరములయొక్క, శత్రుపురములయొక్క, త్రిపురములయొక్క యనుట,సంతతియై=వంశముగలవాఁడై, పరంపరగలవాఁడై. కమలాధిపాంచితామందమహాశయాంకుఁ డయి.— కమలాధిప = విష్ణువుచేత, మృగశ్రేష్ఠముచేతను; అంచిత=ఒప్పెడు; అమంద=అధికమగు; మహాశయ=దొడ్డహృదయముయొక్క; మహత్=పూజ్యమగు; శయ=హస్తముయొక్క "పఞ్చశాఖ శ్శయః పాణిః" అని అమరము: అంకుఁడై = చిహ్నముగలవాఁడయి. మాన్యగణావనలోలచిత్తసంబంధపరీతుఁడై.— మాన్యగణ =ప్రాజ్ఞసంఘము యొక్క, పూజ్యు లగుప్రమథులయొక్క; అవన=రక్షణమందు; లోల=ఆసక్తమైన; చిత్త=చిత్తముయొక్క; సంబంధ=సంబంధముచేత; పరీతుఁడై=వ్యాప్తుఁడై, అట్టిచి

త్తముగలవాఁడై యనుట. జగతిన్ =లోకమందు. బుధుల్ నుతింపఁగన్=పండితులు దేవతలు స్తుతిచేయఁగా. భాసిలెన్ =ప్రకాశించెను. ఔర. అనఁగా ఏద్రుం డేరీతిఁ ద్రిపురముల నచ్యుతుఁ డనుసాయకాగ్రిమస్పందముచే నాశనముఁజేసి జగమున భాసిల్లెనో యారీతి వేంకటాద్రివిభుఁడును సాయకములచే శత్రుశరీరములను దునిమి జగతిని భాసిలె నని భావము. ఉపమాలంకారధ్వని.

సీ. పటుపుండరీకసం•కటగృహశ్రేణికల్, పటుపుండరీకసం•కటము లయ్యె
బృథులాచ్ఛభల్లవి• స్తృతచత్వరమ్ములు,పృథులాచ్ఛభల్లవి• స్తృతము లయ్యె
వితతసాలకదంబ•వృతలసద్వేశ్మముల్, వితతసాలకదంబ•వృతము లయ్యె
ఘనచక్రిఖడ్గిసం•గతరాజవీథులు, ఘనచక్రిఖడ్గిసం•గతము లయ్యె

తే. వేంకటాద్రిక్షమానేతృ•విపులబాహు, దండకోదండనీరదా•ఖండచండ
శరపరంపరఁబరహంస•సముదయంబు, వెఱచి చనునెడఁదత్పుర•వితతినెల్ల.

టీ. పరహంససముదయంబు.— పరహంస = శత్రుశ్రేష్ఠులయొక్క, శ్రేష్ఠము లగురాజహంసలయొక్క. సముదయంబు = గుంపు. వేంకటాద్రిక్షమానేతృవిపులబాహుదండ కోదండనీరదాఖండచండశరపరంపరన్.— వేంకటాద్రిక్షమానేతృ = వేంకటాద్రి భూపాలునియొక్క; విపుల = విశాలములగు; బాహుదండ = భుజదండములయందుండెడు; కోదండ= ధనువనెడు; నీరద = మేఘముయొక్క; అఖండ = అవిచ్ఛిన్నమగు; చండ = దుస్సహమైన; శరపరంపరన్=బాణపరంపర యనెడుజలపరంపరయందు. వెఱచి=భయపడి. చనునెడన్=పోవుసమయమందు. తత్పురవితతినెల్లన్=వానిపత్తనసమూహమునంతటను. పటుపుండరీకసంకటగృహశ్రేణికలు.—పటు=సమర్థమైన; పుండరీక=గొడుగులచేత; సంకట=సమ్మర్దములైన; గృహశ్రేణికల్ = గృహపరంపరలు. పటుపుండరీకసంకటములు.— పటు=సమర్థమైన; పుండరీక = పులులచేత, సంకటములు = సంకటించినవి. అయ్యెన్. పృథులాచ్ఛభల్లవిస్తృతచత్వరమ్ములు.—పృథుల = విశాలములగు; అచ్ఛ=స్వచ్ఛములగు ; భల్ల=బాణములచేత, విస్తృత = వ్యాప్తము లైన; చత్వరమ్ములు = అంగణములు. పృథులాచ్ఛభల్లవిస్తృతములు.—పృథుల= గొప్పలైన ; అచ్ఛభల్ల=ఎలుఁగులచేత; విస్తృతములు. అయ్యెన్. వితతసాలకదంబ వృతలసద్వేశ్మముల్.—వితత = విశాలము లయిన ; సాల = కోటలయొక్క, “ప్రాకారో వరణస్సాలః” అని అమరము: కదంబ = సమూహముచేత; వృత = ఆవరింపఁబడిన; లసత్ = ప్రకాశించుచున్న; వేశ్మముల్ = గృహములు. వితతసాలకదంబవృతములు.— వితత = విస్తృతములగు; సాల = ఏపెలచేత; కదంబ = కడుములచేత; వృతములు. అయ్యెన్. ఘనచక్రిఖడ్గి సంగత రాజవీథులు.—ఘన = గొప్పలగు; ఖడ్గి = ఖడ్గాయుధములుగల వారితోడను; చక్రి = చక్రాయుధములుగల వారితోడను; సంగత=కూడుకొన్న ; రాజవీథులు = రాజమార్గములు. ఘన చక్రి ఖడ్గిసంగతములు.— ఘన=ఘనములైన; చక్రి=సర్పములతోడను; ఖడ్గి=ఖడ్గమృగములతోడను; సంగతములు. అయ్యెన్.

ఈ పద్యమున పట్వాదిశబ్దములు పునరుక్తము లయిన విశిష్టతను భేదమున్నది గాన దుష్టములు గావు. ఇట్టిప్రయోగములు వసుచరిత్రాదులందును గలవు. ఇందు యమకవృత్త్యనుప్రాసములు శబ్దాలంకారములు. రూపక మర్థాలంకారము.

క. ఆతనితమ్ముఁడు లింగ, క్ష్మాతలపతి పొగడు గనియె ♦ సమదారినృప
వ్రాతమనోబ్జాతఘనో, ద్భూతరజస్సైన్యవిజిత♦భువనుం డగుచున్. 44

టీ. ఆతనితమ్ముఁడు = ఆ వేంకటాద్రి భూపాలునితమ్ముఁడు. లింగక్ష్మాతలపతి = లింగభూపాలుఁడు. సమదారినృపవ్రాత మనోబ్జాతఘనోద్భూత రజస్సైన్యవిజితభువనుండు.— సమద = మదముతోఁగూడిన; అరినృప = శత్రురాజులయొక్క; వ్రాత=సంఘముయొక్క, మనః = మనస్సులనెడు; అబ్జాత = కమలములకు; ఘన=మేఘప్రాయమగు; ఉద్భూతరజః = అధికపరాగముగల; సైన్య = సైన్యముచేత; విజిత = జయింపఁబడిన; భువనుండు = లోకములు గలవాఁడు. అగుచున్. పొగడుగనియెన్ =స్తుతిగాంచెను. మేఘము కమలములకు హాని గలుగఁజేయునదిగాన సైన్యపరాగము మనోబ్జాతములకు ఘనప్రాయ మనఁబడియె.

మ. పరగోత్రాభృదనీకముం గదిసి శుం♦భత్సైన్యగర్జాసము
త్కరఘోరాకృతి నంటి తచ్ఛిరములం ♦ గల్పించెఁ గీలాల ము
ద్ధురవేగోగ్రతదాశుగప్రతతి కా♦దుర్వార మై లింగభూ
వరుఖడ్గచ్ఛలవారిదంబు సుమనో♦వర్ణ్యాతిచిత్రక్రియన్. 45

టీ. లింగభూవరుఖడ్గచ్ఛలవారిదంబు.— లింగభూవరు = లింగభూపాలునియొక్క; ఖడ్గ = ఖడ్గమనెడు; ఛల = నెపముగల; వారిదంబు = మేఘము. సుమనోవర్ణ్యాతిచిత్రక్రియన్.— సుమనః = జాజులచేత, దేవతలచేత; వర్ణ్య=పొగడఁదగిన; అతిచిత్రక్రియన్ = అత్యద్భుత వ్యాపారముచేతను. పరగోత్రాభృదనీకమున్.— పరగోత్రాభృత్ = శ్రేష్ఠములగు పర్వతములయొక్క, శత్రురాజులయొక్క; అనీకమున్ = సమూహమును, సేనను. కదిసి=ఆక్రమించి. శుంభత్సైన్యగర్జాసముత్కరఘోరాకృతిన్.—శుంభత్ = ప్రకాశించుచున్న; సైన్య = సైన్యముయొక్క; గర్జా = సింహనాదము లనెడుమేఘనాదములయొక్క; సముత్కర = సమూహముచేత; ఘోర = భయంకరమగు; ఆకృతిన్ = ఆకారముచేత. తచ్ఛిరములన్ = ఆపర్వత శిఖరములను, ఆరాజులశిరస్సులను. అంటి = చేరి. ఉద్ధురవేగోగ్ర తదాశుగప్రతతికాదుర్వారమై.— ఉద్ధుర = అతిశయించిన; వేగ = వేగంబుచేత; ఉగ్ర = తీక్ష్ణమైనట్టి; తదాశుగ=ప్రసిద్ధవాయువుయొక్క, వారిబాణములయొక్క; ప్రతతికా = సమూహమునకు; దుర్వారమై = వారింపనలవిగానిదై. కీలాలమున్ = ఉదకమును, రక్తమును. "శోణితేఽమ్భసి కీలాలమ్" అని అమరము. కల్పించెన్=చేసెను.

వారిద ముద్ధురవేగోగ్ర మగుమారుతమునకు దుర్వారమై వర్షించుట చిత్ర మనియాశయము శ్లిష్టరూపకము ఖడ్గచ్ఛలవారిద మనుచో కైతవాపహ్నుతి రెంటికిని సంకరము.

తే. అతనియనుజుఁడు చిన్నలిం◆గావనీశుఁ
డలరు నైజమహోభానుఁ◆ డఖిలశార్వ
రాళిఁ దూల్చియు నరివధూ◆పాళి కాత్మ
రమణవిరహంబుఁ జేయఁ జి◆త్రప్రశస్తి. 46

టీ. అతనియనుజుఁడు = ఆలింగభూపాలునితమ్ముఁడు. చిన్నలింగావనీశుఁడు = చిన్నలింగభూపాలుఁడు. నైజమహోభానుఁడు.— నైజ = తనసంబంధియైన; మహః = ప్రతాపమనెడు; భానుఁడు = సూర్యుఁడు. అఖిలశార్వరాళిన్.— అఖిల = సమస్తమగు; శార్వర = అంధకారములయొక్క; ఆళిన్ = గుంపును, సమస్తవైరిసంఘము ననుట. తూల్చియున్ = నాశముసేసియు. అరివధూపాళికిన్.— అరివధూ = ఆఁడుజక్కవలయొక్క; పాళికిన్ = గుంపునకు, శత్రువనితలగుంపున కనుట. ఆత్మరమణవిరహంబు = నిజనాథులయొక్క వియోగమును. చిత్రప్రశస్తిన్ = ఆశ్చర్యకరప్రసిద్ధితో. చేయన్ = చేయుచుండఁగా. అలరున్ = ప్రకాశించును.

సూర్యుండు తమస్సంఘమును దూల్చియు జక్కవపడఁతులకుఁ బ్రియవియోగంబు ఘటిల్లఁజేయుట చిత్ర మని తాత్పర్యము. చిన్నలింగభూపతి సమస్తవైరుల సంహరించి వారి నారులకు విరహము ఘటిల్లఁ జేసె నని భావము. విరోధాభాసము. రూపకభేదము.

సీ. లాటాంతరమున కే◆లలితవిగ్రహుగుణ, శ్రేణి వినూతన◆చిత్రరచన
వంగమండలికి నే◆వరకలాశాలిప్ర, తాపంబు సూడ ర◆త్నంపుబరణి
కాశ్మీరమునకు నే◆కల్యాణనిధికీర్తి, వారంబు మహనీయ◆వజ్రపేటి
యానిచోళమునకు నే◆యమనశీలునియాజ్ఞ, యలరారు తెలిముత్తి◆యంపుజల్లి
తే. యతఁడు పొగడొందు జగముల◆నరినృపాల
మకుటతటకోటికాహిత◆మణికలాప
రాజినీరాజితాంఘ్రిసీ◆రేజశాలి
చాపజితశూలి చినలింగ◆భూపమౌళి. 47

టీ. లాటాంతరమునకున్ = లాటదేశమధ్యమనెడు వస్త్రాభ్యంతరమునకు "లాటోదేశాంశుకేపిచ" అని విశ్వము. ఏలలితవిగ్రహుగుణశ్రేణి = ఏమనోహరాంగుని సుగుణముల గుంపు. వినూతనచిత్రరచన = నూతనచిత్రకర్మయో, ఆశ్చర్యకరణ మనుట. వంగమండలికిన్ = వంగదేశమనెడు కర్పూరకదంబమునకు "వఙ్గః కర్పూరవార్తాకదేశభేదేషు కీర్తితః" అని విశ్వము. ఏ. వరకలాశాలిప్రతాపంబు.— వర = శ్రేష్ఠములగు; కలా = విద్యలచేత; శాలి = ఒప్పుచుండెడువానియొక్క; ప్రతాపంబు = ప్రతాపము. చూడన్ = పరికింపఁగా. రత్నంపుబరణి = రత్ననిర్మిత మగుబరణియో. అనఁగాబరణి కర్పూరము నెట్లు చుట్టియుం

డునో ఆవిధమున లింగభూపాలుని ప్రతాపంబు వంగదేశము నావరించి యున్న దనుట ప్రతాప మెఱ్ఱని దని కవిసమయము గనుక రత్నంపుబరణిగా రూపింపఁబడినది. కాశ్మీరమునకున్=కాశ్మీర దేశమ నెడుకుంకుమమునకు. ఏకల్యాణనిధికీర్తివారము=ఏమంగళమూర్తియొక్క యశఃపుంజము. మహనీయవజ్రపేటి=శ్రేష్ఠమగు వజ్రంపుపెట్టెయో, అనఁగా గుంకుమమును బెట్టె యేలాగున నావరించియుండునో ఆలాగున లింగభూపాలునికీర్తి కాశ్మీరదేశము నావరించి యున్న దనుట, కీర్తి తెల్లని దని కవిసమయము గాన వజ్రపేటికగా రూపింపఁబడినది. ఆని చోళమునకున్ — ఆని = కదిసి; చోళమునకున్=చోళదేశ మనెడుప్రసిద్ధ మగుముసుఁగు గుడ్డకు. ఏయమనశీలునియాజ్ఞ = ఏనియంతయొక్క యాజ్ఞ. అలరారుతెలిముత్తియంపుజల్లి=ప్రకాశించునట్టి తెల్లనిముత్తెములచేతఁ జేయఁబడిన జాలరై ఒప్పునో, అనఁగా ముసుఁగుగుడ్డకు ముత్తియంపుజాలరువలె నారాజునాజ్ఞ చోళదేశమున కలంకారమై యభినంద్యముగా నున్న దనుట. అతఁడు = ఆరాజు. అరినృపాలమకుటతటకోటికాహితమణికలాపరాజినీరాజితాంఘ్రినీరేజశాలి. — అరినృపాల = శత్రురాజులయొక్క; మకుటతట = కిరీటతటములయొక్క; కోటికా = అగ్రభాగములందు; ఆహిత = ఉంపఁబడిన; మణికలాప = మణిభూషలయొక్క; రాజి = బంతిచేత; నీరాజిత = నివాళింపఁబడిన; అంఘ్రినీరేజ = పాదపద్మములచే; శాలి = ఒప్పుచున్నవాఁడు. చాపజితశూలి = ధనుర్విద్యయందు జయింపఁబడిన రుద్రుఁడు గలవాఁడు. అంతటిసామర్థ్యముగలవాఁడనుట. జగములన్ = లోకములయందు. పొగడొందెన్=ఖ్యాతి గాంచెను. శ్లిష్టరూపకాలంకారము.

క. అతనియనుజుండు చినమ, ల్లతరుణనీరేజశరుఁడు ♦ లలి నొప్పె మహా
న్నతగాయకనుతసాయక, హతనాయకఘటితసౌర ♦ హరిణేక్షణుఁడై.

టీ. అతనియనుజుండు=ఆచినలింగభూపాలుని తమ్ముఁడు. చినమల్లతరుణనీరేజశరుఁడు=చినమల్లభూపాలుఁ డనునవమన్మథుఁడు. మహోన్నతగాయకనుతసాయకహతనాయకఘటితసౌరహరిణేక్షణుఁడై.—మహోన్నత గాయక=మిక్కిలియొక్కువగా శబ్దించునట్టితుమ్మెదలచేత, మహోన్నతులగుగాయకులచేతనని రాజపరమైనయర్థము; నుత=కొనియాడఁబడిన; సాయక=సుమబాణములచేత, బాణములచేత ననియర్థాంతరము. హత=కొట్టఁబడిన; నాయక = శృంగారాలంబనపురుషులతో, రాజులచేతితో; ఘటిత=కూర్పఁబడిన; సౌరహరిణేక్షణుఁడై=సురాంగనలుగలవాఁడై. లలిన్=ఉత్సాహముచేత. ఒప్పెన్. నీరేజశరుని బాణప్రసరణము యువమిథునసంఘటన సంపాదకము గావునఁ జినమల్లతరుణ నీరేజశరుని సాయకహతనాయకులు సురాంగనాసంఘటనము నొంది రని భావము. ఇందు రూపకాలంకారము.

సీ. ఈధన్యుహేతి ధా♦రాధరం బగుఁ గాని, చో రాజహంసాళి ♦ సోలు టెట్టు
లీనరేశ్వరుశౌర్య ♦ మైన తేజమ కాని, చో లోకతమములు ♦ దూలు టెట్టు
లీరాజుపాణి మం♦దారశాఖియ కాని, యెడ సుమనశ్శ్రేణు ♦ లడరు టెట్టు
లీమహేంద్రునికీర్తి♦కౌముదియగుఁగాని, యెడఁగువలయమోద♦మొసఁగు టెట్టు

తే. లనుచు విబుధులు నుతియింతు • రమరశైల, కందరాసంచరద్దేవ • కామినీజ
నాభిగీతనవీనచా • హస్తిమల్ల, బిరుదనిస్తంద్రుఁ జినమల్ల • ధరణిచంద్రు. 49

టీ. ఈధన్యహేతి=ఈధన్యుని ఖడ్గము. ధారాధరంబగుఙ్=మేఘమగును, పదును గలదగునని భావము. కానిచోఙ్=అటు గాకున్నయెడ. రాజహంసాళి.—రాజహంస=హంసపక్షివిశేషములయొక్క; ఆళి=గుంపు,రాజశ్రేష్ఠులగుంపు. సోలు పెట్టులు=ఆడలుట యే ప్రకారము, మేఘోదయకాలమందు రాజహంసలు పాఱుట కవిసమయసిద్ధము. ఈనరేశ్వరుశౌర్యము=ఈరాజుశౌర్యము. ఇనతేజము=సూర్యసంబంధిప్రభయే. కానిచోఙ్=కానియెడల. లోకతమములు=లోకములయం దుండుచీకటులు,లోకులయజ్ఞానములు,అజ్ఞానప్రయుక్తదోషముల నన్నింటిని దుష్టనిగ్రహము చే శమింపఁజేయుటంబట్టి యిటు వచించుట. తూలు పెట్టులు=నశించుట యెట్లు. ఈరాజుపాణి=ఈప్రభువుయొక్క హస్తము. మందారశాఖియె=కల్పవృక్షమే. కానియెడఙ్=కానిచో. సుమనశ్శ్రేణులు=దేవసంఘములు, విద్వత్సంఘములు. ఆడరు పెట్టులు = ఆనందించుట యెట్లు. ఈమహేంద్రునికీర్తి = ఈమహారాజుయొక్క కీర్తి. కౌముదియగుఙ్=వెన్నెల యగును. కానియెడఙ్=కానిచో. కువలయమోదము = కలువలకు సంతసము, భూవలయమునకు సంతసము. ఎసఁగు పెట్టులు=తనరు టెట్లు, అనుచుఙ్=ఇట్లనుచు. విబుధులు=దేవతలు, విద్వాంసులు. అమరశైలకందరాసంచరద్దేవకామినీ జనాభిగీతనవీనచాహస్తిమల్లబిరుదనిస్తంద్రుఙ్.—అమరశైల=మేరుపర్వతముయొక్క; కందరా=గుహాలయందు; సంచరత్=తిరుగుచున్న; దేవకామినీజన=దేవతాస్త్రీసంఘము చేత; అభిగీత = గానము చేయఁబడిన; నవీనచాహస్తి మల్లబిరుద=నూతన మగుచాహస్తిమల్లుఁ డనుబిరుదము చేత; నిస్తంద్రుఙ్=జాగరూకుని. చినమల్లధరణిచంద్రుఙ్=చినమల్లనృపాలుఁ డనుభూలోకచంద్రుని. నుతియింతురు=కొనియాడుదురు. ఇందుఁ బరంపరితశ్లిష్టరూపకాలంకారము.

ఉ. ఆయనుజుల్ భజింప విమ • లాత్ముఁడు ముమ్మడిమల్లమేదినీ
నాయకుఁ డుర్వి నేలెను గ • నత్పదపీఠమసారసారభా
మేయకలిందజాజలవి • మిశ్రితపాదపునర్భవప్రభా
వ్యాయతజహ్నుజావినతి • వారితవిద్విడశేషదోషుఁడై. 50

టీ. ఆయనుజుల్ = ఆతమ్ములు. భజింపఙ్ = సేవించుచుండఁగా. విమలాత్ముఁడు = నిర్మలచిత్తముగలిగినట్టి. ముమ్మడిమల్ల మేదినీనాయకుఁడు = ముమ్మడిమల్లభూపాలుఁడు: వీరి తండ్రియుఁ దాతయు మల్లభూపాలుం డనుపేరిచేతనె రాజిల్లుటంబట్టి మల్లభూపాలురలో మూఁడవతరమువాఁ డగునీనృపాలుండు ముమ్మడిమల్లమేదినీనాయకుఁ డని చెప్పఁబడియె. కనత్పదపీఠమసారసారభామేయకలిందజాజలవిమిశ్రితపాదపునర్భవప్రభావ్యాయతజహ్నుజావినతివారితవిద్విడశేషదోషుఁడు.— కనత్ = ప్రకాశించుచున్న; పదపీఠ = పాదపీఠమందలి; మసార = ఇంద్రనీలమణులయొక్క; సార = శ్రేష్ఠమగు; భా = కాంతియనెడి; అమేయ = అధికమైన; కలిందజాజల = కాళిందీజలము చేత; విమిశ్రిత = కలిసినట్టి; పాదపునర్భవప్రభా = పాదనఖకాంతి యనెడు “ పునర్భవః కరరుహో నఖో

స్త్రీనఖరౌ స్త్రియామ్'' అని యమరము: వ్యాయత = మిక్కిలి విశాలమైన; జహ్నుజా= గంగానదియందు; వినతి = నమస్కారముచేత, స్నానముచేత; వారిత = పోఁగొట్టఁబడిన; విద్విట్ = శత్రువులయొక్క; అశేష = సమస్తములగు; దోషుఁడు=పాపములుగలవాఁడు, నేరములు గలవాఁడు. ఐ = అయి. ఉర్వీమ్ = భూమిని. ఏలెను= పాలించెను. ఇచట పాద పునర్భవప్రభృత్యాదివిశేషణస్వారస్యముచేత వర్ణ్యుఁడగు ముమ్మడిమల్లభూపాలునియందు విష్ణుత్వము ధ్వనించుచున్నది. అలంకారము రూపకము.

సీ. ఉన్నతకూటసం♦పన్నవర్తన యైన
సంతతేరాధర♦సమితి రోసి,
యెల్లకాలము జిహ్మ♦వృత్తి వర్తిలునట్టి
శేషునిపొందపే♦క్షింప మాని,
యళిపేయమదయు♦క్తికలిమిఁ దూఁగుదిగంత
కరిమూర్తులను డాయ♦ నరుగు టుడిగి,
యలఘుజడాస♦క్తిఁ దలయెత్తి వెఱచుమ
హాశమతస్వామి♦ నంట వెఱచి,
తే. చెందె భూకాంత యాత్మని♦స్సీమభూమ
సకలగుణరత్నభూషితా♦శావధూటి
కాశ్రవణకోటి ఖరతర♦ఖడ్గపాటి
తవిమతకరోటి మల్లభూ♦ధవకిరీటి. 51

టీ. భూకాంత=భూమియనెడు స్త్రీ. ఉన్నతకూటసంపన్నవర్తనయైనసంతతేరాధరసమితిన్.—ఉన్నత=అధికములగు; కూట = కపటములచేత, శిఖరములచేత ; సంపన్న= సమృద్ధమైన; వర్తనయైన=వృత్తిగలదియైనట్టి; సంతతేరాధరసమితిన్=ఎల్లప్పుడు కల్లుద్రాగువారియొక్కగుంపును, భూమినిమోయుపర్వతములగుంపుననుట ''ఇరా భూవాక్సురాప్సు స్యాత్'' అని యమరము. రోసి=విసుగుపడి. ఎల్లకాలమున్=ఎల్లపుడును. జిహ్మవృత్తిన్= కుటిలస్వభావముచేత. వర్తిలునట్టిశేషుని = వర్తించుచున్నదాసునియొక్క, సేవ్యుఁడు శేషి యనియు సేవకుఁడు శేషుఁడనియుఁ బ్రసిద్ధము: వక్రగమనముచేత వర్తించునట్టియనంతుని యొక్కయనుట. పొందు=సాంగత్యమును. అపేక్షింప మాని=కోరుటను మాని. అళిపేయ మదయుక్తికలిమిన్.—అళి=సురయనెడు; పేయ = పానీయముచేతనైన; మదయుక్తి = మదసంబంధముయొక్క; కలిమిన్ = కల్గుటచేత, తుమ్మెదలచేతఁ బానముచేయఁదగిన మదోదకముయొక్క కలిమిచేతననుట ''అళిస్సురాపుష్పలిహోః'' అని విశ్వము. తూఁగుదిగంతకరిమూర్తులను.—తూఁగు=తూఁగునట్టి; దిగంత=దిక్కులకడలయందలి, అనఁగా నప్రసిద్ధమగు నొకచోటనుండు; కరిమూర్తులను = రేఫలకారముల కభేదమునుబట్టి కలిమూర్తులను పాప మూర్తుల ననుట, గజమూర్తుల నని భావము. డాయ నరుగు టుడిగి = దగ్గఱఁబోవుటను వదలి. అలఘుజడాసక్తిన్.— అలఘు = అధికమగు; జడ = మూర్ఖులతోడి; ఆసక్తిన్=

సంబంధము చేతను, లకారడకారముల కభేదమునుబట్టి, అధిక జలాసక్తిచేతను. తలయెత్తక=తలయెత్తుటకు. వెఱచు=భయపడు. మహాకమఠస్వామిక.—మహత్=అధికమగు; అక=పాపమునకు; మఠ=ఆశ్రయ మగు; స్వామిక=ప్రియుని, తల యెత్తనిస్వభావము గల ఆదికూర్మస్వామి ననుట. అంటక=ముట్టుటకు. వెఱచి=భయపడి. ఆత్మనిస్సీమభూమసకలగుణరత్నభూషితాశావధూటికాశ్రవణకోటిక.—ఆత్మ=తనయొక్క, నిస్సీమ=నిరవధికమగు; భూమ=ఆధిక్యము గల ; సకల = సమస్తము లగు ; గుణరత్న=గుణము లనెడురత్నముల చేత; భూషిత=అలంకృతము లగు ; ఆశావధూటికా=దిగంగనలయొక్క ; శ్రవణకోటిక =కర్ణాగ్రభాగములుగలవాని. ఖరతరఖడ్గపాటితవిమతకరోటిక.—ఖరతర = మిక్కిలితీక్ష్ణమగు; ఖడ్గ=ఖడ్గము చేత ; పాటిత=చీల్పఁబడిన ; విమత = శత్రువులయొక్క ; కరోటిక= పుఱ్ఱెలుగలవాని «శిరోస్థ్ని తు కరోటి స్స్యాత్'' అని యమరము. మల్లభూధవకిరీటిక =కిరీటితుల్యుఁ డగుమల్లభూపాలుని; ఉపమానోత్తరపదకర్మధారయసమాసము. చెందెక =పొందెను. భూభరణధురీణు లగుకులాచలశేషదిక్కరికమఠస్వాములు కాపట్యసంపత్తి కుటిలస్వభావ సురాపానమత్తతాజడాసక్తులను బొందుటచే వారినివదలిభూకాంత సకలసుగుణసంపత్తి గలమల్లభూపతి నాశ్రయించె ననిభావము. ఇందు శ్లేషోత్థాపితవ్యతిరేకాలంకారము.

మ. ఘనభేరీవరభూరిభాంకృతిజరేఖాసంధి లేఖాలయం
బునకుక్ మల్లనృపక్షతక్షితిపరాట్పూగంబు లేఁగక్ ఘనా
యనముం జేరె మహాబిలాఖ్య దురగవ్యావిద్ధయుద్ధోచితా
వని పెం పొందెఁ దదీయరత్నతతి పర్వక్ రత్నగర్భాభిధన్. 52

టీ. ఘనభేరీవరభూరిభాంకృతిజరేఖాసంధిక.—ఘన = గొప్పలగు ; భేరీ = భేరులయొక్క ; వర=శ్రేష్ఠములగు ; భూరి=అధికములగు; భాంకృతి=భాంకారములవలన; జ = పుట్టినట్టి ; రేఖా=చీలికగీఱయొక్క; సంధిక=రంధ్రము చేత. లేఖాలయంబునకుక్=స్వర్గమునకు. మల్లనృపక్షతక్షితిపరాట్పూగంబులు.—మల్లనృప=మల్లభూపాలునిచేత ; క్షత = కొట్టఁబడిన ; క్షితిపరాట్=రాజశ్రేష్ఠులయొక్క ; పూగంబులు=గుంపులు. ఏఁగక = పోవఁగా. ఘనాయనముక=ఆకాశమును. మహాబిలాఖ్య = అధికవివరముగలదనుపేరు, మహాబిలమనెడునామము. చేరెక = పొందెను. తురగవ్యావిద్ధయుద్ధోచితావని.— తురగ=గుఱ్ఱములచేత ; వ్యావిద్ధ=కొట్టఁబడిన; యుద్ధోచితావని=యుద్ధార్హ మగుభూమి. తదీయరత్నతతి =ఆరాజులకుసంబంధించినరత్నములయొక్కగుంపు. పర్వక=ప్రసరింపఁగా ; రత్నగర్భాభిధక=రత్నగర్భ యను నామము చేత. పెంపొందెక=వృద్ధిఁబొందెను.

ఆకాశము మహాబిల మనుపేరు వొందుటకు భూమి రత్నగర్భ యనుపేరు వొందుటకు క్షితిపరాట్పూగంబు లేఁగుట తదీయరత్నతతి పర్వుట హేతువులుగా నుత్ప్రేక్షింపఁబడినవి గాన హేతూత్ప్రేక్షాలంకారము.

సీ. తగ మహావిగ్రహ మగుకిరాతశ్రేణిఁ, బ్రత్యగ్రదళితవిగ్రహముఁ జేసె
విప్రమోదావహవృత్తి లాయవనుల, విప్రమోదావహవిధులఁ జేసె

ఘనపద్ధతిక్రమ♦గర్హణు లగుశాత్రవుల ఘనపద్ధతి ♦ మెలఁగఁ జేసె
నిష్ఠురధర్మగ♦రిష్ఠు లౌనహితుల, నతులసుధర్మాభి♦యుతులఁ జేసె

తే. ననుచుఁ దరవారిపరిదారి♦తారిహస్తిమస్తనిస్తులనిర్గళ♦న్మౌక్తికముల
సేసఁ జల్లుచు జయలక్ష్మి♦సేరె నౌర, వీరమల్లక్ష్మాపాలు ♦ విమలశీలు. 53

టీ. తగఁన్=ఒప్పునట్లుగా. మహావిగ్రహ మగుకిరాతశ్రేణిన్=మహావిరోధము గలకిరాతులగుంపును. ప్రత్యగ్రదళితవిగ్రహమున్=నూతనముగఁ గొట్టఁబడినవిరోధముగలదానిని,ఖండితదేహములుగలదాని ననుట "విరోధే కలహే దేహే విస్తారే విగ్రహః" అని హలాయుధుఁడు. చేసెన్=ఒనరించెను. విప్రమోదాపహవృత్తులౌ యవనులన్.—విప్ర=బ్రాహ్మణులయొక్క; మోద=సంతసమునకు; అపహ=నాశకమగు; వృత్తులౌ యవనులన్=వ్యాపారముగలతురకలను. విప్రమోదావహవిధులన్=విప్రులకు ప్రమోదావహ ములగువిధులుగలవారిని. వి=పక్షులకు; ప్రమోదావహ=సంతోషమును జేసెడు విధులుగలవారిని, అనఁగా నిహతులై కంకగృధ్రాది పక్షులకు సంతసముఁ జేయువారి ననుట; చేసెన్=ఒనరించెను. ఘనపద్ధతిక్రమగర్హణు లగుశాత్రవులన్.—ఘన=పెద్దలయొక్క; పద్ధతి=మార్గమందు; క్రమ=సంచరణముయొక్క; గర్హణు లగు = నిందకు లగు, సన్మార్గవిరోధులగు ననుట; శాత్రవులన్ = విరోధులను; ఘనపద్ధతిన్=పెద్దలమార్గమందు, గగనమందు. మెలఁగన్=వర్తించునట్లు. చేసెన్=ఒనరించెను. అనఁగాఁ బరిమార్చి వీరస్వర్గమునకు బంపెనని భావము. నిష్ఠురధర్మగరిష్ఠు లౌనహితులన్.—నిష్ఠురధర్మ=కఠినధర్మము చేత, కఠినమగుధనుర్విద్య చేత. గరిష్ఠు లౌనహితులన్=శ్రేష్ఠు లగుపగతురను. అతులసుధర్మాభియుతులన్.—అతుల=అసమానమగు; సుధర్మాభియుతులన్=మంచిధర్మముతో దేవసభతో కూడుకొన్నవారినిగా. చేసెన్=ఒనరించెను, కఠినధర్మముగలవారిని మంచిధర్మముగలవారినిగాఁ జేసె నని యర్థము. ధనుర్విద్యయందు దక్షులగువీరులను దేవసభఁ జేరునట్లు చేసెనని భావము. ఔర=ఆశ్చర్యము. ఇట నాశ్చర్యము స్పష్టము. అనుచున్. జయలక్ష్మి.తరవారిపరిదారితారిహస్తిమస్తనిస్తులనిర్గళన్మౌక్తికములన్.—తరవారి=ఖడ్గము చేత; పరిదారిత=ఖండింపఁబడిన; అరిహస్తి = శత్రుగజములయొక్క; మస్త=శిరస్సులవలన; నిస్తుల = అసమాన మగునట్లుగా; నిర్గళత్ = జాఱుచున్న; మౌక్తికములన్ = ముత్యములచేత; సేసఁ జల్లుచున్ = తలఁబ్రాలుచల్లుచు. విమలశీలున్ = నిర్మలస్వభావముగల. వీరమల్లక్ష్మాపాలున్ = వీరుఁ డగుమల్లభూపాలుని. చేరెన్ = పొందెను. ఇందుఁ జరణచతుష్టయమందును విరోధాభాస మలంకారము, "ఆభాసత్వే విరోధస్య విరోధాభాస ఉచ్యతే" అని తల్లక్షణము.

శా. ఆలోచింప దధీచిదానము మహా♦వ్యర్థంబు దోషాకరుం
డాలేఖావళి కిచ్చు నీగి యొకతో♦యం బై కలామాత్ర మై
చాలం దక్కువ యొక్కపక్షమున నెం♦చన్ మించుఁ గా మల్లభూ
పాలగ్రామణిసాటి సద్గుణతతిన్ ♦ భావించుచో నెంతయున్. 54

టీ. దధీచిదానము= "దధీచి ర్దానవీ రోభూ ద్దయావీర శ్శిబి ర్న్పపః।హమ్మీరో యుద్ధవీ రోభూత్" అని దానవీరుఁడుగాఁ జెప్పఁబడిన దధీచియొక్క దానము. ఆలోచింపక =విచారింపఁగా. మహావ్యర్థంబు = మిక్కిలి వ్యర్థమైనది: మహావ్యర్థంబు = గొప్పలైనపర్వతములకొఱకైనదనుట "అవయ శ్శైలమేషార్కాః" అని యమరుఁడు. దోషాకరుండు=చంద్రుఁడు. ఆలేఖావళికిన్=అదేవబృందమునకు. ఇచ్చునీగి=ఇచ్చెడుత్యాగము. ఒకతోయంబె=జలమాత్రమే, మఱియొక వస్తువు లే దనుట. కలామాత్రమై=పదునాఱవభాగరూపమై. చాలందక్కువ= మిక్కిలి అల్పమైనది. ఒక్కపక్షమున నె=ఒకపక్షమందె అదియు కృష్ణపక్షమున నె కాని యుభయపక్షమందు గాదనుట. సుధాంశువు దేవవర్గమునకు నొకజలరూప మగు షోడశతమకలాత్మక మగునమృతమును కృష్ణపక్షంబున నే యిచ్చు ననుట. ఎంచఁగన్ = చంద్రుని దాతృత్వము వర్ణ్యుఁ డగుమల్ల భూపాలునిదాతృత్వముతో సరియైనదే కాదు. యొకపక్షమందైనను సరి యగునా యని విచారింపఁగా. మల్లభూపాలగ్రామణిసాతి=మల్లభూపాలాగ్రణియొక్క దానము "సాతి ర్దానావసానయోః" అని యమరుఁడు. సద్గుణతతిన్=శ్రేష్ఠగుణముల యొక్క గుంపుచేత. భావించుచోన్=తారతమ్యమును పర్యాలోచింపఁగా. ఎంతయున్= మిక్కిలి. మించుఁ గా=అతిశయించును గదా.

ప్రకృత మల్లభూపాలత్యాగమున కప్రకృతదధీచిదోషాకరత్యాగములు తుల్యములుగా వనుటవలన ప్రతీపాలంకారభేదము. "వర్ణ్యే నాన్యస్యో పమాయా అనిష్పత్తివచశ్చతత్" అని లక్షణము.

సీ. ద్విజరాజు వెఱఁ గంద • వివిధకలాపాలి, పచరించుఁ దత్తఱ•పాటు లేక
యలమహానటుఁ డెన్న•నతులశృంగారవ, ర్తనఁ జూపునింతైన•శ్రాంతి లేక
తారాళు లీక్షింపఁ • దరుణామృతరసాభి, హారణంబు గావించు•నరుచి లేక
నచలాధిపునిచెంత•నధికగహ్వరవిహా, రశ్రీలఁ బూను భా•రంబు లేక

తే. మల్లభూపాలుముమ్మడి•మల్లశౌరి, కీర్తికాంతామతల్లి పం•కేజజాండ
కాండగర్భాతిభారసం•క్రాంతయయ్యుఁ,దత్తదనుకూలఖేలనా•యత్తవృత్తి.

టీ. మల్లభూపాలు ముమ్మడిమల్ల శౌరికీర్తికాంతా మతల్లి.—మల్లభూపాలుముమ్మడిమల్లశౌరి=మల్లభూపతి పుత్రుఁ డగుముమ్మడిమల్లవీరాగ్రణియొక్క; కీర్తికాంతామతల్లి=ప్రశస్తయగుకీర్త్యంగన "మతల్లికామచర్చికా ప్రకాణ్డ ముద్ఘతల్లజౌ ప్రశస్తవాచకా న్యమూని" అనియమరుఁడు. పంకేజజాండకాండగర్భాతిభార సంక్రాంతయయ్యున్.—పంకేజజాండ=బ్రహ్మాండములయొక్క; కాండ = గుంపులనెడు; గర్భ = గర్భములచేతనైన; అతిభార = అధికభారముచేత; సంక్రాంతయయ్యున్=కూడుకొన్నదయ్యును, అనఁగా బ్రహ్మాండ కాండరూపదుర్వహగర్భఖిన్న యయ్యు ననుట. తత్తదనుకూలఖేలనాయత్తవృత్తిన్ = వారివారి కనుకూల మగుక్రీడనమున కధీనమైనవృత్తిచేత. ద్విజరాజు = బ్రాహ్మణశ్రేష్ఠుఁడు, విద్వాంసుఁడనుట. వెఱఁ గందన్= ఆశ్చర్యపడునట్లు. వివిధకలాపాలిన్.—వివిధ = నానాప్రకారములగు; కలా = విద్యలయొక్క; పాళిన్ = సమూహమును. తత్తఱపాటులేక=తొట్రుపాటు

పాటులేక. పచరించున్=కనఁబఱచును. ద్విజరాజు=చంద్రుఁడు. వెఱఁగందక్=భయముచేఁ గందునట్లుగా. వివిధకలాపాలిక్=నానాప్రకారములగుకాంతులగుంపును, తత్తఱపాటు లేక పచరించు ననికీర్తిపరమైన యర్థము. అలమహానటుఁడు.—అల=ప్రసిద్ధమగు; మహానటుఁడు=దొడ్డనట్టువుఁడు,శివుఁడు. ఎన్నన్=గణించునట్లుగా. అతులశృంగారవర్తనన్=అసమానమగు నాట్యమును,శృంగారనియమమును. ఇంతైన శ్రాంతిలేక=ఇంచుకైన శ్రమములేక. చూపున్. “శృఙ్గార స్సురతే నాట్యే రసే దిగ్గజమణ్డలే” అని విశ్వము. తారాళులీక్షింపన్.—తారుఆళులు=చెలికత్తెలుతాము. ఈక్షింపన్=చూచుచుండఁగా. తరుణామృతరసాభిహరణంబు.—తరుణ=నూతనములగు;అమృత=అమృతమువంటి; రస=మధురాదిరసములయొక్క; అభిహరణంబు=గ్రహణంబు“అభిహారోఽభిగ్రహణమ్” అని అమరము.అరుచిలేక=అసహ్యత లేక.కావించున్=చేయును. గర్భవతులకుఁ బదార్థములయం దరుచి గలిగి తానెక్కుడు గ్రహింపమి స్వాభావికంబై యుండఁగా నీమె యరుచి లేక రసాభిగ్రహణము గావించు ననుట. తారాళులు=నక్షత్రముల సంఘములు. ఈక్షింపన్.తరుణామృతరస = నవసుధారసము యొక్క.అభిగ్రహణంబు గావించు నని కీర్తిపరమైన యర్థము. అచలాధిపుని చెంతన్=భూపాలుని సన్నిధియందు. అధికగహ్వరవిహారశ్రీలన్= అధికము లగుదాంభికవిహారములయొక్క సంపదలను. భారంబు లేక=గర్భభారముచేనలసటనొందక. పూనున్=వహించును. అచలాధిపుని=హిమవంతునియొక్క. చెంతన్. అధికగహ్వరవిహారశ్రీలన్=అతిశయమైన గుహావిహారముల యొక్క శ్రీలను. పూనున్=వహించును. “గహ్వరస్తు గుహాదమ్భ నికుఞ్జగహనేష్వపి” అని విశ్వము. గర్భవతి గర్భిణీధర్మములకు విరుద్ధము లైనవ్యాపారములు సేసె ననిభావము.

కీర్తికాంత విద్వాంసుల చేతఁ బ్రశంసింపఁబడినదనియు హిమగిరి గుహాదుల నావరించిన దనియు చంద్రమండలము నాక్రమించి చంద్రునికన్న మిగులఁ దేజరిల్లినదనియు నక్షత్రమండలము నతిక్రమించి కైలాసముదాఁక వ్యాపించినదనియు పంకేజజాండ కాండ గర్భ యనుటచేత బ్రహ్మాండకోటుల నావరించిన దనియు ఫలితార్థము. ఇందుఁ గీర్తికాంతయందు గర్భాభిభరణరూపపుష్కలకారణ మున్నను అరుచ్యలసతాదికార్యములు గలుగనట్లు వర్ణితంబులగుటనుబట్టి విశేషోక్త్యలంకారము. “కార్యాజని ర్విశేషోక్తి స్సతి పుష్కలకారణే” అనిలక్షణము. కీర్తికాంత యనుచోట రూపకంబు.

తే. ఆధరాధీశుసతులు చె•న్నాంబ తిరుమ
లాంబ మల్లాంబికే యనంత•మాంబిక యన
నాతతాత్మీయసద్గుణ•స్యూతసుకవి
సూక్తిముక్తాకదంబ లై • యొప్పి రందు. 56

టీ. ఆధరాధీశుసతులు = ఆ మల్లభూపాలుని భార్యలు. చెన్నాంబయు, తిరుమలాంబయు, మల్లాంబయు, అనంతమాంబికయు, అనన్. ఆతతాత్మీయ సద్గుణస్యూతసుకవిసూక్తిముక్తాకదంబలై.—ఆతత=విశాలములైన; ఆత్మీయ సద్గుణ=తమ లోకోత్తర గుణములనెడుగుణముల చేత,అనగా సూత్రముల చేత;స్యూత=కూర్పఁబడిన;సుకవిసూక్తి=సత్కవివాక్కులనెడు

ముక్తాకదంబలై=ముత్యముల గుంపులుగలవారై, అనగాఁ గవివాక్కులచే నెల్లప్పుడుఁ గొనియాడఁదగుసుగుణములు గలవారై యనుట. ఒప్పిరి. అందున్ = ఆసతులయందు. దీనికి ముందు పద్యముతో నన్వయము. రూపకాలంకారము.

సీ. తాఁ జంచలాత్మ యై ♦ తనుగన్నవారికి, బలుసుల్లు దెచ్చున ♦ బ్జాతపాణి
దతరజోగుణయుక్తి ♦ దానవద్ద్విపముల, నంటుగంధోదగ్ర ♦ యైనభూమి
నొకమూలఁబడియుండి ♦ యుచ్చసింహాసన, మంది తాఁ జండిక ♦ యైనగౌరి
గురుఁడు వాక్రువ్వ న ♦ క్షరవిగ్రహముఁ బూని, నిక్కి రాజాస్థాని ♦ కెక్కు వాణిఁ

తే. బరిహసించుచు జనయిత్రి ♦ భవనకీర్తి
దాయివర్తన సాత్త్విక ♦ ధర్మనియతి
భర్తృచిత్తానుసృతిఁ బూజ్య ♦ పటల సేవఁ
జెలఁగు సద్గుణనికురుంబ ♦ చెన్నమాంబ. 57

టీ. సద్గుణనికురుంబ=సద్గుణసమూహముగలది యైన. చెన్నమాంబ=చెన్నమ్మయను సతి. తాన్=తాను. చంచలాత్మయై=చపలచిత్తయై. తనుఁగన్నవారికిన్=తనపుట్టినింటివారికి. బలుసుల్లు = అధికోపద్రవములను. తెచ్చునబ్జాతపాణిన్ = తెచ్చిపెట్టెడు లక్ష్మీదేవిని. తాఁజంచలాత్మయై=చలస్వభావముగలదై; స్థిరముగానిదై యనుట. తనుఁగన్నవారికిన్=తను గన్నట్టి యుదకమునకు, సముద్రమున కనుట. బలుసుల్లు= అధికావర్తములను. తెచ్చునబ్జాతపాణి ననితాత్పర్యము. తతరజోగుణయుక్తిన్.—తత = విపులమైన; రజోగుణ = రాజసగుణము యొక్క; యుక్తిన్=యోగముచేత. దానవద్ద్విపములను = రాక్షసశ్రేష్ఠులను. అంటి = ఆశ్రయించి. గంధోదగ్ర యైనభూమిన్ = గర్వముచేత నధిక యైనభూమిని. తతరజోగుణయుక్తిన్ = విస్తృత మగుపరాగగుణముయొక్క సంబంధముచేత. దానవద్ద్విపములన్.— దానవత్ = మదయుక్తములగు; ద్విపములన్ = గజములను, దిగ్గజముల ననుట. దానవ + ద్విప అనుచోట "అనచి చ.— అచః పరస్య యరో ద్వే వా స్తో న త్వచి" అనుదానిచే దానవద్ద్విప అని దకారమునకు ద్విత్వమువచ్చినది. గంధోదగ్ర యైనభూమిన్ = ఘ్రాణగ్రాహ్య గుణవిశేషముచేత అధిక యైనభూమిని; పరాగము గలిగి దిగ్గజములతోఁ గూడి గంధవతియై పృథివి యుండుట స్వభావము. ఒకమూలఁ బడియుండి=ఒకగొందిని బడియుండి. ఉచ్చసింహాసనమంది=ఉన్నతమగురాజాసనము నొంది. తాన్. చండికయైన గౌరిన్=తానత్యంతకోపవతి యగుగౌరిని. ఒకమూలన్=మూలగానున్న యీశాన్యదిక్కునందు. పడియుండి. ఉచ్చసింహాసనము.—ఉచ్చసింహ=ఉన్నత మగు సింహమందు;ఆసనము=ఉపవేశనమును.అంది.చండికయైనగౌరిన్=చండియను నామాంతరముగలదైనగౌరిననుట. గురుఁడు=మామ. వాక్రువ్వన్=మాటాడఁగా, నోరెత్తఁగా ననుట. అక్షరవిగ్రహము=నశింపనికలహము. పూని=వహించి. నిక్కి=గర్వించి. రాజాస్థానికిన్=రాజసభకు. ఎక్కువాణిన్=ఎక్కుడుసరస్వతిని. గురుఁడు=బృహస్పతి.వాక్రువ్వన్=చెప్పఁగా. అక్షరవిగ్రహముఁబూని=అకారాద్యక్షరస్వరూపమును దాల్చి. నిక్కి=అతిశయించి. రాజాస్థానికిన్.—

రాజ=ఇంద్రునియొక్క; ఆస్థానికిన్=సభకు. ఎక్కువాణిన్. అనఁగా నకారాద్యక్షరరూపిణి యగుసరస్వతిబృహస్పతిచేత నింద్రసభలోఁ బూజింపఁబడినదని యనుట. కాదేని నుపాధ్యాయుండు సెప్పఁగా రాజసభలలోఁ బూజిత యగువాణి ననుట. పరిహసించుచున్=మిక్కిలిహాస్యము సేయుచు. జనయితృభవనకీర్తిదాయివర్తనన్.—జనయితృభవన=జనకగృహమునకు; కీర్తిదాయి=కీర్తిజనకమగు; వర్తన=వృత్తిచేత. దీనికిఁదనుఁగన్నవారికి బలుసుకీర్తి దెచ్చునజ్ఞాతపాణిని నుదానితోఁ బ్రతిద్వంద్విగా నన్వయము. ఇట్లు నాలుగుచరణములయందుఁ జెప్పిన యర్థములకు నన్వయంబు దెలియవలయు. సాత్త్వికధర్మనియతిన్=సాత్త్వికధర్మములయందు వర్తనముచేతను. భర్తృచిత్తానుసృతిన్= భర్తృచిత్తమునను సరించుటచేతను. పూజ్యపటలసేవన్=పూజ్యులసంఘముయొక్క సేవచేతను. చెలఁగున్=ఒప్పును. చెన్నమాంబ లక్ష్మీభూమిగౌరీ సరస్వతులకన్న మిన్న యని వ్యంగ్యము. ఇందు యథాసంఖ్యాలంకారము. శ్లేషసముత్థాపితవ్యతిరేకాలంకారమును గలదు.

శా. ఆవామామదనుండు మల్లవసుధా♦ధ్యక్షుండు దచ్చెన్నమాం
బావామేక్షణయందు రామవిభునిన్ ♦ మల్లావనీవల్లభున్
శ్రీవాసేక్షణ నిన్ను మల్లమయెడం ♦ గృష్ణాధిపున్ మేదినీ
రావుం గాంచె నచంచలప్రమదసాం♦ద్రా మాధవక్ష్మాపతీ. 58

టీ. అచంచలప్రమదసాంద్రా=స్థిరమైన సంతోషముచేత సాంద్రుఁడగువాఁడా. మాధవక్ష్మాపతీ=మాధవరాయా. ఆవామామదనుండు మల్లవసుధాధ్యక్షుండు = యువతీజన మనోహరుఁ డగునామల్లభూపాలుండు. తచ్చెన్నమాంబావామేక్షణయందున్=ఆచెన్నాంబికయందు. రామవిభునిన్=రామభూపాలుని. మల్లావనీవల్లభున్=మల్లభూపాలుని. శ్రీవాసేక్షణ=శ్రీనివాసము లైనదృష్టులు గలమాధవరాయా. నిన్నున్. మల్లమయెడన్=మల్లాంబికయెడ. కృష్ణాధిపున్=కృష్ణరావును. మేదినీరావున్=మేదినీరావును. కాంచెన్=కనెను.

క. అందగ్రజుండు యువతీ
కందర్పుఁడు రామధరణీ♦కాంతుఁడు వెలసెన్
మందరబలబంధురభుజ
మందరధరమథితవైరి♦మహిపాంబుధి యై. 59

టీ. అందున్=వారలలో. అగ్రజుండు=జ్యేష్ఠుండును. యువతీకందర్పుఁడు=మానినీమన్మథుఁడు నగు. రామధరణీకాంతుఁడు=రామభూపాలుఁడు. మందరబలబంధురభుజమందరధరమథితవైరిమహిపాంబుధియై.—మందర=బహుళమగు;బల=సామర్థ్యముతోడ;బంధుర=దట్టము లైన; భుజ=బాహుల నెడు; మందరధర=మందరపర్వతముచేత; మథిత=మథింపఁబడిన; వైరిమహిప=శత్రురాజుల నెడు;అంబుధి యై=సముద్రముగలవాఁడై. వెలసెన్=ప్రకాశించెను.

సీ. ధర్మనిర్మథనంబు ♦ దాఁ జేసి జనకజా, పాణౌకృతిక్రీడఁ ♦ బ్రబలఁ జేసి
నవరజక్షిప్తరా♦జ్యాతిభారుం డయి, వనచరవర్తన ♦ వఱలఁ జేసి
సతతసుగ్రీవాను♦షక్తాత్ముఁ డై దావ, మున మఖవత్సూనుఁ ♦ దునుమఁ జేసి
సురుగోవిహారార్త♦పరజీవన నిధి యై, యలపుణ్యజనభర్త ♦ నడఁపఁ జేసి

తే. సాటి యన వచ్చు రాముఁడు • సాధుసుకృత
కేళి సర్వంసహాభార•శాలి త్రాత
సాగ్నిసంతానపాళిసా•ధ్వవననిత్య
శీలి యగురామభూపాల•మౌళి కెపుడు. 60

టీ. ఎపుడున్ = సర్వకాలమందును. సాధుసుకృతకేళి.— సాధు = శ్రేష్ఠములగు; సుకృత = పుణ్యవిషయ మైన; కేళి = క్రీడ గలవాఁడును. సర్వంసహాభారశాలి = భూభరణసమర్థుఁడును. త్రాత = రక్షకుఁడు. సాగ్నిసంతానపాళిసాధ్వవననిత్యశీలి.— సాగ్ని = అగ్న్యుపాసనము సేయు సోమయాజులయొక్క; సంతానపాళి = బిడ్డలగుంపుయొక్క; సాధ్వవన = చక్కఁగఁ బోషించుట; నిత్యశీలి = నిరంతరస్వభావముగాఁ గలవాఁడును. అగురామభూపాలమౌళికిన్ = అయినట్టి రామభూపాలాగ్రేసరునకు. రాముఁడు = శ్రీరాముండు. తాన్ = తాను. ధర్మనిర్మథనంబు = ధర్మమార్గభంగమును. చేసి = ఒనరించి. జనకజాపాణౌకృతిక్రీడన్.— జనక = తండ్రివలన; జా = పుట్టినదానియొక్క, సహోదరియొక్క యనుట. పాణౌకృతి = వివాహమందలి; క్రీడన్ = క్రీడచేత. ప్రబలఁ జేనిన్ = వృద్ధిఁబొందఁజేని. పాణౌకృతియనుచోట “నిత్యం హస్తే పాణా వుపయమనే” అని యలుక్సమాసము. ధర్మ = ధనువుయొక్క. నిర్మథనంబు = భంగంబు. తాఁ జేసి. జనకజా పాణౌకృతి = జనకచక్రవర్తికూఁతురగుసీతాపాణిగ్రహణమందలి క్రీడచేత శ్రీరాముండు ప్రబలినాఁడని భావము. గీతిలోఁ జెప్పిన యర్థములకు వీనికిఁ గ్రమముఁ జూడవలయు. అవరజక్షిప్తరాజ్యాతిభారుండయి.— అవరజ = నీచునియందు; క్షిప్త = ఉంపఁబడిన; రాజ్యాతిభారుండయి = రాజ్యసంబంధియైనయధికభారము గలవాఁడై. వనచరవర్తనన్ = కిరాతకుల వృత్తిచేతను. వఱలఁ జేనిన్. అవరజుఁ డనఁగా అనుజుఁడైన భరతుఁడు అతనియందుంపఁబడినరాజ్యభారము గలవాఁడై వనచరు లగుమున్యాదుల యొక్క వర్తనచేత శ్రీరాముండు వఱలినాఁడని భావము. సతతసుగ్రీవానుషక్తాత్ముఁడై.— సతత = ఎల్లపుడును; సుగ్రీవా = మంచికంఠము గలదానియందు; అనుషక్తాత్ముఁడై = అనురాగముగలవాఁడై. దావమునన్ = అరణ్యమున. మఖవత్సూనున్.— మఖవత్ = సోమయాజియొక్క; సూనున్ = సుతుని. తునుమఁ జేనిన్ = వధింపఁజేని. సతతము సుగ్రీవునియందనుషక్తాత్ముఁడై దావమున మఖవత్సూనుఁ డనఁగా నింద్రసుతుఁ డగువాలిని శ్రీరాముండు దునిమినవాఁడని భావము. “హవి ర్జక్షితి నిశ్శఙ్కో మఖేషు మఖవా నసౌ. త త్త్రైకో మఖవా నమ్రత్ర బహవః” ఇత్యాది ప్రయోగములు మతుబంతమైన మఖవచ్ఛబ్దమునకుఁ బ్రమాణములు. ఉరుగోవిహారాత్తపరజీవననిధి యై.— ఉరు = అధికమగు; గో = దృష్టులయొక్క; విహార = వ్యాపారముచేత; ఆత్త = పొందఁబడిన; పర = అన్యులయొక్క; జీవననిధి యై = జీవనాస్పదమగు ధనముయొక్క నిధిగలవాఁడై, కన్నులచే బెదిరించి పరద్రవ్యాపహరణముఁ జేసినవాఁ డనుట. శ్రీరాముండు. ఉరు = అధికమగు; గోవిహార = బాణములయొక్క విహారముచేత; ఆత్త = ఆక్రమింపఁబడిన; పర = ఉత్కృష్టమగు; జీవననిధి = సముద్రముగలవాఁడని భావము. అలపుణ్యజనభర్తన్ = ఆసుకృతిజనశేఖరుని, రాక్షసులకుభర్త యగురావణుని ననుట. “యాతుధానః పుణ్యజనః” అని అమరము. అడఁపఁ జేనిన్ = తునుమఁ జేని. సాటి యన వచ్చున్ = సమానుఁడన

వచ్చును. ఇందు యథాసంఖ్యాలంకారము "యథాసంఖ్యం క్రమేణైవ క్రమికాణాం సమన్వయః" అని లక్షణము. మఱియు వర్ణ్యం బగు రామభూపాలున కవర్ణ్యం బగు రామభద్రుం డౌపమ్యనివృత్తి లేనందున సాటి గాఁ డని చెప్పుటచే ప్రతీపాలంకారము. "వర్ణ్యే నాన్య స్యోపమాయా అనిష్పత్తివచశ్చ తత్" అని లక్షణము.

మ. శరజాతంబు దృణీకరించి రజనీ♦జానిం గలాభంగమై
పరవం జేసి యధఃకరించి యలస♦ర్పస్వామి రామక్షమా
వరుకీర్తిచ్ఛట సత్యలోకమునకున్ ♦ వాగ్దేవితోఁ జెల్మికై
కర మేఁగన్ సురధేనువాస్య మటుగాఁ ♦ గావించె మధ్యేసృతిన్. 61

టీ. రామక్షమావరుకీర్తిచ్ఛట = రామభూపాలునియశఃపరంపర. శరజాతంబు = తెల్లగడ్డియొక్క గుంపును. తృణీకరించి = ధిక్కరించి. తెల్లి తృణము గాన తృణీకరణము సహజము. రజనీజానిన్ = చంద్రుని. కలాభంగమైపరవన్ = తేజోహీనత గలవాఁడై వర్తించునట్లు చేసి. చంద్రుఁడు కృష్ణపక్షమునందు కలాహీనుఁడై వర్తిలుట సహజము. అలసర్పస్వామిన్ = ఆశేషుని. అధఃకరించి = నికృష్టునిఁగాఁ జేసి, ఆదిశేషుఁడు అధోలోకమం దుండుట సహజము. వాగ్దేవితోన్ = సరస్వతీదేవితో. చెల్మికై = స్నేహమునకై. సత్యలోకమునకున్ = బ్రహ్మలోకమునకు. ఏఁగన్ = పోవుచుండఁగా. మధ్యేసృతిన్ = మార్గమధ్యమందు "పారే మధ్యే షష్ఠ్యావా" అని యలుక్సమాసము. సురధేనువు = కామధేనువు. కరము = మిక్కిలి. ఆస్యము = ముఖము. అటుగాఁగావించెన్ = మరల్చెననుట. ధేనువుముఖము నల్లగ నుండును గాన చూపలేక మరల్చుట.

రామభూపాలునికీర్తి స్వర్గమర్త్యపాతాళములు వ్యాపించి సత్యలోకముదాఁకఁ బ్రసరించిన దని తాత్పర్యము. ఇందు రామభూపాలకీర్తికి కర్తృకశేషాద్యధఃకరణాద్యసంబంధ ముండినను తత్సంబంధవర్ణనమునుబట్టి సంబంధాతిశయోక్త్యలంకారము. "సంబన్ధాతిశయోక్తి స్స్యాదయోగే యోగకల్పనమ్" అని లక్షణము. అదియు శ్లిష్టశబ్దనిబంధనయగుటచే శ్లేషోత్థాపిత యగును.

క. ఆరాముననట్లు వెలసెన్, శ్రీరామారమణుఁ డగుచు ♦ మల్లాధిపుఁ డా
సారాయతధీరాశుగ, వారాహతవైరిదాన♦వద్విపకులుఁడై. 62

టీ. ఇందు మల్లనృపతి శ్రీరామునట్లు అనఁగా తనయన్నయట్లు వెలసెనని చెప్పఁబడెను. మల్లాధిపుఁడు = మల్లభూపాలుఁడు. ఆసారాయతధీరాశుగవారాహతవైరిదానవద్విపకులుఁడై.—ఆసార = వర్షధారలవలె; ఆయత = విస్తారములయిన; ధీర = శ్రేష్ఠములైన; ఆశుగ = బాణములయొక్క; వార = సంఘముచేత; ఆహత = కొట్టఁబడిన; వైరిదానవద్విపకులుఁడై = వైరి అగుశాత్రవసమూహ ఏనుఁగుల ... గలవాఁడై; వైరి = శత్రువులయొక్క; దాన

వత్ = మదయుక్తములైన; ద్విపకులుఁడై=గజములగుంపులుగలవాఁడై యని యర్థాంతరము. క్ష్మారామారమణుఁడగుచుఁ.—క్ష్మా=భూసంబంధినియగు, అనఁగా భూపుత్రియగు; రామా=సీత యనుట; రమణుఁడగుచుఁ=వల్లభుఁ డగుచు, భూకాంతావల్లభుఁ డగుచు నని యర్థాంతరము, భూపాలుఁ డగుచు నని తాత్పర్యము. ఆరామునట్లువెలసెఁ=ప్రసిద్ధుఁ డగుదాశరథివలెఁ బ్రకాశించెను. పైఁజెప్పినతనయన్న యగురామభూపాలునివలెఁ బ్రకాశించెను అని యర్థద్వయముఁ జూడవలయు. ఇందు శ్లేషసంకీర్ణోపమాలంకారము.

సీ. కురులపట్టునకు నే♦యురుకలానిధియాజ్ఞ, దరుణచంపకగర్భ♦దామకంబు
మధురోపకంఠసీ♦మకు నేమహాభాగు, తతగుణశ్రేణి ము♦క్తాలలంతి
కరహాటకటకభా♦గమున కేరాజుతీ, వ్రప్రతాపం బబ్జ♦రాగఘటన
మద్రమధ్యమున కే♦మాన్యకలాపాళి, గమనీయమేఖలా♦కలకలంబు

తే. లలవిదేహాదేశమున కే♦లలితమూర్తి
కీర్తి గర్పూరచర్చికా♦స్ఫూర్తి యతఁడు
రాజచేకోలగండాంక♦రాజితుండు
మల్లభూపాలచంద్రుఁడు ♦ మహిఁ జెలంగె. 63

టీ. కురులపట్టునకుఁ = కురుదేశప్రదేశ మనెడుకుంతలప్రదేశమునకు. ఏయురుకలానిధియాజ్ఞ = ఏయధిక విద్యగలవానియొక్క యాజ్ఞ. తరుణచంపకగర్భదామకంబు = తత్కాలగ్రథిత మగుసంపెఁగపువ్వులసంబంధి యైనశిరోమాల్యమో, అనఁగా గుంతలములయందుఁ జంపకమాలిక నాదరముతో వహించిన ట్లారాజునాజ్ఞ కురుదేశపువారిచే శిరసున వహింపఁబడుచున్న దనుట. ఆదేశము నీరాజే పాలించుచున్నాఁ డని వ్యంగ్యము. ఇట్లన్నిచరణములయందు నూహింపఁ దగినది. మధురోపకంఠసీమకుఁ= మధురాపురియొక్క సమీపదేశమనెడు మనోజ్ఞ మగునుపకంఠసీమకు అనఁగా కంఠసమీపదేశమునకు. ఏమహాభాగుతతగుణశ్రేణి=ఏమహాభాగ్యశాలియొక్క విపులమైనగుణగణము. ముక్తాలలంతి=వ్రేలాడుముక్తాహారమో, "లమ్బనం స్యాల్లలన్తికా" అనిఅమరుఁడు.అనఁగాకంఠప్రదేశమునకు ముక్తాలలంతిశోభావహమైనట్లు మధురాపురీపరిసరమునకు నారాజుగుణగణ మలంకార మగు నని యనుట. కరహాటకటకభాగమునకుఁ = కరహాటదేశపట్టణభాగ మను కరమందున్న హాటకటక భాగమునకు అనఁగా సువర్ణమయమైన కంకణములయొక్క ప్రదేశమునకు. ఏరాజుతీవ్రప్రతాపంబు= ఏరాజుయొక్క యుగ్రప్రతాపంబు. అబ్జరాగఘటన = పద్మరాగమణిఘటనమో. తాత్పర్యము పైఁబోలినరీతి నూహ్యంబు. మద్రమధ్యమునకుఁ =మద్రదేశమధ్య మనెడు మంగళ మగుమధ్యప్రదేశమునకు. ఏమాన్యకలాపాళి=ఏమాననీయునివిద్యాసమూహము. కమనీయ మేఖలాకలకలంబు = మనోజ్ఞ మగునొడ్డాణముయొక్క కలకలధ్వనియో. అలవిదేహాదేశమునకుఁ = ప్రసిద్ధ మగువిదేహాదేశ మనెడు విశేష మయినశరీరప్రదేశమునకు. ఏలలిత మూర్తికీర్తి = ఏకమనీయ శరీరునికీర్తి. కర్పూరచర్చికాస్ఫూర్తి=కర్పూర లేపనాతిశయరూపమో. అతఁడు=అ

రాజు. రాజచేకోలగండాంకరాజితుండు=రాజచేకోలగండ యనుబిరుదముచేఁ బ్రకాశించువాఁడు. మల్లభూపాలచంద్రుఁడు = చంద్రునివలె నాహ్లాదకుం డగుమల్లభూపాలుండు. మహిన్=భూమియందు. చెలంగెన్=ప్రకాశించెను. మల్లభూపతి గుణగణము మొదలగునది భూపావిశేషరూప మయినపు డతఁడు చంద్రునివలె జగదాహ్లాదకరుఁ డగుట స్పష్టము. శ్లిష్టరూపకాలంకారము.

చ. అనుపమమల్లికార్జునయ♦శోంచితుఁ డైనకుమారమల్లనా
వనిపతి డాయఁ బూని రిపు♦వారము లంత నుపాంతవాహినీ
ఘనతరవారులన్ మునిఁగి ♦ గ్రక్కునఁ గాంతురు సౌరసుందరీ
జనకుచకుంభకూటతట♦సాంద్రమృగీమదసారసంగతిన్. 64

టీ. అనుపమమల్లికార్జున యశోంచితుఁడైనకుమారమల్లనావనిపతిన్.—— అనుపమ = సాటిలేని; మల్లిక = మల్లికాకుసుమములవలె; అర్జున = తెల్లనగు; యశః = కీర్తిచేత; అనుపమ మగుమల్లికార్జున = మల్లికార్జునస్వామియొక్క, యశః = ఖ్యాతిచేత. అంచితుఁడై అనఁగా శ్రీశైలములో నున్న సాంబశివునకు మల్లికార్జునస్వామి యని నామంబు గాన ఈ రాజపుంగవులవంశమున తొల్లింటినుండి యామహానుభావుని సేవించుటయు, వారినామంబులోఁ దమబిడ్డలనుబిలుచుటయుఁ గలిగియున్నయవి. దీననే పెదమల్లభూపాలుఁడు, చినమల్లభూపాలుఁడు, ముమ్మడిమల్లభూపాలుఁడు, కుమారమల్లభూపాలుఁడు, అను నామంబులచే విలసిల్లుట. మఱియు లింగభూపాలుండు లింగాంబిక లోనైనవియు నిష్టదేవతానామంబులే కాని వేఱు గావు. వెండియు నీరాజశేఖరులకుఁ గూటస్థుం డగు ననపోతమహారాజు శ్రీశైలమునకు సోపానములు గట్టించినట్లు, "యశ్చారుసోపానపథేన చక్రే శ్రీపర్వతం సర్వజనాఙ్ఘ్రిగమ్యమ్" ఇదిలోనుగా సింగభూపాలప్రణీతం బైనరసార్ణవసుధాకరమందు వర్ణింపఁబడినది. ఇట్లనుపమ మల్లికార్జున యశోంచితుఁ డైనకుమారమల్లనావనిపతిన్. డాయఁ బూని=చేరఁ గడంగి. రిపువారములు = శత్రుసంఘములు. అంతన్ = అంతట. ఉపాంతవాహినీఘనతరవారులన్.— ఉపాంత = సమీపమున నున్న; వాహినీ = సేనలయొక్క, సమీపమున నున్నకృష్ణానదియొక్క; ఘనతరవారులన్.—ఘన = గొప్పలగు; తరవారులన్ = ఖడ్గములయందు, ఘనతరము లైనయుదకములయందు. మునిఁగి = క్రుంకి. గ్రక్కునన్=వేగముగా. సౌర సుందరీ జనకుచకుంభకూటతటసాంద్రమృగీమదసారసంగతిన్.—— సౌరసుందరీ = సురాంగనలయొక్క; జన = సంఘముయొక్క; కుచకుంభ = కుంభములవంటికుచములయొక్క; కూట = సమూహముయొక్క; తట = ప్రదేశములయందలి; సాంద్ర = దట్టమగు; మృగీమద=కస్తూరియొక్క; సార = స్థిరాంశముయొక్క; సంగతిన్ = సంబంధమును; కాంతురు = పొందుదురు. ప్రస్తుతాప్రస్తుతముల కుపమానోపమేయభావము వ్యంగ్యము గాన రాజును సమీపింపఁ బూనిన శత్రురాజులు వీరిసేనలఖడ్గములచే నఱకఁబడి సురాంగనాపరిరంభసౌఖ్యమును, మల్లికార్జునస్వామిని జేరఁబూనినవారు కృష్ణానదియందు స్నానము జేసి సురాంగనాసంగసౌఖ్యముఁ బొందినట్లు పొందిరనుట. అలంకారము వ్యంగ్యోపమ.

సీ. శ్రీ నంద దనుచు సా♦మైనమే నూనుఁ జా
యల మెచ్చ దనుచు బ♦ల్వాలపు నెఱపుఁ
దనపదంబునఁ జేర♦దనుచు వెల్వెలఁబోవుఁ
జెఱఁగు ముట్ట దనుచుఁ♦జెందు మఱపుఁ
దలముఁ జూడ దనుచుఁ♦దాఁ గలంగు నిజాప
ఘనము నంట దనుచుఁ♦గల దొలంగుఁ
గటక మొల్ల దనుచుఁ♦ఘనదానరతిఁ బూనుఁ
గనుదోయిఁ గప్పుకో♦దనుచు రోఁజు. 65

తే. శూలిసౌరాగ మాశర♦త్కాలఘనము,ముసలిజడధీనుఁడుగ్రమా♦లిసురవార
ణంబు శేషుండు వారిచం♦దంబుఁ జూచి, గేరు మల్లావనీపాలు♦కీర్తికన్య. ర

టీ. శ్రీనందదనుచు నిత్యాదిసీసచరణ చతుష్టయమందుఁ జెప్పినయర్థములకుగీతియందుఁ గ్రమముగా నన్వయంబు. శూలి=శివుఁడు. శ్రీ నంద దనుచుక్=శ్రీ యనఁగా సంపత్తు విషము, మల్లావనీనాథుకీర్తికన్య తనసంపద నొల్ల దనుచు. సామైన మేనూనుక్=సగమైనశరీరమును దాల్చినవాఁడు. తనసంపదనె యంగీకరింపనపుడు తన్ను వరించుట మిక్కిలి యసంభావనీయ మనిచింతతో క్షీణించినాఁ డనుట. శివుఁడు తెల్లనివాఁడైనను విషము నల్లనిది గానఁ దెల్లనిస్వభావము గలకీర్తికన్య దానిం జూచి శివునిఁ ద్యజించుననియు,నీశ్వరుండు స్వభావముగా నర్ధాంగుఁ డనియుఁ దెలియ వలయు. సౌరాగము=కల్పవృక్షము. చాయలక్=కాంతులను, నీడలను; మెచ్చ దనుచుక్=శ్లాఘింపదనుచు. బల్వాలపు నెఱపుక్,= అధికమైన మోహామును దాల్చును, చాయలనే మెచ్చనిది తను వరించుట దుర్లభమని వలపు నెఱపు ననుట. కల్పవృక్షము తాను తెల్లదైనను దననీడ నల్లనిదిగానఁ గీర్తికన్య మెచ్చ దనియు వలపుఅనఁగాఁ బరిమళము నెఱపుట సహజమనియు తెలియవలయు. ఆశరత్కాలఘనము=ప్రసిద్ధమైనశరన్మేఘము. తనపదంబునఁ జేర దనుచుక్=తనస్థానమునఁ జేర దనుచు. వెల్వెలఁబోవుక్= వైవర్ణ్యమును దాల్చును,తెల్లఁబోవును. ఘనపదమాకాశము నల్లనిది గాన నచటఁ గీర్తికన్య చేరదనియు శరత్కాలఘనము తెల్లగానుండుట సహజమనియుఁ దెలియునది. ముసలి=బలరాముఁడు. చెఱఁగు ముట్ట దనుచుక్=వస్త్రమును ముట్టదని. మఱపుఁజెందుక్= మత్తత నొందు. తనచెఱఁగు ముట్టనిది తన్ను వరించుట దుర్లభ మని మఱపుఁ జెందె ననుట. బలరాముఁడు తెల్లనివాఁడైనను గట్టుగుడ్డ నల్లనిది గానఁ గీర్తి ముట్టదనియు బలరాముఁడు మదిరాపానపరవశచిత్తుండగుట స్వభావ మనియుఁ దెలియ వలయు. "ఘూర్ణయక్ మదిరాస్వాదమదపాటలితద్యుతీ। రేవతీవదనోచ్ఛిష్ట పరిపూతపుటేదృశౌ" అని మాఘమందు బలరాముఁడు హాలాపానవివశుఁ డని వర్ణింపఁబడినయది. జడధీనుఁడు=సముద్రశ్రేష్ఠుఁడు. తలముఁ జూడ దనుచుక్=అడుగుభాగమును జూడదనుచు; తాక్. కలంగుక్=కలఁగఁబాఱును. సముద్రతలము పంకమయ మగుటచే నల్లగా నుండుననియు సముద్రము కలఁగఁబాఱుట సహజమనియు తెలియునది. ఉగ్రమాళి = శివునిశిరోలంకారమైన చంద్రుఁడు. నిజాపఘనముక్ = తనశరీర

ము ను "అఙ్గం ప్రతీకోపఘనో౽థ కళేబరమ్" అని యమరుఁడు. అంటదనుచున్ = ముట్టదనుచు. కలదొలంగున్ = కాంతిహీనుఁ డగును. చంద్రునియందుఁ గలంకమున్నది గాన నతనిశరీరము ముట్టదనియు కలాహీనుఁ డగుట సహజమనియుఁ దెలియవలయు. సురవారణంబు=ఐరావతము. కటక మొల్లదనుచున్=తనపురము నొల్లదనుచు. ఘనదానరతిన్=అధికత్యాగరతిని. పూనున్. "కటవీపకటః" అని కటకశబ్దము గండస్థలమును బోధించును గాన నైరావతము గండస్థల మళిమలినమై యుండుటచేఁ గీర్తి దానినొల్ల దనియు దాన మనఁగా మదోదకము దానియందు రతిఁబూనుట స్వభావమనియుఁ దెలియవలయు. శేషుండు = ఆదిశేషుఁడు. కనుదోయిన్ = నేత్రయుగ్మముచేత. కప్పుకోదనుచున్ = ఆదరింపదనుచు. రోఁజున్ = బుసపెట్టును, శేషునికనుదోయి యందు కప్పు అనఁగా నల్లదనముకలదనియు కోదు అనఁగా అంగీకరింపదనియు సర్పములకు రోఁజుట సహజమనియు భావము. శూలియనఁగా శూలరోగముగల వాఁడనియు సౌరాగమనఁగా సురాసంబంధియైన వృక్షమనియు ఆ శరత్కాలఘన మనఁగా రాక్షసులవలె నాచరించు కాలమేఘమనియు ముసలియనఁగా వృద్ధుఁడనియు జడధీనుఁడనఁగాజడమతిగలవారిలో శ్రేష్ఠుఁడనియు ఉగ్రమౌళి యనఁగా నుగ్రులలో శ్రేష్ఠుఁడనియు సురవారణంబనఁగా సురలచే వారింపఁబడినదనియు శేషుఁడనఁగా దాసుఁడనియు నపార్థముతోఁచును గాన శివకల్పతరు శరదంబుదబలభద్ర సముద్ర సురగజ శేషులయొక్క సంపచ్ఛాయాపదాదుల నిరాకరణమును గీర్తికన్య చేసెననియు దెలియవలయు. వారిచందంబుఁజూచి=వారిరీతినిజూచి. మల్లావనీనాథుకీర్తికన్య = మల్లభూపాలుని కీర్తియనెడు కన్యక. కేరున్=హసించును. క్రమాలంకారము. శివాదు లర్ధశరీరము మొదలగు వాని నవలంబించుటకు మల్లమహీపతి కీర్తి కన్యాకర్తృకాస్వీకారము నహేతువును హేతువుగాఁ జెప్పుటవలన హేతూత్ప్రేక్షగమ్యమగు.

తే. ఆధరాధీశుపిమ్మట ♦ నఖిలభూమి, భరము నీవు ధరించితి ♦ కిరికులేంద్ర
కమఠవల్లభకులశైల♦కరటిసంస, దురగనాథులతోఁడఁ బె♦న్నుద్ది వగుచు.

టీ. ఆధరాధీశుపిమ్మటన్ = ఆ కుమారమల్లభూపాలునిపిదప. కిరికులేంద్రకమఠవల్లభకులశైలకరటిసంసదురగనాథులతోడన్ = ఆదివరాహమూర్తి యాదికూర్మము సప్తకులాచలములు దిగ్గజగణంబు ఆదిశేషుండు వీరితోడ. పెన్నుద్దివగుచున్ = పెద్దయీడగుచు. అఖిలభూమిభరము = సర్వపృథివీభారమును. నీవు. ధరించితి=ధరించితివి. ఇందు గుణోత్కృష్టులగునాదివరాహకమఠనాథకులశైలదిగ్గజశేషులతో మాధవరాయలను దుల్యులనుగా జెప్పుటవలనఁ దుల్యయోగితాలంకారభేదము. "శ్లో॥ గుణోత్కృష్టైః సమీకృత్య వచో౽న్యా తుల్యయోగితా" అని తల్లక్షణము.

సీ. బంధురవనకదం♦బములపాలుగఁ జేసె, ఘనతరపుండరీ♦కముల నెల్ల
శిఖరిశిఖాశ్రేణిఁ ♦ జేరంగఁ బురికొల్పెఁ, గలితసారంగసం♦ఘముల నెల్ల
ఘోరమహాబిల♦కోటి నుండఁగఁజేసెఁ, బ్రబలపరాశుగ♦పటలి నెల్లఁ
గమలేశ్వరాధీన♦గతిఁ బొసంగఁగఁ జేసెఁ, దతమై జయంతికా♦వితతి నెల్లఁ
తే. దన్ను నవి యెల్ల మఱచినఁ ♦ దాను మఱవ
కాత్మనృపచిహ్నములు డాఁచు ♦ నందునందు

శత్రునృపకోటి నీధాటిఁ ◆ జకితవృత్తి
పరఁగి చనువేళ మాధవ ◆ ధరణిపాల. 67

టీ. ఇందు మాధవరాయ శత్రురాజులయొక్క నృపచిహ్నగోపన మర్థద్వయముతోఁ జెప్పఁబడినది. మాధవధరణిపాల = మాధవరాయా. శత్రునృపకోటి = శత్రురాజబృందము. నీధాటిన్ = నీదండయాత్రయందు "శ్లో. శత్రుసేనావమర్దాయ సద్యస్సుభటఘోటకైః విజిగీషోః ప్రవృత్తిర్యా సా ధాటీతి నిగద్యతే" అని ధాటీలక్షణము. చకితవృత్తిన్ = భీతవృత్తితో. పరఁగి=ప్రవర్తించి. చనువేళన్ = పాఱిపోవునెడ. ఘనతరపుండరీకములనెల్లన్ = మిక్కిలిగొప్పవైన శ్వేతచ్ఛత్త్రములనెల్లను, తెల్లదామరలనెల్ల ననికాని, వ్యాఘ్రములనెల్ల ననికాని, యర్థాంతరము. బంధురవనకదంబములపాలుగన్ =దట్టములైనయుదకసంఘములపాలగునట్లుగా లేక యరణ్యములపాలగునట్లుగా. చేసెన్. కలితసారంగ సంఘములనెల్లన్ = ఒప్పుచున్న యేనుఁగులగుంపుల నన్నింటిని, తుమ్మెదగుంపుల నన్నింటిని. శిఖరిశిఖాశ్రేణిన్ = పర్వతాగ్రప్రదేశములను, వృక్షాగ్ర ప్రదేశములను. చేరంగన్ = చేరునట్లు. పురికొల్పెన్ = చేసెను. గజము లడవులు చేరునట్లు వానియందున్న తుమ్మెదలు చెట్లు చేరునట్లు చేసెనని భావము. ప్రబలపరాశుగపటలినెల్లన్.—ప్రబల=మిక్కిలిసామర్థ్యముగల; పర=శ్రేష్ఠములగు; ఆశుగ=బాణములయొక్క, వాయువులయొక్క; పటలినెల్లన్=సంఘమునెల్ల. ఘోరమహాబిలకోటిన్ = భయంకరమగుగొప్పబొఱియలగుంపులో, ఘోరమైనమహాబిల యనఁగా నాకాశముయొక్కయగ్రమున "తారాపథోఽన్తరిక్షంచ మేఘద్వారం మహాబిలమ్" అని అమరుఁడు. ఉండఁగఁజేసెన్ =ఉండునట్లు చేసెను. తతవైజయంతికావితతినెల్లన్.—తత=విస్తృతమగు; వైజయంతికా=టెక్కెములయొక్క, వనమాలలయొక్క; వితతినెల్లన్ =సముదాయమునెల్లను. కమలేశ్వరాధీనగతిన్.—కమలేశ్వర=సముద్రముయొక్క "సలిలం కమలం జలమ్" అని అమరుఁడు: విష్ణుమూర్తియొక్క అధీన=స్వాధీనతయొక్క, భావప్రధాననిర్దేశము. గతిన్=ప్రాప్తిచేత. పొసంగఁగన్=ఒప్పునట్లు. చేసెన్. తన్నున్. అవియెల్లన్ =ఆగొడుగులు మొదలగురాజచిహ్నము లన్నియు. మఱచినన్=రాజ్యభ్రష్టులై పోవునపుడు తచ్చిహ్నములు తన్నుమఱచుట స్వభావము గాన మఱచినను తాను. మఱవక=మఱచిపోక. ఆత్మనృపచిహ్నములు=తమరాజచిహ్నములు. అందునందున్ =వానివాని కుచితము లగునాయాస్థలములయందు. డాఁచున్=డాఁచిపెట్టును. అనఁగా మాధవరాయలధాటియందు భీతులై యరులు పోవునపుడు తమనృపచిహ్నములు యదృచ్ఛగా గొడుగులు నీటిలోను లేక వనములలోను గజము లడవులలోను వాని ననుసరించినతుమ్మెదలు వృక్షాగ్రములలోను బాణములు బొఱియలలోను టెక్కెములు సముద్రములోను వానియంతకు నవి పడి పోయినను శత్రురాజులు బుద్ధిపూర్వకముగాఁ దత్తదుచితప్రదేశములయం దుంచి పోయిన ట్లున్నదని యనుట. పుండరీకములు వనముల నుండుటయు సారంగములు శిఖరిశిఖాశ్రేణులఁ జేరుటయు ఆశుగములు గగనముఁ జేరుటయు వైజయంతులు విష్ణుమూర్తిని జేరుటయు నుచిత మనిభావము. ప్రకృతాప్రకృతార్థములకు శ్లేషమూలాభేదారోపముఁ జేయఁబడినది. ఇచట పుండరీకసారంగాశుగవైజయంతులను మాధవరాయధాటీపలాయితారిమండలి తత్తదుచితస్థలములలో నుంపకపోయినను నుంచిపోయినట్లు చెప్పుటవలన నుత్ప్రేక్షాలంకారము.

మఱియుఁ దత్తదనురూపస్థానని వేశనము శ్లేషమూలముగాఁ దోఁచుచున్నది గాన సమాలంకారము. "సమం స్యా ద్వర్ణనం యత్ర ద్వయో ర ప్యనురూపయోః" అని లక్షణము.

మ. అనలమ హీనమై యెసఁగె ♦ నౌర త్వదుద్ధతశౌర్యలక్ష్మిచే
ధనదుఁడు వొందెఁ దా ధర హి♦తస్థితిఁ దావకదానవైఖరిం
గని యచలవ్రజంబును ము♦ఖస్ఫుటవర్ణవియుక్తిఁ గాంచె నీ
ఘనతరధైర్యవైభవము ♦ గన్గొని మాధవరాయ చిత్రతన్. 68

టీ. మాధవరాయ. త్వదుద్ధతశౌర్యలక్ష్మిచేన్.— త్వత్ = నీయొక్క; ఉద్ధత=అధికమైన; శౌర్యలక్ష్మిచేన్ = ప్రతాపసంపదచేత. అనలమ = అగ్నియే. హీనమై యెసఁగెన్= హీనమై యొప్పెను. ఔర=ఆశ్చర్యము. శౌర్యలక్ష్మి యగ్నికిని దుస్సహ మగుటచే నాశ్చర్యము. తావకదానవైఖరిన్ = నీదానరీతిని. కని=చూచి. ధనదుఁడు=కుబేరుఁడు. ధరన్= భూమియందు. తాన్ = తాను. హితస్థితిన్ = హితవృత్తిని. పొందెన్ = పొందెను. "శ్లో. భజతే విదేశ మధికేన జిత స్త దనుప్రవేశ మథవా కుశలః" అను న్యాయము ననుసరించి నీహితవృత్తి నవలంబించె ననుట. ఘనతరశౌర్యవైభవము=ఉత్కృష్ట మగునీధైర్యసంపదను.కన్గొని= చూచి. అచలవ్రజంబు = పర్వతసంఘము. ముఖస్ఫుటవర్ణవియుక్తిఁగాంచెన్=ముఖమందు స్ఫుటవర్ణవియోగమును,అనఁగా కాంతిహీనతను కాదేని గద్గదభాషణమును కాంచెన్=పొందెను. చిత్రతన్ అనునది యంతటను సమన్వయించును. చిత్ర మెట్లన అనలము అహీనమై ఆకారహీనమై నలమై అనఁగా గడ్డిపోఁచై యెసఁగెను ధనదుఁడు ధరహితస్థితిన్=ధకారరహితస్థితిని, నదుఁడు అనుస్థితిని" నదదాతీతినదః" అనఁగా నియ్యనివాఁడు అను పేరు వొందెను ఇటనశబ్దముతో సమాసము-అచలవ్రజంబు. ముఖస్ఫుటవర్ణవియుక్తిన్.—ముఖ=ఆదియందున్న.స్ఫుట=స్ఫుటమగు.వర్ణ=అవర్ణముయొక్క వియోగమును. చలవ్రజ మాయె నని తెలియునది. మాధవరాయలశౌర్యసంపదకు నగ్నిగడ్డిపోఁచగా నాయెనఁగా శౌర్యాగ్నిప్రభకు నగ్నితేజమత్యల్పమై యెసఁగెననియు మాధవరాయలత్యాగమునకు విశేషముగ నిచ్చువాఁడై ధనదుఁడని పేరువొందినకుబేరుండు నియ్యనివానివలెఁదోఁచె ననియు మాధవరాయలధైర్యసంపదకుఁ గదలకుండి యచల మనిపించుకొన్న పర్వతవ్రజము చలించుదానివలె నాయె ననియు భావము. అత్యద్భుతమైన శౌర్యముదానము ధైర్యము గలవాఁ డని ఫలితార్థము. అత్యుక్తి యర్థాలంకారము. చిత్రము శబ్దాలంకారము " ఆకారగతిస్వరవ్యంజనస్థాననియమచ్యుతగుప్తాదిభేదై రనేకధా చిత్రమ్" అని కావ్యానుశాసనమందుఁ జిత్రలక్షణము.

సీ. తాఁ గుంభినీశతఁ ♦ దగి ముఖ్యరుచి నెల్లఁ, బరశిలీముఖకోటి♦పాలు చేసెఁ
దా ధరాధీశతఁ ♦ దనరి శృంగము నెల్ల, ఘనగండకాండసం♦కటముఁ జేసెఁ
దా భోగిరాజతఁ♦దాల్చి పదం బెల్ల, సాంద్రాహిభీతిజ♦ర్జరముఁ జేసెఁ
దా భూమిదారత ♦ ధరియించి పురమెల్ల, బహుళదుష్కీర్తిదు♦ర్భరముఁ జేసె

తే. ననుచుఁ గరిరాజి గిరిరాజి నాహరిపతిఁ
గిరిపతి నిరాకరించి యిద్ధరణికాంత
జెందె నరిభేదవైభవాంచితు నభీతుఁ
గీర్తిసంపన్ను మాధవక్షితిప నిన్ను. 69

టీ. ఇందు ధరణికాంత దిగ్గజాదుల నిరాకరించి మాధవరాయలను జేరుటకు శ్లేషభంగిచే హేతునిరూపణముఁ జేసి యర్థద్వయము గలుగఁ జెప్పఁబడియె. ఏలాగనిన:—తాన్=తాను. కుంభినీశతన్=భూమీశ్వరత్వముచేత. తగి. ముఖ్యరుచినెల్లన్=ప్రధానకాంతినంతయు. పరశిలీముఖకోటిపాలు చేసెన్=శత్రువులయొక్క బాణపరంపరలపాలు చేసెను. తాను రాజయ్యుఁ దనరాజశక్తినంతయు శత్రువుల యధీనము చేసె ననియర్థము. దిగ్గజవర్గము కుంభినీశతననఁగాఁ గరిణీపతిత్వముచేతఁ దనరినదనియు ముఖ్యరుచి యనఁగా ముఖమందుఁ బుట్టినచవిని, పరశిలీముఖకోటి యనఁగా శ్రేష్ఠమగు తుమ్మెదలగుంపు దాని యధీనము చేసిన దనియు భావము. తాన్=తాను. ధరాధీశతన్=భూపతిత్వముచేత. తనరి. శృంగము నెల్లన్=దొరతనమునంతయు. ఘనగండకాండసంకటమున్.—ఘన=ఘనము లగు; గండకాండ=ఉపద్రవపరంపరలచేత; సంకటమున్=సమ్మర్దమైనదానిఁగా. చేసెన్. అనియర్థము. కులాచలవర్గము. ధర=పర్వతములకు. అధీశతన్=అధిపతిత్వముచేత. తనరి. తనశిఖరము నెల్ల ఘనము లయిన (గండకాండ) స్థూలోపలములయొక్క సంఘములచే సంకట మగునట్లు చేసె నని భావము. తాన్ = తాను. భోగిరాజతన్.—భోగి=రాజులకు; రాజతన్=రాజత్వమును, రాజాధీశ్వరత్వము ననుట. తాల్చి. పదం బెల్లన్ = తన నివాసస్థానము నెల్లను. సాంద్రాహిభీతిజర్జరమున్.—సాంద్ర=దట్టమైన; అహిభీతిన్=శత్రుభీతిచేత. జర్జరమున్=శిథిలమైనదానిని. చేసెన్ అనియర్థము. శేషుండు (భోగిరాజతన్) సర్పరాజతను దాల్చినాఁడనియు తనపదమైన పాతాళమంతయు (అహిభీతిన్) సర్పభీతిచేత జర్జరమయినదనియు భావము. తాన్=తాను. భూమిదారతన్=భూపతిత్వమును. ధరియించి. పురమెల్లన్=పట్టణమంతయు. బహులదుష్కీర్తిదుర్భరమున్=అధికమగునపకీర్తిచేత దుర్భరముగాఁ జేసెననియర్థము, ఆదివరాహస్వామి భూమిదారమను నామమును వహించినాఁడనియు తనపురంబు దనశరీరము బహులమై దుష్టమగు బురదచేత వ్యాప్తము చేసినాఁడనియు భావము; వరాహములు బురదలోఁ దిరుగుట స్వభావము. గీతియందుఁ గ్రమముగా నన్వయము. అనుచున్=ఇట్లనుచు. ఇద్ధరణికాంత= ఈభూకాంత. కరిరాజిన్=దిగ్గజసంఘమును. గిరిరాజిన్ = కులాచలసంఘమును. ఆహరిపతిన్=ప్రసిద్ధుఁ డగుసర్పరాజైనయాదిశేషుని. కిరిపతిన్=వరాహాధిపతియైనయాదివరాహమును. నిరాకరించి = తిరస్కరించి. అరిభేదవైభవాంచితున్=శత్రువిదారణసంపదచే నొప్పుచున్నవానిని. అభీతున్=భయరహితుని. కీర్తిసంపన్నున్=కీర్తిమంతుని. నిన్నున్. మాధవక్షితిప=మాధవరాయ. చెందెన్. ఇందును గ్రమముగా నన్వయము తెలియందగినది. ఇందు శ్లేషోత్థాపితవ్యతిరేకాలంకారము యథాసంఖ్యాలంకారమును.

మ. భవదీయోగ్రచమూపరాగపటలాభ్రశ్రేణి యాదోనిధా
నవిమంబుల్ వడిఁ ద్రావ జన్యవసుధానవ్యోరుడోలాధిరూ

ఢవిపక్షక్షితినాథు నూఁచు బలఝూ◆టస్థేమ చిత్రంబు మా
ధవరాయేంద్ర త్వదీయహేతి వెలికిం◆ దార్చుఁ యశఃక్షీరమున్. 70

టీ. మాధవరాయేంద్ర. భవదీయోగ్రచమూపరాగ పటలాభ్రశ్రేణి.—భవదీయ= నీకుసంబంధించిన; ఉగ్రచమూ=ఉగ్రమగుసేనయొక్క; పరాగపటల = ధూళీపటలమనెడు; అభ్రశ్రేణి= మేఘపరంపర. యాదోనిధానవిషంబుల్ = సముద్రసంబంధి విషములను, జలముల ననుట. వడిఁ=వేగముగా. త్రావఁ=పానము సేయఁగా. బలఝూటస్థేమ=సైన్యసంఘసామర్థ్యము. జన్యవసుధానవ్యోరుడోలాధిరూఢ విపక్షక్షితినాథుఁ.— జన్యవసుధా=యుద్ధభూమి యనెడు; నవ్య = నూతనమును; ఉరు=గొప్పదియునగు; డోలా=ఉయ్యెలను; అధిరూఢ = అధిష్ఠించు; విపక్షక్షితినాథుఁ = శత్రురాజును. ఊఁచుఁ=ఊఁచును. త్వదీయహేతి = నీఖడ్గము. యశఃక్షీరముఁ = యశస్సనెడుపాలను. వెలికిం దార్చుఁ = వమనము చేయును, బయల్పఱచు ననుట. చిత్రంబు = ఆశ్చర్యము.

విషము ద్రావినవారిని పాలుద్రాపి యుయ్యలలో నుంచియూఁపగా వారు విషముతోడిపాలను గ్రక్కుట సహజమై యుండఁగా చమూపరాగము విషము ద్రావుటయు శత్రురాజు నూఁచుటయు ఖడ్గము పాలను కక్కుటయు చిత్రం బని భావము. మాధవరాయల సేనాపరాగము సముద్రముదాఁక వ్యాపించి జలము నింకునట్లు చేసినదనియు శత్రువు యుద్ధభూమిని బడిపోయినాఁ డనియు ఖడ్గము మిక్కిలిఖ్యాతిని ఘటింపఁ జేసినదనియు ఫలితార్థము. అసంగత్యలంకారము. "విరుద్ధం భిన్నదేశత్వం కార్యహేత్వో రసంగతిః। విషం జలధరైః పీతంమూర్ఛితాః పథికాఙ్గనాః" అని చంద్రాలోకలక్ష్యలక్షణంబులు. పరాగపటలాభ్రశ్రేణి, జన్యవసుధాడోలాయశఃక్షీరేత్యాదులందు రూపకము.

సీ. ముకుళితపాణు లై◆ వికవిక నగువారి
స్వీయాంకసంగతిఁ◆ జెంద నీదు,
తల నిల్పి కొనఁ బూని◆ తహతహ పడువారి
ననురాగయుక్తి డా◆యంగఁ బోవ,
దడుగు వెట్టఁగ లేక◆ వడఁకు చుండెడువారి
స్థిరమహాధారాప్తిఁ◆ జేర్పఁ జనదు,
తృణగర్భ మగుమోము◆ దెఱచు చుండెడువారి
నెద మీఱ ముఖ మంటఁ◆ గదియ దింత,

తే. మనుపదో మహాస్నానులఁ◆ జెనుపదో న
వీనకీర్తి సంతాన మిం◆ల్వీపుల నౌర
తావకీనాసిలక్ష్మి చి◆త్రప్రశస్తి
వితతగుణసాంద్ర మాధవ◆క్షితిమహేంద్ర. 71

ఈ పద్యమందు మాధవరాయాసిలక్ష్మిని బుత్రవతిఁగా నధ్యవసించి యర్థద్వయము గలుగఁ జెప్పఁబడియె. ఏలాగనిన:— ముకుళితపాణులై = మోడ్పుఁగేలులు గలవారై. వికవిక నగువారిక్ = కకవికనయ్యెడువారిని, పిడికిళ్లు మూసికొని వికవిక నగుట శిశుస్వభావము. స్వీయాంకసంగతిక్.— స్వీయ = తనసంబంధియైన; అంక = తొడయొక్క; సంగతిక్ = సంబంధమ్మును. చెంద నీదు= పొందనీదు. అతిబాల్యము గలవారై పిడికిలి పట్టుకొని వికవిక నగుశిశువుల నెత్తికొని తనతొడమీఁదఁ గూర్చుండఁబెట్టుకొన దని పుత్రవతీపరమైన యర్థము. ప్రణనిల్లుచు కకావికలు పడుచుండెడు శత్రువులను తనసమీపము నొంద నీదు అనఁగా నట్టివారిదగ్గఱకుఁ బోయి వారిని సంహరింప దని ఖడ్గపరమైనయర్థము. తల నిల్పికొనఁ బూని=తల నిల్పుటకుఁ బ్రయత్నించి. తహతహపడువారిక్ = సంతోషపడుచున్నశిశువులను ; అనురాగయుక్తిక్ = ప్రీతితోడ. డాయంగఁబోవదు = సమీపింపఁబోదు. తల్లనిల్పఁజాలక తహతహ పడుశిశువుల సమీపమునకుఁ బ్రీతితోఁ బో దని పుత్రవతీపరమైన యర్థము. యుద్ధములో శిరస్సు నిల్పుకొనవలె నని యనఁగా జీవింపవలె నని (తహతహపడు) త్వరపడుశత్రువులను (డాయంగఁబో దని యనఁగా నట్టివారిని) సంహరింప దని ఖడ్గపరమైన యర్థము. అడుగువెట్టఁగలేక వడఁకుచుండెడువారిక్ = నడచునంతవయస్సు లేకనడవఁబోయి వడకుచుండెడుబాలురను. స్థిరమహాధారాప్తిక్ = స్థిరమై గొప్పదియైన స్తంభాద్యాధారము యొక్క ప్రాప్తిని. చేర్పఁజనదు = చేర్చుటకుఁ బోవదు. నడవ నేరక లేచిపడుచున్నశిశువులను స్తంభాద్యాధారములు చేర్పఁజనదని పుత్రవతీపరమైనయర్థము. యుద్ధకాలమందుఁ బ్రాణభీతితో నడుగువెట్టఁజాలక యనఁగాఁబాఱిపో నుద్దేశించియు భీతితో బాఱఁజాలక కంపించువారిని, స్థిరమై యధికమైన (ధారా) అంచుయొక్క ఆప్తిని జేర్పంగఁజనదు,అనఁగా అట్టివారిని తెగనఱక దని ఖడ్గపరమైనయర్థము. తృణగర్భ మగు మోము దెఱచుచుండెడువారిక్ = అజ్ఞానముతో గడ్డిపోఁచలు నోటిలోఁ బెట్టుకొని తెఱచు చుండెడుబాలురను. ఎద మీఱఁగ్ = మనస్సు ఉప్పొంగఁగా. ముఖమంటక్ = ముఖము శోధించుట కనుట. కదియుదు=కదిసి గడ్డిపోఁచ దీయ దని పుత్రవతీపరమైన యర్థము. గడ్డి నోటఁగఱచుకొనినశత్రువులను భయము అతిశయించునట్లుగా సంహరింప దని ఖడ్గపరార్థము. జౌర. వితతగుణసాంద్ర. మాధవక్షితిమహేంద్ర. ఇవ్విపులక్ = ఈభూమియందు. తావకీనాసిలక్ష్మి = నీఖడ్గలక్ష్మి. మహస్సూనులక్ = ప్రతాపముప్రధానముగాఁ గలకుమారుల నని పుత్రవతీపరమైన యర్థము. సూర్యునివంటిప్రతాపములను అనిఖడ్గపర మైనయర్థము "సూనుః పుత్రేనుజే రవౌ" అని అమరశేషము. కీర్తిసంతానము = కీర్తియని స్త్రీత్వనిర్దేశమునఁ గీర్తియనెడునాఁడుబిడ్డలయొక్క సంతానము నని పుత్రవతీపరమైన యర్థము, కల్పవృక్షమువంటికీర్తి నని ఖడ్గపరార్థము. పెనుపదో = పెంపదో. చిత్రప్రశస్తి=అతిచిత్రము, అనఁగా తాను పుత్రులను గనుచుఁ బెంచుచు బెఱవారిబాలురు ముకుళితపాణులై వికవిక నగుచుండుట లోనగువ్యాపారములు సేయునెడ స్వీయాంకసంగత్యాదులను జేయకుంట యాశ్చర్యం బని స్త్రీపరమైన భావము. ఖడ్గము శరణాగతులను, ప్రాణత్రాణమునకై తహతహపడువారిని బరుగెత్తి పోవ నుద్దేశించి పోలేక వడఁకుచుండెడువారిని గడ్డిపోఁచ నోరఁ బెట్టుకొన్నవారిని సంహరింపదు. తక్కిననశత్రువుల నందఱను ధ్వంసము సేసిన దని ఖడ్గపరమైన భావము.

మ. ధరణిన్ మాధవరాయ తావకబలో♦ద్యద్రేణుపాళీకృతో
ద్ధురభావత్కమహోగ్నిబుద్ధి ప్రమ యై♦ తోఁపంగ నాన్వీక్షుకీ
వరు లవ్యాప్తము ధూళి తద్బలమునం♦ బాటిల్లు ధూమధ్వజా
కరధీ యప్రమ యంచు నెంచుట లిఁకం♦గైకొందురే యెంతయున్. 72

టీ. మాధవరాయ. ధరణిన్=భూమియందు. తావకబలోద్యద్రేణుపాళీకృతోద్ధురభావత్కమహోగ్నిబుద్ధి.—తావక=నీసంబంధియగు; బల=సైన్యమందు; ఉద్యత్=ఎగయుచున్న; రేణుపాళి=పరాగపంక్తిచేత; కృత=చేయఁబడిన; ఉద్ధుర=దట్టమైన; భావత్కమహోగ్నిబుద్ధి=నీసంబంధియైనప్రతాపాగ్నిజ్ఞానము. ప్రమ యై=యథార్థానుభవమై. తోఁపంగన్=తోఁచుచుండఁగా. ఆన్వీక్షుకీవరులు=తార్కికులు. ధూళి=పరాగము. అవ్యాప్తము=సాధ్యసమానాధికరణాత్యంతాభావప్రతియోగి. తద్బలమునన్=ఆసైన్యమందు. పాటిల్లుధూమధ్వజాకరధీ.—పాటిల్లు=ఉదయించు. ధూమధ్వజాకరధీ=వహ్ని విషయకజ్ఞానము. అప్రమ=అయథార్థజ్ఞానము, అనఁగా భ్రాంతిరూపజ్ఞానము. అంచున్ = ఇట్లనుచు. పలుకుటలు = వచించుటలు. ఇఁకన్=ఇఁకమీఁద. ఎంతయున్=మిక్కిలి. గ్రహింతురె=గ్రహింపరనుట; అతార్కికులుగా నున్నవారలు నీసైన్యరజస్సున్నచోట నీప్రతాపాగ్ని యుండునన్న విషయము అయథార్థముగాఁ దెలిసికొన్నను దర్కశాస్త్రపారీణులు తావకబలోద్యద్రేణురూపహేతువుచేత భవత్ప్రతాపాగ్నిజ్ఞానము యథార్థానుభవమై యుండఁగా ధూళి యవ్యాప్తము ప్రతాపాగ్నిజ్ఞానము భ్రమాత్మక మనుట యంగీకరింప రని తాత్పర్యము. అతిశయోక్తిసంకీర్ణానుమానాలంకారభేదము.

సీ. శారదనారద♦సాదృశ్యము వహించి, హంసమండలి నంద♦మందఁ జేయు
బుధవరప్రహ్లాద♦బోధకశ్రీఁ బూని, భూరిహారిచ్ఛాయఁ♦ బొలుపు మీఱు
సామోదపుండరీ♦కాఖండరుచిఁ గాంచి, సర్వజ్ఞమతికిఁ దో♦షము ఘటించు
ననుపమానఘనార్జు♦నాభిఖ్య నలరారి,పాండురాజవిభూతిఁ♦ బరిఢవిల్లు
తే. నందనందనపాదార♦విందభక్తి, వాసితాశ్రయ శ్రీమాధ♦వక్షితీశ
తావకఖ్యాతికాంతయ♦తాంతమగుని,జానుకూల్యంబు దెల్లమై♦యతిశయిల్ల.

టీ. నందనందనపాదారవిందభక్తివాసితాశ్రయ.—నందనందనపాదారవింద=శ్రీకృష్ణపాదపద్మములయొక్క; భక్తివాసిత=భక్తులకనుట; ఆశ్రయ=ఆశ్రయుఁడైన. శ్రీమాధవక్షితీశ=మాధవభూపాలుఁడా. తావకఖ్యాతికాంత=నీకీర్తికాంత. అతాంత మగునిజానుకూల్యంబు.—అతాంతమగు=అమ్లానమగు, అనఁగాప్రకాశించునదియనుట. నిజానుకూల్యంబు=స్వకీయానుకూల్యము. తెల్లమై=వ్యక్తమై. అతిశయిల్లన్=విజృంభించునట్టుగా. శారదనారదసాదృశ్యము=నూతనమగునారదమహర్షియొక్కసామ్యమును. "శారదః పీతముద్గే నా ప్రత్యగ్రేభినవే త్రిషు" అనిహలాయుధము. వహించి=పొందివి. హంసమండలిన్.—హంస=యతులయొక్క; మండలిన్=సమూహమును. హంస, పరమహంస, కుటీచక, బహూదకు లని యతులలో నాలుగుభేదములు. నందము=ఆనందమును. అందఁజేయున్=పొందఁజేయును. నారదమహర్షి సాదృశ్యము నొంది యతుల కానందమును జేయు ననియర్థము. శరత్కాలమేఘముయొక్కసాదృశ్యము వహించి

రాయంచలగుంపు నంద మందునట్లు చేయు ననిభావము. రాయంచలు వార్షుకమేఘమునకు వెఱచుటయు శారద మేఘమునకు సంతసించుటయుఁ గవికులప్రసిద్ధంబు. బుధవరప్రహ్లాదబోధకశ్రీఁ బూని.—బుధవరప్రహ్లాద=బుధశ్రేష్ఠుం డగుప్రహ్లాదునియొక్క; బోధకశ్రీఁ బూని= జ్ఞానసంపదనుబూని, ఇట బోధశబ్దముమీఁద స్వార్థమందు కప్రత్యయంబు. భూరిహరిచ్ఛాయన్.—భూరి = అధికమగు; హరిచ్ఛాయన్ = విష్ణుమూర్తియొక్కనీడచేత, పక్షపాతము చేత ననుట. పొలుపుమీఱున్ = ఒప్పుమీఱును. ప్రహ్లాదునిజ్ఞానసంపదను వహించి విష్ణుమూర్తిచ్ఛాయ నొప్పు ననియర్థము. బుధవరులయొక్క (అనఁగా పండితోత్తములయొక్క) ప్రహ్లాదమును బోధించు శ్రీఁ బూని సింహముయొక్కకాంతిచేత బొలుపుమీఱు ననిభావము. సామోదపుండరీకాఖండరుచి = సంతసముతోఁగూడినపుండరీకుఁ డనునొకవిష్ణుభక్తునియొక్కయఖండరుచిని గాంచి. సర్వజ్ఞమతికిఁ దోషము ఘటించుచున్ అనఁగా సర్వజ్ఞపదము యోగవృత్తిచే విష్ణుమూర్తిని బోధించును గాన విష్ణుమనస్సున కానందముఁ గలుగఁజేయు ననియర్థము. పరిమళముతోఁగూడినతెల్లదామరలకాంతి నొంది యీశ్వరునియొక్కమనస్సున కానందము ఘటించు ననిభావము. శివుఁడు పుండరీకప్రియుఁ డగుట స్పష్టము. అనుపమానఘనార్జునాభిఖ్య నలరారి = అసమానము ఘనము నైనయర్జునునియొక్కకాంతిచేత నలరారి. పాండురాజవిభూతిఁ బరిఢవిల్లున్ = పాండురాజుయొక్క యైశ్వర్యముతో నొప్పియుండు నని యర్థము. అర్జునాభిఖ్య నలరారినపుడు అతనితండ్రి యగుపాండురాజుయొక్కవిభూతితోఁ బరిఢవిల్లుట స్పష్టము. అనుపమానము ఘనము నగునట్టుగా (అర్జున మనఁగా) శుభ్రమైనది యని పేరు వొంది (పాండురాజ) తెల్లనిచంద్రునియొక్కవిభూతితోఁ బరిఢవిల్లు నని భావము. ఇట్లు నీవు నందనందనపాదారవిందభక్తివాసితుల కాశ్రయమై యున్నవాఁడవు కాన నీకీర్తియు నారద ప్రహ్లాద పుండరీకార్జునాదిపరమభాగవతోత్తములభంగి నలరి హంసాదుల కానంద మందఁజేయుచు నీయానుకూల్యవర్తనతో రాజిల్లు నని యభిప్రాయము. నీకీర్తి శరత్కాలమేఘాదులతోఁ దులదూఁగియున్నదని ఫలితార్థము. ఇందు శ్లేషసంకీర్ణోపమాలంకారము:

సీ. భూరిప్రకంపన•స్ఫూర్తి గ్రక్కున లేచి, పటుతరరథచక్ర•భంగ మూన్చి
పరమస్తకోద్దేశ•పదవికి నెగఁబ్రాఁకి, తద్ఘనాఖ్యామృత•ధారఁ గ్రోలి
యతనుసంగరమాప్తి•యంటువాయఁగఁ జేసి, యాత్మైకచింతనా•యతిఁ దవిల్చి
యచలయోగక్షేమ • మలవడఁగాఁ దీర్చి, కన్నులనీ రొల్కఁ•గా ఘటించి
తే. సురుచిరాహారముల్ మాన్చి • పరమశక్తి
భవదసిభుజంగి జటిలతా•పదవిహార
విభవములఁ గూర్చెఁ బరహంస•వితతి కెల్లఁ
దనర మాధవరాయ స•త్సాంపరాయ. 74

టీ. సత్సాంపరాయ = న్యాయ యుద్ధముగల. మాధవరాయ = మాధవ ప్రభుపుంగవుఁడా. తనరన్ = ఒప్పునట్లు. పరమశక్తి భవదసిభుజంగి=పరమశక్తిస్వరూప మగునీయసి

యనెడు కుండలిని. పరహంస వితతి కెల్లన్ = శత్రుశ్రేష్ఠసంఘమున కెల్లను, అని ఖడ్గపరమైనయర్థము, శ్రేష్ఠులగుయతులయొక్క సంఘమున కెల్ల నని కుండలినీశక్తిపర మైనయర్థము. భూరిప్రకంపనస్ఫూర్తిన్.—భూరి = అధికమగు; ప్రకంపన=చలనముయొక్క; స్ఫూర్తిన్=ప్రకాశముచేత. గ్రక్కున లేచి=వేగముగ లేచి. పటుతర రథచక్రభంగమూన్చి.—పటుతర = దృఢతరములైన; రథ= స్యందనములయొక్క; చక్ర=కండ్లయొక్క; భంగమూన్చి= భంగము సేసి, అని ఖడ్గపర మైన యర్థము. అధిక మగుప్రాణాయామ నిబద్ధవాయువుయొక్క స్ఫూర్తిచే గ్రక్కున లేచి దృఢతరదేహసంబంధి మూలాధారాదిచక్రముల యొక్క భంగమూన్చి యని శక్తిపరమైన యర్థము. పరమస్తకోద్దేశపదవికిన్.— పర = శత్రువులయొక్క; మస్తకోద్దేశపదవికిన్ = శిరస్స్థానమునకు. ఎగఁబ్రాఁకి= ఎక్కి. తద్ఘనాఖ్యామృతరసమున్.—తత్ = ఆశత్రువులయొక్క; ఘన = అధికమగు; ఆఖ్యా = యశమనెడు; అమృతరసమున్ = సుధారసమును. గ్రోలి=పానముచేసి, అని ఖడ్గపర మైనయర్థము. ఉత్కృష్ట మగుశిరస్స్థానమున కెక్కి ప్రసిద్ధమగు ఘన మను పేరుగలిగిన సహస్రారసుధను గ్రోలి యని శక్తిపర మైన యర్థము. అతను సంగరమాప్తి యంటున్.—అతను. అధికమగు. సంగర = యుద్ధసంబంధినియైన; మా=లక్ష్మియొక్క; ఆప్తి = ప్రాప్తియొక్క; అంటు = సంపర్కమును. పాయఁగఁజేసి= లేకుండఁజేసి. ఆత్మైకచింతనాయతిన్.—ఆత్మ = తనయొక్క, అనఁగా ఖడ్గముయొక్క; ఏక = ముఖ్య మగు; చింతనా = స్మరణముయొక్క; ఆయతిన్ =అతిశయమును; తవిల్చి = కూర్చి, అని ఖడ్గపర మైన యర్థము. అధికమైన సంగముయొక్క రమయొక్క ఆప్తిని లేకుండఁజేసి బ్రహ్మముయొక్క ముఖ్య మగుధ్యానాతిశయము ఘటింపఁజేసి యని శక్తిపరమైనయర్థము. అచలయోగస్థేమము.—అచల = పర్వతములయొక్క; యోగ = సాంగత్యమందలి; స్థేమము=స్థైర్యమును. అలవడఁగాఁదీర్చి = తగునట్లుగాఁజేసి. కన్నుల నీరొల్కఁగా ఘటించి = దుఃఖముచేతఁ గన్నులనీ రొల్కునట్లు చేసి యని ఖడ్గపరమైనయర్థము. చలింపని యోగమందు స్థైర్యమును తగునట్లొనరించి యానందముచేతఁగన్నులనీరొలుకునట్లు చేసి యని శక్తిపరమైన యర్థము. సురుచిరాహారములు మాన్పి = మనోహర మగునాహారములు మానునట్లుచేసి, అరణ్యవాసముచేత శత్రురాజులకు యోగులకును ఫలమూలాదులే యాహారంబులు గావున రెంటి నిదే యర్థము. జటిలతాపద విహారవిభవములన్.—జటి=జువ్విచెట్లయొక్క "ప్లక్షో జటీ పర్కటీస్యాత్" అని అమరుఁడు. లతా=తీవెలయొక్క; పద = స్థానములయందలి; విహార = విహరణముయొక్క; విభవములన్ = సంపదలను. కూర్చెన్ అని ఖడ్గపర మైన యర్థము. జటిలతా = జటాధారిత్వమనెడు; పద = చిహ్నముచేత; విహారవిభవముల నని శక్తిపర మైన యర్థము.

మాధవరాయలవారిఖడ్గము గ్రక్కున లేచి శత్రురాజుల రథచక్రాదులను భంగము చేసి వారితలపై కెక్కి వారియశంబును గొని యనఁగా వారి నోడించి ఖ్యాతి గాంచి వారలు యుద్ధలక్ష్మి చింతపోయి తనచింతయే ముఖ్యముగాఁ గలిగి యరణ్యములపాలై దుఃఖముతోఁ గన్నీరొలుకఁగా పుష్పాద్యాహారము లేక వృక్షలతాగుల్మాదిప్రదేశములలోఁ జేరునట్లు

చేసె ననియు, నది సూడఁగా రౌరాగాభ్యాసము సేయువారలమూలాధారనిలయ యగుకుండ లిని యనుశక్తి ప్రాణాయామనిబద్ధవాయువుచే గ్రక్కున లేచి మూలాధారాదిచక్రభంగ మొనర్చి శిరస్థానమందు సహస్రారసుధను గ్రోలి సర్వసంగపరిత్యాగము బ్రహ్మానుసంధాన ము గలుగఁజేయుచు నిశ్చలయోగముతో సానందబాష్పము లొల్కఁగా వార లాహారములు మాని జటాధారులై యడవులలో విహరించునట్లు చేసినభంగి నున్న దనియు భావము. ఇందు శ్లిష్టపరంపరితరూపకాలంకారము.

తే. విబుధశిక్షితుఁడవు శాస్త్రవిదుఁడ వఖిల
కావ్యవేదివి ఘనతార్కికవ్యవహృతి
నెఱుఁగుదువు నీ కసాధ్యమే యింపు మీఱఁ
గృతి వినిర్మింపుము మాధవక్షితిప యనిరి. 75

టీ. మాధవక్షితిప. నీవు విబుధశిక్షితుఁడవు, అఖిలకావ్యవేదివి, ఘనమైతర్కశాస్త్రి సంబంధియైన వ్యవహారము నెఱుఁగుదువు, నీకుఁ బుండరీకాక్షునిదేశానుసారముగఁ గృతి నిర్మించుట యసాధ్యంబు గాదు గాన నింపుమీఱఁ గృతి నిర్మింపు మని బుధజనంబు లమందానంద కందళితహృదయారవిందులై యని రని పూర్వము వ్రాసినవచనముతో నన్వయము.

వ. అనిన నేను బరమానందకందళితహృదయారవిందుండనై. 76

షష్ఠ్యంతములు.

క. భాషాధిపశేషాహిప, భాషాభూషాయితాత్మపటుగుణతతికిన్
దోషాచరదోషాచర, దోషాచరచక్రకలితదోర్బలభృతికిన్. 77

టీ. భాషాధిపశేషాహిపభాషా భూషాయితాత్మపటుగుణతతికిన్.—భాషాధిప = బ్రహ్మ యొక్కయు; శేషాహిప = ఆదిశేషునియొక్కయు; భాషా=వాణికి; భూషాయిత = అలంకార ప్రాయమగు; ఆత్మ = తనయొక్క; పటు=శ్రేష్ఠములగు; గుణ = అనంతకల్యాణగుణములయొక్క; తతికిన్ = సమూహముగలవానికి. దోషాచరదోషాచరదోషాచరచక్రకలితదోర్బలభృతికిన్.—దోష=పాపములను; ఆచర=మిక్కిలి ఆచరించుచున్న; దోషాచర=రక్కసులయొక్క; దోషా = భుజములకు "దోర్దోషాచ భుజా బాహుః" అని హలాయుధనిఘంటువు; చర=ఖండించెడు; చక్ర=సుదర్శనముచేత; కలిత= ఒప్పుచున్న; దోర్బల=బాహుబలముయొక్క; భృతికిన్=భరణముగలవానికి. దీని కర్పితముగ నొనర్తు ననుదానితో నన్వయము. ముందు నిట్లు చూడవలయు.

క. కోపాయితపాపాయత, భూపాయితదనుజమథనపూజితమతికిన్
గోపాలనగోపాలన, గోపాలననిబిడరతికి గోహితకృతికిన్. 78

టీ. కోపాయిత పాపాయత భూపాయిత దనుజమథన పూజితమతికిన్.—కోప= కోపముచేత; అయిత = పొందఁబడిన "అయగతౌ" అనుధాతువు మీఁద క్తప్రత్యయము; పాప = పాతకముల చేత; ఆయత = అధికులగు; భూపాయిత = రాజులవలె నాచరించుచున్న; దనుజ = రాక్షసులయొక్క; మథన = నాశనముచేత; పూజిత = శ్లాఘ్యమైన;

మతికిన్ = బుద్ధిగలవానికి. గోపాలన గోపాలనగోపాలననిబిడరతికిన్.—గోప=రాజులకు; గొల్లలకు "గోపాశ్చ గోపాశ్చ గోపాః" అని యేకశేషము; అలన = అలంకారకరమగు; గోపాలన = భూపాలనమందు; గోపాలన = గోవులపాలనమందు; నిబిడ=దట్టమైన; రతికిన్ = ఆసక్తిగలవానికి. గోహితకృతికిన్.—గో = స్వర్గమునకు; హిత = అనుకూలమగు; కృతికిన్=వ్యాపారముగలవానికి "స్వర్గేషు పశువాగ్వజ్రదిఙ్నేత్రఘృణిభూజలే । లక్ష్యదృష్ట్యా స్త్రియాంపుంసి గౌః" అని యమరుఁడు.

క. కమలాసజనకనాభికిఁ, గమలన్మోహాంధతమసకమలాంకునకుం
గమలాలయకమలాలయ, కమలాలయశయనభృతికిఁ గాంతాకృతికిన్. 79

టీ. కమలాసజనకనాభికిన్. — కమలాస = బ్రహ్మకు; జనక = ఉత్పాదకమగు; నాభికిన్ = నాభిగలవానికి. కమలన్మోహాంధతమస కమలాంకునకున్.—క=ఆత్మకు; మలత్=పాతకమువలె నాచరించుచున్న; మోహ = అజ్ఞానమనెడు, అంధతమస = కటికిచీకటికి; కమలాంకునకున్=మృగాంకునకు. కమలాలయ కమలాలయ కమలాలయశయనభృతికిన్.—కమల = లక్ష్మీదేవికి; ఆలయ = స్థానమగు; కమలాలయ = సముద్రముయొక్క; కమల = ఉదకమందు; అలయ = వినాశములేనట్టు; శయన = శయనముయొక్క; భృతికిన్ = భరణముగలవానికి. కాంతాకృతికిన్ = మనోహరాకారముగలవానికి.

క. శరణాగతపరిరక్షణ చరణప్రవణాత్మచిత్తసరసీజునకున్
నరకాహితనరకాహిత, నరకాహితబాణతతికి నరసారథికిన్. 80

టీ. శరణాగతపరిరక్షణచరణప్రవణాత్మచిత్తసరసీజునకున్.— శరణాగత = శరణమును బొందినవారియొక్క; పరిరక్షణ = పాలనముయొక్క; చరణ = ఆచరణమందు; ప్రవణ = అభిముఖమైన; ఆత్మ = తనయొక్క; చిత్త = మానసమనెడు; సరసీజునకున్= కమలము గలవానికి. నరకాహిత నరకాహిత నరకాహిత బాణతతికిన్.—నరక = నిరయమునకు; అహిత = శత్రువులగు, అనఁగాఁ బుణ్యాత్ములగు; నరక=నరులకు; స్వార్థమందు కప్రత్యయము. అహిత = అహితుఁడగు; నరక = నరకాసురునకు; అహిత = విరోధులగు, బాణతతికిన్=బాణములయొక్క సముదాయము గలవానికి. నరసారథికిన్ = అర్జునసారథికి.

క. శ్రీవాసజ్జటప్రోలీ, భావుకపత్తనవిహారపటుశీలునకున్
గోవర్ధన గోవర్ధన, గోవర్ధనవృష్టివ్యాతికి గోపాలునకున్. 81

టీ. శ్రీ వాసజ్జట ప్రోలీభావుకపత్తన విహారపటుశీలునకున్.—శ్రీ=లక్ష్మీదేవికి; వాసత్ = నివాసమువలె నాచరించు; జటప్రోలీ = జటప్రోలనెడు; భావుక = భవ్యమగు; పత్తన = పురియందు; విహార = విహారమందు; పటు = సమర్థమైన; శీలునకున్ = స్వభావముగలవానికి. గోవర్ధన గోవర్ధన గోవర్ధనవృష్టివ్యాతికిన్ = గోవర్ధన=ఆవుల వృద్ధిబొందించెడు; గోవర్ధన = గోవర్ధన పర్వతముయొక్క; గో = భూమికి; 'సమాసాన్తవిధి రనిత్యః' అనుటచేత

సమాసాంతప్రత్యయము రా దయ్యె; వర్ధన = నాశక మగు; వృష్టి = వర్షముయొక్క; హృతికిన్ = హరణము గలవానికి. గోపాలునకున్ = మదనగోపాలస్వామికి.

వ. అర్పితంబుగా నాయొనర్పం బూనినచంద్రికాపరిణయం బనుమహాప్రబంధంబునకుం గథాక్రమం బెట్టి దనిన. 82

ఉ. శ్రీ నిరు వొంది నైమిశము ♦ చెన్నగు నందు నిజామలాశయా
లానదృఢావబద్ధకమ♦లావరదంతులు శౌనకాదిమా
నీనులు సూతజుం బలికి ♦ యేనృపుఁ డేలె ధరన్ నిరీతిగా
నానృపుఁ దెల్పు మన్న నతఁ ♦ డాయతకౌతుకపూరితాత్ముఁ డై. 83

టీ. నైమిశము = నైమిశారణ్యము. శ్రీన్ = శోభావిశేషముచేత. ఇరు వొంది = స్థిరత నొంది. చెన్నగున్ = ప్రకాశించును. అందున్ = ఆయరణ్యమందు. నిజామలాశయాలానదృఢావబద్ధకమలావరదంతులు.—నిజ = స్వకీయ మై; అమల = స్వచ్ఛమైన; ఆశయ= హృదయ మనెడు; ఆలాన = బంధస్తంభమందు; "ఆలానం బన్ధస్తంభే" అని యమరుఁడు: దృఢ = స్థిరమానట్లు; అవబద్ధ = కట్టఁబడిన; కమలావర = విష్ణుమూర్తియనెడు; దంతులు=గజము గలవారలు. శౌనకాదిమానీనులు = శౌనకాది మునిరాజులు. సూతజున్ = సూతునిఁ గూర్చి. పలికిరి=వచించిరి. ఏనృపుఁడు = ఏరాజు. ధరన్=భూమిని. నిరీతిగాన్= ఈతిబాధారహిత మగునట్టుగా. ఏలెన్ = పాలించెను. ఆనృపున్ = ఆరాజును. తెల్పుమన్నన్. అతఁడు. ఆయతకౌతుకపూరితాత్ముఁ డై = విస్తారమైనకౌతుకముచే నిండినహృదయము గలవాఁ డై. పలికెన్ అని యుత్తరపద్యస్థక్రియతో నన్వయము. ఇందశ్లిష్టపరంపరిత రూపకము. "శ్లో. తత్పరం పరితం శ్లిష్టే వాచకే భేదభాజి వా" అని కావ్యప్రకాశమందుఁ దల్లక్షణము.

శా. సారాక్షీణకలాకలాపనిధి యై ♦ చక్రప్రియంభావుక
శ్రీరమ్యాకృతి యై దినేశకులల♦క్ష్మీమూల మై యిద్ధరా
భారం బూనె సుచంద్రసంజ్ఞ నొకభూ♦పాలాగ్రగణ్యుండు త
చ్చారిత్రంబు వచింతు నంచుఁ బలికెన్ ♦ జంచద్వచోవైఖరిన్. 84

టీ. ఒకభూపాలాగ్రగణ్యుండు=ఒకరాజశ్రేష్ఠుండు. సారాక్షీణకలాకలాపనిధి యై.—సార=శ్రేష్ఠ మగు; అక్షీణ = తక్కువగాని; కలా = చతుష్షష్టివిద్యలయొక్క, షోడశకలలయొక్క యని యర్థాంతరము; కలాప = సమూహమునకు; నిధి యై = నివాస మై. చక్రప్రియంభావుక శ్రీరమ్యాకృతియై.—చక్ర = రాష్ట్రములకు, జక్కవలకు; ప్రియంభావుక = ప్రియమగు; శ్రీ = సంపదచేత, కాంతిచేత; రమ్య = రమ్యమగు; ఆకృతియై= ఆకృతి గలవాఁ డై. దినేశకులలక్ష్మీమూల మై.— దినేశ = సూర్యునియొక్క; కుల = వంశముయొక్క;

దినేశ = సూర్యులయొక్క, ద్వాదశాదిత్యులయొక్క యనుట; కుల = సమూహముయొక్క; లక్ష్మీ = సంపదకు, కాంతికి; మూలమై = ఆధారమై. సుచంద్రసంజ్ఞన్ = సుచంద్రుం డను పేరిచేతను, సమీచీన మైనచంద్రుం డను పేరిచేత నని యర్థాంతరము. అనఁగాఁ బ్రసిద్ధ చంద్రుండు క్షీణకలాకలాపనిధియు, చక్రవాకాప్రియకారి శ్రీరమ్యుండు, దినేశమూలక లక్ష్మియు నగువాఁడు; ఈరాజో అక్షీణకలాకలాపనిధి, చక్రప్రియంభావుక శ్రీరమ్యాకృతి, దినేశకులలక్ష్మీమూలము, కావున మంచిచంద్రుఁ డనుపేరిచేత నని యాశయము. ఇద్ధరాభారంబు = ఈ భూభారమును. ఊనెన్ = వహించెను. తచ్చారిత్రంబు = ఆ సుచంద్ర నరేంద్రుని చరితమును. వచింతు నంచున్=చెప్పుదు ననుచు. చంచద్వచోవైఖరిన్=ప్రకాశించుచున్న వాగ్వైఖరిచేత. పలికెన్ = వాక్రుచ్చెను.

ఇటఁ బ్రసిద్ధచంద్రాధిక్యము సుచంద్రనరేంద్రునియందుఁ దోఁచు చున్నది గాన యుపమేయాధిక్యపర్యవసాయిశ్లేషోత్థాపితవ్యతిరేకాలంకారము. “శ్లో. వ్యతిరేకో విశేష శ్చే దుపమా నోపమేయయోః” అని తల్లక్షణము.

సీ. వరగుణసన్మణి♦వ్రాతసంలబ్ధిచే, శ్రితమహీభృద్వర్య♦వితతిచేత
విచరద్ఘనాఘన♦ప్రచయవిస్ఫూర్తిచే, విమలచక్రిప్రచా♦రములచేతఁ
బటువేగవన్మహా♦భంగకాండములచే, ఘనవాహినీసము♦త్కరము చేత
సాంద్రనానావన♦చక్రసంప్రాప్తిచే, నసమరాజీవనే♦త్రాళిచేత

తే. నలరులచ్చికిఁ బుట్టిని♦ల్లన నసర్ఘ్య, శైలరిపునీలమయసాల♦సామజేంద్ర
కలితసితపద్మకచ్చంద్ర♦కామినీక, లాపరుచిరంబు శ్రీవిశా♦లాపురంబు. 85

టీ. ఈపద్యమందు విశాలాపుర విషయక మైనయర్థము, సముద్రపర మైనయర్థాంతరముం దోఁచుచున్నది. ఏ లాగనిన:— అనర్ఘ్యశైలరిపునీలమయ సాలసామజేంద్రకలితసితపద్మకచ్చంద్ర కామినీకలాప రుచిరంబు.— అనర్ఘ్య = అమూల్యము లగు; శైలరిపునీలమయ = ఇంద్రనీలమణిమయము లగు; సాల = ప్రాకారములయందలి; సామజేంద్ర = గజశ్రేష్ఠములయందు; కలిత = ఒప్పుచున్న; సిత = తెల్లనైన; పద్మకత్ = బిందుజాలక మనఁగా నేనుఁగులపై నున్న తెల్లనిచుక్కలు, వానివలె నాచరించుచున్న; చంద్రకామినీ = నక్షత్రములయొక్క; కలాప = సంఘముచేత; రుచిరంబు=మనోహరమగు. శ్రీవిశాలాపురంబు= సంపద్యుక్త మైనవిశాలానగరము. వరగుణసన్మణివ్రాతసంలబ్ధిచేన్.— వరగుణ = శ్రేష్ఠ గుణములుగల; సన్మణి = పండితోత్తములయొక్క; వ్రాత=సంఘముయొక్క; సంలబ్ధిచేన్= ప్రాప్తిచేతను, శ్రేష్ఠము లగుగుణములుగలమంచిమణులయొక్క సంఘప్రాప్తిచేతనని సముద్రపర మైనయర్థము. శ్రితమహీభృద్వర్య వితతి చేతన్.—శ్రిత=ఆశ్రయించిన; మహీభృద్వర్య=రాజ శ్రేష్ఠులయొక్క; వితతి చేతన్=గుంపు చేత, ఆశ్రయించిన పర్వతముల గుంపు చేత నని సముద్రపర మైనయర్థము. విచరద్ఘనాఘన ప్రచయవిస్ఫూర్తిచేన్.—విచరత్=మిక్కిలిచరించుచున్న;

ఘనాఘన=మదపుటేనుఁగులయొక్క; ప్రచయ=సమూహముయొక్క; విస్ఫూర్తిచేన్=ప్రకాశముచేతను, చరించుచున్నవర్షించునట్టిమేఘముల సమూహముయొక్క విస్ఫూర్తిచేత నని సముద్రపరమైనయర్థము. విమలచక్రిప్రచారములచేతన్.—విమల=నిర్మలములగు; చక్ర=రథములయొక్క; ప్రచారములచేతన్ = సంచారములచేతను, నిర్మలమైనవిష్ణుమూర్తియొక్క సంచారములచేత నని యర్థాంతరము. పటువేగవన్మహాభంగకాండములచేన్.— పటు=సమర్థములై; వేగవత్=వేగయుక్తములై; మహాత్ = గొప్పలై; అభంగ=అప్రతిహతములైన; కాండములచేన్=అశ్వములచేత,అతివేగముగల గొప్పతరఁగలగుంపుచేత నని యర్థాంతరము; "కాణ్డో స్త్రీదణ్డబాణార్వవర్గావసరవారిషు" అనియమరుఁడు. ఘనవాహినీసముత్కరముచేతన్.—ఘన=అధికమైన; వాహినీ=సేనలయొక్క; సముత్కరముచేతన్=సముదాయముచేత,అధికములైననదీసంఘములచేత నని యర్థాంతరము. సాంద్రనానావనచక్రసంప్రాప్తిచేన్.—సాంద్ర=దట్టములైన; నానా=అనేకప్రకారములగు;వన=ఉద్యానవనములయొక్క;చక్ర=సంఘములయొక్క;సంప్రాప్తిచేన్=లాభముచేతను,సాంద్రములైయనేకవిధములైనజలావర్తముల ప్రాప్తిచేత ననియర్థాంతరము. అసమరాజీవనేత్రాళిచేతన్.—అసమ=అసమానలగు;రాజీవనేత్రా=స్త్రీలయొక్క; ఆళిచేతన్=గణముచేత; అసమానమైన (రాజీవనేత్ర)మీనశ్రేష్ఠములయొక్కగణముచేత నని యర్థాంతరము, "రాజీవశ్శకులస్తిమిః" అనియమరుఁడు. లచ్చికిన్=లక్ష్మీదేవికి; పుట్టినిల్లనన్=జన్మస్థానమనఁగా, సముద్రమన్నట్లుగా. అలరున్=ఒప్పును. ఇట సంబంధాతిశయోక్తి శ్లేషోత్ప్రేక్షాలంకారములు గలుగు.

సీ. వరణాబ్జరాగభా•వ్యాజబాలాతపా, నిశజృంభితవియద్ధు•నీసలిలము
సౌధవజ్రచ్ఛవి•చ్ఛలచంద్రికావియో, జితలేఖకేళివే•శ్మతలసరము
స్వస్తికనీలత్వి•షామిషఘనదత్త, కేకాస్వనస్వన•త్కృతకనగము
రథ్యావలభితార్క్ష్య•రత్నశోభాకూట, యువనార్పితామోద•కార్కరథము

తే. భర్మకేతుపటాంచల•పవనగళద, నంతకుహనమధురసాఘ•లాళిఖాద
నాశయోత్పతదతులకీ•రాభిరామ,గోపురము మించు నిల విశా•లాపురంబు.

టీ. వరణాబ్జరాగభావ్యాజబాలాతపానిశజృంభితవియద్ధునీసలిలము.—వరణ=ప్రాకారములయొక్క "ప్రాకారో వరణస్సాలః" అని యమరుఁడు; అబ్జరాగ=పద్మరాగమణులయొక్క; భా = కాంతియనెడు; వ్యాజ = నెపముగలిగిన; బాలాతప = లేయెండచేత ; అనిశ=ఎల్లప్పుడు; జృంభిత=వికసింపఁజేయఁబడిన; వియద్ధునీ=స్వర్గంగయందలి; సలిలము=జలముగలది,అనఁగా లక్షణచేత సురనదీజలగతపద్మములు బోధితములగుచున్నవి గాన యెల్లపుడు వికసింపఁజేయఁబడిన వియద్ధునీసలిలగతపద్మములు గల దని యాశయము. సౌధవజ్రచ్ఛవిచ్ఛలచంద్రికావియోజితలేఖకేళివేశ్మతలసరము.— సౌధ = మేడలయొక్క; వజ్ర = వజ్రములయొక్క; ఛవి=కాంతి యనెడు; ఛల=వ్యాజముగల; చంద్రికా=వెన్నెలచేత; వియోజిత=

ఎడఁబాటుగలదిగాఁజేయఁబడిన ; లేఖ = దేవతలయొక్క ; కేళివేశ్మ = క్రీడాగృహముల యొక్క; తల = ప్రదేశములయందలి; సరము= సరస్సులుగలది. అనఁగా సరోగతచక్రవాకములు గల దనిలక్షణచేత నర్థము చేయవలయు. స్వస్తికనీలత్విషామిషఘనదత్తకేకాస్వనస్వనత్కృతకనగము.—స్వస్తిక=సౌధవిశేషములయొక్క "స్వస్తిక స్సర్వతోభద్రః" అనియమరుఁడు; నీల = ఇంద్రనీలమణులయొక్క ; త్విషా = కాంతియనెడు ; మిష = నెపముగల; ఘన=మేఘముచేత; దత్త=ఇయ్యఁబడిన; కేకాస్వన = కేక యనుధ్వనిచేత; స్వనత్ = ధ్వనిచేయుచున్న, అనఁగాఁ గేకాభిన్నస్వనముచేయు చున్నయనుట; కృతకనగము=కృత్రిమపర్వతములు గలది. ఇచటను బూర్వరీతిగఁ గృతకనగస్థమయూరములు గల దనిలాక్షణికార్థము చేయవలయు. రథ్యావలభితార్క్ష్యరత్నశోభాకూటయవసార్పితామోదకార్కరథము.—రథ్యా=రాజవీథులయందున్న; వలభి= చంద్రశాలలయొక్క ; తార్క్ష్యరత్న= గరుడపచ్చలయొక్క; శోభా= కాంతియనెడు; కూట=కపటముగల; యవస = పచ్చికయందు; అర్పిత= ఉంపఁబడిన; ఆమోదక = సంతసముగల; అర్కరథము = సూర్యరథము గలది, అనఁగాఁ బూర్వరీతిగ సూర్యరథాశ్వములు గల దని యర్థము. భర్మకేతుపటాంచలపవనగళదనంతకుహనమధురసాఫలాళిఖాదనాశయోత్పతదతులకీరాభిరామగోపురంబు.— భర్మ = స్వర్ణమయములగు; కేతు=టెక్కెములయొక్క ;పటాంచల=వస్త్రాగ్రభాగముయొక్క; పవన = వాయువుచేత; గళత్=జాఱుచున్న; అనంత=ఆకాశమనెడు, అనఁగాఁ బూర్వరీతిగా లక్షణచే నాకాశస్థనక్షత్రము లనెడు అని యర్థము; కుహన=కాపట్యముగల; మధురసాఫల= ద్రాక్షాఫలములయొక్క ; ఆళి=బంతియొక్క; ఖాదన=భక్షణమందు ; ఆశయ = అభిప్రాయముచేత; ఉత్పతత్ = మీఁది కెగయుచున్న ; అతుల = సాటి లేని ; కీర = చిలుకలచేత ; అభిరామ=ఒప్పుచున్న; గోపురంబు = పురద్వారముగలదియునై. విశాలాపురబు. ఇలన్=భూమియందు. మించున్=అతిశయించును.

ఇట వియద్ధునీసలిలలేఖకేళివేశ్మతలసరఃకృతకనగార్కరథానంతములకు శాలాతపానిళవికసన చంద్రికావియోజన ఘనదత్త కేకాస్వన యవసార్పితామోద పటాంచలపవనపతనములు సంభవింపమి లక్షణావృత్తి నాశ్రయించి తద్గతము లగుపద్మాదులు చెప్పఁబడియె. లక్షణయనఁగా శబ్దవృత్తులలో నొక్కటి. శబ్దవృత్తులు శక్తి లక్షణ వ్యంజన యని మూఁడు. వీనిస్వరూపములు భేదములు "శ్లో. సామన్తనగరాణ్యుచ్చై రాక్రోశన్తి సమన్తతః" ఇది లోనగు లక్ష్యములు ప్రతాపరుద్రీయాదులయందు విస్తరముగ నిర్ణయింపఁబడిన వనియు,నిట వ్రాయుటయనవసర మనియు,సంక్షేపింపఁబడియె. అలంకారములిందుఁగైతవాపహ్నుతి సంబంధాతిశయోక్తిభేదములు.

చ. కలిమినెలంతకై నలువ ♦ గాంచినమేటివిచిత్రశక్తి రా
జిలఁ బరరాజభీకరతఁ ♦ జె న్నలరన్ సృజియించినట్టియు
జ్జ్వలజలజంబు నాఁగఁ బురి ♦ వజ్రమణీవరణం బగత్త యు
న్కొలఁకున నొప్పఁ దేఁటిసొబ♦గుం గని పైగగనంబు దోఁపఁగన్. 87

టీ. నలువ=బ్రహ్మదేవుండు. కాంచినమేటివిచిత్రశక్తి రాజిలన్ =అభ్యసించియుత్కృష్టమై యాశ్చర్యకర మగుసామర్థ్యము ప్రకాశించునట్టుగా. పరరాజభీకరతన్ = శత్రురాజభీకరతచేత, శ్రేష్ఠ మగుచంద్రునకుభీకరతచేత. చెన్నలరన్ = ఒప్పునట్టుగా. కలిమిచెలంతకై = లక్ష్మీదేవికై. సృజియించినట్టియుజ్జ్వలజలజంబునాఁగన్ = రచియించినప్రకాశమానమగు పద్మమనునట్లుగా. పురిన్ = పట్టణమునందు. వజ్రమణీవరణంబు=వజ్రమణిరచితమగుప్రాకారము. అగడ్త యనుకోలఁకునన్ =అగడ్త యనుకొలనియందు. పైగగనంబు = మీఁదియాకాశము. తేఁటిసొబగుంగని=తుమ్మెదయందము నొంది. తోఁపఁగన్ =తోఁచుచుండఁగా. ఒప్పున్ =ఒప్పును. ఇందుత్ప్రేక్షాలంకారము.

మ. పురసాలంబు నిజాఖ్యపెంపు గననో ♦ భూరిప్రవాళాప్తము
న్వరనీలాళిసమావృతంబు పరిఖా♦నవ్యాలవాలామృతాం
తరసందృశ్యము నై చెలంగుఁ బొగ డొం♦దన్ దానిపెంగొమ్మల
బ్బురమై రాజపతంగయోగకలనం♦బుల్ రేవగల్ గాంచుటన్. 88

టీ. పురసాలంబు = విశాలాపురియొక్క కోట. నిజాఖ్యపెంపు గననో = తనపేరుగలదానియొక్క, అనఁగా సాలవృక్షముయొక్క అతిశయము గనుటకో. భూరిప్రవాళాప్తమున్ = అధిక మగుచిగురుటాకులను బొందినదియు, అనఁగా సువర్ణమును బగడములను బొందినదనుట. "భూరి ప్రాజ్యసువర్ణయోః" అని విశ్వము. వరనీలాళిసమావృతంబు=శ్రేష్ఠములయి నీలము లయినతుమ్మెదలచేతఁ జుట్టుకొనఁబడినదియు,అనఁగా శ్రేష్ఠమైన యింద్రనీలమణులగుంపుచేత నావరింపఁబడిన దనుట. పరిఖానవ్యాలవాలామృతాంతరసందృశ్యము నై.— పరిఖా = అగడ్త యనెడు; నవ్య = నూతనమగు; 'ఆలవాల = పాదుయొక్క; అమృతాంతర = జలాంతరమందు; సందృశ్యము నై = కనిపించునదియై. దానిపెంగొమ్మలు = దానిపెద్దశాఖలు, ఆకోటయొక్క పెద్దకొమ్మ లనుట. రాజపతంగయోగకలనంబుల్.— రాజపతంగ = పక్షిశ్రేష్ఠములయొక్క; యోగకలనంబుల్ = సంబంధము సేయుటలు, చంద్రసూర్యసంబంధము సేయుట లనుట. రేవగల్ గాంచుటన్=ఎల్లపుడును బొందు చుండుటచేత. అబ్బురమై = ఆశ్చర్యకరమై. పొగ డొందన్ = శ్లాఘ్యత నొందునట్లుగా. చెలంగున్=ఒప్పును.

ఇట సూర్యుఁడు రాత్రికాలమందు చంద్రుఁడు పగటియందు నుండమింజేసి సర్వకాలమందు సూర్యచంద్రసంబంధము గలిగి యుండుట యాశ్చర్యకర మనిభావము. రాత్రి చంద్రసంబంధమును పగలు సూర్యసంబంధమును బొందు నని క్రమముగా నన్వయం బెఱుంగునది. ఇచటఁ బురసాల మున్నత మగుటకు నిజాఖ్య పెంపు గనుట ఫలము గాక పోయినను దానిని ఫలముగా సంభావన సేయుటంజేసి ఫలోత్ప్రేక్షయగును. అదియు శ్లేషానుప్రాణితము.

చ. అనఘుహరిప్రతానయుతి ♦ నబ్జకరానికరాప్తి భోగిరా
డ్జనపరిలబ్ధి విప్రవర♦సంతతియుక్తిఁ బురం బనారతం

బును దెలిదీవికన్న సిరిఁ • బూని మనం గని రక్తిఁ జేరి ని
ల్చినకలశాబ్ధి నా విమల•జీవనఖేయము వ్రేల్చు నెంతయున్. 89

టీ. అనఘహరిప్రతానయుతిన్.— అనఘ=నిర్దోషములైన; హరి = అశ్వములయొక్క; ప్రతాన=సంఘముయొక్క; యుతిన్=సంబంధముచేతను,అనఘులైనవిష్ణువులయొక్కగుంపుల సంబంధముచేతను. అబ్జకరానికరాప్తిన్ = పద్మములవంటిపాణులుగల స్త్రీసంఘములకూడిక చేత, లక్ష్ములయొక్క నికరములను బొందుటచేత. భోగిరాడ్జనపరిలబ్ధిన్=భోగవంతు లగురాజులయొక్క బృందమునొందుటచేతను, ఆదిశేషుల సంఘముయొక్కసంలబ్ధిచేతను. విప్రవరసంతతియుక్తిన్ = బ్రాహ్మణోత్తమ సముదాయములోఁ గూడుటచేత, గరుత్మంతులబృందముతోఁజేరుటచేత. పురంబు=విశాలాపురము. అనారతంబున్=ఎల్లపుడును. తెలిదీవికన్నన్= శ్వేతద్వీపమునకన్నను. సిరిఁ బూని=సంపద నొంది. మనన్ = వృద్ధిఁ బొందఁగా. కని= అవలోకించి. రక్తిన్=అనురక్తిచేత. చేరి=పొంది. నిల్చినకలశాబ్ధి నాన్= నిల్చియున్నక్షీరాంబురాశియో యనునట్లు. విమలజీవనఖేయము.—విమల=నిర్మలమగు; జీవన=జలముగల; ఖేయము=అగడ్త, "ఖేయంతు పరిఖాధార స్త్వంభసామ్" అని యమరుఁడు. ఎంతయున్= మిక్కిలి. వ్రేల్చున్ = ఒప్పును.

శ్వేతద్వీపమున నొకహరియు, నొకలక్ష్మియు, నొకశేషుండును, నొకగరుడుండు నుండుటయు; నీపురమందు ననేకహరులు, ననేకలక్ష్ములు, ననేకశేషులు, ననేకగరుడులుఁ గలిగియుండుటయుఁజూచి క్షీరాంబునిధి శ్వేతద్వీపమునకన్న నీపురి సిరిఁ బూని మించిన దనియెంచి యిచటఁ జేరెనో యనునట్లు విశాలాపురియగడ్త యొప్పె ననిభావము. ఈపద్యమందుఁ బురము శ్వేతద్వీపమునకన్న మించినదనియు నగడ్త క్షీరాంబురాశివలె నున్న దనియు రెండును వర్ణ్యములేకాన, యుపమేయమగుపురమం దుపమాన మగుశ్వేతద్వీపమునకన్న నాధిక్యము శ్లిష్టశబ్దములచేఁ జెప్పుటచే శ్లేషోత్థాపితవ్యతిరేకాలంకారము. అగడ్త కలశాబ్ధి నాఁ బొల్చు నని చెప్పుటచే నుత్ప్రేక్షాలంకారంబును గలుగుచున్నది.

మ. అరుదై చూడఁబడున్ మహీస్థలి విశా•లాధీశలోకేట్కృత
స్ఫురణం బొల్చుపురోర్వికిం బరిఖ యం•భోరాశి నాఁ దామ్రర
త్నరుగాలోకనిమక్తి శక్రమణిభా•ధ్వాంతాళియుక్తిన్ మనో
హరవప్రాంతర మెప్పుడున్ మెఱయ లో•కాలోకసామ్యంబునన్. 90

టీ. పరిఖ=అగడ్త. విశాలాధీశలోకేట్కృతస్ఫురణన్.—విశాలాధీశ=విశాలాపురీనాయకుఁడనునట్టి; లోకేట్=లోకేశుఁడైన బ్రహ్మచేత; కృత=నిర్మింపఁబడిన; స్ఫురణన్=అతిశయముతో. పొల్చుపురోర్వికిన్=ప్రకాశించునట్టి విశాలాపుర మనెడుభూమికి. మనోహరవప్రాంతరము = మనోజ్ఞ మగుమఱియొకకోట, అనఁగా పిల్లకోట. తామ్రరత్నరుగాలోకనిమక్తిన్=పద్మరాగమణులయొక్క తేజ స్సనియెడి సూర్యాతపముయొక్క సంబంధముచేతను.

శక్రమణిభాధ్వాంతాళియుక్తిన్ = ఇంద్రనీలమణులకాంతి యనునంధకారపరంపరా సంబంధముచేతను. లోకాలోకసామ్యంబునన్ = లోకాలోక మనుపర్వతముయొక్క సాటిచేత. ఎప్పుడున్ = ఎల్లప్పుడును. మెఱయన్ = ప్రకాశించుచుండఁగా. అంభోరాశి నాన్ = సముద్రమో యనునట్లుగా. అరుదై = ఆశ్చర్యకరమై. మహీస్థలిన్ = భూమండలమందు. చూడఁబడున్ = అవలోకింపఁబడును. ఉత్ప్రేక్షాలంకారభేదము.

విశాలాపురి యనునుర్వికి నగడ్త సముద్రమువలె నున్న దనియు, దానికి వెలికోట పద్మరాగమణిప్రభాశక్రమణిప్రభ లనెడు తేజస్తిమిరములతో నెప్పుడు మెఱయుటంజేసి లోకాలోకపర్వతమువలె నున్నదనియు భావము.

సీ. వెలయింప నేరఁ డు♦జ్జ్వలచంద్రికాగూఢి, రవి ప్రభాసంసక్తిఁ ♦ బ్రబలుఁ గాని
కనఁడు కావ్యాశయ♦గౌరవం బగభేది, యురుకల్పతరులబ్ధి ♦ నొనరుఁ గాని
దఱియ నోపఁడు పక్ష♦ధరవరోద్ధతి శేషుఁ, డసమలోచనయుక్తి♦మసలుఁగాని
ప్రతిఘటింపఁ గలంగుఁ ♦ బ్రాభాకరస్ఫూర్తి, కజ్జారికౌముది ♦ నలరుఁ గాని

తే. యనుచుఁ దత్సదినత్వగ♦వాధిపత్వ
కుండలిత్వద్విజేశత్వ♦గుంఫనములు
పరిహసింతు ర♦ప్పురి నధీత
సకలసుగ్రంథతతు లగ్ర♦జన్మపతులు. 91

టీ. అప్పురిన్ = ఆవిశాలాపురియందు. అధీతసకలసుగ్రంథతతులు = అధ్యయనము సేయఁబడినసమస్తగ్రంథసమూహము గలవారైన. అగ్రజన్మపతులు = బ్రాహ్మణశ్రేష్ఠులు. రవి = సూర్యుండు. ప్రభాసంసక్తిన్ = ప్రభ యనుప్రకరణముయొక్క సంబంధముచేత, కాంతిచేత ననుట. ప్రబలుఁగాని = అతిశయించును గాని. ఉజ్జ్వలచంద్రికాగూఢిన్ = ప్రకాశించుచున్న చంద్రిక యనుగ్రంథముయొక్క యతిశయమును. వెలయింప నేరఁడు = ప్రకాశింపఁజేయ నెఱుఁగండు. ప్రభ యనుప్రకరణమాత్రమే కాని చంద్రిక యనెడుగ్రంథము చదివినవాఁడు కాఁ డనుట; సూర్యుఁడు తేజస్సుతోఁ గూడియున్నాఁ డనియు వెన్నెలను జేయఁజాలఁ డనియు భావము. అగభేది = ఇంద్రుండు. ఉరుకల్పతరులబ్ధి నొనరుఁ గాని = అధిక మగు కల్పతరు వనెడు వేదాంతగ్రంథలాభముచే నొప్పును గాని. కావ్యాశయగౌరవంబు = రఘువంశాదికావ్యాభిప్రాయాతిశయమును. కనఁడు = ఎఱుఁగఁడు. ఇంద్రుండు కల్పవృక్షమును బొందినవాఁ డనియు శుక్రునియొక్క యాశయగౌరవము గనఁ డనియు భావము. శేషుఁడు = ఆదిశేషుఁడు. అసమలోచనయుక్తిన్ = అసమాన మైనలోచన మనుగ్రంథసంబంధముచేత. మసలుఁగాని = చరించును గాని. పక్షధరవరోద్ధతిన్ = పక్షధర మను నామముగల తర్కగ్రంథముయొక్క అతిశయోద్ధతిని. తఱియ నోపఁడు = సమీపింప నోపఁడు; శేషుండు పక్షధరవరుఁ డనఁగా గరుడుఁడు వానిఁ దఱియ నోపఁ డనియు అసమలోచనుఁ

డనఁగా శివుఁడు వానితోసంబంధించి యుండు ననియుఁ భావము. శివుఁడు శేషాహిభూషణుం డగుట ప్రసిద్ధము. అబ్జారి = చంద్రుఁడు. కౌముదిక్ =కౌముది యనువ్యాకరణగ్రంథముచేత. అలరుఁగాని = ఒప్పునుగాని. ప్రాభాకరస్ఫూర్తికిన్ = ప్రాభాకర మనుమీమాంసాగ్రంథముయొక్క స్ఫూర్తికి. ప్రతిఘటింపక్ = ఎదురింపను. కలంగుక్ = కలఁతపడును. చంద్రుండు వెన్నెలచే నలరు ననియు. సూర్యసంబంధిని యైనప్రభకుఁ బ్రతిఘటింపఁ జాలఁ డనియు భావము. అనుచుక్ =ఇట్లనుచు. తత్సదినత్వ గవాధిపత్వ కుండలిత్వ ద్విజేశత్వ గుంఫనముల్.—తత్ = వారిసంబంధియైన; సదినత్వ = పండితరాజత్వముయొక్క, శ్రేష్ఠ మగు సూర్యత్వముయొక్క యనుట; గవాధిపత్వ= వాక్పతిత్వముయొక్క, స్వర్గాధిపత్యముయొక్క యనుట; కుండలిత్వ = కుండలవత్త్వముయొక్క,యనఁగా సోమయాజిత్వముయొక్క, సర్పత్వముయొక్క యనుట; ద్విజేశత్వ = బ్రాహ్మణోత్తమత్వముయొక్క, ద్విజరాజత్వముయొక్క యనుట; గుంఫనములు = కూర్పులు. పరిహసింతురు = హాసాస్పదములుగాఁ జేయుదురు. అనఁగా విశాలాపురియం దున్నవిప్రులు సకలవిద్యల నభ్యసించినవార లని భావము. ఉపమానభూతసూర్యాదుల కన్న నుపమేయభూతద్విజోత్తములయందు గుణాధిక్యము చెప్పుటచే శ్లేషోత్థాపితవ్యతిరేకాలంకారము; అతిశయోక్త్యలంకారంబును.

మ. అతులాత్మప్రతిభానిరస్తకమలాధ్యక్షాత్మజుల్ త్రాతచ
క్రతతుల్ నిర్మలధర్మహేతులు నమస్కారప్రియుల్ నిత్యసం
భృతవిశ్వంభరు లంచితోదయు లదోషైకక్రముల్ మింతు రూ
ర్జితతేజోయుతిలోకబంధు లన ధాత్రీనాయకుల్ దత్పురిన్. 92

టీ. ఈ పద్యమునందు రాజపరమైనయర్థము; సూర్యపరమైనయర్థమును దోఁచుచున్నది. తత్పురిక్ =ఆవిశాలాపురియందు. ధాత్రీనాయకులు = రాజులు. అతులాత్మప్రతిభానిరస్తకమలాధ్యక్షాత్మజుల్.—అతుల=అసమాన మగు; ఆత్మ=తమయొక్క; ప్రతిభా=కాంతిచేత; నిరస్త=తిరస్కరింపఁబడిన; కమలాధ్యక్షాత్మజుల్=మన్మథులు గలవారు. సాటిలేని తమ తేజస్సుచేత నిరసింపఁబడిన (కమలాధ్యక్షు యనఁగా) సముద్రముయొక్క ఆత్మజుఁ డైనచంద్రులు గలవా రనిసూర్యపరమైనయర్థము. త్రాతచక్రతతుల్.—త్రాత = రక్షింపఁబడిన; చక్ర=రాష్ట్రములయొక్క; తతుల్ = సమూహముగలవారు, రక్షింపఁబడిన చక్రవాకసమూహము గలవారని యర్థాంతరము. నిర్మలధర్మహేతులు.—నిర్మల= నిర్దోషము లగుధర్మహేతులు=ధనువులు ఖడ్గములు గలవారు, సూర్యుండు కర్మసాక్షి గావునఁ దత్పరమైనపుడునిర్మలములైనయాగాదులకు హేతువు లైన వారనియర్థము. నమస్కారప్రియుల్="నమఃకుర్వన్తీతి నమస్కారాః" అనఁగా నమస్కరించువారు, వారియందుఁబ్రీతి కలవారు,నమస్కరించువారిని గాపాడుట రాజధర్మము గావుననట్టివారియందుఁబ్రీతిగలవా రనుట. సూర్యపరమైనపుడు "శ్లో. నమస్కారప్రియో భానుః" అనుటంబట్టి నమస్కారమందుఁ బ్రీతిగలవా రని యర్థము, నిత్యసంభృతవిశ్వంభరులు=ఎల్లప్పుడుఁ బోషింపఁబడిన భూమిగలవారు,

ఎల్లప్పుడు ధరింపఁబడిననారాయణమూర్తి గలవా రని సూర్యపర మైనయర్థము. "శ్లో. ధ్యేయస్సదా సవితృమణ్డలమధ్యవర్తీ నారాయణః" అని మొద లగువానిచే నారాయణుండు సూర్యమండలవాసి యగుట ప్రసిద్ధము; పక్షద్వయమం దీయర్థమే కా వచ్చును. అంచితోదయులు = ఒప్పుచున్నయభివృద్ధిగలవారు, పొందఁబడినయుదయగిరి గలవా రని యర్థాంతరము. అదోషైకక్రముల్ = అదుష్టము లై ముఖ్యము లైననడవడికలు గలవారు, సంప్రదాయముగలవా రనుట, సూర్యపర మైనపుడు అదోషైకక్రము లనఁగా దోషైకక్రములు గాని వారు, రాత్రిసంచారములేనివా రనుట. ఊర్జితతేజోయుతిన్ = స్థిర మైన ప్రతాపసంబంధము చేత, స్థిర మైన తేజస్సంబంధముచేత నని యర్థాంతరము. లోకబంధు లనన్ = లోకహితు లనఁగా, సూర్యు లనఁగా, ద్వాదశాదిత్యతాత్పర్యముతో బహువచనము. మింతురు=అతిశయింతురు. ఈపురియందు రాజులు మన్మథునకన్న సుందరు లై రాష్ట్రముల నేలువారై యాగాదిక్రియల నాచరించుచు శరణాగతత్రాణముఁ జేయుచు నిర్దోష మైననడవడికతోఁ బ్రతాపశాలు లై మింతు రని భావము.

మ. అలఘుశ్రీయుతి సద్గణావనవిహా♦రారూఢి లేఖస్తుతా
చలధర్మాదృతిఁ బ్రాపితాసమనిధి♦చ్ఛాయాప్రహృష్యత్సుహృ
త్తిలకాసక్తి ననారతంబుఁ బురి నెం♦తే మించు నర్యేశమం
డలి స్వానంతగుణప్రవృద్ధిగరిమ ♦ న్రాజిల్లు నానాననన్. 93

టీ. ఈ పద్యమం దర్యేశమండలి శబ్దముచేత వైశ్యోత్తమపర మైన యర్థముఁ జెప్పఁగాఁ దద్ఘటక మగు ఈశపదముచే నీశ్వరరూపార్థముగూడఁ దోఁచుచున్నది. పురిన్ = విశాలాపురియందు. అర్యేశమండలి = వైశ్యోత్తమ బృందము, ఈశ్వరబృంద మని ధ్వనితార్థము. అలఘుశ్రీయుతిన్ = అధికసంపద్యోగముచేతను, అధికవిష సంబంధముచేత నని యీశ్వరపర మైన యర్థము "శ్రీ ర్వేషరచనార్థ శోభా సమ్పత్సరళశాఖిషు। వాణీలక్ష్మీలవఙ్గేషు విషే" అని రత్నమాల. సద్గణావనవిహారారూఢిన్.— సద్గణ = సత్పురుషసంఘము యొక్క; అవనవిహారారూఢిన్ = పాలనక్రీడాతిశయముచేత, శ్రేష్ఠ మగుప్రమథగణము యొక్క పాలనవిహారారూఢిచేత నని శివపర మైనయర్థము. లేఖస్తుతాచల ధర్మాదృతిన్.— లేఖ = దేవతలచేత; స్తుత = కొనియాడఁబడిన; అచల = స్థిర మైన; ధర్మ =యాగాదిసత్క్రియలయొక్క; ఆదృతిన్ =ఆదరణముచేత; దేవతలచేత నుతింపఁబడిన మేరుధనువుయొక్కయాదరణముచేత నని శివపర మైనయర్థము. ప్రాపితాసమనిధిచ్ఛాయాప్రహృష్యత్సుహృత్తిలకాసక్తిన్.—ప్రాపిత = పొందింపఁబడిన; అసమ = అసమాన మైన; నిధి = ధననిధులుగలిగినట్టి; ఛాయాప్రహృష్యత్ = తమనీడలయందు సంతసించుచున్న; సుహృత్తిలక = మిత్రరత్నములయందు; ఆసక్తిన్ = ప్రీతిచేత. వైశ్యోత్తములు తమమిత్రులకు సరిలేనిధనములిచ్చి వారు తమనీడయందు సంతసించుచుండఁగా వారలయెడఁ బ్రీతి గలవారై యున్నా రనుట. ఈశ్వరపర మైనపుడు, ప్రాపిత = పొందింపఁబడిన, అసమ = విషమములైన; తొమ్మి దైనయనుట; నిధి = మహాపద్మాదినిధులయొక్క; ఛాయా = రక్షణముచేత; ప్రహృ

వ్యత్ = సంతోషించుచున్న; సుహృత్తిలక = కుబేరునియందు; ఆసక్తిన్ = ప్రీతిచేత. అనారతంబున్ = ఎల్లపుడు. స్వానంతగుణప్రవృద్ధిగరిమన్.—స్వ=ధనముయొక్క; అనంత గుణ = అత్యధికమైన; ప్రవృద్ధి = మితిలేని వడ్డియొక్క; గరిమన్= అతిశయముచేత, స్వసంబంధియైన శేషుఁడనెడు నల్లేత్రాటియొక్క వృద్ధ్యతిశయముచేత నని శివపరమైన యర్థము. జో నా ననన్ = ప్రశంసించునట్లు. రాజిల్లెన్ = ప్రకాశించెను.

ఆపురియందు వైశ్యులు మిగుల నైశ్వర్యవంతులై సత్పురుషులఁ బోషించుచు సత్కర్మములు నాచరించుచుఁ దమహితులను ధనవంతులనుగాఁజేసి యతిశయమైన వృద్ధిరూపమైన ధనాదాయముతో రాజిల్లుచున్నా రని భావము. ఇచటఁ బ్రస్తుతాప్రస్తుతముల కౌపమ్యముద్వ్యంగ్యము.

చ. పురమణి హాలికోత్తములు ♦ పూన్చినధాన్యపుఁదిప్ప లర్కభూ
విరుచిశిఖాళిఁ బైపయిని ♦ వేఁగఁ దదభ్యుదయాదితంత్రమా
హరిపద మంతికస్థలగ ♦ తాంచితదివ్యధునీతరంగశీ
కరనికరంబులం బొదివి ♦ గ్రక్కునఁ జల్వ ఘటించు నిచ్చలున్. 94

టీ. పురమణిన్ = పురశ్రేష్ఠమందు; హాలికోత్తములు = ఉత్తమశూద్రులు. పూన్చిన ధాన్యపుఁదిప్పలు = కుప్ప సేసినధాన్యరాసులు. అర్కభూవిరుచిశిఖాళిన్.— అర్కభూ = సూర్యునివలనఁబుట్టిన; విరుచి = విశేషకాంతియొక్క; శిఖాళిన్ = జ్వాలాసమూహముచేత. పైపయిని = మీఁదమీఁదను. వేఁగన్ = తపింపఁగా. తదభ్యుదయాది తంత్రమా హరిపదము.— తత్ = ఆహాలికులయొక్క; అభ్యుదయ = ఉత్పత్తికి; ఆదితంత్రమా = ప్రథమకారణమగుచున్న; హరిపదము = విష్ణుపద మనెడునాకాశము. "శ్లో. తస్య పాదాంబుజా జ్జాతో వర్ణో విగతకల్మషః" ఇత్యాదులచే శూద్రులు విష్ణుపాదోద్భవులగుట ప్రసిద్ధము. అంతికస్థలగతాంచితదివ్యధునీ తరంగశీకర నికరంబులన్.—అంతికస్థలగత=సమీపమునుఁ బొందిన. అంచిత = పూజ్యయగు; దివ్యధునీ = స్వర్గంగయొక్క; తరంగ= అలలయొక్క; శీకర=కణములయొక్క; నికరంబులన్ = సమూహములచేత. పొదివి = కప్పి. గ్రక్కునన్ = వేగముగా. చల్వన్ = శైత్యమును. నిచ్చలున్ = ఎల్లపుడును. ఘటించున్ = పొందించును.

ఆపురియందు హాలికులు ధాన్యములను మిక్కిలి పండించుచున్నా రని భావము. ధాన్యరాసులకు గగనతలసంబంధము లేక పోయినను దత్సంబంధ మున్నట్లు చెప్పుటచే సంబంధాతిశయోక్త్యలంకారము. "శ్లో. సంబన్ధాతిశయోక్తిస్స్యా దయోగే యోగకల్పనమ్" అని తల్లక్షణము.

మ. అలితోద్యత్కదళీకలాపములు మే • ఘావాప్తపాదాన్వితం
బులు దంతాంతరశోభిహేమవలయం • బుల్ ధాతురేఖాసము
జ్జ్వలతావత్కటకాంతముల్మదగజ • వ్రాతంబు లప్పోటిర
థ్యల నిచ్చల్ చరియించు జంగమకుభృ • త్సామ్యంబు సంధించుచున్. 95

టీ. ఈ పద్యమందు గజములకుఁ బర్వతసామ్యముఁ జెప్పుటచే నర్థద్వయము తోఁచు చున్నది. మదగజవ్రాతంబులు=మదపుటేనుఁగుల గుంపులు. అలితోద్యత్కదళీకలాపములు.— అలిత = అలంకరింపఁబడిన "అలభూషణే"; ఉద్యత్ = ఎత్తఁబడిన; కదళీ = ధ్వజముల యొక్క; కలాపములు= గుంపులు గలవై, అని గజపరమైన యర్థము. అలంకరింపఁబడి యెగురుచున్నట్టిజింకలయొక్క గుంపులుగల వని పర్వతపరమైనయర్థము. మేఘావాప్తపాదాన్వితంబులు — మేఘ = మదవిశేషముచేత "శ్లో. దానం కపోలయోః శ్వేధు రక్ష్ణో శ్చ్యుతో ష్ట స్సాగరః కరాగ్రే శీకర శ్శిక్యం స్తనాగ్రే మేహనే మదః హృదయే ఘర్మసలిల మ్మేఘు స్తుచరణవ్రజే। సంజ్ఞయాష్ట మదా హ్యేతే జాయన్తే భద్రదన్తినామ్" అని యమరశేషము పాదమందుఁ బుట్టినమదోదకము మేఘ మను పేరుగల దనుటకుఁ బ్రమాణము. అవాప్త=పొందఁబడిన. పాద=చరణములచేత. అన్వితంబులు=కూడినవై, జలదములచేతఁ గూడుకొన్న ప్రత్యంతపర్వతములు గల వని పర్వతపరమైన యర్థము. దంతాంతరశోభిహేమవలయంబుల్.— దంత = విషాణములయొక్క; అంతర = మధ్యభాగమందు; శోభి = ప్రకాశించు నట్టి; హేమవలయంబుల్=బంగరుకడియములు గలవై. పొదరిండ్లమధ్యమునఁ బ్రకాశించుసంపెఁగితీవెలగుమురులు గల వనిపర్వతపరమైన యర్థము. ధాతురేఖాసముజ్జ్వలతావత్కటకాంతముల్.— ధాతురేఖా = సిందూరరేఖలసంబంధియైన; దీనికి సముజ్జ్వలతయం దన్వయము; సముజ్జ్వలతావత్ = ప్రకాశముగల; కట = గండస్థలములచేత; కాంతముల్ = మనోజ్ఞములై. గైరికాది ధాతురేఖలచేఁ బ్రకాశించు నితంబప్రదేశము గల వనియర్థాంతరము. అవ్వీటిరథ్యలన్ = ఆవిశాలాపురి వీథులయందు. నిచ్చల్ = ఎల్లప్పుడును. జంగమకుభృత్సామ్యంబు = చరించుచున్న పర్వతసామ్యమును. సంధించుచున్ = పొందుచు. చరియించున్= సంచరించును. ఆపురియందు గజములు మహోన్నతములై చరించుచున్న పర్వతాకారముగ నున్న వని భావము. ఉపమాలంకారము.

చ. ధర హరి కెక్కుడన్న మహి•తక్రమ మూని యహీనకాండభా
 స్వరగతి నోంచుపెంపు గని • వాజికులేశత నొంది యెంతయున్
 హరిహయమానహారి యగు • నట్టితరంబు వహించి సైంధవో
 త్కరము సెలంగు వీట నిజ•తార్క్ష్యసమాఖ్య యథార్థతం దగన్. 96

టీ. ఈ పద్యమందు నశ్వపరమైన యర్థము, గరుడపరమైనయర్థముగూడఁ దోఁచుచున్నది. వీటన్=విశాలాపురియందు. సైంధవోత్కరము = అశ్వసమూహము. ధరన్=భూమియందు. హరి కెక్కుడన్న మహితక్రమము = వాయువున కన్న నుత్కృష్టము లనఁదగుమంచివేగమును, విష్ణువునకు వాహన మనెడు పూజ్యక్రమము నని గరుడపరమైన యర్థము. ఊని=వహించి. అహీనకాండ భాస్వరగతిన్.— అహీన = అధికమగు; కాండ=బాణములయొక్క; భాస్వర=ప్రకాశించునట్టి; గతిన్ = గమనమును. నోంచు పెంపుగని = నొప్పించు గౌరవము వొంది, అహీనకాండ=సర్పశ్రేష్ఠముల గుంపులయొక్క; భాస్వరగతిన్=మంచితెలివిని. నోంచుపెంపు గని యని గరుడపరమైన యర్థము. వాజికులేశతన్=అశ్వశ్రేష్ఠతను

పక్షిరాజత నని యర్థాంతరము "వాజినోశ్వేషుపక్షిణః" అని యమరుఁడు. ఒంది. ఎంతయున్=మిక్కిలి. హరిహయమానహారి యగునట్టి తరఁబు=సూర్యాశ్వములమానము హరించునట్టి వేగమును. వహించి. ఇంద్రునియొక్క మానమును హరించునట్టి యుత్కర్షమును వహించి యని గరుడపరమైనయర్థము. నిజతార్క్ష్యశ్రీ సమాఖ్య=తమయొక్క తార్క్ష్యము లను పేరు, తార్క్ష్యశ్రీ మనఁగా నశ్వము గరుత్మంతుండును "తురఙ్గగరుడౌ తార్క్ష్యౌ" అని యమరుఁడు. యథార్థతన్ = సార్థకతచేత. తగన్ = ఒప్పఁగా. చెలంగున్ = ప్రకాశించును.

ఆపురియందు సూర్యాశ్వబాణవాయువేగములకు మించినవేగము గలిగినయుత్తమాశ్వము లున్న వని భావము. ప్రకృతాశ్వములకు నప్రకృతగరుడునకు నౌపమ్యము వ్యంగ్యము. అతిశయోక్త్యలంకారము.

మ. వరవర్ణక్రమభాసివాహయుతి భా♦స్వచ్చంద్రచక్రాప్తి వీ
టిరథశ్రేణి వహించియుం గడు నఖం♦డీభూతవిస్ఫూర్తిచే
నరుదై పొల్చుట నొక్కొ కేరు గిరిక♦న్యాధీశచక్రాంగవై
ఖరి నుద్యద్వలభీవిలంబితమణీ♦ఘంటాళిఘాణంఘణిన్. 97

టీ. ఈ పద్యమందు రథశ్రేణిని వర్ణింపఁగా యథాసంభవముగ నీశ్వరరథ పరమైన యర్థాంతరము గూడఁ దోఁచుచున్నది. వీటిరథశ్రేణి = పురమందలి రథములయొక్క గుంపు. వరవర్ణక్రమభాసివాహయుతిన్.—వర=శ్రేష్ఠమగు; వర్ణ = రంగుచేతను, జాతిచేతనని కాని; క్రమ = నడుపుచేతను; భాసి = విలసిల్లునట్టి; వాహ=అశ్వములయొక్క; యుతిన్=సంబంధమును, శ్రేష్ఠము లగునకారాది వర్ణములచేతను క్రమపదవాచ్య మగు పాఠవిశేషముచేతను (భాసిల్లువాహము లనఁగా) వేదరూపాశ్వములు, వానియుతి నని యీశ్వరరథ పరమైన యర్థము. భాస్వచ్చంద్ర చక్రాప్తిన్ = ప్రకాశించు చున్న బంగరుకండ్లయొక్క ప్రాప్తిని "గైరికం వసు చన్ద్రికం" అని యమరుఁడు. సూర్యచంద్రాత్మక చక్రములయొక్క ప్రాప్తి నని యీశ్వరరథ పరమైన యర్థము. శివునకు త్రిపురహరణకాలమైన భూమి రథము వేదములు వాహములు మేరువు ధనువు విష్ణువు సాయకంబు నగుట పురాణప్రసిద్ధమైనది. వహించియున్=ధరించియు. కడున్=మిక్కిలి. అఖండీభూతవిస్ఫూర్తిచేన్.—అఖండీభూత=అవిచ్ఛిన్నమగు. విస్ఫూర్తిచేన్=ప్రకాశముచేత. అరుదై=ఆశ్చర్యకరమై. పొల్చుటనొక్కొ = ఒప్పుటచేతనో. ఉద్యద్వలభీవిలంబితమణీఘంటాళిఘాణంఘణిన్.— ఉద్యత్ = ప్రకాశించుచున్న; వలభీ = కోణిగలయందు; విలంబిత = వ్రేలాడుచుండిన; మణీఘంటా= మణిమయఘంటలయొక్క; ఆళి=పంక్తియొక్క ; ఘాణంఘణిన్=ఘణఘణ యను నాదముచేత. గిరికన్యాధీశ చక్రాంగవైఖరిన్.—గిరికన్యాధీశ=పార్వతీపతియొక్క; చక్రాంగవైఖరిన్=రథముయొక్క రీతిని. కేరున్=పరిహసించును.

అనఁగా విశాలాపురియం దున్నరథములు రుద్రునిరథమువలె వరవర్ణక్రమభాసివాహభాస్వచ్చంద్రచక్రాప్తి మొదలుగాఁ గలవానినిఁ బొందియు నఖండీభూతస్ఫూర్తిచేఁ

బొల్చుట చేత నీశ్వరుని భూమ్యాత్మక రథవైఖరి నవఖండాత్మక మనిఘంటల చప్పుడు చేతఁ గేరుచున్నట్టున్న దనిభావము. ఇందువ్యతిరేకోత్ప్రేక్షా శ్లేషాలంకారములు.

చ. స్థిరసుమనోవితానముల♦చే ననిమేషవిలోలలోచనో
త్కరములచే ననర్ఘమణి♦కామయకూటచయంబుచే సిరిం
గరము పొసంగుపీటినవ♦కాంచనసౌధపరంపరల్ మరు
ద్గిరివరవైఖరిం బొలుచు♦ దివ్యపథం బధరీకృతంబు గాన్. 98

టీ. ఈ పద్యమందు సౌధములు మేరుతుల్యముగ నున్న వనుటచే మేరుపరమైన యర్థాంతరముగూడఁ దోఁచుచున్నది. సిరిన్ = సంపదచే. కరము = మిక్కిలి. పొసంగుపీటి నవకాంచనసౌధపరంపరల్.—పొసంగు = ఒప్పుచున్న; పీటి = పురముయొక్క; నవ = నూతనములగు; కాంచనసౌధ = బంగరుమేడలయొక్క; పరంపరల్ = సమూహములు. స్థిరసుమనోవితానములచేన్ = స్థిర = తిరమగు; సుమనోవితానములచేన్ = పువ్వుఁజప్పరములచేతను, దేవతాసంఘములచేత నని యర్థాంతరము. అనిమేషవిలోలలోచనోత్కరములచేన్.—అనిమేష = మత్స్యములవలె; విలోల = మిక్కిలి చలించుచున్న; లోచనా = నేత్రములుగల స్త్రీలయొక్క; ఉత్కరములచేన్ = సమూహములచేతను; దేవతాస్త్రీసంఘముచేత నని యర్థాంతరము. అనర్ఘమణికామయకూటచయంబుచేన్ = వెలలేనట్టి మణిమయ గృహవిశేషములచేతను, మణిమయశిఖరములచేత నని యర్థాంతరము. "కూటోస్త్రీశిఖరం వానః కూటో ద్వయోః" అని అమరుఁడు. దివ్యపథంబు = అంతరిక్షము. అధరీకృతంబుగాన్ = క్రిందు చేయఁబడినదికాఁగా. మరుద్గిరివరవైఖరిన్ = మేరుపర్వతము వంటి మేలైనభంగితో. పొదలున్ = ఒప్పును.

విశాలాపురియందు మేడలు గగనమండలము క్రిం దగునంత యున్నతములై మేరుపర్వతమువలెఁ బ్రకాశించె ననిభావము. ఉపమాలంకారభేదము.

మ. అవడీనానిలవాసనాజనితహా♦ర్దాప్తిం బురిన్ భర్మహా
ర్మ్యవితానాశ్రితయోషిదాస్యములఁ జే♦రం బోవుదివ్యాపగా
బ్జవసద్బంభరపాళి కుద్గమనజ♦శ్రాంతిం దొలంచున్ విలా
సవనీసాలలతాంతగంధలహరీ♦సారంబు మధ్యేసృతిన్. 99

టీ. ఇందుఁ బ్రకారాంతరముగ సౌధోన్నత్యము వర్ణింపఁబడుచున్నది. పురిన్ = విశాలాపురియందు. భర్మహార్మ్యవితానాశ్రితయోషిదాస్యములన్.—భర్మహార్మ్య = బంగరు మేడలయొక్క; వితాన = సంఘములను; ఆశ్రిత = ఆశ్రయించినట్టి; యోషిత్ = స్త్రీలయొక్క; ఆస్యములన్ = ముఖములను. అవడీనానిలవాసనాజనితహార్దాప్తిన్.—అవడీన = క్రిందికి డిగివచ్చిన; అనిల = వాయువువలననైన; వాసనా = పరిమళమండలి; హార్ద = ప్రీతియొక్క; ఆప్తిన్ = ప్రాప్తిచేత. చేరన్ = స్త్రీముఖములను జేరుటకు. పోవుదివ్యాపగాబ్జవసద్బంభరపాళికిన్.—పోవు = పోవునట్టి, దీనికి బంభరపాళియం దన్వయము. దివ్యాపగా =

వ్యోమగంగయందున్న ; అబ్జ = కమలములయందు ; వసత్ = వసించుచున్న ; బంభరపాళికిన్ = తుమ్మెదలగుంపునకు. విలాసవనీసాలలతాంతగంధలహరీసారంబు.—విలాసవనీ = క్రీడార్థమైనయుద్యానవనములందలి; సాల=వృక్షములయొక్క. "అనోకహః కుట స్సాలః" అని యమరుఁడు ; లతాంత=కుసుమములయొక్క ; గంధలహరీ = పరిమళప్రవాహముయొక్క ; సారంబు = స్థిరాంశము. ఉద్గమనజక్లాంతిన్.—ఉద్గమన = ఊర్ధ్వమునకుఁ బోవుటవలన; జ=పుట్టినట్టి; క్లాంతిన్=శ్రమమును. మధ్యేసృతిన్=మార్గమధ్యమునందు, "పారే మధ్యే షష్ఠ్యా వా" అని యలుక్సమాసము. తోలంచున్=పోఁగొట్టును.

విశాలాపురియందు మేడలు స్వర్గమునకన్న నత్యున్నతము లై యున్నవనియు, స్వర్గంగాసరోజములయం దున్నభృంగము లచటియోషిదాస్యములఁ జేరంబోవుచుండఁగా మార్గమధ్యమందు కలిగినశ్రమమును విశాలాపురోద్యానతరుసుమపరిమళము పోఁగొట్టుచున్న దనుటవలన నుద్యానములును స్వర్గమును మించినయౌన్నత్యము గలిగి యున్నవనియు భావము. అతిశయోక్తిభేదము.

మ. పురచామీకరసౌధచత్వరమణీ•పుత్రీముఖాంభోజముల్
శరజాసాలయకుడ్యబింబితము లై•చక్కం గనం దోఁచుని
ర్భరదర్శార్కకరాభిచర్వితనిశా•రాణ్ణిర్మిమిత్సాప్తవా
గ్వరసంయోజితచంద్రకారణచయ•వ్యాప్తిన్ విజృంభించుచున్. 100

టీ. పురచామీకరసౌధచత్వరమణీపుత్రీముఖాంభోజముల్.—పుర = విశాలాపురమందలి ; చామీకరసౌధ = బంగరుమేడలయొక్క ; చత్వర. = ముంగిళ్లభూములయందలి ; మణీపుత్రీ = మణిమయము లగుబొమ్మలయొక్క ; ముఖాంభోజముల్ = ముఖపద్మములు. శరజాసాలయకుడ్యబింబితము లై.—శరజాస=పద్మాసనుం డగుబ్రహ్మయొక్క; ఆలయ=గృహముయొక్క; కుడ్య = గోడలయందు; బింబితము లై = ప్రతిఫలితము లై. చక్కంగనన్= చక్కఁగాఁ బరిశీలింపఁగా. నిర్భరదర్శార్కకరాభిచర్వితనిశారాణ్ణిర్మిమిత్సాప్తవాగ్వరసంయోజితచంద్రకారణచయవ్యాప్తిన్.—నిర్భర = దట్టములగు ; దర్శార్కకర = అమావాస్యయందలి సూర్యునికిరణములచేత; అభిచర్విత = భక్షింపఁబడిన; నిశారాట్ = చంద్రునియొక్క; నిర్మిమిత్సా = నిర్మాణేచ్ఛచే; ఆప్త= పొందినట్టి; వాగ్వర = బ్రహ్మచేత; సంయోజిత = చేర్పఁబడిన; చంద్రకారణచయ = మరలఁ జంద్రుని నిర్మించుటకు సాధనము లైనవానిగుంపనెడు; వ్యాప్తిన్=ప్రసిద్ధిచేత. విజృంభించుచున్ = అతిశయించుచు. తోఁచున్ = అగపడును. చంద్రకారణచయ మనున ట్లగపడు ననుట.

విశాలాపురి నున్న మేడలు సత్యలోకమువర కున్నతములుగా నున్నవనియు, నామేడలయంగణభూములయం దున్నమణులతోఁ జేయఁబడినబొమ్మలముఖములు బ్రహ్మదేవునియింటిగోడమీఁదఁ బ్రతిఫలించి యుండఁగా నవి యమావాస్యలయందు సూర్యకిరణములచే మ్రింగఁబడిన చంద్రులకు మాఱుగా నిర్మించుటకు బ్రహ్మ కారణసామగ్రి నొనగూర్చి యుంచినట్లు దోఁచు చున్న వనియు భావము. ఉత్ప్రేక్షాత్యుక్త్యలంకారసంకరము.

చ. అతులశుభాగమక్రమము ♦ స్వాశ్రితభూరికలస్వనద్విజే
శతతులు దెల్ప వీటిమణి♦సౌధము లాజిరహర్మ్యలక్ష్మిపైఁ
జతురత నించుసేస గృహ♦చత్వరవీథిక లొంది జాలకా
రతిఁ దగుచాన లెల్లఁ దొర ♦ రాజిల ఱువ్వెడు మొగ్గచాలునన్. 101

టీ. ఈపద్యమం దంగణ భూములయందుఁ జానలు క్రీడించువేళఁ జల్లుకొను మొగ్గలు మణిసౌధాజిరలక్ష్ములయొక్క వైవాహికాక్షతలుగా వర్ణింపఁబడియె. వీటిమణిసౌధములు = పట్టణమందలిమణిమయము లైనమేడలు. స్వాశ్రిత భూరికలస్వన ద్విజేశతతులు.—స్వాశ్రిత = తమ్ము నాశ్రయించిన ; భూరికలస్వన = అధికము లైనమధురవాక్కులు గలిగిన ; ద్విజేశతతులు = పక్షు లనెడుబ్రాహ్మణులయొక్క గుంపులు. అతులశుభాగమక్రమము.—అతులశుభ = సాటిలేనిశుభముహూర్తముయొక్క ; ఆగమక్రమము = ప్రాప్తివిధమును. తెల్పన్ = తెలుపుచుండఁగా. ఆజిరహర్మ్యలక్ష్మిపైన్ = అంగణహర్మ్యలక్ష్మిపై. గృహచత్వరవీథికలు = గృహాంగణభూములను. ఒంది = పొంది. జాలకారతిన్ = మొగ్గలు చల్లుకొనెడు క్రీడచేత, తగుచాన లెల్లన్ = ఒప్పునట్టిస్త్రీలందఱు. తొర రాజిలన్ = వేగ నూనట్లుగా. ఱువ్వెడుమొగ్గచాలునన్ = విసరివైచుమొగ్గలగుంపుచేత. చతురతన్ = చాతుర్యమున. సేసన్ = అక్షతలను ; చల్లున్ = చల్లును. ఉత్ప్రేక్షాభేదము.

మ. తరుణుల్ వీటిశిరోగృహాళి నిసి ము♦క్తాకంతుకం బాడుచోఁ
గరకంజంబున జాతి బంతి గడ కేఁ♦గం దత్సృతిం జేరుచం
దురుఁ దద్బుద్ధి గ్రహించి గోర్వఁగఁ దద♦స్తోకాహతిం గందెఁ గా
కురుమాలిన్యము సత్కులాధిపతి కె♦ట్లొందున్ మదిం జూడఁగన్. 102

టీ. ఇందుఁ బ్రకారాంతరమున సౌధోన్నత్యము వర్ణింపఁబడియె. వీటిశిరోగృహాళిన్ = పట్టణముయొక్కమేడలయందు. తరుణుల్ = స్త్రీలు. నిసిన్ = రాత్రియందు. ముక్తాకంతుకం బాడుచోన్ = ముత్యములతోఁ గూర్పఁబడినచెండాడునెడ. బంతి=చెండు. కరకంజంబునన్=పాణిపద్మమువలన. జాతి. కడ కేఁగన్ =దూరమునకుఁ బోఁగా. తత్సృతిన్ =ఆమార్గమును. చేరుచందురున్ = పొందునట్టిచంద్రుని. తద్బుద్ధిన్ = ఆచెండనుబుద్ధిచేత. గ్రహించి = పట్టుకొని. గోర్వఁగాన్ = ఎగవేయఁగా. తదస్తోకాహతిన్ = ఆగొప్పపాటుచేత. కందెఁగాక = కందెఁగాని. ఉరుమాలిన్యము = అధిక మైనమాలిన్యము. సత్కులాధిపతికిన్ = సత్కులశ్రేష్ఠుఁ డగువానికి, నక్షత్రరాజున కనుట. మదిన్ = మనస్సునందు. చూడఁగాన్ = భావింపఁగా. ఎట్లొందున్ = ఏరీతిఁ జెందును. చంద్రునియందుఁ గలంకము విశాలాపురీసౌధములయం దున్నస్త్రీలు చెండనుభ్రాంతితోఁ బట్టుకొని కొట్టఁగా గలిగినదే కాని మఱియొకవిధముగాఁ గలిగినది గా దని భావము. ఇచటఁ జంద్రునియందుఁ గలంకము క్రీడాకాలికసౌధోపరిచరన్నీరజలోచనాస్తోకాహతివలనఁ గలిగినదే కాని యిత

రమువలన సంభవింప లేదని యెట్లొందునను దానిచేఁ జెప్పుటవలన మంథానభూమిధరేత్యాదులయందుఁ గువలయానందమున వ్రాసినరీతిని హేత్వపహ్నుతి భ్రాంతిమంతమును.

సీ. భవ్యతారారూఢిఁ ♦ బదనఖంబులు మించఁ
దొడలు రంభారీతిఁ ♦ దొడరి యెంచ,
మేనావరస్ఫూర్తి ♦ మెఱుఁగుఁజన్ను లెసంగ
నాసల్ తిలోత్తమో♦న్నతిఁ బొసంగ,
హారిణీవిలాసత ♦ నక్షియుగ్మము వ్రేంద
నళికముల్ చంద్రక♦లాత్మఁ జెంద
నతనూర్వశిస్ఫూర్తి♦నలరి వేణిక లెచ్చఁ
దనులు హేమైకవ♦ర్తనను మెచ్చ

తే. నహహ నిర్జరనీరజా♦స్యావితాన, హారిసౌందర్యసంగతై ♦కైకమాని
తావయవకాంతిసంపత్తి♦నడరినిల్చు, సిరుల నలరుదు రబ్జకం♦ధరలు వీట.

టీ. వీటన్ = విశాలాపురియందు. అబ్జకంధరలు=శంఖమువంటి కంఠముగల స్త్రీలు "అబ్జౌ శఙ్ఖశశాఙ్కౌ చ" అని యమరుఁడు. పదనఖంబులు=పాదనఖములు. భవ్యతారారూఢిన్.—భవ్య=మనోజ్ఞ యగు; తారా = తార యనుదేవాంగనయొక్క; రూఢిన్ =ప్రసిద్ధివంటిప్రసిద్ధిచేతను; మనోజ్ఞము లగు నక్షత్రములయొక్క ప్రసిద్ధిచేత ననుట. మించన్=అతిశయింపఁగా. తొడలు = ఊరులు. రంభారీతిన్ = రంభ యనునప్సరస్త్రీయొక్క రీతిని అనఁటులయొక్క రీతిననుట. తొడరి = పూని. ఎంచన్ = ఎన్నఁగా అనఁగా పోలుచుండఁగా ననియర్థము. మెఱుఁగుఁ జన్నులు = మెఱయు చున్నకుచములు. మేనావరస్ఫూర్తిన్.—మేనా=మేనక యనెడు దివ్యస్త్రీయొక్క; వర=శ్రేష్ఠమగు; స్ఫూర్తిన్ = ప్రకాశముచేతను, మేనావరుఁడైన హిమవంతునియొక్క ప్రకాశవంటి ప్రకాశ చేతననుట. ఎసంగన్ = అతిశయింపఁగా. నాసల్ = నాసికలు. తిలోత్తమోన్నతిన్.—తిలోత్తమా= తిలోత్తమ యనునప్సరస్త్రీయొక్క "ఊర్వశీ మేనకారమ్భా ఘృతాచీచ తిలోత్తమా సుకేశీమఞ్జుఘోషాద్యాః కథ్యన్తేప్సరసోబుధైః" అని యమరుఁడు; ఉన్నతిన్=ఔన్నత్యము చేతను, తిలకుసుమముయొక్క యౌన్నత్యముచేత ననుట. పొసంగన్=ఒప్పుచుండఁగా. అక్షియుగ్మము = నేత్రయుగ్మము "స్తనాదీనాం ద్విత్వవిశిష్టా జాతిః ప్రాయేణ" అను వామనసూత్రముచేత నిట స్త్రీలనేత్రము లనేకము లయినను యుగ్మమని ప్రయోగింపఁబడినది. హారిణీవిలాసతన్ = హారిణి యను సురాంగనయొక్క విలాసమువంటి విలాసమును, ఇట విలాసశబ్దము అర్శ ఆద్యజంతమైనందున విలాసవిశిష్టమును బోధించును, తద్ధర్మము విలాసత అది విలాసరూపమే యగు ననియాశయము. విలాసమునక్షియుగ్మమను పాతము సమీచీనముగఁ దోఁచు చున్నది. ఆఁడుజింకయొక్క విలాసము ననుట. ప్రేందన్ = ప్రేందఁగా. అళికముల్ = ఫాలస్థలములు. చంద్ర

కలాత్మన్ = చంద్రకల యనుదేవాంగనయొక్క రూపమును. చెందన్ = పొందఁగా. చంద్రుని కలారూపమును బొందఁగా ననుట. వేణికలు=జడలు. అతనూర్వశిస్ఫూర్తిన్ = అధిక మగు నూర్వశి యనునప్సరస్త్రీయొక్క ప్రకాశముచేత. అలరి = ఒప్పి, మన్మథునిగొప్పఖడ్గముయొక్కస్ఫూర్తిచే నలరారి యనుట, "శ్లో. డలయో రలయోశ్చైవ శసయోర్బవయో స్తథా" యనుటచేత నిచట నూర్వశి యనుచోట శకారసకారముల కభేదము చెప్పఁబడినది. తనులు = శరీరములు. హేమైకవర్తనన్.— హేమా = హేమ యనుదేవాంగనయొక్క; ఏక= ముఖ్య మగు. వర్తనన్=వృత్తిని. మెచ్చన్ = శ్లాఘింపఁగా, సువర్ణమును బోలఁగా ననుట. అహహా = ఔరా. నిర్జరనీరజాస్యావితానహారిసౌందర్యసంగతైకైకమానితావయవకాంతిసంపత్తిన్.— నిర్జరనీరజాస్యావితాన=దేవాంగనాకదంబముయొక్క; హారి = మనోజ్ఞ మగు; సౌందర్య=సౌందర్యముతో; సంగత=కూడుకొన్న, ఏకైకమానితావయవ=ఒక్కొక్కపూజితాంగముయొక్క; సంపత్తిన్ = సంపదచేత. అడరి=ఒప్పి. నిల్చుసిరులన్ = స్థిరమగుసంపదలచే. అలరుదురు = ప్రకాశింతురు.

విశాలాపురియం దున్నస్త్రీలయవయవము లొక్కొకటి యొక్కొకరంభాదిసురాంగనను బోలి యుండఁగా వారిసర్వావయవసౌందర్యమునకు సరి యైనయువతి త్రైలోక్యములో దుర్లభ యని భావము.

మ. అనిశాశేషఋతుప్రసేవితపురీం•ద్రారామపంక్తుల్ గళ
ద్ఘనసూనౌఘపరాగపూగములఁ దో•డ్తన్ సేతువుల్ దీర్చి కీ
రనికాయాస్యనికృత్తపక్వఫలనీ•రంబుల్ తగన్ నించు నొ
య్యన పోషింపనొ నందనాఖ్య•మనునాకాక్రీడ మెల్లప్పుడున్. 104

టీ. అనిశాశేషఋతుప్రసేవితపురీంద్రారామపంక్తుల్.— అనిశ = ఎల్లప్పుడును; అశేషఋతు = షడృతువులచేత, ఇచట 'ఋత్యకః' అనుపాణిని సూత్రముచేత నకారఋకారములకు సంధి లేదు; పురీంద్రారామ = విశాలాపురోద్యానములయొక్క; పంక్తుల్ = సమూహములు. గళద్ఘనసూనౌఘపరాగపూగములన్.— గళత్ = జాఱుచున్న; ఘన=దట్టమైన; సూనౌఘపరాగ=పుష్పాదులయొక్క; పూగములన్ = సమూహములచేత. తోడ్తన్ = వెంటనే. సేతువుల్ = కట్టలు. తీర్చి=చేసి. కీరనికాయాస్యనికృత్తపక్వ ఫలనీరంబుల్.— కీర = చిలుకలయొక్క; నికాయ = సమూహముయొక్క; ఆస్య=ముఖములచేత; నికృత్త= భేదింపఁబడినట్టియు; పక్వ=పండినట్టియు; ఫల=పండ్లయొక్క; నీరంబుల్ = మకరందముల ననుట. నందనాఖ్యన్ = నందన మనుపేరిచేత, కుమారుఁ డనుప్రసిద్ధిచేత. మనునాకాక్రీడము= వృద్ధిఁబొందుస్వర్గోద్యానమును. ఎల్లప్పుడున్ = సర్వకాలమును. పోషింపనో=పోషించుటకో యేమో. ఒయ్యన=మెల్లగా. తగన్ = ఒప్పునట్లుగా. నించున్ = పూరించును.

విశాలాపురియం దున్నయుద్యానములు నందనవనమునకన్న నుపరిభాగము నొంది యున్న వనియు, నందనవనము పురోద్యానములకు బిడ్డ యనునట్లు అల్పముగా నున్న దనియు

భావము. ఉపవనకర్తృకపుష్ప రజఃకరణక సేతుకృతియుఁ, దదధికరణకపక్వఫలనీరపూరణమును లేనివే నందనవనపోషణహేతువులుగా వర్ణింపఁబడుటచే నసిద్ధవిషయ హేతూత్ప్రేక్షాలంకారము. "శ్లో. సంభావనా స్యా దుత్ప్రేక్షా వస్తుహేతుఫలాత్మనా" యని లక్షణము.

సీ. జాలకమాలికా♦జాలంబులెత్తుట, నుదుటుముత్యపుఁ జేరు ♦ లొసఁగు మనుట
సరసబంధూకగు♦చ్ఛముఁ జూపి కప్పుట, నలప్రొద్దు గ్రుంకఁగా♦వలయు ననుట
దళముగాఁ గెందమ్మి♦దళములు గూర్చుట, నీమీఁద ననురక్తి ♦ నెగడె ననుట
చికిలిసంపెఁగ ననల్ ♦ చెలిమిచే నిచ్చుట, గుఱుతు చంపకలతా♦కుంజ మనుట
తే. తెలుపకయ తెల్పి కడు నేర్పు ♦ దేటపడఁగ
నలరుబోంకులఁ జెలఁగించి ♦ యఖిలకమన
పాళి తమదండకై యాస♦పడఁగఁ జేసి
విరులు విల్తురు కుసుమలా♦వికలు వీట. 105

టీ. వీటన్ = విశాలాపురియందు. కుసుమలావికలు=పువ్వులమ్మెడుస్త్రీలు. జాలకమాలికాజాలంబులు = మొగ్గలసరములగుంపులు. ఎత్తుటన్ = ఎత్తుటచేత. ఉదుటుముత్యపుఁ జేరులు=గొప్పముత్యపుసరులు. ఒసఁగు మనుట = ఇమ్మని చెప్పుట. సరసబంధూకగుచ్ఛమున్.—సరస = శ్రేష్ఠ మగు; బంధూక=మంకెనపువ్వులయొక్క; గుచ్ఛమున్ = గుత్తిని. చూపికప్పుటన్=చూపి మూయుటచేత. అలప్రొద్దు గ్రుంకఁగా వలయు ననుట = ఆప్రొద్దు గ్రుంకవలయు నని చెప్పుట. దళముగాన్ = దట్ట మౌనట్టుగా. కెందమ్మిదళములు = ఎఱ్ఱతామరరేకులు. కూర్చుటన్ = కూర్చుటచేత. నీమీఁదన్ = నీపై. అనురక్తి = అనురాగము. నెగడెన్ = అతిశయించెను. అనుట=అని చెప్పుట. చికిలిసంపెఁగననల్ = బాగైనసంపెంగపువ్వులు. చెల్మిచేన్ = ప్రేమచేత. ఇచ్చుటన్ = ఇచ్చుటచేత. చంపకలతాకుంజము=సంపెంగలతలపొద. గుఱుతు = సంకేతస్థానము. అనుట = అనిచెప్పుట. తెలుపకయతెల్పి = ఇట్లు తమయభిప్రాయము వాక్కుతోఁ జెప్పకయె వ్యాపారముతోఁ దెల్పి. కడునేర్పుదేటపడఁగన్ = మిక్కిలిచాతుర్యము వ్యక్త మౌనట్టుగా. అలరుబోంకులన్ = ఒప్పుచున్నయసత్యోక్తులచేత. అఖిలకమనపాళిన్ = ఎల్లకాముకకోటిని. చెలఁగించి= సంతోషపెట్టి. తమదండకై = తమపూదండకు, పొందునకు. ఆసపడఁగన్ = ఆశించునట్లు. చేసి = ఒనరించి. విరులు = కుసుమములు. విల్తురు = విక్రయింతురు.

చ. అలవగరాధిపాళి సర♦సాగ్రణు లెంచఁ జరించుచల్లవీ
వలి తను భృంగకోటి గొలు♦వన్ విటనేత యనంగ సొంపుమై
నలరెడివద్మినీతతుల♦యందపుఁదావులు సెంది యుబ్బుచుం
గులుకుఁ జిగుర్చుఁ గన్నెలత♦కూనలమేల్పొల పూని చొక్కుచున్. 106

టీ. ఈపద్యమందు మందమారుతమును విటనాయకునిఁగా వర్ణించుటచే నర్థద్వయము గలుగుచున్నది. అలనగరాధనాళిన్=ఆపురవరముపై. సరసాగ్రణులెంచన్ = రసికశిరోమణులు మెచ్చఁగా. చరించుచల్లవీవలి = వీచుచున్నచల్లనివాయువు. తనున్ = తన్ను. భృంగకోటి = తుమ్మెదలగుంపులు, విటులగుంపులు. కొలువన్ = సేవింపఁగా. "భృఙ్గో ధూమ్యాటషిద్గయోః మధువ్రతే" అని విశ్వము. విటసేతి యనంగన్ = విటశ్రేష్ఠుండనునట్లు. సొంపునన్=మనోహరతచేత. అలరెడుపద్మినీతతులయందపుఁదావులు.— అలరెడి = ఒప్పుచున్న; పద్మినీ = పద్మలతలయొక్క, పద్మినీజాతిస్త్రీలయొక్క; అందపుఁదావులు = మనోజ్ఞములగుపరిమళములు, నివాసస్థానములను. చెంది=పొంది. ఉబ్బుచున్ = అతిశయించుచు. కన్నెలతకూనలమేల్వలపు = కన్నెలవంటి బాలలతలయొక్క హెచ్చైనపరిమళమును, బాలలతలవంటి కన్నెలయందు హెచ్చైనమోహమును. ఊని = వహించి. చొక్కుచున్ = పరవశమగుచు. కులుకు=అందమును. చిగుర్పన్=ఆవిర్భవింపఁజేయును.

సీ. సేసకొప్పుల నమ♦ర్చిన మొల్ల మొగడచాల్, సరిగరుమాలపైఁ♦జక్కఁ దోఁప
వలెవాటు వైచిన ♦ సుళువుఁజెందిరకావి, వలిపముల్ పదపల్ల♦వముల జీర
నెలవంక రేఖలు ♦ నెలకొన్న పేరుర,ములఁ జిల్కతాళులు ♦ తళుకు సూపఁ
జెలువంబు నెగడఁ దీ♦ర్చిన క్రొత్తకస్తూరి, పట్టెలమేల్తావి ♦ మట్టుమీఱ

తే. జెక్కుఁగవ ముత్తియపుటొంట్ల♦జిగి వెలుంగ
బలుకుఁగ్రంపువీడెంబు♦వలపు నిగుడ
నలరు వేడుక వెనువెంటఁ ♦ జెలులు నడవ
వేడ్క వచియింతు రనిశంబు ♦ విటులు వీట. 107

టీ. వీటన్ = విశాలాపురియందు. విటులు=జారులు. సేసకొప్పులన్ = కొండెసిగలయందు. అమర్చినమొల్లమొగడచాల్ = ఉంపఁబడిన కుందకుట్మలములయొక్క బంతులు. సరిగరుమాలపైన్ = జరీరుమాలమీఁద. చక్కన్=బాగుగా. తోఁపన్ = తోఁచుచుండఁగా. వలెవాటువైచిన సుళువుఁజెందిరకావివలిపముల్.—వలెవాటు వైచిన=వల్లెవాటుగా వేసికొన్న; సుళువుఁజెందిరకావి=లేఁతచెంద్రకావి వన్నెగల; వలిపముల్ = వస్త్రములు. పదపల్లవములన్ = పల్లవములవంటి పాదములపై. జీరన్ = జీరాడుచుండఁగా. నెలవంకరేఖలన్ = చంద్రవంకరేకలు. నెలకొన్న పేరురములన్= వ్యాపించినవిశాలమైనవక్షస్స్థలములయందు. చిల్కతాళులు = తావళములనెడుహారవిశేషములు. తళుకు సూపన్=ప్రకాశించుచుండఁగా. చెలువంబు = అందము. నెగడన్ = అతిశయించునట్లు. తీర్చిన క్రొత్తకస్తూరిపట్టెలమేల్తావి = తీర్పఁబడిన నూతనకస్తూరిపట్టెలయొక్క యుత్తమమైనపరిమళము. మట్టుమీఱన్ = అతిశయింపఁగా. చెక్కుఁగవన్=గండయుగ్మమందు. ముత్తియంపుటొంట్లజిగి= ముత్యములతోఁ గూడినయంటుపోఁగులయొక్క కాంతి. వెలుంగన్=ప్రకా

శించు చుండఁగా. పలుకుఁగప్రంపువీడెంబువలపు = పలుకు కర్పూరముతోఁ జేరిన తాంబూలములయొక్క వాసన. నిగుడన్ = అతిశయించు చుండఁగా. అలరువేడుకన్ = అతిశయ విలాసముచేత. వెనువెంటన్ = వెంబడిగా. చెలులు = స్త్రీలు. నడవన్ = నడచు చుండఁగా. అనిశంబున్ = ఎల్లప్పుడును. వేడ్కన్ = వేడుకచేత. చరియింతురు = సంచరింతురు.

మ. అకలంకాంబుజపాళికాసుఖితభృం•గాళీతనూకాంతిదం
భకళిందప్రభవానుషంగశిఖిదా•మాతాండవాపాదనో
దకభంగోత్కరఘర్షణక్రమసము•ద్గచ్ఛత్పయోబిందుశీ
తకరీభూతపతంగగంగ దనరుం•దత్ప్రాంతదేశంబునన్. 108

టీ. తత్ప్రాంతదేశంబునన్ = ఆవిశాలాపురిసమీపమందు. అకలంకాంబుజపాళికాసుఖితభృంగాళీతనూకాంతిదంభకళిందప్రభవానుషంగశిఖిదామాతాండవాపాదనోదకభంగోత్కరఘర్షణ క్రమసముద్గచ్ఛత్పయోబిందుశీతకరీభూతపతంగ.—అకలంక = స్వచ్ఛములగు; అంబుజ = పద్మములయొక్క; పాళికా = గుంపులయందు ; సుఖిత = సంజాతసుఖములగు ; భృంగ = తుమ్మెదలయొక్క; ఆళీ = సమూహముయొక్క; తనూకాంతి= దేహకాంతి యనెడు; దంభ = నెపముగల; కళిందప్రభవా = యమునానదియొక్క; అనుషంగ = సంబంధముచేత దీని కాపాదనక్రియయం దన్వయము; శిఖిదామా=మయూరసమూహమునకు; తాండవాపాదన = తాండవోత్సవసంపాదక మగు ; ఉదక = జలముయొక్క; భంగోత్కర = అలలగుంపులయొక్క; ఘర్షణక్రమ = సంఘర్షణక్రమముచేత; సముద్గచ్ఛత్ =మిక్కిలి పైకెగయుచున్న; పయోబిందు = ఉదకబిందువులచేతను ; శీతకరీభూత = చంద్రునివలెఁ జల్లనైన; పతంగ = సూర్యుఁడు గల. గంగ = గంగానది. తనరున్ =ప్రకాశించును. ఈపద్యమందు శిఖిదామా యనుచోట దామన్ శబ్దము. 'డా బుభాభ్యా మన్యతరస్యామ్' అనుసూత్రముచేత డాప్ప్రత్యయము వచ్చుటచే నాకారాంత మైనది. భృంగతనూకాంతి యనెడుయమునాసంగముచేత గంగాతరంగములు మేఘపరంపరలఁ బోలి శిఖితాండవముఁ గలుగఁజేయుచున్న వనియు, నాతరంగములయొక్క తాఁకుడువలన జలకణములు సూర్యలోకమువఱకు నెగసి సూర్యునిఁ జంద్రునివలెఁ జల్ల నగునట్లు చేయుచున్నవనియు భావము.

మ. విలసత్సారణికానుయాయివిబుధ•ద్వీపిన్యనర్ఘామృతం
బుల ముక్కారును బండు శాలులు పురీ•భూదేవపాళీకృతో
జ్జ్వలనానావిధయజ్ఞతన్నవహవి•స్సంభుక్తిబర్హిర్ముఖా
వళు లెల్లప్డు నమర్త్యభావ మజర•త్వం బూని మోదింపఁగన్. 109

టీ. శాలులు = వరిపైరులు. విలసత్సారణికానుయాయి విబుధద్వీపిన్యనర్ఘామృతంబులన్.—విలసత్సారణికా = ప్రకాశించుకాల్వలను; అనుయాయి=అనుసరించిపోవు; విబు

ధద్వీపినీ = గంగయొక్క; అనర్ఘామృతంబులన్ = అమూల్యము లగునుదకము లనుసుధలచేత. ముక్కారును = మూఁడుకార్లును. పండున్ = ఫలించును. పురీభూదేవపాళీకృతోజ్జ్వలనానావిధయజ్ఞతన్నవహావిస్సంభుక్తిన్.— పురీ = విశాలాపురియందలి; భూదేవపాళీ = బ్రాహ్మణబృందముచేత; కృత = చేయఁబడిన; ఉజ్జ్వల = ప్రకాశించునట్టి; నానావిధ = అనేక ప్రకారములగు; యజ్ఞ = యజ్ఞములయందు; తన్నవహావిస్సంభుక్తిన్ = ఆశాలిసంబంధి యైననూతనహావిర్భోజనముచేత. బర్హిర్ముఖావళులు=దేవసంఘములు. ఎల్లప్డున్ = నిరంతరమును. అమర్త్యభావము = మరణము లేకుంటను. అజరత్వంబు = ముసలితనము లేమిని. ఊని = వహించి. మోదింపఁగన్ = సంతసించుచుండఁగా. దీనికి పండు నను సమాపకక్రియతో నన్వయము. బర్హిర్ముఖులకు(అనఁగా గడ్డి దిను వారికి)నమృతముతోఁ బండిన లోకోత్తరశాలిహావిస్సు భుజించుటయు, నమర్త్యత్వాజరత్వములు గలుగుటయు, లోకోత్తరానందహేతు వగు నని యాశయము. గంగానది కాల్వలచేత ముక్కారుపంటలు పండుచుండఁగా విప్రులు యాగము లెప్పుడుఁ జేయుచు దేవతలను సంతసింపం జేయుదు రని భావము. ఇచట బర్హిర్ముఖ నిష్ఠాజరత్వామర్త్యభావములను గూర్చి హేతువు గానివిబుధద్వీపిన్యనర్ఘామృతఫలితశాలిహావిర్భోజనమును, హేతువు గా సంభావన చేయుటవలన హేతూత్ప్రేక్షాలంకారము. అదియు నమృతశబ్దగతరూపకముతో సంకీర్ణంబు.

చ. అనువనసారిణీతటయు•గాంబుజబృందమరందపూరము
లగనిమలు నిండి యానదిజ•లంబులతోఁ బ్రవహింపఁ బైపయిన్
జనునళిపంక్తి బొ ల్పెసఁగు • సాగరనీరముఁ గ్రావి దప్పిచే
ననిశము మేఘమాలిక త•దంబుకదంబము గ్రోలఁ జేరె నాన్. 110

టీ. అనువనసారిణీతటయుగాంబుజబృందమరందపూరముల్.— అనువన = వనము ననుసరించిన; సారిణీ = కాల్వలయొక్క; తటయుగ = ఇరుప్రక్కలయందున్న; అంబుజబృంద=పద్మములగుంపుయొక్క; మరందపూరముల్ = మకరందప్రవాహములు. గనిమలు నిండి = కయ్యలునిండి. ఆనదిజలంబులతోన్ = ఆగంగాజలములతో. ప్రవహింపన్ = ప్రవహించుచుండఁగా. పైపయిన్=మీఁద మీఁద. చనునళిపంక్తి = పోవుతుమ్మెదలగుంపు. సాగరనీరము = సముద్రోదకము. అనిశమున్ = ఎల్లప్పుడును. గ్రావి = పానముచేసి. దప్పిచేన్ = తృష్ణచేత. మేఘమాలిక = మబ్బులగుంపు. తదంబుకదంబము = ఆమకరందముతో మెలంగిన గంగాజలమును. గ్రోలన్= గ్రావుటకు. చేరె నాన్ = చేరినదా యనునట్లు. పొల్పెసఁగున్=ఒప్పారును. అళిపంక్తిని మేఘముగా సంభావనచేయుటచే స్వరూపోత్ప్రేక్షాలంకారము.

ఉ. పున్నమరేలఁ గాఁపువిరి•బోఁడులు కాంచనకందుకంబులం
జె న్నగుచంద్రకాంతతట•సీమల వజ్రపుబిల్లదొంతి నే

య న్నెరయంగఁ జాలినర♦యంబున మార్చి గ్రహింతు రింపుతో
నన్నదినిర్మలోర్మికల ♦ నందినపూర్ణసుధాంశుమూర్తులన్. 111

టీ. పున్నమరేలన్=పున్నమరాత్రులయందు. కాఁపువిరిబోఁడులు=కాఁపులయాఁడు వారు. కాంచనకందుకంబులన్=బంగరుచెండ్లచేత. చెన్నగుచంద్రకాంతతటసీమలన్=ప్రకాశించుచున్న చంద్రకాంతమణిఖచితమగుతీరప్రదేశములయందు. వజ్రపుబిల్లదొంతిన్ = వజ్రములతో గుండ్రముగాఁ జేయఁబడినబిల్లలయొక్క దొంతి ననఁగా నొకదానిపైనొకదానిని వరుసగాఁబెట్టినరాశిని. ఏయన్=ఏయఁగా. నెరయన్=ఆబిల్లలంతట నెరసికొనఁగా. చాలినరయరేబునన్=మిక్కిలివేగముచేత. అన్నదినిర్మలోర్మికలనందినపూర్ణసుధాంశుమూర్తులన్ = ఆగంగయొక్క నిర్మలము లగుతరంగములయందుఁ బ్రతిఫలించినపూర్ణచంద్రుని తనువులను. మార్చి=మార్పుచేసి. ఇంపుతోన్=సంతసముతో. గ్రహింతురు=పట్టుకొందురు. ఇచట వజ్రపుబిల్లలనెడుభ్రాంతితోఁ గాఁపువిరిబోఁడులు చంద్రబింబములను గ్రహించుటవలన భ్రాంతిమదలంకారము.

సీ. కమనీయకామినీ♦గానంబు కమనీయ, కామినీగానంబు ♦ గలిసి మెఱయఁ
జక్రాంగచక్రని♦స్వనములు చక్రాంగ, చక్రనిస్వనములు ♦ చక్క నెరయ
బహుళహార్యాళికా♦ర్భటికలుబహుళహా,ర్యాళికార్భటికలై ♦క్యంబు నొంద
సారంగరాజఘో♦షంబులు సారంగ, రాజఘోషములు మి♦త్రత్వ మూనఁ

తే. గలితవాహినికాకల♦కలము నిత్య
కలితవాహినికాకల♦కలము బెరయ
నప్పురవుఁజెల్మిచేఁ బోలె ♦ నమరతటిని
చెంత శుచిజీవనస్థితిఁ ♦ జెలఁగు నెపుడు. 112

టీ. ఇందుగంగాపరమైనయర్థము పురపరమైనయర్థమును దోఁచుచున్నది.కమనీయకామినీగానంబు=మనోజ్ఞస్త్రీలగానము. కమనీయకామినీగానంబు = మనోజ్ఞచక్రవాకస్త్రీగానము. "కామీ స్యాత్కాముకే చక్రవాకే పారావతేఽపిచ" అని విశ్వము.కామియొక్కస్త్రీ కామిని యగును. కలిసి=కూడి. మెఱయన్=ప్రకాశింపఁగా.చక్రాంగచక్రనిస్వనములు=రథసమూహములధ్వనులు. చక్రాంగచక్రనిస్వనములు=హంసనమూహములధ్వనులు. చక్కన్=చక్కఁగా. నెరయన్=కలయఁగా. బహుళహార్యాళికార్భటికలు.—బహుళ=అధికము లగు; హార్యాళికార్భటికలు=అశ్వసంఘముయొక్క హేషలు. బహులహార్యాళికార్భటికలు.—బహుల=అధికము లగు; లహరీ=అలలయొక్క;ఆళికా=సమూహములయొక్క ఆర్భటికలు = ధ్వనులు. ఐక్యంబు నొందన్=అభేదము నవలంబింపఁగా. సారంగరాజఘోషములు = శ్రేష్ఠగజముల యొక్క బృంహితములు. సారంగరాజఘోషములు = గండుఁదుమ్మెదలరుతములు. మిత్రత్వము

సుహృద్భావమును. ఊనన్ = వహింపఁగా. కలితవాహినీకాకలకలము = ఒప్పుచున్న సేనల కోలాహలములు. నిత్యకలితవాహినీకాకలకలములు=ఎల్లపుడుఁ గూడుకొన్న ప్రవాహకోలాహలధ్వనులు. బెరయున్=కూడఁగా. అప్పురపుఁజెల్మి చేఁబోలెన్=ఆవిశాలాపురియొక్క మైత్రితోఁబోలె. అమరతటిని = సురనది. చెంతన్=పురసమీపమున. శుచిజీవనస్థితిన్ = నిర్మలమైన బ్రదుకుయొక్కస్థితిచేత, నిర్మలోదకస్థితిచేత ననుట. ఎపుడున్ = సర్వకాలమందు. చెలఁగున్=ఒప్పును.

గంగానది తనయందున్నకమనీయచక్రవాకస్త్రీగానాదులు విశాలాపురియందున్న కమనీయనారీగానాదులు పరస్పరసామ్యమున మైత్రి నొందఁగాఁ దానును బ్రీతితోఁ బోలె శుచిజీవనస్థితిని దాల్చి శుచిజీవనస్థితియైనపురముచెంత వసించినదనఁగా నొండొరులధర్మము లైక్యముగా నున్న వని భావము.

పురమందున్నవారలజీవనముయొక్క నైర్మల్యమును బట్టి లక్షణచే పురము శుచిజీవనమగు నని యెఱుఁగునది. పురసమీపమందు గంగాస్థితికి హేతువు లగుకామినీగానైక్యాదులు హేతువులుగాఁ జెప్పుటచే హేతూత్ప్రేక్షాలంకారము.

క. ఆరాజధాని కధిపతి, యై రాజిల్లును సుచంద్రుఁ♦డనురాజు మహో
దారగిరీశోరుదరీ, వారవరీవృత్యమాన♦వైరివ్రజుఁడై. 113

టీ. ఆరాజధానికిన్=ఆనగరమునకు. అధిపతి యై=ప్రభు వై. సుచంద్రుఁ డనురాజు=సుచంద్రుఁ డను నామము గలరాజు. మహోదారగిరీశోరుదరీవారవరీవృత్యమానవైరివ్రజుఁడై— మహోదార=మిక్కిలి యధికము లగు; గిరీశ=పర్వతశ్రేష్ఠములయొక్క; ఉరుదరీ= గొప్పదరులయొక్క; వార=సంఘములయందు; వరీవృత్యమాన = మిక్కిలివసించినట్టి; వైరివ్రజుఁ డై= శత్రుసంఘము గలవాఁ డై. రాజిల్లున్=ప్రకాశించును.

సీ. తనచారుకీర్తిసం♦తానవల్లరికి స, జ్జాలముల్ సజ్జాల♦లీల నెనయఁ
దననిత్యదానాంబు♦వనజాలయమునకు,బుష్కరం బతినీల♦పుష్కరము గఁ
దనఖడ్గపుత్ర్యభి♦ధానకాదంబిని, కరిరాజు లరిరాజు♦లై తలంకఁ
దననవ్యధామసాం♦ద్రద్యోతమునకు ఖ, ద్యోతుండు ఖద్యోత♦రీతిఁబూనఁ

తే. దనభుజాభోగిరాడ్భోగ♦మునకు ధర్ణి
చక్ర మెంతయుఁ జక్రప్ర♦శస్తి బెరయ
వెలయు నభిరామసౌందర్య♦విజితమదన
శక్రసుతచంద్రవిభుఁడు సు♦చంద్రవిభుఁడు. 114

టీ. అభిరామసౌందర్యవిజితమదనశక్రసుతచంద్రవిభుఁడు.— అభిరామ=ఒప్పుచున్న; సౌందర్య=చక్కఁదనముచేత; విజిత=జయింపఁబడిన; మదన=మన్మథునియొక్కయు; శక్రసుత

=జయంతునియొక్కయు; చంద్ర=చంద్రునియొక్కయు; విభుఁడు=విశేషకాంతిగలవాఁడైన. సుచంద్రవిభుఁడు=సుచంద్రమహారాజు. తనచారుకీర్తిసంతానవల్లరికిన్= తనయొక్క మనోజ్ఞమగు కీర్తి యనెడుకల్పవల్లికి. సజ్జాలకముల్=రిక్కలగుంపులు. సజ్జాలలీలన్=లెస్సమొగ్గలయొక్క లీలవంటిలీలను ఎనయన్=పొందఁగా. తననిత్యదానాంబు వనజాలయమునకున్=తనయొక్క నిరంతర దానోదక మనెడుసముద్రమునకు. పుష్కరంబు=ఆకసము. అతినీలపుష్కరముగన్=మిక్కిలి నల్లనైనతామర కాఁగా. తనఖడ్గపుత్ర్యభిధానకాదంబినికిన్=తన చురకత్తి యనెడు మేఘమాలకు. అరిరాజులు=శత్రురాజులు. అరిరాజులై= జక్కవరాజులై. తలంకన్=భయపడఁగా. తననవ్యధామసాంద్రద్యోతమునకున్=తన ప్రతాప మనెడుదట్టమగు నెండకు. ఖద్యోతుండు=సూర్యుండు. ఖద్యోతరీతిఁబూనన్=మిడుఁగుఱుఁబురుగుచీతిని వహింపఁగా. తనభుజాభోగిరాడ్భోగమునకున్=తనయొక్క భుజమ నెడు నాదిశేషునిఫణమునకు. ధరణిచక్రము=భూచక్రము. చక్రప్రశస్తిన్=చక్రాయుధఖ్యాతిని. బెరయన్=పొందఁగా. వెలయున్=ప్రకాశించును. ఇచట శ్లేషానుప్రాణితపరంపరితరూపకములకు సంసృష్టి యగు.

చ. అలఘుమహంబునం గువల◆యప్రియకారినిజోదయంబున
న్లలితవసుచ్ఛటావితర◆ణంబున నిస్తులలక్షణంబునం
గలితచకోరదృఙ్నవసు◆ఖప్రదరూపమునం గడున్ విరా
జిలు నలరాజు గైకొనఁగఁ◆ జెల్లదె ధాత్రి సుచంద్రనామమున్. 115

టీ. అలఘుమహంబునన్ = అధికమైన తేజస్సుచేతను, అధికమైనయుత్సవముచేత నని భావము. కువలయప్రియకారినిజోదయంబునన్=నల్లకల్వలకుఁ బ్రియమును జేయుతనయావిర్భావముచేతను, భూవలయమునకుఁ బ్రియముఁ జేయుతనయభివృద్ధిచేత ననుట. లలితవసుచ్ఛటావితరణమ్మునన్ = మనోజ్ఞమైన కిరణపరంపరయొక్క యీవిచేతి, మనోజ్ఞసువర్ణచ్ఛటాదానముచేత ననుట. నిస్తులలక్షణంబునన్ = అసమాన మగుకలంకముచేతను, సాటిలేని రాజచిహ్నముల చేత ననుట. కలితచకోరదృఙ్నవసుఖప్రదరూపమునన్.—కలిత= ఒప్పుచున్న; చకోర = వెన్నెలపులుఁగులయొక్క; దృక్ = చూపులకు; నవ = నూతనమానట్టుగా; సుఖప్రద = సుఖము నిచ్చు; రూపమునన్ = స్వరూపముచేత. కలిత=ఒప్పుచున్న. చకోరదృక్ అనఁగా స్త్రీలు, వారి కపూర్వసుఖము నిచ్చురూపముచేత ననుట. కడున్= మిక్కిలి. విరాజిల్లునలరాజు = ప్రకాశించునారాజు. సుచంద్రనామమున్= సమీచీనమైన చంద్రనామమును. ధాత్రిన్ = భూమియందు. కైకొనఁగఁజెల్లదె = స్వీకరింపఁగఁజెల్లదా, అనఁగా జంద్రునియందున్న తేజము, కువలయప్రియకారి యగునుదయము, వసుచ్ఛటావితరణము, సాటిలేనిచిహ్నము, చకోరదృఙ్నవసుఖప్రదరూపము గలిగియుండఁగాఁ జంద్రుఁ డనునామము నతనికిఁ జెల్లు నని భావము.

ఇచట వర్ణనీయరాజునందు సమర్థనీయ మగుచంద్రనామమును గూర్చి యలఘుమహంబున నిత్యాద్యులను హేతువులుగా సమర్థించినందునఁ గావ్యలింగభేదము.

సీ. పుణ్యజనప్రియ♦మున మించు నేరాజు, ప్రబలు నేరా జవి♦పక్షగుప్తి
నైకసహస్రాక్ష్య♦వాప్తకుం డేరాజు, సకలాశ లేరాజు ♦ చక్కఁ బ్రోచు
బహువజ్రభూషల ♦ భాసిల్లు నేరాజు, దనరు నేరాజు స♦త్కవిహితాత్మఁ
బరదేవహరణచా♦తురి నొప్పు నేరాజు, బలయుక్తి నేరాజు ♦ పరిఢవిల్లుఁ

తే. జెలఁగు నేరాజు నిచ్చ య♦శృంఖలైక
లక్ష్ము లొప్పారఁ దనుఘను♦ల్భక్తిఁ గొలువ
నహహ యారాజు దనరు ది♦వ్యప్రణుత్య
మానితగుణాంశపరిజితా♦మర్త్యరాజు. 116

టీ. ఈపద్యమున సుచంద్రునియం దింద్రునకన్న విశేషము వర్ణితం బయ్యె. ఏరాజు= ఏభూమీశుఁడు. పుణ్యజనప్రియమునన్ = పుణ్యాత్ములయందలి ప్రీతిచేత. మించున్ = అతిశయించునో. ఇంద్రుఁడు పుణ్యజనప్రియుఁడు గాఁ డని వ్యతిరేకము; రాక్షస ప్రియుఁడు కాఁ డని భావము. ఏరాజు. అవిపక్షగుప్తిన్ = శత్రువులు గానివారియొక్క రక్షణముచేత. ప్రబలున్ = అతిశయించునో, ఇంద్రుఁ డట్లు కాఁ డని వ్యతిరేకము; పర్వతములయొక్క ఱెక్కలగోపనముచేత నింద్రుఁడు ప్రబలువాఁడు కాఁ డని భావము. ఏరాజు. నైకసహస్రాక్ష్యవాప్తకుండు.— నైక = అనేకములగు; సహస్ర = సహస్ర సంఖ్యలుగల; అక్షి = రథములను. అవాప్తకుండు = పొందినవాఁడు, ఇంద్రుఁడు (ఏకసహస్రాక్ష్యవాప్తకుండు) ఒకవేయినేత్రములు గలవాఁ డనిభావము. నైకసహస్ర యనుచోటఁ 'సుప్సుపా' యనుసూత్రముచేత సమాసము. ఏరాజు. సకలాశలు=సర్వదిక్కులు. చక్కన్= చక్కగా. ప్రోచున్ = పాలించునో. ఇంద్రుఁ డొకతూర్పుదిక్కునే పాలించువాఁడు. ఏరాజు. బహువజ్రభూషలన్ = అధికహీరమయభూషణములచేత. భాసిల్లున్ = ప్రకాశించునో. ఇంద్రుఁడు బహువజ్రభూషలు గలవాఁడు కాఁడు మఱి మన్న నొకవజ్రాయుధమనెడుభూషచే భాసిల్లువాఁ డనిభావము. ఏరాజు. సత్కవిహితాత్మన్=మంచిపండితులకు హితమైనస్వభావముచేత. తనరున్ = ఒప్పునో. ఇంద్రుఁడు సత్కవిహితాత్మచేఁ దనరఁడు, అనఁగా శ్రేష్ఠుఁ డైనశుక్రునకు హితుఁడు కాఁ డనుట. ఏరాజు. పరదేవహరణచాతురిన్ = పరరాజసంహారచాతుర్యముచేత. ఒప్పున్. ఇంద్రుఁడు పరదేవహరణచాతురి గలవాఁడు కాఁడు; అనఁగా నుత్కృష్టు లగుదేవతలను సంహరించువాఁడు కాఁ డనుట. ఏరాజు. బలయుక్తిన్.—బల = సామర్థ్యముయొక్క; యుక్తిన్ = సంబంధముచేత. పరిఢవిల్లున్ = అతిశయిల్లునో. ఇంద్రుఁడు బలయుక్తిచేతఁ బరిఢవిల్లఁడు, అనఁగా బలాసురునిసంబంధము చేయఁ డనుట. ఏరాజు. నిచ్చ = ఎల్లపుడును. అశృంఖలైకలక్ష్ములు = అడ్డములేనట్టి ముఖ్యసంపదలు. ఒప్పారన్ = ఒప్పుచుండఁగా. తనున్ = తన్ను. ఘనుల్ = గొప్పవారు. భక్తిన్ = ప్రీతిచేత. కొలువన్ = సేవింపఁగా. చెలఁగున్ = ఒప్పునో. ఇంద్రుఁ డశృంఖలైకలక్ష్ము లొప్పారఁ దను ఘనుల్గొలువఁ జెలఁగువాఁడు కాఁడు, అనఁగా శృంఖలము

లతోఁ దగిలి యున్న మేఘములతో సేవింపఁ బడువాఁ డనిభావము. దివ్యప్రణుత్యమానిత గుణాంశపరిజితామర్త్య రాజు=దేవతలచేతఁ గొనియాడఁ దగినపూజ్యము లగుగుణలేశముల చేత నోడింపఁబడినయింద్రుఁడుగలవాఁడైన. ఆరాజు=ఆసుచంద్రనరేంద్రుఁడు. తనరుక్=ఒప్పును. అహాహా=ఆశ్చర్యము. సుచంద్రుండు మనుష్యమాత్రుం డయ్యు సర్వాతిశయగుణగరిష్ఠుం డగునింద్రునిఁ దనగుణలేశముచేత జయించుట యాశ్చర్య మని యాశయము. వ్యతిరేకాలంకారము.

మ. పరిసంవర్ధితచంద్రనాగకులరా•ట్పద్మామృతం బై నిరం
  తరముం బొల్చుతదుర్వరాధిపసము•ద్యత్కీర్తివారాశి పం
  కరుహోజాండము నిండుటల్ నిజ మటుల్ • గా కున్నచోఁ బుష్కరా
  న్తరసీమం గనుపట్టునే తరణిమ•ణ్డల్యేకసంచారముల్. 117

టీ. పరిసంవర్ధితచంద్రనాగకులరాట్పద్మామృతం బై.—పరిసంవర్ధిత=వృద్ధిఁ బొందింపఁబడిన; చంద్ర = చంద్రుఁడు; నాగకులరాట్=ఐరావతము; పద్మా = లక్ష్మి; అమృతం బై=సుధయుఁ గలదై, అని సముద్రపరార్థము. మిక్కిలి ఖండింపఁబడిన చంద్రుఁడు,ఐరావతము, పద్మములు, అనఁగాఁ దెల్లతామరలు, అమృతమును గలదై యని కీర్తిపరార్థము. నిరంతరముళ్=ఎల్లపుడును. పొల్చుతదుర్వరాధిపసముద్యత్కీర్తి వారాశి= ఒప్పుచున్నయారాజుయొక్కప్రకాశించుకీర్తి యనెడుసాగరము. పంకరుహోజాండము = పద్మమందు నుదయించినబ్రహ్మసంబంధి యైనఅండము, అనఁగా బ్రహ్మాండము. నిండుటల్=నిండియుండుటలు. నిజము = సత్యము. అటుల్ గా కున్నచోళ్=అట్లు కీర్తివారాశి బ్రహ్మాండము నిండ కున్నచో. పుష్కరాంతరసీమళ్.—పుష్కర = ఆకాశ మనెడునీటియొక్క; అంతరసీమళ్ = మధ్యప్రదేశమందు. తరణిమండల్యేకసంచారముల్.—తరణిమండలి = ఖగపూషహిరణ్యగర్భాదిసూర్యమండలి యనెడునావలగుంపులయొక్క; ఏక = ముఖ్య మగు; సంచారముల్=సంచరణములు. చూపట్టునె=కనఁబడునా.

కీర్తివారాశి బ్రహ్మాండము నిండనియెడ నాకాశమధ్యమున నావలు సంచరించుట ఘటింపదు గావునఁ గీర్తివారాశి బ్రహ్మాండములు నిండినదే నిజ మని యాశయము. సుచంద్రుని కీర్తి చంద్రాదులను తిరస్కరించి యనఁగా వానికన్న నెక్కుడైనశుక్లగుణమును వహించి సముద్రమువలె బ్రహ్మాండములు వ్యాపించిన దని భావము. ఇచటఁ గీర్తివారాశికర్తృక బ్రహ్మాండవ్యాపనమును పుష్కరాధికరణకతరణిమండలీసంచారములతో నూహించినందున ననుమానాలంకారము.

చ. అలఘుసమిత్తలంబున మ•హామహిమంబునఁ బొల్చునాకు భృ
  త్కులమణిదోర్గ్రప్రతాపశిఖి•కూటమిభశ్రుతివీజనానిలం
  బులఁ గడుఁ బర్విసం గరఁగుఁ • బో యని కాదె యజాండసీమకుక్
  వలగొనఁ జేసె ధాత యని•వార్యజలావరణంబు నేర్పునన్. 118

టీ. అలఘుసమిత్తిలంబునన్=అతిశయమగుయుద్ధరంగ మనెడుసమిధలపట్టున. మహామహిమంబునన్=అతిశయమైనమహిమచేత. పొల్చునాకుభృత్కులమణిదోఃప్రతాపశిఖికూటము.—పొల్చు=ఒప్పుచున్న; ఆకుభృత్కులమణి=ఆరాజశేఖరుఁ డనెడుపర్వతశ్రేష్ఠముయొక్క; దోఃప్రతాపశిఖికూటము=బాహుప్రతాప మనెడుకాఱుచిచ్చుగుంపు. ఇభశ్రుతివీజనానిలంబులన్.—ఇభ=ఏనుఁగులయొక్క; శ్రుతి=శ్రోత్రము లనెడు; వీజన=విసనకఱ్ఱలయొక్క; అనిలంబులన్ = వాయువులచేత. కడున్=మిక్కిలి. పర్వినన్=వ్యాపించినచో. కరఁగుఁబో యనికాదె = ద్రవించునుబో యని కాదా. ధాత = బ్రహ్మదేవుఁడు. అజాండసీమకున్ = బ్రహ్మాండప్రదేశమునకు. అనివార్యజలావరణంబు = నివారింపరానిజలముయొక్క ఆచ్ఛాదనమును అనఁగా సముద్రములను. నేర్పునన్ = చాతుర్యముచేత. వలగొనన్ = చుట్టుకొనునట్లు. చేసెన్=ఒనరించెను.

అజాండమునకు జలావరణకరణమును గూర్చి హేతువు గాని సుచంద్రప్రతాపవహ్నిద్రావణమును హేతువుగాఁ జెప్పుటవలన హేతూత్ప్రేక్షాలంకారము. ప్రతాపాదులయందు శిఖిత్వాద్యారోపమున రూపకము.

సీ. గురుతరత్వచిసార♦గుల్మోత్కరమ్ములు, సరసవిహారమం♦దిరము లయ్యె
ఘనకందరాముఖో♦ద్గతఝరీజాలంబు, కేళికాదీర్ఘికా♦పాళి యయ్యెఁ
గటకశోభితతత♦గ్రావకూటంబు లు, ద్భ్రాజదాస్థానవి♦తర్దు లయ్యె
నభినవశతపర్వి♦కావృతాధిత్యకల్, కలితప్రసవతల్ప♦కులము లయ్యె

తే. సంతతమునాటవికవర♦సముదయంబు, లభిమతవయస్యవర్యచ♦యమ్ము లయ్యె
మలయ నగవీథి నమ్మహీ♦వలయనాథ, చంద్రశాత్రవగోత్రాత♦లేంద్రతతికి.

టీ. అమ్మహీవలయనాథ చంద్రశాత్రవగోత్రాతలేంద్ర తతికిన్.—అమ్మహీవలయనాథచంద్ర = ఆరాజచంద్రుఁ డగుసుచంద్రునియొక్క; శాత్రవగోత్రాతలేంద్రతతికిన్ = శత్రురాజబృందమునకు. అగవీథిన్=పర్వత ప్రదేశమందు. మలయన్=తిరుగునట్లుగా; కాదేని, మలయనగవీథిన్=మలయ పర్వతప్రాంతమం దనియర్థము. గురుతరత్వచిసారగుల్మోత్కరమ్ములు.—గురుతర=మిక్కిలి గొప్పవైన; త్వచిసారగుల్మ=వేణుగుల్మములయొక్క; ఉత్కరమ్ములు=సమూహములు. సరసవిహార మందిరములు=శ్రేష్ఠము లగు క్రీడాగృహములు. అయ్యెన్. ఘనకందరాముఖోద్గతఝరీజాలంబు = గొప్పదరీముఖములవలనఁ బయలుదేఱుచున్నసెలయేఱుల గుంపు. కేళికాదీర్ఘికాపాళి=క్రీడావాపీసమూహము. అయ్యెన్. కటకశోభిత తతగ్రావకూటంబులు.—కటక = కొండలనడిమిభాగములయందు; శోభిత = ప్రకాశించుచున్న; తత= విశాలములగు; గ్రావ = పాషాణములయొక్క; కూటంబులు=గుంపులు. ఉద్భ్రాజదాస్థానవితర్దులు.—ఉద్భ్రాజత్ = ప్రకాశించుచున్న; ఆస్థాన = కొలువుకూటమందలి; వితర్దులు = వేదికలు. అయ్యెన్. అభినవశతపర్వికావృతాధిత్యకల్.— అభినవ = నూతన మగు. శత

పర్వికా= నల్లగతికచేత. “గోలోమీ శతపర్వికా” అని యమరుఁడు; అవృత=వ్యాప్తము లగు. అధిత్యకల్ = పర్వతోపరిప్రదేశములు “ఉపత్యకాద్రే రాసన్నా భూమి రూర్ధ్వ మధిత్యకా” అని యమరుఁడు. కలితప్రసవతల్ప కులములు.— కలిత = ఒప్పుచున్న; ప్రసవతల్ప = పువ్వులపాన్పులయొక్క; కులములు = సమూహములు. అయ్యెన్. సంతతమున్= ఎల్లప్పుడును. ఆటవికవరసముదయంబులు = ఆరణ్యకులైన కిరాతకులగుంపులు. అభిమతవయస్యవర్య చయములు = అనుకూలమైన మిత్రవరుల సమూహములు. అయ్యెన్ = ఆయెను. సుచంద్రనరేంద్రుని యుగ్రప్రతాపమువలన భీతులయి యరినృపతు లడవులపాలైరని భావము. ఇందు రూపకములకు సంసృష్టి.

మ- ఇల సజ్జాలకభాసమాన మగునా♦పృథ్వీశుకీర్త్యాఖ్యని
ర్మలహర్మ్యేంద్రమునం దదీయనవధా♦మవ్యాజమార్తాండమ
ణ్డలరోచుల్ ప్రసరింప నచ్చటఁ గన♦ రాజిల్లువేధోండమ
ణ్డలు లెంతేఁ ద్రసరేణుబృందసమత♦ న్సంధించి యెల్లప్పుడున్. 120

టీ. ఇలన్ = భూమియందు. సజ్జాలకభాసమాన మగునాపృథ్వీశుకీర్త్యాఖ్యనిర్మలహర్మ్యేంద్రమునన్.—సత్ = శ్రేష్ఠములగు; జాలక = గవాక్షములచేత. భాసమాన మగునని సౌధపరమైనయర్థము. సత్పురుషుల సంఘముచేత భాసమాన మనఁగాఁ గొనియాడఁబడిన దని కాని సజ్జాలకమువలె భాసమాన మని కాని కీర్తిపరమైన యర్థము. సజ్జాలక మనఁగా నక్షత్రములగుంపు, శ్రేష్ఠ మగు మొగ్గలును; ఆపృథ్వీశు=ఆరాజుయొక్క; కీర్త్యాఖ్య=కీర్తి యను నామముగల; నిర్మల=స్వచ్ఛమగు; హర్మ్యేంద్రమునన్=ఉత్తమసౌధమునందు. తదీయ నవధామవ్యాజమార్తాండమండలరోచుల్=ఆరాజుసంబంధియైనప్రతాపమనెడునెపము గలసూర్యమండలకాంతులు. ప్రసరింపన్=వ్యాపింపఁగా. అచ్చటన్ కనన్ = ఆమేడలోఁ జూడఁగా. వేధోండమండలులు=బ్రహ్మాండములగుంపులు. ఎంతేన్=మిక్కిలి. త్రసరేణు బృందసమతన్.— త్రసరేణు = త్ర్యణుకములయొక్క; బృంద = సంఘముయొక్క; సమతన్ = సామ్యమును. సంధించి = పొంది. ఎల్లప్పుడున్ = సర్వకాలమును, ప్రతాపసూర్యప్రభ దివారాత్రము లుడిపోవనిది గావున నెల్లప్పుడు ననుట. రాజిల్లున్ = ప్రకాశించును. అనఁగా నొకమేడయందు గవాక్షద్వారముగ సూర్యకిరణములు ప్రసరింపఁగా నాతేజస్సునందుఁ బరాగాదులసూక్ష్మావయవములు గాన్పించినయట్లు సుచంద్రునికీర్తి యను మేడలో నారాజు ప్రతాపవ్యాజసూర్యకాంతులు ప్రసరింపఁగా నచట బ్రహ్మాండకోటులు త్ర్యణుకములగుంపుల వలెఁ గాన్పించు నని యాశయము. ఇందులకు “శ్లో. జాలసూర్యమరీచిస్థం సూక్ష్మం య ద్దృశ్యతే రజః తస్య షష్ఠతమోభాగః పరమాణు స్స ఉచ్యతే” అని తర్కపరిభాషయందుఁ జెప్పఁబడినది. ఆపరమాణువు ద్వ్యణుకమును చక్షుఃప్రత్యక్షగోచరములు గా వనియుం త్ర్యణుకము మొదలుగఁ బ్రత్యక్షగోచరము లగు ననియుం వ్రాయఁబడియె. ఇట్లు చెప్పఁగా సుచంద్రుని కీర్తి సమస్తబ్రహ్మాండములఁ నావరించిన దనియు నారాజుప్రతాపము సూర్యప్రభవలె దివారాత్రములు వెలుఁగుచున్న దనియుం భావము.

సీ. ఆత్మకిరాతత్వ♦మత్యుత్సవముఁ బూన్ప,వనచరావృతిఁ గూర్మ♦వర్యుఁ డలరు
ననిశంబు దర్వీక♦రాప్తిఁ జేకొని మహా,ప్రజ్ఞుఁ డై కుండలి♦రాజు దనరుఁ
బరపద్మినీసుసం♦పర్కంబుఁ జేసి దృ,ప్తుండయి దిక్కరీం♦ద్రుండు ప్రబలు
బహ్వాబ్దసంగతిఁ ♦ బడసి యెచ్చటఁ జరిం, పఁగ నోపక కులాద్రి♦భర్త నిల్చు

తే. గహనముల నొక్కఁడై దంష్ట్రి♦కాంతుఁ డడరు
ననుచు నిరసించి సత్కులు ♦ నమలరూపు
ననఘుగుణు నాత్తయశావను ♦ నలఘుసంప
దాఢ్యు రాకొమరునిఁ జెంది ♦ యవని యలరు. 121

టీ. కూర్మవర్యుఁడు = ఆదికూర్మము. ఆత్మకిరాతత్వము=తనబోయతనము. అత్యుత్సవము=అతిసంతసమును. పూన్పన్=వహింపఁజేయఁగా.వనచరావృతిన్=అరణ్యసంచారులవ్యాప్తిచేత. అలరున్=ఒప్పును. ఆత్మకున్. ఇరాతత్వము. ఉదకమందు సంతతసంచార మత్యుత్సవముఁ బూన్పఁగా వనచర అనఁగా జలచరములైనమత్స్యాదులయొక్కఆవృతిచేతఁ గూర్మవర్యుఁ డలరునని భావము. “ఇరాభూవాక్సురాప్సుస్యాత్” అనియమరుఁడు. కుండలిరాజు=శేషుండు. అనిశంబున్ = ఎల్లపుడు.దర్వీకరాప్తిన్.—దర్వీ=తెడ్లవంటి; కర=హస్తములయొక్క;ఆప్తిన్=ప్రాప్తిచేత. మహాప్రజ్ఞుఁడై=మిక్కిలి ప్రకృష్టములైనమోకాళ్ళు గలవాఁడై “ప్రజ్ఞుఃప్రగతజానుకః” అని అమరుఁడు. ‘ప్రసంభ్యాంజానునోర్జ్ఞుః’ అను సూత్రముచే జానుశబ్దముపై ‘జ్ఞు’ ఆదేశమగు. విశేషణద్వయముచేత శేషుఁడు కురూపియని తోఁచుచున్నది. ఎల్లపుడు సర్పసాంగత్యము గలవాఁ డనియు మహాబుద్ధిశాలియనియు భావము. తనరున్= ఒప్పును. దిక్కరీంద్రుండు = దిగ్గజరాజు. పరపద్మినీసుసంపర్కంబున్=పరస్త్రీసాంగత్యమును. చేసి = కావించి. దృప్తుండయి = గర్వియై. ప్రబలున్ = అతిశయించును. దిక్కరి గొప్పయాఁడేనుఁగుతో సంబంధముఁ జేసి మత్తుగొని యుండునని భావము. పద్మియొక్కస్త్రీ పద్మినీ పద్మి యనఁగా గజము. “ఇభస్తమ్బేరమః పద్మీ” అని యమరుఁడు. కులాద్రిభర్త = కులాచలశ్రేష్ఠము. బహ్వాబ్దసంగతిన్ = అనేకసంవత్సరముల సంబంధమును. పడసి=పొంది.ఎచ్చటఁ జరింపఁగనోపక=ఎచటను సంచరింపఁజాలక.నిల్చున్. మిక్కిలి వృద్ధత్వముగలవాఁ డని తోఁచు చున్నది. కులాద్రిభర్త బహుళమైన అబ్దములనఁగా మేఘములు వానితోఁగూడి చరింపఁగనోపక అనఁగా రేఫలకారముల కభేదముగావునఁజలింపఁగనోపక, అచలత్వముచేత నొప్పి నిల్చియుండునని భావము. దంష్ట్రికాంతుఁడు=వరాహపతి. ఒక్కఁడై=వెనుకముందులేనివాఁడై. గహనములన్= దుఃఖములచేత. అడరున్=అతిశయించును. వరాహము తా నొక్కటియే యడవులయందు సంచరించు ననుట. అనుచున్=ఇట్లనుచు. అవని=భూరమణి. నిరసించి=కూర్మరాజు మొదలగువారిని నిరాకరించి. సత్కులున్=ఉత్తమకులమువాని, కూర్మరాజువలె నీచజాతివాఁడు గానివాని ననుట. ఇట్లు గీతియందుఁ జెప్పినవ్యతిరేకవిశేషణమునకుఁ గ్రమముగా నన్వయము తెలియునది. అమల

రూపుఁ=లోకోత్తరసౌందర్యముగలవాని. ఆత్తయౌవనుఁ=రూఢతారుణ్యము గలవాని. అలఘుసంపదాఢ్యుఁ=అధికమైనపుత్రమిత్రకళత్రాదిసంపదచేఁ బూర్ణుని. రాకొమరునిఁ=రాజపుత్రుండగుసుచంద్రుని. చెంది=పొంది. అలరుఁ=ఒప్పును. సుచంద్రుండు సర్వభూమిభరణముఁ జేయుచు సర్వగుణసంపత్తిచేత రాజిల్లె ననిభావము. వ్యతిరేకక్రమాలంకారములు.

మ. కనుఁజాయన్ సిరి వాయ కెప్పుడుఁ జెలంగన్ సమ్ముఖం బంది పా
వని వాగ్భామిని యొప్పఁ గీర్తి శుచిభావం బూని సేవింప మే
దిని బాహాంతరసంగతిం బొదల ధాత్రీభర్త దాక్షిణ్యవ
ర్తనసత్ప్రీతి వహించి మించు సురవర్యస్తుత్యనిత్యోన్నతిన్. 122

టీ. సిరి=లక్ష్మి. కనుఁజాయన్=కన్నులయెదుట ననుట. ఎప్పుడున్=ఎల్లకాలమును. వాయక=వదలక. చెలంగన్=ఒప్పఁగా. రాజులకు సిరి కనుఁజాయ ననఁగా నేత్రకాంతియందుండు నని ప్రసిద్ధము. పావని=పవిత్ర యగువాగ్భామిని, వాణియను స్త్రీ. సమ్ముఖంబు=ఆభిముఖ్యమును. అంది ఒప్పన్=పొంది యొప్పు చుండఁగా. వాణిసంగత మైనముఖం బంది యుండు ననుట. కీర్తి=కీర్తికాంత. శుచిభావంబు=శుద్ధాంతఃకరణమును, నిర్మలస్వభావము ననుట. పూని=వహించి. సేవింపన్=కొలుచు చుండఁగా. మేదిని=భూమి. బాహాంతరసంగతిన్=వక్షస్స్థలముయొక్క సంబంధముచేత, భుజమధ్యసంబంధముచేత ననుట. భూదేవి భుజము చేఁ బాలింపఁబడుట ప్రసిద్ధము. పొదలన్=ఒప్పఁగా. ధాత్రీభర్త=సుచంద్రుఁడు. దాక్షిణ్యవర్తనన్=దక్షిణనాయకభావ మనెడువృత్తిచేత. "తుల్యో నేకత్ర దక్షిణః" అని లక్షణము. మొగమోటపునడువడిచేత ననుట. సత్ప్రీతిన్=మంచిప్రేమమును, విద్వత్ప్రీతి ననుట. వహించి. సురవర్యస్తుత్యనిత్యోన్నతిన్ = దేవతోత్తములచేఁ గొనియాడఁదగిన నిత్యవైభవాతిశయముచేత. మించున్=అతిశయించును. సుచంద్రనృపతికటాక్షప్రసరణమాత్రమున లక్ష్మి గలుగు ననియు, నాతండు సర్వవిద్యలు చదివినవాఁ డనియు, నుత్కృష్టకీర్తిశాలి యనియు, సర్వభూమిని పాలించువాఁ డనియు భావము.

వ. సకలజగచ్ఛాసనపాండితీధురంధరుం డగు నా రాజశేఖరుం డొక్కనాఁ
డాత్మీయసేవాసమాయాత నానాదిశాధినాయక మనోమహోత్సవోల్లాస
సంపాదకవిఖ్యావిభాసితచంద్రమకుటాలంకృతోత్తమాంగుండును గరుణా
రసపరిపూరితాపాంగుండును నఖిలభువనవిజిగీషుప్రసవేషుయోజితరసాల
శరాసనాంతరదృశ్యమానకోకనదపలాశాదభ్రవిభ్రమదభ్రూమధ్యవిరో
చమానశిఖిశిఖాంచితవిశేషకవిశేషుండును వదనేందునిర్గతచంద్రికాయిత
దరహాసభూషుండును మహాభోగమణిగణసముపేతాహీనాంగదశోభిత
బాహుండును నతనుభూతిభాసమానదేహుండును ననవధికైకసద్ద్యుతి
యుక్తహార విభూషితగళుండును శారదఘన ప్రభాజయకృత్త్యసితాం

శుకసంవేష్టితనితంబతలుండును హరివిరోచనసంతతిరసాధీశరాజవరమకు
టవాటికాఘటితసరోజరాగమరీచిరాజినీరాజితచరణకుశేశయుండును ధీర
గణాలోకామోదదాయిశృంగారాతిశయుండును నగుచుఁ గలితమహారజత
కూటస్తంభవారంబులం గమనీయకాంచనవితానగుచ్ఛప్రభాంకూరం
బులం గలకంఠికాజనగానామృతాసారంబులం గర మొప్పుకలధౌతాగా
రారాజదాస్థానభవనరాజంబునం గనత్తరాహిరిపుమణిమయభద్రాసనం
బున సుఖాసీనుండై యహితమహాబలవిధ్వంసనశంసనీయసామర్థ్యధురీ
ణుండు గావున నిజపరాభూతికారణదారుణసమీరణసముత్సారణంబు గోరి
తనకు విన్నవింపఁ జేరిన మేఘమండలంబుడంబున నొక్కవిబుధకుధరకుచార
త్నంబు వట్టినమేఘడంబరంబు గనకఝల్లరీశంపావల్లరీభాసురంబై యేపు
సూప నరిభేదనోదారకరకాండమండితరాజసాహాయ్యంబును నతిదీప్రతర
ప్రకాశాన్వితసదనీకసాంగత్యంబును నధిగమించి విజృంభించునిశాధిదే
వతతో జగడంబు చరింప నోపక పట్టువడినయంబుజాప్తబింబంబుతీరున
నొక్కహారి నీలకుంతలావతంసంబు వూనినయభిరూపజాతరూపహంసరూప
ధూపకరండంబువలనఁ జాలుగా వెడలుసామ్రాణిధూపధూమమాలికలు
తదంతరసంస్థాయిరమారమణతనూతలవినిర్యదభిరామశ్యామధామమాళికల
మోహంబు నివ్వటిల్లఁ జేయ నిరంకుశపంకజరాగకంకణక్రేంకారపూర్వకం
బుగా నొక్కరాజకీరవాణీలలామ వీచుధవళవాలవ్యజనంబు లనుపమా
నపవమానమృదుయానకలనానద్యమానగగనగంగాతరంగడోలికావీథి
నుయ్యాల లూఁగునవదాతపత్త్రంబులకు సగోత్రంబులై వైచిత్రిఁ జిత్రింప
విశాలవిలోచనశతపత్త్రపత్త్రవిలసనంబును విమలభుజామృణాళ సౌంద
ర్యంబును వినీలభ్రమరకసౌష్ఠవంబును విరంజితకింజల్కమాంజుల్యంబును
బూని సరసగణ్యలావణ్యవైభవంబున నెలరుపద్మినిపై మోహంబు
వూని పౌర్వకాలికవైరంబు డించి ప్రియంబు వచింపఁ జేరి తత్కరకమల
లాలితం బగుశీతాంశుమండలంబుదండి నొక్కభుజంగభుఙ్మందయానామ
తల్లి దాల్చినకర్పూరకలాచిక నయనామోదవీచికం జేకూర్ప మహానంది
గోరాజకుమారముఖ్యులు సెంతలం గొలువ నపూర్వవిభవంబునం బేరో
లగం బుండు నవసరంబున. 123

టీ. ఈవచనంబున రాజశేఖరుం డనుకర్తృపదము చే నప్రకృతచంద్రశేఖరపరమైన యర్థాంతరము స్ఫురించు చున్నది. సకలజగచ్ఛాసనపాండితీధురంధరుఁడు = సర్వజగత్పాలనపాండిత్యభారమును వహించువాఁడు. అగునారాజశేఖరుండు=అగునట్టి యారాజపరమేశ్వరుండు. ఒక్కనాఁడు దీనికిఁ బేరోలగం బుండు నవసరంబున నను దానితో నన్వయము.

సకలలోకశిక్షాదక్షుఁడగు ప్రసిద్ధచంద్రశేఖరుం డని యర్థాంతరము. ఆత్మీయసేవాసమాయాత నానాదిశాధినాయక మనోమహోత్పలోల్లాససంపాదకవిభావిభాసితచంద్రమకుటాలంకృతోత్తమాంగుండును.— ఆత్మీయసేవాసమాయాత = తనసేవకొఱకువచ్చిన; నానాదిశాధినాయక=నానాదిక్కులయందలిరాజులయొక్క; మనోమహోత్పల = హృదయకమలముయొక్క "అరవిందం మహోత్పలమ్" అని యమరుఁడు. ఉల్లాససంపాదక = వికసనసంపాదక మగు; విభా=విశేషకాంతి చేత; విభాసిత=మిక్కిలిభాసించు చున్న; చంద్రమకుట= సువర్ణకిరీటము చేత; "గైరికం వసు చన్ద్రికం" అని యమరుఁడు. అలంకృత= అలంకరింపఁబడిన; ఉత్తమాంగుండును=శిరస్సు గలవాఁ డని రాజపర మైనయర్థము. సేవాసమాయాతనానాదిశాధినాయక=సేవాగతాష్టదిక్పాలకులయొక్క; మనః=మన స్సనెడు; మహత్ =గొప్ప దగు. ఉత్పల=కల్వయొక్క; ఉల్లాససంపాదకవిభావిభాసిత మైన; చంద్రమకుట = చంద్రుఁ డనెడుకిరీటముచేత నలంకృతోత్తమాంగుం డని యీశ్వరపర మైనయర్థము. కరుణారసపరిపూరితాపాంగుండును=దయాతిశయముచే పూర్ణమగుకటాక్షము గలవాఁ డని రెంట నొక్కయర్థమే. ఇచట రసపదమునకు శృంగారాద్యన్యతమ మర్థము గాదు. కరుణాఖ్యరసము శోకస్థాయికమై ప్రకృతాననుగుణము గావునను, రసపర మైనపుడు కరుణపదము స్త్రీలింగము గా నందున నని తెలియునది. ఇందలివిస్తరము మాచ్రవ్రాసినకావ్యాలంకారసంగ్రహవిమర్శమునఁ దెలియును. అఖిలభువనవిజిగీషుప్రసవేషుయోజితరసాలశరాసనాంతరదృశ్యమానకోకనదపలాశాదభ్ర విభ్రమద భ్రూమధ్య విరోచమాన శిఖిశిఖాంచిత విశేషక విశేషకుండును.—అఖిలభువనవిజిగీషు=ఎల్లజగంబులు గెలువవలె ననుకోరిక గల; ప్రసవేషు = మన్మథుని చేత; యోజిత = ఎక్కువెట్టఁబడిన ; రసాలశరాసన = చెఱకువిల్లుయొక్క. "రసాల స్త్విక్షు చూతయోః" అని విశ్వము. అంతర = మధ్యభాగమందు; దృశ్యమాన=చూడఁబడుచున్న; కోకనదపలాశ = ఎఱ్ఱతామర ఱేకుయొక్క ; అదభ్రసుభ్రమద = అధికభ్రాంతి నిచ్చెడు ; భ్రూమధ్య విరోచమాన = బొమలనడుమ వెలుంగుచున్న ; శిఖిశిఖ = కుంకుమ చేత; "కాశ్మీరజ న్మాగ్నిశిఖమ్" అని యమరుఁడు, అంచిత = ఒప్పు చున్న; విశేషకవిశేషుండును = తిలకవిశేషము గలవాఁడును. ఈశ్వరపర మైనపుడు, శిఖిశిఖా = అగ్నిజ్వాల చేత; అని మాత్రము భేదము తక్కినది సమానము. వదనేందు నిర్గత చంద్రికాయితదరహాస భూషుండును = ముఖ మనెడు చంద్రునివలన వచ్చు చున్న వెన్నెలవలె నుండు మందహాసము భూషణముగాఁ గలవాఁ డని రెంట సమానము. మహాభోగ మణిగణసము పేతాహీనాంగదశోభితబాహుండును.— మహాత్ = అధిక మైన; ఆభోగ = పరిపూర్ణత గల; మణిగణ = మణిసంఘములతోడ; సము పేత = కూడుకొన్న; అహీన = గొప్పలైన; అంగద = భుజకీర్తుల చేత; శోభిత = ప్రకాశించు చున్న ; బాహుండును = భుజములు గలవాఁడును, అని రాజపర మైన యర్థము. మహాత్ = గొప్ప లైన ; భోగ = పడగలయందు ; "భోగస్తు ఫణకాయయోః" అని రత్నమాల. మణిగణము చేత సము పేత మగు అహీన శేషుండను, అంగదముచే శోభితబాహుం డని యీశ్వరపర మైనయర్థము. అతనుభూతిభాసమానదేహుండును.—అతను = అధిక మైన ; భూతి = సంపదచేత ; భాస

మాన = ప్రకాశమాన మగు; దేహుండును = శరీరము గలవాఁడును అని రాజపర మైనయర్థము. మన్మథునియొక్క భస్మముచేతఁ బ్రకాశించుదేహము గలవాఁ డని యీశ్వరపర మైనయర్థము. అనవధికైకసద్ద్యుతియుక్తహారవిభూషితగళుండును.—అనవధిక = మేర లేని ; ఏక = ముఖ్యమైన ; సద్ద్యుతి=మంచికాంతితోఁడ ; యుక్త=కూడుకొన్న ; హార=ముక్తావళిచేత; భూషిత=అలంకృత మగు ; గళుండును=కంఠముగలవాఁడు నని రాజపరార్థము. అనవధి=మేర లేని ; కైకస=కీకససంబంధిని యైన, కీకసము లనఁగా నస్థులు "కీకసం కుల్య మస్థిచ" అని యమరుఁడు. ద్యుతితోఁడ యుక్త మగుహారముచే భూషితగళుం డని యీశ్వరపర మైనయర్థము. శివుఁడు కపాలమాలాధరుఁడగుట ప్రసిద్ధము. శారదఘనప్రభాజయకృత్త్యసితాంశుకసంవేష్టితనితంబతలుండును.—శారదఘనప్రభా=శరన్మేఘకాంతియొక్క; జయ=గెలుపే; కృత్త్యా=ప్రయోజనముగాఁగల; సితాంశుక=శుభ్రవస్త్రముచేత; సంవేష్టిత=చుట్టఁబడిన; నితంబతలుండును=మధ్యప్రదేశము గలవాఁడును అని రాజపరార్థము. శారద=మేఘసంబంధినియైన. శరదశబ్దముపై "తస్యేద" మనుసూత్రముచే నణ్ప్రత్యయము వచ్చినది. ఘనప్రభా=గొప్పకాంతియొక్క, అనఁగా నల్లనికాంతియొక్క; కాదేని, శారద=నూతన మగు; ఘన=మేఘముయొక్క, ప్రభయొక్క; "శారదః పీతమన్దేనా ప్రత్యగ్రేప్రథితే త్రిషు" అని వైజయంతి. కాదేని శారదఘన సజలజలదముయొక్క, స్వార్థికాణ్ ప్రత్యయము. ప్రభా = కాంతియొక్క; జయ=జయముగల ; కృత్తి=గజచర్మ మనెడు ; అసితాంశుక=నీలిదుప్పటముచేత ; సంవేష్టితనితంబతలుండని యీశ్వరపర మైనయర్థము. కైకసద్ద్యుతి జయకృత్త్యశబ్దములలో "అనచిచ" అనుసూత్రముచే దకారతకారములకు ద్విత్వము. హరివిరోచనసంతతిరసాధీశరాజవరమకుటవాటికాఘటితసరోజరాగమరీచిరాజినీరాజితచరణకుశేశయుండును.—హరి= చంద్రునియొక్కయు; విరోచన=సూర్యునియొక్కయు ; సంతతి=వంశపువా రైన; రసాధీశరాజ=నృపశ్రేష్ఠులయొక్క; వర=శ్రేష్ఠము లగు; మకుట=కిరీటములయొక్క; వాటికా=పరంపరలయందు; ఘటిత=కూర్పఁబడిన; సరోజరాగ=పద్మరాగములయొక్క; మరీచిరాజి=కిరణసమూహముచేత; నీరాజిత=హారతియొత్తఁబడిన; చరణకుశేశయుండును= పాదపద్మములు గలవాఁడు నని రాజపర మైనయర్థము. హరి = ఇంద్రునియొక్క. విరోచనసంతతి = యమునియొక్క. రసాధీశ=వరుణునియొక్క, "ఆస్వాదనధ్వని సుధామ్బురసాఖ్యధాతుష్వీష్టోరసః" అని రత్నమాల. రాజవర=కుబేరునియొక్క. మకుటవాటికేత్యాదికమునకు నీశ్వరపరమందు నర్థము తుల్యము. ధీరగణాలోకామోదదాయిశృంగారాతిశయుండును.—ధీరగణ=పండితసమూహముయొక్క; ఆలోక = చూపులకు; ఆమోదదాయి = సంతసము నిచ్చునదియైన; శృంగార = అలంకారముయొక్క; అతిశయుండును=అతిశయముగలవాఁడును, అనఁగా విద్వదభినందనీయశృంగారాతిశయము గలవాఁ డనుట. శివునిపర మైనపుడు ధీర మగుప్రమథగణముయొక్క ఆలోకామోదదాయి యగుశృంగార మనఁగా నాట్యము గలవాఁ డని యర్థము. "శృఙ్గార స్సురతే నాట్యే రసే దిగ్గజమణ్డనే" అని విశ్వము. అగుచున్. కలితమహారజతకూటస్తంభవారంబులన్.—కలిత=ఒప్పునట్టి; మహారజత=సువర్ణవికారము లైన, "మహారజతకాఞ్చనే" అని యమరుఁడు, కూట=గృహవిశేషములయొక్క; స్తంభవారంబులన్ = స్తంభసమూహములచేతను; అని రాజపరార్థము. కలిత = ఒప్పుచున్న; మహాత్ = అధికము లైన; రజతకూట స్తంభ =

స్తంభములవంటి వెండిశిఖరములయొక్క వాగులచేత నని శివపరమైనయర్థము. కమనీయ కాంచన వితానగుచ్ఛ ప్రభాంకూరంబులన్.—కమనీయ=మనోజ్ఞము లగు; కాంచనవితాన=బంగరు మేలుకట్లయొక్క; గుచ్ఛ=ముక్తాదిగుచ్ఛములయొక్క; ప్రభాంకూరంబులన్=కాంతులయొక్క అంకురములచేతను, "భవేదమర్ష ఆమర్షోప్యఙ్కురో౽ఙ్కుర ఏవచ" అనిద్విరూపకోశము. కమనీయము లగు సంపెఁగతీవెలయొక్క పువ్వుగుత్తుల ప్రభాంకూరముల చేతనని శివపరమైనయర్థము. కలకంఠికాజన గానామృతాసారంబులన్.—కలకంఠికాజన=స్త్రీజనముయొక్క; గానామృత=గానమనెడుసుధయొక్క; ఆసారంబులన్=ధారాసంపాతముల చేతను, "ధారాసమ్పాత ఆసారః" అనియమరుఁడు. కలకంఠికాజన=ఆఁడుఁగోయిలగుంపులయొక్క; గానామృతాసారములచేత నని శివపర మైనయర్థము. కరమొప్పుకలధౌతాగారారాజదాస్థాన భవనరాజంబునన్.—కరమొప్పు = మిక్కిలియొప్పుచున్న; కలధౌతాగార=బంగరుటిండ్లచేత; ఆరాజత్=ప్రకాశించుచున్న; ఆస్థానభవనరాజంబునన్=కొలువుకూటపుగృహశ్రేష్ఠమున నని రాజపర మైనయర్థము. కలధౌతాగ=కైలాసపర్వత మనెడు; ఆరారాజత్=మిక్కిలి ప్రకాశించుచున్న; ఆఙ్పూర్వకయఙ్లుగంత రాజధాతువుపై శతృప్రత్యయము. ఆస్థానభవనరాజంబున నని శివపర మైనయర్థము "కలధౌతం రౌప్యహేమ్నోః" అని యమరుఁడు. కనత్తారాహిరిపుమణిమయ భద్రాసనంబునన్ = ప్రకాశించుచున్న గారుత్మతమణిమయ మైనసింహాసనమందు, ఇంద్రనీలమణిమయ మైనసింహాసనమందు అనికాని యర్థము. సుఖాసీనుండై = సుఖోపవేశము గలవాఁడై. అహితమహాబలవిధ్వంసనశంసనీయ సామర్థ్యధురీణుండు గావునన్.—అహిత = శత్రువులయొక్క; మహాబల = అతిసామర్థ్యముయొక్క; విధ్వంసన = నాశముచేత; శంసనీయ = శ్లాఘనీయమగు; సామర్థ్య=సామర్థ్యముయొక్క; ధుర్ణీణుఁడు కావునన్=భారవాహి గావున నని యర్థము, అహిత=శత్రువైన; మహాబల=వాయువుయొక్క; విధ్వంసన శంసనీయ సామర్థ్యధురీణుఁడు గావున నని యర్థాంతరము. నిజపరాభూతికారణ దారుణసమీరణసముత్సారణంబు గోరి=తనపరాభవమునకుఁ గారణ మగువాయువుయొక్క తిరస్కారమును గోరియని యొకయర్థమే. తనకు విన్నవింపఁజేరిన మేఘమండలంబు డంబునన్ దీని కేపు సూప ననుదానియం దన్వయంబు. అర్థము స్పష్టము. ఒక్కవిబుధ కుధరకుచారత్నంబు పట్టినమేఘడంబరంబు.—విబుధకుధర=మేరువంటి; కుచా=స్తనములుగలవారలలో; రత్నంబు=శ్రేష్ఠ యగు స్త్రీ; పట్టినమేఘడంబరంబు = ధరించిన నల్లగొడుగు; శివపర మైనపుడు, విబుధ = దేవతాసంబంధిని యగు; కుధరకుచారత్నంబు=స్త్రీరత్నంబు పట్టినమేఘడంబరం బనియర్థము. కనకఝల్లరీశంపావల్లరీభాసురంబై.—కనకఝల్లరీ = బంగరుజాల రనెడు; శంపావల్లరీ = మెఱుపుఁదీవచేత; భాసురంబై = ప్రకాశమాన మై. ఏపు సూపన్ = అతిశయింపఁగా. "పుణ్డరీకం సితచ్ఛత్త్రం నీలం తన్మేఘడమ్బరమ్।తత్ప్రాన్తలమ్బి హేమాదివస్త్రీస్యాజ్ఝల్లరీ స్త్రియామ్" అని యమరశేషము. అరిభేదనోదారకరకాండ మండితరాజసాహాయ్యంబును.—అరి= శత్రువులయొక్క; భేదన = విదారణమందు; ఉదార = ఉత్కృష్టము లైన; కరకాండ = హస్తములయందుండు బాణములచేత; మండిత = అలంకృతు లగు; రాజ = భూపతులయొక్క;

సాహాయ్యంబును=సహాయమును. అరి = చక్రవాకములయొక్క; ఛేదన = పాపుటయందు, ఉదార = ఉత్కృష్టము లగు; కర = కిరణములయొక్క; కాండ = సమూహముచేత; మండిత = అలంకృతుఁడైన ; రాజ = చంద్రునియొక్క ; సాహాయ్యంబును, అని యర్థాంతరము. అతిదీప్రతరప్రకాశాన్విత సదనీక సాంగత్యంబును.— అతిదీప్రతర = మిక్కిలి తేజరిల్లునట్టి ; ప్రకాశ = కాంతితోడ; అన్విత = కూడుకొన్న; సత్ = గొప్పవారల; అనీక = సమూహముయొక్క; సాంగత్యంబును = మైత్రిని, మిక్కిలితేజరిల్లు కాంతితోఁ గూడుకొన్న రిక్కలగుంపులయొక్క సాంగత్యము ననియర్థాంతరము. అధిగమించి = పొంది. విజృంభించునిశాధిదేవతతోన్ = ఉజ్జృంభించుచున్నట్టి రాత్ర్యధిష్ఠానదేవతతో. జగడంబు=యుద్ధము. చరింపన్=చేయుటకు. ఓపక=చాలక. పట్టువడినయబ్జాప్తబింబంబుతీరునన్ = పట్టువడినట్టిసూర్యబింబంబురీతిగా. ఒక్కవారినీలకుంతలావతంసంబు=ఇంద్రనీలమణులవంటి కురులు గలిగిన స్త్రీలలోఁ శ్రేష్ఠ యగునొకతె యని రాజపరమైన యర్థము. విష్ణుసంబంధిని యైనయొకనీలకుంతలావతంసంబు = అనఁగా లక్ష్మీదేవి యని కాని విష్ణురూపిణి యగు మోహిన్యాత్మిక యగు స్త్రీ యని కాని యీశ్వరపర మైనయర్థము. పూనినయభిరూపజాతరూపహంసరూపధూపకరండంబువలనన్.— పూనిన = వహించినట్టి. అభిరూప = మనోజ్ఞ మగు, "ప్రాప్తరూపసురూపాభిరూపాబుధమనోజ్ఞయోః" అని యమరుఁడు: జాతరూప = సువర్ణమయ మైన, "చామీకరం జాతరూపమ్" అని యమరుఁడు: హంసరూప=సూర్యరూప మైన, "భాను ర్హంస స్సహస్రాంశుః" అని యమరుఁడు: ధూపకరండంబువలనన్ = పొగవేసికొనుడబ్బివలన. చాలుగాన్=బంతిగా. వెడలుసామ్రాణిధూపధూమమాలికలు=బయలుదేఱుచున్న సామ్రాణిధూపసంబంధమైనధూమముయొక్క బంతులు. తదంతరసంస్థాయిరమారమణతనూతల వినిర్యదభిరామశ్యామధామాళికల మోహంబు.— తదంతర = ఆ సూర్యబింబమధ్యభాగమందు; సంస్థాయి=నివసించియుండు; రమారమణ=నారాయణునియొక్క; తనూతల=శరీరప్రదేశమునుండి; వినిర్యత్=బయలుదేఱుచున్న; అభిరామ=మనోహరమగు; శ్యామధామ=నీలచ్ఛాయయొక్క; ఆళికల=చాలులయొక్క; మోహంబు=భ్రాంతిని; నివ్వటిల్లంజేయన్=కలుగఁజేయఁగా; అనఁగా నారాజు చెంతనొక నారీరత్నము ధూపకరండమును ధరియించి యుండఁగా నా స్త్రీ నిశాధిదేవతను బోలియున్నదనియు దానిచేత నున్న బంగరు బరణి ఆ స్త్రీకి శత్రుభేదనపటిష్ఠ బాణహస్తు లగురాజులసాహాయ్యము, మంచి తేజశ్శాలు లగు సత్పురుషులసాహాయ్యము గలిగియుండుటంజేసి దానితో జగడంబు సేయఁజాలక పట్టువడిన సూర్యబింబమ్మువలె నున్నదనియు ఆబరణినుండి వెడలుసామ్రాణిపొగయొక్క ధారలు సూర్యబింబమధ్యమున నున్న నారాయణమూర్తితనూకాంతిశ్రేణులం బోలియున్నదనియు భావము. శివపరమైనభావము నిట్లే తెలియునది. ఇట్లు చెప్పఁగా సాంబమూర్తికి సుచంద్రునకు సుచంద్రుని చెంత నున్న నారీరత్నమునకు శివుని చెంత నున్న లక్ష్మికి లేక హరి యను నారికి సామ్యము దోఁచుచున్నది. ఇట్లన్ని వాక్యములయందు సుచంద్రశివులకుఁ దత్పరము లైనయర్థములకు సామ్యము దోఁచు నని యెఱుంగునది. నిరంకుశపంకజరాగకంకణక్రేంకారపూర్వకంబుగాన్.— నిరంకుశ=అడ్డములేని; దీనికిఁ గ్రేంకారముం దన్వయము. పంకజరాగకంకణ=పద్మరాగమణి

మయము లగుకంకణములయొక్క; క్రేంకార=క్రేంకరణము; పూర్వకంబుగాన్ = పురస్సరమగునట్లుగా. ఒక్కరాజకీరవాణీలలామ=ఒక స్త్రీరత్నము అని రాజపరమైనయర్థము. రాజ=యక్షసంబంధిని యగు; కీరవాణీలలామ=స్త్రీరత్న మని యీశ్వరపరమైనయర్థము. వీచుధవళనాలవ్యజనంబులు = వీచునట్టి తెల్లనిసురటీలు. అనుపమానపవమానమృదుయానకలనానద్యమానగగనగంగాతరంగ డోలికావీథికన్.—అనుపమాన = సాటిలేనట్టి; పవమానమృదుయాన=మారుతముయొక్కమందగమనము చేత; కల=అవ్యక్తమధురముగా; నానద్యమాన = ధ్వని సేయుచున్న; గగనగంగా = స్వర్గంగయొక్క; తరంగ=అల లనెడు; డోలికావీథికన్=ఉయ్యెలలవరుసయందు. ఉయ్యెల లూఁగునవదాతపత్త్రంబులకున్=డోలావిహారము సేయుచున్న హంసలకు. సగోత్రంబులు ఐ = బంధువులై అనఁగాఁ దుల్యములై యనుట. ఇందుకు కవికల్పలతయందు, "శ్లో. బన్ధుశ్చోరస్సుహృద్వాదీకల్పః ప్రఖ్యః ప్రభ స్సమః । దేశీయదేశ్యరిపువ్వాభ సోదరాద్యాఇవార్థకాః । యథేన్దుబన్ధు ర్ముక్తా శ్రీచారో హార శ్రియస్సుహృత్ కున్దవాదీహంసకల్పఃక్షీరప్రఖ్యోహిమప్రభః । గఙ్గాసమోబ్జ దేశీయశ్శైవ దేశ్యస్సుధారిపుః। బిసాభస్తేయశోరాశిః కైలాసోదరసోదరః" అని ప్రమాణోదాహరణములు దెలియవలయు. వైచిత్రిన్=ఆశ్చర్యమును. చిత్రింపన్ = రచియింపఁగా ననుట. అనఁగా సుచంద్రుని యొద్ద నొక స్త్రీ పద్మరాగమణిమయకంకణక్రేంకారపూర్వకముగా వీచు తెల్లసురటీలు మందమారుతమునకు మధురముగ ధ్వని సేయుగంగానదీతరంగము లనెడునుయ్యెలలం దూఁగుచున్నహంసలవలె నున్న వని భావము. రాజహంసలముక్కులు పాదము లెఱ్ఱగా నుండుట తక్కినశరీరము తెల్లగా నుండుట ప్రసిద్ధము గాన స్త్రీహస్తముల నున్నపద్మరాగమణుల కంకణములు ముక్కులవలె నున్న వనియుఁ దెల్లనిసురటీలు తక్కినశరీరములవలె నున్న వనియు నాకంకణధ్వనులు తరంగధ్వనులఁ బోలి యున్నవనియు హస్తములగతాగతములు తరంగచలనములవలె నున్నవనియు ఫలితార్థము. శివపరమైనప్పు డిటులె తెలియునది. విశాలవిలోచనశతపత్త్రపత్త్రవిలసనంబును.— విశాల=విపులము లగు; విలోచన=నేత్రము లనెడు; శతపత్త్రపత్త్ర=కమలపత్త్రములయొక్క; విలసనంబును=విలాసంబును. విమలభుజామృణాళసౌందర్యంబును.— విమల=నిర్మలము లగు; భుజా=బాహువు లనెడు; మృణాళ=తామరతూఁడుయొక్క; సౌందర్యంబును=చక్కఁదనంబును. వినీలభ్రమరకసౌష్ఠవంబును.—వినీల=మిక్కిలి నల్లనగు; భ్రమరక = ముంగురు లనెడుతుమ్మెదలయొక్క; సౌష్ఠవంబును = అందమును. విరంజితకింజల్కమాంజుల్యంబును.—విరంజిత=మిక్కిలి రంజింపఁజేయుచున్న; ణిజంతరంజధాతువుపై కర్త్రర్థమందు విభక్తసోదరాదిశబ్దములయందువలె నిష్ఠాప్రత్యయము; కింజల్క=కేసరములనెడుపుప్పొడిబొట్టుయొక్క; మాంజుల్యంబును=మనోజ్ఞతయు, "పుష్పరేణౌచ కిఞ్జల్కః" అని యమరశేషము. పూని=వహించి. సరసగణ్యలావణ్యవైభవంబునన్.—సరస= మడుఁగులయందు, రసముతోఁ గూడినవి సరసములు, రస మన నుదకము. రసికులచేత నని యర్థాంతరము. గణ్య=గణనీయమగు; లావణ్య=కాంతివిశేషముయొక్క, "శ్లో. ముక్తాఫలేషుచ్ఛాయాయా స్తరళత్వమివాన్తరా ప్రతిభాతి యదఙ్గేషు లావణ్యం తదిహోచ్యతే" అని లావణ్యలక్షణము దెలియునది. వైభవంబునన్ =అతిశయముచేత; అలరుపద్మినిపైన్=ఒప్పుచున్నతామరతీవపై. పద్మినీ

జాతిస్త్రీయై యని ధ్వన్యమానార్థము. మోహంబు=వలపును. పూని=వహించి. పౌర్వకాలికవైరంబు=మొదల నున్న విరోధమును. డించి=వదలి. ప్రియంబు= ప్రియవాక్యమును.పచింపన్=చెప్పటకు. చేరి. తత్కరకమలలాలితం బగుశీతాంశుమండలంబుదండిన్.—తత్కరకమల = ఆపద్మినీపాణిపద్మముచేత; లాలితం బగు=లాలింపఁబడునట్టి; శీతాంశు=చంద్రునియొక్క; మండలంబుదండిన్=బింబముకీతిగా. ఒక్కభుజంగభుజ్మందయానామతల్లి=విటులను బాలించెడు నొకస్త్రీరత్నము,దాని యనుట "భుజఙ్గోవిటసర్పయోః" అని విశ్వము. "భుజపాలనాభ్యవహారయోః" అని పాణిన్యనుశాసనము. ఒకగరుడస్త్రీరత్న మని శివపరమైన యర్థము. తాల్చినకర్పూరకలాచిక=ధరియించిన కర్పూరములోఁ జేయఁబడిన తమ్మపడిగ. నయనామోదవీచికన్.—నయన=నేత్రములకు; ఆమోదవీచికన్=సంతోషపరంపరను. చేకూర్పన్=చేయుఁగా; అనఁగా సుచంద్రునిచెంత నొకస్త్రీ తనకన్నులనెడుకమలపత్త్రములచేతను; భుజములనెడుమృణాళములచేతను, ముంగురులనెడుతుమ్మెదలచేతను పుష్పాడిబొట్టులనెడుకింజల్కములచేతను, తామరతీవనుబోలి యున్నదనియు,ఆతామరతీవ యనెడునొక పద్మినీజాతిస్త్రీయందుఁ జంద్రుఁ డనురక్తుఁడై వైరముడిగి ప్రియము చెప్పటకుఁ బోయి దానిపాణిపద్మముచే లాలింపఁబడుచున్నయట్టు లాస్త్రీపట్టుకొన్న తమ్మపడిగ యున్నదనియు భావము. శివపరమైనపుడు నిటులే తెలియునది. మహానందిగోరాజకుమారముఖ్యులు.——మహానంది=అతిసంతసముగలిగిన; గోరాజ = భూపతులయొక్క; కుమారముఖ్యులు = పుత్రవరులు. మహాత్ = అధికమగు; నంది = నందికేశ్వరుఁడు; గోరాజ = వృషభము; కుమారముఖ్యులు = కుమారస్వామిమొదలగువారు. చెంతలన్ = సమీపములయందు. కొలువన్ = కొలుచు చుండఁగా. అపూర్వవిభవంబునన్ = తొల్లితనకు లేనివిభవంబున,ముందులోకమందు లేనివిభవమ్మున నని యర్థాంతరము. పేరోలగం బుండునవసరంబునన్ = గొప్పకొలువు సేరియున్న సమయమున. దీనికి శాండిల్యముని యరుదెంచె ననుముందుపద్యమం దున్నక్రియతో నన్వయము దెలియునది.

సీ. స్వకటాక్షవిభ్రమ♦స్థానన్నరశ్రేణి, యొడఁబోలె వరభూతి♦ యొడల నొప్ప
హృదయసారసవీథి♦యొడఁబోలె నలినాక్షు, సంభృతి కంధరా♦స్థలి నెసంగ
మహితశిష్యాదితా♦మ్నాయాళియొడఁబోలె, నలఘుజటారేఖ♦తలఁజెలంగ
నాత్మసంరచితాధ్వ♦రావళియొడఁబోలె, సత్త్రాటకస్ఫూర్తి♦చక్షు లూనె

తే. ననుచు నెమ్మది నద్భుతం♦ బడర నఖిల
జనములు నుతింప నరుదెంచె♦ నమ్మదంబుఁ
బూని సుకలానిరస్తోడు♦జాని సుగుణ
మణినికరఖాని శాండిల్య♦మౌని యపుడు. 124

టీ. సుకలానిరస్తోడుజాని = మంచితేజముచేతఁ దిరస్కరింపఁబడినచంద్రుఁడు గలవాఁడు, జాని యనుచోట జాయాశబ్దమునకు "జాయాయానిజ్" అను సూత్రముచేత నిజాదేశము. సుగుణమణినికరఖాని=మంచిగుణము లనెడుమణులయొక్కనికరమునకు గనియైన

వాఁడు. "ఖనిః ఖానిరపిస్త్రీ తా" అని శబ్దభేదప్రకాశిక. శాండిల్యమౌని=శాండిల్యుఁడను మహాముని. స్వకటాక్షవిశ్రమస్థానవన్నరశ్రేణియెడంబోలెన్.—స్వ=తనయొక్క; కటాక్ష=క్రేఁగంటిచూపునకు; విశ్రమస్థానవత్=విశ్రాంతిస్థానమువలె నాచరించు చున్న, ఇట "సర్వప్రాతిపదికేభ్యః క్విబ్వా వక్తవ్యః" అను సూత్రముచే నాచారార్థమందు క్విప్ప్రత్యయము. నరశ్రేణియెడంబోలెన్=మనుష్యసంఘమందుబలె. ఒడలన్=దేహమందు. వరభూతి=శ్రేష్ఠసంపత్తు; శ్రేష్ఠభస్మ మనియర్థాంతరము. "భూతిర్భస్మని సంపది" అని యమరుఁడు. ఒప్పెన్=అమరెను. హృదయఘసారసవీథియెడన్=హృదయకమలవీథియందుబలె; కంధరాస్థలిన్=కంఠస్థలమందు. నలినాక్షసంభృతి.—నలినాక్ష=విష్ణుమూర్తియొక్క, తామరపూసలయొక్క యని యర్థాంతరము; సంభృతి=భరణము. ఎసంగెన్= అతిశయించె. మహితశిష్యోదితామ్నాయాళియెడంబోలెన్.—మహిత=పూజ్య మగు; శిష్య=శిష్యులచేత; ఉదిత=పలుకఁబడిన; ఆమ్నాయాళియెడంబోలెన్=వేదసమూహమందుబలె. తలన్=శిరస్సునందు. అలఘుజటారేఖ.—అలఘు=విస్తారమగు; జటా=పదపాఠవిశేషముయొక్క, జడలయొక్క యని యర్థాంతరము. రేఖ=సమూహము. చెలంగెన్ =ఒప్పెను. ఆత్మసంరచితాధ్వరావళియెడన్.—ఆత్మ=తనచేత; సంరచిత = చేయఁబడిన; అధ్వరావళి యెడంబోలెన్ =యజ్ఞసంఘములయందుబలె. చక్షులు= నేత్రములు. సత్త్రాటకస్ఫూర్తి.—సత్త్రాటక=ఋత్విజులయొక్క; స్ఫూర్తి=ప్రకాశము, సత్త్ర మనఁగా యజ్ఞము. దానియందుఁ జరించువారు సత్త్రాటకులు, "సత్త్రమాచ్ఛాదనే యజ్ఞే" అని యమరుఁడు; సత్=సత్పురుషులయొక్క; త్ర=రక్షణమందు; అట=సంతతగతిగల; క=చిత్తముయొక్క; స్ఫూర్తి=ప్రకాశ మని యర్థాంతరము. ఊనెన్=వహించెను. అంతఃకరణవృత్తి యగు సత్పురుషరక్షణవ్యాపారము చక్షులందుఁ దోఁచు చున్నదనుట. చక్షు లనుచోట సప్తమ్యర్థమందుఁ బ్రథమ వచ్చినది. అనుచున్=ఇట్లనుచు. నెమ్మదిన్ = మంచిమనస్సునందు. అద్భుతంబు=ఆశ్చర్యము. అడరన్=ఒప్పు చుండఁగా. అఖిలజనములున్ = ఎల్లమనుజులును. నుతింపన్=పొగడు చుండఁగా. సమ్మదంబున్=సంతోషమును. పూని=వహించి. అరుదెంచెన్=వచ్చెను.

అనఁగా సుచంద్రనరేంద్రుండు పేరోలగం బుండునవసరంబున శాండిల్యమునివరుండు తనకటాక్షపాత్రు లగువారలకు సంపదలు గలుగఁజేయుచు శరీరమందు భస్మము దాల్చి హృదయమందు నారాయణుని ధ్యానించుచుఁ గంఠమందుఁ దామరపూసలమాలిక దాల్చి శిష్యులకుఁ జెప్పెడు వేదమందుబలెఁ దలమీఁద జటలు దాల్చి యజ్ఞములయందు ఋత్విక్కులంబోలె సత్పురుషులను రక్షింపవలె ననుహృదయాభిప్రాయము కన్నులయందుఁ బ్రకాశింపఁజేయుచు వచ్చె ననిభావము. ఉపమాలంకారభేదము.

మ. మునిరాజిట్లరుదేర ద్వాస్స్థితజనా◆మూలోక్తి వైచిత్రి మే
ల్కని తోడ్తో నెదురేఁగి భక్తి వినతుల్ ◆ గావించి తోడ్తెచ్చి నూ
తనచామీకరపీఠి నుంచి యిలగో◆త్రాకామినీకాముకుం
డను వొందన్ ఘటియించె నాదమికిఁ దా◆ నాతిథ్య మప్పట్టునన్. 125

టీ. అలగోత్రాకామినీకాముకుండు=ఆపృథివీపతి యగుసుచంద్రుఁడు. ఇట్లు=పైఁజెప్పినవిధముగ. మునిరాజు=శాండిల్యుఁడు. అడుగఁగన్=విచ్చేయఁగా. ద్వాస్థితజనామూల్యోక్తివైచిత్రిన్.—ద్వాస్థితజన=ద్వారపాలకులయొక్క; "స్త్రీద్వార్ద్వారం" అని యమరుఁడు. అమూల్యోక్తివైచిత్రిన్=లోకోత్తరవాగ్వైచిత్రిచేత. మేల్కాని=జాగరూకుఁడై. తోడ్తోన్=వెంటనె. ఎదురేఁగి=ఎదురుఁగఁబోయి. భక్తిన్ = భక్తిచేత. వినతుల్= ప్రణామములు కావించి=చేసి. తోడ్తెచ్చి=తోడుకొనితెచ్చి. నూతనచామీకరపీఠిన్.—నూతన=క్రొత్తదగు; చామీకరపీఠిన్=బంగరుపీటయందు. ఉంచి=కూర్చుండఁబెట్టి. అనువొందఁగన్=తగునట్టుగా; ఆదమికిన్=ఆమునికి. తాన్. అప్పట్టునన్= ఆసమయమందు. ఆతిథ్యముల్= అతిథిసత్కారములు. ఘటియించెన్=చేసెను.

క. విమలాసనమునఁ బతి యతి, కమలాసనలసదనుజ్ఞిక వసించి మహా
సుమనోరసాగుహాద్యత్సుమనోరససూక్తిఁ దపసితో నిట్లనియెన్.

టీ. పతి=భూపతి యైనసుచంద్రుఁడు. యతికమలాసనలసదనుజ్ఞికన్ = యతిపుంగవుఁడైనశాండిల్యునియొక్క ప్రకాశించు చున్నయాజ్ఞ చేత. అనుజ్ఞాశబ్దముమీఁద కప్రత్యయము. ఇత్వమువచ్చి యనుజ్ఞిక యైనది. వసించి=కూర్చుండి. మహాసుమనోరసారుహోద్యత్సుమనోరససూక్తిన్.—మహత్=అధికమైన. దీనికి సుమనోరసమం దన్వయము. సుమనోరసారుహ=అమరతరువువలన. ఉద్యత్=ఉదయించుచున్న. సుమనోరస= పూఁదేనియవంటి. సూక్తిన్=వాక్కుచేత; అనఁగా కల్పతరుకుసుమమకరంద మొలుకు చున్నవాక్కుచేత ననుట. తపసితోన్=మునితోడ. ఇట్లనియెన్=చెప్పఁబోవురీతిగఁ బలికెను.

శా. మానీ సేమమె మీకు మంగళమె యుష్మచ్ఛాత్త్రరాట్పాళికిం
నానాసూనవప్రసూనములు సింఁదన్ మించునే యాశ్రమా
గానీకంబు లనంతరాయకలనన్ యజ్ఞాళు లీడేఱునే
శ్రీ నొప్పారునె మీమహోటజము నిర్వేలానురానీతికన్. 127

టీ. మానీ=ఓశాండిల్యమునీ. మీకున్=మీకు. సేమమె=కుశలమా. యుష్మచ్ఛాత్త్రరాట్పాళికిన్=మీశిష్యశ్రేష్ఠులగుంపునకు. మంగళమె=కల్యాణమా. ఆశ్రమాగానీకంబులు=ఆశ్రమద్రుమసమూహములు. నానాసూనవప్రసూనములు.—నానా=అనేకప్రకారములగు; సూన=కుసుమములు; నవ=నూతనములగు, ప్రసూనములు=ఫలములు. చిందన్=వ్యాపింపఁగా. "ప్రసూనం పుష్పఫలయోః" అని వైజయంతి. మించునే=అతిశయించునా. యజ్ఞాళులు=యజ్ఞములయొక్క సమూహములు. అనంతరాయకలనన్=నిర్విఘ్నముగా. ఈడేఱునే=సిద్ధించు చున్నవా. మీమహోటజము=మీయొక్క పూజ్యమగుపర్ణశాల. నిర్వేలానురానీతికన్ = అడ్డములేని రాక్షసులయీతిబాధ లేకుండఁగా. శ్రీన్=సంపదచేత. ఒప్పారునె = ఒప్పుచున్నదా. దీని కిట్లనియె ననుపూర్వపద్యస్థక్రియయం దన్వయము.

చ. యతికులచంద్ర సత్కువలయప్రియ మై తగునీదురాకమ
ద్వితతమనస్సంతాపగతి వేగ యలంప గలంప సంతతో
ద్ధతతరపంకజాతములఁ దావకపాదనిషేవణాసమా
దృతి మనునాశుభాళి గనునే ధరఁ దక్కినరాజచక్రముల్. 128

టీ. యతికులచంద్ర = మునికులచంద్రుండ వగుశాండిల్యుఁడా, చంద్రుఁడా యని యర్థాంతరము. సత్కువలయప్రియకారినిజోదయంబునన్.— సత్కువలయ = మంచిభూవలయమునకు, కల్వలకు అని యర్థాంతరము; ప్రియమై = హితమై. తగునీదురాక=ఒప్పుచున్న నీరాక. మద్వితత మనస్సంతాపగతిన్ = నాయొక్క మనస్సునం దున్న విపులమైనసంతాపమును, వేఁడి యని యర్థాంతరము. వేగ = వేగముగా. అలంపన్ = అలయింపఁగా. సంతతోద్ధతతరపంక జాతములన్.—సంతత = ఎల్లప్పుడును ; ఉద్ధతతర=ఉత్కటతరములగు; పంకజాతములన్=పాపసంఘములను. పద్మముల నని యర్థాంతరము. కలంపన్=కలఁతపఱుపఁగా. తావకపాదనిషేవణాసమాదృతిన్.-తావక=నీసంబంధులగు; పాద=చరణములయొక్క, కిరణములయొక్క యని యర్థాంతరము; నిషేవణ = సేవయందలి; అసమ=సాటిలేనిదగు; ఆదృతిన్=ఆదరమున, మనునాశుభాళిన్.—మను= వృద్ధిఁబొందెడు; నాశుభాళిన్=నాయొక్కకల్యాణపరంపరలను, తక్కినరాజచక్రముల్= ఇతరనృపాలసంఘములు; శ్రేష్ఠచక్రవాకసంఘము లని యర్థాంతరము. కనునె=పొందునా,పొందవనుట. ఇచటఁ బ్రస్తుతశాండిల్యవిషయమైనయర్థముఁ జెప్పఁగాఁ జంద్రకువలయాది నానార్థశబ్దశక్తిమూలవ్యంజనచేతఁ జంద్రాదివిషయకార్థాంతరము వ్యజ్యమాన మగుఁ గావునఁ జంద్రుఁడు రాఁగా నేరీతిఁ గల్వలకుఁ బ్రీతియు,తాపము శమించుటయుఁ బద్మములు విరియుటయు జక్కవలు సంతస మందకుంటయు నగునో యట్లు శాండిల్యుండు రాఁగా భూవలయమునకుఁ బ్రీతియు సుచంద్రునిమనస్సంతాపము శమించుటయు సమస్తపాపకదంబము తత్పాదసేవనమున నశించుటయు నితరరాజదుర్లభమై ఘటించెనని భావము. వస్తుకృతోపమాలంకారధ్వని.

చ. కరము మదీయపుణ్యలతికల్ సఫలత్వముఁ బొందఁ బూన్చి యో
సురభిచరిత్ర నీ విటకు సొంపుగఁ జేరితి శక్యమే భవ
ద్వరసుమనోహితత్వఘనవైఖరి సన్నుతిఁ జేయ నీదయా
పరిణతిఁ గాదె యుత్కలికఁ బాయక భవ్యతరుల్ సెలంగుటల్. 129

టీ. ఓసురభిచరిత్ర = మనోజ్ఞమైననడవడిగలయోమునీ, వసంతునిచరితము గలవాఁడ యనిధ్వని, కరము=మిక్కిలి, మదీయపుణ్యలతికల్=నాసుకృతము లనెడులతలను. సఫలత్వమున్=ఫలవత్త్వను. పొందన్ పూన్చి=ఫలములను బొందింప నుద్యమించి యనుట. ఫలము లనఁగా లాభములు పండ్లును. నీవు. ఇటకున్=నాయొద్దకు. సొంపుగన్=సంతోషముగా. చేరితి=చేరినవాఁడవైతివి. భవద్వరసుమనోహితత్వఘనవైఖరిసన్నుతిన్.—భవత్=నీయొక్క; వర=శ్రేష్ఠమగు; సుమనోహితత్వ=విద్వత్ప్రీతియొక్క; పుష్పప్రీతియొక్క యని యర్థాంతరము.

ఘనవైఖరి=గొప్పరీతియొక్క. సన్నుతిన్=స్తోత్రమును. చేయన్=చేయుటకు. శక్యమె=శక్యము గాదనుట. నీదయాపరిణతి గాదె=నీకృపాపరిణామము గదా. భవ్యతరుల్ = మిగులఁబెద్దలు, ఒప్పుచున్నవృక్షము లని యర్థాంతరము. ఉత్కలికన్ = ఉత్సవమును, మొగ్గల ననియర్థాంతరము, పాయక = తొలంగక. చెలంగుటల్= ప్రకాశించుటలు, ఇచట ఘనవైఖరిశబ్దములో ఘనపదమునకు మేఘపరమైనయర్థాంతరము స్ఫురించినను, దానికిఁ గుసుమహితత్వము లేమిచేతను సుమనశ్శబ్దమునకు మాలతి యర్థమైనందునఁ దద్ధితత్వము మేఘమునకు సంభవించినను "శ్లో. జాతీకదమ్బకేతకఝుంఝానిలనిమ్నగాహాలిప్రీతిః" అని కవికల్పలతయందు వర్షర్తువునందె జాతీవర్ణనము చెప్పినందునను, సురభియందు మేఘపరమైనయర్థమనుగుణ మని తలంచి వ్రాయ లేదు. వసంతునకు శాండిల్యునకు నౌపమ్యము గమ్యము.

మ. ఘనతాత్పర్యము నాపయిన్ నిలిపి వేడ్కన్ వచ్చి తస్మత్పురా
తనభాగ్యంబునఁ జేసి యోతపసి రత్నశ్రేణులో భూమియో
ధనమో ధేనువులో కరీంద్రములో రథ్యవ్రాతమో యిష్టవ
స్తునికాయం బనివార్యభక్తి ఘటియింతుం దెల్పవే సత్కృపన్. 130

టీ. ఓతపసీ=ఓమునీ. అస్మత్పురాతనభాగ్యంబునఁ జేసి=నాయొక్కపూర్వపుభాగ్యమువలన. నాపయిన్=నాయందు. ఘనతాత్పర్యము=గొప్పప్రీతిని. "తత్పరే ప్రసితాసక్తా" అని యమరుఁడు; నిలిపి=ఉంచి. వేడ్కన్=సంతసముతో. వచ్చితి=వచ్చినవాఁడవైతివి. రత్నశ్రేణులో = నవరత్ననికరములో. భూమియో =వసుంధరయో. ధనమో=ద్రవ్యంబో. ధేనువులో=గోవులో. కరీంద్రములో=గజోత్తములో. రథ్యవ్రాతమో= అశ్వములగుంపో. ఇష్టవస్తునికాయంబు=యజ్ఞాదులయందు దేయంబుగా నిష్టమైనవస్తుకదంబము. సత్కృపన్ =మంచిదయతోడ. తెల్పవే. అనివార్యభక్తిన్ = నివారింపరానిభక్తితో, అత్యుత్కటభక్తితో ననుట. ఘటియింతున్=ఘటియింపఁజేయుదును.

మ. అని యాభూపతి పల్కన్ యోగిమణి చిత్తాంకూరితానందుఁడై
యినవంశోత్తమ తావకీనకృప మా కెల్లప్పుడున్ సేమ ము
ర్వి నితాంతైకమహామహోన్నతభవాదృక్షిత్రసాంగత్యవ
ర్తన నిచ్చల్ మనుమాకుఁ జేకుఱునె జాగ్రద్దుష్టదోషావళుల్. 131

టీ. అని=ఇట్లని. ఆభూపతి=ఆనుచంద్రుండు. పల్కన్=వచింపఁగా. యోగిమణి=యోగిశ్రేష్ఠుం డగుశాండిల్యుండు. చిత్తాంకూరితానందుఁడై=చిత్తమునం దంకురించినయానందము గలవాఁడై. ఇనవంశోత్తమ=సూర్యవంశపురాజులలో నుత్తముఁడైనవాఁడా. తావకీనకృపన్=నీదయతో. మాకున్= మము బోఁటితపసులకు. ఎల్లప్పుడున్ = సర్వకాలమందును. సేమము=కుశలము. ఉర్విన్=భూమియందు. నితాంతైకమహామహోన్నతభవాదృక్షిత్రసాంగత్యవర్తనన్.—నితాంత = తీవ్రమైన ; "తీవ్రైకాన్తనితాన్తాని" అని యమరుఁడు. ఏక=ముఖ్యమగు. మహః = ప్రతాపము చేత ; మహోన్నత=మిగుల నధికుఁడగు ; భవాదృక్=నిను

బోఁటి; మిత్ర = చెలికానితోడ; సాంగత్యవర్తనన్ = సంబంధవృత్తిచేత; తేజస్సుచేత మిగుల నధికుఁ డగుసూర్యునిసాంగత్యవృత్తిచేత నని యర్థాంతరధ్వని. నిచ్చల్ = ఎల్లప్పుడును. మనుమాకున్ = వృద్ధిఁ బొందునట్టిమాకు. జాగ్రద్దుష్టదోషావళుల్ = జాగరూకులైన దుర్మార్గులవలన నుపద్రవపరంపరలు, రాత్రులపంక్తు లనిధ్వన్యమానార్థము. చేకుఱునె=లభించునా, అనఁగాఁ దీవ్రతేజశ్శాలి యగుసూర్యునిసాంగత్యమువలన రాత్రులయుపద్రవ మెట్లు లభింపదో య ట్లుగ్రప్రతాపశాలి వగునీసాంగత్యమున మాకు దుర్మార్గులయుపద్రవములు ఘటింప వని భావము. ప్రస్తుతాప్రస్తుతోపమాధ్వని.

తే. అనిశము సమస్తలోకర♦క్షైకదీక్ష, నలరునీకృప సకలేష్ట♦ మంది మించు
మాకుఁగోరిక యొక్కింత♦మాత్రమైనఁ, గలదె భవదవలోక నా♦కాంక్షదక్క.

టీ. అనిశమున్=ఎల్లప్పుడును. సమస్తలోకరక్షైకదీక్షన్ = సర్వలోకరక్షణవిషయమైనముఖ్యదీక్షచేత. అలరునీకృపన్=ఒప్పునట్టినీదయచేత. సకలేష్టము = ఎల్లయిష్టములను, జాత్యేకవచనము. అంది=పొంది. మించుమాకున్ = అతిశయించునట్టిమాకు. ఒక్కింతమాత్రమైనన్=ఈషత్తైనను. కోరిక=అభిలాష. భవదవలోకనాకాంక్షదక్కన్ = నినుఁజూడవలెనను నిచ్ఛదక్క. కలదె=కలదా. సమస్తలోకరక్షాదీక్షుండ వగునీదయతో సకలేష్టముల నందినమాకు నీదర్శనాభిలాషతక్క వేఱొక్కయభిలాష లే దని భావము.

మ. సకలారాతివిదారణంబు సుమన♦స్త్రాణంబుఁ గావించి ధా
ర్మికులం దెక్కుడవై జగత్ప్రియత ధా♦త్రీకాంత నీ వొప్ప మా
నికులశ్రేష్ఠులతో నిరీతి మఘముల్ ♦ నిగ్గించుచున్ మేము వే
డుక వర్తిల్లుదు మాశ్రమాళి సురకో♦టుల్ నిచ్చ హర్షింపఁగన్. 133

టీ. ధాత్రీకాంత=సుచంద్రుఁడా. నీవు. సకలారాతివిదారణంబున్ = సమస్తశత్రునిబర్హణమును. సుమనస్త్రాణంబున్=విద్వజ్జనరక్షణంబును. కావించి=చేసి. ధార్మికులందున్=విలుకాండ్రలోపల, పుణ్యశీలురలోపల. ఎక్కుడవై=అధికుఁడవై. జగత్ప్రియతన్=లోకప్రీతిచేత. ఒప్పన్=ఒప్పుచుండఁగా. మేమున్=మేమును. మానికులశ్రేష్ఠులతోన్=మునివరులతో. నిరీతిన్=ఈతిబాధ లేనట్లుగా. మఘముల్=క్రతువులను. నిగ్గించుచున్=నెఱవేర్చుచు. సురకోటుల్=దేవసంఘములు. నిచ్చ = ఎల్లప్పుడును. హర్షింపఁగన్ = సంతసింపఁగా. వేడుకన్=సంతసముతో. ఆశ్రమాళిన్=ఆశ్రమసమూహమందు. వర్తిల్లుదుము=వసింతుము. నీవు శత్రునిబర్హణముఁ జేసి విలుకాండ్రలోను, విద్వజ్జనరక్షణంబుఁ జేసి పుణ్యశీలురలు శ్రేష్ఠుండ వయి వర్తింపఁగా మేమును మునిశ్రేష్ఠులతోఁ గూడి యజ్ఞములు సేయఁ ఫలము సుర కోటులు సంతసింపఁగా నాశ్రమములందు వేడుకతో వర్తిల్లుదు మని భావము.

మ. జపముల్ సాఁగఁగ వేదపాఠములు ని♦ష్ప్రత్యూహతన్ మించఁగాఁ
దపముల్ పూర్ణత నొంద జన్నములు ని♦త్యంబుం బ్రకాశింపఁగా

నృప యుష్మన్మహిమం జెలంగుదుము ని॰ర్వేలప్రసూనప్రసూ
నపటల్యంచితసాలజాలయుతస॰న్మాన్యాశ్రమాస్థానికన్. 134

టీ. జపముల్=మంత్రజపములు. సాఁగన్=కొనసాఁగఁగా. వేదపాఠములు=వేదముల యొక్క పాఠములు. నిష్ప్రత్యూహతన్=నిర్విఘ్నతతో. మించఁగాన్= అతిశయింపఁగా. తపముల్=తపస్సులు. పూర్ణతన్=పరిపూర్ణభావమును. ఒంచన్=పొందఁగా. జన్నములు=యజ్ఞములు. నిత్యంబున్=ఎల్లప్పుడును. ప్రకాశింపఁగాన్=తేజరిల్లఁగా. నృప=ఓసుచంద్రుఁడా. యుష్మన్మహిమన్ = మీమహిమచేత. నిర్వేలప్రసూనప్రసూనపటల్యంచితసాలజాలయుతసన్మాన్యాశ్రమాస్థానికన్.—నిర్వేల=అనర్గళ మగు; ప్రసూన = పుష్పములయొక్కయు ; ప్రసూన=ఫలములయొక్కయు ; "ప్రసూనం పుష్పఫలయోః" అని విశ్వము. పటలీ= సంఘముచేత. అంచిత=ఒప్పునట్టి. సాలజాల = వృక్షసంఘముతో. యుత = కూడుకొన్నట్టి. సత్= సత్పురుషులచేత ; మాన్య = మాననీయ మగు; ఆశ్రమ= ఆశ్రమ మనెడు; ఆస్థానికన్=సభయందు; చెలంగుదుము=ప్రకాశింతుము.

చ. భవదవలంబనంబున న॰పాయము గానక యిన్నినాళ్లు మా
నవకులచంద్ర సౌఖ్యకల॰నం దనరారితి మట్టిమాకు స
త్సవనవినాశకంబు ముని॰జాలమనఃప్రమదాపహారకం
బవునొక కార్య మబ్బె నిపు॰డాదృతిచే నది చిత్తగింపవే. 135

టీ. భవదవలంబనంబునన్=నీయాశ్రయమున. అపాయము గానక=చ్యుతి గనక. ఇన్నినాళ్లున్=ఇన్నిదినములును. మానవకులచంద్ర=సుచంద్రుఁడా. సౌఖ్యకలనన్= సౌఖ్యప్రాప్తిచేత. తనరారితిమి=ఒప్పితిమి. అట్టిమాకున్ = అరీతిగ నున్నమాకు. సత్సవనవినాశకంబు=శ్రేష్ఠ మగుయజ్ఞముల నశింపఁ జేయునదియు; మునిజాలమనఃప్రమదాపహారకంబు=మునిజనుల యొక్కమనస్సంతోషవినాశకమును ; అవునొక కార్యము=అగునట్టియొక కార్యము. ఇపుడు =ఈసమయమున. అబ్బెన్=ఘటించెను. అది = ఆకార్యము. ఆదృతిచేన్ = ఆదరముచేత. చిత్తగింపవే=మనస్కరింపుమా.

వ. అని వెండియు నయ్యతీంద్రుం డాసుచంద్రమహీశచంద్రునితో ని ట్లనియె.

టీ. అని. వెండియున్=మఱియును. అయ్యతీంద్రుండు = ఆశాండిల్యుండు. ఆసుచంద్రమహీశచంద్రునితోన్=ఆసుచంద్రుం డనురాజచంద్రునితో. ఇట్లనియెన్ = వక్ష్యమాణప్రకారంబునఁ బలికెను.

దము గ
స. _ వైరిమకుటము॰క్తాజయశ్రీకపి, లావాచనాపాది॰లలితశరుఁడు
భుజబలవ్యాఖ్యాతభూ॰భృద్బిదాస్యాను, బింబవత్స్వోరత్న॰వీతతటుఁడు
రణభేరికాభాంక॰రణపరిప్రాపిత, వారిదంష్ట్రిలోకేశ॰పురవరుండు
ప్రతిదినాభ్యుదితకా॰ర్శ్యలక్ష్మాపితప్రతి,మాన్యతాకామరీ॰మహితగృహుఁడు

తే. ప్రబలు నాత్మచమూప్రతి•ప్రస్థితీక్ష,ణేహికాప్తిపునఃపున•రీషదున్న
మన్ముఖసుమేరుకందరా•త్మావసన్న,హాసురుండు తమిస్రాభి•ధాసురుండు. 137

టీ. ఘనవైరిమకుటముక్తాజయశ్రీకపిలావాచనాపాదిలలితశరుఁడు.—ఘన = గొప్పలగు; వైరిమకుట=శత్రుకిరీటములయొక్క; ముక్తా=ముత్యములచేత; జయశ్రీ=జయలక్ష్మికి; కపిలావాచన=వివాహమందలి స్వస్తివాచనిక కర్మవిశేషమును; ఆపాది = సంపాదించుచున్న; లలితశరుఁడు=లలితములైనబాణములు గలవాఁడు; పంచబాణుం డని ధ్వనించును. భుజబలవ్యాఖ్యాతృభూభృద్భిదాస్యానుబింబవత్స్వారత్నపీఠతటుఁడు.—భుజబల= బాహువిక్రమమునకు; వ్యాఖ్యాతృ=వ్యాఖ్యానించెడు; దీని కాస్యానుబింబమునం దన్వయము. భూభృద్భిత్ = ఇంద్రుని యొక్క; ఆస్యానుబింబవత్=ముఖప్రతిబింబములు గలిగిన; స్వారత్నపీఠ= చింతామణిపీఠము యొక్క; స్వర్ రత్న యని యుండఁగా సంధివశంబునఁ బూర్వరేఫమునకు లోపంబును దత్పూర్వాకారమునకు దీర్ఘంబును గలిగె; తటుఁడు=దరిగలవాఁడు. అనఁగా నతఁడు గూర్చుండుచింతామణిపీఠమున నమస్కరించు నింద్రునిముఖము ప్రతిబింబింపఁగా నతనిబాహుబలము దానివలన వ్యాఖ్యాతంబుగా నున్న దనుట. రణభేరికాభాంకరణ పరిప్రాపితహరిదంష్ట్రిలోకేశపురవరుండు.—రణభేరికాభాంకరణ=యుద్ధభేరీధ్వనిచేత; పరిప్రాపిత=పొందింపఁబడిన; హరి=సింహములు; దంష్ట్రి=పందులుగలిగిన; లోకేశ=రాజులయొక్క; పురవరుండు=పురవరములు గలవాఁడు అనఁగా వానిభేరీధ్వనివలన రాజులు భయపడి పురములను వదలి పోఁగా నా పురములయందు సింహములు వరాహములు చేరిన వనుట. ప్రతిదినాభ్యుదిత కార్శ్యజ్ఞాపిత ప్రతిమాన్యతాకామరీమహితగృహుఁడు.—ప్రతిదిన=దినదినమందు ; అభ్యుదిత = పుట్టిన; కార్శ్య=కృశత్వముచేత; జ్ఞాపిత=బిటింగింపఁబడిన, ప్రతిమాన్యతాక=అవమానముగల; ప్రతిమాన్యతాకశబ్దాంతబహువ్రీహిమీఁదకప్రత్యయము. అమరి=దేవతాస్త్రీలచేత; మహిత=పొగడఁబడిన; గృహుఁడు=గృహములు గలవాఁడు అనఁగా రాక్షసునితో బందీకరింపఁబడితి మని యవమానముచేత దినదినము కృశించుచున్న దేవాంగనలతనియింట నున్నా రనిభావము. ఆత్మచమూప్రతిప్రస్థితీక్షణేహికాప్తిపునఃపునరీషదున్నమన్ముఖసుమేరుకందరాత్మావసన్నహాసురుండు.—ఆత్మ=తనయొక్క; చమూ=సేనలయొక్క; ప్రతిప్రస్థితి=మరలిపోవుటయొక్క; ఈక్షణ=చూచుటయందు; ఈహికాప్తి=ఇచ్ఛాప్రాప్తిచేత; పునఃపునః=మాటిమాటికి; ఈషదున్నమత్=ఇంచుకయున్నతమగుచున్న; ముఖ=మోములుగల; సుమేరుకందరాత్మావసన్నహాసురుఁడు=మేరుపర్వతగుహాభూములయం దున్నయుత్కృష్టులైనసురలుగలవాఁడు. అనఁగా దేవతలు వానిదాడికి వెఱచి మేరుగుహలయందు డాఁగి తమ్ము వెదకి దునుమవచ్చిన తమిస్రాసురునిసైనికులు మరలి పోవుచుండఁగా సారెసారెకు నిక్కిచూచుచున్నా రనిభావము. తమిస్రాభిధాసురుండు=తమిస్రుం డనిపేర్కొనఁబడురక్కసుండు. ప్రబలుక్=అతిశయించును.

చ. అనుపమధేనుకాహితత•నంధి చరించుమునివ్రజంబులం
బెనువుఁ గడుక్ మహాసవకృ•పీటభవాళులఁ దూలఁ జేయుఁ జ

యవ్యనఁ గలఁచున్ బహూదకచ◆యంబుల వ్రాల్చు ధరిత్రి శ్యామలం
జనవర దానవద్ద్విపము ◆ సాంద్రమదస్ఫురణంబు హెచ్చఁగన్.  138

టీ. ఈపద్యమందు రాక్షసపరమైనయర్థము గజపరమైనయర్థము గలుగును. జనవర సుచంద్రుఁడా. దానవద్ద్విపము=ద్విపమువంటిదానవుండు,మదించినగజము. సాంద్రమదస్ఫురణంబు.—సాంద్ర=దట్టమగు; మద=గర్వముయొక్క, మదముయొక్క, స్ఫురణంబు=ప్రకాశము. హెచ్చఁగన్=అతిశయింపఁగా. అనుపమధేనుకాహితతన్.—అనుపమ=అసమానమగు; ధేనుకా=గోవులకు; అహితతన్=శత్రుభావమును, ఆఁడేనుఁగులకు హితభావము నని గజపరమైనయర్థము. "కరిణీ ధేనుకా వశా" అని యమరుఁడు. అంది=పొంది. చరించున్=తిరుగును. మునివ్రజంబులన్=మునులగుంపులను. అగిసెమ్రాఁకులగుంపులను. పెఱుపున్=నాశముఁజేయును. మహాసవకృపీటభవాళులన్.—మహత్=అధికమైన; సవ=యజ్ఞములయొక్క. కృపీటభవాళులన్=అగ్నిసమూహములను. మహత్=అధికమగు; ఆసవ=మకరందముగల; కృపీటభవ=తామరలయొక్క. ఆళులన్=గుంపులను. కడున్=మిక్కిలి. తూలఁ జేయున్=చలింపఁ జేయును.బహూదకచయంబులన్=బహూదకు లనెడుసన్న్యాసులయొక్కగుంపులను. హంస పరమహంస కుటీచక బహూదకు లని సన్న్యాసులలో నాలుగుభేదములు గలవు. అధికము లైనజలసంఘముల నని యర్థాంతరము. చయ్యనన్=శీఘ్రముగ. కలఁచున్=కలఁతపఱచును. ధరిత్రిన్=భూమియందు. శ్యామలన్=యౌవనమధ్యస్థ లగుస్త్రీలను. వ్రాల్చున్=వ్రాలునట్లుచేయును, అనఁగాశ్రమపఱచును. ప్రేంకణము మొదలగువృక్షవిశేషములను భూమిని వ్రాల్చు నని గజపరమైనయర్థము.

సీ. హరిహయాస్యాతత◆స్ఫురణ దూలఁగఁ దార్చి
శుచిధామమహిమంబుఁ ◆ జూఱ వుచ్చి,
చటులమహాకాల◆పటిమంబు దిగఁద్రోచి
నానాశరచ్ఛటా◆శ్రీ నడంచి,
కమలవరప్రభా◆ఘంబు మాయఁగఁ జేసి
ఘనమరుత్ప్రసాల◆గరిమ ముంచి,
ప్రచురసోమావలే◆పం బెల్లఁ గరఁగించి
పంచాస్యశక్తిఁ బో◆పడ నొనర్చి,
తే. యిట్టు లాపూర్వదేవవం◆శేశ్వరుండు
విశ్వ హరిదీశ విజయాప్తి ◆ వెలయు నాత్మ
చండదోర్దండమండల◆మండలాగ్ర
జనితసత్కీర్తిదీప్తిప్ర◆చారమూర్తి.  139

టీ. ఈపద్యమందు తమిస్రాసురునిదీప్తికీర్తులపర మైనయర్థద్వయము గలుగును. హరిహయాస్యాతతస్ఫురణన్.—హరిహయ = ఇంద్రునియొక్క ; ఆస్య = ముఖముయొ

క్కు; ఆతతస్ఫురణన్ =విపులమైనకాంతిని. తూలఁగఁ జేసి యని ప్రతాపపరమైనయర్థము. వారిహాయ = విష్ణువాహనమైనగరుడునియొక్క; ఆస్య = ముఖముయొక్క; ఆతతస్ఫురణన్ = అతిశయప్రకాశమును, తూలఁగఁజేసి, అనఁగా గరుత్మంతునిముఖకాంతి తెల్లఁగా నుండును గాన దానిం దూలఁగఁజేసి యని కీర్తిపరమైన యర్థము. ఇట్లు వాక్యాంతరముల నూహ్యంబు. శుచిధామమహిమంబున్.—శుచి = అగ్నియొక్క; “శుచిరప్పిత్తమ్” అని యమరుఁడు. ధామ = తేజముయొక్క; మహిమంబున్ = మహిమను. చూఱవుచ్చి = కొల్లవెట్టి యని ప్రతాపపరమైనయర్థము. శుచిధామ = చంద్రునియొక్కమహిమంబుఁ జూఱవుచ్చి యని కీర్తిపరమైనయర్థము. చటులమహాకాలపటిమంబున్ = చటులమై అధికమైనయమునిమహిమమును దిగఁద్రోచి యని ప్రతాపపరమైనయర్థము. చటులమైన మహాకాల యనఁగా శివునియొక్కమహిమంబు దిగఁద్రోచి యని కీర్తిపరమైనయర్థము. నానాశరచ్ఛటాశ్రీన్.—నానా=అనేకప్రకారములగు; ఆశర=నిరృతియొక్క; ఘటా=పరంపరారూపమైన; శ్రీన్=సంపదను. అడంచి=అడఁగఁజేసి యని ప్రతాపపరమైనయర్థము. అనేకప్రకారము లగుశరము లనఁగా మబ్బులు వానిఘటలయొక్కశ్రీ నడంచి యనికీర్తిపరమైనయర్థము. కమలవరప్రభౌఘంబున్.—కమలవర=జలాధిపతి యగువరుణునియొక్క; ప్రభౌఘంబున్=కాంతిపుంజమును; మాయఁగఁ జేసి=నశించునట్లు చేసి, అని ప్రతాపపరమైనయర్థము. కమల=పద్మములయొక్క, తెల్లదామరలయొక్క యనుట; వరప్రభా = శ్రేష్ఠకాంతియొక్క; ఓఘంబున్=సంఘమును; మాయఁగఁజేసి యనికీర్తిపరమైనయర్థము. ఘనమరుత్పురసాలగరిమన్.—ఘన=అధికమగు; మరుత్=వాయువుయొక్క; పుర = నగరముయొక్క, సాల=కోటయొక్క; గరిమన్ = అతిశయమును; ముంచి=మునుఁగఁజేసి అని ప్రతాపపరమైన యర్థము. ఘనమగు; మరుత్పుర=స్వర్గసంబంధియైన; సాల=వృక్షముయొక్క, కల్పవృక్షముయొక్క యనుట. గరిమను ముంచి యని కీర్తిపరమైనయర్థము. ప్రచురసోమావలేపంబెల్లన్ =ప్రచురమగు కుబేరునియొక్కగర్వము నంతయు. కరఁగించి=కరఁగఁజేసి యని ప్రతాపపరమైనయర్థము. ప్రచుర మగుకర్పూరముయొక్కదర్పమునుగరఁగించి యని కీర్తిపరమైనయర్థము. ‘సోమః కుబేరే కర్పూరే’ అని రత్నమాల. పంచాస్యశక్తిన్=శివునిసామర్థ్యమును. పోపడన్=పోవునట్లు. ఒనర్చి=చేసియని ప్రతాపపరమైనయర్థము. సింహశక్తిని పోపడనొనర్చియని కీర్తిపరమైన యర్థము, “సింహో మృగేన్ద్రః పంచాస్యః” అని యమరుఁడు. ఇట్లు=ఈప్రకారముగ. ఆపూర్వదేవవంశేశ్వరుండు = ఆరాక్షసకులేశ్వరుఁడైనతమిస్రాసురుఁడు. విశ్వహరిదీశవిజయాప్తిన్.—విశ్వ=సమస్తమగు; హరిదీశ=ఇంద్రాదిదిక్పాలకులయొక్క; విజయాప్తిన్=విజయముయొక్కలాభము చేత. ఆత్మచండదోర్దండమండల మండలాగ్రజనిత సత్కీర్తిదీప్తిప్రచారమూర్తి.—ఆత్మ=తనయొక్క; చండ=ఉగ్రమగు; దోర్దండమండల= భుజదండమండలమందున్న; మండలాగ్ర=ఖడ్గమువలన; జనిత=పుట్టినట్టి; సత్కీర్తి = ఉత్తమయశస్సుయొక్కయు; దీప్తి=ప్రతాపముయొక్కయు; ప్రచార=వ్యాప్తికి; మూర్తి=శరీరప్రాయుఁడై. వెలయున్=ప్రకాశించును. ఇంద్రాద్యష్టదిక్పాలకుల నడంచు ప్రతాపమును గరుత్మన్ముఖహిమాంశుప్రభృతుల తేజము నొంచుకీర్తియుఁ గలవాఁడై తేజరిల్లు నని భావము.

మ. నవసంగ్రామధరాహృతంబు లగునా•నాలేఖనాగాన్వయే
భవితానమ్ముల సాధ్యరాడ్రథములం • బ్రాంచత్తురంగాస్యర
త్నవిమానంబుల నొప్పఁ జేసి హిమగో•త్రాభృద్దరీరాజధా
న్యవతంసంబున మించు నాతఁ డసురేం•ద్రానీకకోటీయుతిన్. 140

టీ. నవసంగ్రామధరాహృతంబులు.—నవ=నూతనమగు; సంగ్రామధర=యుద్ధభూమియందు; ఆహృతంబులు=తీసికొనిరాఁబడినవి. అగు నానాలేఖనాగాన్వయేభవితానమ్ములన్.—అగు=అగునట్టి; నానా=అనేకప్రకారము లైన; లేఖనాగ=ఐరావతముయొక్క; అన్వయేభ=వంశీయగజములయొక్క; వితానమ్ములన్=సమూహములను, ఐరావతమ్ముల ననుట. సాధ్యరాడ్రథములన్.—సాధ్యరాట్=సాధ్యేశ్వరునియొక్క; రథములన్=స్యందనములను. ప్రాంచత్తురంగాస్యరత్న విమానంబులన్.—ప్రాంచత్=ఒప్పుచున్న; తురంగాస్యరత్న = కింపురుషరాజుయొక్క; విమానంబులన్=పుష్పకములను కాదేని కింపురుషులరత్నమయవిమానములనని యర్థము. ఒప్పఁజేసి=ఒప్పున ట్లొనరించి హిమగోత్రాభృద్దరీరాజధాన్యవతంసంబునన్.—హిమగోత్రాభృద్దరీ=హిమవత్పర్వతగుహ యనెడు; రాజధాన్యవతంసంబునన్ = పురవరమందు. అసురేంద్రానీకకోటీయుతిన్.— అసురేంద్రానీక = రాక్షసేంద్రసమూహముయొక్క; కోటీ=అనేకములయొక్క; యుతిన్=సంబంధము చేత; అతఁడు=ఆతమిస్రాసురుండు. మించున్=అతిశయించును.

చ. అలదనుజేశ్వరుండు మృగ•యాపరమానసుఁ డై నిశాచరా
వళులు భజింప మౌనికుల•వర్యమహోటజరాజిఁ జేరి దా
బలిమిని దాపసేంద్రతతిఁ • బట్టి వధించుఁ దదూర్జితాధ్వర
జ్వలనము లార్పఁ జేయు ననివారితశోణితవారిధారలన్. 141

టీ. అలదనుజేశ్వరుండు=ఆతమిస్రాసురుండు. మృగయాపరమానసుఁ డై=వేఁటయందాసక్త మైనచిత్తముగలవాఁ డై. నిశాచరావళులు=రాక్షసులగుంపులు. భజింపన్=కొలుచుచుండఁగా. మౌనికులవర్యమహోటజరాజిన్= మునిశ్రేష్ఠులయాశ్రమసమూహమును. చేరి=పొంది. తాన్=తాను. బలిమిని=బలాత్కారముచేత. తాపసేంద్రులన్ = మునీంద్రులను. పట్టి వధించున్=పట్టుకొని హింసించును. తదూర్జితాధ్వరజ్వలనములు=ఆమునీశ్వరులయొక్క యుత్కృష్టయజ్ఞసంబంధియగ్నులను. ఆర్పన్=ఆర్చుటకు. అనివారితశోణితధారలన్ = ఆటంకము లేని రక్త మనెడునుదకధారలను. చేయున్=కలిగించును.

తే. ధీరచక్రంబుల నడంచు • సారసవన
హాననస్ఫూర్తిఁ బొల్చుభూరిదో•షానువృత్తి
నెనసి చెలరేఁగునాదాన•వేంద్రుఁ డవని
నవియ కావె తమిస్రని•ర్వా్యజగతులు. 142

టీ. ఇందుఁ దమిస్రాసురపర మైనయర్థము నంధకారపర మైనయర్థముఁ గలుగును. ఆదానవేంద్రుఁడు = ఆరాక్షసుఁడు. ధీరచక్రములన్ = విద్వన్మండలములను. ధీరము

లయినజక్కవల నని యర్థాంతరము. అడంచున్ = అడఁగఁజేయును. సారసవనహననసృతిన్.— సార=శ్రేష్ఠము లగు; సవన=యజ్ఞములయొక్క; హననసృతిన్ = హింసామార్గమందు. పొల్చున్=ఒప్పును. సారస=పద్మములయొక్క; వన=వనములయొక్క. హననసృతిఁ బొల్చు ననియర్థాంతరము. భూరిదోషానువృత్తిన్ = అనేకపాతకములయొక్క యనుసరణమును. అధికముగ రాత్రులను గూడుట నని యర్థాంతరము. ఎనసి=పొంది. చెలరేఁగున్=విజృంభించును. అవనిన్=భూమియందు. తమిస్రనిర్వ్యాజగతులు.—తమిస్ర=తమిస్రుఁ డనురక్కసుని యొక్క, చీకటియొక్క యనియర్థాంతరము; నిర్వ్యాజగతులు=స్వాభావికవ్యాపారములు. అవియ కావె=అట్టివె కావా, అనఁగా చీకటి యేరీతి చక్రవాకముల నడఁచి తామరతోఁటలను భంగపఱచి రాత్రి ననుసరించి యుండునో యట్లు తమిస్రాసురుఁడును విద్వన్మండలి నడఁచి శ్రేష్ఠయజ్ఞములనుభంగపఱచి మిక్కిలిపాపమార్గము ననుసరించి యున్నాఁడని భావము. ప్రస్తుతతమిస్రునకునప్రస్తుతాంధకారమునకు నౌపమ్యము గమ్యము. "తమిస్రం తిమిరం తమః" అని యమరుఁడు.

చ. ధరణిపచంద్ర తద్దనుజ♦దౌష్ట్యమునన్ సకలర్షి నాయకా
ధ్వరములకున్ మహాజపితృ♦వారజపంబులకున్ వ్రతివ్రతో
త్కరములకుం దపస్విసము♦దాయతపంబులకున్ సురేంద్రదు
స్తరతరవిఘ్నముల్ వొడమ♦ సాగెఁ జుమీ బహుకాల మెంతయున్. 143

టీ. ధరణిపచంద్ర=రాజచంద్రుఁడా. తద్దనుజదౌష్ట్యమునన్ = ఆతమిస్రాసురునిదుష్టత్వముచేత. సకలర్షినాయకాధ్వరములకున్=ఎల్లమునీంద్రులయొక్కజన్నములకు. మహాజపితృవారజపంబులకున్.—మహాత్=అధికమగు; జపితృవార=జపముఁ జేయువారిగుంపుయొక్క; జపంబులకున్=జపములకు. వ్రతివ్రతోత్కరములకున్ = బ్రహ్మచారులయొక్కనియమజాతములకు. తపస్విసముదాయతపంబులకున్=తాపసులగుంపుయొక్కతపములకు. సురేంద్రదుస్తరతరవిఘ్నములు = దేవేంద్రునకు దుస్తరము లగు ననఁగా వారింప రానివిఘ్నములు. ఎంతయున్=మిక్కిలి. బహుకాలము=దీర్ఘకాలముగ. వొడమ సాగెఁ జుమీ=ఉదయింపసాగెఁ జుమా.

చ. అనుపమతైక్ష్ణ్యసంచితగ♦వాళి సురారి హరింతు మైన మా
యనఘమహాతపోర్జితమ♦హంబు వ్యయం బగు నంచుఁ దన్మతిం
గనము గవాళి నయ్యసుర♦ కాంతు హరింపుము భూప యైన నీ
యనఘ మహాతపోర్జితమ♦హం బలఘుత్వము నొందుఁ గావునన్. 144

టీ. అనుపమతైక్ష్ణ్యసంచితగవాళిన్.—అనుపమ=నిరుపమాన మగు; తైక్ష్ణ్య= ఉగ్రతచేత; సంచిత = సంపాదింపఁబడిన; గవాళిన్ = వాక్పరంపరలచేత. శాపరూపము లగు వాక్పరంపరలచేత ననుట. సురారిన్=రక్కసుని. హరింతుము = సంహరింతుము. ఐనన్= అట్లయినయెడ. మాయనఘమహాతపోర్జితమహంబు.—మా=మాయొక్క; అనఘ=నిర్దోష మైన;

మహాతపః=అధికమగుతపముచేత; అర్జిత=సంపాదింపఁబడిన; మహాంబు=తేజస్సు. వ్యయఁ బగునంచున్=నష్టమగునవుచు. తన్మతిన్=అట్టిబుద్ధిని. కనము=చూడము. అనఁగా వానిసంహారము చేయుటకు యత్నింపమనుట. గవాళిన్=బాణపరంపరచేత. అయ్యసురకాంతున్=అయ్యసురనాథుని. హరింపుము=సంహరింపుము. భూప = సుచంద్రుఁడా. ఐనన్ = అట్లైనయెడ; నీయనఘమహాతపోర్జితమహంబు.—నీ=నీయొక్క; అనఘ=ఒచ్చెములేని; మహత్=అధికమైన. ఆతప=ఎండవలె; ఊర్జిత=ఊర్జితమైన; మహంబు=ప్రతాపము. అలఘుత్వమున్=ఆధిక్యమును. ఒందుఁ గావునన్=పొందును గాఁబట్టి వానిని సంహరింపుమని వెనుక కన్వయము., యమకాలంకారభేదము.

మ. అఖిలాస్త్రైకవిధానశాలివి సప•త్నాధీశమాయాతమి
స్రఖరాంశుండవు జన్యభూవిహృతి•సారజ్ఞుండ వీ వాట స
ర్వఖలధ్వంసనదక్ష యాదనుజు సం•గ్రామోర్వి బాణోద్భవ
చ్ఛిఖిఁ గూల్పం దగు దీవె పూనుము మన•స్థైర్యంబుఁ దద్వృత్తికిన్. 145

టీ. సర్వఖలధ్వంసనదక్ష=సకలదుష్టసంహారమునందు దక్షుండవగుసుచంద్రుఁడా. అఖిలాస్త్రైకవిధానశాలివి.—అఖిలాస్త్ర=సకలవిధాస్త్రములయొక్క; ఏక=ముఖ్యమగు; విధానశాలివి = విధి చేనోపువాఁడవు. సపత్నాధీశమాయాతమిస్రఖరాంశుండవు.—సపత్నాధీశ = శత్రుశ్రేష్ఠుండగు; మాయాతమిస్ర=మాయావియగుతమిస్రాసురుం డనుచీకటికి, కాదేని శత్రుశ్రేష్ఠునిమాయయనుచీకటికని యర్థము. ఖరాంశుండవు=సూర్యుండవు. జన్యభూవిహృతిసారజ్ఞుండవు.—జన్యభూ=యుద్ధభూమియందలి; విహృతిసారజ్ఞుండవు=విహారసారము దెలిసినవాఁడవు. ఈ వాటన్=నీ వగుటవలన. సంగ్రామోర్విన్=యుద్ధభూమియందు. బాణోద్భవచ్ఛిఖిన్=బాణములవలనఁబుట్టునగ్నిచేత. ఆదనుజున్=ఆరాక్షసుని. ఈవె. కూల్పం దగుదువు = కూలఁజేయ సమర్థుఁడవు. తద్వృత్తికిన్=ఆయసురసంహారవృత్తికి. మనస్థైర్యంబున్ = మనస్థైర్యమును. పూనుము=వహింపుము.

క. అని పల్కన్ నృపతి దయా•ధుని సిల్కం బలుకువాలు•దొరలం గడుఁ బా
యనియల్కం దూల్చుపలా•దునిఁ జుల్కం జేసి నియమి•తో నిట్లనియెన్.

టీ. అని పల్కన్=ఇట్లు శాండిల్యుఁడు పల్కఁగా. నృపతి= సుచంద్రుండు. దయాధుని=దయానది. చిల్కన్=చిందునట్లుగా, దీని కిట్లనియెన్ అనుక్రియతో నన్వయము. పలుకువాలుదొరలన్ = శాపరూపవాక్కులాయుధములుగాఁ గలప్రభువులను. అనఁగా మునిశ్రేష్ఠులను. కడున్=మిక్కిలి. పాయనియల్కన్=వీడనికోపముచేత. తూల్చుపలాదునిన్=సంహరించుక్రవ్యాదుని. చుల్కంజేసి = లఘువుగా నెంచి. నియమితోన్ = మునితోడ. ఇట్లనియెన్=వక్ష్యమాణప్రకారముగఁ బలికెను.

చ. పుడమిన్నృపాలు రబ్బురముఁ • బూన బలంబులతోడ నీదు వెం
బడి నరుదెంచి రాత్రిచర•బంధునిఁ గూల్చెద నంత యేల యి
య్యెడ నలదానవుం డనఁగ • నెంత భవత్కృప వాఁడు నాకసా
ధ్యుఁడె హరి గాచి యున్న హరు•తో రణమేదిని కేఁగుదెంచినన్. 147

టీ. పుడమిన్ = భూమియందు. నృపాలురు = రాజులు. అబ్బురమున్ = ఆశ్చర్యమును. పూనన్ = వహింపఁగా. బలంబులతోడన్ = సైన్యములతోడ. నీదు వెంబడిన్ = నీవెంట. అరుదెంచి = వచ్చి. రాత్రిచరబంధునిన్ = రాక్షసబంధు వగు నాతమిస్రుని. ఇయ్యెడన్ = ఇప్పుడు. కూల్చెదన్ = సంహరించెదను. అంత యేల = అంత చెప్ప నేల. అలదానవుం డనఁగ నెంత = ఆరాక్షసుం డనఁగా నెంత. భవత్కృపన్ = మీదయచే. హరి కాచి యున్నన్ = విష్ణువు రక్షించియున్నను. హరుతోన్ = శివునితోడ. రణమేదినికిన్ = యుద్ధభూమికి. ఏఁగుదెంచినన్ = వచ్చినను. నాకున్. వాఁడు = ఆరాక్షసుండు. అసాధ్యుఁడె = అసాధ్యుఁ డైనవాఁడా.

మ. దనుభూభారవిముక్తి గోతలము సెం•దన్ గోతలాప్తిన్ సుప
ర్వనికాయం బెనయన్ సుపర్వయుతి శ•శ్వత్సద్వితానంబులుం
దనరం బాయనిసద్వితానముల నా•నామౌని గేహంబు లె
చ్చ నవాస్త్రావళిఁ గూల్తుఁ దత్సురరిపు•స్వామిన్ రణాస్యంబునన్. 148

టీ. గోతలము = భూతలము. దనుభూభారవిముక్తిన్.—దనుభూ = రాక్షసునియొక్క; భారవిముక్తిన్ = భారమోక్షమును; చెందన్ = పొందఁగా. సుపర్వనికాయంబు = దేవసంఘము. గోతలాప్తిన్ = స్వర్గతలప్రాప్తిని. ఎనయన్ = పొందఁగా. సుపర్వయుతిన్ = మంచిపర్వము యొక్క యోగము చేత. శశ్వత్సద్వితానంబులున్ = సంతతము లై శ్రేష్ఠము లగుయజ్ఞములు. "వితానో యజ్ఞ విస్తార లోభేషు" అని విశ్వము. తనరారన్ = ఒప్పఁగా. పాయని సద్వితానంబులన్ = ఎడయని విద్వత్కదంబంబులతోడ. నానామౌని గేహంబులు = అనేకమునిగృహములు. ఎచ్చన్ = మించఁగా. నవాస్త్రావళిన్ = నూతనము లగున స్త్రములగుంపు చేత. తత్సురరిపుస్వామిన్ = ఆదేవారిరాజగురక్కసుని. రణాస్యంబునన్ = యుద్ధముఖమందు. కూల్తున్ = సంహరింతును. తాత్పర్యము స్పష్టము.

ఏకావళీకారణమాలాలంకృతులు. శ్లో. గృహీతముక్తరీత్యార్థశ్రేణి రేకావళీమతా గుమ్ఫః కారణమాలా స్యాద్యథా ప్రాక్ప్రాన్తకారణైః. అని లక్షణములు.

తే. యమికులమహేంద్ర యిది కార్య • మనుచు నొక్క
శిష్యుఁ బనిచిన వచ్చి యా•శీవిషోప
మాశుగాళి సురారాతి • నవనిఁ గూలి
చెదను మీ రింతపనికి వి•చ్చేయఁ దగునె. 149

టీ. యమికులమహేంద్ర = మునికులరాజ వైనశాండిల్యుఁడా. ఇది కార్యమను చున్ = ఇది కర్తవ్యం బని. ఒక్కశిష్యునిఁ బనిచినన్ = ఒకయుం తేవాసిని బనిచినను. వచ్చె= నేనంతవఱకు వచ్చి. ఆశీవిషోపమాశుగాళిన్.— ఆశీవిష=సర్పములకు. ఉపమ=తుల్యము లగు; ఆశుగ=బాణములయొక్క; ఆళిన్=పంక్తిచేత. సురారాతిన్= దేవవిరోధి యగురక్కసుని. అవనిన్= భూమియందు. కూలిచెదను = పడవైతును. మీరు = మహర్షిశ్రేష్ఠులైనమీరు. ఇంతపనికిన్ = ఇట్టిస్వల్పకార్యమునకు. విచ్చేయన్ = వచ్చుట. తగునే=తగినట్టిదా.

చ. అని విభుఁ డమ్మునీశు విన•యంబునఁ బూజన మూన్చి భక్తిచే
నని చి నిజాప్తమంత్రిజన•తైకవచోగతి సమ్మదం బెదఁ
దనరఁగ నాత్మదివ్యపృత•నానికరంబుల రా ఘటించి తా
నెనపె జయప్రయాణనియ•తైహికమానసవీథి నంతటన్. 150

టీ. అని=ఈప్రకారము పచించి. విభుండు=సుచంద్రుఁడు. అమ్మునీశున్ = ఆశాండిల్యుని. వినయంబునన్ = అడఁకువతోడ. పూజనము = అర్చనము. ఊన్చి = చేసి. భక్తిచేన్ = భక్తిచేత. అనిచి=పంపి. నిజాప్తమంత్రిజనతైకవచోగతిన్.— నిజ = తన; ఆప్త=హితులయొక్కయు; మంత్రిజనతా=మంత్రిసమూహముయొక్కయు; ఏక=ముఖ్య మగు; వచోగతిన్=వాగ్రీతి చేత. సమ్మదంబు=సంతసము. ఎదన్=హృదయమున. తనరఁగన్=ఒప్పఁగా. ఆత్మదివ్యపృతనానికరంబులన్ = తనదివ్యసేనలగుంపులను. రా ఘటించి = వచ్చునట్లు చేసి. తాన్. జయప్రయాణ నియతైహికన్.— జయప్రయాణ = విజయయాత్రయందు; నియతైహికన్=నియతాభిలాషను, ఈహాశబ్దముపై కప్రత్యయము. మానసవీథిన్=మనోవీథిని. అంతటన్=ఎల్లెడల. ఎనపెన్=వ్యాపింపఁజేసెను. జయప్రయాణమునకు నిశ్చితచిత్తుం డాయె ననుట.

మ. గళదర్కంబుఁ బనీపతత్కుజము రిం•ఖద్గోత్రగోత్రంబుఁ జా
చలదుర్వీవలయంబు ఫక్క•దఖిలా•శాకంబు భిద్యన్నభ
స్థ్సలమేఘౌఘము భ్రశ్యదృక్షము రణ•త్పద్మాసనాండంబు నై
యల రెం దన్మహిపాలజైత్రగమబం•భారావ మప్పట్టునన్. 151

టీ. అప్పట్టునన్ = ఆసమయమందు. తన్మహిపాలజైత్ర గమబంభారావము.— తన్మహిపాల=ఆసుచంద్రునియొక్క; జైత్ర=జయార్థమైన; గమ=ప్రస్థానసూచకమగు "ప్రస్థానంగమనంగమః" అని యమరుఁడు. బంభా=భేరియొక్క, "బమ్భాభేర్యామ్" అని అమరశేషము: ఆరావము=ధ్వని. గళదర్కంబున్ = పడుచున్నసూర్యుఁడు గలదియు. పనీపతత్కుజమున్ = మిక్కిలి కూలుచున్నవృక్షములు గలదియు, పనీపతచ్ఛబ్దము యఙ్లుగంతము. "నీగ్వంచుస్రంసు" అను సూత్రముచేనభ్యాసమునకు నీగాగమము. రింఖద్గోత్రగోత్రంబున్ = ఎగిరిపడుచున్న గిరిసంఘము గలదియు. చాచలదుర్వీవలయంబున్ = మిక్కిలిచలించుచున్నభూవలయము గలదియు. ఫక్క

దఖిలాశాకంబుల్ = పగులు చున్న సకలదిక్కులు గలదియు, ఆశాశబ్దాంతబహువ్రీహిమీఁద కప్ప్రత్యయము. “ఆపోన్యతరస్యామ్” అని వికల్పముచేత హ్రస్వములేదు. భిద్యన్నభస్థల మేఘౌఘముల్ = చీలుచున్న గగనగత మేఘములగుంపు గలదియు. భ్రశ్యదృక్షముల్ = పుడమిని వ్రాలుచున్నరిక్కలు గలదియు, భ్రంశు అధఃపతనే యనుటచేత భ్రంశుధాతువధఃపతనార్థకంబు. రణత్పద్మాననాండంబుల్ = మ్రోఁగుచున్న బ్రహ్మాండంబు గలదియు. ఐ. అలరెల్ = ఒప్పెను. అత్యుక్త్యలంకారము.

సీ. సితకాండజాతసం♦గతి విరాజిల్లుటఁ, జక్రాంగ మగుటకు ♦ సందియంబె
చారుసూనవితాన♦సంయుక్తి వెలయుట,స్యందనం బగుటకు ♦ సందియంబె
వరవైజయంతికా♦పరివృత్తి నొప్పుటఁ, జక్రి దా నగుటకు ♦ సందియంబె
సుకరయుగాదికాం♦గకలబ్ధిఁ దనరుట, సద్రథం బగుటకు ♦ సందియంబె

తే. హరిభయంకరభూరిధా♦మాప్తి మనుట
జగతి నిది తార్క్ష్య మగుటకు ♦ సందియంబె
యనఁగఁ బొగ డొందురత్నశ♦తాంగ మప్పు
డధిపుకనుసన్నఁ దెచ్చె ని♦యంత యొకఁడు. 152

ఇందు రథమువర్ణింపఁబడు చున్నది, ఎట్లనిన:—సితకాండజాతసంగతిల్.—సిత=తెల్లనగు; కాండ=గుఱ్ఱములయొక్క; జాత=గుంపుయొక్క; సంగతిల్=సంబంధముచేత; విరాజిల్లుటల్=ప్రకాశించుటచేత. సిత=తెల్లనగు; కాండజాత=తామరలయొక్క; సంగతిచేత విరాజిల్లుట నని యర్థాంతరము. చక్రాంగము = రథము, హంసము అని యర్థాంతరము. అగుటకుల్. సందియంబె = సందేహంబు లే దనుట. చారుసూనవితానసంయుక్తిల్.— చారు = మనోజ్ఞము లగు; సూనవితాన=పువ్వులచప్పరములయొక్క; సంయుక్తిల్ = సంబంధముచేత. వెలయుటల్ = ప్రకాశించుటచేత. మనోజ్ఞకుసుమ సంఘయోగముచేత వెలయుట నని యర్థాంతరము. స్యందనం బగుటకుల్ = రథ మగుటకు, నెమ్మిచెట్టగుట కని యర్థాంతరము. సందియంబె. వరవైజయంతికాపరివృత్తిల్ = శ్రేష్ఠము లగుపతాకలయొక్క సంబంధముచేత నొప్పుటచే, శ్రేష్ఠ మగువనమాలికయొక్క సంబంధముచేత నొప్పుటచే నని యర్థాంతరము.. చక్రి దా నగుటకు సందియంబె = రథ మగుటకు సందియమా, విష్ణు వగుటకు సందియమా యని యర్థాంతరము. సుకరయుగాదికాంగకలబ్ధిల్.— సుకర=అనుకూల మగు ; యుగ=కాఁడి ; ఆదిక=మొదలుగాఁగల; అంగక=అంగములయొక్క; లబ్ధిల్=లాభముచేత. సమీచీన మైనహస్తద్వయము మొద లగునంగములతోఁ గూడుటచేత నని యర్థాంతరము. సద్రథంబు=మంచితేరు, మంచిశరీరము అని యర్థాంతరము. “రథో దేహేస్యన్దనేచ” అని రత్నమాల. అగుటకుల్ సందియంబె. హరిభయంకరభూరిధామాప్తిల్.—హరి=సూర్యునకు ; భయంకర=భయమును జేయు; భూరిధామ=బంగరుతేజముయొక్క ; ఆప్తిల్=ప్రాప్తిచేత, సర్పములకు భయంకర మైన ; భూరి=అధిక మగు, “భూరిప్రాజ్య సువర్ణయోః”

అని విశ్వము: ధామ=తేజముయొక్క; ఆప్తిచేత ననియర్థాంతరము. మనుటన్=వృద్ధిఁ బొందుటచేత. జగతిన్=లోకమందు; ఇది=ఈరథము. తార్క్ష్యము అనఁగా నశ్వములు గలది తార్క్ష్యశబ్దముపై నర్శఆద్యచ్ప్రత్యయము. గరుత్మంతుఁ డని యర్థాంతరము. "తురఙ్గగరుడౌ తార్క్ష్యౌ" అని యమరుఁడు. అగుటకున్ సందియంబె. అనఁగన్ = ఇట్లని. పొగడొందు రత్నశతాంగము = పొగడ్తను గాంచురత్నఖచిత మగురథము; అప్పుడు = ఆజయభేరీనినాదావసరమున. అధిపుకనుసన్నన్=రాజునేత్రసంజ్ఞచేత. నియంత యొకఁడు=ఒకసూతుండు తెచ్చెన్=తీసికొనివచ్చెను.

ఈపద్యమునందు రథము విషయభేదముచే నానారూపముగ లోకముచేత నుల్లేఖింపఁబడుటంజేసి యుల్లేఖాలంకారభేదము. "శ్లో. ఏకేన బహుధోల్లేఖే ఖ్యసౌ విషయభేదతః" అని తల్లక్షణము. లోకులచేత ననియుల్లేఖకర్తృబహుత్వము వివక్షితమగునేని, "శ్లో. బహుభి ర్బహుధోల్లేఖాదేకస్యోల్లేఖ ఇష్యతే" అని యుల్లేఖాలంకారభేద మగును.

చ. తొడవులు మేటిమేనిజిగి♦తో నిగుడం గుడివంకఁ గెంపు రా
పిడియము దోఁప బంధునృప♦బృందము లందఱు నివ్వటిల్ల వెం
బడి నెడ యీక రాఁ దళుకు♦బంగరుఁజేల యొకింత జీరఁగా
వెడలె హజార మానృపతి ♦ విప్రయుగంబును దృష్టి నాఁగుచున్. 153

టీ. ఆనృపతి=ఆసుచంద్రుఁడు. తొడవులు=భూషణములు. మేటిమేనిజిగితోన్ = శ్రేష్ఠమగుదేహకాంతితోడ. నిగుడన్=వ్యాపింపఁగా. కుడివంకన్=కుడిప్రక్కను. కెంపురాపడియము=పద్మరాగమణిమయ మగుబాహు. తోఁపన్ = అగపడుచుండఁగా. బంధునృపబృందములు=బంధునృపాలురసముదాయములు. అందఱున్=ఎల్లరును. నివ్వటిల్లన్=అతిశయించునట్లుగా. వెంబడిన్=వెంట. ఎడ యీక=పిక్కటిల్లునట్లుగా. రాన్=రాఁగా. తళుకుబంగరుఁజేల=ప్రకాశించుకనకచేలము. ఒకింతజీరఁగాన్=ఇంచుక జీరాడఁగా. విప్రయుగంబును=బ్రాహ్మణయుగ్మమును. దృష్టిన్=చూపుచే. ఆఁగుచున్ = అడ్డగించుచు. అనఁగా దృష్టిగోచరముగా బ్రాహ్మణ యుగ్మమును జేయుచు నని భావము. "శ్లో. కన్యాగోర్ద్విరిశఙ్ఖం దధిఫలకుసుమం పావకం దీప్యమానం యానం వా విప్రయుగ్మం హయగజవృషభం పూర్ణకుమ్భద్వయంచ" అని మొదలుగా జ్యోతిషశాస్త్రీయశకునాధ్యాయమందు బ్రాహ్మణయుగ్మదర్శనము ప్రస్థితులకు మంగళకర మనిచెప్పఁబడినది. హజారము=కొలువుకూటము. వెడలెన్=బయలుదేఱెను.

చ. కొలు విపు డబ్బె నంచు బలు♦కోర్కు మహీశులు నిల్చి కొల్వుఁ(?)బ్రొ
క్కులు ఘటియించి రప్పతిక♦కుంఠకలధ్వని వేత్రు లంగరా
ట్కులుఁడు పరా కితం డతఁడు ♦ కోసలనేత పరా కితండు కే
రలుఁడు పరా కతండు కురు♦రాజు పరా కని యుగ్గడింపఁగన్. 154

టీ. మహీశులు=రాజులు. కొలు విపు డబ్బె నంచున్=ఇపుడు సుచంద్రుని సేవ ఘటించె ననుచు. నిల్చి=నిలుచుకొని. అప్పతికిన్=ఆరాజునకు. వేత్రులు=వేత్రధారులు, అనఁగా బెత్తపువారు. వేత్రశబ్దముమీఁదమత్వర్థీయేనిప్రత్యయము. అకుంఠకలధ్వనిన్ = నిరర్గళ మధురశబ్దముతో. ఇతండు=మ్రొక్కుచున్న యీప్రభువు. అంగరాట్కులుఁడు= అంగదేశాధీశ్వరవంశ్యుఁడు. పరాకు=తత్పరుఁడవు గమ్ము. అతఁడు=ప్రణమిల్లుచున్నయాతండు. కోసలనేత=కోసలాధీశుఁడు. పరాకు. ఇతండు=నమస్కరించు చున్నయీభూమిపతి. కేరళుఁడు= కేరళదేశాధీశుఁడు. పరాకు. అతండు=నతి నొనర్చు నానరపతి. కురురాట్=కురుదేశాధీశుఁడు. పరాకు=హెచ్చరికపదము. అని యుగ్గడింపఁగన్=అని శబ్దించు చుండఁగా. బలుకొల్కు = కొల్వుమ్రొక్కులు; కొలువుప్రణామములు. ఘటియించిరి=చేసిరి.

మ. నృపరత్నంబు వినీతసూతతిలకా•నీతప్రియస్యందనం
బపుడిం పెచ్చఁగ నెక్కి యొప్పె మఘవా•శాద్రిం గనం బొల్చుపూ
ర్ణపయోజారి యనన్ బుధావళి నవా•నందంబుచేఁ జూడ న
భ్రపదం బాఁగుచు వాహినీశ్వరమహా•భంగార్భటుల్ హెచ్చఁగన్. 155

టీ. నృపరత్నంబు=నృపశ్రేష్ఠుం డగుసుచంద్రుఁడు. వినీతసూతతిలకానీతప్రియస్యందనంబు.— వినీత=వినయవంతుఁ డైన; సూతతిలక=ఉత్తమసారథిచేత; ఆనీత=తీసికొనిరాఁబడిన; ప్రియస్యందనంబు=ప్రియ మగురథము; ఇం పెచ్చఁగన్=ప్రీతి హెచ్చఁగా. ఎక్కి = అధిరోహించి. అపుడు=ఆసమయమున. కనన్=చూడఁగా. మఘవాశాద్రిన్=ఉదయగిరియందు. పొల్చుపూర్ణపయోజారి=ఒప్పునట్టిపూర్ణచంద్రుఁడు. అనన్ = అనునట్లుగా, దీని కొప్పె ననుక్రియతో నన్వయము. బుధావళి=పండితమండలి, దేవసంఘ మనియర్థాంతరము. నవానందంబుచేన్=తత్కాలోల్లసితానందముచేత. చూడన్=అవలోకింపఁగా. అభ్రపదంబు = గగనతలమును. ఆఁగుచున్=అడ్డగించుచు. వాహినీశ్వరమహాభంగార్భటుల్.— వాహినీశ్వర=సేనాధిపతులయొక్క; మహత్=అధికము లైన; అభంగ=అవిచ్ఛిన్నము లైన; ఆర్భటుల్=శబ్దములు; అని రాజపర మైనయర్థము. వాహినీశ్వర=సముద్రముయొక్క; మహాభంగ =పెద్దతరఁగలయొక్క; ఆర్భటుల్ = శబ్దము లనిచంద్రపర మైనయర్థము. హెచ్చఁగన్ = అతిశయింపఁగా. ఒప్పెన్=ప్రకాశించెను.

అనఁగా సుచంద్రనృపతి రథారూఢుం డై బుధులు మోదముతోఁ దన్నవలోకించు చుండఁగా సేనానాయకార్భటులు హెచ్చుచుండఁగా నుదయగిరి నధిరోహించి దేవతలు ప్రీతితోఁ దన్నవలోకించు చుండఁగా సముద్రతరంగధ్వను లెచ్చుచుండఁగా మించుపూర్ణచంద్రునివలెఁ బ్రకాశించె ననిభావము. రూపకాలంకారభేదము. "తద్రూపక మభేదో య ఉపమానోపమేయయోః" అని కావ్యప్రకాశమందుఁ దల్లక్షణము.

వ. ఇట్టు లాలోకమిత్రుం డహీన భూరిప్రగ్రహప్రకాండ పరిస్ఫూర్తంబును
నఖిలసన్మణిప్రకరవర్ణనీయప్రభాభాసమానైకచక్రసముపేతంబును నాశు

గమార్గాతిక్రమణచణవేగవదనమావదాతతురంగసంయోజితంబును నమర
వినుతాభిరామధామారుణసారథివిభ్రాజితంబును నై రాజిల్లుశతాంగరాజం
బారోహించి యాత్మీయభక్తిభావ సంసక్తచిత్తంబున నడరుచక్రకాంత
చక్రంబులంగటాక్షించుచుననివార్యరసవిశేషవిలసితపద్మినీసందోహంబుల
కామోదంబుఁ గూర్చుసొంపునం బెంపొందుచు నఖండరాజమండలతేజో
గౌరవంబు నిజతేజోమహిమంబున సంపాదించుచు నక్షీణదస్యువీక్షణసమ్మద
విక్షేపకాక్షుద్రకరకాండచండిమంబునఁ జూపట్టుచు నఖర్వశార్వరమాహా
త్మ్యనిర్వాపణోల్లాసంబున నెడలె నయ్యెడ. 156

టీ. ఇట్టులు=ఈప్రకారముగ. ఆలోకమిత్రుండు=ఆలోకహితుండగుసుచంద్రుఁడు. 'ఖద్యోతోలోకబాన్ధవః' అనుటచేత సూర్యుఁడనునర్థాంతరము స్ఫురించును. అహీనభూరిప్రగ్రహప్రకాండపరిస్యూతంబును.—అహీన=అధికములైన; భూరి=సువర్ణమయములైన; ప్రగ్రహ=పగ్గములయొక్క; ప్రకాండ=సమూహముచేత ; పరిస్యూతంబును=కట్టఁబడినదియు నని సుచంద్రరథపరమైనయర్థము. సర్వశ్రేష్ఠము లనెడునధికములైనపగ్గములసమూహముచేఁ గట్టఁబడిన దని సూర్యరథపరమైనయర్థము. అఖిలసన్మణిప్రకరవర్ణనీయప్రభాభాసమానైకచక్రసముపేతంబును.—అఖిల=సమస్తములగు; సన్మణి=శ్రేష్ఠమణులయొక్క,సత్పురుషశ్రేష్ఠులయొక్కయనియర్థాంతరము.ప్రకర=గుంపుచేత;వర్ణనీయ=కొనియాడఁదగిన; ప్రభా=కాంతులచేత; భాసమాన=ప్రకాశమానములగు; ఏక=ముఖ్యములగు ; చక్ర=కండ్లతోడను ; సముపేతంబును=యుక్తంబును. భాసమానమైనయొకకంటితోడ సముపేతంబు ననియర్థాంతరము. ఆశుగమార్గాతిక్రమణచణవేగవదనమావదాత తురంగసంయోజితంబును —ఆశుగ = బాణములయొక్క, వాయువుయొక్క; మార్గ=సరణియొక్క; అతిక్రమణ=అతిక్రమించుటచేత; చణ = ప్రసిద్ధములైన; వేగవత్=వేగవంతములగు; అవదాతతురంగ=తెల్లగుఱ్ఱాలతోడను; సూర్యరథపరమైనపుడు (పచ్చ) గుఱ్ఱాలతోడ ననియర్థము. "అవదాతస్సితేపీతేశుద్ధే", అని విశ్వము. సంయోజితంబును=కూడినదిగాఁ జేయఁబడినదియు. అమరవినుతాభిరామధామారుణసారథివిభ్రాజితంబును.— అమరవినుత=దేవతలచేఁ గొనియాడఁబడిన ; అభిరామ = మనోహరమగు; ధామ=ప్రతాపముచేత; అరుణ=సూర్యతుల్యుఁడగు; సారథి=సూతునిచేత ; విభ్రాజితం బనిసుచంద్రరథపరమైనయర్థము. అమరవినుతమై యభిరామమైన తేజము గలయనూరుఁడనుసారథిచేత విభ్రాజితం బనిసూర్యరథపరమైనయర్థము. ఐ. విరాజిల్లుశతాంగరాజంబు=పూర్వోక్తగుణవిశిష్టమై భాసిల్లునుత్తమరథంబు. ఆరోహించి = ఎక్కి. ఆత్మీయభక్తి భావసంసక్తచిత్తంబునన్.—ఆత్మీయ=తనసంబంధియైన; భక్తిభావ=భక్తి యనెడుభావముచేత, స్వవిషయకమైనభక్తిభావముచేత ననుట. రసగంగాధరాద్యలంకార గ్రంథములయందు భక్తికి రసత్వముఁ జెప్పినవారిమతఖండనావసరంబున, "శ్లో. రతిర్దేవాదివిషయావ్యభిచారీతథాఞ్జితః । భావఃప్రోక్తః" అనుటచేత, భక్తిని, దేవాదివిషయకరతిభావములోఁ జేర్చినందున, నిట భక్తిభావ యని వచింపఁబడియె. మఱియు ఆత్మీయభక్తిభావ యనుచోట "శ్లో. జక్షా

కాన్తోరుణాలోకనఖకిరణలసత్కేసరాళీకరాలత్ప్రత్యగ్రాలక్తకాభాప్రసరకిసలయోమఞ్జుమఞ్జీరభృఙ్గః। భర్తుర్నృత్తానుకారే జయతి నిజతనుస్వచ్ఛలావణ్యవాపీసంభూతామ్భోజశోభాం విదధదభినవో దణ్డపాదో భవాన్యాః" అనుదానియందు భవానీగతనిజత్వప్రతీతి కావలసియుండఁగా దండపాదగతనిజత్వప్రతీతి యగుటవలన విరుద్ధమతికారిత్వరూపకావ్యదోషము ప్రసరించునని కావ్యప్రకాశమందుఁ జెప్పినరీతిగ సుచంద్రగతాత్మీయత్వప్రతీతి కావలసియుండఁగాఁ జక్రకాంతగతాత్మీయత్వప్రతీతి యగుటవలనఁ బైఁ జెప్పినదోషము ప్రసరించు నని తోచుఁగాని "నత్వా సామ్బం శివం బ్రహ్మా నాగేశః కురుతే" అనుచోట జగన్నిరూపితాంబాత్వప్రతీతివలెఁ బ్రధానభూతక్రియాకర్తృనిరూపితాత్మీయత్వప్రతీతి నవలంబించినందున నట్టిదోషంబు ప్రసరింప దని యెఱుంగునది. సంసక్త=సంబంధించిన; చిత్తంబునన్=మానసముచేత; అడరు చక్రకాంతచక్రంబులన్=ఒప్పునట్టి రాష్ట్రాధిపతులయొక్క సంఘములను; చక్ర=చక్రవాకపక్షులయొక్క; కాంత=మనోజ్ఞములగు; చక్రంబులన్=సంఘముల నని యర్థాంతరము. కటాక్షించుచున్=అవలోకించుచు. అనివార్యరసవిశేషవిలసితపద్మినీ సందోహంబులకున్.—అనివార్య=అడ్డగింప రాని; రసవిశేష=ఆసక్తివిశేషముచేత; అధికమైన మకరందముచేత నని యర్థాంతరము. విలసిత=ప్రకాశించునట్టి; పద్మినీ=పద్మినీజాతి స్త్రీలయొక్క, తామరతీఁగెలయొక్క యని యర్థాంతరము. సందోహంబులకున్=గుంపులకు. ఆమోదంబున్=సంతసమును; పరిమళమును అని యర్థాంతరము. కూర్పసాంపునన్=ఘటింపఁజేయు సౌందర్యమువలన. పెంపొందుచున్=అతిశయించుచు. అఖండరాజమండలతేజోగౌరవంబు.—అఖండ=అవిచ్ఛిన్నమగు; రాజమండల=నృపసంఘముయొక్క, పూర్ణచంద్రమండలముయొక్క; తేజోగౌరవంబు=ప్రతాపాతిశయము; కాంత్యతిశయము. నిజతేజోమహిమంబునన్=తనప్రతాపమహిమముచేత, కాంత్యతిశయముచేత. సంపాదించుచున్=కలుగఁజేయుచు. అక్షీణదస్యువీక్షణసమ్మద విక్షేపకాత్యుద్రకరకాండచండిమంబునన్.—అక్షీణ=తక్కువ గాని; దీనికి సమ్మదమం దన్వయము. దస్యు=శత్రువులయొక్క, దొంగలయొక్క; వీక్షణ=చూపులయొక్క; సమ్మద=సంతసమునకు; విక్షేపక=నాశకము లగు పగలు చోరులకు సందర్భము ఘటింపదు గాన దొంగలసంతసమునకు సూర్యతేజము నాశక మనుట. అత్యుద్ర=అధికములైన; కర=హస్తమందలి; కాండ = బాణములయొక్క; కరకాండ=కిరణసంఘములయొక్క యని సూర్యపరమైనయర్థము. చండిమంబునన్=ఉగ్రతవలన. చూపట్టుచున్ = అగపడుచు. అఖర్వశార్వరమాహాత్మ్యనిర్వాపణోల్లాసంబునన్.—అఖర్వ=అధికమగు; శార్వర=శత్రువు లగురక్కసులయొక్క, చీకటియొక్క యని సూర్యపరమైనయర్థము. మాహాత్మ్య=గొప్పదనముయొక్క; నిర్వాపణ=ప్రశమనమందు; ఉల్లాసంబునన్= సంతోషముచేత; ప్రకాశముచేత. వెడలెన్=బయలుదేఱెను. అయ్యెడన్=ఆసమయమున. ఇచట సూర్యునకు సుచంద్రునకు నౌపమ్యము గమ్యము గావున నుపమాలంకారధ్వని.

చ. హరిభయకృద్రయాన్వితము • లై యభిరూపకలాపజాతభా
స్వరత వహించి చూడఁ దగు • వాజివరంబుల నెక్కి రాజశే

ఖరతనయౌఘు మేఁగె మహీ♦కాంతుని వెంబడి దివ్యశక్తితో
నరు దగుతారకాత్మదర♦దాత్మసమాఖ్య బుధుల్ నుతింపఁగన్. 157

టీ. ఈ పద్యమందు సుచంద్రపరమైనయర్థముఁ గుమారస్వామిపరమైనయర్థముఁ గలుగును. హారిభయకృద్రయాన్వితములు ఐ.— హరి = వాయువునకు; సర్పముల కని యర్థాంతరము. భయకృత్=వెఱపు పుట్టించెడు; రయ=వేగముతోడ; అన్వితములై= కూడుకొన్నవై. అభిరూపకలాపజాతభాస్వరతన్.—అభిరూప=మనోజ్ఞము లగు; కలాప=భూషణములయొక్క, మనోజ్ఞ మగుపింఛముయొక్క యని యర్థాంతరము. “కలాపోభూషణేబర్హే” అని యమరుఁడు. వహించి=ధరించి; చూడన్=కనుటకు. తగువాజివరంబులన్=ఒప్పుచున్న యశ్వరత్నములను, కుమారస్వామిపరమైనపుడు పక్షిశ్రేష్ఠముల ననియర్థము నెమ్ముల ననిభావము. ఎక్కి=అధిరోహించి. రాజశేఖరతనయౌఘము=రాజశ్రేష్ఠులకుమారసంఘము, చంద్రశేఖరునికుమారులైన షణ్ముఖులయొక్క గుంపు అని ధ్వన్యమాన మగునర్థము. దివ్యశక్తితోన్=అమానుషసామర్థ్యముతో, దివ్య మగుశక్తి యనునాయుధముతో నని స్కందపరమైనయర్థము. అరు దగుతారకాత్మదరదాత్మసమాఖ్యన్.—అరుదగు=ఆశ్చర్యకరమైన; తారకాత్మ= నక్షత్రదేహములను; దర=శంఖమును; ద=ఖండించెడు; ఆత్మసమాఖ్యన్=తనకీర్తిని. తారక=తారకాసురునియొక్క; ఆత్మ=చిత్తమునకు; దరద=భయము నిచ్చెడు; ఆత్మసమాఖ్యన్=తనపేరిని. బుధుల్=పెద్దలు; దేవతలు అని స్కందపరమైనయర్థము. నుతింపఁగన్=కొనియాడఁగా. మహీకాంతునివెంబడిన్=సుచంద్రనరపతి వెంబడి. ఏఁగెన్=చనుదెంచెను.

అనఁగా సర్పములకు భయంకర మగువేగమును వహించి మనోహరపింఛముఁ దాల్చిన మయూరము నెక్కి శక్త్యాయుధముతోఁ గూడి తారకాసురాత్మభయంకర మగుతనపేరిని దేవతలు నుతించుచుండఁగా స్కందుండు వెడలినట్లు రాజకుమారులు వాయుభయంకరమయినవేగము గలిగి మనోహరభూషణములు దాల్చి భాసిల్లునశ్వరత్నముల నెక్కి యమానుషమైనబలిమితోఁ గూడి నక్షత్రశంఖకాంతులను దిరస్కరించుతమకీర్తిని పెద్దలు కొనియాడుచుండఁగా సుచంద్రునివెంటఁ జనుదెంచి రని భావము. ప్రస్తుతాప్రస్తుతోపమాధ్వని యని తెలియునది.

చ. తనుపులకాలిమేలు పయిఁ♦దార్చినబంగరుజాలుచాలు చ
క్కనికటిసీమలం దనరు♦గైరికరేఖలడాలు సాలఁ గ
న్గొనిన ముద మూన్ప భద్రకరి♦కోటులు వెల్వడె రాజువెంటఁ జ
య్యనఁ బదమేఘగాళితతు♦లందుకజాలకయుక్తిఁ బూనఁగన్. 158

టీ. భద్రకరికోటులు=భద్రగజసమూహములు. తనుపులకాలిమేలు.—తను= శరీరమందలి; పులక=రోమాంచములయొక్క; ఆలి=పంక్తియొక్క; మేలు = అతిశయము. పయిన్=శరీరమందు. తార్చినబంగరుజాలుచాలు=ఉంచినట్టి బంగరు జాలుయొక్క చాలు. చక్కనికటిసీమలన్=అందమైనకటిప్రదేశములయందు. తనరు గైరికరేఖలడాలు=ఒప్పు చున్నధాతు

రేఖల కాంతి. కన్గొనన్ = చూడఁగా. చాలన్ = మిక్కిలి. ముదము=సంతసమును. ఊన్పన్ = చేయఁగా. ఎయ్యనన్ = వేగముగా. పదమేఘగాళి= పద=పాదములయందున్న; మేఘ= మేఘ మనుపేరుగల మదోదకమును; గ=పొందినట్టి; అళి=తుమ్మెదలయొక్క. తతులు=గుంపులు. అందుకజాలకియుక్తిన్=నిగళసమూహముయొక్క కూడికను. పూనఁగన్=వహింపఁగా. రాజువెంటన్=సుచంద్రుని వెంబడి. వెల్వడెన్=బయలుదేఱెను.

మ. అమరెం దత్సృతి నేఁగునీలమయచ◆క్రాంగంబు లింద్రావరో
ధముఁ దప్పించుక ధాత్రిఁ జేరినసము◆ద్యత్పుష్కలావర్తము
ఖ్యమహామేఘకులంబులో యనఁగఁ జ◆క్కం గాండధారావిశే
షములుం భూరిమణీశరాసనవిభా◆జాతంబులుం జూడఁగన్. 159

టీ. తత్సృతిన్ = ఆసుచంద్రుఁడు పోవుదారిని. ఏఁగునీలమయచక్రాంగంబులు.—ఏఁగు = పోవుచున్న; నీలమయ = ఇంద్రనీలమణిమయములగు; చక్రాంగంబులు = రథములు. ఇంద్రావరోధమున్=ఇంద్రుని యడ్డగింతను. తప్పించుక=వదిలించుకొని. ధాత్రిన్= భూమిని. చేరిన సముద్యత్పుష్కలావర్త ముఖ్య మహామేఘకులంబులో యనఁగన్.—చేరిన= పొందిన; సముద్యత్=ప్రకాశించు చున్న; పుష్కలావర్తముఖ్య= పుష్కలావర్తము మొదలగు; మహామేఘ = గొప్ప మేఘములయొక్క; కులంబులో యనఁగన్ = గుంపులో యను నట్టుగా, దీని కమరెన్ అనుక్రియతో నన్వయము. చక్కన్ = బాగుగా. కాండధారా విశేషములన్=గుఱ్ఱాలయొక్క గతి విశేషములను. "ఆస్కందితం ధౌరితకం రేచితం వల్గితం ప్లుతం గతయోమూః పఞ్చధారాః" అని యమరుఁడు, జలధారల విశేషములను. భూరిమణీశరాసనవిభాజాతంబులన్.—భూరిమణీ=అధికమణులుగల; శరాసన=ధనువులయొక్క, ఇంద్రధనువులయొక్క యని యర్థాంతరము. విభా=విశేషకాంతులయొక్క; జాతంబులన్=సంఘములను. చూడఁగాన్=అవలోకింపఁగా. అమరెన్=ఒప్పెను. ఉత్ప్రేక్షాలంకారము.

చ. అనఘవిసారపాళియుతి◆ నంచితశుభ్రశరాప్తిఁ బుండరీ
కనిచయలబ్ధి నాగవర◆కాండనిమక్తిఁ గనం బొసంగువా
హిని యలయంశుమత్కులమ◆హీశ్వరు వెంబడి నేఁగఁ జొచ్చె న
భ్రభనది భగీరథానుసృతి◆ భవ్యరయస్థితి నేఁగుచాడ్పునన్. 160

టీ. ఈపద్యమున సుచంద్రునివెంటఁ జనుసేన భగీరథునివెంటఁ జనుగంగవలె నున్న దని వర్ణించుటంజేసి సేనాభాగీరథులపరమైనయర్థద్వయము గలుగు చున్నది. అనఘవిసారపాళియుతిన్.—అనఘ=ఒచ్చెము లేని; విసార=ప్రసరణముగల; పాళి = పెక్కుములయొక్క; యుతిన్=సంబంధముచేత నని సేనాపరమైనయర్థము. అనఘము లైనమత్స్యవిశేషములయొక్క గుంపుయొక్క యోగముచేత నని గంగాపరమైనయర్థము, "విసారశ్శకులార్భకః" అని యమరుఁడు. అంచితశుభ్రశరాప్తిన్.—అంచిత=ఒప్పుచున్న; శుభ్ర=నిర్మలము లైనట్టి; శర=బాణములయొక్కయు జలములయొక్కయు; ఆప్తిన్=ప్రాప్తిచేతను, పుండ

రీకనిచయలబ్ధిన్=శ్వేతచ్ఛత్త్రములయొక్క గుంపులలాభముచేతను, తెల్లతామరలసంఘముయొక్కలబ్ధిచేతను. నాగవరకాండనిషక్తిన్.—నాగ=గజములయొక్కయు; వరకాండ=శ్రేష్ఠాశ్వములయొక్కయు; నిషక్తిన్=సంబంధముచేతను. "కాణ్డోఽస్త్రీ దణ్డబాణార్వవర్గావసరవారిషు" అని యమరుఁడు. నాగవర=సర్పశ్రేష్ఠములయొక్క; కాండ = సమూహముయొక్క; నిషక్తిన్=సంబంధముచేతనని గంగాపరమైనయర్థము. కనన్ =చూచుటకు. పొసంగువాహిని=ఒప్పుచున్నసేన, నది యనియర్థాంతరముతోఁచు. అలయంశుమత్కులమహీశ్వరువెంబడిన్=ఆసూర్యవంశీయుఁడగుసుచంద్రునివెంబడి. అభ్రనది=ఆకాశగంగ. భగీరథానుసృతి=భగీరథుని యనుసరించినదై. భవ్యరయస్థితిన్=అధికవేగవృత్తిచేత. ఏఁగుచాడ్పునన్ = పోవురీతిగా. ఏఁగఁజొచ్చెన్=పోవనారంభించెను. సురనదికి సేనకు నుపమానోపమేయభావమున నుపమాలంకారము. సుచంద్రునకు భగీరథునకు బింబప్రతిబింబభావాదు లూహ్యంబులు. రాజు వెంబడి సేన వెడలుచుండఁగా భగీరథచక్రవర్తివెంబడి స్వర్గంగ పోవుచున్నరీతిగా నున్న దనిభావము.

చ. కలితమృదంగతుంగరవ◆గర్జనటత్త్రిదశీతనుప్రభో
జ్జ్వలచపలాళియంబుధర◆వర్త్మమునం దగ నాధరేంద్రుపై
నలరెడుమానసంబున మ◆హాశరజాతవినాశ ముర్వరం
దెలుపు ప్రసూనవృష్టి జగ◆తీధరశత్రువు నించె నయ్యెడన్. 161

టీ. కలితమృదంగతురంగరవగర్జ.—కలిత=ఒప్పుచున్న; మృదంగ=మృదంగముయొక్క; తురంగరవ=అధికమగుధ్వని యనెడు; గర్జ=మేఘధ్వనియు. నటత్త్రిదశీతనుప్రభోజ్జ్వలచపలాళి.—నటత్=నర్తనముఁ జేయుచున్న; త్రిదశీ=దేవాంగనలయొక్క; తనుప్రభా=దేహకాంతి యనెడు; ఉజ్జ్వల=ప్రకాశించుచున్న; చపలా=మెఱుపులయొక్క; ఆళి=పంక్తి. అంబుధరవర్త్మమునన్ = ఆకాశమందు. తగన్ = ఒప్పఁగా. ఆధరేంద్రుపైన్=ఆసుచంద్రునిమీఁద. ఆపర్వతముపైననియర్థాంతరము ధ్వనించును. అలరెడు మానసంబునన్=ఒప్పుచున్న మనస్సుచేత. అతనిపైఁ బ్రీతిచేత ననుట. మానస మనుసరోవరమునం దని యర్థాంతరధ్వని. ఉర్వరన్=భూమియందు. మహాశరజాతవినాశము.—మహాత్=ఉత్కృష్టులైన; ఆశర=రాక్షసులయొక్క; జాత=సంఘముయొక్క; వినాశము = క్షయమును. మహత్=ఉత్కృష్టములైన; శరజాత=కమలములయొక్క వినాశమని యర్థాంతరధ్వని. తెలుపు ప్రసూనవృష్టి=తెలియఁజేయుపుష్పవృష్టి యనువర్షము. అయ్యెడన్=ఆసుచంద్రప్రస్థానసమయమందు. జగతీధరశత్రువు.—జగతీధర=భూధరములకు; శత్రువు=రిపువైనయింద్రుండు. నించెన్=పూరించెను. పర్వతములయందు మేఘము జలము వర్షించురీతి నింద్రుండు సుచంద్రుపై బ్రీతితోఁ బుష్పములను వర్షించె నని భావము.

చ. అలయజరాపగన్ రవికు◆లాధిపుపార్శ్వగవాహపాశ్వని
స్తులగతిజైలఘూళివిత◆తుల్ విరళోదయ గాఁగ ఘటింపఁ ద

ద్బలవిచరద్గజేశకర • పాళినిజామిత శీకరాంబుమం
డలిని రసోదయస్థితిఁ బె • నంగఁగ నెంతయు దార్చెఁ జిత్రతన్. 162

టీ. అలయజరాపగన్ = ఆవిశాలాపురి చెంత నున్నగంగను. రవికులాధిపపార్శ్వగ వాహపాశ్వనిస్తులగతి జైలధూళివితతుల్.—రవికులాధిపు = సుచంద్రునియొక్క; పార్శ్వ= ప్రక్కలను; గ=పొందినట్టి; వాహప=రౌతులయొక్కయు; అశ్వ = గుఱ్ఱములయొక్కయు; నిస్తులగతి=అసమాన మైనగమనమువలన;జ=పుట్టినట్టి; ఐల=ఇలాసంబంధి యగు, ఇల యనఁగా భూమి "గౌరిలా కుమ్భినీ క్షమా" అని యమరుఁడు. ధూళి=పరాగములయొక్క; వితతుల్= గుంపులు. విరళోదయ గాఁగన్=కొంచె మైనయావిర్భావము గలదానిఁగా, తక్కువగా ననుట. ఘటింపన్=చేయఁగా. తద్బలవిచరద్గజేశకరపాళి.—తత్=అసుచంద్రునియొక్క; బల= సైన్యమందు; విచరత్=సంచరించుచున్న; గజేశ=గజశ్రేష్ఠములయొక్క; కర=తుండముల యొక్క; పాళి=పంక్తి. నిజామితశీకరాంబుమండలిన్.—నిజ=స్వకీయము లగు; అమిత= అధికము లగు; శీకర=అంబుకణములయొక్క; మండలిన్=సమూహము చేత. రసోదయ స్థితిన్.—రస=ఉదకముయొక్క; ఉదయ=ఆవిర్భావముయొక్క; స్థితిన్=స్థితిచేత. పెనం గఁగన్=కూడునట్లు. చిత్రతన్=ఆశ్చర్యము చేత. తార్చెన్=చేసెను. ఆశ్చర్యకర మగురీతి గాఁ జేసె ననుట. ఇచట విరళోదయ గాఁగ ఘటింప ననుచోట విగత మైనరేఫము గలల కారముయొక్క యుదయము గలదానిఁగా నని యర్థమువలన అజరాపగ యనుచోట రేఫ ము పోయి దానిస్థానమందు లకార ముదయించఁగా అజరాపగ అజలాపగ యగుననియు అంబుమండలి నిరసోదయస్థితి అనుచోట అంబుమండలి నిరసోదయస్థితి అని పదవిభాగము చేసి నిర్=గత మైన; అ=అకారముగల; స=సకారముయొక్క; ఉదయస్థితి చేత నని యర్థము చేయుటవలన అజరాపగశబ్దములో అకారము పోయి దానిస్థానమందు సకార ముదయిం పఁగా అజరాపగ సజలాపగ అగుననియు చిత్రత నెఱుంగునది.

ఈపద్యమందు "శ్లో. రాజం స్త్వత్ప్రాప్యకూపారా స్త్వత్ప్రతాపాగ్ని శోషితాః । పున స్త్వదరినారీణాం బాష్పపూరేణ పూరితాః॥ అను శ్లోకమందుబలె నత్యుక్త్యలంకారము.

చ. అతులితవైజయంతయుతి • నంచితసాగరజాతదంతిసం
గతి ఘనచక్రిసంభృతి న • ఖండితవైభవదేవనాయకా
యతిఁ దనరారుసాన్నృపబ • లాళి యొసంగె ధరిత్రి జంగమ
స్థితిఁ జరియించులేఖపురి • చెల్వునఁ జూపఱ కింపు నింపుచున్. 163

టీ. ఇందు సేనాపర మైనయర్థము అమరావతీ పర మైనయర్థము గలుగు చున్నవి. అతులిత వైజయంతయుతిన్.—అతులిత=సాటిలేనట్టి; వైజయంత = టెక్కెములయొక్క; యుతిన్=సంబంధము చేత, నని సేనాపర మైనయర్థము. అతులిత మైనయింద్రనగరుయొక్క యుతి చేత నని యమరావతీ పరమయినయర్థము. "స్యాత్ప్రాసాదో వైజయన్తః" అని యమ రుఁడు. అంచిత సాగరజాతదంతిసంగతిన్.—అంచిత=ఒప్పుచున్న; సాగరజాత=దీవులయం

దుఁబుట్టిన; దంతిసంగతిన్ = గజసంబంధముచేత; అంచితమయిన సాగరజాతదంతి యనఁగా నై రావతము, దానిసంబంధముచేత నని యర్థాంతరము. ఘనచక్రికంభృతిన్ = ఘనములైనరథములయొక్క భరణముచేత, ఘనుఁడైనవిష్ణువుయొక్క భరణముచేత నని యర్థాంతరము.. అఖండితవైభవదేవనాయకాయతిన్.—అఖండితవైభవ=అవిచ్ఛిన్నవైభవములచేత; దేవ=ప్రకాశించు చున్న, 'దివుక్రీడావ్యవహార ద్యుతిస్తుతిమోద మదస్వప్నకాన్తిగతిషు' అని యనుశాసనము; నాయక=రాజులయొక్క; ఆయతిన్ = సమృద్ధిచేత, అఖండితవైభవము గల సురశ్రేష్ఠులయొక్క సమృద్ధిచేత నని యర్థాంతరము. తనరారుచున్నృపబలాళి=ఒప్పుచున్న యాసుచంద్రునిసేనాకదంబము. ధరిత్రిన్ = భూమియందు. జంగమస్థితిన్ = జంగమప్రవృత్తిచేత. చరియించులేఖపురిచెల్వునన్ = సంచరించు చున్నయమరనగరియందము న. చూపటన్ = అవలోకించుజగమునకు. ఇంపు నింపుచున్ = సుఖముఁ జేయుచు ఎసంగెన్ = అతిశయించెను. శ్లేషభిత్తికాఘదాధ్యవసాయముచేతివైజయంతికాదిరూపముగా నధ్యవసానముచేయఁబడిన వైజయంతప్రసాదము మొదలగువానిచే సేనాకదంబము సుంనగరముగా నగపడుచున్నదని తాత్పర్యము. ఉపమాలంకారభేదము.

ఉ. ఆతతిఁ గాన రాజిలె మ♦హాప్రతికూలభిదానిదానవి
ద్యోతితకాండమండితచ♦మూదధిశేఖరమధ్యవీథి ము
క్తాతివిభాసితం బగుళ♦తాంగవరేణ్యముపైఁ దదుర్వరా
నేత సితాంతరీపమున ♦ సీటు వహించినవిష్ణుపోలికన్. 164

టీ. తదుర్వరానేత=ఆభూపతియైనసుచంద్రుఁడు. ఆతతిన్ = ఆసమయమందు. మహాప్రతికూలభిదానిదానవిద్యోతితకాండమండిత చమూదధిశేఖరమధ్యవీథిన్.—మహాప్రతికూల= మిగులవిరోధులయొక్క, గొప్పలైనయొడుుదుడులయొక్క యని యర్థాంతరము;భిదా = భేదనమందు; నిదాన=ఆదికారణమైన; విద్యోతిత = ప్రకాశించునట్టి; కాండ=బాణములచేత, జలములచేత నని యర్థాంతరము; మండిత=రాజిల్లునట్టి; చమూ=సేన యనెడు; ఉదధి = సముద్రముయొక్క; శేఖర=శిరస్సుయొక్క;మధ్యవీథిన్ = మధ్యప్రదేశమునందు. ముక్తాతివిభాసితంబగుళతాంగవరేణ్యముపైన్.—ముక్తా=ముత్యములచేత; ముక్త=ముక్తులగువారిచేతననియర్థాంతరము;అతివిభాసితంబు=మిగులప్రకాశమానము.అగుళతాంగవరేణ్యముపైన్ = అగునట్టియుత్తమరథముమీఁద. కానన్ = చూడఁగా. సితాంతరీపమునన్ = శ్వేతద్వీపమందు.సీటువహించినవిష్ణుపోలికన్ = అందము తాల్చినట్టివిష్ణుమూర్తి సాదృశ్యమున. రాజిలెన్ = ప్రకాశించెను. అనఁగా సుచంద్రనృపతి సేనామధ్యమున ముత్యపుసరులతో రాజిల్లురథము నధిష్ఠించి సముద్రమధ్యమున ముక్తులతో రాజిల్లుశ్వేతద్వీపములో నున్నవిష్ణుమూర్తివలె వెలసె నని భావము.

తే. అపుడు సదనీకమధ్యగుం♦ డగుచు నలర
రారమణమాళి నేత్రప♦ర్వంబుఁ గూర్చె
విమలనక్షత్రలోకసం♦వృతి ధరిత్రిఁ
జేరినట్టిసుధాసూతి♦ చెలువుఁ బూని. 156

టీ. అపుడు=ఆసమయమందు. ధరారమణమౌళి= రాజశేఖరుం డగుసుచంద్రుఁడు. సదనీకమధ్యగుం డగుచున్=పండితమండలీమధ్యమున నున్నవాఁడగుచు. విమలనక్షత్రలోకసంవృతిన్=నిర్మలము లగునక్షత్రముల గుంపుయొక్క పరివేష్టనము చేత. ధరిత్రిన్ = భూమిని. చేరినట్టిసుధాసూతిచెలువున్=పొందినట్టి చంద్రునియందమును. పూని = వహించి. నేత్రపర్వంబున్=నేత్రోత్సవమును. కూర్చెన్=ఘటిల్లఁజేసెను. అనఁగా జయమునకు వెడలునపుడు సుచంద్రుఁడు నీతి విద్యాస్త్రవిద్యావేత్తలతోఁ బరివేష్టితుఁడై నక్షత్రకదంబముతోఁబరివేష్టితుఁ డైనచంద్రునివలెఁ బ్రకాశించె నని తాత్పర్యము.

క. జననాథుఁ డిట్లు సేనా, జనసంవృతుఁ డగుచు నరిగె • సమ్మిళదళినీ
నినదవనీసునదధునీ, కనదవనీధరవరాళి•కం గనుఁగొనుచున్. 166

టీ. ఇట్లు=ఈప్రకారముగా. జననాథుఁడు = సుచంద్రుఁడు. సేనాజనసంవృతుఁ డగుచున్=సేనలగుంపులతోఁ గూడినవాఁడగుచు. సమ్మిళదళినీనినదవనీసునదధునీకనదవనీధరవరాళికన్.—సమ్మిళత్=మిక్కిలి కూడుచున్న;అళినీనినద=ఆఁడుఁదుమ్మెదలధ్వనిగల;వనీ=వనములయొక్క; సు=సమీచీనము లైన; నద=పురుషప్రవాహములయొక్క; ధునీ=స్త్రీప్రవాహములయొక్క; కనత్=ఒప్పుచున్న; అవనీధర=పర్వతములయొక్క;ఆళికన్=గుంపును. కనుఁగొనుచున్=అవలోకించుచు. అరిగెన్=పోయెను.

చ. అలపతి గాంచెఁ జెంత ఘన•హైమగుహాగృహవాసికిన్నరీ
కులమణివల్లకీసమను•కూలమనోహరగీత్యుపాంగదు
జ్జ్వలసురసాలజాలసుమ•వల్లరికావిచరన్మిళిందని
ర్మలరవభగ్నపాంథజన•మానకవాటము హేమకూటమున్. 167

టీ. అలపతి=ఆసుచంద్రుఁడు. చెంతన్=సమీపమున. ఘనహైమ గుహాగృహవాసికిన్నరీకులమణివల్లకీ సమనుకూల మనోహరగీత్యుపాంగ దుజ్జ్వల సురసాలజాల సుమవల్లరికా విచరన్మిళింద నిర్మలరవ భగ్నపాంథజనమానకవాటమున్.—ఘన=గొప్పలగు; హైమ=సువర్ణమయము లగు;గుహా=గుహాలనెడు; గృహ=గృహములయందు;వాసి=వసించియుండు;కిన్నరీకుల=కిన్నరస్త్రీలగుంపుయొక్క;మణివల్లకీ=మణులవీణలయొక్క;సమనుకూల—మిక్కిలియనుకూలమగు;మనోహర=మనోజ్ఞమైన;గీతి=గానమునకు; ఉపాంగత్=సుతియగుచున్న;ఉజ్జ్వల=ప్రకాశించుచున్న, దీనికిమిళిందనిర్మలరవమందన్వయము;సురసాల=కల్పతరువులయొక్క; జాల=గుంపుయొక్క; సుమ=పువ్వులయొక్క; వల్లరికా=తీఁగలయందు; విచరత్=సంచరించుచున్న; మిళింద=తుమ్మెదలయొక్క; నిర్మల=స్వచ్ఛమగు; రవ=ధ్వనిచేత; భగ్న=బ్రద్దలుచేయఁబడిన; పాంథజన=పథికసంఘముయొక్క; మానకవాటమున్ = మానమనెడుద్వారముగలదానిని హేమకూటమున్=హేమకూటమను పర్వతమును. కాంచెన్=చూచెను.

చ. కనుఁగొని తన్మహీభృదుప•కంఠమునన్ నిజరాజధానిపొ
లుపున సుమనోనికాయపరి•భూషిత యై కలకంఠికామణీ

జనయుత యై కనత్కనక•సాలసమన్వితయై పొసంగుచ
క్కనివని వేడ్క వేలము డి•గన్ ఘటియించె జనేంద్రుఁ డయ్యెడన్. 168

టీ. కనుఁగొని=హేమకూటమును జూచి. జనేంద్రుఁడు=సుచంద్రుఁడు. తన్మహీభృదుపకంఠమునన్=ఆపర్వతసమీపమున. నిజరాజధానిపొల్పునన్=తనవిశాలాపురీవిధమున. సుమనోనికాయపరిభూషిత యై.—సుమనోనికాయ=జాజిగుబురులచేత నని వనీపరమైన యర్థము, పండితమండలిచేత నని రాజధానీ పరమైన యర్థము, పరిభూషితయై=అలంకృతయై; కలకంఠికామణీజనయుత యై.—కలకంఠికా=ఆఁడుఁగోయిలలయొక్కయని వనీపరమైనయర్థము, స్త్రీలయొక్కయని యర్థాంతరము, జన=సంఘముతోడ, యుతయై=కూడుకున్నదై; కనత్కనకసాలసమన్విత యై.—కనత్ ప్రకాశించుచున్న; కనకసాల=సంపెఁగచెట్లతోడ నని వనీపరమైనయర్థము; బంగరుకోటలతోడ నని రాజధానీపర మైనయర్థము; సమన్వితయై = కూడుకొన్నదై. పొసంగుచక్కనివనిన్=ఒప్పుచున్న మంచివనమందు. వేలము=సేనను. అయ్యెడన్. డిగన్ ఘటియించెన్=డిగునట్లు చేసెను.

మ. తనుభానిర్జితమార మారరిపుకాం•తాచిత్తసంసార సా
రనిరస్తాఘకవార వారణభిదా•రాజద్బలోదార దా
రనివేశాయితసూర సూరసితభా•రమ్యాక్షివిస్తార తా
రనిభఖ్యాతివిసార సారసభవ•ప్రస్తుత్యనిత్యోదయా.

టీ. తనుభానిర్జితమార=దేహకాంతిచేత గెలువఁబడిన మదనుఁడు గలవాఁడా! మారరిపుకాంతాచిత్తసంసార.—మారరిపు=శివునకు, కాంతా = ప్రియ యగు పార్వతియొక్క, చిత్త=హృదయమందు, సంసార=చరించు చున్నవాఁడా! విష్ణువు పార్వతికిఁ బుత్రుఁడు గావున నతనియం దామెకు వాత్సల్య మున్నదనుట. బ్రహ్మవైవర్తగణేశఖండమందు విష్ణువు గణేశరూపముగాఁ బార్వతికిఁ బుత్రుఁడైనట్లున్నది. సారనిరస్తాఘకవార=బలముచేత నిరసింపఁబడినపాపసంఘము గలవాఁడా, అఘ శబ్దమునీఁద కప్ప్రత్యయము. వారణభిదారాజద్బలోదార.—వారణ=కువలయాపీడముయొక్క; భిదా=భేదనమందు; రాజత్ = ప్రకాశించుచున్న; బల=సామర్థ్యముచేత; ఉదార=ఉత్కృష్టుఁడైనవాఁడా! దారనివేశాయితసూర.—దార=లక్ష్మీదేవికి; నివేశాయిత=గృహముగానాచరించుచున్న; సూర=మంచివక్షస్స్థలమ్ముగలవాఁడా! సూరసితభారమ్యాక్షివిస్తార= సూర్యచంద్రులనెడు రమ్యములైన నేత్రముల విస్తారముగలవాఁడా! తారనిభఖ్యాతి విసార=నక్షత్రములతో సమాన మైనఖ్యాతి ప్రసారము గలవాఁడా! సారసభవప్రస్తుత్యనిత్యోదయా.—సారసభవ=బ్రహ్మచేత; ప్రస్తుత్య=కొనియాడఁదగిన; నిత్యోదయా=నిరంతరాభ్యుదయము గలవాఁడా! ఈసంబోధనములకు ముందు రెండుపద్యములలోనిసంబోధనములకు నిది ప్రథమాశ్వాసము అను గద్యముతో నన్వయము. ఇందు ముక్తపదగ్రస్తమను శబ్దాలంకారము.

క. శరణాగతశుభకరణా, కరణాతీతాత్మవివిధకార్యాచరణా
చరణానతాసుహరణా, హరణాయితసత్స్యమంతకాభాభరణా. 170

టీ. శరణాగతశుభకరణా=శరణమును బొందినవారికి శుభములఁ జేయునట్టివాఁడా! కరణాతీతాత్మవివిధకార్యాచరణా.—కరణాతీత = ఇంద్రియాతీతములైన; ఆత్మ=స్వీయములైన; వివిధకార్య=అనేకప్రకారములగుసృష్ట్యాదికార్యములను; ఆచరణా = ఆచరించునట్టివాఁడా! చరణానతాసుహరణా.—చరణానత = పాదములయందు నమ్రులుగానివారియొక్క, అనఁగా దుర్మార్గులయొక్క యనుట; అసు=ప్రాణములను; హరణా=హరించువాఁడా; హరణాయితసత్స్యమంతకాభాభరణా.—హరణాయిత=అరణముగాఁ జేయఁబడిన; సత్స్యమంతక=శ్రేష్ఠమైన స్యమంతకమణియొక్క; ఆభా=కాంతి; ఆభరణా=భూషణముగఁగలవాఁడా! ఇందును శ్లేషాలంకారమేయగును. ముందుపద్యమందు నిదేయలంకారము.

పృథ్వి. ధరాధరమచర్చికాధర ధరారిముఖ్యోదయ
ద్దరాపహమహాత్తరాదర దరస్వనోత్సేకితా
శరప్రకరనిస్సృతచ్ఛర శరప్రభూతాలయా
వరాంకకలనప్రభావర వరప్రదానుగ్రహా. 171

టీ. ధరాధరమచర్చికాధర=ప్రశస్తపర్వతమగుమందరమునుధరించినవాఁడా! ధరారిముఖ్యోదయద్దరాపహమహత్తరాదర.—ధరారిముఖ్య=ఇంద్రుఁడుమొదలగువారికి; ఉదయత్ =పుట్టుచున్న; దర=భయముయొక్క; అపహ=పోఁగొట్టుటయందు; మహత్తర=అధికమగు; ఆదర=ప్రీతిగలవాఁడా! దరస్వనోత్సేకితాశరప్రకరనిస్సృతచ్ఛర.—దరస్వన=పాంచజన్యధ్వనిచేత; ఉత్సేకిత=సంజాతోత్సేకముగలవియు; ఆశర=రాక్షసులయొక్క; ప్రకర=సమూహమందు; నిస్సృతత్ =పడుచున్నవియునగు; శర=బాణములుగలవాఁడా! శరప్రభూతాలయావరాంకకలనప్రభావర.—శర=ఉదకమందు; ప్రభూత=పుట్టినట్టిపద్మము; ఆలయా=గృహముగాఁగల లక్ష్మియొక్క; వర=కుంకుమముయొక్క; అంక=చిహ్నములయొక్క; కలన=సంబంధముచేతనైన; ప్రభా=కాంతిచేత; వర=శ్రేష్ఠుఁడగువాఁడా! వరప్రదానుగ్రహా=వరములనిచ్చెడు ననుగ్రహముగలవాఁడా! ఈకృతిపతి సంబోధనములకు నిది ప్రథమాశ్వాసమునుదానితో నన్వయమని వ్రాయఁబడిరి.

గద్యము. ఇది శ్రీమదనగోపాలప్రసాదసమాసాదితోభయభాషా కళాకళత్ర రేచర్లగోత్రపవిత్ర సురభిమల్లక్ష్మాపాలసత్పుత్ర కవిజనవిధేయ మాధవరాయప్రణీతంబైన చంద్రికాపరిణయం బను మహా ప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

గద్యము. ఇది శ్రీసరతీరమణకరుణాసమాసాదితసర్వసౌభాగ్య భాగ్యనగర మహారాజ్యసంకలిత శ్రీజటప్రోలుసంస్థానప్రాజ్యసకలసామ్రాజ్య శ్రీరేచర్లగోత్ర పవిత్ర కవిజనగేయ శ్రీవేంకట జగన్నాథరాయ సత్పుత్త్రి సత్సంప్రదాయ శ్రీసురభివేంకట లక్ష్మణరాయ పరిపోష్య సరసవైదుష్య తదాస్థానతలమండిత శేష సదాశివపండిత విరచిత శరదాగమ సమాఖ్యవ్యాఖ్యయందుఁ ప్రథమాశ్వాసము.



శ్రీయేనమః.

శ్రీ లక్ష్మీనరసింహాయనమః.

# చంద్రికాపరిణయము, సవ్యాఖ్యానము.

## ద్వితీయాశ్వాసము.

క. అహరీశసుతావీచీ, విహరణరణదంఘ్రికటక ♦ విశ్వాసిపత
ద్గ్రహయాళుపాణిపద్మ, స్స్పృహయాళుమదాళిజాల ♦ శ్రీగోపాలా. 1

టీ. అహరీశసుతావీచీ విహరణ రణదంఘ్రికటక విశ్వాసిపతద్గ్రహయాళుపాణిపద్మ స్పృహయాళు మదాళిజాల.—అహరీశసుతా=యమునానదియొక్క; వీచీ=తరఁగలయందు; విహరణ=క్రీడచేత; రణత్=మ్రోయుచున్న; అంఘ్రికటక=హంసకములయందు, "హంసకః పాదకటకః" అని యమరుఁడు. విశ్వాసి=విశ్వసించునట్టి; పతత్=హంసపక్షిని "పతత్పత్త్రి రథాణ్డజాః" అని యమరుఁడు. గ్రహయాళు=గ్రహింపనిచ్ఛగల; పాణిపద్మ = కరకమలమందు; స్పృహయాళు=వాంఛగల; మదాళిజాల = మదించిన తుమ్మెదలగుంపుగల వాఁడైన. శ్రీగోపాలా = శ్రీమదన గోపాలస్వామీ! అని కృతిపతిసంబోధనము. దీనికిఁ జిత్తగింపుమనును త్తరపద్యస్థక్రియతో నన్వయము.

యమునానదియందుఁ గ్రీడించుచున్న కృష్ణమూర్తియొక్క పాదకటకధ్వనియందు హంసపలుకు లనుభ్రాంతిచేత హంసలు సమీపమునకుఁ బోఁగా శ్రీకృష్ణుండు వానిం బట్టు తలంపుతో కరకమలంబు సాఁపఁగా నాకేలుఁదమ్మియందు వాస్తవకమలభ్రాంతిచేఁ దుమ్మెదలగుంపు చుట్టుకొన్న దనితాత్పర్యము. భ్రాంతిమదలంకారము. "శ్లో. భ్రాన్తిమానన్యసంవిత్తిరన్యస్మిన్ సామ్యదర్శనాత్" అని కావ్యదర్పణమందుఁ దల్లక్షణము.

తే. చిత్తగింపుము శౌనకా ♦ ద్యుత్తమర్షి
సమితి కిట్లను రోమహ ♦ ర్షణతనూజుఁ
డిట్లు వేలంబు డిగఁ దార్చి ♦ నృపతి హేమ
పటకుటి వసించి యుండె సం ♦ భ్రమ మెలర్ప. 2

టీ. చిత్తగింపుము=అవధరింపుము. శౌనకాద్యుత్తమర్షి సమితికిన్=శౌనకుఁడు మొదలుగాఁ గలమహర్షిసంఘమునకు. ఇట్లు = వక్ష్యమాణప్రకారమున. రోమహర్షణ తనూజుఁడు=సూతుఁడు. అనున్=వచించును. ఇట్లు = ఈప్రకారము. వేలంబు=ఉపవనమును. డిగన్=దిగుటకు. తార్చి=ఓనరించి. నృపతి = సుచంద్రుఁడు. హేమపటకుటిన్ = బంగరుగుడారమునందు. సంభ్రమము = సంతసము. ఎలర్పన్=అతిశయింపఁగ. వసించి యుండెన్ = నివసించి యుండెను.

చ. అలతతిఁ దద్గిరీంద్రతటి • కాంచన కాంచనమాలతీలతా
వలయలతాంతకాంతతర • వాసనవాసన వానిలాళికల్
మలయ విధుండు వేడ్కఁ దన • మానస మాన సముజ్జ్వలాత్ము నె
చ్చెలిఁ గని పల్కెఁ స్వర్ద్రుసుమ • జీవనజీవన భేదనోక్తికన్. 3

టీ. అలతతిన్=ఆసమయమందు. తద్గిరీంద్రతటికాంచనకాంచన మాలతీలతావలయలతాంతకాంతతర వాసనవాసనవానిలాళికల్.—తద్గిరీంద్ర=ఆహేమకూటముయొక్క; తటికా=దరులకు; అంచన = అలంకార మగు; కాంచన=సంపెఁగలయొక్క; మాలతీలతా=జాజితీవలయొక్క; వలయ = గుములయందలి; లతాంత = కుసుమములయొక్క; కాంతతర=మిక్కిలి మనోజ్ఞము లగు; వాసన=సుగంధములకు; వాస=నివాసము లగు; నవానిలాళికల్=నూతనవాయుసమూహములు. తనమానసము=తనమనస్సును. అనన్ = స్పృశించునట్లు. మలయన్ = వీచుచుండఁగా. విధుండు=సుచంద్రుండు. వేడ్కన్=సంతోషము చేత. సముజ్జ్వలాత్మున్=మిక్కిలి ప్రకాశించుదేహముగల, కాదేని బుద్ధిగల. నెచ్చెలిన్= ప్రియసఖుని. కని=చూచి. స్వర్ద్రుసుమజీవన జీవనభేదనోక్తికన్.—స్వర్ద్రుసుమ=కల్పతరు కుసుమములయొక్క; జీవన=మకరందముయొక్క; జీవన=బ్రదుకునకు; భేదన=భేదక మగు; ఉక్తికన్=వాక్యమును. పల్కెన్ = వచించెను. యమకాలంకారము.

ఉ. ఈయగరాజమౌళి మన • మిచ్చట నుండుట తా నెఱింగి యా
త్మీయసమగ్రవైభవగ • తిం దిలకింపఁగ ర మ్మటంచు మో
దాయతిఁ బిల్వఁ బంచెఁ బవ • నాంకురపాళికఁ జూతమే వయ
స్యా యచలేంద్రుదివ్యమహి • మాతిశయంబు ప్రియంబు పొంగఁగన్. 4

టీ. ఈ యగరాజమౌళి=పర్వతశ్రేష్ఠ మగునీహేమకూటము. మనము. ఇచ్చటన్= ఈప్రదేశమందు. ఉండుట=ఉండుటను. తా నెఱింగి=తాఁదెలిసికొని. ఆత్మీయసమగ్రవైభవగతిన్=తనదుసమగ్రమైన వైభవరీతిని. తిలకింపఁగన్=చూచుటకు. రమ్మటంచున్=రావలయు నంచు. పవనాంకురపాళికన్ = మందమారుతపరంపరను. మోదాయతిన్=సంతోషాతిశయము చేత. పిలువన్=పిలుచుటకు. పంచెన్=పంపెను. వయస్యా = సఖుఁడా. ప్రియంబు=ప్రేమము. పొంగఁగన్=మించఁగా. అచలేంద్రు దివ్యమహిమాతిశయంబు.—అచలేంద్రు= హేమకూటముయొక్క; దివ్య = లోకోత్తర మగు; మహిమాతిశయంబు = మహిమోన్నతిని. చూత మే=చూతమా.

• హేమకూటవనమందున్న సుచంద్రునిపై హేమకూటమున నుండి మందమారుతపరంపర ప్రసరింపఁగాఁ దనవిభవాతిశయము గాంచుటకు హేమకూటము సుచంద్రునిఁ బిల్వ మందమారుతము నంపినదా యన్నట్లుండె నని భావము. ఇందు గమ్యోత్ప్రేక్ష.

చ. అని జననేత తత్ప్రియస • ఖాగ్రణి కేల్ కయిదండఁ బూని చ
క్కని తెలిమిన్న మెట్టికలు • గట్టినత్రోవ నగేంద్ర మెక్కెఁ బా

వనమరుదుచ్చలత్కిసల•వారమృషావ్యజనాళిఁ బార్శ్వసీ
మ నలరుమల్లికాయువతి•మండలి యింపుగ వీవ నత్తఱిన్. 5

టీ. అని=ఇట్లని. జననేత=సుచంద్రుఁడు. పార్శ్వసీమన్ = ఇరుప్రక్కలను. అలరుమల్లికాయువతిమండలి=ఒప్పుచున్నమల్లికాలత లనెడు స్త్రీలగుంపు. పావనమరుదుచ్చలత్కిసలవారమృషావ్యజనాళిన్.— పావన=పవిత్రమగు; మరుత్=వాయువుచేత; ఉచ్చలత్=మిక్కిలి కదలుచున్న; కిసల=పల్లవములయొక్క, "కిసాలయం కిసలయం కిసాలం కిసలం కిసమ్" అని ద్విరూపకోశము. వార=సమూహ మనెడు; మృషావ్యజన=కృత్రిమతాళవృంతములయొక్క; "కిసలవారమిషవ్యజనాళిన్" అను పాఠమందు, కిసలవార మనెడు నెపముగల సురటీలగుంపుచేత ననియర్థము. ఇంపుగన్ = సొంపుగ. వీవన్ = వీచుచుండఁగా. అత్తఱిన్=ఆసమయమందు. ప్రియసఖాగ్రణికేల్=ప్రియవయస్యుని హస్తమును. కయిదండన్=హస్తాలంబముగ. పూని=గ్రహించి. చక్కని తెలిమిన్న మెట్టికలుగట్టినత్రోవన్=సుందర మగు వజ్రమణులసోపానములుగట్టిన దారిచే. నగేంద్రము=హేమకూటమును. ఎక్కెన్=అధిష్ఠించెను.

సుచంద్రుఁడు హేమకూటము నధిష్ఠించుతఱి నుభయపార్శ్వములయందు మందమారుతముచేఁ బల్లవములు చలించుచుండఁగా మల్లికాలత లనెడుకాంతలు సురటిలచే వీచుచున్నయట్లుండె నని భావము. గమ్యోత్ప్రేక్ష.

క. అలరారువేడ్కఁ దద్గిరి, కులరాడ్వైభవముఁ గాంచు•కుతలేశ్వరుతో
నలరాచెలి యిట్లను మధు, జలరాశితరంగనినద•జయయుతఫణితిన్. 6

టీ. అలరారువేడ్కన్ = ఒప్పుచున్నసంతోషముతోడ. తద్గిరికులరాడ్వైభవమున్=ఆపర్వతరాజైనహేమకూటముయొక్కవైభవమును. కాంచుకుతలేశ్వరుతోన్ = అవలోకించురాజుతోడ. అలరాచెలి = ఆరాజసఖుండు. మధుజలరాశితరంగనినదజయయుతఫణితిన్.— మధుజలరాశి = పూఁదేనియసముద్రముయొక్క; తరంగ = అలలయొక్క; నినద=ధ్వనియొక్క; జయ=గెలుపుతోడ; యుత=కూడుకొన్న; ఫణితిన్ = వాక్కుచేత. ఇట్లనున్=వక్ష్యమాణరీతిగాఁ బలికెను. ద్వ్యక్షరీప్రాసకందము.

సీ. కరిరాజధీపూర•పరిరాజితోదార, హరిరాజిహృతసార•శరదపాళి
నగచారివరజాత•మృగచాతురీభీత, మృగచాలనోద్ధూత•పృథులధూళి
సకలాజరీగూహ•నకలావిలీనాహ, పికలాపినీవ్యూహ•బిలగృహాళి
లలితాపగోర్మిత•రలితాసితాబ్జాత, గలితానవజసాతి•విలసనాళి

తే. మహిప కనుఁగొను తనుజను•ర్మహిమజనన
జనకకలరవకులరవ•ధ్వనితసురభి
భరితఘనరవవనచర•తురగవదన
కులజలదచూళి యిమ్మహా•కుధరమాళి. 7

టీ. కరిరాజధీపూర పరిరాజితోదార హరిరాజిహృతసార శరదపాళిన్. —కరిరాజ= గజశ్రేష్ఠము లనెడు; ధీపూర = బుద్ధి రాశిచేత; పరిరాజిత = మిగుల ప్రకాశించుచున్న; ఉదారహరిరాజి= ఉత్కృష్టమగుసింహపంక్తి చేత; హృత=హరింపఁబడిన; సార=శ్రేష్ఠమగు; కాదేని హృతసార=హరింపఁబడినసారముగల; శరద= మేఘములయొక్క; పాళిన్=గుంపుగలదియు. నగచారివరజాత మృగచాతురీభీత మృగచాలనోద్భూత పృథులధూళిన్.—నగచారివర=వనచరశ్రేష్ఠులయొక్క; జాత=గుంపుయొక్క; మృగ = వేఁటయొక్క; "మృగా పశౌకురఙ్గేచ కరినక్షత్రభేదయోః। యాచ్ఞాయాంమృగయాయాంచమృగః" అని విశ్వము. చాతురీ=చాతుర్యమువలన; భీత=భయపడినట్టి; మృగ = లేడులయొక్క; చాలన = సంచరణముచేత; ఉద్భూత = యుదయించిన; పృథుల=అధికమగు; ధూళిన్ = పరాగముగలదియు; సకలాజరీగానాహానకలావిలీనాహాపికలాపినీవ్యూహాబిలగృహాళిన్.—సకల = సమస్తమగు; అజరీ = దివ్యస్త్రీలయొక్క; గానహానకలా = దాఁగిలిమూఁత లనెడు నాటలయందు; విలీన=డాఁగినట్టి; ఆహాపికలాపినీ=సర్పస్త్రీలయొక్క; అహిశబ్దముపై "తస్యేదమ్" అని అణ్ ప్రత్యయము వచ్చి ఆహ యని యైనది. వ్యూహా=సంఘముగల; బిలగృహా= గుహలయొక్క; ఆళిన్ = పంక్తిగలిగినట్టిదియు. లలితాపగోర్మితరలితాసితాబ్జాతగలితాసవజసాతివిలసనాళిన్.—లలిత=మనోజ్ఞములగు; ఆపగా=నదులయొక్క; ఊర్మి=తరఁగలవలన; తరలిత=చలింపఁజేయఁబడిన; అసిత=నల్లనైన; అబ్జాత=కమలములవలన; గలిత=జాఱినట్టి; ఆసవ=మకరందమువలన, జ=పుట్టినట్టి; సాతివిలసన=అత్యంత ప్రకాశముగల; అళిన్ = తుమ్మెదలు గలిగినదియు. తనుజనుర్మహిమజనన జనకకలరవకులరవధ్వనితసురభిభరిత ఘనరవవనచర తురగవదనకులజలదచూళిన్.—తనుజనుః=దేహ మెత్తుటయొక్క. కాదేని మనసిజునియొక్క. "జనుర్జననజన్మాని" అని యమరుఁడు. మహిమజనన=ఉత్కర్షోత్పత్తికి; జనక=సంపాదకములైన; కలరవ = కోకిలలయొక్క; కుల=గుంపుయొక్క; రవ=ధ్వనులచేత; ధ్వనిత=సంజాతధ్వనియగు; సురభి=వసంతముచేత; భరిత=నిండినట్టి, దీనికి చూళియం దన్వయము. ఘనరవ = గొప్పధ్వనులుగల; వనచర= కిరాతకులు; తురగవదన=కిన్నరులు; జలదకుల= మేఘసంఘములుగల; చూళిన్ =అగ్రభాగముగలదియు నైన; ఘనతర యనుపాఠమున భరితమై ఘనతరమైన వనమందుఁ జరించుచున్నకిన్నరస్త్రీలుగలదనియర్థము. జలదచూళులనఁగా ఘనకచలు. ఇమ్మహీధరమౌళిన్ = ఈగొప్పపర్వతరాజును. మహీప=సుచంద్రుఁడా! కనుఁగొను=అవలోకింపుము.

మ. జననాథేశ్వర కంటె రత్నకటకాంచ ♦ త్స్వర్ణమాళ్యాప్తమై
యనిశాత్యాశ్రితరాజసింహనిచయం ♦ బై సంవృతానేకవా
హిని యై చందనగంధవాసితము నై ♦ యీశైలవర్యంబు దాఁ
దనరెన్ నీ విట నొందుమాత్రనె భవ ♦ త్సారూప్యముం గాంచె నాన్. 8

టీ. జననాథేశ్వర=సుచంద్రుఁడా! ఈశైలవర్యంబు=ఈపర్వతశ్రేష్ఠము. తాన్. నీవిటనొందుమాత్రనె = నీ విచటఁ జేరినంతమాత్రముననె. భవత్సారూప్యమున్ = నీపోటిని. కాంచె నాన్=పొందెనా యనునట్లు. రత్నకటకాంచత్స్వర్ణమాళ్యాప్తమై.—రత్న=రత్నమయము లగు; కటక=చరులను; అంచత్=ఒప్పుచున్న; స్వర్ణ=సంపెఁగ లనెడు; మాళి=

అశోకము లనెడు "మాలిః కజ్కేళిచూతయోః" అని విశ్వము. రత్నకటక=రత్నపుఁగడియములను; అంచత్స్వర్ణమౌళి=ఒప్పుచున్న బంగరుకిరీటమును; ఆప్తమై=పొందినదియై. అనిశాత్యాశ్రితరాజసింహనిచయంబై.—అనిశ = ఎల్లపుడును; అత్యాశ్రిత = మిక్కిలియాశ్రయించినట్టి; రాజసింహ=పెద్దసింగము లనెడు నృపశ్రేష్ఠులయొక్క; "స్యురుత్తరపదేవ్యాఘ్రపుఙ్గవర్షభకుఞ్జరాః సింహశార్దూలనాగాద్యాఃపుంసి శ్రేష్ఠార్థగోచరాః" అని యమరుఁడు. నిచయంబై=సమూహము గలదై. సంవృతానేకవాహినియై.—సంవృత=చుట్టుకొనఁబడిన; అనేక=అనేకము లగు;వాహినియై=నదు లనెడు సేనలుగలదై. చందనగంధవాసితమునై =చందనవృక్షము లనెడు శ్రీగంధముయొక్క పరిమళము చేత వాసితమైనదై.తనరెన్=ఒప్పెను.కంటె=చూచితివా ?

చ. అనుపమధాతుధూళియుతి ♦ నంచితకుంజనివృత్తి నొప్పునీ
ఘనసితరత్నగండతటిఁ ♦ గ్రాలెడుపొన్న నృపాల కాన్పు తె
ల్లని తొలుగారు నెక్కినయి♦లాధరవైరియె చుమ్ము కానిచో
నొనరునె దేవవల్లభత♦యున్ సుమనోభరణంబు దానికిన్. 9

టీ. నృపాల=సుచంద్రుఁడా; కాన్పు=చూడుము అనుపమధాతుధూళియుతిన్.—అనుపమ = సాటిలేని; ధాతు = జేగుఱురొయొక్క; ధూళి=పరాగముయొక్క; యుతిన్=సంబంధముచేతను. అంచితకుంజనివృత్తిన్.—అంచిత=ఒప్పుచున్న; కుంజ=పొదలయొక్క, దంతములయొక్క; నివృత్తిన్=సంబంధముచేతను. ఒప్పు నీఘనసిత రత్నగండతటిన్ = ఒప్పుచున్నయీఘన మగు వజ్రమణిమయమైన స్థూలోపల ప్రదేశమందు. గ్రాలెడుపొన్న=ఒప్పునట్టిపొన్నవృక్షము. తెల్లనితొలుగారు నెక్కిన యిలాధరవైరి యెచుమ్ము=తెల్లగా నుండు నైరావతము నెక్కిన పర్వతవైరి యగునింద్రుండెచుమీ. కానిచోన్=అటుగానియెడ. దేవవల్లభతయున్=దేవవల్లభ మగుటయు, "కేసరో దేవవల్లభః" అని యమరుఁడు. సుమనోభరణంబున్=పుష్పభరణమును, దేవతాపోషణమును. దానికిన్=ఆపున్నాగమునకు. ఒనరునె = ఘటిల్లునా ? అనఁగా సురరాజు గానిచో దేవవల్లభతయు సుమనోభరణంబును ఘటిల్లవు గావున సురరాజే యనుట.

వజ్రమణిమయ మయి ధాతుధూళివిరాజితం బగుగండోపల మైరావతమును బోలియున్నదనియు, దాని పైనున్న పుష్పించిన పున్నాగము దేవేంద్రునిఁ బోలి యున్నదనియు భావము. రూపకాలంకారభేదము.

సీ. బహునీలతటులఁ గ♦న్పట్టుసూర్యాకృతుల్
పొందమ్ము లని త్రెంపఁ ♦ బూని పూని,
నవవజ్రకటకమం♦డలిఁ దోఁచునై జమూ
ర్తులఁ బరేభమనీషఁ ♦ గ్రుమ్మి క్రుమ్మి,
కురువిందమయపాద♦సరణిఁ గ్రాలెడుఘన

మ్ముల వశామతిఁ గేల • నలమి యలమి,
గారుడగ్రావశృంగ•గములఁ బొల్చుసురాధ్వ
తటినిఁ బెన్నది యంచుఁ • దఱిసి తఱిసి,
తే. యలఘువీథి భయోపబృంహ•కదురంత
బృంహితార్భటి దిక్కోటి • బ్రీలఁ జేయు
సమదవైఖరి నీయద్రి • సంచరించు
వనగజశ్రేణి కనుఁగొంటె • మనుజవర్య. 10

టీ. మనుజవర్య=సుచంద్రుఁడా! ఈయద్రిన్ = ఈపర్వతమందు. సమదవైఖరిన్ = మదయుక్తమైనరీతితోడ. సంచరించువనగజశ్రేణి = తిరుగుచున్న యరణ్యగజసమూహము. బహునీల తటులన్.—బహు = అధికములగు; నీల = నీలమణిమయములగు; తటులన్ = చఱులయందు. కన్పట్టుసూర్యాకృతుల్=ప్రతిఫలించినట్టి సూర్యబింబములు. పొందమ్ము లని= బంగరు పద్మము లనికొని. త్రెంపన్=తెంచుటకు. పూని పూని= ప్రయత్నించి ప్రయత్నించి. నవవజ్రకటకమండలిన్.— నవ=నూతనమగు; వజ్ర=వజ్రమణిమయ మగు; కటక = నితంబ ప్రదేశములయొక్క; మండలిన్ = సమూహమందు. తోఁచునైజమూర్తులన్ = ప్రతిఫలించుతమశరీరములను. పరేభమనీషన్=ఇతరగజము లనెడుబుద్ధిచేత. క్రుమ్మి క్రుమ్మి = కొమ్ములతోఁ బొడిచి పొడిచి. కురువిందమయపాదసరణిన్ = పద్మరాగమణిమయ మగు ప్రత్యంత పర్వతమార్గమందు. గ్రాలెడు ఘనమ్ములన్=ఒప్పారు చున్నమబ్బులను. వశామతిన్=ఆఁడేనుఁగులను బుద్ధిచేత. కేలన్=తుండములచేత. అలమి యలమి=ఆక్రమించి యాక్రమించి. గారుడ గ్రావశృంగములన్ = గారుత్మతమణిమయ మగు శిఖరములయందు. పొల్చుసురాధ్వతటినిన్=ప్రతిబింబించినయాకాశగంగను; పెన్నది యంచున్=పెద్దనది యనుచు. తఱిసి తఱిసి= సమీపించి సమీపించి. అలఘువీథిన్ = అధిక మగువనవీథియందు. భయోపబృంహకదురంత బృంహితార్భటిన్.— భయ=భీతికి; ఉపబృంహక=వర్ధక మగు; దురంత = పారములేని; బృంహిత=స్వకీయధ్వనులయొక్క; ఆర్భటిన్=అతిశయముచేత. దిక్కోటిన్=దిక్సమూహమును. బ్రీలన్=చీలునట్లుగా. చేయున్=చేయును. కనుఁగొంటె=చూచితివా.

ఈహేమకూటము నానావిధమణికూటముతో విరాజిల్లు చున్నదనియు నిందుఁ బెక్కుమదపుటేనుఁగులగుంపు లున్నవనియు భావము. భ్రాంతిమదలంకారము.

చ. కలితమణీశరాసఘన•కాండభృతిన్ వరవాజిసంగతిం
బొలుచుసువర్ణకూట మరి•భూపవిదారణఁ జూడఁ గాంచనా
చలవిజయప్రయాణపరి•సన్నహనాత్మతఁ బూనుటల్ కడుం
దెలిపె మరుద్గతిధ్వనదు•దీర్ణగుహాచయ భేరికాధ్వనుల్. 11

టీ. కలితమణీశరాసఘనకాండభృతిన్.— కలితమణీ శరాసఘనకాండ = ఒప్పుచున్న యింద్రధనువును, మేఘసమూహమ నెడుకలితములైనరత్నఖచిత శరాసనములయొక్కయు

ఘనము లైనబాణములయొక్కయు; ధృతిన్=ధారణముచేత. వరవాజిసంగతిన్=శ్రేష్ఠము లగు పక్షు లనెడుశ్రేష్ఠము లైనగుఱ్ఱములయొక్క సాంగత్యముచేత. పొల్చుసువర్ణకూటము= ఒప్పునట్టిహేమకూటము. అరిభూపవిదారణన్=శత్రురాజభేదనమును. చూడన్=కనుటకు. కాంచనాచలవిజయప్రయాణపరిసన్నహనాత్మతన్.— కాంచనాచల = మేరుపర్వతమునకు; విజయ= జయముకొఱకైన; ప్రయాణ=పయనముయొక్క; పరిసన్నహన=సన్నాహమందు; ఆత్మతన్=చిత్తము గలుగుటను. పూనుటల్=వహించుటలను. మరుద్గతిధ్వనదుదీర్ణగుహాచయభేరికాధ్వనుల్.— మరుద్గతి=వాయువుయొక్క గమనముచేత; ధ్వనత్=ధ్వని సేయుచున్న; ఉదీర్ణ= ఉత్కట మగు; గుహాచయ=గుహలగుంపు లనెడు; భేరికా=భేరులయొక్క; ధ్వనుల్=శబ్దములు. కడున్=మిక్కిలి. తెలిపెన్=ఎఱింగించెను.

వాతాభిఘాతమున గుహాచయము మ్రోఁగుచుండఁగా మణీశరాసఘనకాండభృతివరవాజిసంగతులచే నొప్పుచున్న హేమకూటము శత్రుభేదనమునకై మేరుపర్వతమునకు బయనముఁ జేయుచుఁ బ్రయాణభేరీనాదము సేయుచున్నట్లున్నదని భావము. గమ్యోత్ప్రేక్ష.

చ. మనుకులరాజచంద్ర కను♦మా ప్రతిబింబితపర్ణజాలన
ప్రమనఖరయుక్తిఁ దోఁచునల♦మౌక్తికశృంగనృసింహమూర్తి పెం
పొనరె నధిత్యకాప్రభవి♦తోన్నతవిద్రుమవల్లికల్ పలా
శనజఠరంబు సీర్చి వెలు♦చం బయి నెత్తునవాంత్రపాళి గన్. 12

టీ. మనుకులరాజచంద్ర=సుచంద్రుఁడా! ప్రతిబింబితపర్ణజాలనమ్రనఖరయుక్తిన్.— ప్రతిబింబిత=ప్రతిఫలించినట్టి; పర్ణజాల=ఆకులగుంపనెడు; నమ్ర = వంగినట్టి; నఖర = గోళ్లయొక్క; యుక్తిన్=సంబంధముచేత. తోఁచునలమౌక్తికశృంగనృసింహమూర్తి=తోఁచునట్టియామౌక్తికశృంగ మనెడునృసింహస్వామి. అధిత్యకాప్రభవితోన్నతవిద్రుమవల్లికల్.— అధిత్యకా = పర్వతోర్ధ్వప్రదేశమందు "ఉపత్యకాద్రేరాసన్నా భూమిరూర్ధ్వమధిత్యకా" అని యమరుఁడు. ప్రభవిత=సంజాతప్రభవములయిన; ఉన్నత= విశాలము లయిన; విద్రుమవల్లికల్ = పగడపుఁదీవలు. పలాశనజఠరంబున్ = రాక్షసునిహృదయమును. వెలుచన్ = ఆగ్రహముచేత. చీర్చి=బ్రద్దలుచేసి. పయిన్=మీఁదికి. ఎత్తునవాంత్రపాళిగన్=ఎత్తునట్టినూతనము లగుప్రేఁగులగుంపగుచుండఁగా. పెంపొనరెన్=ఒప్పెను. కనుమా=చూడుమీ.

ఈహేమకూటమందు ముక్తామయ మగునొకశృంగము నృసింహునిఁబోలి, దానియందు ప్రతిఫలించిన పల్లవములు నఖములఁ బోలియుండఁగా నధిత్యకలయం దుదయించిన పగడపుఁదీవలు హిరణ్యకశిపుజఠరము సీర్చిపైకెత్తినప్రేఁగులా యనునట్లు విలసిల్లె నని భావము.

సీ. వదనాంబుజమరీచి♦వారంబు తొలుదొల్త, నృత్తనాయకమాన♦రీతి నెంపఁ
గలితవీక్షాపాత♦కలనంబు లంతంతఁ, బుండరీకమదైక♦భూతి మాన్ప

సరసోరుయుగవిభా•సారంబుమునుమున్న, కదళికామహిమంబుఁ•గడకుఁదేర్పఁ
గబరికాబంధవై•ఖరి మించి వేవేగఁ, బరమఘనాఘన•స్ఫురణఁ దూల్ప

తే. నలరి కాంతారమృగనికా•యముల నడఁప
నిరతమృగయానువర్తనా•పరత నరతఁ
గాంచి యిచ్చటితటులఁ జ•రించుచెంచు
చంచరీకాలకలఁ జూడు • జనవరేణ్య. 13

టీ. జనవరేణ్యా=సుచంద్రుఁడా! ఇచ్చటితటులన్ = ఈహేమకూటపు సానువులయందు. వదనాంబుజమరీచివారంబు.—వదనాంబుజ= ముఖకమలములయొక్క; మరీచి = కాంతుల యొక్క; వారంబు=సమూహము. తోలుదొల్తన్ =తొల్తనె. ఋక్షనాయకమానరీతిన్.—ఋక్షనాయక=భల్లూకశ్రేష్ఠముయొక్క, చంద్రునియొక్క యని యర్థాంతరము. మానరీతిన్=అహంకారభంగిని. వొంపన్ =అడంపఁగా. కలితవీక్షాపాతకలనంబులు=ఒప్పుచున్న దృక్పాతములవ్యాప్తులు. అంతంతన్ =ముందుగనే. పుండరీకమదైకభూతిన్.—పుండరీక = శార్దూలములయొక్క, తెల్లదామరలయొక్క యని యర్థాంతరము. మద=గర్వముయొక్క; ఏక=ముఖ్యమగు; భూతిన్=సంపదను. మాన్పన్ =పోఁగొట్టఁగా. సరసోరుయుగవిభాసారంబు.—సరస = శ్రేష్ఠమగు; ఊరు=తొడలయొక్క; యుగ=జవయొక్క ; విభాసారంబు = కాంతిసారము. మునుమున్న=ముందుముందుగనే. కదళికామహిమంబున్.—కదళికా=లేళ్ళయొక్క; "కదళీకందళీచీనశ్చమూరు ప్రియకావపి" అని యమరుఁడు. మహిమంబున్ =అతిశయమును, అనఁటులయొక్క మహిమ నని యర్థాంతరము. కడకుఁదేర్పన్ =దూరీకరింపఁగా. కబరికాబంధవైఖరి.—కబరికాబంధ=కేశబంధములయొక్క; వైఖరి=రీతి. వేవేగన్ =అతివేగముగా. పరమఘనాఘనస్ఫురణన్.—పరమ=శ్రేష్ఠమగు; ఘనాఘన=మదపుటేనుఁగులయొక్క; వర్షుకాబ్దములయొక్క యని యర్థాంతరము. స్ఫురణన్ =ప్రకాశమును. తూల్పన్ =తొలఁగింపఁగా. అలరి=సంతసించి. కాంతారమృగనికాయములన్ =అరణ్యమృగసంఘములను. అడఁపన్ =అడంచుటకు. నిరతమృగయానువర్తనాపరతన్.—నిరత=ఎల్లపుడు; మృగయానువర్తనా = వేట ననుసరించుటయందు ; పరతన్ =ఆసక్తిచేత. నరతన్ =నరత్వమును. కాంచి=పొంది. చరించుచెంచుచంచరీకాలకలన్ =సంచరించుచున్నచెంచుస్త్రీలను. చూడు=అవలోకింపుము. "శ్లో. భామాసేయం బలిజకులజా భావభూభాగధేయమ్" అనునట్లు చెంచుశబ్దప్రయోగము.

ఈపర్వతమందుఁ జరించుచెంచువనితలు తమముఖకాంతి భల్లూకమానమును దృక్కాంతి శార్దూలగర్వమును తొడలు లేళ్ళమదమును కొప్పులు మదపుటేనుఁగులదర్పమును తమసంకల్పమునకు మునుమున్నే తొలఁగఁజేయఁగా సంతసించి నిరతమృగయాపరత్వముచే నరజన్మ మెత్తినవారేకాని వాస్తవముగ మనుష్యస్త్రీలు కారనిభావము.

చ. నికటరుషుఁకీకృపీటనర•ణిం దవరూపము సూచి భవ్యమా
ర్తికమయకూటసీమఁ దగు•కేసరి తాఁ బ్రతిసింహబుద్ధిఁ గో

పకలనమై వడిఁ దుమికి ♦ పైకొని సీర్చి తదంతరస్థర
త్నకులము లంచు నాత్మఁ గొని ♦ దారున వెల్వడెఁ గాన్పు మోనృపా. 14

టీ. ఓ నృపా=ఓసుచంద్రుఁడా! భవ్యమౌక్తికమయకూటసీమన్.—భవ్య=మనోజ్ఞమైన; మౌక్తికమయ=ముక్తామయ మగు; కూటసీమన్=శిఖరప్రదేశమందు. తగుకేసరి = ఒప్పుచున్నట్టిసింహము. నికటఝరీకృపీటసరణిన్.—నికట=సమీపమందున్న; ఝరీ=సెలయేటియొక్క; కృపీటసరణిన్=జలప్రదేశమందు. తనరూపము=తనప్రతిబింబమును. చూచి=అవలోకించి. తాన్. ప్రతిసింహబుద్ధిన్=ప్రతిస్పర్ధి యగుమఱియొకసింహ మనుబుద్ధిచేత. కోపకలనమై=కోపావిష్టమై. వడిన్=వేగముగా. దుమికి=ఆజలములో దుమికి. పైకొని=కవిసి. సీర్చి=బ్రద్దలు చేసి. తదంతరస్థరత్నకులములు=ఆజలమధ్యమున నుండురత్నజాలములు. అంచున్. ఆత్మన్=హృదయమందు. కొని=అనుకొని. దారునన్=వేగముగా. వెల్వడెన్=బయల్పడెను. కాన్పుము=అవలోకింపుము.

ఈ హేమకూటముయొక్క మౌక్తికమయ మగునొకశృంగమందుఁ దగుసింహము చెంతనున్న సెలయేటిప్రవాహమునఁ బ్రతిఫలించినతనరూపమును జూచి ప్రతిసింహ మని కోపించి దుమికి సీర్చి యిది ప్రతిసింహము కాదు జలాంతరమున నున్నరత్నచయ మనుకొని వేగముగ వెల్వడె నని భావము.

చ. అలఘుపరాగహేమవసనాంచల ♦ మించుక జాఱఁ దేఁటిచూ
పుల మరు గెల్చునీసొబగు ♦ పొంకముఁ గన్గొని మోహతాపసం
కలనత నోమహీరమణ ♦ కంటివె యీవనలక్ష్మి వేఁడియూ
ర్పులు వెడలించెఁ జంపకపుఁ ♦ బువ్వుల మాఁగినగాడ్పుచాలునన్. 15

టీ. ఓ మహీరమణ=ఓసుచంద్రుఁడా! ఈ వనలక్ష్మి=ఈవనసంపద యనెడు నొకస్త్రీ. అలఘుపరాగహేమవసనాంచలము.— అలఘు=విశాలమగు; పరాగ=పుప్పొడి యనెడు; హేమవసన=స్వర్ణవస్త్రముయొక్క; అంచలము=అగ్రము. ఇంచుక=కొంచెము. జాఱన్=జీరాడఁగా. తేఁటిచూపులన్=తుమ్మెద లనెడుచూపులచేత. మరుగెల్చునీసొబగు పొంకమున్=కాముని నోడించునీసౌందర్యముయొక్క పొందికను. కన్గొని=అవలోకించి. మోహతాపసంకలనతన్.—మోహ=వలపువలననైన; తాప=సంతాపముయొక్క; సంకలనతన్=సంబంధముచేత. "సంకలయతీతిసంకలనః" కర్త్రర్థమందునంద్యాదిల్యుట్ప్రత్యయము. చంపకపుఁబువ్వులమాఁగినగాడ్పుచాలునన్=సంపెంగిపువ్వుల సంబంధి యైనమాఁగినగాడ్పులయొక్కగుంపుచేత. వేఁడియూర్పులువెడలించెన్=ఉష్ణ మగునిశ్వాసములను విడిచెను. కంటివె=చూచితివా?

ఇట సుచంద్రునందు వనలక్ష్మికిఁ దదీయసౌందర్యవిశేషాద్యవలోకనమహిమచేఁ బ్రథమానురాగోదయ మైనట్లు వ్యక్త మగుచున్నది గావున నభిలాషహేతుకవిప్రలంభశృంగారము వ్యజ్యమాన మగును. విప్రలంభ మనఁగా వియోగకాలావచ్ఛిన్నరతియే. నాయికానాయకులకు వైయధికరణ్యము వియోగ మని కొందఱభిప్రాయపడినారుగాని యట్లైనచో "శ్లో. ఏకస్మిన్కాళ

యనే పరాఙ్ముఖతయా వీతోత్తరం తామ్యతోరన్యోన్యస్య హృది స్థితేప్యనునయే సంరక్షతోర్గౌరవమ్'' ఇత్యాదికావ్యములయం దేకశయ్యావిప్రలంభము చెప్పఁబడినది యసంగత మగును గావున వియుక్తుండ నైనవాఁడ నను బుద్ధియె వియోగ మ్మని సిద్ధాంతము. ఇట్టి విప్రలంభమున సుచంద్రుఁ డాలంబనవిభావంబును, తదీయ సౌందర్యాదు లుద్దీపనవిభావంబులును, వేఁడియూర్పు లనుభావంబులును, ఆక్షిప్యమాణరోమాంచాశ్రుపాతాదులు సాత్త్వికములును తాదృశచింతాదైన్యాదులు వ్యభిచారులును పరిపూర్ణము లగు కారణకార్యసహకారు లుండుటంబట్టి లోకోత్తరవిభవంబు ఘటించినయది. విభావానుభావాదిస్వరూపము ముందు వివరింపఁబడు.

చ. అతులఫణీశరమ్యకట • కాన్విత మై నిజమూర్ధభాగసం
భృతమలినాన్యపుష్కరఝ • రీతిలకం బయి కాలికానుషం
జిత మయి దేవసేవ్య మయి • చెన్నగునీకుధరాధిరాజ మో
క్షితివరచంద్ర కైకొనుట • చిత్రమె ధాత్రి గిరీశనామమున్. 16

టీ. ఓ క్షితివరచంద్ర=రాజచంద్రుండ వగునోసుచంద్రుఁడా! అతులఫణీశరమ్యకటకాన్వితమై.—అతుల=అసమానము లగు; ఫణీశ=సర్పశ్రేష్ఠములచే; రమ్య=మనోజ్ఞములగు; కటక=చఱులతోడ; అన్వితమై=కూడుకొన్నదై, సాటిలేనిఫణీశుఁ డనెడురమ్య మయినకడియములచేఁ గూడినదై యనియర్థాంతరము. నిజమూర్ధభాగసంభృతమలినాన్య పుష్కరఝరీతిలకం బయి.—నిజ=తనదైన; మూర్ధభాగ = శిరోభాగమందు; సంభృత=భరింపఁబడిన; మలినాన్య=నిర్మలమగు; పుష్కర=జలముగల; ఝరీతిలకంబయి=శ్రేష్ఠమగు సెలయేళ్లు గలదయి. మలినాన్య యగుపుష్కరఝరి అనఁగా వ్యోమగంగ గల దయి యనియర్థాంతరము. కాలికానుషంజిత మయి.—కాలికా=మేఘమాలచేత, పార్వతీదేవిచేత నని యర్థాంతరము. అనుషంజిత మయి=సంసక్త మయి. దేవసేవ్యమయి=దేవతలకు విహరించుస్థల మయి. ఇంద్రాదిభజనీయ మయి. చెన్నగునీకుధరాధిరాజము=ఒప్పుచున్నయీపర్వతశ్రేష్ఠము. ధాత్రిన్=భూమియందు. గిరీశనామమున్=గిరిశ్రేష్ఠ మనుపేరిని, శివనామము నని యర్థాంతరము. కైకొనుట=స్వీకరించుట. చిత్రమె=ఆశ్చర్యకరమా? గిరీశునం దున్నగుణగణమ్ముతో విరాజితం బగునీపర్వతమునకు గిరీశ మనునామ ముండుట యాశ్చర్యకరము గా దనుట.

సీ. అలరుఁదీవియలఁబో • యకమించుక్రొందేఁటి, జోటిమ్రోఁతలోయారి • పాటగాఁగ
స్థలకంజినీకంజ • ములగాడ్పు దారిఁ బైఁ, బర్వుపుప్పొడిపచ్చ • పావడలుగఁ
గనకశృంగాగ్రసం • గతపాండుకాండదా, నీకముల్ నవపుండ • రీకములుగ
నతిచలచ్ఛదయుక్తి • నలరురంభాస్తంభ, జాలంబు జయపతా • కాళి గాఁగ

తే. భోగవతికావతంసముల్ • పుణ్యతరులు
రాజశార్దూలసంఘముల్ • ప్రాంతవీథిఁ
గొలువఁ బేరోలగం బున్న • చెలువుఁ బూనె
నీధరాభృద్వరునిఁ గంటె • భూధరేంద్ర. 17

టీ. భూధరేంద్ర=ఓరాజేంద్రుఁడా. అలరుఁదీవియలన్=పువ్వులతోఁ గూడినలతలను. పాయక = వదలక. మించుక్రొందేఁటిజోటి ప్రోఁతలు.— మించు= అతిశయించునట్టి; క్రొందేఁటిజోటి=క్రొత్తతుమ్మెదల జంటయొక్క; ప్రోఁతలు=ఝుంకారములు. ఓయారిపాట గాఁగన్ = నారీమణులయొక్క పాట యగు చుండఁగా. స్థలకంజినీకంజములగాడ్పుదారిన్.— స్థలకంజినీ=మెట్టదామరతీవలయొక్క; కంజముల=కమలములయొక్క; గాడ్పుదారిన్ = వాయుప్రసరణమార్గము చేత. పైఁబర్వుపుప్పొడి=పైకెగయు పువ్వుదేణువు. పచ్చపావడలుగన్ = పసపుపంచెలు కాఁగా. కనకశృంగాగ్రసంగత పాండుకాండ దానీకముల్.— కనక=సువర్ణమయము లగు; శృంగ=శిఖరములయొక్క; అగ్ర=కొనలయందు; సంగత=కూడియున్న; పాండు=తెల్ల నగు; కాండద = మేఘములయొక్క; అనీకముల్=గుంపులు. పుండరీకములుగన్= శ్వేతచ్ఛత్రములు కాఁగా. అతిచలచ్ఛదయుక్తిన్.—అతిచలత్=మిక్కిలికదులు చున్న; ఛద= పర్ణములయొక్క; యుక్తిన్=సంబంధము చేత. అలరురంభాస్తంభజాలంబులు=ఒప్పు చున్న యనంటి స్తంభములయొక్క గుంపులు. జయపతాకాళి కాఁగన్= విజయధ్వజములగుంపులు కాఁగా. భోగవతీశావతంసముల్=వేశ్యారత్నములు, నాగకన్యకాశ్రేష్ఠములు. పుణ్యతఱులు= మిక్కిలి పుణ్యశీలు రైనవారు,మనోజ్ఞము లగువృక్షములు. "పుణ్యమ్మనోజ్ఞేఽభిహితం తథా సుకృతధర్మయోః" అని విశ్వము. రాజశార్దూలసంఘముల్=రాజశ్రేష్ఠుల గుంపులు, వ్యాఘ్రశ్రేష్ఠముల గుంపులు. ప్రాంతవీథిన్=సమీప ప్రదేశమందు. కొలువన్=సేవించు చుండఁగా. పేరోలగం బున్న చెలువున్=కొలువుకూటమం దున్నయందమును. పూనెన్=వహించెను. ఈధరాభృద్వరునిన్=ఈపర్వతశ్రేష్ఠమును. ఈరాజశ్రేష్ఠము నని ధ్వనితార్థము. కంటె= అవలోకించితివా?

క్రొందేఁటిజోటిప్రోఁతలు నారీమణీగానంబులుగాను, మెట్టదామరల నుండివెడలుగాడ్పునఁ బైఁబర్వుపుప్పొడి పసపుపంచగాను, శిఖరాగ్రమందు వెలయుతెల్లమబ్బు శ్వేతచ్ఛత్రముగాను కదులు చున్నయాకులు గలయనంటులు జయపతాకములుగాను శోభిల్లు చుండఁగా నాగకన్యకాశ్రేష్ఠము లనెడువేశ్యారత్నంబులు మనోజ్ఞము లగువృక్షము లనెడుపుణ్యవంతులు శ్రేష్ఠము లగుపులు లనెడురాజశ్రేష్ఠులు చెంతలం గొలుచుచుండఁగా పేరోలగం బున్న రాజరత్నమువలె నీధరాధరశ్రేష్ఠము తేజరిల్లు చున్నదని తాత్పర్యము.

వ. వెండియు నీహేమకూటంబు హేమకూటప్రభాకూట సంధ్యారాగోదయమై ఖరీపరిఫుల్లమానగిరి మల్లికావల్లికాప్రసూనాంబుజాత ప్రవాహసంవర్ధితం బగుట నాత్మనిదానాభిధానంబునం బ్రసిద్ధిం బొందునతిమంజులహేంజుల పుంజవలయంబునడుమం జెలు వూనుపారిజాతమహీంజాతలతానికాయ కాయమానంబులక్రింద నందంబు లగుకురువిందవేదికా బృందంబులపై నిండువేడుక నెమ్మనంబుల మెండుకొన నెచ్చెలిపిండు పసిండిదండియలు వూని నుతి మీఁట నతికలితకలనాదకాకలీస్వరవిలసనంబున విషమాంబకబిరుదగీత వ్రాతంబులు పాడుతెఱగంటికెలువకంటిదంటల నవీనతానసంతానమానం

బులం జొక్కి సంజాతపులకప్రరోహంబులం బొలుచుచెలువున నుదార
కోరకవారంబులం జూపట్టునీరంధ్రప్రియాళుప్రతానంబులవలన నీరంధ్ర
ప్రియాళుప్రతాననికుంజగేహంబుల నొక్కయెడనైన నినభయంబు గానక
సుఖం బుండి యాఖండలశిలాగండోపలఫలకప్రతిఫలితాధిత్యకాస్థలరమ
మాణగరుడమాణవకమూర్తులం గని వెఱ దొరయ నచ్చటం జొరఁబాఱు
చిలువదొరలఫణాతలమణికులభాస్వద్ఘృణిపూరంబులకు నిలువనోపక వెడలి
పఱతెంచుకటికిచీకటికిన్నరాంబుజముఖీకదంబకవిరచితనూతనదోహదధూ
మంబులయోజం దేజరిల్ల సద్యస్సముత్పద్యమానఫలమిళితశాఖాకలితంబు
లగుదాడిమీకులంబులఁ దిలకించి యచ్చటి కాశ్రయింపం జనుద మని నిజ
ప్రియజనంబులఁ బిలుచురాచిలుకచిలుకలకొలుకులకలికిపలుకులువిని యలరు
కర్ణికారవారంబులవలనఁ గర్ణికారవారప్రవాళశ్రేణులబ్జరాగతోరణమా
లికలును నిస్తులగోస్తనీవిలంబమానఫుల్లగుచ్ఛంబులచ్ఛమౌక్తికవితానం
బులును నమలకకుత్థ్సలనానట్యమానమత్తాళిపాళికలభిరూపధూపధూమ
మాలికలునుంగాఁగ నమరుమందారవీరున్మందిరంబునసంపెఁగతీవజాలువా
గొలుసులను య్యెలలూఁగుసాధ్యమిథ్యామధ్యాజనంబుల చరణపయోజసం
యోజనంబులకు లక్ష్యంబులై తదీయస్పర్శనవినిర్గతానురాగకందళంబుల
యందంబునం జివురించునశోకానోకహంబులవలన నశోకానోకహకుసుమ
విసరవర్షితమరందధారాళధారాగారవంబునఁ బెనులోయఁ బడిన ధగధగ
నిపగడంపుఁగోనల భుగభుగవలచుకపురంపుటనంటుల చప్పరంబులక్రిందం
జెప్పరానివేడుక ముప్పిరిగొనవిచ్చలవిడి డాఁగిలిమ్రుచ్చులాడునెడ నెడయని
వడి యడర నుదంచితచంచరీకమాలికలనుల్లసితపల్లవంబులను త్తుంగనిస్తు
లస్తబకంబుల నుజ్జ్వలత్కళికాకులంబుల నుల్లసిల్లుతరుణప్రతతికలం గల
కుడుంగరంగంబులలోఁ దమ్ముఁ దెలియ కుండ డాఁగియున్న యన్నలమిన్న
లవీక్షింపఁ జరించుసిద్ధరాజతనూజాసమాజంబుల నిశాతవిలోచనాపాతం
బుల నపూర్వవిలాసంబు గాంచుతిలకనగతిలకంబులవలనఁ దిలకనగతిలక
కుసుమగళన్మకరందసంపర్కంబునం బదనైనముత్తియంపుదోనల నిండిన
నంకుమదపంకంబునం బొంకంబుగా మృదుమృదుత్వగభినవదళంబుల నలి
నభవునిం గొలువఁ జనినతమతమరమణునికై సందేశంబులు లిఖించి చెలు
ల నంచి పంచశరపంచశరీప్రపంచితరమణీశిఖాశిఖాంచల చంచలితమా
నసంబున నడలి బడలి చెలువ మొలపుకొలువదొర రాయరంగులం బఱచినక
లువదేశజముకోణంబులపటుయింబొరలుగంధర్వసౌగంధికగంధిరత్నంబులనం

తాపంబు సన విరిసీరు నించియు కెంజివురులం గప్పియుఁ జల్లపుప్పొడులు సల్లియు నలరుజొంపంబులం బొదివియు శీతలోపచారంబులు సేయుతప్పి యువయస్యాలలామంబులకుం దోడునీడలై చూడం దగువాసంతికాజాతంబులలనవాతపోతప్రచారంబులం గౌఁగిలింపనవారితసుమనోవికాసంబునం బొలుపుగాంచుకురువకలతావలయంబులవలనఁ గురువకలతావలయవల్లవపల్లవాధరామండలమధ్యస్థల సందర్శనీయపురందర శిలాశిఖరనందనందనసంభృతరంజిత వేణుదండాయమానమానితకటకవాలవాయజ సూత్రానుబింబంబు లహిరూపంబులుగా నెఱింగి యుప్పొంగి చెంగున నెగసి చరణంబులం ద్రొక్కి పట్టి చంచూపుటంబుల సించి తెక్కల నడిచి యేమియుం దేర కున్న విస్మయంబు మనంబు బెరయ విఫలప్రయత్నంబులై పుడమి వ్రాలుకాంతారమయూరదారకంబులం జొచ్చి కికాకికకేళి సల్పుగరుడసరోజముఖనికరంబుల దరస్మితవిలాసంబున సమధికపథికచేతస్తాపసంవర్ధకపరిసవామోద పరంపరలఁ జెన్ను మీఱుపున్నాగ పూగంబులవలనఁ బున్నాగ పూగ మధుసాలరసాల ముఖ్య దివ్యతర్వంతరంబున మంజులకంజరాగ భిత్తిభాగ మరీచిపుంజంబు భాస్వదాతప ప్రాబల్యఖంజనంబును శాతకుంభకుంభవిభాడంబరంబు సంధ్యారాగారంభంబును వలభిన్మణివలభిరుచిరరుచిపూరంబు నిబిడతిమిరవివర్ధనంబును ముక్తాల్లోలవిభాసారంబు దారకానిసర్గంబును భూరిస్తంభసంగ్రథితహీరదర్పణద్యుతిజాతంబు నిస్తంద్రచంద్రికాకల్పనంబునుం గావింప నక్షీణతుణాదైకవిలసనంబునం బొలుచుకేళికాహర్మ్యంబున మిక్కిలి పిక్కటిల్లుమక్కువఁ జక్కరవిల్తుజగడంబుల మగలఁ జొక్కించి యాత్మీయపుంభావభావనాసంభూతశ్రమంబుదూలఁ జెంగటివనుల సంచరించునాగకన్యావతంసంబుల యాగాఢనిశ్వాససమీరంబులతోరం బగుసిరి నొప్పారుసిందువారంబులవలన సిందువారాదినగవారశిలాతలంబులనురులు దాల్చియు నెత్తమ్ము లిమ్ముగాఁ బ్రవహించుసెలయేఱులపై వలలు సేర్చియు స్వజాతిద్విజాతుల రాఁబిలుచుపులుఁగులదీములుగట్టియు జిగురుఁగండెలమర్చియు విచిత్రతరవనపతత్త్రిగోత్రంబులం బట్టుకొనుతలంపున మెండైనపొదల నుండి యప్పటప్పటికి వానిం గానఁ దమకించి చెంచెత లెత్తునెమ్మొగంబుతమ్మిచాయలవసంతసమయసముదితసౌభాగ్యమ్మునం బొదలుచాంపేయధాత్రీరుహంబులవలనఁ జాంపేయధరారుహకుసుమగళిత పరాగరాశిమధురసనదీపులినదేశంబునఁ గపురంపుఁటినంటుపలే ధ్యాసుఁ బఱచి మరకతమకరకేతనాహితమూర్తి నిలిపి తదేకపూజాత్మా

ర్యంబున నున్న సద్గుణోత్తములకు విరులొసంగునంతరంగంబునఁ బ్రమ దావనంబు సొచ్చి ప్రమథమధురోష్ఠీతల్లజంబులు గేల నూది నిక్కి విటపాంతరాభివేష్టితమల్లికాప్రసూనంబులఁ గోయునెడఁ దత్కరసంయోగంబు వలన నిజేష్టఫలలాభంబు చేకూరెనోయన రమ్యఫలంబులం బెంపొందుమాకందంబులవలన మాకందవాసనాభివాసితపవమానప్లవమానసీలాశోకరజస్తోమంబు ప్రవర్గ్యోపక్రమనిర్గచ్ఛద్ధూమవర్తనంబునం బర్వ నమందానందకందళితచిత్తారవిందంబులతో ముందుముందుగఁ బఱతెంచుపురందరాదిబృందారకవర్గంబుల తనూశ్రమంబు దెరలం జేయుశీతలతరతాపసాశ్రమనానావిధ వసుధారుహనివహంబుల చెంతలం దదీయశాఖాప్రసవముఖవినిష్ఠ్యూతమధుపాళికం బ్రసవితంబు లగువిశారదవిటపిపటలంబులవలనను వలనుమిగిలి మేరుకుధరంబునుం బోలె శక్రపురాతిభాసురంబును హిమవన్నగంబునుం బోలె గోభృత్కార్ష్మకాన్విత కాళికాతిశోభితంబును మందరధరంబునుం బోలె వ్యాళాధిరాజపరివేష్టితంబును ఋశ్యమూకాద్రియుం బోలె హరిజాతికలితంబును మాల్యవద్గోత్రంబునుం బోలె రామసంచారసంగతంబును నీలాచలంబునుం బోలె పురుషోత్తమభూషితంబును గంధమాదనగ్రావంబునుం బోలె మహావరాహపాళికాలింగితంబును సమామోదసంకలితశ్యామామహితం బయ్యును నసమామోదసంకలితశ్యామామహితంబై పీనఘనార్భటివిఘూర్ణితమహాబిలం బయ్యును నపీనఘనార్భటివిఘూర్ణితమహాబిలంబై మరాళికాశ్రితకటకస్థలవనజాతం బయ్యును నమరాళికాశ్రితకటకస్థలవనజాతంబై సద్వృక్షరాజసారంగసంతానసంకలితం బయ్యును నసద్వృక్షరాజసారంగసంతానసంకలితంబై కాలాహితసుమనోనగ భాసమానం బయ్యును నకాలాహితసుమనోనగభాసమానంబై యొప్పుచున్నయది విలోకింపుము.

టీ. వెండియుఁ గా=మఱియును. ఈ హేమకూటంబు=ఈ హేమకూటపర్వతము. దీనికి వచనాంతమం దున్న యొప్పుచున్నదను క్రియతో నన్వయము. హేమకూటప్రభాకూటసంధ్యారాగోదయవైఖరీపరిఫుల్ల్యమానగిరిమల్లికావల్లికాప్రసూనాంబుజాతప్రవాహసంవర్ధితంబగుటన్.—హేమకూట=కనకశిఖరములయొక్క; ప్రభాకూట=కాంతిపుంజమనెడు; సంధ్యారాగ=సాయంకాలసూచకమగు నారుణ్యముయొక్క యనుట. వైఖరీ=రీతిచేత; పరిఫుల్ల్యమాన=వికసించుచున్న; గిరిమల్లికా=కుటజవృక్షములయొక్క; వల్లికా = లతలయొక్క; ప్రసూన=పుష్పములయొక్క; అంబుజాత = మకరందసమూహముయొక్క; ప్రవాహ = వఱదచేత; సంవర్ధితం బగుటన్ = వృద్ధిఁ బొందింపఁబడినదైన హేతువుచేత. ఆత్మనిదానాభిధానంబునన్.—ఆత్మ=తనకు; నిదాన=ఆదికారణముయొక్క; అభిధానంబునన్=పేరిచేత. ప్ర

సిద్ధింబొందునతిమంజులహింజులపుంజవలయంబునడుమన్.— ప్రసిద్ధింబొందు=ఖ్యాతిఁగాంచునట్టి; అతిమంజుల=మిక్కిలిమనోహరములగు; హింజుల=నీరుగన్నేరులయొక్క; అంబుజాతమువలనవృద్ధిఁ బొందినది గావున, నీరుగన్నేరులనిపేరు బొందినవనుట. "నిచుళోహింజులో హింజుః" అని యమరుఁడు. పుంజవలయంబునడుమన్=వలయాకార మగుగుంపులనడుమను. చెలువూనుపారిజాతమహీజాతలతానికాయ కాయమానంబులక్రిందన్.— చెలువూను=సౌందర్యమొందు; పారిజాత=పారిజాత మనెడు; మహీజాత=వృక్షములయొక్క; లతానికాయ=తీవలగుంపుయొక్క; కాయమానంబులక్రిందన్=పందిళ్లక్రింద. అందంబు లగుకురువిందవేదికాబృందంబులపైన్.—అందంబులగు=సుందరములైన; కురువిందవేదికా=పద్మరాగమణులతో గట్టినతిన్నెలయొక్క; బృందంబులపైన్=సమూహములమీఁద. నిండువేడుక=పరిపూర్ణకుతూహలము. నెమ్మనంబులన్=మంచిమనస్సులయందు. మెండుకొనన్=అతిశయింపఁగా. నెచ్చెలిపిండు=ప్రియసఖీసమూహము. పసిండిదండియలు=బంగరువీణలు. పూని=వహించి. సుతిమీటన్=శ్రుతిని అతిశయింపఁజేయఁగా. శ్రుతి యనఁగా స్వరారంభకావయవవిశేషము. "శ్లో. ప్రథమశ్రవణాచ్ఛబ్దశ్శ్రూయతే హ్రస్వమాత్రకః సాశ్రుతిస్సంపరిజ్ఞేయా స్వరావయవలక్షణా" అని శ్రుతిలక్షణము. అతికలితకలనాదకాకలీస్వరవిలసనంబునన్.—అతికలిత=మిక్కిలి కలయుచున్న; కలనాద=అవ్యక్తమధురధ్వనిగల; కాకలీస్వర=మధురమై అస్ఫుటమైన స్వరముయొక్క; విలసనంబునన్=ఉన్మేషము చేత. విషమాంబకబిరుదగీతవ్రాతంబులు.— విషమాంబక=పంచబాణునియొక్క; బిరుద=సామర్థ్యచిహ్నములయొక్క; గీత=గానములయొక్క; వ్రాతంబులు=సమూహములు; పాడుతెలిగంటికలువకంటిదంటలనవీనతాన సంతానమానంబులన్.— పాడు=పాడెడు; తెలిగంటి=దేవతాసంబంధినులగు; కలువకంటిదంటల = దిట్టతనముగల స్త్రీలయొక్క; నవీన=అపూర్వమగు; తాన=తానకారముతోఁబాడెడుపాటలయొక్క; సంతానమానంబులన్ = సమూహగౌరవములచేత. చొక్కి=సుఖపరవశమై. సంజాతపులకప్రరోహంబులన్.—సంజాత=పుట్టినట్టి; పులక=రోమాంచములయొక్క; ప్రరోహంబులన్=అంకురములచేత. పొలుచుచెలువునన్=ఒప్పుచందంబున. ఉదారకోరకవారంబులన్.—ఉదార=గొప్పలయిన; కోరక=కలికలయొక్క; వారంబులన్=సమూహములచేత. చూపట్టునీరంధ్రప్రియాళుప్రతానంబులవలనన్.—చూపట్టు=కనఁబడుచున్న; నీరంధ్ర=దట్టమైన; ప్రియాళు=ప్రేంకణములయొక్క; ప్రతానంబులవలనన్=సమూహములవలన. ఈపంచమ్యంతమునకు, ముందు, రాఁగలపంచమ్యంతములకు "వలనుమిగిలి" అనుక్రియతో నన్వయము. నీరంధ్రప్రియాళు ప్రతాననికుంజగేహంబులన్.— నీరంధ్ర=దట్టమగు; ప్రియాళు=ప్రేంకణములయొక్క; ప్రతాన = సమూహముయొక్క; నికుంజగేహంబులన్= పొదరిండ్లయందు. ఒక్కయెడనైనన్= ఒకసమయమందైనను. ఇనభయంబున్=సూర్యభయమును. కానక=చూడక. సుఖంబుండి=సుఖముతోడ వసియించి. అఖండలశిలాగండోపలఫలకప్రతిఫలితాధిత్యకాస్థలరమమాణగరుడమాణవకమూర్తులన్.— అఖండలశిలా = ఇంద్రనీలమణులయొక్క; గండోపలఫలక = పలకలవంటి స్థూలోపలములయందు; ప్రతిఫలిత=ప్రతిబింబితములైన; ఇదిమాణవకమూర్తులకు విశేషణము. అధిత్యకాస్థల=పర్వతోర్ధ్వప్రదేశములందు; రమమాణ=క్రీడించుచున్న; గరుడ=గరుడపక్షులయొక్క; మాణ

పక=బిడ్డలయొక్క; మూర్తులన్=శరీరములను. కని=చూచి. వెఱదొరయన్ = భయమొదవఁగా. అచ్చటన్=అనికుంజగేహములయందు. జొరఁబాఱుచిలువదొరలఫణాతలమణికులభాస్వద్ఘృణిపూరంబులకున్.—జొరఁబాఱు=చొచ్చుచున్న; చిలువదొరల= ఫణిశ్రేష్ఠములయొక్క; ఫణాతల=పడగలయందున్న;మణికుల=మణులసమూహముయొక్క; భాస్వత్=ప్రకాశించుచున్న; ఘృణి = కాంతులయొక్క, కాదేని మణిసమూహమనెడు సూర్యునియొక్క కిరణములయొక్కయని యర్థము. పూరంబులకున్=ప్రవాహములకు. నిలువన్ ఓపక = ఉండఁజాలక. వెడలి=బయలుదేఱి. పఱతెంచు కటికిచీకటి=పోవునట్టిగాఢాంధకారము. కిన్నరాంబుజముఖీకదంబకవిరచితనూతన దోహదధూమంబులయోజన్.—కిన్నరాంబుజముఖీ=కిన్నరస్త్రీలయొక్క; కదంబక=సమూహముచేత; విరచిత=చేయఁబడిన;నూతన=నవీనమగు; దోహద=అనఁగా తరుగుల్మలతాదులకకాలమందు పుష్పఫలాదినిమిత్తమై చేయుక్రియావిశేషము. అట్టిక్రియావిశేషము లెవ్వియన, దాడిమికి పొగ, అశోకమునకు స్త్రీపాదతాడనము, పొగడకు ముఖసీధువు, గోరంట కాలింగనము, బొట్టుగునకు వీక్షణము, మామిడికి కరస్పర్శము, సంపెఁగకు ముఖరాగము, కొండగోఁగునకు సల్లాపము, వావిలికి ఊర్పు, మోరటికి పాట, సురపొన్నకు నవ్వు ఇత్యాదిగాఁ దెలియఁదగినయది. అదోహదరూపమైన;ధూమంబుల=పొగలయొక్క.యోజన్=రీతిచేత. తేజరిల్లన్=ప్రకాశింపఁగా. సద్యస్సముత్పద్యమానఫలమిళితశాఖాకలితంబులగుదాడిమీకులంబులన్.— సద్యస్సముత్పద్యమాన=తత్కాలోత్పద్యమానములగు; ఫల= ఫలములచేత; మిళిత=కూడుకున్నట్టి; శాఖా=కొమ్మలచేత; కలితంబులగు = ఒప్పుచున్నట్టి; దాడిమీకులంబులన్=దాడిమీవృక్షములగుంపులను. తిలకించి=అవలోకించి. అచ్చటికిన్= ఆప్రదేశమునకు. ఆశ్రయింపన్=ఆశ్రయించుటకు. చనుదమని=పోవుదమని. నిజప్రియజనంబులన్=తమప్రియులను. పిలుచు రాచిలుకచిలుకలకొలుకులకలికిపలుకులు.—పిలుచు=ఆహ్వానముఁ జేయుచున్న;రాచిలుకచిలుకలకొలుకుల=శ్రేష్ఠమైనశుకాంగనలయొక్క,కలికి=అందమైన;పలుకులు=మాటలను; విని=ఆకర్ణించి. అలరుకర్ణికారవారంబులవలనన్=వికసించుకొండగోఁగులసమూహములవలనను. కర్ణికారవారప్రవాళశ్రేణులు.—కర్ణికారవార=కొండగోఁగుగుంపులయొక్క;ప్రవాళ=పల్లవములయొక్క;శ్రేణులు=పరంపరలు. అబ్జరాగతోరణమాలికలును=పద్మరాగమణిమయ మగుతోరణములగుంపులును. నిస్తులగోస్తనీవిలంబమానఫుల్లగుచ్ఛంబులు.— నిస్తుల=అసమానములగు; గోస్తనీ=ద్రాక్షయొక్క; విలంబమాన=వ్రేలాడుచున్నట్టి; ఫుల్ల=వికసించినట్టి; గుచ్ఛంబులు=గుత్తులు; అచ్ఛమౌక్తికవితానంబులును.—అచ్ఛ=స్వచ్ఛమగు; మౌక్తిక = ముత్యములయొక్క; వితానంబులును = మేలుకట్లును. అమలకకుత్స్థలనానట్యమానమత్తాళిపాళికలు.— అమల=స్వచ్ఛమగు;కకుత్స్థల=శ్రేష్ఠప్రదేశమందు;నానట్యమాన=విహరించుచున్నట్టి; మత్త=మదించిన; అళి=తుమ్మెదలయొక్క,పాళికలు=గుంపులు. అభిరూపధూపధూమమాలికలును.—అభిరూప=మనోహరమగు; ధూప=ధూపసంబంధియైన; ధూమ=పొగయొక్క; మాలికలును=సమూహములును. కాఁగన్=అగుచుండఁగా. అమరుమందారవీరున్మందిరంబునన్.—అమరు=ఒప్పుచున్న; మందారవీరుత్=కల్పలతలయొక్క; మందిరంబునన్=గృహమందు. సంపెఁగతీవజాలువాఁగొలుసులన్=సంపెఁగతీవలనెడు బంగరుగొలుసులయందు. ఉయ్యాలలూఁగు సాధ్యమిథ్యా

మధ్యాజనంబుల చరణపయోజసంయోజనంబులకున్.—ఉయ్యేలలూఁగు=డోలావిహారముసేయుచున్న; సాధ్య=సాధ్యులయొక్క; మధ్యామధ్యా=తనుమధ్యలైనయంగనలయొక్క; జనంబుల=సమూహములయొక్క; చరణపయోజ=పాదపద్మములయొక్క; సంయోజనంబులకున్=సంబంధములకు; లక్ష్యంబులై=విషయంబులై. తదీయస్పర్శన వినిర్గతానురాగ కందళంబులయందంబునన్.—తదీయస్పర్శన = ఆసాధ్యస్త్రీపాదపయోజస్పర్శచేత; వినిర్గత = వెడలి వచ్చిన; అనురాగ=ప్రీతియొక్క; కందళంబులయందంబునన్=అంకురములభంగి. చివురించునశోకానోకహంబులవలనను = చిగురించు చున్నయశోకవృక్షముల వలనను, అశోకమునకు నబలాపాదతాడనము దోహద మని తెలుపఁబడియె. అశోకానోకహ కుసుమ విసరవర్షితమరంద ధారాళధారాగౌరవంబునన్.—అశోకానోకహ కుసుమవిసర = అశోకవృక్ష కుసుమసమూహముచేత; వర్షిత=వర్షింపఁబడినట్టి; మరంద=పూఁదేనియయొక్క; ధారాళ=అధికమగు; ధారా=ధారలయొక్క; గౌరవంబునన్=అతిశయముచేత. పెనులోయఁ బడిన ధగధగని పగడంపుఁగోనలన్=పెద్దకొండ చీలికయందుఁ బడినధగధగ మని మెఱయు పగడములయొక్క కోనలయందు. ఘుగఘుగవలచు కపురంపుటనంటి చప్పరంబులక్రిందన్.—ఘుగఘుగవలచు=ఘుగఘుగమనిపరిమళించు; కపురంపుటనంటి=కర్పూరపుటరఁటిచెట్లయొక్క; చప్పరంబుల క్రిందన్=పందిళ్లక్రిందను. చెప్పరానివేడుక=చెప్పనలవిగాని సంతసము. మిప్పిరిగొనన్=మిక్కిలి వృద్ధిఁబొందఁగా. విచ్చలవిడి=యథేచ్ఛముగ. డాఁగిలి ముచ్చులాడునెడన్=డాఁగిలిముచ్చు లనిపేరుగల యాటలాడు నపుడు. ఎడయనివడి=సందులేని వేగము. అడరన్=ఒప్పఁగా. ఉదంచిత చంచరీక మాలికలన్=మిక్కిలి యొప్పుచున్న భృంగపంక్తుల చేతను. ఉల్లసిత పల్లవంబులన్=ప్రకాశించుచున్న చిగురుటాకుల చేతను. ఉత్తుంగనిస్తుల స్తబకంబులన్.—ఉత్తుంగ=ఉన్నతమగు; నిస్తుల=సాటిలేని; స్తబకంబులన్ = గుచ్ఛముల చేతను; ఉజ్జ్వలత్కలికాకులంబులన్=ప్రకాశించు చున్న మొగ్గలగుంపుచేతను, ఉల్లసిల్లు తరుణప్రతతులన్=ప్రకాశించు చున్న లేఁతలతలయందు. కలకుడుంగరంగంబులలోన్=ఉండినట్టి లతాగృహముల యొక్క మధ్యప్రదేశములయందు. తమ్ముఁ. తెలియకుండన్. డాఁగియున్న యన్నులమిన్నలన్=డాఁగియున్నట్టి యుత్తమస్త్రీలను. వీక్షింపన్=అవలోకించుటకు. చరించుసిద్ధరాజ తనూజాసమాజంబులనిశాతవిలోచనాపాతంబులన్.—చరించు=సంచరించు చున్న; సిద్ధరాజతనూజా=సిద్ధకన్యకలయొక్క; సమాజంబుల=సంఘముల యొక్క; నిశాత=తీక్ష్ణములగు; విలోచన=దృష్టులయొక్క; ఆపాతంబులన్ = ప్రసరణముచేత. అపూర్వవిలాసంబున్=లోకోత్తర విలాసమును; కాంచుతిలకనగతిలకంబులవలనన్ = కాంచునట్టి శ్రేష్ఠము లగుతిలకవృక్షములవలనను. తిలకవృక్షము లనఁగా బొట్టుగుచెట్లు, వీనికిఁ దోహదము వీక్షణ మని తెలుపఁబడియె. తిలకనగతిలకకుసుమ గళన్మకరంద సంపర్కంబునన్.—తిలకనగతిలకకుసుమ = శ్రేష్ఠము లగుబొట్టుగుల యొక్క పువ్వులవలన; గళత్=జాఱుచున్నట్టి; మకరంద = పూఁదేనియయొక్క; సంపర్కంబువలనన్ = సంబంధమువలన. పదనైనముత్తియంపు దోనలన్=ఆర్ద్రమైన ముత్యపుదోనలయందు. నిండినసంకుమదపంకంబునన్=నిండినట్టి జవ్వాజిబురద చేత. పొంకంబుగాన్=సుందరమగునట్లుగా. మృ

దుమృదుత్వగభినవదళంబులన్.—మృదు=మెత్తనగు; మృదుత్వక్=భూర్జవృక్షముయొక్క; ‘‘భూర్జేచర్మిమృదుత్వచౌ’’ అనిఅమరుఁడు. అభినవ=నూతనమగు; దళంబులన్=పత్త్రములయందు; నలినభవునిన్=బ్రహ్మను. కొలువన్=సేవింపను. చనినతమతమ రమణునికై= పోయినట్టి తమతమప్రియుని కొఱకు. సందేశంబులు=స్వీయవృత్తాంతములు. లిఖించి=వ్రాసి. చెలులన్=సకియలను. అంచి=పంపి. పంచశరపంచశరీప్రపంచితరహాణశిఖి శిఖాంచలచంచలిత మానసంబునన్.—పంచశర=మన్మథుని యొక్క; పంచశరీ=శరపంచకము చేత ‘‘పంచానాం శరాణాం సమాహారః’’ అని ద్విగువుచేసి జీప్ప్రిత్యము చేయఁగా పంచశరీ అనియైనది. ప్రపంచిత=విస్తరింపఁ జేయఁబడిన; రహాణ=వియోగ మనెడు, శిఖి=అగ్నియొక్క; శిఖా = జ్వాలలయొక్క; అంచల=అగ్రములచేత; చంచలిత=మిక్కిలి చలింపఁజేయఁ బడిన;మానసంబునన్=మనస్సుచేత. అడలి=దుఃఖించి; బడలి=అలసి. చెలువము=అందమును. ఎలవుకలువల దొరరాయరంగులన్.—ఎలవు=చేయుచున్న;కలువల దొరరా= చంద్రకాంత మణుల యొక్క; అరంగులన్=తిన్నెలమీఁద. పఱచిన కలువ ఱేకు జముకాణంబుల పయిన్=పఱచినట్టి కలువ ఱేకు లనెడు జముకాణములను నాస్తరణవిశేషములయందు. పొరలుగంధర్వసౌగంధికగంధిరత్నంబుల సంతాపంబు.—పొరలు=పరివర్తనము సేయుచున్న; గంధర్వ = గంధర్వులయొక్క; సౌగంధిక గంధిరత్నంబుల=స్త్రీరత్నములయొక్క ; సౌగంధిక మనఁగా మంచిపరిమళముగల యొకవిధమైన కలువ, దాని గంధమువంటిగంధము గలవారలు సౌగంధికగంధులు. వారలలో శ్రేష్ఠులు సౌగంధికగంధిరత్నములు. ‘‘సౌగన్ధికంతు కహ్లారమ్ రత్నం స్వజాతిశ్రేష్ఠేఽపి’’ అని యమరుఁడు. సంతాపంబు=సంతాపము. చనన్=చనుటకు. విరినీరు నించియున్=బువ్వుజలమును బూరించియు. కెంజివురులన్=ఎఱ్ఱనిచిగురుటాకులచేత. కప్పియున్=ఆచ్ఛాదించియు.చల్లపుప్పొడులు=చల్లనిపుప్పరేణువులు.చల్లియున్. అలరు జొంపంబులన్=పువ్వుల గుబురులచేత. పొదివియున్=కప్పియు. శీతలోపచారంబులు=శైత్యోపచారములను. చేయుతత్ప్రియవయస్యాలలామంబులకున్=చేయుచున్న వారి ప్రియసఖీరత్నములకు. తోడునీడలై=సహాయములై. చూడన్=అవలోకించుటకు. తగువాసంతికా జాతంబు=ఒప్పుచున్న బండిగురువెందలతలగుంపు. అలసవాతపోతప్రచారంబునన్.— అలసవాతపోత=మందమారుతముయొక్క; ప్రచారంబువలనన్=సంచారమువలన. కౌఁగిలింపన్=ఆలింగనము సేయఁగా. అవారితసుమనోవికాసంబునన్ = అడ్డగింపఁబడని కుసుమవికాసమువలన. పొలుపుగాంచుకురువకలతావలయంబులవలనన్=అంద మగుగోరంట తీవలవలయముల వలనను, ‘‘ఆలిఙ్గనేన కురవో హరిణేక్షణానా మామోదగౌరవభృతో భువి సర్వ ఏవ’’ అనుట వలన హరిణేక్షణాలింగనమే కురవకామోదహేతు వైనను వాసంతికాజాతంబునందే స్త్రీలింగమహిమచే స్త్రీజాతత్వారోపమున విచ్ఛిత్తివిశేషము నపేక్షించి యిట్లు కవి వచించె. ఇట్లు మఱికొన్ని దోహదము లిందు వచింపఁబడిన యవి. కురువకలతావలయ వల్లవపల్లవాధరా మండలమధ్యస్థలసందర్శనీయ పురందర శిలాశిఖర నందనందన సంభృతరంజిత వేణుదండాయమాన మానితకటక వాలవాయజ నూత్నానుబింబంబులు.— కురువకలతావలయ=గోరంటలతల గుంపనెడు ; వల్లవపల్లవాధరామండల=యాదవాంగనల గుంపుయొక్క;

మధ్యస్థల=మధ్యభాగమందు; సందర్శనీయ=చూడ సొంపయినట్టి; పురందరశిలాశిఖర=ఇంద్రనీలమణిమయ శిఖరమనెడు; నందనందన=కృష్ణునిచేత; సంభృత=భరింపఁబడిన; రంజిత=ప్రకాశించునట్టి; వేణుదండాయమాన=వేణుదండమువలె నాచరించుచున్న; మానిత=పూజితమగు; కటక=నితంబప్రదేశమందలి; వాలవాయజ సూత్ర=సూత్రాకారమగు వైడూర్యముయొక్క "వైడూర్యం వాలవాయజమ్" అని యమరుఁడు. అనుబింబంబులు=ప్రతిబింబములను. అహిరూపంబులుగాన్=సర్పములుగా. ఎఱింగి=తెలిసికొని. ఉప్పొంగి=విజృంభించి. చెంగున నెగసి=చెంగున పైకి లేచి, చెంగనునది ధ్వన్యనుకరణ శబ్దము. చరణంబులన్ ద్రొక్కిపట్టి=పాదముల చేతఁ ద్రొక్కిపట్టి. చంచూపుటంబులన్=ముక్కులయొక్క యగ్రభాగముల చేత. చించి=ప్రబ్బలుచేసి. ఱెక్కలన్=పక్షముల చేత. అడిచి=కొట్టి. ఏమియున్ తేరకున్నన్=ఏమియు తేటపడకుండఁగా. విస్మయంబు=ఆశ్చర్యము. మనంబు=మనస్సును. బెరయన్=పొందఁగా. విఫలప్రయత్నంబులువై=నిష్ఫలప్రయత్నములుగలవై. పుడమిన్=భూమియందు. ప్రాలుకాంతార మయూర దారకంబులన్=పడుచుండిన వనమయూరముల బిడ్డలను. చొచ్చి=చేరి. కికాకీక కేలిన్=ఇట్టి ధ్వనివిశేషములోఁ గూడిన క్రీడను. నల్పు గరుడసరోజముఖీనికరంబుల దరస్మితవిలాసంబునన్.—నల్పు=చేయునట్టి; గరుడసరోజముఖీ=గరుడస్త్రీలయొక్క; నికరంబుల=గుంపులయొక్క; దరస్మిత విలాసంబునన్=మందహాసవిలాసము చేత, సమధిక పథిక చేతస్తాపసంవర్ధక ప్రసవామోదపరంపరలన్.—సమధిక=మిక్కిలి యధికమైనట్లుగా; పథిక=పాంథులయొక్క; చేతస్తాప=మనస్సంతాపమునకు; సంవర్ధక=మిక్కిలి వర్ధకమగునట్టి; ప్రసవ=పుష్పములయొక్క; ఆమోద=పరిమళముయొక్క; పరంపరలన్=సమూహముల చేత. చెన్నుమీఱు పున్నాగ పూగంబులవలనన్=ప్రకాశించు పొన్నలగుంపులవలనను. పున్నాగపూగ మధుసాల రసాలముఖ్య దివ్యతర్వంతరంబునన్.—పున్నాగ=పొన్నలు; పూగ=పోఁకలు; మధు=ఇప్పలు; సాల=ఏపెలు; రసాల=తీయమావులు; ముఖ్య=మొదలుగాఁగల; దివ్య=లోకోత్తరములగు; తరు=వృక్షములయొక్క; అంతరంబునన్=మధ్యభాగమున; మంజులకంజరాగ భిత్తిభాగమరీచిపుంజంబు.—మంజుల=మనోజ్ఞమగు; కంజరాగ=పద్మరాగమణులయొక్క; భిత్తిభాగ=గోడలయొక్క ప్రదేశ సంబంధులగు; మరీచి=కాంతులయొక్క; పుంజంబు=గుంపు; భాస్వదాతప ప్రాబల్య ఖంజనంబును.—భాస్వదాతప=సూర్యాతపముయొక్క; ప్రాబల్య=అతిశయముయొక్క; ఖంజనంబును=నిలుకడను. "ఖజి గతివైకల్యే" అని యనుశాసనంబు. ఖండనంబు నను పాఠముస్పష్టార్థకము. పద్మరాగభిత్తి కాంతిపుంజము వృద్ధాతపమును బోలియున్నదనుట. శాతకుంభ కుంభవిభాడంబరంబు.—శాతకుంభకుంభ=కనకకలశముల యొక్క; విభా=విశేష కాంతియొక్క; ఆడంబరంబు=విజృంభణము. సంధ్యారాగారంభంబును=సంధ్యాకాలిక రాగము యొక్క ప్రాదుర్భావమును. వలభిన్మణి వలభిరుచిర రుచిపూరంబు.—వలభిన్మణి=ఇంద్రనీలమణులయొక్క; వలభి=చంద్రశాలలయొక్క; రుచిర=మనోహరమగు; రుచి=కాంతులయొక్క; పూరంబు=గుంపు. నిబిడ తిమిరవివర్ధనంబును=దట్టమైన చీకటికి ఛేదనమును, ముక్తోల్లోలవిభాసారంబు.— ముక్తా=ముత్తియములయొక్క; ఉల్లోల=మిక్కిలి తరలమైన; విభా=విశేష కాంతియొక్క; సారంబు=స్థిరాం

శము. "ముక్తాఫలేషు చ్ఛాయాయా స్తరళత్వమివాన్తరా" అని ముత్యములయందు తరళత్వము లావణ్యలక్షణమున రసార్ణవసుధాకరములోఁ జెప్పఁబడినది అది పూర్వము వ్రాయఁబడియె. తారకానిసర్గంబును=నక్షత్రస్వభావమును. భూరిస్తంభసంగ్రథిత హీరదర్పణ ద్యుతిజాతంబు.—భూరిస్తంభ=సువర్ణస్తంభములయందు; సంగ్రథిత=కట్టఁబడిన; హీరదర్పణ=వజ్రదర్పణములయొక్క; ద్యుతిజాతంబు=కాంతిపుంజము. నిస్తంద్ర చంద్రికా కల్పనంబును.—నిస్తంద్ర=జాగరూకమైన అనఁగా తేజరిల్లునట్టి; చంద్రికా=వెన్నెలయొక్క; కల్పనంబును=ఉత్పాదనమును. కావింపన్=చేయఁగా. అక్షీణక్షణదైకవిలసనంబునన్.—అక్షీణ=అధికమగు; క్షణదా=రాత్రియొక్క; ఏక=ముఖ్యమగు; విలసనంబునన్=ప్రకాశముచేత. పొలుచుకేళికాహర్మ్యంబునన్=ఒప్పుచున్న క్రీడాసౌధమునందు. మిక్కిలి = అతిశయముగునట్లుగా. పిక్కటిల్లుమక్కువన్.—పిక్కటిల్లు=వృద్ధిబొందునట్టి; మక్కువన్=ప్రేమచేత. చక్కెరవిల్తుజగడంబులన్=మదనకదనములయందు. మగలన్=భర్తలను. చొక్కించి = సుఖపరవశులను జేసి. ఆత్మీయ పుంభావభావనాసంభూతశ్రమంబు.—ఆత్మీయ=తమసంబంధియైన; పుంభావ=పురుషాయితముయొక్క; సంభావనా=నిష్పాదనమువలన; సంభూత=పుట్టినట్టి; శ్రమంబు=ఖేదము. తూలన్=తొలఁగుటకు. చెంగటివనులన్=సమీపములందలివనములయందు. సంచరించునాగకన్యావతంసంబులయాగాఢనిశ్శ్వాససమీరంబులన్.—సంచరించు=విహరించుచున్న; నాగకన్యావతంసంబుల=శ్రేష్ఠలగునాగకన్యకలయొక్క; ఆగాఢ=మిక్కిలిదట్టమగు; నిశ్శ్వాససమీరణంబులన్=నిశ్శ్వాసవాయువులచేత. తోరంబగుసిరిన్=అధికమైనపుష్పఫలసంపదచేత. ఒప్పారుసిందువారంబుల వలనన్=ఒప్పుచున్న వావిలిచెట్లవలనను. సిందువారాదినగ వారశిలాతలంబులన్.—సిందువారాదినగవార=వావిల్లుమొదలగు చెట్లసమూహములుగల; శిలా=పాషాణములయొక్క; తలంబులన్=ప్రదేశములయందు. ఉరులు=మృగబంధనములు. తాల్చియున్=ధరించియు. నెత్తమ్ములన్=పర్వతములమీఁదిసమప్రదేశములయందు. ఇమ్ముగాన్=ఇంపుగా. ప్రవహించుసెలయేఱులపైన్=ప్రవహించుచున్న సెలయేఱులమీఁద. వలలు=బంధనరజ్జువులను. చేర్చియున్=ఉంచియును. స్వజాతిద్విజాతులన్=తమజాతిపక్షులను. రాఁబిల్చుపులుఁగులన్=చేరఁబిలుచుచున్న పక్షులయందు. దీములన్=పక్షులులో నగువానిం బట్టుటకై పెంపఁబడినపక్షులలోనగువానిని. కట్టి=బంధించి. జిగురుఁగండెలు=జిగురుతోఁగూడినపేనినదారపుఁగండెలను. అమర్చియున్=సిద్ధముచేసియు. విచిత్రతరవనపతత్త్రిగోత్రంబులన్=నానావర్ణములుగలవనపక్షులగుంపులను. పట్టుకొనుతలంపునన్=గ్రహించునుద్దేశమున. మెండైనపొదలన్=గొప్పవైనపొదలయందు. ఉండి=వసించి. అప్పటప్పటికిన్=ప్రతిక్షణమందు. వానిన్=ఆయురులుమొదలుగాఁగలవానిని. కానన్=చూచుటకు. తమకించి=త్వరపడి. చెంచెతలు=చెంచుస్త్రీలు. ఎత్తునెమ్మొగంబుల తమ్మిచాయలన్=ఎత్తునట్టి సుందరమైన ముఖపద్మములయొక్క కాంతులచేత. వసంతసమయ సముదితసౌభాగ్యమ్మునన్.—వసంతసమయ=వసంతకాలమందు; సముదిత=ఉదయించిన ; సౌభాగ్యమ్మునన్=విభవాతిశయముచేత. పొదలుచాంపేయధాత్రీరుహంబులవలనన్=ఒప్పుచున్న సంపెఁగచెట్లవలనను. చాంపేయధాత్రీరుహకుసుమగళిత పరాగరాశిమధురసనదీపులినదేశమ్మునన్.—చాంపేయధాత్రీరుహ = సంపెఁగచెట్లయొక్క ; కుసుమ = పువ్వుల

వలన; గలిత=జాఱినట్టి; పరాగరాశి=పుప్పొడిసమూహమనెడు; మధురసనదీపులిన=మకరందనదీసైకతముయొక్క. దేశమ్మునన్=ప్రదేశమునందు. కపురంపుటనంటులేయాకు=కర్పూరపుటనంటిలేఁతయాకును. పఱచి. మరకతమకరకేతనాహితమూర్తిన్ =మరకతమణిమయమగుశివమూర్తిని. నిలిపి=స్థాపించి. తదేకపూజాతాత్పర్యంబునన్ —తత్= ఆసాంబమూర్తియొక్క; ఏక=ముఖ్యమగు; పూజా=పూజయందలి; తాత్పర్యంబునన్ = ఆసక్తిచేత. ఉన్నసద్గణోత్తములకున్=ఉండునట్టి ప్రమథశ్రేష్ఠులకు. విరులొసంగునంతరంగంబునన్=పువ్వుల నిచ్చుమనస్సుచేత. ప్రమదావనంబు=ఉద్యానవనమును. చొచ్చి=ప్రవేశించి. ప్రమథమధురోష్ఠీతల్లజంబులు=ప్రశస్తమైనప్రమథాంగనలు. కేలన్=హస్తములచేత. ఊఁది=ఊనుకొని. నిక్కి=మీఁదికిసాఁగి. విటపాంతరాభివేష్టిత మల్లికాప్రసూనంబులన్ —విటపాంతర = శాఖాంతరములయందు; అభివేష్టిత=చుట్టుకొనియుండునట్టి; మల్లికా = మల్లికాలతలయొక్క; ప్రసూనంబులన్=పువ్వములను. కోయునెడన్=కోయుసమయమున. తత్కరసంయోగంబువలనన్=ఆప్రమథస్త్రీకరసంపర్కమువలన. నిజేష్టఫలలాభంబు=తమకిష్టమైన ఫలములయొక్కలాభము. చేకూరెనో యనన్=ఘటిల్లెనోయనునట్లు. రమ్యఫలంబులన్ = మనోహరము లగుపండ్లచేతను, లాభములచేతను. పెంపొందుమాకందంబులవలనన్ = వృద్ధిఁబొందుమావులవలనను. మాకందవాసనాభివాసితపవమానప్లవమాననీలాశోకరజస్తోమంబు.—మాకంద = రసాలపుష్పములయొక్క; వాసనా=పరిమళముచేత; అభివాసిత=వలచునట్టి; పవమాన = వాయువుచేత; ప్లవమాన=తేలియాడుచున్న; నీలాశోకరజః = నల్లనియశోకకుసుమముల పరాగముయొక్క; స్తోమంబు=సమూహము. ప్రవర్గ్యోపక్రమనిర్గచ్ఛద్ధూమవర్తనంబునన్.—ప్రవర్గ్య=అగ్నిష్టోమాద్యంగవిశేషహోమముయొక్క; ఉపక్రమ=ప్రారంభమందు; నిర్గచ్ఛత్=వెడలివచ్చుచున్న; ధూమ=పొగయొక్క; వర్తనంబునన్=వృత్తివంటివృత్తిచేత. పర్వన్=వ్యాపింపఁగా. అమందానందకందళితచిత్తారవిందంబులతోన్.— అమందానంద = అధికానందముచేత; కందళిత=అంకురించినట్టి; చిత్తారవిందంబులతోన్=చిత్తములనెడునరవిందములతోడ. ముందుముందుగన్=తొలుతొల్త. పఱతెంచుపురందరాదిబృందారకవర్గంబులతనూశ్రమంబు.—పఱతెంచు=పరుగెత్తివచ్చునట్టి; పురందరాదిబృందారకవర్గంబుల=ఇంద్రుఁడుమొదలగుదేవతలబృందములయొక్క; తనూశ్రమంబు=దేహశ్రమము. తెరలన్=పోవునట్లు. చేయుశీతలతరతాపసాశ్రమ నానావిధవసుధారుహ నివహంబులచెంతలన్.— చేయు = చేయునట్టి; శీతలతర=మిక్కిలిచల్లనైన; తాపసాశ్రమ=మున్యాశ్రమములయందలి; నానావిధవసుధారుహ=అనేకవిధములయిన వృక్షములయొక్క; నివహంబులచెంతలన్=సమూహముల సమీపప్రదేశములయందు. తదీయశాఖాప్రసవముఖనిష్ఠ్యూతమధుపాళికన్.— తదీయ = వానిసంబంధిను లగు; శాఖా = కొమ్మ లనెడుస్త్రీలయొక్క యని శాఖాశబ్దగతస్త్రీలింగమునఁ జెప్పవలయు. స్త్రీముఖనిష్ఠ్యూతగండూషము వకుళమునకు దోహదముగాఁ జెప్పఁబడియుండెఁగదా. ప్రసవముఖ = పువ్వు లనెడుముఖములవలన; నిష్ఠ్యూత = ఉమియఁబడిన; మధు = మకరందముయొక్క; పాళికన్=సమూహముచేత. ప్రసవితంబులు= పుష్పించియున్నయవి. అగువిశారదవిటపిపటలంబులవలనను = అగునట్టి పొగడమ్రాఁకులసమూహములవలనను. “విశారదో మధ్యగన్ధో

వకుళస్సచకేసరః'' అనిరత్నమాల. వలనుమిగిలి=ఒప్పి. మేరుధరంబునుంబోలెక్ = మేరుపర్వతమువలె. శక్రపురాతిభాసురంబును=ఇంద్రపురముచే భాసిల్లునది. శక్ర=మద్దిచెట్ల చేతను; పుర=గుగ్గిలపుఁజెట్లచేతను; అతిభాసురంబు=మిక్కిలిప్రకాశించునదియని భావము. "శక్రో మహేన్ద్రే హేమాద్రౌ కుటజేఽర్జునభూరుహే'' అనియు, "పురంపురిశరీరేచ గుగ్గిలే కథితఃపురః'' అనియు విశ్వము. హిమవన్నగంబునుంబోలెక్ =హిమవత్పర్వతంబువలె. గోభృత్కార్ముకాన్వితకాలికాతిశోభితంబును.— గోభృత్కార్ముక=శివునితోడను;త్రిపురవధకాలమునఁ శివునకు మేరువు ధనువగుట ప్రసిద్ధము. అన్వితయైన. కాలికా=పార్వతిచేత నతిశోభితంబును. గోభృత్కార్ముక=ఇంద్రధనువుతోడ; అన్విత=కూడుకొన్న; కాలికా=మేఘపంక్తిచేత;అతిశోభితంబును=మిక్కిలిప్రకాశమానమును. మందరధరంబునుంబోలెక్=మందరపర్వతమువలె. వ్యాళాధిరాజపరివేష్టితంబును.—వ్యాళాధిరాజ=వాసుకిచేతను, దుష్టగజశ్రేష్ఠముచేతను; పరివేష్టితంబు=చుట్టుకొనఁబడినదియు. ఋశ్యమూకాద్రియుంబోలెక్=ఋశ్యమూకపర్వతమువలె. హరిజాతికలితంబును=కపిసంఘముతోఁగూడినదియు, సింహసంఘముతోఁగూడినదియు.మాల్యవద్గోత్రంబునుంబోలెక్=మాల్యవత్పర్వతమువలె. రామసంచారసంగతంబును.—రామ=రామభద్రునియొక్క, పశువిశేషముయొక్క "రామః పశువిశేషేస్యాత్'' అని విశ్వము. సంచార=సంచరణముచేత; సంగతంబును=కూడుకొన్నదియు. నీలాచలంబునుంబోలెక్ = నీలాద్రివలె. పురుషోత్తమభూషితంబును = సర్వేశ్వరునిచేత, మంచిపొన్నలచేత భూషింపఁబడినదియు. గంధమాదనగ్రావంబునుంబోలెక్ = గందమాదన పర్వతమువలె. "గ్రావాణౌ శైలపాషాణౌ'' అని యమరుఁడు మహావరాహ పాళికాలింగితంబును.— విష్ణుమూర్తియొక్క చిహ్నముతోఁ గూడుకొన్నదియు. "మహావరాహో గోవిన్ద స్సుషేణః కనకాఙ్గదీ'' అని విష్ణుసహస్రనామము. మహత్=గొప్పలైన; వరాహపాళీ=పందుల గుంపుతో; ఆలింగితంబును = కూడుకొన్నదియు. సమామోదసంకలితశ్యామామహితంబు అయ్యుక్.— సమ=అనురూపమైన; ఆమోద=సంతసముతో; సంకలిత=కూడుకొన్న; శ్యామా=యౌవనమధ్యస్థలగుస్త్రీలచేత; మహితంబు=ఒప్పుచున్నది. అయ్యును. అసమామోదసంకలితశ్యామామహితంబు ఐ.—అసమామోద=సరిలేనిపరిమళముతోడ; సంకలిత=కూడుకొన్న;శ్యామా=ప్రేంకణపుఁదీవలచేత; "శ్యామాతుమహిళాహ్వయా'' అని యమరుఁడు. మహితంబుఐ, విరోధాభాసాలంకారము. వీనఘనార్భటివిఘూర్ణితమహాబిలం బయ్యును.—వీన=పక్షిశ్రేష్ఠములయొక్క; ఘన=గొప్పలైన; ఆర్భటి=ధ్వనులచేత; విఘూర్ణిత=వ్యాప్తమైన; మహాబిలంబు= గొప్పగుహలుగలది, అయ్యును. నవీనఘనార్భటివిఘూర్ణితమహాబిలంబై.—నవీన= క్రొత్తలగు; ఘన=మేఘములయొక్క; ఆర్భటులచే విఘూర్ణితమైన మహాబిలంబు = ఆకాశముగలదైఅని విరోధపరిహారము. మరాళికాశ్రితకటకస్థలవనజాతంబు అయ్యును.—మరాళికా = పెంటియంచలచేత; ఆశ్రిత=ఆశ్రయింపఁబడిన ; కటకస్థల=పర్వతనితంబప్రదేశములందలి ; వనజాతంబును=జలపూరంబు గలదయ్యును. అమరాళికాశ్రితకటకస్థలవనజాతంబుఐ.— అమరాళికా= దేవపరంపరలచేత,ఆశ్రితము లై కటకస్థలములయందుండునరణ్యసమూహములుగలదై. సద్భల్లూకరాజసారంగసంతానసంకులితంబయ్యును.— సద్భల్లూకరాజ=మంచి భల్లూకముఖ్యములయొక్క;

సారంగ=లేళ్లయొక్క; సంతాన=సంతతులచేత; సంకులితంబు = వ్యాకులముగఁ జేయఁబడినద య్యును. అసదృక్షరాజసారంగసంతానసంకులితంబై.—అసదృక్ష=సరిలేని; రాజసారంగ=శ్రేష్ఠగజములయొక్క, సంతానములచేత సంకులితం బై. కాలాహితసుమనోనగ భాసమానం బయ్యును.—కాలాహిత=యమశత్రువైన; సుమనః=దేవునియొక్క, శివునియొక్క యనుట. నగ=పర్వత మగు కైలాసముభంగి; భాసమానంబుఅయ్యును=ప్రకాశమానమయ్యును. అకాలాహితసుమనోనగ భాసమానమై= అకాలమందుదయించిన పువ్వులుగలవృక్షములచేత భాసమానంబై. ఒప్పుచున్న యది=ప్రకాశించుచున్న యది. విలోకింపుము=చూడుము.

చ. అని లలితోక్తి నాప్రియవ♦యస్యశిఖామణిచిత్తసీమఁ బా
యనిలలితోఁ దదద్రిమహి♦మాతిశయం బెఱిఁగింప నప్పు డా
మనుకులరాజమౌళి బిల♦మండలిచొక్కపుఁదీవెయింటిమేల్
మనుకులరాజకాంతతట♦మార్గములం గనుగొంచు నేఁగుచున్. 19

టీ. అని=ఇట్లని. లలితోక్తిన్=మనోజ్ఞమైనవాక్కుచేత. ఆప్రియవయస్యశిఖామణి=ఆప్రియసఖరత్నం బైనకుముదుండు. చిత్తసీమన్=హృదయసీమను. పాయనిలలితోన్=వదలనిప్రీతితోడ. తదద్రిమహిమాతిశయంబు = ఆహేమకూటముయొక్క మహిమాతిశయమును. ఎఱిఁగింపన్=తెలుపఁగా. అప్పుడు=ఆసమయమున. ఆమనుకులరాజమౌళి = మనువంశపురాజులలో శ్రేష్ఠుం డగునాసుచంద్రుఁడు. బిలమండలిచొక్కపుఁదీవెయింటిమేల్మనుకులరాజకాంతతటమార్గములన్.—బిలమండలి=గుహాచయముయొక్క; చొక్కపు=శ్రేష్ఠమగు; తీవెయింటి=లతాగృహములయొక్క; మేల్=అతిశయముచేత; మను=వర్తించునట్టి; కుల=కులీనములైన; రాజకాంత=చంద్రకాంతమణులయొక్క; తట=ప్రదేశములయొక్క; మార్గములన్=త్రోవలను. కనుఁగొంచున్=చూచుచు. ఏఁగుచున్=పోవుచు. దీనికి ముందుపద్యమం దున్నకోనఁగనియెన్ అనుక్రియతో నన్వయము.

సుచంద్రుఁడు చూచుచు నేఁగుచున్న గుహామార్గములు చంద్రకాంతమణిఖచితములై యిరుప్రక్కల లతాగృహములచే నావరింపఁబడిన వనిభావము.

సీ. కల్పైండవెడఁదకాఁ♦కఁ గఱంగి ప్రవహించు, జవ్వాదిడిగ్గియ♦చాలలోయఁ
బడుచుఁ జొక్కపుఁగ్రొత్త♦పటికంపుఁజటిపజ్జ,బాగైనకెంపురా♦పణుకువాలుఁ
బొదరుఁబొన్నలరాలు♦పుప్పొడియిసుములపైఁ,బగిలియొప్పెడువేరు♦పనసపంటి
నీటికాల్వలఁ బ్రోచి ♦ పాటించుజేజేల, మ్రాఁకుతీవలఁజుట్టి ♦ రాఁగ నలరు

తే. దాకపందిలిక్రింద ని♦ద్దంపువేడ్క
దవిలి కోలాట మాడుగం♦ధర్వసతుల
చారుసౌవర్ణకటకసిం♦జానినాద
కులఘుమఘుమాయమాన మా♦కోనఁ గనియె. 20

టీ. కట్టెండవెడఁదకాఁకన్.—కట్టెండ=అధికమైనయెండయొక్క; వెడఁద=విశాలమగు; కాఁకన్=వేఁడిచేత. కఱఁగి=ద్రవించి. ప్రవహించుజవాదిడిగ్గియ.—ప్రవహించు=ప్రవహించునట్టి; జవ్వాది=సంకుమదముయొక్క; డిగ్గియ = నడబావి. చాలన్ = మిక్కిలి. లోయన్ = కొండనడిమిచీలికయందు. పడుచున్ = పడినట్టిదగుచు. చొక్కపుఁగ్రొత్తపటికంపుచటిపజ్జన్.—చొక్కపు=ఉత్తమమైన; పటికంపు=స్ఫటికములయొక్క; చటి=తటముయొక్క; పజ్జన్=సమీపమున. బాగైనకెంపుఠాపణుకువాలు.—బాగైన=అందమైన; కెంపురా=పద్మరాగమణులయొక్క; పణుకు = సందులందలి; వాలు = దీర్ఘమైన. పొదరుఁబొన్నలన్ = పొదలైన పున్నాగములవలన. రాలుపుప్పొడియిసుమపైన్ = పడు చుండినపుప్పొడియనునిసుకపై. పగిలి=బ్రద్దలై. ఒప్పెడువేరుపనసపంటినీటికాల్వలన్.— ఒప్పెడు= ప్రకాశించునట్టి; వేరుపనస=వేరుపనసలయొక్క; పంటి=ఫలసంబంధి యగు; నీటికాల్వలన్=జలప్రవాహములవలన. ప్రోచి=పోషించి. పాటించుజేజేలమ్రాఁకుతీవలన్ = ఆదరించుచున్నకల్పవృక్షములతీవలను. చుట్టి రాఁగన్=పరివేష్టించిరాఁగా. అలరుదాకపందిలిక్రిందన్=ఒప్పుచున్నద్రాక్షపందిలియొక్కక్రిందను. నిద్దంపువేడ్కన్ = స్నేహయుక్తమైనవేడుకను. తవిలి=పొంది, కోలాటము=క్రీడావిశేషమును. ఆడుగంధర్వసతులచారుసౌవర్ణకటకశింజానినాదకులఘుమఘుమాయమానము.—ఆడు=ఆడుచున్న; గంధర్వసతుల=గంధర్వస్త్రీలయొక్క; చారు=సుందరమగు; సౌవర్ణకటక=బంగరుకడియములయొక్క; శింజా=చిన్నగంటలయొక్క; నినాదకుల=ధ్వనిసమూహము చేత; ఘుమఘుమాయమానము=ఘుమఘుమయనధ్వనిగలయట్టిది; ఔ కోనన్=అగునట్టిపర్వతమందలిరహస్యప్రదేశమును. కనియెన్=చూచెను.

ఎండకాఁకచే కఱఁగిప్రవహించునట్టిజవ్వాజిచే నేర్పడినడిగ్గియ, పటికపుఁ జతిదగ్గ అనున్నకెంపురాలపణుకులయ్యందు పొదలై పెరిఁగి యున్నపొన్నచెట్లనుండి రాలినపుప్పొడియిసుకమీఁదనున్నవేరుపనసపండ్లరసములకాల్వలను, పోషించి కల్పవృక్షపుఁదీవలను ఆదరించును. అట్టికల్పవృక్షపుదీవలను చుట్టుకొని వృద్ధిఁ బొందునట్టిద్రాక్షపందిళ్లక్రింద గంధర్వస్త్రీలు కోలాట మాడునట్టి కోనను చూచె ననిభావము.

లయగ్రాహి.

మానితనవీనకిస • లానురతికానఘపి • కీనిచయగానముల • చే నళినికానీ
కానుగతమానసచ • రీనిరుపమానరుతి • చే నళికులీనవని • తానికరనానా
ధ్యానములచే ననిల • యానమునఁ బైనిగుడు • సూనతతి తేనియల • సోనరొదచే నిం
పైనయలకోన గని • యానృపతి దానెనసె • మానసతటీనివిశ • మానముదమంతన్.

టీ. మానితనవీనకిసలానురతికానఘపికీనిచయగానములచేన్.—మానిత=శ్రేష్ఠమగు; నవీన=నూతనమైన; కిసల = పల్లవములయందు; "కిసాలం కిసలం కిసమ్" అనిద్విరూపకోశము. అనురతిక=అనురక్తి గలిగినట్టి; అనఘ=ఒచ్చెములేనట్టి; పికీనిచయ=కోకిలస్త్రీలగుంపుయొక్క; గానములచేన్ = గీతములచేతను. నళినికానీకానుగతమానసచరీనిరుపమానరుతిచేన్.—నళినికా=పద్మలతలయొక్క; అనీక=సంఘములను; అనుగత=అనుసరించినట్టి; మానసచరీ=హంసస్త్రీల

యొక్క; నిరుపమాన=సాటిలేనట్టి; రుతిచేన్=ధ్వనిచేతను. అళికులీనవనితానికరనానాధ్వానములచేన్.—అళి=తుమ్మెదలయొక్క; కులీనవనితా=కులస్త్రీలయొక్క, ఆడుతుమ్మెదలయొక్క యనుట. నికర=సమూహముయొక్క; నానా=అనేకప్రకారములగు; ధ్వానములచేన్=నాదములచేతను. అనిలయానమునన్=వాతప్రచారముచేత. పైన్=మీఁదను; నిగుడుసూనతతితేనియలసోనరొదచేన్.—నిగుడు=వ్యాపించునట్టి; సూనతతితేనియలసోన=పూగుత్తులతేనియలవానయొక్క; రొదచేన్=ధ్వనిచేతను. ఇంపైనయలకోనన్=సొంపైనట్టియాకోనను. కని=చూచి. ఆనృపతి=ఆసుచంద్రుఁడు. మానసతటీనివిశమానముదము.—మానసతటీ=హృదయప్రదేశమును; నివిశమాన=ప్రవేశించుచున్న; ముదము=ఆనందము. అందన్=అంతటను. గాన్. ఎనసెన్=పొందెను.

తే. ఇట్టు లక్కోన నెనసి త•దీయచిత్ర
మహిమ మెంతయుఁ గాంచుచు • మనుజనేత
తళుకుఁ బ్రాఁగెంపుమెట్టుల • దాఁరి డిగ్గి
యాత్మహితుతోడ నొయ్యన • యరుగ నచట. 22

టీ. మనుజనేత=సుచంద్రుండు. ఇట్టులు=ఈప్రకారమున. అక్కోనన్=ఆకోనను. ఎనసి=పొంది. తదీయచిత్రమహిమము=ఆకోనకు సంబంధించిన చిత్రమైనమహిమను. ఎంతయున్=మిక్కిలి. కాంచుచున్=అవలోకించుచు. తళుకుఁబ్రాఁగెంపుమెట్టులదారిన్.—తళుకు=ప్రకాశించుచున్న; ప్రాఁగెంపు=చిరంతనపద్మరాగములయొక్క; మెట్టులదారిన్=సోపానమార్గమునుండి. డిగ్గి=దిగి. ఆత్మహితుతోడన్=తనచెలికానితోడ. ఒయ్యన=తిన్నగ. అరుగన్=పోవుచుండఁగా. అచ్చటన్=ఆప్రదేశమందు. దీనికుత్తరపద్యముతో నన్వయము.

చ. పగడపుఁగంబముల్ తళుకుఁ•బచ్చలబోదెలు కెంపుదూలముల్
జగమగఱాల దెంచికలు • చక్కనినీలపుఁబల్కచాల్ మెఱుం
గగుతెలిమిన్నలోవయును • నచ్చపుబంగరుపేరరంగునం
దగఁ గనుపట్టునొక్కవిక•సన్మణిమండప మప్డు దోఁపఁగన్. 23

టీ. పగడపుఁగంబముల్=విద్రుమస్తంభములు. తళుకుఁబచ్చలబోదెలు.—తళుకు=ప్రకాశించు చున్న; పచ్చల=గారుత్మతమణులయొక్క; బోదెలు=స్తంభముమీఁదనుంచునవయవవిశేషములు. కెంపుదూలముల్=పద్మరాగమణులదూలములు. జగమగరాలదెంచికలు.—జగ=శ్రేష్ఠములగు; మగఱాల=వజ్రములయొక్క; దెంచికలు=దూలములమీఁద నడ్డముగా నుంపఁబడుగృహావయవవిశేషములు. చక్కనినీలపుఁబల్కచాల్.—చక్కని=అందమైన; నీలపు=నీలమణులయొక్క. పల్కచాల్=దెంచికలమీఁదవేయఁబడుపలుకలచాలు. మెఱుంగగుతెలిమిన్నలోవయును.—మెఱుంగగు=ప్రకాశించుచున్న; తెలిమిన్న=స్ఫటికములయొక్క; లోవయును=చూరును. తగన్=ఒప్పుచుండఁగా. అచ్చపుబంగరుపేరరంగునన్.—అచ్చపు=శ్రేష్ఠమగు; బంగరు=సువర్ణముయొక్క; పేరరంగునన్=విశాలమైనవేదికయందు. కనుపట్టునొ

కన్పడు సన్మణిమండపము=కనఁబడునట్టి యొకప్రకాశమానమణిమయమగుమందిరము. అప్డు=ఆసమయమందు. తోఁపఁగన్ = అగపడుచుండఁగా. దీనికివసించె ననునుత్తరపద్యస్థక్రియతో నన్వయము. ఇందుదాత్తాలంకారము. "ఉదాత్తమృద్ధే శ్చరితం శ్లాఘ్యం చాన్యోపలక్షణమ్" అని తల్లక్షణము.

చ. కనుఁగొని యానృపాలరతి♦కాంతుఁడు విస్మయ మంతరంబులో
నెనయఁగ నోవయస్య మన ♦ మిచ్చట ని_ల్తమె కొంతప్రొద్దటం
చనువుగ మందయానమున ♦ నమ్మణిమండపవాళిఁ జేరి యం
దొనరఁగ రత్నపీఠి ముద ♦ మొప్ప వసించె వసించునంతటన్. 24

టీ. కనుఁగొని=చూచి. ఆనృపాలరతికాంతుఁడు=ఆసుచంద్రుఁడు. విస్మయము=ఆశ్చర్యము. అంతరంబులోన్=హృదయమందు. ఎనయఁగన్=వృద్ధిఁబొందఁగా. ఓవయస్య= ఓసఖుఁడా. మనము. ఇచ్చటన్. కొంతప్రొద్దు=కొంతసేపు. నిల్తమె=వసింతమా. అటంచున్=అని చెప్పుచు. అనువుగన్=అనుకూలముగా. మందయానమునన్=తిన్ననిగమనము చేత. అమ్మణిమండపవాళిన్=ఆమణిమయమండపశ్రేష్ఠమును. చేరి=పొంది. అందున్=అమంటపమందు. ఒనరఁగన్=ఇంపుగను. రత్నపీఠిన్=రత్నమయమైనపీఁటయందు. ముదముఒప్పన్=సంతసమొప్పఁగా. వసించెన్=కూర్చుండెను. వసించునంతటన్=కూర్చుండినంతలో. దీనికి ముందు పద్యముతో నన్వయము.

సీ. ఒకమణిపుత్రిక ♦ యొయ్యారమునఁ జేరి
కపురంపువలపుబా♦గా లొసంగె,
నొకసాలభంజిక ♦ యుద్దిరిపువ్వుల కెంపుఁ
బావడ నేరు పే♦ర్పడఁగ వీచె,
నొకవసుప్రతిమ యిం ♦ పూన్చు తెల్లని తావిఁ
బొదివించెడుకలాచి ♦ పూని నిలిచె,
నొక వోకాటపుబొమ్మ ♦ యొయ్య నెయ్యన పొన్న
విరిచాలు గూర్చిన♦సురటి విసరె,

తే. చిటులు పాంచాలికామణి♦పటల మూడి
గము లుచితరీతి దార్ప నా♦యమరకేళి
మండపశ్రీ నుతించుచు ♦ మనుజభర్త
దండఁ జెలి గొల్వ సుఖలీల ♦ నుండె నంత. 25

టీ. ఒకమణిపుత్రిక=ఒకమణిమయప్రతిమ. ఒయ్యారమునన్=విలాసమున. చేరి=సమీపమునకు వచ్చి. కపురంపువలపుబాగాలు.-కపురంపువలపు=కర్పూరపరిమళముగల; బాగాలు=వక్కపొడితోఁజేరినవిడెములు. ఒసంగెన్=ఇచ్చెను. ఒకసాలభంజిక = ఒకబొమ్మ. ఉదిరిపువ్వులకెంపుఁబావడన్=బంగరుపువ్వులుగలచెంగావివస్త్రముచేత. నేర్పు ఏర్పడఁగను=చాతు

ర్యమేర్పడునట్లు. వీచెన్=విసరెను. ఒకవసుప్రతిమ = ఒకబంగరుబొమ్మ. ఇంపూన్చు తెల్లని తావిఁబొదవించెడుకలాచి.-ఇంపూన్చు=అందమగు; తెల్లని=శుభ్రమగునట్టి; తావిఁబొదవించెడు= పరిమళమును బొందించునట్టి; కలాచి=తమ్మపడిగమును. పూని=గ్రహించి. నిలిచెన్. ఒకచ్ఛో కాటపుబొమ్మ=ఒకస్వచ్ఛమైనప్రతిమ. ఒయ్యనొయ్యన = తిన్నతిన్నఁగ. పొన్నవిరిచాలు = పొన్నపువ్వులగుంపు. కూర్చినసురటిన్=పొదివినవ్యజనముచేత. విసరెన్ =వీచెను. ఇటులు =ఈప్రకారము. పాంచాలికామణిపటలము = పాంచాలికాశ్రేష్ఠములగుంపు. పాడిగిసులు= ఉపచారములు. ఉచితరీతిన్=యోగ్యమైనరీతిచేత. తీర్పన్=చేయుచుండఁగ. అమరకే ళిమండపశ్రీన్.-అమర=దేవతలయొక్క; కేళిమండప=విలాసమందిరముయొక్క; శ్రీన్=సం పదను. నుతించుచున్=కొనియాడుచు. మనుజభర్త=సుచంద్రుఁడు. దండన్=సమీపమునం దు. చెలి=సఖుఁడు. కొలువన్=సేవించుచుండఁగ. సుఖలీలన్=సుఖముచేతనైనవిలాసము చేత. ఉండెన్=వసించెను. అంతన్=ఆసమయమందు. దీనికి వ్యవహితోత్తరపద్యమునందు న్న "ఒక్కసింగంబు వడిఁ బొదనుండి వెడలె" అనుదానితో నన్వయము.

చ. కరు లిల వ్రాల శంబరని♦కాయము దూలఁ దరక్షులోకము
లెవ్వెఱఁ బరువంద మత్తకద♦ళీచయముల్ బెగడొంద గండకో
త్కరములు స్రుక్క ఋక్షసము♦దాయము నెవ్వగఁ జిక్కఁ గీశము
ల్తరుతతి నీఁగ సూకరకు♦లంబులు డాఁగ మహాద్భుతంబుగాన్. 26

టీ. కరులు=ఏనుఁగులు. ఇలన్=భూమియందు. వ్రాలన్=పడుచుండఁగ. శంబరనికా యము.-శంబర=హరిణవిశేషములయొక్క "రఙ్కుశ్శమ్బరరోహిషః" అనిఅమరుఁడు. నికా యము=సమూహము. తూలన్=తొలఁగుచుండఁగ. తరక్షులోకముల్= సివంగుల గుంపులు. "తరక్షుస్తు మృగాదనః" అని అమరుఁడు. వెఱన్=భీతిచేత. పరువందన్=పాఱుచుండఁగ. మత్తకదళీచయముల్=మదించినయిఱ్ఱులగుంపులు. "కదళీకన్దళీచీనచ్చమూరుప్రియకావపి" అని అమరుఁడు. బెగడొందన్=భయపడఁగ. గండకోత్కరములు=ఖడ్గమృగసమూహములు. స్రుక్కన్=వెనుదీయఁగ. ఋక్షసముదాయము=ఎలుఁగులగుంపు "ఋక్షాచ్ఛభల్లభల్లూకాః" అని యమరుఁడు. నెవ్వగఁ జిక్కన్=మిక్కిలివిచారముచేఁ బట్టువడఁగా. కీశముల్=వానరములు. "వానరః కీశో వనౌకాః" అని అమరుఁడు. తరుతతిన్=వృక్షసమూహమందు. ఈఁగన్=తూఱఁగ. సూకరకులంబులు=అడవిపందులగుంపులు. డాఁగన్=దాఁగుచుండఁగ. మహాద్భుతంబుగాన్=అతివింతగ. ఈపద్యమున కుత్తరపద్యస్థక్రియతో నన్వయమని యెఱుంగునది.

సీ. అఖిలజంతునిఖాద♦నారూఢిమైఁ బోలె
నతివివృతంబైన♦యాస్య మమర,
నాశేభములఁ జీర్ప♦నట్టిసిబ్బితిఁ బోలె
నతిగన్ననఖరసం♦తతి వెలుంగ,
స్వమృగహింసావిహా♦రము గాంచరతిఁ బోలెఁ
దలపై నెగయువాల♦దండ మొనర,

నిగుడుకోపాంకుర♦నికరం బగుటఁబోలె
సితకేసరముల కెంజిగి చిగుర్ప,

తే. వక్రదంష్ట్రిలు శతకోటి♦వాదు గెలువ
వర్తులపుఁగన్నుఁగవ భాను♦వాసిఁ గేర
ఘుటఘుటార్భటి ఘనకోటి♦పటిమ దెగడ
నొక్కసింగంబు వడిఁ బొద♦నుండి వెడలె. 27

టీ. అఖిలజంతునిఖాదనారూఢిమైఁబోలెన్.—అఖిల=సమస్తమైన; జంతు=ప్రాణుల యొక్క; నిఖాదన=భక్షణముయొక్క; ఆరూఢిమైఁ బోలెన్=అలవాటుచేతబలె. అతివివృతంబు=అతివిశాలము. వినయాస్యము=వినట్టిముఖము. అమరన్=ఒప్పుచుండఁగ. ఆశేభములన్=దిగ్గజములను. చీర్వనట్టిసిబ్బితిఁబోలెన్ =బ్రద్దలుసేయనట్టిసిగ్గుచేతబలె. నతి=వంగుటను. కన్ననఖరసంతతి=పొందినగోళ్లసమూహము. వెలుంగన్=ప్రకాశింపఁగ. స్వమృగహింసావిహారము.—స్వమృగ=స్వజాతిమృగములయొక్క; హింసా=వధయనెడు;విహారము=క్రీడను. కాంచురతిఁబోలెన్=పొందుటయందు దాసక్తిచేతబలె. తలపైన్=శిరమునందు. ఎగయు=చేరియున్న. వాలదండము=దండముతో సమానమగువాలము. ఒనరన్=ఒప్పుచుండఁగ. నిగుడుకోపాంకురనికరంబగుటఁబోలెన్.—నిగుడు=వ్యాపించుచున్న; కోపాంకుర=కోపముయొక్క; అంకుర=మొలకలయొక్క;నికరంబు=సమూహము. అగుటఁబోలెన్=అగుటచేతంబలె, సితకేసరములన్.—సిత=తెల్లనగు; కేసరములన్=మెడమీఁదివెండ్రుకలయందు. కెంజిగి=రక్తకాంతి. చిగుర్పన్=ఉదయించుచుండఁగ. వక్రదంష్ట్రిలు=కుటిలమగుకోఱలు. శతకోటివాదు.— శతకోటి=వజ్రాయుధముయొక్క. వాదు=వాదమును. గెలువన్=గెలుచుచుండఁగ, అనఁగ కోఱలు వజ్రాయుధతుల్యముగ నున్నవనుట. వర్తులపుఁగన్నుఁగవ=గుండ్రమగుకనుదోయి. భానువాసిన్=సూర్యాధిక్యమును. కేరన్=పరిహసించుచుండఁగ. ఘుటఘుటార్భటి=ఘుటఘుటధ్వని. ఘనకోటిపటిమన్=మేఘబృందముయొక్క సామర్థ్యమును. తెగడన్=తిరస్కరింపఁగా. ఒక్కసింగంబు=ఒకసింహము. వడిన్=వేగముచేత. పొదనుండి. వెడలెన్=బయలుదేరెను. సమస్తమృగములను బెదరించుచు విశాలముఖము వంగినగోఱలు శిరస్సుయందు జేర్పఁబడినవాలము ఎఱ్ఱనికేసరాగ్రములు వజ్రాయుధతుల్యము లగుకోఱలును సూర్యబింబమును దిరస్కరించు కనుఁగవయుఁ గలనొకసింగము పొదనుండి వెల్వడెనని భావము.

క. వెలలి జిఘృక్షాగౌరవ, కలనన్ లంఘింప నృపతి♦ గన్గొని నిజని
. స్తులచంద్రహాసధారం, దలఁ ద్రెవ్వఁగ నేసె నద్భు♦తంబుగ నంతన్. 28

టీ. వెలలి=వెడలి. . జిఘృక్షాగౌరవకలనన్.—జిఘృక్షా=గ్రహణేచ్ఛయందలి ; గౌరవ=ఆదరముయొక్క; కలనన్=ప్రాప్తిచే. లంఘింపన్ =లంఘనము చేయఁగ. నృపతి=సుచంద్రుఁడు. కన్గొని=చూచి. నిజనిస్తులచంద్రహాసధారన్.—నిజ=స్వకీయమగు;నిస్తుల=అసమాన

మగు; చంద్రహాసః=కత్తియొక్క; ధారన్=అంచుచేత. తలన్=శిరమును. ద్రెవ్వఁగన్=తెగు నటుల. ఏసెన్=వైచెను. అద్భుతంబుగన్=ఆశ్చర్యముగ. అంతన్=అంతలో. దీనికి తరప ద్యముతో నన్వయము.

మ. క్షితినాథేంద్రశితాసిసంహతిభవా♦సృగ్వ్యాప్తతత్సింహరా
జతనూదీధితిసంధ్యలో వెడలుభా♦స్వన్మూర్తి నా నొక్కమా
నితతేజస్తతి దోఁచె నంత నచట♦ న్వీక్షింప నయ్యెన్ రమా
పతి నాపూరుషరూప మొక్కటి జగ♦త్పూస్తుత్యదీవ్యద్ద్యుతిన్. 29

టీ. క్షితినాథేంద్ర శితాసిసంహతి భవాసృ గ్వ్యాప్తతత్సింహరాజతనూదీధితిసంధ్య లోన్.—క్షితినాథేంద్ర=సుచంద్రునియొక్క; శిత=తీక్ష్ణమగు; అసి=ఖడ్గముయొక్క; సంహతిః=ప్రహారమువలన; భవ=పుట్టిన; అసృక్=రక్తముచేత; వ్యాప్త=పొందఁబడిన; తత్సింహరాజ=ఆ మృగరాజుయొక్క; తనూదీధితి=దేహకాంతియనెడు; సంధ్యలోన్=సంధ్యాకాలమందు. వె డలు భాస్వన్మూర్తినాన్=ఉదయించు భానుఁడో యన. ఒకమానితతేజస్తతి=ఒకానొకపూజ్య మగు తేజస్సమూహము. తోఁచెన్ = కనిపించెను. అంతన్=అంతలో. అచటన్=ఆతేజః పుంజమందు. జగత్పూస్తుత్యదీవ్యద్ద్యుతిన్ = లోకములచే స్తుతింపఁదగినట్టిప్రకాశించుచున్న కాంతి చేతను. ఒక్కపూరుషరూపము=ఒకానొకపురుషాకృతి. రమాపతినాన్=నారాయణుఁ డోయన. వీక్షింపన్=చూచుటకు. ఆయ్యెన్=అయెను.

సుచంద్రునిఖడ్గముచే ఖండింపఁబడిన యాసింహముయొక్క రక్తసిక్తమగుశరీరకాంతి యనెడు సంధ్యయం దుదయించిన తేజఃపుంజమనెడు సూర్యబింబమందు తద్గత నారాయణమూ ర్తి నా నొకపురుషాకృతి చూపట్టెనని భావము.

చ. అది గని యానృపాలుఁడు మ♦నోంబురుహంబున విస్మయాంకురం
బొదవఁగ నుండఁ గిన్నరత♦ నూనుచుఁ దత్పురుషావతంస మా
యుదధిగభీరుఁ జేరి విన♦యోన్నతి భానుకులాయ శత్రువ
ర్యదమనపణ్డితాయ భవ♦తే౽స్తు నమో యని మ్రొక్కి మ్రొక్కినన్. 30

టీ. ఆనృపాలుఁడు=అసుచంద్రుఁడు. అది గని=ఆపురుషరూపమును జూచి. మనోంబురు హంబునన్=చిత్తకమలమందు. విస్మయాంకురంబు=ఆశ్చర్యము. ఒదవఁగన్=కలుగు నటుల. ఉండన్=ఉండఁగ. తత్పురుషావతంసము=ఆపురుషశ్రేష్ఠుఁడు. కిన్నరత నూనుచున్=కిన్నర త్వము ధరించుచు. ఆయుదధిగభీరున్=ఆసముద్రగంభీరుఁ డగుసుచంద్రుని. చేరి=సమీపించి. వినయోన్నతిన్=వినయాతిశయముచే. భానుకులాయ=భానుకులీనుఁడ వైనట్టి. శత్రువర్య దమనపణ్డితాయ=పగతురఁ బరిమార్చుటయందు పండితుఁడ వైన. భవతే=నీకొఱకు. నమః=నమ స్కారము. అస్తు=అగుఁ గాక. అని మ్రొక్కెన్=ఇట్లు ప్రణమిల్లెను. మ్రొక్కినన్=ప్రణమి ల్లఁగా దీనికి తరపద్యముతో నన్వయము.

తే. ఆదరంబునఁ గెంగేల♦ నతని నెత్తి
దండఁ గూర్చుండఁ గావించి♦ ధరణిభర్త

తత్కథాశ్రవణైకము♦దాయుతాత్మ

నప్పురుషమౌళిఁ గాంచి యి♦ట్లనుచుఁ బలికె. 31

టీ. ధరణిభర్త=భూపతి యగుసుచంద్రుఁడు. ఆదరంబునన్=ప్రీతితోడ. అతనిన్=అకుముదుని. కెంగేలన్ = ఎఱ్ఱనైనహస్తముచే. ఎత్తి = లేవఁదీసి. దండన్ = సమీపమందు. కూర్చుండన్=ఉపవేశించునట్లు. కావించి=చేసి. తత్కథాశ్రవణైకముదాయుతాత్మన్.—తత్కథా=అకుముదుని కథయొక్క; శ్రవణ=వినుటయందు; ఏక=ముఖ్యమగు; ముదా=సంతసముచేత; యుత=కూడినట్టి; ఆత్మన్=మనస్సుచేత. అప్పురుషమౌళిన్ = ఆపురుషశ్రేష్ఠుని. కాంచి=అవలోకించి. ఇట్లనుచుఁ బలికెన్=వక్ష్యమాణప్రకారమున పచించెను.

చ. అకలుషరూపశోభివి మ♦హామతిశాలివి కిన్నరత్వబో

ధకశుభపాళి విట్టివిబు♦ధస్తుతవృత్తిఁ జెలంగునీకు ని

త్యకటుతరేభవైరిరమ♦ణాకృతి యేగతిఁ జెందె నెట్లు త

ద్వికృతి యడంగెఁ దెల్పఁ గద♦వే విన వేడుక పుట్టె నియ్యెడన్. 32

టీ. అకలుషరూపశోభివి.—అకలుష=ఒచ్చెములేని; రూప=స్వరూపముచేత; శోభివి=ప్రకాశించునట్టివాఁడవు. మహామతిశాలివి=గొప్పమతితోడనొప్పునట్టివాఁడవు. కిన్నరత్వబోధకశుభపాళివి.—కిన్నరత్వబోధక=కిన్నరత్వమునకు జ్ఞాపకములగు; శుభపాళివి=శుభచిహ్నములు గలవాఁడవు. "పాళిః కేతు ర్ధ్వజో లిఙ్గమ్" అని యమరుఁడు. ఇట్టివిబుధస్తుతవృత్తిన్=ఇవ్విధ మగుపండితస్తవనీయమగు కాదేని దేవస్తవనీయ మగువృత్తిచేత. చెలంగునీకున్=ఒప్పునట్టినీకు. నిత్యకటుతరేభవైరిరమణాకృతి.—నిత్యకటుతర=ఎల్లపుడుఁ గఠినతరమగు; ఇభవైరిరమణ=గజరిపుశ్రేష్ఠమైనసింగముయొక్క; ఆకృతి=ఆకారము. ఏగతిన్ చెందెన్=ఏవిధముగ నమరెను. ఎట్లు తద్వికృతియడంగెన్=ఏరీతి నాసింహభావము నశించెను. తెల్పఁగదవే=తెల్పవే. ఇయ్యెడన్ = ఇచట. వినన్ = ఆకర్ణించుటకు. వేడుక = కుతూహలము. పుట్టెన్=ఉదయించెను.

ఇట్టిలోకోత్తరగుణగణశాలి వగునీకు సింహత్వము గలుగుట యెట్లు మరల నది పోవుట యెట్లు విశదీకరింపు మని భావము.

క. అనుజనపతివాక్యము మది, కనివారితమోద మొసఁగ♦ నాఘనుఁడు పునః

పునరవనతి ఘటియించుచుఁ, దనకథ వివరించె నిట్లు♦దారమృదూక్తిన్. 33

టీ. అనుజనపతివాక్యము=ఉక్తప్రకారం బగుసుచంద్రవచనంబు. మదికిన్=చిత్తమునకు. అనివారితమోదము=అపరిమితానందమును. ఒసఁగన్=ఘటింపఁజేయఁగా. ఆఘనుఁడు=ఆదివ్యపురుషుండు. పునఃపునరవనతి=పలుమాఱు నమస్కారములను. ఘటియించుచున్ = చేయుచు. ఇట్లు=వక్ష్యమాణప్రకారమున. ఉదారమృదూక్తిన్=అతిశయమార్దవముతోఁ గూడిన పలుకుచే. తనకథ=తనవృత్తాంతము. వివరించెన్=విశదీకరించెను.

సీ. కలిమితొయ్యలి దాల్పు • బలుసామిపొక్కిట, మనుతమ్మి యేవేల్పుఁ • గనినతల్లి
మినుకుఁజాల్తుద దెల్పు • మిన్న లోఁ గాంచుజో,గులటెంకి యేవేల్పు • కలికివీడు
చిలుకుముద్దులవీణె • చెలియ గాఁ దగుచాన, బొమ్మరిండ్లేవేల్పు • నెమ్మొగంబు
లీరేడుజగముల • వారలఁ బుట్టించు, తీరువ యేవేల్పు • పారుపత్తె

తే. మట్టిపెనువేల్పు హరిహయ • హవ్యవాహ
హరిజ హరిరిపు హరిణాంక • గురుపరిబృఢ
హరిణహయ హయముఖరాజ • హరులు గొలువ
హాళిఁ బేరోలగం బుండు • నవసరమున. 34

టీ. కలిమితొయ్యలి దాల్పు బలుసామిపొక్కిటన్.—కలిమితొయ్యలి దాల్పు= లక్ష్మీధరుండగు; బలుసామి=గొప్పదేవునియొక్క, విష్ణువుయొక్క యనుట; పొక్కిటన్=నాభియందు. మనుతమ్మి=ఉండునట్టితామర. ఏవేల్పుఁగనినతల్లి=ఏదేవునిఁగన్నతల్లి యో. ఏవేల్పుకలికివీడు=ఏదేవునియందమైనపురము. మినుకుఁజాల్తుద=ఉపనిషద్రూపమగు వేదాంతము. తెల్పు మిన్న= తెలియఁజేయునట్టియుత్కృష్టుని. లోన్=అంతరంగమందు. కాంచుజోగులటెంకి=అవలోకించుయోగులయొక్క గృహమో, అనఁగా సత్యలోకమందుఁ బరబ్రహ్మము ధ్యానించు యోగులు వసించియుందురని భావము. ఏవేల్పునెమ్మొగంబులు=ఏదేవుని మంచిమొగములు. చిలుకుముద్దులవీణెచెలియ=అతిశయమై సుందరమైన వీణెయొక్క సకియ. కాఁదగుచాన బొమ్మరిండ్లు.—కాఁదగుచాన=అగుటకర్హమైన సరస్వతీరూపమైన స్త్రీయొక్క; బొమ్మరిండ్లు=బాలికలు బొమ్మలనుంచి క్రీడించు చిన్నగృహములో. ఏవేల్పుపారుపత్తెము = ఏదేవునియధికారము. ఈరేడుజగములవారలన్ = పదునాలుగు లోకములయందున్నవారిని. పుట్టించుతీరువ = కల్గించునట్టిపని. అట్టిపెనువేల్పు = అట్టి పెద్దదేవుండు, అనఁగా బ్రహ్మదేవుఁడు. హరిహయ హవ్యవాహ హరిజ హరిరిపు హరిణాంకగురుపరిబృఢ హరిణహయ హయముఖరాజ హరులు.—హరిహయ=ఇంద్రుండు; హవ్యవాహ=అగ్నిదేవుండు; హరిజ=సూర్యసుతుండైనయముండు; హరిరిపు=రాక్షసుం డగుటచే విష్ణుశత్రు వగునిరృతి; హరిణాంకగురు = చంద్రజనకుం డగుసముద్రునకు; పరిబృఢ=అధిపుం డగువరుణుండు "ప్రచేతా వరుణః పాశీ యాదసాంపతి రప్పతిః" అని యమరుండు. హరిణహయ=లేడివాహనము గాఁ గలవాయువు. హయముఖరాజ= కిన్నరాధిపతి యగుకుబేరుండు. హరులు=శివుండును. కొలువన్=సేవించుచుండఁగా. హాళిన్=ఆసక్తిచేత. పేరోలగంబుండు నవసరమునన్=కొలువు కూటమున నుండుతఱి. దీనికుత్తరపద్యస్థమైన యిట్లనున్ అనుదానితో నన్వయము.

చ. కొలువున నిల్చి భక్తివిధిఁ • గొల్చుమహామనువర్ణదేవతా
కులములలో నజత్వ మొన • గూర్చు మహామనువర్ణదేవతా
వళు లొకకొన్ని పర్విన న • వజ్వలనోజ్జ్వలకీలికాప్లుతిం
గళవళమందఁ గాంచి యుల • కంజభవుండు ప్రియోక్తి నిట్లనున్. 35

టీ. కొలువునన్=కొలువుకూటమందు. నిల్చి=నిల్చుకొని. భక్తివిధిన్=భక్తివిధానము చేత. కొల్చుమహామనువర్ణదేవతాకులములలోన్.—కొల్చు=సేవించుచున్న; మహామను=మహామంత్రములయొక్క; వర్ణ=బీజములయొక్క; దేవతా=తదధిష్ఠాన దేవతలయొక్క; కులములలోన్=సమూహములలో. అజత్వము = బ్రహ్మత్వము. ఒనగూర్చుమహామనువర్ణదేవతావళులు.—ఒనగూర్చు=చేయుచున్న; మహామను = మహామంత్రములయొక్క; వర్ణదేవతావళులు = వర్ణాధిష్ఠాన దేవతాసంఘములు. ఒక కొన్ని పర్వినన్ = ఒకానొకకొన్ని చుట్టుకొనఁగా. నవజ్వలనోజ్జ్వలకీలికాప్లుతిన్.—నవ=నూతనమగు; జ్వలన=అగ్నియొక్క; ఉజ్జ్వల = ప్రకాశించుచున్న; కీలికా=మంటలయొక్క; అప్లుతిన్=అప్లుతికి; కళవళ మందన్=కలఁతనొందఁగా. అలకంజభవుండు=ఆబ్రహ్మదేవుఁడు. కాంచి=చూచి. ప్రియోక్తిన్=ప్రియవచనము చేత. ఇట్లనున్=వక్ష్యమాణప్రకారమునఁ బలికెను. పారిజాతారణ్యమందు తపం బొనరించువసంతుఁ డను విప్రునితపోగ్నిజ్వాలలచేఁ గంది మహామనువర్ణదేవతలు నలువను వలనొనఁ దిలకించి యతనికి వక్ష్యమాణప్రకారముగ వచించె నని భావము.

చ. కటకట సర్వలోకశుభ•కాంతు లొసంగుచు నిచ్చ మించు మీ
కిటుల భజింప రానియవి•హీనవిపత్తిక సేరె నెట్లు త
త్పటిమ హరింతుఁ దెల్పుఁ డన•పద్మజునిన్ మనువర్ణదేవతా
పటలము మ్రొక్కి యిట్లనియెఁ • బాయని దైన్యము మోముఁ జెందఁగన్.

టీ. సర్వలోకశుభకాంతులు.—సర్వ=సమస్తమగు; లోక=భువనములకు; "లోకస్తుభువనేజనే" అని యమరుఁడు. శుభకాంతులు=మంగళప్రద మగుకోరికలను. ఒసంగుచున్=ఇచ్చుచు. నిచ్చ=ఎల్లప్పుడును. మించుమీకున్=అతిశయించుచున్న మీకు. ఇటుల = ఈరీతిని. భజింపరానివి=సేవింపనలవి గాని. అవిహీనవిపత్తిక=అధికమగు నాపద. ఎట్లు=ఏరీతి. చేరెన్=సమకూరెను. తత్పటిమన్=ఆయాపదయొక్కబలమును. హరింతున్=పోఁగొట్టుదును. తెలుపుఁడు=విన్నవింపుఁడు. అనన్=అనఁగ. మనువర్ణదేవతాపటలము.— మను=మంత్రములయొక్క; వర్ణ=బీజములయొక్క; దేవతా=తదధిష్ఠాన దేవతలయొక్క; పటలము=సమూహము. పద్మజునిన్=నలువను. మ్రొక్కి=నమస్కరించి. పాయనిదైన్యము=వీడనిదీనత్వము. మోముఁ జెందఁగన్=ముఖమును జేరి యుండఁగ. ఇట్లు=వక్ష్యమాణప్రకారమున. అనియెన్=వచించెను.

శా. ఆరమ్యాగమమార్గగద్విజశరణ్యం•బై యిలం బారిజా
తారణ్యంబు సెలంగు నయ్యటవి బ్ర•హ్మత్వంబు రాఁ గోరి దు
ర్వారాత్మప్రథిమాప్తిమామకజపవ్యా•పారపారంగతుం
డై రాజిల్లుతపస్వి యొక్కఁడు వనం•తాభిఖ్య నిం పొందుచున్. 37

టీ. ఇలన్=పుడమియందు. ఆరమ్యాగమమార్గగద్విజశరణ్యంబై.— ఆరమ్య=అంతట మనోజ్ఞమగు; ఆగమమార్గ=వేదమార్గమును; గ=పొందినట్టి; ద్విజ=బ్రాహ్మణులకు; శరణ్యంబై=రక్షకమయినదై. ఆరమ్య, ఆగమ, యని విభాగము, వృత్తివిఘులఁ జేరినపక్షుల కనియర్థాంతరము

గోచుచున్నది. పారిజాతారణ్యంబు=పారిజాతవనము. చెలంగున్=ఒప్పఁగా. అయ్యటవిన్=ఆ పారిజాతారణ్యమందు. బ్రహ్మత్వంబు రాఁ గోరి=బ్రహ్మత్వంబు రాఁ దలఁచి. దుర్వారాత్మప్రదఘ్నమహాప్తిన్.-దుర్వార=దుర్నివారమగు; ఆత్మప్రదఘ్నమ=మనోదార్ఢ్యముయొక్క; ఆప్తిన్=ప్రాప్తిచే. మామకజపవ్యాపారపారంగతుండై.-మామక=నాకు సంబంధించినమంత్రముయొక్క; జపవ్యాపార=జపమనువ్యాపారమందు; పారంగతుండై=పారము నొందినవాఁడై. వసంతాభిఖ్యనింపొందుచున్=వసంతుఁడను నామముచే నొప్పినవాఁడగుచు. తపస్వియొక్కఁడు=తపసియొకఁడు. రాజిల్లున్=ప్రకాశించును.

చ. కనఁ డితరంబు దా వినఁడొ • కానొకవిప్రవరోక్తిఁ బల్కఁడిం
పున నొకమాట నిట్టిదమ•భూషితుఁడై ముని నిశ్చలాంతరం
బెనసి యతృప్తికృజ్జపస•మేధనవైఖరి మించు తత్ప్రవ
ర్తన మిటులయ్యె దీని నొక•దారి నడంపఁగఁ జూడు మిత్తఱిన్. 38

టీ. తాన్=ఆవసంతుఁడు. ఇతరంబు=మఱియొకవస్తువును. కనఁడు = చూడఁడు. ఒకానొకవిప్రవరోక్తిన్=ఒకానొకయైనపక్షివరము నారదమునును. వినఁడు=ఆకర్ణింపఁడు. బ్రాహ్మణోత్తమునివాక్యమునైన వినఁడనితోఁచుచున్నది. ఇంపునన్=ఆనందముతో. ఒకమాటన్=ఒకవాక్యమును. పలుకఁడు=వచింపఁడు. ఇట్టిదమభూషితుఁడై=ఈరీతి నింద్రియనిగ్రహముచే భూషితుఁడై. ముని=వసంతాఖ్యుఁడు. నిశ్చలాంతరంబు.-నిశ్చల=చలింపని; అంతరంబు = మనస్సును. ఎనసి=పొంది. అతృప్తికృజ్జపసమేధనవైఖరిన్.-అతృప్తికృత్=అసంతుష్టిని జేయు; జప=జపముయొక్క; సమేధన=వృద్ధియొక్క; వైఖరిన్=రీతిచేత. మించున్ = అతిశయించును. తత్ప్రవర్తన.-తత్ = ఆవసంతునియొక్క; ప్రవర్తన=నడవడి. ఇటులు=ఇట్లు. అయ్యెన్ = ఆయెను. దీనిన్=ఈప్రవర్తనను. ఒకదారిన్=ఒకయుపాయముచే. ఇత్తఱిన్ = ఈసమయమందు. అడంపఁగన్=అడఁచుటకు. చూడుము=ఆలోచింపుము.

చ. అన వనజాసనుం డలమ•హాయతి యెంతకుఁ జొచ్చె నౌర స
జ్జనవినుతాజభావగతిఁ•జక్కఁగ నొందెడివాఁడె యెట్టులై
న నొకనవాంతరాయము పె•నంగఁగఁ జేసెద నంచు చింతతోఁ
దనరఁగ నుండ నప్పు డగ•దారి విరించిఁ గుఱించి యిట్లనున్. 39

టీ. అనన్=ఈరీతిఁ జెప్పఁగా. వనజాసనుండు=బ్రహ్మ. అలమహాయతి=ఆవసంతుఁడు. ఎంతకుఁ జొచ్చెన్=ఎంతపనికిఁ బ్రవేశించెను. ఔర=ఆహా. సజ్జనవినుతాజభావగతిన్=సత్పురుషులచేఁ గొనియాడఁదగిన బ్రహ్మత్వగతిని. చక్కఁగన్=సరిగా. ఒందెడివాఁడె=పొందఁగలవాఁడె. ఎట్టులైనన్=ఏరీతినైన. ఒకనవాంతరాయము=ఒకానొకనూతనవిఘ్నమును. పెనంగఁగన్=కలయునటుల. చేసెద నంచున్=చేయుదు ననుచు. చింతతోన్=ఆలోచనతో. తనరఁగన్=అతిశయించునటుల. ఉండన్=ఉండఁగా. అప్పుడు=ఆసమయమందు. అగదారి=ఇంద్రుఁడు. విరించిగుఱించి=బ్రహ్మనుద్దేశించి. ఇట్లు = వక్ష్యమాణప్రకారముగ. అనున్=పలికెను.

చ. యతి యన నెంత తన్మనుజ♦పైకసమాధి యనంగ నెంత త
ద్వ్రతి మన నెంత యియ్యెడ ము♦దంబున విఘ్నము దార్తు రిమ్మరు
త్సతు లఖిలేశ యిట్టిసుర♦తామరసేక్షణ లుండ లోకసం
తతినుతశక్తి మించు రతి♦నాయకుఁ డుండ విచార మేటికిన్. 40

టీ. అఖిలేశ=బ్రహ్మదేవుఁడా. యతి యనన్=వసంతుఁ డనఁగ. ఎంత=యెంతమాత్రము, సాధారణుఁ డనుట. తన్మనుజపైకసమాధి యనంగన్.—తత్=ఆవసంతునియొక్క; మనుజప=మంత్రజపముయొక్క; ఏక=ముఖ్యమగు; సమాధి యనంగన్ = చిత్తవృత్తినిరోధ మనఁగ. ఎంత=ఎంతమాత్రము. సులభముగఁ జలింపఁజేయఁదగినదని భావము. తద్వ్రతి మనన్=వానిని యమ మనఁగ. ఎంత=ఎంతమాత్రము. ఇమ్మరుత్సతులు=ఈ దేవాంగనలు. ఇయ్యెడన్ = ఈసమయమందు. ముదంబునన్=సంతోషముచేత. విఘ్నము=అంతరాయమును. దార్తురు=చేయుదురు. ఇట్టిసురతామరసేక్షణలు=ఇట్టిదేవాంగనలు. ఉండన్=ఉండఁగ. లోకసంతతినుతశక్తిన్.—లోక=జనులయొక్క; సంతతి=సమూహముచేత; నుత=కొనియాడఁదగిన; శక్తిన్ = సామర్థ్యముచేత. మించురతినాయకుఁడు=అతిశయించు మన్మథుఁడు. ఉండన్=ఉండఁగ. విచారము=చింత. ఏటికిన్=ఎందుకు. మహాయోగులధృతి గలంచు దేవాంగనలు మన్మథుఁడు నుండ విచార మేటి కని భావము.

సీ. ఏలదే బంటు గా♦ నీమేనకాకాంత, యచలగాధికుమారు♦నంతవాని
నేఁచదే సొబగుచే♦ నీధాన్యమాలిని, వింత గా శాండిల్యు♦నంతవాని
నెమ్మితోఁ గలయదే♦ యీయుర్వశీవామ, హాళిమై జాబాలి♦యంతవాని
నెనయవే వరుసతో♦ నీవేల్పుచెలిచాలు, లలమండకర్ణజు♦నంతవాని
తే. నిట్టిసురసుందరులు గల్గ♦ నింతపనికి,మనములోఁ జాలఁ జింత నీ♦ వెనసె దేల
వీరిలో నొక్క వెలఁది న♦మ్మారుఁగూర్చి,పంచుమీకార్యమిపుడె ఫ♦లించుఁగాని.

టీ. ఈమేనకాకాంత=మేనక యనునీసురాంగన. అచలగాధికుమారునంతవానిన్=చలింపనివిశ్వామిత్రునంతటివానిని. బంటుగాన్=దాసునిఁగా. ఏలదె=పరిగ్రహింపదా యని కాకువు. ఈధాన్యమాలిని=ధాన్యమాలి యనుపేరుగల యీసురాంగన. శాండిల్యునంతవానిన్=శాండిల్యమహామునియంతవానిని. సొబగుచేన్=సౌందర్యముచేత. వింత గాన్ = చిత్రముగా. ఏఁచదే=శ్రమపెట్టదా యని కాకువు. ఈ యుర్వశీవామ = ఊర్వశి యనుపేరు గలయీసురాంగన. జాబాలియంతవానిన్=జాబాలి యనుపేరుగల మహర్షియంతవానిని. హాళిమైన్=ఆసక్తిచేత. ఎమ్మితోన్=ప్రేమతో. కలయదే=పెనఁగదా యని కాకువు. ఈ వేల్పుచెలిచాలులు=ఈ సురాంగనాసమూహములు. అలమండకర్ణజునంతవానిన్ = మండకర్ణజుఁ డనుపేరుగలమహాముని యంతవానిని. వరుసతోన్ = క్రమముగ. ఎనయవే = పొందవా యని కాకువు. ఇట్టి సురసుందరులు=ఇటువంటిసామర్థ్యము గలసురాంగనలు. కల్గన్ = ఉండఁగా. ఇంతపనికిన్ =ఇట్టిస్వల్పకార్యమునకు. మనములోన్ = మనసునందు. చాలన్=మిక్కిలి. చింతన్ = చింతను. ఈవు=నీవు. ఎనసెదేల = పొందనేల. వీరిలోన్ = ఈసురాంగనలలో. ఒక్కవెలఁదిన్ =

ఒకకాంతను. అబ్జారుల్=అమస్మానునితో. కూర్చి=చేర్చి. పంచుము = పంపుము. ఇపుడె = ఈక్షణమందె. ఈకార్యము=ఈపని. ఫలించుఁగాని=ఫలించును. మహామునుల మనంబు చలింపఁ జేయునంతి సామర్థ్యము గలసురాంగన లుండ మీరింతిపనికిఁ జింతింపఁబనిలేదని భావము.

చ. అన నమృతంపుఁదేటజత ♦ యందినయాసురరాజుమాట చ
య్యన శ్రుతిపర్వమై మదిని ♦ హర్షమహాపగఁ బొంగఁ జేయ నీ
పని కిది కార్య మౌర యని ♦ పల్కి వెలందిమగంటు కంతుఁ బి
ల్వ ననిలుఁ బంచి వేల్పునవ♦లాతలమిన్నల నంతఁ గాంచినన్. 42

టీ. అనన్ = ఈప్రకారము పలుకఁగ. అమృతంపుఁదేటజత = అమృతసారముతోడి సమత్వమును. అందినయాసురరాజుమాట=పొందినట్టియాయింద్రునిమాట. చయ్యనన్ = శీఘ్రముగ. శ్రుతిపర్వమై=శ్రోత్రమునకు నానందకరమై. మదిని=మనసునందు. హర్షమహాపగన్=సంతసమనుగొప్పయేటిని. పొంగఁజేయన్=ఉబుకఁజేయఁగ. ఈపనికిన్=దీనికి. ఇది=ఇంద్రోక్తమైనయుపాయము. కార్యము=చేయఁదగినది. ఔర యని పల్కి. వెలందిమగంటు=నలువ. కంతున్=మారుని. పిలువన్=పిలుచుటకు. అనిలున్=వాయుదేవుని. పంచి=పంపి. అంతన్=అటుపిమ్మట. వేల్పునవలాతలమిన్నలన్=సురాంగనాశిరోమణులను. కాంచినన్=చూడఁగ. దీని కుత్తరపద్యస్థక్రియతో నన్వయము.

సీ. వెలవెలనై తోఁచె ♦ నలచంద్రకళ యత్య
తులతమశ్శ్రీఁ బొందఁ ♦ గలనె యనుచుఁ,
జల మెత్తె లేదయ్యె ♦ నలరంభ కీరకుం
జరము సెక్కిన మనఁ♦జాల ననుచుఁ,
దెలివి వాయఁగఁ బోల్చె ♦ నలతార హంసుని
గొడవఁ బోయిన మహాం ♦ బడఁగు ననుచు,
శ్యామలలో నీఁగె ♦ నలమాధవి ధరిత్రి
ఘనులగోస్మృతి నిల్పఁ ♦ గలనె యనుచు,
తే. నిట్టు లనిమేషకాంత ల♦హీనభంగ
వృత్తి సంధించి చలియింపఁ ♦ జిత్తమందు
వే యొకఁగి చిత్రరేఖ య♦న్వేల్పుచెలువ
నలువకు జోహారు గావించి ♦ నిలిచె నపుడు. 43

టీ. అలచంద్రకళ=చంద్రకళ యనునట్టి యాసురాంగన. యత్యతులతమశ్శ్రీన్.—యతి=వసంతుఁడను తపసియొక్క. అతుల=అధికమగు;తమశ్శ్రీన్=తమోగుణాతిశయమును. పొందఁగలనె యనుచున్=చూడఁగలనా యనుచు, అనఁగ వసంతుఁడను తపసియొక్క తమోగుణమును బరీక్షింపఁగలనా యనిభావము. వెలవెలనై తోఁచెన్=చిన్నఁబోయినదై కనఁబడెను. ఇటచంద్రకల = చంద్రరేఖ. అత్యతుల = మిక్కిలి అధికమగు; తమశ్శ్రీన్ = రాహువుయొక్క అతిశయమును; కాంచునా యనునర్థము శబ్దశక్తిస్వభావమువలన ధ్వనించుచు

స్నది. అలరంభ=రంభ యను నా దేవాంగన. ఘనకుంజరము=పండితశ్రేష్ఠుఁ డగు వసంతుఁడు. చెనక్కానక్=ఎదిరించిన. మనఁ జాల దను మి=బ్రదుకఁ జాల నని. తల యెత్త నేసియ్యన్=శిరము ఎత్తలేదని యర్థము. అనఁగ గంభీరగజము ఎదిరించిన మనఁజాల దను నర్థాంతరము స్ఫురించుచున్నది. తార=తార యను సురాంగన. పాంసునగోడవన్=పరమహంసుఁ డగు వసంతుని యొక్క నిరోధమునందు. పోయినన్=ప్రసక్తించినయెడ. మనాంబు=తేజము. అడఁగిననుచున్=నివర్తించు ననుచు. తెలివి వాయఁగన్=ప్రజ్ఞ వీడునటుల. పొల్చెన్=అగపడెను. రక్కప్రాస్థు నెదిరించినపోఁ దేజ ముడుగు నని తెలివిపాయునటుల యగపడెనని యర్థాంతరము దోఁచుచున్నది. అలమాధవి=మాధవి యనునట్టియా దేవాంగన. ఘనులగోస్పృతిన్=పెద్దలయొక్క వాక్యమునకు. నిల్వఁగలనె యనుచున్=తాళఁగలనా యనుచు. శ్యామలలోన్=స్త్రీలలో. ఈఁగెన్=చొచ్చెను. మాధవి=లతావిశేషము. ఘనులగోస్పృతిన్=మేఘములయొక్క జలధారకు. నిలువఁగలనా యని. శ్యామలలోన్=లతలయందు. ధరిత్రిన్=భూమియందు. ఈఁగెన్=ప్రవేశించెనని యర్థాంతరము దోఁచుచున్నది. ఇట్టులు=ఈరీతి. అనిమేషకాంతలు=దేవాంగనలు. అహీనభంగివృత్తిన్.—అహీన=అధికమగు; భంగవృత్తిన్=భంగి వర్తినను. సంధించి=పొంది. చలియింపన్=చలింపఁగ. చిత్తమందున్=మనసునందు. చిత్రరేఖ యన్వెల్వ చెలువ=చిత్రరేఖ యను దేవాంగన. వే=శీఘ్రముగ. ఎఱిఁగి=గుర్తించి. నలువకున్=బ్రహ్మకు. జోహారు గావించి=నమస్కరించి. నిలిచెన్=నిలువఁబడెను. అపుడు=ఆసమయమందు. ఈపదమున కుత్తరపద్యస్థక్రియతో నన్వయము.

నలువ వసంతుఁ డను మహర్షియొక్క తపోవిఘ్నమునకై పంపుటకుఁ జంద్రికకళాగసురాంగనల నవలోకింప వారు తపోవిఘ్నమొనరింపఁజాలమని చలింపఁగాఁ జిత్రరేఖ యనుసురాంగన వారిచందంబు గుర్తెఱింగి నలువకు నమస్కరించి నిలిచె నని భావము.

చ. నిలిచి యవార్యయౌవనవి♦నిర్మలసుందరభావసత్కళా
కులజనితైకదర్పమును ♦ గూడిన చేడియ గాన ముందు దాఁ
దెలియక ధాత కిట్లను స♦తీమణి దేవ భవన్మనోహితం
బలర నొనర్తు నన్ను దయ ♦ నంపుము నిర్జరు లెల్ల మెచ్చఁగన్. 44

టీ. నిలిచి=నిలుచుండి. అవార్యయౌవన వినిర్మలసుందర భావసత్కళాకుల జనితైకదర్పమును.—అవార్య=వారించుట కశక్యమైన; యౌవన=తారుణ్యముయొక్క; వినిర్మల=అత్యమలమగు; సుందరభావ=సౌందర్యముయొక్క; సత్కళా=శ్రేష్ఠమగు విద్యలయొక్క; కుల=సమూహము చేత; జనిత = పుట్టింపఁబడిన; ఏక=ముఖ్యమయినట్టి; దర్పమును = మదమును. కూడిన చేడియగాన=పొందియున్న వనితగాన. తాన్=తాను. ముందు తెలియక=ముందురాఁబోవుదాని నెఱుఁగక. సతీమణి=చిత్రరేఖ. ధాతకున్=బ్రహ్మకు. ఇట్లనున్=వక్ష్యమాణ ప్రకారమునఁ బలికెను. దేవ=స్వామీ. భవన్మనోహితంబు.—భవత్=మీయొక్క; మనోహితంబు=మనసునకు హితమగుపనిని. అలరఁగన్=సంతోషించునటుల. ఒనర్తున్=చేయుదును. నన్ను దయన్=నన్ను దయతో. అంపుము=అంపుము. నిర్జరులెల్ల మెచ్చఁగన్=దేవతలెల్ల మెచ్చుకొనఁగ. ఈపద ముత్తరపద్యముతో నన్వయించును.

న్నది. అలరింభ=రంభయను నా దేవాంగన. ఖరకుంజరము=పండితశ్రేష్ఠుఁ డగు వసంతుఁడు. చెనక్కొనన్=ఎదిరించిన. మనఁ జాల దనుము=బ్రదుకఁ జాల దని. తల యెత్తఁ జేసె యయ్యెన్=శిరము ఎత్తలేదని యర్థము. అనఁగఁ గంభీరగజము ఎదిరించిన మనఁజాల దను నర్థాంతరము స్ఫురించుచున్నది. తార=తార యను సురాంగన. వాంఛనిగోడవన్=పరమహంసుఁ డగు వసంతుని యొక్క నిరోధమునందు. పోయినన్=ప్రవర్తించిన యెడ. మహంబు=తేజము. అడఁగునను చున్=నివర్తించు ననుచు. తెలివి వాయఁగన్=ప్రజ్ఞ వీడునటుల. పొల్చెన్=అగపడెను. రిక్క ప్రొద్దు నెదిరించినపోఁ దేజ ముడుగు నని తెలివి పాయునటుల యగపడెనను యర్థాంతరము దోఁచుచున్నది. అలమాధవి=మాధవి యను నట్టియా దేవాంగన. ఘనులగోస్మృతిన్=పెద్దలయొక్క వాక్యమునకు. నిల్వఁగలనె యనుచున్=తాళఁగలనా యనుచు. శ్యామలలోన్=స్త్రీలలో. ఈఁగెన్=చాచ్చెను. మాధవి=లతావిశేషము. ఘనులగోస్మృతిన్=మేఘములయొక్క జలధారకు. నిలువఁగలనా యని. శ్యామలలోన్=లతలయందు. ధరిత్రిన్=భూమియందు. ఈఁగెన్=ప్రవేశించె నని యర్థాంతరము దోఁచుచున్నది. ఇట్టులు=ఈరీతి. అనిమేషకాంతలు=దేవాంగనలు. అహీనభంగవృత్తిన్.—అహీన=అధికమగు; భంగవృత్తిన్=భంగవర్తనను. సంధించి=పొంది. చలియింపన్=చలింపఁగ. చిత్తమందున్=మనసునందు. చిత్రరేఖ యన్వెల్పుచెలువ=చిత్రరేఖ యను దేవాంగన. వే=శీఘ్రముగ. ఎఱిఁగి=గుర్తించి. నలువకున్=బ్రహ్మకు. జోహారు గావించి=నమస్కరించి. నిలిచెన్=నిలువఁబడెను. అపుడు=ఆసమయమందు. ఈపదమున కుత్తరపద్యస్థక్రియతో నన్వయము.

నలువవసంతుఁ డను మహర్షియొక్క తపోవిఘ్నమునకై పంపుటకుఁ జంద్రకళాదిసురాంగనల నవలోకింప వారు తపోవిఘ్న మొనరింపఁ జాల మని చలింపఁగఁ జిత్రరేఖ యను సురాంగన వారిచందంబు గుర్తెఱింగి నలువకు నమస్కరించి నిలిచె నని భావము.

చ. నిలిచి యవార్యయౌవనవి♦నిర్మలసుందరభావసత్కళా
కులజనితైకదర్పమును ♦ గూడిన చేడియ గాన ముందు దాఁ
దెలియక ధాత కిట్లను స♦తీమణి దేవ భవన్మనోహితం
బలర నొనర్తు నన్ను దయ ♦ నంపుము నిర్జరు లెల్ల మెచ్చఁగన్. 44

టీ. నిలిచి=నిలుచుండి. అవార్యయౌవన వినిర్మలసుందరభావసత్కళాకుల జనితైకదర్పమును.—అవార్య=వారించుట కశక్యమైన; యౌవన=తారుణ్యముయొక్క; వినిర్మల=అత్యమలమగు; సుందరభావ=సౌందర్యముయొక్క; సత్కళా=శ్రేష్ఠమగు విద్యలయొక్క; కుల=సమూహముచేత; జనిత=పుట్టింపఁబడిన; ఏక=ముఖ్యమయినట్టి; దర్పమును=మదమును. కూడిన చేడియ గాన=పొందియున్న వనిత గాన. తాన్=తాను. ముందు తెలియక=ముందురాఁబోవుదాని నెఱుఁగక. సతీమణి=చిత్రరేఖ. ధాతకున్=బ్రహ్మకు. ఇట్లనున్=వక్ష్యమాణ ప్రకారమునఁ బలికెను. దేవ=స్వామీ. భవన్మనోహితంబు.—భవత్=మీయొక్క; మనోహితంబు=మనసునకు హితమగుపనిని. అలరఁగన్=సంతోషించునటుల. ఒనర్తున్=చేయుదును. నన్ను దయన్=నన్ను దయతో. అంపుము=అంపుము. నిర్జరులెల్ల మెచ్చఁగన్=దేవత లెల్ల మెచ్చుకొనఁగ. ఈపదము నుత్తరపద్యముతో నన్వయించును.

చ. మరుఁడు సహాయుఁడై బలస♦మగ్రతతోఁ వెనువెంట రాఁగ స
త్వరగతి ధాత్రి నొంది యల♦తాపసుఁ జేరి భవత్కృపాపరి
స్ఫురితకలావిలాసములఁ♦ జొక్కపువేడుక నిక్కఁ జేసి బం
ధురనిజశక్తి నిచ్చటికిఁ♦ దోకొని వచ్చెద నేలి బంటుఁ గన్. 45

టీ. మరుఁడు=మన్మథుఁడు. సహాయుఁడై=తోడై. బలసమగ్రతతోన్.—బల=సేనల యొక్క; సమగ్రతతోన్=పరిపూర్ణతచేత. వెనువెంట రాఁగన్=ఎడఁబాయక రాఁగ. సత్వరగతిన్=శీఘ్రగమనముచేత. ధాత్రి నొంది=భూమిని జేరి. అలతాపసుఁజేరి=ఆవసంతుని సమీపించి. భవత్కృపాపరిస్ఫురితకలావిలాసములన్.— భవత్=మీయొక్క; కృపా=దయచేత; పరిస్ఫురిత=ప్రకాశింపఁజేయఁబడిన; కలా=విద్యలయొక్క; విలాసములన్=లీలలచేత. చొక్కపు వేడుకన్=శ్రేష్ఠమయిన అభిలాషను. నిక్కఁ జేసి=అతిశయింపఁజేసి. బంధురనిజశక్తిన్.—బంధుర=అధికమగు నిజశక్తిన్=స్వసామర్థ్యముచేత. బంటుఁగన్=సేవకునిఁగ. ఏలి=పాలించి. ఇచ్చటికిన్=ఇచటికి. తోకొని వచ్చెదన్=తోడుకొని వత్తును.

సీ. జలపానసంరక్తి♦ సడలించి మోవితే
నియ గ్రోలుతమిఁ జాల♦ నింప వచ్చు,
తొలుపల్కుఁజదువులు♦ వ్రేలియించి రతికూజి
తంబులు నడపుటల్♦ దార్ప వచ్చు,
ధ్యాననైశ్చల్యంబు♦ దలఁగించి వలజేని
కలహంపుఁజింతలోఁ♦ గలప వచ్చు,
యతివేషవైఖరి♦ నడఁగించి విటపాళి
యెంచుమేల్ సొగసు చే♦యింప వచ్చు,
తే. నొంటి దిరుగుట మాన్పి యిం♦పొనరుసఖులఁ
గూడి విహరించుతెఱఁగు వే♦కూర్ప వచ్చు
నాత్మచాతురి నేమి సే♦యంగ రాదు
తపసి నివ్వేళ ననుఁ బంపు♦ తమ్మిచూలి. 46

టీ. తపసిన్=వసంతుని. జలపానసంరక్తిన్=ఉదకపానమందుఁ గలయాసక్తని. సడలించి=వదలించి. మోవితేనియ గ్రోలుతమిన్=కాంతాధరరసమును బానము చేయునట్టియాసక్తని. చాలన్=మిక్కిలి. నింప వచ్చున్=కలుగఁజేయవచ్చును. తొలుపల్కుఁజదువులు=వేదపాఠములను. పొలియించి=నశింపఁజేసి. రతికూజితంబులు=మణితములను. నడపుటల్=జరపుటలను. తార్పవచ్చున్=చేయవచ్చును. ధ్యాననైశ్చల్యంబు.—ధ్యాన=ధ్యానమందలి; నైశ్చల్యంబు=చాంచల్యరాహిత్యమును. తలఁగించి=వదలించి. వలజేనికలహంపుఁజింతలోన్=సురతవిషయకచింతయందు. గలపవచ్చు=ప్రవేశింపఁజేయవచ్చును. యతివేషవైఖరిన్=మునివేషముయొక్క రీతిని. అడఁగించి=పోఁగొట్టి. విటపాళి=విటసమూహము. ఎంచుమేల్సొగసు.—ఎంచు=ప్రశంసించునట్టి. మేల్సొగసు=శ్రేష్ఠమగుసందము. చేయింపవచ్చున్=

ఘటింపఁజేయవచ్చును. ఒంటరిమిగుటన్ = జతలేక సంచరించుటను. మాన్పి = పోఁగొట్టి. ఇంపొసఁగు సఖులన్ = ఆనందమును చేకూర్చుచున్న కాంతలను. కూడి = కలసి. విహరించుతెఱఁగున్ = క్రీడించు క్రమమును. వే = శీఘ్రముగ. కూర్పవచ్చున్ = ఘటింపవచ్చును. ఆత్మచాతురిన్ = బుద్ధి చాతుర్యముచేత. ఏమి సేయంగరాదు = ఏమి చేయఁగూడదు, సర్వముఁ జేయవచ్చునని భావము. ఇవ్వేళన్ = ఈసమయమందు. ననున్ = నన్ను. పంపు = పంపుము. తమ్మిమాలి = ఓసలువా. బుద్ధి చాతుర్యముచేత జలపానాదిమునిధర్మములను బోఁగొట్టి వసంతునకు విటవేషము ధరింపఁ జేయవచ్చునని నలువనుగుఱించి చిత్రరేఖ యనుసురాంగన విన్నవించె నని భావము.

చ. తొలకరిచూపు లింపొసఁగు • ధూపము పైపయిఁ బర్వఁ గంధరో
జ్జ్వలకలనిస్వనం బుడుక • చాల్ రొద యై విన వేడ్కఁ దార్పఁ బూ
విలుగలవేల్పు రాసివము • వేగమె మానికి రేఁచి మత్కుచా
చలయుగరంగవీథి ఘన • సంభ్రమతన్ నటియింప నూన్చెదన్. 47

టీ. తొలకరిచూపులు = ప్రథమావలోకనములు. ఇంపొసఁగుధూపములై = ఆనందము నిచ్చుధూపవిశేషములై. పైపయిఁబర్వన్ = మీఁదమీఁద వ్యాపింపఁగ. కంధరోజ్జ్వలకలనిస్వనంబు = కంఠమందుదయించినరవము, అనఁగ రతికూజిత మని భావము. ఉడుకచాల్ రొదయై = చర్మవాద్యసమూహముయొక్క ధ్వనియై, ఆవేశమును జేయుచర్మవాద్యముయొక్క ధ్వనిరూపమయి. వినన్ = వినుటకు. వేడ్కన్ = సంతోషమును. తార్పన్ = చేయుచుండఁగ. పూవిలుగలవేల్పురాసివము = మన్మథావేశమును. వేగమె = శీఘ్రముగ. మానికిన్ = వసంతుఁడను పేరుగలమునికి. రేఁచి = అతిశయింపఁజేసి. మత్కుచాచలయుగరంగవీథిన్. — మత్ = నాయొక్క; కుచాచల = పర్వతములవంటి స్తనములయొక్క; యుగ = జంటయను; రంగవీథిన్ = నాట్యస్థలమందు. ఘనసంభ్రమతన్ = అధికత్వరచేతను. "సంభ్రమోవేగహర్షయోః" అని విశ్వము. నటియింపన్ = నాట్యముఁజేయునటుల. ఊన్చెదన్ = చేయుదును.

కటాక్షములు నల్లనుటకవిసముయముగాన చూపులను ధూపమును వేసి మణితి మను జమిడికి ధ్వనిని చెవి సోఁకఁజేసి వసంతునకు మన్మథావేశము దెప్పించి నాకుచయుగ మను రంగవీథిలో నటియింపఁజేయుదు నని భావము.

సీ. వలతేనిమనములో • మొలపించు క్రొంజూపు, తూపుల ధైర్యంబు • దూల్ప నేనిఁ
దలఁపుల నెవ్వేళ • తలఁగక యూరించి, కెరలు మేల్కాఁకలఁ • జొక్కింప నేనిఁ
గౌఁగిట నలమి చో • కాటపుఁగూటమి, గలయుంగఁ జేరానఁ • గొలుప నేనిఁ
దులకించు మోహంపు • వలఁ జిక్కి వెను వెంటఁ, బాయక తిరుగంగఁ • జేయ నేనిఁ

తే. బలుకువాల్దొర నివ్వేల్పు • పడఁతు లెల్ల
వినుతి సేయంగ విటునిఁ గా • వింప నేని
సజరకులమునఁ బుట్టితి • నంచు నిచ్చ
పలుకఁగా సిగ్గు గాదె య • బ్జాతజన్మ. 48

టీ. అబ్జాతజన్మ=బ్రహ్మదేవుఁడా. నలఁచేనిన్=మన్మథుని. మనములోన్=మనసునందు. మొలపించుక్రొంజూపుఁదూపులన్.—మొలపించు=ఉదయింపఁజేయు; క్రొంజూపుఁదూపులన్ =క్రొత్తచూపు లను బాణములచేత. ధైర్యంబు=ధృతిని. తూల్పనేనిన్=చలింపఁజేయనియెడల ను. ఎవ్వేళన్ = ఎప్పుడును. తలఁపులన్ = కోరికలను. తలఁగక = సెడదెగకుండునటుల. ఊరించి=పుట్టించి. కేరలుమేల్కళలన్ = అతిశయించువిద్యలచేత. చొక్కఁపనేనిన్= పరవశత నొందింపనియెడలను. కౌఁగిటన్ = కౌఁగిటియందు. అలమి=ఆక్రమించి. చొక్కా టపుఁగూటమిన్ = శ్రేష్ఠమగు సంగమమందు. కలయంగన్=కూడుటకు. సేరాసన్=గొప్ప యాశను. కొలుపనేనిన్ = పుట్టింపనియెడలను. తులకించుమోహంపువలన్.—తులకించు = ఒప్పుచున్న; మోహంపువలన్ = మోహమనుజాలమందు. చిక్కి=పట్టుపడి. వెనువెంటన్= వెంబడివెంబడి. పాయక = ఎడఁబాయక. తిరుగంగన్ = తిరుగునటుల. చేయనేనిన్ = ఒనర్పనియెడలను. పలుకువాగ్గురన్ = మునిరాజగువసంతుని. ఇవ్వేల్పుపడఁతులెల్లన్= ఈసురాంగనలెల్ల. వినుతిసేయంగన్ = ప్రస్తుతిచేయుచుండఁగ. విటునిఁగావింపనేనిన్ = జారుని నొనర్పనియెడలను. అజరకులమునన్=దేవతావంశమందు. పుట్టితి నంచున్=జన్మించితిననుచు. నిచ్చ=ఎల్లప్పుడును. పలుకఁగాన్ = వచించుటకు. సిగ్గు గాదే=లజ్జ కాదా.

ఓచెలువా నేను క్రొంజూపులచే కామమును బుట్టించి ధైర్యమును దొలఁగించియు మఱియు కౌఁగిలించి సురతమందాసక్తిఁ బుట్టించియు మోహ మనుజాలమునఁ దగులుకొని నావెంటఁ దిరుగంగఁజేయుచు నామహర్షిని విటునిఁ గావింపనైతి నేని దేవతావంశమందుఁ బుట్టితి నని చెప్పుకొనుట నాకు లజ్జాకర మని భావము.

చ. అనఁ దెలిగంటికొమ్మ పలు • కాత్మమనఃప్రమదంబు గూర్ప న
వ్వనరుహసూతి యాదరణ • వైఖరి ని ట్లను నోయెలంత ది
వ్యనికరవర్ణ్యవిభ్రమక • లాప్రవిమోహితసర్వలోక వై
తనరెడునీకు ధాత్రి నొక • తాపసు లోఁబడ నూన్చు టబ్రమే. 49

టీ. అనన్=పూర్వోక్తప్రకారమునఁ జిత్రరేఖ పలుకఁగా. తెలిగంటికొమ్మపలుకు=దే వాంగన యగుచిత్రరేఖవాక్యము. ఆత్మమనఃప్రమదంబు.—ఆత్మ=తనయొక్క; మనః=మన స్సుయొక్క; ప్రమదంబు=సంతసమును. కూర్పన్=చేయఁగ. అవ్వనరుహసూతి=ఆనలువ. ఆద రణవైఖరిన్=మన్ననరీతి చే. ఇట్లు=వక్ష్యమాణప్రకారమున. అనున్=వచించెను. ఓయెలంత= చిత్రరేఖా. దివ్యనికరవర్ణ్యవిభ్రమకలాప్రవిమోహితసర్వలోకవు.—దివ్య=స్వర్గమందుఁబుట్టిన దేవాదులయొక్క; ఇచట దివిభవా దివ్యా యనిభవార్థమందు యత్ప్రత్యయ మని యెఱుఁగునది. నికర=సమూహముచే. వర్ణ్య=పొగడఁదగిన. విభ్రమకళా=భ్రమకవిద్యలచే. ఆప్రవిమో హిత=మోహింపఁజేయఁబడిన. సర్వలోక వై=సమస్తలోకములుగలదాన వై. తనరెడునీకున్ = అతిశయించునీకు. ధాత్రిన్=పుడమియందు. ఒకతాపసున్=ఒకమునిని. లోఁబడ నూన్చుట=వశ మగునటులు చేయుట. అబ్రమె=ఆశ్చర్యమా, ఆశ్చర్యము కాదనుట. సమస్తవశ్యవిద్యలచే లోకముల నెల్ల మోహింపఁజేయునీకుఁ బుడమి నొకతాపసుని మోహింపఁజేయు టరుదా యని భావము.

ఉ. చొక్కపునీటునం గళల•సొంపున చారువిలాసవైఖరిం
జక్కఁదనంబునం సరస•చాతురి నీసురయోషావతంసములోఁ
నెక్కువ దాన వౌట చెలి • యిచ్చ ఘటించితిఁ గాక దీనికిన్
తక్కినవారిచే నగునె • తార్పఁగ నీదృశకార్యమెంతయున్. 50

టీ. చొక్కపునీటునన్=శ్రేష్ఠమగుమురిపెముచేత. కళలసొంపునన్=విద్యలయొక్క ప్రాచుర్యముచేతను. చారువిలాసవైఖరిన్.—చారు=సుందరమగు; విలాస=హావభావాదులయొక్క; వైఖరిన్=రీతిచేతను. చక్కఁదనంబునన్=సౌందర్యముచేతను. సరసచాతురిన్.—సరస=మనోజ్ఞమగు; చాతురిన్=చాతుర్యముచేతను. ఈసురయోషావతంసములోన్=ఈ దేవతాస్త్రీసమూహములో. ఎక్కువదానవౌటన్=ఎక్కువైనదానవుగాన. చెలి=చిత్రరేఖా. ఇచ్చన్=ఇచ్ఛచేత. దీనికిన్=ఈకార్యమునకు. ఘటించితిఁగాక=నియోగించితిని. ఈతక్కినవారిచేన్=నీకంటె నితరులైనవీరిచేత. ఈదృశకార్యము=ఇటువంటిగొప్పపని. ఎంతయున్=మిక్కిలి. తార్పన్=చేయుటకు. అగునె=సాధ్యమగునా. కాదని కాకువు.

స్మరశాస్త్రమునందు ప్రావీణ్యము గలదాన వగుటచే సౌందర్యమందు నెక్కువైనదాన వగుటచే నీచేఁ దక్క నితరులచే నీపని కానని సమ్మతిచే నియోగించితి నని భావము.

సీ. నవబోఁడి యతులఘన•స్ఫూర్తిఁ దూలింపఁ, జాలదే నీనీల•వాలకాంతి
లీలం దమీశావ•లేపంబు విదళింపఁ, జాలదే నీయాస్య•జలజదీప్తి
వనజానన యహీన•మునిప్రౌఢిఁ గలఁగింపఁ, జాలదే నీరోమ•పాళికాంతి
ముదిత నత్తాపస•మూజ్జృంభణముఁ బెంపఁ, జాలదే నీపదో•జ్జ్వలనఖాళి
తే. యచలవక్షోజపరమహం•హౌఘమహిమ
నడఁపఁ జాలదె నీమంద•యానలీల
యగుటఁ దల్లక్ష్మి చెలు వందు•నట్టినీకు
పడఁతి యొకమౌని నిల మోహ•పఱచు టెంత. 51

టీ. నవబోఁడి=చిత్రరేఖా. నీనీలవాలకాంతి=నీయొక్క నల్లనైన కురులకాంతి "వాలః కచే శిశౌ మూర్ఖే" అని విశ్వనిఘంటువు. యతులఘనస్ఫూర్తిన్.—యతుల=మునులయొక్క; ఘన=అధికమైన; స్ఫూర్తిన్=సామర్థ్యమును. తూలింపఁజాలదె=నశింపఁజేయ సమర్థము కాదా యని కాకువు. అతుల=సరిలేని. ఘన=మేఘముయొక్క; స్ఫూర్తిన్=కాంతిని. తూలింపఁజాలదే యనునర్థాంతరమును దోఁచుచున్నది. లీలన్=విలాసముచే. నీయాస్యజలజదీప్తి=జలజము వంటినీయాస్యముయొక్క కాంతి "ఉపమితం వ్యాఘ్రాదిభిస్సామాన్యాప్రయోగే" యను సూత్రమువలన సమాసము. దమీశావలేపంబు=మునిశ్రేష్ఠునియొక్క గర్వమును. "దర్పోఽవలేపోఽవష్టంభః" యని యమరుఁడు. విదళింపఁజాలదే=పోఁగొట్టఁజాలదా యని కాకువు. తమీశ యనువిభాగమందు, "ద్రుతప్రకృతికమునుమీఁదిపరుషములకు సరళము లగు. ఆదేశసరళములకు ముం దున్నద్రుతమునకు బిందుసంశ్లేషములు విభాషనగు." అను సూత్రము

లచే దకారమును బిందువును వచ్చినవి. తమీశ=నిశాపతి యగు చంద్రునియొక్క. ''రజనీ యామినీతమీ''యని యమరుఁడు. అవలేపంబు = గర్వమును. నీయాస్య జలజదీప్తి లీలచే విదళింపఁజాలదా యనునర్థము దోఁచుచున్నది. వనజానన = చిత్రరేఖా. నీరోమపాళి కాంతి=నీనూఁగారుయొక్క కాంతి. అహీనమునిప్రౌఢిక్.—అహీన=అధికమగు;మునిప్రౌఢిక్=మునులయొక్క ప్రాగల్భ్యమును. కలఁగింపఁజాలదే=కలఁతిపఱుపఁజాలదా. నీరోమపాళి కాంతి = నీనూఁగారుకాంతి. అహీన=యాదిశేషునియొక్క. మునిప్రౌఢిక్ = మౌనముద్రను. బిగువునను. కలఁగింపఁజాలదే యను నర్థాంతరము స్ఫురించుచున్నది. ముదిత=చిత్రరేఖా. నీపదోజ్జ్వలనఖాళి=నీపాదములయందు ప్రకాశించునఖపంక్తి. సత్తాపసముజ్జృంభణము.—సత్=శ్రేష్ఠమగు; తాపస=ఋషులయొక్క; ముత్=సంతసముయొక్క; జృంభణమును=అతిశయమును. పెంపఁజాలదే=ఖండింపఁజేయఁజాలదా, ఖండించుననుట. నీఖనపంక్తి.సత్తాపసముజ్జృంభణము.—సత్=నక్షత్రములయొక్క; తాపసముజ్జృంభణము = తాపాతిరేకమును; పెంపఁజాలదే=అతిశయింపఁ జేయఁజాలదా యనునర్థాంతరము స్ఫురించుచున్నది. అచలవక్షోజ=పర్వతములవంటి స్తనములుగల చిత్రరేఖా. నీమందయానలీల = నీమందగమనక్రియ. ''లీలా విలాసక్రియయోః'' అని అమరుఁడు. పరమహంసౌఘమహిమక్.—పరమహంస=సన్న్యాసులయొక్క; ఓఘ=సమూహముయొక్క; మహిమక్=సామర్థ్యమును. అడఁపఁజాలదె=అడఁగింపఁజాలదా. నీమందయానలీల. పరమహంసౌఘమహిమక్.—పరమ=ఉత్కృష్టములగు; హంస=రాజహంసలయొక్క; ఓఘ = బృందముయొక్క; మహిమక్=సామర్థ్యమును అడంపఁజాలదా యను నర్థాంతరము దోఁచుచున్నది. అగుటక్=ఈప్రకారము కావుటవలన. తల్లక్ష్మి చెలువందునట్టినీకుక్=ఆనీలవాలకాంత్యాదిసంపదచే నొప్పుచున్నట్టినీకు. పడఁతి=చిత్రరేఖా. ఒకమానిక్=ఒకమునిని. ఇలక్=భూమియందు. మోహపఱచుటెంత ?

చిత్రరేఖా! నీకుచులు ముఖము నూఁగారు నఖములు నీమందయానములే మునులధృతి దూల్చుచుండఁగఁ బుడమి నొకమునిని మోహపఱచుట నీకకించిత్కర మని భావము.

చ. అలవిరివింటిదంట ముద • మారఁగ నీవెనువెంట రా ధరా
స్థలి వడిఁ జేరి యామునియు • దారతపశ్శ్రమ మెల్ల మాన్చి యు
జ్జ్వలగతి వచ్చునీకుఁ జెలు • వా యొనగూర్తు వహింప నీసురా
బలలు శిరోనతిం బవలు • పంజులు చెంద్రికపావడక్ రహిన్. 52

టీ. చెలువా=చిత్రరేఖా. అలవిరివింటిదంట=దిట్టతనము గల యామన్మథుఁడు. ముదమారఁగక్=సంతసము నిండఁగా. నీవెనువెంట రాక్=నీవెంబడి రాఁగ. ధరాస్థలిక్ = భూప్రదేశమును. వడిక్=వేగమున. చేరి=పొంది. యామునియుదారతపశ్శ్రమమెల్లక్=ఆవసంతునియొక్క యెక్కుడైన తపశ్శెల్లను. మాన్చి=పోఁగొట్టి. ఉజ్జ్వలగతిక్=ప్రకాశించుగమనముచేత. వచ్చునీకుక్=వచ్చునట్టినీకు. ఈసురాబలలు=ఈ దేవాంగనలు. శిరోనతిక్=తలవంపును. వహింపక్=పొందునటుల. పవలుపంజులు=పగలుదివిటీలను. చెంద్రికపావడక్=కుసుమంపువస్త్రమును. రహిక్=ప్రీతితో. ఒనగూర్తుక్=ఇత్తును.

ఇల వసంతుని తపోభంగ మొనరించివచ్చునీకు నితరసురాంగనలకు లజ్జ గలుగునటుల నీకు పవలుపంజులు వస్త్రములు బహుమతిగా నిత్తు నని భావము.

తే. అని యనేకవిధంబుల ♦ నాదరంబు, దొలఁక రంభాదినిర్జరీ♦కులము లాత్మఁ
గలఁకచేఁ గుంద నప్పల్లు♦కలికిమగఁడు, చెలిమి నాచిత్రరేఖతోఁ ♦బలుకు నపుడు.

టీ. అని=ఈ ప్రకారము వచించి. అనేకవిధంబులన్=నానావిధరీతులచేత. ఆదరంబు=మన్నన. తొలఁకన్=అతిశయింపఁగ. రంభాదినిర్జరీకులములు=రంభ మొదలగు దేవాంగనలగుంపులు. ఆత్మన్=చిత్తమందు. కలఁకచేన్=కలఁతచేత. కుందన్=చింతింపఁగ. అప్పల్లుకలికిమగఁడు=బ్రహ్మ. చెలిమిన్=నెయ్యముతో. ఆచిత్రరేఖతో. పలుకునపుడు=మాటలాడుచుండఁగ.

సీ. ననసేసకొప్పు నొం♦దినయొంటిపేరచెంద్ర, కావిరుమాల విం♦తై వెలుంగ
రతికౌఁగిలింతఁ దో♦రపుఁజిక్కు గన్నమొ, గ్గలసరుల్ పేరెదఁ ♦ జెలువు మీఱ
నెలవంకరేఖల ♦ నిలిచి పైఁ జెదరుక, ప్పురపుగందపుఁదావి ♦ బుగులుకొనఁగఁ
గలికిగోణమ్ముపైఁ ♦ గట్టినక్రొత్తగే, దఁగిరేకువంకి యం♦దముగ మెఱయ
తే. చిలుకకోయిలమూఁకలు ♦ సేరి నడవఁ
గలువఱేఁ డామనియుఁ బార్శ్వ♦ముల రహింప
శారికలు నైజజయవిద్య♦చయముఁ జదువ
వేడ్కఁ జనుదెంచె నపుడు పూ♦వింటిజోదు. 54

టీ. ననసేసకొప్పున్=పుష్పయుక్తమగుకొండెసిగను. ఒందినయొంటిపేరచెంద్రకావిరుమాల=పొందినట్టి యొంటిపడతగలచెంగావితలగుడ్డ. వింతై=చిత్రమయినదై. వెలుంగన్=ప్రకాశింపఁగ. రతికౌఁగిలింతన్=రత్యాలింగనముచేత. తోరపుఁజిక్కుగన్న మొగ్గలసరుల్=మిక్కిలి పెనఁగిన మొగ్గలతోఁగూర్చినహారములు. పేరెదన్ = విశాలమగు వక్షమునందు. చెలువుమీఱన్ =అందముచే నతిశయింపఁగ. నెలవంకరేఖలన్=నఖక్షతములందు. నిలిచి=తగులుకొని. పైఁ జెదరుకప్పురపుగందపుఁదావి = మీఁదికెగయుచున్న కర్పూరగంధముయొక్క పరిమళము. బుగులుకొనఁగన్=నెఱసికొనఁగ. కలికిగోణమ్ముపైన్=సుందరమగు కాసెదట్టిపైన. కట్టినక్రొత్తగేదఁగిరేకువంకి=కట్టినట్టి నూతనమగు కేతకీదళమనెడుబాకు. అందముగన్=సుందరముగ. మెఱయన్=ప్రకాశించుచుండఁగ. చిలుకకోయిలమూఁకలు=శుకపికసేనలు. చేరి నడవన్ = సమీపించి నడచుచుండ. కలువఱేఁడు నామనియున్ = చంద్రుఁడును వసంతుఁడును. పార్శ్వములన్=ఇరుప్రక్కలయందు. రహింపన్= ఒప్పుచుండఁగ. శారికలు = గోరువంకపక్షులు. నైజజయవిద్యచయమున్ = తనసంబంధమగు బిరుదులను. చదువన్ = పఠింపఁగ. వేడ్కన్=సంతసముచే. పూవింటిజోదు = మన్మథుఁడు. అరుదెంచెన్ =వచ్చెను.

మ. వలరాజట్లరుదేర యానలువ దీ♦వ్యద్రత్నసింహాసన
స్థలి నెయ్యన్ డిగి చేర వచ్చి నతి నొం♦దం బాణిచే నెత్తి య
ర్మిలితోఁ గౌఁగిటఁ గూర్చి యంత రతినా♦రీభర్తతో నందదు
జ్జ్వలపీఠిన్ వసియించెఁ జెంగటనె ని♦ల్వం దద్బలవ్రాతముల్. 55

టీ. వలరాజు=మన్మథుఁడు. అట్లు=పూర్వోక్తప్రకారమున. అరుదేరన్=రాఁగ. అలువ=ఆ బ్రహ్మదేవుఁడు. దీవ్యద్రత్నసింహాసనస్థలిన్.—దీవ్యత్=ప్రకాశించుచున్న; రత్నసింహాసనస్థలిన్=రత్నమయసింహాసనమునుండి. ఒయ్యన్=శీఘ్రముగ. డిగి=దిగి. చేర వచ్చి=సమీపమునకు వచ్చి. నతి నొందన్=నమస్కరింపఁగ. పాణిచే నెత్తి=హస్తముతో లేవఁదీసి. అర్మిలితోన్=ప్రేమతో. కౌఁగిటఁ గూర్చి=కౌఁగిలించి. అంతన్=అటుపిమ్మట. రతినాథభర్తతోన్=మన్మథునితో. నందదుజ్జ్వలపీఠిన్=ఆనందకరమగు పీఠమందు. తద్బలవ్రాతముల్.—తత్=ఆమన్మథునియొక్క; బల = సేనలయొక్క; వ్రాతముల్ = సమూహములు. ప్రేఁగటనె నిల్వన్=సమీపమునందె నిల్వఁగ. వసియించెన్=కూర్చుండెను.

నలువ మన్మథుఁడు రాఁగానే యెదుర్కొని కౌఁగిలించి రత్నమయసింహాసనముపైఁ గూర్చుండఁబెట్టుకొనె ననిభావము.

చ. ఘనవినయాత్ము నున్నయల♦కంజశరుం దిలకించి యవ్విరిం
చనుఁ డనురక్తిఁ దోఁప చతు♦రానని నొక్కటి యై రహించుతి
న్ననిమధురోక్తిఁ బల్కె రతి♦నాయక నిన్గనుగొన్న నామదిన్
మనిచె బ్రమోదసంతతి ర♦మాపతిఁ గాంచినదారి నియ్యెడన్. 56

టీ. ఘనవినయాత్మన్=అధిక మగువినయము గలబుద్ధిచేత. ఉన్నయలకంజశరున్=ఉండినట్టియామన్మథుని. తిలకించి=చూచి. అవ్విరించనుఁడు=ఆ బ్రహ్మదేవుఁడు. అనురక్తి తోఁపన్=అనురాగ ముదయింపఁగా. చతురాననిన్=నాలుగుముఖముల చేత. "చతుర్ణామాననానాంసమాహారశ్చతురాననీ, సంఖ్యాపూర్వోద్విగుః" అనిసమాసము. ఒక్కటి యైరహించు తిన్ననిమధురోక్తిన్ = ఒక్కటైనమృదుమధురోక్తిని. పల్కెన్=పలికెను. రతినాయక=మన్మథుఁడా. నిన్గనుగొన్నన్=నిన్ను చూడఁగ. నామదిన్=నామనస్సునందు. రమాపతిన్=విష్ణుమూర్తిని. కాంచినదారిన్=చూచినరీతిని. ఇయ్యెడన్=ఇపుడు. ప్రమోదసంతతి=ప్రమదమును. మనిచెన్=వృద్ధిఁ బొందించెను.

చ. సరసతరానమాస్త్రములు ♦ సంతతజీవికశింజినీలతా
స్ఫురితశరాసనోత్తమముఁ ♦ బూని తలంపఁగ మేటి వై సుమా
కరసఖ నీవు రాజిలఁగఁ ♦ గాదె సమస్తజగజ్జనుల్ పర
స్పరపరిపై మతీగతులు ♦ బాసి ప్రియప్రమదాప్తి నుబ్బుటల్. 57

టీ. సరసతరాసమాస్త్రములు.—సరసతర=మిక్కిలి శ్రేష్ఠమగు. అసమ=సాటిలేని. అస్త్రములు=బాణములు, మకరందముతోఁ గూడుకొన్నపూఁదూఁపు లని తోఁచుచున్నది. సంతతజీవికశింజినీలతాస్ఫురితశరాసనోత్తమమున్.—సంతతజీవిక=అవిచ్ఛిన్న మయినజీవనముగలిగిన, మిక్కిలి సామర్థ్యము గలదనుట; శింజినీలతా = అల్లెత్రాటిచేత, తుమ్మెదనారి యని తోఁచుచున్నది; స్ఫురిత = ప్రకాశించుచున్న; శరాసనోత్తమమున్= మేటివింటిని. పూని=గ్రహించి. ఇక్షుధనువును గ్రహించియనిభావము. తలంపఁగన్ = ఆలోచింపఁగ. మేటి వై=అగ్రేసరుఁడ వై. సుమాకరసఖ=వసంతునకు సఖుఁడ వైనమన్మథుఁడా. నీవు రాజి

లఁగఁగాదె=నీవు సర్వోత్కర్షముగ నుండుటవలనఁగదా. సమస్తజగజ్జనుల్=ఎల్లజగములలో నుండుజనులు. పరస్పరపరివైమతీగతులు.—పరస్పర = అన్యోన్యము; పరివైమతీగతులు= ప్రణయకలహాదులవలన వైనమనస్తాపములను. పాసి=నడలి. ప్రియప్రమదాప్తిన్ = సంతోషముచే. ఉబ్బుటల్ = విజృంభించుటలు.

చెఱకువిల్లు పూఁదూఁపులును తుమ్మెదనారియుఁ బూని నీవు విజృంభించు చుండఁగఁ గదా సమస్తజనులు వైమతులఁబాసి విజృంభింతు రని భావము.

సీ. మునిభామకై యింద్రుఁ • బెనుఁగోడి గా లసద్ధృతిఁ దూల్చి మించిన • దిట్టతనము
నొక్కకాత్యాయని • నొందంగ సెగకంటి, పౌరుషం బర చేసి • ప్రబలు నేర్పు
హంసాఖ్యఁ దగు కైర • వారిపితృప్రసూవి, సంపర్కగతిఁ గూర్చి • యొప్పు చలము
గురుపత్నిఁ గలయ స • త్కులనేత యగువాని, సతతంబుఁ గుందించు • చతురవృత్తి

తే. నఖిలభువనాభినవ్యమ • హాద్భుతౌఘ, కల్పనానర్గళస్ఫూర్తిఁ • గాంచి వెలయ
మాదృశుల కెన్న నలవియె • మంజుకంజ, బాణజితలోకజాల శం • బరవిఘాల.

టీ. మునిభామకై=అహల్యకై. ఇంద్రున్=దేవేంద్రుని. పెనుఁగోడిగాన్=కుక్కుటము గా. లసత్=ప్రకాశించుచున్న. ధృతి=ధైర్యమును. తూల్చిమించిన=పోఁగొట్టి అతిశయించిన. దిట్టతనమున్=సామర్థ్యమును. ఇచట పెనుఁగోడిగాల ననుచోట పెద్ద కోడిగపుఁజేష్టలచేత నని యర్థాంతరము దోఁచుచున్నది. ఒక్కకాత్యాయనిన్=ఒక్కతి యైనపార్వతిని. "ఉమా కాత్యాయని" యని అమరుఁడు. ఒందంగన్=పొందుటకు. సెగకంటిపౌరుషంబు=ఈశ్వరశరీరమును. అర చేసి=సగము చేసి. ప్రబలు నేర్పున్=అతిశయించిన నైపుణ్యమును. ఈచరణమందు; నొక్కకాత్యాయనిన్=సగమేఁడ్లు గలముదిమి ముదితను. "కాత్యాయన్యర్ధవృద్ధాచ" అని యమరుఁడు. సెగకంటిపౌరుషమును=సెగకంటిరొమ్ముశరీరధర్మమను నర్థమును దోఁచుచున్నది. హంసాఖ్యన్=సూర్యనామముచేత. తగు=ఒప్పుచున్న. కైరవారి=ఆదిత్యునికి. పితృప్రసూవిసంపర్కగతిన్.—పితృప్రసూ=సాయం సంధ్యయొక్క, "సాయంసంధ్యాపితృప్రసూః" అని అమరుఁడు. విసంపర్కగతిన్ = విశేషసంబంధమును; కూర్చి=కలుగఁజేసి. ఒప్పుచలమున్=ఒప్పిదమగుమాత్సర్యమును. హంసాఖ్యఁదగు=పరమహంస యనుప్రసిద్ధినొందు. కైరవారి.పితృప్రసూవిసంపర్కగతిన్=తండ్రివలనఁబుట్టినవానియొక్క, తోఁబుట్టుస్త్రీలయొక్క యని భావము. విసంపర్కగతిన్=విశేషసంబంధమును గూర్చి యనునర్థము దోఁచుచున్నది. గురుపత్నిఁగలయన్ = బృహస్పతిభార్యయగు తారను గలయుటకు. సత్కులనేతయగువానిన్=రిక్కలఱేఁడగు నెలను. సతతంబున్=ఎల్లప్పుడును. కుందించుచతురవృత్తి=క్షీణింపఁజేయుచాతుర్యమును. గురుపత్నిన్ కలయన్=ఉపాధ్యాయభార్యను గలయుటకు. మంచికులమువారిలోఁ బెద్దను సతతంబుఁ గుందించు ననునర్థము ధ్వనించుచున్నది. అఖిలభువనాభినవ్య మహాద్భుతౌఘకల్పనానర్గళస్ఫూర్తిన్.—అఖిలభువన=సమస్తలోకములకు; అభినవ్య=మిక్కిలి నూతనమగు; మహాద్భుతౌఘ = అత్యాశ్చర్యసంఘముయొక్క; కల్పన=కల్పించుటయందు; అనర్గళ = నిరంకుశమగు; స్ఫూర్తిన్=సామర్థ్యమును. కాంచి=పొంది. వెలయన్=

ప్రకాశింపఁగా. మాదృశులకు=మాబోఁటివారికి. ఎన్నన్=గణించుటకు. మంజుకంజబాణజితలోకజాల=మనోహరమగుపద్మబాణములచేజయింపఁబడినలోకసమూహము గలవాఁడా. శంబరవిఘాల=శంబరాంతకుఁడా. అలవియె=వశమా.

ఇంద్రశివసూర్యచంద్రులధృతిఁ దూల్చి కామపరతంత్రులఁ జేసిననీసామర్థ్యము నెన్న మాబోఁటివారి కలవి గా దని తాత్పర్యము.

చ. కను గలవిల్లు పూని కడు♦గాటపుసంపెఁగ మొగ్గముల్కిచాల్
గొని కలనాదసైన్యములుఁ ♦ గొల్వఁగ పీవలి తేరి నెక్కి నీ
వనికి రమాకుమారక భు♦జాంచితశక్తిఁ గడంగ డాఁగఁడే
ఘనకరవీరసూనదరిఁ ♦ గాలవిరోధి భయావిలాత్ముఁడై. 59

టీ. రమాకుమారక= మన్మథుఁడా. నీవు. కనుగలవిల్లుపూని = చెఱకువింటిని గ్రహించి. కడుగాటపుసంపెఁగ మొగ్గముల్కిచాలు.—కడుగాటపు=మిక్కిలి అధికమైన; సంపెఁగ మొగ్గ=చంపకకోరకములనెడు; ముల్కిచాలు=బాణబృందమును. కొని = గ్రహించి. కలనాదసైన్యములు=కోవిల లనుసైనికులు. కొల్వఁగన్=సేవింపఁగ. పీవలితేరినెక్కి=మందమారుత మనెడురథము నెక్కి. భుజాంచితశక్తిన్ =భుజబలము చేత. అనికిన్=యుద్ధమునకు. కడంగన్= ప్రయత్నింపఁగా. కాలవిరోధి=శంకరుఁడు. భయావిలాత్ముఁడై=భయము చేఁ గలఁత గొన్నమనసు గలవాఁడై. ఘనకరవీరసూనదరిన్.—ఘన = అధికమగు; కరవీరసూన=గన్నేరుకుసుమ మనెడు; దరిన్=గుహయందు. డాఁగఁడే=దాఁగఁడా యనికాకువు.

క. అని వినుతిపూర్వకంబుగ, మనసిజునిం బలికి యపుడు♦మఱియు నతనితోన్
తనకార్య మెల్లఁ దేటగ, వనజాననుఁ డిట్లు వలుకు ♦ వరమృదుఫణితిన్. 60

టీ. అని=ఈప్రకారము. వినుతిపూర్వకముగన్=స్తుతిపూర్వకముగ. మనసిజునిన్= వలరాజును. పలికి=వచించి. అపుడు=ఆసమయమందు. మఱియున్=ఇంకను. అతనితోన్= ఆమన్మథునితో. తనకార్య మెల్లన్=తనకార్యమంతయు. తేటగన్=వెల్లడిగ. వనజాననుఁడు=నలువ. ఇట్లు=వక్ష్యమాణప్రకారమున. వరమృదుఫణితిన్=శ్రేష్ఠమగుమృదువాక్యమును. పలుకున్=పలికెను.

శా. వింటే మన్మథ మత్ప్రభుత్వమున కు♦ర్విం బుట్టువిఘ్నావళిన్
గెంటం దార్చుచు మామకాత్మహితభం♦గిన్ మించు నీ వుండుటల్
కంటం గానక బ్రహ్మభావమున కా♦కాంక్షించి యొక్కండు పెన్
గొం టై యాముని దెచ్చినాఁ డిటఁ దపశ్శి♦కుల్యాధ్వసంచారితన్. 61

టీ. మన్మథ=మన్మథుఁడా. మత్ప్రభుత్వమునకున్=నాదొరతనమునకు. ఉర్విన్=భూమియందు. పుట్టువిఘ్నావళిన్=ఉదయించునంతరాయములను. గెంటందార్చుచు=చలింపఁజేయుచు. మామకాత్మహితభంగిన్ = నాశరీరమునకొఱకు హితమైనవిధము చే. మించునీవుండుటల్ = అతిశయించు నీవునికిని. కంటంగానక=చూడక. బ్రహ్మభావమునకు=బ్రహ్మత్వ

మునకు. ఆకాంక్షించి = ఆసపడి. ఒక్కఁడు పెక్కొంటె యాముని= ఒక దుష్టతపస్వి. తపఃకుల్యాధ్వసంచారితన్.-తపఃకుల్యా = తప మనుకృత్రిమనదియొక్క. అధ్వసంచారితన్ = మార్గసంచారముచేత. ఇటన్=ఇచ్చటికి. తెచ్చినాఁడు. వింటే=వింటివా.

అనఁగా పుడమి నాబ్రహ్మత్వమునకుఁ బుట్టినట్టి యంతరాయములను బోఁగొట్టి నీయుని కశ్రీయుక నొక జడదారి బ్రహ్మత్వమును గోరి తపం బొనరించుచున్నాఁ డని భావము.

చ. ముని యజభావ మంద తపముల్ గడుఁ జేసినఁ జేయుఁ గాక పా
వన మనురాజజాతజపవైఖరి మించిన మించుఁ గాక ని
త్యనియమవృత్తిఁ దాల్చినఁ దాలుచుఁ గాక విచార మేల నో
మనసిజ నాకు నీవు బలుమక్కువతమ్ముఁడ వై చెలంగఁగన్. 62

టీ. ఓమనసిజ=మన్మథుఁడా. ముని=వసంతుఁడు. అజభావ మందన్=బ్రహ్మత్వము నొందుటకు. తపముల్=తపంబులు. కడున్=మిక్కిలి. చేసినన్=ఒనరించినను. చేయుఁగాక=ఒనరించుఁగాక. పావనమనురాజజాతజపవైఖరి.—పావన=పవిత్రమగు; మనురాజజాత=మంత్రరాజసమూహముయొక్క; జపవైఖరిన్=జపరీతిచేత. మించినన్=అతిశయించినను. మించుఁగాక=అతిశయించునుగాక. నిత్యనియమవృత్తిన్=ఎల్లపుడు నియమవృత్తిని. తాలిచినం దాలుచుఁగాక=ధరియించిన ధరియించునుగాక. నాకు నీవు. బలుమక్కువ తమ్ముఁడవై చెలంగఁగన్=మిక్కిలి ప్రేమగల తమ్ముఁడవై యుండఁగా. విచారమేల = చింతయేందుకు, చింత పనిలేదని భావము. పలువ విష్ణుమూర్తినాభికమలమందు జన్మించినవాఁ డగుటచే మన్మథున కన్న యని భావము.

చ. హరి సకలాధిపత్యము సుమాశుగ మా కొనఁగూర్చె మున్ను త
త్పరిభవకార్యసంప్రాతియుఁ దత్పరిపాలనముల్ ఘటింపఁగా
నిరతముఁ గర్త వీ వగుట నేర్పున నీ విలఁ జేరి తన్మునీ
శ్వరతప మెల్లఁ దూల్పఁదగు సారమహామహిమంబు లెంచఁగన్. 63

టీ. హరి=విష్ణుమూర్తి. మున్ను=పూర్వమందు. సుమాశుగ=మన్మథుఁడా. సకలాధిపత్యము=సమస్తభువనాధిపత్యము. మా కొనగూర్చెన్=మాకు కలుగఁజేసెను. తత్పరిభవకార్యసంప్రాతియున్.— తత్=ఆయాధిపత్యముయొక్క; పరిభవకార్య=తిరస్కారకార్యముయొక్క. సంప్రాతియున్=ప్రతిక్రియయును. తత్పరిపాలనమున్ = ఆయాధిపత్యపరిపాలనమును. ఘటింపఁగాన్=ఘటింపఁజేయుటకు. నిరతమున్=ఎల్లపుడును. కర్తవీవగుటచేన్=కర్తవు నీవగుటవలన; నేర్పునన్=జాణతనముచేత. నీవు ఇలఁజేరి=నీవుపుడమిని ప్రవేశించి. సారమహామహిమంబు లెంచఁగన్= పరాక్రమాతిశయము లెంచఁగ. తన్మునీశ్వరతప మెల్లఁదూల్పఁదగున్ = ఆమునీశ్వరునియొక్క తపస్సునకు భంగముఁ జేయవలయును.

చ. అనఘ కలాకలాపిని య నల్పవిలాసిని చిత్రరేఖ పే
రను దగు నీవధూనికర రత్నము నీవెను వెంట రాఁగ వే
చని ధరఁ జేరి యానియమి చంద్రుతపం బెడలించి వానిఁ దూ
ల్చి నిజశక్తి నేతదబలా పరిచారకుఁ జేయు మంగజా. 64

టీ. అంగజా=మన్మథుఁడా. అనఘకలాకలాపిని.—అనఘ=అమోఘములైన; కలా=మన్మథవిద్యలే; కలాపిని=భూషణముగా కలిగినట్టియు. అనల్పవిలాసిని.—అనల్ప = అధికమగు;విలాసిని=విలాసములు గలిగినట్టియు. చిత్రరేఖపేరను=చిత్రరేఖ యను పేరిచేత. తగు=ఒప్పుచున్నట్టి. ఈవధూనికరరత్నము = ఈనారీకులరత్నము. నీవెనువెంటన్ = నీవెంబడి. రాఁగన్=వచ్చుచుండఁగ. వేచని=శీఘ్రముగ వెళ్ళి. ధరఁజేరి=పుడమినొంది. అనియమిచంద్రుతపంబు=ఆవసంతునితపమును. ఎసలించి=తొలఁగించి. వానిఁదూల్పన్=ఆమునిని దూలించుటకై. నిజశక్తిన్=స్వసామర్థ్యముచేత. ఏతదబలాపరిచారకన్.—ఏతదబలా=ఈచిత్రరేఖకు. పరిచారకన్=సేవకునిఁగా. చేయుము=ఒనర్పుము.

చ. అలికవిలోచనోగ్రతప • మంతయు ము న్నడఁగించినట్టినీ
బలము చలంబు దివ్యశర•పాండితి నేఁడును జూపి మౌని ని
చ్చెలువ కధీనుఁ జేయు మిఁకఁ • జెప్పెడి దేమి రతీశ సర్వముం
దెలిసిననీకు దీనఁ దగ నిల్పుము • మద్భువనాధిపత్యమున్. 65

టీ. రతీశ=మన్మథుఁడా.మున్ను=పూర్వమందు.అలికవిలోచనోగ్రతప మంతయున్=శంకరునితీక్ష్ణతపమంతయు. అడఁగించినట్టినీబలము=పోఁబెట్టినట్టి నీ సామర్థ్యము.దివ్యశర పాండితి=అమోఘ మగుబాణవిద్యాపాండిత్యము నేఁడును = ఇపుడును. చూపి = కనిపింపఁజేసి. మౌనిన్=మునిని. ఇచ్చెలువకు=ఈసురాంగనకు. అధీనున్=స్వాధీనునిఁగా. చేయుము= ఒనరించుము. సర్వముం దెలిసిననీకు=సర్వజ్ఞుఁడ వగునీకు. ఇఁకన్=ఈమీఁద. చెప్పెడిదేమి=చెప్పవలసిన దేమియున్నది. "శ్లో. కిమర్పితాత్మభారాణాం వక్తవ్య మవశిష్యతే" యనున్యాయమువలన నీకుఁ దెలుపున దేమియును లే దనిభావము. దీనన్=దీనివలన. మద్భువనాధిపత్యమున్=నాలోకాధిపత్యమును. తగన్=యుక్తముగ. నిలుపుము=ఉంపుము.

ఉ. నా విని నల్వఁ జూచి రతి•నాయకుఁ డిట్లను వాగధీశ యి
ట్లీవు వచింపఁగాఁ దగవె • యీఘనకార్యభరంబు నాది నా
దే విబుధుల్ నుతింప జగ•తీస్థలిఁ జేరి మునీంద్రు దేవరా
జీవదళాక్షితో నెనయఁ • జేసెద మానుము వంత నెమ్మదిన్. 66

టీ. నా విని=ఈప్రకారము వచింపఁగావిని.రతినాయకుఁడు=మన్మథుఁడు.నల్వఁ జూచి=బ్రహ్మనుజూచి. ఇట్లనున్=వక్ష్యమాణప్రకారమునఁ బలికెను.వాగధీశ=నలువా. ఇట్లు=పూర్వోక్తప్రకారమున.ఈవు=నీవు. వచింపఁగాఁదగవె=వచించుటఉచితమా.ఈఘనకార్యభరంబు=ఈగొప్పకార్యభారము.నాది కాదే=నాదికాదా యని కాకువు. విబుధుల్ నుతింపన్=దేవతలు స్తుతి చేయఁగ.జగతీస్థలిఁజేరి=పుడమి సొచ్చి. మునీంద్రున్=వసంతుని. దేవరాజీవదళాక్షితోన్=దేవాంగనతో. ఎనయఁజేసెదన్=కలయునటుల చేసెదను. నెమ్మదిన్=మనసునందు. వంత=దుఃఖము. మానుము=వదలుము.

చ. అళితతిపోటుఁగూఁత లెగ•యం జెనుమావులు డిగ్గి చిల్కరా
తులు నడవన్ మహాబలము • దోడ్తన చుట్టికొనం దపస్విని

శ్చలధృతి సాలమండలము ♦ చయ్యన లగ్గలు వట్టి పట్టి యీ
నెలఁతయురోజదుర్గతటి ♦ నిల్పెదఁ దత్పటువ్యాప్తహీవిభున్. 67

టీ. అళితతిపోటుఁగూఁతలు=తుమ్మెదగుంపులకూరవాక్యములు. ఎగయన్=అతిశయించుచుండఁగ. చిల్కరౌతులు=శుకము లనురౌతులు. పెనుమావులు=పెద్దచూతవృక్షము లనుగుఱ్ఱములను. డిగ్గి=దిగి. నడవన్=నడచుచుండఁగ. మహాబలము=పిపీలి యనుసైన్యము. తోడ్తన=వెంటనే. చుట్టికొనన్=ఆవరింపఁగ. తపస్వినిశ్చలధృతి సాలమండలము.—తపస్వి=మునియొక్క; నిశ్చల=చలింపని; ధృతి = ధైర్యమను; సాలమండలము = ప్రాకారమండలము. "ప్రాకారో వరణ స్సాలః" అని అమరుఁడు. చయ్యనన్=శీఘ్రముగ. లగ్గలువట్టిపట్టి=ప్రాఁకిప్రాఁకి. ఈనెలఁతయురోజదుర్గతటిన్ = ఈచిత్రరేఖయొక్క పర్వతతుల్య మగు స్తనము లనెడుకోటయందు. తత్పటువ్యాప్తహీవిభున్.—తత్=ఆమునియొక్క; పటువ్యాప్తహీవిభున్=హృదయ మనుభూపతిని. నిల్పెదన్=బంధింతును.

చ. అన మరుఁ బల్కునం బ్రమద ♦ మంది విరించి సువర్ణచేలముల్
ఘనమణిభూషణంబు లల♦కంతునకున్ సురకాంతకుం బ్రియం
బెనయ నొసంగి యంతరజ♦నీశ వసంతసమీరతామ్రలో
చనవరముఖ్యమారబల♦సంతతి నాధృతి సేసి యిట్లనున్.

టీ. అనన్=ఈప్రకారము పలుకఁగ. మరుపల్కునన్=మన్మథవాక్యముచేత. విరించి=నలువ. ప్రమదమంది=సంతసించి. సువర్ణచేలముల్=కనకాంబరములను. ఘనమణిభూషణంబులు.—ఘన=అధికమగు; మణిభూషణంబులు = మణిమయాభరణములు. అలకంతునకున్=మన్మథునికి. సురకాంతకును=దేవాంగనకును. ప్రియంబు=ప్రేమము. ఎనయన్=పొందునటుల. ఒసంగి=ఇచ్చి. అంతన్=అటుపిమ్మట. రజనీశవసంతసమీరతామ్రలోచనవరముఖ్యమారబలసంతతిన్.—రజనీశ=చంద్రుఁడు; వసంత=ఆమని; సమీర=వాయువు; తామ్రలోచన=పికము; వర=శ్రేష్ఠమగు; ముఖ్య=ఆదిగాగల; మారబలసంతతిన్=మన్మథసైన్యసంఘమును. ఆధృతి సేసి=ఆదరించి. ఇట్లు=వక్ష్యమాణప్రకారము. అనున్=పలికెను.

అనఁగా మునితపోభంగ మొనరింప సమకట్టి యున్నమన్మథునకును దేవాంగనకును కనకాంబరములు మణిభూషణములును బహుమతిగా నొసంగి మన్మథసహాయు లగుచంద్రవసంతాదులను ప్రియోక్తుల నాదరించె నని భావము.

సీ. తెఱవ నవ్వుల యోగి♦ధృతిఁ గలంపక మున్న
నెఱియు వెన్నెలలు పై ♦ నింప వన్న,
నెలఁత కేలను మాని ♦ కళ లంటకయ మున్న
చిగురాకు నెమ్మేనఁ ♦ జేర్చ వన్న,
నకిపైఁట యతిఁ జొక్కఁ ♦ జక్కవీవకమున్న
ప్రబలుచల్లఁదనానఁ ♦ గ్రమ్మ వన్న,

చెలిపాట యమిమీను ♦ లలరఁ బాడకమున్న
కలనాదభంగికల్ ♦ తెలుప వన్న

తే. యోకుముదమిత్త్ర యోచైత్ర ♦ యోసమీర
యోపికాధీశ మీనేర్పు ♦ లొనరఁ జూపి
పడఁతి కాజడదారి లోఁ♦బఱప రన్న
మన్మనోభీష్టకార్యంబు ♦ మనుప రన్న. 66

టీ. తెలివ=చిత్రరేఖ. నవ్వులన్=మందహాసముల చేతను. యోగిధృతిన్ = మునియొక్క ధైర్యమును. కలంపకమున్న=కలఁతపఱపకముందె. నెఱయు వెన్నెలలు = వ్యాపించు చంద్రికలను. పైనింప వన్న=పైఁగప్పుమా. నెలఁత=చిత్రరేఖ. కేలన్=హస్తముచేత. మాని కళలు=వసంతునియొక్క కళాస్థానములను. అంటకయున్న = స్పృశింపకమునుపే. స్త్రీపురుషులకునొక్కొక్కదినమందు నొక్కొక్కయంగమునఁ గళయుండుట కళాశాస్త్రప్రసిద్ధము. చిగురాకునెమ్మొనన్=చిగుటాకుయొక్క యగ్రముచే. చేర్పవన్న=కూర్పుమా. సకి=చిత్రరేఖ. పైఁటన్=పైఁటకొంగుచేతను; అనఁగ ముసుఁగుకొంగుచేతను. యతిన్=మునిని. చొక్కన్=పరవశపడునటులు. చక్కన్=అనుకూలముగ. వీవకమున్న = విసరకమునుపే. ప్రబలుచల్లఁదనానన్=అధికమగుచల్లఁదనముచేత. క్రమ్మవన్న=పైకొనుమా. చెలి = చిత్రరేఖ. పాటన్=పాటను. యమిమీనులు=మునికర్ణములు. అలరన్=సంతోషించునటులు. పాడకమున్న=పాడకమునుపే. కలనాదభంగికల్.—కల=అవ్యక్తమధురమగు; నాద=ధ్వనులయొక్క; భంగికల్=రీతులను. తెలుపవన్న=తెలియఁజేయుమా. ఓకుముదమిత్త్ర=ఓచంద్రుఁడా. ఓచైత్ర=ఓవసంతుఁడా. ఓసమీర=ఓమందమారుతమా. ఓపికాధీశ=ఓకోకిలరాజా. చంద్రాదులకుపూర్వచరణములందు క్రమముగా నన్వయమని యెఱుంగునది. మీనేర్పులు=మీజాణతనములను. ఒనరన్=ఒప్పునటులు. చూపి. పడఁతికిన్=చిత్రరేఖకు. ఆజడదారిన్ = ఆమునిని. లోఁబఱపరన్న=వశపఱుపుఁడీ. మన్మనోభీష్టకార్యంబు=నామనమున కిష్టమగుపనిని. మనుపరన్న=సిద్ధించునట్లు చేయుఁడీ.

చ. అని నిజమిత్త్రవర్యనిచ♦యంబుల నీగతిఁ బల్కి యమ్మరు
ద్వనధరవేణికామణి వి♦ధాత రహిం దన కొప్పగించి పం
చిన విరివింటిజోదు పిక♦సేనలతో సురవారిజాక్షితో
ఘన మగువేడ్క వొంగఁ దద♦గారము వెల్వడి వచ్చె నంతటన్. 67

టీ. విధాత=బ్రహ్మదేవుఁడు. అని=ఈప్రకారముగ. నిజమిత్త్రవర్యనిచయంబులన్.— నిజ = స్వకీయులగు; మిత్త్రవర్య = మిత్త్రశ్రేష్ఠులయొక్క; నిచయంబులన్ = సమూహములను గూర్చి. ఈగతిన్=ఈరీతిని. పల్కి=వచించి. అమ్మరుద్వనధరవేణికామణిన్ = మేఘతుల్యమగు వేణిగలయాసురాంగనారత్నమును. రహిన్=ప్రీతితో. తనకొప్పగించి=తనయధీనము చేసి. పంచినన్=పంపఁగ. విరివింటిజోదు=మన్మథుఁడు. పికసేనలతోన్=కోకిలబలములతో. సురవారిజాక్షితోన్=దేవాంగనతో. ఘన మగువేడ్కపొంగన్=అధికమగుసంతసముబుకఁగ. తదగారము=ఆవిరించిమందిరమునుండి. వెల్వడి=బయలుదేఱి. వచ్చెన్=వచ్చెను. అంతటన్=అటుపిమ్మట.

సీ. చిలుకతత్తడిరాతు • చేతితియ్యనివింటఁ, గాఢకృపీటజ • కాండ మెగసె
నుడురాజు పఱతెంచు • నెడఁ బుండరీకంబు, వికలత్వమున నిరా • వీథిఁ ద్రెళ్లెఁ
గపువలి కడ్డమై • వెఱఁ గూన్చె నలఘున, పద్య నవ్యాత్మభీ • ప్రదమహాహి
యామని రాఁగఁ జ • య్యన విగతచ్ఛదం, బుగఁ జూడఁబడె నప్డు • పురుషకాళి
తే. నిర్జరవధూటికావామ • నేత్రసీమ
జడిగొని పరిప్లవత్వంబు • నరగఁ దోఁచె
ని ట్లశకునంబు లేపున • నెన్ని యున్న
వానిఁ జూడక యధికగ • ర్వంబుతోడ. 68

టీ. చిలుకతత్తడిరౌతుచేతి తియ్యనివింటన్.—చిలుకతత్తడిరౌతు=మన్మథునియొక్క; చేతితియ్యనివింటన్ = హస్తమునందుండు నిక్షుధనువునుండి. గాఢకృపీటజకాండము.— గాఢ=అధికమగు; కృపీటజకాండము = అగ్నిసంఘము. ఎగసెన్ = పైకి వచ్చెను. కృపీట మనఁగ నుదకము, దానియందుఁబుట్టినది కృపీటజము. "కృపీటయోనిర్జ్వలనః" అనియగ్నికి జలమందుఁ బుట్టుటకు ప్రమాణము. పయినించియున్న వలరాజుయొక్క కార్ముకమునుండి యుల్కాపాత మవశకునమని భావము. ఇచట మన్మథునివింటివలన కృపీటజకాండ మనఁగ జలజబాణ మెగసె నని శబ్దశక్తిస్వభావముచే సహజార్థము దోఁచుచున్నది. ఉడురాజు= చంద్రుఁడు. పఱతెంచునెడన్=త్వరచేవచ్చుచున్నసమయమందు. వికలత్వమునన్=విచ్ఛేదము చేత. పుండరీకము=శ్వేతచ్ఛత్రము. ఇరావీథిన్=భూప్రదేశమందు. "ఇరా భూవాక్సురాప్సు స్యాత్" అని అమరుఁడు. త్రెళ్లెన్=పడెను. చంద్రుఁడు వచ్చుచుండఁగ గొడుగు విఱిగి భూమిపైఁబడుటచే నశకునమనిభావము. చంద్రోదయమందు పుండరీక మనఁగ తెల్లతామర చెడి, ఇరావీథి యనఁగ జలమధ్యమందుఁ ద్రెళ్లెనని సహజార్థము దోఁచు చున్నది. కపువలికిన్= మూపుతమునకు. అడ్డమై=అడ్డమైనదై. నవ్యాత్మభీప్రదమహాహి.—నవ్య = నూతనమగు; ఆత్మ= మనస్సునకు ; భీప్రద = భయమునిచ్చు ; మహాహి = గొప్పసర్పము, అలఘున పద్యన్ = ఆ గొప్పమార్గమునందు. వెఱఁగూన్చెన్=నిశ్చేష్టతకలిగించెను. మార్గమధ్యమందు పామడ్డమైనచో నశకునమనిభావము. అలఘునపద్యన్=ఆయాకాశమార్గమందు. అవ్యాత్మభీప్రదమహాహి.— అవి=సూర్యునియొక్క; "అవయశ్శైలమేషార్కాః" అని యమరుఁడు; ఆత్మ=శరీరమునకు; భీప్రద=భయప్రదమగు; మహాహి=గొప్పసర్పమగు రాహువు. వెఱఁగూన్చె ననిస్వభావార్థము శబ్దశక్తిచేఁ దోఁచుచున్నది. ఆమనిరాఁగన్=వసంతుఁడు రాఁగ. అప్డు=ఆసమయమందు. విగతచ్ఛదంబుగన్=వస్త్రహీనముగ. పురుషకాళి=పురుషబృందము. చయ్యనన్=శీఘ్రముగ. చూడఁబడెన్=అవలోకింపఁబడెను. వసంతుఁడుబయలుదేఱునపుడు దిగంబరమైనపురుషబృందముఁ జూచుట యశకునమనిభావము. వసంతుఁడు రాఁగా, పురుషకాళి=పున్నాగవృక్షములగుంపు. "పున్నాగే పురుషః" అని అమరుఁడు. విగతచ్ఛదంబుగన్ = రాలినయాకులు గలదై "ఛద స్త్విట్పటపర్ణయోః" అని విశ్వము. చూడఁబడె ననుస్వభావార్థము దోఁచుచున్నది. నిర్జరవధూటికావామనేత్రసీమన్.—నిర్జరవధూటికా=చిత్రరేఖయొక్క; అవామనేత్రసీమన్=కుడి

కంటిపట్టున. జడిగొని=అతిశయించి. పరిప్లవత్వంబు=చాంచల్యము. సరగన్=వేగముగ. తోఁచెన్=కనిపించెను. స్త్రీలకు దక్షిణనేత్రస్పంద మశకునః మనిభావము. చిత్రరేఖయొక్క వామనేత్రసీమననఁగా సుందరమగు నేత్రములయొక్క ప్రదేశమందు,పరిప్లవత్వముదోఁచెననుటసహజార్థము. ఇట్లు=ఈప్రకారము. అశకునంబులు=దుశ్శకునములు. ఏపునన్=అతిశయముచేత. ఎన్నియున్నన్. వానిఁజూడక=ఆ యశకునములను సరకుసేయక. అధికగర్వంబుతోడన్=ఎక్కుడు కావరముతో. కంజశరుఁడు ధాత్రిన్ దొరసె నని మీఁది కన్వయము.

మునితపోభంగ మొనరించుటకు అశకునములు దోఁచినను సరకుసేయక గర్వముతోఁ బోవుచు నని భావము.

మ. అలసత్యాధ్వము డిగ్గి యప్డు తప మొయ్యన్ దాఁటి దీవ్యజ్జన
స్థల మాపిమ్మట నొంది యంతట మహస్స్థానంబునుం బొంది వే
ల్పులరాపీడట వేడ్క డగ్గఱి భువర్లోకేంద్ర మవ్వేళఁ జే
రి లలిం గంజశరుండు దా దొరసె ధాత్రిన్ మేరుమార్గంబునన్. 69

టీ. కంజశరుండు=మన్మథుఁడు. అలసత్యాధ్వము=ఆసత్యలోకమార్గమునుండి. డిగి=దిగ్గి. అప్డు=ఆసమయమందు. తపమున్=తపోలోకమును. ఒయ్యన్=తిన్నగ. దాఁటి = అతిక్రమించి. దీవ్యజ్జనస్థలము=ప్రకాశించు జనర్లోకమును. ఆపిమ్మటన్=అటుపిమ్మట. ఒంది=పొంది. అంతటన్=అటుపిమ్మట. మహస్స్థానంబునున్=మహర్లోకమును. ఒంది=పొంది. అటన్=అటుపిమ్మట. వేల్పులరాపీడు=ఇంద్రపట్టణమును. వేడ్కన్=సంతోషముతో. డగ్గఱి=సమీపించి. అవ్వేళన్=ఆసమయమందు. భువర్లోకేంద్రము = భువర్లోకశ్రేష్ఠమును. చేరి=సమీపించి. లలిన్ = క్రమముగ. తాన్=తాను. ధాత్రిన్ = పుడమిని. మేరుమార్గంబునన్ = మేరుపర్వతమార్గముచేత. దొరసెన్=ప్రవేశించెను.

అనఁగా మన్మథుఁడు సత్యలోక తపోలోక జనర్లోక మహర్లోక స్వర్లోక భువర్లోకములను క్రమముగ దాఁటి భూలోకమును మేరుమార్గముచేఁ బ్రవేశించెనని భావము.

చ. ధర నిటు లొంది యంత సము దారగిరీనపురీఝరీదవో
త్కరముల నెల్లఁ గన్గొనుచుఁ గాముఁడు వింధ్యముఁ జేరె నందుఁ బ
ద్మరిపుసుతోర్మిజాంబుకణమండలపుష్పితనీపనిత్యభా
స్వర మగుపారిజాతవనవర్యము గన్నుల కింపుఁ గూర్పఁగన్. 70

టీ. కాముఁడు=మన్మథుఁడు. ధరన్=భూమిని. ఇటు లొంది= ఈప్రకారము పొంది. అంతన్=అటుపిమ్మట. సముదారగిరీనపురీఝరీదవోత్కరములన్.—సముదార = ఉత్కృష్టములగు; గిరీన=పర్వతశ్రేష్ఠములయొక్క; పురీ=నగరములయొక్క; ఝరీ=నదులయొక్క; దవ=వనములయొక్క; ఉత్కరములన్=సమూహములను. ఎల్లన్=సర్వమును. కన్గొనుచున్=చూచుచు. వింధ్యమున్=వింధ్యాద్రిని. చేరెన్=సమీపించెను. అందు=ఆవింధ్యపర్వతమందు. పద్మరిపు సుతోర్మిజాంబుకణమండల పుష్పితనీపనిత్య భాస్వరము.— పద్మరిపుసుతా=చంద్రునకు కూఁతురగునర్మదయొక్క; ఊర్మిజాంబుకణమండల=తరఁగలవలనఁ బుట్టినతుంపురులగుంపుల

చేత; పుష్పితనీపనిత్యభాస్వరము = పూచినకడిమిమ్రాఁకులచే నెల్లప్పుడును బ్రకాశమానము. అగు పారిజాతవనవర్యము=అగునట్టి పారిజాతవనశ్రేష్ఠము. కన్నులకున్ = నేత్రములకు. ఇంపుఁ గూర్పఁగన్ = ఆనందము కలుగఁజేయుచుండఁగ; షైపద్యముతో నన్వయము.

మన్మథుఁడు వింధ్యముఁజేరెను, అచ్చట గొప్పగొప్పపర్వతములను పర్వతములం దున్న నదులను జూచుచు నర్మదతరఁగలవలనఁ బుట్టినతుంపురులచేఁ జెన్నుమీఱు మంకెవమ్రాఁకులచేఁ బ్రకాశించుపారిజాతవనము తన కన్నులకు వేడుకఁ జేయుచుండఁగనని భావము.

చ. గురుజవశక్తి వచ్చి యొక • కోయిలవేగరి తద్వసంతభూ
సురతిలకాశ్రమం బిదియ • చుమ్మని తెల్పఁగఁ గంతుఁ డందు ని
ర్జరసతితో నిజాప్తవర • జాలముతో వసియించెఁ దత్ప్రసూ
నరసకులార్ద్రిమారుతము • నన్ స్వతనూశ్రమ మెల్లఁ బాయఁగన్. 71

టీ. కంతుఁడు=మన్మథుఁడు. గురుజవశక్తిన్.—గురు=అధికమగు; జవశక్తిన్=వేగసామర్థ్యముచేతను. ఒకకోయిలవేగరి = కోయిల యనునొకవేగులవాఁడు. వచ్చి = సమీపించి. తద్వసంతభూసురతిలకాశ్రమంబు = ఆవసంతుఁ డనుపేరు గలబ్రాహ్మణశ్రేష్ఠుని యొక్క యాశ్రమంబు. ఇదియచుమ్మని = ఇదే చూడుమని. తెల్పఁగన్=తెలియఁజేయఁగ. అందున్=ఆవనమందు. నిర్జరసతితోన్ = దేవాంగనతో. నిజాప్తవరజాలముతోన్.—నిజ=తనసంబంధియగు; ఆప్తవర=మేలైనయిష్టులయొక్క; జాలముతోన్=సమూహముతో. తత్ప్రసూనరసకులార్ద్రిమారుతమునన్.—తత్=ఆవనముయొక్క; ప్రసూనరస=పుష్పరసముయొక్క; కుల=సమూహముచే; ఆర్ద్రి=తడుపఁబడిన; మారుతమునన్=వాయువుచేత. స్వతనూశ్రమ మెల్లఁబాయఁగన్=మార్గగమనమువలననైనతనశరీరాయాసముతొలఁగునట్లు. వసియించెన్=నివసించెను.

వసంతుఁ డనుమునియొక్కయాశ్రమవన మిదియయనికోయిల చెప్పఁగ నాప్తవర్గముతో మన్మథుఁడందు నిలిచె నని భావము.

చ. చెలు వగుమైత్త్రిఁ గోయిలవ • జీరులఁ దుమ్మెదకమ్మగట్టుమూఁ
కల గొరువంకరాదొరల • గాటపుఁజిల్కలకాల్బలంబులన్
నలినకలంబవీరబల • నాథుఁడు చైత్రుఁడు తద్బలోచితో
జ్జ్వలలతికాకుటీపటలిఁ • జక్కఁగఁ బాళెము డించె నయ్యెడన్. 72

టీ. నలినకలంబవీరబలనాథుఁడు=మన్మథుఁ డనువీరునియొక్క సేనాధిపతి యగునట్టి. చైత్రుఁడు=వసంతుఁడు. చెలు వగుమైత్త్రిన్=ఒప్పు చున్నస్నేహముచేతను. కోయిలవజీరులన్=కోయిల లనుకూపులను. తుమ్మెదకమ్మగట్టుమూఁకలన్=తుమ్మెద లనుకమ్మగట్టులయొక్క సేనలను. గొరువంకరాదొరలన్=శారికాశ్రేష్ఠము లనుదొరలను. గాటపుఁజిల్కలకాల్బలంబులన్=దృఢములైన చిల్క లనుకాల్బలములను. తద్బలోచితోజ్జ్వలలతికాకుటీపటలిన్.—తద్బల = ఆ సేనలకు; ఉచిత=అనుకూలమగు; ఉజ్జ్వల=ప్రకాశించు; లతికా=తీవలయొక్క; కుటీ=గుడిసెలయొక్క; పటలిన్=సమూహమందు. అనఁగా లతాగృహములయందు. చక్కఁగన్= బాగుగ. ఆయ్యెడన్=ఆ సమయమందు. పాళెము=దండును. డించెన్ = దించెను.

అనఁగా మన్మథునికి సేనాధిపతి యగువసంతుఁడు కోయిలలుమొద లగుసేనాబృందముల ననుకూల మగులతాగృహముల విడియించె నని భావము.

సీ. చిగిరించునెఱకెంపు•చివురాకుగమి కట్టు, నట్టికౌసుంభాంబ•రాళిఁ బోలఁ
జాలఁ దోఁచిననూత్న•జాలకశ్రేణి మేల్, హురుమంజిముత్తెపు•సరులఁ బోల
నళులెక్కనరదోఁచు•తెలిపూలచాలు కై,శ్యములఁజేర్చినగర్భ•కములఁబోల
నలరుగుత్తులనిండ•నలరుపుప్పొడి గుబ్బ, కవలపై నలఁదుగం•దవొడిఁ బోల
తే. సరసశృంగారవైఖరి • ధరణిఁ బొదలు
లతిక లయ్యెడ వీక్షించు•కుతుక మొసఁగెఁ
జైత్రకాంతాగమనదిష్ట•సముచితౌజ్జ్వ
లీపరిభ్రాజదుత్తమా•లీల నొంది. 73

టీ. చివురించు నెఱకెంపు చివురాకుగమి.— చిగిరించు = పల్లవించుచున్న. నెఱకెంపు = మిక్కిలి యెఱ్ఱనైన. చివురాకుగమి = చిగురుటాకుగుంపు. కట్టునట్టికౌసుంభాంబరాళిన్ = ధరియించి యున్న కుసుంబా వస్త్రములసమూహమును. పోలన్ = పోలి యుండఁగ. చాలన్ = మిక్కిలి. తోఁచిన నూత్నజాలకశ్రేణి = ఉదయించియున్నక్రొత్త మొగ్గలచాలు. మేల్ హురుమంజి ముత్తెపుసరులన్.— మేల్ = శ్రేష్ఠమగు; హురుమంజిముత్తెపుసరులన్ = హురుమంజిదేశమందుఁ బుట్టిన ముత్తెములహారములను. పోలన్ = పోలి యుండఁగ ననియర్థము. అళులెక్కన్ = భృంగము లధిష్ఠింపఁగ. అర దోఁచు తెలిపూలచాలు = సగము గనిపించు తెల్లపూవులబంతి. కైశ్యములన్ = కేశసమూహములందు. "తద్వృన్దే కైశికం కైశ్యమ్" అని యమరుఁడు. చేర్చిన గర్భకములన్ = ఉంచిన లోపలిసరములను. పోలన్ = పోలియుండఁగ. "కేశమధ్యేతు గర్భకమ్" అని యమరుఁడు. అలరుగుత్తులన్ = పూగుత్తులయందు. నిండన్ = పూర్ణముగ. అలరుపుప్పొడి = ఒప్పుచున్న పుష్పపరాగము. గుబ్బకవల పైన్ = స్తనప్రదేశములమీఁద. అలఁదుగందవొడిన్ = పూసినబుక్కాను. పోలన్ = పోలియుండఁగ. సరసశృంగారవైఖరిన్.— సరస = మనోజ్ఞమగు; శృంగార = సౌందర్యముయొక్క; వైఖరిన్ = రీతిచేత. ధరణిన్ = పుడమియందు. పొదలులతికలు = వృద్ధిఁబొందుచున్న తీవలు. చైత్రకాంతాగమనదిష్ట సముచితౌజ్జ్వలీ పరిభ్రాజదుత్తమాలీలన్.— చైత్రకాంత = వసంతుఁ డనుప్రియునియొక్క; ఆగమనదిష్ట = ఆగమనవేళకు, అనఁగఁ బ్రియుఁడు వచ్చుసమయమున కనుట. సముచిత = అనుకూలమగు; ఔజ్జ్వలీ = ప్రకాశముచేత; పరిభ్రాజత్ = వెలుఁగుచున్న. ఉత్తమాలీలన్ = వరవర్ణినీవిలాసమును. ఒంది = పొంది. అయ్యెడన్ = ఆ సమయమందు. వీక్షించుకుతుకము = చూచు వేడుకను. ఒసఁగెన్ = ఇచ్చెను.

చిగురుటాకులు కుసుంబావస్త్రములను, మొగ్గలు హురుమంజిముత్యపుసరులను, తుమ్మెదలుముసరుటచే సగముగనఁబడు తెలిపూలచాలు కొప్పున ధరియించుసరములను, పుప్పొడిచేఁ గప్పఁబడినపూగుత్తులు గందవొడియలందినపాలిండ్లను, బోలియుండ, లతలు వసంతుఁ డను ప్రియుని యొక్క యాగమనసమయమున కుచితశృంగారవైఖరిని ధరియించి యుత్తమస్త్రీల

లీలను బొంది యుండెనని చెప్పుటచే లతలయందు వాసకసజ్జాత్వము దోఁచుచున్నది. ప్రియుఁడు రాఁగలఁడని సురతసామగ్రీసన్నాహముఁ జేసి తనువు నలంకరించుకొనునది వాసకసజ్జయని దానిలక్షణము.

ఉ. డాసె సుమాళిఁ దుమ్మెదమిటారి తమిం జివు రాని కోయిలల్
మ్రోసె రసాలకేసరసమూహసుగంధము దిక్తటంబులం
బూసె మెకంబు నెక్కుదొర ముమ్మను పైకొను కాఁకచే ధృతిం
బాసె వియోగి యోగివనపాళిక నామని యాక్రమింపఁగన్. 74

టీ. తుమ్మెదమిటారి=భృంగస్త్రీ; సుమాళిన్=పూబంతిని. డాసెన్=సమీపించెను. కోయిలల్=కోవెలలు. తమిన్=ఆసక్తితో. చివురు=చిగురాకును. ఆని=భక్షించి. మ్రోసెన్=ధ్వనిఁజేసెను. మెకంబునెక్కుదొర=వాయువు. రసాలకేసరసమూహసుగంధము.—రసాల=తియ్యమావులపూలయొక్క; కేసర=పొన్నపూలయొక్క; సమూహ=గుంపుయొక్క; సుగంధము=పరిమళమును. దిక్తటంబులన్=దిక్ప్రదేశములయందు. పూసెన్=లేపనము చేసెను. వియోగి=వియుక్తుఁడు. ముమ్మను=ముందుముందుగ; పైకొను కాఁకచేన్.—పైకొను=మీఱుచున్న; కాఁకచేన్=వేఁడిమిచేత. ధృతిన్=ధైర్యమును. పాసెన్=వదలెను. యోగివనపాళికన్=మునితపోవనమును. ఆమని=వసంతుఁడు. ఆక్రమింపఁగన్=ఆక్రమించుచుండఁగ.

అనఁగా వసంతకాలము రాఁగానే తుమ్మెదలు కుసుమములను జేరెననియు కోయిలలు గూసెననియు రసాలకేసరపుష్పములసుగంధము గలవాయువు వీసరె ననియు విరహులు ధైర్యము విడి రనియు భావము.

చ. మునివన మంతయుం దనచమూపతి యత్తఱి నాక్రమింప మిం
చినబలదర్పగౌరవముచే విషమాశుగవీరశేఖరుం
డని కిదె చుమ్ము వేళ యని యాప్తమతిం బికమంత్రి దెల్పఁ జ
య్యన వెడలెన్ రసాలవిశిఖాసనము సూనశరాళిఁ బూనుచున్. 75

టీ. మునివనము=వసంతమునియొక్క తపోవనము. అంతయున్=సర్వమును. తనచమూపతి=తనసేనాధిపతి యగునామని. అత్తఱిన్=ఆసమయమందు. ఆక్రమింపన్=ఆవరింపఁగ. పికమంత్రి=కోకిల మను సచివుఁడు. ఆప్తమతిన్=హితబుద్ధిచేత. అనికిన్=యుద్ధమునకు. ఇదెచుమ్ము=ఇదెచూడుము. వేళయని=సమయమని. తెల్పన్=తెలియఁజేయఁగ. విషమాశుగవీరశేఖరుండు=మన్మథవీరాగ్రేసరుఁడు. మించినబలదర్పగౌరవముచేన్.—మించిన=అతిశయించిన; బల=సారముయొక్క; దర్ప=గర్వముయొక్క; గౌరవముచేన్=గురుత్వముచేత. రసాలవిశిఖాసనము=రసాలబాణాసనమును. సూనశరాళిన్=పూఁదూపులసమూహమును. పూనుచున్=ధరించుచు. చయ్యనన్=శీఘ్రముగ. వెడలెన్=బయలుదేఱెను.

అనఁగాఁ దనచమూపతి యగువసంతుఁడు మునితపోవనము నాక్రమించినపిమ్మట పికమనుమంత్రి యుద్ధమునకు నిది సమయ మని తెలుపఁగ మన్మథుఁడు బాణబాణాసనములఁగొని వెడలెనని భావము.

సీ. అరిరాజచిత్తభీ♦కరకరకాండప్రచండిమ మనురాజ♦మండలంబు
క్రొందళంబులఁ జాలఁ ♦ గూర్చుక హరివితా,నములతోఁ జైత్రసే♦నావిభుండు
కన్నుల నెఱమంటఁ♦ గ్రక్కుచుఁ గలరుతుల్, బెరయ నానావన♦ప్రియబలంబు
కనకరజోరేఖఁ ♦ గనుపట్టువరగంధ, పటిమ రాజిలుమహా♦బలకులంబు
తే. తొలుదొలుతఁ దీవ్రవిస్ఫూర్తిఁ ♦ దోడరి నడవఁ
జిలుకమేల్పక్కిపై నెక్కి ♦ యలరువింటి
దంట యమ్మానిఁ గదిసె దు♦ర్దాంతశౌరి
కాళి యాత్మైకబిరుదప♦ద్యములు చదువ. 76

టీ. అరిరాజ చిత్త భీకరకరకాండ ప్రచండిమన్.—అరిరాజ=శత్రురాజులయొక్క. చిత్త=మనసునకు. భీకర= భయంకరమగు. కర=హస్తమందున్న; కాండ=బాణములయొక్క; ప్రచండిమన్=ప్రాబల్యముచేత. మనురాజమండలంబు=వర్తించుక్షత్రియబృందము. ఇచట అరిరాజచిత్తభీకర=శ్రేష్ఠములగుజక్కవలయొక్క చిత్తమునకు భయంకరమగు, కరకాండ=కిరణసమూహముయొక్క, ప్రచండిమచే వర్తించు,రాజమండలము=చంద్రమండలమని స్వభావార్థము దోఁచుచున్నది. క్రొందళంబులన్ =క్రొత్తసేనలను. చాలన్ = మిక్కిలి. కూర్చుక =జతపఱుచుకొని. హరివితానములతోన్ = గుఱ్ఱపుగుంపులతో. జైత్రసేనావిభుండు = జయశీలుఁడగుసేనాధిపతి.ఇచట క్రొందళంబులన్=చివురాకులను,గూర్చుకొని. హరివితానములతోన్=శుకబృందములతో. చైత్రిసేనావిభుండు=సేనాధిపతియగువసంతుఁడని స్వభావార్థము దోఁచుచున్నది.కన్నులన్=కన్నులచేత.నెఱమంటన్=అధికమగు జ్వాలను. క్రక్కుచున్= విడుచుచు. కలరుతుల్ = కలిగినవీరాలాపములు. బెరయన్=వ్యాపింపఁగ. నానావనప్రియబలంబు=అనేకవిధము లగుచెంచుమూఁక. ఇచట కన్నులన్ =కన్నులచేత. ఎఱమంటన్=మంటివంటిరెయిఱుపును. క్రక్కుచున్=విడుచుచు. కలరుతుల్=అవ్యక్తమధురమగుధ్వనులు. బెరయన్=వ్యాపింపఁగ. నానావనప్రియబలంబు=అనేకవిధము లగుకోకిలములగుంపులనిస్వభావార్థము దోఁచుచున్నది.కనకరజోరేఖన్=బంగరుపొడిరేఖచేతను. కనుపట్టువరగంధపటిమన్.—కనుపట్టు=చూపట్టుచున్న;వర=శ్రేష్ఠమగు;గంధపటిమన్=గర్వాతిశయముచేత; “గన్ధోగన్ధక ఆమోదేలేశే సంబన్ధగర్వయోః” అని విశ్వము.రాజిలుమహాబలకులంబు.—రాజిలు=ప్రకాశించు,మహత్=అధికమగు;బల=సేనలయొక్క; కులంబు=గుంపు.కనకరజోరేఖన్=సంపెఁగపువ్వులయొక్క పరాగశ్రేణిచేత. కనుపట్టు=చూపట్టుచున్న; వర=శ్రేష్ఠమగు;గంధ=పరిమళములయొక్క; పటిమన్=పటిమచేత; రాజిలు=ప్రకాశించు;మహాబలకులంబు=వాయుసంఘమనిస్వభావార్థము దోఁచుచున్నది. తొలుదొలుతన్=ముందుముందుగ. తీవ్రవిస్ఫూర్తిన్ అధిక మగువిజృంభణముతో. తోడరి=పూని నడవన్=నడచుచుండఁగ. అలరువింటిదంట=మరుఁడు. దుర్దాంతశౌరికాళి = నివారించుట కశక్యమగుగోరువంకసమూహము. ఆత్మైకబిరుదపద్యములు.—ఆత్మ=తనయొక్క; ఏక=ముఖ్యమగు; బిరుదపద్యములు=జయచిహ్నములుగల పద్యములను. చదువన్=చదువుచుండఁగ. చిలుకపక్కిపై నెక్కి=శుకవాహనము నెక్కి. అమ్మానిన్=అమునిని. కదిసెన్=సమీపించెను.

అనఁగా చంద్రుఁడు సేనాధిపతి యగువసంతుఁడు కోయిలలు మందమారుతము అనేక సేనలతో ముందు ముందు నడచుచుండఁగ మన్మథుఁడు శుకము నెక్కి సామర్థ్యచిహ్నములు గంపవ్యముల గోనువంకలు చదువ వసంతమునిమీఁదికిఁ బోయెనని తాత్పర్యము.

చ. అపుడు రణోత్సుకుం డగుసితాంబుజసాయకుకంటిసన్నఁ గీ
రపటలి చల్లగాడ్పు తొవరాయఁడు కోయిలపౌఁజు చైత్రుఁ డ
చ్చపుఁదెలిపక్కిపుల్గు లని సల్పఁగఁ జాలుదు నేనె నేనె యం
చపరిమితాగ్రహస్ఫురణ నమ్మునిఁ జుట్టిరి సత్వరంబు గన్. 77

టీ. అపుడు=అసమయమందు. రణోత్సుకుం డగుసితాంబుజసాయకుకంటిసన్నన్.— రణోత్సుకుం డగుసితాంబుజసాయకు=యుద్ధమందు సంతసము గలపద్మబాణుఁ డగుమన్మథుని యొక్క; కంటిసన్నన్=కనుసంజ్ఞచేత. కీరపటలి=శుకబృందము. చల్లగాడ్పు=మందమారుతము. తొవరాయఁడు=కలువలదొర, అనఁగ చంద్రుఁడు. కోయిలపౌఁజు=కోకిలబలము. చైత్రుఁడు=వసంతుఁడు. అచ్చపుఁదెలిపక్కిపుల్గులు=హంసలు. అని=యుద్ధమును. సల్పఁగన్=చేయుటకు. చాలుదున్=చాలుదును. నేనె నేనె యంచున్=నేనొక్కఁడనే యనుచు అపరిమితాగ్రహస్ఫురణన్.— అపరిమిత=మితిలేని, అనఁగ నధికమగునటు. ఆగ్రహ=కోపముయొక్క; స్ఫురణన్=ఆవిర్భావముచేతను. అమ్మునిన్=ఆవసంతఋషిని. సత్వరంబుగన్=వేగముగ. చుట్టిరి.

అనఁగా రణోత్సుకుం డగునాపంచశరుఁడు కనుసైగఁ జేయఁగ శుకసమూహాదులు నేనొక్కఁడనే రణమునకుఁబ్రపుటకు సమర్థుఁడ నని యహమహమికచే మునిని జుట్టుముట్టి రని భావము.

సీ. శైత్యవత్కరకుంత చటులధారారేఖ
శమినేత నాటించెఁ జలువమిన్న
తళుతళుక్కన వేగ జళిపించి మావిక్రొం
దళపుఁగత్తిని మౌని నఱకె సురభి
కడుఁ జంచరీకసంఘము మ్రోయ ఘనజాల
కంబుల యతి మొత్తె గడుసుగాడ్పు
కటురజోగ్నికణాళి గ్రమ్మఁ జెందొవమందు
తిత్తుల మునిఁ గప్పె హత్తి యంచ

తే. యిట్టు లాదిట్ట లందఱుఁ జుట్టుముట్టి, గట్టిలిన నుట్టిపడ నురుశాంతికవచ
ధారి జడదారి నొప్పించి ధైర్యలీల, నడఁపలేకున్కిఁ గనిమరుం డపుడుగడఁగి.

టీ. చలువమిన్న = చంద్రుఁడు. శైత్యవత్కరకుంత చటులధారారేఖన్.— శైత్యవత్=చల్లఁదనముగల; కర=కిరణములనెడు; కుంత=ఈఁటెలయొక్క; చటుల=చలించుచున్న; ధారారేఖన్=వాదరచేతను. శమినేతన్=మునిపతిని. నాటించెన్=గ్రుచ్చెను. సురభి = వసంతుఁడు. తళుతళుక్కనన్=తళతళ మనునటుల. వేగ=శీఘ్రముగ. జళిపించి = ఆడించి. మావిక్రొందళపుఁగత్తిన్=మావిచిగురా కనుకత్తిచేత. మౌనిన్ = మునిని. నఱకెన్=ఖండిం

చెను. గడుసుగాడ్పు.—గడుసు=కఠినమైన; గాడ్పు=వాయువు.ఘనజాలకంబులన్=గొప్ప మొగ్గలనెడులోహముద్గరసంఘములచేత. యతిన్=మునిని. కడున్=మిక్కిలి. చంచరీకసంఘములు.—చంచరీక=భృంగములయొక్క; సంఘములు = సమూహములు. మ్రోయన్ = ధ్వనిచేయుచుండఁగ. మొత్తెన్=కొట్టెను. అంచ=హంస. కటురజోగ్నికణాళిక్రమ్మన్.— కటు=తీక్ష్ణమగు; రజః=పరాగమనెడు; అగ్నికణాళి=మిణుఁగురులగుంపు. క్రమ్మన్ = పైకొనఁగ. చెందొవమందుతిత్తులన్=ఎఱ్ఱగలువలనెడుమారకద్రవ్యవిశేషముగలభస్త్రికలచేత. మునిన్ = ఋషిని. హత్తి = చేరి. కప్పెన్=కప్పెను. ఇట్టులు=ఈప్రకారము. ఆస్టిలందఱున్=ఆధైర్యముగలచంద్రాదులెల్ల. చుట్టుముట్టి=పరివేష్టించి. గట్టితనము=సామర్థ్యము. ఉట్టిపడన్=అతిశయింపఁగ. ఉరుక్షాంతికవచధారిన్.—ఉరు=అధికమగు; క్షాంతి=శమమనెడు; కవచ=బొందలమును; ధారిన్=ధరించిన. జడదారిన్=మునిని. నొప్పించి=బాధించి. ధైర్యలీలన్=ధైర్యముయొక్క విలాసమును. అడఁపలేకున్కి=అడఁగఁజేయకుండుటను. కని=చూచి. అపుడు=ఆసమయమందు. మరుండు=మన్మథుఁడు. కడఁగి=ప్రయత్నించి. దీనికుత్తరపద్యస్థక్రియతోనన్వయము.

చంద్రుఁడు కగిము లనుకుంతములచేతను వసంతుఁడుచూతపల్లవ మనుతిరవారిచేతను మలయానిలము మొగ్గ లనునినుపగుదియలచేతను అంచ చెందొవ లనుమందుతిత్తుల చేతను బాధించియు శమ మనుకవచమును ధరించినశమినేతధైర్యము నడఁపలే కుండుటంజూచి పద్మముకుళాస్త్రములను మరుఁడు మునిపై నించెనని భావము.

చ. చననినవాగ్రహస్ఫురణఁ • జక్కెరవిల్తుఁడు తేజి బోరునన్
మునిపతిమీఁద నూకి కడు • ముట్టక మ్రోయుగొనంబు తుంటవిం
టనొనరఁ గూర్చి చంద్రబుతు•నాధులు గన్గొని యౌర మేలు మే
లనఁ బరితేజితాబ్జముకు•ళాస్త్రపరంపర నించె నుద్ధతిన్. 79

టీ. చక్కెరవిల్తుఁడు=మారుఁడు. చననినవాగ్రహస్ఫురణన్ = పీడనినూతనక్రోధముయొక్క స్ఫురణముచేతను. తేజిన్=గుఱ్ఱముగుశుకమును. బోరునన్ = బోరనుధ్వనిగలుగునటులు. మునిపతిమీఁదన్ = ఋషిమీఁదను. నూకి = త్రోలి. కడున్= మిక్కిలి. ముట్టక= ముట్టకయే, స్పృశింపకయే యనుట. మ్రోయుగొనంబు=మొరయుచున్న యల్లెత్రాటిని. తుంటవింటన్=చెఱకువింటియందు. ఒనరన్=అనుకూలముగ. కూర్చి=జతపఱచి. చంద్రబుతునాధులు=చంద్రుఁడును వసంతుఁడును. కన్గొని=చూచి. ఔర=ఆశ్చర్యము. మేలుమేలనన్=మేలుమే లనిప్రశంసింపఁగ. పరితేజితాబ్జముకుళాస్త్రపరంపరన్.—పరితేజిత = చికిలిపెట్టఁబడిన; అబ్జముకుళాస్త్ర=తామరమొగ్గ తూఁపులయొక్క; పరంపరన్ = గుంపును. ఉద్ధతిన్ = వేగముచేత. నించెన్ = కప్పెను.

అనఁగా మన్మథుఁడు తనగుఱ్ఱమును మునిమీఁదికివిడిచి తనంతటనె మొరయు చున్న యల్లెత్రాటిని (అనఁగా తుమ్మెదబారు ననుట.) చెఱకువింట నెక్కిడి చంద్రాదులు పొగడఁగ పద్మబాణములు మునిపై నించెనని భావము.

చ. మదనబిసప్రసూనశర•మండలి యాజడదారిసామిపే
రెదవడిఁ దాఁకునత్తతిఁ ద•దీయపరాగము చిందుటల్ స్తవా
స్పదమయి పొల్చె తద్విశిఖ•జాలసమాహతిభిన్నమౌనిరా
జదృఢరమేశభక్తికవ•చస్ఫుటచూర్ణ మనీష దార్చుచున్. 80

టీ. మదనబిసప్రసూనశరమండలి.—మదన = మన్మథునియొక్క; బిసప్రసూనశర= తామరతూఁపులయొక్క; మండలి = సమూహము. ఆజడదారిసామిపేరెదన్.—ఆజడదారిసామి=ఆమునిరాజుయొక్క; పేరెదన్=విశాలమగు ఱొమ్మును. వడిన్=వేగముగ. తాఁకునత్తతిన్ = తాఁకుసప్పుడు. తదీయపరాగము = ఆతామరపూదూఁపుపుప్పొడి. చిందుటల్=రాలుటలు. తద్విశిఖజాలసమాహతిభిన్నమౌనిరాజదృఢరమేశభక్తికవచస్ఫుటచూర్ణమనీషన్.—తత్=ఆమన్మథునియొక్క; విశిఖజాల=బాణసమూహముయొక్క; సమాహతి= కొట్టుటచేత; భిన్న=బ్రద్దలయిన; మౌనిరాజ=ఋషిరాజుయొక్క; దృఢ=గాఢమయిన; రమేశభక్తి=విష్ణుభక్తి యనెడు; కవచ=బొందళముయొక్క; స్ఫుట=వ్యక్తమగు; చూర్ణ= పొడియొక్క; మనీషన్=బుద్ధిని. తార్చుచున్=చేయుచు. స్తవాస్పదమయి=స్తుతికర్హమయి. పొల్చెన్=ఒప్పెను.

మన్మథుని పద్మబాణసమూహము మునీశ్వరుని ఱొమ్ము దాఁకి నాసమయమునం దాపద్మ బాణపరాగము చిందుటలు మన్మథబాణములచే భేదింపఁబడిన విష్ణుభక్తియనెడు కవచము యొక్క పొడియను భ్రమ కలిగించె ననిభావము.

చ. వరజవశక్తిచేఁ బలుకు•వాల్దొరపేరెదఁ దాఁకి తాఁకునం
బరిహృతకుట్మలాత్మమగు•మారునితామరమొగ్గముల్కి ని
బ్బరముగఁ బర్వఁ దద్రసము•భాసిలె తన్మునిధైర్యజీవనో
త్కరములు పీల్చి వెగ్గలము•గాఁగఁ గడున్ వెడలించుపోలికన్. 81

టీ. వరజవశక్తిచేన్.—వర=శ్రేష్ఠమగు; జవ=వేగముయొక్క; శక్తిచేన్=సామర్థ్యముచేత. పలుకువాల్దొరపేరెదన్.—పలుకువాల్దొర=మునిరాజుయొక్క; పేరెదన్ = విపులమగువక్షమును. తాఁకి=తగిలి. తాఁకునన్=తాఁకుటచేత; పరిహృతకుట్మలాత్మము.—పరిహృత= పోఁగొట్టఁబడిన; కుట్మలాత్మము=కోరకావస్థగలది. అగుమారునితామరమొగ్గముల్కి=అయినట్టిమన్మథుని పద్మకోరకబాణము. నిబ్బరముగన్=అధికముగ. తద్రసము=దానిమకరందము. పర్వన్= వ్యాపింపఁగ. తన్మునిధైర్యజీవనోత్కరములు.—తన్ముని=యాజడదారియొక్క; ధైర్య=ధైర్యమనెడు; జీవన=ఉదకముయొక్క; ఉత్కరములు=సమూహములను. పీల్చి=పానముచేసి. వెగ్గలముగాఁగన్=మిక్కుటముకాఁగ. కడున్=మిక్కిలి. వెడలించుపోలికన్=పైకివెళ్ళఁగ్రక్కువట్లు. భాసిలెన్=ప్రకాశించెను.

అనఁగా నతివేగముగ తామరమొగ్గతూపు జడదారియెదఁదాఁకి కోరకభావము విడి మకరందము గాఱఁగా నదియామునిధైర్యమనునుదకమునఁద్రావి యధికమగుటచే వెడలఁగక్కు రీతిభాసిల్లె నని భావము.

చ. అచలసమాధియోగగతి నందినయమ్మునిఁ జెంద దయ్యె న
వ్యచలనరేఖ యప్పు డసమాశుగకాండము పర్వినం గరం
బచలసమాధియోగగతి నందినయమ్ముని నెట్లు చెందు న
వ్యచలనరేఖ యెంత యసమాశుగకాండము పర్వినన్ మహిన్. 82

టీ. అప్పుడు=ఆసమయమందు. కరంబు=మిక్కిలి. అసమాశుగకాండము.—అసమాశుగ=మన్మథునియొక్క; కాండము = బాణము. జాత్యేకవచనముగా నిది ప్రయోగింపఁబడినది. పర్వినన్=వ్యాపించినను. అచలసమాధియోగగతిన్.—అచల=చలింపని; సమాధ=చిత్తవృత్తినిరోధమువలననైన; యోగగతిన్ = ధ్యానగతిని. అందిన=పొందినట్టి. అమ్మునిన్=ఆజడదారిని. నవ్యచలనరేఖ=నూతన మగుచాంచల్యపరంపర. చెంద దయ్యెన్=పొందదయ్యె. అచలసమాధియోగగతిన్.—అచలసమ=పర్వతసమానమగు; అధియోగ=ధ్యానముయొక్క; గతిన్=రీతిని. అందిన=పొందినట్టి. అమ్మునిన్=ఆతపసిని. ఎంత=ఎంతకాలము. అసమ=సాటిలేనిదగు; ఆశుగకాండము= వాయుబృందము. పర్వినన్ = వ్యాపించినను. మహిన్ = భూమియందు. నవ్యచలనరేఖ=నూతన మగు చాంచల్యపరంపర. ఎట్లు=ఏరీతి. చెందున్=పొందును?

అనఁగా లోకమందు వాయుసంఘము పర్వతమును చలింపఁజేయనట్లు చలింపనిసమాధియోగిమం దున్నయాజడదారిని మన్మథునిబాణపుంజము చలింపఁజేయఁజాల దయ్యెనని భావము.

మ. తనకంజాతశరంబు లిట్లు మునిచంద్రస్ఫీత తేజంబుచే
వనవీథిన్ వికలత్వ మొందఁ గని దుర్వారావలేపక్రమం
బున నాకంతుఁడు కేలుదోయిఁ గొని నేర్పుల్ మీఱఁ బూమొగ్గ నే
జను దద్వక్షము గుప్పునం బొడిచె నోజం జైత్రుఁ డౌనౌ ననన్. 83

టీ. తనకంజాతశరంబులు= తనసంబంధు లగుపద్మబాణములు. మునిచంద్రస్ఫీతతేజంబుచేన్.—మునిచంద్ర=మునిచంద్రునియొక్క; స్ఫీత=అధికమగు; తేజంబుచేన్=కాంతిచేత. ఇట్లు=ఈప్రకారము. వనవీథిన్=అడవియందు. వికలత్వము=నిరర్థకత్వమును. ఒందన్=పొందఁగ. ఇచట మునియనెడుచంద్రునికాంతిచే, వనవీథిన్=ఉదకమందు, కమలములు వికలత్వము ననఁగా ముకుళనమును పొందె ననునర్థము స్ఫురించుచున్నది. కని= చూచి. దుర్వారావలేపక్రమంబునన్.—దుర్వార = నివారించుట కశక్యమైన; అవలేప=గర్వముయొక్క; క్రమంబునన్=రీతిచేత. ఆకంతుఁడు=ఆమన్మథుఁడు. పూమొగ్గనేజను = పూమొగ్గయనుతోమరమును. కేలుదోయిన్ = రెండుచేతులచే. కొని=తీసి. నేర్పుల్=చాతుర్యములు.

మీఱన్=అతిశయింపఁగ. తద్వృక్షము=ఆమునితపస్సును. చప్పునన్=శీఘ్రముగ. చైత్రుఁడు=వసంతుఁడు. జౌనానన్=పొంగడఁగ. ఓజన్=ఉత్సాహముతో. పొడిచెన్=గ్రుచ్చెను.

అనఁగా మన్మథుఁడు తనపుష్పబాణములు వ్యర్థములు కాఁగా నయమోఘమగుపూవుఁ గ్రొత్తమామిడిపూఁగోలతో మునిం బొడిచెనని భావము.

చ. దళిమగుకోప మెచ్చఁ దన•తత్తడి నోరగఁ బోనఁ జేసి ని
స్తులపథికాసృగక్తి మను•సొంపున రోహితదీప్తిజాతముల్
గలయఁగ మించునూతనప•లాశసుమం బనుబాఁగుదారఁ జేఁ
జలమున నయ్యతిన్ నఱికె•నాఁడు సనాయకవీరుఁ డంతటన్. 84

టీ. అంతటన్=అటుపిమ్మట. సాయకవీరుఁడు=మన్మథవీరుఁడు. దళము=అధికము. అగుకోపము=అయినట్టికోపము. ఎచ్చన్=అతిశయింపఁగ. తనతత్తడిన్=తనవాహనమగు చిలుకను. ఓరగన్=ప్రక్కకు. పోనన్=పోవునట్లు. చేసి=ఒనర్చి. నిస్తులపథికాసృగక్తము.—నిస్తుల=నిస్సమానమగు; పథిక=విరహులయొక్క; అసృక్=రక్తముచే; అక్తము=పూయఁబడినది. అనుసొంపునన్ = అనువిధంబున, పథికులరక్తముచే పూయఁబడినదా యన్నట్టునట. రోహితదీప్తిజాతముల్.—రోహిత=ఎఱ్ఱనైన; దీప్తి = కాంతుల యొక్క; జాతముల్=పుంజములు. కలయఁగన్=వ్యాపింపఁగా. మించునూతనపలాశసుమంబనుబాఁగుదారచేన్. మించు.—అతిశయించు; నూతనపలాశసుమంబను=క్రొత్తమోదుకపూవను; బాఁగుదారచేన్=చూరకత్తిచేత. చలమునన్=మాత్సర్యముచేత. అయ్యతిన్=ఆమునిని. నఱికెన్=ఖండించెను.

అనఁగా మన్మథుఁడు క్రోధమతిశయింపఁగ తనవాహనము నొకప్రక్కకుఁ గొని పథికుల రక్తముచేఁ దడిసినట్లున్న యెఱ్ఱనగుమోదుగుసుమ మను చూరకత్తిచే మునిని నఱికెనని భావము.

చ. మునిపతి కేమిటన్ జుఱుకు•ముట్టక యుండినఁ గాంచి తేజి చ
య్యన డిగి యప్డు నైకనిశి•తాయుధజాతము పూని మిక్కిలం
గనుఁగొనలన్ రుషానలశి•ఖాతతి పర్వ మరుండు చంద్రచం
దనపవమానముఖ్యవృతిఁ•దా నడచెన్ యతిమీఁది కుద్ధతిన్. 85

టీ. మునిపతికిన్=జడదారిసామికి. ఏమిటన్=ఏయస్త్రముచేతను. చుఱుకుముట్టక = వేఁడితాఁకక. ఉండినన్=ఉండఁగ. కాంచి=చూచి. తేజి=గుఱ్ఱమునుండి. చయ్యనన్=శీఘ్రముగ. డిగి=దిగి. అప్డు=ఆసమయమందు. నైకనిశితాయుధజాతము.—నైక=అనేకములైన; నిశిత=తీక్ష్ణములైనట్టి; ఆయుధ=కుంతాద్యాయుధములయొక్క; జాతము=సమూహమును. పూని=గ్రహించి. మిక్కిలన్=అతిశయించునట్లు. కనుఁగొనలన్=నేత్రాంతములయందు. రుషానలశిఖాతతి.—రుషానల=రోషాగ్నియొక్క; శిఖా=జ్వాలలయొక్క; తతి=సమూహము. పర్వన్=వ్యాపించుచుండఁగ. మరుండు=మన్మథుఁడు. చంద్రచందనపవమానముఖ్యవృతిన్.—చంద్ర = చం

ద్రుఁడు; చండపవమాన=మలయానిలము; ముఖ్య=అదిగాఁగలవారియొక్క; స్ఫూర్తిన్=మేళన
ముచేతను. తాన్=మన్మథుఁడు. ఉద్ధతిన్=గర్వముచేత. యతిమీఁదికిన్= మునిమీఁదికి.
నడచెన్=నడిచెను.

క. నడచి యళిఘంటికాధ్వని, యడరఁ బరాగాగ్నికణచ♦యంబులు వెడలం
గడు నమరురాగసుమ మను, బెడిదం బగుశక్తి వైచె♦ భీకరలీలన్. 86

టీ. నడచి=గమనించి. అళిఘంటికాధ్వని.—అళి=తుమ్మెదలను; ఘంటికా=చిఱుగం
టలయొక్క; ధ్వని=నాదము. అడరన్ = అతిశయింపఁగ. పరాగాగ్నికణచయంబులు.—
పరాగ=పుప్పొడి యనెడు; అగ్నికణ=స్ఫులింగములయొక్క; చయంబులు= సమూహములు.
వెడలన్=బయలుదేఱుచుండఁగ. కడునమరురాగసుమము.—కడున్=మిక్కిలి; అమరు=ఒప్పియు
న్న; రాగసుమము=బంధూకపుష్పము. అనుబెడిదం బగుశక్తన్=అనెడుగొప్ప శక్తని. భీకర
లీలన్=భయంకర మగుక్రియచేతను. "లీలావిలాసక్రియయోః" అనియమరుఁడు. వైచెన్=
వేసెను.

అనఁగా భృంగధ్వని యనెడుచిఱుఘంటలధ్వనిచేతను పుప్పొడి యనునగ్నికణ
ములచేతను నొప్పు మంకెనపుష్ప మనుశక్తిని వైచె ననిభావము.

ఉ. దాన నొకింతయున్ విధృతిఁ♦ దాల్పనియామునినేతఁ జూచి త
త్తూనశరుండు బీరమున♦ శూరత యుట్టిపడంగ నయ్యెడన్
మానితపారిజాతసుమ♦నఃకలికాగద కేల నెత్తి య
మ్మౌనిని మోఁదె దివ్యకుసు♦మప్రతతుల్ మరుదాళి నింపఁగన్. 87

టీ. దానన్=శక్తి యనునాయుధముచేత. ఒకింతయున్= కొంచెమైన. విధృతిన్=
అధైర్యమును. తాల్పని=ధరింపనట్టి. యామినేతన్=ఆమునిరాజును. చూచి = అవలోకించి.
తత్తూనశరుండు=ఆమన్మథుఁడు. బీరమునన్=పరాక్రమముచేత. శూరత=శౌర్యము. ఉట్టిప
డంగన్=అతిశయింపఁగ. అయ్యెడన్=ఆసమయమందు. మానితపారిజాతసుమనఃకలికా
గద.—మానిత=శ్రేష్ఠమగు; పారిజాతసుమనః = పారిజాతపుష్పముయొక్క; కలికా=మొగ్గ
యనెడు; గద=గదాయుధమును. కేలనెత్తి = హస్తముతో నెత్తి. మరుదాళి=దేవసంఘము.
దివ్యకుసుమప్రతతుల్.—దివ్య = స్వర్గమందున్న; కుసుమ = పుష్పముయొక్క; ప్రతతుల్=
సమూహములను. నింపఁగన్=నిండించుచుండఁగ; అమ్మౌనిని=ఆజడదారిని. మోఁదెన్=
కొట్టెను.

ఆముని శక్తి యనునాయుధమునకును ధైర్యము చెడకయుండుటంజూచి మరుఁడు
శౌర్యముతో పారిజాతకోరక మనుగదతో నతని మోఁదె ననిభావము.

ఉ. అందుల కింతయుం జలన♦ మందని పెంపున కబ్బురం బెడం
జెంది ప్రసూనకోశతతిఁ♦ జెల్వగు గేదఁగిఱేకుఁజిక్కటా

౦ంది యనూనరోషగతి ♦ నమ్మునిఁ గ్రుమ్మె మరుండు శాంకరా
మందమనోధృతిక్షపణ♦మాన్యభుజాబలరేఖ హెచ్చఁగన్. 88

టీ. అందులకున్=ఆగదాయుధప్రహారమునకు. ఇంతయున్=కొంచెమైనను. చలనమందని=చలింపని. పెంపునకున్=మహత్త్వమునకు. అబ్బురంబు=ఆశ్చర్యమును. ఎదన్=హృదయమందు. చెంది=పొంది. ప్రసూనకోశతటన్.—ప్రసూన=పుష్పమనెడు; కోశ=ఒఱయొక్క; తటన్=ప్రదేశమందు. చెల్వగు గేదఁగి ఱేకుఁజిక్కటూరు.—చెల్వగు=అందమైన; గేదఁగి ఱేకు=కేతకీదళమనెడు; చిక్కటూరు=చూరకత్తిని. అంది=పొంది. అనూనరోషగతిన్.—అనూన=తక్కువకాని; రోష=క్రోధముయొక్క; గతిన్=ప్రాప్తిచేత. అమ్మునిన్=ఆఋషిని. మరుండు=మన్మథుఁడు. శాంకరామంద మనోధృతిక్షపణమాన్యభుజాబలరేఖ.—శాంకర=శంకరునికి సంబంధించిన; అమంద= అధికమగునట్టి;మనోధృతి=మనస్థైర్యముయొక్క; క్షపణ=పోఁగొట్టుటచేత; మాన్య=పొగడఁదగిన;భుజాబల=భుజబలముయొక్క; రేఖ=విలాసము; హెచ్చఁగన్=అతిశయించుచుండఁగ; క్రుమ్మెన్=పొడిచెను.

అనేకవిధమగునస్త్రములకు చలనమందకయున్న మునికి మనమున నబ్బురమంది యామరుండు వెతకి కేతకీదళమనుకటారు గొని మునిని పొడిచె నని భావము.

చ. సరసబలంబు గొల్వ సుమ♦సాయకుఁ డంతటఁ బోక మౌని డా
సి రమణ మొగ్గ యన్గుదియఁ ♦ జేకొని మొత్తి ప్రవాళ మన్మహా
పరశువుఁ బూని వే యడిచి ♦ బాగగుమంకెనవంకిఁ బట్టి ప
ల్లరములఁ గ్రుమ్మి యార్చె హిమ♦ధాముఁడు గన్గొని మెచ్చ నయ్యెడన్. 89

టీ. సుమసాయకుఁడు=మన్మథుఁడు. సరసబలంబు.—సరస = శ్రేష్ఠమగు; బలంబు=సేన. కొల్వన్=సేవింపఁగా. అంతటఁబోక=అంతటితో నిలువక. మౌనిన్=మునిని. డాసి=సమీపించి. రమణన్ = ఆసక్తిచేత. మొగ్గయన్గుదియన్ = కోరకమనుగదను. చేకొని=గ్రహించి. మొత్తి=కొట్టి. ప్రవాళమన్మహాపరశువున్ = చిగురనునట్టిగొప్ప గండ్రగొడ్డంటిని. పూని = గ్రహించి. వే=వేగముగ. అడిచి=కొట్టి. బాగగుమంకెనవంకిన్=శ్రేష్ఠమగుబంధూకకుసుమ మనెడుబాఁకును. పట్టి = పట్టుకొని. పల్లరములన్ = అనేక ప్రకారములచే. అయ్యెడన్ = ఆసమయమందు. హిమధాముఁడు = చంద్రుఁడు. కన్గొని = చూచి. మెచ్చన్ = మెచ్చుకొనునట్లు. క్రుమ్మి=పొడిచి. ఆర్చెన్ = అఱచెను.

మరుఁడు పలువిధము లగునాయుధములను ప్రయోగించినను మునిచలింపకుండుటజూచి మునిని సమీపించి మొగ్గయనుగుదియతో మొత్తి చిగురాకనుపరశువుతోఁ గొట్టి మంకెనయనుబాఁకునఁ బొడిచెనని భావము.

తే. ఇట్టు లమ్మారుఁ డమ్ముని ♦ నెనసి యనిశ
టించు నవ్వేళ నిది వేళ ♦ యంచుఁ దలఁచి

చిత్రరేఖావధూటి వి♦చిత్రరీతి
శమి కనతిదూరమున సఖీ♦జనము గొలువ. 90

టీ. ఇట్టులు=ఈప్రకారము. అమ్మారుఁడు=ఆమదనుఁడు. అమ్మునిన్=ఆఋషిని. ఎనసి=కలసి. అనిన్=యుద్ధమును. ఘటించునవ్వేళన్ = చేయునట్టియాసమయమందు; ఇది వేళయంచున్=ఇదిసమయమనుచు. తలఁచి=స్మరించి. చిత్రరేఖావధూటి=చిత్రరేఖ యనుదేవాంగన. విచిత్రరీతిన్ = ఆశ్చర్యమగువిధముచే. శమికిన్=మునికి. అనతిదూరమునన్=సమీపమందు. సఖీజనము=చెలికత్తెలు. కొలువన్=సేవింపఁగా. తిలకాళిఁ దిలకించునను నుత్తర పద్యములోనుండు క్రియతో నన్వయము.

సీ. తిలకాళిఁ దిలకించుఁ♦ జెలి పెండ్లితఱిఁ గాంచు, తెఱఁగు తపస్వికిఁ♦ దెలుపుకరణి
గోఁగుచెంగటఁ బల్కుఁ♦గోమలి ప్రియములు, పలుకుటల్ దపసికిఁ♦ దెలుపుకరణి
మావిపైఁ గరముంచు♦మగువ కళాస్థాన, మలముటల్ మౌనికిఁ♦ దెలుపుకరణిఁ
గ్రోవిఁ గౌఁగిటఁ దార్చుఁ♦గుముదాక్షి పరిరంభ, కలనంబు యోగికిఁ♦ దెలుపుకరణి
తే. నిట్టు లప్పారికాంక్షి క♦హీనమదన, తంత్రవిజ్ఞానగరిమను♦ దరుణి దెలుప
వల్లిదోహదచర్య దై♦వాఱ నపుడు, హాళి దళుకొత్తఁ దద్వనీ♦కేళి సలిపె. 91

టీ. చెలి=చిత్రరేఖ. పెండ్లితఱిన్=వివాహసమయమందు. కాంచుతెఱఁగున్=చూచునట్టిరీతిని. తపస్వికిన్=జడదారికి. తెలుపుకరణిన్=తెలియఁజేయురీతిగ. తిలకాళిన్—.తిలక=బొట్టుగుచెట్లయొక్క; ఆళిన్=బంతిని. తిలకించున్=చూచెను. కోమలి=చిత్రరేఖ. ప్రియములు పలుకుటల్.—ప్రియోక్తులఁబలుకురీతిని. తపసికిన్=మునికి. తెలుపుకరణిన్=తెలియఁజేయురీతిగ. గోఁగుచెంగటన్.—గోఁగు=కర్ణికారముయొక్క; చెంగటన్=సమీపమందు. పల్కున్=పలికెను. మగువ=దేవాంగన. కళాస్థానము=కామశాస్త్రప్రసిద్ధమగుకళాస్థానమును. అలముటల్=ఆక్రమించుటలను,స్పృశించుటల ననుట. మౌనికిన్=తపసికి. తెలుపుకరణిన్=తెలియఁజేయురీతిగ. మావిపైన్=చూతవృక్షముమీఁద.కరము=హస్తమును. ఉంచున్=ఉంచెను. కుముదాక్షి=చిత్రరేఖ. పరిరంభకలనంబు.—పరిరంభ=కౌఁగిలింతయొక్క; కలనంబు = చేయుటను. యోగికిన్=మునికి. తెలుపుకరణిన్=తెలియఁజేయురీతిగ.క్రోవిన్=కురవకమును. కౌఁగిటన్=భుజాంతరమందు. తార్చున్ = చేర్చెను. ఇట్టులు = ఈప్రకారముగ. అప్పారికాంక్షికిన్=ఆయతికి. అహీనమదనతంత్రవిజ్ఞానగరిమను.—అహీన=అధికమగు; మదనతంత్ర = కామశాస్త్రముయొక్క; విజ్ఞాన=తెలివియొక్క;గరిమను=అతిశయమును. తరుణి=వనిత. తెలుపన్=దెలియఁజేయుటకు. వల్లిదోహదచర్య.— వల్లి =తీవలయొక్క; దోహదచర్య=దోహదములయొక్క చర్య. దైవాఱన్=అతిశయింపఁగ.తద్వనీకేళిన్= ఆవనవిహారమును. సలిపెన్=ఒనరించెను.

ఇందు దోహద మనఁగాఁ దరుగుల్మలతాదుల కకాలమున ఫలపుష్పాధాయక క్రియావిశేషము. "తరుగుల్మలతాదీనామకాలే ఫలపుష్పయోః। ఆధానాయ క్రియాయాస్యాత్సదోహద ఇతీర్యతే" అని తల్లక్షణంబు. "ఆలిఙ్గనాత్కురవక శ్చమ్పకో ముఖదర్శనాత్ ।

-గాత్రో యోషితక్కురస్వరాన్ తిలకో దృక్ప్రసారణాత్ । ఆకర్ణనాత్కర్ణికారస్త్వశోకః పాదతాడనాత్'' ఇత్యాదిగా దోహద విశేషములు తెలియవలయు.

సీ. దమి దీన నైనఁ జి♦త్తము బయల్ పఱచునో
యని సంచరించు న♦భ్యర్ణపదవి
ముని దీననైన నూ♦తనరక్తి దాల్చునో
యని పాడుఁ దేనియల్♦చినుకుపాట
శమి దీననైన ని♦శ్చలభావ ముడుపునో
యని పొదల్ దూఱు ల♦తాళి గదల
యతి దీననైన ధై♦ర్యముఁ బాయఁ జేయునో
యని పల్కు సఖుల నొ♦య్యారిపలుకు
తే. నియమి దా దీననైనఁ గ♦న్విప్పు నొక్కొ-
యని మసలు దండ రాసా♦ప్తి నాళియుక్తి
నైన నానాతిచిత్రచ♦ర్యానిరూఢిఁ
దాపససమాధివైఖరి ♦ దఱుఁగ దయ్యె. 92

టీ. దమి=మునివర్యుఁడు. దీననైనన్=దీనిచేతనైనను. చిత్తము=మనసును. బయల్పఱచునోయని=తెలియఁబఱచునా యని. అభ్యర్ణపదవిన్=సమీపస్థానమందు. సంచరించున్=తిరుగును. ముని=జడదారి. దీననైనన్=దీనిచేతనైన. నూతనరక్తిన్=నూతన మగునను రాగమును. తాల్చునోయని=వహించునాయని. తేనియల్చినుకుపాటన్=మకరందమును గురియుగీతమును. పాడున్=పాడును. శమి=జడదారి. దీననైనన్ = దీనిచేతనైన. నిశ్చలభావము = నిశ్చలత్వమును. ఉడుపునో యని=విడుచునా యని. పొదల్=కుంజములను. లతాళిగదలన్=తీవలగుంపుకదలునటులు. దూఱున్=ఈఁగును. యతి=మునిరాజు. దీననైనన్=దీనిచేతనైన. ధైర్యము=ధృతిని. పాయఁజేయునో యని=విడుచునాయని. సఖులన్ = చెలికత్తెలతో. ఒయ్యారిపలుకు=విలాసోక్తిని. పలుకున్=వచించును. నియమి=జడదారి. తాన్=తాను. దీననైనన్=దీనిచేతనైన. కన్విప్పు నొక్కొయని=కనులు తెఱచునా యని. దండన్ = సమీపమందు. ఆళియుక్తిన్ = సకియలతోడి కూడికచేతను. రాసాప్తిన్.—రాస = కోలాటముయొక్క ; ఆప్తిన్=ప్రాప్తిచేత. మసలున్ = విహరించును. ఐనన్ = అయినను. ఆనాతిచిత్రచర్యానిరూఢిన్.—ఆనాతి=ఆదేవాంగనయొక్క ; చిత్రచర్యా = విచిత్రకార్యములయొక్క ; నిరూఢిన్=అతిశయము చేత. తాపససమాధివైఖరి=మునిమనస్థైర్యముయొక్కరీతి. తఱుఁగదయ్యెన్=తక్కువపడదయ్యెను.

చిత్రరేఖ ముని హృదయమును దెలుపునా యని సమీపమందు సంచరించినను అనురాగమును పూనునా యని రమణీయమగుగానముఁ జేసినను చలించునాయని లతలుగదలఁ బొదలు

దూఱినను ధైర్యమును విడుచునా యనిసఖులతోఁ బ్రియోక్తులు వలికినను కనులనైన విప్పునా యనిసకియలఁగూడి కోలాట మాడినను కొంచెమైన మునియొక్క సమాధి తప్పవగా లేదని భావము.

ఉ. ఆయతిలోకమౌళిహృద♦యంబు బయల్పడ కున్కి గాంచి యా
తోయజనేత్ర యాళితతి♦తో మునిసన్నిధిఁ జేరి జాళువా
కాయలవీణె గైకొని త♦గన్ శ్రుతిఁ గూర్చి యొయార మెచ్చఁగా
నాయెడ నేర్పు మించ గమ♦పాదికపుంఖణ మూన్చి వేడుకన్. 93

టీ. ఆయతిలోకమౌళిహృదయంబు = ఆమునిరాజుయొక్క చిత్తము. బయల్పడక = వెల్వడక. ఉన్కి = ఉండుటను. కాంచి = చూచి; ఆతోయజనేత్ర = చిత్రరేఖ. ఆళితతితోన్ = సకియలగుంపుతో. మునిసన్నిధిన్ = యతిసమీపమును. చేరి = పొంది. జాళువా కాయలవీణెన్ = బంగరుకాయలు గలవీణెను. కైకొని = గ్రహించి. తగన్ = ఒప్పునటులు. శ్రుతిన్ = స్వరముల కారంభకమైన సుతిని. "స్వరాశ్శ్రుతిభ్యస్సంజాతాః" అని సంగీతరత్నాకరము. ఒయారము = విలాసము. ఎచ్చఁగాన్ = అతిశయింపఁగా. ఆయెడన్ = ఆ సమయమందు. నేర్పు = నైపుణ్యము. మించన్ = అతిశయించునటులు. వేడుకన్ = సంతోషముచేత. గమపాదిక పుంఖణము.—గ = గాంధారము; మ = మధ్యమము; ప = పంచమము; ఆదిక = మొదలుగాఁగల స్వరములయొక్క; పుంఖణము = మూర్ఛనను. స్వరారోహావరోహక్రమము ననుట. గమపాద్యక్షరములు గాంధారాదిస్వరవాచకములనుట సంగీతశాస్త్రమందు సంకేతింపఁబడినది. ఊన్చి = చేసి. దీనికి వీణవాయించెనని యుత్తరపద్యస్థక్రియతో నన్వయ మని తెలియవలయును.

అనఁగా నామునివర్యునియొక్క యాశయము దెలియఁక చిత్రరేఖ సకియలతోఁ గూడి యామునిసన్నిధిం జేరి బంగరుకాయలు గలమంచివీణను దీసికొని సుతి చేసి గమపాది స్వరముల వాయించె ననితాత్పర్యము.

సీ. ఘనమార్గవిభవంబు ♦ వనితవేణినెగాదు, శ్రుతిపర్వరాగసం♦తతి నెనంగె
సమతాళవిస్ఫూర్తి ♦ సతిగుబ్బలనెగాదు, నవ్యగీతప్రతా♦నముల నెనసెఁ
గలహంసవైఖరి♦ చెలిగతులనె గాదు, సరసప్రబంధపుం♦జమునఁ దోఁచెఁ
బల్లవంబులపెంపు♦ పడఁతి కేలనెగాదు, సొగసైనపదపాళి ♦ సొంపు పూనె

తే. ననుచు వనదేవతాజనం♦బభినుతింప,రక్తివిధమును దేశీయ♦రాగగతియుఁ
జిత్రతరమంద్రరాగజ♦శ్రీలు వెలయ, నింతిముని చెంతవీణెవా♦యించెనంత.

టీ. ఘనమార్గవిభవంబు.—ఘనమార్గ = ఆకాశముయొక్క; విభవంబు = నైల్యము, లేదా, ఘన = మేఘముయొక్క; మార్గ = కస్తురియొక్క; విభవంబు = నైల్యము. వనితవేణినెగాదు.— వనిత = చిత్రరేఖయొక్క; వేణినెకాదు = జడయందేకాదు. శ్రుతిపర్వరాగసంతతిన్.—శ్రుతిపర్వ = చెవులకింపగు; రాగ = భైరవి తోడి మొదలగురాగములయొక్క; సంతతిన్ = సమూహ

మందు. ఎసంగెన్=ఒప్పెను. ఘనమార్గవిభవంబు.— ఘనమార్గ=గొప్పదైనసంగీతభేదముయొక్క; విభవంబు=అతిశయము, రాగసంతతి నెసంగెననియర్థము. మార్గము దేశి యనిసంగీతము రెండువిధములు. మహేశునియొద్దనుండి బ్రహ్మాదులచేఁదేఁబడి భరతాదులచేఁబ్రకటింపబడినది మార్గము. దేశదేశమునందు భిన్నభిన్నముగాఁ బ్రచారముగలది దేశియని తెలియునది. సమతాళవిస్ఫూర్తి.—సమ = సమానమగు ; తాళ = తాళఫలములయొక్క; విస్ఫూర్తి = అతిశయము. సతిగుబ్బలనెగాదు = చిత్రరేఖయొక్క స్తనములందేగాదు. నవ్యగీతప్రతానములన్.—నవ్య=నూతనమగు ; గీత=గానముయొక్క; ప్రతానములన్ = పుంజములను. ఎనసెన్=పొందెను. సమతాళవిస్ఫూర్తి=సమగతిగలచంచత్పుటాదితాళములయొక్కవిస్ఫూర్తి, గీతప్రతానములనెనసెననియర్థము. కలహంసవైఖరి.—కలహంస=రాయంచలయొక్క; వైఖరి=గతివిశేషము. చెలిగతులనెగాదు=చిత్రరేఖనడకలయందేకాదు. సరసప్రబంధపుంజమునన్, "చతుర్భిర్ధాతుభిష్షడ్భి శ్చాఙ్గైర్యస్మాత్ప్రయుజ్యతే । తస్మాత్ప్రబన్ధఃకథితః" అని సంగీతచూడామణియందున్నది. సరసమగునుక్తలక్షణ ప్రబంధమునందు, తోఁచెన్ = కాన్పించెను. "శ్లో॥ చక్రవాకః క్రౌఞ్చపహాస్వ రాధోధ్వనికుండినీ । ఆర్యాగాథాద్విపదగాకలహంసశ్చతోటకః" యని సంగీతరత్నాకరమందున్నది, అనఁగ, కలహంసవృత్తముయొక్క వైఖరిప్రబంధమున తోఁచెననియర్థము. పల్లవంబుల పెంపు=చిగురాకులయొక్కయతిశయము. పడఁతి కేలనెగాదు=చిత్రరేఖకరమునందేగాదు. సొగసైనపదపాళిన్=సుందరమగుధ్రువపదములయొక్క బృందమునందు. సొంపు=అందమును. పూనెన్=పొందెను. పల్లవంబులపెంపు=గీతములందలిమొదటిపాదములయతిశయము, ధ్రువాదులఁబొందెననియర్థము. అనుచున్=ఈప్రకారమువచించుచు. వనదేవతాజనంబు=వనదేవతలు. అభినుతింపన్=కొనియాడఁగ. రక్తివిధమును=రక్తియొక్కరీతిని. దేశీయరాగగతియు=దేశీయరాగముయొక్కరీతియును; చిత్రతరమంద్రరాగజశ్రీలు.—చిత్రతర = విచిత్రమగు; మంద్ర=హృదయస్వరములవలనను; రాగ=శుద్ధస్వరములవనను; జ=పుట్టిన; శ్రీలు=రచనలు. వెలయన్=ప్రకాశింపఁగ. ఇంతి=చిత్రరేఖ. మునిచెంతన్=మునిసమీపమందు. వీణెన్=వీణను. వాయించెన్=పలికించెను.

ఉ. చెన్నగు జాళువా యొళవు ♦ చిన్నరి కెంపుల మెట్లు నీలపు
న్వన్నియ నొప్పు కాయలు న♦వం బగు వజ్రపు కర్వె పచ్చలం
బన్నినయట్టి మేరువును ♦ బాగగు తంత్రులు మించ నొప్పు మే
ల్కిన్నర చెంతఁ జేరి యొక♦కిన్నరకంఠి యొసంగ నయ్యెడన్. 95

టీ. చెన్నగుజాళువాయొళవు = ప్రకాశించుచున్న బంగరుదండము. చిన్నరికెంపులమెట్లు = చక్కనగు కెంపులసరికట్లు. నీలపున్వన్నియన్ = నల్లనిఛాయచేత. ఒప్పుకాయలు=ఒప్పుచున్నకాయలు. నవంబగువజ్రపుకర్వె=నూతన మగువజ్రములయొక్క కకుభము. పచ్చలన్=గరుడపచ్చలచేత. పన్నినయట్టి=రచించినట్టి. మేరువును=శిఖరమును. బాగగుతంత్రులు=శ్రేష్ఠమగుతంత్రులు. మించన్=అతిశయింపఁగ. ఒప్పుమేల్కిన్నరన్ = ప్రకాశించు

చున్నట్టిశ్రేష్ఠ వీణాభేదమును. ఒకకిన్నరకంఠి=ఒకముదిత. చెంతఁజేరి=చిత్రరేఖసమీపమును బొంది. ఒసంగన్=ఇయ్యఁగ. అయ్యెడన్=ఆసమయమందు. దీనికుత్తరపద్యమున పల్కించె నను క్రియతో నన్వయము.

మ. సరసత్వంబునఁ గేల నూని యల యోషామాళి చక్కన్ రిరి
మ్మరిగా మారి యటంచు రిప్పనిమగా మామ్మారి యంచు న్విభా
స్వరనానానవరక్తిఁ దానతతి మించన్ గౌళ వాయించి ని
బ్బరపున్ వేడుకఁ జేయుపంతువిధముల్ పల్కించె నప్పట్టునన్.

టీ. అలయోషామాళి=ఆచిత్రరేఖ. కేలన్=హస్తముచేత. సరసత్వంబునన్ = రసికతతో. ఊని=గ్రహించి. చక్కన్ = సొంపుగ. రిరిమ్మరిగా మారియటించున్ రిప్పనమగా మామ్మారియంచున్ = ఈప్రకారమనుచు. విభాస్వరనానానవరక్తిన్.—విభాస్వర=ప్రకాశించుచున్న; నానా=అనేకవిధములగు; నవరక్తిన్=నూతనమగు సొంపుచేత. తానతతిమించన్ = తానయనుశబ్దజాలమతిశయింపఁగ. గౌళన్=గౌళరాగమును. వాయించి=పలికించి. నిబ్బరపున్ వేడుకఁజేయు పంతువిధముల్ = మిక్కిలివినోదమును చేయునట్టి శ్రేష్ఠమగురీతులను. పల్కించెన్ = వాయించెను. అప్పట్టునన్=దీనికి పైపద్యములో నున్న సల్పె ననుక్రియతో నన్వయము.

అనఁగ చిత్రరేఖ కుముదాక్షి యొసంగిన కిన్నర దీసికొని సరిగమాదిస్వరములను వాయించి గౌళ యనురాగమును తానతతినఁగ తానయను శబ్దములతో ననేకరీతులను వాయించె ననిభావము.

మ. బళిరే మైసిరితీరు నిల్కడలు సేబా సయ్యారే పేరణీ
కలనం బౌర పదాళికాభినయవైఖర్యంబు మజ్జారె కో
పులవైచిత్రి యహో వినిర్మలకరాంభోజాతవిన్యాస మం
చలివేణుల్ వినుతింప సల్పె నటనం బాకొమ్మ తత్సన్నిధిన్. 97

టీ. మైసిరితీరు=దేహకాంతియొక్కరీతి. బళిరే! నిల్కడలు=ధైర్యములు. సేబాసు! ఈ పద్యమందు "బళిరే సేబాసు మొదలగుశబ్దములు, ప్రశంసార్థకము లనియెఱుంగునది. పేరణీకలనంబు=భాండముపైఁ జేయునృత్యము. అయ్యారే! పదాళికాభినయవైఖర్యంబు.—పదాళికా=గానోపయోగిపదపుంజములయొక్క; అభినయవైఖర్యంబు=పదార్థాభినయరీతి. ఔర! కోపులవైచిత్రి=నాట్యసంబంధు లగుతీర్పులయొక్క విచిత్రత. మజ్జారె! వినిర్మలకరాంభోజాతవిన్యాసము.—వినిర్మల=స్వచ్ఛమగు; కరాంభోజాత=కరకమలములయొక్క; విన్యాసము=ఉంచుట. అహో=బళి! అంచున్=ఈప్రకారమువచించుచు. అళివేణుల్=స్త్రీలు. వినుతింపన్=స్తుతిఁజేయఁగ. ఆకొమ్మ=ఆచిత్రరేఖ. తత్సన్నిధిన్=ఆమునిసమీపమందు. నటనంబు=నాట్యమును. సల్పెన్=చేసెను.

అంగనలు నతియించుచుండఁగఁ జిత్రరేఖ మునిసన్నిధి నభినయించి నాట్యముఁ జేసెనని తాత్పర్యము.

క. ఈలీల నన్నివిద్యలు, వేలుపుతొవకంటి చూపి ♦ విపులసమాధి
శ్రీలాభగౌరవంబున, శైలాభం దెమల కున్న♦శమిఁ గాంచి రహిన్. 98

టీ. ఈలీలన్=ఈరీతిగ. అన్నివిద్యలున్=ఎల్లవిద్యలను. వేలుపుతొవకంటి=చిత్రరేఖ. చూపి=ప్రదర్శించి. విపులసమాధిశ్రీలాభగౌరవంబునన్.—విపుల=విశాలమగు; సమాధి=చిత్తవృత్తినిరోధముయొక్క; శ్రీ=సంపదయొక్క; లాభ=ప్రాప్తివలననైన; గౌరవంబునన్=గురుత్వముచేత. శైలాభన్=పర్వతముకైవడి. తెమలకున్నశమిన్ = చలింపకున్న మునిని. రహిన్=ప్రీతితో. కాంచి=చూచి.

చ. అనుపమకాంచిరమ్యతట♦హాటకకింకిణికాఝుణంఝుణ
ధ్వని చెలరేఁగ నానియమి♦దండకుఁ జేరి యొయారమెచ్చ న
వ్వనిత తపోధనేంద్రపద♦వారిజయుగ్మము కేల నంటి యొ
య్యనఁ దలఁ జేర్చి నూత్నమధు♦రామృతపూరసమోక్తి నిట్లనున్. 99

టీ. అనుపమకాంచిరమ్యతటహాటకకింకిణికాఝుణంఝుణధ్వని.—అనుపమ=అసమానమగు; కాంచి=ఒడ్డాణములయొక్క; రమ్య=మనోహరమగు; తట=ప్రదేశమందలి; హాటకకింకిణికా=బంగరుచిఱుగంటలయొక్క; ఝుణంఝుణధ్వని= ఝుణఝుణయనుశబ్దము. చెలఁరేఁగన్=అతిశయింపఁగ. ఆనియమిదండకున్=ఆమునిసమీపమునకు చేరి. ఒయారము=విలాసము. ఎచ్చన్=అతిశయింపఁగ. అవ్వనిత = ఆచిత్రరేఖ. తపోధనేంద్ర పదవారిజయుగ్మము.—తపోధనేంద్ర = జడదారి సామియొక్క; పదవారిజయుగ్మము = పాదకమల ద్వంద్వమును. కేలన్=హస్తముచేత; అంటి=స్పృశించి. ఒయ్యనన్=తిన్నగా. తలన్=శిరమునను. చేర్చి=కదియించి. నూత్నమధురామృతపూరసమోక్తిన్—నూత్న=నూతనమగు; మధుర=తియ్యని; అమృత=సుధయొక్క; పూర=ప్రవాహముతోడ; సమ = సదృశమగు; ఉక్తిన్=వాక్యమును. ఇట్లు=ఈప్రకారముగ; అనున్=పలికెను.

సీ. తెఱగంటిదొరలకుఁ♦దీఱలేనివిరాళి, మొనపుచక్కఁదనానఁ♦దనరుదాన
కులుకుచిత్తరుపుబొ♦మ్మలకుజీవమునించఁ, గలపాటవగనేర్చి♦యలరుదాన
రంభాదికనిలింప♦రామలఁ దలవంపఁ, జేయునాట్యమెఱింగి♦సెలఁగుదాన
హరిగిరిశాదిది♦వ్యసభాళి బిరుదు లెన్నైనఁ జేకొని నిచ్చ♦యడరుదాన

తే. పలుకుతొయ్యలి పీ వంచు♦నలువ మెచ్చ
నలఘుసాహిత్యవిద్యాప్తి♦వెలయుదాన
చిత్రరేఖాసమాఖ్య రా♦జిల్లుదాన
నిన్ను సేవింప వచ్చితి♦నియమిచంద్ర. 100

టీ. తెఱఁగంటిదొరలకున్ = దేవశ్రేష్ఠులకు. తీఱలేని వెఱ్ఱిన్ = ఎడతెగని మోహమును. మొనపుచక్కఁదనానన్ = కలుగఁజేయు సౌందర్యముచేత. తనరుదానన్ = ఒప్పుచున్నదానను. కులుకుచిత్తరువుబొమ్మలకున్=చిత్తరువునందు వ్రాసినచక్కనిబొమ్మలకు. జీవము=ప్రాణమును. నించఁగలపాటవగన్=నిండఁజేయుటయందు సామర్థ్యముగలగానముయొక్క సొంపును. నేర్చి = అభ్యసించి. అలరుదానన్=ప్రకాశించుదానను. రంభాదికనిలింపరామలన్.— రంభాదిక=రంభ మొదలుగాఁగల; నిలింపరామలన్=దేవాంగనలను. తలవంపన్=శిరమువంచునటులు. చేయు నాట్యము = చేయునట్టినాట్యమును. ఎఱింగి = తెలిసి. చెలఁగుదానన్ = ప్రకాశించుదానను. హరిగిరిశాదిదివ్యసభాళిన్.—హరి=కృష్ణుఁడు; గిరిశ=శంకరుఁడు;ఆదిమొదలుగాఁగలవారియొక్క; దివ్య=మనోహరమగు;సభాళిన్=సభలసమూహమందు; బిరుదులు=జయచిహ్నములను. ఎన్నైనన్= ఎన్నిటినైనను. చేకొని=గ్రహించి. నిచ్చ=ఎల్లపుడు. అడరుదానన్=ఒప్పుచున్నదానను. నలువ=బ్రహ్మదేవుఁడు. ఈవు=నీవు. పలుకుతొయ్యలివి=సరస్వతివి. అంచున్ = అనుచు. మెచ్చన్ = మెచ్చునటులు. అలఘుసాహిత్యవిద్యాప్తిన్.—అలఘు=అధికమగు; సాహిత్యవిద్యా=నాటకాలంకారాదిసాహిత్యవిద్యలయొక్క; ఆప్తిన్=ప్రాప్తిచేత ; వెలయుదానన్=ఒప్పుచున్నదానను. చిత్రరేఖాసమాఖ్యన్=చిత్రరేఖయను నామముచేత. రాజిల్లుదానన్=ప్రకాశించుదానను. నిన్ను సేవింపన్=నిన్నుఁగొలుచుటకు. నియమిచంద్ర=వసంతుఁడా! వచ్చితిన్.

నియమిచంద్రా! దేవోత్తములకును మోహమును జేయునందముచేతను అచేతనము లగు బొమ్మలకును ప్రాణ మిచ్చునంతటిగానముచేతను రంభాదిదేవాంగనలకు నలవిగానినాట్యముచేతను తనరుచు,అనేకశివకేశవాద్యుత్తములసభలందు బిరుదములఁగొని మించుచు నలువ సరస్వతివినీవె యని మెచ్చునట్టిసాహిత్యవిద్యచే నొప్పుచుండుదాన, చిత్రరేఖ యనుపేరుగలదాన నేనిన్ను సేవింపవచ్చితి ననిభావము.

క. అనునెడ నమ్మునికులమణి, కనుఁగవ నర విప్పి • కాంతఁ గన్గొని యంతన్
బునరనవధికసమాధిక, లన నక్షులు మోడ్చి నిశ్చ•లతచే నుండన్. 101

టీ. అనునెడన్=అనిపలుకునపుడు. అమ్మునికులమణి=ఆఋషిశ్రేష్ఠుఁడు. కనుఁగవన్=కనుదోయిని. అరవిప్పి=సగముదెఱచి. కాంతన్=చిత్రరేఖను. కన్గొని=చూచి. అంతన్=అటుపిమ్మట; పునః అనవధికసమాధికలనన్.—పునః=మరల;అనవధిక=అంతములేని;సమాధి=చిత్తవృత్తినిరోధముయొక్క; కలనన్=ప్రాప్తిచేత. అక్షులు = నేత్రములను. మోడ్చి = ముకుళించి. నిశ్చలతచేన్=అచంచలతచేత. ఉండన్ = ఉండఁగ.

ఉ. కాంచి తపస్విచిత్తగతి • గాంచఁగలేక యయారె మామకా
భ్యంచిత శాంబరీమహిమ•కయ్యతి లోఁబడు నంచు నెంచి త
త్కాంచనగాత్రి యాళిజన•తాయుతి మిక్కిలి చెంతఁ జేరి నే
త్రాంచలసీమ నవ్వు వెల•యన్ మునిఁ బల్కె నవ్యోక్తిచాతురిన్. 102

టీ. తత్కాంచనగాత్రి=ఆచిత్రరేఖ. కాంచి=చూచి. తపస్విచిత్తగతిన్= మునిహృదస్థితిని. కాంచఁగలేక=తెలియఁజాలక. అయారె=ఆశ్చర్యము! మామకాభ్యంచితశాంబరీమహిమకున్.—మామక=నాసంబంధియగు; అభ్యంచిత=శ్రేష్ఠమగునట్టి; శాంబరీమహిమకున్=మాయాసామర్థ్యమునకు. అయ్యతి=ఆముని. లోఁబడున్. అంచున్ = వశపడుననుచు. ఎంచి= తలఁచి. ఆళిజనతాయుతిన్=సఖీజనముతోడి కూడిక చేతను. మిక్కిలి చెంతఁజేరి=అత్యంతసమీపమును బొంది. నేత్రాంచలసీమన్= నేత్రాంతముల ప్రదేశమునందు. నవ్వు=స్మితము. పాలయన్= వ్యాపింపఁగ. మునిన్ = వసంతునిగూర్చి. నవోక్తిచాతురిన్.—నవ = నూతనమగు; ఉక్తి= వాక్యములందలి; చాతురిన్= నేర్పుచేత. పల్కెన్.

సీ. జవరాలినునుగుబ్బ•చన్నులఁ జేరుట, వసుధాధరస్థలీ•వసతి గాఁగ
నతివరత్యంతశ్ర•మాంబులఁ దోఁగుట, నమరాపగావగా•హనము గాఁగ
తెఱవకెమ్మోవిక్రొం•దేనియ ల్గ్రోలుట, నిరుపమామృతపాన•సరణి గాఁగ
కొమ్మతో రతికూజి•తమ్ములు నొడువుట, సరసాగమాంతాళి•చదువు గాఁగ

తే. దలఁప బద్మాంబకాభిఖ్య•దైవతంబు
మసలక దయారసంబున • నొసఁగు సుమ్మ
ఖండితానందగరిమ ని•క్కలన మనుము
వట్టియీఖేదకనివృత్తి • గట్టి మాని. 103

టీ. మౌని=వసంతుఁడా! జవరాలినునుగుబ్బచన్నులఁ జేరుట= స్త్రీలయొక్క నునుపుగుబ్బచన్నులను బొందుట. వసుధాధరస్థలీవసతి = పర్వతప్రదేశమందునివాసము. కాఁగన్=అగునటులు. అతివరత్యంతశ్రమాంబులన్.—అతివ=వనితయొక్క; రత్యంత=సురతాంతమువలననైన; శ్రమాంబులన్ = శ్రమోదకములయందు. తోఁగుట = మునుఁగుట. అమరాపగావగాహనము.— అమరాపగా = గంగానదియందు; అవగాహనము = స్నానము. కాఁగన్ = అగునటులు. తెఱవకెమ్మోవిక్రొందేనియల్.— తెఱవ = వనితయొక్క; కెమ్మోవి=అరుణాధరోష్ఠముయొక్క; క్రొందేనియలు=నూతనమధురసములను. క్రోలుట=పానము చేయుట. నిరుపమామృతపానసరణికాఁగన్.—నిరుపమ=సాటిలేని; అమృత=సుధయొక్క; పానసరణి=పానరీతి; కాఁగన్=అగునటులు. కొమ్మతోన్=కాంతతో. రతికూజితమ్ములు=మణితములు. నొడువుట=పలుకుట. సరసాగమాంతాళిచదువు.—సరస=శ్రేష్ఠమగు; ఆగమాంత= వేదాంతములయొక్క; ఆళి=బృందముయొక్క; చదువు=చదువుట. కాఁగన్=అగునటులు. తలఁపన్ = భావింపఁగ. పద్మాంబకాభిఖ్య దైవతంబు.— పద్మాంబకుఁ డను పేరుగల; దైవతంబు = దేవత; అనఁగఁ దామరతూపులుగల మన్మథుఁ డనుట. మసలక—తడవు సేయక. దయారసంబునన్=కృపారసముచేత. అఖండితానందగరిమన్= అఖండానందాతిశయమును. ఒసఁగున్=ఇచ్చును. సుమ్ము=సత్యము. వట్టి=నీరసమగు. ఈఖేదకనివృత్తిన్=దుఃఖకరమగు ఈనివృత్తిమార్గమును. కట్టి=బంధించి. ఇక్కలనన్=ఈరీతిగ. మనుము = వర్తింపుము.

అనఁగ స్త్రీకుచంబులనెనయుట పర్వతనివాసమనియు సురతాంతశ్రమవారిమునుఁగుట గంగాస్నానమనియు నధరరసాస్వాద మమృతరసాస్వాద మనియు స్త్రీలతో రతికూజితములు నుడువుట వేదాంతవిద్యలచదు వనియుఁ దలఁచి మన్మథునిధ్యానింతువేని, మునిచంద్రా! నీవు నతఁడు అఖండానందము నొసఁగు. కేవలనీరసమగు నీనివృత్తిమార్గమును వదలు మనిభావము.

సీ. పరమకాశ్యాకృతిఁ ♦ బ్రబలదే నియమిరాళ, సోమమండలదాస్య ♦ రోమవల్లి
యనవద్యమధురాత్మ ♦ నలరదే మునికాంత, జలరుహేక్షణమధు ♦ స్రావిమోవి
పురుషోత్తమస్థేమఁ ♦ బొసఁగదే యతిచంద్ర, యచలకల్పోరోజ ♦ యలఘునాభి
శ్రీరంగవైఖరిఁ ♦ జెలఁగదే దమివర్య, కనకజాతీయాంగి ♦ కన్నుదోయి
తే. యగుట నిత్యపవిత్రరూ ♦ పాప్తి నడరు
కలికితోఁ గూడి యుండినఁ ♦ గాక కలదె
యతనుసుఖరాశి యిట్టిమ ♦ హాఘుదాయి
ఘోరకాంతారమహి నున్న ♦ ధీరముఖ్య. 104

టీ. నియమిరాళ=ఓ మునిరాజా! సోమమండలదాస్యరోమవల్లి = చంద్రమండలమువలె నాచరించుచున్న మోముగలదానియొక్క నూఁగారు. పరమకాశ్యాకృతిన్ .—పరమ=ఉత్కృష్టమగు; కాశి=వారాణసియొక్క; ఆకృతిన్=స్వరూపముచేత. ప్రబలదే= అతిశయింపదా యనికాకువు. పరమక=ఉత్కృష్టమగు, ఇచట స్వార్థమందుక ప్రత్యయము; అసి=ఖడ్గముయొక్క; ఆకృతిన్=స్వరూపముచేత. ప్రబలదాయనిస్వభావార్థము. శ్లేషయందు శసల కభేదము నవలంబించుట యాలంకారికసమ్మతము. మునికాంత=మునినాథా! జలరుహేక్షణమధుస్రావిమోవి.— జలరుహేక్షణ=వనజాక్షియొక్క. మధుస్రావి=మకరందమును స్రవించు; మోవి=ఓష్ఠము. అనవద్యమధురాత్మన్.—అనవద్య = నిర్దుష్టమగు; మధురాత్మన్=మధుర యనుదివ్యక్షేత్రముయొక్క యాకారముచేత. అలరదె = ప్రకాశింపదా యనికాకువు; మధురాత్మన్.— మధుర = తియ్యని; ఆత్మన్ = స్వరూపముచేత. అలరదెయనిస్వభావార్థము. యతిచంద్ర= ఓమునిచంద్రుఁడా. అచలకల్పోరోజయలఘునాభి = ఇంచుకకొదవగాపర్వతములగుచున్న స్తనములుగలదానియొక్క పొక్కిలి. ఇచట "ఈషదసమాప్తౌకల్పప్" అని కల్పప్ప్రత్యయము. పురుషోత్తమస్థేమన్. పురుషోత్తమ=పురుషోత్తమక్షేత్రముయొక్క; స్థేమన్=మహిమచేతను. పొసఁగదె=ఒప్పదాయని కాకువు. పొక్కిలి. పురుషోత్తమస్థేమన్.— పురుషోత్తమ= పున్నాగపుష్పముయొక్క. స్థేమన్=మహిమవంటిమహిమచేత, పొసఁగదాయనిస్వభావార్థము. దమివర్య=యతిశ్రేష్ఠుఁడా! కనకజాతీయాంగికన్నుదోయి.—కనకజాతీయ=సువర్ణప్రకారముగల; అంగి=దేహముగలదానియొక్క; ఇచట "ప్రకారవచనేజాతీయర్" అని జాతీయప్రత్యయము; కన్నుదోయి=నేత్రయుగ్మము. శ్రీరంగవైఖరిన్.— శ్రీరంగ = శ్రీరంగమను క్షేత్రముయొక్క; వైఖరిన్=రీతిచేత. చెలఁగదే= ప్రకాశింపదా యనికాకువు. కన్నుదోయి. శ్రీరంగవైఖరిన్.— శ్రీ=సిరికి; రంగ=విహారస్థానముయొక్క; వైఖరిన్=రీతిచే, చెలఁగదా యని స్వభావార్థము.

అగుటన్ = ఈప్రకారముగ వనితావయవములు పుణ్యక్షేత్రాకృతిని పొందుటచేత. నిత్యపవిత్రరూపాప్తిన్.—నిత్య=నిరంతరము; పవిత్ర=నిర్మలమగు; రూప=స్వరూపముయొక్క; ఆప్తిన్ ప్రాప్తిచేత. అడుగుకలికితోన్=ఒప్పుచున్న కాంతతో. కూడియుండినంగాక=కలసియుండినంగాని. అతనుసుఖరాశి.— అతను=అధికమగు; సుఖరాశి=ఆనందరాశి. మన్మథసుఖరాశియని స్వభావార్థము. ఇట్టి మహాఘదాయిఘోరకాంతారమహిన్.—ఇట్టి=ఈప్రకారము; మహత్= అధికమగు; అఘ=పాపమును; "అఘందుఃఖేచపాపేచ" అని విశ్వము; దాయి=ఇచ్చుచున్న; ఘోర = భయంకరమగు; కాంతారమహిన్ = అరణ్యభూమియందు. ఇట్టి గొప్ప దుఃఖమునిచ్చునట్టి భయంకరమయిన యడవినేలయందు అని స్వభావార్థము. ఉన్నన్. ధీరముఖ్యా = పండితోత్తముఁడా. కలదె=ఉండునా?

అనఁగ రోమవల్లిపరమకాళ్యాకృతిని మోవిమధురాత్మతను పొక్కిలి పురుషోత్తమక్షేత్రగరిమను కనుదోయి శ్రీరంగవైఖరిని పొందియుండుటచే సర్వదా పవిత్రరూపమును పొందినకలికితోడఁ గూడియుండిన నతనుసుఖము ఘటిల్లును గాని యఘప్రదమగు నీయడవి నుండినచో నెట్లు ఘటిల్లునని భావము.

మ. ఉరురామైకగుణానువర్ణనమొ కాంతోచ్చైస్తనాగస్థలీ
పరివాసంబొ సతీవరాంఘ్రిభజనాప్రాశస్త్యమో సౌదృశో
త్కరసేవాగతియో ప్రియారుణకరాత్యాలోకనంబో మదిం
గర మూహింపఁగ నిట్టినీతప మనంగా నేమి మౌనీశ్వరా. 105

టీ. ఉరురామైకగుణానువర్ణనమొ.—ఉరు=అధికమైన; రామ=దాశరథియొక్క; ఏక=ముఖ్యమైన; గుణ=కల్యాణగుణములయొక్క; అనువర్ణనమొ=స్తుతించుటయో. రామా=సుందరియొక్క; ఏక=ముఖ్యమగు; గుణ=సౌందర్యాదిగుణములయొక్క; అనువర్ణనమొ=వర్ణించుటయో యనిస్వభావార్థము దోఁచుచున్నది. కాంతోచ్చైస్తనాగస్థలీపరివాసంబొ.—కాంత = రమణీయమైన; ఉచ్చైస్తన=గొప్పవైన; "సాయంచిరంప్రాహ్ణే ప్రగేవ్యయేభ్యష్ట్యుట్యులౌతుట్చ" యని అవ్యయమువూఁద ట్యుట్యుల్వౌత్యయతుడాగమములు వచ్చినవి; అగస్థలీ = పర్వతప్రదేశములయందు; పరివాసంబొ = వాసమొ; కాంతా=వనితయొక్క; ఉచ్చైః = ఉన్నతమైన; స్తనాగ=పర్వతములవంటికుచములయొక్క; స్థలీ=ప్రదేశమందు; పరివాసంబొ యనిస్వభావార్థము దోఁచుచున్నది. సతీవరాంఘ్రిభజనాప్రాశస్త్యమో.—సతీవర—శంకరునియొక్క; అంఘ్రి=పాదములయొక్క; భజనా=సేవయొక్క; ప్రాశస్త్యమో=ప్రశస్తతయో; సతీవరా = ఉత్తమస్త్రీలయొక్క; అంఘ్రిభజనా = చరణసేవయొక్క; ప్రాశస్త్యమో= ప్రశస్తతయో యనిస్వభావార్థము దోఁచుచున్నది. సౌదృశోత్కరసేవాగతియో.— సౌదృశ= విద్వాంసులసమూహముయొక్క; సేవా=భజనయొక్క; గతియో=ప్రాప్తియొ. సౌదృశోత్కర= స్త్రీసంబంధిబృందముయొక్క; సేవాగతియొ యనిస్వభావార్థముదోఁచుచున్నది. ప్రియారుణకరాత్యాలోకనంబో.— ప్రియ=ప్రియమగు; అరుణకర=సూర్యకిరణములయొక్క; అత్యాలోకనంబో=నిరంతరమైనచూచుటయో. ప్రియా=ప్రియురాలియొక్క; అరుణ=ఎఱ్ఱనైన; కరహా=

స్తములయొక్క; అత్యాలోకనంబో యని స్వభావార్థము. మానీశ్వరా= జడదారిసామీ! మదిన్ = మనసునందు. కరము= మిక్కిలి. ఊహింపఁగన్ = ఊహచేయఁగ. ఇట్టి=ఈవిధమగు; నీతపమనంగానేమి = నీతపమనఁగానేమి? ఏవిధమైనదనుట.

శ్రీరామశివాదులయొక్క గుణకీర్తనమా నీవు చేయు తప మనిభావము. నారీగుణకీర్తనమా నీవు చేయుతప మనిస్వభావాభిప్రాయము.

మ. చెలిలెక్కల్ గని కొమ్మపాట విని యో◆షిన్మౌళి నెమ్మోముతా
వులమేలాని నెలంతమే నలమి పూ◆వుంబోఁడి కెమ్మోవితే
నెలచాల్గ్రోలి సమేతరాక్షసుఖ మెం◆తేఁ గాంచఁగా లేక మి
క్కిలి యాత్మాధిగతైకహృత్సుఖనిమ◆క్తిన్ మానీ కాంక్షింతురే. 106

టీ. మానీ=మునివర్యా! చెలిలెక్కల్= వనితావిలాసములను. కని = చూచి. కొమ్మపాటన్ = స్త్రీగానమును. విని = ఆకర్ణించి. యోషిన్మౌళినెమ్మోముతావుల మేలు.—యోషిన్మౌళి=స్త్రీరత్నముయొక్క; నెమ్మోము=సుందరముఖముయొక్క; తావుల = పరిమళములయొక్క; మేలు=సారమును. ఆని=ఆఘ్రాణించి. నెలంత మేను = కాంతాశరీరమును. అలమి = కౌఁగిలించి. పూవుంబోఁడికెమ్మోవితేనెలచాలు=స్త్రీయొక్కయధరరసపుంజమును. గ్రోలి=పానముచేసి. సమేతరాక్షసుఖము=పంచేంద్రియములయొక్క అనఁగఁజక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణత్వగింద్రియములయొక్క యనుట, సుఖమును. ఎంతేన్=మిక్కిలి. కాంచఁగాలేక=పొందలేక. మిక్కిలి=అతిశయముగ. ఆత్మాధిగతైకహృత్సుఖనిమక్తిన్.— ఆత్మ=పరమాత్మవలన; అధిగత=పొందఁబడినట్టియు; ఏక=ముఖ్యమయినట్టియు; హృత్సుఖనిమక్తిన్ = హృదయసుఖసంబంధమును; కాంక్షింతురే=కోరుదురా యని కాకువు.

అనఁగా బుద్ధిమంతులు స్త్రీవిలాసదర్శనతదీయగానశ్రవణతన్ముఖసుగంధాఘ్రాణతదధరపానతదాలింగనజనిత మగుపంచేంద్రియసుఖమును గోరక కేవలపరమాత్మ వలనఁ బొందఁబడిన హృత్సుఖమునుమాత్రము కోరరనిభావము.

సీ. సుమసౌకుమార్యాప్తి◆ నమరునీనెమ్మేను, ఘనపంచశిఖికీలఁ◆ గందకున్నె
నెలపుల్గు పెంపూని◆యలరునీకనుదోయి, సూర్యదర్శనసక్తి◆ స్రుక్కఁబడదె
తమ్మియందమ్మూని◆తనరునీనెమ్మోము, శుచిభసితచ్ఛాయ◆ సొగసెడయదె
తళుకుకెంజిగురాకు◆సొలపూనునీయంఘ్రి, సూచిపై మెట్టిన◆ సొంపుసెడదె
తే. యకటకట నీవొకింతైన◆యంతరంగమునఁ దలంపవుగానిస◆ద్భోగయోగ్య
భావమునమించునీయట్టి◆భవ్యమూర్తి, కీదృశమహాతపోగ్లాని◆ నెనయఁదగునె.

టీ. సుమసౌకుమార్యాప్తిన్.—సుమ=పుష్పములయొక్క; సౌకుమార్య=సుకుమారత్వముయొక్క; ఆప్తిన్ ప్రాప్తిచేత. అమరు నీనెమ్మేను=ఒప్పుచున్ననీసుందరశరీరము. ఘనపంచశిఖికీలన్.—ఘన=గాఢమగు; పంచశిఖి = పంచాగ్నులయొక్క; కీలన్ = జ్వాలచేత. కందదె

న్నె=పరితపింపకుండునా. నెలపుల్గు పెంపూని.—నెలపుల్గు=చకోరములయొక్క; పెంపు=సౌందర్యమును; ఊని = పొంది. అలయునీకనుదోయి = ప్రకాశించునీకనుఁగవ. సూర్యదర్శనసక్తిన్.—సూర్య = సూర్యునియొక్క; దర్శన = చూచుటయొక్క; సక్తిన్ = సంబంధముచేతను. స్రుక్కఁబడదె=తపింపదా? తమ్మియందమ్ము.—తమ్మి = కమలముయొక్క; అందమ్ము=సౌందర్యమును. ఊని=పొంది. తనరు=ఒప్పుచున్న; నీ నెమ్మోము=నీచక్కనిముఖము. శుచిభసితచ్ఛాయన్.—శుచి=శుభ్రమగు; భసిత=భస్మముయొక్క; ఛాయన్=కాంతిచేత. శుచిభ=తెల్లనికిరణములుగల చంద్రునియొక్క; సితచ్ఛాయన్=తెల్లనికాంతిచేత ననఁగా చంద్రికచేత. సొగసు=అందమును. ఎడయదె=విడువదా. తళుకుకెంజిగురాకుసోలపూను నీయంఘ్రి.—తళుకు=ప్రకాశించుచున్న; కెంజిగురాకు=ఎఱ్ఱనిచిగురుటాకుయొక్క; సోలపు=మృదుత్వమును; ఊను=పొందినట్టి; నీయంఘ్రి = నీపాదము. సూచిపైన్ = సూదిమీఁద. మెట్టినన్=త్రొక్కఁగ. సొంపు=అందము. చెడదె? అకటకట = అయ్యోకష్టము. నీవు. ఒకింతైనన్ = కొంచెమైన. అంతరంగమునన్=మనస్సునందు. తలంపవుగాని = స్మరింపవుగాని. సద్భోగయోగ్య భావమునన్.—సత్=శ్రేష్ఠమగు; భోగ=సుఖమునకు; యోగ్యభావమునన్=యోగ్యత్వముచేత. మించునీయట్టిభవ్యమూర్తికిన్.—మించు=ప్రకాశించుచున్న; నీయట్టి=నీవంటి ; భవ్యమూర్తికిన్= మంగళమూర్తికి. ఈదృశమహాతపోగ్లానిన్.—ఈదృశ=ఇటువంటి ; మహాతపః = అధికతపమువలననైన; గ్లానిన్=దుఃఖమును. ఎనయఁదగునె=పొందఁదగునా?

అనఁగా లోకోత్తరమృదులసుందరావయవములు గలనీకు ఘోరతపం బొనరింప నుచితము గాదని భావము.

మ. అసమజ్వాలశిఖాళి వ్రేఁగిన నిరాహారంబు గైకొన్న శీ
తసరిద్వారులఁ గ్రుంకియున్న భుజగీతంద్రీపరిధ్వంసిసా
హసవృత్తిం గయికొన్న నీ కతను కల్యాణంద మెట్లబ్బు భ
వ్యసితాంభోరుహలోచనాంఘ్రియుగసేవం దక్క యోగీశ్వరా. 108

టీ. యోగీశ్వరా=జడదారిసామీ! అసమజ్వాలశిఖాళిన్.—అసమ = సరిలేని; జ్వాల=మంటలయొక్క; శిఖా=అగ్రములయొక్క; ఆళిన్=పంక్తిచేత. వ్రేఁగినన్=పరితపించినను. నిరాహారంబు=భోజనాభావమును. కైకొన్నన్ = గ్రహించినను, ఉపవాస ముండిన ననుట. శీతసరిద్వారులన్.—శీత=చల్లనగు; సరిద్వారులన్=ఏటినీళ్ళయందు. క్రుంకినన్=మునిఁగినను. భుజగీతంద్రీపరిధ్వంసిసాహసవృత్తిన్.—భుజగీ = మూలాధారస్థకుండలినీశక్తియొక్క; తంద్రీ=నిద్రను;పరిధ్వంసి=పోఁగొట్టెడు;సాహసవృత్తిన్=తెగువపనిని. కైకొన్నన్=గ్రహించినను. మహాయోగసాధ్య మగుమూలాధారస్థకుండలినీశక్తిని మేలుకొలుపునంతటి తెగువనుస్వీకరించిన ననుట. "శ్లో. భుజఙ్గాకారరూపేణ మూలాధారం సమాశ్రితా । శక్తిఃకుణ్డలినీనామబిసతన్తునిభాశుభా । మూలకన్దం ఫణాగ్రేణదష్ట్వాకమలకన్దవత్ । ముఖేనపుచ్ఛంతంగృహ్యబ్రహ్మరన్ధ్రింసమాశ్రితా।పద్మాసనగతస్స్వస్థోగుదమాకుఞ్చ్యసాధకః। వాయుమూర్ధ్వగతింకుర్వన్ కుమ్భకావిష్టమానసః వాయ్వాఘాతవశాదగ్నిస్స్వాధిష్ఠానగతోజ్వలన్ । జ్వలనాఘాతపవనా

ఘూ తైరున్నిద్రితో హిరాట్! ఇంద్రగ్రన్థిం తతోభిత్త్వా విష్ణుగ్రన్థిం భినత్త్యతః । బ్రహ్మగ్రన్థించ భిత్త్వైవం కమలానిభినత్తిపట్ । సహస్రకమలేశక్త్యా శివేన సహమోదతే । సాచావస్థాపరాజ్ఞేయాసైవనిర్వృతికారణమ్" అని వామకేశ్వర మహాతంత్రమున నున్నది. భవ్యసితాంభోరుహ లోచనాంఘ్రియుగ సేవందక్కన్.— భవ్య = మంగళమూర్తియగు; సితాంభోరుహలోచన=తెల్లదామరలవంటికన్నులు గలవిష్ణుమూర్తియొక్క; అంఘ్రిసేవందక్కన్ = పాదసేవచేఁదప్ప; ఇచట సితాంభోరుహలోచనా = పద్మాక్షియొక్క; అంఘ్రిసేవందక్కన్=పాదసేవచేఁదప్పనను స్వభావార్థము స్ఫురించుచున్నది. నీకున్. అతనుకల్యానందము.—అతను=అధికమగు; కల్యానందము=శుభప్రదమగు నానందము, అనఁగ జన్మమృత్యుజరావర్జిత మగు నానంద మనుట. ఇచట నతనుకల్యానందము = మన్మథయుద్ధసంబంధియగు నానందమను స్వభావార్థ స్ఫురించుచున్నది. అతను=మన్మథునియొక్క; కలి=యుద్ధము. కలిశబ్దమునకు యుద్ధమర్థమనుట స్పష్టము. ఎట్లు అబ్బున్?

అనఁగాఁ బంచాగ్నిజ్వాలలచేఁ గందినను పస్తుండినను చల్లనినీటఁ గ్రుంకినను మహాయోగసామర్థ్యముఁబొంది మూలాధారస్థకుండలినీశక్తిని మేలుకొలిపినను విష్ణుమూర్తిసేవందక్క అనఁగా శరీరశోషక మగుకర్మల నెన్నింటిని జేసినను బ్రహ్మజ్ఞానము లేక యతనుకల్యానంద మబ్బ దనిభావము. స్త్రీసేవనము చేతనే మన్మథసుఖముకలుగునని స్వభావాభిప్రాయము.

సీ. మాతంగయుతదావ♦మహిఁకన్నఁగొంచెమే, వరవిప్రవృతకేళి♦వనధరిత్రి
ఘనపంకమయశైవ♦లినికన్నల్పమే, యమలహంసాంచితా♦బ్జాకరంబు
శైలాటగృహదగ♦చ్ఛటకన్నఁ దక్కువే, సద్వితానోద్యోత♦సౌధపాళి
యనిశ మిరాశనం♦బునకన్న నింద్యమే, పుణ్యాసుదృక్కృత♦భోజనంబు

తే. కాన నీకాన నీవృత్తి♦గరిమ మెల్ల
మాని నే మానితప్రీతి♦మహిమఁ గొల్వ
మాని యిమ్మానిలింపస♦ద్మంబుఁ జేరు
దాన మోదానపాయత ♦ దాల్తు విపుడు. 109

టీ. మాని=వసంతుఁడా! వరవిప్రవృతకేళివనధరిత్రి. వర=శ్రేష్ఠులగు; విప్ర=బ్రాహ్మణులచేత; వృత=ఆవరింపఁబడిన; కేళివన=ఉద్యానవనముయొక్క; ధరిత్రి=భూమి. మాతంగయుతదావమహికన్నన్.—మాతంగ=చండాలురతో; యుత=కూడికొన్న; దావమహికన్నన్=వనభూమికన్న. కొంచెమె=తక్కువయా? యనికాకువు. ఇచట, వర = శ్రేష్ఠమగు; వి=పక్షులచేత; ప్రవృత = ఆవరింపఁబడిన; కేళివనధరిత్రి = ఉద్యానవనభూమి. మాతంగయుత=మాతంగ=గజములతో కూడుకొన్న; దావమహికన్నన్=అరణ్యభూమికన్న, తక్కువయా? యని స్వభావార్థము దోఁచుచున్నది. అమలహంసాంచితాబ్జాకరంబు.— అమల=నిర్దోషులగు; హంస=పరమహంసలచేత; అంచిత=ప్రకాశించుచున్న; అబ్జాకరంబు = తామరకొలను. ఘనపంకమయశైవలినికన్నన్.— ఘన=అధికమగు; పంకమయ=పాపమయమైన; శైవలినిక

న్నన్=నదికన్న; "శైవలినీతటినీస్రవంతీనిమ్నగాదినీధునీ" యని అమరుడు. అల్పమె=కొంచెమా యని కాకువు. ఇచట స్వచ్ఛములైనహంసలతోఁ గూడియున్నకొలను. ఘనపంకమయ = అధికమగుబురదతోఁ జేరియున్న, నదికన్న స్వల్పమా యనిస్వభావార్థము దోఁచుచున్నది. సద్వితానోద్యోతసౌధపాళి.—సత్=సత్పురుషులయొక్క; వితాన=సమూహము చేత; ఉద్యోత=ప్రకాశముగల; సౌధపాళి = మేడలయొక్క గుంపు. శైలాటగృహాదగచ్ఛటకన్నన్.—శైలాట=కిరాతులకు; "కిరాతసింహశార్దూలాటౌ" అని రత్నమాల; గృహాత్=ఇల్లువలె నాచరించు; అగచ్ఛటకన్నన్=కొండలగుంపుకన్న. తక్కువే=తక్కువయా యనికాకువు. ఇచట, సద్వితానోద్యోతసౌధపాళి.—శ్రేష్ఠ మగుమేలుకట్లచే ప్రకాశముగలమేడలగుంపు. శైలాటగృహదగచ్ఛటకన్నన్.— శైలాట = సింహములకు, గృహాత్ = ఇల్లువలె నాచరించు,పర్వతసంఘముకన్న తక్కువయా యనుస్వభావార్థముదోఁచుచున్నది. పుణ్యసుదృక్కృతభోజనంబు. పుణ్య=పవిత్రమైన; సుదృక్=విద్వాంసులచేత; కృత = చేయఁబడిన; భోజనంబు = ఆహారము. అనిశమిరాశనంబున కన్నినింద్యమె.—అనిశము=ఎల్లపుడును; ఇరా = సురయొక్క; "ఇరాభూవాక్సురామ్బుషు" అనివైజయంతి; అశనంబునకన్నన్=భోజనమునకన్న. నింద్యమె=నింద్యమా యని కాకువు. పుణ్యసుదృక్కృతభోజనంబు. పుణ్య = మనోహరమైన; సుదృక్=స్త్రీలచేత; కృత=చేయఁబడిన; భోజనంబు=ఆహారము. "పుణ్యంమనోజ్ఞేఽభిహితం తథాసుకృతధర్మయోః" అని విశ్వము. అనిశమిరాశనంబునకన్నన్.—అనిశము=ఎల్లపుడు; ఇరాశనంబునకన్నన్=జలభక్షణమునకంటె. నింద్యమే=నింద్యమా ? యని స్వభావార్థముదోఁచుచున్నది. కానన్=కాఁబట్టి. ఈకానన్=ఈయడవియందు. నీవృత్తిగరిమము=నీయొక్క వ్యాపారాతిశయమును. ఎల్లన్=సర్వమును. మాని=విడిచి. నేన్=నేను. మానితప్రీతిమహిమన్=మేలైన ప్రేమయొక్క పేరిమిచేత. కొల్వన్=సేవించుచుండఁగ. ఇష్టానిలింపసద్మంబు=అనుకూలమగుస్వర్గమును. చేరు=పొందుము. దానన్=దానిచేత. ఇపుడు=ఈసమయమందు. మోదానపాయతన్.—మోద=సంతోషముయొక్క; అనపాయతన్=అపాయరాహిత్యమును. తాల్తువు=ధరింతువు.

మాతంగ సంకులమగు వనభూమికన్నను పంకభూయిష్ఠమగు నదికన్నను కిరాతకులకు నివాస మగుపర్వతసమూహమునకన్నను ఎల్లపుడుఁ జేయుసురాపానమునకన్నను విప్రులతోఁ గూడియున్న యుద్యానవనము పరమహంసలతోఁ గూడియున్నకొలను సత్పురుషులతోఁగూడి యున్న మేడలు పవిత్రులగువిద్వాంసులచే నిర్మింపఁబడినభోజనమును హీనము లయినవి కావు గనుక నాతోడ స్వర్గముఁ జేరి సంతోషాతిశయమును బొందు మనిభావము. ఏనుఁగులు మొదలగువానితోఁ గూడినయడవి మొదలగువానికన్నను, మంచిపక్షులు మొదలగువానిలోఁ గూడిన యుద్యానవనము మొదలగునవి మిక్కిలియుత్తమములు, కావున, నీవు నాతోఁగూడ స్వర్గముచేరి సుఖింపుమని స్వభావాభిప్రాయము.

చ. పలుమఱు వట్టిపల్కు లిఁకఁ బల్కఁగ నేల యతీంద్ర త్వత్సము
జ్జ్వలతరరూపయౌవనరుచావరవిభ్రమక్ష్మ ప్తమోహనై

బలుతమి నిన్నుఁ జేరి ధృతిఁ ♦ బాసిననన్ రతిఁ జొక్కఁ జేయుము
త్కలికల నీకధీనగతిఁ ♦ దాల్చితి సూనశరుండు సాక్షిగన్. 110

టీ. యతీంద్ర=మునిశ్రేష్ఠుఁడా! పలుమఱున్ = మాటిమాటికి. వట్టిపల్కులు = వ్యర్థపు మాటలను. ఇఁకన్=ఈమీఁద. పల్కఁగన్=పలుకుటచే. ఏల=ఏమిప్రయోజనము?త్వత్సముజ్జ్వలతరరూపయౌవనరుచావరవిభ్రమక్లృప్తమోహాన్.—త్వత్=నీయొక్క; సముజ్జ్వలతర=మిక్కిలిప్రకాశించుచున్న; రూప=ఆకృతిచేతను; యౌవన=తారుణ్యముచేతను; రుచా=కాంతిచేతను; ఇచట హలంతలక్షణటాప్రత్యయమువచ్చిరుచా యని ఆకారాంతరూపము; వర=శ్రేష్ఠమగు; విభ్రమ=వస్త్రభూషణాదులవలనఁబుట్టినకాంతిచేతను; క్లృప్త=కలిగింపఁబడిన; మోహాన్=మోహముగలదానను. ఐ=అయి; బలుతమిన్ = అత్యాసక్తిచేత. నిన్నుఁ జేరి=నిన్ను సమీపించి. ధృతిఁబాసిననన్=ధైర్యమువిడిచిననన్ను.రతిన్=సురతముచేత. చొక్కన్=పరవశయగునటులు. చేయుము=ఒనర్పుము. సూనశరుండు సాక్షిగన్=మన్మథుఁడుసాక్షియగునట్లు. ఉత్కలికలన్=ఉత్కంఠలచేత. నీకున్. అధీనగతిన్=స్వాధీనవిధిని. తాల్చితిన్=ధరించితిని.

చ. అని మునిరాజునిశ్చలత ♦ నాత్మవచోర్థచయోరరీకృతిన్
మనమున నిశ్చయించి యల♦మత్తమతంగజయాన యేమి వ
చ్చిన నిఁక వచ్చుఁ గాక యని ♦ చిక్కనిధైర్యము పూని యేలు న
న్ననుపమరక్తి నంచు దమి♦హస్తముఁ బట్టి కళం దెమల్చినన్. 111

టీ.అలమత్తమతంగజయాన=మదపుటేనుఁగుయొక్క గమనమువంటి గమనముగలయాచిత్రరేఖ.అని=ఈప్రకారముగఁబలికి. మునిరాజనిశ్చలతన్=మునీశ్వరునియొక్క నిశ్చలత్వముచేత.ఆత్మవచోర్థచయోరరీకృతిన్.—ఆత్మవచః=తనవాక్కులయొక్క;అర్థచయ=అర్థసమూహముయొక్క; ఉరరీకృతిన్=అంగీకారమును, "ఊరీకృత మురరీకృత మఙ్గీకృతమ్" అని యమరుఁడు.మనమునన్=మనస్సునందు.నిశ్చయించి=నిర్ణయించుకొని. ఏమివచ్చినన్=ఏమియాపదవచ్చినను. ఇఁకన్ = ఈమీఁద. వచ్చుఁగాక. అని = ఈప్రకారముగఁదలఁచి; చిక్కనిధైర్యము=గాఢమగుధృతిని.పూని=గ్రహించి. నన్నున్;అనుపమరక్తిన్ = అసమానమగు నురాగముచేత-|ఏలు=పాలింపుము.అంచున్.—ఈప్రకారముపలుకుచు. దమిహస్తముఁబట్టి=మునికరముం బట్టుకొని. కళన్=కళాస్థానమును. తెమల్చినన్=చలింపఁజేయఁగ. ఉత్తరపద్యస్థక్రియతోనన్వయము.

అనఁగఁ జిత్రరేఖ తాను జెప్పినవాక్యములకాయతివర్యుండంగీకరించెనని యాతని నిశ్చలత్వమున భ్రమించి దృఢముగ నీమీఁద నే మైనను గానిమ్మని మునికరముఁ బట్టి కళాస్థానమును జలింపఁ జేసె నని భావము.

క. ఆతఱి నాయతివర్యుం, డాతతముగఁ దెఱచె లోచ♦నాబ్జములు మనో
భూతప్రతిఘోజ్జ్వలన, స్ఫీతజ్వాలద్విలోల♦జిహ్వాంచలుఁ డై. 112

టీ. అయతివర్యుండు=ఆవసంతుఁడు. ఆతఱిన్=ఆసమయమందు. లోచనాబ్జములు=కనుఁదామరలను. ఆతతముగన్=విశాలముగ. మనోభూతప్రతిఘోజ్జ్వలనస్ఫీతజ్వాలద్విలోలజిహ్వాంచలుఁడై.—మనోభూత=మనమునందుఁబుట్టిన; ప్రతిఘా=కోపమనెడు; "ప్రతిఘారుట్రుధౌ స్త్రియామ్" అనియమరుఁడు. ఉత్=అధికమగు; జ్వలన=అగ్నియొక్క; స్ఫీత=అధికమగు; జ్వాలత్=మంటవలె నాచరించునట్టియు; విలోల = చలించుచున్నట్టి; జిహ్వాంచలుఁడై=నాలుకచివరగలవాఁడై. తెఱచెన్= విప్పెను.

అంత ముని, మనసునం దుదయించుకోపాగ్నిజ్వాలయోయనునటు లుండునాలుక కలవాఁడై కనులు విప్పె నని భావము.

వ. ఇవ్విధంబున నవ్వాచంయమిసార్వభౌముండు తత్పద్మినీహృత్పద్మ సాధ్వసాపాదన చమత్కారిదినాంత సంధ్యాయమాన కోపరసశోణిమధురంధరంబు లగునేత్రపుష్కరంబులు విప్పి చెప్ప రానియాగ్రహాభంగిఁ జెంగట నున్నయక్కురంగలోచనామణిం గనుంగొని తోఁకఁ ద్రొక్కినపెనుజిలువచెలువున దీర్ఘంబు గనునిట్టూర్పు నడలించుచు నో నిలింపచాంపేయగంధి యగంధమహాంధకజిత్పరిపంథి మదాంధకార సంబంధంబునఁ గన్ను గానక మానక నిగుడుమనస్థైర్యంబున దవంబులు చేరి వనంబుల దినంబులు గడుపుచు నమలయమలక్ష్మీసాంగత్యంబున నున్ననన్నుమారకయె పెచ్చుపెరుఁగు తెచ్చు కోలువలపునఁ బచ్చవిల్తుకయ్యంబునకు నెయ్యం బుంపు మని మదీయకరంబుఁ బట్టఁ జెల్లునే యైన నది యేమి సేయం జను నియ్యెడ నీ వేలుపుఁదొయ్యలితనంబు దూలి యియ్యవని మనుజవనిత వై పుట్టి సుదోషాకరసమాఖ్యం దగునొక్కయిరాపుం జెట్ట వట్టియుండెదు గాక యని శపియించె నపుడు. 113

టీ. ఇవ్విధంబునన్=ఈప్రకారముగ. అవ్వాచంయమి సార్వభౌముండు = మునిచక్రవర్తి యగునావసంతుఁడు. తత్పద్మినీహృత్పద్మసాధ్వసాపాదన చమత్కారిదినాంత సంధ్యాయమానకోపరసశోణిమధురంధరంబులు. తత్పద్మినీ=ఆపద్మినీజాతిస్త్రీయొక్క; హృత్పద్మ=హృదయకమలమునకు; సాధ్వసాపాదన=భయాపాదకమగు; చమత్కారి=విచిత్రమగు; దినాంతసంధ్యాయమాన=సాయంసంధ్యవలెనున్న; కోపరస=క్రోధరసముయొక్క; శోణిమ = ఆరుణ్యముయొక్క; ధురంధరంబులు=భారవాహులు. అగునట్టి నేత్రపుష్కరంబులు = ఐననేత్రకమలములను; విప్పి = తెఱచి; చెప్పరానియాగ్రహాభంగిన్.—చెప్పరాని= వచించుట కలవిగాని; ఆగ్రహ=కోపముయొక్క; భంగిన్=రీతిచేత. చెంగటన్=సమీపమందు. ఉన్నయక్కురంగలోచనామణిన్=ఉండియున్నస్త్రీరత్నమగుచిత్రరేఖను. కనుంగొని=చూచి. తోఁకద్రొక్కినపెనుజిలువచెలువునన్=తోఁకద్రొక్కినపెదసర్పముకైవడి. దీర్ఘంబు=నిడుద. అగుని

ట్టూర్పున్=అగునట్టినిశ్వాసమును. వడలించుచున్=విడుచుచు. ఓనిలింపచాంపేయగంధి=చంపకపుష్పముయొక్క పరిమళమువంటిపరిమళముగలయో దేవాంగనా! అగంధమహాంధకజిత్పరిపంథిమదాంధకారసంబంధంబునన్.—అగంధ=అధికమగు; మహాంధకజిత్=శంకరునికి; పరిపంథి=శత్రువగుమన్మథునియొక్క; మద=గర్వమనెడు; అంధకార=చీఁకటియొక్క; సంబంధంబునన్=సంయోగముచేత. కన్నుగానక=కన్నుదెలియక. మానక=వదలక. నిగుడుమనస్థైర్యంబునన్=కలుగునట్టి మనోదార్ఢ్యముచేత. దవంబులు=అరణ్యములను. చేరి=ప్రవేశించి. వనంబులన్=తపోవనములయందు. దినంబులు=వాసరములను. గడుపుచున్=జరుపుచు. అమలయమలక్ష్మీసాంగత్యంబునన్.—అమల=స్వచ్ఛమగు; యమ=నియమముయొక్క; లక్ష్మీ=సంపదయొక్క; సాంగత్యంబునన్=సంబంధముచేత. ఉన్ననన్నున్=ఉండియున్ననన్ను. ఊరకయె=నిష్కారణముగ. పెచ్చుపెరుఁగుతెచ్చుకోలువలపునన్.— పెచ్చుపెరుఁగు=అతిశయించు; తెచ్చుకోలువలపునన్ = ఆరోపితకామముచేతను. పచ్చవిల్తుకయ్యంబునకున్ = మన్మథయుద్ధమునకు. అనఁగా సురతమునకు ననుట. నెయ్యంబు=ప్రేమను. ఉంచుమని. మదీయకరంబున్=నాహస్తమును. పట్టన్=పట్టుకొనుటకు. చెల్లునే=తగునా? ఐనన్=అటులైనను. అని = ఆకరమును బట్టుకొనుట. ఏమి సేయంజనున్=ఏమి చేఁయబోవుదు? ఇయ్యెడన్=ఈసమయమందు. నీవేల్పుఁదొయ్యలితనంబు=నీదేవాంగనాత్వము. తూలి=తొలఁగి. ఇయ్యవనిన్=ఈపుడమియందు. మనుజవనితవు = మనుష్యాంగనవు. ఐ. పుట్టి=జన్మించి. సుదోషాకరసమాఖ్యన్ = సుదోషాకరుఁ డనునన్వర్థనామముచేత. తగనొక్కయిరాపున్ = ఒప్పునట్టియొక మద్యపాయిని. చెట్టవట్టి=వివాహమాడి. ఉండెదుగాక=ఉండుమా. అని=ఈప్రకారము. శపియించెన్=శాపమిచ్చెను.

అనఁగ నామునిసార్వభౌముఁడు కోపముచే నెఱ్ఱనగుకన్నులు దెఱచి చిత్రరేఖను జూచి తోఁకద్రొక్కినపాముభంగి నిశ్వాసంబు విడుచుచు నోదేవాంగనా నీవు మదనమదాంధకారముచేఁగన్నుగానక దవంబులఁజేరితపంబొనరించుచున్ననన్ను నకారణముగ సురతమునకై నామీఁదప్రేమముంచుమని కరంబు గ్రహించుట యుక్తముగాదని పలికి యీసమయమందు నీదేవాంగనాత్వము తొలఁగి మనుజాంగనవై పుట్టిసుదోషాకరుఁ డను పేరుగలయిరాపుబెండ్లియాడు మని శపియించె నని భావము.

సీ. తనక్రొందళములమ•న్నన చెట్లపాలుగాఁ, జనియెసూనశ్రీల•నెనసి మధువు
తనతరోగరిమ మెం•తయుధూళిపాలుగా, నరిగె వడంకుచు • ననదుగాడ్పు
తనమహస్ఫూర్తితో•ల్తనె యగ్నిపాలుగాఁ, బఱచె వెల్వెలఁ బొఱ•పద్మవైరి
తనపాత్రవృత్తితో•డ్తనె మింటిపాలుగా, నడఁగెఁగొమ్మలఁ బికా•ద్యభ్రగాళి
తే. తనపురారాతిభీకరో•దగ్రవిగ్ర
హస్ఫురణ భూతిపాలుగా • నతనుఁ డేగె
చాపశతజాతములు వన•స్థలిని వైచి
యమ్మహామౌని కోపాప్తి • నడరునపుడు. 114

టీ. అమ్మహామాని=ఆవసంతుఁడు. కోపాప్తిన్=కోపప్రాప్తిచేత. అడరునపుడు=అతిశయించునపుడు. మధువు=వసంతుఁడు.తనక్రొందళంబులమన్నన=తనయొక్క నూతనమగు సేనలయొక్కమన్నన. చెట్లపాలుగాన్=చెట్లపాలుకాఁగ.సూనశ్రీలన్.—సు=మిక్కిలి;ఊన=కొదువపడిన;శ్రీలన్=సంపదలను.ఎనసి=పొంది. చనియెన్=పోయెను.మునికి క్రోధము వచ్చి యతిశయించునపుడు వసంతుఁడు తనదండు చెట్లపాలు కాఁగా సంపదలవిడిపోయెనని తాత్పర్యము. ఇచట వసంతుఁడు క్రొందళము లనఁగఁ జిగురాకులు చెట్లపాలుకాఁగా ననఁగా వృక్షములయందు చేరఁగానే సూనశ్రీలను అనఁగా ప్రసూనసంపదలను పొందిచనియెనని స్వభావార్థము. వసంతుఁడు రాఁగానె మ్రాఁకు లంకురించుటయును పుష్పించుటయును సహజ మనిభావము. అసదుగాడ్పు=మలయానిలము. తనతరోగరిమము = తనబలిమియొక్కయతిశయము. ఎంతయున్=మిక్కిలి. ధూళిపాలుగాన్=దుమ్ముపాలుగాఁగ. వడంకుచున్=వణఁకుచు. అరిగెన్=పోయెను.మలయానిలము తనసామర్థ్యము దుమ్ముపాలైపోఁగా భయపడి వణఁకుచుఁబోయెనని తాత్పర్యము. అసదుగాడ్పు=మందమారుతము. తనతరోగరిమము=తనయొక్క వేగాధిక్యము. ధూళిపాలుగాన్=దుమ్ములోఁగలయఁగ. వడఁకుచున్=చలించుచు;అరిగె నని స్వభావార్థము. అనఁగమారుతమునకుధూళితోఁగలయుటయు చలించుటయును సహజమనిభావము.పద్మవైరి=చంద్రుఁడు. తనమహాస్ఫూర్తి=తనప్రతాపస్ఫూర్తి. తొల్తనె=మొదటనె. అగ్నిపాలుగాన్=అగ్నిపాలుకాఁగ. వెల్వెలఁబాఱి = వివర్ణముగలవాఁడై, కాంతిహీనుఁడై యనుట. పఱచెన్=పాఱిపోయెను. చంద్రుఁడు తనప్రతాప మగ్నిపాలు కాఁగానే కాంతిహీనుఁడై పాఱిపోయె ననుట.చంద్రుఁడు;తనప్రతాపస్ఫూర్తి=తనకళాస్ఫూర్తి. తొల్తనె=మొదటనే. అగ్నిపాలుకాన్ అగ్నిహోత్రుఁడు మొదట చంద్రునిప్రథమకలను పానము చేయు ననుట ప్రసిద్ధము ఇందు, "ప్రథమాంపిబతేవహ్నిః" అను వచనము ప్రమాణము. వెల్వెలఁబాఱి=వెలవెలనై పఱచుట సహజమనిభావము. పికాద్యభ్రగాళి=పికము మొదలగుపక్షులగుంపు. తనపాత్రవృత్తి=తనయొక్కతగినవార నెడివృత్తి. తోడ్తనె=వెంటనె. మింటిపాలుగాన్=మింటిపాలైపోఁగ. కొమ్మలన్=స్త్రీలయందు. అడఁగెన్=దాఁచుకొనెను. కోయిల మొదలగు పక్షులగుంపు తనసంబంధి యగు యుద్ధాదులకు తగినవాఁడనువృత్తి మింటిపాలు కాఁగ వెంటనె భయపడి స్త్రీలయందు దాఁచుకొనెనని భావము. ఇచ్చట కోయిలలుమొదలగునవి, తనపాత్రవృత్తి=తనయొక్క పాత్రము అనఁగా ఱెక్కలసంబంధియైన వ్యాపారము, ఎగయుటయనుట. మింటిపాలుగాన్, కొమ్మలన్=వృక్షశాఖలందు. అడఁగెన్. కోయిలలు మొదగునవి దొంగని కొమ్మలఁజేరుట సహజమనిభావము. అతనుఁడు=మన్మథుఁడు. తనపురారాతిభీకరోదగ్రవిగ్రహస్ఫురణ.—తన=తనసంబంధియగు; పురారాతి=శంకరునికి;భీకర=భయంకర మగునట్టియు; ఉదగ్ర=అధికమగు; విగ్రహ=విరోధముయొక్క; స్ఫురణ=స్ఫురించుట. భూతిపాలుకాకాన్=భస్మపాలుకాఁగానె. చాపశరజాతములు=విల్లమ్ముల సమూహములను. వనస్థలిన్=వనమందు. వైచి=రువ్వి. ఏగెన్=పోయెను. అనఁగమన్మథుడు శంకరునికిని భీకర మగుతన మాత్సర్యస్ఫురణము భూతిపాలు కాఁగానె అడవిలో ధనుస్సును బాణములను పాఱ వైచి పోయె నని భావము. మన్మథుని విగ్రహస్ఫురణ మనఁగా శరీరస్ఫురణము, భూతిపాలు

కాఁగానెయనఁగా భస్మీభూతము కాఁగానె, వనస్థలిన్=ఉదకమందు, అరవిందాదులనఁ బైచి పోయె నని స్వభావార్థము. మన్మథునిశరీరము హరనేత్రాగ్నిచే భస్మ మగుటయు నతనిబాణము లగునరవిందాదు లుదకమం దుండుటయు సహజ మని భావము.

క. ఈరీతి మునీశ్వరవా, గ్భూరీతిభయార్తచంద్ర•కుసుమాస్త్రపికీ
కీరీతిరోహితత గని, నారీతిలకంబు వెఱపు•నన్ మదిఁ గలఁగన్. 115

టీ. ఈరీతిన్=ఈప్రకారముగ. మునీశ్వరవాగ్భూరీతిభయార్తచంద్రకుసుమాస్త్రపికీకీరీతిరోహితతన్.—మునీశ్వర=జడదారిసామియొక్క; వాక్=శాపరూపవచనమనెడి; భూరి=అధికమగు; ఈతి=పీడవలననైన; భయ=వెఱపుచేత; ఆర్త=పీడితులగు; చంద్ర=చంద్రునియొక్క; కుసుమాస్త్ర=మన్మథునియొక్క; పికీ=ఆఁడుకోయిలలయొక్క; కీరీ=ఆఁడుశుకములయొక్క; తిరోహితతన్=తిరోహితత్వమును; అనఁగ డాఁగి యుండుటను. కని=చూచి. నారీతిలకంబు=చిత్రరేఖ; వెఱపునన్=భయముచేత. మదిన్=చిత్తమందు; కలఁగన్=కలఁతపడఁగ. దీనికి నుత్తరపద్యములో నుండు పల్కె నను క్రియతో నన్వయము.

మునీశ్వరశాపమునకు చంద్రమన్మథపికకీరములు భయముచే తిరోధానమును బొందుటను జూచి చిత్రరేఖ భయపడి మనమునందు కలఁత నొందె నని భావము.

ఉ. అయ్యతివర్యుఁ జేరి విన•యంబున నంఘ్రుల వ్రాలి పల్కె నో
యయ్య భవత్ప్రభావగతి • నాత్మ నెఱుంగక ప్రాజ్యగర్వసా
హాయ్యమునన్ ఘటించితి మ•హాగము నైన దయాత్మఁ బ్రోవవే
యియ్యెడ నీకు నే ననఁగ • నెంత త్వదుక్తి మరల్చి నెమ్మదిన్. 116

టీ. అయ్యతివర్యున్=అమునిశ్రేష్ఠుని. చేరి=సమీపించి. వినయంబునన్=అడఁకువచేత. అంఘ్రులన్=పాదములయందు. వ్రాలి=ఒరగి. పల్కెను=పలికెను. ఓయయ్య=ఓమునినాథా! భవత్ప్రభావగతిన్.—భవత్=మీయొక్క; ప్రభావగతిన్=సామర్థ్యవిధమును. ఆత్మన్=చిత్తమందు; ఎఱుంగక=తెలియక; ప్రాజ్యగర్వసాహాయ్యమునన్.—ప్రాజ్య=అధికమగు; గర్వ=అహంకారముయొక్క; సాహాయ్యమునన్=తోడ్పాటుచేత. మహాగమున్=గొప్పయపరాధమును. చేసితిన్=ఒనరించితిని. ఐనన్=అయినను. ఇయ్యెడన్=ఈసమయమందు. నీకున్, నేనన్ఁగన్. ఎంత=ఎంతటిదానను? త్వదుక్తిన్=నీవాక్యమును. నెమ్మదిన్=నిండుచిత్తముచేత. మరల్చి=త్రిప్పి. దయాత్మన్=దయతోఁగూడినమనముచేత. ప్రోవవే=రక్షింపుమా.

చ. కటకట నిర్జరీత్వ ముడు•గన్ ధర మర్త్యవధూటికాత్మ నే
నెటులు జనింతు నైన మతి•యేగతి దుష్టసమాఖ్యఁ బూని స
త్పటలవినిందనీయగతిఁ • దాల్చినవాని వరించి యోర్తు నా
వటముగ నీదుమాట ముని•వర్య మరల్చి దయాత్మఁ బ్రోవవే. 117

టీ. నిర్జరత్వము=దేవాంగనాత్వము. ఉడుగన్=పోవఁగ. మర్త్యవధూటికాత్మన్=మనుష్యాంగనారూపము చేత. ఎటులు=ఏప్రకారము. జనింతున్=పుట్టుదును? ఐనన్=మర్త్యజన్మమెత్తినను. మఱియేగతిన్=మఱియేరీతిగ. దుష్టసమాఖ్యన్=దుష్టనామమును. పూని=గ్రహించి. సత్పటలవినిందనీయగతిన్,—సత్పటల=సత్సమూహమునకు; వినిందనీయ=మిక్కిలి గర్హితమగు; గతిన్=రీతిని. తాల్చినవానిన్=ధరించినవానిని. వలచి=కోరి. ఏగతిన్=ఏరీతిగ. ఓర్తున్=సహింతును? కటకట=అతికష్టము. మునివర్య=మునిశ్రేష్ఠుఁడా! అవటముగన్=ఉపాయముగ. నీదుమాటన్=నీశాపరూపవాక్యమును. మరల్చి=త్రిప్పి. కరుణాత్మన్=దయతోఁగూడిన చిత్తము చేత. ప్రోవనే=రక్షింపుమా.

అనఁగ మునినాథా! నీశాపమున నాదేవత్వము వీడినను సహింతును గాని దుష్టసమాఖ్యను బూనినమర్త్యపాయుని వివాహమాడి యెట్లు ఓర్తును? యుక్తిచే నీశాపోక్తిని మరల్చి నన్నుఁ బ్రోవుమని భావము.

చ. అనువనితాప్రియోక్తిఁ గరు♦ణాయతనాయితమానసాబ్జుఁడై
మునికులముఖ్యుఁ డిట్లను న♦మోఘము మద్వచనంబు లైన నే
ర్పున నిఁక దాని కన్యగతిఁ ♦ బూన్తుఁ బయోజదళాక్షి యంచుఁ బా
వననిపుణత్వరూఢి దయి♦వాఱ యతీశుఁడు పల్కె వెండియున్. 118

టీ. అనువనితాప్రియోక్తిన్=ఈప్రకారముపలుకుచున్న చిత్రరేఖప్రియవచనముల చేత. కరుణాయతనాయితమానసాబ్జుఁడువై,—కరుణాయతనాయిత=కరుణాగృహమువలె నాచరించుచున్న; మానసాబ్జుఁడై=చిత్తకమలముగలవాఁడై. మునికులముఖ్యుఁడు=మునిశ్రేష్ఠుఁడు. ఇట్లు=వక్ష్యమాణప్రకారముగ. అనున్=పలికెను. పయోజదళాక్షీ=చిత్రరేఖా! మద్వచనంబులు=నామాటలు. అమోఘము=రిత్తవోవనవికావు. ఐనన్=అయినను. నేర్పునన్=నైపుణ్యము చేత. ఇఁకన్=ఈమీఁద. దానికిన్=ఆశాపవాక్యమునకు. అన్యగతిన్=అర్థాంతరమును. పూన్తున్=చేయుదును. అంచున్=అనుచు. పావననిపుణత్వరూఢి,—పావన=పరిశుద్ధమగు; నిపుణత్వ=నైపుణ్యముయొక్క; రూఢి=ప్రసిద్ధి. దయివాఱన్=అతిశయించునట్టులు. వెండియున్=మఱియును. పల్కెన్.

చ. సరసిజగంధి వింటివె సు♦చంద్రసమాఖ్య రహించుభూపతిం
బరిణయ మందు మంచు నల♦భవ్యవచస్తతి కర్థ మాట ను
ర్వర ఘనరాజవంశమున♦రాజిలి జిష్ణువిరోధిభేదనా
దరు నినవంశమౌళిమణిఁ ♦ దన్వి వరించి చెలంగె దెంతయున్. 119

టీ. సరసిజగంధి=పద్మముయొక్క గంధమువంటిగంధముగలచిత్రరేఖా! వింటివె=వింటివా? అలభవ్యవచస్తతికిన్=సుదోషాకరసమాఖ్యుండగు నొకయిరాపున నెడి వచనజాతమునకు. సుచంద్రసమాఖ్యరహించుభూపతింబరిణయమందుమంచున్=సుచంద్రుఁడను పేర నొప్పుచు

న్నరాజును వివాహము చేసికొను మని. అర్థము జొటన్=అర్థము కావుటవలన. ఎటులనఁగ, దోషాశబ్దమునకు రాత్రి యర్థము దానిఁజేయువాఁడు దోషాకరుఁడు అనఁగఁ జంద్రుఁ డగుట. సుశబ్దపూర్వకదోషాకరశబ్దమునకు సుచంద్రుఁ డర్థము ఈసమాఖ్యచే నొప్పు ఇరావుఁ డెనఁగ. ఇరాంపాతీతిఇరాపః అని భూపుఁ డర్థము, ఇరాభూవాక్సురాప్సుస్యాత్ని యమరుఁడు. ఈ రీతి సుచంద్రుఁ డర్థ మగుటవలన నని తాత్పర్యము. ఉర్వరన్=భూమియందు. ఘనరాజ వంశమునన్=గొప్పరాజవంశమందు. రాజిలి = ఒప్పినదానవై. జిష్ణువిరోధిభేదనాదరున్.— జిష్ణువిరోధి = ఇంద్రశత్రువులగురాక్షసులయొక్క; భేదన = బ్రద్దలుచేయుటయందు; ఆదరున్ = ఆదరముగలవానిని. ఇనవంశమౌళిమణిన్=సూర్యవంశశిరోరత్నమగు సుచంద్రుని; వరించి=కోరి. తన్వి=చిత్రలేఖా! ఎతయున్=మిక్కిలి. చెలంగెదు=ఒప్పెదవు.

తే. అఖిలభూమిధురాభర♦ణాఢ్యు నాధ, రాభుజునిఁ జెట్టవట్టి దు♦ర్వారవిభవ
సంగతి శతసహస్రవ♦త్సరము ధరణి, నలరి యంత భవద్రూప♦మందె దనిన.

టీ. అఖిలభూమిధురాభరణాఢ్యున్.—అఖిల=సమస్తమగు; భూమిధురా=భూభారము యొక్క; భరణ=భరించుటచేత; ఆఢ్యున్=అధికుఁడగు. ఆధరాభుజున్ = ఆసుచంద్రుని. చెట్టవట్టి=వివాహముఁజేసికొని. దుర్వారవిభవసంగతిన్.—దుర్వార=అనివార్యమగు; విభవ= సంపదయొక్క; సంగతిన్=సంబంధముచేత. శతసహస్రవత్సరము = నూఱువేలసంవత్సర ములు; ధరణిన్=భూమియందు. అలరి=ఒప్పి. అంతన్=అటుపిమ్మట. భవద్రూపము=నీదేవాంగ నాస్వరూపమును. అందెదు=పొందఁగలవు. అనినన్=అనఁగా. దీని కుత్తరపద్యస్థక్రియతో నన్వయము.

అనఁగ సార్వభౌముం డగుసుచంద్రునిఁ బెండ్లియై లక్ష వత్సరములు పుడమియం దుండి యామీఁద నీస్వరూపముఁ బొందఁ గల వని భావము.

చ. విని ప్రమదప్రవాహపరి♦వేష్టితమానస చిత్రరేఖ యం
త నలమునీశుపాదనలి♦నంబులకుం బ్రణమిల్లి యాఘనుం
డనుప హితాళిపాళియుతి♦ నాస్థలి నల్లనఁ బాసి యాత్మకాం
చనమయకేళికానిలయ♦సంస్థలిఁ జేరె రయంబు మించఁగన్. 121

టీ. ప్రమదప్రవాహపరివేష్టితమానస.—ప్రమదప్రవాహ=సంతోషమను ప్రవాహముచే త; పరివేష్టిత=చుట్టఁబడిన; మానస=చిత్తముగల. చిత్రరేఖ=చిత్రరేఖయను దేవాంగన. విని=ము నివచనమును విన్నదై. అంతన్=అటుపిమ్మట. అలమునీశుపాదనళినంబులకున్=ఆవసంతముని పాదపద్మములకు. ప్రణమిల్లి=నమస్కరించి. ఆఘనుండు=ఆవసంతముని. అనుపన్=పంపఁగ. హి తాళిపాళియుతిన్.—హిత=అనుకూలలగు; ఆళి=సకియలయొక్క; పాళి=పంక్తితోడ; యుతిన్ =కూడికచేతను. ఆస్థలిన్=ఆపారిజాతారణ్యప్రదేశమును. అల్లనన్=తిన్నగ. పాసి = వదలి. రయంబు = వేగము. మించఁగన్=అతిశయింపఁగా. ఆత్మకాంచనమయకేళికానిలయసంస్థ

లిన్.—ఆత్మ=తనయొక్క; కాంచనమయ=సువర్ణమయమగు; కేళికానిలయ=కేళిగృహముయొక్క; సంస్థలిన్=ప్రదేశమును. చేరెన్=పొందెను.

పూర్వోక్తవాక్యములను విన్నదై చిత్రరేఖ వసంతునమస్కరించి సంతసమున సకియలం గూడి స్వకీయకాంచనమయగృహమును జేరె నని భావము.

ఉ. ఆలలితాంగి యొక్కశుభవి♦కాహమునన్ క్షణదోదయాఖ్యపాం
చాలవసుంధరాపతికి ♦ శ్యామ యనం బొగ డొందుసుందరీ
పాళియెడన్ జనించె నల♦మానవభర్తయు భూరిహర్షభూ
షాకలితాత్ముఁడై యునిచెఁ ♦ జంద్రిక యన్శుభనామ మింతికిన్. 122

టీ. ఆలలితాంగి=ఆచిత్రరేఖ. ఒక్కశుభవికాహమునన్=ఒకశుభదినమందు క్షణదోదయాఖ్యపాంచాలవసుంధరాపతికిన్=క్షణదోదయుఁ డను పేరుగలపాంచాలభూపతికి. శ్యామయనన్=శ్యామ యనఁగ. పొగడొందుసుందరీపాళియెడన్=ప్రసిద్ధినిబొందుకాంతారత్నమునందు. జనించెన్=జన్మించెను. అలమానవభర్తయును=ఆక్షణదోదయరాజును. భూరిహర్షభూషాకలితాత్ముఁడై.—భూరి=అధికమగు; హర్ష=సంతసముచేత; భూషా = ఆభరణములచేత; కలిత=పొందఁబడిన; ఆత్ముఁడై=మనమునుదేహమును గలవాఁడై. ఇంతికిన్=కూఁతునకు. చంద్రికయన్శుభనామము=చంద్రికయనుశుభనామధేయమును. ఉనిచెన్=ఉంచెను.

చిత్రరేఖ పుడమి నొకశుభదినమందు క్షణదోదయభూపతికాంత యగుశ్యామ యను పేరు గలనారీరత్నమందుజన్మింపఁగా క్షణదోదయుఁడు ఆకన్యకుచంద్రికయనునామ మునిచె నని భావము.

మ. తనకార్యంబున కీగతిం జని యమ♦ర్త్యస్త్రీలలామంబు పా
వనహాన్యుక్తి నిజాదివర్ణరహిత♦త్వం బూని ధాత్రిం జనిం
చిన వార్తన్ విని చింత నొంది మదిఁ ద♦త్స్నేహంబుతో దివ్యచి
హ్నానికాయంబులు గల్గఁ జేసె నవలా♦కబ్జాసనుం డెంతయున్. 123

టీ. అబ్జాసనుండు=నలువ. తనకార్యంబునకున్ = మునితపోభంగరూపస్వ కార్యమునకు. ఈగతిన్=ఈరీతిగా. చని=పోయి. అమర్త్యస్త్రీలలామంబు=దేవాంగనయగు చిత్రరేఖ. పావనహాన్యుక్తిన్=పవిత్రమగుముని శాపోక్తిచేత. నిజాదివర్ణరహితత్వంబు.—నిజ = అమర్త్యస్త్రీశబ్దముయొక్క; ఆదివర్ణ=ప్రథమవర్ణమగు నకారముయొక్క; రహితత్వంబు= రాహిత్యమును. ఊని=పూని. అనఁగమర్త్యస్త్రీత్వమును బొందియనుట. ధాత్రిన్=భూమియందు. జనించినవార్తన్=జన్మించెనను జనశ్రుతిని. విని. చింతన్=విచారమును. ఒంది=పొంది. మదిన్=హృదయమందు. తత్స్నేహంబుతోన్.—తత్=ఆచిత్రరేఖయందలి; స్నేహంబుతోన్=ప్రేమచేత. దివ్యచిహ్ననికాయంబులు=దివ్యమగు భాగ్యచిహ్నములయొక్క సమూహములను. నవలాకున్=చంద్రికకు. ఎంతయున్=మిక్కిలి. కల్గన్=కలుగునటులు. చేసెన్=ఒనరించెను.

అనఁగఁ బారిజాతారణ్యమునందు బ్రహ్మత్వమునకై తపం బొనరించువసంతమునితపో భంగమునకుం దాను బంపినచిత్రరేఖకు నామునిశాపమువలన మర్త్యస్త్రీత్వము రాఁగానే నలువ చింతించి యాకాంతకు నమోఘభాగ్య చిహ్నములు గలుగఁ జేసె నని భావము.

ఉ. ఆసరసీరుహాక్షి కఖి♦లాద్భుతదాయివిపంచికాకలా
భ్యాస మొనర్పఁ జెంతఁ దగు♦నట్టినను౦ గుముదాఖ్యుఁ గాంచి ప
ద్మాసనుఁ డంపఁ బూర్వసమ♦యామితమైత్త్రి ధరిత్త్రిఁ జేరి యు
ద్భాసితతద్రహస్యగతిఁ ♦ దన్వికి నేర్పితి నేర్పుపెంపునన్. 124

టీ. ఆసరసీరుహాక్షికిన్=ఆచంద్రికకు. అఖిలాద్భుతదాయివిపంచికాకలాభ్యాసము.—అఖిల=సమస్తజనులకు; అద్భుత=ఆశ్చర్యమును; దాయి=ఇచ్చునట్టి; విపంచికాకలా=వీణావిద్యయొక్క; అభ్యాసము=నేర్పుటను. ఒనర్పన్=చేయుటకు. కుముదాఖ్యున్=కుముదుఁడను పేరుగల. చెంతఁదగునట్టినను౯=సమీపమునందున్ననన్ను. కాంచి=చూచి. పద్మాసనుఁడు=నలువ. అంపన్=పంపఁగా. పూర్వసమయామితమైత్త్రిన్.—పూర్వసమయ=పూర్వకాలమందున్నట్టియు; అమిత=అధికమగునట్టి; మైత్త్రిన్=స్నేహము చేతను. ధరిత్త్రిన్=భూమిని. చేరి=పొంది. ఉద్భాసితతద్రహస్యగతిన్.—ఉద్భాసిత=ప్రకాశించుచున్న; తత్ = ఆవీణావిద్యయొక్క; రహస్య=నిగూఢమగు; గతిన్=రీతిని. తన్వికిన్=చంద్రికకు. నేర్పుపెంపునన్=నైపుణ్యాతిశయము చేత. నేర్పితిన్=అభ్యసింపఁజేసితిని.

అనఁగ నలువ చెంత నున్నకుముదుఁ డనుపేరు గలనన్నుఁ జూచి పుడమికిఁ బోయి చంద్రికకు వీణావిద్యారహస్యమును దెలుపు మనఁగా, నేను బూర్వస్నేహంబున భూమిఁజేరి తద్విద్యారహస్యము నామెకు నేర్పితి నని భావము.

తే. అంత నొకనాఁడు శారదా♦కాంతవలన
వింతరాగంబులొకకొన్ని♦వినిముదమున
వానినన్నింటినారాజ♦వర్యసుతకుఁ
దెలిపెదనటంచుఁబుడమికే♦తెంచునపుడు. 125

టీ. అంతన్=అటుపిమ్మట. ఒకనాఁడు=ఒకదినమందు. శారదాకాంతవలనన్=సరస్వతీదేవివలన. వింతరాగంబులు=విచిత్రమగురాగములను. ఒకకొన్ని. విని. ముదమునన్=సంతసముచేత. వానినన్నింటిన్=ఆరాగములనన్నిటిని. ఆరాజవర్యసుతకున్=ఆచంద్రికకు. తెలిపెదను=తెలియఁజేసెదను. అటంచున్=ఆప్రకారమనుచు. పుడమికిన్=భూలోకమునకు. ఏతెంచునపుడు=వచ్చుచున్నసమయమందు.

సీ. కనుదోయి కింపూన్చు♦కలికికుంకుమబొట్టు, దార్చిననెమ్మోముఁ♦దమ్మిదాని
నీటుగాఁ దీర్చిన♦కాటుకరేఖచే, నొప్పారువిమలాక్షి♦యుగముదాని
నునుపు లొత్తొడలని♦గ్గున వింతవగ దోఁచు, నవ్యచీరాచ్ఛాద♦నమ్ముదానిఁ
బసపుచాలూఁత చేఁ ♦ బచ్చదామరపెంపు, దలఁకించుపాణిపా♦దమ్ముదాని

తే. జలదనికటస్థలిరహించు♦చపలవ్రాలెఁ
బర్ణదళశాలపొంతఁ జూ♦పట్టుదాని
నొక్కమునికాంత నీయద్రి♦చక్కిఁ గాంచి
చాల వైచిత్రి నెమ్మది ♦ సందడింప. 126

టీ. కనుదోయికిన్=కనుఁగవకు. ఇంపూన్చుకలికికుంకమబొట్టు.—ఇంపు = సొంపును; ఊన్చు=చేయుచున్న; కలికి=సుందరమగు; కుంకుమబొట్టు = కాశ్మీరతిలకము. తార్చిన నెమ్మొముతమ్మిదానిన్.—తార్చిన=దిద్దిన; నెమ్మొముతమ్మిదానిన్ = సుందరమగుముఖకమలముగలదానిని. నీటుగాన్=శృంగారముగ. తీర్చినకాటుకరేఖచేన్=దిద్దినకాటుకరేకచేత. ఒప్పారు విమలాక్షియుగముదానిన్.—ఒప్పారు=ప్రకాశించుచున్న; విమల=నిర్మలమగు; అక్షియుగముదానిన్=కనుదోయిగలదానిని. ననుపులౌతోడలసగ్గునన్=ననుపులగుతొడలయొక్క కాంతిచేత. వింతవగ=ఆశ్చర్యకరమగువిలాసము. తోఁచునవ్యచీరాచ్ఛాదనమ్ముదానిన్.— తోఁచు=కనిపించుచున్న; నవ్య = నూతనమగు; చీరాచ్ఛాదనమ్ముదానిన్=నారకోఁకగలదానిని. పసపుచాలూఁతచేన్=పసపు సమృద్ధిగా పూయుటచేత. పచ్చదామరపెంపు=పసపుతామరపూలయొక్క అతిశయమును. తలఁకించుపాణిపాదమ్ముదానిన్.—తలఁకించు=చలింపఁజేయు; పాణిపాదమ్ముదానిన్=హస్తములుపాదములుగలదానిని.(ప్రాణ్యంగములగుటచే నేకవద్భావము. జలదనికటస్థలిన్=మేఘసమీపప్రదేశమందు. రహించు చపలవోలెన్ = ఒప్పుచున్న మెఱపుతీఁగవలె. పర్ణదళశాలపొంతన్.—పర్ణదళశాల=మోదుకాకులతోఁ గట్టఁబడిన పర్ణశాలయొక్క; పొంతన్=సమీపమందు; చూపట్టుదానిన్=కనుపట్టుదానిని. ఒక్కమునికాంతన్=ఒకమునిపత్నిని. ఈయద్రిచక్కిన్=ఈపర్వతస్థానమందు. చూచి=కని. చాలన్=మిక్కిలి. వైచిత్రి=ఆశ్చర్యము; నెమ్మదిన్=మనమునందు. సందడింపన్=అతిశయింపఁగ.

చ. కళ గలమోము కెంపుసిరి ♦ గాంచినవద్దెర తేనె లొల్కుపలుకులు బిగువైనచన్నుఁగవ ♦ కుందనపుంజిగి నేలుముద్దుచెక్కుల గలయీచెలిం బ్రియపుఁ♦గూర్మి వగ న్ననవిల్తుపోరునన్
గలయక యున్నచోఁ దలఁపఁ ♦ గల్గు నొకో నవసౌఖ్యమం చొగిన్. 127

టీ. కలగళమోము=కాంతిగలముఖము. కెంపుసిరిన్=ఎఱ్ఱనికాంతిని. కాంచినవద్దెర=పొందినట్టిమోవి. తేనెలొల్కుపల్కులు = మకరందమును జిల్కుమాటలు. బిగువైనచన్నుఁగవ=బిగుతుగలపాలిండ్లును. కుందనపుంజిగిన్=అపరంజికాంతిని. ఏలుముద్దుచెక్కులు = పరిగ్రహించిన ముద్దుచెంపలును. కలయీచెలిన్=కలుగునట్టి యామునిపత్నిని. ప్రియపుకూర్మిన్=ప్రియమగుచెలిమిచేతను. వగన్=విలాసముచేతను. ననవిల్తుపోరునన్ = సురతమునందు. కలయకయున్నచోన్=కూడకయుండినయెడ. నవసౌఖ్యము=నూతనమగు సౌఖ్యము. తలఁపఁగల్గునొకో=తలపఁగల్గునాకలుగదని భావము. అంచున్=అనితలఁచుచు.ఒగిన్=క్రమముగా.

ఉ. తాపసరాట్కుమారసమ♦తాకలితాకృతి నాత్మవిద్య మా
యాపటిమన్ భరించి తదు♦దారనవచ్ఛదశాలఁ జేరి యు
ద్దీపితభక్తిఁ దన్మునిపి♦తృప్రముఖానవరర్షిమీశరా
జీపదపద్మములు వినతి♦చేయుచు నంతటఁ దత్కథాగతిన్. 128

టీ. తాపసరాట్కుమార సమతా కలితాకృతిన్.—తాపసరాట్కుమార=మునిశ్రేష్ఠుని కుమారునియొక్క; సమతా=సమత్వముతో; కలిత = కూడుకొన్న; ఆకృతిన్ = ఆకారమును. ఆత్మవిద్యన్=స్వభావవిద్యచేతనైన. మాయాపటిమన్ = మాయాపటుత్వముచేత. భరించి= వహించి. నామాయచేత మునిపుత్త్రాకృతినిబొంది యనిభావము. తదుదారనవచ్ఛదశాలన్.— తత్=ఆమునిపుత్త్రునియొక్క; ఉదార=ఉత్కృష్టమగు;నవ=నూతనమైన; ఛదశాలన్=పర్ణశాలను. చేరి=సమీపించి. ఉద్దీపితభక్తిన్ = అధికమగుభక్తిచేత. తన్మునిపితృప్రముఖానవరర్షిమీశరాజీపదపద్మములు.— తన్ముని = ఆమునియొక్క; పితృ=తండ్రి; ప్రముఖ=మొదలుగాఁగల; అనవరర్షిమీశ=పెద్దమునులయొక్క; రాజీ=పంక్తియొక్క; పదపద్మములు=పాదకమలములను. వినతిచేయుచున్=నమస్కరించుచు. అంతటన్=అటుమీఁద. తత్కథాగతిన్.— తత్=ఆమునులయొక్క; కథాగతిన్ = కల్పితవృత్తాంతముయొక్క రీతిచే. దీని కుత్తరపద్యమునం దున్నక్రియతో నన్వయము.

తే. ప్రొద్దు గడపుచు నుండ మ♦త్పూర్వకర్మ
గౌరవమ్మున నమ్ముని♦కాంతుఁ డచటి
కుట్టిపడ్డట్లు కన్నూడి♦నట్లు లపుడు
వేగమున వచ్చెఁ దత్సభ ♦ వెఱఁగుపడఁగ. 129

టీ. ప్రొద్దుగడపుచునుండన్ =పూర్వోక్త కథచేఁ బ్రొద్దుఁ బుచ్చుచుండఁగ. మత్పూర్వకర్మగౌరవమ్మునన్.—మత్=నాయొక్క;పూర్వకర్మ=పూర్వజన్మదుష్కర్మయొక్క; గౌరవంబునన్ = ఆధిక్యముచేత. అమ్మునికాంతుఁడు=ఆమునినాథుఁడు. అచటికిన్=ఆపర్ణశాలకు.ఉట్టిపడ్డట్లు=నిష్కారణముగ పిడిపడినట్లు. కన్నూడినట్టులు=నేత్రము లూడినవిధముగ. అపుడు = ఆసమయమందు. వేగమునన్=శీఘ్రముగ. తత్సభ=ఆసభ. వెఱఁగుపడఁగన్= ఆశ్చర్యపడునటులు.వచ్చెన్.

ఉ. వచ్చిన నమ్మునీశుఁ గని ♦ వారక గుండియ వ్రీల నంత నే
నచ్చటఁ దెచ్చుకోలు ధృతి ♦ నయ్యతితో శపనోక్తిజాలకం
బెచ్చఁగఁ బెద్దప్రొద్దు కల♦హించితి నప్డు పరస్పరోగ్రఘో
షోచ్చలితాత్మత న్సభ య♦హో యని యబ్బుర మూని నిల్వఁగన్.130

టీ. వచ్చినన్ =రాఁగానే. అమ్మునీశున్ =ఆ మునినాథుని. కని=చూచి. వారక=నిలుపక. గుండియ=హృదయము. ఁ్రీలన్=చీలఁగ. అంతన్=అమీఁద. ఏను=నేను. అచ్చటన్=ఆస్థలమందు. తెచ్చుకోలుధృతిన్=తెచ్చుకొన్నధైర్యము చేత. అయ్యతితోన్=ఆమునితోడ. శపనోక్తిజాలకంబు.—శపనోక్తి=తిట్టులయొక్క; జాలకంబు=సమూహము. ఎచ్చఁగన్=అతిశయింపఁగ. పెద్దప్రొద్దు=దీర్ఘకాలము. సభ=సభయందుండినజనులు. పరస్పరోగ్రఘోషోచ్చలితాత్మతన్.—పరస్పర=మాయన్యోన్యులయొక్క; ఉగ్ర=తీక్ష్ణమగు; ఘోష=ధ్వనిచేత; ఉచ్చలిత=చలించిన; ఆత్మతన్=మనముగలవారలగుటచేత. అహో యని=అహో యనుచు. అబ్బురము=ఆశ్చర్యమును. ఊని=పూని. నిల్వఁగన్ = నిలుచుండఁగ. అప్డు =ఆ సమయమందు. కలహించితిని=జగడమాడితిని

క. ఆయతిపతి యాయెడ మ, న్మాయాగతి నెల్లఁ దెలిసి • న న్గాంచి మనో
భూయఃపరికందళితమ, హీయఃప్రతిఘారసాప్తి • నిట్లని పలికెన్. 131

టీ. ఆయతిపతి=ఆమునిరాజు. ఆయెడన్=ఆసమయమందు. మన్మాయాగతిన్.—మత్=నాయొక్క; మాయాగతిన్=కపటరీతిని. ఎల్లన్=సర్వమును. తెలిసి. నన్గాంచి=నన్నుఁజూచి. మనోభూయఃపరికందళితమహీయఃప్రతిఘారసాప్తిన్.—మనః=మనమునందు; భూయః=అధికముగా; పరికందళిత = అంకురించినట్టియు; మహీయః=అధికమగు; ప్రతిఘారస=క్రోధరసముయొక్క; ఆప్తిన్=ప్రాప్తిచేత. ఇట్లని. పలికెన్.

ఆమునినాథుండు నాకపటము నంతయు నెఱింగినవాఁడై కోపము నొంది వక్ష్యమాణప్రకారముగఁ బలికెనని భావము.

శా. ఓరీ కిన్నర యిట్లు పాపమతివై • యుద్వృత్తి మౌనీశ్వరా
కారం బూని మదంగనై కరతికాం•క్షాయుక్తిచే మీఱి యౌ
రా రాఁ జెల్లునె యిప్డు నీవు పవిధా•రారూపశాపోక్తి దు
ర్వారేభాహితమూర్తివై పొడమ రా • వైళంబె యియ్యద్రిపై న్. 132

టీ. ఓరీకిన్నర=ఓరికిన్నరుఁడా! ఇట్లు=ఈప్రకారము. పాపమతివై = పాపబుద్ధిగలవాఁడవై. ఉద్వృత్తిన్=దుష్టవృత్తిచేత. మౌనీశ్వరాకారంబు=మునివేషమును. పూని=గ్రహించి. మదంగనైకరతికాంక్షాయుక్తిచేన్.—మదంగనా=నాభార్యయొక్క; ఏక=ముఖ్యమగు; రతి=సురతమునందలి కాంక్షా=కోరికతోడి; యుక్తిచేన్=కూడికచే. మీఱి=అతిక్రమించి. రాఁజెల్లునె=రాఁదగునా? ఔరా=ఆశ్చర్యము. ఇప్డు=ఈసమయమందు. నీవు. పవిధారారూపశాపోక్తిన్.-పవి=వజ్రాయుధముయొక్క; ధారారూప=వాదఱవంటిదగు; శాపోక్తిన్=శాపవచనముచేత. దుర్వారేభాహితమూర్తివి ఐ=దుర్వార=నివారించుటకశక్యమగు; ఇభాహితమూర్తివై=సింహశరీరముగలవాఁడవై. వైళంబ=శీఘ్రముగ. ఇయ్యద్రిపైన్ = ఈపర్వతము మీఁద. పొడమరా=జన్మింపుమా.

చ. అని ముని శాప మిచ్చిన భ♦యంబు మనంబున నిండి యుండ న
య్యనఘునిపాదపద్మముల ♦ నయ్యెడఁ జయ్యన వ్రాలి భక్తిచే
కొని యిటు లంటి నో నియమి♦కుంజర మీఁదు మహాగసుండ నై
నను ననుఁ బ్రోవ రయ్య కరు♦ణాసదనం బగుమానసంబునన్. 133

టీ. ముని=జడదారి. అని=ఈప్రకారముగ; శాపమిచ్చినన్ = శాపమియ్యఁగా. భయంబు=వెఱపు. మనంబునన్=మనస్సునందు. నిండియుండన్=పరిపూర్ణమయియుండఁగా. అయ్యనఘునిపాదపద్మములన్=పాపరహితుండగు నాముని పాదకమలములయందు. అయ్యెడన్=ఆసమయమందు. చయ్యనన్=శీఘ్రముగ. వ్రాలి=ఒరగి. భక్తిన్. చేకొని=స్వీకరించి. ఇటులు=వక్ష్యమాణప్రకారముగ. అంటిన్=వచించితిని. నియమికుంజర=మునిశ్రేష్ఠుఁడా! మీఁదు. మహాగసుండను=నేను గొప్పయపరాధము గలవాఁడను. ఐనను=అటులైనను. ననున్. కరుణాసదనంబు=దయానిలయము. అగుమానసంబునన్=అగునట్టిహృదయముచేత. ప్రోవుఁడు అయ్య=రక్షింపుఁడీ.

మ. వనజంతూత్కరహింసనోగ్రతరదు♦ర్వ్యాపారసంలబ్ధి మే
దినిఁ గన్పట్టుమతంగజారివరమూ♦ర్తిం బూని వర్తింప నో
ర్తునె యయ్యో మునివర్య యిప్డు నవకా♦రుణ్యంబు నాపై ఘటిం
చి ననుం బ్రోవవె పాపవే మదుపల♦క్ష్యీభూతశాపోక్తికన్. 134

టీ. వనజంతూత్కరహింసనోగ్రతరదుర్వ్యాపారసంలబ్ధిన్.—వనజంతు=అడవిమృగములయొక్క; ఉత్కర=సమూహముయొక్క; హింసన=సంహరించుటయందు; ఉగ్రతర=అతితీక్ష్ణమగు; దుర్వ్యాపార=దుష్టవృత్తియొక్క; సంలబ్ధిన్=ప్రాప్తిచేత. మేదినిన్=భూమియందు. కన్పట్టుమతంగజారివరమూర్తిన్.—కన్పట్టు=చూపట్టుచున్న; మతంగజారివర=సింహశ్రేష్ఠముయొక్క; మూర్తిన్=శరీరమును. పూని=గ్రహించి. వర్తింపన్=ఉండుటకు. ఓర్తునె=సహింతునా? అయ్యో=అకటా! మునివర్య=మునిశ్రేష్ఠుఁడా! ఇప్డు=ఈసమయమందు. నవకారుణ్యంబు=నూతనమగుదయను. నాపైన్=నాయందు. ఘటించి=ఉంచి. ననున్. ప్రోవవె. మదుపలక్ష్యీభూతశాపోక్తికన్.—మత్ = నేను; ఉపలక్ష్యీభూత = లక్ష్యముగాఁగలదియయిన; శాపోక్తికన్=శాపవచనమును. పాపవే=తొలఁగింపుమా.

తే. అన దయామయమానసుం ♦ డగుట మౌని
మామకీనోక్తి నిజ మైన ♦ మయుకులేంద్ర
వర్ష పంచకము హరీంద్ర♦భావ మూని
యంత నీరూప మందెద ♦ వనుచు ననిచె. 135

టీ. అనన్=ఈప్రకారము ప్రార్థింపఁగా. దయామయమానసుండు=కృపామయమగు హృదయముగలవాఁడు. అగుటన్=కావుటవలన. మౌని=జడదారి. మామకీనోక్తి = నామాట.

నిజము=సత్యమైనది. ఐనన్=అయినను. మయుకులేంద్ర=కిన్నరశ్రేష్ఠుఁడా! "తురఙ్గవదనో మయుః" అని అమరుఁడు. వర్షపంచకము=ఐదేండ్లు. హరీంద్రభావము=సింహత్వమును. ఊన్ని=పొంది. అంతన్=అమీఁద. నీరూపము=నీయొక్క పూర్వరూపమును. అందెదవు=పొందఁగలవు. అనుచున్=అని పలుకుచు. అని చెన్=పంపెను.

చ. అనిచిన నేను నమ్మునికులాగ్రణికిం బ్రణమిల్లి మన్మనో
మనసిజశాంబరీకులచమత్కృతి యెంతకుఁ దెచ్చెనంచుఁ బా
యని పెనుచింతతోఁ గలఁగ నాంతర మే నటు వాసి యీవినూ
తనమణిమండపోత్తమము దారునఁ జేరి వసించి యున్నెడన్. 136

టీ. అనిచినన్=పంపఁగ, నేను. అమ్మునికులాగ్రణికిన్=ఆమునిశ్రేష్ఠునికి. ప్రణమిల్లి=నమస్కరించి. మన్మనోమనసిజశాంబరీకుల చమత్కృతి.—మత్=నాయొక్క; మనః=మనస్సునందలి; మనసిజ=మన్మథునియొక్క; శాంబరీకుల=మాయాబృందముయొక్క; చమత్కృతి=చమత్కారము. ఎంతకున్ తెచ్చెన్=ఎంతపనిఁజేసెననుట. అంచున్=ఈప్రకారమనుచు. పాయని పెనుచింతతోన్=విడువని గొప్పచింతతో. అంతరము=అంతరంగము. కలఁగన్=కలఁతపడఁగ. ఏను=నేను. అటువాసి=ఆస్థలమును విడిచి. ఈ వినూతనమణిమండపము=ఈక్రొత్తరవలచవికను. దారునన్=శీఘ్రముగ. చేరి=సమీపించి. వసించియున్నెడన్=కూర్చుండియున్న సమయమందు.

సీ. కురువిందరుచి నాజిఁ గుదియించురదరాజి
వక్రతాశాతతా వలిత మయ్యె
నెలవుల్లుకవడంబు గలఁచునేత్రయుగంబు
వృత్తతాహారితతా యత్త మయ్యె
నంబుదావళినీలి నడఁచుశిరోజాలి
ఖర్వతాశోణతా కలిత మయ్యె
నలరుతామరగోము నలయించునెమ్మోము
వివృతతావిపులతా భివృత మయ్యె

తే. నహహా యని పశ్యదఖిలవా హాస్యవితతి
విస్మయం బూన బుధవర్ణ్య విమలరూప
గౌరవంబున మించుమ ద్గాత్ర మపుడు
భీమకంఠీరవాకృతి స్థేమ గనియె. 137

టీ. కురవిందరుచిన్=పద్మరాగమణికాంతిని. ఆజిన్=యుద్ధమందు. కుదియించురదరాజి=క్రుంగఁజేయుచున్న దంతపంక్తి, పద్మరాగములను దిరస్కరించు దంతపంక్తి యని

భావము. వక్రతాశాతతావళితము.—వక్రతా=కుటిలత్వము చేతను; శాతతా = తీక్ష్ణత్వము చేతను; వళితము=చుట్టఁబడినది. అయ్యెన్=ఆయెను. నెలపుల్గుకవడంబు.—నెలపుల్గుకవ=చకోరమిథునముయొక్క; డంబు=గర్వమును. కలఁచు నేత్రయుగంబు=కలఁతపఱచు కనుదోయి. వృత్తతాహారితతాయత్తము.—వృత్తతా=వర్తులత్వమునకు; హారితతా=హారితత్వమునకు, పీతత్వమునకనుట; ఆయత్తము=స్వాధీనము. అయ్యెన్=ఆయెను. అంబుదావళి నీలిన్.—అంబుదావళి=మేఘపంక్తియొక్క; నీలిన్=నల్లఁదనమును; అడఁచు శిరోజాలి=అడఁగఁద్రొక్కు కురులగుంపు. ఖర్వతాశోణతాకలితము.—ఖర్వతా=కుఱుచఁదనము చేతను; శోణతా = రక్తత్వము చేతను; ఆకలితము=పొందఁబడినది. అయ్యెన్=ఆయెను. అలరుతామరగోమున్.—అలరు=ప్రకాశించుచున్న; తామర=కమలముయొక్క; గోమున్=సౌకుమార్యమును, అందముననుట. అలయించునెమ్మోము=శ్రమపఱచుచున్న చక్కనిముఖము, అనఁగ తిరస్కరించుచున్న ముఖమనుట. వివృతతావిపులతాభివృతము.—వివృతతా=తెఱచుకొనియుండుట చేతను; విపులతా=వైశాల్యము చేతను; అభివృతము=ఆవరింపఁబడినది. అయ్యెన్=ఆయెను. అహహా యని = ఆశ్చర్యమాశ్చర్యమని. పశ్యదఖిలహాహాస్యవితతి.—పశ్యత్ =చూచుచున్నట్టియు; అఖిల=సమస్తమైన; హాహాస్యవితతి=కిన్నరబృందము. విస్మయంబు=అద్భుతమును. ఊనన్=పొందఁగ. బుధవర్ణ్యవిమలరూపగౌరవంబునన్.—బుధ=దేవతల చేత; వర్ణ్య=పొగడఁదగిన; విమల=స్వచ్ఛమగు; రూప=సౌందర్యముయొక్క; గౌరవంబునన్=అతిశయము చేత. మించుమద్గాత్రము= అతిశయించు నాశరీరము. అపుడు=ఆసమయమందు. భీమకంఠీరవాకృతిస్థేమన్.—భీమ=భయంకరమగు; కంఠీరవ= సింహముయొక్క; ఆకృతి = ఆకారముయొక్క; స్థేమన్= స్థైర్యమును. కనియెన్ = పొందెను.

అనఁగ పద్మరాగములవంటి నా దంతములు కుటిలములై పదనుగలవైనవి. చకోరములవంటి నా కనుదోయి గుండ్రమై హారితవర్ణమయ్యెను. మేఘమువంటి నా కురులు కుఱుచనివై యెఱ్ఱనివైనవి. కమలములవంటి నా మోము తెఱవఁబడినదై విశాలమయ్యెను. ఇట్లు నాశరీరము కిన్నరబృందము చూచుచుండఁగ భయంకరమగు సింహాకృతిని బొందెనని భావము.

వ. ఇట్టు లతులనాగవిదళనవ్యాపార నవీనశతమఖకరవాలాయమాన ఖరనఖరంబులును నక్షీణమృగక్షతజకటాజ్యధారా సముజ్జ్వల జఠరజ్వలన సమున్నత జ్వాలాయమాన రసనాకిసలయంబును నమందతుంద కారామందిర బందీకృతస్వభృతసారంగకులీన సారంగవిమోచనలాలసావిలసనోత్తమాంగ రాజసదనవదనద్వారాశ్రిత చంద్రరేఖాయమానవక్రదంష్ట్రాయుగంబును నాత్మీయహరితానుబోధక భాస్వద్విరోచన మండలాయమాన నిస్తులలోచనద్వయంబును నలయప్రభావైరీకృతాకిలజంతునికృంతనతంతన్యమాన చాతుర్యపృష్ఠీకృతకీనాశపాశాయమానదీర్ఘవాలంబును నతిఘనఘనాఘనస్థైర్యసమున్మూలనశీలనిబిరీసనిశ్వాసమారుతప్రచార కారణమహాబిలాయమాన

నాసారంధ్రంబును గలసింహాకారంబు నివ్వటిల్ల నుల్లంబు జల్లుమన మదాప్తజనంబులు చెంతల నిలువ లేక యెల్లెడలకుం జన సకలజగద్ద్వారపారావారగళనపానసమర్థాత్యుగ్రక్షుధోదన్యాపరిక్షుభితమానసంబు పక్షీకరించి యనేకకాంతారజంతుసంతానంబుల మెక్కుచుఁ దదీయాసృక్స్రావంబుఁ గ్రోలి సొక్కుచు దుష్టవర్తనంబున నింతకాలం బిచ్చటఁ దిరిగి తిరిగి భవత్కరహేతిధారామాహాత్మ్యంబునఁ బూర్వరూపంబు గంటి నీవలన మంటి నిన్నే మని సన్నుతింతు నని యత్తురంగవదనుండు వెండియుఁ బ్రణామంబులు గావించి యవ్విభుండు నయభాషణంబుల నుపలాలింప నానందించె నప్పుడు. 138

టీ. ఇట్టులు=ఈప్రకారము. అతులనాగవిదళనవ్యాపారనవీనశతమఖకరవాలాయమానఖరనఖరంబులునుక్.—అతుల=నిస్సమానమగు; నాగ=గజములు అను; అతులన=సాటిలేని; అగ=కొండలయొక్క; విదళనవ్యాపార=బ్రద్దలుచేయు నుద్యోగమునందు; నవీన=నూతనమగు; శతమఖ=ఇంద్రునియొక్క; కరవాలాయమాన=వజ్రాయుధమువలె నాచరించుచున్న; ఖర=తీక్ష్ణములగు; నఖరంబులునుక్=గోళ్ళును. అక్షీణమృగక్షతజకటాజ్యధారాసముజ్జ్వలజ్జఠరజ్వలనసమున్నతజ్వాలాయమానరసనాకిసలయంబునుక్.—అక్షీణ=ఎడతెగని; మృగక్షతజ=మెకముల నెత్తురను; కట=అధికమగు; ఆజ్యధారా=ఘృతధారచేత; సముజ్జ్వలత్=మండుచున్న; జఠరజ్వలన=జఠరాగ్నియొక్క; సమున్నత=నిషుదయగు; జ్వాలాయమాన=మంటవలె నాచరించు; రసనాకిసలయంబునుక్ = లేయాకువలెనున్న నాలుకయును. అమందతుందకారామందిరబందీకృతస్వభృతసారంగకులీనసారంగవిమోచనలాలసావిలసనోత్తమాంగరాజసదనవదనద్వారాశ్రితచంద్రరేఖాయమానవక్రదంష్ట్రాయుగంబునుక్.—అమంద=అధికమగు; తుంద=కడుపనెడు; కారామందిర=కారాగృహమునందు; బందీకృత=చెరవేయఁబడిన; స్వభృత=తనచేపోషింపఁబడిన; సారంగ=మృగముయొక్క; కులీన=కులమందుఁబుట్టిన; సారంగ=కురంగములయొక్క; విమోచన=విడిపించుటయందు; లాలసా=ఆసక్తియొక్క; విలసన=విలాసముచేత; ఉత్తమాంగ=శిరమనెడు; రాజసదన=రాజగృహముయొక్క; వదన=ముఖమనెడు; ద్వార=వాకిటిని; ఆశ్రిత=ఆశ్రయించిన; చంద్రరేఖాయమాన=చంద్రరేఖవలె నాచరించుచున్నట్టియు; వక్ర=కుటిలమగు; దంష్ట్రాయుగంబును=కోఱజంటయును. ఆత్మీయహరితానుబోధకభాస్వద్విరోచనమండలాయమాననిస్తులలోచనద్వయంబునుక్.—ఆత్మీయ=తనసంబంధియగు; హరితా=సింహత్వమునకు; అనుబోధక=సూచకమగు; భాస్వత్=ప్రకాశించుచున్న; విరోచన=అగ్నియొక్క; మండలాయమాన=కుప్పవలెనున్న; నిస్తుల=సాటిలేని; లోచనద్వయంబునుక్=కనుఁగవయును, ఇచట, హరితా=విష్ణుత్వమువకు, సూచకమగు, ప్రకాశించుచున్న, విరోచనమండలాయమాన=సూర్యచంద్రమండలములవలె నాచరించు కనుఁగవ యని యర్థాంతరము దోఁచుచున్నది. "వహ్న్యర్కశశ్యంకవిరోచనాః" యనిరత్నమాల. అలయప్రభావోరరీకృతాఖిలజంతునికర

తనతంతన్యమానచాతుర్యపృష్ఠీకృతకీనాశపాశాయమానదీర్ఘవాలంబునన్.-అలయ=నాశము
లేని; ప్రభావ=మహిమచేత; ఉరరీకృత=అంగీకరింపఁబడిన; "ఊరీకృతమురరీకృతమఙ్గీకృత"
మ్మనియమరుఁడు;అఖిల=సమస్తమైన; జంతు=ప్రాణులయొక్క; నికృంతన=ఛేదనమందు;తం
తన్యమాన=మిక్కిలివృద్ధిఁబొందుచున్న;చాతుర్య=నేర్పుచేత;పృష్ఠీకృత=పృష్ఠభాగమందుం
పఁబడిన;కీనాశ=యమునియొక్క; పాశాయమాన=పాశాయుధమువలెనాచరించుచున్న; దీర్ఘ
వాలంబునన్=పొడవైనతోఁకయును. అతిఘనఘనాఘనస్థైర్యసమున్మూలనశీలనిబిరీసనిశ్వా
సమారుతప్రచారకారణమహాబిలాయమాననాసారంధ్రంబునన్.—అతిఘన=మిక్కిలి యధిక
మైన; ఘనాఘన=మత్తగజముఅను వర్షాకాలమేఘముయొక్క; స్థైర్య=దార్ఢ్యముయొక్క: స
మున్మూలన=ఉత్పాటనము;శీల=స్వభావముగాఁగల;నిబిరీస=దట్టమగు;నిశ్వాసమారుత=నిట్టూర్పు
వాయువుయొక్క;ప్రచార=సంచారమునకు;కారణ=హేతుభూతమగు; మహాబిలాయమాన=ఆ
కాశమువలెనాచరించుచున్న;"మేఘద్వారంమహాబిల" మ్మని యమరుఁడు; నాసారంధ్రంబు
నన్=నాసికారంధ్రమును. కలసింహాకారంబు = కలిగినసింహాకృతి. నివ్వటిల్లన్=ఒప్పు
చుండఁగ. ఉల్లంబు = మనము. జల్లుమనన్=తల్లడిల్లఁగాననుట. మదాప్తజనంబులు=నామి
త్రులు. చెంతలన్ = సమీపములందు; నిలువలేక = నిలుచుండలేక; ఎల్లెడలకున్=అంతట;
చనన్ = పోఁగా. సకలజగద్వారపారావారగిళనపానసమర్థాక్షుద్రక్షుధోదన్యాపరిక్షుభితమాన
సంబు.—సకల=సమస్తమగు; జగద్వార=లోకసమూహముయొక్క;పారావార=సముద్రముల
యొక్క; గిళన=తినుటయందు; పాన = త్రాగుటయందు; సమర్థ = శక్తిగల; అక్షుద్రక్షుధో
దన్యా=అధికమగునాఁకలినీరువట్టులచేత; పరిక్షుభిత= క్షోభపడిన ; మానసంబు= హృదయ
మును; పక్షీకరించి=అంగీకరించి. అనేకకాంతారజంతుసంతానంబులన్=అనంతములగునడవి
మెకంబులగుంపులను. మెక్కుచున్=భుజించుచు. తదీయాసృక్పూరంబున్.—తదీయ=మృగ
సంబంధియగు; అసృక్పూరంబున్=రక్తప్రవాహమును. క్రోలి=పానముఁజేసి. చొక్కుచున్=
పరవశతనొందుచు. దుష్టవర్తనంబునన్ = చెడువృత్తిచేత. ఇంతకాలంబు. ఇచ్చటన్=
ఈపర్వతమందు. తిరిగితిరిగి = క్రుమ్మరిక్రుమ్మరి. భవత్కరహేతిధారామాహాత్మ్యంబునన్.—
భవత్=మీయొక్క; కరహేతి=హస్తమందున్నఖడ్గముయొక్క; ధారా=వాదరయొక్క; మా
హాత్మ్యంబునన్=మహిమచేత. పూర్వరూపంబు = పూర్వమందున్నకిన్నరరూపంబును. కం
టిన్=పొందితిని. నీవలనన్.మంటిన్ = జీవించితి. నిన్నున్=నిను. ఏమనిసన్నుతింతున్=
ఏమనికొనియాడుదును? అని=ఈప్రకారముగఁబలికి. అత్తురంగవదనుండు=ఆకిన్నరుఁడు. వెం
డియున్=మఱియు. ప్రణామంబులు=వందనంబులను. కావించి=చేసి. అవ్విభుండు=ఆసుచం
ద్రుఁడు. నయభాషణంబులన్=అనునయోక్తులచేత. ఉపలాలింపన్ = ఊఱడింపఁగ. ఆనం
దించెన్=సంతసించెను. అప్పుడు=ఆసమయమందు.

అనఁగ, వజ్రాయుధతుల్యములగుతీక్ష్ణనఖములును అధిక మగుమెకంబులరక్త మను
ఘృతధారచేతఁ బైకెగయుపజఠరాగ్నిమంటవలె నున్న నాలుకయు, అధిక మగుకడుపనెడు
కారాగృహమందు బంధింపఁబడిన స్వపోషితమృగసంబంధిమృగంబులను విడిపించుటకై
యుక్కుఁబూని శిరమనురాజస్థానమునకు ద్వారమయినముఖమునంగాచియున్న చంద్రరేఖ

వలెనుండుకోఁజాలుచు, నిప్పులనుప్పలవలె నున్నకనుఁగవయు, సర్వప్రాణుల సంహరించు కాలదండమువలె నున్నవాలదండమును, కాలమేఘంబులఁ దూలించుగాఢమారుతమునకుఁ దానఁ బగునాకసమువలె మత్తగజంబులఁ బొలిందోలు నిట్టూర్పులకుఁ జోటైయున్న నాసా రంధ్రములునుగల్గి సింహాకృతిఁ బూని నిలువఁ, జెంగటనున్న సంగడికాండ్రు విడిచి పరువి డుటయు, నంతనాకు మున్నీటినీళ్లెల్లం గ్రోలునంతటి నీరువట్టును నెల్లజగంబులఁ దినునంత టియాఁకలియును బొడమ, నీయడవిలో నుండు మెకంబులనెల్ల మెక్కుచు నింతకాలం బిచ్చ ట విచ్చలవిడిఁ గ్రుమ్మరుచుండి నీఖడ్గమహిమంబున నాతొంటిరూపంబు గంటి నని సుచంద్రు నితోఁ గుముదుండు విన్నవించె నని భావము.

తే. వరకళాసాంద్రుఁ డైనయా♦వసుమతీశ
చంద్రు నలగోనికాయప్ర♦చారమహిమ
కుముదుఁ డతిమంజులామోద♦సమితి నలరె
పుష్కరచరాళి వైచిత్రిఁ ♦ బొందుచుండ. 139

టీ. వరకళాసాంద్రుఁడు.—వర = శ్రేష్ఠమగు; కలా = విద్యలచేత, కాంతులచేత; సాంద్రుఁడు = నిండినవాఁడు. ఐన = ఐనట్టి; ఆవసుమతీశచంద్రు నలగో నికాయప్రచా రమహిమన్.— ఆవసుమతీశ చంద్రు = భూపతిశ్రేష్ఠుఁడగు నాసుచంద్రునియొక్క; అలగోనికాయప్రచారమహిమన్ = ఆవాక్యసమూహముయొక్క ప్రసక్తి సామర్థ్యము చేత; ఆవసుమతీశ = రాజను పేరుగల, చంద్రు = నిశాపతియొక్క; అలగోనికాయ = ఆకిరణపుంజముయొక్క, ప్రచారమహిమచేతనని యర్థాంతరము దోఁచుచున్నది. కుము దుఁడు = కుముదుఁడను పేరుగల కిన్నరుఁడు, కలువ. అతిమంజులామోద సమితిన్.— అతి=అధికమగు; మంజుల =మనోజ్ఞమగు; ఆమోద = సంతసముయొక్క; పరిమళ ముయొక్క; సమితిన్=సమూహముచే. పుష్కరచరాళి=దేవబృందము; పుష్కర = కమల ములను; చర=పొందిన; అళి=భృంగము. వైచిత్రిన్=విచిత్రతను. పొందుచుండన్.అలరెన్= సంతసించెను.

అనఁగ విద్యలచే పరిపూర్ణుం డగుసుచంద్రునియొక్క వచనకదంబముచేఁ గుముదుం డనుకిన్నరుఁడు దేవతలు చూచి వైచిత్రిని పొందుచుండఁగ సంతసించె నని భావము. కాంతు లచే పరిపూర్ణుం డగుచంద్రునియొక్క కిరణపుంజముచేత కలువ మనోజ్ఞ మగు పరిమళము తో భృంగములు సంతోషించునట్లు వికసించి ప్రకాశించెనని యర్థాంతరమునకుభావము

మ. కలితారాతివిరామ రామరుచిసం♦గప్రస్ఫురద్భామ భా
మలవక్త్రాహతసోమ సోమసుతశుం♦భద్భూరిసంగ్రామ గ్రా
మలసద్వేణుసకామ కామకలిసం♦పల్లాలసశ్యామ శ్యా
మలరోచిశ్చయవామ వామనతనూ♦మాన్యత్రిలోకీక్రమా. 140

టీ. కలితారాతివిరామ.—కలిత=చేయఁబడిన; అరాతి=శత్రువులయొక్క; విరామ=నాశముగలవాఁడా! రామరుచిసంగప్రస్ఫురద్భామ.—రామ=మనోహరమగు; రుచి = కాంతియొక్క; సంగ=సంబంధముచేత; ప్రస్ఫురత్=ప్రకాశించుచున్న; భామ=సూర్యుఁడుగలవాఁడా! "భామః క్రోధే రవౌ దీప్తౌ" అని విశ్వము. సూర్యబింబమందుండు నారాయణమూర్తి తనకాంతిపుంజములచే నాసూర్యునిఁ బ్రకాశింపఁ జేయువాఁడని భావము. భామలవక్త్రాహతసోమ.—భా=కాంతిచేత; అమల=స్వచ్ఛమగు; వక్త్ర=ముఖముచేత; హత=కొట్టఁబడిన; సోమ=చంద్రుఁడుగలవాఁడా! మనోజ్ఞముఖకాంతిచే తిరస్కరింపఁబడిన చంద్రుఁడుగలవాఁడని భావము. సోమనుతశుంభద్భూరిసంగ్రామ.—సోమ=శంకరునిచేత; నుత = ప్రశంసింపఁబడినట్టియు; శుంభత్=ప్రకాశించుచున్నట్టి; భూరిసంగ్రామ=అధికమైనయుద్ధముగలవాఁడా; గ్రామలసద్వేణుసకామ.—గ్రామ=స్వరసందోహముచేత; లసత్=ప్రకాశించుచున్న; వేణు=మురళియందు; సకామ=కోరికతోఁగూడినవాఁడా! కామకలిసంపల్లాలసశ్యామ.—కామకలి=మన్మథయుద్ధముయొక్క; సంపత్=సంపదయందు; లాలస=ఆసక్తిగల; శ్యామ=కాంతలుగలవాఁడా! శ్యామలరోచిశ్చయవామ.—శ్యామలరోచిః=నల్లనికాంతులయొక్క; చయ = సమూహముచేత; వామ=మనోహరుఁడైనవాఁడా! వామనతనూమాన్యత్రిలోకీక్రమా.—వామనతనూ=త్రివిక్రమాకృతిచేత; మాన్య = పూజ్యమైన; త్రిలోకీక్రమా = ముల్లోకములయందుఁ బాదన్యాసముగలవాఁడా!

క. సత్యాహితాంతరంగా, సత్యాశయపుండరీక•చంచద్భృంగా
సత్యాత్మకగుణసంగా, సత్యాలయయోగియోగ•సంతతరంగా. 141

టీ. సత్యాహితాంతరంగా.—సత్యా = సత్యభామయందు; "నామైకదేశే నామగ్రహణ" మను న్యాయమువలన సత్యభామానామైకదేశమగు సత్యాశబ్దమునకు సత్యభామ యనియర్థమనియెఱుంగునది; ఆహిత=ఉంపఁబడిన; అంతరంగా=మనస్సుగలవాఁడా! సత్యభామయందు ఆసక్తిగలవాఁడనిభావము. సత్యాశయపుండరీకచంచద్భృంగా.—సతీ = పార్వతీదేవియొక్క; ఆశయపుండరీక=హృత్కమలమందు; చంచత్=చలించుచున్న; భృంగా=భృంగరూపమైనవాఁడా! పార్వతి తనహృత్పుండరీకమునందు నెల్లపుడు నారాయణమూర్తిని ధ్యానించుచున్నదని భావము. సత్యాత్మకగుణసంగా.—సత్యాత్మక = సత్యరూపమగు; గుణ=శౌర్యాదిగుణములయొక్క; సంగా=సంబంధముగలవాఁడా! సత్యాలయయోగియోగసంతతరంగా.—సత్య=సత్యలోకమే; ఆలయ=నివాసముగాఁగల; యోగి=మునులయొక్క; యోగ=ధ్యానమే; సంతత=ఎల్లపుడును; రంగ = నాట్యస్థానముగాఁగలవాఁడా! సత్యలోకమందు వసించి తపం బొనరించు మునుల ధ్యానమునందు నెడఁబాయకుండువాఁడని భావము.

ఉత్సాహవృత్తము. కరివరాంగబహులభంగ•కరణసంగతగ్రహో
చరరథాంగహారిశాతాంగ•జనక రంగదద్రిజాం
తరసుమంగళాబ్జభృంగ • తతపతంగమందిరా
పరభుజంగరిపుతురంగ • ప్రబలరంగభూషణా. 142

గద్యము. ఇది శ్రీమదనగోపాల ప్రసాద సమాసాదితో భయభాషాకవిత్వ కలాకళత్ర రేచర్ల గోత్రపవిత్ర సురభిమల్ల క్ష్మాపాల సత్పుత్త్రి కవి జనవిధేయ మాధవరాయ ప్రణీతంబైన చంద్రికాపరిణయ మనుమహాప్రబంధంబునందు

## ద్వితీయాశ్వాసము.

టీ. కరివరాంగబహుళభంగకరణసంగతగ్రహోచరరథాంగ.—కరివర = గజేంద్రుని యొక్క; బహుళ=అనేకప్రకారములుగ; భంగకరణ = నాశము సేయుటయందు; సంగత= ఆసక్తమైన; గ్రహ=మొసలియొక్క; ఆచర=సంహారకమగు; రథాంగ=చక్రాయుధముగల వాఁడా! గజేంద్రునిం బట్టుకొన్న మొసలిని సంహరించిన చక్రాయుధముగలవాఁడని భావము. హారిశతాంగజనక.—హారి=మారుతము; "యమానిలేన్ద్రచన్ద్రార్క విష్ణుసింహాంశువాజిషు। శుకాహికపిభేకేషుహరిః" అని యమరుఁడు;శతాంగ=రథము గాఁగలమన్మథునకు; జనక= తండ్రియైనవాఁడా! రంగదద్రిజాంతర సుమంగళాబ్జభృంగ.— రంగత్ = చలించుచున్న; అద్రిజా=పార్వతీదేవియొక్క; అంతర=హృదయమను; సుమంగళ=మంగళప్రదమగు; అబ్జ= కమలమునకు; భృంగ=భృంగరూపుఁడయినవాఁడా! పార్వతీదేవి యెల్లప్పుడును హృదయకమలమందు నారాయణమూర్తిని నిలుపుకొని ధ్యానించుచున్నదిగాన తద్ధృదయకమలమునకు భృంగప్రాయుఁడై యున్నవాఁడని భావము. తతపతంగమందిరా.—తత=విశాలమగు;పతంగ=సూర్యుఁడే "పతంగౌపక్షిసూర్యౌచ" అని అమరుఁడు;మందిరా=గృహముగాఁగలవాఁడా! సూర్యమండలమందు సర్వదా నివసించువాఁడని తాత్పర్యము. ఇందుకు "ధ్యేయస్సదా సవితృమణ్డలమధ్యవర్తీ నారాయణః" అనువచనము ప్రమాణము. పరభుజంగ రిపుతురంగ.— పర=ఉత్కృష్టుఁడగు; భుజంగరిపు=గరుడుఁడే; తురంగ=గుఱ్ఱముగాఁగలవాఁడా! ప్రబలరంగభూషణా.—ప్రబల=ఉత్కృష్టమగు; రంగ=శ్రీరంగవిమానమునకు; భూషణా=భూషణప్రాయుఁడైనవాఁడా!

ఈవృ "మిూఱ సూర్యగణముల్ రేఫు గాంతమైన ను। తొస్రిహావృత్తమనఁగఁగృతులఁ బాఁగుచుండు" నని యుత్సాహావృత్తలక్షణము అప్పకవీయమునఁ జెప్పఁబడినది.

గద్యము. ఇది శ్రీసరతీరమణకరుణాసమాసాదితసర్వసౌభాగ్య భాగ్యనగర మహారాజ్యసంకలిత శ్రీజటప్రోలుసంస్థానప్రాజ్యసకలసామ్రాజ్య శ్రీరేచర్ల గోత్ర పవిత్ర కవిజనగేయ శ్రీవేంకట జగన్నాథరాయ సత్పుత్త్రి సత్సంప్రదాయ శ్రీసురభివేంకట లక్ష్మణరాయ పరిపోష్య సరసవైదుష్య విద్యాస్థానతలమండిత శేష సదాశివపండిత విరచిత శరదాగమ సమాఖ్యవ్యాఖ్యయందు ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

శ్రీరస్తు.

శ్రీ గురుభ్యో నమః.

శ్రీలక్ష్మీనరసింహాయనమః.

# చంద్రికాపరిణయము - సవ్యాఖ్యానము

## తృతీయాశ్వాసము.



క. విలసత్కమలాపదయుగ, లలితానుపమానదివ్య♦లాక్షాలక్ష్మో
జ్జ్వలతరకౌస్తుభమణిపి, చ్ఛిలరుచివక్షోవిశాల ♦ శ్రీగోపాలా. 1

టీ. విలసత్కమలా పదయుగ లలితానుపమాన దివ్య లాక్షా లక్ష్మోజ్జ్వలతర కౌస్తుభ మణి పిచ్ఛిల రుచి వక్షో విశాల.—విలసత్=ప్రకాశించుచున్న, కమలాపదయుగ=లక్ష్మీపాదయుగళముయొక్క, లలిత=మనోజ్ఞము, అనుపమాన=సాటిలేనిదియునగు, దివ్యలాక్షా=లోకోత్తరమగు లత్తుకయొక్క, లక్ష్మ=చిహ్నముచేత, ఉజ్జ్వలతర = మిక్కిలిప్రకాశమానమగు, కౌస్తుభ=మణివిశేషముచేత, పిచ్ఛిల=దట్టమైన, రుచి=కాంతిగల, వక్షః=ఎదచేత, విశాల=గొప్పవాఁడవగు, అనఁగా, విశాలవక్షస్స్థలముగల; శ్రీగోపాలా = శ్రీమదనగోపాలస్వామీ ! అని కృతిపతిసంబోధనము. దీనికిఁ జిత్తగింపు మనుత్తరపద్యమందలి క్రియతో నన్వయంబు.

గీ. చిత్తగింపుము శౌనకా♦ద్యుత్తమర్షి
సమితికి ట్లను రోమహ♦ర్షణతనూజుఁ
డప్పు డామోద మూని య♦క్షాధిపతి మ
హీంద్రుఁ దిలకించి వెండియు ♦ నిట్లు లనియె. 2

టీ. చిత్తగింపుము. రోమహర్షణతనూజుఁడు=సూతుఁడు; శౌనకాద్యుత్తమర్షి సమితికిన్=శౌనకుండు లోనగు శ్రేష్ఠమునిసంఘమునకు; ఇట్లు=వక్ష్యమాణప్రకారముగ; అనున్=వచించును. అప్పుడు= ఆసమయమందు; యక్షాధిపతి=యక్షశ్రేష్ఠుండగు కుముదుఁడు; ఆమోదము=సంతసమును; "ప్రమోదామోదసమ్మదాః" అనియమరుఁడు; ఊని=వహించి; మహీంద్రున్=సూచంద్రుని; తిలకించి=వీక్షించి; వెండియున్=మఱియు; ఇట్టులు=వక్ష్యమాణప్రకారముగ; అనియెన్=పలికెను.

చ. ఇరఁ గలపద్మినీతతుల♦యింపును సొంపు నడంచు మంపునం
గరముఁ బొసంగుచంద్రికయ♦ఖండవిలాసము నన్నుతింపఁగాఁ

తరమె తదీయదీధితివి•తానము గన్గొనుమాత్రఁ బెంపు దు
ష్కరగతి మించుభూర్యసమ•కాండగవోదితతాపమండలిన్. 3

టీ. ఇటఁ బ్రస్తుతచంద్రికాఖ్యనాయికాపరమైనయర్థమును జ్యోత్స్నాపరమైనయర్థమును గలుగుచున్నది.—ఇరన్ = భూమియందు, జలమందని వెన్నెలపరమైనయర్థము; "ఇరాభూవాక్సురాప్సుస్యాత్" అని యమరుఁడు; కలపద్మినీతతులయింపును=కలిగినట్టి పద్మినీజాతిస్త్రీలయొక్క యానందమును, తామరతీవలయొక్క యానందము ననిజ్యోత్స్నాపరమైన యర్థము; సొంపును=సౌందర్యమును; అడంచుమంపునన్=అడఁగించుమదముచే; కరమున్= మిక్కిలి; పొసంగుచంద్రిక యఖండవిలాసము=ఒప్పుచున్న చంద్రికయొక్క యవిచ్ఛిన్నమైన విలాసము, వెన్నెలయొక్క యఖండవిలాసమని యర్థాంతరము; సన్నుతింపఁ గాన్=కొనియాడఁగా; తరమె=శక్యమా? తదీయదీధితివితానము=ఆచంద్రికయొక్కయు వెన్నెలయొక్కయు కాంతిపుంజము; కన్గొనుమాత్రన్=అవలోకించునంతనే; దుష్కరగతిన్=అశక్యమగు రీతిచే; మించుభూర్యసమకాండగవోదిత తాపమండలిన్.—మించు = అతిశయించునట్టి, భూరి=అధికములయిన, అసమకాండ=విషమసాయకుఁడైన మరునియొక్క, సప్తాశ్వుఁడైన సూర్యునియొక్కయని యర్థాంతరము, "కాణ్డోఽస్త్రీ దణ్డబాణార్వ" అని యమరుఁడు, గో= బాణములచేతను, కిరణములచేతనని యర్థాంతరము, "స్వర్గేషు పశువాగ్వజ్రదిఙ్నేత్ర ఘృణి భూజలే, లక్ష్యదృష్ట్యాస్త్రియాం పుంసిగౌః" అని యమరుఁడు. "గో+ఉదిత" అనుచోట గోశబ్దముమీఁది యోకారమునకు అవఙాదేశమువచ్చి "గవోదిత"అనియయ్యె, ఉదిత=ఉదయించిన, తాపమండలిన్=సంతాపాతిశయమును, వేఁడియొక్క యతిశయమునని వెన్నెలపరమైనయర్థము; పెంపున్=పోషించును, నశింపఁజేయునని యర్థాంతరము.

అనఁగాఁ జంద్రికాఖ్యనాయిక భూమియందుఁ గలపద్మినీజాతిస్త్రీలలోను త్తమురాలనియు, ఆమె దేహకాంతి యవలోకించినంతనే స్మరోద్దీపనమగుననియుఁ దాత్పర్యము. వెన్నెల జలమందున్న తామరతీవలయింపుసొంపుల నడంచు ననియు, ఆతపబాధ శమింపఁజేయు ననియు, నర్థాంతరమందుఁ దాత్పర్యము. ప్రకృతాప్రకృతార్థముల కౌపమ్యము గమ్యము.

సీ. నెలఁతచన్గవదారి • నెఱికొప్పు కటిరొప్పు
ఘనచక్రసంగతి • నని నడంచుఁ
గొమ్మకన్నులరాణ • నెమ్మోము మెడకోము
కలితాబ్జమహిమంబుఁ • దలఁగఁ జేయు
సకినులదొడలరీతి • చికురాళి నఖపాళి
సకలభోర్జితజయ•స్ఫూర్తి నలరుఁ
జెలివలగ్నాభ వ•ల్కులతీరు నూఁగారు
హరిమదాపహవృత్తి • నతిశయిల్లు

తే. అహహా త్రైలోక్యవర్ణనీ♦యాజరాంగ
నావతారవిలాసా ప్తి ♦ నడరుకతన
మహిప పాంచాలరాట్సుతా♦మంజులాంగ
కాంతి చిత్రకరస్థేమఁ ♦ గాంచు టరుదె. 4

టీ. వెలఁతచన్గవదారి.—వెలఁతి=చంద్రికయొక్క, చన్గవ = స్తనయుగ్మముయొక్క, దారి=పద్ధతి; నెఱికొప్పు=అందమైనకేశబంధము; కటిరొప్పు=పిఱుందులయందము; అనిక్=జగడమందు; ఘనచక్రవైఖరిక్=ఘనములైన జక్కవలయొక్క రీతిని; మేఘసంఘముయొక్క రీతిని; ఘన=గొప్పవియైన, చక్ర=బండికండ్లయొక్క, వైఖరిక్=రీతిని; అడంచుక్=అడఁగఁజేయును. అనఁగాఁ జంద్రికయొక్కచన్గవ దారిఘనములైనజక్కవలరీతిని, కొప్పు మేఘసంఘరీతిని, పిఱుందులు గొప్పలగు బండికండ్లయొక్కరీతిని, జయించు నని యథాసంఖ్యముగా నన్వయము. కొమ్మకన్నులరాణ=చంద్రికయొక్క నేత్రములయొప్పదము; నెమ్మోము=అందమగుముఖము; మెడగోము=కంఠసౌకుమార్యము; కలితాబ్జమహిమంబుక్.—కలిత = ఒప్పుచున్న, అబ్జ=కమలముయొక్క, చంద్రునియొక్క, శంఖముయొక్క, మహిమంబుక్=మహిమను; తలఁగక్=తొలఁగునట్లుగా; చేయుక్. ఆమెకన్నులు కమలములయొక్కయు, మోము చంద్రునియొక్కయు, మెడశంఖముయొక్కయు, మహిమను దలఁగఁజేయుననుట. సకినుందొడలరీతి=చంద్రికయొక్క నునుపగు తొడలవైఖరి; చికురాళి=కుంతలపంక్తి; నఖపాళి=నఖములయొక్కపంక్తి; సుకలభోర్జితజయస్ఫూర్తిక్.—సు=లెస్సయైన, కలభ=కరబహిర్భాగముయొక్క, తుమ్మెదలయొక్క, "కలభః కరపార్శ్వే స్యా ద్భ్రమరే కరిశాబకే" అని విశ్వము, సుకల=మంచిప్రకాశముగల, భ=నక్షత్రములయొక్క, "నక్షత్రమృక్షం భం తారా" అని యమరుఁడు, ఊర్జిత=అతిశయించిన, జయ=జయముయొక్క, స్ఫూర్తిక్=ప్రకాశముచేత; అలరుక్=ఒప్పును. ఆమెతొడలు కరబహిర్భాగముయొక్కయు, కేశములు తుమ్మెదలయొక్కయు, గోళ్ళునక్షత్రములయొక్కయు, గెలుపుచేత నమరుచున్న వని తాత్పర్యము. చెలివలగ్నాభ = చంద్రిక మధ్యప్రదేశముయొక్క కాంతి; పల్కులతీరు = వచనభంగి; నూఁగారు=రోమావళి; హరిమదాపహవృత్తిక్.—హరి=సింహముయొక్క, చిలుకయొక్క, సర్పముయొక్క, మదాపహవృత్తిక్=గర్వమునడంచువర్తనముచేత; అతిశయిల్లుక్=మించును. ఆమెనడుము సింహమును, పలుకు చిలుకను, నూఁగారు సర్పమును, బోలిన దనుట. అహహా=ఆశ్చర్యము! మహిప=సుచంద్రుఁడా! పాంచాలరాట్సుతామంజులాంగకాంతి=చంద్రికయొక్క మనోజ్ఞమగుదేహకాంతి; త్రైలోక్యవర్ణనీయాజరాంగనావతారవిలాసాప్తిక్.—త్రైలోక్య=లోకత్రయముచేత, వర్ణనీయ=కొనియాడఁదగిన, అజరాంగనావతారవిలాస=దేవాంగనావతారముయొక్క విలాసముయొక్క, అప్తిక్=పొందికచేత; అడరుకతనక్=ఒప్పుటవలన; చిత్రకరస్థేమక్=ఆశ్చర్యమగుస్థితిని; కాంచుట=పొందుట; అరుదె=ఆశ్చర్యమా ?

అనఁగా చంద్రిక మూఁడులోకములచేత వర్ణనీయ మైనవిలాసమును బొందినది గావునను నామెకు ఘనచక్రాదిజయము గల స్తనయుగ్మ కేశపాశ కటిస్థలాదులు మూఁడేసి యవయవ

ములు గలిగియుండుట యాశ్చర్యముగాదని తాత్పర్యము. ఇట మంజులాంగకాంతియనుచోట "శోభైవకాన్తి రాఖ్యాతా మన్మథాప్యాయితోజ్జ్వలా। సా శోభా రూపభోగాద్యైర్యత్స్యాదఙ్గవిభూషణమ్" అని కాంతిలక్షణమును, మెడగోము అనుచోట "యత్స్పర్శాసహతాఙ్గేషు కోమలస్యాపివస్తునః। తత్సౌకుమార్యమ్" అని సౌకుమార్య లక్షణమును దెలియవలయు.

చ. సమరహితాత్మమై యతను♦సాయకశక్తి భరించునాసుదే
హమెఱుఁగుమేనితోఁ గడు ఘ♦నాళి సహాయముఁ గన్నచంచలా
ఘము పగ లొందిన న్విగత♦కాంతిక మౌ ననఁ దద్విహీనతా
క్రమమున మించుచంపకము ♦ గాంచునె సొంపు విరోధ మూనినన్. 5

టీ. సమరహితాత్మమై=యుద్ధమునకు హితమయిన స్వరూపముకలదై, సమరహిత=సమమైనదానిచే రహితమైన, అనఁగా సాటిలేని, ఆత్మమై=స్వరూపముగలదై యని యర్థాంతరము; అతనుసాయకశక్తిన్=అధికములగు బాణములయొక్క శక్తిని, మరునితూపనేడుశక్తిని అని యర్థాంతరము; "రమ్యం హర్మ్యతలం నవాస్సునయనా గుఞ్జద్ద్విరేఫా లతాః ప్రోన్మీలన్నవమల్లికాసురభయో వాతా స్సచన్ద్రాః క్షపాః। యద్యేతాని జయన్తి హన్త పరితశ్శస్త్రాణ్యమోఘాని మే" అని మరునికి వనితయు సాయకముగాఁ జెప్పఁబడినది; భరించునా సుదేహమెఱుఁగుమేనితోన్=ధరించునట్టి యాచంద్రికయొక్క ప్రకాశించునంగముతోడ, దీనికిఁ బగలొందిన నను దానితో నన్వయము; కడున్=మిక్కిలి; ఘనాళిన్.—ఘన=గొప్పవారలయొక్క, మేఘములయొక్క,యని యర్థాంతరము, ఆళిన్=సమూహమును; సహాయముగాన్=తోడునుగా; కన్నచంచలౌఘము=పొందినవిద్యుత్సమూహము; పగలొందినన్=వైరములనొందినచో, దివసము నొందినచో నని యర్థాంతరము; విగతకాంతిక మౌన్ అనన్=కాంతిహీనముగు ననఁగా; తద్విహీనతాక్రమమున మించుచంపకము.—తత్ = ఆఘనాళిచేత, అనఁగా గొప్పదైన తుమ్మెదచేతనని యర్థము, విహీనతాక్రమమునన్=రాహిత్యముయొక్క రీతిచేత, మించుచంపకము=గర్వించు సంపెఁగతీవ; విరోధము ఊనినన్=పగనొందినచో; సొంపున్=అందమును; కాంచునె=వహించునా?

అనఁగా సమరసన్నద్ధమై యనేకబాణసంపత్తితోఁ గూడుకొన్న యా మెదేహముతో ఘనాళిసాహాయ్యము నొందిన మెఱుపే పగలొందినచో గెలువ నపుడు అట్టి ఘనాళి సాహాయ్యము లేనిచంపకము విరోధ మూనినయెడ గెలువఁజాలదని చెప్పవలసినదిలేదనుట. ఆమె దేహము సాటి లేని దనియు మదనమహోద్దీపకమనియు మెఱుపుఁదీవయు సంపెఁగపువ్వును సాటి యనుటసంభావింపఁదగదనియు భావము. ఇందుఁ జంద్రికయొక్క దేహయష్టివర్ణింపఁబడెను. ఇట్లు చెప్పుటవలన లోకోత్తరలావణ్యాతిశయము చంద్రికాదేహమందుఁ జెప్పఁబడినది. "ముక్తాఫలేషు చ్ఛాయాయా స్తరళత్వ మివాన్తరా। ప్రతిభాతి యదఙ్గేషు లావణ్యం తదిహోచ్యతే" అని లావణ్యలక్షణము దెలియవలయు.

మ. జగతీనాయక కన్యపాదనఖముల్ ♦ సజ్జాలకత్రాణమా
న్యగతిం జేకొని లోకవర్ణ్యవిధుకాం♦తాకారసంపత్తి మిం
చఁగ ముత్యంబులు శుక్తికాతటిఁ దపః♦శ్చర్య న్విజృంభించి హె
చ్చుగుతాద్రూప్యముఁ బొందెఁ గానియెడ ము♦క్తాభిఖ్య యె ట్లబ్బెడిన్. 6

టీ. జగతీనాయక=సుచంద్రుఁడా! కన్యపాదనఖముల్ = చంద్రికాపాదనఖములు; సజ్జాలకత్రాణమాన్యగతిన్.—సజ్జాలక=సత్పురుషులసమూహముయొక్క, శ్రేష్ఠములైన మొగ్గల యొక్క యని యర్థాంతరము, త్రాణ=రక్షణము చేత, మాన్య=పూజ్యమగు, గతిన్ =స్థితిని; చేకొని =గ్రహించి; లోకవర్ణ్యవిధుకాంతాకారసంపత్తిన్.—లోకవర్ణ్య=లోకముచేఁ గొనియాడఁ దగిన, విధు=విష్ణుమూర్తియొక్క, కాంత=మనోహరమయిన, ఆకార=ఆకృతియొక్క, సంపత్తిన్=సంపదచేత; విధుకాంతా=నక్షత్రములయొక్క, ఆకారసంపత్తిన్ = ఆకృతిసంపత్తు చేతనని యర్థాంతరము; "విధుర్విష్ణౌ చన్ద్రమసి" అని యమరుఁడు, మించఁగన్=అతిశయింపఁగా; ముత్యంబులు=మౌక్తికములు; శుక్తికాతటిన్=శుక్తికయను నొకనదియొక్క యొడ్డున, ముత్యపుచిప్పలదరినని యర్థాంతరము; తపశ్చర్యన్=తపముఁ జేయుటచేత; విజృంభించి= అతిశయించి; హెచ్చుగుతాద్రూప్యమున్=ఉత్కృష్టమగు తద్రూపతను, తన్నఖరూపతననుట; పొందెన్. కానియెడన్=అటుగానిచో; ముక్తాభిఖ్య=మోక్షమునుబొందినవనుపేరు, మౌక్తికము లనుపేరు, ముక్త యని ముత్యములకు నామాంతరము; ఎట్లబ్బెడిన్=ఏవిధముగ లభించును?

అనఁగా ముత్యములు శుక్తికానదీతీరమునఁ దపముఁ జేసి చంద్రికా నఖసారూప్య ముక్తిని గాంచినవి గావుననే ముక్తాఖ్యనొందినవి, కానిచో నొందఁ జాల వనుట. చంద్రికా పాదనఖములు మొగ్గలను నక్షత్రములను బోలియున్న వని భావము. ఇట నఖములు వర్ణితం బులయ్యె. చిత్రరేఖావతారరూప యగుటం జేసి చంద్రిక దేవతాత్మ గావున "మానవా పాళితో వర్ణ్యా దేవా శ్చరణతః పునః" అను కవికులనియమము ననుసరించి నఖాదిగా వర్ణించుట యని తెలియ వలయు.

చ. అనిశవిభాసితాత్మమృదు♦తారుణతాజితపల్లవాభలై
తనరు వెలందిపాదరుచిఁ ♦ దమ్ము లిరం గమలాప్తుగోత్రమం
బునఁ గని మించఁ గాదె సిరి ♦ పూని కరమ్ములఁ జక్క నొత్తు లో
చనములు గంతుకేళివిధి♦జక్లమదారణదంభధీగతిన్. 7

టీ. అనిశ విభాసితాత్మ మృదుతారుణతాజితపల్లవాభలై.—అనిశ=ఎల్లపుడును, విభాసిత=ప్రకాశించుచున్న, ఆత్మ=తనసంబంధియగు, అనఁగాపాదసంబంధియగు, మృదుతా=మార్దవముచేతను, అరుణతా=ఎఱ్ఱఁదనముచేతను, జిత = జయింపఁబడిన, పల్లవాభలై= చిగురుటాకుకాంతిగలవై, అనఁగాఁ బల్లవమునందు మ్రదిమారుణ్యములు సర్వకాలమునందు నుండునవి గావు కావునఁ బాదరుచిచే వది యోడింపఁబడిన దనుట; ఇట్లు చెప్పుటచేఁ

జంద్రికాపాదములయందు మార్దవాతిశయము గదితంబయ్యె, "స్పృష్టం యత్రాఙ్గమస్పృష్టమివ స్యాన్మార్దవం హి తత్" అని తల్లక్షణంబు. ఆయుస్యోక్తిచే ద్వితీయయౌవనము గదితమగు. "స్తనౌ పీనౌ తనుర్మధ్యః పాణౌ పాదే చ రక్తిమా। ఊరూ కరికరాకారావఙ్గం వ్యక్తాఙ్గసన్ధికమ్। నితమ్బో విపులో నాభిర్గభీరా జఘనం ఘనమ్। వ్యక్తా రోమావళిస్సైవం స్నిగ్ధ్యె మఙ్గకే లలితాక్షిణీ। ద్వితీయే యౌవనే" అని రసార్ణవసుధాకరమందుఁ దల్లక్షణం బెఱుంగునది. తనరు వెలందిపాదరుచిన్=ప్రకాశించునట్టి చంద్రికయొక్క పాదకాంతిని; తమ్ములు=తోఁబుట్టువులు, పద్మములని యర్థాంతరము; ఇరన్=భూమియందు,ఉదకమందు; కమలాప్తగోక్రమంబునన్ = విష్ణుమూర్తివచనక్రమము చేత, వరప్రదానము చేతననుట, సూర్యకిరణసంచారము చేతనని యర్థాంతరము; కని=పొంది; మించన్ కాదె = మించుట చేతఁగదా! సిరి=లక్ష్మి; కరమ్ములన్ = హస్తములయందు; పూని=వహించి; లోచనములు= నేత్రములను; కంతుకేళివిధిజ క్లమదారణదంభధీగతిన్.—కంతుకేళివిధి = అనంగక్రీడా విధానమువలన, జ=పుట్టినట్టి, క్లమ=శ్రమముయొక్క, దారణ=పోఁగొట్టుకొనుటయొక్క, దంభధీ = వ్యాజపుబుద్ధియొక్క, గతిన్ = ప్రాప్తిచేత; చక్కన్ = బాగుగా; ఒత్తున్= ఒత్తుకొనును.

అనఁగా నెల్లపుడు రాజిల్లుతనమార్దవారుణ్యములచేఁ బల్లవకాంతి నోడించిన చంద్రికాపాదరుచిని, తమ్ములు అనఁగా లక్ష్మీసహోదరము లగుతామరసములు విష్ణుమూర్తివరముచే త గ్రహించె నని సిరి సంతసించుచుఁ గంతుకేళిపరిశ్రమాపనోదనవ్యాజమునఁ గన్నులొత్తుకొనుచున్న దనుట. చంద్రికాపాదములు పల్లవములకన్న మార్దవారుణ్యములు గల వనియు, పద్మములు సూర్యకిరణప్రచారముచే నట్టివానికాంతిని బొందిన వనియు భావము. లక్ష్మీదేవి పద్మహస్త యగుట, "నిత్యంసాపద్మహస్తా మమవసతుగృహేసర్వమాఙ్గళ్యయుక్తా" యని ప్రసిద్ధము. ఇట్లు సిరిపద్మహస్తయగుటకు, పద్మములు చంద్రికాపాద ప్రమదిమారుణ్యములను బొందుట హేతువుగాకున్నను, హేతువుగాఁజెప్పుటవలన హేతూత్ప్రేక్షాలంకారము. ఆమ్రదిమారుణ్యములకు భగవత్ప్రసాదైకలభ్యతచెప్పుట లోకోత్తరత్వానితరసాధ్యత్వాది ప్రతీత్యర్థమని తెలియునది.

చ. వెలఁదిమెఱుంగుపిక్కలయ • వేలమరీచిక ధాటి వెల్వడన్
జలమున నంచుఁ గాహళిక • సాంద్రరుతిన్ బయ లూన్ప శాలి లోఁ
గలసినభీతి వాహినుల • కాండముతో హరిమండలంబుతో
వల నగుపొందుఁ గాంచియును • వప్రము వెల్వడ కుండు నెంతయున్. 8

టీ. వెలఁదిమెఱుంగు పిక్కల యవేలమరీచిక.—వెలఁది=చంద్రికయొక్క, మెఱుంగుపిక్కల=ప్రకాశించుచున్న జంఘలయొక్క, అవేలమరీచిక=అధికమగు కాంతి; ధాటిన్ =జైత్రయాత్రనుగూర్చి; చలమునన్ = మాత్సర్యముచేత; వెల్వడన్=బయలుదేఱను. అంచున్; కాహళిక=బూరుగ; సాంద్రరుతిన్=దట్టమగుధ్వనిని; బయలూన్పన్= వెల్లడిసేయఁ

గా; శాలి=వరిపొట్ట యనుట; లోన్=అంతరంగమందు; కలిసినభీతిన్=కూడుకొన్నభయము చేత; వాహినులకాండములతోన్=సేనలయొక్క గుంపుతో, నదుల జలముతోను, "కాండో స్త్రీదణ్డబాణార్వ వర్గావసరవారిషు" అని అమరుఁడు; వారిమండలంబుతోన్=అశ్వసమూహముతో, శుకవర్గంబుతోను; వలనగుపొందున్ = అనుకూలమైన సంబంధమును; గాంచియును = పొందియును; వప్రము=కోటను, వరిమడిని; ఎంతయున్ = మిక్కిలి; వెల్వడకుండున్=బయలుదేఱకుండును. చిత్రతన్ అనుపాఠమున వాహినులకాండములతోను వారిమండలముతోను వలనగుపొందుఁ గాంచియు వెల్వడకుండుట చిత్ర మని తెలియునది.

చంద్రిక పిక్కలకాంతి చైత్రయాత్ర వెడలఁగఁ గాహళికపెద్ద పెట్టునొరొదసేయుటను శాలి విని తాను వాహినీకాండములతోను వారిమండలంబుతోనుం గూడిన దయ్యు వప్రము వెల్వడ కుండె ననుట. ఆమె పిక్కలు బూరుగలకన్నను వరిపొట్టలకన్నను మిన్నగా నున్న వనిభావము. వాహినులకాండము వారిమండలము వప్రమనుచోటుల శ్లిష్టరూపకము పిక్కలను కాహళములు వరిపొట్టలు లోనగువానితోడఁ బోల్చుట కవిసమయసిద్ధము.

ఉ. రాజవరాత్మజాతపరి◆రంభసుఖం బొనగూర్చు నాకుభృ
ద్రాజకుచోరుకాండములు ◆ రంభలు గావున నొక్కొ నిచ్చలున్
రాజిలురక్తి సారసవ◆నప్రవివర్ధనవృత్తిఁ బూనుఁ బో
రాజితహస్తిహస్తనిక◆రంబులు తత్ప్రియభావ మూనఁగాన్. 9

టీ. రాజవరాత్మజాతపరిరంభసుఖంబు.—రాజవరాత్మజాత = రాజకుమారునకు, నలకూబరునకని యర్థాంతరము, పరిరంభసుఖంబు=ఆలింగనసౌఖ్యమును; ఒనగూర్చు నాకుభృద్రాజకుచోరుకాండములు.—ఒనగూర్చు=కలుగఁజేయునట్టి, ఆకుభృద్రాజకుచా=పర్వతశ్రేష్ఠములవలె నున్నతములగుకుచములుగల యాచంద్రికయొక్క, ఊరుకాండములు=స్తంభములవంటియూరువులు; "నారీపీన పయోధరోరు యుగళం స్వప్నేపి నాలిఙ్గిత మ్మాతుః కేవలమేవ యౌవనవనచ్ఛేదే కుఠారా వయమ్" ఇత్యాదికా వ్యవహారములవలనను, కామశాస్త్రోద్యుక్తాలింగన ప్రభేదాంతర్గతివలనను, ఊర్వాలింగనము ప్రసిద్ధ మని తెలియవలయు. రంభలు గావున నొక్కొ=రంభ యను దేవాంగన లగుటవలననో, పూజయందు బహువచనము, అనఁటు లగుటనో; నిచ్చలున్=సర్వకాలమందును; రాజితహస్తిహస్తములు = ప్రకాశించుచున్నట్టి యేనుఁగుతొండములు; తత్ప్రియభావము=ఆరంభాత్మకములైన యూరువులకు మిత్త్రభావమును; ఊనఁగన్=పొందునట్లు; రాజిలురక్తిన్=ప్రకాశించుచున్న యనురాగముచేత; సారసవనప్రవివర్ధనవృత్తిన్.—సారసవన=తామరతోఁటలయొక్క, ప్రవివర్ధనవృత్తిన్ = ఛేదించుటయొక్క వ్యాపారమును; సారస=సరస్సంబంధియగు, వన=జలముచేత, ప్రవివర్ధనవృత్తిన్=వృద్ధిఁబొందుటయొక్క వ్యాపారమును; సార=శ్రేష్ఠములయిన, సవన=యాగములయొక్క, ప్రవివర్ధన=వృద్ధిఁబొందించుటయొక్క, వృత్తిన్=వ్యాపారమును; సారస=రసికసంబంధియయిన, వన=సమూహముయొక్క, ప్రవివర్ధన=వృద్ధిఁబొందించుటయొక్క, అనఁగా సంతోషపఱచుట

యొక్క,వృత్తిక్ = వ్యాపారమును; ఇవి క్రమముగాఁ గరికర కదళీ దేవాంగనా చంద్రికోరూ పరములయిన యర్థములు; పూనెక్ = వహించెను. పో = నిశ్చయము.

చంద్రికోరువులు రాజవరాత్మజాతుఁ డగువనునకుఁ బరిరంభసుఖము నియ్యఁదగినవి కావున రాజవరాత్మజాతుఁ డగు నలకూబరునకుఁ బరిరంభసుఖ మిచ్చురంభ లయ్యె ననియు అట్లు రంభాభావము పొంది తమకు (అనఁగా రంభాశబ్దమునకు అనఁటులును అర్థము కావున నట్టియనఁటులకు) శత్రువు లయిన కరికరంబులను సారసవనప్రవివర్ధనవృత్తిఁ బూనుటచే మిత్రములగునట్లు చేసికొనినవి యని తాత్పర్యము. ఏనుఁగుతొండములు కమలవనమును ఛేదించుటయు అనఁటులు సరోజలముచే వృద్ధిఁబొందుటయు దేవాంగనాసంగ సౌఖ్యమునకై యాగములు చేయఁబడుటయుఁ బ్రసిద్ధము. ఆమెయూరువులు అనంటులను ఏనుఁగుతొండములను బోలిన వని భావము. "ఊరూ కరికరాకారా వజ్రం వ్యక్తాజ్ఞసన్నిభమ్" అన్న చొప్పున ద్వితీయయోవన మిందుఁ జెప్పఁబడిరెు.

చ. సతిజఘనప్రభాగరిమ • సైకతముల్ పరిశుద్ధతీర్థవా
సితఁ దగి శారదాదరణ•చే నిసుమంత గ్రహించి మించ స
మ్మతిఁ గన నోపకే యవని • మాటికిఁ గప్పికొను న్సమీరసం
తతిగతినిశ్చ్యుతాసనవ•నప్రసవౌఘపరాగశాటికన్. 10

టీ. సైకతముల్ = ఇసుకదీములు; పరిశుద్ధతీర్థవాసితన్.—పరిశుద్ధ = నిర్మలమగు, తీర్థ = పుణ్యక్షేత్రమందలి, ఉదకమందలి, "తీర్థం శాస్త్రాధ్వరక్షేత్రోపాయోపాధ్యాయమన్త్రిషు। అవతారర్షి జుష్టామ్బుః స్త్రీరజస్సుచ విశ్రుతమ్" అనివిశ్వము, వాసితన్ = నివాసముచేత, వసించువాఁడు వాసి వానిధర్మము వాసిత అది వాసరూపంబ యగును; తగి = ఒప్పి; శారదాదరణచేన్ = సరస్వతీప్రసాదముచేత, శరత్కాలసంబంధియైన యాదరముచేత, శరత్కాలమునసే సైకతప్రకాశము గావున నిట్లు వచింపఁబడిరెు; సతిజఘనప్రభాగరిమన్ = చంద్రిక కటిపురోభాగములయొక్క శోభాతిశయమును;ఇసుమంతన్ = కొంచెముగాను,ఇసుక నంతయు నని వాస్తవార్థము; గ్రహించి = పొంది; మించన్ = అతిశయింపఁగా; అవని = భూమి; సమ్మతిన్ = అంగీకారముచేత; కనన్ = చూచుటకు; ఓపకే = సహింపకయే; సమీరసంతతిగతి నిశ్చ్యుతాసనవనప్రసవౌఘపరాగశాటికన్ .—సమీరసంతతి = వాయుసంఘముయొక్క, గతి = గమనముచేత, నిశ్చ్యుత = జాఱినట్టి, ఇది పరాగవిశేషణము, అసన = బంధూకవృక్షములయొక్క, వన = వనములయొక్క, ప్రసవౌఘ = పువ్వురాశిసంబంధియగు, పరాగ = రజము నెడు, శాటికన్ = కాషాయవస్త్రమునసుట; మాటికిన్ = సారెకు; కప్పికొనున్ = ఆచ్ఛాదించుకొనును.

అనఁగా, చంద్రికాజఘన సౌందర్యము నించుకగ్రహించి మించిన సైకతంబుల సౌభాగ్యముచూచి సహింపఁజాలక భూమి సన్న్యసించెనని భావము.

చ. స్థిరతపనీయసారసన•దీప్తిమృషాతపనాతపంబు భా
స్వరకటిహార్మ్యనాభిమిష•జాలకవీథికఁ బర్వినం దదం.

తరమున నక్షిలక్ష్యగతిఁ ♦ దాల్చినసూక్ష్మతరాణుఁ బోలెఁ జుమీ
కరికులరాజయాననను ♦ గౌను మనంబునఁ జింతి యూన్పఁగన్. 11

టీ. కరికులరాజయాననను గౌను.—కరికులరాజయాన=గజరాజగమనయగు చంద్రికయొక్క, ననుగౌను=సన్నపైనమధ్యభాగము; మనంబునన్=మనస్సునందు; చింతఁ బూన్పఁగన్=ధ్యానింపఁగా; స్థిరతపనీయసారసన దీప్తిమృషా తపనాతపంబు.—స్థిర=అచంచలమగు, తపనీయ=బంగరుయొక్క, "తపనీయంశాతకుమ్భమ్" అని యమరుఁడు, సారసన=ఒడ్డాణముయొక్క, "స్త్రీకట్యాం మేఖలా కాఞ్చీ సప్తకీ రశనా తథా । క్లీబే సారసనమ్" అని యమరుఁడు, దీప్తి=కాంతియనెడు, మృషా=వ్యాజముగల, తపనాతపంబు=సూర్యాతపంబు; భాస్వరకటిహర్మ్య నాభిమిషజాలక వీథికన్.—భాస్వర=ప్రకాశించుచున్న, కటి=కటిప్రదేశమనెడు, హర్మ్య=మేడయొక్క, నాభిమిషజాలక=పొక్కిలియనెడు నెపముగలుగవాక్షముయొక్క, వీథికన్=ప్రదేశమందు; పర్విన్=ప్రసరింపఁగా; తదంతరమునన్ = ఆసూర్యాతపమధ్యమునఁ; అక్షిలక్ష్యగతిన్=చక్షురింద్రియవిషయస్థితిని; దాల్చినసూక్ష్మతరాణువు=ధరించిన అతిసూక్ష్మమగు అణువు; బోలెఁ జుమీ=అగునుసుమీ.

"జాలసూర్యమరీచిస్థం సూక్ష్మం యద్దృశ్యతే రజః। తస్య షష్ఠతమో భాగః పరమాణుస్స ఉచ్యతే" అని చెప్పినరీతిగాఁ బ్రత్యక్షవిషయ మగుత్రసరేణుత్వము మధ్యమందధ్యవసిత మైనది. "గౌను సూక్ష్మతరాణు వోలెన్ కటిహర్మ్య" అనుచోటుల రూపకాలంకారము. "దీప్తిమృషాతపనాతపంబు; నాభిమిషజాలక" యను చోటుల కైతవాపహ్నుతియు, కరికులరాజయాన యనుచోట నుపమాలంకారంబు నగును.

మ. అళివేణీమణినాభి తుంగఘనపు ♦ ష్పాభంగశోభాగతిం
జెలు వందం దదమూల్యసద్గుణగణ ♦ శ్రీఁ గానఁగా లేమి నో
జలజాతాకరపాళి చుట్టుకొను ని ♦ చ్చల్ మర్త్యశైవల్లికా
వళి నస్పృశ్యనిరంతరావిశద శై ♦ వాలాళిదంభంబునన్. 12

టీ. అళివేణీ మణినాభి=చంద్రికయొక్క పొక్కిలి; తుంగఘనపుష్పాభంగశోభాగతిన్.—తుంగ=ఉన్నతమైన, ఘనపుష్ప=జలముయొక్క, అభంగ=తరఁగలులేని, శోభా=కాంతియొక్క, గతిన్=రీతిచేత, "మేఘపుష్పంఘనరసమ్" అని యమరుఁడు; తుంగ=పొన్నయొక్క, ఘన=గొప్పదగు, పుష్ప=పువ్వుయొక్క, అభంగ=భంగములేని, ఆవఁగాఁగొఱఁతలేని, శోభాగతిచేతనని వాస్తవార్థము; చెలువందన్=సుందరమగుచుండఁగా; జలజాతాకరపాళి=పద్మాకరములైన కొలఁకులయొక్కపంక్తి; తదమూల్యసద్గుణగణశ్రీన్.—తత్=ఆనాభిసంబంధియైన, అమూల్య=వెలలేని, సద్గుణగణ=శ్రేష్ఠగుణసంఘముయొక్క, మొలనూలుత్రోవగువానియొక్క, శ్రీన్=సంపదను; గానఁగాలేమినో=పొందలేకుండుటవలననో; నిచ్చల్=ఎల్లప్పుడు; అస్పృశ్యనిరంతరావిశద శైవాలాళిదంభంబునన్.—అస్పృశ్య=స్పృశింపఁగా

డనట్టియు, నిరంతర=ఎల్లప్పుడు, అవిశద=నల్లగానుండునట్టి, "విశదశ్వేతపాణ్డరాః" అని యమరుండు, శైవాల = నాచుఁదీవలయొక్క, అళి=సంపనెడు, దంభంబునన్ = నెపముచేత; దుర్యశోవల్లికావళిన్ = అయశో లతాసంఘమును; చుట్టుకొనున్ = కప్పికొనును.

అనఁగా నామెపొక్కిలి ఘనపుష్పాభంగశోభాగతిని బొందఁగా సభంగశోభాగతియైనజలజాతాకరపాళి తదమూల్యసద్గుణశ్రీ నొందఁజాలక యోడి దుర్యశోవల్లిని దాల్చిన దని భావము. వర్ణ్యముచేత నోడింపఁబడిన దిట్లు చెప్పఁబడిన దని సంప్రదాయము. ఇందులకు "లజ్జా కోపో యశోనాశో రోషాక్రన్దాస్యకృష్ణతాః। రాగపాణ్డురతాశస్త్రీవిషధూమ్రాతపో జపాః॥ రాజప్రసాదహంసైకదస్తభక్తినిషేవణమ్ । దుఃఖస్నేహాభిచారేర్ష్యా సహానోద్రేకవిశాదయః॥ వర్ణ్యేన విజితస్యైతే పరాభవసముద్భవాః॥ భావా వాచ్యా యథౌచిత్యమ్" అనియు, "ముఖజితం కమలం మూర్తిమదయశో భృఙ్గావళీవ్యాజేన ధత్తే" అనియు, కవికల్పలత యందున్నది.

చ. తలఁకక యౌవనాంబునిధిఁ • దానముఁ జేసి కటీవితర్దిఁ జెం
ది లలితవిప్రసేవితుఁడు • నీరజబాణుఁడు పాంథభేదనో
జ్జ్వలమతి నాభికుండమునఁ • జయ్యన హోమ మొనర్పఁ బర్వుశ్యా
మలతరధూమలేఖ యన • మానిని యారు పొసంగు నింపునన్. 13

టీ. లలితవిప్రసేవితుఁడు.—లలిత=సరసులైన, విప్ర = బ్రాహ్మణులచేత, సేవితుఁడు=కొలువఁబడినవాఁడగు; లలిత=సుందరములైన, వి=శుకాదిపక్షులచేత, ప్రసేవితుఁడగు నని వాస్తవార్థము; నీరజబాణుఁడు=మరుఁడు; పాంథభేదనోజ్జ్వలమతిన్.—పాంథ=బాటసారులయొక్క, భేదన=విదారణమందు, ఉజ్జ్వల=ప్రకాశించునట్టి, మతిన్=బుద్ధిచేత; యౌవనాంబునిధిన్=ప్రాయంబనెడుమున్నీటియందు; తలఁకక= భయంపడక; తానమున్ = స్నానమును; చేసి=ఒనరించి; కటీవితర్దిన్=కటిప్రదేశమనెడు వేదికను; చెంది=పొంది. నాభికుండమునన్ = పొక్కిలియనెడు కుండమునందు, కుండ మనఁగా హోమమునకై విధిచొప్పునఁ ద్రవ్వఁబడిన గుంట; చయ్యనన్ = వేగముగ; హోమము; ఒనర్పన్ = చేయఁగా; పర్వుశ్యామలతరధూమలేఖ.—పర్వు=వ్యాపించెడు, శ్యామలతర=మిక్కిలినల్లనగు, ధూమలేఖ=ధూమమాలిక; అనన్ = అనునట్లు; మానినియారు=చంద్రికయొక్క రోమరాజి; ఇంపునన్=అందముచే; పొసంగున్= ఒప్పును.

చంద్రికయారు మరుఁడు పథికులవధింప నిచ్ఛించి యౌవనాంబునిధియందు స్నానముఁ జేసి విప్రసేవితుఁడయి కటీవితర్దియందు నాభికుండమున వేల్చినధూమమాలికయో యన్నట్లున్నదని భావము. ఉత్ప్రేక్షాలంకారము. "యౌవనాంబునిధి నాభికుండ" అనుచోట్ల రూపకములకు నుత్ప్రేక్షకు నంగాంగిభావముచే సంకరము.

మ. నవరోమావళియష్టికాగ్రముపయి ♦ న్రాజిల్లి చందోయి తా
నవి మెప్పించి తదాత్మత న్మనసూ ♦ యన్ గ్రీవ యబ్జాప్తవై
భవముం జేకొనె నొండపండు మున్నరుణబిం ♦ బస్ఫూర్తిఁ గెమ్మోవి వే
ణి విరాజిల్లెఁ దమస్సపత్నగతి నెం ♦ తేఁ దాల్చి యయ్యింతికిన్. 14

టీ. అయ్యింతికిన్=ఆచంద్రికకు, చందోయి=స్తనయుగ్మము; నవరోమావళియష్టికాగ్రముపయిన్.—నవ=నూతనమగు, రోమావళి=అరసెడు, యష్టికా=ఆసనవిశేషముయొక్క, యష్టికాసనము యోగప్రసిద్ధము, అగ్రముపయిన్=అగ్రభాగముమీఁద; రాజిల్లి=ప్రకాశించి, అనఁగా తాదృశాసనారూఢమై తపము దాల్చి యనుట; తాన్; అవిన్=సూర్యుని; మెప్పించి=సంతుష్టునిఁజేసి; తదాత్మతన్= ఆయవిస్వరూపముచేతను, పర్వతస్వరూపము చేననుట; "అవయశ్శైలమేషార్కాః" అని యమరుఁడు; మనన్=వృద్ధిఁబొందఁగా; గ్రీవ=కంధరము; అసూయన్=ఈర్ష్యచేత; అబ్జాప్తవైభవమున్=సూర్యునియొక్క విభవమును; అబ్జ=శంఖమునకు, ఆప్త=చెలియనెడు, వైభవమున్=విభవమును; "అబ్జౌశజ్ఖశశాఙ్కౌచ" అని యమరుఁడు; ఇటచమత్కారమున పద్మార్కతయు, సూర్యుండు పద్మబాంధవుం డగుటయు, తెల్లము. చేకొనెన్=గ్రహించెను. కెమ్మోవి=ఎఱ్ఱనగునట్టియధరము; మున్ను=తొలుత; అరుణబింబస్ఫూర్తిన్=సూర్యబింబప్రకాశమును, అరుణమైన దొండపండుయొక్క ప్రకాశమును; ఒందెన్=పొందెను. వేణి=జడ; తమస్సపత్నగతిన్.—తమః = రాహువునకు; "తమస్తు రాహుః" అని అమరుఁడు, సపత్న=శత్రువనెడు, గతిన్=రీతిని, అంధకారశత్రువైన సూర్యునిరీతిని; ఎంతేన్=మిక్కిలి; తాల్చి=వహించి; విరాజిల్లెన్ = ప్రకాశించెను.

ఆచంద్రికయొక్క కుచములు పర్వతోన్నతములనియు కంఠము శంఖతుల్యం బనియు అధరము బింబసదృశ మనియు, వేణి రాహువును బోలి యున్నదనియు భావము- "బన్ధుశ్చోర స్సుహృ ద్వాదీ కల్పః ప్రఖ్యః ప్రభ స్సమః। జేశీయ దేశ్యరిపా ప్రభసోదరాద్యా ఇవార్థకాః" అనుటచే ఆప్తసపత్నశబ్దములు తౌల్యమునఁ బ్రతిపాదించును.

సీ. సకియురోజములసా ♦ టికి గవ్వారముఁ బూని
కుధరపాళిక కలఁ ♦ గుండువడియెఁ
గలికిగుబ్బలపెంపుఁ ♦ గనఁ జాలఁ దమిఁ గాంచి
కోకముల్ రాజుచేఁ ♦ గుందువడియెఁ
జెలికుచంబులఁ బోల ♦ నెళవున సరిఁ జూచి
కనకకోలంబముల్ ♦ గట్టువడియె
నెలఁతచందోయితోఁ ♦ దులఁదూఁగ రతిఁ బూని
భృంగారుతతి వేగ ♦ మొత్తువడియెఁ

తే. తతియు గోత్రమ్ములకును గోత్రమ్ము లరుల
కగులు కాయమ్ములకుఁ గాయములు భద్ర
ఘటకములకు సదాభద్రఘటకములుఁ బ
ళీరె వధూకులమణిపయోధరము లెన్న. 15

టీ. కుధరపాళిక=పర్వతసమూహము; సకియురోజములసాటికిన్ = చంద్రికపాలిండ్ల సామ్యమునకు; గహ్వరమున్=దంభమును, గుహను; పూని=వహించి; కలఁగుండువడియెన్=కలఁతపడెను. పర్వతము గుహలుగలిగి కలఁగుండుపడుట సహజము. కోకముల్ = చక్రవాకములు; కలికిగుబ్బలపెంపున్=చంద్రికగుబ్బల యతిశయమును; కనన్=పొందుటకు; చాలన్= మిక్కిలి; తమిన్=ఆసక్తిని, రాత్రిని; "రజనీయామినీతమీ" అని యమరుఁడు; కాంచి=పొంది; రాజుచేన్=ప్రభువుచేత, చంద్రునిచేత; కుందుపడియెన్ = దుఃఖమునుబొందెను. చక్రవాకములు రాత్రి చంద్రునిచేఁ గుందుపడుట సహజము. కనకకోలంబముల్ = బంగరుకిన్నెరకాయలు; చెలికుచంబులన్=చంద్రికాస్తనములను; పోలన్=పోలుటకు; ఒళవునన్= లోలోపల, వీణాదండమందు; సరిన్=సాటిని; చూచి=అవలోకించి; కట్టువడియెన్=సిగ్గునఁ జాలించుకొనెను, బంధమునుబొందెను. కోలంబకము లొళవునఁ గట్టువడుట సహజము. భృంగారుతతి.—భృంగారు=బంగరుగిండ్లయొక్క, "భృఙ్గారుగికనకాలుకా" అని యమరుఁడు, తతి=గుంపు; నెలఁతచన్దోయితోన్=చంద్రికచన్నుఁగవతోడ; తులఁదూఁగన్=సాటిఁబొందుటకు; రతిన్=ప్రీతిని; పూని=వహించి; వేగ= శీఘ్రముగా; ఎత్తువడియెన్=డస్సెను, తూఁచఁబడెను; బంగరుగిండ్లు తూఁచఁబడుటసహజము. వధూకులమణి పయోధరములు = స్త్రీరత్నంబగు చంద్రికయొక్క పాలిండ్లు; ఎన్నన్=ఎంచఁగా; తతియుగోత్రమ్ములకున్ = సమీపించుచున్న పర్వతములకు; గోత్రమ్ములు=పూజనీయములు. "గోత్రస్సంభావనీయేపి" అని విశ్వము; అరులకున్=చక్రవాకములకు, అరులు=శత్రువులు. కాయమ్ములకున్=వీణాకాయములకు, కోలంబకములకనుట; కాయములు=కటుద్రవ్యములచేఁ జేసిన యౌషధములు, సహింపరానివనుట. భద్రఘటకములకున్=పైఁజెప్పినభృంగారువులకు; "భద్రకుమ్భః పూర్ణకుమ్భో భృఙ్గారుః" అని యమరుఁడు; సదాభద్రఘటకములు=ఎల్లపుడు శ్రేయమునుఘటిల్లఁజేయునవి, కాదేని అభద్ర అని విభాగము, ఎల్లప్పుడు అమంగళమును జేయున వనుట. సదాపదము "సుప్సుపా" అని సమసించినది. బళిరే=ఆశ్చర్యము !

గోత్రమ్ములకు గోత్రమ్ము లరుల కగు లిత్యాదిగాఁ దత్తత్సమానరూపత నొందుట యాశ్చర్య మనిభావము. ఆమె స్తనములు పర్వతములవలె నున్నత మయినవనియు, జక్కవలవలె జతగూడి యున్న వనియు, వీణాకాయములవలెఁ బొంకములుగానున్న వనియు, భృంగారువులవలె మెఱుఁగు గలిగి యున్న వనియు భావము. ఇందుఁ జందోయి వర్ణితం బయ్యె.

మ. భువిఁ గశ్చిత్పదపూర్వకంబుగ సుధీపుంజంబు త న్నల్క నా
త్మ వెతం జేకొని దేవదత్తము మిళింద ద్వేణికంఠాత్మ సొం

పు వెలుంగం జనియించి మించె బళి స • త్సూ్వగాంచితంబై ప్రసి
ద్ధవరాభిఖ్య నెసంగి భూరిగుణర • త్నప్రాప్తి సంధించుటన్. 16

టీ. దేవదత్తము=అజ్ఞనశంఖము, అజ్ఞాతకులగోత్రం బగునొకవ్యక్తివిశేషము; భువిన్=భూమియందు; సుధీపుంజంబు=విద్వన్మండలము; తన్=తన్ను; కశ్చిత్పదపూర్వకంబుగన్="కశ్చిద్దేవదత్తః" అను వ్యవహారముచే కశ్చిత్పదము ముం దగునట్లుగా;పల్కన్=వచింపఁగా; అట్లు వ్యవహరించుట శాస్త్రములయందుఁ బ్రసిద్ధంబు; ఆత్మన్ = మనస్సునందు; వెతన్=దుఃఖమును; చేకొని=పొంది; మిళిందద్వేణికంఠాత్మన్.—మిళిందద్వేణి=తుమ్మెదలవలె నాచరించువేణిగల చంద్రికయొక్క, మిళిందత్ అనుచోట ఆచారార్థమున క్విప్ప్రత్యయము, కంఠాత్మన్=కంఠరూపముచేత;సొంపువెలుంగన్=శోభయతిశయించునట్లుగా; జనియించి=ఉదయించి; సత్సూ్వగాంచితంబువి.—సత్సూ్వగ=విద్వత్సంఘముచేత, అంచితంబై=పూజితంబై, వాఁకభంగి నొప్పుచున్నదై; ప్రసిద్ధవరాభిఖ్యన్=ప్రసిద్ధమై శ్రేష్ఠమైనపేరిచేత, ప్రసిద్ధ=ప్రసిద్ధమగు,వర=కుంకుమముయొక్క,అభిఖ్యన్=కాంతిచేత,"వరంబాహ్లీకపీతనే,అభిఖ్యానామశోభయోః" అని యమరుఁడు; ఎసంగి=ఒప్పి; భూరిగుణరత్నప్రాప్తి.—భూరి=అధికమైన, గుణరత్న=రత్నములవంటి గుణములయొక్క, ప్రాప్తి=పొందిక, భూరిగుణ=గొప్పసూత్రముగల, కాదేని బంగరుసూత్రముగల, రత్నప్రాప్తి=మణులపొందిక; సంధించుటన్=కలుగుటవలన; మించెన్=అతిశయించెను. బళి=ఆశ్చర్యము !

దేవదత్తము పండితమండలిచే కశ్చిత్పదపూర్వకముగా వ్యవహరింపఁబడుచున్నా నని వెత నొంది చంద్రికాకంఠరూపముగా జనించి సుగుణరత్నములఁ బొందిసత్సూ్వగాంచితంబై ప్రసిద్ధనామమును దాల్చి విరాజిల్లె ననుట. అనఁగా అజ్ఞనశంఖావతార రూపముగా నామె కంఠము వెలయుచున్న దని భావము. పూర్వ మంతసామాన్యస్థితిలో నుండినదేవదత్తము కంఠరూపతఁ దాల్చి తద్విపరీతముగ లోకోత్తరస్థితిచేఁ జెలఁగుట యాశ్చర్యము.

చ. వనితభుజాప్రసూనసర • వల్గువిలాసముఁ జెందఁ గోర్కెఁ గై
కొని వనజాకరాళి బిస • కోటి గళద్వయసాంబుసీమ ని
ల్చి నయనపద్మముల్ దెఱచి • సేయుఁ దరణ్యవలోకనం బహం
బున నిశ వాని మోడ్చి పెను • పుం దదుదంచితచింతనాగతిన్. 17

టీ. బిసకోటి=తామరతూఁడుగుంపు; వనితభుజాప్రసూనసర వల్గువిలాసమున్.— వనిత=చంద్రికయొక్క, భుజాప్రసూనసర=పుష్పహారములవలెనుండుబాహువులయొక్క, వల్గు=మనోజ్ఞమైన, విలాసమున్=లీలను; చెందన్=పొందుటకు; కోర్కెన్=వాంఛను; కైకొని=పొంది; వనజాకరాళిన్=పద్మాకరములయొక్క సమూహమందు; గళద్వయసాంబుసీమన్.—గళద్వయస=కంఠప్రమాణమైన, "ప్రమాణేద్వయసచ్" ఇత్యాదిసూత్రముచేఁ బ్రమాణార్థమందు గళశబ్దముపైద్వయసచ్ప్రత్యయము, అంబుసీమన్=జలప్రదేశమందు; నిల్చి; నయన

పద్మముల్=నయనరూపములైన పద్మములను; తెఱచి=విప్పికొని; అహంబునన్=పగటియందు; తరణ్యవలోకనంబు=సూర్యావలోకనమును; చేయున్=ఒనరించును. నిశన్=రాత్రియందు; వానిన్=ఆనయనపద్మములను; మోడ్చి=మూసికొని; తదుదంచితచింతనాగతిన్.—తత్ = ఆ సూర్యునిసంబంధియైన, ఉదంచిత=అధికమగు, చింతనా=ధ్యానముయొక్క, గతిన్ = రీతిని; పెనుపున్=వృద్ధిఁబొందించును.

తపంబొనరించు వారిలోఁ గొందఱు జలమధ్యమునఁ గంఠమువఱకునిల్చి సూర్యావలోకనమే సేయుచు సూర్యుం డస్తమింపఁగా నాతనినే ధ్యానించుచుఁ గన్నులుమోడ్చికొని రేయిగడిపి మఱల సూర్యోదయమునఁ దన్నిరీక్షణము సలుపుట ప్రసిద్ధము. అట్లు బిసకోటి చంద్రికాభుజావిలాససిద్ధికై కొలఁకునందు సూర్యావలోకనముసేయుచుఁ దపోవిశేషము నాచరించుచున్నట్లు త్ప్రేక్షింపఁబడినది. అనఁగాఁ జంద్రికాభుజాలతలు మృణాళములను మించియున్న వనిఫలితార్థము "ప్రాయోఽబ్జం త్వత్పదే నైక్యం ప్రాప్తుం తోయే తపస్యతి" అనుచోటవలె నుత్ప్రేక్షాలంకారము.

సీ. ఎంత సద్గుణలబ్ధి • నెనసి మించిన నైన
మణులరంధ్రములె నె•మకు ననంగ
నెంతవారికిఁ బుట్టి • యెమ్మె గాంచిన నైన
సుధ పెంపుఁ బలుచగాఁ • జూచు ననఁగ
నెంత బల్మోనఁ గూడి • యింపుఁ జెందిన నైనఁ
జిగురాకు నగపీథిఁ • జేర్చు ననఁగ
నెంత రసోదయం • బెచ్చఁ బొల్చిన నైనఁ
జెఱకు నిష్ఫలముగాఁ • జేయు ననఁగ

తే. ననిశ మామోద మొక్కింత • గనక వాయు
రీతిఁ జాంచల్యము వహించి • రిత్త విరిసి
సొంపు చెడ వాడుబంధూక•సుమచయంబు
తెఱవకెమ్మోవితో విరో•ధింపఁ గలదె. 18

టీ. ఎంతసద్గుణలబ్ధిన్=ఎంతసుగుణలాభమును, మంచినూత్రములయొక్కలాభమును; ఎనసి=పొంది; మించిననైనన్=అతిశయించినప్పటికిని; మణులరంధ్రములె=మణులయొక్కదోషములనే, బెజ్జములనేయనియర్థాంతరము; నెమకున్=వెదకును; అనంగన్=ఇట్లనుచుండఁగా; ఎంతవారికిన్=ఎంతదొడ్డవారికి, ఎంతజలమునకును; పుట్టి=జన్మించి; ఎమ్మె=అందము; గాంచిననైనన్=పొందినప్పటికిని; సుధపెంపున్=అమృతముయొక్కయతిశయమును; పలుచగాన్=తక్కువగాను, సుధ చిక్కనిది కావుండుట స్వభావము; చూచున్ అనఁగన్=అవలోకించుననఁగా;

ఎంతబలాఢ్యానన్=ఎంతయధికమైనసేనను, సహాయమును; కూడి; ఇంపున్=యోగ్యతను; చెందినసైనన్=పొందినప్పటికిని; చిగురాకున్=కిసలయమును; నగన్ వీథిన్ చేర్చుననఁగన్=లోకము నవ్వునట్లుగా వీథికిఁదెచ్చుననఁగా; నగవీథిన్=వృక్షపంక్తిని, చేర్చుననఁగనని యర్థాంతరము; ఎంతరసోదయంబు=ఎంతవీర్యాతిశయము, పానకముయొక్కయుదయము; ఎచ్చన్=అతిశయించునట్లుగా; పొల్చినసైనన్=ఒప్పినప్పటికిని; చెఱకున్=ఇక్షువును; నిష్ఫలముగాన్=లాభములేనిదానిఁగా, పండ్లులేనిదానిఁగానని యర్థాంతరము; చేయుననఁగన్=ఒనరించుననఁగా; అనిశము=ఎల్లపుడు; ఆమోదము=సంతసము, పరిమళము; ఒక్కింతగినక=కొంచెమైనం గానక; వాయురీతిన్.—వాయు=వాతరోగముయొక్క, తెమ్మెరలయొక్క, రీతిన్=రీతిచేత; చాంచల్యమువహించి=చంచలత్వమునొంది; రిత్తవిఱిసి=వృథాగర్వముచేతఁజెడి, ఫలములేకవికసించి; సొంపుచెడన్=అందమాఱునట్లు; వాడుబంధూకసుమచయంబు=మ్లానమౌదాసనపువ్వుల గుంపు; తెలివకెమ్మోవితోన్=చంద్రికయొక్కయరుణాధరముతోడ; విరోధింపఁగలదె=పోరఁగల్గునా?

అనఁగా నంతంతయుత్కృష్టము లగుమణిసుధాపల్లవేక్షువులే యోడినపు డిట్లుసామాన్యమగుబంధూకము విరోధింపఁజాలదనుట. చంద్రికమోవి బంధూకపుష్పపల్లవ మణులకన్న మార్దవారుణ్యములుగలిగి యిక్షుసుధలకన్న తీయనైనదని ఫలితార్థము.

మ. హరిమధ్యానఘదంతకోరకసమ♦త్వారూఢి పుణ్యాకర
స్ఫురణల్ గాంచినహీరసంతతి కిలం ♦ బొల్పొందఁగా కబ్బునే
పరమాఘంబునఁ బొల్చు మాకని వనిం ♦ బల్మాఱు ఖేదించు బం
భరనాదంబున మొల్లమొగ్గలు గళ♦న్మధ్వశ్రుపూరంబుగన్. 19

టీ. మొల్లమొగ్గలు=కుందకుట్మలములు; హరిమధ్యానఘదంతకోరకసమత్వారూఢి.—హరిమధ్యా=చంద్రికయొక్క, అనఘ=ఒచ్చెములేని, దంతకోరక=కలికలవంటిదంతములయొక్క, సమత్వారూఢి = సామ్యప్రాప్తి; ఇలన్=భూమియందు; పుణ్యాకరస్ఫురణల్.—పుణ్య=సుకృతములకు, ఆకర=ఆధారములైన, స్ఫురణల్=ప్రకాశములను; పుణ్య=మనోహరములగు, ఆకర=గనులయందు, స్ఫురణములను; కాంచినహీరసంతతికిన్=పొందినవజ్రసంఘమునకు; పొల్పొందఁగాక=ఒప్పునుగాక. పరమాఘంబునన్.— పరమ = అధికమగు, అఘంబునన్=పాపముచేత; పర=శ్రేష్ఠమయిన, మాఘంబునన్=మాఘమాసమునందు; పొల్చుమాకున్=ఉదయించినమాకు; అబ్బునే=అమరునా? అని=ఇటనుచు; గళన్మధ్వశ్రుపూరంబుగన్.—గళత్=జాఱుచున్నట్టి, మధు=పూదేనియయనెడు, అశ్రుపూరంబుగన్=కన్నీటిప్రవాహముగలదియగునట్లుగా; బంభరనాదంబునన్=తుమ్మెదలనాదముచేత; పల్మాఱున్=సారెకు; ఖేదించున్=దుఃఖించును.

అనఁగాఁ జంద్రికయొక్క దంతకోరకములకు హీరములు సాటియగును గాని మొల్లమొగ్గలు తాము కామని దుఃఖించెననుట. ఇట "దుఃఖస్నేహాభిచారేష్వాసనహానోద్దీప్తివిశాద

యః'' అను పూర్వోదాహృతప్రమాణమునుబట్టి ''ముఖజిత శ్చన్ద్రః పీయూషబిన్దువ్యాజే నా గ్రహణి ముఞ్చతి-ముఖజితం కమలం భ్రమరారావై రాక్రన్దతి'' అని కవికల్పలతలోఁ జెప్పిన చొప్పున ''ఖేదించుబంభరనాదంబున మొల్లమొగ్గలు గళన్మధ్వశ్రుపూరంబుగన్'' అని పరాజయచిహ్నము వర్ణితంబయ్యె. ఉత్ప్రేక్షాలంకారభేదము.

ఉ. మానినిమేటితావి గల•మాటలతేటఁ గ్రహింపఁ గోరి నా
నానగరాజితప్రవచ•నద్విజరాజులఁ జేరి యీప్సితం
బూనమి వాక్సతీపదప•యోరుహయావకవారిఁ గ్రోల నా
నా నెఱకెంపు సొంపెసఁగె • నాననసీమలఁ గీరరాజికిన్. 20

టీ. మానినిమేటితావి గలమాటలతేటన్.—మానిని=చంద్రికయొక్క, మేటితావిగల=మంచిపరిమళముగలయట్టి, మాటల=పలుకులయొక్క, తేటన్=సారమును; గ్రహింపన్=స్వీకరించుటకు; కోరి=ఇచ్ఛించి; నానానగరాజితప్రవచన ద్విజరాజులన్.—నానానగర=అనేకరాజధానులయందు, అజిత=గెలువఁబడనట్టి, ఓడనివారైనట్టియనుట, ప్రవచన=ప్రకృష్టవాక్కులుగలవారైన, ద్విజరాజులన్=బ్రాహ్మణశ్రేష్ఠులను; నానానగ=అనేకవిధములైనవృక్షములయందు, రాజిత=ఒప్పుచున్న, ప్రవచన=ప్రకృష్టమైనపలుకులుగల, ద్విజరాజులన్=పక్షిపంక్తులను; చేరి=ఆశ్రయించి; ఈప్సితంబు=ఇష్టార్థము; ఊనమిన్=పొందనందున; వాక్సతీపదపయోరుహయావకవారిన్.—వాక్సతీ=వాగ్దేవియొక్క, పదపయోరుహ=పాదపద్మసంబంధియగు, యావకవారిన్=లత్తుకనీరును, వాగశేక్షగలవారు వాగ్దేవినాశ్రయించుట సహజము; క్రోలన్=పానముసేయఁగా; కీరరాజికిన్=చిలుకలగుంపునకు; ఆననసీమలన్=ముఖప్రదేశములయందు; నెఱకెంపు=అధికమైన యెఱ్ఱఁదనము; సొంపెసఁగెన్=ప్రకాశించెను. నానా=యథార్థము.

చంద్రికపలుకులు చిలుకలపలుకులకన్న మృదుగా నున్నవని భావము.

చ. కలికికపోలయుగ్మరుచి • కాంచనదర్పణకాంతిసంతతుల్
కలయఁగఁ జేరఁ బ్రేమమునఁ • గౌఁగిటఁ గూర్చి నిజోజ్జ్వలాంకసం
స్థలి నిడి కర్ణపూరవిల•సత్సితరత్నమరీచిపాళికా
చ్ఛలమునఁ బాలు వోసి పరు•స న్వరపత్త్రిక డోల నూఁచెడున్. 21

టీ. కలికికపోలయుగ్మరుచి.—కలికి=చంద్రికయొక్క, కపోలయుగ్మ=గండస్థలయుగ్మముయొక్క, రుచి=కాంతి; ఇది కర్త; కాంచనదర్పణ కాంతిసంతతుల్.—కాంచనదర్పణ=బంగరుటద్దముయొక్క, కాంతిసంతతుల్=కాంతులనెడు శిశువులు; కలయఁగన్=కలయుటకు; చేరన్=సమీపింపఁగా; ప్రేమమునన్=ప్రీతిచేత; కౌఁగిటన్ కూర్చి=ఆలింగనముఁ జేసికొని; నిజోజ్జ్వలాంకసంస్థలిన్.—నిజ=స్వీయమగు, ఉజ్జ్వల=ప్రకాశించునట్టి, అంకసంస్థలిన్=తొడసమీపదేశ,సమీపభూమియందనుట; ఇడి=కూర్చుండఁబెట్టి; కర్ణపూరవిలసత్సితరత్న

మరీచిపాళికాచ్ఛలమునన్.—కర్ణపూర=కమ్మలయందు, విలసత్=ప్రకాశించుచున్న, సితరత్న=వజ్రమణులయొక్క, మరీచిపాళికా=కాంతిపరంపరయనెడు, ఛలమునన్=నెపముచేత; పాలు=క్షీరములను; పోసి; వయసన్=క్రమముగా; పరపత్త్రికదోలన్—శ్రేష్ఠములగు మకరికాపత్త్రములనెడు నుయ్యేలలయందు; ఊచెదన్.

కపోలరుచి దర్పణకాంతు లనెడుశిశువులను ప్రేమమునఁ గౌఁగిలించి తొడపైఁగూర్చుండఁ బెట్టికొని పాలుపోసి యుయ్యేల నూఁచెనని దర్పణకాంతులయందు శిశువృత్తమును కపోలరుచియందు మాతృవృత్తమును వర్ణించుటవలన దర్పణకాంతికన్నఁ గపోలకాంతి యతిశయించి యున్న దనిభావము. జననులు బిడ్డలు చేర రా నిట్లు చేయుట లోకప్రసిద్ధము.

చ. వనములఁ జేరి పుణ్యతమ♦వాసనఁ గాంచి మలీమసాళిమై
త్త్రి నడఁచి మాధవాదృతి సి♦రి న్ధరియించి సమత్వ మెంచుకాం
చనకళికావళి న్నిజరు♦చాబలవైఖరి రిత్తపుచ్చనో
తనుతరమధ్యనాస తిల♦దాన మొనర్చుఁ జుమీ యజస్రమున్. 22

టీ. వనములన్=అరణ్యములయందు; చేరి=వసించి; పుణ్యతమవాసనన్.—పుణ్యతమ=పవిత్రతమమైన, వాసనన్—అపూర్వమును; మనోహరమైనపరిమళమును; కాంచి=పొంది; మలీమసాళిమైత్త్రిన్.—మలీమస=మలినులయొక్క, ఆళి=పంక్తియొక్క, మలీమసఅళి=నల్లనైనతుమ్మెదలయొక్క, మైత్త్రిన్=సఖ్యమును; అడఁచి=పోఁగొట్టి; మాధవాదృతిన్=విష్ణువునందలి యాసక్తిచేత, వసంతానుగ్రహముచేతను; సిరిన్=సంపదను, కాంతిని; ధరియించి=ధరించి; సమత్వము=తనసామ్యమును; ఎంచుకాంచన కళికావళిన్=కోరునట్టిసంపెఁగమొగ్గలయొక్క పరంపరను; తనుతరమధ్యనాస=సూక్ష్మమధ్యయగు నాచంద్రికయొక్కనాసిక; నిజరుచాబలవైఖరిన్.—నిజరుచా=తనకాంతియొక్క, బల=అతిశయముయొక్క, వైఖరిన్=రీతిచేత; రిత్తపుచ్చనో=వ్యర్థముసేయుటకో; తిలదానము=నూలదానమును; అజస్రమున్=ఎల్లపుడును; ఒనర్చుఁజుమీ=చేయునుసుమీ. తిలకుసుమ ఖండనముఁజేయునని వాస్తవార్థము.

ఇంతయనర్హమైనవస్తువు నాతో సాటిని గోరుట దురితమునఁ జేసియెకాఁబోలునని తత్పాపనిరసనమునకై తిలదానము సేయునట్లున్నదనుట. తిలదానమువలన నరిష్టనిరసనము కలుగునసుట "తిలాఃపాపహరానిత్య"మిత్యాదులవలనఁ దేటపడును. చంద్రికయొక్కనాసిక తిలకుసుమమును సంపెఁగమొగ్గను మించి విరాజిల్లుచున్న దని ఫలితార్థము.

సీ. తారకావరదీప్తిఁ దనరారఁ♦ గానెకా, గనియె సతీర్థతఁ ♦ గలువగుంపు
ఘనరోహితహితాత్మ ♦ ననువొందఁ గానె కా, నెనసె సగోత్రత ♦ నేణికాళి
ప్రద్యుమ్నబోధివ♦ర్తనఁ దాల్పఁ గానె కా,గాంచె సపక్షత ♦ ఖంజనములు
నమలినశ్రీ నవ్వ♦హము మించఁగానె కా, పడసె సమిత్త్రతఁ ♦ బంకజమ్ము

తే. లనుచు హృద్వీథిఁ దలఁప శ్యా♦మాళిమైత్త్రి
నిరతచకితస్వభావతా ♦ సరణి నతను

వాజిభావాప్తిఁ బక్ష్మస • మాజలబ్ధి
నిందుముఖికన్నుదోయి తా • నొందు టరుదె. 23

టీ. తారకావరదీప్తిన్.—తారకావర = చంద్రునియొక్క; దీప్తిన్=ప్రకాశముచేత; తారకా=నల్లగ్రుడ్లయొక్క, వర=శ్రేష్ఠమగు, దీప్తిన్=దీప్తిచేత; తనరారఁగానె కా=ఒప్పఁగా నేకదా! కలువగుంపు=కువలయసమూహము; సతీర్థత=ఒకగురువు గలిగియుండుటను, జలములఁగూడివర్తించుటను; కనియెన్=పొందెను. ఆమెకన్నులకుఁ గలువగుంపు సహాధ్యాయిత్వము నొందెననఁగా సామ్యము వహించెననుట. "సతీర్థ్యాస్త్వేకగురవః" అని యమరుఁడు. ఘనరోహితహితాత్మన్.—ఘన=గొప్పవగు, రోహిత=ఇఱ్ఱులకు, హిత=ప్రియమయిన, ఆత్మన్=స్వరూపముచేత, మత్స్యమువలె హితమయినస్వరూపముచేత; అనువొందఁగానె కా= ఒప్పఁగా నేకదా! ఏణికాళి=ఆఁడుజింకలగుంపు; సగోత్రతన్=జ్ఞాతిత్వముచేత; ఎనసెన్=చేరెను. ఆమెనేత్రములకు ఏణికాళి బాంధవ్యమును బొందిన దనఁగా సమానమయ్యె ననుట. "గోకర్ణపృషతైణర్శ్యరోహితాః,రోహితో మద్గురః" అని యమరుఁడు. ప్రద్యుమ్నబోధివర్తనన్.—ప్ర=ప్రకృష్టమైన, ద్యుమ్న=ధనమును, "ద్యుమ్నమర్థో రై విభవావపి" అని యమరుఁడు, బోధి=తెలిపెడు, వర్తనన్=వృత్తిని; ప్రద్యుమ్నబోధివర్తనన్=మరుని మేల్కొలిపెడు నడవడిని; తాల్పఁగానె కా=వహింపఁగా నేకదా! ఖంజనములు=కాటుకపక్షులు; సపక్షతన్=మిత్రత్వమును; ఱెక్కలతోఁ గూడియుండుటను; కాంచెన్=పొందెను. కాటుకపిట్టలామె కన్నులకు సపక్షభావమును బొందె ననఁగా సాదృశ్యముఁ బొందెనని భావము. నిక్షేపగర్భమయినభూమిమీఁదనే కాటుకపిట్టలు జతగూడుననిప్రసిద్ధము. అమలినశ్రీన్=నిర్మలమైన కాంతిచేత,నిర్మలయగు లక్ష్మీదేవిచేత; అన్వహము=ఎల్లపుడు,ప్రతిపగటియందును; మించఁగానె కా=అతిశయింపఁగా నేకదా! పంకజమ్ములు=పద్మములు; సమిత్రతన్ = సమానమిత్రతను, సూర్యునిగూడియుండుటను; పడసెన్=పొందెను. ఆమెనేత్రములకు పద్మములు సమిత్రము లయ్యె ననఁగా సమానము లయ్యెనని భావము. అనుచున్=ఇటనుచు; హృద్వీథిన్=అంతరంగప్రదేశమందు; తలఁపన్; ఇందుముఖికన్నుదోయి=చంద్రికయొక్క నేత్రయుగ్మము; శ్యామాళిమైత్రిన్.—శ్యామా=రాత్రులయొక్క, ఆళి=గుంపుయొక్క, శ్యామ=నల్లనగు, అళి=తుమ్మెదలయొక్క, మైత్రిన్=సఖ్యమును; శ్యామా=యౌవనమధ్యస్థలగు, ఆళి=చెలులయొక్క, మైత్రిని; నిరతచకితస్వభావతాసరణిన్.—నిరత=ఎల్లపుడు, చకితస్వభావతా=భయసంభ్రమప్రధానమైన స్వభావముగలుగుటయొక్క, సరణిన్=మార్గమును; అతనువాజిభావాప్తిన్.—అతనువాజిభావ =అధికమగు పక్షిత్వముయొక్క, మదనబాణభావముయొక్క, "వాజినోశ్వేషుపక్షిణః" అని అమరుఁడు, ఆప్తిన్=పొందికను; పక్ష్మసమాజలబ్ధిన్.—పక్ష్మ=కింజల్కములయొక్క, ఱెప్పలయొక్క, సమాజ=గుంపుయొక్క, లబ్ధిన్=ప్రాప్తిని. "పక్ష్మాక్షిలోమ్ని కింజల్కే" అని అమరుఁడు; తాన్; ఒందుట=పొందుట; అరుదె=ఆశ్చర్యమా?

అనఁగా కలువలు సతీర్థము లగుటచే శ్యామాళిమైత్రిని, ఏణికాళి సపక్షత దాల్చుటచే నిరతచకితస్వభావమును,ఖంజనములు సపక్షములగుటచే అతను వాజిభావమును పంకజములు

సమిత్త్రములగుటచే పత్త్మ సమాజలబ్ధిని, చంద్రికానేత్రము లొందుట యుదుగా దనుట. ఆమె నేత్రములు కలువలను జింకలను కాటుకపిట్టలను తామరలను బోలియున్న వని భావము. బంధుశ్చ్వేర స్సుహృ ద్వా దీత్యాదిప్రాక్ప్రోక్తి ప్రమాణ మిందు గమనింపవలయు.

చ. నరవరతాపదాత్మకత • నాతి తపాంతరమాభ మించఁగా
హరిహయచాపముల్ బలె న•యారె బొమ ల్గనుపట్టు నాపయి
న్సరససువర్ణసూనసర•చంచలతోఁ జెలువందు కైశ్యకం
ధర మిలఁ గాలకంఠకుల•దర్పవిభేదనశక్తి నొప్పఁగన్. 24

టీ. నాతి=చంద్రిక; నరవరతాపదాత్మకతన్.—నరవర=రాజులకు, తాప = సంతాపమును, ద=ఇచ్చెడు, ఆత్మతన్=స్వభావముగలుగుటచేత, మనుష్యశ్రేష్ఠులకుతాపమును బోఁగొట్టెడు స్వభావము గలుగుటచేత; తపాంతరమాభన్.—తపాంతరమా = వర్షానంపదయొక్క,ఆభన్=కాంతివంటికాంతి చేత;మించఁగాన్=అతిశయింపఁగా;బొమల్=కనుబొమలు; హరిహయచాపముల్ బలెన్=ఇంద్రధనువులవలె;కనుపట్టున్=అగపడును.ఆపయిన్=అపైని; సరససువర్ణసూనసరచంచలతోన్.—సరస=శ్రేష్ఠములగు, సువర్ణసూన=సంపెఁగపువ్వులయొక్క, సర=హారముఅను, చంచలతోన్=మెఱుపుతో; చెలువొందు కైశ్యకంధరము=ఒప్పునట్టికేశసమూహమనెడుమేఘము; ఇలన్=భూమియందు; కాలకంఠకులదర్పవిభేదనశక్తిన్.— కాలకంఠకుల=నీలకంఠములగు నెమిళ్ల సమూహముయొక్క, హంసనంబంధిసమూహముయొక్క, "కలకణ్ఠః కలధ్వానేహంసేపారావతేపికే" అనివిశ్వము, శ్లిష్టరూపకము,దర్ప=గర్వముయొక్క, భేదనశక్తిన్=భేదించుసామర్థ్యముచేత; ఒప్పఁగన్ = ప్రకాశింపఁగా; కనుపట్టున్ అను వెనుకటి క్రియతోనన్వయము. అయారె=ఆశ్చర్యము!

అనఁగా చంద్రికవర్షానంపదను బోలి యుండఁగా నామెకనుబొమలు ఇంద్రధనువులనుబోలిన వనియు, కేశసమూహ మనెడు మేఘము సంపెఁగపూదండ యను మెఱుపుతోఁ గూడినదై నెమిళ్లనుహంసలను బాఱఁదోలుశక్తి కలిగి యుండె ననియు భావము. ఇందు బొమలు వర్ణింపఁబడియె.

మ. వరబాల్యాహ మడంగ యౌవననిశా•వక్త్రంబునం గంజజి
త్కర దంతాంశుకశోణకాంత్యుదయరా•గశ్రీలు హాసావదా
తరుచుల్ గన్పడఁ బ్రాచిఁ బోల నలిక•స్థానంబు దృక్చంద్రికా
త్స్వరుహర్షం బొనగూర్చు సౌమ్యుదితచం•ద్రోత్కర్షముఁ బూనుచున్.25

టీ. వరబాల్యాహ మడంగన్.—వర=శ్రేష్ఠమగు, బాల్య=శైశవమనెడు, అహంబు= పగలు; అడంగన్=శమింపఁగా; యౌవననిశావక్త్రంబునన్=తారుణ్య మనెడుప్రదోషసమయమందు; "ప్రదోషోరజనీముఖమ్" అని అమరుఁడు; దంతాంశుకశోణకాంత్యుదయరాగశ్రీలు.—దంతాంశుక = అధరముయొక్క, శోణకాంతి=అరుణప్రకాశమనెడు, ఉదయరాగశ్రీ

లు=ఉదయకాలికరాగసంపదలు; హాసావదాతరుచుల్.—హాస=చిఱునగవుయొక్క, అవదాత=శుభ్రములగు, రుచుల్=కాంతులు; కన్పడన్=అగపడుచుండఁగా; కంజజిత్కర=చంద్రిక; ప్రాచిన్=తూర్పును; పోలన్=పోలుచుండఁగా; అళికస్థానంబు=ఫాలస్థలము, ఇదికర్త; సామ్యుదితచంద్రోత్కర్షమున్.—సామ్యుదిత=అర్ధోదితమగు, చంద్ర=చంద్రునియొక్క, ఉత్కర్షమున్=ఉత్కర్షమువంటి యుత్కర్షమును; పూనుచున్=వహించుచు; దృక్చంద్రికాళ్యురుహర్షంబు.—దృక్=కన్నులనెడు, చంద్రికాళి = వెన్నెలపిట్టలయొక్క, ఉరు=అధికమగు, హర్షంబు=సంతసమును; ఒనగూర్పన్=చేయును.

అనఁగా బాల్య మనుదివసముయొక్క యవసానమై తారుణ్య మనునిశయొక్క ప్రాదుర్భావ మగునప్పుడు అధరారుణ్యమును హాసావదాతరుచులునుగన్పడఁగాఁ జంద్రిక పూర్వదిశను బోలి యుండుననియు, ఫాలస్థల మర్ధోదితచంద్రుని బోలియుండుననియు, నేత్రములు చకోరములఁ బోలుననియు భావము. ఇట నలకస్థలము వర్ణితం బయ్యె.

మ. ఘనముక్తామయకుండలద్యుతులఁ దత్కాంతాశ్రుతు ల్సాటిగా
వని నవ్వన్ సరి దామె యంచు నతితీవ్రాగ్నిచ్ఛటాతప్తతై
లనికాయంబులు ముట్టి శష్కులులు నిల్వ న్మేలుచిం గాంచి యం
గన లేగింతురు సారెపేర రహి నిక్కం బ్రత్యగారమ్మునన్. 26

టీ. తత్కాంతాశ్రుతుల్=ఆచంద్రికయొక్క కర్ణములు; ఘనముక్తామయకుండలద్యుతులన్.—ఘన=గొప్పలగు, ముక్తామయకుండల= మౌక్తికవికారములగు కమ్మలయొక్క, ద్యుతులన్=కాంతులచేత; సాటిగావని=శష్కులులుమాకు సరిగావని; నవ్వన్ = హసింపఁగా; శష్కులులు=చక్కిలములు; సరితామెయంచున్=తామెసాటియనుచు; అతితీవ్రాగ్నిచ్ఛటాతప్తతైలనికాయంబులు.—అతితీవ్ర=మిక్కిలిదుస్సహమగు, అగ్నిచ్ఛటా=అగ్నిపరంపరచేత, తప్త=కాలినట్టి, తైలనికాయంబులు=తైలసమూహములను; ముట్టి=స్పృశించి; మేలుచిన్=మంచి కాంతిని, మంచిస్వాదువును; కాంచి=పొంది; నిల్వన్; అంగనలు=కాంతలు; సారెపేరన్=సారెయను పేరున; రహి=ప్రీతి; నిక్కన్=అతిశయింపఁగా; ప్రత్యగారమ్మునన్=ప్రతి గృహమునను; ఏగింతురు = ఊరేగింతురు. బాసచేసి గెలిచినవారి నూరేగించుట ప్రసిద్ధము.

చంద్రికాకర్ణములు శష్కులులను బోలి యున్న వని తాత్పర్యము.

చ. తరుణిమొగంబె తా నని సు ధానిధి విష్ణుపదమ్ము ముట్టి దు
ష్కరకరజాతపాండిమ వి గర్హితుఁడై యశుచిం గృశింపఁ బం
కరుహము తన్ముఖోపమము గా నని తా హరిపాద మంటి యిం
దిర దనుఁ జేరఁ గీర్తిఁ గని దీపితజీవన మయ్యె నెంతయున్. 27

టీ. సుధానిధి=చంద్రుఁడు; తాను; తరుణిమొగంబె=చంద్రికయొక్కముఖమె ; అని=ఇట్లు వచించి; విష్ణుపదమ్మున్=నారాయణచరణమును; ముట్టి=స్పృశించి, అనఁగా నేనామె

ముఖమె కాని వేఱు గాదని భగవంతుని చరణము ముట్టి శాసఁ జేసి యనుట, సుధానిధియాకసమును ముట్టి యున్నాఁడని సహజార్థము;దుష్కర కరజాతపాండిమన్.—దుష్కర=అచికిత్స్యమైన, కర=హస్తములయందు, జాత=పుట్టినట్టి, పాండిమన్ = పాండురోగము. చేత, దుర్లభమయిన కిరణములయందలి ధావళ్యముచేత ననిస్వభావార్థము; విగర్హితుఁడై=నిందితుఁడై, వి=చక్రవాకపక్షిచేత గర్హితుఁడై యని స్వభావార్థము; అశుచిన్=మాలిన్యముచేత, కృష్ణపక్షమందు; కృశింపన్ = క్షీణింపఁగా; కృష్ణపక్షమందుఁ జంద్రుండు క్షీణుఁడగుట ప్రసిద్ధము; పంకరుహమ్ము = కమలము; తన్ముఖోపమము.—తత్ = ఆచంద్రికయొక్క, ముఖ=మోముతో, ఉపమము = పోలికకలదానను; కానని; తాన్ = కమలము; హరిపాదమంటి = నారాయణచరణము ముట్టి, సూర్యకిరణము స్పృశించి; ఇందిర=సంపద; లక్ష్మీదేవి; తనున్; చేరన్=పొందఁగా; కమలము లక్ష్మికి వాసస్థానమనుట ప్రసిద్ధము; కీర్తి=యశమును, బురదను; "కీర్తిర్యశసికర్దమే" అని విశ్వము; కని=పొంది; ఎంతయున్=మిక్కిలి; దీపితజీవనము=మంచిబ్రతుకుగలది, ప్రకాశింపఁజేయఁబడిన జలముగలది; అయ్యెన్=ఆయెను.

ఇట న్యాయమార్గము నవలంబించి సత్యమునం దున్నవాఁడు మిగుల సంపదగలవాఁడై కీర్తిమంతుఁడై మంచిజీవనము గలవాఁడగు ననియు, అన్యాయము నవలంబించి పాసలు లోనగునవి చేయువాఁడు పాపరోగములు గలిగి గర్హితుఁడై క్షయించు ననియుం వస్తుకృతవస్తు ధ్వనియగును. చంద్రుఁడు పద్మము ఈరెండును చంద్రికావదనమునకు సాటిగా వని ఫలితార్థము.

సీ. శుభకలాప్రాప్తి మిం • చుమయూరి ఘనపోష్య
కోటిలోఁ దొలుదొల్తఁ • గోమరు గాంచె
నఖిలశిరోధార్య • మైనయుదీచ్యసం
తతి స్వవాలాఖ్యాన•గతి రహించె
నతనుగుణస్ఫూర్తి • నలరుహిందోళౌఘు
మనివారితాళితా•వ్యాప్తి నెనసె
వరరసోన్నతి నొప్పు•వర్షుకాంభోదజా
తము సుమనోహిత•త్వమున వెలసె

తే. నైనభాస్వత్సహాయత • స్వాంతసీమ
నించు కంతయుఁ గోరక • మించుతమము
తరుణి కైశ్యంబుతో విరో•ధంబు గాంచి
చిత్రము మహానిశోదయ•శ్రీల మనుట. 28

టీ. శుభకలాప్రాప్తిన్=శుభపరంపరాప్రాప్తిచేత, శుభమైనపింఛముయొక్క ప్రాప్తిచేత; మించుమయూరి=అతిశయించుమయూరస్త్రీ; ఘనపోష్యకోటిలోన్.—ఘనపోష్యాభ అభి

కమగునట్లుగాఁ బోషింపఁదగినవారియొక్క, మేఘములచేతఁ బోషింపఁదగినవారియొక్క కోటిలోన్=సమూహములో; తొలుదొల్తన్=మొట్టమొదట; కొమరున్ = మనోహరతన నొంచెన్=పొందెను. అనఁగాఁ గళ్యాణపరంపరతోఁ గూడినమయూరి తరుణీకైశ్యమున ఘనపోష్య కోటిలోఁ జేరిన దని భావము, మయూరి కలాపముతోఁ గూడియుండు యు మేఘములపోష్యకోటిలోఁ జేరి యుండుటయు స్వభావము. అఖిలశిరోధార్య=అన గా నందఱకును బహుమానము చేయఁదగినది, ఎల్లరకును శిరమున ముడువఁదగినది; ఐ యుదీచ్యసంతతి=అయినట్టి కురువేరుగుంపు; స్వవాలాఖ్యానగతిన్.—స్వ=తనయొక్క, వాల శిశువనెడు, ఆఖ్యానగతిన్=అభిధానరీతిచేత, తనదు వాల మనెడు పేరు వొందుటచేత; రహి చెన్=ఒప్పెను. "వాలం హ్రీబేర బర్హిష్ఠోదీచ్యకేశాంబునామచ" అని యమరశేషము. అత గుణస్ఫూర్తిన్.—అతనుగుణ=దొడ్డగుణములయొక్క, స్ఫూర్తిన్=ప్రకాశముచేత, మరునియ త్రాడనెడు ప్రకాశముచేత; అలుహిందోళౌఘము=ప్రకాశించు తుమ్మెదలగుంపు, "హిందో ళో రాగమధుపౌ" అనియుత్పలము; అనివారితాళితావ్యాప్తిన్.=అనివారిత=నివారింపఁబడ ఆళితా=సఖిత్వముయొక్క, వ్యాప్తిన్=వ్యాప్తిని; అనివారితమైన, ఆళితా=మధుపభావముయొక్క వ్యాప్తిని; ఎనసెన్=పొందెను. భృంగపంక్తి అతనుగుణస్ఫూర్తినలరుటచేతఁ జంద్రికాకైశ్య మునకు సఖీత్వమును గాంచిన దనుట, భృంగపంక్తి మన్మథగుణస్ఫూర్తి నలరుటయు అ ళియనుపేరిచే మహిత మగుటయు ప్రసిద్ధము. వరరసోన్నతిన్=శ్రేష్ఠమగు నాసక్త్యతిశయ ముచేత, వరమైనజలాధిక్యముచేత; ఒప్పువర్షుకాంభోదజాతము=ఒప్పుచున్నట్టి వర్షించుమే ములసమూహము; సుమనోహితత్వమునన్=మిక్కిలిమనమునకుహితమగుటచేత, జాజికిహిత గుటచేత; వెలసెన్=ప్రకాశించెను. ఆమెకైశ్యమునకు భక్త్యతిశయము గలవర్షుకమేఘ కైశ్యముయొక్క మనసునకు హితమగుటచే వెలసె ననుట. వర్షుకమేఘము జలోన్నతి నొప్పుటయు, జాజికి హిత మగు యుఁడెల్లము. ఐనన్=వీనిస్థితి యెల్ల నిట్టిదైనను; భా త్సహాయత=మంచిసహాయసమూహము, సూర్యుని సాహాయ్యము; స్వాంత సీమన్=హృద ప్రదేశమందు; ఇంచుకంతయున్ = కొంచెమైనను; కోరక; మించు తమము=అతిశయిం నంధకారము; తరుణీకైశ్యంబుతోన్=చంద్రిక కేశసమూహముతోడ; విరోధంబు గాంచి=ప బూని; మహానిశోదయశ్రీలము.—మహత్ = అధికమైన, అనిశ = సార్వకాలికమై ఉదయశ్రీలము = ఉదయ లక్ష్మిగలదానను; మహత్=అధికమైన, నిశా=రాత్రియందలి, యశ్రీలము=ఆవిర్భావలక్ష్మిగలదానను, "లక్ష్మీవాక్ లక్ష్మణశ్శ్రీ)లః" అని నామలింగానుశాసనః అనుట=అని చెప్పుట; చిత్రము=ఆశ్చర్యము.

అట్లు శుభకలాపావాప్తి, అఖిలశిరోధార్యయగుట, అతను గుణస్ఫూర్తి, వరరసో తి వీనిచే నొప్పుచున్న మయూర్యుదీచ్యహిందోళ వర్షుకాబ్దములు, చంద్రికకైశ్యమునకు సగ ఘనపోష్యకోటిలోఁ జేరుటయు వాలాఖ్యానగతి దాల్చుటయు ఆళిత్వమును గాంచ యు సుమనోహితమగుటయు, సహజములైనను, మంచిసహాయ మించుకైన లేక మించున కారము తత్కైశ్యమువలె మహానిశోదయశ్రీల మనుట చిత్ర మని భావము. అంధకార సూర్యసాహాయ్యము లేనిదగుటవలన, నిశయందుమాత్ర ముదయశ్రీ గలదాన ననవచ్చునుగ

అని శోదయశ్రీయనఁగాఁ బగటియందును ఉదయశ్రీ గలదాన వనుకొనుట చిత్రమనియు తెలియవలయు. చంద్రికాకైశ్యము మయూర్యుదీచ్యభృంగసంఘవక్షకాద్భుతమముల మించియున్నదని ఫలితార్థము.

మ. అలరుంగల్వలనీటు మంచుజిగియొ•య్యారంబునుం దమ్మిమొ
గ్గలచెల్వంబును గెంపుదామరలచొ•క్కాటంపుటంజంబు ఱి
క్కలడాల్ పెంపును మించ నిచ్చెలువు రే•ఖం బొల్చునాశ్యామ ని
ర్మలర క్తిం గన రాట్సుతేక్షణచకో•రంబుల్ ముదం బూనవే. 29

టీ. ఇట్లు చంద్రికావయవములను నఖశిఖాంతము వర్ణించి యీపద్యమున వానిమొత్తము యథాసంభవముగ వర్ణితం బయ్యె. ఏలా గనిన. అలరుంగల్వలనీటు=ఒప్పుచున్నకువలయములశృంగారవిశేషము, కల్వ లనఁగా నట్లు నిశ్చయింపఁబడిన కన్నులు; మంచుజిగియొయ్యారంబునుకా=హిమదీధితియొక్క సౌందర్యగర్వము, అనఁగా నట్లు నిశ్చిత మగుమోము; తమ్మిమొగ్గలచెల్వంబును=పద్మముకుళములయందమును, అనఁగాఁ జందోయి యనుట; కెంపుదామరలచొక్కాటంపుటందంబు=రక్తోత్పలములయొక్క చొక్కమగునందము, అనఁగాఁ బైవిధముగ హస్తములని భావము; రిక్కలడాల్ పెంపును=నక్షత్రకాంత్యతిశయమును, గోరు లనుట; మించక=అతిశయింపఁగా; ఇచ్చెలువు రేఖక=పైఁజెప్పిన సౌందర్యరీతిచేత; పొల్చునాశ్యామక=ఒప్పుచున్నయా యౌవనమధ్యస్థయగు చంద్రికను, రాత్రి నని యర్థాంతరము తోఁచుచున్నది; తత్పక్షమందుఁ గల్వలనీటు మంచుజిగి లోనగువానికి శబ్దార్థమే సమన్వయించునని తెలియవలయు; నిర్మలరక్తిక=మంచియనురాగముచేత; కనక=చూడఁగా; రాట్సుతేక్షణచకోరంబుల్.— రాట్సుత=రాచకొమరులయొక్క, ఈక్షణచకోరంబుల్= దృష్టులనెడు వెన్నెలపిట్టలు; ముదంబు=సంతోషమును; ఊనవే=వహింపవా?

అనఁగాఁ గల్వలనీటు మంచుజిగియొయ్యారంబు తమ్మిమొగ్గలచెల్వంబు కెంపుదామరలయందంబు రిక్కలడాల్ పెంపు వీనితోఁబొల్చు రాత్రిని గనినంతనే చకోరములకు సంతసము గలిగినట్లు గల్వలను బోలు కన్నులును చంద్రునిబోలుమోమును తమ్మిమొగ్గలఁ బోలుచందోయియు కెంపుదామరలఁ బోలుకరములును రిక్కలను బోలుగోళ్ళును గలిగి విరాజిల్లు యౌవనమధ్యస్థ యగువామెను జూచినమాత్రనె రాకొమరులనేత్రములకు సంతసము గలుగు నని భావము.

ఇట ‹‹వాపీ కాపి స్ఫురతి గగనే తత్పరం సూక్ష్మపద్యా సోపానాళీ మధిగతవతీ కాఞ్చనీ మైన్ద్రనీలీ। అగ్రే శైలౌ సుకృతిసుగమౌ చందనచ్ఛన్నదేశౌ తత్రత్యానాం సులభ మమృతం సన్నిధానా త్సుధాంశోః॥ ఇత్యాదులయందువలె సాధ్యవసానలక్షణచేత కువలయాది శబ్దములకు నయనాదిరూపార్థము చెప్పుకొనవలయును. సాధ్యవసానలక్షణ యనఁగా లక్షణలో నొకభేదము. లక్షణ యనఁగా శబ్దవృత్తులలో నొక్కటి. వాచకము లక్షకము వ్యంజకము అని శబ్దము మూఁడువిధంబులు. అందు సాక్షాత్సంకేతితార్థము

ము జెప్పునది వాచకము, లక్ష్యార్థమును జెప్పునది లక్షకము, వ్యంగ్యార్థమును జెప్పునది వ్యంజకము. సంకేత మనఁగాఁ బదపదార్థసంబంధవిశేషము, అది యే శక్తియనఁబరగుచు రూఢి యౌగము యోగరూఢి యని త్రైవిధ్య మొందును. శాస్త్రకల్పితావయవార్థ నైరపేక్ష్యముచే విశిష్టార్థ బోధకమగు గవాదిశబ్దములందలి వ్యాపారము రూఢి యనియు, శాస్త్రకల్పితావయవార్థ మాత్ర సహకారముచే నర్థమును జెప్పు పాచకాది శబ్దగత వ్యాపారము యౌగము అనియు ద్వైవిధమైన యవయవార్థ సహకారముచేత విశిష్టార్థమును జెప్పు పంకజాది శబ్దగత వ్యాపారము యోగరూఢి యనియుఁ దెలియవలెను. ఇఁక స్వశక్య సంబంధము లక్షణనాఁబరగు, "గంగాయాంఘోషః" అనుచోట గంగాపదశక్యము ప్రవాహము, దానితో సంయోగసంబంధము ఘోషమునకు లేనందున వాక్యార్థానుపపత్తిపరిహారమునకై గంగాపదమునకు తీరమర్థమనుట కీలక్షణ యంగీకృతం బయ్యె. ఇది ప్రయోజనవతి నిరూఢ అని రెండు విధములు. కొంచెము ప్రయోజనము నుద్దేశించి యాశ్రయించునది ప్రయోజనవతి, "గంగాయాం ఘోషః" ఇత్యాది స్థలములయందు గంగా గత శైత్య పావనత్వాది ప్రతీతి ప్రయోజనము నపేక్షించి యాశ్రయింపఁ బడినందునఁ బ్రయోజనవతి, "కర్మణి కుశలః" ఇత్యాది స్థలములలోఁ గుశలాది పదములకు "కుశాన్ లునాతీతి కుశలః" ఇతి వ్యుత్పత్తి సిద్ధావయవార్థ సంబంధ నైరపేక్ష్యముగ చతురుండు బోధితుఁ డగుచున్నాఁడు గావున నిరూఢ లక్షణ యగును. ఈలక్షణ గౌణి యని శుద్ధ యని ప్రకారాంతరమున ద్వివిధ యగును. సాదృశ్య సంబంధ మూలక లక్షణ గౌణి యగును, తదితర సంబంధ మూలక యగునది శుద్ధ యగును. ఈశుద్ధ జహత్స్వార్థ యని యజహత్స్వార్థ యని రెండు విధములు. స్వార్థమును పరిహరించి కేవల లక్ష్యార్థమునె చెప్పునది జహత్స్వార్థ, "గంగాయాం ఘోషః" అనుచోట శక్యార్థమైన ప్రవాహమునకు శాబ్దబోధలో భానములేనందున నది జహత్స్వార్థ యగును. "కున్తాః ప్రవిశన్తి," ఇత్యాదిస్థలములయందు శక్యార్థమగు కుంతములకుఁ బ్రవేశక్రియయం దన్వయ ముండుటంబట్టి అజహత్స్వార్థ యైనది. ఇఁక సారోప యనియు సాధ్యవసానిక యని యు లక్షణ ప్రకారాంతరమున ద్వివిధయై యొప్పు, సారోప యనఁగా నారోపముతోఁ గూడినది, ఆరోపము ఆహార్యనిశ్చయము. "గౌర్వాహీకః, అగ్నిర్మాణవకః సింహో మాణవకః" ఇత్యాది స్థలములయందు సాదృశ్యము చేతను, "ఆయుర్ఘృతమ్" ఇత్యాదులయందుఁ గార్యకారణాది సంబంధముల చేతను వాహీకాదులయందు గోత్వాద్యారోపమున సారోపయనియు విషయిమాత్రము, నిలిచి విషయము దానిచే లక్ష్యము గాఁ దగి యున్నచోట అనఁగా, "అయంగౌః, అయమగ్నిః, అయంసింహః" ఇత్యాదిస్థలములయందు సాధ్యవసానిక యనియుఁ దెలియవలయు, ఇట్లత్యంతాభేదముగఁ జెప్పుటకు అదియే యిది యని యతిశయోక్తి ఫలము. కావుననె "విషయ స్యానుపాదానాత్ విషయ్యుపనిబధ్యతే। యత్రసా అతిశయోక్తి స్స్యాత్ కవిప్రౌఢోక్తిసమ్మతా" అని యాలంకారికులు దీని నతిశయోక్త్యలంకారభేదముగా గణించినారు. ఇఁక వ్యంజనాదిభేదములు అధికముగా నుండుటచే విస్తరభీతిని విరమించితి.

శా. ఆహా మేక్షణవిభ్రమస్ఫురణమా ♦ యాతన్వియొయ్యారమా
యావామామణిచారుదీప్తిచయమా ♦ యాకొమ్మసౌందర్యమా

యావక్రాలకసత్కళావిభవమా ♦ యాలేమబిబ్బోకమా
భావంబందు నుతింపనల్వ వశమా ♦ పద్మాప్తవంశోత్తమా. 30

టీ. పద్మాప్తవంశోత్తమా=సూర్యవంశము రాజులలో నుత్తముఁడవగుచుచంద్రుఁడా! ఆహా మేక్షణవిభ్రమస్ఫురణమా=ఆచంద్రికయొక్క విలాసస్ఫురణమా! "విభ్రమ స్త్వరయా కాలే భూషాస్థానవిపర్యయః" ఇత్యుక్తలక్షణవిభ్రమము ఇచట సంభవింపమివలన విభ్రమశబ్దమునకు విలాసార్థము గ్రహించిన మే లని తలంచెద. ఇట్లు "ఇష్టేప్యనాదరో మానా ద్గర్వా ద్బిబ్బోక ఈరితః" అను లక్షణముచే లక్షితమైన బిబ్బోకము మాత్రము గాక ముందు బిబ్బోకపదము శృంగార చేష్టాసామాన్య పరముగానే చెప్పఁ గొనవలయు నని తోఁచుచున్నది. అతన్వీయొయ్యారమా= ఆచంద్రిక సౌందర్యగర్వమా! అహామామణి ,దాఁడీప్తిదయమా=స్త్రీరత్న మగు నాచంద్రికా సంబంధియగు మనోజ్ఞకాంతిపుంజమా! "కాంతి రేవ వయోభేద దేశకాలగుణాదిభిః। ఉద్దీపితా తివిస్తారం యాతా చే ద్దీప్తి రుచ్యతే॥" అని దీప్తిలక్షణము. కాంతి లక్షణము వెనుక వ్రాయఁబడియె. ఆ కొమ్మ సౌందర్యమా=ఆకొమ్మ సంబంధి యగు సౌందర్యమా! అవక్రాలక సత్కళా విభవమా = కుటిలాలక యగు నాచంద్రికయొక్క శ్రేష్ఠ విద్యా విభవంబా? ఆలేమ బిబ్బోకమా=ఆచిన్నదానియొక్క శృంగారచేష్టయా! భావంబందుఁ=మనసునందైనను; నుతింపన్ = కొనియాడుటకు; నల్వవశమా= బ్రహ్మతరమా?

అనఁగా బ్రహ్మకైన సాకల్యముగ నామె గుణగణము తెలిసి మనసునందైనఁ గొనియాడ వశముగాదని తాత్పర్యము. లోకోత్తర సౌందర్యవతి యని ధ్వని.

చ. అలఘుమనోభవప్రోదయక ♦ రాంగయుతిం దగునామిళిందకుం
తల నలమీననేత్ర నల ♦ తామరసానన నాపికారవో
జ్జ్వలవరమంజులాబ్జగళ ♦ సంగత నాబిసబాహ నాప్రవా
ళలలితపాద నాచెలిఁ ద ♦ లంపఁగ నీకె తగు న్నృపాలకా. 31

టీ. నృపాలకా=సుచంద్రుఁడా! అలఘుమనోభవోదయకరాంగయుతిన్.—అలఘు= అధికమగునట్లు,మనోభవోదయకర=కామోదయకరమగు,అంగ=అవయవములతోడి,యుతిన్ =కూడికచేత; తగు=ఒప్పునట్టి; ఆమిళిందకుంతలన్=ఆతుమ్మెదలఁబోలుముంగురులు గల యామెను; అలమీననేత్రన్=అమీలఁబోలు కన్నులుగల యామెను; అల తామరసాననన్=ఆ తమ్మినిబోలు మోముగల యామెను; ఆపికారవోజ్జ్వలవరమంజులాబ్జగళసంగతన్.—ఆపికారవోజ్జ్వల=ఆకోయిలపలుకులఁబోలు పలుకులచేఁ బ్రకాశించునదియు, వరమంజులాబ్జగళసంగతన్=శ్రేష్ఠమగు శంఖమును బోలువదియునగు,కంఠముతోఁ గూడినయామెను;ఆబిసబాహన్ =ఆతామరతూండ్లనుబోలు బాహువులు గలయామెను; ఆప్రవాళ లలిత పాదన్=ఆచిగురుటాకులవలె మనోజ్ఞములగు పాదములు గలయామెను; ఆచెలిన్=ఆస్త్రీని ; తలంపఁగన్=స్మరింపఁగా; నీకెతగున్=నీకేయుక్తము.

ఇటఁ జెప్పిన మిళిందములు మీనములు తమ్ములు పికములు శంఖములు తామరతూడులు చిగురుటాకులు ఇవి యెల్ల స్మర సామగ్రులనంబరఁగి యుద్దీపన విభావములుగాఁ జెప్పఁ బడినవి కావున వానిని బోలునవయవములు గలిగిన చంద్రిక మనోభవో దయకరాంగి యు తిచేతఁ దగు నని భావము.

ఉద్దీపన విభావము లనఁగావిభావవిశేషములు, విభావమనునదిరసోత్పాదనకారణంబు. ఇట రస శబ్దము రసస్థాయి యగు రతి హాస క్రోధాదుల పరము గాని యద్వితీయానందాత్మక మయిన రసము పరము గాదు.అట్లయిన బ్రహ్మానందరూపమయి నిత్యమగు దాని కుత్పత్తి లయ ములు చెప్పవలసివచ్చును. కారణ మనఁగాఁ గార్య నియతి పూర్వవృత్తి. ఇట్లా యుత్పాదన కారణంబు రెండు విధములు,ఆలంబనము,ఉద్దీపనముఅని,రత్యాదుల కెద్ది యాలంబనమో అనఁ గా విషయమో యది యాలంబన విభావము.ఎట్లన, దుష్యంతుని రతికి శకుంతల యాలంబనము గనుక నాతని రతి కామె యాలంబన విభావము. ఇట్లామె రతి కాతడు యాలంబన విభా వమగును. రత్యాదులఁ బోషించునవి యుద్దీపన విభావములు. మలయానిల చంద్రోదయా దులు రతిని బోషించునవి గాన నుద్దీపన విభావంబులనం బరఁగు. ఇది యెల్లను, "విభావః కథ్యతే తత్ర రసోత్పాదన కారణమ్। ఆలమ్బనోద్దీపనాత్మా సద్వేధా పరికీర్తితః। ఆలమ్బ నన్నాయికా స్యాదాదిక్షిణాద్యాశ్చ నాయకాః। ఆలమ్బన గుణ శ్చైవ తచ్చేష్టా తదలం కృతిః। తటస్థ శ్చేతి విజ్ఞేయ శ్చతుర్ధోద్దీపనక్రమః। ఆలమ్బన గుణో రూప యౌవనాది రుదాహృతః। తచ్చేష్టా యౌవనోద్భూత హావభావాదికా మతా। నూపురాఙ్గద హారాది తద లంకరణ మ్మతమ్। మలయానిల చంద్రాద్యా స్తటస్థాః పరికీర్తితాః॥-ఇత్యాది శాస్త్రప్రమాణ ముల వలనఁదెలియఁదగు. లోకమునఁ గారణములని కార్యములని సహకారులని చెప్పఁ బడు నవి యె కావ్యనాట్యములయందు విభావాది శబ్దములతో వ్యవహరింపఁ బడు. "కారణా న్యథ కార్యాణి సహకారీణి యాని హి।రత్యాదేః స్థాయినో లోకే తాని చే న్నాట్యకావ్య యోః। విభావా అనుభావాశ్చ కథ్యన్తే వ్యభిచారిణః" అను కావ్యప్రకాశము వలన నీవిషయము వ్యక్తం బగును.

చ. సరసతరోక్తి నమ్ముని సు•చంద్రసమాఖ్య రహించుభూపతిం
బరిణయ మందు మంచు నకిఁ • బల్కెఁ దదాఖ్య రహించుమేదినీ
శ్వర మణి వీవె కాన నల•సారసలోచన ని న్వరించు న
ప్పరమతురీతువా క్యతి· యు•పార్థతఁ గ్గై కొనునే మహీస్థలిన్. 32

టీ. అమ్మునిఁ=పూర్వమందు ద్వితీయాశ్వాసమునఁ జెప్పఁబడిన వసంతుం డను ముని; సరసతరోక్తిన్=మిక్కిలి రసవంతమైన వాక్కుచేత; సుచంద్ర సమాఖ్య రహించు భూప తిన్.—సుచంద్రసమాఖ్యన్ = సుచంద్రుఁడను పేరిచేత; రహించుభూపతిన్ = ఒప్పుచున్న రాజును ; పరిణయ మందుము = వివాహ మాడుము. అంచున్ = ఇటనుచు ; సకిన్ = చిత్రరేఖను గూర్చి; పలికెన్ = వచించెను. తదాఖ్యన్ = సుచంద్రుఁడను నాఖ్యచేత; రహించు మేదినీశ్వర మణివి = ఒప్పునట్టిరాజశ్రేష్ఠుండవు; ఈవె = నీవె; కానన్ = అహో

తువుపలన; అల సారసలోచన=పద్మనయన యగు నాచంద్రిక; నిన్=నిను; వరించున్=కోరును. మహీస్థలిన్=భూతలమందు; అప్పరమ యతీశు నాక్తతి = ఆమునిశ్రేష్ఠుని వాక్యసమూహము; అపార్థతన్=అయథార్థతను; కైకొనునె=పొందునా? పొందదనుట.

దానంజేసి నీ వవశ్యముగాఁ దత్పరిణయమునకై యత్నింప వలయు నీప్రయత్నము సఫలమగు నని భావము.

మ. అని యిట్లాత్మ కథాప్రవృత్తి కలవాహాస్యుం డుపోద్ఘాతవ
ర్తన రాజిల్ల వినిర్మలోక్తిచయధారం జంద్రికాసుందరీ
జననైకక్రమ మంతయుం దెలుప నిష్ఖండైకతానాత్మచే
విని యాశ్చర్యసమగ్రతం బెనిచెఁ బృథ్వీభర్త చిత్తంబునన్. 33

టీ. అని ఇట్లు; అలవాహాస్యుండు=కుముదుండను పేరుగల యాకిన్నరుఁడు; ఆత్మ కథాప్రవృత్తికిన్.—ఆత్మ=తనయొక్క, కథా ప్రవృత్తికిన్=కథయొక్క ప్రసక్తికి; ఉపోద్ఘాత వర్తన=ఉపోద్ఘాత స్థితి; రాజిల్లన్=ప్రకాశించు నట్లు; వినిర్మలోక్తి చయ ధారన్=మిక్కిలి నిర్మలమగు వాగ్ధారచేత; చంద్రికా సుందరీ జననైక క్రమము=చంద్రికయొక్క యుత్పత్తియొక్క ముఖ్యక్రమమును; అంతయున్=సర్వంబును; తెలుపన్; నిష్ఖండైకతానాత్మచేన్.—నిష్ఖండ=అఖండమగు, ఏకతాన=ఏకాగ్రతగల, ఆత్మచేన్=చిత్తముచేత; విని=ఆకర్ణించి; చిత్తంబునన్=మనస్సునందు; ఆశ్చర్యసమగ్రతన్ = ఆశ్చర్యపరిపూర్తిని; పెనిచెన్=వృద్ధిఁ బొందించెను.

అనఁగా లోకోత్తర సౌందర్య శాలిని యగు చంద్రికయొక్క గుణ గణములు వినఁగా నత్యాశ్చర్యము దోఁచినదని భావము.

శా. పాంచాలీవరవిభ్రమశ్రవణసంపద్రేఖనో మాన్మథా
భ్యంచచ్ఛాంబరికా సమున్నతినొ పూర్వాదృష్టసంభూతినో
మించెం దన్మహిపాలహృత్పదవి నిర్మేయస్థితిం బూనుత
త్పంచాస్యోపమమధ్యమాకులమణీభవ్యానురాగాళికల్. 34

టీ. తన్మహిపాల హృత్పదవిన్ = ఆసుచంద్రునియొక్క మనోమార్గమందు; పాంచాలీ వర విభ్రమ శ్రవణ సంపద్రేఖనో.—పాంచాలీ = చంద్రికయొక్క, వర = శ్రేష్ఠమగు, విభ్రమ=విలాసములయొక్క, శ్రవణ=వినికియొక్క, సంపద్రేఖనో=సంపత్పరంపర చేతనో; మాన్మథాభ్యంచ చ్ఛాంబరికా సమున్నతినో.—మాన్మథ=మన్మథ సంబంధిని యగు, అభ్యంచత్=ఒప్పుచున్న, శాంబరికా = మాయయొక్క, సమున్నతినో=అతిశయమువనో; పూర్వాదృష్ట సంభూతినో=జన్మాంతరీయాదృష్టసంపత్తి చేతనో; నిర్మేయ స్థితిన్=అమేయవృత్తిని; పూను తత్పంచాస్యోపమ మధ్యమా కులమణీ భవ్యానురాగాళికల్.—పూను = వహించునట్టి, తత్పంచాస్యోపమ మధ్యమా కులమణీ = సింహముయొక్క మధ్యమును బోలు మధ్యము గల

స్త్రీలయందు శ్రేష్ఠ యగు చంద్రిక యందలి, భవ్యానురాగాళికల్=శుభోదర్కంబు లగునను రాగముల గుంపులు ; మించెన్=అతిశయించెను.

అనఁగా సుచంద్రునకుఁ జంద్రికావిషయమై యనురాగోదయమైన దని తాత్పర్యము. "యత్ప్రేమ సంగమాత్పూర్వం దర్శన శ్రవణోద్భవమ్। పూర్వానురాగ స్స జ్ఞేయ శ్శ్రవణం తద్గుణశ్రుతిః।ప్రత్యక్ష చిత్ర స్వప్నాదౌ దర్శనం దర్శన మ్మతమ్" అనుట వలన దర్శనంబునం బోలె గుణశ్రవణంబునను రాగోదయమగు.ఇట్లు హంసముఖమున నలగుణశ్రవణమువలన దమయంతి కనురాగోదయము చెప్పఁబడినది.

ఇట ననురాగ మనఁగా "అంకుర పల్లవ కలికా ప్రసూన ఫల భోగ భాగియం క్రమశః। ప్రేమామానః ప్రణయ స్స్నేహో రాగో నురాగశ్చ" అని చెప్పఁబడిన రతియొక్క షష్ఠావస్థా రూపము గాదు మఱియేమన్న రతిమాత్రమో లేక రతిప్రథమావస్థ యగు ప్రేమమో గ్రహింపవలయు. ఇది సంగమ పూర్వకాలమందు సుఘటము. "యత్ప్రేమ సంగమాత్పూర్వ" మనునదియు నీపక్షమున నుపపాదము. ఇత్యాది "నిసర్గేణాభియోగేన సంసర్గేణాభిమానతః। ఉపమాధ్యాత్మ విషయైః" అనుటవలన నిసర్గమునను గలుగును. ఇట్లు "అలం వివాదేన యథా శ్రుతం త్వయా తథావిధ స్తావ దశేషమస్తు నః। మమాత్ర భావైకరసం స్థితం మనో న కామవృత్తి ర్వచనీయ మీక్షతే" అను కుమారసంభవమందు రూపాది దృష్టకారణ నిరపేక్షమై జన్మాంతరవాసనారూపమైన రతి శివునియందుఁ బార్వతికి నిసర్గముగఁ జెప్పఁబడినది.

మన్మథ మాయ శాస్త్రోక్త రతిజనక సామగ్రిలో స్వతంత్ర కారణముగాఁ జూపట్టదు. కాని కార్యమాత్రమును గూర్చి దైవాదృష్టాదులకుఁ గారణత చెప్పఁకొన్నట్లు రతిమాత్రమును గూర్చి మన్మథునకుఁ గారణత కవిసమయ సిద్ధముగాఁ జెప్పఁకొన వలయు. సాహిత్య దర్పణమందు "మౌర్వీ రోలమ్బ మాలా ధను రథ విశిఖాః కౌసుమాః పుష్పకేతో ర్భిన్నం స్యా దస్య బాణై ర్యువజన హృదయం స్త్రీకటాక్షేణ తద్వత్। ఇత్యాద్యన్యేయ మన్య త్కవిసమయ గతం సత్కవీనాం ప్రబన్ధే" అని యిది కవిసమయ మని చెప్పఁ బడినది. ఇట్లు "అపి యది విశిఖా శ్శరాసనం వా కుసుమ మయం ససురాసురం తథాపి। మమ జగదఖిలం వరోరు నాజ్ఞా మిద మతిలఙ్ఘ్య ధృతి మ్ముహూర్త మేతి" ఇత్యాదిగాఁ ప్రబోధచంద్రోదయకుమారసంభవాది సత్కవి ప్రబంధములవలన నూహింప వలయు.

ప్రస్తుత పద్యమునఁ జంద్రికా గుణశ్రుతి మన్మథమాయా జన్మాంతర వాసనాత్మకములగు త్రివిధ కారణములలో దేని చేతనో సుచంద్రునకుఁ జంద్రికయందుఁ బ్రేమోదయము యినదని వచించుటవలన, సుచంద్రునియందుఁ బై కారణత్రయమునకును సంభవము కలదని కవియాశయము సూచిత మవుచున్నది.

ఇటఁ బూర్వానురాగ రూపమగు విప్రలంభ శృంగారము వ్యక్తంబు. "స విప్రలమ్భో విజ్ఞేయ స్స చతుర్ధా నిగద్యతే। పూర్వానురాగ మానౌ చ ప్రవాస కరుణావితి" అని సింగభూపీయమునఁ దత్ప్రమాణంబు.

విప్రలంభము శృంగారములో నొక భేదము, శృంగార మొక రసము, రసము, శ్లో "విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః। ఆనీయమాన స్స్వాదుత్వం స్థాయీ భావో రస స్స్మృతః" అనుటచే విభావానుభావ సాత్త్వికభావ వ్యభిచారిభావములచే నిర్భరానందరూపత నొందింపఁబడిన స్థాయి భావంబే, స్థాయిభావ మనఁగా "సజాతీయ విజాతీయై రతిరస్కృత మూర్తిమాన్, యావద్రసం వర్తమాన స్స్థాయీ లవణాకరః" అనుటచే సజాతీయ భావములచేతఁ గాని విజాతీయ భావములచేతఁ గాని తిరోధానము నొందక లవణాకరము దనలోఁ జేరిన మంచినీటిని క్షారరూపము నొందించునట్లు తనలోఁ జేఱు భావముల నన్నింటిని తనరూపము నొందించు భావము. అది రతి హాసము శోకము క్రోధము ఉత్సాహము భయము జుగుప్స విస్మయము శమము అని నవ విధము. "రతి ర్హాసశ్చ శోకశ్చ క్రోధోత్సాహౌ భయంతథా। జుగుప్సా విస్మయశమాః స్థాయిభావా నవ క్రమాత్" అని తత్ప్రమాణంబు. ఇఁక విభావమనఁగా రసోత్పాదన కారణము, అయ్యది ఆలంబనము ఉద్దీపనమని రెండువిధములు. అందు శృంగారమునకు ఆలంబనము నాయికానాయకులు. ఉద్దీపనము, ఆలంబనగుణము తచ్చేష్ట తదలంకృతి తటస్థ మని నాలుగు విధములు గలది. ఏతత్ప్రమాణ వచనములు "అలఘు మనోభవో దయకరాంగ యుతిన్" అను పద్యంపు టీకలో వ్రాయంబడిరి. అనుభావము లనఁగా నాయికానాయకుల హృద్గతములయిన రత్యాదులను దెల్పు భ్రూవిక్షేప కటాక్షాదికములు, "భావ మ్మనోగతం సాక్షా త్స్వహేతుం వ్యఞ్జయన్తి యే, తే నుభావా ఇతి ప్రోక్తా భ్రూవిక్షేప స్మితాదయః" అని తత్ప్రమాణము. ఇఁక సాత్త్వికములు శారీరభావములు, భావము లనఁగా రసానుకూల వికారాత్మకము లనియు కేవల మనోవికార రూపములనియు మతభేదముచేఁ జెప్పఁబడిన వికార విశేషములు, అవి శారీరములనియు మానసములనియు విభజింపఁబడినవి. అందు శారీరములు సాత్త్వికము లనియు, మానసములు వ్యభిచారు లనియు నెన్నంబడుచున్నవి. సాత్త్వికములు, స్తంభము ప్రళయము రోమాంచము స్వేదము వైవర్ణ్యము కంపము అశ్రువు వైస్వర్యము అని యెనిమిది. "స్తమ్భ ప్రళయ రోమాఞ్చాః స్వేదో వైవర్ణ్య వేపథూ। అశ్రు వైస్వర్య మిత్యష్టౌ సాత్త్వికాః పరికీర్తితాః" అని తత్ప్రమాణము. వ్యభిచారి భావములనఁగా విశేషముగ రసాభిముఖములై సర్వరసములయందుఁ జరించుచుండు భావములు. వ్యభీ ఇత్యుపసర్గా ద్వా విశేషాభిముఖత్వయోః। విశేషా దాభిముఖ్యేన చరన్తో వ్యభిచారిణః॥ అని చెప్పఁబడినవి. అవి ముప్పదిమూఁడు. "శ్లో నిర్వేద గ్లాని శఙ్కాఖ్యా స్తథా సూయా మద శ్రమాః। ఆలస్యం చైవ దైన్యం చ చిన్తామోహః స్మృతి ర్ధృతిః॥ వ్రీడా చపలతా హర్ష ఆవేగో జడతా తథా। గర్వో విషాద ఔత్సుక్య న్నిద్రా పస్మార ఏవచ। సుప్తం ప్రబోధో మర్షశ్చా ప్యవహిత్థ ముగ్రతా। మతి ర్వ్యాధి స్తథోన్మాద స్తథా మరణ మేవచ। త్రాస శ్చైవ వితర్కశ్చ విజ్ఞేయా వ్యభిచారిణః। త్రయస్త్రింశ దమీ భావా స్సమాఖ్యాతా స్తు నామతః" అను భరత వచన నిచయము తత్ప్రమాణము. ఇట్టి విభావాది కారణ సామగ్రిచే నిర్భరానంద రూపత నొందింపఁ బడిన స్థాయి యే రసమయి శృంగారము హాస్యము కరుణము రౌద్రము వీరము భయానకము బీభత్సము అద్భుతము శాంతము అని నవవిధ మైనది. అందు శృంగారము సంభోగమనియు విప్రలంభమనియు

రెండుతెగలై యున్నది. సంభోగ శృంగార మనఁగా సంయోగ కాలావచ్ఛిన్న రతియు. సంయోగము బహిరింద్రియ సంబంధ రూప మనియు ముదిత పంచేంద్రియ సంబంధాభావ రూప విప్రలంభ భిన్నస్వరూప మనియు సంయుక్తుండను ఇత్యాకారక మతిరూప మనియు నిర్ణీతమైనది. అది పరస్పరావలోక నాలింగనచుంబనాది నానా రూపమై సంక్షిప్తము సంకీర్ణము సంపన్నము సమృద్ధ మని నాలుగు భేదములు గలదిగాఁ జెప్పిరి, "దర్శన స్పర్శనాదీనా మానుకూల్య నిషేవణమ్। ఘటతే యత్ర యూనోస్స సంభోగో యం చతుర్విధః। సంక్షిప్త స్సంకీర్ణ స్సంపన్నతర స్సమృద్ధిమా నితి తే। పూర్వానురాగ మాన ప్రవాస కరుణా నుసంభవాః క్రమశః" అని తత్ప్రమాణము. ఇఁక విప్రలంభము వియోగకాలావచ్ఛిన్న రతి,వియోగము దంపతులకు వైయధికరణ్య రూపము గాదు, ఏక శయ్యాయందును నీర్ష్యాది సద్భావమందు విప్రలంభమును గవులు వర్ణించుటనుబట్టి,వైవిధమున ముదిత పంచేంద్రియ సంబంధాభావ రూపము,వియుక్తుండనైతి ఇత్యాకారకబుద్ధిరూపము గాని యగును,అది పూర్వానురాగ మాన విరహ ప్రవాస శాప భేదమునఁ బంచవిధమని కావ్యప్రకాశ కారాదిమతము, పూర్వానురాగ మనఁగా తరుణీతరుణులకు సంగమపూర్వకాలమందు దర్శనశ్రవణాదులచేఁ గలుగు నితరేతర ప్రేమంబె."యత్ప్రేమ సంగమాత్పూర్వం దర్శన శ్రవణోద్భవమ్। అసౌ పూర్వానురాగాఖ్యో విప్రలమ్భ ఇతీరితః" అని పూర్వము వ్రాసిన ప్రమాణముఁ జూడవలయు.

తే. కలితమానసకైరవం • బలరఁ జంద్రి
కావిలాసంబు వినిన భూ • కాంతమౌళి
కపుడు నేత్రచకోరంబు • లమితమోద
మొదవఁ దిలకింప లాలసం • బుదితమయ్యె. 35

టీ. కలిత మానస కైరవంబు=ఒప్పుచున్న మనస్సనెడు కలువ; అలరన్=సంతసించునట్లు; చంద్రికా విలాసంబు=చంద్రికయొక్క విలాసమును, వెన్నెలయొక్క విలాసముననియర్థాంతరము; వినిన భూకాంతమౌళికిన్=ఆకర్ణించిన రాజశేఖరునకు; నేత్ర చకోరంబులు=కన్నులనెడు వెన్నెల పులుఁగులు; అమితి మోదము=అధికమగు నానందము; ఒదవన్=పొందునట్లు; తిలకింపన్=చంద్రికను వీక్షించుటకు; లాలసంబు=ఆసక్త్యతిశయము; "లాలసో లాలసాపిస్యా ద్యాచ్ఞాతృష్ణాతిరేకయోః। ఔత్సుక్యేచ" అని విశ్వము; ఉదితమయ్యెన్=ఆవిర్భవించెను. వెన్నెలకుఁ గుముదములు ముద మందుటయు, చకోరములు ప్రీతిఁ గాంచుటయు ప్రసిద్ధము.

అనఁగా మానస మలర నామెవిలాసము విన్న నృపతికి నేత్రోత్సవ మగునట్లుగా నామెనుజూడ వాంఛ గలిగె ననిభావము.

ఇందు చక్షుఃప్రీతి యను ననంగదశ వచింపఁబడినది. ఆదశలు "చక్షుఃప్రీతి ర్మనస్సఙ్గ స్సంకల్పో థ ప్రజాగరః। అరతి స్సంజ్వరః కార్శ్యం లజ్జాత్యాగో భ్రమో మృతిః। దశావస్థా భవన్త్యేతే విప్రలమ్భే భిలాషజే" అని చెప్పఁబడినది. చక్షుఃప్రీతి యనఁగాఁ ద

దేకాలోకనరతి. ఈయనంగ దశలంగూర్చి "అభిలాష చింతనా నుస్మృతి గుణసంకీర్తనో ద్వేగాః" అనియు, "చక్షుఃప్రీతిః ప్రథమం చిన్తాసఙ్గ స్తతోథ సంకల్పః। నిద్రాచ్ఛేద స్తనుతా విషయనివృత్తి స్త్రపానాశః" అనియు నానాప్రకార నామక్రమ భేదములు గ్రంథములయందుఁ జూపట్టుచున్నవి. తన్నిరూపణంబు విస్తరభీతిచే నుపేక్షితంబయ్యె. మాచ్రాసిన కావ్యాలంకార సంగ్రహ విమర్శమునఁ దెలియు.

క. ఈకరణి మదిం దద్రజ, నీ కరముఖిఁ గాంచువాంఛ • నిక్కంగ ధరణీ
లోకరమా సుతుఁడు మధు, శ్రీకరవాక్పటిమ యతి • శేఖరుఁ బలికెన్. 36

టీ. ధరణీలోక రమా సుతుఁడు=భూలోక మన్మథుండగు నానుచంద్రుఁడు; ఈకరణిన్=ఈరీతిగ; మదిన్=చిత్తమందు; తద్రజనీకర ముఖిన్=ఆచంద్ర ముఖి యగు చంద్రికను; కాంచువాంఛ=చూడవలెననునిచ్ఛ; నిక్కన్=అతిశయింపఁగా; యతిశేఖరున్=కుముదుని గూర్చి; మధు శ్రీకరవాక్పటిమన్=మకరంద సంపదవంటిసంపదనుజేయునట్టి వాక్పౌఢిచేత, మధురవచనముచేతనమట; పలికెన్=వచించెను.

ఉ. ధీరవరేణ్య నీ విపుడు • దెల్పిననిర్మలచంద్రికోదయో
దారసుధారసంబు మది • కప్రమితప్రమదంబు నించి యెం
తే రచియించె నవ్వనజ• నేత్రఁ గనుంగొన నూత్నలాలసా
పూరము గానఁ జానఁ గనఁ • బోవుద మాస్పద మావహిల్లఁగన్. 37

టీ. ధీరవరేణ్య=పండితోత్తముఁడ వగు శ్రీకుముదుఁడా! నీవు; ఇపుడు; తెల్పిన నిర్మలచంద్రికోదయోదార సుధారసంబు.—తెల్పిన=బోధించినట్టి, నిర్మల=స్వచ్ఛమగు, చంద్రికా=చంద్రికయొక్క, ఉదయ=ఆవిర్భావమనెడు, ఉదార=అధికమగు, సుధారసంబు=అమృతరసము; అనఁగా వెన్నెలయొక్క యావిర్భావ మమృత మయమయి సుఖకరమయినట్లు చంద్రికోదయ క్రమము సుఖకరమైనదనుట; మదికిన్=మనస్సునకు; అప్రమిత ప్రమదంబు=అమితమైన సంతసమును; నించి=పూరించి; అవ్వనజనేత్రన్=ఆచంద్రికను; కనుంగొనన్=చూచుటకు; నూత్న లాలసాపూరము.—నూత్న=అపూర్వమగు, లాలసా=ఉత్కటవాంఛయొక్క, పూరము=ప్రవాహమును; ఎంతేన్=మిక్కిలి; రచియించెన్=ఒనర్చెను. కానన్=ఆహేతువువలన; ఆస్పదము ఆవహిల్లఁగన్=పనిఘటిల్లునట్లు; చానన్=ఆనుంధరిని; కనన్=చూచుటకు; పోవుదము=చనుదము.

చ. అనఁ గుముదుండు వల్కు వసు•ధాధిప నీకుభరూపరేఖికల్
గనుఁగొనుమాత్ర నామహిప•కన్య యెద న్నినుఁ జేర్చి దా వరిం
చు నిది నిజంబు కంజముఖిఁ • జూడఁగ రమ్ము మదభ్రయాన విూ
వనువుగ నెక్కి యంచు నతఁ • డయ్యెడ దానిఁ దలంచెనంతలోన్. 38

టీ. అవల=సుచంద్రుఁ డిట్లు వచింపఁగా; కుముదుండు=కుముదుఁ డను యక్షుఁడు; పల్కెన్. వసుధాధిప=సుచంద్రుఁడా! నీ శుభ రూప రేఖికల్=నీ మంగళ కరములగురూపము ను రేఖలను, అనఁగా సాముద్రికోక్తములగు పద్మాది రేఖలననుట; రూపమునకు "అఙ్గాన్యభూషితా న్యేవ ప్రక్షేప్యాద్యై ర్విభూషణైః। యేన భూషితవ ద్భాన్తి తద్రూప మితి కథ్యతే॥" అని లక్షణంబు; కనుఁ గొనుమాత్రన్=చూచినమాత్రముననే; అమహీపకన్య=అ రాజకుమారి; ఎదన్=హృదయమందు; నిసుల్; చేర్చి=ఉంచి; తాన్=తానే, వరించున్=కోరును. ఇది నిజంబు=ఈమాట నిక్కము. మదభ్రయానము=నావిమానమును; "వ్యోమయానంవిమానోస్త్రీ" అని అమరుఁడు; అనువుగన్=అనుకూలముగ; ఎక్కి; కంజముఖిన్=పద్మముఖి యగు చంద్రికను; చూడఁగన్=చూచుటకు; రమ్ము. అంచున్=ఇట్లనుచు; అతండు=ఆకుముదుఁడు; దానిన్=ఆ విమానమును; తలంచెన్=స్మరించెను. అంతలోన్ = స్మరించినంతలో. దీనికి నిల్చెనను నుత్తరపద్యస్థ క్రియతో నన్వయము.

చ. బలు వగువిస్మయంబున నృ•పాలుఁడు గన్గొనఁ జెంత నిల్చె ని
ర్మలధనరాజపుష్పకస•మానము సద్వలభీతసుప్రభా
గిళితదినేశమానము వి•కీలితచారుమణీవితానకో
జ్జ్వలరుచిరోచమాన మల•హాహా ముఖేంద్రవిమాన మయ్యెడన్. 39

టీ. అయ్యెడన్=ఆసమయమందు; నిర్మల ధనరాజ పుష్పక సమానము=ప్రశస్తమైన కుబేర పుష్పకముతోడ సదృశమయినట్టియు; సద్వలభీత సుప్రభా గిళిత దినేశ మానము.—సత్=శ్రేష్ఠములయిన, వలభి=చూరుపట్టెలను, ఇత=పొందినట్టి, సుప్రభా=మంచికాంతి చేత, గిళిత=మ్రింగఁబడిన, దినేశమానము=సూర్యుని యహంకారముగల యట్టియు; వికీలిత చారుమణీవితానకోజ్జ్వలరుచి రోచమానము.—వికీలిత=కట్టఁబడిన, చారుమణీవితానక=రమ్యమగుమణిసమూహము చేత, ఉజ్జ్వల=ప్రకాశించుచున్న, రుచి=కాంతి చేత, రోచమానము=ప్రకాశమానమయినట్టి; అల హాహాముఖేంద్ర విమానము=ఆయక్షేశ్వరునివ్యోమయానము; నృపాలుఁడు = సుచంద్రుఁడు; బలువగు విస్మయంబునన్=అధికాశ్చర్యముతోడ; కన్గొనన్=చూడఁగా; చెంతన్=సమీపమున; నిల్చెన్.

చ. నిలిచినయవ్విమాన మవ•నీపతిచంద్రుఁడు మిత్త్రయుక్తుఁడై
యలధనదాభ్రయానము ధ•రాత్మభవాపతి వోలె నెక్కి ని
స్తులరయసంగతిం జనియెఁ • దోడ్తఁ దదర్వముఖాన్వయాధిరా
ట్కలితమహాత్మభావగతిఁ • గన్పడకుండఁ బరాళి కత్తఱిన్. 40

టీ. అవనీపతి చంద్రుఁడు=అరాజ చంద్రుఁడు; మిత్త్రయుక్తుఁడై=చెలికానితోఁ గూడిన వాఁడయి; నిలిచిన యవ్విమానము=ఎదుట నున్న యావిమానమును; అలధనదాభ్రయానము=అకుబేరుని పుష్పకమును; ధరాత్మభవాపతి వోలెన్=శ్రీరాముఁడువోలె; ఎక్కి=

అధిష్ఠించి; నిస్తులరయ సంగతిన్=సాటి లేనివేగముచేత; తదర్య ముఖాన్వయాధిరాట్కలిత మహాత్మ్యభావగతిన్.—తదర్యముఖాన్వయాధిరాట్=ఆకుముదునిచేత, కలిత=చేయఁబడిన, మహాత్మ్యభావ=మాహాత్మ్యముయొక్క, గతిన్=ప్రాప్తిచేత; పరాళికిన్=ఇతర జన సమూహమునకు; అత్తతిన్ = ఆసమయమున; కన్పడకుండన్ = అగపడనట్లు; తోడ్తన్ = వెంటనే; చనియెన్=పోయెను.

అనఁగా శ్రీరాముఁడు రావణ వధానంతరమున సుగ్రీవాది మిత్త్రియుక్తుఁడై కుబేర పుష్పకము నెక్కినట్లు సుచంద్రుఁడు మిత్త్రియుక్తుఁడై కుముద విమానము నెక్కి యాకుముదునిప్రభావముచే నితరులకుఁ గనఁబడనివాఁడై చనియె ననిభావము.

మ. వనితాదర్శనదోహదాతిశయధావ త్స్వాంతరంగాగ్రవ
ర్తనకన్నన్మనుమున్న యేగుమయుసత్ప్రామాద్వోమయానంబునన్
జననాథేంద్రుఁడు వేడ్కతోఁ జనియె వీక్షాలక్ష్యతం బూన దా
వనికాయంబులు పట్టణంబులు నదీవారంబు లందంబుగన్. 41

టీ. జననాథేంద్రుఁడు=సుచంద్రుఁడు; వనితా దర్శన దోహదాతిశయధావ త్స్వాంతరంగాగ్ర వర్తనకన్నన్.—వనితాదర్శన=చంద్రికాదర్శనమందలి, దోహదా తిశయ=ఆసక్త్యతిశయముచేత, ధావత్=పరుగెత్తుచున్న, స్వాంతరంగ=తన మనస్సుయొక్క, అగ్ర వర్తనకన్నన్=ముందునికికన్నను; మునుమున్న=ముందుముందుగనే; ఏగుమయు సత్ప్రామాద్వోమయానంబునన్=పోవునట్టి కుముదుని విమానము వలన; దావ నికాయంబులు=అడవులగుంపులు; పట్టణంబులు=నగరములు; నదీవారంబులు=నదీపుంజములును; అందంబుగన్=సుందరమగునట్లు; వీక్షా లక్ష్యతన్=దృగ్విషయతను; పూనన్=వహింపఁగా; వేడ్కతోన్=సంతసముతోడ; చనియెన్=పోయెను.

చ. చని చని తత్తరోమహిమఁ జయ్యన నాక్షణదోదయక్షమే
శనగర మప్పు డబ్బుర మెసంగఁ గనుంగొని యంతఁ జంద్రికా
వనజముఖీవిలాసవనవాటికఁ దత్తిలకాప్రమకుందచం
దనసుమవాసితానిలవితాన మెదుర్కొనఁ జేరి యచ్చటన్. 42

టీ. తత్తరోమహిమన్=విమానవేగాతిశయముచేత; చనిచని=పోయిపోయి; ఆక్షణదోదయక్షమేశనగరము=పూర్వము చెప్పినక్షణదోదయుఁ డను రాజుయొక్క నగరమును; అప్పుడు; అబ్బురము=ఆశ్చర్యము; ఎసంగన్=అతిశయించునట్లు; కనుంగొని=చూచి; అంతన్=అంతట; చంద్రికావనజముఖీ విలాసవనవాటికన్=చంద్రికయొక్కవిలాసవనమును; తత్తిలకాప్రమకుందచందనసుమవాసితానిలవితానము=ఆవనము సంబంధులగు బొట్టుగులుమావులు మొల్లలు చందనములు వీని కుసుమముల చేఁ బరిమళించువాయువులగుంపు; ఎదుర్కొనన్=అభిముఖము

గరాఁగా, పూజనీయులు విచ్చేయునపుడు వారల కెదురుగఁ బోవుట సముచితమని వాయువారాజున కెదురుగఁ బోయిన ట్లున్న దనుట; చేరి; అచ్చటన్=ఆవనమందు. దీనికిఁ గాంచెననుముంగలిపద్యమందలిక్రియతో నన్వయము.

చ. హరిముఖనేత సూప వసు♦ధాధిపచంద్రుఁడు గాంచె ముంగలన్
హరినిభమధ్యమన్ హరిక♦రాదృతశంఖసమానకంధరన్
హరిజయశాలివాణి హరి♦దంశుకవైరిశరాససుభ్రువున్
హరిణసపత్ననేత్ర హరి♦ణాంకముఖిన్ హరినీలకుంతలన్. 43

టీ. హరిముఖనేత=తురగవదనశ్రేష్ఠుండగుముకుదుఁడు; చూపన్; వసుధాధిపచంద్రుఁడు; హరినిభమధ్యమన్=సింహసమానమధ్యను; హరికరాదృత శంఖసమానకంధరన్=విష్ణుకరాదృతమైన శంఖమునుబోలు కంఠముగలదానిని; హరిజయశాలివాణిన్=చిలుకల జయించుటచేఁ బ్రకాశించుపలుకులుగలదానిని; హరిదంశుకవైరిశరాససుభ్రువున్.—హరిదంశుక=దిగంబరుండగుశివునకు, వైరి=శత్రువగుమరునియొక్క, లేదా శివుఁడు శత్రువుగాఁగలమరుని యొక్క, శరాస=వింటినిబోలు, సుభ్రువున్=మంచిబొమలుగలదానిని; హరిణసపత్ననేత్రన్=ఏణములకుఁ బగలగునేత్రములుగలదానిని; హరిణాంకముఖిన్=చంద్రముఖిని; హరినీలకుంతలన్=ఇంద్రనీలమణులఁ బోలునలకలు గలదానిని, అట్టిచంద్రికనసుట; ముంగలన్=ఎదుట; కాంచెన్=చూచెను. "యమానిలేంద్ర చంద్రార్క విష్ణుసింహాంశువాజిషు, శుకాహికపిభేకేషు హరిః" అను నామలింగానుశాసనముచే హరిపదమున కిట్టి తురంగసింహవిష్ణుశుకేంద్రరూపార్థములు తెలియఁదగినవి.

సీ. తానచాతురి కద్భు♦తముఁ దాల్పుపోలిక
వరమణిపుత్రికల్ ♦ శిరము లూఁప
ఘనగానసుధఁ గ్రోలి ♦ తని వొంది బయ లూన్చు
గతి శిలాతతి జలౌ♦ఘమ్ముఁ గురియ
యతిలయశ్రుతులవి♦స్తృతితత్త్వ మూనిన
చాయ నాళులు విని♦శ్చలతఁ దాల్ప
బలురక్తి లో నిండి ♦ పట్టఁజాలక వెలు
వడుదారి వల్లికల్ ♦ కడుఁ జిగుర్ప
తే. హరివసువీతికాసీన♦యై విపంచిఁ
గలసి గానము సేయుభూ♦కాంతపుత్త్రిఁ
గనకనిభగాత్రిఁ గాంచి య♦య్యనకులుండు
చాల నాశ్చర్యజలరాశిఁ ♦ దేలె నపుడు. 44

టీ. తానచాతురికిన్.—తాన=తన్నకారముతోఁ బాడెడు పాటలయొక్క, చాతురికిన్=నేర్పునకు; అద్భుతమున్=ఆశ్చర్యమును; తాల్చుపోలికిన్=వహించురీతి; వరమణిపుత్రికల్=శ్రేష్ఠములగు మణిమయప్రతిమలు; శిరములు=తలలను; ఊఁపన్=చలింపఁజేయఁగా; ఘనగానసుధన్=అధికమగు గానామృతమును; క్రోలి=పానముచేసి; తనివొంది=తృప్తిపొంది; బయలూన్చుగతిన్=బయల్పఱచురీతి; శిలాతతి=పాషాణసంఘము; జలౌఘమ్మున్=నీటిప్రవాహమును; కురియన్=వర్షింపఁగా; యతిలయశ్రుతులవిస్తృతితత్త్వము.—యతి=యతులయొక్క, లయ=లయమనెడితాళప్రాణముయొక్క, శ్రుతుల=స్వరారంభకావయవవిశేషములయొక్క; విస్తృతి=విస్తారముయొక్క, ఇట తాళప్రాణములు, "కాలోమార్గః క్రియాఙ్గాని గ్రహో జాతిః కళా లయః। యతిః ప్రస్తారకశ్చైవ తాళప్రాణాదశస్మృతాః" అనునవి, శ్రుతియనఁగా, "ప్రథమశ్రవణాచ్ఛబ్దశ్శ్రూయతే హ్రస్వమాత్రకః। సాశ్రుతిస్సంపరిజ్ఞేయా స్వరావయవలక్షణా" అని చెప్పఁబడినది, దానివిస్తృతి "చతుశ్చతుశ్చతుశ్చైవ షడ్జమధ్యమపఞ్చమాః। ద్వేద్వేనిషాదగాన్ధారౌ త్రిస్త్రిరిషభధైవతౌ" ఇత్యాదిగాఁ జెప్పఁబడినది; తత్త్వము=స్వరూపమును; ఊనినచాయన్=వహించినమాడ్కి; అళులు=చెలియలు; వినిశ్చలతన్=నైశ్చల్యమును; తాల్పన్; బలురక్తి=అధికానురాగము; లోన్=అంతరంగమందు; నిండి; పట్టన్ చాలక=ఆఁగలేక; వెలువడుదారిన్=బయల్పడురీతిగా; వల్లికల్=లతలు; కడున్=మిక్కిలి; చిగుర్పన్=చివురింపఁగా; హారివసుపీఠికాసీనయై.—హారి=మనోజ్ఞమగు, వసుపీఠికా=బంగరుపీఁటయందు, ఆసీనయై=కూర్చుండినదై; విపంచిన్=వీణను; కలసి=చేరి; గానముసేయుభూకాంతపుత్త్రిన్=పాడుచుండెడు రాజపుత్త్రిని; కనకనిభగాత్రిన్=బంగరుతో, కాదేని, సంపెఁగపువ్వుతో సాటియగుశరీరముగలదానిని, అట్టిచంద్రికను; అయ్యినకులుండు=ఆనుచంద్రుఁడు; కాంచి=అవలోకించి; చాలన్; ఆశ్చర్యజలరాశిన్=విస్మయమనెడు సముద్రమునందు; అపుడు=ఆదర్శనక్షణమందు; తేలెన్.

"అపూర్వదర్శనాచ్చిత్తవిస్తారో విస్మయో మతః" అనుటవలన లోకోత్తరసౌందర్యశాలిని యగువాసుదతిని జూడ రాజునకు విస్మయోదయం బాయె ననుట.

చ. తెలియక కన్యఁ జేరి తద◆ధీనతఁ బొల్చి యినావలోక మ
త్తఱి నలర న్మిళద్ధరిర◆థంబయి మున్నె మనోభ్ర మెంతయున్
మెఱయఁగ నంతకన్న మును ◆ మించె శ్రమోదకవృష్టి చిత్రతన్
దొఱయఁగ మున్నె క్షేత్రమునఁ ◆ దోరముగాఁ బులకాఖ్యసస్యముల్. 45

టీ. తెలియక=బయలువెడలక; కన్యన్=చంద్రికను, కన్యారాశిని యర్థాంతరము; చేరి=పొంది; ఇనావలోకము.—ఇన=రాజుయొక్క, అవలోకము=చూపు, సూర్యప్రకాశమని యర్థాంతరము, అనఁగా ధర్మధర్ముల కభేదగ్రహణముచే సూర్యుఁడే యనుట, సూర్యుఁడు కన్యారాశిని జేరఁగా నని ఫలితార్థము; "ఇన స్సూర్యే ప్రభౌ" అని యమరుఁడు; అత్తఱిన్=ఆసమయమున; అలరన్=ఒప్పఁగా; మనోభ్రము=మనస్సనెడునాకసము; మిళద్ధరిరథంబు అయి.—మిళత్=సంబంధించినట్టి, హరిరథంబయి=చిలుకరథముగాఁగలమరుఁడుగలదై, ఇంద్రరథమగుమేఘముగలదై యనియర్థాంతరము; ఎంతయున్=మిక్కిలి; మెఱయన్=ప్రకాశిం

పఁగా, మెఱపులు మెఱయఁగా; మున్నె=అంతకుమునుపే; శ్రమోదకవృష్టి=స్వేదోదకవర్షము; చిత్రతన్ = ఆశ్చర్యముచేత; దొఱయఁగన్ = పొందఁగా; అంతకన్నమును = అంతకుపూర్వమె; క్షేత్రమునన్=శరీరమందు, సస్యోచితభూప్రదేశమందు; తోరముగాన్ = అధికముగా; పులకాఖ్యసస్యముల్=పులకలనెడుసస్యములు; మించెన్=అతిశయించెను.

అనఁగా సుచంద్రునిదృష్టి కన్యను జేరి తెలుపక యుండఁగా అనఁగాదర్శనానందము ననుభవించుచుండఁగా మనంబునఁ గందర్పోదయమయినదనియు మేనెల్ల స్వేదోద్గమ మాయెననియుఁ బులకల్లనలొత్తెననియు భావము. కన్యారాశిని సూర్యుఁడు చేరఁగా వర్షర్తు వగుటంజేసి వృష్టి గలుగుట లోకప్రసిద్ధము. సూర్యుఁడు కన్యారాశిని జేరుట,తదనంతరము మేఘయుక్తమైయాకాశము మెఱయుట, తదనంతరము వర్షము, తదనంతరము క్షేత్రమున సస్యోదయ మని క్రమ ముండఁగా మేఘముతోఁ జేరి యాకసము మెఱయుటకు మున్నె వర్షమును దానికిమున్నె క్షేత్రమున సస్యములు గలుగుటయు చిత్రమని తాత్పర్యము.ఇచట సస్యమునకు వర్షమువర్షమునకుమబ్బుతోఁగూడినమిన్ను మెఱయుటకారణముగానున్నను ఆకసము మెఱయుటకుమున్నె వృష్టిగలిగెననియు నంతకుమున్నె సస్యముదయించెననియు కార్యకారణభావమునకు వైపరీత్యమునుబట్టి అత్యంతాతిశయోక్త్యలంకారము. "అత్యంతాతిశయోక్తిస్స్యాత్పౌర్వాపర్యవ్యతిక్రమే॥ అని తల్లక్షణము. అవిదితక్రమములుగా నతిశీఘ్రకాలములో నుదయించినవని ఫలితార్థము.

"పాంచాలీశుభవిభ్రమస్ఫురణ" యనుపద్యమునందే భవ్యానురాగాళికల్ అనుటచేత రాగోదయమైనదని యేర్పడినను రాగము ఆసక్తిరూపమనియు కామ ముత్కటాసక్తరూపమనియు సిద్ధాంతము గాన గుణశ్రవణమున సామాన్యాసక్తిగలిగి సాక్షాద్దర్శనమున నుత్కటాసక్తి గలిగిన దని తెలియునది. "ధ్యాయతో విషయాన్పుంస స్సఙ్గస్తేషూపజాయతే। సఙ్గాత్సంజాయతే కామః॥" అను గీతావచనమునందును దద్భాష్యతద్వ్యాఖ్యలయందును రతికామములస్వరూపము పైవిధముగ నున్నది. ఈవిషయము విస్తరముగఁ గావ్యాలంకారసంగ్రహమున"వనితయుఁ బతియు"నను పద్యము టీకలో మాచే వ్రాయఁబడినది. ఇట సుచంద్రునకు స్వేదము పులకలు అను సాత్త్విక భావోదయము చెప్పఁబడినది. సాత్త్వికము లనఁగా ననుభావవిశేషములు. అనుభావములనఁగా "అనుభావయన్తి, అనువ్యుత్పత్తిచే జాతరత్యాద్యనుమాపకములు. "భావ మ్మనోగతం సాక్షాత్స్వహేతుం వ్యఞ్జయన్తియే। తేనుభావా ఇతి ప్రోక్తా భ్రూవిక్షేపస్మితాదయః" అని తల్లక్షణము వ్రాయంబడియె. స్తంభాదు లిట్టియను భావములలోఁ జేరినను దానికి సాత్త్వికములని నామము గలుగుట సత్త్వమాత్రమునఁ గలుగుటంజేసి. ఇందులకుఁ బ్రమాణము. 'సర్వేపి సత్త్వమూలత్వా ద్భావా యద్యపి సాత్త్వికాః। తథా ప్యమీషాం సత్త్వైకమూలత్వా త్సాత్త్వికప్రథా। అను భావాశ్చ కథ్యన్తే భావసంసూచనా దమీ॥ ఏవం ద్వైవిధ్య మేతేషాం కథితంభావకోవిదైః॥" అని సింగభూపాలీయము. సత్త్వమనఁగా "అన్యేషాం సుఖదుఃఖాదిభావేషు కృతభావనమ్। ఆనుకూల్యేన యచ్చిత్తం భావకానాం ప్రవర్తతే। సత్త్వంతదితి విజ్ఞేయం ప్రాజ్ఞైస్సత్త్వోద్భవానిమాన్।

సాత్త్వికా ఇతి జానన్తి భరతాద్యా మహర్షయః। తే స్తమ్భస్స్వేదరోమాఞ్చస్స్వరభేదాశ్చవేపథుః। వైవర్ణ్యమశ్రుప్రళయా ఇత్యష్టౌ పరికీర్తితాః।" అనుటలోఁ జెప్పఁబడి యాగ్రంథము ననే నిరూపింపఁబడినది. ఇట హస్తాతిశయము స్వేదరోమాంచములు. "నిదాఘహర్షవ్యాయామశ్రమక్రోధభయాదిభిః। స్వేదస్సంజాయతే" అనియు "రోమాఞ్చో విస్మయోత్సాహహర్షాద్యైః" అనియు నందునకుఁ బ్రమాణము. ఇట శ్రీపాదకళ్లము స్వేదోదకమందు మూఢమని కవిహృదయముగాఁ గొనఁ దగియున్నది.

చ. తరుణిమెఱుంగుటారుగడ♦దారున నెక్కి నృపాలుచూపుదొ
మ్మరి రమణీయహారగుణ♦మండలిసందునఁ దారుచుం బయో
ధరసృతి లాగు వైచి వడిఁ♦దాఁకొని సమ్ముఖరాజుఁ జేరఁ బం
కరుహశరుండు శార్యభిధ♦కాహళి మ్రోయఁగఁ జేసె నత్తఱిన్. 46

టీ. నృపాలుచూపుదొమ్మరి = రాజుదృష్టియనెడు దొమ్మరి; తరుణిమెఱుంగుటారుగడన్=చంద్రికయొక్క మెఱయుచున్నయారనెడుగడను; దారునన్=వేగముగ; ఎక్కి=అధిష్ఠించి; రమణీయహారగుణమండలి సందునన్.— రమణీయ = మనోజ్ఞమగు, హార=ముత్యంపుపేరులనెడు, గుణ=త్రాళ్లయొక్క, మండలి=సమూహముయొక్క, సందునన్=మధ్యభాగమునసుండునవకాశమున; తారుచున్=చేరుచు; పయోధరసృతిన్ = స్తనసీమయనెడుగసమందు; లాగువైచి=లాగువేసి; వడిన్ =వేగముగా; తాఁకొని=కదిసి; సమ్ముఖరాజున్=చంద్రునివంటిమోమనెడు నెదుటనున్నరాజును; చేరన్=చేరఁగా; పంకరుహశరుండు=మరుండు; శార్యభిధకాహళిన్=గోరువంకయను పేరుగల బూరుగును; అత్తఱిన్=ఆలాగువైచుసమయమునను; మ్రోయఁగన్=ధ్వనించునట్లు ; చేసెన్=ఒనరించెను.

లోకమున దొమ్మరి గడ పొంతి దానినెక్కి త్రాళ్లనుండి జాతి పైపైన లాగు వైచి యధిపతి యెదుట నిలుచుటయు, నత్తఱిఁ దదీయుఁడు కాహళి మ్రోయఁగఁ జేయుటయుఁ బ్రసిద్ధంబు. అట్లు ఆనరపాలుచూపు తోలుత నానుందరిరోమరాజిపైఁ బ్రసరించి పయోధరములను జేరి యామెమోమున నెదుట నిలిచి యుండెననియు, నప్పుడు గోరువంక కూయ సాగిన దనియు, మన్మథుఁడు మ్రోయఁగఁ జేసె ననుటచే నాకాంత రాజునకు మిక్కిలి కామోద్దీపకముగనుండె ననియు భావము.

చ. అవనిపకన్యనాభిజల♦జాకరసన్నిధి రోమవల్లికా
నవతరయష్టికాపదము♦నం బ్రియయోగము వూని శ్రీసతీ
ధవమహిమాప్తి సిద్ధరస♦పాళికిఁ బొందియుఁ బొంద వయ్యెఁ ద
త్ప్రవిమలకంధరాధ్వచర♦తన్ నృపునేత్రము లద్భుతస్థితిన్. 47

టీ. నృపునేత్రములు=నుచంద్రునిచూపులు; అవనిపకన్యనాభిజలజాకరసన్నిధిన్.— అవనిపకన్య=రాజకుమారియగు చంద్రికయొక్క, నాభి=బొక్కిలియనెడు, జలజాకర=సర్సు

స్సుయొక్క, సన్నిధిన్ = తీరమునందు; రోమవల్లికావవతర యష్టికా పదమునన్.—రోమవల్లికా=నూఁగారనెడు, నవతర = అత్యపూర్వమైన, యష్టికాపదమునన్ = యష్టికాసనమనెడుయోగాసనవిశేషమందు; ప్రియయోగము = ప్రీతియుతమగుసంగతియనెడు ప్రియధ్యానమును; పూని=వహించి; శ్రీసతీభవమహిమాప్తిన్.—శ్రీసతీభవ=శ్రీపుత్రుండగుమనునియొక్క, శ్రీమంతు లగుపార్వతీపరమేశ్వరులయొక్క, మహిమాప్తిన్=మాహాత్మ్యప్రాప్తిచేత; సిద్ధరసపరమ;పాళికన్.—సిద్ధరస=సిద్ధమైనశృంగారరసముయొక్క,దివ్యరసముయొక్క, పాళికన్=పరంపరను; పొందియున్;తత్ప్రవిమలకంధరాధ్వచరతన్.—తత్=ఆకన్యయొక్క,ప్రవిమల=నిర్మలమగు,కంధరాధ్వ=కంఠమార్గమందు, చరతన్=సంచరణమును, "అధ్వనిచరతీత్యధ్వచరః"అను విగ్రహమందు"చరేష్టః"అని కర్త్రర్థమందు టప్రత్యయము దానిపైభావార్థమందుతల్ ప్రత్యయము రాఁగా చరించువానిధర్మము చరణమేయగును, ప్రసిద్ధమై నిర్మలమయిన మేఘమార్గమగుగగనమునందు సంచారమును అని యర్థాంతరము; అద్భుతస్థితిన్=ఆశ్చర్యవర్తనచే; పూనవయ్యెన్=వహింపవయ్యెను.

పుణ్యతీర్థసన్నిధిని యష్టికాసనముపై యోగనిష్ఠాగరిష్ఠుండై పార్వతీపరమేశ్వరానుగ్రహమున సిద్ధరసమును బొందినవాఁడు గగనమార్గసంచరణమును బొందుటప్రసిద్ధము, అట్లు పొందకుండుట చిత్రముగ నున్నదని తాత్పర్యము. సుచంద్రసరపాలునిచూపు లాకన్యయారునందుఁ జేరి యందుఁ బ్రీతి గలిగి స్మరావేశముచే శృంగారరససిద్ధి ననఁగా నానందాతిశయమునొంది కంఠముపైఁ బాఱక సుఖపారవశ్యమున నచటనే నిలిచియుండెనని ఫలితార్థము.

మ. స్తనమేరుస్థలవృత్తి నుబ్బు వళికా♦స్వర్ద్వీపినీభంగకు
ర్దనఁ జొక్కుం గను మధ్యనాకవిహృతిన్ ♦ రమ్యోరురంభోపగూ
హనలబ్ధిం జెలఁగు న్నృపేక్షణము లా♦హా చిత్ర మేణీవిలో
చనయాస్యేందుసుధైకసేవ ననిమే♦షత్వంబు సంధిల్లుటన్. 48

టీ. నృపేక్షణములు = ఆరాజదృష్టులు; ఏణీవిలోచన యాస్యేందుసుధైకసేవన్.—ఏణీవిలోచన=చంద్రికయొక్క,ఆస్యేందు=ముఖచంద్రునియొక్క, సుధా=అమృతముయొక్క, ఏకసేవన్ = ముఖ్యసేవచేత; అనిమేషత్వంబు = ఱెప్పపాటులేమి, దేవత్వము; సంధిల్లుటన్=సంభవించుటచేత; స్తనమేరుస్థలవృత్తిన్.—స్తన=కుచములనెడు, మేరుస్థల = మేరుపర్వతప్రదేశమున,వృత్తిన్=ఉనికిచేత; ఉబ్బున్=వృద్ధిఁబొందును. వళికాస్వర్ద్వీపినీభంగకుర్దనన్.—వళికా=వళిత్రయమనెడు,స్వర్ద్వీపినీభంగ=వ్యోమగంగాతరంగములయందు,కుర్దనన్=క్రీడచేత, "క్రీడాఖేలాచకుర్దనమ్"అని అమరుఁడు; చొక్కున్=సుఖపరవశ మగును. మధ్యనాకవిహృతిన్.—మధ్యనాక=కౌననెడునాకమునందు, "నాకస్స్వర్గాంతరిక్షయోః" అని విశ్వము, విహృతిన్=విహారమును; కనున్=పొందును, స్వర్గవిహారము నొందు ననుట దేవత్వప్రక్షముగ కత్యంతామగుణం బైనను స్తనములు మేరువులోడను వళులు గంగాతరంగములతో

డను ఊరువు లనంటులతోడను సాటియగునట్లు కానాకనముతోడనే సాటియగుఁగాని స్వర్గముతోడఁ గా దని యిట్లు వ్యాఖ్యాతంబయ్యె. రమ్యోరురంభోపగూహనలబ్ధిక్.—రమ్య=మనోజ్ఞములగు, ఊరు=తొడలనెడు, రంభా=దివ్యస్త్రీయొక్క, ఉపగూహన = కౌఁగిలింత యొక్క, లబ్ధిక్=ప్రాప్తిచేత; చెలఁగుక్=ఒప్పును. అహోచిత్రము = ఆశ్చర్యశ్చర్యమనుట.

అనఁగా ప్రసిద్ధచంద్రమండలస్థసుధను గ్రోలి దేవత్వమును గాంచినవారు మేరుస్థలవాసస్వర్ధీవ్యాపినీతరంగవిహారవ్యోమమార్గసంచారరథాలింగనాదుల నొందినట్లు నృపేక్షణములు చంద్రికాముఖచంద్ర సుధారసపానమున నట్టి విభవమును గాంచుట యాశ్చర్యతమంబనుట. ఆకన్యయొక్క లోకోత్తరముఖాద్యవయవములయందుఁ బ్రసరించి చెప్పపాటులేనివృపుచూపులు నిరతిశయానందము నొందె నని భావము.

తే. ఉజ్జ్వలతరానురాగసం♦ధ్యోదయంబు
దగ మహాస్తంభభావంబు♦ దాల్చినట్టి
పతిమనంబున నీరజాం♦బకుఁడు దోఁచె
నపుడు హరిరథసంలబ్ధి♦ ననుసరించి. 49

టీ. ఉజ్జ్వలతరానురాగసంధ్యోదయంబు.—ఉజ్జ్వలతర=మిక్కిలి ప్రకాశించునట్టి, అనఁగా నుత్కృటమయినట్టి, అనురాగ=ప్రీతివిశేషమనెడు, సంధ్యా = సంధ్యాకాలముయొక్క, ఉదయంబు=ప్రాదుర్భావము; తగక్=ఒప్పఁగా; మహాస్తంభభావంబు.—మహత్=అధికమైన, స్తంభభావంబు=చేష్టారహితుని భావమును, గృహాధారదారు విశేషభావమును; తాల్చినట్టిపతిమనంబునక్=వహించినట్టినృపునిచిత్తమున; అపుడు=ఆనిర్నిమేషదర్శనసమయమందు; నీరజాంబకుఁడు=పద్మబాణుం డగుమరుం డనుపద్మనయనుం డగునారాయణుండు; హరిరథసంలబ్ధిక్=మందమారుతమనెడు తేరియొక్క సంలబ్ధియును సింహదేహప్రాప్తిని; అనుసరించి=పొంది; తోఁచెక్=అగపడెను.

పూర్వము హిరణ్యకశిపువధకై సంధ్యాకాలమున స్తంభమధ్యమున నారాయణుండు నృసింహరూపము దాల్చి తోఁచినట్లు నృపునిమనం బుత్కృటరాగంబయి స్తంభభావంబు దాల్చి యుండ నందు మందమారుతము నధిష్ఠించి కాముఁడు దోఁచె ననుట. ఆరాజునకనురాగోద్రేకమయి మనము స్తంభ మనెడుసాత్త్వికభావము దాల్చిన దనియు నపుడు మరుండు మందమారుతారూఢుండయి సాక్షాత్కరించిన యట్లు తోఁచెననియు భావము. "స్తంభస్స్యాన్నిష్క్రియాఙ్గత్వమ్" అనుటచే స్తంభము శరీరధర్మమై గాఁదగియున్నను, రాగాది జన్యమానస స్తంభములేక శారీరము గలుగదనియు "సత్త్వజన్యత్వే సతిగతినిరోధస్తంభః" అను లక్షణానుగతమైన రాగసంభవమయిన మనోవ్యాపారనిరోధమునుబట్టి యిట స్తంభపదప్రయోగమని తెలియునది. కామోదయరాగోదయములు వెనుకఁ జెప్పఁబడినవైయున నిందుఁ దదుత్కృటదశగాఁ దెలియఁ దగును.

చ. నిరుపమపద్మినీకులమ♦ణీపరిదర్శనశక్తి నైశ్చలీ
గరిమ భజించి సమ్మదవి♦కాసమునం గనుపట్టుకుంభినీ

శ్వరతిలకంబు నుద్ధతి ని॰శాతపలాశసుమాంకుశంబుచేఁ
గర మసమాస్త్రయంత నజు॰కం జనియించె శిరశ్చలనస్థితుల్. 50

టీ. నిరుపమపద్మినీకులమణీ పరిదర్శనశక్తిన్.—నిరుపమ=సాటిలేనట్టి, పద్మినీకులమణీ=పద్మినీజాతిస్త్రీలయందు శ్రేష్ఠయగుచంద్రికయొక్క, పరిదర్శనశక్తిన్=దర్శనసామర్థ్యము చేత, సాటిలేనిగజస్త్రీరత్నముయొక్క దర్శనసామర్థ్యముచేతనని యర్థాంతరము; పద్మి యొక్క స్త్రీ పద్మిని, "ఇభస్స్యాత్పద్మీ" అని యమరుఁడు; నైశ్చలీగరిమన్=నిశ్చల భావముయొక్కయాధిక్యమును; భజించి=పొంది; సమ్మదవికాసమునన్ = సంతోషాతిశయము చేత, అధికమైన మదవికాసముచేతనని గజపరమైనయర్థము; కనుపట్టు కుంభినీశ్వరతిల కంబున్=చూపట్టు రాజశ్రేష్ఠుని, చూపట్టుగజశ్రేష్ఠమునని యర్థాంతరము; "గోరిలాకుమ్భినీ క్షమా" అనుటచే కుమ్భినీశబ్దము భూమియందును, కుమ్భినః స్త్రీకుమ్భినీ, అను వ్యుత్పత్తిచే గజస్త్రీయందును వర్తించును; ఉద్ధతిన్=దర్పముచేత; నిశాతపలాశసుమాంకుశంబుచేన్.—నిశాత=తీక్ష్ణమగు, పలాశసుమ=కింశుకకుసుమమనెడు, అంకుశంబుచేన్=అంకుశమను నాయుధముచేత; అసమాస్త్రయంత=మదనుఁడనుమావటీవాఁడు; నజుకన్=నజుకఁగా; శిరశ్చలన స్థితుల్=మెప్పున శిరఃకంపముసేయుటలు, చుఱుకునతలవిదుర్చుటలు అని గజపక్షమునర్థము; జనియించెన్=ఉదయించెను.

చంద్రికాదర్శనానందాతిశయముచే నైశ్చల్యము వహించి మన్మథబాణహతుఁడై మెప్పున నారాజు శిరఃకంపముచేయఁగా నది యాఁడేనుఁగు నందాసక్తమయి మదవిలాసము చే గదలకుండినగజమును నియంతయంకుశముచేఁ బొడువఁగా నాగజము చుఱుకునఁ దల విదిర్చినట్లుండెనని భావము.

చ. అలరెడిశ్యామకెంజిగురు॰టాకులఁ జేరినఁ గోరకంబులన్,
మలయుచు నున్నఁ జారుసుమ॰మాలిక లొందిన మంజుమంజరీ
స్థలములపొందు గన్న మధు॰సంతతిఁ గూడినఁ బాయ వయ్యెడం
జెలఁగుటనో ద్విరేఫగతి॰చే మహిపాలకురమ్యనేత్రముల్. 51

టీ. మహిపాలకురమ్యనేత్రముల్=సుచంద్రుని మనోజ్ఞనేత్రములు, అనఁగా దృష్టులు; ద్విరేఫగతిన్=భృంగరీతిచేత, రేఫద్వయప్రాప్తిచేత; చెలఁగుటనో=ఒప్పుటచేతనో; రమ్య నేత్రపదమందు ఆద్యంతములయందు రెండురేఫము లున్నవి గావున నవి ద్విరేఫగతిఁ జెలంగు ననుట, ద్విరేఫశబ్దముచే లక్షితలక్షణావృత్తివలన భ్రమరపదబోధ్యము లగుభృంగములు బోధితము లగు నని శాస్త్రిసరణి; అలరెడిశ్యామకెంజిగురుటాకులన్.—అలరెడి=ప్రకాశిం చుచున్న, శ్యామ=లతయొక్క, కెంజిగురుటాకులన్=రక్తపల్లవములను, ఈపద్యమున నుపమా నము లైనపల్లవాదులు చెప్పఁగా సాధ్యవసానలక్షణచే నుపమేయము లగుహస్తాదులు బోధ్య ములు గావున, శ్యామకెంజిగురుటాకులన్ అనఁగాఁ జంద్రికాహస్తములచేతనని గ్రాహ్యము;

ఇట్లంతటఁ దెలియవలయు; జేరినన్=పొందినను; కోరకంబులన్=మొగ్గలయందు, వానిచే లక్ష్యంబు లగుగోరులయందనుట; మలయుచున్ ఉన్నన్=తిరుగుచున్నను; చారుసుమమాలికలు=మనోహరములయినపూలదండలను, అనఁగా నామె బాహువులను; ఒందినన్=చేరినను; మంజుమంజరీస్థలములపొందు.—మంజు=మనోజ్ఞములగు, మంజరీ=పువ్వుగుత్తులయొక్క, వానిచే లక్ష్యంబులగు స్తనములయొక్క, స్థలముల=ప్రదేశములయొక్క, పొందు=సంపర్కమును; కన్నన్=కాంచినను; మధుసంతతిన్=మకరందపరంపరను, కూడినన్=చేరినను, ఆమెపెదవినిజేరినననుట; పాయవయ్యెన్=వీడవయ్యెను,

అనఁగా ద్విరేఫములు లతావిశేషముయొక్క చివురులను, కోరకములను, సుమములను, పువ్వుగుత్తులను, మకరందమును గూడియున్నను బాయకుండునట్లు, ద్విరేఫగతిఁ జెలంగు నృపాలు నేత్రములు, చిగురుటాకులనుబోలు హస్తములను, కోరకంబులఁబోలు గోరులను, సుమమాలికలఁ బోలుబాహువులను, పువ్వుగుత్తులఁ బోలు స్తనములను, పూఁదేనియను బోలునధర రసమును గూడియు వీడకున్న వని భావము. అతిశయోక్త్యలంకారభేదము. "విషయస్యానుపాదానా ద్విషయ్యుపనిబధ్యతే। విజ్ఞేయాతిశయోక్తి స్సా కవిప్రౌఢోక్తి సమ్మతా॥" అని తల్లక్షణంబు పూర్వము దెలుపఁబడియె.

తే. ఇట్లు తచ్చంద్రికాయత్త♦ దృక్చకోరుఁ
డై రసాధీశపద్మాకు♦మారుఁ డపుడు
ప్రమదము నవాద్భుతంబును ♦ బల్లవింప
నాత్మ నాయింతి నిట్లని ♦ యభినుతించె. 52

టీ. ఇట్లు=ఈప్రకారముగ; రసాధీశపద్మాకుమారుఁడు=భూపతియగు పెదపద్మనృపతి కుమారుఁడు; తచ్చంద్రికాయత్తదృక్చకోరుండై=ఆచంద్రికాపరతంత్రములగు నేత్రములను చకోరములుగలవాఁడై; అపుడు; ప్రమదము=సంతసము; నవాద్భుతంబును=లోకోత్తరాశ్చర్యమును; పల్లవింపన్=చివురింపఁగా; ఆత్మన్=మనస్సునందు; ఆయింతిన్=ఆచంద్రికను; ఇట్లు=వక్ష్యమాణప్రకారముగా; అభినుతించెన్=శ్లాఘించెను.

సీ. కాఁబోలు నీహేమ♦గాత్రి క్రొత్తగ సానఁ, దీరినవలతేని♦చారుహేతి
కాఁబోలు నీకంబు♦కంఠి పాల్కడలిజ, డ్డడఁగఁ జూపట్టుశీ♦తాంశురేఖ
కాఁబోలు నీతమ్మి♦కంటి చిరద్యుతుల్, మించఁ బొల్చినతళ్కు♦మించుఁదీవ
కాఁబోలు నీనీల♦కైశ్య మన్మథశిల్పి, బాగుగాఁ దీర్చిన♦పసిఁడిబొమ్మ
తే. యౌర యీచెల్వచెలువ మ♦య్యారె యీపొ
లంతి యొయ్యారమహహా యీ♦యింతిమిన్న
సొంపు మజ్జారె యీచాన ♦ సొగసుపెంపు
బళిరె యీలేమఁ బొగడ వా♦క్పతివశంబె. 53

టీ. ఈహేమగాత్రి=ఈకనకాంగి; క్రొత్తగన్=నూతనముగ; సానన్=సానయందు, సాన యనఁగా మణులు లోనగువానిఁ జక్కఁబఱచుసాధనవిశేషము; తిరినవలరేనిచారుహేతి.—తిరిన=చక్కఁబడిన, వలరేని=మరునిసంబంధియగు, చారు=మనోజ్ఞమైన, హేతి=ఖడ్గము; కాఁబోలు=కాఁదగును. ఈకంబుకంఠి=శంఖమువంబోలుకంఠముగల యీసుందరి; పాల్కడలిజిడ్డఁగన్.—పాల్కడలి=క్షీరాంబునిధియొక్క, జిడ్డఁగన్=జిడ్డుఅణఁగిపోఁగా; చూపట్టుశీతాంశురేఖ=అగపడుచంద్రరేఖ; కాఁబోలున్=కాఁదగును. ఈతమ్మికంటి=ఈపద్మనయన; చిరద్యుతుల్=స్థిరమయినకాంతులు; మించన్=అతిశయించునట్లు; పొల్చినతళ్కుమించుఁదీవ=ఉదయించినట్టి ప్రకాశమానమయిన మెఱుపుఁదీవ; కాఁబోలున్=కాఁదగును. ఈనీలకైశ్య=ఈనీలకుంతల; మన్మథశిల్పి=మన్మథుఁడను శిల్పకారుఁడు; బాగుగన్=చక్కఁగా; తీర్చినపసిఁడిబొమ్మ=దిద్దినబంగరుబొమ్మ; కాఁబోలున్=కాఁదగును. ఔర=ఆశ్చర్యము! ఈచెల్వచెలువము=ఈస్త్రీసౌందర్యము! అయారె=అద్భుతము! ఈపొలంతియొయ్యారము=ఈస్త్రీసౌందర్యగర్వము; ఆహహా=చిత్రము! ఈయింతిమిన్నసొంపు=ఈయుత్తమస్త్రీరమ్యత; మజ్జారె=విస్మయకరము! ఈవానసొగసుపెంపు = ఈస్త్రీసౌందర్యముయొక్క యతిశయము; బళిరె=వింత! ఈలేమన్=ఈస్త్రీని; పొగడన్=నుతించుటకు; వాక్పతివశంబె=బ్రహ్మతరమా?

అనఁగాఁ జతుర్ముఖుఁడై చతుర్వేది తెలిసిన యట్టిబ్రహ్మకైన నిట్టిలోకోత్తరనాయికను వర్ణింప నలవి గాదనుట. ఆమె స్మరహేతినిశశిరేఖను మించుఁదీవను పసిఁడిబొమ్మనుబోలిన దని ఫలితము.

మ. అతిశోణం బతికోమలం బతివిశా•లాత్మం బతిశ్లక్ష్ణకం
బతినిమ్నం బతిమేచకం బతిదృఢం • బత్యంతపారిప్లవం
బతివక్రం బతిదీర్ఘ మౌర బళి యీ•యంభోజపత్త్రాక్షి య
ప్రతిమానావయవప్రతానము మనః•పద్య న్విచారింపఁగన్. 54

టీ. ఈయంభోజపత్త్రాక్షియప్రతిమానావయవప్రతానము.— ఈయంభోజపత్త్రాక్షి=ఈకమలపత్త్రాక్షియొక్క, అప్రతిమాన=సాటిలేని, అవయవప్రతానము=అవయవసంఘము; మనఃపద్యన్=చిత్తవీథిని; విచారింపఁగన్=ఆలోచింపఁగా; అతిశోణంబు=మిక్కిలిఎఱ్ఱనైనదియు; అతికోమలంబు=మిక్కిలిమృదులమయినదియు; అతివిశాలాత్మంబు=అతివిపులస్వరూపంబును; అతిశ్లక్ష్ణకంబు=మిక్కిలి కృశమయినదియు; అతినిమ్నంబు=మిక్కిలి లోఁతుగనున్నదియు; అతిమేచకంబు=మిక్కిలినల్లనైనదియు; అతిదృఢంబు=మిక్కిలి స్థూలమయినదియు; అత్యంతపారిప్లవంబు=మిక్కిలిచపలమయినదియు; అతివక్రంబు = మిక్కిలికుటిలమైనదియు; అతిదీర్ఘము=మిక్కిలిపొడవైనదియు; ఔర బళి=అత్యాశ్చర్యము!

అనఁగా నొకయువతియవయవ సమూహము పరస్పరవిరుద్ధముగ శోణత్వమేచకత్వకృశత్వవిశాలత్వాదిధర్మముల నొప్పియుండుట యాశ్చర్య మని యాశయము. అయింతి యడుగు లతిశోణం బనియు, పాదంబు లతికోమలంబు లనియు, కటిస్థల మతివిశాలంబనియు, మధ్యభాగం బతిశ్లక్ష్ణ మ్మనియు, నాభి యతినిమ్నం బనియు, నూఁగా రతి

మేచకం బనియు, చన్దోయి యతిదృఢం బనియు, కన్దోయి యత్యంతపారిప్లవం బనియు, ముంగురు లతివక్రంబు లనియు, జడ యతిదీర్ఘం బనియు భావము. ఇటఁ జంద్రికాగతసౌందర్యాతిశయము వర్ణితం బయ్యె. "అఙ్గప్రత్యఙ్గకానాం యః సన్నివేశో యథోచితమ్। సుశ్లిష్టసంధిబన్ధ స్స్యా త్తత్సౌన్దర్య మితీర్యతే" అని తల్లక్షణము. ఇట్లు "దీర్ఘాక్షం శరదిన్దుకాన్తివదనం బాహూ నతా వంసయో స్సంక్షిప్తం నిబిడోన్నతస్తన మురః పార్శ్వే ప్రమృష్టే ఇవ। మధ్యః పాణిమితో నితమ్బి జఘనం పాదా వరాళాఙ్గుళీ ఛన్దో నర్తయితు ర్యథైవ మనస శ్శ్లిష్టం తథాస్యా వపుః॥ ఇత్యాదిగా గ్రన్థాంతరములయందు సౌందర్యవర్ణనము తెలియవలయు.

సీ. అలరారు నేమొ ర♦మ్యాళిపాళి నెలంతి
కులుకుపెన్నెఱులతోఁ ♦ జెలిమిఁ గాంచి
చరియించు నేమొ బల్ ♦ మరుమార్గణశ్రేణి
పడఁతిదృగ్రుచి కర్థి♦భావ మూని
చెలువొందు నేమొ మం♦జులకుచంబులు పక్వ
బింబోష్ఠిచనుదోయి ♦ పేరు మోసి
మనఁజేయు నేమొ యిం♦పున ధాత్రి చెలికటి
తటవిస్తృతికి దాది♦తనముఁ దాల్చి

తే. యతిశయిలు నేమొ పద్మంబు ♦ లనుదినంబు
భామపాదద్వయప్రభా ♦ ప్రాప్తి నొప్పి
మహిమ గను నేమొ సద్వంశ♦మణిచయంబు
కలికిపదనఖజనన శే♦ఖరత నొంది. 55

టీ. రమ్యాళిపాళి=రమ్యమైనతుమ్మెదలగుంపు; నెలంతకులుకుపెన్నెఱులతోన్=చంద్రికయొక్క యందమైన పెద్దవెండ్రుకలతోడ; చెలిమిన్=సఖ్యమును; గాంచి=పొంది; అలరారు నేమొ=ప్రకాశించు నేమొ. అనఁగా రమ్యమైన యాళిపాళి యన సఖీసముదయము గావునఁ జెలిమిఁ గాంచుట దానికి సహజంబగు నని హృదయము. బల్మరుమార్గణశ్రేణి=అధికములైనమదనబాణములగుంపు; పడఁతిదృగ్రుచికిన్=దీనిదృక్కాంతికి; అర్థిభావము=యాచకత్వమును; ఊని=వహించి; చరియించు నేమొ=సంచరించు నేమొ. మరుతూపు లీపడఁతిదృగ్రుచికి యాచకవృత్తి దాల్చిన ట్లున్న దన దృగ్రుచియం దాధిక్యంబు మార్గణములయందు న్యూనతయుఁ దోఁచు, దానం జేసి పడఁతిదృగ్రుచి మరుతూపుల కన్న మిన్నగా నున్న దని ఫలితము. మార్గణశ్రేణి యనఁగా యాచకులగుంపు గావున నది యర్థిభావము దాల్చుట స్వభావము. "మార్గణో యాచకార్థినా" అని యమరుఁడు. మంజులకుచంబులు=మనోజ్ఞములగు గజనిమ్మపండ్లు; పక్వబింబోష్ఠిచనుదోయి పేరు=పండినదొండపండువంటి పెదవిగలదానిచన్దోయి నా

ములను; మోపి=వహించి; చెలువందు నే మొ = సొంపుగాంచు నే మొ. దీనిచన్దోయి లకుచ ములను మించిన దని భావము. మంజులకుచశబ్దములో కుచశబ్దము చేరి యున్న దిగావున మంజులకుచములు కుచములపేరు మోసియుంట సహజము. ధాత్రి=భూమి; ఇచ్ఛను=ఇచ్ఛచేత; చెలికటితటవిస్తృతికిన్ = దీనిజఘనవిస్తారమునకు; దాదితనమున్ = పెంపుడు తల్లియగుటను; తాల్చి=వహించి; మనఁజేయు నే మొ=వృద్ధిఁబొందించు నే మొ. దీనిజఘనము భూమియొక్క వైశాల్యమువంటి వైశాల్యమున రాజిల్లు నని భావము. "ధాత్రీ స్యా దుపమాతాపి" అను కోశమున 'ధాత్రీశబ్ద ముపమాతను బోధించుఁ గావున నుపమాత దాదితనము దాల్చుట స్వభావము. పద్మంబులు=తమ్ములు; అనుదినంబు=ప్రతిదినమును; భామపాదద్వయప్రభాప్రాప్తిన్ = ఈసుందరిపాదయుగ్మకాంతిప్రాప్తిచేత; ఒప్పి; అతిశయిలు నే మొ = అతిశయించు నే మొ. దీనిపాదయుగ్మప్రభ పద్మప్రభను మించిన దని భావము "పదః మేవ మా యేషాం తాని పద్మాని" అనుటచేత, పాదలక్ష్మివంటిలక్ష్మిగలవే పద్మములు, గావున నవి పాదద్వయప్రభాప్రాప్తి నలరుట యరిది గాదు. భామపదము సూర్యునిబోధించుఁ గావున సూర్యకిరణప్రభాప్రాప్తిచేతఁ బద్మము లతిశయించుట సహజ మనియుఁ దోఁచు. ఇప్పక్షమున, భామ=సూర్యునియొక్క, పాదద్వయ=కిరణద్వయముయొక్కయే, అనఁగా రెండుకిరణములు ప్రసరించినను పద్మములు వికసిల్లి రాజిల్లు నని యాశయముగాఁ దోఁచుచున్నది. సద్వంశమణిచయంబు = మంచివెదురులందుఁ బుట్టినముత్యములగుంపు; కలికిపదనఖజననశేఖరతన్.— కలికిపదనఖ = ఈసుందరి పాదనఖములవలన, జనన = జన్మవలనసైన, శేఖరతన్ = శ్రేష్ఠతను; ఒంది; మహిమన్ = పూజ్యతను; కను నే మొ = కాంచు నే మొ. అనఁగా చంద్రిక పాదనఖములు ముత్యములను మించిన వనుట. సద్వంశమణిచయం బనఁగా మంచికులముగలమణులగుంపు పదనఖజనన అనఁగాఁ బాదనఖజనకము లైనపాదములకు భూషణభావమును దాల్చు ననుట. జనన శబ్దము కర్త్రర్థల్యుట్ప్రత్యయాంతము, నఖములు కరరుహము లయినట్లు పదరుహములు గా వచ్చును. "పదన్యాసక్రీడారణితమణిమంజీరరశనమ్" ఇత్యాదికవివ్యవహారములవలన మణులు పదములకు భూషణము లనుట స్పష్టము. ఇందును లోకోత్తరసౌందర్యశాలిని యని వ్యక్తం బగుచున్నది.

మ. వలజారత్నము దోఁచు నెన్నడు మణుత్వస్థేమఁ గాంచం గటి
స్థల మెంతేని మహత్త్వ మంద జడ దోడ్తం దీర్ఘతం బూన ని
చ్చలు గుల్ఫంబులు హ్రస్వతం గన రతీశబ్రహ్మలీలాకృతో
జ్జ్వలమాయాపరిమాణవై భవనమచ్ఛాయ న్విరాజిల్లఁగన్. 56

టీ. నెన్నడుము=అందమైనకౌను; అణుత్వస్థేమన్.—అణుత్వ=అణుపరిమాణభావముయొక్క, సూక్ష్మతయొక్కయనుట, స్థేమన్=స్థితిని; కాంచన్=పొందఁగా; కటిస్థలము=కటిప్రదేశము; ఎంతేన్=మిక్కిలి; మహత్త్వము=మహత్పరిమాణభావమును, వైశాల్యమునుట; అందన్; జడ=వేణి; తోడ్తన్=వెంటనె; దీర్ఘతన్=దీర్ఘపరిమాణభావమును; పూనన్; నిచ్చలు=ఎల్లప్పుడు; గుల్ఫంబులు=పిక్కలు; హ్రస్వతన్=హ్రస్వపరిమాణభావమును; కనన్; వలజా

రత్నము=స్త్రీరత్నమగుచంద్రిక, "చాఽస్త్రీభూశ్చవలజా" అనిరత్నమాల; రతీశబ్రహ్మలీలాకృతోజ్జ్వలమాయాపరిమాణవైభవసమచ్ఛాయన్.—రతీశబ్రహ్మ=అనంగుఁడను విధాతచేత, లీలాకృత=విలాసనిర్మితమగు, ఉజ్జ్వల=ప్రకాశించుచున్నట్టి, మాయాపరిమాణ=మాయామయములగు అణుదీర్ఘాదిపరిమాణములయొక్క, వైభవ=సమృద్ధియొక్క, సమచ్ఛాయన్=తుల్యచ్ఛాయచేత; విరాజిల్లఁగన్=ప్రకాశించునట్లు; తోఁచున్=అగపడును.

అనఁగా ననంగుఁడనువిధాత మాయావిలాసముచేత అణుమహద్దీర్ఘహ్రస్వభేదముచే శాస్త్రసిద్ధమైనపరిమాణచతుష్టయమునుజంద్రికారూపముగ సృజియించినట్లు తోఁచుచున్నదనుట.

చ. హరిణధరాస్యమోవిపస•లా కిసలాకృతిఁ బొల్చు నంఘ్రులా
యరుణతరోష్ఠిగుబ్బవగ•లా మృగలాలస మూన్చుకన్నులా
హరినిభవాణిమేనిసట•లా నిటలాకర వాలకమ్ములా
యరిభిదురోజ నెన్న వస•మా యసమాశుగమానభేదికిన్. 57

టీ. హరిణధరాస్యమోవిపసలా.—హరిణధరాస్య=చంద్రవదనయొక్క, మోవి=అధరముయొక్క, పసలా=సారములా! కిసలాకృతిన్=పల్లవాకారముచేత; పొల్చునంఘ్రులా=ఒప్పుచున్నపాదములా! అరుణతరోష్ఠిగుబ్బవగలా=ఈబింబోష్ఠియొక్కచన్దోయివిలాసములా! మృగలాలసమూన్చుకన్నులా.—మృగ=లేఁడియొక్క, లాలసము=ప్రీత్యతిశయమును, మూన్చుకన్నులా=కలిగించునేత్రములా! హరినిభవాణిమేనిసటలా.—హరినిభవాణి=చిలుకపలుకులుగలదీనియొక్క, మేని=శరీరముయొక్క, సటలా=నడకలా! నిటలాకరవాలకమ్ములా.—నిటల=నొసలు, ఆకర=ఆశ్రయముగాఁగల, అనఁగాఫాలమందువ్రేలాడునట్టి, వాలకమ్ములా = కేశములా! ముంగురులాయనుట; అరిభిదురోజన్=చక్రవాకభేదకములగుకుచములుగలదీనిని; ఎన్నన్ = కొనియాడుటకు; అసమాశుగమానభేదికిన్=ఫాలాక్షునకైనను; వసమా=శక్యమా?

ఇట్టిలోకోత్తర సౌందర్యశాలినియగుదీనిఁ జెన్నబంచవక్త్రునంతవానికిని తరముగాదనుట.

సీ. కలికిచీఁకటిపిండు • గలికిఁ బిల్చుకచాళి
వాలుగలసజాలు • వాలుఁగనులు
బింబమ్మునకుఁ బ్రతి•బింబంబు కెమ్మోవి
యే పూనురేరేని•యేపు మోము
ఇంచుమేలిమి నల•యించుమేల్పలుకులు
కంబులకన్నఁ బొం•కంబు గళము
జక్కవకవ నేఁచుఁ • జక్క వలుఁదగుబ్బ
లలివధూకులము నా • లలిత మారు
హావులసిరి సారె • హావు లవన్నాభి
మెఱుఁగుదంభోళి రూప • మెఱుఁగుఁ దొడలు

తే. తమ్ము లన మంజులశ్రీయు • తమ్ము లడుగు
లుడుపురాణాస్యకాంతుల • నుడుపు గోరు
లవని నీకొమ్మలావణ్య • లవనిరూఢి
యమరసుందరులం దైన • నమరఁ గలదె. 58

టీ. కచాళి=కేశపంక్తి; కలికిచీఁకటిపిండుఁ గా=అందమగునంధకారపుంజమును; కలికిన్=జగడమునకు; పిల్చున్=ఆహ్వానము సేయును. వాలుఁగనులు=నిడుదకన్నులు; వాలుగలసజాలు.—వాలుగల=మత్స్యములయొక్క, సజాలు=శిక్షారూపములు, దీనికన్నులు మత్స్యములకు శిక్షారూపములనుటచే మత్స్యములకన్నఁ గన్నులు సుందరములని భావము. కెమ్మోవి=కెంపైన పెదవి; బింబంబునకున్=దొండపండునకు; ప్రతిబింబంబు=ప్రతిరూపము. మోము=ముఖము; ఏపు=గర్వమును; ఊనురేరేనియేపు = వహించుచంద్రునియొక్కబాధ, బాధించునదనుట. మేల్పలుకులు=శ్రేష్ఠములగుమాటలు; ఇంచుమేలిమిన్ = చెఱకుయొక్కయతిశయమును; అలయించున్=అలయునట్లు సేయును. గళము=కంఠము; కంబులకన్నన్=శంఖములకన్నను; పొంకంబు=సుందరమైనది. వలుఁదగుబ్బలు=స్థూలములగు స్తనములు; చక్కన్=బాగుగ; జక్కవకవన్=చక్రవాకమిథునమును; ఏఁచున్=బాధించును. ఆరు=నూఁగారు; అలివధూమాలమునాన్=ఆఁడుతుమ్మెదలగుంపనఁగా; లలితము=ఒప్పునట్టిది. లసన్నాభి=ప్రకాశించుపొక్కిలి; వాపులసిరిన్=నడబావులయొక్కసంపదను; సారెన్=మాటిమాటికి; పాపున్=తొలఁగఁజేయును. తొడలు=ఊరువులు; మెఱుఁగురంభలరూపము=ప్రకాశించుచున్న యనంటులయొక్కరూపమును; ఎఱుఁగున్=తెలియును. అడుగులు=పాదములు; తమ్ములనన్=పద్మములనఁగా; మంజులశ్రీయుతమ్ములు=మనోజ్ఞమైన కాంతితోఁగూడినవి. గోరులు=నఖములు; ఉడుపురాణాస్యకాంతులన్.—ఉడు=రిక్కలయొక్క, పురాణ=మునుపటివైన, ఆస్యకాంతులన్ = ముఖరుచులను; ఉడుపున్=ఉడుగఁజేయును. అవనిన్=భూమియందు; ఈకొమ్మలావణ్యలవనిరూఢి=ఈస్త్రీయొక్కలావణ్యలేశముయొక్క ఆధిక్యము; అమర సుందరులందైనన్=దేవలోకకామినులయందైనను; అమరఁగలదె=అబ్బఁగలదా?

అనఁగా నిట్టిలావణ్యలేశము సురసుందరుల కైన నమర దనుట. లావణ్య మనఁగా దేహకాంతివిశేషము. ఆమెకచములు చీఁకటిని, కన్నులు మత్స్యములను, మోవిబింబమును, ఇత్యాదిగాఁ బోలియున్నవని ఫలితము. ఇది పంచపాదిసీసము.

చ. అని పతి సన్నుతించు హృద • యంబున విస్మయ ముంచు నేఁడుగా
యనుపమశక్తి దర్పకున • కబ్జ నటంచు వచించు నవ్విరిం
చను శుభసర్గకోవిదత • సారెకు నెంచు నిమేషరాహితిం
గనుఁగవ పూన వెండియును • గాంచు వెలందిఁ దదేకతానతన్. 59

టీ. అని=ఇట్లని; పతి=సుచంద్రుఁడు; సన్నుతించున్=కొనియాడును. హృదయమ్మునన్=చిత్తమందు; విస్మయము=ఆశ్చర్యమును; ఉంచున్. దర్పకునకున్=మదనునకు; అనుపమ

శక్తి=సాటిలేనిసామర్థ్యము; సేఁడుగా=ఇప్పుడుగదా! అబ్బెన్=అమరెను. అటంచున్; వచించున్ = పలుకును. అవ్విరించిను శుభసర్గకోవిదతన్ = ఆబ్రహ్మయొక్క శుభనిర్మాణ పాండితిని; సారెకున్=మాటిమాటికి; ఎంచున్=గణించును. కనుఁగవ=నేత్రయుగ్మము; నిమేషరాహితిన్=అప్పపాటులేమిని; పూనన్=వహింపఁగా; వెండియున్=మఱియును; తదేకతానతన్=తదేకాగ్రతతో; "ఏకతానోనన్యవృత్తిః" అని యమరుఁడు; వెలందిన్ = చంద్రికను; కాంచున్=అవలోకించును.

చ. అపుడు మహీంద్రుతోడ నల ♦ యక్షవిభుండు వధూటిఁ గంటివే
తపనకులేంద్ర నాపలుకు ♦ తథ్యత గాంచెఁ గదా తదాప్తి నే
నిపు డట కేగి కొమ్మకుఁ ద్వ♦దేకమతిం బొడమింతు నంచు న
న్నృపతియనుజ్ఞఁ గైకొనుచు ♦ హృద్యవిమానము డిగ్గి యత్తఱిన్. 60

టీ. అపుడు; అలయక్షవిభుఁడు=ఆకుముదుఁడు; మహీంద్రుతోడన్ = సుచంద్రునితోడ; తపనకులేంద్ర=సూర్యవంశోత్తముఁడా! వధూటిన్=చంద్రికను; కంటివే=చూచితివిగదా! నాపలుకు=నామాట; తదాప్తిన్=అట్లునేఁజెప్పిన స్త్రీయుపలబ్ధిచేత; తథ్యతకాంచెఁగదా=యథార్థతనొందెఁగదా! నేన్; ఇపుడు; అటకున్ = ఆచంద్రికయుండుచోటికి; ఏగి; కొమ్మకున్=చంద్రికకు; త్వదేకమతిన్=నీయందలిప్రీతినపుట; పొడమింతున్=ఉదయింపఁజేయుదును. అంచున్; అన్నృపతియనుజ్ఞన్=ఆరాజునాజ్ఞను; కైకొనుచున్ = స్వీకరించుచు; హృద్యవిమానము = మనోజ్ఞపుష్పకమునుండి:డిగ్గి; అత్తఱిన్=ఆసమయమందు. దీనికి "వనధరఁజేరి" యనునుత్తరపద్యక్రియతో నన్వయంబు.

చ. వనధరఁ జేరి చారుతరు♦వారము చయ్యన దాఁటి పూర్వవ
ర్తన నవలాలఁ జేరఁ జనఁ ♦ దామరసానన లెల్ల వచ్చెఁ గా
ఘనగురుఁ డంచు నబ్రమునఁ ♦ గాంచఁగఁ గాంచనపీఠి డిగ్గి యా
జనవరకన్య యాళిజన♦సంవృతిఁ దా నెదు రేగి భక్తితోన్. 61

టీ. వనధరన్=ఉద్యానవనస్థలమును; చేరి; చారుతరువారము = మనోజ్ఞవృక్షసంఘమును; చయ్యనన్=శీఘ్రముగా; దాఁటి; పూర్వవర్తనన్=పూర్వరీతిగా; నవలాలన్=ఉవిదలను; చేరఁజనన్=చేరఁబోఁగా; తామరసాననలు ఎల్లన్=స్త్రీలందఱు; ఘనగురుఁడు=మనపెద్దయుపాధ్యాయుండు; వచ్చెఁగా=వచ్చెనుగదా! అంచున్; అబ్రమునన్=ఆశ్చర్యముతో; కాంచఁగన్=చూడఁగా; ఆజనవరకన్య=ఆచంద్రిక; కాంచనపీఠిడిగ్గి = బంగరుపీటనుండిదిగి; ఆళిజనసంవృతిన్=సఖీసముదయపరివృతిచేత; తాన్; ఎదురేగి=ఎదురొక్కని; భక్తితోన్. దీని కానతిసేయ ననుముందుక్రియతో నన్వయము.

చ. గురుకుచభారరేఖ నొగిఁ ♦ గోమలి యానతి సేయ నాదయా
కరమతి పెండ్లికూఁతురవు ♦ గమ్మని దీవన లిచ్చి తద్వధూ

త్కారకృతపూజనావిధులు • గైకొని తద్వనితాసమర్పితాం
బరచరరాజరత్నచయ•భాసురపీఠి వసించె నయ్యెడన్. 62

టీ. గురుకుచభారరేఖన్=గొప్పలగు స్తనములయొక్క భారాతిశయముతోడ; ఒగిన్=క్రమముగా; కోమలి=చంద్రిక; ఆనతిన్=ప్రణామమును; చేయన్; ఆదయాకరమతి=కరుణాకరమగు మదిగలయాతమునుడు(డు; పెండ్లికూఁతురవుకమ్ము అంచున్= పెండ్లికుమారితవుగమ్మనుచు; దీవనలుఇచ్చి=ఆశీర్వదించి; తద్వధూత్కారకృతపూజనావిధులు గైకొని=ఆవనితాకదంబముచేఁజేయఁబడిన పూజావిధానములను స్వీకరించి; తద్వనితాసమర్పితాంబరచర రాజరత్నచయభాసురపీఠిన్=ఆవనితలచే సమర్పింపఁబడిన యింద్రనీలమణిచయభాసురమైనపీఠమున; అంబరచరరాజరత్నములనఁగా సురరాజైన యింద్రునిసంబంధిరత్నములు, ఇంద్రనీలమణులనిఫలితము; వసించెన్=కూర్చుండెను. అయ్యెడన్. దీని క్రిమపద్యస్థ మగువసించెనుక్రియతో నన్వయము.

తే. మనుజపతికన్య సఖులతో • మణిమయాస
నమున వసియించె నప్పు డా•కోమిరెమిన్న
నెచ్చెలి చకోరి యన మించు•నెలఁత యోర్తు
కుముదుఁ దిలకించి యిట్లనుఁ • గుతుకఫణితి. 63

టీ. మనుజపతిజన్య=చంద్రిక; సఖులతోన్=చెలియలతోడ; మణిమయాసనమునన్=రత్నపీఠికయందు; వసియించెన్. అపుడు; ఆకోమిరెమిన్న నెచ్చెలి=చంద్రికయొక్కసకియ; చకోరియనమించునెలఁతయోర్తు=చకోరియనంబరఁగునొకస్త్రీ;కుముదున్=కుముదుని;తిలకించి=చూచి; కుతుకఫణితిన్=సంతసముతోఁగూడినవాక్కుచేత; ఇట్లనున్ = వక్ష్యమాణరీతిగాఁ బలుకును.

చ. హరిసమధామ యుష్మదరు•ణాంఘ్రులు గన్గొన నిప్డు మద్దృగం
బురుహము లెంతయుం జెడని•మోదముఁ జేకొనె దూర మయ్యె దు
స్తరహృదయాంధకారసము•దగ్రత లెల్లఁ బ్రవృద్ధిఁ గాంచె వి
స్ఫురదభిలాషచక్రములు • పొల్పడఁగె న్నిబిడప్రదోషముల్. 64

టీ. ఇందుఁ గుముద పరమయినయర్థము సూర్యపరమయినయర్థము గలుగుచున్నది. హరిసమధామ=సూర్యతుల్యమగు తేజముగలవాఁడా! యుష్మదరుణాంఘ్రులు=మీయొక్కశోణచరణములు, పాటలములగుకిరణములనియర్థాంతరము; కన్గొనన్=అవలోకింపఁగా; ఇప్డు; మద్దృగంబురుహములు=నా నేత్రము లనెడునంబురుహములు;ఎంతయున్=మిక్కిలి; చెడనిమోదమున్=నశింపనిసంతసమును; చేకొనెన్=పొందెను. దుస్తరహృదయాంధకారసముదగ్రతలు.—దుస్తర=తరింపవలనిగాని, హృదయాంధకారసముదగ్రతలు=హృదయమందుండెడు నజ్ఞా

నమను చీఁకటులయాధిక్యములు; ఎల్లన్; మాసిపమ్మెన్=తొలఁగెను; విస్ఫురదఖిలాప్తచక్రములు=ప్రకాశించుచున్న కోర్కులగుంపులనెడు చక్రవాకములు; ప్రవృద్ధిఁగాంచెన్=వృద్ధిఁబొందెను. నిబిడప్రదోషముల్=నిబిడములైన దురితములను రజనీముఖములు; పొల్పడఁగెన్=నశించెను.

సూర్యుని శోణకిరణదర్శనమున నంబురుహములు సంతసించుటయు చీఁకటులు మాసమగుటయు చక్రవాకములు వృద్ధినొందుటయు ప్రదోషములు శమించుటయు నెట్లో, అట్లు తమ చరణదర్శనమున నాకు నయనానందము అజ్ఞాననాశము వాంఛాసము దయాభివృద్ధి దోషశాంతియుఁ గలిగెననుట.

చ. అనుదినముం బ్రియంబును ద♦యామహిమంబును మించ వత్తు కే
జనవరపుత్త్రికామణికిఁ ♦ జక్క విపంచిక నేర్ప నేఁటికిన్
జనియె సుమీ యనేకదివ♦సంబులు మీఱిట రాక నేఁడు నిం
దునిఁ దెలికల్వలో యన ని♦నున్ గనఁ గోరు మదీయనేత్రముల్. 65

టీ. అనుదినమున్=ప్రతిదినమును; ప్రియంబును=ప్రేమమును; దయామహిమంబును=కరుణాతిరేకమును; మించన్; ఈజనవరపుత్త్రికామణికిన్=ఈరాజపుత్త్రికయగు చంద్రికకు; చక్కన్=బాగుగ; విపంచికన్=వీణను; నేర్పన్=అభ్యసింపఁజేయుటకు; వత్తురు. నేఁటికిన్=ఇప్పటికి; మీఱిటన్ రాక=మీరిచ్చోటికి వచ్చేరక; అనేకదివసంబులు=బహుదినములు; చనియెన్=కడచెను. నేఁడున్=ఇప్పుడుగూడ; ఇందునిన్=చందురుని; కనన్; తెలికల్వలోయనన్=తెల్లకలువలవలె; మదీయనేత్రముల్=నాకన్నులు; నినున్; కనన్=అవలోకించుటకు; కోరున్=ఇచ్ఛించును. అనఁగా నిప్పుడు నీవువచ్చుటకుముందుగూడ నిన్నుఁదలఁచుచుంటి ననుట.

చ. మునుపటియట్ల యిచ్చటికి ♦ మోదముతో నరుదేరకున్కి కో
జనపరివర్ణ్యదివ్యగుణ♦జాలక కారణ మేమి యేపురం
బెనసితి రేవిశేషగతు♦ లింపుగఁ గాంచితి రేనృపాలుతో
నను వగుమైత్త్రి సల్పితిరి ♦ యంతయుఁ దెల్పఁగదే దయామతిన్. 66

టీ. ఓజనపరివర్ణ్యదివ్యగుణజాలక=జనులచేవర్ణింపఁదగినటోత్తమగుణగణముగలవాఁడా! మునుపటియట్ల=పూర్వమువలెనె; ఇచ్చటికిన్; మోదముతోన్=సంతసముతోడ; అరుదేరకున్కికిన్=రాకుండుటకు; కారణముఏమి=హేతువేమి? ఏపురంబెనసితిరి = ఏనగరముఁబొందితిరి? ఏవిశేషగతులు; ఇంపుగన్=సొంపుగను; కాంచితిరి=అవలోకించితిరి; ఏనృపాలుతోన్=ఏరాజుతోడ; అనువగుమైత్త్రిన్=అనుకూలమగు చెలిమిని; సల్పితిరి=చేసితిరి? అంతయున్; దయామతిన్=కరుణాబుద్ధితోడ; తెల్పఁగదే.

క. అన వనితావాక్యసుధా, జనితామోదవ్రతమాన♦సవయోరుహుఁడై
యను వార యతుఁడు విభుఁడు, ట్లను వారణయానఁ గని మ♦హామధురోక్తిన్.

టీ. అనఁ=చకోరి యిట్లనఁగా; వనితావాక్యసుధాజనితామోదవృతమానసపయోరుహుఁడై.—వనితావాక్యసుధా=చకోరిపలుకులను నమృతముచేత, జనిత=పుట్టినట్టి, ఆమోద=సంతసముచేత, వృత=కూడినట్టి, మానసపయోరుహుఁడై=చిత్తాంభోజముగలవాఁడై; అనువారన్=అనుకూలమగునట్లుగా; యక్షవిభుఁడు=కుముదుఁడు; వారణయానన్ కని=ఆ స్త్రీని జూచి; మహామధురోక్తిన్=మిక్కిలి తియ్యనిమాటచేత; ఇట్లు అనున్=వక్ష్యమాణప్రకారముగఁ బల్కును.

మ. కలఁ డత్యుత్కటధాటికాతురగరింఖాజాతభూక్షోదక
జ్జలచిహ్నప్తమహాప్రదీపహృతతీక్ష్ణధ్వాంతవేలాకుభృ
ద్బిలగేహప్రతిమాయితామితసమిద్భేరీకులధ్వానమం
డలనిర్విణ్ణరిపుక్షితీంద్రుఁడు సుచంద్రక్ష్మాపచంద్రుం డిలన్. 68

టీ. ఇలన్=భూమియందు; అత్యుత్కటధాటికాతురగరింఖా జాతభూక్షోదకజ్జలచిహ్నప్తమహఃప్రదీపహృత తీక్ష్ణధ్వాంతవేలాకుభృద్బిల గేహప్రతిమాయితామితసమిద్భేరీకులధ్వానమండల నిర్విణ్ణరిపుక్షితీంద్రుఁడు.—అత్యుత్కట=మిక్కిలియధికమగు, ధాటికా=జైత్రయాత్రయందలి, తురగ=అశ్వములయొక్క, రింఖాజాత=గిట్టలవలనఁబుట్టిన, భూక్షోద=భూపరాగమనెడు, కజ్జల = మసియొక్క, చిహ్నప్త=చిహ్నమునుబొందిన, మహఃప్రదీప=ప్రతాపమనెడుదీపముచేత, హృత=హరింపఁబడిన, తీక్ష్ణధ్వాంత=గాఢాంధకారముగల, వేలాకుభృద్బిల=లోకాలోకపర్వతగుహాలనెడు, గేహ=గృహములకు, ప్రతిమాయిత = బొమ్మలుగాఁజేయఁబడిన, ఇది రిపుక్షితీంద్రులకువిశేషణము, అమిత=కొలఁదిలేనట్టి, సమిద్భేరీకులధ్వాన=యుద్ధభేరులగుంపులధ్వనులయొక్క, మండల=సమూహముచేత, నిర్విణ్ణ=నిర్వేదమునొందిన, రిపుక్షితీంద్రుఁడు=శత్రురాజులుగలవాఁడు; సుచంద్రక్ష్మాపచంద్రుండు = సుచంద్రుండను రాజచంద్రుఁడు; కలఁడు.

అనఁగా సుచంద్రునిశత్రువులు లోకాలోకపర్వతగుహలు నిబిడధ్వాంతసంతతిసమావృతంబు లని యచట దాఁగి యున్నవా రనియు, అబిలగృహములు సేనాపరాగ మనెడుమషీచిహ్నము గలసుచంద్రప్రతాపదీపముచేత నంధకారశూన్యములై యుద్ధభేరీనాదవ్యాప్తములు కాఁగా వారలు మన కిచట నైన క్షేమము లేక పోయెఁ గదా యని నిర్విణ్ణులై బొమ్మలవలె చేష్టారహితులై యున్నారనియు భావము. సూర్యతేజము ప్రసరింపనిలోకాలోకపర్వతగుహలవఱకు సుచంద్రుని ప్రతాపము ప్రసరించినదనియు సర్వశత్రువులుం బలాయితులై పర్వతగుహల నాశ్రయించినా రనియు ఫలితార్థము.

మ. సరసీజాతహితాన్వయేశ్వరుయశోజాతంబు చక్రాప్తమై
హరిశోభాంచితమై భృతాబ్జనికరంబై రాజిలం దత్తులే
తరభావోదితపంక మంకవిధిచేత న్మేనునం గప్పినన్
సురకుత్కీలవరప్రదక్షిణముఁ బూనుం జంద్రుఁ డక్రాంతమున్. 69

టీ. వెనుకపద్యమున సుచంద్రుని ప్రతాపాతిశయమును జెప్పి యిట నారాజుయశోతిశయమును జెప్పుచున్నాఁడు.—సరసీజాతహితాన్వయేశ్వరయశోజాతంబు = సూర్యవంశ్యులయందు శ్రేష్ఠుండగు సుచంద్రునియొక్క కీర్తిపుంజము; చక్రాఙ్కమై=రాష్ట్రహితమై, చక్రవాకప్రియమై యనియర్థాంతరము; హరిశోభాంచితమై=సింహతేజముచేతనొప్పుచున్నదై, సూర్యదీప్తిచేతఁ బ్రకాశించుచున్నదైయనియర్థాంతరము; భృతాబ్జనికరంబై=పోషింపఁబడిన శంఖములుగలదై, పద్మములుగలదైయనియర్థాంతరము; రాజిలన్=ప్రకాశింపఁగా; తత్తులేతరభావోదితపంకము.—తత్తులేతరభావ=ఆయశస్సుయొక్క సామ్యాభావముచేత, ఉదిత=ఉదయించినట్టి, పంకము=పాపము; అంకవిధిచేతన్=కలంకరూపముగా నుట; మేనునన్=శరీరమందు; కప్పినన్=వ్యాపింపఁగా; చంద్రుఁడు=శీతాంశువు; అక్రాంతమున్=ఎల్లపుడును; సురకుత్కీలవరప్రదక్షిణమున్.—సురకుత్కీలవర=మేరుపర్వతముయొక్క, ప్రదక్షిణమున్=ప్రదక్షిణమును; పూనున్=వహించును.

అనఁగాఁ జంద్రునికాంతి చక్రవాకాప్రియము సూర్యతేజముచే విరాజిల్లనిదియుఁ బంకజములనుబోషింపనిదియు, సుచంద్రునియశోజాల మట్లుకాక చక్రప్రియము సూర్యతేజోరాజితంబు అబ్జపోషకంబునై విరాజిల్లుటం జేసి, చంద్రునకుఁ దద్యశోరాశిసామ్యము లేమిచేఁ గలంకరూపముగాఁ బాపము శరీరమున వ్యాపించినందున నతండు తత్పాపనివృత్తికై మేరుప్రదక్షిణముఁ బ్రత్యహముఁ జేయుచున్నాఁ డని భావము. సుచంద్రయశము రాష్ట్రహితమై సింహశంఖసమానధావళ్యము గలిగి తేజరిల్లుచున్న దని ఫలితార్థము.

మ. పరవాహిన్యధినాథజీవనహృతిం • బాటిల్లుతద్భూపని
ర్భరధామస్థితి తన్మహాప్రథనగో•త్రాధూళి తద్వృత్తిమైఁ
గర మొప్పన్వలయాద్రిఁ జేరుఁ దదరి•క్ష్మాపాళినై జాంగముల్
వరకీరాళి పికవ్రజం బనుచర•త్వం బూనఁగాఁ జేయఁగన్. 70

టీ. ప్రకారాంతరముగఁ బ్రతాపమునే చెప్పుచున్నాఁడు.పరవాహిన్యధినాథజీవనహృతిన్.—పరవాహిన్యధినాథ=శత్రుసేనానాయకులయొక్క, జీవన=ప్రాణములయొక్క, హృతిన్=హరణముచేత; పాటిల్లుతద్భూపనిర్భరధామస్థితి=ఒప్పునట్టియారాజుయొక్క యధికమైనప్రతాపస్థితి, ఇదికర్త; తన్మహాప్రథనగోత్రాధూళి.—తత్=ఆరాజుసంబంధియగు, మహాత్=అధికమైన, ప్రథనగోత్రాధూళి=యుద్ధభూపరాగము; తద్వృత్తిమైన్=ఆపరవాహిన్యధినాథజీవనహృతియనెడువృత్తిచేత; అనఁగా పరమైనసముద్రముయొక్క నీరింకించుటచేతననుట; కరము=మిక్కిలి; ఒప్పన్; తదరిక్ష్మాపాళి=ఆయనశత్రురాజులగుంపు; నైజాంగముల్=తమశరీరములు; వరకీరాళి.—వర=శ్రేష్ఠమగు, కీరాళి=చిలుకలగుంపు; పికవ్రజంబు=కోకిలలగుంపు; అనుచరత్వంబు=సహచరతను; ఊనఁగాఁజేయఁగన్=వహింపఁజేయుచుండఁగా; వలయాద్రిన్=లోకాలోకపర్వతమును; చేరున్=పొందును.

సుచంద్రునిప్రతాపము శత్రుసేనానాయకులప్రాణహరణముఁ జేసి లోకాలోకముపఱకు వ్యాపించిన దనియు, తదీయయుద్ధభూపరాగము సముద్రమునీరింకించిన దనియు, తదరిరాజుల

శరీరములు పలుకులచేతను తలవెంట్రుకలచేతను శుకపికాళిననుసరించినవనియు భావము. వాని శరీరములు కీలుగొంటులుపడి తలవెంట్రుకలూడిపోయి పక్షిశరీరములవలె నుండెనని ఫలితార్థము.

చ. సరసకలాంచితాస్యుఁ డయి • చారువిలోచనపద్ముఁడై కళం
కరహితగాత్రుఁడై జగతిఁ • గన్పడునానృపమాళితోఁ జనుల్
హరిముఖునిన్ సుమాంబకుఁ గ•ళంకసమన్వితగాత్రుఁ బోల్తురే
నిరుపమసౌందరీవిధికి • నిచ్చలు సాటి య టంచు నెమ్మదిన్. 71

టీ. ఇటసుచంద్రు సౌందర్యము చెప్పఁబడు. సరసకలాంచితాస్యుఁడయి.—సరస=శ్రేష్ఠములగు, కలా=కాంతులచేత, అంచిత=ఒప్పుచున్న, ఆస్యుఁడయి=ముఖముగలవాఁడై; శ్రేష్ఠములగువిద్యలచే నంచితమగుముఖముగలవాఁడయి యనియర్థాంతరము; చారువిలోచనపద్ముఁడై=మనోహరమైనపద్మములవంటి నేత్రములుగలవాఁడయి, మనోహరములైన నేత్రములందు పద్మ యనఁగా లక్ష్మి గలవాఁడైయని యర్థాంతరము; కళంకరహితగాత్రుఁడై=కలంకశూన్యమైనశరీరముగలవాఁడయి; ఒచ్చెము లేనిశరీరముగలవాఁడైయని యర్థాంతరము; జగతిన్=లోకమందు; కన్పడునానృపమాళితోన్=చూపట్టుచున్నయారాజశేఖరునితోడ; జనుల్=లోకులు; హరిముఖునిన్=నలకూబరుని, గుఱ్ఱపుమోరగలవాని నని కాని కోఁతిమోర గలవాని నని గాని ధ్వని; సుమాంబకున్=మరుని; పూఁగంటివాని నని ధ్వని; కలంకసమన్వితగాత్రున్=చంద్రుని, ఒచ్చెములతోఁగూడినశరీరముగలవానినని ధ్వని; నిరుపమసౌందరీవిధికిన్ = సాటిలేని సౌందర్యవిధానమునకు; నిచ్చలు=ఎల్లపుడు; సాటియటంచున్=సరియనుచు; నెమ్మదిన్=చిత్తమందు; పోల్తురే=సరిపోల్పరనుట.

అనఁగా నట్టిముఖము లోచనములు గాత్రముగల సుచంద్రునితోడ గుఱ్ఱపుమూతి పువ్వుపడిన కన్నులు ఒచ్చెములుగలగాత్రము గలనలకూబరసుమాయుధచంద్రులు సాటి యని జనులుపోల్పరని తాత్పర్యము. సుచంద్రునియందు నిరుపమానసౌందర్యము వ్యంగ్యము.

చ. అవనిపచంద్రరూపవిభ•వాతిశయశ్రవణోయమానమో
హవితతి యూను భోగిమను•జామరకన్యల నిచ్చ నేచుఁ బం
చవిశిఖుఁ డాశుగత్రితయిఁ • జక్కఁగ శేషశరద్వయంబుఁ గాం
తు వెలయ డాఁచు ముంగల న•ఖండఫలంబు వహించు నన్మతిన్. 72

టీ. అవనిపచంద్రరూపవిభవాతిశయశ్రవణోయమానమోహవితతి.— అవనిపచంద్ర=సుచంద్రునియొక్క, రూపవిభవ=రూపసంపదయొక్క, రూపలక్షణమువ్రాయంబడియె, అతిశయ=ఆధిక్యముయొక్క, శ్రవణ=వినుటచేత, ఊయమాన=నేయఁబడుచున్న, వృద్ధిఁబొందింపఁబడుచున్నయనుట, "ఊఙ్ తన్తుసన్తానే, అనుదానిపై శానచ్ప్రత్యయము చేయఁగా ఊయమాన యని యైనది, మోహవితతి=మోహాతిశయమును; ఊను భోగిమనుజామరకన్యలన్=

వహించునట్టి నాగకన్యలను మనుజకన్యలను దేవకన్యలను, స్వర్గమర్త్యపాతాళములను లోకత్రయమందుండు కన్యకలననుట; నిచ్చల్ = ఎల్లప్పుడు; పంచవిశిఖుండు = మన్మథుడు; అనుగత్రితయిన్ = అరవిందనవమల్లికానీలోత్పలములను మూడుబాణములచేత. నెక్కొని = పొసగగ; ఏఁచున్ = బాధించును. శేషశరద్వయంబున్ = తక్కిన చూతాశోకకుసుమములనెడు బాణద్వయమును; మంగిలన్ = ఈచంద్రికను ఆరాజునకుఁ బరస్పరావలోకన మబ్బినపు డనుట; అఖండఫలంబు = అవిచ్ఛిన్నలాభము, చూతాశోకములు ఫలించుఁ గావున నఖండమైనపండ్లనని యర్థాంతరము తోఁచుచున్నది; వహింమనస్మృతిన్ = పొందుననుతలంపుచేత; కాంక్షవెలయన్ = కోర్కి యతిశయించునట్లు; డాఁచున్ = మఱుఁగుపఱచును.

"మార ఏకో మహాధన్వీ ద్వయ మేకం కరోత్యసౌ" అనుటచే మన్మథశరప్రయోగమునకుఁ దరుణీతరుణసంఘటనమే ముఖ్యఫలంబు గాన నట్టిఫలము స్వర్గమర్త్యపాతాళలోకస్త్రీలయందుఁ గాక చంద్రికయందే కలుగు నని కాముండు చంద్రికాసుచంద్రసమావేశసమయమును బ్రతీక్షించుచున్నాఁ డని భావము. ఇందువలన దేవాంగనాదిప్రార్థనీయసౌందర్యము గలవాఁడనియు, వారలకును సుల్లభుఁ డనియు, దానం జేసి చంద్రికచే నవశ్యముగఁ గోరఁదగినవాఁడనియు, ఫలిత మగుచున్నది.

తే. ఇట్టిసకలానఘగుణోత్క • రాబ్ధి యైన
యామహీకాంతుతో మైత్రి • యడరుకతన
నిన్నిదినములు తదుద్యోగ • మెనసి యుంటి
నెడయ నేఁ గొమ్మ హృద్వీథిఁ • బొడమకున్కి. 73

టీ. ఇట్టిసకలానఘగుణోత్కరాబ్ధియైనయామహీకాంతుతోన్ = ఈప్రకారముగ సకలనిర్దుష్టగుణముల కాకరుం డైనయాసుచంద్రుఁ డనురాజుతోడ; మైత్రి = సఖ్యము; అడరుకతనన్ = అతిశయించుహేతువున; ఇన్నిదినములు; తదుద్యోగ మెనసి = అతనిసంబంధము నొంది; ఉంటిన్. కొమ్మ = చకోరీ! హృద్వీథిన్ = అంతరంగప్రదేశమందు; పొడమకున్కిన్ = తోఁపకుండుటచేత; నేన్; ఎడయన్ = ఆరాజు నెడఁబాయను.

ఇట్టి సకలగుణములుగల సుచంద్రునితోఁ గూడి యారాజు నెడఁబాయఁజాలక యుంటినని భావము.

ఉ. ఈనృపకన్యఁ జూచురతి • నిప్పుడు తజ్జనరాడనుజ్ఞచేఁ
బూని రయాప్తి వచ్చితి న • పూర్వవిలాసినియై రహించునీ
మానినిఁ గాంచ నిత్తతి న • మందముదావళిఁ జెందె నాత్మకం
జానన యంచు నామయుకు • లాగ్రణి వెండియుఁ బల్కె నాచెలిన్. 74

టీ. ఈనృపకన్యన్ = ఈరాజపుత్త్రిని; చూచురతిన్ = చూడవలెననువాంఛచేత; ఇప్పుడు; తజ్జనరాడనుజ్ఞచేన్ = ఆరాజు నానతిచేత; పూని = ప్రయత్నపడి; రయాప్తిన్ = వేగప్రా

ప్తిచేత; వచ్చితిన్. అపూర్వవిలాసినియై=లోకోత్తరవిలాసముగలదై; రహించుసీమానినిన్=ఒప్పుచున్నయీచంద్రికను; కాంచన్=చూడఁగా; ఇత్తఱిన్=ఈసమయమున; కంజానన = ఓ పద్మముఖి! ఆత్మ=చిత్తము; అమందముదావళిన్ = అధికమగుసంతోషపరంపరను; చెందెన్=పొందెను. అంచున్; అమయకులాగ్రణి=అయక్షేశ్వరుఁడు, "తురంగవదనోమయుః" అని యముఁడు; ఆచెలిన్=ఆచకోరినిగూర్చి; వెండియున్; పల్కున్=వచించును.

చ. అళికచ నెమ్మదిం దలఁప • నప్పతికే తగు నీవెలంది యీ
జలరుహనేత్రకే తగు ర•సారమణేంద్రుఁడు గాన నామనో
జలలితమూర్తి యీలలనఁ • జక్క వరించినఁ గాక మామదిం
దళమయి మించ నేర్చునె యు•దారకుతూహలవార్ధివీచికల్. 75

టీ. అళికచ=తుమ్మెదలఁబోలువెండ్రుకలుగలచకోరీ! నెమ్మదిన్=మంచిమనస్సుచేత; తలఁపన్=విచారింపఁగా; ఈవెలంది=చంద్రిక; అప్పతికే=ఆసుచంద్రునకే; తగున్=ఒప్పును. రసారమణేంద్రుఁడు=ఆరాజేంద్రుఁడు; ఈజలరుహనేత్రకే=ఈకమలాక్షికే; తగున్=ఒప్పును. కానన్=ఆకారణముచేత; ఆమనోజలలితమూర్తి=ఆమన్మథసుందరతనువుగలరాజు; ఈలలనన్=ఈచిన్నదానిని; చక్కన్; వరించినన్ కాక=వరించినంగాని; మామదిన్=మామనస్సునందు; ఉదారకుతూహలవార్ధివీచికల్.—ఉదార=అధికమగు, కుతూహల=సంతసమనెడు, వార్ధి=సముద్రముయొక్క, వీచికల్=తరఁగలు; దళమయి=దట్టమయి; మించన్ నేర్చునె=అతిశయింప నేర్చునా, నేర్వవనుట.

మ. కనుగల్వల్ వికసిల్ల మోదము పొసం•గన్ దజ్జనాధీశచం
ద్రుని వీక్షించినఁ గాని మామకహృదు•ద్భూతస్పృహారేఖ యి
మ్మెనయం జాలదు చాన యవ్విభుని మీ•కీలోపలం గాంచఁ గ
ల్గు నన న్గోమలి కిన్నరేశ్వరునిఁ బ•ల్కు న్గోర్కి దైవాఱఁగన్. 76

టీ. కనుగల్వల్=కన్నులనెడుకలువలు; వికసిల్లన్ = వికసించునట్లును; మోదము=సంతసము; పొసంగన్=కలుగునట్లును; తజ్జనాధీశచంద్రున్=ఆరాజచంద్రుని; వీక్షించినఁగాని=చూచినంగాని; మామకహృదుద్భూతస్పృహారేఖ=నామనంబున నుదయించినవాంఛాతిశయము; ఇమ్మెనయన్ చాలదు=అనుకూల్యముఁబొందఁజాలదు. చాన=ఓచకోరీ! అవ్విభునిన్=ఆరాజును; మీకున్; ఈలోపలన్=ఇంతలోనే; కాంచఁగల్గున్=చూచుటసంభవించును. అనన్=ఇట్లువచింపఁగా; కోమలి=చకోరి; కోర్కి దైవాఱఁగన్ = కోరికఅతిశయింపఁగా; కిన్నరేశ్వరునిన్=కుబేరునిగూర్చి; పల్కున్=వచించును.

మ. హరివంశోత్తమసద్గుణాళి విని ని•త్యం బేము వర్ణింప న
త్వరబుద్ధిం గనఁ జాన గోరుఁ బతి నా•త్మం గాంచ మాకుం దదం

తర మెల్లప్పుడు మించుఁ గాన నలగో♦త్రాభర్త నే మిప్పు డే
కరణిం గాంతుము గాంచుదారిఁ గృప ని♦క్కం దెల్పవే నావుడున్. 77

టీ. హరివంశోత్తము సద్గుణాళిన్ = సూర్యవంశమునందు త్తముఁడగు నారాజుయొక్క శ్రేష్ఠగుణములగుంపును; విని=ఆకర్ణించి; నిత్యంబు=ఎల్లప్పుడు; ఏము; వర్ణింపఁగాన్ = ఆ రాజు గుణములనుగొనియాడఁగా; చాన=చంద్రిక;సత్వరబుద్ధిన్=త్వరతోఁగూడినమతితోడ; పతిన్=రాజును, భర్త నని యుఁ బోఁచు; కనన్ = అవలోకించుటకు; ఆత్మన్ = మనమున; కోరన్=వాంఛించును. మాకున్; కాంచన్ = చూచుటకు; తదంతరము=ఆమనస్సు; అంతర శబ్దార్థములు చెప్పునపుడు "బహిరవసరమధ్యేంతరాత్మనిచ" అనియుమనుఁడు; ఎల్లప్పుడు; మించున్=అతిశయించును. కానన్=ఆహేతువువలన; అలగోత్రాభర్తను=ఆరాజును; ఏము; ఇప్పుడు=ఈ సమయమున;ఏకరణిన్=ఏరీతి; కాంతుము=చూతుము. కాంచుదారిన్=అవలోకించుత్రోవను; కృపనిక్కన్ = కరుణయతిశయిల్లునట్లు; తెల్పవే=అనరాదే. నావుడున్=ఇట్లనఁగా. దీనికిముందుపద్యముతో నన్వయము.

మ. వనితా యావిభుఁ గాంచువాంఛ మదిఁ జె♦ల్వంబూనినం గాంచవే
జనితానక్తి నృపాలు మామకకర♦చ్ఛాయ న్మనోవీథి నూ
త్నవితాంతాద్భుత మబ్బ నంచు మహిమం♦ దత్సద్గుణశ్రేణికా
ఖని తాఁ బ్రాక్కృతమాయ నంతయుఁ జనం♦ గావింప నప్పట్టునన్. 78

టీ. వనితా=చకోరి! ఆవిభున్ = ఆరాజును; కాంచువాంఛ = చూడవలెననుకోర్క; మదిన్=మనస్సునందు; చెల్వంబుఊనినన్=చక్కఁగాఁగుదిరినయెడ, మనోవీథిన్=మనఃప్రదేశమునందుః నూత్ననితాంతాద్భుతము=అపూర్వమైన మిక్కిలియాశ్చర్యము; అబ్బన్ = అమరునట్లు; మామకకరచ్ఛాయన్=నాచేతిచాయను; జనితాసక్తిన్ = కలిగినప్రీతితోడ; నృపాలున్=రాజును; కాంచవే=చూడుమా. అంచున్ = ఇట్లనుచు; తత్సద్గుణశ్రేణికాఖని=ఆ శ్రేష్ఠగుణాకరుఁడగుకుముదుఁడు; మహిమన్ = ప్రభావముచేత; తాన్; ప్రాక్కృతమాయను అంతయున్=ఇతరజనులకుఁ గాన్పింపఁ గూడదని మున్ను చేసినమాయ నంతయు; చనన్=తొలఁగునట్లు; కావింపన్ = చేయఁగా; అప్పట్టునన్ = ఆప్రదేశమున. దీనికి ముందు కన్వయము.

సీ. బెళుకుచూపులవానిఁ ♦ బలుమాఱు బలుమారు
సొంపు నిందించుమే♦ల్సొబగువాని
నెఱపు మించినవాని ♦ నెఱిమించునెఱిమించు
మెలపుఁ గందించు నె♦మ్మేనివాని
సొగసు మీఱినవానిఁ ♦ బగడంబుపగడంబు
తలఁపుఁ గుదించుమే♦ల్తళుకువానిఁ

గళుకు హెచ్చినవానిఁ • గపురంపుకపురంపు
వలపుఁ జిందించున • వ్వులయువానిఁ

తే. కళ మెలకువాని మంజులో • జ్జ్వలమువానిఁ
చెలువు గలవాని నొయ్యార • మలరువాని
నభ్రయానసమాసీను • నాక్షితీశుఁ
జూచి వెఱఁగంది నిలిచి రా • సుదతు లపుడు. 79

టీ. తెళుకుచూపులవానిన్=ప్రకాశించుచున్న దృష్టులుగల వానిని; పలుమాఱు=సారెకు; బలుమారుసొంపు.—బలు=అధికమైన, మారు=మన్మథునియొక్క, సొంపు = సౌందర్యమును; నిందించుమేల్సొబగువానిన్ = నిందించునట్టి మేలైన చక్కఁదనముగలవానిని; ఒఱపుమించినవానిన్=యోగ్యతచే నతిశయించినవానిని; నెఱమించు నెఱమించుమెలపున్.—నెఱ=అధికముగ, మించు=ప్రకాశించుచున్న, నెఱమించు=నిండుమెఱపుయొక్క, మెలపున్=జాగరూకతను; కందించునెమ్మేనివానిన్ = శ్రమపఱచునందమగు శరీరముగలవానిని; సొగసుమీఱినవానిన్=అందముచేత నతిశయిల్లువానిని; పగడంబు పగడంబుతలఁపున్.— పగడంబు=ప్రవాళముయొక్క, పగ=విరోధముయొక్క, డంబు=అతిశయముయొక్క, తలఁపున్=చింతను, అనఁగా సంకల్పమును; కుందించుమేల్ తళుకువానిన్.—కుందించు=దుఃఖపెట్టుచున్న, మేల్=అధికమైన, తళుకువానిన్=ప్రకాశముగలవానిని; కళుకుహెచ్చినవానిన్=కాంతిచే నతిశయించినవానిని; కపురంపుకపురంపువలపున్.—క=సుఖమునకు, పురంపు=స్థానమైన, కపురంపువలపున్=కర్పూరసంబంధి పరిమళమును; చిందించునవ్వులయువానిన్=చెదరఁగొట్టుచున్న మందహాసమువ్యాపించువానిని; కళ మెలకువానిన్ = కళా ప్రకాశముగలవానిని; మంజులోజ్జ్వలమువానిన్=మనోహరమైన శృంగారముగలవానిని; "ఉజ్జ్వలోధీరశృంగారవిశదేషువిలాసిని" అని విశ్వము; చెలువుగలవానిన్=అందకాని; ఒయ్యారమలరువానిన్=విలాసమొప్పువానిని; అభ్రయానసమాసీనున్=విమానారూఢుని; ఆక్షితీశున్=ఆసుచంద్రుని; చూచి; వెఱఁగంది = ఆశ్చర్యమంది; ఆసుదతులు=ఆస్త్రీలు; నిలిచిరి. అపుడు=ఆసమయమున, దీనికుత్తరపద్యస్థ క్రియతో నన్వయము.

చ. పులకలు మేన నిక్క వల • పుంబస మానసవీథిఁ జిక్క దృ
క్స్థలి ననిమేషవిస్ఫురణ • దక్కఁ బ్రమోదము చిందు ద్రొక్క ని
ర్మలమణిపీఠి డిగ్గి యొక • మానిని కేల్కయిలాగు వూని యా
యలికులవేణి రాజకును • మారుఁగుఁ గాంచె నొకింత సిబ్బితిన్. 80

టీ. మేనన్=శరీరమందు; పులకలు = గగురుపాటులు; నిక్కన్ = అతిశయింపఁగా; మానసవీథిన్=అంతరంగమందు; వలపుంబస=మోహసమృద్ధి; చిక్కన్=చేరఁగా; దృక్స్థలిన్=

చూపునందు; అనిమేషవిస్ఫురణ=ఱెప్పపాటులేమియొక్క స్ఫూర్తి; దక్కన్=లభింపఁగా; ప్రమోదము=సంతసము; చిందుద్రొక్కన్=నటింపఁగా; అయలికులవేణి=నీలవేణి యగు నా చంద్రిక; ఒకమానిని కేలుకయిలాగు=ఒక స్త్రీయొక్క హస్తావలంబమును; ఊని=వహించి; నిర్మలమణిపీఠిన్ = స్వచ్ఛమగుమణిమయ పీఠమునయుండి; డిగ్గి=దిగి; రాజకుసుమాశుగున్=రాజమన్మథుఁడగు సుచంద్రుని; ఒకింతసిబ్బితిన్=కొంచెములజ్జచేత; కాంచెన్=అవలోకించెను.

ఇచటఁ జంద్రికకు లోకోత్తరవస్తుదర్శనమున విస్మయము, దానంజేసి మేనఁబులకలు, తదనంతర మాతనియందు రత్యుదయము, తదనంతరము మనోరథలాభముచేత హర్షము, దానంజేసి నిమేషశూన్యదర్శనము, ప్రథమదర్శనమున లజ్జోదయము చెప్పఁబడియె. శ్లో "లోకోత్తరపదార్థానా మపూర్వా లోకనాదిభిః। విస్తారశ్చేతసోయస్తు విస్మయ స్సనిగద్యతే। క్రియా స్తత్రాక్షివిస్తారసాధూక్తి పులకాదయః" అని విస్మయలక్షణ తత్కార్యకారణములు, శ్లో. "రోమాఞ్చోవిస్మయోత్సాహ హర్షాద్యైస్తత్రవిక్రియాః। రోమోద్గమోముఖోల్లాసగాత్రసంస్పర్శనాదయః" అనిరోమాంచలక్షణతత్కార్యకారణములు, శ్లో "యూనోరన్యోన్యవిషయా స్థాయినీచ్ఛారతిర్భవేత్। నిసర్గేణాభియోగేనసంసర్గేణాభిమానతః। ఉపమాధ్యాత్మ శ్చ విషయైరేషా స్యాత్తత్రవిక్రియాః। కటాక్షపాతభ్రూక్షేపప్రియవాగాదయోమతాః" అనిరతిలక్షణతత్కార్యకారణములు, శ్లో "మనోరథస్యలాభేనసిద్ధ్యాయోగ్యస్యవస్తునః। ప్రియసంగమదేవాదిప్రసాదాదేశ్చకల్పితః। మనఃప్రసాదోహర్షస్స్యాత్తత్రనేత్రస్యఫుల్లతా। ప్రియభాషణమాశ్లేషః పులకానాంప్రరోహణమ్" అనిహర్షలక్షణ తత్కార్యకారణములు, తెలియవలయు. నేత్రస్యఫుల్లతా, అనుటచేత నిర్నిమేషభావమునువివక్షితమే. అట్లు "నివాతపద్మస్తిమితేన చక్షుషానృపస్యకాంతంపిబతస్సుతాననమ్। మహోదధేఃపూర ఇవేన్దుదర్శనాద్గురుః ప్రమోదః ప్రబభూవచాత్మని" ఇత్యాదులయందు నిర్నిమేషతఁ జూడవలయు. శ్లో॥ "అకార్యకరణావజ్ఞాస్తుతినూతనసంగమైః। ప్రతీకారాక్రియాద్యైశ్చ వ్రీడాత్వనతిధృష్టతా। తత్రచేష్టానిగూఢోక్తిరాధోముఖ్యవిచిన్తనే। అనిర్గమోబహిః క్వాపిదూరాదేవావగుంఠనమ్। నఖానాంకృన్తనంభూమిలేఖనం చైవమాదయః" అని లజ్జాలక్షణ తత్కార్యకారణములు తెలియవలయు. ఇట్లుచెప్పినవీనిలో రతియనునదిస్థాయిభావము, అది, శ్లో "నియతంవికాసవిస్తృతివిక్షోభక్షేపసంజ్ఞితాధర్మాః। చత్వారోజాయన్తేసపదివిభావాదిసంగమేమనసః। కథితోవికాసమూలశ్శృఙ్గారోవిస్తరోపధిర్వీరః। క్షోభోపధిస్తురౌద్రోబీభత్సఃక్షేపమూలకః పూర్వైః। హాస్యాశ్చర్యభయానకదయావికాసాదిమూలకాఃక్రమశః" అనుటవలనవిభావాదిసంగమము నమనసునందుఁగలుగు వికాసరూపధర్మము, దానికిస్థాయిత్వము సజాతీయవిజాతీయానభిభావ్యమైయావదానందానుభవము నిలిచియుండుటంబట్టి కలిగినది, తల్లక్షణంబువెనుక వ్రాయంబడియె. విస్మయంబు స్వతంత్రముగ నద్భుతరసమునుగూర్చి స్థాయియైనను నిటదానికి స్థాయిత్వముగలుగదు. దానికనుభవపర్యంతావస్థాయిత్వములేక కించిత్కాలావస్థాయిత్వ ముండుటం బట్టి దానియందు "విరుద్ధైరవిరుద్ధైర్వాభావైర్విచ్ఛిద్యతేనయః। ఆత్మభావన్నయత్యన్యాన్" ఇత్యాదిస్థాయిలక్షణము సమన్వయింపదు. మఱియున్న, "రత్యాదయఃస్థాయిభావాస్స్యుర్భూయిష్ఠవిభావజాః। స్తోకైర్విభావైరుత్పన్నాస్తఏవవ్యభిచారిణః॥ అను సంగీతరత్నాకరమువల

నను, ‘‘భావోవాపి రసోవాపి ప్రవృత్తిర్వృత్తిరేవవా । సర్వేషాంసమవేతానాం రూపం యస్య భవేద్బహు । సమస్తవ్యో రసస్థాయీ శేషాస్సంచారిణోమతాః॥ అను భరత వచనమువలనను, దానికి రతినిగూర్చి సంచారిత్వమే ఘటిల్లునని తెలియవలయు. ఇఁక రోమాంచమనునది సాత్త్వికభావము, అదియనుభావవిశేషమె, మనోగతభావమును బయల్పఱచుభావము లనుభావములు, వానిలక్షణములు భేదములు వెనుక వ్రాయఁబడియె. హర్షము లజ్జయు సంచారులు, ఇవి రతినిబుష్టిపఱచునవి, ‘‘ఉన్మజ్జన్తో నిమజ్జన్తః స్థాయిన్యమ్బునిధావివ । ఊర్మివద్వర్ధయన్త్యేనం యాన్తితద్రూపతాంచతే’’ ఇత్యాదులు తత్ప్రమాణంబులు. ఇట్లు సాత్త్వికవ్యభిచారులచే నుపచితమగు స్థాయి రసరూపతనొందునని ముందు తెల్లమగును.

చ. జనపతియాస్యచంద్రుఁ గనఁ ♦ జాలఁ జెలంగువధూటికావలో
కనకుహనాచకోరములు ♦ గ్రక్కున వ్రీళతమశ్చయంబు పో
ల్చిన భ్రమియింప దాని సడ♦లించె మరుండు విచిత్రశక్తి నూ
తనశరజాతనిర్వమదు♦దారశిఖోదయరాగవైఖరిన్. 81

టీ. జనపతియాస్యచంద్రున్=రాజుముఖమనెడుచంద్రుని; కనన్=చూచుటకు; చాలన్=మిక్కిలి; చెలంగువధూటికావలోకనకుహనాచకోరములు = ఒప్పుచున్న చంద్రిక చూపులను నెపముగల వెన్నెలపులుఁగులు; గ్రక్కునన్=వేగముగా; వ్రీళతమశ్చయంబు=లజ్జయను నంధకారపుగుంపు; పొల్చినన్=ఉదయించుటచేత; భ్రమియింపన్=కలఁతనొందఁగా; మరుండు=మన్మథుఁడు; విచిత్రశక్తిన్=అద్భుతసామర్థ్యముచేత; నూతనశరజాతనిర్వమదుదారశిఖోదయరాగవైఖరిన్.—నూతన=క్రొత్తదగు, శరజాత=బాణసంఘముచేత, నిర్వమత్=వెడలుచున్న, ఉదార=అధికమైన, శిఖా=జ్వాలలనెడు, ఉదయరాగ=ఉదయకాలారుణ్యము యొక్క, వైఖరిన్=రీతిచేత; దానిన్=ఆలజ్జాంధకారమును; సడలించెన్=పోఁగొట్టెను.

అనఁగా నామె రాజును జూచునపుడు లజ్జ ప్రతిబంధకముగా నుదయించియు రాగాతిశయమునఁ దొలంగిన దనియు నందువలన సంపూర్ణనయనానందము ఘటిల్లిన దనియు వ్యజ్యమాన మగుచున్నది. కామము రాగాతిశయరూపమే కాని వేఱొండుపదార్థము గాదు. ఇచ్ఛారూపము రతియనియు నుత్కటేచ్ఛారూపము కామమనియు వ్రాయఁబడియె. రమ్యవస్తుదర్శనమున దానియందుఁ బ్రీతిగలిగి యిది మదిష్టసాధనమగునని దానియందుత్కటప్రీతిగలుగుట యనుభవసిద్ధము. చంద్రికకు సుచంద్రునిఁజూడఁగనె లోకోత్తరవస్తుదర్శన ప్రయుక్తవిస్మయముగలిగి వెనుక రతిగలిగి తదనంతరంబ కామముదయించినదని చెప్పఁబడియె. సుచంద్రునకు నిట్లే రత్యనంతరము కామము వెనుక చెప్పఁబడినది. రతి సంభోగేచ్ఛాత్మక మను మతమునుగూర్చియు రతికామములపౌర్వాపర్యమునుగూర్చియు కావ్యాలంకారసంగ్రహవిమర్శనము చూడవలయు.

తే. చెలిఁ దఱియ వచ్చునరపాల♦సితదృగాళి
దారి నానాదిచూపుచా♦ల్దవిలి నడిచె

నపుడు గగనధునీప్రవాహంబు సొచ్చి
వేగ యెదు రెక్కుమీనౌఘవిధి వహించి. 82

టీ. చెలిఁగ=చంద్రికను; తఱియఁగ = సమీపించుటకు; వచ్చునరపాలసితదృగాళిదారిఁ=వచ్చుచున్న రాజు తెల్లని చూపుచాలుయొక్క త్రోవను; అనారతచూపుచాల్=అచంద్రిక యొక్క దృక్పరంపర; తవిలి=సంబంధించి; అపుడు; గగనధునీప్రవాహంబు = వ్యోమగంగా ప్రవాహమును, చొచ్చి=ప్రవేశించి; వేగ=త్వరగా; ఎదురెక్కుమీనౌఘవిధిఁ = ఎదురుగ నడచుచున్న మీనుల గుంపుప్రకారమును; వహించి=పొంది; నడిచెన్=పోయెను.

ఆరాజు చూపులు తెల్లగ గంగాప్రవాహముంబోలెఁ జంద్రికయందుఁ బ్రసరించిన వనియు, ఆప్రవాహరూప మగుచూపుచాలునందు నెదు రెక్కుమీనులఁబోలెఁ జంద్రికాదృక్పరంపర నృపుపై నడిచె ననియు దానంజేసి యన్యోన్యదర్శనానందపరిపూర్తి ఘటిల్లె ననియుఁ దెలియవలయు.

ఇటనాయికానాయకాన్యోన్య దర్శనానందానుభవము చేనితరేతరానురాగము ప్రవ్యక్తంబగుచున్నది. దానంజేసి పూర్వానురాగాఖ్యవిప్రలంభశృంగార మిందు సకలసామగ్రులుగలుగుట చేఁబూర్ణముగా స్ఫురించుచున్నది. ఏలాగనిన, అన్యోన్యావలోకనమున నితరేతరవిషయకమైనప్రీతి వ్యక్తమగుచున్నదిగదా! "యూనోరన్యోన్యవిషయాస్థాయినీచ్ఛారతిర్భవేత్" అనుటవలన నదిరతియనఁబడుచున్నది. దానికిపుడును ఆలంబనవిభావములు, "ఆలమ్బనన్నాయికాస్స్యుర్దక్షిణాద్యాశ్చనాయకాః" అని వెనుక వ్రాయఁబడియె. నాయిక స్వీయాపరకీయా సామాన్యాభేదముచేఁ ద్రివిధయనియు, నందుస్వీయ, ముగ్ధామధ్యాప్రగల్భాభేదముచేఁ ద్రివిధయనియు, నందు మధ్యాప్రగల్భలు, ధీరాధీరాధీరాధీరాభేదముచేఁ బ్రత్యేకముగఁ ద్రివిధలై జ్యేష్ఠాకనిష్ఠాభేదమునఁ బ్రత్యేకముగ నాఱుతెగలనియు, పరకీయ పరోఢాకన్యకాభేదముచే ద్వివిధయనియు, సామాన్యయొకతెయనియు, నిట్లుపదాఱ్వురైననాయికలు ప్రత్యేకముగ స్వాధీనపతికావాసకసజ్జావిరహోత్కంఠితాభిసారికా విప్రలబ్ధా ఖండితాకలహాంతరితాప్రోషితపతికాభేదముచేత నెన్మిదిభేదములుగలవారై యుత్తమమధ్యమాధమ భేదములతోఁ బ్రత్యేకముగఁ ద్రివిధలై మున్నూటయెనుబదినాలుగుభేదములతో రాజిల్లుదురనియు, "శ్లో॥ స్వీయాత్రయోదశవిధా ద్వివిధాతుపరాఙ్గనా । వేశ్యైకైవంషోడశధాతాశ్చావస్థాభిరష్టభిః । ప్రత్యేకమష్టధాతాసాముత్తమాదిప్రభేదతః । త్రైవిధ్యమేవంచచతురశీతిత్రిశతంభవేత్" అనుటవలన నెఱుంగునది. అట్లునాయకులు పతి, ఉపపతి, వైశికుఁడు, అని ముగ్గురనియు, అందు బతి, దక్షిణుఁడు అనుకూలుఁడు ధృష్టుఁడు శఠుఁడుఅని నాలుగుభేదములు గలవాఁడనియు సింగభూపాలీయమున "శృఙ్గారాపేక్షయా తేషాం త్రైవిధ్యం కథ్యతేబుధైః । పతిశ్చోపపతిశ్చైవవైశికశ్చేతిభేదతః । పతిస్తువిధినాపాణిగ్రాహకః కథ్యతేబుధైః । చతుర్ధాసోపికథితో వృత్త్యాకావ్యవిచక్షణైః । అనుకూలశ్శఠోధృష్టోదక్షిణశ్చేతిభేదతః" ఇత్యాదులవలనఁ దెలియునది. ఇట్లు చంద్రికానుచంద్రరూపాలంబనవిభావములు సానురాగావలోకనాద్యనుభావ

ములు, పూర్వోక్తస్వేదాదిసాత్త్వికములు, హర్షలజ్జాదిసంచారులు, "యౌవనంరూపలావణ్యే సౌన్దర్యమభిరూపతా । మార్దవంసౌకుమార్యం చేత్యాలమ్బనగతాగుణాః" అని చెప్పఁబడిన యాలంబనగుణములు, భావహావహేలావిభ్రమకిలికించితమోట్టాయితకుట్టమితాదిగాఁ జెప్పఁబడినవానిలో యథాసంభవముగఁదచ్చేష్టలు, నూపురాంగదహారాదితదలంకరణములు, ఉపవనమందమారుతకోకిలాలాపభ్రమరఝంకారాదితటస్థములును నీనాలుగుతెగలైనయుద్దీపనవిభావములు చేరియుండుటవలనఁ బరిపూర్ణసామగ్రీసంఘటనమైనందున రతిరూపస్థాయిభావమునకు రసరూపతగలుగుచున్నది. శ్లో "ఏతేచస్థాయినఃస్వైస్వైర్విభావైర్వ్యభిచారిభిః । సాత్త్వికైరనుభావైశ్చనటాభినయయోగతః। సాక్షాత్కారమివానీతైః ప్రాపితాస్స్వాదురూపతామ్ । సామాజికానామ్మనసి ప్రయాన్తిరసరూపతామ్" ఇత్యాదులు తత్ప్రమాణంబులు. ఇటనటాభినయపదము శ్రావ్యకావ్యమునకుపలక్షకము, "రత్యాదేఃస్థాయినో లోకేతానిచేన్నాట్యకావ్యయోః। విభావాఅనుభావాశ్చకథ్యన్తే వ్యభిచారిణః। వ్యక్తస్సతైర్విభావాద్యైఃస్థాయీభావో రసస్స్మృతః । అను కావ్యప్రకాశాదులవలన నయ్యది యెఱుంగునది. విభావైరనుభావైశ్చ సాత్త్వికైర్వ్యభిచారిభిః । నీతాసదస్యరస్యత్వంరతిశ్శృఙ్గార ఉచ్యతే" అనుట వలననిది శృంగారరసము. అందును, "అయుక్తయోస్తరుణయోర్యోనురాగః పరస్పరమ్। అభీష్టాలిఙ్గనాదీనామనవాప్తౌ ప్రకృష్యతే। సవిప్రలమ్భోవిజ్ఞేయః" అనుటవలన విప్రలంభమనియు, అందును, "యత్ప్రేమసంగమాత్పూర్వందర్శన శ్రవణోద్భవమ్"అనియుపక్రమించి "సోయం పూర్వానురాగాఖ్యోవిప్రలమ్భఇతీరితః" అనుటవలనఁ బూర్వానురాగాఖ్య విప్రలంభమనియుఁ దెలియునది. విప్రలంభము పూర్వానురాగమానప్రవాసాదిభేదములుగలదని వెనుక వ్రాయంబడియె.

చ. నిజబలరూఢి దోఁపఁ దఱి ♦ నివ్వటిలెన్ బళి యంచుఁ దాఁ జతు
ర్భుజుఁడయి పంచసాయకుఁడు ♦ భూరిధృతిన్ క్షణదోదయాధిపా
త్మజబొమవింటిదోయి నస♦మానవిలోచనమాలికాసితాం
బుజవిశిఖాళి నించె నల♦భూపతి పేరెద గాఁడి పాఱఁగన్. 83

టీ. పంచసాయకుఁడు=మరుఁడు; నిజబలరూఢి=తనసామర్థ్యాతిశయము; తోఁపన్=కనఁబడునట్లు; తఱి=సమయము; నివ్వటిలెన్=ఘటిల్లెను. బళి=ఔర! అంచున్ = ఇటనుకొని; తాన్ ; చతుర్భుజుఁడుఅయి = నాలుగుచేతులుగలవాఁడయి, ఉప్పొంగినవాఁడయి యనుట; భూరిధృతిన్=ఎక్కుడైనధైర్యముచేత; క్షణదోదయాధిపాత్మజబొమ వింటిదోయిన్.— క్షణదోదయాధిపాత్మజ=చంద్రికయొక్క, బొమవింటిదోయిన్=బొమలనెడు ధనుర్ద్వయముచేత ; భూపతి పేరెద=రాజుయొక్కవిశాలవక్షమును; కాఁడిపాఱఁగన్=తూటిపాఱునట్లు; అసమానవిలోచనమాలికాసితాంబుజ విశిఖాళిన్.—అసమాన = సాటిలేనట్టి, విలోచనమాలికా=చంద్రికాదృక్పరంపరయనెడు, అసితాంబుజ విశిఖాళిన్=నీలోత్పలరూపమైనబాణపరంపరను "అరవిన్దమశోకంచ చూతంచ నవమల్లికా। నీలోత్పలంచ పఞ్చైతే పఞ్చబాణస్య సాయకాః" అనియుమరుఁడు; నించెన్=పూరించెను.

చంద్రికాదృక్పరంపర మన్మథునిచేఁ బ్రయోగింపఁబడిన నీలోత్పలబాణపరంపరను బోలి యుండె ననియు, నామెబొమలు పంచశరశరాసనములఁ బోలి యుండె ననియు, భావము. ఆరాజున కామెచూపులు కరము మన్మథోద్దీపనకరము లని ఫలితార్థము.

చ. అలవిభుఁ గాంచుఁ గాంచి యెద • నప్పతిరూపము నుంచు నుంచి ని
శ్చలమతి నెంచు నెంచి మది • జాఱనికోర్కులు ముంచు ముంచి యూ
ర్పులు కడు నించు నించి వల•పుల్ మన నాత్మ భ్రమించు మించుఁబోఁ
డి లసదనంగసాయకత•టీవిలుఠత్పటుశాంబరీగతిన్. 84

టీ. మించుఁబోఁడి = మెఱుఁగువంటిదేహముగలచంద్రిక; లసదనంగసాయక తటీవిలుఠత్పటుశాంబరీగతిన్.— లసత్ = ప్రకాశించుచున్న, అనంగసాయక = స్మరశరములయొక్క, తటీ = అగ్రభాగములయందు, విలుఠత్ = పొరలుచున్న, పటు = సమర్థమైన, శాంబరీగతిన్ = మాయారీతిచేత; అలవిభున్ = ఆరాజును; కాంచున్ = చూచును. కాంచి = చూచి; ఎదన్ = హృదయమందు; అప్పతిరూపమున్ = ఆరాజురూపమును; ఉంచున్ = నిలిపికొనును. ఉంచి; నిశ్చలమతిన్ = స్థిరచిత్తముచేత; ఎంచున్ = ప్రశంసించును. ఎంచి; మదిన్ = చిత్తమును; జాఱని కోర్కులన్ = వీడనిమనోరథములలో; ముంచున్ = మునుఁగఁజేయును. ముంచి; కడున్ = మిక్కిలి; ఊర్పులు = నిశ్వాసములను; నించున్ = నిండఁజేయును. నించి; వలపుల్ = అనురాగములు; ఆత్మన్ = చిత్తమందు; మనన్ = పుట్టఁగా; భ్రమించున్ = భ్రాంతినొందును.

ఇటఁ జక్షుఃప్రీతి మనస్సంగ గుణనుతి చింతనోన్మాదము లనునవంగదశలు యథాసంభవముగ గదితంబు లయ్యె. ఊర్పులు స్మరదశానుభావములుగా నెఱుఁగ వలయు.

క. ఈలీల నృపతిదర్శన, కేళీభవవిస్మయాను•కీలితమతియై
నాళీకనయన యా లల, నాళీకమలాస్త్రుఁ డనుచు • నతనిం బొగడెన్. 85

టీ. నాళీకనయన = కమలనేత్రయగుచంద్రిక; ఈలీలన్ = ఈప్రకారముగ; నృపతిదర్శనకేళీభవవిస్మయానుకీలితమతియై.— నృపతి = రాజుయొక్క, దర్శనకేళీ = దర్శనవిలాసమున, భవ = పుట్టినట్టి, విస్మయ = ఆశ్చర్యముచేత, అనుకీలిత = బంధింపఁబడిన, మతియై = మనస్సుగలదై; అతనిన్ = ఆరాజును; ఆ = ఇదియాశ్చర్యముఁదెలుపును. లలనాళీకమలాస్త్రుఁడు = యువతీసమూహమునకు కందర్పుఁడు. అనుచున్; పొగడెన్ = నుతించెను. నుతిప్రకారం బగ్రిమ పద్యాదిగాఁ జెప్పఁబడుచున్నది.

సీ. తనవిధుత్వ మ్మాస్య•మున నొప్ప ఘనలక్ష్మి
యొనరఁ దోఁచినపూరు•షోత్తముండు
తనతమోగతి కైశ్య•మునఁ దోఁప సద్గణ
త్రాణంబునకుఁ జేరు•రాజమౌళి

తనయంగమహిమ నే•త్రముల రాజిలఁ గళా
వ్యాప్తిఁ జూపట్టుప్ర•జాధినేత
తనశోణరుచి మోవిఁ • దగ జగమ్ములఁ బ్రొక్కు
లంది చెల్వొనులో•కైకబంధుఁ

తే. డట్టి యీడిట్ట పతి యంచు • నబ్జపాణి
యవనిభృన్నాయకకుమారి • హంసయాన
పద్మినీమణి మానస•పదవి మెచ్చ
సన్నుతింపఁ దరంబె భు•జంగపతికి. 86

టీ. తనవిషుత్వము = తనవిష్ణుత్వము, చంద్రత్వమనిఁ యర్థాంతరముతోఁచుచున్నది. "విధుర్విష్ణౌచంద్రమసి" అనియమరుఁడు; ఆస్యమునన్ = ముఖమున; ఒప్పన్ ; ఘనలక్ష్మి = ఘనయైనశ్రీదేవి; రాజ్యలక్ష్మియనియర్థాంతరముతోఁచు; ఒనరన్ = ఒప్పఁగా; తోఁచినపూరుషోత్తముండు = తోఁచినట్టి నారాయణుండు, నరశ్రేష్ఠుండనియర్థాంతరము; తనతమోగతి = తనతమోగుణప్రాప్తి; చీకటితీరనియర్థాంతరముతోఁచు; కైశ్యమునన్ = కేశసమూహమందు; తోఁపన్ = సద్గణత్రాణంబునకున్ = శ్రేష్ఠమగుప్రమథగణరక్షణమునకు, సత్పురుషసంఘరక్షణమునకనియర్థాంతరము; చేరురాజమౌళి = భూమిఁజేరినమహాదేవుండు, రాజశ్రేష్ఠుండని యర్థాంతరము; తనయంగమహిమ = తనముఖాద్యవయవబాహుళ్యము, అంగములపూజ్యతయని యర్థాంతరముతోఁచు; నేత్రములన్ = కన్నులయందు; రాజిలన్ = ప్రకాశింపఁగా; కళావ్యాప్తిన్ = విద్యావ్యాప్తిచేత, తేజోవ్యాప్తిచేతనని యర్థాంతరము; చూపట్టుప్రజాధినేత = అగపడుచున్న బ్రహ్మదేవుఁడు, నరపతియని యర్థాంతరము; తనశోణరుచి = తనరక్తకాంతి; మోవిన్ = పెదవియందు; తగన్ = ఒప్పఁగా; జగమ్ములన్ = లోకములందు; ప్రొక్కులు = ప్రణామములను; సూర్యపక్షమున నమస్కారప్రియోభానుః, అనుటచేతను, రాజపక్షమున శరణాగతిచేతను, అని తెలియునది; అంది = పొంది; చెల్వొనులోకైకబంధుఁడు = అందమందినసూర్యుండు, భువనహితుఁడని యర్థాంతరము; అట్టియీడిట్ట = పూర్వోక్తగుణశాలియగు నీదిట్టతనముగలవాఁడు; పతి = పెనిమిటి, భూపతి యనితోఁచును. అంచున్ = ఇటనుచు; అబ్జపాణి = పద్మహస్తయగులక్ష్మీదేవి ; పద్మములవంటి హస్తములుగలస్త్రీయని యర్థాంతరముతోఁచును; అవనిభృన్నాయకకుమారి = పర్వతరాజసుతయగుగౌరి; రాజపుత్త్రియని యర్థాంతరముతోఁచును; హంసయాన = హంసవాహనయగుసరస్వతి; అంచలఁబోలునడలుగలకలికియని యర్థాంతరముతోఁచు; పద్మినీమణి = పద్మలతయనునారీమణి; "పద్మినీవల్లభోహరిః" అనుటచేసూర్యునిప్రియపద్మినియని చెప్పఁబడిరెు; పద్మినీజాతిస్త్రీయని యర్థాంతరముదోఁచు; మానసపదవిన్ = మనోవీథియందు; మెచ్చన్ = ప్రశంసింపఁగా; భుజంగపతికిన్ = శేషునికిని; సన్నుతింపన్ = కొనియాడుటకు; తరమె = వశమా?

అనఁగాలక్ష్మిగౌరిసరస్వతీ పద్మినీమణులే, పైఁజెప్పినక్రమముగ విష్ణుమూర్తియనియు, శివుండనియు, బ్రహ్మదేవుండనియు సూర్యుండనియుఁ,గొనియాడుచుండఁగా నిట్టియుత్తమునిఁ

గొనియాడుటకు శేషునకైనఁదరముగాదనుట. లక్ష్మీవిష్ణువును, గౌరీశివునిని, సరస్వతిబ్రహ్మను, పద్మినిసూర్యునిఁ, బతియని కొనియాడుట సహజమని తెలియునది. ఆరాజు మోము చంద్రునిఁబోలినదనియు, కేశములు చీఁకటినిబోలినవనియు, నేత్రములు విశాలములనియు, మోవియరుణమైనదనియు, దానంజేసి పద్మములఁబోలు కేలుగలదానికి రాజపుత్రియగుదానికి వంచవడలదానికి పద్మినీజాతిస్త్రీరత్నమునకుఁ బతిగాఁ, గోరఁదగినవాఁడనియు, భావపర్యవసానమగుచున్నది. ఇందువలన నబ్జపాణిత్వరాజపుత్రీత్వహంసగమనాత్వపద్మినీమణిత్వాదిగుణ విశిష్టయగుతనకునిట్టి లోకోత్తరగుణగరిష్ఠుఁడగు సుచంద్రుఁడు పతిగావరింపఁదగినవాఁడని ఫలితమగుచున్నది.
శ్లిష్టరూపకము.

మ. గళపూగచ్ఛవి యబ్జకాండపరిస◆ర్గం బూన్పఁ గన్నుల్ గనన్ -
నలరూపంబులు పెంప లేనగవు చం◆ద్రశ్రేణుల న్మన్ప ని
ర్మల మౌమోవి మధూత్కరంబు ఘటియిం◆ప న్మించునీభర్తతోఁ
దలఁపం జెల్లునె సాటి యౌ ననుచుఁ ద◆ద్రమ్యాంగసౌభాగ్యముల్. 87

టీ. గళపూగచ్ఛవి = పూగమువంటిగళముయొక్క కాంతి ; అబ్జకాండపరిసర్గంబు. — అబ్జకాండ=పద్మబాణుఁడగుమదనునియొక్క, శంఖసమూహము యొక్క, పరిసర్గంబు=సృష్టిని; బూన్పన్ =వహింపఁగా ; కన్నుల్ కనన్ = నేత్రములుచూడ ; నలరూపంబులు=నలచక్రవర్తియొక్కస్వరూపములను, కమలరూపములను; పెంపన్ =పోషింపఁగా ; లేనగవు=చిఱునగవు; చంద్రశ్రేణులన్ =చంద్రులయొక్కగుంపులను, కర్పూరముయొక్కగుంపులను; మన్పన్ = వృద్ధిఁబొందింపఁగా; నిర్మలము=నిర్దోషము; ఔమోవి=అయినపెదవి; మధూత్కరంబు=వసంతులయొక్కసమూహమును, తేనియలయొక్కసమూహమును ; ఘటియింపన్ = చేయఁగా; మించునీభర్తతోన్ =అతిశయించునీరాజుతో;తద్రమ్యాంగసౌభాగ్యముల్. — తత్ =ఆస్మరనలచంద్రవసంతులయొక్క, రమ్య=మనోజ్ఞములగు, అంగ=శరీరములయొక్క, సౌభాగ్యముల్ = సౌందర్యములు; సాటియౌననుచున్ =సరియగుననుచు; తలంపన్ చెల్లునె=స్మరింపఁదగునా'

సుచంద్రునియొక్క కయవయవంబే యనేకస్మరనలాదులను సృజియించుచుండఁగా నట్టిసుచంద్రునితో వారు సాటి యౌదు రనుట చెల్లదని యభిప్రాయము.

ఈరాజు గళము శంఖమును, కన్నులు పద్మములను, లేనగవు కర్పూరమును, బోలియున్న వనియు, పెదవి తేనియలు ఘటియించుచున్న దనఁగా నంత మధుర మనియు ఫలితము. శంఖాదులకు గళాద్యుపమిత్యనివృత్తిచేతఁ బ్రతిపక్షేదము శ్లిష్టరూపకోత్థాపితము.

చ. ఘనఖరతామిళద్విషమ◆కాండసమున్నతహేతిజాతతా
పనికర మంతయుం దడకుఁ ◆ బాయఁగ నీనదధీశుపాదసే
వన గతి యేతదీయఘన◆వర్తనఁ గాంచక యున్నచోఁ గరం
బెనయదె నాదుశ్యామతన◆ మెంతయు నుర్వి నిరర్థకత్వముల్. 88

టీ. ఇందుఁ జంద్రికాపరమైనయర్థము రాత్రిపరమైనయర్థము గలుగును. ఏలాగనిన.—ఘనఖరతామిళద్విషమకాండసమున్నతహేతిజాతతాపనికరము.—ఘన = అధికమగు, ఖరతా=తీక్ష్ణత్వముతో, మిళత్=కూడుకొన్న, విషమకాండ=పంచబాణునియొక్క, సూర్యునియొక్కయని రాత్రిపరమైనయర్థము, సమున్నత=మిక్కిలి యతిశయించిన, హేతి=ఖడ్గమువలన, జాత=పుట్టినట్టి, తాప=సంతాపముయొక్క, హేతి=కిరణములయొక్క, జాత=సంఘమువలననైన, తాప=వేఁడియొక్కయనిరాత్రిపరమైనయర్థము, నికరము=సమూహము; అంతయుఁ=ఎల్లను; తడకుఁబాయఁగన్ = కడకుఁబోవఁగా; ఈసదధీశుపాదసేవన.— ఈసదధీశు=ఈమంచిరాజుయొక్క, పాద = అడుగులయొక్క, నక్షత్రేశుఁడగుచంద్రుని కిరణములయొక్కయని రాత్రి పరమైనయర్థము, సేవన=సేవించుట; గతి=శరణము. ఏతదీయఘనవర్తనన్.—ఈరాజుయొక్కయున్నతవృత్తిని, చంద్రునియొక్కపూర్ణభావముననని యర్థాంతరము; కాంచకయున్నచోన్=చూడకుండినయెడ; నాదుశ్యామతనము=నాయొక్క యౌవనవతీత్వము, రాత్రిత్వము అని యర్థాంతరము; ఎంతయుఁ=మిక్కిలి; ఉర్విన్=భూమియందు; నిరర్థకత్వముఁ=వ్యర్థతను; కరంబు ఎనయదె=మిక్కిలి పొందదా?

అనఁగా సూర్యకిరణజనితతాపము సనుటకు చంద్రకిరణసేవనమె రాత్రి కెట్లు శరణంబో అట్లుకాక యున్నరాత్రి యెట్లు వ్యర్థమో, అట్లు స్మరశరజనితసంతాపము సనుటకు నాకు నీరాజుపాదసేవనమె శరణంబు అట్లు కానిచో నాదుతారుణ్య మంతయు వ్యర్థంబయగు నని భావము. ప్రకృతా ప్రకృతముల కౌపమ్యము గమ్యము.

చ. అని యనివార్యదోహదస◆మన్వితమానసవల్లియై వినూ
తన చపలాతనూకులమ◆తల్లి దలంచుచునుండునంతలో
వనిత యొకర్తు చేరి చెలు◆వా నిను రమ్మనె నిప్డు వీణియన్
విన జనయిత్రి యన్న గురు◆ని న్వినయంబునఁ గాంచెఁ గాంచినన్. 89

టీ. వినూతనచపలాతనూకులమతల్లి = నూతనమైన మెఱుపువంటి శరీరముగలవారిగుంపునశ్రేష్ఠయగుచంద్రిక; అనివార్యదోహదసమన్వితమానసవల్లియై.—అనివార్య= నివారింపనలవిగాని, దోహద=ఆసక్తితో, దోహదక్రియతోనని వల్లీపదస్వారస్యముచే నర్థాంతరముదోఁచును; సమన్విత=కూడుకొన్నట్టి, మానస=మనస్సనెడు, వల్లియై=లతగలదై; అని=పైప్రకారముగ; తలంచుచున్=తలపోయుచు; ఉండునంతలోన్=ఉన్నంతలో; వనితయొకర్తు=ఒకస్త్రీ; చేరి=వచ్చి; చెలువా=సకియా! జనయిత్రి=తల్లి; ఇప్డు=ఈసమయమున ; వీణియన్=వీణావాద్యమును; వినన్=వినుటకు; నిన్నున్; రమ్మనెన్. అన్నన్=ఇట్లనఁగా ; గురునిన్=గురువైనకుముదుని; వినయంబునన్=వినయముతోడ; కాంచెన్=చూచెను. కాంచినన్=చూడఁగా. దీనికి ముందుపద్యముతో నన్వయము.

చ. కిన్నరకంఠి యీనృపతి◆కి న్సతి వయ్యెదు నాదు మాట యా
సన్నశుభంబు పొమ్మనుచుఁ◆ జక్కఁగ నంచినఁ దద్గురూక్తిచేఁ

గన్నియ యేగె మాతసముఖంబును గాంతలు వెంట రాఁగ ను
ద్యన్నవహీరపాదకటకార్భటి యంచల బుజ్జగింపఁగన్. 90

టీ. కిన్నరకంఠి=కిన్నెరవంటికంఠముగలదానా! ఈనృపతికిన్=ఈరాజునకు; సతి వి అయ్యెదు=భార్యవుకాఁగలవు. నాదుమాట=నావాక్యము; ఆసన్నశుభంబు = సమీపించిన కల్యాణముగలది పొమ్ము. అనుచున్=ఇట్లనుచు; చక్కఁగన్=బాగుగను; అంచినన్ = పంపఁగా; తద్గురూక్తిచేన్=ఆ గురువాక్యముచేత; కన్నియ=చంద్రిక; కాంతలు=స్త్రీలు; వెంటరాఁగన్=వెంబడిరాఁగా; ఉద్యన్నవహీరపాదకటకార్భటి.—ఉద్యత్= ఉదయించుచున్న, ఇది యార్భటికి విశేషణము, నవ=క్రొత్తవగు, హీర=వజ్రమయములగు, పాదకటక=కాలియందెల యొక్క, ఆర్భటి=ధ్వని; అంచలన్=హంసలను; బుజ్జగింపఁగన్=లాలనచేయఁగా; మాతసముఖంబును=తల్లిసన్నిధింగూర్చి; ఏగెన్=పోయెను.

మ. అలయోషామణి యిట్టు లేగ రవివంశాధీశుఁ డుద్భ్రాంతహృ
త్తలయోగంబున నెందుఁ జెందె లతికాతన్వంగి వీక్షించుటల్
కలయో మారశరాళి నేకరణి వేఁగ న్వచ్చు నివ్వేళ నా
నలయోషిత్సమఁ గాంచ కే ననుచుఁ జింతారేఖ సంధించుచున్. 91

టీ. అలయోషామణి=ఆస్త్రీరత్నము; ఇట్టులు=ఈప్రకారము; ఏగన్=పోఁగా; రవివంశాధీశుఁడు=సుచంద్రుఁడు; ఉద్భ్రాంతహృత్తలయోగంబునన్.—ఉద్భ్రాంత = భ్రమిసినట్టి, హృత్తల=హృదయప్రదేశముతోడి, యోగంబునన్=సంబంధమున; లతికాతన్వంగి=లతాసుకుమారదేహయగుచంద్రిక; ఎందున్ చెందెన్=ఎటఁబోయెను? వీక్షించుటల్ = చూచుటలు; కలయో=స్వప్నమో. ఇవ్వేళన్=ఈసమయమున; ఆ నలయోషిత్సమన్= దమయంతీతుల్యయగు నాచంద్రికను; కాంచక=చూడక; ఏన్=నేను; మారశరాళిన్=స్మరశరములగుంపుచేత; ఏకరణిన్=ఏరీతి; వేఁగన్ వచ్చున్=తపింపవచ్చును? అనుచున్=ఇటనుచు; చింతారేఖ సంధించుచున్=చింతాపరంపరను చేయుచు. దీనికుత్తరపద్యముం దన్వయము.

సీ. శారి పూఁబోదఁ జేరి చక్కఁ బల్కినదారి
నారి వల్కె నటంచు సారె దలఁచు
రామచంపకధామరాజి పర్వెడుసీమ
భామ నిల్చె నటంచుఁ బ్రేమఁ గాంచు
నంచ యింపు రహింప నడుగు వెట్టినయంచఁ
గాంచనాంగి చరించె నంచుఁ జూచు
బాలకోకిల చాల నోలి మ్రోసెడుమూల
బాల పాడెడు నంచుఁ జాల మెచ్చు

తే. లలితపవమాన మాన నా♦లయవనస్థ
లాబ్జలసమానసౌమన♦సానుమోద
మలమ నసమానమానస ♦ మతులప్రమద
మానఁగ సుచంద్రమానవా♦ధ్యక్షుఁ డలరు. 92

టీ. శారి=గోరువంక; పూఁబొదన్=పువ్వులపొదను; చేరి=పొంది; చక్కన్=బాగుగ; పల్కినదారిన్=పల్కినత్రోవను; నారి = చంద్రిక; పల్కెన్ అటంచున్ = పల్కెననుచు; సారె=మాటిమాటికి; తలఁచున్=ఎంచును. రామచంపకధామరాజి.—రామ=ఒప్పుచున్న, చంపక=సంపెఁగలయొక్క, ధామరాజి=కాంతిపరంపర; పర్వెడుసీమన్=ప్రసరించుప్రదేశమునందు; భామ=చంద్రిక; నిల్చెన్ అటంచున్=నిలిచియున్నదనుచు; ప్రేమన్=ప్రీతితోడ; కాంచున్=చూచును. అంచ=హంస; ఇంపురహింపన్=సొంపగునట్లుగా; అడుగువెట్టినయంచన్=అడుగువెట్టినచెంతను; కాంచనాంగి=చంద్రిక; చరించెనంచున్ = సంచరించెననుచు; చూడున్=అవలోకించును. బాలకోకిల=చిన్నికోయిల; చాలన్=మిక్కిలి; ఓలిన్=వరుసగా; మ్రోసెడుమూలన్=కూయువంక; బాల=చంద్రిక; పాడెన్ అటంచున్=గానముచేసెననుచు; చాలన్; మెచ్చున్=శ్లాఘించును. లలితపవమానము = మనోహరమయినమందమారుతము; ఆనన్=స్పృశింపఁగా; ఆలయవనస్థలాబ్జలసమాన సౌమనసానుమోదము.—ఆలయవన=సదనోద్యానమందుండెడు, స్థలాబ్జ=మెట్టదామరమొదలగు, లసమాన=ప్రకాశించుచున్న, సౌమనస=పువ్వుసమూహముయొక్క, అనుమోదము=పరిమళము; అలమన్=క్రమ్ముటచేత; అసమానమానసము = సాటిలేనిమనస్సు; అతులప్రమదము = నిరుపమానమగుసంతసమును; ఆనఁగన్ = పొందఁగా; సుచంద్రమానవాధ్యక్షుఁడు = సుచంద్రనరపాలుఁడు; అలరున్=ప్రకాశించును.

చంద్రికాయత్తచిత్తుండై తదేకధ్యానము సేయు నారాజునకు పైఁజెప్పినశారి పల్కులోనగునవియెల్లఁ జంద్రికా వ్యాపారములుగఁ దోచినవని తాత్పర్యము.

చ. అళినికరంబు కీలుజడ ♦ యందపుఁగెందలిరాకు మోవి ని
స్తులతరమంజరుల్ మెఱుఁగుఁ ♦ జన్నులు మొగ్గలచాల్ పదాంబుజ
స్థలనఖపాళి గాఁగ వన♦ధాత్రిఁ గనంబడుతీవ లెల్ల నా
చెలిసొబ గానృపాలు మదిఁ ♦ జేర్చి భ్రమింపఁగఁ జేసె నయ్యెడన్. 93

టీ. అయ్యెడన్=ఆసమయమందు; అళినికరంబు=తుమ్మెదలగుంపు; కీలుజడ=జాఱవిడిచినజడయును; అందపుఁగెందలిరాకు=అందమగుఎఱ్ఱనిచిగురాకు; మోవి=అధరంబును; నిస్తులతరమంజరుల్=వట్రువులగు పువ్వులగుత్తులు; మెఱుఁగుఁజన్నులు=ప్రకాశించుచున్నకుచములును; మొగ్గలచాల్=మొగ్గలగుంపు; పదాంబుజస్థలనఖపాళి=పాదపద్మములయందుండుగోరులచాలును; కాఁగన్=అగుచుండఁగా; వనధాత్రిన్=ఉద్యానవనభూమియందు; కనఁబడుతీవలుఎల్లన్=

కనఁబడుచుండెడులతలెల్ల; ఆచెలిసొబగు=ఆచంద్రికయందమును; ఆన్పపాలుమదిన్=ఆరాజుమనమునందు; చేర్చి; భ్రమింపఁగఁజేయున్=భ్రమనొందునట్లుసేయును.

అనఁగాఁ బైఁజెప్పిన చొప్పున నొప్పులతలెల్లఁ జంద్రికావయవముల సొబగుఁగాన్పించి. యీరాజునంగన దశలలోనియున్మాదావస్థ నొందునట్లు చేయుననుట. "సర్వావస్థాసు సర్వత్ర తన్మనస్కతయా సదా । అతస్మిన్ తదితి భ్రాన్తి రున్మాదో విరహోద్భవః" ఇట్లుక్తలక్షణలక్షితం బగునున్మాద మను ననంగదశావిశేష మిందు వచింపఁబడియె. ఇట్లు శారి పూఁబోఁ దఁజేరి యనుక్రిందిపద్యమునందును దెలియ వలయు.

సీ. కమ్మపుప్పొడిగాడ్పు • గ్రమ్మ నొప్పగుబండి
గురివెందవిరిగుత్తి•కొమరుఁ జూచి
యలరు సంపెఁగతీవ • యలమ నింపుగఁ దోఁచు
కలికిక్రొమ్మల్లియ•చెలువుఁ జూచి
మగతేఁటి వేడ్క మిం•చఁగ ముద్దుగొనినచ
క్కనిమెట్టదామర•కళుకుఁ జూచి
సొలపుచక్కెరతిండి•పులుఁగు నొక్కెడిబింబి
కాపక్వఫలముపొం•కంబుఁ జూచి

తే. తరుణిచనుదోయి కెంపుగం•దవొడిఁ బూసి
చెలువనెమ్మేను కౌఁగిటఁ • జేర్చి కొమ్మ
మోము ముద్దిడి పూఁబోఁణి•మోవిఁ గ్రోలి
చెలఁగు టెపు డబ్బునో యంచుఁ • దలఁచు నృపతి. 94

టీ. నృపతి=సుచంద్రుఁడు; కమ్మపుప్పొడిగాడ్పు=కమ్మనిపుప్పొడి సంబంధియగువాయువు; గ్రమ్మన్=ప్రసరింపఁగా; ఒప్పగుబండిగురివెందవిరిగుత్తికొమరున్=ఒప్పిదమగుబండిగురివెందపూగుత్తియొక్క సౌందర్యమును; చూచి=వీక్షించి. అలరుసంపెఁగతీవ = ప్రకాశించుచంపకలత; అలమన్=ఆక్రమింపఁగా; ఇంపుగన్ = ఇంపగునట్లు; తోఁచుకలికిక్రొమ్మల్లియచెలువున్=తోఁచుచున్నయందమగునూతనమల్లికయందమును; చూచి; మగతేఁటి=గండుతుమ్మెద, వేడ్కన్ = ఉత్సవము; మించఁగన్ = అతిశయించునట్లు; ముద్దుగొనిన చక్కనిమెట్టదామరకళుకున్ = ముద్దుగొనినట్టి యందమగు మెట్టదామరయొక్క చక్కఁదనమును; చూచి; సొలపుచక్కెరతిండిపులుఁగు= పరవశమయినశుకపక్షి; నొక్కెడిబింబికాపక్వఫలముపొంకంబున్=కొఱుకుచున్నపండినదొండపండుపొంకమును; చూచి; తరుణిచనుదోయి=చంద్రికాకుచయుగ్మమును; కెంపుగందవొడిఁబూసి=ఎఱ్ఱనిగందపొడిచేఁబూసి; చెలువనెమ్మేను=సుందరియందమగుశరీరమును; కౌఁగిటఁజేర్చి=ఆలింగనముఁజేసికొని; కొమ్మమోము=ఆస్త్రీముఖమును; ముద్దిడి=

చుంబనము చేసి; పూఁబోణిమోవిన్=ఆనారియధరమును; గ్రోలి=పానముఁజేసి; చెలఁగుట=ప్రకాశించుట; ఎపుడబ్బునో=ఎపుడమరునో; అంచున్; తలఁచున్=స్మరించును.

అనఁగా బండిగురివెంద విరిగుత్తి చన్దోయిగను దానిపైఁ గ్రమ్ము పుష్పొడి కెంపుగంద వొడిగను సంపెఁగచే జుట్టఁబడిన మల్లియ పురుషాలింగిత తన్వంగిగాను, మగతేటిచేఁ జుంబితమైన మెట్టదామర పురుషచుంబిత స్త్రీముఖముగను, శుకతుండ ఖండితమగు బింబఫలము దంతక్షతమైన స్త్రీయధరముగాను దోఁచి యారాజు చంద్రికాస్తన యుగ్మాలింగనాధరచుంబనాదు లెపుడబ్బునోయని స్మరించెననుట. ఇట ననుస్మృతియను ననంగదశ చెప్పఁబడియె. "ముహుర్ముహుర్నిశ్వసితైర్మనోరథవిచిన్తనైః । ప్రద్వేషస్త్వన్యకార్యాణామనుస్మృతిరుదాహృతా" అని నాట్యశాస్త్రమందుఁ దల్లక్షణము.

సీ. ఎంతమాధవదయా♦సంతానసంసిద్ధిఁ, బొలిచెనో యిచ్చటి♦తిలకపాళి
యెంతపుణ్యద్విజా♦ధీశసంసేవన, వఱలెనో యిచ్చటి♦చిఱుతమావి
యెంతమహాసవో♦ద్ధృతిగతాత్మసుమాప్తి, మనియెనో యిచ్చటి♦కనకరాజి
యెంతసదాళిచి♦త్తేష్టదానస్ఫూర్తి, వెలసెనో యిచ్చటి♦కలికిక్రోవి

తే. చెలికటాక్షైకధారచేఁ♦జెలఁగ నెలఁత
పాణిలాలనమున మించఁ♦బడఁతిమోము
గని యలర నాతిపరిరంభ♦గరిమఁ జొక్క
ననుచు నృపమౌళి కడుఁ♦జింతఁ బెనుచు మదిని. 95

టీ. ఇచ్చటితిలకపాళి=ఈవనినున్నబొట్టుగులగుంపు; ఎంతమాధవదయాసంతానసంసిద్ధిన్=ఎంతవిష్ణువుయొక్క కరుణాసముదయసంసిద్ధిచెత, ఎంతవసంతదయాసముదయసంసిద్ధిచేతనని స్వభావార్థము; పొలిచెనో=ఉదయించెనో. ఇచ్చటి చిఱుతమావి = ఇటనున్న చిన్నచూతము; ఎంతపుణ్యద్విజాధీశసంసేవనన్=ఎంతపుణ్యవంతులైన విప్రశ్రేష్ఠులసేవచేత, ఎంతమనోజ్ఞములగుపక్షిశ్రేష్ఠములయొక్క సేవచేతననినాస్తవార్థము; "పుణ్యమ్తుమనోజ్ఞేఽభిహితం తథాసుకృతధర్మయోః" అని విశ్వము; వఱలెనో=ఒప్పెనో. ఇచ్చటికనకరాజి=ఈయుద్యానమందలి సంపెఁగచాలు; ఎంతమహాసవోద్ధృతిగతాత్మసుమాప్తిన్.—ఎంతమహాసవ=ఎంతగొప్పయజ్ఞములయొక్క, ఉద్ధృతి=పోషణము చేత, గత=పొందఁబడిన; ఆత్మ=తనయొక్క, సు=లెస్సయయిన, మా=సంపదయొక్క, ఆప్తిన్ = ప్రాప్తిచేత; మహాత్ = అధికమయిన, ఆసవ=పువ్వుఁదేనియయొక్క, ఉద్ధృతి=ధరణమును,గత=పొందిన, ఆత్మ=తనయొక్క, సుమాప్తిన్=కుసుమముల ప్రాప్తిచేతనని వాస్తవాభిప్రాయము; ఇచ్చటి కలికిక్రోవి=ఇందున్నయందమగుగోరంట; ఎంతసదాళిచిత్తేష్టదానస్ఫూర్తిన్.—ఎంతసదాళి = ఎంతసత్పురుషులగుంపుయొక్క, చిత్త=చిత్తములకు, ఇష్టదాన=ఇష్టములయినవస్తువులప్రదానముయొక్క, స్ఫూర్తిన్=విస్ఫురణముచేత; సదా=ఎల్లప్పుడు, అళి=తుమ్మెదలయొక్క, ఇటసదాళశబ్దము శబ్దముతో "సుపుస

పా''అనిసమసించినది, చిత్తములకు, ఇష్టదానస్ఫూర్తిచేతననివా స్తవాశయము; వెలసెనో=ప్రకాశించెనో. చెలికటాక్షైరధాచేఁ=చంద్రికయొక్క క్రేగంటిచూపులపరంపరచేత, చెలఁగన్=ఒప్పుటకును; పాణిలాలనమునన్=హస్తము చేలాలించుటవలన; మించన్=అతిశయించుటకును; పడఁతిమోమున్=చంద్రికముఖమును; కని=చూచి; అలరన్=సంతసించుటకును; నాతిపరిరంభగరిమన్=చంద్రికయొక్క యాలింగనాతిశయము చేత; చొక్కన్=సుఖపరవశతనొందుటకును; అనుచున్=ఇట్లువచించుచు; నృపమౌళి=రాజశ్రేష్ఠుండు; మదిని=చిత్తమందు; కడున్=మిక్కిలి; చింతన్; పెనుచున్=వృద్ధిఁబొందించుకొనును.

అనఁగాఁ దిలకపాళి చిఱుతమావి కనకరాజి కలికిక్రొవి అంత లోకోత్తరనాయికాకటాక్షప్రసార కరలాలన ముఖదర్శన పరిరంభములచే వలసుట దుర్ఘటము గావున నవి యెంతో మాధవదయాసంసిద్ధి ద్విజాతిసేవనాదులు వాంది యుండవలె ననుట. బొట్టుగులకు స్త్రీకటాక్షవీక్షణంబు, మావులకు స్త్రీకరలాలనంబు, సంపెఁగలకు స్త్రీముఖదర్శనంబు, గోరంటలకు స్త్రీపరిరంభంబు, దోహదంబులు గావునఁ గటాక్షవీక్షణాదులచే నవి సంతసించుటస్వభావసిద్ధం బని కవిహృదయంబు''తరుగుల్మలతాదీనా మకాలే ఫలపుష్పయోః । అథానాయ క్రియాయా స్యా త్స దోహద ఇతీర్యతే'' ఆలిఙ్గనా త్కురవక శ్చమ్పకో ముఖదర్శనాత్ । చూతో యోషిత్కరస్పర్శా త్తిలకో దృక్ప్రసారణాత్। ఆకర్ణనా త్కర్ణికార స్త్వశోకః పాదతాడనాత్। దాడిమీ ధూమసందోహా త్ప్రియాళుర్గానసంపదః''ఇత్యాదిగాదోహదలక్షణతద్విశేషంబులుకొన్ని ద్వితీయాశ్వాసంబునవ్రాయంబడియె.

మ. నవలా యేగినదారిఁ గాంచు మదిఁ దన్నాళీకపత్త్రేక్షణా
నవలావణ్యవిశేష మెంచు వలవంతం జాలఁ జింతించు రా
జవలారాతి తదేకమోహలహరీసంసక్తచిత్తంబునన్
గువలాస్త్రాతినిశాతసాయకశిఖాకుంఠీభవద్ధైర్యుఁడై. 96

టీ. రాజవలారాతి=రాజేంద్రుఁడు; ''శసయోర్బవయో స్తథా'' అనుట చేత బవలకు భేదంబు లేమి కవివ్యవహారసిద్ధ మని వెనుక వ్రాయంబడియె; తదేకమోహలహరీసంసక్తచిత్తంబునన్.—తత్=ఆచంద్రికయందు, ఏక=ముఖ్యమగు, మోహలహరీ=మోహప్రవాహముతో, సంసక్త=కూడుకొన్నట్టి, చిత్తంబునన్=మనస్సుచేత; కువలాస్త్రాతినిశాతసాయకశిఖాకుంఠీభవద్ధైర్యుఁడై.—కువలాస్త్ర=మరునియొక్క, అతినిశాత=మిక్కిలి తీక్ష్ణములగు, సాయక=బాణములచేత, కుంఠీభవత్=తగ్గుచున్న, ధైర్యుఁడై=ధైర్యముగలవాఁడయి; నవలాయేగినదారిన్ = చంద్రికపోయినత్రోవను; కాంచున్=చూచును. మదిన్=చిత్తమందు; తన్నాళీకపత్త్రేక్షణా నవలావణ్యవిశేషము.—తన్నాళీకపత్త్రేక్షణా=ఆకమలనయనయగుచంద్రికయొక్క, నవ=నూతనమగు, లావణ్యవిశేషము = విలక్షణలావణ్యమును, లావణ్యలక్షణము వ్రాయంబడియె; ఎంచున్=ప్రశంసించును. వలవంతన్ = మన్మథవ్యథచేత; చాలన్=మిక్కిలి. చింతించున్=చింతసేయును.

చ. నరవిభుఁ డిట్లు తత్సతియ♦నర్గళమోహగతిం భ్రమింపఁ గి
న్నరపతి యప్డు చేరి మహి♦నాయక యీగతి వంత నాత్మ నుం
తురె నినుఁ బ్రేమఁ జూచినవ♦ధూమణి నింతకు మున్నె యేఁచెఁ ద
త్స్మరశరకోటి త్వద్గతస♦మగ్రమనోరథగా ఘటించుచున్. 97

టీ. నరవిభుఁడు=సుచంద్రుఁడు; ఇట్లు=ఈప్రకారముగ; తత్సతియనర్గళమోహగతిన్=ఆచంద్రికావిషయకమైన యనివార్యమగుమోహరీతిచేత; భ్రమింపన్=చిత్తభ్రమనొందఁగా; కిన్నరపతి=కుముదుఁడు; అప్డు; చేరి=ఆరాజుసమీపమునొంది; మహీనాయక=సుచంద్రుఁడా! ఈగతిన్=ఈతీరుగ; వంతన్=సంతాపమునందు; ఆత్మన్=చిత్తమును; ఉంతురె=ఉంచుదురా? నినున్; ప్రేమన్=ఆసక్తిచేత; చూచినవధూమణిన్=అవలోకించిన స్త్రీరత్నమును; ఇంతకున్ మున్నె=ఇంతకుఁబూర్వమె; తత్స్మరశరకోటి=ఆమరుమార్గణపరంపర; త్వద్గతసమగ్రమనోరథ=నీయందుఁగలిగినసమగ్రాభిలాషగలది; కాన్=అగునట్లు; ఘటించుచున్=చేయుచు; ఏఁచెన్=బాధించెను.

స్మరుఁడు మున్నె చంద్రికను నీసంగమము నభిలషించుదానిఁగా నొనరించుటంజేసి తనంతనే కార్యసిద్ధి యగుఁ గాన దానికై నీవు చింతింపఁ బని లే దని తాత్పర్యము.

క. నీలాలక వరియించెద, వేలా వలవంత మేది♦నీశ్వర యన నా
కాలాబ్జవిమతకులజన, పాలాగ్రణి కూటధృతివి♦భాస్వన్మతితోఁ. 98

టీ. మేదినీశ్వర=సుచంద్రుఁడా! నీలాలకన్=చంద్రికను; వరియించెదవు=పెండ్లియాడెదవనుట. వలవంత=మన్మథవ్యథ; ఏలా=ఎందుకు? అనన్=కుముదుఁడిట్లువచింపఁగా; కాలాబ్జవిమతకులజనపాలాగ్రణి.—కాలాబ్జవిమత=నీలోత్పలవిరోధియగుసూర్యునియొక్క, కుల=వంశమందుఁబుట్టిన, జనపాల=రాజులయందు, అగ్రణి=శ్రేష్ఠుండగు సుచంద్రుఁడు; కూటధృతివిభాస్వన్మతితోన్=నిశ్చలధైర్యమున నొప్పుచున్నమదిచేత. దీనికి నుత్తరపద్యస్థమగుపనిచె ననుక్రియతో నన్వయము.

గీ. గగనయానోత్తమస్యద♦గతి ధరిత్రి
నగరకాననకుధరసం♦తతులఁ గనుచుఁ
జని తనబలంబు నెనసి యా♦త్మావిభుండు
కూర్మిఁ గనుపట్ట నంత నా♦కుముదుఁ బనిచె. 99

టీ. ఆత్మావిభుండు=ఆరాజు; గగనయానోత్తమస్యదగతిన్.—గగనయానోత్తమ=ఉత్తమవిమానముయొక్క, స్యద=వేగముయొక్క, "రయస్స్యదః" అని యమరుఁడు, గతిన్=తీరుచేత; ధరిత్రిన్=భూమియందు; నగరకాననకుధరసంతతులన్ = పురారణ్యపర్వతముల యొక్కసంఘములను; కనుచున్=చూచుచు; చని; తనబలంబున్=తనసైన్యమును; ఎనసి=చేరి;

కూర్మి=ప్రేమము; కనుపట్టన్=కనఁబడునట్లు; అంతన్; ఆకుముదున్=పైఁజెప్పిన కుముదుని; పనిచెన్=పంపెను.

చ. మును మునితోడఁ బల్కినయ•మూల్యనిజోక్తిఁ దలంచి యారసా
జనపతిమౌళి సత్వరత • సంగరభూమిఁ దమిస్రదానవేం
ద్రుని వధియింతు నంచు లలి•తోఁ దపనీయరథాధిరూఢుఁడై
చనియె రణానకప్రకర•సాంద్రరుతుల్ దెస లెల్లఁ గ్రమ్మఁగన్. 100

టీ. మును=పూర్వమున; మునితోడన్=శాండిల్యునితోడ; పల్కినయమూల్య నిజోక్తిన్=వచించినట్టి యనర్ఘమగుతనమాటను; తలంచి=స్మరించి; ఆరసాజనపతిమౌళి=ఆరాజమౌళియగుచంద్రుఁడు; సత్వరతన్=వేగముచేత; సంగరభూమిన్=యుద్ధభూమియందు; తమిస్రదానవేంద్రునిన్=తమిస్రాసురుని, వధియింతున్ అంచున్=సంహరింతునంచు; లలితోన్=ప్రీతితోడ; తపనీయరథాధిరూఢుఁడు=కనకరథమునధిష్ఠించినవాఁడునై; రణానకప్రకరసాంద్రరుతుల్.—రణానకప్రకర=రణభేరీనిచయముయొక్క, "ఆనకః పటహోస్త్రీస్యాత్" అని యమరుఁడు, సాంద్ర=దట్టములగు, రుతుల్=ధ్వనులు; దెసలుఎల్లన్=దిక్కులనంతయు; క్రమ్మఁగన్=ఆవరింపఁగా; చనియెన్=పోయెను.

సీ. అతులరింఖోద్భ వ•క్షితిధూళి నానాశ
రాధీశమహిమఁ బో•నాడుహయము
లతిశాతదంతప్ర•హతిఁ గర్బురాచల
స్థితి నెల్ల మాయించు•ద్విరదచయము
లలఘు కేతనమారు•తాళి మహాసురో
త్తమమండలిఁ దెరల్చు•విమలరథము
లాత్మ భాసురసమా•ఖ్యాశక్తి యామినీ
చరభయంబు ఘటించు•సద్భటేంద్రు

తే. లపుడు వేవేలు గొలువ న•య్యవనిభర్త
యిటులు కల్యాణమయరథం • బెక్కి వేగ
శశిరగిరిఁ జేర నరిగె న•క్షీణదనుజ
దళనచణదివ్యసాధనో•ద్భాసి యగుచు. 101

టీ. అతులరింఖోద్భవక్షితిధూళిన్.—అతుల=సాటిలేని, రింఖా=ఖురములచేత, ఉద్భవ=ఉదయించిన, క్షితిధూళిన్=భూపరాగముచేత; నానాశరాధీశమహిమన్.—నానా=అనేకప్రకారములగు, శరాధీశ=సముద్రములయొక్క, మహిమన్=అతిశయమును, అనేకప్రకారు

లగు, ఆశరాధీశు లనఁగా రక్కసులయొక్క మహిమము ననియర్థాంతరధ్వని; "క్రవ్యాదోస్ర పఆశరః" అని యమరుఁడు; పోనాడుహయములు.—పోఁగొట్టెడునశ్వములు; అతిశాతదంత ప్రహతిన్ =మిక్కిలి తీక్ష్ణములగు దంతముల ప్రహారముచేత; కర్బురాచలస్థితిన్ =మేరుపర్వతస్థితిని, రాక్షసులయొక్క స్థిరమయినస్థితి నని యర్థాంతరము;"గాఙ్గేయం భర్మ కర్బు.రమ్,రాత్రించరోరాత్రిచరః కర్బురః" అనియమరుఁడు; ఎల్లన్; మాయించుద్విరదచయములు=మాపుచున్న గజములగుంపులు; అలఘుకేతనమారుతాళిన్.—అలఘు=అధికమగు, కేతన=ధ్వజములయొక్క, మారుతాళిన్=వాతజాతముచేత; మహాసురోత్తమమండలిన్.—మహత్=అధికమగు, సురోత్తమమండలిన్=సూర్యపుంజమును, ద్వాదశాదిత్యులపటలినని, "సురోత్తమోధామనిధిః పద్మినీవల్లభో హరిః" అనియమరుఁడు, గొప్పయసురోత్తమ మండలిననియర్థాంతరము తోఁచుచున్నది; తెరల్చువిమలరథములు=పోఁగొట్టుచున్నవిమలమైనట్టిరథములు; ఆత్మభాసురసమాఖ్యాశక్తిన్.—ఆత్మ=తమయొక్క, భాసుర=ప్రకాశమానమగు,సమాఖ్యా=యశముయొక్క, శక్తిన్=సామర్థ్యముచేత; యామినీచరభయంబు.—యామినీచర = చంద్రునియొక్క, రాక్షసులయొక్కయనియర్థాంతరము, భయంబు=భీతిని; ఘటించుసద్భటేంద్రులు=చేయుశ్రేష్ఠభటనాయకులు; అపుడు=ఆసమయమున; వేవేలు=అనేకసహస్రములు; కొలువన్ =సేవింపఁగా; అయ్యవనిభర్త=ఆరాజు; ఇటులు=ఈప్రకారముగా; కల్యాణమయరథంబు = బంగరుతేరును; మంగళమయమయినరథము ననియర్థాంతరము, "కల్యాణమర్జునంభూరి" యనియమరుఁడు: ఎక్కి=అధిష్ఠించి; అక్షీణదనుజదళనచణ దివ్యసాధనోద్భాసి.—అక్షీణ=తక్కువగానట్టి, ఇదిసాధనశబ్దమునకువిశేషణము, దనుజదళనచణ=రాక్షససంహారసమర్థమగు, దివ్య=లోకోత్తరమయిన, సాధన=శరాదిసామగ్రిచేత, ఉద్భాసి=ప్రకాశించువాఁడు; అగుచున్; వేగ=వేగముగా; శిశిరగిరిన్=హిమవత్పర్వతమును; చేరెన్=పొందెను.

అనఁగా ఖురధూళిచే సముద్రమహిమ నపహరించుహయములును దంతప్రహారములచేఁ గాంచనాచలము రూపుమాపుగజములును గేతనవాతముచే సూర్యమండలిని దెరల్చురథములును నిజతేజములచేఁ జంద్రునిభయపెట్టు భటశ్రేష్ఠులును గొలుచుచుండ స్వర్ణమయరథంబు నెక్కి సుచంద్రుఁడు రాక్షససంహారసాధనసహస్రంబుతో శిశిరగిరి చేరె ననుట.

శా. భాస్వన్మండలమధ్యగుం డసురమా♦భామావిభుం డో యనన్
వస్వభ్యంచితచక్రపాదమున నం♦దం బంది భూభర్త సై
న్యస్వాముల్ భజియింప దైత్యకటకేం♦ద్రద్వారభూభృద్దరీ
భాస్వన్మార్గము సొచ్చె నంత ఘనబం♦భాఘోషముల్ హెచ్చఁగన్. 102

టీ. భూభర్త=సుచంద్రుఁడు; భాస్వన్మండలమధ్యగుండు=సూర్యమండలమధ్యవర్తి; అసురమాభామావిభుండు ఓ అనన్=అయినట్టినారాయణుండో యనఁగా; వస్వభ్యంచితచక్రపాదమునన్.—వసు=సువర్ణముచేత, అభ్యంచిత=పూజ్యమగు, చక్రపాదమునన్=చక్రములు పాదములుగాఁగలరథమునందు; అందంబుఅంది=సొంపుగాంచి; సైన్యస్వాముల్ = సేనానా

యకులు; భజియింపఁగ౯=సేవించుచుండఁగా; ఘనబంభాఘోషముల్ = గొప్పలగుక్షుయలయొక్క నాదములు; హెచ్చఁగ౯=అతిశయింపఁగా; అంత౯ = ఆసమయమందు; దైత్యకటకేంద్రద్వారభూభృద్దరీభాస్వన్మార్గము.—దైత్య=తమిస్రాసురునియొక్క, కటకేంద్ర=నగరశ్రేష్ఠముయొక్క, ద్వార=ద్వారమందలి, భూభృత్=పర్వతముయొక్క, దరీ=గుహాయనెడు, భాస్వత్=ప్రకాశించుచున్న, మార్గము౯=మార్గమును; చొచ్చె౯=ప్రవేశించెను.

మ. పతి గాంచె౯ నవగోపురేశమకుటా•బ్జద్వేష్యుద్యదంశుచ్ఛటా
మతికృత్కేతనధౌతదీప్రము మహా•క్ష్మాహంసకజ్ఞానదా
యతవప్రంబు సమగ్రసాలవలయా•గాంతస్థితాన్యాచలా
కృతిమత్సౌధసముత్కరంబు దనుజ•శ్రీమత్పురం బయ్యెడ౯. 103

టీ. అయ్యెడ౯=ఆసమయమందు;నవగోపురేశమకుటాబ్జద్వేష్యుద్యదంశుచ్ఛటామతికృత్కేతనధౌతదీప్రము.—నవ=నూతనమగు, ఇదియంశుచ్ఛటకువిశేషణము, గోపురేశ=పురద్వారమనెడుశివునియొక్క. “పురద్వారంతుగోపురమ్” అనియమరుఁడు, మకుట=శిఖరములనెడుకిరీటములందలి,అబ్జద్వేషి=చంద్రునియొక్క, ఉత్=ఊర్ధ్వముఖములైన,అంశు=కిరణములయొక్క, ఛటా=పరంపరయనెడు, మతి=జ్ఞానమును, కృత్=చేయుచున్న, అనఁగా హారమకుటతటశీతాంశుకిరణపుంజమును బోలుచున్న యనుట, కేతన=ధ్వజములచేత, ధౌతదీప్రము=శుభ్రమయినదియు ప్రకాశించునదియునగు; మహాక్ష్మాహంసకజ్ఞానదాయతవప్రంబు.— మహత్=అధికమయిన, క్ష్మాహంసక=భూదేవిసంబంధియగుపాదకటకమనెడు, “హంసకః పాదకటకః” అనియమరుఁడు, జ్ఞాన=జ్ఞానమును, ద=ఇచ్చుచున్న, ఆయత=విశాలమయిన, వప్రంబు=కోటగలదియు; సమగ్రసాలవలయాగాంతస్థితాన్యాచలాకృతిమత్సౌధసముత్కరంబు.—సమగ్ర = సంపూర్ణమయిన, సాలవలయాగ=లోకాలోకపర్వతమువంటిప్రాకారముయొక్క, అంతస్థిత=లోపలనున్నవియు, అన్యాచల=ఇతరపర్వతములయొక్క, ఆకృతిమత్=ఆకారమువంటియాకారముగలవియునగు,సౌధ=మేడలయొక్క, సముత్కరంబు=గుంపులుగలదియునగు; దనుజశ్రీమత్పురంబు=రాక్షసునిప్రకాశించుచున్ననగరమును;పతి=సుచంద్రుఁడు;కాంచె౯=చూచెను.

చ. కనుఁగొని యానతియ్య మహీ•కాంతు ననుజ్ఞ బలంబు లెల్లఁ ద
ద్ఘనవరణంబు చుట్టి పరి•ఖాతతిఁ బూడ్వఁగఁ గోట ద్రవ్వ గ్ర
క్కున బలుమేరువుల్ నిలుప• ఘోరతరోగతి సంభ్రమించెఁ ద
త్స్వనము సురారిపాళి కని•వార్యరణక్రియ ముగ్గడింపఁగ౯. 104

టీ. కనుఁగొని=చూచి;ఆనతియ్య౯=అనుజ్ఞయొసంగఁగా; మహీకాంతుననుజ్ఞ౯=రాజునాజ్ఞచేత; బలంబులుఎల్ల౯=సైన్యములెల్లను; తద్ఘనవరణంబుచుట్టి=ఆగొప్పకోటనావరించి; పరిఖాతతి౯ = అగడ్తలగుంపును; పూడ్వఁగ౯ = మృత్పాషాణాదులచేనించుటకును; కోటద్రవ్వ౯=ప్రాకారమును త్రవ్వుటకును; గ్రక్కున౯=వేగముగా; బలుమేరువుల్=

అధికములగుసారువలను; నిలుపక=ఉంచుటకును; తత్స్వనము=ఆధ్వని; సురాపాళికిన్=రక్కసులగుంపునకు; అనివార్యరణక్రమము=నివారింపరానియుద్ధక్రమమును; ఉగ్గడింపఁగన్=బయల్పఱుచునట్లు; ఘోరతరోగతిన్=అధికమయినవేగముతీరున, కాదేని బలముతీరున; సంభ్రమించెన్=వేగిరపడెను. ఆరాజు సైన్యమగ ద్రఁబూడ్చుటకొఱకు ట్రద్రవ్యటలోనగు కార్యములకు వేగమున సంభ్రమించెననుట.

వ. అంత నద్దురంత కోలాహ లార్థ విజ్ఞాపక చారవార వాచా జాయమాన ప్రతిఘా సముద్దాముం డగునాతమిస్రతమిస్రాచర సార్వభౌముం డనూనకువలయభయంకర కోపాటోపశోణిమధురీణ వదనాంబురుహబంధుబింబ వినిర్గతకిరణాంకూరమాలికాయమానని స్తబ్ధతామ్రశ్మశ్రుజాలుండును నధరాధరఫలగ్రాసనసమానక్ష్మోపరిద్విజోపరిగతాగ్రహ తదితరద్విజారబ్ధకలహాసముదిత నినాదమతిక్రూరదదనాగ్రాఘాత సంజాతకిటకిటారవబధిరీకృతపర్యంతవర్తికుండును నరిరాజహంసమదాపహారికరకరద ధగధగాయమానసూతనైరావతీ ప్రమాకరకనకకరవాలికాతారళీముకుళీకృత సభాజనలోచనాబ్జుండును నతంద్రసుచంద్రరాజచంద్రప్రతాపవీతిహోత్ర పరంపరాప్రకారసమున్నమదంతరంగకరండా ఖండరోషపారదౌల్బణీవిదార్యమాణచీలబంధనశేముషీదాయక సాంపరాయికలాలసాక్రమ సమేధమానాపఘనఘనత్వఫలత్తనుత్రాణుండును నలఘుబలాహితకాండాసమానవిలాస వీక్షణదీక్షాదక్షవికటభ్రుకుటికుండును నఖిలప్రపంచపంచతాకరణచణవిలయకాలమహాకాలసరూపరూపుండును నగుచు నేఁడుగదామదాశయపూర్తి గావించెఁ బంచజనమాంసంబని తలంచుచు మణిమయాసనంబు డిగ్గన డిగనుఱికి నిజావాసంబు వెడలి వినీతసారథివరానీతశతాంగరాజం బెక్కి క్రిక్కిఱిసి రక్కసిదొరలు వెనువెంటం గొలువ నభంగురమతంగజతురంగమ చక్రాంగపదాతి సముదయంబులతో నాహవోత్సాహంబున వెడలె నయ్యెడ.

టీ. అంతన్=అటుతరవాత; తద్దురంతకోలాహలార్థవిజ్ఞాపకచారవార వాచాజాయమానప్రతిఘాసముద్దాముండు.—తద్దురంతకోలాహల=ఆయపారమగుకలకలధ్వనికి, అర్థ=ప్రయోజనభూతమయినయుద్ధముయొక్క, జ్ఞాపక=నివేదకులగు, చార = వేగులవారియొక్క, వార=సంఘముయొక్క, వాచా=వచనములచే, జాయమాన=జనించుచున్న; ప్రతిఘా=రోషముచేత, సముద్దాముండు=అధికుఁడు; అగు; ఆతమిస్రతమిస్రాచరసార్వభౌముండు = ఆతమిస్రుండనుపేరుగలరజనీచర చక్రవర్తి, "తమిస్రాతామసీరాత్రిః" అని యమరుఁడు; అనూనకువలయభయంకర కోపాటోపశోణిమధురీణ వదనాంబురుహబంధుబింబవినిర్గతకిరణాంకూర

మాలికాయమానని స్తబ్ధతామ్రశ్మశ్రుజాలుండును.—అనూన=అధికమయిన, కువలయ=భూవలయ
మనెడుకల్పక, భయంకర=భయప్రదమైన, కోపాటోప = కోపాతిశయముచేత, శోణిమధు
రీణ=రక్తిమభారవాహకమగు, మిక్కిలి యెఱ్ఱనయిన యనుట, వదన=ముఖమనెడు, అంబురు
హబంధుబింబ=సూర్యబింబమువలన, వినిర్గత=వెడలివచ్చుచున్న, కిరణాంకూరమాలికాయమా
న=బాలకిరణపరంపరవలెనాచరించుచున్న, దానింబోలుచున్న యనుట,నిస్తబ్ధ=నిగుడుకొన్న,
తామ్ర=ఎఱ్ఱనయిన, శ్మశ్రుజాలుండును=మీసములగుంపుగలవాఁడును; అధరాధరఫలగ్రాస
సమాసక్తోపరిద్విజో పరిగతాగ్రహతదితర ద్విజారబ్ధకలహాసముదితనినాదమతికృద్రదనాగ్రా
ఘాతసంజాతకిటకిటారవబధిరీకృత పర్యంతవర్తికుండును.—అధరాధర=క్రిందిపెదవియనెడు,
ఫల=పండుయొక్క,గ్రాస=భక్షణమందు, సమాసక్త=వాంఛగల,ఉపరిద్విజ=పైపండ్లనెడుపక్షు
లయొక్క, ఉపరి=మీఁదను, గత=పొందినట్టి, ఆగ్రహ=కోపముగల, తదితరద్విజ=వానికన్న
నితరములగు దిగువపండ్లనెడు పక్షులచేత, అరబ్ధ=ఆరంభింపఁబడిన, కలహ=కలహముచేత,
సముదిత=ఉదయించిన, నినాద=ధ్వనియనెడు, మతి=బుద్ధిని, కృత్=చేయుచున్న, రదనా
గ్రాఘాత=దంతాగ్రఘట్టనముచేత, సంజాత=ఉదయించిన, కిటకిటారవ=కిటకిటయను ధ్వని
చేత, బధిరీకృత=బధిరులుగాఁజేయఁబడిన, పర్యంతవర్తికుండును=పార్శ్వవర్తిజనముగలవాఁ
డును; అరిరాజహంసమదాపహారికరశరదధగధగాయ మాననూత్నైరావతీ ప్రమాకరకనకకర
వాలికాతారళీముకుళీకృత సభాజనలోచనాబ్జుండును.—అరిరాజ=శత్రురాజులనెడు, హంస=
హంసలయొక్క, మదాపహ=దర్పమునుడిగించెడు, కరశరద=హస్తమనెడు మేఘమునందు,
ధగధగాయమాన=ప్రకాశించుచున్న, నూత్నైరావతీ = తొలకరిమెఱుపనెడు, "ఐరావత్యః
క్షణప్రభాః" యనియమరుఁడు, ప్రమాకర=యథార్థజ్ఞానకరమయిన,కనకకరవాలికా=బంగరు
చూరకత్తియొక్క, తారళీ=చాంచల్యముచేత, ముకుళీకృత=ముకుళములుగాఁ జేయఁబడిన,
సభాజనలోచనాబ్జుండును = సభయందున్న జనులయొక్క నేత్రకమలములు గలవాఁడును;
అతంద్రసుచంద్రరాజచంద్రప్రతాపవీతిహోత్రపరంపరాప్రకారసమున్నమదంతరంగకరండా
ఖండరోషపారదౌల్బణీవిదార్యమాణచీలబంధనశేముషీదాయక సాంపరాయికలాలసాక్రమ
సమేధమానాపఘన ఘనత్వఫలత్తనుత్రాణుండును.—అతంద్ర=జాగరూకమైన, సుచంద్రరా
జచంద్ర=సుచంద్రనరపాలాగ్రణియొక్క,ప్రతాప=ప్రతాపమనెడు,వీతిహోత్రపరంపరాప్రకా
ర=అగ్నిపరంపరలరీతిచేత,సమున్నమత్=మిక్కిలిపైకెగయుచున్న, అంతరంగకరండ=చిత్త
మనెడుమూసయందలి, అఖండ=అవిచ్ఛిన్నమగు, రోషపారద=క్రోధమనెడుపాదరసముయొ
క్క, ఔల్బణీ=ఉద్రేకముచేత, విదార్యమాణ=బ్రద్దలుచేయఁబడిన, చీలబంధన = మూసపై
మట్టితోచేసినగట్టనయనెడు, శేముషీ=మతియొక్క, దాయక=ఇచ్చునదియైన, దీనికి తనుత్రాణ
ముతో నన్వయము,సాంపరాయిక=సమరమందలి, లాలసాక్రమ=తృష్ణాతిశయముచేత, సమేధ
మాన=వృద్ధిఁబొందుచున్న, అపఘన=అంగముయొక్క, "అఙ్గంశరీరోపఘనోవయవః" అని
యమరుఁడు, ఘనత్వ=గొప్పతనముచేత, ఫలత్=పగులుచున్న, "ఫలవిశరణే" అని యను
శాసనము, తనుత్రాణుండును=కవచముగలవాఁడును; అలఘుబలాహితకాండాసమానవిలాస
విక్షపణదీక్షాదక్షవికటభ్రుకుటికుండును,—అలఘు=అధికమగు, బలాహితకాండాస = ఇంద్ర
ధనుస్సుయొక్క, మానవిలాస=గర్వవిలసనముయొక్క, విక్షపణదీక్షా = నాశనదీక్షయందు

దక్ష=సమర్థమగు, భ్రుకుటికుండును = భ్రూభంగముగలవాఁడును; అఖిలప్రపంచపంచతాకరణచణవిలయకాలమహాకాల సరూపరూపుండును.—అఖిలప్రపంచ=సమస్త లోకములయొక్క, పంచతాకరణ=నాశకరణమందు, చణ=సమర్థమయిన, విలయకాలమహాకాల=ప్రలయకాలరుద్రునితో, సరూప=సమానమగు, రూపుండును=రూపముగలవాఁడును; అగుచున్. నేఁడు గదా=ఇపుడుగదా! పంచజనమాంసంబు=మనుష్యమాంసము; "స్యుఃపుమాంసః పంచజనాః" అనియమరుఁడు; మహాశయపూర్తిన్=నాయిష్టపూర్తిని; కావించెన్=చేసెను. అని తలంచుచున్=ఇట్లుచింతించుచు; మణిమయాసనంబు=మణిమయమగు సింహాసనమునుండి; డిగ్గనన్=తటాలున; డిగనుఱికి=వేగముగాదిగియనుట; నిజావాసంబు=నిజగృహమునుండి; వెడలి=బయలుదేఱి; వినీతసారథివరానీతశతాంగరాజంబు = వినయవంతుఁడైనసారథిశ్రేష్ఠునిచేఁదేఁబడిన రథశ్రేష్ఠమును; ఎక్కి=అధిష్ఠించి; రక్కసిదొరలు=రాక్షసాధిపతులు; వెనువెంటన్ = మిక్కిలివెంబడిగా; క్రిక్కిఱిసి=ఎడములేనట్లుబలిసి; కొలువన్=సేవించుచుండఁగా;అభంగురమతంగజతురంగమచక్రాంగ పదాతిసముదయంబులతోన్.—అప్రతిహతములగుకరితురగ రథపదాతిచయములతోడ; ఆహవోత్సవంబునన్=యుద్ధమునందలి వేడుకవలన;వెడలెన్=బయలుదేఱెను. అయ్యెడన్=ఆసమయమునందు.

అనఁగా నాతమిస్రాసురుండు సూర్యబింబమున నుండి వెడలిన కిరణములుంబోలె తన ముఖమున నుండి వెడలి నిగుడుకొన్న నిూసములుగలవాఁడును దంతాఘట్టన జనితారవ బధిరీకృతపరివారజనుండును నిజకరాగ్రజలదనానట్యమానవిద్యుల్లతాయమానకరవాలికాధాళధళ్యముకుళీకృత సభ్యజనలోచనాబ్జుండును సుచంద్రప్రతాపాగ్ని సంతాపితరోష పారదోద్రేకవిదార్యమాణమనః కరండచీలబంధనాయిత యుద్ధలాలసా సమేధమానగాత్ర ఘనతాభిద్యమానతనుత్రాణుండును ఇంద్రధనుర్మదాపహభ్రుకుటీ విరాజమానుండును సకలలోకలయకారి కల్పాంతకాలరుద్ర సదృక్షవిగ్రహుండును అగుచు మణిమయాసనమున నుండి డిగ్గి రథారూఢుఁడై యనేకరాక్షస నాయకపరివృతుఁడై రథగజతురగాది రణసామగ్రితో బయలుదేఱె ననుట.

మ. కరిఘీంకారము లాశరేశబలహుంకారంబు లర్వవ్రజ
స్థిరహేంకారము లక్షచక్రవిలసత్క్రేంకారముల్ గూడి స
త్వరతం ద్విద్వయసాగరోర్మిచటులధ్వానంబు నాఁ జేర భూ
వరసేనాజన మాయితం బగుచు దైవాఱెన్ రణోత్సాహతన్. 106

టీ. కరిఘీంకారములు=గజములఘీమనుధ్వనులు; ఆశరేశబలహుంకారంబులు=రాక్షసేశ్వరుని సేనలహుంకారములు;అర్వవ్రజస్థిరహేంకారములు=అశ్వబృందముయొక్క స్థిరమైన హేషారవములును; అక్షచక్రవిలసత్క్రేంకారములు=రథసమూహములయొక్క ప్రకాశమానక్రేంకారములు; కూడి=మెలఁగి; సత్వరతన్=వేగముచేత; ద్విద్వయసాగరోర్మిచటులధ్వానంబునాన్.—ద్విద్వయసాగర = నాలుగుసముద్రములయొక్క, "నవద్వయద్వీపపృథగ్జయ

శ్రియామ్" అనునట్లు ద్విద్వ్యయయను ప్రయోగము, ఊర్మి=తరంగములయొక్క, చటుల=చంచలమైన, ధ్వానంబునాన్=ధ్వనియోయనునట్లు; చేరన్ = చెందఁగా; భూవరసేనాజనము=సుచంద్రునిసేనలోనిజనము; ఆయితంబగుచున్ = సిద్ధమగుచు; రణోత్సాహతన్ = యుద్ధోత్సాహము గలుగుటచేత; దైవాఱెన్=ఒప్పెను.

మ. అరుణాభ్రోదితరక్తవృష్టి యనుకూ♦లాన్యానిలశ్రేణి భా
స్వరకేత్వగ్రవిలగ్నగృధ్రము శివా♦జాతామితారావముల్
పరిదృశ్యోల్క నిజాజయంబు వివరిం♦పన్ వానిఁ జింతింప కా
సురవంశేశిత సంగరోర్వి నెనసెన్ ♦ శూరత్వ మొప్పారఁగన్. 107

టీ. అరుణాభ్రోదితరక్తవృష్టి=ఎఱ్ఱనిమేఘమువలన నుదయించిన రక్తవర్షంబును; అనుకూలాన్యానిలశ్రేణి.—అనుకూలాన్య=ప్రతికూలమయిన, అనిలశ్రేణి=వాతసమూహమును; భాస్వరకేత్వగ్రవిలగ్న గృధ్రము.—భాస్వర=ప్రకాశమానమగు, కేత్వగ్ర=ధ్వజాగ్రమందు, విలగ్న=సంబంధించిన, గృధ్రము=గద్దయును; శివాజాతామితారావముల్.—శివాజాత = జంబుకసమూహముయొక్క, అమితారావముల్=అపరిమితధ్వనులును; పరిదృశ్యోల్క= కనఁబడుచున్న కొఱవియు; "ఉల్కాస్యాన్నిర్గతజ్వాలా" అని యమరుఁడు; నిజాజయంబు=తనపరాజయమును; వివరింపన్=స్ఫుటీకరింపఁగా; వానిన్=ఆరక్తవృష్ట్యాదులను; చింతింపక=విచారింపక; ఆ సురవంశేశిత.—ఆసుర=రాక్షససంబంధియైన, వంశ=కులమునకు, ఈశిత=ప్రభువైనతమిస్రుఁడు; శూరత్వము=శౌర్యము; ఒప్పారఁగన్=ఒప్పుచుండఁగా; సంగరోర్విన్=రణభూమిని; ఎనసెన్=పొందెను.

ఉ. దానవనాయకాజ్ఞ సమ♦దక్షణదాచరసైన్యకోటులున్
మానవనాయకాజ్ఞ నస♦మానమహాజనసైన్యకోటులున్
బూనినరోషచండిమ న♦పూర్వకలంబసమీకకేళి వై
•మానికవార మభ్రమున ♦ మాటికిఁ గన్గొన సల్పె నేర్పునన్. 108

టీ. దానవనాయకాజ్ఞన్=రాక్షసేంద్రునియాజ్ఞచేత; సమదక్షణదాచర సైన్యకోటులున్.—సమద=గర్వయుక్తమైన, క్షణదాచర=రాక్షసులయొక్క, సైన్యకోటులున్= సైన్యసంఘములును; మానవనాయకాజ్ఞన్=ఆ సుచంద్రునాజ్ఞవలన; అసమానమహాజనసైన్యకోటులున్.—అసమాన=సాటిలేనట్టి, మహత్=శ్రేష్ఠులైన, జన=నరులయొక్క, సైన్యకోటులున్= సైన్యసమూహములును; పూనినరోషచండిమన్ = వహించినరోషాతిశయముచేత; అపూర్వకలంబ సమీకకేళిన్.—అపూర్వ=లోకోత్తరమగు, కలంబసమీక=బాణయుద్ధమనెడు, కేళిన్=క్రీడను, "కలంబమార్గణశరాః, సమీకంసాంపరాయికం" అని యమరుఁడు; వైమానికవారము=దేవతాబృందము; అభ్రమునన్=ఆకాశముననుండి; మాటికిన్ = సారెకు; కన్గొనన్= అవలోకింపఁగా; నేర్పునన్ =చాతుర్యముచేత; సల్పెన్ = చేసెను.

చ. అపుడు మహోగ్రవర్తన భ◆టాగ్రణిఁ బోరె భటాగ్రియాయి హా
స్తిపకవరేణ్యుతో రణముఁ◆ జేకొనె హాస్తిపకేశ్వరుండు సా
దిపటలిఁ జయ్యనం గదిసె◆ ధీరత సాదిచయంబు దోర్బలై
కపటిమచేఁ బరస్పరజి◆ఘాంస మనంబుల నంకురింపఁగన్. 109

టీ. అపుడు=ఆసమయమున; మహోగ్రవర్తనన్=అత్యుగ్రవృత్తిచేత; భటాగ్రణిన్=భటశ్రేష్ఠునితో; భటాగ్రయాయి= భటశ్రేష్ఠుఁడు; పోరెన్ =పెనఁగెను. హాస్తిపకవరేణ్యుతోన్=మావటులయందు శ్రేష్ఠుఁడగువానితోడ; హాస్తిపకేశ్వరుఁడు=మావటులయందు శ్రేష్ఠుండు; రణమున్=యుద్ధమును; చేకొనెన్ = చేసెను. సాదిపటలిన్=అశ్వారోహకులయొక్క సమూహమును; చయ్యనన్=వేగముగ; ధీరతన్=ధైర్యముచేత; సాదిచయంబు=అశ్వారోహులసమూహము; కదిసెన్=తాఁకెను. దోర్బలైకపటిమచేన్ = బాహుబలాధిక్యముచేత; పరస్పరజిఘాంస=అన్యోన్యహననేచ్ఛ; మనంబులన్ = చిత్తములయందు; అంకురింపఁగన్= ఉదయింపఁగ. ఇది పై పోరెనిత్యాది క్రియల యన్నిటితో నన్వయించును.

మ. ద్రుఘణంబుల్ పరఁగించి కుంతములచేఁ◆ దూలించి కోదండము
క్తఘనాస్త్రాళులఁ గ్రమ్మి శూలతతి వే◆గన్ గ్రుమ్మి దుర్వారపా
రిఘధారాగతిఁ జీరి సంగరధరి◆త్రిన్ మించెఁ దద్వీరసే
న ఘనాధ్వంబు పగుల్పఁ దత్తుముల స◆న్నాదంబు చిత్రంబుగన్. 110

టీ. ద్రుఘణంబుల్=ముద్గరములను; పరఁగించి=ప్రయోగించి; కుంతములచేన్=బల్లెములచేత; తూలించి=తూలఁజేసి; కోదండముక్త ఘనాస్త్రాళులన్.—కోదండ=ధనుస్సులనుండి, ముక్త=విడువఁబడిన, ఘనాస్త్ర=గొప్పబాణములయొక్క, ఆళులన్= సమూహములచేత ; క్రమ్మి=కప్పి; శూలతతిన్=బాఁకులగుంపుచేత; వేగన్=త్వరగా ; గ్రుమ్మి=గ్రుచ్చి; దుర్వారపారిఘధారాగతిన్.—దుర్వార=వారింపశక్యముగాని, పారిఘ = పరిఘసమూహముయొక్క, ధారాగతిన్=అంచులతీరుచేత; చీరి = బ్రద్దలుచేసి; తద్వీరసేన = ఆమనుష్యదానవవీరులయొక్క సైన్యంబు ; చిత్రంబుగన్ = ఆశ్చర్యముగా ; తత్తుములసన్నాదంబు = ఆరణసంకులధ్వని; ఘనాధ్వంబు = ఆకాశమును ; పగుల్పన్=భేదింపఁగా; ధరిత్రిన్ = భూమియందు; మించెన్=అతిశయించెను.

మ. నరనాథేంద్రభటుల్ సురారిభటులున్◆ స్వస్వాభిధాశౌర్యముల్
వరుసం జెల్పుచుఁ బోరి రుగ్రరణఖే◆లాపాండితిన్ నిర్జరో
త్కరముల్ వ్యోమవితర్దిఁ జేరి యని ఖ◆డ్గాఖడ్గిలీలల్ శరా
శరియుజ్జృంభణముల్ గదాగదివిలా◆సంబుల్ మదిన్ మెచ్చఁగన్. 111

టీ. నిర్జరోత్కరముల్=దేవతాసంఘములు; వ్యోమవితర్దిన్ = గగనమనెడు వేదికను; చేరి=పొంది; అనిన్=యుద్ధమందలి; ఖడ్గాఖడ్గిలీలల్ = ఖడ్గములచేఁజేయు యుద్ధక్రియ

లను; శరాశరియుజ్జృంభణముల్=బాణముచేఁజేయు యుద్ధవిజృంభణములను ; గదాగదివిలాసంబుల్=గదలతోఁజేయు యుద్ధవిలసనములను; మదిన్=చిత్తమందు; మెచ్చఁగన్=ప్రశంసింపఁగా; ఉగ్రరణఖేలాపాండితిన్.—ఉగ్ర=భయంకరమగు, రణ=యుద్ధమనెడు, ఖేలా=, క్రీడయొక్క, పాండితిన్=పాండిత్యముచేత; నరనాథేంద్రభటుల్=రాజభటులును ; సురారిభటులున్=రాక్షసభటులును;స్వస్వాభిధాశౌర్యముల్=తమతమపేళ్ళను బరాక్రమములను; వరుసన్=క్రమముగా; తెల్పుచున్=తెలియఁజేయుచు; పోరిరి=యుద్ధముఁజేసిరి.

శా. ఆలో నాదిననాథవంశమణి చక్రాంగోత్తమాస్థానిఁ బ్ర
త్యాలీఢస్థితిఁ బొల్చి కుండలితబాణాసోజ్జ్వలత్పాణియై
చాలన్ శింజినికానినాదమున నాశావీథి మేల్కాంచ ని
ర్వేలాస్త్రప్రకరంబు నించె ననుహృద్వీరానుహృద్వృత్తిచేన్. 112

టీ. ఆలోన్=అంతలో; ఆ దిననాథవంశమణి=ఆ సూర్యవంశశ్రేష్ఠుండగు సుచంద్రుఁడు; చక్రాంగోత్తమాస్థానిన్=ఉత్తమరథమను నాస్థానమందు; ప్రత్యాలీఢస్థితిన్=స్థానవిశేషస్థితిచేత;అనఁగా నెడమకాలుముందుకుఁజాఁపినిల్చియనుట,“స్యాత్ప్రత్యాలీఢమాలీఢమిత్యాదిస్థానపంచకమ్” అని యమరుఁడు; పొల్చి=ఒప్పి;కుండలితబాణాసోజ్జ్వలత్పాణియై.—కుండలిత=కుండలాకారముగఁ జేయఁబడిన, బాణాస=ధనుస్సుచేత, ఉజ్జ్వలత్= ప్రకాశించుచున్న, పాణియై=హస్తముగలవాఁడై; చాలన్=మిక్కిలి; శింజినికానినాదమునన్= అల్లెత్రాటిధ్వనిచేత; ఆశావీథి=దిక్ప్రదేశము;మేల్కాంచన్=మేల్కొనఁగా; అనఁగా దిగంతము వఱకు శింజానినాదము వ్యాపింపఁగా ననుట; నిర్వేలాస్త్రప్రకరంబు=అధికములగు బాణములగుంపును; అనుహృద్వీరానుహృద్వృత్తిచేన్=శత్రువీరులయొక్క ప్రాణములహరించు వృత్తిచేత; నించెన్=పూరించెను.

మ. పరబర్హ్యుద్ధతిఁ దూల్చి తార్క్ష్యహరణప్రౌఢిన్ విజృంభించి ని
ర్భరశక్తిన్ ధర గాఁడి పాఱె నలగోత్రాభృన్మహాజిహ్మగో
త్కరముల్ తద్వ్యాహృతిప్రకారభయరేఖావన్మహాజిహ్మగో
త్కరముల్ నిండరొనర్పఁ దత్పురము వేగం జేరుచందంబునన్. 113

టీ. అలగోత్రాభృన్మహాజిహ్మగోత్కరముల్.—అలగోత్రాభృత్ = ఆ సుచంద్రునియొక్క, మహత్=గొప్పలయిన; అజిహ్మగ=బాణములయొక్క, “అజిహ్మగఖగాశుగాః” అని యమరుఁడు, ఉత్కరముల్=సమూహములు; సర్పసమూహములని యర్థాంతరము ధ్వనించుచున్నది; తత్పక్షమందు జిహ్మగఅని పదచ్ఛేదము. పరబర్హ్యుద్ధతిన్.—పర=శత్రువులైన, బర్హి=గర్విష్ఠులయొక్క, “బర్హిర్గర్వే కేకిపింఛే” అనివిశ్వము, ఉద్ధతిన్=దర్పమును, ఉత్కృష్టములైన మయూరములయొక్క యుద్ధతియని యర్థాంతరము; తూల్చి = ఉడిగించి; తార్క్ష్యహరణప్రౌఢిన్.—తార్క్ష్య=అశ్వములయొక్క, హరణ=సంహారముయొక్క, ప్రౌఢిన్=ప్రావీణ్యము

చేత; గరుత్మత్సంహారప్రావీణ్యముచేతనని యర్థాంతరము; "తురంగగరుడౌ తార్క్ష్యౌ" అని యమరుఁడు; విజృంభించి=అతిశయించి ; తద్విహృతిప్రకారభయరేఖావన్మహాజిహ్మగోత్కర మున్.—తత్=ఆ బర్హితార్క్ష్యములయొక్క, విహృతిప్రకార = విహారభంగిచేత, భయరేఖావత్=భయపరంపరగల, మహత్=గొప్పలగు, జిహ్మగ=సర్పములయొక్క, ఉత్కరమున్= సమూహమును; నిందయొనర్పన్=నిందచేయుటకు; తత్పురము = సర్పపురమగు పాతాళమును; వేగన్=శీఘ్రముగా; చేరుచందంబునన్=పొందురీతిగా; నిర్భరశక్తిన్ = అధికసామర్థ్యముచేత; ధరన్=భూమిని; కాఁడి=నాటి; పాఱెన్= పరుగెత్తెను.

అనఁగా సుచంద్రుని బాణములనెడు సర్పములు శత్రువులనెడుమయూరములఁదూల్చి వారియశ్వమ్ములనెడుగరుత్మంతులసంహరించి వేగాతిశయమున భూమినిదూఱి పోవుచుండఁగా నది మయూరగరుడులకు వెఱచి పాతాళము సొచ్చినసర్పములను నిందింపఁ బాతాళముఁజేరఁ బోవుచున్నట్లుండెననుట.

చ. అమితనృపాలసాయకచ•యంబు నిశాటచమూతనుత్రఝా
టము వడిఁ దాఁకి పై కెగయు•టల్ వినుతింపఁగ నయ్యె నౌర యు
త్తమనవకాముకచ్ఛట ము•దంబున వచ్చె నటంచు నిర్జర
ప్రమదల కెల్లఁ జక్కఁ దెలు•పం జనుపెంపు వహించి యయ్యెడన్. 114

టీ. అమితనృపాలసాయకచయంబు.—అమిత = మితిలేనట్టి, నృపాల=సుచంద్రుని యొక్క, సాయక=బాణములయొక్క, చయంబు=సముదాయము; నిశాటచమూతనుత్రఝాటము.—నిశాటచమూ=రాక్షససేనయొక్క, తనుత్రఝాటము=కవచసమూహమును; వడిన్ =వేగముగా; తాఁకి=తగిలి; పై కెగయుటల్=మీఁదికెగురుటలు; అయ్యెడన్=ఆసమయమందు; నిర్జరప్రమదలకెల్లన్=రంభాదిదేవాంగనలకెల్లను; ఉత్తమనవకాముకచ్ఛట=శ్రేష్ఠమగుక్రొత్తకాముకులగుంపు; ముదంబునన్=సంతోషముతో; వచ్చెన్ అటంచున్=వచ్చెననుచు; చక్కన్= బాగుగా; తెలుపన్=తెలియఁజేయుటకు; చనుపెంపు=పోవునతిశయమును; వహించి=పొంది; నుతింపఁగనయ్యెన్=శ్లాఘింపనాయెను. ఔర=ఆశ్చర్యము !

అనఁగా రాక్షససైనికకవచములను దాఁకి పైకెగయుసుచంద్రబాణపరంపర క్రొత్తనాయకవర్గంబు వచ్చుచున్నదని దేవాంగనలకుఁ దెలుపుటకు సురలోకము పోవుచున్నచందంబున నుండెనని భావము. ఆరాజు బాణములచేరక్కసులెల్ల నీలిగిదేవత్వమునొందుదురని ఫలితము.

చ. ఘనగజదర్పభేదన మ•ఖండసురారిపురప్రభంజనం
బు నలఘుధర్మఖండనముఁ • బూనిచి వేలుపు లెంచ సుగ్రీవ
ర్తనఁ దనరారునమ్మనుజ•రాజకలంబము చిత్రవైఖరిన్
దనిపె నజాత్మజాంతర ము•దారతరప్రమదోర్మి నయ్యనిన్. 115

టీ. ఉగ్రవర్తనన్=తీక్ష్ణవ్యాపారముచేత, శివునిదన చేతననియర్థాంతరము; తనరారునమ్మనుజరాజకలంబము.—తనరారు=ఒప్పుచున్న, అమ్మనుజరాజ=అనుచంద్రునియొక్క, కలంబము=బాణము; ఘనగజదర్పభేదనము=గొప్పగజములమదముయొక్క ఖేదనమును; గజాసురునిదర్పభేదనముననియర్థాంతరము; అఖండసురారిపురప్రభంజనంబును.—అఖండ = అవిచ్ఛిన్నమయిన, సురారిపుర=రాక్షసగాత్రములయొక్క, త్రిపురాసురులయొక్కయనియర్థాంతరము, ప్రభంజనంబు = నాశనమును; అలఘుధర్మఖండనము = అధికమయినవిండ్లతునుముటను, యమునిభంగముసేయుటననియర్థాంతరము "ధర్మస్తు పుణ్యేయమే న్యాయే చాపేచాపనిషద్యపి" అనివిశ్వము; పూనిచి=కల్పించి; వేల్పులు=దేవతలు; ఎంచన్ = ప్రకాశించుచుండగా; అయ్యనిన్ =ఆయుద్ధమందు; అజాక్షజాంతకనుజ=నారదమునియొక్క మనస్సునకు, దక్షప్రజాపతిపుత్రియయిన పార్వతిమనస్సునకునియర్థాంతరము; హాసపరి పనుపొందన్=అత్యధికమైన సంతోషపరంపరచేత; చిత్రవైఖరిన్=ఆశ్చర్యకరముగునట్లుగా; ఒనిపెన్=ప్రకాశింపజేసెను.

అనఁగా శివుండు గజాసురుని భేదించి త్రిపురభంజనముఁ జేసి యము నవమానించి పార్వతిచిత్తమున కానందముఁ జేసినట్లు సుచంద్రుని బాణము శత్రుగజభేదనమును సురారిశరీరభంజనంబును తదీయధనుఃఖండనంబును గావించి యుద్ధముగాంచు ప్రీతితో గగనముఁజేరిన నారదుచిత్తమున కానందముఁ జేసె నని భావము.

ఉ. ఆది గుణచ్యుతిన్ గనిన•యట్టినృపాలు నజిహ్మగాళి త
న్మేదినిలోన సుజ్వలన•మిత్త్రిపరంపరఁ గ్రోలి వేగ మెం
తేఁ దనరన్ బలీ యసుర•నేతృకులంబు తదేకయుక్తిఁ ద
చ్ఛ్రీ దయివాఱె నొక్కొ యజ•రీవృతి నాకపదంబుఁ జేరఁగన్. 116

టీ. ఆదిన్=తొలుత; గుణచ్యుతిన్=అల్లెత్రాటివలనజాఱుటను; ఆదిగుణచ్యుతిన్=మొదటిదైనగుణసంజ్ఞగలయకారముయొక్కచ్యుతివనియర్థాంతరము; అకారము గుణమని వ్యాకరణప్రసిద్ధము; కనినయట్టినృపాలునజిహ్మగాళి=పొందినట్టిరాజుబాణపరంపర, అజిహ్మగాళిశబ్దములో నాద్యకారచ్యుతి కాఁగా జిహ్మగాళి యగుటం జేసి సర్పపంక్తి యని యర్థాంతరమగు; తన్మేదినిలోనన్=అరణభూమియందు; సుజ్వలనమిత్రపరంపరన్.— సుజ్వల=లెస్సప్రకాశించుచున్న, నమిత్రపరంపరన్=శత్రుపరంపరను; "తన్మేదినిలోన్ అనుజ్వలనమిత్రపరంపరన్" అని విభాగముఁజేసి, తన్మేదినిలోన్=ప్రసిద్ధమయినభూమియందు, అనుజ్వలనమిత్త్రిపరంపరన్.—అనుజ్వలనమిత్త్ర=ప్రాణవాయువులయొక్క, పరంపరన్=సముదాయమును; క్రోలి=పానముచేసి; వేగము=శీఘ్రముగా; ఎంతేన్=మిక్కిలి; తనరన్=ఒప్పఁగా; అసురనేతృకులంబు=రాక్షసనాయకకులము; అజరీవృతిన్=దేవాంగనాపరివృతిచేత; నాకపదంబుఁజేరఁగన్=స్వర్గముఁజేరుటకు; తదేకయుక్తిన్.— తత్=ఆబాణములయొక్క, ఏకయుక్తిన్=ముఖ్యసంబంధముచేత; తచ్ఛ్రీన్.—తత్=ఆబాణములయొక్క, శ్రీన్=సంపదచేత; ఆసర్పములయొక్కవిషముచేతననియర్థాంతరము; దైవాఱెనొక్కొ=ఒప్పెనేమో. బలీ!

అనఁగా, అజిహ్మగములు అనఁగా బాణములు ఆదిగుణచ్యుతినిఁబొంది జిహ్మగములు అనఁగా సర్పములై, యసురులనుఁ బొందఁగా, నాయసురులు వానిసంబంధముచే నాజిహ్మగములయొక్క శ్రీని (విషమును) బొందినవారలై అనఁగా వానిసంపదయయిన ఆదిగుణచ్యుతినిఁబొంది సురలై స్వర్గముఁ జెందిరనుట. అసురులు సుచంద్రునిబాణములచే హతులై స్వర్గముఁ జేరిరని ఫలితార్థము.

ఉ. నరవర్యాశుగకృత్తతద్దనుజసై◆న్యం బప్డు చూపట్టె దు
స్తరఝంఝానిలఘాతదావగతి భ్రశ్యత్కాంచనస్యందనో
త్కరమై నశ్యదనేకవాజివరజా◆తంబై పతన్మౌళియై
పరిశీర్యద్ఘనకుంభ్యనీకమయి భూ◆భాగంబు దాఁ గప్పుచున్. 117

టీ. అప్డు = ఆసమయమందు; నరవర్యాశుగకృత్తతద్దనుజసైన్యంబు.—నరవర్యాశుగ=సుచంద్రునిబాణములచేత, కృత్త=ఛేదింపఁబడిన, తద్దనుజసైన్యంబు = ఆతమిస్రుని సైన్యము; ఝంఝానిలఘాతదావగతిన్=ఝంఝావాతముచేఁ గంపితమగు నరణ్యమురీతిగ; భ్రశ్యత్కాంచనస్యందనోత్కరమై.—భ్రశ్యత్=పడుచున్న, కాంచనస్యందన=బంగరుతేరులయొక్క, ఉత్కరమై=గుంపుగలదై; భ్రశ్యత్=పడుచున్న, కాంచన=సంపెఁగలయొక్క, స్యందన=తినాసపుచెట్లులయొక్క, ఉత్కరమై=సమూహముగలదైయని దావపరమైనయర్థము; నశ్యదనేకవాజివరజాతంబై=నశించుచున్న యనేకతురగశ్రేష్ఠముల గుంపులుగలదై, అనేకపక్షిశ్రేష్ఠములగుంపులుగలదైయనియర్థాంతరము; పతన్మౌళియై=పడుచున్నకిరీటములుగలదై; కూలుచున్న యశోకములుగలదైయని యర్థాంతరము, "మౌళిః కంకేళిచూతయోః" అనివిశ్వము; పరిశీర్యద్ఘనకుంభ్యనీకమయి.—పరిశీర్యత్=చీలుచున్న, ఘన=గొప్పలగు, కుంభి=ఏనుఁగులయొక్క, అనీకమయి=సంఘముగలదయి, కుంభి=కలిగొట్టుచెట్లయొక్క, యనీకముగలదయి యని దావపరమైనయర్థము; భూభాగంబు=భూప్రదేశమును; తాన్; కప్పుచున్=ఆవరించుచు; చూపట్టెన్=అగపడెను.

అనఁగా నసురసైన్యంబు ఝంఝానిలఘాతమైనయరణ్యముచందంబున భ్రశ్యత్కాంచనస్యందనాదికమై చూపట్టెననుట.

మ. బలుపాదంబులు కూర్మముల్ మెఱుఁగు దోఁ◆ప న్మించునేజల్ జలా
హులునుం దెల్లనిచాయపట్టుగొడుగుల్ ◆ ప్రోద్ధూతడిండీరకం
బులు చిక్కుల్వడు కేశపాశనికరం◆బుల్ నాఁచులుం గాఁగఁ ద
త్పలభుగ్గాత్రజరక్తనిర్ఝరిణి గ◆న్పట్టెన్ శరోత్కర్షతన్. 118

టీ. బలుపాదంబులు=అధికములగునంఘ్రులు; కూర్మముల్ = తాఁబేళ్ళును; మెఱుఁగు దోఁపన్=ప్రకాశముతోఁచునట్టుగా; మించునేజల్=అతిశయించునాయుధవిశేషములు; జలాహులునున్=నీటిపాములును; తెల్లనిచాయపట్టుగొడుగుల్ = తెల్లనిరంగుగలపట్టుగొడుగులు;

ప్రోద్ధూతడిండీరకంబులు=మిక్కిలి కంపితములయిన నురుఁగులును; చిక్కుల్పడు కేశపాశ నికరంబుల్=చిక్కుపడిన వెండ్రుకల గుంపులు; నాఁచులున్=శైవాలములును; కాఁగన్=అగుచుండఁగా, తత్పలభుగ్గాత్రజరక్తనిర్ఝరిణి=ఆరాక్షసులశరీరములనుండి పుట్టిన రక్తనది; శరోత్కర్షతన్=బాణోత్కర్షము చేత; కన్పట్టెన్=చూపట్టెను.

అనఁగా బాణపరంపరచేఁ ద్రుంపఁబడిన రాక్షసశరీరములనుండి వెడలిన నెత్తురుటేర్లలోఁ బడినరాక్షసపాదములు కూర్మములుగాను రేజలు జలఘణులుగాను శ్వేతచ్ఛత్రములు ఫేనములుగాను కేశపాశములు శైవాలములుగాను దోఁచెనుట.

సీ. భూరిదైత్యకపాల♦పూర్ణరక్తము పేరి
కాశ్మీరపంకంబు ♦ కలయఁ బూసి
రథములజాళువా♦రావిరేకుల పేరి
పసిఁడిబొట్టులు ఫాల♦పదవిఁ దీర్చి
మహిఁ ద్రెళ్ళి యున్నర♦మ్యశిరస్త్రముల పేరి
కులుకుకుళ్ళాయి తాఁ ♦ దల దవిల్చి
యసృగంబుసిక్తధ్వ♦జాంబరంబుల పేరి
బలుచెంద్రకావిదు♦ప్పటులు గప్పి
తే. యలఘుపలభక్ష్యభోజ్యము ♦ లారగించి
మహితచక్రపదాస్థాన♦మండపమునఁ
జక్కఁ గొలువిచ్చె నపు డెద ♦ నిక్కు వేడ్కఁ
జటులబేతాళవంశ్యరా♦జన్యసమితి. 119

టీ. అపుడు=ఆసమయమందు; చటుల బేతాళవంశ్యరాజన్యసమితి.—చటుల=చంచలమగు, బేతాళవంశ్య=బేతాళవంశమునందుఁబుట్టిన భూతముల నెడు, రాజన్యసమితి=రాజసభ; భూరిదైత్యకపాలపూర్ణరక్తము పేరి కాశ్మీరపంకంబు.—భూరి=అధికమగు, దైత్యకపాల=రాక్షసులతలపుర్రెలయందు, పూర్ణ=నిండినట్టి, రక్తము పేరి=రక్తమను నామముగల, కాశ్మీరపంకంబు=కుంకుమపంకమును; కలయన్=అంతటను; పూసి=లేపనముఁజేసి; రథములజాళువారావిరేకుల పేరిపసిఁడిబొట్టులు.—రథముల=రథములయొక్క, జాళువారావిరేకుల పేరి=బంగారువిరేకుల నెడు, పసిఁడిబొట్టులు=బంగరుబొట్టులను; ఫాలమునన్=నుదుట; తీర్చి=దిద్ది; మహిన్=భూమియందు; ద్రెళ్ళియున్న రమ్యశిరస్త్రముల పేరి కులుకు కుళ్ళాయి.—ద్రెళ్ళియున్న=పడియున్న, రమ్య = మనోజ్ఞములయిన, శిరస్త్రముల పేరి=తలతొడుపులను పేరుగల, కులుకు కుళ్ళాయి=అందమయినటోపి; తాన్=తాను; తలన్=శిరమునందు; తవిల్చి=ఉంచి; అసృగంబుసిక్తధ్వజాంబరంబుల పేరి బలుచెంద్రకావిదుప్పటులు.—అసృక్=రక్తమనెడు, అంబు=ఉదకమునందు, సిక్త=తడుపఁబడిన, ధ్వజాంబరంబుల పేరి=ధ్వజపటములను పేరుగల, బలుచెంద్రకావిదుప్పటులు=పెద్దచెంగావివస్త్రములను; కప్పి=ఆచ్ఛాదించి; అలఘుపలభక్ష్యభోజ్యము

లు=అధికములగు మాంసములనెడు భక్ష్యభోజ్యములను; ఆరగించి=భక్షించి; మహితచక్రపదాస్థానమండపమునన్.—మహిత=పూజ్యమగు; చక్రపద=రథమనెడు, ఆస్థానమండపమునన్=సభామండపమందు; చక్కన్ = బాగుగా; ఎదన్=హృదయమందు; నిక్కువేడ్కన్=అతిశయించు నుత్సాహముచేత; కొలువిచ్చెన్=కొలువుచేసెను.

అనఁగా నపుడు భూతము లనెడు రాజులగుంపు రక్కసులతలపుఱ్ఱెలలో నిండిన నెత్తుర నెడు గందము పూసికొని తెలుపురావియాకు లనెడు బంగరుబొట్టులు వెట్టుకొని ధరఁబడియున్న తలతోడుప్రు లనెడు కుళ్ళాయీలు తలఁ దవిల్చికొని నెత్తురుతోఁ దడిసిన కేతనపటము లనెడు చెంద్రకావిదుప్పటులు గప్పికొని మాంస మనెడు భక్ష్యభోజ్యము లారగించి తేరు లనెడు కొలువుకూటమునఁ గూర్చుండె ననుట.

వ. అప్పుడప్పాలసుదిండిమూఁకలదండం బఖండదోర్దండమండితశౌర్యచండిమంబున నమ్మహీమండలేశ్వరుం జుట్టుముట్టి యుట్టిపడు కట్టల్క నట్టిట్టు డెమలక పరిఘపట్టిసముద్గరగదాభిందివాలతోమర శూలాదినానావిధాయుధయూథంబులం గప్పి మరుత్కులాభినుత్యసమిత్కౌతల చమత్కారోత్కర్షంబు సూపుచు విజృంభించినం దిలకించి మనోంచలప్రపంచిత ప్రతిఘారసప్రకాండుండై యామనుజనాయకమార్తాండుండు వలయితచాపవల్లికాతల్లజంబున నిశితభల్లంబులు గూర్చి నేర్పు వెలయం బఱపి కరంబులు శిరంబులు పదంబులు రదంబులు నురంబులు దరంబులు వేఱువఱుప రాకుండం దునియలు చేయుచు నరిభయంకరప్రచురతరసాహసవిభవంబునం దనచటులసాయకచాతుర్యంబు సూపునెడ నొక్కొక్కయెడ నుదారతీవ్రాశుగధారాప్రసారంబున నుద్వేలకీలాలపూరంబులు బోరునం గురియ ముక్తాహారంబులు సారెకుం బుడమిఁ బ్రేళ్ళ విగతకరకంబులై నిజఘనాఘననామంబు నిజం బగుటకుం బోలె ననంతాస్థానంబున భ్రమించుదంతావళసంతానంబులును నొక్కొక్కయిక్క మిక్కుటం బగుచాంచల్యంబున ధరాపరాగపూగసంవళితంబై యూపతి నానాజిహ్మగసంహతి క్రమంబునకుఁ దల్లడిల్లుచు నాత్మహార్యభిధానంబు సార్థకంబు గావించుటకుం బోలె మూలలకుఁ జేరువాయనిచయంబులును నొక్కొక్కవంక విశంకటశింజినీటంకార జలదగర్జాసమూర్జనంబున నాంతరంబు వ్రీల విముక్తకాండజాతంబులై వాహినీమధ్యంబున గతివిశేష మొక్కింత యెఱుంగక చక్రాంగభావంబు సత్యం బగుటకుం బోలె నడలు స్యందనసందోహంబులును నొక్కొక్కచెంత సుచంద్రసాంద్రధామస్తోమంబు గనుంగొనం బాయక నెమ్మనంబుల సాధ్వసం బుప్పొంగి పొంగ మహాబలాతివియోగంబున వ్రుక్కుచు మిక్కిలి రయంబునం బొదలు దూఱం దలఁచుచుఁ జిం

దువంబై పఱచుచు స్వచక్రనామంబు సిద్ధంబుఁ జేయనుం బోలెఁ జలి యించు సేనాజనంబులును నెక్కొక్కచో మూల యాతుధానతనుత్రాణవితానాయసచూర్ణ పరంపర శోణరుచిపూరంబున శాదభూతంబై యేపు సూపఁ బుండరీకసమాఖ్యాకలితంబు లగుటం బోలె బహుశిలీముఖసమాక్రాంతంబులై విదళితత్వంబు వహించు తెలిపట్టుగొడుగులును నెక్కొక్కచోట నవక్రచక్రఘాతంబుల విశకలితోత్తమాంగంబులై భాస్వచ్ఛంద్రరథాచ్ఛాదనం బంబరంబునం గావించుచుఁ గేతువిఖ్యాతిం బొగడొందుటం బోలె నిశాటకాంతానుషంగత్వంబు డింపనిబిరుదపతాకానికరంబులును నెక్కొక్కచాయఁ బరులతోఁ గలహంబులు మాని యసమాంబకలగ్నహృదయులై ద్విజపక్షపాతంబు చేకొని తాము సాదు లగుటం బోలె నైశ్చల్యంబునం దోఁచువాహారోహకులును నెక్కొక్కదిక్కున హరిదంశుకస్తవనీయనరవరప్రక్ష్వేడనతాడనంబుల విగతప్రాణంబులై రాజరాజుల్లసద్విస్మయంబున వీక్షింప సూతజాతతాగతిం బరఁగుటం బోలె ధరణిం బడినయంతృకులంబులును నెక్కొక్కక్రేవలఁ బుణ్యజనానంగీకృతంబులై యెంతయు సౌగుణ్యంబు సంపాదింపక నిశ్శరయోగంబు బెరసి ధన్వాహ్వయంబు లగుటం బోలెఁ బెంపు గననికోదండంబులును నెక్కొక్కసీమల ఘనకాండాసారమహిమంబున వీతపత్రంబులై యలఘుఫలనికాయసాంగత్యంబు గానక సొంపు చెడి బాణాత్మంబునఁ బరఁగుటం బోలె ధరాపదవిఁ ద్రావలిననారాచజాలంబులును బొలుపొంద నత్యద్భుతంబై దేవదానవాయోధనధరాస్థలంబునందంబున జిష్ణుకరాసిఖండితకర్బురచక్రాంగసంగతంబై రామరావణయుద్ధదేశంబుడంబున చటులహరిపటలరటనాఘటితంబై హరపురాసురసమరాస్థానంబుపోలిక ననంతకలంబ విజృంభణగుంభితంబై కుమారతారకాన్కందనతలంబు చందంబున నభేద్యశక్తిసంయుతంబై కౌరవపాండవసంగ్రామాంగణంబు చెలువునఁ జక్రికేతనవిదారణచణభీమగదాక్రియాసముపేతంబై యమ్మహా సంగరరంగంబు వినుతి కెక్కె నయ్యవసరంబున. 120

టీ. అపుడు=ఆసమయమందు; అప్పొలసుదిండిమూఁకలదండంబు = ఆ క్రవ్యాద సేనల యొక్క గుంపు; అఖండదోర్దండమండిత శౌర్యచండిమంబునన్.—అఖండ=అవిచ్ఛిన్నమగు, దోర్దండ=బాహుదండముల చేత, మండిత=అలంకృతమయిన, శౌర్యచండిమంబునన్ = శౌ

ర్యాతిశయము చేత; అమ్మహీమండలేశ్వరున్ =ఆభూమండలేశ్వరుండగు సుచంద్రుని; చుట్టుముట్టి=చుట్టుకొని; ఉట్టిపడుకట్టల్కన్ = మిక్కిలి యధికమైనక్రోధము చేతననుట; అట్టిట్టుదెమలక=అటుఇటుపోక; పరిఘపట్టిసముద్గరగదాభిండివాలతోమరశూలాది నానావిధాయుధయూథంబులన్.—ఇనుపకట్లగుదియ మొదలుబల్లెము వఱకుఁగలయాయుధములు మొదలగునానావిధాయుధసమూహములచేత; కప్పి; మరుత్కులాభినుత్యసమిత్కృతలచమత్కారోత్కర్షంబు.—మరుత్కుల=దేవతాబృందముచేత, అభినుత్య=ప్రశంసనీయమగు, సమిత్కృతల=యుద్ధభూమియొక్క, చమత్కారోత్కర్షంబు = చాతుర్యాతిశయమును; చూపుచున్=కనఁబఱచుచు; విజృంభించినన్=చెలరేఁగఁగా; తిలకించి= చూచి; మనోంచలప్రపంచితప్రతిఘోరసప్రకాండుండై.—మనోంచల=చిత్తప్రదేశమందు, ప్రపంచిత=విస్తరిల్లఁ జేయఁబడిన, ప్రతిఘోరసప్రకాండుండై=ప్రశస్తరౌద్రరసముగలవాఁడై; ఆమనుజనాయకమార్తాండుండు=ఆరాజసూర్యుఁడు; వలయితచాపవల్లికాతల్లజంబునన్ = కుండలీకృతమగుప్రశస్తధనుర్లతయందు; నిశితభల్లంబులు=తీక్ష్ణములైనబాణములను; కూర్చి=తొడిగి; నేర్పువెలయన్=చాతుర్యమువిలసిల్లఁగా; పఱపి=వ్యాపింపఁజేసి; కరంబులు=హస్తములు; శిరంబులు=తలలు; పదంబులు=పాదములు; రదంబులు=దంతములు; ఉరంబులు=ఎదలు; ఉదరంబులు=జఠరములు; వేఱుపఱుపరాకుండన్=వేఱుగాఁదెలియరాకుండునట్లు; తునియలు చేయుచున్=ఖండములు చేయుచు; అరిభయంకర ప్రచురతరసహోవిభవంబునన్ —అరి = శత్రువులకు, చక్రవాకములకని యర్థాంతరము, భయంకర = భయప్రదమగు, ప్రచురతర = అధికతరమగు, సహః = బలముయొక్క, "తరస్సహోబలశౌర్యాణి" అని యమరుఁడు, విభవంబునన్ = సమృద్ధిచేత; తనచటులసాయక చాతుర్యంబు = తనయొక్క వేగవంతమగుబాణములనేర్పును; చూపునెడన్ = చూపుసమయమందు; ఒక్కొక్కయెడన్ = ఒక్కొక్కచోట; ఉదారతీవ్రాశుగ ధారాప్రచారంబునన్.—ఉదార = గొప్పలగు, తీవ్రాశుగ = దృఢసాయకములయొక్క, చండమారుతముయొక్కయని యర్థాంతరము, ధారా=అంచుయొక్క, జలధారలయొక్క, ప్రచారంబునన్=సమృద్ధిచేత; ఉద్వేలకీలాలపూరంబులు=అధికములగురక్తప్రవాహములు, ఉదకప్రవాహములని యర్థాంతరము; బోరునన్ కురియన్=మిక్కిలికురియఁగా; ముక్తాహారంబులు = ముత్యపుసరములు; సారెకున్=మాటిమాటికి; పుడమిన్=భూమియందు; త్రెళ్ళన్ = వ్రాలఁగా; విగతకరకంబులై = పోయినతొండములుగలవై, రాలినవడగండ్లుగలవై యని యర్థాంతరము; నిజఘనాఘననామంబు = తమమదగజనామము, వర్షకాబ్దనామమును; నిజంబగుటకున్ బోలెన్=యథార్థమగుటకువలె; అనంతాస్థానంబునన్.—అనంతా=భూమియొక్క, స్థానంబునన్ = ప్రదేశమందు; అనంత ఆస్థానంబునన్ = ఆకాశప్రదేశమందని యర్థాంతరము; భ్రమించుదంతావళ సంతానంబులును=సంచరించుచున్న యేనుఁగులగుంపులును. అనఁగా వర్షించుమేఘములు చండమారుతముచేఁ బోరున జలపూరము వర్షించి వర్షోపలవిహీనములయి గగనమందు సంచరించునట్లు ఘనాఘననామసామ్యమున మదపుటేనుఁగులును సుచంద్రునితీవ్రబాణములచే రక్తము వర్షించి ముత్యములు పుడమిఁ ద్రెళ్ళఁగాఁ దొండములు లేనివై యుద్ధ భూమిని జరించుచుండెననుట. ఏనుఁగుల గుంపు లాకసమూల ఖండితతుండములయి యుండెనని ఫలితార్థము.

ఒక్కొక్కయిక్కన్ = ఒక్కొక్క ప్రదేశమునందు; మిక్కుటంబగు చాంచల్యమునన్ = అధికమగుచపలతచేత ; ధరాపరాగ సంవలితంబయి = భూపరాగవ్యాప్తమయి; రూపఱి = రూపుచెడి; నానాజిహ్మగ సంహతిక్రమంబునకున్.—నానా = అనేకప్రకారములగు, అజిహ్మగసంహతి = బాణసమూహముయొక్క, నానాప్రకారమగు సర్పసమూహముయొక్కయని యర్థాంతరము, క్రమంబునకున్ = సంచరణమునకు; తల్లడిల్లుచున్ = పరితపించుచు; ఆత్మవార్యభిధానంబు = తమయశ్వనామము, వాయువనెడుపేరు; సార్థకంబు గావించుటకుంబోలెన్ = యథార్థముసేయుటకువలె; మూలలకున్ = మఱుఁగులకు, విదిగ్భాగములకు; చేసుహాయ నిచయంబులును = చేసుచున్నగుఱ్ఱములగుంపులును. అనఁగా నశ్వసమూహము అనేకవిధములైన బాణప్రహారములచేత తల్లడిల్లి మూలలఁబడి యుండఁగా నది తమకుఁ గలవార్యభిధానము అనఁగా వాయువు లను నామము సార్థకముఁ జేయుటకు సర్వసంచారమువలన తల్లడిల్లి వాయవ్యమూలల కొదిఁగినట్లుండెనని భావము. బాణాఘాతమున కశ్వములు తల్లడిల్లి పరాగవ్యాప్తములై యొక మూలఁబడి యుండెనని ఫలితార్థము.ఒక్కొక్కవంకన్ = ఒక్కొక్కప్రదేశమునందు; విశంకటశింజినీటంకార జలదగర్జా సమూర్జనంబునన్.—విశంకట=విపులమగు, శింజినీటంకార=అల్లెత్రాటిధ్వనియనెడు, గర్జా=మేఘనాదముయొక్క, సమూర్జనంబునన్ = అతిశయముచేత; అంతరంబుప్రీలన్ = హృదయము వ్రయ్యలుకాఁగా; విముక్తకాండ జాతంబులై = విడువఁబడిన గుఱ్ఱముల సమూహముగలవై, విముక్త = విడువఁబడిన, కాండజాతంబులై = జలసమూహముగలవై, నీటినివదలినవైయనుట; వాహినీమధ్యంబునన్ = సేనామధ్యంబున, నదీమధ్యముననని యర్థాంతరము; గతివిశేషము = గమనవిశేషము; ఒక్కంతయుఱుంగక = కొంచెమయినఁగానక; చక్రాంగభావంబు = రథభావము, హంసభావమని యర్థాంతరము; సత్యంబగుటకుంబోలెన్ = యథార్థమగుటకువలె; సడలుస్యందన సందోహంబులును = శిథిలమగు రథసమూహములును; అనఁగా హంసలు మేఘధ్వనిని విని భయపడి జలసమీపమును వదలి నదీమధ్యసంచారము కొంచెమయిన లేక యుండుట స్వభావము గాన చక్రాంగనామసామ్యమున స్యందనంబులును వానివలె శింజినీనాదమునకు వెఱచి విముక్తాశ్వములై సేనామధ్యసంచారము మాని పడి యున్నట్లు తోఁచుచున్నవనుట ఒక్కొక్క చెంతన్=ఒక్కొక్క ప్రదేశమునందు; సుచంద్రసాంద్ర ధామస్తోమంబు = సుచంద్రునియొక్క సాంద్రమైన ప్రతాపసమూహమును, మంచిచంద్రునియొక్క తేజఃపుంజమునని యర్థాంతరము; కనుంగొనన్=చూడఁగా; పాయక=ఎడయక; నెమ్మనంబులన్=నిండుమనస్సులయందు; సాధ్వసంబు=భయము; ఉప్పొంగిపొంగన్=ఉబుకివెలిపర్వఁగా; మహాబలాతివియోగంబునన్.—మహాత్ = అధికమయిన, బల = బలముగలవారియొక్క, అతివియోగంబునన్ = మిక్కిలియెడఁబాటుచేత; మహాత్ = అధికమయిన, అబలా = స్త్రీయొక్క, అతివియోగంబునని యర్థాంతరము; ప్రమక్కుచున్ = కుందుచు; మిక్కిలి = అధికమయిన; రయంబునన్ = వేగముచేత; పొదలు = నికుంజములను; తూఱన్ = చొచ్చుటకు; తలంచుచున్; చిందువందై = చెదరినవై; పఱచుచున్=పరుగెత్తుచు; స్వచక్రనామంబు=తనసైన్యనామము; తనచక్రవాకనామమని యర్థాంతరము, "చక్రం చయే జలావర్తే రథాఙ్గే రాష్ట్రసైన్యయోః" అని రత్న

మూల; సిద్ధంబు సేయునంబోలెన్ = నిష్పన్నము సేయుటకువలె; చలియించు సేనాజనంబులును = కదలుచున్న సేనాజనములును. అనఁగా చక్రవాకములు చంద్రధామస్తోమము చూచి భయపడి ప్రియావియోగమును గాంచి స్రుక్కుచు అతివేగమున పొదలు దూఱుచు చెదరినవగుచు నొప్పుట స్వభావముగాన చక్రనామసామ్యమున సేనాజనసముదయంబును సుచంద్రరాజప్రతాపము గని భయపడి సేనానాయకవియోగమును గాంచి స్రుక్కుచు మిక్కిలి వేగంబున పొదలు దూఱఁ బాఱుచు చెదరెననుట. సుచంద్రప్రతాపమునకు వెఱచి సేనాజనులు పటాపంచలై చీకాకుపడి రని తాత్పర్యము. ఒక్కొక్కమూలన్ = ఒక్కొక్కప్రదేశమునందు; యాతుధానతనుత్రాణవితానాయసచూర్ణపరంపర.— యాతుధాన = రాక్షసులయొక్క, తనుత్రాణవితాన = కవచసముదాయ సంబంధియగు, ఆయసచూర్ణ పరంపర = ఇనుపపొడిగుంపు; శోణితఝరపూరంబునన్.— శోణితఝర = నెత్తురుటేర్లయొక్క, పూరంబునన్ = వఱదయందు; శాదభూతంబై = బురదరూపమై; "పంకోస్త్రీ శాదకర్దమౌ" అని యమరుఁడు; ఏపుసూపన్ = అతిశయింపఁగా; పుండరీకసమాఖ్యాకలితంబులటంబోలెన్ = శ్వేతచ్ఛత్రము లయినందునంబలె, సితాంభోజము లయినందునంబలెనని యర్థాంతరము; బహుళశిలీముఖసమాక్రాంతంబులై=అనేకబాణములచేతఁ జుట్టఁబడినవై, తుమ్మెదలచేతఁ జుట్టఁబడినవైయని యర్థాంతరము; విదళితత్వంబు=పగులుపఁబడుటయు; వికసించుటయు; వహించు తెలిపట్టుగొడుగులును= పొందినట్టి శ్వేతచ్ఛత్రములును; అనఁగా శ్వేతచ్ఛత్రములు పుండరీకనామము గలవి గాన తెల్లదామరలు నదీప్రవాహపంకమునందు అళికులమిళితములై వికసించి యుండునట్లు శోణిత నదీపూరమునందు యాతుధానతనుత్రాణచూర్ణమను బురదయందు బాణసమాక్రాంతంబులై పగిలి పడి యున్న వనుట. శోణితము నదీప్రవాహముగఁ బాఱుచున్న దనియు అందు రాక్షసకవచచూర్ణము పంకముగానున్న దనియు అందు బాణగణసంకీర్ణములై పగిలి పడి యున్న తెల్లగొడుగులు సితాంభోజములను బోలి యున్న వనియు భావము. ఒక్కొక్కపొంతన్ = ఒక్కొక్క ప్రదేశమునందు; అవక్రచక్రఘాతంబులన్ = అకుటిలమగు చక్రనామకాయుధములతాఁకులచేత, సుదర్శన ప్రహారములచేతనని యర్థాంతరము; విశకలితోత్తమాంగంబులై = తునియలుచేయఁబడిన కొనలుకలవై, త్రుంపఁబడిన శిరములుగలవైయని యర్థాంతరము; భాస్వచ్చంద్రరథాచ్ఛాదనంబు.— భాస్వచ్చంద్రరథ=ప్రకాశించుచున్న బంగరుతేరులయొక్క, సూర్యచంద్రశరీరములయొక్క, ఆచ్ఛాదనంబు=ఆవరణమును;అంబరంబునన్ =వస్త్రముచేత, ఆకాశమందు; కావించుచున్ = చేయుచు; కేతువిఖ్యాతిన్ = పతాకయనుపేరును, కేతుగ్రహమనుపేరునని యర్థాంతరము; పొగడొందుటంబోలెన్=ప్రసిద్ధినిబొందుటచేవలె; నిశాటకాంతానుషంగంబు.—నిశాటకాంత = రక్షోనాథులయొక్క, అనుషంగంబు = అనుసరణమును, రాక్షసస్త్రీయను సరణమును; డింపనిబిరుదపతాకానికరంబులు = వదలని బిరుదయుక్తములయిన టెక్కెములగుంపులును. అనఁగా పతాకలు కేతుశబ్దసామ్యమున, కేతుగ్రహము చక్రముచే నఱకఁబడినతల గలిగి యంబరమున సూర్యచంద్రశరీరాచ్ఛాదనమును గావించుచు రాక్షసస్త్రీయనుసరణమును వహించునట్లు, చక్రాయుధముల చేతఁ ద్రుంపఁబడినకొనలు గలవై వస్త్రములచే రథముల నాచ్ఛాదించుచు నిశాచరనాథుల ననుసరించుచు నొకమూలఁ బడి యుం

డెనని భావము. ఒక్కొక్కచాయన్ = ఒక్కొక్కప్రదేశమునందు; పసులతోన్=శత్రువులతో, ఇతరజనులతోనని యర్థాంతరము; కలహంబుమాని=జగడమువదలి; అసమాంబకలగ్నహృదయులై=సరిలేని యమ్ములునాటిన రొమ్ములుగలవారై, విషమలోచనుఁడైన శివునియందు లగ్నమయినహృదయముగలవారై;ద్విజపక్షపాతంబు=కంకగృధ్రాదులయొక్క ఱెక్కలపాటును, బ్రాహ్మణులయందలిప్రీతిని; చేకొని=స్వీకరించి; తాము; సాదులగుటన్ బోలెన్=రాతులగుటచేతవలె, సజ్జనులౌటచేతవలె; నైశ్చల్యంబునన్=నిశ్చలతచేత;తోఁచువాహారోహకులును = తోఁచుచున్న అశ్వారోహకులును ; అనఁగా సాధుజనులు పసులతోఁ కలహము మాని సాంబమూర్తియందు లగ్నహృదయులై బ్రాహ్మణపక్షపాతము వాల్చి ధ్యానయోగమున నైశ్చల్యమును ,భజించునట్లు తన్నామసామ్యంబున అశ్వారోహకులును పసులతో కలహంబు మాని అసమాంబకములచే లగ్నహృదయులై గృధ్రాదిద్విజపక్షపాతము వాల్చి ప్రాణవియోగ మగుటవలన నైశ్చల్యమును వహించి యొకమూలఁ బడి యుండి రని భావము. ఒక్కొక్కదిక్కునన్ = ఒక్కొక్కప్రదేశమునందు; హారిదంశుక స్తవనీయ నరవరప్రక్ష్వేడనతాడనంబులన్.- హారిదంశుక = దిగంబరుఁడైన శివునిచేత, స్తవనీయ = కొనియాడఁదగిన, నరవరప్రక్ష్వేడన !తాడనంబులన్ = సుచంద్రుని బాణతాడనములచేత, హారిదంశుక = పీతాంబరుఁడైన కృష్ణునిచేత, స్తవనీయమయిన, నర=అర్జునునియొక్క, వరప్రక్ష్వేడన తాడనంబులన్ = శ్రేష్ఠములగు బాణతాడనములచేత ; విగతప్రాణంబులై = గతాసువులై; రాజరాజు = కుబేరుఁడు, దుర్యోధనుఁడని యర్థాంతరము. ఉల్లసద్విస్మయంబునన్ = ప్రకాశించునాశ్చర్యముతోడ; ఈక్షింపన్ = చూచుచుండఁగా; సూతజాతతాగతిన్ = సూతజాతిప్రాప్తిచేత, సూతులవల్లఁ బుట్టుటయనఁగా కర్ణత్వముయొక్క ప్రాప్తిచేత; పరఁగుటంబోలెన్=ఒప్పుచుండుటచేతవలె; ధరణిన్ = భూమియందు; పడినయంతృకులంబులును = పడియున్నసారథి సముదయంబులును; శ్రీకృష్ణునిచేఁగొనియాడఁ దగినకిరీటిబాణతాడనములచే విగతప్రాణుండై దుర్యోధనునిచే సవిస్మయంబుగ నీక్షింపఁబడు కర్ణునిచందంబున యంతృకులంబు సుచంద్రుని బాణతాడనములచే విగతప్రాణంబై కుబేరునిచే సవిస్మయంబుగ నీక్షింపఁబడుచు యుద్ధభూమి నొకమూలఁ బడి యుండెనని సూతజాతత్వసామ్యమున వర్ణింపఁబడిరి. ఒక్కొక్కక్రేవన్=ఒక్కొక్క ప్రదేశమునందు; పుణ్యజనానంగీకృతంబులై=రక్కసులచేతఁ బరిగ్రహింపఁబడనివియై; పెద్దలచేతఁ బరిగ్రహింపఁబడనివియై యనియర్థాంతరము; ఎంతయున్=మిక్కిలి; సౌగుణ్యంబు=మంచియల్లెగలుగుటను, మంచిగుణములుగలుగుటను; సంపాదింపక=ఆర్జింపక; నిశ్శరయోగంబు=గుణసాంగత్యములేమిచే బాణయోగాభావమును, జలసంగత్యభావమును; తెరసి=పొంది;ధన్వాహ్వయంబులగుటంబోలెన్=విల్లనెడుపేరుగల వగుటచేతవలె, నిర్జలదేశములని పేరుగాంచుటచేతవలె; “ధన్వాజాంగలదేశేస్యాద్ధన్వచాపే” అని విశ్వము; పెంపున్=వృద్ధిని; కవనికోదండంబులును = పొందనిధనుస్సులును , అనఁగా నిర్జలదేశములు సజ్జనులచే ననంగీకృతంబులై మంచిప్రదేశము లనుట లేక జలహీనములై పెంపు గననియట్లు ధన్వనామసామ్యముచే విండ్లును పుణ్యజను లైనరాక్షసులచే విడువఁబడి అల్లెత్రాటి సంబంధము లేనందున శరసంబంధముగానక యొకమూలఁ బడి యున్న వని భావము; ధనువులు తమ్ముఁ బట్టుకొను నాయకులచే

తను అస్త్రత్రాళ్ళచేతను శరములచేతను వియుక్తములై విశకలితములుగాఁ బడి యున్న వని పరమార్థము. ఒక్కొక్కసీమన్ = ఒక్కొక్కప్రదేశమునందు; ఘనకాండాసారమహిమంబునన్=గొప్పబాణవృష్టిమహిమచేత; ఘన=మేఘసంబంధియైన, కాండ=ఉదకముయొక్క, ఆసార=వర్షధారలయొక్క, మహిమంబునన్=అతిశయముచేత; వీతపత్రంబులై=పోయిన ఆకులుగలవై, రాలినయాకులుగలవై; అలఘుఫలనికాయసాంగత్యంబు.—అలఘు=అధికమయిన, ఫలనికాయ=ములుకులగుంపుయొక్క, పండ్లగుంపుయొక్క "ఫలంహేతురసేర్థేస్యాత్ఫలకేము ష్టిలాభయోః జాతీఫలేపి కర్కోలేసస్య బాణాగ్రయోరపి" అని విశ్వము; కానక=పొందక; సొంపుచెడి=అందమాఱి; బాణాత్మంబునన్=శరస్వరూపముచేత, గోరంటవృక్షస్వరూపముచేత; పరఁగుటంబోలెన్=ఒప్పుటచేతవలె; ధరాపవన్ = భూతలమందు; వాలిననారాచంబులును=పడినబాణములును; అనఁగా గోరంటలు వర్షాకాలంబున జలధారలచే విగతపత్రములై ఫలములను బొందక సొంపుచెడి భూతలమందు వ్రాలుట ప్రసిద్ధంబు గావున నట్లు బాణశబ్దసామ్యమున రాక్షసనారాచంబులు సుచంద్రబాణవర్షమహిమచేత పత్త్రహీనములయి వీడిన ములుకులుగలవై సొంపుచెడి ధరాతలమున వ్రాలి యున్న వనుట. పొలుపొందన్=ఇట్లు మూలమూలకుఁబడినగజతురగాదు లొప్పుచుండఁగా; అత్యద్భుతంబై=మిక్కిలిఆశ్చర్యకరంబయి; దేవదానవాయోధనధరాస్థలంబునందంబునన్=దేవాసురయుద్ధభూమియందమున; జిష్ణుకరాసిఖండితకర్బురచక్రాంగసంగతంబై.—జిష్ణు=ఇంద్రునియొక్క, జయశీలుండైన సుచంద్రునియొక్కయని యర్థాంతరము, కర=హస్తమందలి, అసి=ఖడ్గముచేత, ఖండిత=నఱకఁబడిన, కర్బురచక్రాంగ=బంగరురథములతోడను, రాక్షససంఘములయొక్కశరీరములతోడను, సంగతంబై=కూడుకొన్నదై; రామరావణయుద్ధదేశంబుడంబునన్=రామరావణులయొక్కయుద్ధప్రదేశమువలె; చటులహరిపటలరటనాఘటితంబయి=చంచలము లగునశ్వసమూహములధ్వనులతోఁగూడినదై; వానరసేనయొక్కయార్భటులతోఁగూడినదై; హరపురాసురసమరాస్థానంబుపోలికన్=ఈశ్వరత్రిపురాసురయుద్ధభూమివలె; అనంతకలంబవిజృంభణగుంభితంబై.—అనంతకలంబ=విష్ణురూపమగుబాణముయొక్క, బహుబాణములయొక్క, విజృంభణగుంభితంబై=అతిశయముతోఁగూడుకొన్నదయి; కుమారతారకాస్కందనతలంబుచందంబునన్=కుమారతారకాసురులయొక్కయుద్ధభూమిరీతిగా; అభేద్యశక్తియుతంబై = భేదింపనలవిగానిశక్త్యాయుధముతోఁగూడినదై, సామర్థ్యముతోఁగూడినదై; కౌరవపాండవసంగ్రామాంగణంబుచెలువునన్=కౌరవపాండవులయొక్కరణరంగముభంగి; చక్రికేతనవిదారణచణభీమగదాక్రియాసముపేతంబై.—చక్రికేతన=సర్పకేతనుఁడగుదుర్యోధనునియొక్క, విదారణ=ఛేదనమందు, చణ=సమర్థమైన, భీమగదాక్రియా=భీమసేనుని గదావిహారముతోడ, సముపేతంబై=కూడినదై; చక్రికేతన=రథపతాకలయొక్క, విదారణచణ=విదారణసమర్థములగు, భీమ=భయంకరములైన, గదాక్రియా=గదావిహారముతో, సముపేతంబై; అమ్మహాసంగరంబు=ఆమహాయుద్ధము; వినుతికెక్కెన్=వాసికెక్కెను. అయ్యవసరంబునన్=ఆసమయమున; దీని కుత్తరపద్యముతోడ సంబంధము.

చ. చకితనిశాటమై పతిత◆సాదిజనంబయి సుప్తయంత్రజా
లకమయి భిన్నకుంజరకు◆లంబయి లూనరథంబునై తద

ర్కకులనృపాలశక్తి నిల ♦ వ్రాలినయాత్మబలంబుఁ గాంచి పా
యక మనురోషరేఖ యెడ ♦ నంది తమిస్రసురారి యత్తఱిన్. 121

టీ. చకితనిశాటమై=భయపడుచున్న రాక్షసులుగలదై; పతితసాదిజనంబయి=పడినయశ్వారోహకులగుంపుగలదై; సుప్తయంతృజాలకమయి=నిద్రించినసారథులగుంపుగలదై; భిన్నకుంజరకులంబయి=బద్ధలు చేయఁబడినగజసంఘములుగలదై; లూనరథంబునై=ఛిన్నములైనరథములుగలదై; తదర్కకులనృపాలశక్తిన్=ఆరాజు సామర్థ్యముచేత; ఇలన్=భూమియందు; వ్రాలినయాత్మబలంబున్=పడినతనసైన్యమును; కాంచి=చూచి; పాయక=పీడక; మనురోషరేఖ=వృద్ధిఁబొందుచున్నక్రోధపరంపరను; ఎడన్=మనస్సునందు; అంది=పొంది; తమిస్రసురారి=తమిస్రాసురుఁడు; అత్తఱిన్=ఆసమయమందు. దీనికుత్తరపద్యముతో నన్వయము.

మహాస్రగ్ధర. వరకోదండప్రకాండో ♦ జ్జ్వలగుణనినద ♦ వ్రాతసాహాయ్యవద్దు
స్తరకంఠక్రోధనృత్య ♦ త్కహకహరవముల్ ♦ తన్నృపానీకినీభీ
కరలీలన్ దోఁపఁ బ్రోత్థో ♦ త్కటరుడరుణితే ♦ క్షావిధిం దత్త్రియామా
చరుఁ డక్షీంద్రంబు భూమీ ♦ శరథము నెదుటం ♦ జక్కఁ బో నిచ్చి యంతన్.

టీ. వరకోదండప్రకాండోజ్జ్వలగుణనినదవ్రాతసాహాయ్యవద్దుస్తరకంఠక్రోధనృత్యత్కహకహరవముల్.—వర=శ్రేష్ఠమగు, కోదండప్రకాండ=ప్రశస్తచాపమందు, ఉజ్జ్వల=ప్రకాశించుచున్న, గుణ=అల్లెత్రాటియొక్క, నినదవ్రాత=ధ్వనిసంఘముయొక్క, సాహాయ్యవత్=సాహాయ్యయుక్తమగు, దుస్తరకంఠ=గహనమయినకంఠమందు, క్రోధనృత్యత్=క్రోధముచే నాట్యముఁజేయుచున్న, కహకహరవముల్=కహకహాయనుధ్వనులు; తన్నృపానీకినీభీకరలీలన్=ఆరాజసైన్యమునకుభయంకరమగురీతి చే; తోఁపన్=తోఁచుచుండఁగా; ప్రోత్థోత్కటరుడరుణితేక్షావిధిన్.—ప్రోత్థ=ఉదయించిన, ఉత్కట=అధికమయిన, రుట్=రోషము చేత, అరుణిత=ఎఱ్ఱగాఁజేయఁబడిన, ఈక్షావిధిన్=దృగ్రీతి చేత; తత్త్రియామాచరుఁడు=ఆతమిస్రాసురుఁడు; అక్షీంద్రంబు=రథశ్రేష్ఠమును; భూమీశరథము నెదుటన్ = సుచంద్రునిరథముదు; పోనిచ్చి=పోవునట్లు చేసి; అంతన్. ఇందుకు ముందఱి పద్యముతో నన్వయము. "స్తతనస్రాగర్వివిరించాప్తవిరతులు మహాస్రగ్ధరం జెప్పనొప్పున్" అని మహాస్రగ్ధరలక్షణము.

క. వలయితచాపజ్యాసం, స్థలి రోపత్రితయిఁ గూర్చి ♦ జనపతియెద నే
ర్పలవడ నాటించి మహీ, వలయాధిపుఁ గాంచి యసుర ♦ వరుఁడిట్లనియెన్.

టీ. వలయితచాపజ్యాసంస్థలిన్.—వలయిత = వలయాకారముగఁజేయఁబడిన, చాప=ధనుస్సుయొక్క, జ్యాసంస్థలిన్=అల్లెత్రాటియందు; రోపత్రితయిన్=బాణత్రయమును; కూర్చి=సంధించి; జనపతియెదన్=సుచంద్రునివక్షస్స్థలమందు; నేర్పలవడన్ = నేర్పుమీఱునట్టు; నాటించి; మహీవలయాధిపున్=సుచంద్రుని; కాంచి=చూచి; అసురవరుఁడు = తమిస్రుఁడు; ఇట్లనియెన్=వక్ష్యమాణరీతిగాఁ బలికెను.

మ. మతి నొక్కింత విచార మూనక కురుసం॰పద్గర్వరేఖ న్మహా
దితిజాధీశవిరోధ మంది యిటు లే॰తేరన్ మనం బుంతురే
రతి ధాత్రిన్ మనఁ గల్గినన్ జనుము మ॰ద్రాజద్భుజాదండమం
డితకోదండవినిర్వమద్విశిఖముల్ ॰నిం గాఁడ విప్పట్టునన్. 124

టీ. మతిన్=బుద్ధియందు; ఒక్కింత = అల్పమయినను; విచారము = ఆలోచనమును; ఊనక=వహింపక; ఉరుసంపద్గర్వరేఖన్=అధికమగునైశ్వర్యమదపరంపరచేత; మహాదితిజాధీశవిరోధము=గొప్పరాక్షసప్రభువైననాతోవైరమును; అంది=పొంది; ఇటు లేతేరన్=ఇట్లు వచ్చుటకు; మనంబుంతురే=మనస్సునుంచుదురా? ధాత్రిన్=భూమియందు; మనన్=బ్రతుకుటకు; రతి=కోరిక; కలిగినన్=కలిగినయెడల; చనుము=పొమ్ము. మద్రాజద్భుజాదండమండితకోదండవినిర్వమద్విశిఖముల్.—మత్=నాయొక్క, రాజద్భుజాదండ=ప్రకాశించుచున్న బాహుదండములచేత, మండిత=అలంకృతమైన, కోదండ=ధనువువలన, వినిర్వమత్ = వెడలుచున్న, విశిఖముల్ = బాణములు; నిన్ = నిను; ఇప్పట్టునన్=ఈసమయమున; కాఁడవు=బాధింపవు.

మ. మునివాక్యంబున మోసపోయితివి త॰న్మూలంబుగాఁ జుమ్ము నీ
కెనసెన్ గాలము మద్రణేహ గనువాఁ॰డెవ్వాఁ డిలన్ మించెఁ జొ
చ్చెనొ నీవీనుల లేదొ భూమివర యా॰జిప్రాప్తదేవేశకృం
తనసంలోలమదాశయాన్యవిధికృ॰ద్ధాత్రుక్తమిత్రోక్తికల్. 1 5

టీ. మునివాక్యంబునన్ = శాండిల్యమునివచనముచే; మోసపోయితివి=వంచితుఁడవైతివి. తన్మూలంబుగాఁజుమ్ము=అతనిమూలముగాసుమీ; నీకున్; కాలము=నాశకాలము; ఎనసెన్=ఘటిల్లెను. మద్రణేహగలవాఁడు=నాతోయుద్ధముఁ జేయనిచ్ఛగలవాఁడు; ఎవ్వాఁడు=ఎవఁడు; ఇలన్=భూమియందు; మించెన్=అతిశయించెను? భూమివర=ఓ మహీపతీ! ఆజిప్రాప్తదేవేశకృంతనసంలోలమదాశయాన్యవిధికృద్ధాత్రుక్తమిత్రోక్తికల్.—ఆజిప్రాప్త = యుద్ధమునుబొందిన, దేవేశ=ఇంద్రునియొక్క, కృంతన=సంహారమందు, సంలోల = మిక్కిలి ఆసక్తుఁడనగు, మత్=నాయొక్క, ఆశయ=అభిప్రాయమునకు, అన్యవిధికృత్=మఱియొకప్రకారముఁ జేయుచున్న, ధాత్రుక్త=బ్రహ్మదేవునిచేఁబలుకఁబడిన, మిత్రోక్తికల్=సాంత్వవాదములు; నీవీనులన్=నీశ్రోత్రములను; చొచ్చెనో లేదో=ప్రవేశించెనో లేదో.

అనఁగా నొకపుడు దేవేంద్రుఁడు యుద్ధమునకు వచ్చియుండఁగా నతనిసంహరింప నుద్యమించిన నేను బ్రహ్మ బతిమాలఁగాఁ జంపక వదలినవాఁడ. ఈవృత్తాంతము నీచెవి సోఁకినదో లేదో అనుట. ఇట్లు చెప్పుటం జేసి సర్వాతిశాయిసామర్థ్యము గలవాఁడని గర్వము ధ్వనిత మగును.

సీ. లలనాళిగీతక♦ల్యాణగీతిక గాదు
చెవి యొూన ఘనసింహ♦రవము గాని
సరసకేళీచంద్ర♦శాలికావళి గాదు
విహరింప సంగ్రామ♦వీథి గాని
బంధురకర్పూర♦గంధచర్చిక గాదు
మే నూన మొనముల్కి♦సోన గాని
సేవాపరాప్తధా♦త్రీవరౌఘము గాదు
తిలకింప దనుజేంద్ర♦బలము గాని

తే. గురుహితజనావృతవిహార♦ఖురళి గాదు
శరగరిమఁ జోప శాత్రవాం♦తరము గాని
తరము గా దిట్లు రణ మూనఁ ♦ దరణికులజ
తటిమి వధియింతు నీవేళఁ ♦ దలఁగి చనుము. 126

టీ. తరణికులజ=సుచంద్రుఁడా! చెవియూనన్ =శ్రోత్రముపానముచేయుటకు, సుఖాకర్ణనమునకనుట; ఘనసింహరవము గాని=గొప్ప సింహ నాదము గాని; లలనాళిగీతకల్యాణగీతిక.—లలనాళిగీత=స్త్రీబృందముచేగానముచేయఁబడిన, కల్యాణగీతిక=శుభగీతము; కాదు. విహరింపన్ =క్రీడించుటకు; సంగ్రామవీథిగాని=రణరంగముగాని; సరసకేళీచంద్రశాలికావళి.—సరస=శ్రేష్ఠమగు, కేళీచంద్రశాలికా=క్రీడాసౌధవిశేషములయొక్క, అవళి=పంక్తి; కాదు. మేనూనన్ =శరీరమానుటకు; మొనముల్కిసోనగాని=తీక్ష్ణాగ్రములగుబాణములవృష్టిగాని; బంధురకర్పూరగంధచర్చికగాదు.—బంధుర=దట్టమగు, కర్పూరగంధ=కర్పూరగంధముయొక్క, చర్చిక గాదు=లేపనముగాదు. తిలకింపన్ =వీక్షించుటకు; దనుజేంద్రబలముగాని=రాక్షసేశ్వరసైన్యముగాని; సేవాపరాప్తధాత్రీవరౌఘముగాదు.—సేవాపరాప్త=కొలువునకై వచ్చిన, ధాత్రీవర = రాజులయొక్క, ఓఘము గాదు=సంఘముగాదు. శరగరిమన్ =బాణగరిమచే; చోపన్ =తఱుముటకు; శాత్రవాంతరముగాని=శత్రుమధ్యముగాని; గురుహితజనావృతవిహారఖురళి గాదు.—గురు=అధికులగు, హితజన=మిత్త్రజనులచేత, అవృత=వ్యాప్తమయిన, విహారఖురళిగాదు = క్రీడార్థమయినగరిడిగాదు. ఇట్లు=ఈప్రకారముగా; రణమూనన్ = యుద్ధముసేయుటకు; తరము గాదు=శక్యముగాదు. ఈవేళన్ =ఈక్షణమందు; తటిమివధియింతున్ =బలాత్కరించి పరిమార్తును. తలఁగి=యుద్ధమునసుండితొలఁగి; చనుము=పొమ్ము.

త్వరితగతి. అని యసురకులరమణుఁ ♦ డరుణతరవీక్షా
జనితరుడనలకణవి♦సర మరిమనోభీ
జనకముబు పొదల శిత♦శరచయముచేఁ ద
ద్వనజహితజననపతిఁ ♦ ద్వరితగతిఁ గప్పెన్. 127

టీ. అని=ఈప్రకారముగాఁబలికి; అసురకులరమణుఁడు=తమిస్రాసురుఁడు;అరుణతర వీక్షాజనితరుషనల కణవిసరము.—అరుణతరవీక్షా=మిక్కిలిరక్తములగుచూపులచేత, జనిత=పుట్టింపఁబడిన, రుడనల=రోషానలముయొక్క, కణవిసరము=లేశములగుంపు; అరిమనోభీజనకమయి = శత్రుహృదయములకుభీతిజనకమయి; పొదలన్ = ఒప్పఁగా; శితశరచయముచే తన్=తీక్ష్ణబాణపరంపరచేత; తద్వనజహితజననపతిన్ = అనూర్యవంశజుఁడైన భూపతిని, ''సంతతిర్గోత్రజననకులాని'' అని యమరుఁడు; త్వరితగతిన్ = శీఘ్రగతిచేత; కప్పెన్=ఆవరించెను.

ఆరాజుపైఁగఅకుటమ్ములగుంపులు గురిపించె నని తాత్పర్యము. ఇందు వృత్తనామంబయిన త్వరితగతిశబ్దము ప్రకృతార్థపరముగ నిమిడించుటచే "నితమ్బ గుర్వీ తరుణీ దృగ్యుగ్మవిపులా చ సా" ఇత్యాదిస్థలములయందువలె ముద్రాలంకారము. ''సూచ్యార్థసూచనం ముద్రా ప్రకృతార్థపరైః పదైః'' అని తల్లక్షణంబు. త్వరితగతివృత్తలక్షణము. ''అదనదనువహారినుతు • లమరధరబాలా । శదళమనఁదనరుఁగవి • జనులువచియింపన్ । బదునొకటగునెడ యతి • పదిలమునఁజేరన్ । గదియునగణములయిదు • గగముతుదనొందన్. అని యప్పకవీయమునఁ జెప్పఁబడియె. త్వరితగతికి పాలాశదళమనినామాంతరమనియందె వచింపఁబడెను.

చ. తెఱలనిశక్తి నప్పొలసు•దిండికొలంబులమేటి యిట్లు ల
త్తఱి విశిఖాళిఁ గప్ప వసు•ధాపతి దట్టపుమంచుపిండు బల్
కఱకఱిమించులం దునుము•కంజహితుం డన వాఁడితూపులన్
మఱలఁగఁ జేసి యాదనుజ•నాథు గుఱించి మృదూక్తి నిట్లనున్. 128

టీ. అప్పొలసుదిండికొలంబులమేటి=ఆరాక్షసకులాధిపతి; తెఱలనిశక్తిన్=తొలఁగనిసామర్థ్యముచేత; ఇట్లు=ఈప్రకారముగ; అత్తఱిన్=అప్పుడు; విశిఖాళిన్=బాణపరంపరచే; కప్పన్=ఆవరింపఁగా; వసుధాపతి=సుచంద్రుఁడు; దట్టపుమంచుపిండున్=నిబిడహిమశదంబమును; బల్కఱకఱిమించులన్= అధికమైకఠినములైనతేజస్సులచేత; తునుముకంజహితుండనన్=ఖండించుసూర్యుండో యనునట్లు; వాఁడితూపులన్=కఱకుబాణములచేత; మఱలఁగఁజేసి=మఱలునట్లొనరించి; ఆదనుజనాథున్ గుఱించి = ఆరాక్షసేశ్వరునిగూర్చి; మృదూక్తిన్=మృదులమైనవాక్కుచేత; ఇట్లనున్=వక్ష్యమాణప్రకారముగఁబలుకును.

చ. అలఘురణోర్విఁ జేరి యసు•రాధిప యీగతి వట్టిపల్కుచాల్
పలుకుట వీరధర్మమె న•భస్సలి నిర్జరులెల్లఁ జూడ నీ
చలము బలంబు శస్త్రకుల•చాతురిఁ జూపుము చూచి యంతటన్
బ్రబలయుక్తశాను హేతిసమ•బాణపరంపరఁ గూల్తు గ్రక్కునన్. 129

టీ. అసురాధిప=రాక్షసాధిపతీ! అలఘురణోర్విన్ = అధికమయిన యుద్ధభూమిని; చేరి=పొంది; ఈగతిన్=ఈతీరున; వట్టిపలుకుచాల్=వ్యర్థవాక్పరంపరను; పలుకుట= చెప్పుట; వీరధర్మమె=వీరులపాడియా? నభస్స్థలిన్=ఆకాశమునందు; నిర్జరులెల్లన్ = దేవతలెల్లను; చూడన్=అవలోకింపఁగా; నీచలమున్=నీమాత్సర్యమును; బలంబున్=సామర్థ్యమును; శస్త్రికులచాతురిన్.—శస్త్రికుల=బాణపుంజమునందలి, చాతురిన్=నేర్పును; చూపుము=కనఁబఱుపుము. చూచి=అవలోకించి; అంతటన్=అటుతరువాత; ప్రలయకృశానుహేతిసమబాణపరంపరన్=ప్రళయానలజ్వాలాతుల్యమగు బాణసంఘము చేత; గ్రక్కునన్ = వేగముగా; కూల్తున్ = చంపుదును.

తే. ఈయెడఁ దమిస్ర నీదర్ప♦మెల్లఁ గూల్చి
యరిభయదలీలఁ దనరుదీ♦వ్యత్సుచంద్ర
శైత్యవత్కరకాండముల్ ♦ చక్కఁ గాంచి
త్రిదశబృందంబు లానంద♦రేఖఁ జెందు. 130

టీ. తమిస్ర=తమిస్రాసురుఁడా! అంధకారమాయనియర్థాంతరము దోఁచుచున్నది. ఈయెడన్=ఇపుడు; నీదర్పమెల్లన్=నీయహంకారమంతయు; కూల్చి=పడవైచి; అరిభయదలీలన్=శత్రులకుభయప్రదమగుతీరున; జక్కవలకుభయప్రదమగుతీరున నని యర్థాంతరము దోఁచుచున్నది; తనరుదీవ్యత్సుచంద్రశైత్యవత్కరకాండముల్.—తనరు=ఒప్పుచున్న, దీవ్యత్=ప్రకాశించుచున్న, సుచంద్ర=సుచంద్రునియొక్క, శైత్యవత్=వాఁడిగల, తీక్ష్ణవాచకమయినశీతశబ్దముమీఁద శైత్యశబ్దమయినది, కరకాండముల్=హస్తమందుండినబాణములను; సుచంద్ర=మంచిశీతాంశువుయొక్క, శైత్యవత్=చలువగల, కరకాండముల్=కిరణజాలములను; చక్కన్=బాగుగా; కాంచి=చూచి; త్రిదశబృందంబులు=దేవసంఘములు; ఆనందరేఖన్=ఆనందపరంపరను; చెందున్=పొందును.

ఇచటఁ బ్రస్తుతాప్రస్తుతముల కౌపమ్యము గమ్యము గాన నంధకారదర్ప మడంచి చక్రవాకభయంకరము లగుచు చంద్రకిరణములు దేవతాబృందము నానందింపఁ జేయునట్లు నాతీక్ష్ణబాణపరంపర నీదర్ప మడంచి శత్రుభయంకరమై దేవతాబృందము నానందింపఁ జేయు నని భావము.

చ. యతుల వధించి తత్కృతస♦వాళి హరించి ధరిత్రి ధార్ష్ట్యసం
గతిఁ దగునీవు నాయెదురు ♦ కట్టున నిల్చితిగా నిశాట త
త్కృతికి ఫలంబు నీ వెనయ ♦ నిత్తఱిఁ దార్చెద మద్భుజోగ్రధ
న్వతరుణభోగివాంతవిష♦వహ్నిసమానకలంబధారచేన్. 131

టీ. నిశాట=ఓరాక్షసుఁడ! యతులన్=మునులను; వధించి=హింసించి; తత్కృతసవాళిన్=వారిచేనాచరింపఁబడిన యజ్ఞసంఘములను; హరించి=చెఱిపి; ధరిత్రిన్=భూమియందు; ధార్ష్ట్యసంగతిన్ — ధార్ష్ట్య=గడుసుఁదనముయొక్క, సంగతిన్=సంబంధముచేత;

తగునీవు=ఒప్పుచున్న నీవు; నాయెదురకట్టుననిల్చితి గా=నాసమ్ముఖముననిలిచితివికదా! తత్ప్రాతికిన్=ఆచర్యకు; ఫలంబున్=లాభమును; నీవెనయన్=నీవుపొందునట్లు; ఇత్తఱిన్=ఈ సమయమందు; మద్భుజోగ్రధన్వతరుణభోగివాంతవిషవహ్ని సమానకలంబధారచేన్.—మద్భుజ=నాబాహువులయందున్న, ఉగ్రధన్వతరుణభోగి=కోడెనాగుఁబాము వంటి భయంకరమగు ధనుస్సుచేత, వాంత=క్రక్కఁబడిన,విషవహ్ని=విషాగ్నితోడ, సమాన=సాటియగు, కలంబధారచేన్=బాణపరంపరచేత; తార్చెదన్=చేసెదను.

మాలిని.-అని మనుజకులేంద్రుం ◆ డయ్యెడన్ భూరిబాణా
సన మెనసి శరాళిన్ ◆ జాల దైత్యేంద్రు నొంచెన్
ఘనము నగముపై ని◆ష్ఖండవార్ధారచే నా
ఘనగుణరుతి గర్జా◆గౌరవం బూని మించన్. 132

టీ. అని=ఇట్లువచించి;మనుజకులేంద్రుండు=జనపతి;ఘనగుణరుతి=గొప్పజ్యానిర్ఘోషము; గర్జాగౌరవంబు=మేఘధ్వనియొక్క అతిశయమును; ఊని=వహించి; మించన్=అతిశయింపఁగా; ఘనము=మేఘము; నగముపైన్=వృక్షముపై; నిష్ఖండలీలన్=అఖండక్రియచేత; వార్ధారచేనాన్=వారిధారచేతనన్నట్లు; అయ్యెడన్=ఆసమయమున; భూరిబాణాసనము = గొప్పవింటిని; ఎనసి=పొంది; శరాళిన్=బాణపరంపరచేత; చాలన్=మిక్కిలి; దైత్యేంద్రున్=రాక్షసాధిపతిని; నొంచెన్=నొప్పించెను.

"మనసిజగురుసెంతున్ మాలినీవృత్తమందున్ ననమయయగణంబుల్ నందవిక్రాంతి గూడన్" అని మాలినీవృత్తలక్షణము.

చ. జనపతి వైచినట్టిశిత◆సాయకముల్ నిజసాయకచ్ఛటన్
దునియఁగఁ జేసి దైత్యపతి◆తోడనె యమ్ములు కొన్ని గూర్చి వై
చినఁ గడుఁ జూర్ణతన్ గగన◆సీమను గప్పఁగ నాత్మవ
ర్తన నెనయించెఁ జూచునజ◆రప్రకరంబులు కేలఁ బాపఁగన్. 133

టీ. దైత్యపతి = తమిస్రుఁడు ; వైచినట్టిశితసాయకముల్ = రాజు ప్రయోగించిన తీక్ష్ణబాణములను; నిజసాయకచ్ఛటన్=తనబాణపరంపరచేత; తునియఁగన్ చేసి= తునియునట్లుచేసి; తోడనే=వెంటనే; అమ్ములుకొన్నిగూర్చి=కొన్నిబాణములనుసంధించి;వైచినన్=ప్రయోగింపఁగా; జనపతి=రాజు; ఆత్మవర్తనన్=తనబాణవ్యాపారముచేత; చూచునజరప్రకరంబులు=అవలోకించుదేవసమూహములు;కేలన్=హస్తములచేత; పాపఁగన్=తొలఁగఁజేయునట్లు; కడున్‌జూర్ణతన్=మిక్కిలి చూర్ణత్వముచేత; గగనసీమను=ఆకాశప్రదేశమును; కప్పఁగన్=ఆచ్ఛాదించునట్లు; ఎనయించెన్=పొందించెను.

అనఁగా సుచంద్రుఁడు తననిశితసాయకములను దైత్యేంద్రుఁడు తునియలుచేసి కొన్ని బాణములు ప్రయోగింపఁగా వానిని నిజసాయకములచే చూర్ణమై గగనసీమ వ్యాపించునట్లు చేసెననియు, అందు రణావలోకమునకై యేతెంచిన దేవసంఘములు ఆచూర్ణము తమ కడ్డము గాఁగా హస్తములచేఁ దొలఁగించుకొనిరనియు భావము.

చ. అలపతివైచుబాణముల నాదనుజేశుఁడు వాఁడు వైచున
మ్ముల హరిభేది తున్ముచు నపూర్వరణం బొనరించి రయ్యెడన్
దలఁకక విల్లునన్ ఖగవితానము గూర్చుట వాని వైచుటల్
దెలియఁగ నోప కెంతయు మతిన్ సురసంతతి సన్నుతింపఁగన్. 134

టీ. అలపతివైచు బాణములన్ = ఆరాజుప్రయోగించుతూపులను ; ఆదనుజేశుఁడు = ఆతమిస్రాసురుఁడు; వాఁడువైచునమ్ములన్ = ఆదనుజుఁడు ప్రయోగించుబాణములను ; హరిభేది = సుచంద్రుఁడు, కుముదుఁ డనువాఁడు శాపవశమున సింహరూపము నొంది యుండఁగా వానిసింహశరీరమును భేదించినవాఁడు గావున హరిభేది యనం బడియె; తున్ముచున్ = ఖండించుచు; అయ్యెడన్ = ఆసమయమున; తలఁకక = భయపడక; విల్లునన్ = ధనువునందు; ఖగవితానము = బాణసంఘమును; "ఖగస్సూర్యేషుపక్షిషు" అని రత్నమాల; కూర్చుట = సంధించుటను; వానివైచుటల్ = వానిఁ బ్రయోగించుటలను; సురసంతతి = దేవసంఘము ; ఎంతయున్ = మిక్కిలి; తెలియనోపక = తెలియఁజాలక; మతిన్ = చిత్తమందు ; సన్నుతింపఁగన్ = కొనియాడఁగ; అపూర్వరణంబు = లోకోత్తరయుద్ధమును; ఒనరించిరి = సల్పిరి.

ప్రహరణకలితము. అభినవధృతి లోనడరఁగఁ బలభు
గ్విభుఁ డరిబలముల్ వెడలి నడవఁగన్
స్వభటనికర మెంచఁగఁ జటులగదన్
ప్రభుకులమణిపైఁ బఱపెను వడిగన్. 135

టీ. అభినవధృతి = నూతనధైర్యము; లోన్ = మనస్సునందు; అడరన్ = ఒప్పుచుండఁగా; పలభుగ్విభుఁడు = రాక్షసేశ్వరుఁడు; అరిబలముల్ = శత్రుసైన్యములు ; వెడలినడవఁగన్ = రణమునుండి భీతులైపాఱఁగా; స్వభటనికరము = తనసైన్యము; ఎంచఁగన్ = ప్రశంసింపఁగా; చటులగదన్ = చంచలమైనగదాయుధమును; ప్రభుకులమణిపైన్ = రాజేంద్రునిపై; వడిగన్ = వేగముగా; పఱపెను = ప్రయోగించెను.

"పనిగొను నెపుడున్ బ్రహరణకలితన్ । ననభనవలు మందగజ విరమమున్" అని ప్రహరణకలితవృత్త లక్షణము.

పంచచామరము. సురారిరాజు మీఁద వైచుశూరహర్షమార్గదన్
స్థిరధ్వనిప్రభావదీర్ణదిక్ప్రదన్ మహాగదన్
ధరావరాగ్రయాయి ఖడ్గధారఁ ద్రుంచె సర్వరా
ధరోరుకూట ముగ్రవజ్రధార నింద్రుఁడో యనన్. 136

టీ. సురారిరాజు = రాక్షసేశ్వరుఁడు; మీఁదన్ = మీఁదికి; వైచుశూరహర్షమార్గదన్ = ప్రయోగించునదియు, శూరులహర్షమార్గము ఖండించునదియు; స్థిరధ్వనిప్రభావదీర్ణదిక్ప్రదన్ =

స్థిర మగుధ్వని మహిమచేత బ్రద్దలుసేయఁబడిన దిక్తటములు గలదియు నగు; మహాగదన్=గొప్పదగుగదాయుధమును; ధరావరాగ్రయాయి= రాజేంద్రుఁడు; ఉర్వరాధరోరుకూటము=పర్వతసమూహమును; ఉగ్రవజ్రధారన్=ఉగ్రమైనవజ్రముయొక్క అంచుచేత; ఇంద్రుఁడో యనన్=సురేశ్వరుఁడో యనునట్లు; ఖడ్గధారన్=ఖడ్గముయొక్క అంచుచేత; త్రుంచెన్=ఖండించెను.

“జరజజంబులున్ గముం బొసంగి తొమ్మిదింటిపై విరామమొంది” యని పంచమర లక్షణము.

మ. గద యీలీల నృపాసిధారఁ ద్రుంగం దీవ్రరోషం బెదన్
గదురం దానవమాయచే నసురలోకస్వామి యవ్వేళ వై
రిదరాపాది మహాసురాస్త్రము ధరిత్రీభర్తపై వైచె స
త్పదవిన్ జూచుసురాళి కన్నులకు నిద్రాముద్ర చేకూడఁగన్. 137

టీ. ఈలీలన్=ఈతీరున; నృపాసిధారన్=రాజుఖడ్గముయొక్క యంచుచేత; గద=తనగదాయుధము; త్రుంగన్=తునియలుకాఁగా; తీవ్రరోషంబు=గాఢక్రోధము; ఎదన్=హృదయమందు; కదురన్=కలుగఁగా; అసురలోకస్వామి=రాక్షసేశ్వరుఁడు; దానవమాయచేన్=రాక్షసమాయచేత; అవ్వేళన్=అపుడు; వైరిదరాపాదిమహాసురాస్త్రము=శత్రుభయప్రదమగు గొప్పయాసురాస్త్రమును; సత్పదవిన్=నక్షత్రపదవియగు నాకాశమందు; చూచుసురాళికన్నులకున్=అవలోకించు దేవబృందముయొక్క నేత్రములకు; నిద్రాముద్ర=ముకుళీభావమనుట; చేకూడఁగన్ = కలుగునట్లు; ధరిత్రీభర్తపైన్ = రాజుమీద; వైచెన్= ప్రయోగించెను.

శిఖరిణి. ఖరాస్యాస్త్రంబుల్ ఘూకముఖశరముల్ కాకవదన
స్ఫురద్బాణంబుల్ తన్బాదివికొని రా భూరిపరిఘ
క్షురప్రాసిశ్రేణిన్ గురియుచు వెఱం గూల నజరుల్
త్వరన్ దద్దైతేయాస్త్రము నడచెఁ దత్సైన్య మలరన్. 138

టీ. ఖరాస్యాస్త్రంబుల్=ఖరముఖబాణములు; ఘూకముఖశరముల్=ఘూకముఖములు గలిగినబాణములు; కాకవదనస్ఫురద్బాణంబుల్=కాకముఖములచేఁ బ్రకాశించుచున్న బాణములు; తన్=తన్ను, ఆసురాస్త్రముననుట; పాదివికొని రాన్=కప్పికొని రాఁగా; భూరిపరిఘక్షురప్రాసిశ్రేణిన్=అధికములైన పరిఘలయొక్కయుం చురకత్తులయొక్కయు ఖడ్గములయొక్కయు గుంపులను; కురియుచున్=వర్షించుచు; అజరుల్=దేవతలు; వెఱన్=భయముచేత; కూలన్=దిగులుపడునట్లుగా; త్వరన్=వేగముచేత; తత్సైన్యము=వానిసైన్యము; అలరన్=సంతోషింపఁగా; తద్దైతేయాస్త్రము=ఆయాసురాస్త్రము; నడచెన్=వెడలెను.

ద్విజశ్రేష్ఠుల్ మెచ్చన్యమనసభవల్ విశ్వవిరతి ప్రజాతాష్టోవంశ్రై శిఖరిణియసా భా సురమగుర్'' అని శిఖరిణీవృత్తలక్షణము. ఇట నప్పకవి యొకచోటనే విశ్రమముఁ జెప్పినను ఈకవి విశ్రమద్వయముఁ బొందుపఱచెను.

మందాక్రాంత. ఉర్వీశస్వామి ఘనమతితో♦నుగ్రకీలాళి పైపైఁ
బర్వన్ రాఁ జూచి వెఱఁగు మదిన్♦బాయ కెచ్చన్ దదీయా
ఖర్వప్రస్ఫూర్తి నడఁచుతమిం♦గాంచి దోశ్శక్తిమై గాం
ధర్వాస్త్రం బప్డు మహీపతి సం♦తానముల్ మెచ్చ వైచెన్. 139

టీ. ఉర్వీశస్వామి=సుచంద్రుఁడు; ఘనమతితోన్=గొప్పబుద్ధితో; ఉగ్రకీలాళి = భయంకరమగు నగ్నిజ్వాలాపరంపర; పైపైఁబర్వన్ రాన్=మీఁదికిఁబ్రసరించుటకురాఁగా; చూచి; వెఱఁగు=ఆశ్చర్యము; మదిన్ బాయ కెచ్చన్=మనుస్సులోవిడువక యధికముకాఁగా; తదీయాఖర్వప్రస్ఫూర్తిన్=వానియతిశయస్ఫూర్తిని; అడఁచుతమిం గాంచి=శమింపఁజేయుకోర్కెఁబూని; దోశ్శక్తిమైన్=బాహుశక్తిచేత; అప్డు=ఆసమయమున; మహీపతిసంతానముల్=రాజబృందములు; మెచ్చన్=ప్రశంసించునట్లుగా; గాంధర్వాస్త్రంబు= గాంధర్వాస్త్రమును; వైచెన్=ప్రయోగించెను. ‹‹మందాక్రాంత స్గిరిశవిరతుల్మభ్నతా గాగణంబుల్ పొందెన్'' అని మందాక్రాంతా వృత్తలక్షణము నప్పకవిచెప్పె.

భుజంగప్రయాతము. ఖరాంశుచ్ఛటల్ వహ్ని♦కాండంబులన్ శీ
తరుక్పాళిని న్మించి ♦ ధాత్రీనభంబుల్
స్వరోచిం బ్రకాశింప ♦ క్ష్మానాయకాస్త్రం
బిరం దానవాస్త్రీయ♦వృత్తిన్ హరించెన్. 140

టీ. ఖరాంశుచ్ఛటన్=సూర్యపరంపరను; వహ్నికాండంబులన్=అగ్నిపరంపరను; శీతరుక్పాళినిన్=చంద్రపరంపరను; మించి=అతిశయించి; ధాత్రీనభంబుల్=భూమ్యంతరిక్షములు; స్వరోచిన్=తనకాంతిచేత; ప్రకాశింపన్=విలసిల్లఁగా; క్ష్మానాయకాస్త్రంబు=రాజబాణము; ఇరన్=భూమియందు; దానవాస్త్రీయవృత్తిన్ = రాక్షసబాణసంబంధివ్యాపారమును; హరించెన్=శమింపఁజేసెను.

"భుజంగప్రయాతాఖ్యము ల్నాల్గుయాలన్ గజవ్రాత విశ్రాంతిగాఁజెప్పనొప్పన్''.
అనిభుజంగప్రయాతవృత్తలక్షణము.

తే. ఇట్లు తనయస్త్రసామర్థ్య ♦ మెల్లఁ దూల
నాడు కఱచుచు హాయ్ముని ♦ యాగ్రహమున
మీఁసములు నిక్క నపుడు త♦మీచరుండు
శక్తి నృపు వైచె నిజమంత్ర♦శక్తిగరిమ. 141

టీ. తమీచరుండు=రాక్షసుఁడు; ఇట్లు=ఈప్రకారముగా; తనయస్త్రసామర్థ్యమెల్లన్=తనయాసురాస్త్రసామర్థ్యమంతయు; తూలన్ = తొలఁగిపోవఁగా; కౌదుకఁబచుచున్=పెదవికఱచుచు; హుమ్మని=హుంకారముచేసి; ఆగ్రహమునన్=కోపముచేత; మీసములు = శ్మశ్రువులు; నిక్కన్=నిగుడఁగా; అపుడు=ఆసమయమువ; తనమంత్రశక్తిగరిమన్=తనమంత్రసామర్థ్యాతిశయముచేత; శక్తిన్=శక్త్యాయుధమును; నృపున్=రాజునుగూర్చి; వైచెన్.

పృథ్వి. కనత్కనకఘంటికా♦కలఘుణత్కృతి ప్రక్రియన్
జనాధిప మహాచమూ♦శ్రవణభేదనం బూన్చుచున్
ఘనప్రతిమధూమసం♦ఘములఁ జీఁకటుల్నించుచున్
ఘనస్యదనిరూఢిచేఁ♦గదలి శక్తి యేతేరఁగాన్. 142

టీ. కనత్కనకఘంటికాకలఘుణత్కృతిప్రక్రియన్.—కనత్ = ప్రకాశించుచున్న, కనకఘంటికా=బంగరుగజ్జెలయొక్క, కల=అవ్యక్తమధురమగు, ఘుణత్కృతి=తద్రూపమైన ధ్వనివిశేషముయొక్క, ప్రక్రియన్=వ్యాపారముచేత; జనాధిపమహాచమూశ్రవణభేదనంబు.—జనాధిపమహాచమూ=రాజుగొప్పసేనయొక్క, శ్రవణభేదనంబు = చెవులభేదించుటను; ఊన్చుచున్ = చేయుచు; ఘనప్రతిమధూమసంఘములన్.—ఘనప్రతిమ = మేఘమునకుసాటియగు, ధూమసంఘములన్=పొగగుంపులచేత; చీఁకటుల్=అంధకారములను; నించుచున్=పూరించుచు; ఘనస్యదనిరూఢిచేన్=అధికమగువేగస్ఫూర్తిచేత; కదలి=వెడలి; శక్తి=శక్త్యాయుధము; ఏతేరఁగాన్ = రాఁగా. దీని కుత్తరపద్యముతో నన్వయము.

పృథ్వీవృత్తలక్షణమునుగూర్చి, జసల్జసయవంబు లుష్ణకరసంఖ్యవిశ్రాంతులున్। బొసంగికవిపుంగవుల్పలుకభూమిలోఁబృథ్వినా।నసంశయమగుంగలిందతనయామనోవల్లభా॥ అని యప్పకవి పంౘెండవయక్షరము యతిగాఁ జెప్పినను మహాకవులు పెక్కండ్రు తొమ్మిదవర్ణము విశ్రమముగా వ్యవహరించుచున్నారు.

క. మనుజపతి దానిఁ గనుఁగొని
యనిఁ గుండలితాశుగాసుఁ♦డై శరపంక్తిం
దునియలుగాఁ బడ వైచెన్
మనమున వేల్పులు నిజైక♦మహిమను బొగడన్. 143

టీ. మనుజపతి=రాజు; దానిన్=అశక్తిని; కనుఁగొని=అవలోకించి; అనిన్=యుద్ధమందు; కుండలితాశుగాసుఁడై.—కుండలిత=వలయాకారముగాఁజేయఁబడిన, ఆశుగాసుఁడై=ధనువుగలవాఁడై,ఆశుగాసశబ్దము శరాసాదిశబ్దములవలె ధనుర్వాచకమగునని దెలియవలయు; వేల్పులు = దేవతలు; మనమునన్=చిత్తమునందు; నిజైకమహిమన్=తనముఖ్యసామర్థ్యమును; పొగడన్ = శ్లాఘింపఁగా; శరపంక్తిన్=బాణపరంపరచేత; తునియలుగాన్=శకలములుగా; పడవైచెన్=పడఁగొట్టెను.

చ. తనవరశక్తి యిట్లు వసు♦ధాపతిమార్గణధారఁ ద్రెళ్ళ నా
దనుజవిభుండు శత్రుబల♦దారణశీలము స్వాగ్రనిర్గళ
త్సునిశితకీలికీల మొక♦శూలము చయ్యనఁ బూని దీనిచే
మనుము నృపాల యంచుఁ బర♦మప్రతిఘోద్ధతి వ్రేయ నెత్తఁగన్. 144

టీ. ఆదనుజవిభుండు=ఆతమిస్రుఁడు; ఇట్లు = ఈచొప్పున; తనవరశక్తిన్=తనశ్రేష్ఠమగుశక్త్యాయుధము; వసుధాపతిమార్గణధారన్=రాజుబాణములయొక్క అంచుచేత; త్రెళ్ళన్=పడఁగా; శత్రుబలదారణశీలము=శత్రుసైన్యసంహారణస్వభావముగలదియు; స్వాగ్రనిర్గళత్సునిశితకీలికీలము.—స్వ = తనయొక్క, అగ్ర = అగ్రభాగమువలన, నిర్గళత్=వెడలివచ్చుచున్న, సునిశిత=మిక్కిలితీక్ష్ణములగు, కీలికీలము=అగ్నిజ్వాలలుకలదియునగు; ఒక్కశూలము=ఒకశూలాయుధమును; చయ్యనన్=వేగముగా; పూని=వహించి; దీనిచేన్=ఈయాయుధముచేత; నృపాల=ఓరాజా! మనుము=బ్రతుకుము, విరుద్ధలక్షణచే చావుమని యర్థము. అంచున్=ఇట్లనుచు; పరమప్రతిఘోద్ధతిన్=అత్యంతకోపముచేత; వ్రేయన్=ఏయుటకు; ఎత్తఁగన్ = మీఁదికెత్తఁగా. దీనికిముందుపద్యముతోనన్వయము.

చ. జనవిభుఁ డంతలోఁ గరము♦చాతురి హెచ్చఁగ ధన్వ మూని వే
గనియతి నర్ధచంద్రవిశి♦ఖద్వయి పావకమంత్రరేఖతోఁ
దనరఁగఁ గూర్చి వైచి ధరఁ♦ దార్కొనఁ జేసెఁ దదీయదోర్యుగం
బనుపమశూలకాంచనశ♦రాసనముల్ తొలుదొల్త డిందఁగన్. 145

టీ. జనవిభుఁడు=సుచంద్రుఁడు; అంతలోన్ = వాఁడుశూలమెత్తివేయునంతలో; కరము=మిగుల; చాతురి=నేర్పు; హెచ్చఁగన్=మించఁగా; ధన్వము=ధనుస్సును; పూని=వహించి; వేగనియతిన్ = వేగనియమముచేత; అర్ధచంద్రవిశిఖద్వయిన్ = అర్ధచంద్రబాణద్వయమును; పావకమంత్రరేఖతోన్=ఆగ్నేయమంత్రపుంజముచేత; తనరఁగన్=ఒప్పునట్లుగా; కూర్చి=ఘటించి; వైచి=ప్రయోగించి; అనుపమశూలకాంచనశరాసనముల్ = సాటిలేనిశూలమును కాంచనధనువును; తొలుదొల్తన్=మొదటనె; డిందఁగన్ = పడఁగా; తదీయదోర్యుగంబు=వానిబాహుయుగ్మమును; ధరన్ దార్కొనన్ చేసెన్=భూమియందుఁబడునట్లుచేసెను.

ఉ. అంత ననంతరోషశిఖి♦యాంతరవీథికఁ జిందు ద్రొక్కఁ గా
లాంతకతుల్యమూర్తి యల♦యాశరసంతతిచక్రవర్తి దు
ర్దాంతరయంబుతో మణిశి♦తాంగము డిగ్గన డిగ్గి వ్యాత్తవ
క్త్రాంతర మూని క్రింగెద ర♦సాధిపు నం చరుదెంచె నుద్ధతిన్. 146

టీ. అంతన్=అటుతరువాత; కాలాంతకతుల్యమూర్తి=ప్రలయకాలమృత్యువుతోసమానమైనదేహముగల; అలయాశరసంతతిచక్రవర్తి=ఆరాక్షసకులాధిపతియగుతమిస్రుఁడు; అంతరవీథికన్=హృదయప్రదేశమందు; అనంతరోషశిఖి=అధికమయినక్రోధాగ్ని; చిందుద్రొ

క్కున్ = ఉప్పొంగఁగ; దుర్దాంతరయంబుతోన్=నివారింపరాని వేగముతో; మణికేతనాంగ ము=మణిమయమగురథమునుండి; డిగ్గనడిగ్గి=తటాలునదిగి; వ్యాత్తవక్త్రాంతరము.—వ్యాత్త=తెఱవఁబడిన, వక్త్రాంతరము=ముఖమధ్యమును; ఊని = వహించి; ఉద్ధతిన్ = దర్పముచేత; రసాధిపున్ = రాజును; మ్రింగెదనంచున్=కబళించెదననుచు; చనుదెంచెన్=వచ్చెను.

వ. ఇట్లప్రతిమానప్రతిపక్షహార్యక్షవర్యంబు వీక్షించి మహాక్షితిధరాసన్నక్షోణీవలనం గుప్పించుపంచాననంబు తెఱంగునఁ దచ్చక్రాంగం బభంగురామర్ష సాంగత్యంబున డిగ్గ నుఱికి గోత్రాధిపవిచిత్రపత్త్రిరాజ పరిత్రుటితబాహార్గళయుగళుండై నిస్తంద్రసురేంద్ర శతకోటిశితకోటి పాటితపక్షద్వయం బగు నంజనాచలంబుచందంబునం జూపట్టుచు నశేషారిబలవిలోచనోత్సవవిమోచనంబు గావించు మేచకప్రభాఘట్టంబున నెట్టన మిట్టిమీఱు కటికిచీఁకటిం బుట్టించుచుఁ బొడకట్టు నుద్దండతనూదండంబు శింశుమారచక్రవీథి రాయం బెరుఁగఁ జేయుచు నిష్ఠురదీర్ఘనిశ్వాసధూమనిష్ఠాలనీరదనికాయంబులకు శంఖారవప్రోత్థహుంకారవారంబుల విశంకటగర్జనావిశేషంబులు నెగడించుచు గ్రీష్మదినమధ్యందినమార్తండమండలం బొడియం గమకించువిధుంతుదగ్రహంబుదారి నుస్మితవదనకోటరుండై మహీపమార్తండుంగుఱించి యనంతాధ్వంబునన్ బరువుప్రాన్చుచు నతిభయంకరాకారంబునన్ బఱతేర నప్పు డప్పాలసుదిండిమన్నీనిఁ గన్నారంజూచి ధీరోదాత్తుం డగునాసుచంద్రరాజేంద్రుండు నిజకోదండంబున సమంత్రకంబుగ నారాయణాస్త్రంబు గూర్చి ప్రయోగించిన నయ్యస్త్రశిఖావతంసంబును నతివేలశుచిజాలసమన్వితంబు గావునఁ బుష్కరస్థానసంస్థాయినానానిమేషసంతానభంగంబు చేకూర్చుచు ననేకదివ్యకాండసర్గచమత్కారిఘన ప్రకారఖానమానంబుగావున భువనజాతవిలాససముత్సారణంబు సంఘటించుచు నమలకమలాప్తదైవతప్రభావిభూషితంబు గావున నాత్మమిత్రచక్రానందసంధాయకతేజోవైఖరిన్ దేజరిల్లుచు నమితరయంబున నభ్రమార్గంబు చేపట్టి యెదురుగఁ బఱతెంచు నాదైతేయనాయకుశిరంబుఁ ద్రుంచె నయ్యవసరంబున. 147

టీ. ఇట్లు=ఈతీరున; అప్రతిమానప్రతిపక్షహార్యక్షంబు=సాటిలేనిశత్రుశ్రేష్ఠుఁడు; "హార్యక్షః కేసరీహరిః సింహశార్దూలనాగాద్యాః" అని యమరుఁడు; వీక్షించి=చూచి; మహాక్షితిధరాసన్నక్షోణీవలనన్ = గొప్పపర్వతసమీపభూమినుండి; కుప్పించుపంచాననంబు తె

అంగునన్ = దుముకుచున్న సింహమువలె; తచ్ఛతాంగంబు=ఆరథమునుండి; అభంగురా మర్షసాంగత్యంబునన్.—అభంగుర=అప్రతిహతమగు, అమర్ష=చేతఃప్రజ్వలనము చేత;"అమర్షస్స్వపరాభేషు చేతః ప్రజ్వలనంమతమ్" అని అమర్షలక్షణము, సాంగత్యంబునన్=సంబంధముచేత; డిగ్గనుటికి=వేగముగడిగి; గోత్రాధిపవిచిత్రతరపత్త్రిరాజపరిత్రుటిత బాహార్గళయుగళుండై.—గోత్రాధిప=రాజుయొక్క, విచిత్రతర=ఆశ్చర్యకరములగు, పత్త్రిరాజ=ఉత్తమసాయకములచేత, పరిత్రుటిత=ఛేదింపఁబడిన, బాహార్గళయుగళుండై = అర్గళములఁబోలుభుజాద్వయముగలవాఁడై; నిస్తంద్రసురేంద్ర శతకోటి శితకోటి పాటితపక్షద్వయంబై.—నిస్తంద్ర=జాగరూకుఁడైన, సురేంద్ర=దేవేంద్రునియొక్క, శతకోటి=వజ్రాయుధముయొక్క, శితకోటి=తీక్ష్ణాగ్రముచేత, పాటిత=నఱకఁబడిన, పక్షద్వయంబు=గరుద్ద్వయముగలిగినట్టిది; అగు నంజనాచలంబు చందంబునన్=అయిననీలాచలమువలె; చూపట్టుచున్=అగపడుచు; అశేషారిబలవిలోచనోత్సవవిమోచనంబు.—అశేష=సమస్తములగు, అరి=శత్రువులయొక్క,తమిస్రుఁడుగావునజక్కవలయొక్కయనియర్థాంతరముస్ఫురించును, బల=సైన్యముయొక్క,విలోచనోత్సవ=నయనానందముయొక్క, విమోచనంబు=పోఁగొట్టుటను; కావించు మేచకప్రభాఘట్టంబునన్.—కావించు=చేయుచున్న, మేచకప్రభా=నీలకాంతులయొక్క, ఘట్టంబునన్ = గుంపుచేత; నెట్టనన్=అనివార్యముగా; మట్టుమీఱుకటికిచీఁకటిన్=అతిశయించుగాఢాంధకారమును; పుట్టించుచున్=కలుగఁజేయుచు; పొడకట్టునుద్దండతనూదండంబు.—పొడకట్టు=చూపట్టుచున్న, ఉద్దండతనూదండంబు=ఉత్కటశరీరకాండము; శింశుమారచక్రవీథిన్=సూర్యాదిగ్రహసంచారచక్రముయొక్కప్రదేశమును;రాయన్=ఒరయునట్లు;పెరుఁగఁజేయుచున్=వృద్ధిఁబొందఁజేయుచు; నిష్ఠురదీర్ఘనిశ్వాసధూమనిష్కాలనీరదనికాయంబులకున్.—నిష్ఠుర=కఠినమై, దీర్ఘ=పొడవైన,నిశ్వాస=ఊర్పుసంబంధియగు, ధూమ=పొగయనెడు,నిష్కాలనీరద=అకాలమేఘములయొక్క, నికాయంబులకున్=గుంపులకు; శంఖారవోత్థహుంకారవారంబులన్=శంఖనాదముననైనహుంకారములగుంపులచేత;విశంకటగర్జనావిశేషంబులు=విశాలమగు గర్జనావిశేషములను; నెగిడించుచున్=పుట్టించుచు; గ్రీష్మదినమధ్యందినమార్తండమండలంబు=గ్రీష్మదినమందలి మధ్యాహ్నకాలికసూర్యమండలమును;ఒడియన్ తమకించువిధుంతుదగ్రహంబుదారిన్=పట్టుటకుత్వరపడురాహుగ్రహముభంగి; ఉన్మీలితవదనకోటరుండై=తెఱవఁబడిన ముఖబిలముగలవాఁడై; మహీపమార్తండున్ గుఱించి=రాజనెడుసూర్యునిగూర్చి; అనంతాధ్వంబునన్=అంతరిక్షమార్గమున; పఱువూనుచున్=పరుగెత్తుచు; అతిభయంకరాకారంబునన్=మిగుల భయప్రదమగునాకృతితోడ; పఱతెరన్=రాఁగా; అప్పుడు=ఆసమయమున; అప్పాలసుదిండిమన్నీనిన్=ఆరాక్షసేశ్వరుని; కన్నారన్ చూచి=బాగుగనవలోకించి; ధీరోదాత్తుండుఅగునాసుచంద్రరాజేంద్రుండు=ధీరశ్రేష్ఠుండగునారాజశ్రేష్ఠుండు;నిజకోదండమునన్=తన ధనువునందు;సమంత్రకంబుగాన్=మంత్రయుక్తముగా; నారాయణాస్త్రంబున్=నారాయణాధిదైవతమైనయస్త్రవిశేషమును; కూర్చి=సంధించి; ప్రయోగించినన్ = విడువఁగా; అయ్యస్త్రశిఖావతంసంబును=ఆయుత్తమాస్త్రంబును; అతిహేలరుచిజాలసమన్వితంబు=అధికమగునగ్నిసంతతులతోఁగూడినది; అధికములుశుద్ధములునగు వ్రేళ్లతోఁగూడినదిఅని యర్థాంతరముతోఁచు;

కావునన్=అయిన హేతువువలన; పుష్కరస్థానసంస్థాయి నానానిమేషసంతానభంగంబు.—పుష్కరస్థానసంస్థాయి=గగనస్థలమందు నిలిచిన, నానా=అనేకప్రకారములగు, అనిమేషసంతాన=సురసంఘముయొక్క, జలప్రదేశములనున్న మత్స్యసంఘముయొక్క యనియర్థాంతరము, భంగంబు=పతనమును; చేకూర్చుచున్ = చేయుచు; అనేకదివ్యకాండసర్గచమత్కారిఘనప్రకారభాసమానంబు.—అనేక=అనేకములగు, దివ్య=లోకోత్తరములైన, కాండ=బాణముల యొక్క, ఉదకములయొక్క, సర్గ=సృష్టియందు, చమత్కారి=నేర్పుగలిగిన, ఘనప్రకార=అధికప్రకారము చేత, మేఘప్రకారము చేత, భాసమానంబు = ప్రకాశమానము; కావునన్=అయిన హేతువువలన; భువనజాతవిలాససముత్సారణంబును.—భువనజాత=లోకసంతతియొక్క, జలజాతముయొక్క, విలాస=సంతసముయొక్క, సముత్సారణంబును = మోచనమును; ఘటించుచున్=చేయుచు; అమలకమలాప్తదైవతప్రభావభూషితంబు.—అమల=స్వచ్ఛమగు, కమలాప్తదైవత=విష్ణువుయొక్క, సూర్యునియొక్క యనియర్థాంతరము, ప్రభావభూషితంబు=సామర్థ్యము చేనలంకృతమైనది, ప్రభా=కాంతి చేత, అవభూషితంబు = అలంకృతమైనది; కావునన్=అయిన హేతువువలన; ఆత్మమిత్రచక్రానందసంధాయక తేజోవైఖరిన్.—ఆత్మ=తనయొక్క, మిత్రచక్ర=సువ్యాప్తసంఘమునకు, మిత్రములగు చక్రవాకములకు, ఆనందసంధాయక=ఆనందముఁజేయు, తేజోవైఖరిన్=తేజోవిశేషము చేత; తేజరిల్లుచున్=ప్రకాశించుచు; అమితరయంబునన్=అమితవేగము చేత; అభ్రమార్గంబు=ఆకాశమార్గమును; చేపట్టి=అవలంబించి; ఎదురుగన్=అభిముఖముగా; పఱతెంచు నాదైతేయనాయకుశిరంబున్ = ఏతెంచుచున్న యాదనుజనాయకుశిరమును; త్రుంచెన్=ఖండించెను. అయ్యవసరంబునన్=ఆసమయమందు; దీనికిముందు పద్యమందుండుక్రియలతో నన్వయము.

సీ. గంధర్వపతులు చొ♦క్కపుపాట వాడిరి, వాడిరి తద్భవ్య♦వార్త మయులు
కులరాజమంత్రిము♦ఖ్యులు సంభ్రమించిరి, మించిరి సాధ్యు ల♦మేయసుఖిత
నరనాథసిద్ధు లం♦దఱు కొనియాడిరి, యాడిరి బృందార♦కాబ్జముఖులు
పదివదివుల రా♦డ్భటులు మన్నించిరి, నించిరి విరిసోన ♦ నిఖిలలేఖు

తే. లాత్మ సామంతనృపు లబ్ర♦ మంది రిష్ట
సిద్ధి ముని లాశ్రమంబులు ♦ చెంది రసుర
కువలయాత్ములు మిక్కిలి ♦ గుంది రభయ
భూతి జానపదుల్ మదిఁ ♦ బొంది రపుడు. 148

టీ. గంధర్వసతులు=గంధర్వస్త్రీలు; చొక్కపుపాటపాడిరి=మంచిపాటను గానము చేసిరి. మయులు=యక్షులు; తద్భవ్యవార్తన్=ఆమంగళకరమగువృత్తాంతమును; వాడిరి=ప్రస్తావించుకొనిరి. కులరాజమంత్రిముఖ్యులు=కులమువారు రాజులు మంత్రివరులు; సంభ్రమించిరి=సంతోషించిరి. సాధ్యులు=దేవవిశేషులు; అమేయసుఖితన్=అపరిమితసౌఖ్యము చేత; మించిరి = అతిశయించిరి. అందఱున్; నరనాథసిద్ధులన్ = రాజుయొక్క కార్యసిద్ధులను;

శ్లాఘియించిరి=ప్రశంసించిరి. బృందారకాబ్జముఖులు=దేవతాస్త్రీలు; ఆడిరి=నాట్యముఁజేసిరి; ప్రద్రవద్రిపులన్=పలాయమానులగుశత్రువులను; రాడ్భటులు=రాజభృత్యులు; మన్నించిరి=గౌరవించిరి. నిఖిలలేఖులు=సర్వదేవతలు; విరిసోనన్=పుష్పవర్షమును; నించిరి=పూరించిరి. ఆత్మన్=మనమున; సామంతనృపులు = ఇరుపొరుగుభూపులు; అబ్రమందిరి = ఆశ్చర్యమందిరి. మునులు = ఋషులు; ఇష్టసిద్ధిన్ = మనోరథలాభముచేత; ఆశ్రమంబులు = నిజనివాసములను; చెందిరి=పొందిరి. అసురకువలయాక్షులు=రాక్షసస్త్రీలు; మిక్కిలికసందిరి=అధికముగదుఃఖించిరి. జానపదుల్=ప్రజలు; అభయభూతిన్=అభయసంపదను; మతిన్ = బుద్ధియందు; పొందిరి=లభించిరి. అపుడు=దీనికిముందు పద్యముతో నన్వయము.

ఇది యమకాలంకారవిశేషము. "అర్థేసత్యర్థభిన్నానాం వర్ణానాం సాపునః క్రియా। యమకంపాదతద్భాగవృత్తి తద్యాత్యనేకతామ్" అని కావ్యప్రకాశమున యమకలక్షణము. "యుద్ధేతు వర్మబలచారరజాంసి తూర్యనిస్వాణనాదశరమణ్డలరక్తనద్యః । ఛిన్నాతపత్రరథచామరకేతు కుమ్భికుమ్భాసురీవృతభటాస్సురపుష్పవృష్టిః" అనుటం బట్టి యథోచితముగ నిట్లు పుష్పవృష్ట్యంతము వర్ణితంబయ్యె.

మ. హరిదీశాదిసురాళితోఁ బ్రమథవ•ర్యశ్రేణితో సర్వని
ర్జరయోగీశ్వరకోటితో రయితఁ గో•త్రం జేరి గౌరీమనో
హరుఁ డాభూపతి గౌరవించి మహి లో•కాత్యద్భుతాపాదిబం
ధురనానావిధపారితోషికములన్ • దోడ్తో నొసంగెన్ గృపన్. 149

టీ. గౌరీమనోహరుఁడు=శివుఁడు; హరిదీశాదిసురాళితోన్= దిక్పాలాదిదేవబృందముతోడ; ప్రమథవర్యశ్రేణితోన్ = ప్రమథశ్రేష్ఠులగుంపుతోడ; సర్వనిర్జరయోగీశ్వరకోటితోన్=సమస్తదేవమునిసంఘముతోడ; రయితన్=వేగముచేత; గోత్రన్=భూమిని; చేరి=పొంది; ఆభూపతిన్=ఆరాజును; గౌరవించి = గౌరవముచేసి; మహిలోకాత్యద్భుతాపాదిబంధురనానావిధపారితోషికములన్=భూలోకములో మిక్కిలియాశ్చర్యకరములైన యనేకవిధములగు పరితోషార్థద్రవ్యములను; కృపన్=దయచేత; తోడ్తోన్=వెంటనే; ఒసఁగెన్=ఇచ్చెను.

శివుండు దేవబృందముతోను ప్రమథవర్గముతోను మునిగణముతోనుం బుడమికిఁ బోయి యారాజునకు లోకోత్తరపారితోషికముల నిచ్చె ననుట.

చ. దనుజకులేంద్రసైన్యవర•దారుణసాయకపాళి నుర్విఁ ద్రె
ళ్ళినమహిపాలసైన్యపట•లిన్ మనఁజేసె శచీవిభుండు పా
వనకరుణాసుధానికర•వర్షపరంపరకన్న మున్న వ
ర్ధ్వననిజశక్తికల్పితన•వీనసుధారసవృష్టిధారచేన్. 150

టీ. శచీవిభుఁడు=ఇంద్రుఁడు; దనుజకులేంద్రసైన్యవరదారుణసాయకపాళిన్.—దనుజకులేంద్రసైన్య=రాక్షసేంద్రునిసైన్యముయొక్క, వర=శ్రేష్ఠమగు, దారుణ=భయంకరమగు,

సాయకపాళిన్=బాణపరంపర చేత; ఉర్విన్=భూమియందు; ద్రెళ్ళినమహీపాలసైన్యపటలిన్=పడినట్టిరాజుసైనికులసమూహమును; పావనకరుణాసుధానికరవర్షపరంపరకన్నన్.— పావన=పవిత్రమగు, కరుణా=కృపచేతనైన, సుధానికర=సుధాసమూహముయొక్క, వర్షపరంపరకన్నన్=వృష్టిపరంపరకన్నను; మున్న=పూర్వమే; పర్వివనిజశక్తికల్పితనవీనసుధారసవృష్టిధారచేన్.—పర్విన=వ్యాపించినదియు, నిజశక్తికల్పిత = తనసామర్థ్యముచేకల్పింపఁబడినదియు, నవీన=నూతనమునగు, సుధారస=అమృతరసముయొక్క, వృష్టిధారచేన్=వర్షధారచేత; మనఁజేసెన్=బ్రతికించెను.

మ. దివిజాలభ్యతమిస్రదైత్యవిజయా♦ప్తిన్ సేవితుం డైనయా
యవనీనాథవరేణ్యుఁ జేరి వినయా♦యత్తాత్మ గాధేయగా
లవశాండిల్యవసిష్ఠముఖ్యమునిజా♦లం బేకవాచాగతిన్
నవకల్యాణకరాదిదివ్యవరసం♦తానంబు లూన్చెన్ రహిన్. 151

టీ. దివిజాలభ్యతమిస్రదైత్యవిజయాప్తిన్.—దివిజాలభ్య=దేవతలకుఁబొందనలవిగాని, తమిస్రదైత్యవిజయ=తమిస్రాసురునివిజయముయొక్క, ఆప్తిన్=ప్రాప్తిచేత; సేవితుండైనయాయవనీనాథవరేణ్యున్=సేవింపఁబడినయారాజశ్రేష్ఠుని; చేరి=పొంది; వినయాయత్తాత్మన్=వినయవశంవదమైనచిత్తముతోడ; గాధేయగాలవశాండిల్యవసిష్ఠముఖ్యమునిజాలంబు=విశ్వామిత్రుఁడు గాలవుఁడు శాండిల్యుఁడు వసిష్ఠుఁడు మొదలగుమునిపుంజము; ఏకవాచాగతిన్=ఏకవాక్యముగ; నవకల్యాణకరాదిదివ్యవరసంతానంబులు = అపూర్వకల్యాణముఁ జేయునట్టివరము మొదలగువరములయొక్క సమూహములను; రహిన్=ప్రీతిచేత; ఊన్చెన్=వహింపఁజేసెను.

విశ్వామిత్రుఁడు లోనగు మునివర్యు లారాజున కభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాశీర్వదించి రనుట.

చ. జనవిభుఁ డిట్లు దైత్యబల♦జాతజయంబు వహించి దేవతా
జనములచే బహూకృతిని♦ జాల భరించి కడుం దలంచె నె
మ్మనమునఁ జంద్రికాయువతి♦మంజుకటాక్షసమేధితేందిరా
తనయమహాజయం బెపుడు♦ దారునొకో యని కోర్కి మించఁగన్. 152

టీ. ఇట్లు=ఈప్రకారముగ; జనవిభుఁడు=సుచంద్రుఁడు; దైత్యబలజాతజయంబు=రాక్షససైన్యముయొక్క గెలుపును; వహించి=పొంది; దేవతాజనములచేన్=దేవతాసంఘములచేత; బహూకృతిని=సత్కారమును; చాలన్=మిక్కిలి; భరించి=వహించి; నెమ్మనంబునన్=మంచిమనస్సునందు; చంద్రికాయువతిమంజుకటాక్షసమేధితేందిరాతనయజయంబు.—చంద్రికాయువతి=చంద్రికయొక్క, మంజు=మనోజ్ఞములగు, కటాక్ష=నేత్రాంతదృష్టులచేత, సమేధిత=వృద్ధిపొందింపఁబడిన, ఇందిరాతనయ=మన్మథునియొక్క, మహాజయంబు = గొప్పజయము; ఎపుడుదారునొకో = ఎపుడుకలుగునో; అని = ఈప్రకారముగా; కోర్కిమించఁగాన్=అభిలాషయతిశయింపఁగా; కడున్=మిక్కిలి; తలంచెన్=చింతించెను.

ఆవారితో నెపుడుభోగింతునోయని కోరుచుం డెననుట. ఇట్టి చింతయను ననంగద శగా దెలియునది.

క. ఈలీల నపుడు తత్వాం, చాలీమోహార్తచిత్తసారసుఁడై భూ
పాలాగ్రణిసకలాజర, జాలానుమతిన్ బ్రమోదసంతతి మెఱయన్. 153

టీ. అపుడు=ఆసమయమున; ఈలీలన్=ఈప్రకారముగ; భూపాలాగ్రణి=సుచంద్రుఁడు; తత్వాంచాలీమోహార్తచిత్తసారసుఁడై=ఆచంద్రికయందలిమోహాము చేఁబొందఁబడినహృదయారవిందముగలవాఁడై; సకలాజరజాలానుమతిన్=సమస్తదేవతాబృందముయొక్క సమ్మతితోడ; ప్రమోదసంతతి=హర్షాతిశయము; మెఱయన్=ప్రకాశించుచుండఁగా; దీనికిచనియెనను వ్యవహితోత్తరపద్యస్థక్రియయం దన్వయము.

పద్యత్రయమేకక్రియతో నన్వయించుటంజేసి శ్లో॥ "ద్వాభ్యాంయుగ్మమితిప్రోక్తం త్రిభిశ్లోకైర్విశేషకమ్" అను నుక్తలక్షణము చేలక్షితంబగువిశేషకసంజ్ఞ యీపద్యత్రయి కమరుచున్నది.

మ. అనఘోచ్చైస్తనకుంభలబ్ధి ఘనవాలావాప్తి హీరాభదం
తనిషక్తిన్ నవపద్మభాలసితవక్త్రస్ఫూర్తి రాజిల్లుప
ద్మిని రూఢానుశయాఢ్యహృత్సరణి భూమిస్వామి దా నెక్కి కాం
చనబంభారభటుల్ తమిస్రవిజయచ్ఛాయన్ బ్రబోధింపఁగన్. 154

టీ. భూమిస్వామి=సుచంద్రుఁడు; అనఘోచ్చైస్తనకుంభలబ్ధిన్.—అనఘ=ఒచ్చములేని, ఉచ్చైస్తన=మిక్కిలిగొప్పవైన, కుంభ=కుంభస్థలముయొక్క, ఉచ్చైః=మిట్టలైన, స్తనకుంభ=కలశములవంటికుచములయొక్క, లబ్ధిన్=ప్రాప్తిచేతననియర్థాంతరధ్వని; ఘనవాలావాప్తిన్.—ఘన=గొప్పదియైన, వాల=పుచ్ఛముయొక్క, అవాప్తిన్ = ప్రాప్తిచేత, గొప్పతలవెండ్రుకలప్రాప్తిచేతననియర్థాంతరము; హీరాభదంతనిషక్తిన్=వజ్రసమానకాంతిగలదంతసంబంధముచేత; నవపద్మభాలసితవక్త్రస్ఫూర్తిన్.—నవ=నూతనములగు, పద్మ=సిబ్బెపుబొట్టులయొక్క, భా=కాంతులచే, నూతనమైనకమలకాంతిచేతననియర్థాంతరము, లసిత=ప్రకాశించుచున్న, వక్త్రస్ఫూర్తిన్ =ముఖప్రకాశముచేత; రాజిల్లుపద్మినిన్=ప్రకాశించుచున్నయాఁడేనుఁగును, పద్మినీజాతిస్త్రీననియర్థాంతరము; రూఢానుశయాఢ్యహృత్సరణిన్.—రూఢ=అధికమైనటువంటి, అనుశయ=ద్వేషముచేత, అరతిచేతననుట, అరతియనఁగాననంగదశావిశేషము, ఆఢ్య=సమృద్ధమయిన, హృత్సరణిన్ =హృత్ప్రదేశముతో; తాన్; ఎక్కి=అధిష్ఠించి; కాంచనబంభారభటుల్ =స్వర్ణమయభేరులయొక్కనినాదములు; తమిస్రవిజయచ్ఛాయన్ = తమిస్రాసురజయప్రకాశమును; ప్రబోధింపఁగన్=బోధించుచుండఁగా. దీనికి చనియె నను నుత్తరపద్యమందలి క్రియతో నన్వయము.

అనఁగా పద్మిని చంద్రికాలక్షణములతోఁ గూడి యుండుటం జేసి తత్స్మరణప్రియుక్తమయిన యరతితోడ దాని నెక్కి చనియె నని భావము.

చ. అలఘుఝరీతరంగవిభ♦వాతిశయంబు కనద్వనీలతా
వలిమహిమల్ సరోలలిత♦వారిజవైఖరియుఁ నగోజ్జ్వల
జ్జలదమహంబు తన్మహిప♦చంద్రసుతాంగవిభావిలాసముల్
దెలుపఁగ గాంచుచుఁ జనియెఁ♦ద్రిమ్మరునెమ్మదితోడ వీటికిఁ. 155

టీ. అలఘుఝరీతరంగవిభవాతిశయంబు.—అలఘు=అధికమగు, ఝరీ = సెలయేళ్ళయొక్క, తరంగ=అలలయొక్క, విభవాతిశయంబు = సంపత్సమృద్ధి; కనద్వనీలతావలి మహిమల్.=కనత్ =ప్రకాశించుచున్న, వనీ=వనములయందున్న, లతా=తీవలయొక్క, ఆవలి=పంక్తులయొక్క, మహిమల్ = అతిశయములు; సరోలలిత వారిజవైఖరియుఁ.—సరః=సరస్సులయందలి, లలిత=ఒప్పుచున్న, వారిజ = పద్మములయొక్క, వైఖరియుఁ = భంగియు; నగోజ్జ్వలజ్జలదమహంబు = పర్వతములయందుప్రకాశించుచున్న మేఘములవిలాసము; తన్మహిపచంద్రసుతాంగవిభావిలాసము.—తన్మహిపచంద్రసుతా = ఆచంద్రికయొక్క, అంగవిభావిలాసముల్=అంగకాంతివిశేషములను; తెలుపఁగ=స్మరింపఁజేయుచుండఁగా; కాంచుచుఁ= చూచుచు; త్రిమ్మరు నెమ్మదితోడఁ=మిక్కిలి చలించుచున్న నిండుమనస్సుతోడ; వీటికిఁ= నిజరాజధానికి; చనియెఁ=పోయెను.

అనఁగా తరంగలతాపద్మజలదములు చంద్రికయొక్క వళులను బాహువులను కన్నులను కొప్పును స్మరింపఁజేయుచుండఁగాఁ జూచుచుం బోయె ననిభావము.

చ. తనపుర మంతఁ జేరి వసు♦ధాపతి భోటవరాటలాటము
ఖ్యనిఖిలదేశభూపతుల♦నంచి నిజాంచితహైమమందిరం
బెనసి యనీహ మించ దిన♦కృత్యము లూన్చి విలాసహర్మ్యమా
ళి నలరుశయ్య నప్డు పవ♦ళించె నృపాలసుతైకమోహతఁ. 156

టీ. అంతఁ=అటుపైని; వసుధాపతి=సుచంద్రుఁడు; తనపురము=తనపత్తనమును; చేరి= పొంది; భోటవరాటలాటముఖ్యనిఖిలదేశభూపతులఁ=భోటవరాటలాటాదినిఖిలదేశప్రభువులను; అంచి=పంపి; నిజాంచితహైమమందిరంబు.—నిజ=స్వకీయమగు, అంచిత=పూజ్యమయిన, హైమమందిరంబు=స్వర్ణభవనమును; ఎనసి=పొంది; అనీహ=అరతియనుమాన్మథావస్థ; మించఁ=అతిశయింపఁగా; దినకృత్యములు=అవశ్యాచరణీయములగుసంధ్యాదికార్యములను; ఊన్చి=చేసి; విలాసహర్మ్యమాళిఁ = క్రీడాసౌధశ్రేష్ఠమందు; అలరుశయ్యఁ = పువ్వులపఱుపునందు; నృపాలసుతైకమోహతఁ = చంద్రికయందు ముఖ్యమయినప్రీతిగలవాఁడగుటచేత; పవళించెఁ=శయనించెను.

ఆశ్వాసాంతపద్యములు.

మ. ప్రతిమాతీతగభీరతావిజితపా♦రావార రావారసం
యతనానాశరకర్ణకోటరపృష♦త్కాసార కాసారజాం

చితనేత్రాజనతామనోహరమహా•శృంగారః శృంగారసం
భృతమార్గైకవిహారలాలసమనో•బృందారబృందారతా. 157

టీ. ప్రతిమాతీతగభీరతావిజితపారావార.– ప్రతిమాతీత = సాటిలేనట్టి, గభీరతా= గాంభీర్యము చేత, "గాంభీర్యమవికారస్స్యాత్ సత్యపిక్షోభకారణే" అని తల్లక్షణము, విజిత=గెలువఁబడిన, పారావార=సముద్రముగలవాఁడా! రావారసంయుత నానాశరకర్ణకోటరపృషత్కాసార.–రావ=ధ్వనిచేత, అర=శీఘ్రముగా, సంయుత=నిరోధింపఁబడిన, నానాశర=నానారాక్షసులయొక్క, కర్ణకోటర=కర్ణరంధ్రములుగల, పృషత్కాసార = బాణవర్షముకలవాఁడా! కాసారజాంచితనేత్రాజనతామనోహార మహాశృంగార.–కాసారజాంచితనేత్రాజనతా=సరసిజములవలెనొప్పుచున్న నేత్రములుగల స్త్రీలసంఘములకు, మనోహార=మనోజ్ఞమగు, మహత్=అధికమైన, శృంగారః=అలంకారముగలవాఁడా! శృంగారసంభృతమార్గైకవిహారలాలసమనో బృందార.–శృంగార=శృంగారరసముచేత, సంభృత=మిగులఁబోషింపఁబడిన, మార్గ=మార్గమండలి, ఏక=ముఖ్యమగు, విహార=క్రీడయందు, లాలస=ఆసక్తిగల, మనః= మనస్సుగల, బృందార = దేవుఁడా ! శృంగార రసాధిష్ఠాన దైవమాయనుట; బృందారతా= బృందాదేవియందు రతుఁడగువాఁడా! ఈకృతిపతిసంబోధనములకు నుత్తరపద్యములందలి తత్సంబోధనములకు ఇది యను నాశ్వాసాంతిమగద్యముతో నన్వయము.

క. రణభీమ భీమనుతవా, రణవిజయైకాభిరామ • రామాత్మకకా
రణధామ ధామనిధికై, రణరాజద్భామ భామ•రహితాచరణా. 158

టీ. రణభీమ=యుద్ధభీముఁడైనవాఁడా! భీమనుతవారణ విజయైకాభిరామా.—భీమ=శివునిచేత, నుత=కొనియాడఁబడిన, వారణవిజయ = కువలయాపీడమను గజముయొక్క విజయముచేత, ఏక=ముఖ్యమగునట్లుగా, అభిరామ=ఒప్పెడువాఁడా! రామాత్మకకారణధామ.–రామా=స్త్రీలయొక్క, ఆత్మ=మనస్సులయొక్క, క=సుఖమునకు, కారణ=హేతువగు, ధామ=దేహముగలవాఁడా! "ధామదేహేగృహేపిచ" అని విశ్వము; ధామనిధికైరణరాజద్భామ.–ధామనిధి=సూర్యునియొక్క, కైరణ=కిరణసంఘముభంగి, రాజత్=ప్రకాశించుచున్న, భామ=దీప్తిసంపదగలవాఁడా! భామరహితాచరణా=క్రోధరహితమగు నాచరణముగలవాఁడా! ఈ రెండు పద్యములందును ముక్తపదగ్రస్తమను శబ్దాలంకారము.

కవిరాజవిరాజితము. నరకవిభేదన నారజఖాదన • నారదవాదనకేళి దరీ
యరిగణశాదనవారుణపాద న•యాంచితవాదన భూరిదరీ
చరరిపుమాద నరాశ్వవిచోదన • సారఫలార్జనవార్జహరీ
షరనిజపాదనతావన రాదన•భాజితకుంద నరేశ హరీ. 159

టీ. నరకవిభేదన=నరకాసురునకు భేదకుఁడైనవాఁడా! నారజఖాదన=అగ్నిభక్షకుఁడైనవాఁడా! నారదవాదనకేళి = నారదునియొక్క వీణావాద్యమందుఁ గ్రీడగలవాఁడా!

దరీ=శంఖముగలవాఁడా! అరిగణశాదనవారుణపాద = అరిగణ మనెడుపంకమునకు సూత సూర్యరూపుఁడవైనవాఁడా! నయాంచితవాదన=నీతియుక్తమైన వచనముగలవాఁడా! భూరిదరీచరరిపుమాద.— భూరి = అధికములగు, దరి = గుహాలయందు, చర = సంచరించుచున్న, రిపు=శత్రువులయొక్క, మా=సిరిని, ద=ఖండించినవాఁడా! నరాశ్వవిచోదన=అర్జునాశ్వములను దోలువాఁడా! సారఫలార్జనవార్జహారీ.—సార=శ్రేష్ఠమగు, ఫల=మోక్షాదిఫలముయొక్క, ఆర్జన=సంపాదనమగుటకు, వార్జ=కమలములకు, హారీ = సూర్యరూపుఁడవైనవాఁడా! పరనిజపాదనతావన=శ్రేష్ఠములగు తనపాదములయందు నతులైనవారిని రక్షించువాఁడా! రాదనభాజితకుంద.—రాదన=దంతసంబంధియైన, భా=కాంతిచేత, జిత = జయింపఁబడిన, కుంద=మొల్లలుగలవాఁడా! నరేశ=పురుషోత్తముఁడా! హారీ=మదనగోపాలస్వామీ!

గద్య. ఇది శ్రీమదనగోపాల ప్రసాదసమాసాదితోభయభాషాకవిత్వకళాకళత్ర రేచెర్లగోత్రపవిత్ర సురభిమల్లక్షమాపాలసత్పుత్ర కవిజనవిధేయ మాధవరాయ ప్రణీతం బైన చంద్రికాపరిణయం బనుమహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

గద్యము. ఇది శ్రీసతీరమణ కరుణాసమాసాదిత సర్వసౌభాగ్య, భాగ్యనగరమహారాజ్యసంకలిత శ్రీజటప్రోలుసంస్థాన ప్రాజ్యసకలసామ్రాజ్య, శ్రీరేచెర్ల గోత్రపవిత్ర, కవిజనగేయ శ్రీవేంకటజగన్నాథరాయ సత్పుత్ర, సత్సంప్రదాయ, శ్రీసురభివేంకటలక్ష్మణరాయ,పరిపోష్య,సరసవైదుష్య, తదాస్థానతలమండిత శేషసదాశివపండిత విరచిత శరదాగమ సమాఖ్యవ్యాఖ్యయందు

తృతీయాశ్వాసము సంపూర్ణము.



శ్రీరస్తు... 

శ్రీలక్ష్మీనరసింహాయనమః.

# చంద్రికాపరిణయము - సవ్యాఖ్యానము

## చతుర్థాశ్వాసము.



క. కమలాకుచకలశతటీ, విమలాంచిత మృగమదాభి♦విలసన్ముద్రా
కమలామతికృల్లాంఛన, విమలాలసరిపువిభేద♦విధ గోపాలా. 1

టీ. కమలాకుచకలశతటీ విమలాంచిత మృగమదాభి విలసన్ముద్రా కమలామతి కృల్లాంఛన.—కమలా=లక్ష్మీదేవియొక్క, కుచకలశతటీ=కలశములవంటి కుచములతటమందలి, విమల=నిర్మలమై, అంచిత=ఒప్పుచున్నదియైన, మృగమద=కస్తూరియొక్క, అభివిలసన్ముద్రా=ప్రకాశమానముద్రయొక్క, కమలా=సంపత్తియనెడు, మతి=బుద్ధిని, కృత్ = చేయుచున్న, లాంఛన=శ్రీవత్సముగలవాఁడా! విమలాలసరిపు విభేదవిధ.—విమల= విశేషపాపముగల, అలస=ధర్మమునందలసులైన, రిపు = శత్రువులయొక్క, విభేద=భేదనము, విధ=రీతిగాఁగలవాఁడా! గోపాలా=శ్రీమదనగోపాలస్వామీ! ఈకృతిపతిసంబోధనమునకు చిత్తగింపు మనునుత్తరపద్యస్థక్రియతో నన్వయము.

తే. చిత్తగింపుము శౌనకా♦ద్యుత్తమర్షి
సమితి కిట్లను రోమహ♦ర్షణతనూజుఁ
డంత రంగద్వధూమోహ ♦ మన్నృపాలుఁ
డంతరంగస్థలంబున ♦ నతిశయిల్ల. 2

టీ. చిత్తగింపుము=ఆకర్ణింపుము. శౌనకాద్యుత్తమర్షి సమితికిన్=శౌనకుఁడు మొదలగు శ్రేష్ఠముని సంఘమునకు; రోమహర్షణ తనూజుఁడు = సూతుఁడు; ఇట్లనున్ = వక్ష్యమాణప్రకారముగఁ బలుకును. అంతన్=అటుతరువాత; రంగద్వధూమోహము.—రంగత్ = ఒప్పుచున్న, వధూ=చంద్రికయందలి, మోహము=అభిలాషము; అంతరంగస్థలంబునన్= మనస్సునందు; అతిశయిల్లన్=మించఁగా; అన్నృపాలుఁడు=ఆరాజు. దీనికి అనుచుఁ దలపోయుచుండు ననునుత్తర పద్యస్థక్రియతో నన్వయము.

ఈపద్యమందు యమకాలంకారము. ఇట్లీయాశ్వాసమం దంతటను యమకాలంకారంబు ప్రధానంబుగ నగును "స్వరవ్యఞ్జన సముదాయ పౌనరుక్త్యం యమకమ్" అని వాత్స్యాయనసూత్రము.

సీ. వరియించు టెన్నఁడో ♦ వరమనోమోదంబు
నలువార రాజక♦న్యాలలామ
విహరించు టెన్నఁడో ♦ గృహవన్య నాతిమి
న్నలు వారక భజింపఁ ♦ గలికిఁ గూడి
నెలకొల్పు టెన్నఁడో ♦ నిశితపాణిరుహాంక
నలు వారణేంద్రయా♦నాకుచములను
దేలించు టెన్నఁడో ♦ హాళిఁ గ్రొంజెమటసో
నలు వాఱ నెలఁతఁ గం♦దర్పకేళిఁ

తే. జెలువ మరుపోరువెనుక సొ♦మ్ముల నలర్చి
చెలు వమరురక్తి నెన్నఁడో ♦ కలిసియుండు
టనుచుఁ దలపోయుచుండుఁ దా ♦ నాత్తచంద్రి
కాభిలాషానుగుంభిత♦స్వాంతుఁ డగుచు. 3

టీ. రాజకన్యాలలామన్=చంద్రికను; వరమనోమోదంబు=శ్రేష్ఠమగు మనస్సంతోషము; నలువారన్=ఒప్పఁగా; వరియించు టెన్నఁడో = వివాహమాడు టెన్నఁడో. గృహవన్యన్=సదనోద్యానమందు; నాతిమిన్నలు=స్త్రీరత్నములు; వారక=ఎడతెగక; భజింపన్=కొలుచుచుండఁగా; కలికిన్ కూడి=చంద్రికనుకూడి; విహరించు టెన్నఁడో=క్రీడించు టెన్నఁడో; వారణేంద్రయానాకుచములన్= గజేంద్రగమనయగు చంద్రికయొక్క స్తనములయందు; నిశితపాణిరుహాంకనలు.—నిశిత=తీక్ష్ణములగు, పాణిరుహ=గోళ్ళయొక్క, అంకనలు=చిహ్నములను; నెలకొల్పు టెన్నఁడో=చేయు టెన్నఁడో; నెలఁతన్ = చంద్రికను; కందర్పకేళిన్= అనంగక్రీడయందు; హాళిన్=ప్రీతిచేత; క్రొంజెమటసోనలు=నూతనస్వేదాసారములు; పాఱన్=ప్రవహింపఁగా; ఇట సంధివశమున పకారమునకు వకారము వచ్చినది. అలఘురేఫమైనను యమకమునకు బాధలేదు. తేలించు టెన్నఁడో=తృప్తిపొందించు టెన్నఁడో. చెలువన్=చంద్రికను; మరుపోరువెనుకన్=సురతానంతరమందు; సొమ్ములన్=ఆభరణములచేతను; అలర్చి=సంతోషింపఁజేసి, చెలువమరురక్తిన్=ఒప్పిదమగుప్రీతిచేత; కలిసియుండుట=కూడియుండుట; ఎన్నఁడో=ఏనాఁడో. అనుచున్=ఇట్లనుచు; భూవిభుండు=సుచంద్రభూపతి; ఆత్తచంద్రికాభిలాషానుగుంభితస్వాంతుఁడు.—ఆత్త=పొందఁబడిన, చంద్రికాభిలాష=చంద్రికావిషయమైన యనురాగముచేత, అనుగుంభిత=కూర్పఁబడిన, స్వాంతుఁడు = చిత్తముగలవాఁడు; అగుచున్; తాన్; తలపోయుచుండున్=చింతించుచుండును.

ఇచటఁ జింత యనువనంగదశావిశేషము గదితం బయ్యె, శ్లో "కేనోపాయేన సంసిద్ధ్యేత్కదా తేన సమాగమః । దూతీముఖేన కింవాచ్య మిత్యాద్యూహాస్తు చింతనమ్" అని తల్లక్షణంబు. ఇట "కదా వారాణస్యా మమరతటినీరోధసి వసన్। వసానః కౌపీనం శిరసి

నిదధానోఞ్జలిపుటమ్'' అనుచోట శాంతమునకువలె శృంగారరసమునకు ఎన్నఁడో అను పదములచే సూచిత మగుచింతాఖ్యవ్యభిచారిభావ మంగ మగుటంజేసి ప్రేయోలంకారమగును. ఇదియే భావాలంకార మనఁబడు.

చ. లలి మదిఁ జాల మించ నవ♦లా నవలాలితకంతుకల్యనా
విలగతిఁ బ్రోవ కున్కి దగ♦వే తగ వేమరు కౌఁగిలింతచేఁ
గలయక యున్నఁ దాళఁ గల♦నా కలనాద యటంచుఁ బల్కు ఘూ
తలపతి మారశారపవి♦తాపవితానము మేనఁ గూరఁగన్. 4

టీ. మదిన్=చిత్తమందు; లలి=ప్రేమము; చాలన్=మిక్కిలి; మించన్=అతిశయింపఁగా; నవలా=ఓతరుణీ! నవలాలితకంతుకల్యనావిలగతిన్.— నవ=నూతనమైన, లాలిత = ఆదరింపఁబడిన, కంతుకలి=సురతమందలి, అనావిలగతిన్ = అకలుషస్థితిచేత ; ప్రోవకున్కి=రక్షింపకుండుట; తగవే=తగవా? తగవుగాదనుట. తగన్=ఒప్పునట్లుగా; వేమరున్=సారెకు; కౌఁగిలింతచేన్=ఆలింగనముచే; కలయకయున్నన్ = కూడకయున్నయెడ; కలనాద=అవ్యక్తస్వరముగలదానా! తాళఁగలనా=ఓర్వఁగలనా? అటంచున్=అట్లనుచు; ఘూతలపతి=సుచంద్రుఁడు; మారశారపవితాపవితానము.—మార=మన్మథునియొక్క, శారపవి=వజ్రమువంటి శరసంఘముచేతనైన, తాపవితానము=తాపపరంపర; మేనన్=శరీరమందు; ఘూరఁగన్=ఘటిల్లఁగా; పల్కున్=వచించును.

సీ. అహిరోమలతికపొం♦దందినఁ గాని నొం
పఁగ రాదు మలయాగ♦మారుతములఁ
గనకాంగికౌఁగిలి♦ యొనసినఁ గాని పెం
పఁగ రాదు మధుపభా♦మారుతముల
ఘనవేణిఁ గూడి మిం♦చినఁ గాని రూపుమా
ల్పఁగ రాదు శశభృన్న♦వప్రకరముల
వనజారివదనఁ జే♦రినఁ గాని సిరు లడం
పఁగ రాదు వనసంభ♦వప్రకరముల

తే. ననుచు రాజీవనేత్రమో♦హంబు చాల
ననుచు రాజీవసాయకా♦నల్పభయము
మలయ గాహితచింతమైఁ♦గలఁగఁ జిత్త
మల యగాహితనిభుఁడు తా♦పాప్తి నడల. 5

టీ. అహిరోమలతికపొందు=సర్పతుల్యమగురోమలతికగల చంద్రికయొక్కసాంగత్యమును; అందినఁగాని=పొందిననేగాని; మలయాగమారుతములన్=మలయాచలసంబంధులగుగాడ్పులను; నొంపఁగరాదు=నొప్పించుటకలవిగాదు. అనఁగా చంద్రిక సర్పతుల్యమయిన

రోమావళి గలది గావున తత్సాంగత్యమున వాయువును గెలువ వచ్చు ననుట. కనకాంగికాఁగిలి=సంపెఁగనుబోలు నంగములుగలదానియొక్క యాలింగనమును; ఎనసినఁగాని=పొందినఁగాని; మధుపభామాయతములన్=ఆఁడుతుమ్మెదలయొక్క రొదలను; పెంపఁగరాదు=నశింపఁజేయుటకలవిగాదు. చంద్రిక చంపకాంగి గావున దానికాఁగిటఁ జేరినచో తేంట్లనడఁప వచ్చు ననుట. ఘనవేణిన్=ఘనమునుబోలు జడగలదానిని; కూడి=పొంది; మించినఁగాని=అతిశయించిననేకాని; శశభృన్నవప్రకరములన్=చంద్రుని నూతన ప్రకృష్టకిరణములను; రూపు దూర్పఁగరాదు = రూపుమాపనలవిగాదు. చంద్రిక జలదమువంటివేణి గలది గావున దాని సాంగత్యమునఁ జంద్రకిరణములఁ గప్ప వచ్చు ననుట. వనజారివదనన్ = చంద్రునిఁ బోలుమోముగలదానిని; చేరినన్ కాని = పొందిననేకాని; వనసంభవప్రకరములన్ = కమలములయొక్క సమూహములయందు; సిరులడంపఁగరాదు = కాంతులనడఁచుటకలవిగాదు. చంద్రిక చంద్రునివంటిమోము గలది గావున దానిఁజేరి కమలములసిరుల నడంప వచ్చు ననుట. అనుచున్=ఇట్లు వచించుచు; రాజీవనేత్రమోహంబు = చంద్రికయందలి యనురాగము; చాలన్=మిక్కిలి; ననుచు రాజీవసాయకానల్పభయము.—ననుచు=వృద్ధిఁబొందుచున్న, రాజీవసాయక=మరునివలననైన, అనల్పభయము=అధికమైనభీతి; మలయన్=ఉద్రేకింపఁగా; గాహితచింతమైన్=పొందఁబడినచింతచేత; చిత్తము=హృదయము; కలఁగన్=కలఁతపాఱఁగా: అలయగాహితనిభుఁడు=ఇంద్రతుల్యుఁడైన యానుచంద్రుఁడు; తాపాప్తిన్ = సంతాపప్రాప్తిచేత; అడలన్=తపింపఁగా. దీనికిఁ దనర్చెన్ అను నుత్తరపద్యస్థక్రియతో నన్వయము.

చ. నరపతిధైర్యభంగము ద◆నర్చె నవీనరతీశధాటిఁ గై
కరభసలీల చందన◆గచ్యుతమారుతపాళి చాంద్రదు
ష్కరభ సలీలకోకిలని◆కాయశుకవ్రజశారికానము
త్కరభసలీలసద్ధ్వనివి◆ధానము లత్తఱిఁ జిత్రవర్తనన్. 6

టీ. అత్తఱిన్=ఆసమయమున; చిత్రవర్తనన్=ఆశ్చర్యకరమగు రీతిచేత; నవీనరతీశధాటిన్=నూతనమైన మరునిజైత్రయాత్ర యందు; కైకరభసలీల.—కైక=కేకిసంబంధియగు, కేకిశబ్దముమీఁద సంబంధార్థమం దణ్ప్రత్యయము, రభసలీల=హర్షక్రియ; "రభసో వేగహర్షయోః । లీలావిలాసక్రియయోః" అని విశ్వము; చందననగచ్యుత మారుతపాళి.— చందననగ=మలయపర్వతమునుండి, చ్యుత=జాఱిన, వెడలినయనుట, మారుతపాళి = తెమ్మెరలగుంపు; చాంద్రదుష్కరభ=చంద్రుని సంబంధియగు ననివార్యమైనకాంతి; సలీలకోకిల నికాయశుకవ్రజశారికానముత్కర భసలీల సద్ధ్వనివిధానములు.— సలీల = విలాసముతోఁ గూడినవగు, కోకిలనికాయ=పికసముదయముయొక్కయు, శుకవ్రజ=చిలుకల గుంపుయొక్కయు, శారికానముత్కర=గోరువంకలసమూహముయొక్కయు, భసలీ=తుమ్మెదలయొక్కయు, లసత్=ఒప్పుచున్న, ధ్వనివిధానములు=ధ్వనియొనర్పుటలు; నరపతిధైర్యభంగము=రాజుధైర్యముడుగుటయు; తనర్చెన్=చేసెను.

రాజున కుదయించిన చంద్రికావిషయకమైనయనురాగము మలయానిలచంద్రికా కోకిలాలాపాది సహకారి కారణ సమవధానమున మిగుల నుద్దీపితమయ్యె ననుట. "తటస్థాశ్చన్ద్రికాధారా గృహచన్ద్రోదయా వపి। కోకిలాలాపమాకన్ద మన్దమారుత షట్పదాః। లతామణ్డప భూగేహదీర్ఘికా జలదారవాః। ప్రాసాదగర్భసంగీత క్రీడాద్రి సరిదాదయః॥" అని తటస్థోదీపన విభావములు గదితంబు లయ్యె. "ఉద్దీపనవిభావాస్తు రసముద్దీపయన్తి యే" అని యుద్దీపనవిభావలక్షణము. "విభావః కథ్యతే తత్ర రసోత్పాదన కారణమ్" అని విభావలక్షణములోనగునవి వెనుక సవిస్తరముగ వ్రాయంబడియె.

సీ. ఘనసింహగతికి స్రు♦క్కనిదిట్ట హంసవీ
క్షణదారకవ్రాత♦గతికి బెదరు
దనుజాస్త్రకీలి కో♦ర్చినమేటి పూర్ణిమా
క్షణదారమణహేతి♦జాతి కడలుఁ
గలిరవాళికిఁ గలం♦గని దంట కిసలభ
క్షణదారనిస్వన♦చ్ఛటకుఁ దెరలుఁ
దామిస్రశస్త్రిఁ గుం♦దనిసామి విరహిహృ
త్క్షణదారయుతమార♦శస్త్రి నొదుఁగు

తే. నఖలలేఖావగీర్ణన♦వాజిరాజ
తాజరారిధనుర్ముక్త♦వాజిరాజి
దోర్దత్త మయి నాట నలఁగని♦దొర యనలఁగు
రూత్కరము గాత్రసీమయం♦దొరయ నలఁగు. 7

టీ. ఘనసింహగతికిక్=ఘనమైనసింగముగమనమునకు; స్రుక్కనిదిట్ట=వెనుదీయనిధైర్యముగలవాఁడు; హంసవీక్షణదారకవ్రాతగతికిక్.—హంస=హంసలయొక్క, వీక్షణదారక=దృష్టిభేదకమగు, వ్రాత=సంఘములయొక్క, గతికిక్=గమనమునకు; బెదరుక్=వెఱచును. దనుజాస్త్రకీలికిక్=రాక్షసబాణవహ్నికి; ఓర్చినమేటి=సహించినయధిపుఁడు; పూర్ణిమాక్షణదారమణహేతిజాతికిక్.—పూర్ణిమాక్షణదారమణ=పున్నమచంద్రునియొక్క, హేతిజాతికిక్=కాంతిపుంజమునకు; అడలుక్=భయపడును. కలిరవాళికిక్=రణసంబంధియగు ధ్వనిపరంపరకు; కలంగనిదంట=కలఁతపాఱనిదిట్టతనముగవాఁడు; కిసలభక్షణదారనిస్వనచ్ఛటకుక్.—కిసలభక్షణదార=ఆఁడుకోయిలలయొక్క, నిస్వనచ్ఛటకుక్=నాదపరంపరకు; తెరలుక్=చలించును. తామిస్రశస్త్రిక్=తమిస్రాసురసంబంధియగుచురకత్తికి; కుందనిసామి=దుఃఖింపనిభూపతి; విరహిహృత్క్షణదారయుతమారశస్త్రిక్.—విరహిహృత్=విరహవంతులహృదయములయొక్క, క్షణ=ఉత్సవములను, ద=ఖండించెడు, అర=వేగముతో, యుత=కూడియున్న, మారశస్త్రిక్=మన్మథునిశస్త్రిచేత; ఒదుఁగుక్=తొలఁగును. అఖిలలేఖావగీర్ణనవాజిరాజితాజరారిధనుర్ముక్తనా

జిరాజి.—అఖిలలేఖ=సమస్తదేవతలచేత, అవగీర్ణ=పొగడఁబడిన, నవ=నూతనమైన, ఆజి=యుద్ధమందు, రాజిత=విలసిల్లినట్టి, అజరారి= రాక్షసులయొక్క, ధనుః=ధనుస్సులచేత, ముక్త=విడువఁబడిన, వాజిరాజి=శరపరంపర; తోడ్తన్=వెంటనె; మయిన్= శరీరమందు; నాటన్=నాటఁగా; నలఁగనిదొర=శ్రమపడనిరాజు ; అనలగురూత్కరము=వాయుసంఘము, అగ్ని వాయువువలనఁ బుట్టినట్లు శ్రుతిప్రసిద్ధమగుటవలన వాయు వనలగురు వని చెప్పఁబడియె; గాత్రసీమయందున్ = శరీరప్రదేశమందు ; ఒరయన్=ఒరసికొనఁగా; నలఁగున్=శ్రమపడును.

చ. నిరతము వ్రాయు నాహరిణ•నేత్రతలంబు నవామలాలస
స్ఫురణ విభుండు దృగ్యుగళ•మున్ గరమున్ గురులున్ మొగంబునన్
వెర దొరయింప నాహరిణ•నేత్రతలంబున వామలాలస
త్సరసిజమందిరాతనయ•శాంబరికాకృతమోహరేఖనాన్. 8

టీ. విభుండు=సుచంద్రుఁడు; ఆహరిణనేత్రతలంబునన్=మిగులశుభ్రమయినవస్త్రతలమందు; నవామలాలసస్ఫురణన్.—నవ=నూతనమయిన, అమల = స్వచ్ఛమయిన, అలసస్ఫురణన్=ఆలస్యస్ఫూర్తిచేత; నిరతము=ఎల్లప్పుడు; ఆహరిణనేత్రతలంబు=ఆచంద్రికయొక్క స్వరూపమును; "తలంస్వరూపాధరయోః" అని విశ్వము; దృగ్యుగళమున్=కన్నుఁగవయు;కరమున్=హస్తమును;కురులున్=వెండ్రుకలును; మొగంబునన్=ముఖమును; వెరదొరయింపన్=విరహదుఃఖము పుట్టింపఁగా; వామలాలసత్సరసిజమందిరాతనయశాంబరికాకృతమోహరేఖనాన్.—వామ=ప్రతికూలమైన;లాలసత్=మిగులఁబ్రకాశించుచున్న, సరసిజమందిరాతనయ=శ్రీపుత్త్రుఁడైన మమునియొక్క, శాంబరికా = మాయచేత, కృత = చేయఁబడిన, మోహరేఖనాన్=మోహపరంపరయనఁగా; నిరతము=ఎల్లప్పుడు; వ్రాయున్=లిఖించును.

అనఁగాఁగాలక్షేపార్థము ప్రియురాలినివ్రాయఁగాఁ, నదంగములు, కన్నులు కలువలనుబోలినవి కరములు చిగురులను బోలినవి కురులు తుమ్మెదలను బోలినవి ముఖము పద్మమునుబోలినది యగుటంజేసి, మదనమాయాప్రాతికూల్యముచేత భయావహములయ్యె ననుట.

చ. ఎనసినరాగసంపద న•రేశిత తా హితచంద్రికావధూ
తనురుచిఁ గాంచి మోహభృతిఁ • దాల్చిన నాఁటనుండి కీరభూ
రినినదభంగిఁ గుందు బళి•రే సితతాహితచంద్రికావధూ
తనిజధృతిన్ భ్రమించు మదిఁ • దార్కొనుచింతఁ గలంగు నెంతయున్. 9

టీ. నరేశిత=రాజు;ఎనసినరాగసంపదన్=పొందినరాగాతిశయముచేత; తాన్=తాను; హితచంద్రికావధూతనురుచిన్=హితమైనచంద్రికావధువుయొక్క తనురుచిని ; కాంచి=చూచి; మోహభృతిన్ =మోహపరిపోషణమును ; తాల్చిననాఁటనుండి=వహించినప్పటినుండి; కీరభూరినినదభంగిన్.—కీర=శుకములయొక్క, భూరి=అధికమయిన, నినదభంగిన్=ధ్వనిప్రకా

రముచేత; కుందుఁన్ = దుఃఖించును. బళిరే = ఆశ్చర్యము. సితతాహితచంద్రికావఘాతనిజధృతిన్.—సితతా = శుభ్రత్వముచేత, హిత = మనోజ్ఞమైన, చంద్రికా=వెన్నెలచేత, అవఘాత=పోఁగొట్టఁబడిన, నిజధృతిన్=స్వధైర్యముచేత; భ్రమించున్=తిరుగును. మతిన్=చిత్తమును; తారొక్కను చింతన్=పొందునట్టి చింతచేత; ఎంతయున్=మిక్కిలి; కలంగున్ = కలఁతపడును.

అనఁగా సుచంద్రుఁడు చంద్రికయందలి యనురాగము వాల్చిననాటనుండి శుకధ్వనులు మొదలగువానికిఁ గుందుచుండు ననుట.

సీ. తనువేల తావకో◆దార స్తనవసుధా, ధరపాళిఁ గౌఁగిటఁ◆ దార్పకున్న
శ్రుతు లేల భవదుదం◆చితగాననవసుధా, ద్వీపికోర్మి రుతముల్◆ వినక యున్నఁ
గనుదోయి యేల నీ◆గాత్రాంచనవసుధా, లంధల్యవిభవముల్◆గాంచ కున్న
ఘ్రాణ మేల త్వదాస్య◆రాకార్జునవసుధా, మకసుగంధశ్రేణి◆ మరగకున్న

తే. రసన యిది యేల నీయోష్ఠ◆రమ్య మధుర
సోత్కరము వేడ్కఁ గ్రోలక ◆ యున్న మధుర
వాణి యని పల్కుఁ బతి యాత్మ◆ వఱల మధుర
మాధిపసుతోత్థతాపజా◆తాసమధుర. 10

టీ. పతి=భూపతినయగుసుచంద్రుఁడు; మధురవాణి=తీయనిపలుకులుగలదానా! తావకోదార స్తనవసుధాధరపాళిన్.—తావక=నీసంబంధియగు, ఉదార=ఉత్కృష్టములగు, స్తనవసుధాధర=గిరులవంటి స్తనములయొక్క, పాళిన్ ప్రదేశమును; కౌఁగిటన్ = భుజాంతరమందు; తార్పకున్నన్=చేయకున్నయెడ; తనువేల=శరీరమేల ? భవదుదంచితగానన వసుధాద్వీపికోర్మిరుతముల్=నవామృతనదీతరంగ ధ్వనులనుబోలిన నీయుదంచితగానములను; భవచ్ఛబ్దముసర్వనామముగాన "సర్వనామ్నో వృత్తిమాత్రే పుంవద్భావః" అని పుంవద్భావము, ద్వీపికయనుచోట ద్వీపశబ్దముపై ఠన్ప్రత్యయము ఇకాదేశము; వినకయున్నన్=ఆకర్ణింపనియెడల; శ్రుతులేల=శ్రోత్రములేల ? నీగాత్రాంచనవసుధాలంధల్యవిభవముల్=సువర్ణప్రకాశ విభవములవంటి నీగాత్రముయొక్క యొప్పిదములను; కాంచకున్నన్=అవలోకింపకున్నయెడల; కనుదోయియేల = నేత్రయుగ్మ మెందుకు? త్వదాస్యరాకార్జునవసుధామకసుగంధశ్రేణిన్.—త్వదాస్యరాకార్జునవసుధామక = రాకయందలిశుభ్రకిరణములకాశ్రయమగు చంద్రునిఁబోలు నీముఖముయొక్క, సుగంధశ్రేణిన్ = పరిమళపరంపరను ; మరగకున్నన్=పరిచయము చేయకున్నయెడ; ఘ్రాణమేల = నాసికయేల? నీయోష్ఠరమ్యమధుర సోత్కరము=మధురసముయొక్క రాశిని బోలునీయధరమును ; వేడ్కన్ = సంతోషముచేత; క్రోలకయున్నన్=పానముఁ జేయకున్నయెడల; రసనయిదియేల = ఈనాలుకయేల? మధురమాధిపసుతోత్థతాపజాతాసమధుర.—మధురమాధిపసుత=వసంతమదనులవలన, ఉత్థ=పుట్టిన, తాపజా

త= సంతాపపుంజముయొక్క, అసమధుర=సాటిలేనిభారము; ఆత్మన్=చిత్తమందు; పఱలన్=ఒప్పఁగా; అనిపలుకన్=పైఁజెప్పిన విధముగ వచించును.

చ. అలయవిరాజమానకుచ ♦ నాయవనీపతి చిత్తవీథిలో
నలయవిరాజమానరతి ♦ నంది దలంపఁగ నొందు మేనునం
బులక లుషంబునన్ మధువుఁ ♦ బోలెఁ బరిస్ఫుటపద్మసీమ నం
బు లకలుషంబు లెప్పుడును ♦ బొల్పుగ నుబ్బు విలోచనంబులన్. 11

టీ. ఆయవనీపతి=ఆసుచంద్రుఁడు ; చిత్తవీథిలోన్ = హృదయదేశమందు ; అలయవిరాజమానరతిన్.—అలయ=నాశరహితమై, విరాజమాన=ఒప్పుచున్న, రతిన్ = ఆసక్తిని ; అంది=పొంది; అలయవిరాజమానకుచన్=పర్వతములవలెనొప్పుచున్నకుచములుగలయాచంద్రికను; తలంపఁగన్=స్మరింపఁగా; మేనునన్=దేహమందు; పులకలు=రోమాంచములు; ఒందున్=కలుగును.విలోచనంబులన్=నేత్రములయందు; ఉషంబునన్=ఉషఃకాలమందు; పరిస్ఫుటపద్మసీమన్=వికచకమలస్థలియందు;మధువుఁబోలెన్=మకరందమువలె;అకలుషంబులు=నిర్మలములగు; అంబులు=అశ్రువులు;ఎప్పుడున్=ఎల్లపుడు;పొల్పుగన్=ఒప్పుగా;ఉబ్బున్=అతిశయించును.

ఆరాజు చంద్రికను అనురాగముచేత స్మరింపఁగా దేహమందుఁ బులకలు లోచనములం దశ్రువులు గలిగె ననుట.

మ. వరపాంచాలకుమారికాతిలకభ♦వ్యధ్యానసంపత్తిచే
నరుదారన్ భరియించె హృత్సరణిలో ♦ నశ్శ్యామలాభాయతిన్
హరిసంభేది తదీర్ష్యనో కనియె మే ♦ నశ్శ్యామలాభాయతిన్
సరసీజాస్త్రుఁడు మున్నె చేకొన నదా♦నశ్శ్యామలాభాయతిన్. 12

టీ. వరపాంచాలకుమారికాతిలకభవ్యధ్యానసంపత్తిచేన్.—వర = శ్రేష్ఠమగు, పాంచాలకుమారికాతిలక=చంద్రికయొక్క, భవ్యధ్యానసంపత్తిచేన్ = మనోజ్ఞమగుధ్యానసమృద్ధిచేత; హరిసంభేది=సుచంద్రుఁడు; హృత్సరణిలోన్=చిత్తవీథియందు ; అశ్శ్యామలాభాయతిన్.—అశ్శ్యామ=అతరుణిరొయుక్క, లాభ = ప్రాప్తియొక్క, ఆయతిన్ = ఉత్తరకాలమును; అరుదారన్=ఆశ్చర్యముకలుగునట్లు; భరియించెన్=భరించెను. తదీర్ష్యనో.—తత్=ఆహృదయమందలి, ఈర్ష్యనో=అసూయచేతనో; సరసీజాస్త్రుఁడు=మన్మథుఁడు; మున్నె=అంతకుపూర్వమె; అదానశ్శ్యామలాభాయతిన్.—అదాన=అమ్లానమగు, నూతనమగుననుట, శ్యామ=ప్రేంకణపుపువ్వను, శ్యామాశబ్దముమీఁద వికారార్థమందణ్ప్రత్యయము వచ్చి శ్యామ అని అయినది. "పుష్పమూలేషుబహులం" అని బహుళగ్రహణముచేత ప్రత్యయమునకు లుక్కు లేదు. ల=గ్రహించెడు, ఆభా=అతి సామర్థ్యమందలి "భా ప్రభా వేచ తేజసి" అని విశ్వము, యతిన్=నియమమును; చేకొనన్ = గ్రహింపఁగా; మేను = సుచంద్రునిదే

హము; అశ్యామలాభాయతిన్.—అశ్యామల=శుభ్రమయిన, ఆభా = కాంతియొక్క, ఆయతిన్=సాంగత్యమును; కనియెన్=పొందెను.

అనఁగా సుచంద్రునిచిత్తము అశ్యామలాభాయతిని ధరింపఁగా తదీక్షచేనతనిమేను అశ్యామలాభాయతిని బొందిన దనియు మఱి యంతకన్న మున్నె యశ్యామలాభాయతిని బొందెననియు భావము.

చ. అలనరపాలచంద్రుహృద♦యాంబురుహం బితరప్రవృత్తిచేఁ
జెలఁగక యుండ నూన్చి చెలిఁ♦ జేర్చెఁ గడున్ సితపక్షరాజమం
డలమధుపాళికాభ్రచర♦నాథమరుత్సితపక్షరాజమం
డలమధుపాళికల్ గొలువ♦నవ్యభవోన్నతిఁ గంతుఁ డయ్యెడన్. 13

టీ. అయ్యెడన్=ఆసమయమందు; కంతుఁడు = స్మరుఁడు; సితపక్షరాజమండలమధుపాళికాభ్రచరనాథమరుత్సితపక్షరాజమండలమధుపాళికల్.—సితపక్షరాజమండల = శుక్లపక్షమందలిచంద్రమండలము, మధు=వసంతము, పాళికా=గుంపులైన, అభ్రచరనాథ=పక్షిశ్రేష్ఠములు, శుకపికశారికాదులనుట, మరుత్ = మలయమారుతము, సితపక్షరాజమండల= రాజహంసలగుంపు, మధుపాళికల్ = తుమ్మెదలబారులు; నవ్యభవోన్నతిన్ = క్రొత్తపుట్టువు యొక్కయతిశయముచేత; కొలువన్= సేవించుచుండఁగా ; అలనరపాలచంద్రుహృదయాంబురుహంబు = ఆసుచంద్రునియొక్కహృదయకమలము ; ఇతరప్రవృత్తిచేన్=విషయాంతరవ్యాపారముచేత; చెలఁగకయుండన్ = ఒప్పకయుండునట్లు ; ఊన్చి=చేసి; చెలిన్=చంద్రికను; కడున్=మిక్కిలి; చేర్చెన్=ఆహృదయాంబురుహమందుంచెను.

అనఁగా మలయానిలచంద్ర శుకపిక భ్రమర ఝంకారాదులచే ఆరాజుచిత్తము విషయాంతరవ్యాపార ముడిగి చంద్రికయందె నిలిచి యుండె ననుట. ఈకార్యము స్మరసామర్థ్యలభ్య మనుట కవిసమయ పరిపాటీసిద్ధము. ఇం దరతి యనుస్మరావస్థపరిపూర్తి గదితంబయ్యె. అరతి యనఁగా విషయాంతర పరిత్యాగ పూర్వకతదేకాయత్తచిత్తత యని వ్రాయఁబడెను.

తే. పతిహృదయ మిట్లు నిజశౌర్య♦పటిమ నంబు
నామకచఁ జేర్చి యొనయించె♦నలి మనం బు
రద్విషద్వైరి శితశర♦ప్రథిమ నంబు
జహితకులుపైఁ దదేణలో♦చనమనంబు. 14

టీ. పురద్విషద్వైరి=స్మరుఁడు; నిజశౌర్యపటిమన్=తనయొక్క శౌర్యపటిమచేత; ఇట్లు=ఈప్రకారము; పతిహృదయము=సుచంద్రుని మనస్సును; అంబునామకచన్=కురువేరువంటి వెండ్రుకలుగల చంద్రికను; అంబు నామ మనఁగా కురువేర మనుటకు "ఉదీచ్యకేశాంబు నామచ" అని వెనుక వ్రాయఁబడె. చేర్చి=పొందించి; శితశరప్రథిమన్ = తీక్ష్ణములైన

బాణములయొక్క అతిశయముచేత; తదేణలోచనమనంబు=ఆచంద్రికమనస్సును ; అంబుజహితకులుపైన్=సూర్యవంశ్యుఁడైన సుచంద్రునిపై; నలిన్=మిక్కిలి; మనన్=వర్తించునట్లు; ఘనయించెన్=పొందించెను.

చ. అలవిరివింటిదంట తదిలాధిపమోహము నెమ్మనంబునన్
గలవలమాన భేదిమణికైశికఁ గెందలిరాకుముల్కులన్
గలవఁబ మాన నూన్చె నలుకన్ నవసంగరముద్ర నిల్చి మం
గలవలమానమీనతిలకధ్వజశోభిమరుద్రథంబునన్. 15

టీ. అలవిరివింటిదంట=దిట్టతనముగల యాకుసుమసాయకుండు; తదిలాధిపమోహము=ఆసుచంద్రునియందలియనురాగము; నెమ్మనంబునన్ = మంచిమనస్సునందు; కలవలమానభేదిమణికైశికన్.—కల=కలిగినట్టి, వలమానభేదిమణి=ఇంద్రనీలమణులవంటి, కైశికన్=కొప్పుగలచంద్రికను; మంగలవలమాన మీనతిలక ధ్వజశోభిమరుద్రథంబునన్.—మంగల=శుభావహమైన, వలమాన=బెళఁకుచున్న, మీనతిలక=మత్స్యశ్రేష్ఠమనెడు, ధ్వజ=పతాకచేత, శోభి=ప్రకాశించుచున్న, మరుద్రథంబునన్=మందమారుతమనెడు రథముమీఁద ; నవసంగరముద్రన్=నూతనమైన యుద్ధస్థితిచేత; నిల్చి=ఉండి; అల్కన్=కోపముచేత; కెందలి రాకుముల్కులన్=ఎఱ్ఱని పల్లవములనెడు బాణములచేత; కలవలము=అకులతను; అనన్=పొందునట్లు; ఊన్చెన్=చేసెను.

సుచంద్రునిపై మోహము దాల్చినచంద్రికకు నవపల్లవాద్యుద్దీపకదర్శనమువలన నాకులత గలిగె ననుట.

మ. జననాథస్మరచింతనాపరవశస్వాంతంబునం బొల్చుకో
కనదామోదరయంబుచేఁ గమిచి పొంగం జేసెఁ దాపంబుఁ జ
క్కన దామోదరసూనుఘోటపటలీగాఢధ్వనిశ్రేణి యా
కనదామోదరసాప్తభృంగకులఝుంకారంబు లప్పట్టునన్. 16

టీ. అప్పట్టునన్=ఆసమయమందు; దామోదరసూనుఘోటపటలీగాఢధ్వనిశ్రేణి.—దామోదరసూను=మరునికి, ఘోట = అశ్వములగుచిలుకలయొక్క, పటలీ = గుంపుయొక్క, గాఢధ్వనిశ్రేణి=గాఢమైనధ్వనిపరంపర;ఆకనదామోదరసాప్తభృంగకులఝుంకారంబులు.—ఆకనత్=మిగులఁబ్రకాశించుచున్న, ఆమోదరస=సంతోషరసమును, ఆప్త=పొందిన, భృంగకుల=తుమ్మెదలగుంపుయొక్క, ఝుంకారంబులు=మ్రోఁతలు; జననాథస్మరచింతనాపరవశస్వాంతంబునన్.—జననాథస్మర=మరునిఁబోలుసుచంద్రునియొక్క, చింతనా=ధ్యానమునకు, పరవశ=ఆయత్తమైన, స్వాంతంబునన్=మనస్సుచేత ; పొల్చుకోకనదామోదన్=ఒప్పుచున్నచంద్రికను, కోకనదము లనఁగా రక్తోత్పలములు వానియామోదమువంటియామోదము గలది కోకనదామోద; రయంబుచేన్=వేగముచేత; కమిచి=చుట్టుకొని ; తాపంబున్ = సంతాపమును; చక్కనన్=బాగుగను; పొంగంజేసెన్=ఉప్పొంగునట్లుచేసెను.

శుకకూజిత భ్రమరఝుంకారాదులచేఁ జంద్రికసంతాపము మిక్కిలి యుప్పొంగినచుట.

సీ. వినఁ గొంకు శుకపిక♦ధ్వని మనోభవ మాన
రాగకాతనుబలా♦రభటి యనుచు
నంట భీతిలుఁ బల్ల♦వాళి హృద్భవమాన
నీయధామశిఖాని♦కాయ మనుచు
నెనయ నోడు విలాస♦వనవాటి భవమాన
హారభూరిదుర్గచ♦యం బ టంచుఁ
గన స్రుక్కు నవకోర♦కచ్ఛటాభ వమాన
కారికందర్పాసి♦ధార యనుచు
తే. నిటులు వలవంతఁ గుందు నా♦నృపతిరూప
ఘనవిభవ మాన రానియు♦త్కలికఁ గాంచి
నట్టితటి నుండి క్షణదోద♦యావనీశ్వ
రాత్మభవ మానసంబు తా♦పార్చిఁ గలఁగ. 17

టీ. క్షణదోదయావనీశ్వరాత్మభవ.—క్షణదోదయరాజపుత్త్రికయగుచంద్రిక;ఆనృపతిరూపఘనవిభవము=ఆసుచంద్రునియొక్క సౌందర్యాతిశయమును;ఆనరానియుత్కలికన్=పట్టఁజాలనిసంతసముచేత; కాంచినట్టితటినుండి=చూచినసమయముననుండి; మానసంబు=చిత్తము; తాపార్చిన్=సంతాపజ్వాలచేత; కలఁగన్ = కలఁతపాఱఁగా ; శుకపికధ్వనిన్=చిలుకలయొక్కయు కోయిలలయొక్కయుపలుకును; మనోభవమానరాగకాతనుబలారభటి.—మనోభవ=మనస్సునందుఁబుట్టిన, మానరాగక=గర్వమాత్సర్యములుగల, అతనుబల=మన్మథసైన్యముయొక్క, ఆరభటియంచున్ = ధ్వనియనుచు; వినన్=వినుటకు ; కొంకున్=కొంకును. పల్లవాళిన్=చిగురుటాకులగుంపును ; హృద్భవమాననీయధామశిఖానికాయమనుచున్.—హృద్భవ=మరునియొక్క, మాననీయ=పూజనీయమగు, ధామ=ప్రతాపముయొక్క, శిఖా=జ్వాలలయొక్క, నికాయమనుచున్=గుంపనుచు; అంటన్=ముట్టుటకు;భీతిలున్=వెఱచును. ప్రతాపమెఱ్ఱని దనుట కవిసమయసిద్ధము. విలాసవనవాటిన్ = ఉద్యానవనవీథిని; భవమానహారభూరిదుర్గచయంబు అటంచున్.—భవమానహర=కామునియొక్క, భూరి=అధికమగు, దుర్గచయంబటంచున్=దుర్గములయొక్కనిచయమనుచు ; ఎనయన్ = పొందుటకు; ఓడున్=వెనుదీయును. నవకోరకచ్ఛటాభన్ = క్రొత్తమొగ్గల గుంపులయొక్కకాంతిని; వమానకారిదంకర్పాసిధార.—వమానకారి=అవమానముచేసెడు, అవశబ్దాకారమిటలోపించినది, కందర్ప=మరునియొక్క, అసిధార=ఖడ్గముయొక్కఅంచు; అనుచున్; కనన్=చూచుటకు; స్రుక్కున్=భయపడును. ఇటులు=ఈప్రకారముగ; వలవంతన్ = మన్మథవ్యథచేత; కుందున్=దుఃఖించును.

ఇట సంతాపాతిశయముచే శుకధ్వనిమొదలగువాని యందరతి వ్యంజ్యమానమగును.

చ. ఉదుటున మోహనాదికమహోగ్రతరాస్త్రనిరూఢిఁ దత్తమి
స్రదనుజభేదిపై నెడయఁ జాలనికోర్కె నా నవీనతో
యదకచ కొందఁ జేయ నభవారి శయమ్ములఁ గంకణావళుల్
వదలెఁ దొలంకెఁ బో నయనవారిశయమ్ములఁ గంకణావళుల్. 18

టీ. అభవారి=మరుఁడు; ఆనవీనతోయదకచకున్ = నవజలదమునుబోలు వెండ్రుకలు గలయాచంద్రికకు; ఉదుటునన్ = ఔద్ధత్యముచేత; మోహనాదికమహోగ్రతరాస్త్రనిరూఢిన్.— మోహనాదిక=మోహనము మొదలుగాఁగల, మహోగ్రతర=మిగులభయంకరములగు, అస్త్ర=బాణములయొక్క, నిరూఢిన్=ప్రసిద్ధిచేత; తత్తమిస్రదనుజభేదిపైన్ = తమిస్రాసురవిరోధియగు నా సుచంద్రునిమీఁద; ఎడయఁజాలనికోరికన్=తొలఁగనివాంఛను; ఒందఁజేయన్=పొందఁజేయఁగా; శయమ్ములన్=హస్తములయందు; కంకణావళుల్ =వలయములగుంపులు; వదలెన్ = జాఱెను. నయనవారిశయమ్ములన్=వారిజములనుబోలుకన్నులయందు; కంకణావళుల్=జలబిందువులగుంపులు; తొలంకెఁబో=చిందెనుబో.

కార్శ్యముచేతఁ గరకంకణములు దైన్యముచే నయనాశ్రువులు చంద్రికకు జాఱెనట. కార్శ్యమనునది యనంగదశావిశేషము. దైన్యము తత్సంచారియగును. అశ్రువు దైన్యానుభావరూప మగుసాత్త్వికభావము. విరహోత్కర్షము దీనియందు గదితం బయ్యె.

చ. కనుదోవదోయి నిర్నిమిషగౌరవ మందఁగ నబ్బురంబుతో
ననుపమరక్తితోఁ బ్రియమహాఫలకాలసమానరూపమున్
గనుఁగొను నెప్పు డెప్పు డల కామిని యాతఱి యెల్ల నెన్నఁగా
ననువుగఁ బొల్చెఁ బూనియ మహాఫలకాలసమానరూపమున్. 19

టీ. అలకామిని = ఆచంద్రిక; ప్రియమహాఫలకాలసమానరూపమున్.—ప్రియ = ప్రియుఁడగుసుచంద్రునియొక్క, మహాఫలక=గొప్పపలకయందు, ఆలసమాన=మిగులఁబ్రకాశించుచున్న, రూపమున్ = స్వరూపమును; అబ్బురంబుతోన్ = ఆశ్చర్యముతోను; అనుపమరక్తితోన్ = సాటిలేనియనురాగముతోను; కనుదోవదోయి=కలువలఁబోలుకన్దోయి; నిర్నిమేషగౌరవము=ఱెప్పపాటులేమియొక్కయాధిక్యమును; అందఁగన్=పొందునట్లుగా; ఎప్పుడెప్పుడు=ఏయేసమయమందు; కనుఁగొనున్ = చూచునో; ఆతఱియెల్లన్=ఆసమయమంతయు; ఎన్నఁగాన్=పరికింపఁగా; మహాఫలకాలసమానరూపమున్.—మహత్ = గొప్పదియైన, ఫలకాల=ప్రియసమాగమకాలమునకు, సమానరూపమున్=తుల్యరూపమును; పూనియ=పొందియే; అనువుగన్=అనుకూలముగా; పొల్చెన్=ఒప్పెను.

ఆచంద్రిక కాలక్షేపార్థము పలకయందు వ్రాయఁబడినతనప్రియునిరూపము నెప్పుడెప్పు డనురాగాతిశయమున నవలోకించునో అపుడు ప్రత్యక్షప్రియసంగమువలె నామెకు భాసిల్లు నని భావము.

సీ. కన నింపుఁ గూర్చుచక్కనిమోమువలిమిన్న
మన సార ముద్దు గైకొనఁగఁ దివురు

నేల వే లనుచుఁ గ♦పోలలవలి మిన్న
కయ పునర్భవపాళిఁ ♦ గరము మీటుఁ
గలికి చన్గుబ్బలి♦కవ యాన వలిమిన్న
వాసక్తిఁ గౌఁగిటఁ ♦ నందఁ జూచు
లలితాధరోష్ఠప♦ల్లవసుధావలి మి న్న
లము సమ్మదమునఁ గ్రోఁ♦లంగఁ దలఁచుఁ
తే. జెలఁగి యాశీతకరకళా♦జేతృఫాల
ఫలక రమణీయమోహసం♦భ్రాంత యగుచు
ఫలకరమణీయరూపంబు ♦ ప్రౌఢి వ్రాసి
యంబురుహబాణకేళికా♦శాప్తి నపుడు. 20

టీ. అపుడు=ఆసమయమున ; ఆశీతకరకలాజేతృఫాలఫలక = చంద్రకలను గెలిచెడు నుదురుగలయాచంద్రిక; రమణీయమోహసంభ్రాంత= మనోజ్ఞమగు మోహము చేతసంభ్రమించినది; అగుచున్; ఫలకరమణీయరూపంబు.—ఫలక=పలకయందు, రమణీయ=మనోజ్ఞమగు, రూపంబు=ప్రియస్వరూపమును; ప్రౌఢిన్ = నేర్పుచేత ; వ్రాసి=లిఖించి ; అంబురుహబాణకేళికాశాప్తిన్.—అంబురుహబాణ=మన్మథునియొక్క, కేళికా=క్రీడయందలి, ఆశాప్తిన్= ఆశాప్రాప్తిచేత; చెలఁగి=ఒప్పి; కవన్=దాచుటకు ; ఇంపుగన్=సొంపుగ ; కూర్పుచక్కని మోమువలిమిన్నన్ = ఘటిల్లఁజేయునంద మైనముఖచంద్రుని ; మనసారన్ = ముచ్చటదీరునట్లుగా; ముద్దుగైకొనఁగన్ = ముద్దుపెట్టుకొనుటకు; తివురున్ = ప్రయత్నించును. ఏలవేలనుచున్=ఎందుకురక్షింపవనుచు; కపోలలవలిన్ = తమలపాకువంటి చెక్కిలిని ; మిన్నకయ= ఊరకయే; పునర్భవపాళిన్=నఖరాజిచేత; కరము=మిక్కిలి; మీటున్=గీఱును. కలికిచన్గుబ్బలికవ.—కలికి=అందమయిన,చన్గుబ్బలి=పర్వతములఁబోలు స్తనములయొక్క, కవ=యుగ్మము; ఆనన్ = ఒరయునట్లు; బలిమిన్ = బలాత్కారముచేత; నవాసక్తిన్ = అపూర్వానురాగముచేత; కౌఁగిటన్ = భుజాంతరమందు ; అందఁజూచున్ = పొందఁజూచును. లలితాధరోష్ఠపల్లవసుధావలి.—లలిత=మనోజ్ఞమయిన, అధరోష్ఠపల్లవ = పల్లవమునుబోలునధరోష్ఠముయొక్క, సుధావలి=అమృతపరంపరను ; మిన్నలముసమ్మదమునన్.—మిన్నలము=ఆకాశమునంటునట్టి, అధికమైనట్టియనుట, సమ్మదమునన్=సంతసముచేత; క్రోలంగన్=పానముఁజేయుటకు; తలఁచున్=తలంచును.

పూర్వపద్యోక్తమైన సాక్షాత్సంగమవద్భావనను మిందు వివరింపఁబడిరెు.

చ. చలనముఁ బొంద సాగెఁ జెలి♦స్వాంత మరాళమరాళవృత్తికిన్
విలయకృశానుహేతితుల♦నీయ నిశాతనిశాతపాళికిన్
ఫలనిభవాయుకీర్ణమధు♦పాదపరాగపరాగపాళికిన్
లలితరసాలసంగతక♦లస్వనవీనవీనగీతికిన్. 21

టీ. చెలిస్వాంతము = చంద్రికయొక్క మనస్సు; అరాళమరాళవృత్తికిన్ = కుటిలమైన హంసవర్తనమునకు; విలయకృశానుహేతితులనీయ నిశాతనిశాతపాళికిన్.—విలయకృశాను=ప్రళయకాలాగ్నియొక్క, హేతి=జ్వాలలతోడ, తులనీయ=పోల్పఁదగిన, నిశాత=తీక్ష్ణమైన, నిశాతప=వెన్నెలలయొక్క, ఆళికిన్=సమూహమునకు; ఫలనిభవాయుకీర్ణమధుపాదపరాగపరాగపాళికిన్.—ఫలనిభ=బాణపుములుకులకు సరియైన, వాయు=దక్షిణమారుతముచే, కీర్ణ=చెదరినట్టి, మధుపాదప=ఇప్పచెట్లయొక్క, రాగ=దాడిమములయొక్క, పరాగ=పుష్పాదులయొక్క, పాళికిన్=గుంపునకు; లలితరసాలసంగతకలస్వనవీనవవీన గీతికిన్.—లలిత=మనోజ్ఞములగు, రసాల=తీయమావులయందు, సంగత = సంబంధించినట్టి, కలస్వన=అవ్యక్త మధురధ్వనులుగల కోకిలములు మొదలుగాఁగల, వీన=పక్షిశ్రేష్ఠములయొక్క, నవీన=నూతనమగు, గీతికిన్=గానమునకు; చలనముఁబొందన్=చాంచల్యముపొందుటకు; సాగెన్=ఆరంభించెను.

ఇట నుద్వేగ మనుస్మరదశ గదితం బగుచు. "మానసః కంప ఉద్వేగః కథిత స్తత్ర విక్రియాః। చిత్తసంతాపనిశ్వాసౌ ద్వేషః శయ్యాసనాదిషు। స్తమ్భచిన్తాశ్రువైవర్ణ్య దీనత్వాదయ ఈరితాః" అని తల్లక్షణ తత్కార్యంబులు తెలియవలయు.

మ. జనరాట్కన్య స్వసంగతి న్మనుమహాఃచక్రాంగనాళీకలో
చన పొందున్ నిజజీవబంధురతిరాఃట్చక్రాంగనాళీకయో
జనమున్ నిర్మలభాస్వదాప్తమతిమఃచ్చక్రాంగనాళీకన
ద్ఘనసంసర్గము నొంద లేదు గ సుచంఃద్రవ్యక్త లోభంబునన్. 22

టీ. జనరాట్కన్య=రాజపుత్త్రియగుచంద్రిక; స్వసంగతిన్ = తనసాంగత్యముచేత, తనమంచినడకచేతననితోఁచును; మనుమహాచక్రాంగనాళీకలోచనపొందున్ —మను = బ్రతుకుచున్న, మహత్ = అధికమైన, చక్రాంగ=హంసలయొక్క, నాళీకలోచన=పద్మనయనలయొక్క, హంసస్త్రీలయొక్క యనుట, పొందున్=సాంగత్యమును; నిజజీవబంధురతిరాట్చక్రాంగనాళీకయోజనమున్.— నిజ = తనయొక్క, జీవబంధు=ప్రాణవాయువులకుఁ జుట్టమగు, ప్రాణస్నేహితుఁడగుననితోఁచును, రతిరాట్చక్రాంగ=రతిపతిరథమగు మందమారుతునియొక్క, నాళీక=సత్యమైన, యోజనమున్=సంబంధమును; నిర్మలభాస్వదాప్తమతిమచ్చక్రాంగనాళీక నద్ఘనసంసర్గమున్.—నిర్మల=నిర్మలుఁడైన, భాస్వత్=సూర్యునికి, ఆప్త=పొందిన, మతిమత్=బుద్ధిగలిగిన,నిర్మలమై, భాస్వత్=ఒప్పుచున్న, ఆప్తమతిమత్=హితబుద్ధిగల, చక్రాంగనా = ఆఁడుజక్కవలయొక్క, కనత్=ఒప్పుచున్న, ఘనసంసర్గమున్=గొప్పసంబంధమును; సుచంద్రవ్యక్తలోభంబునన్=సుచంద్రునియందు వ్యక్తమైన ఆసక్తిచేత, మంచి బంగారమందు వ్యక్తమైన యాసక్తిచేతననియర్థాంతరముతోఁచు; ఒంద లేదుగ=పొందదుగదా!

ధనాశ గలవా రాప్తులను వదలునట్లు, చంద్రిక సుచంద్రునిమీఁది యనురాగముచే, స్వసంగత్యాదులుగలవైనను హంసప్రభృతులను వదలె ననుట.

సీ. కొమిరె యాయాశుకూటమి గోరుఁ బో యాత్మ
కరవాలశిఖిహేతిఁ గంతుఁ డేఁచ
నువిద యాఘనునిపొం దూహించుఁ బో చైత్రి
కరవాలపనసూచి గాఁడి పాఱఁ
దెలివ యాకనకమూ ర్తిఁ దలంచుఁ బో మధు
కరవాలకచ లెల్లఁ గలఁగఁ జేయ
మగువ యాభోగిపైఁ మన ముంచుఁ బో సుదు
ష్కరవాలపవనంబు గాసి వెట్ట
తే. నినుని వినుతించుఁ బో మదిఁ గనలి నారి
క నలినారిమరీచిసంఘాత మలమ
నారమణి నిత్య మిటులు హృ త్సారసంబు
సారసంబుద్ధతాపసం సక్తి నెనయు. 23

టీ. కంతుఁడు=మరుఁడు; ఆత్మకరవాలశిఖిహేతిన్.—ఆత్మ=తనయొక్క, కరవాల=ఖడ్గమనెడు, శిఖి=అగ్నియొక్క, హేతిన్=జ్వాలచేత; ఏఁచన్=బాధింపఁగా; కొమిరె=చంద్రిక; ఆయాశుకూటమిన్=ఆసుచంద్రునియొక్క సంగమమును; కోరుఁబో = కాంక్షించును బో, ప్రసిద్ధుండగు శివునియొక్క సాంగత్యమును గోరునని యర్థాంతరము దోఁచును. శివుఁడు స్మరహరుండు గావున నతనిసాంగత్యమున స్మరబాధ శమించు నని యతనిసంగతిని గోరు ననుట. చైత్రికరవాలపనసూచి.— చైత్రికరవ = చైత్రమాసమందుఁ బుట్టినధ్వనిగల కోయిలలయొక్క, ఆలపన=ధ్వనియనెడు, సూచి=సూది; గాఁడిపాఱన్=తూఁటిపాఱఁగా; ఉవిద=చంద్రిక; ఆఘనునిపొందున్=ఆసుచంద్రుని సంగమును; మేఘముయొక్క సంగమునని యర్థాంతరముతోఁచును; ఊహించుఁబో=ఆలోచించునుబో, అనఁగా మేఘకాలమందు పికములు ధ్వని సేయ వని కవిసమయము గావున మేఘసాంగత్యముచేత పికకూజితజనితమైన బాధను శమింపఁ జేయ వచ్చు నని ఘనునిపొం దూహించె ననుట. సుచంద్రుని పొందువలనఁ దద్బాధోపశమము సహజము. మధుకరవాలకచలు.—మధుకర=తుమ్మెదలయొక్క, వాలకచలు=వాలమనఁగా కురువేరు, దానింబోలు వెండ్రుకలుగలవారు వాలకచలు, స్త్రీలు, ఆఁడుతుమ్మెద లనుట, "వాలంహ్రీబేరబర్హిష్ఠో దీచ్యకేశాంబునామచ" అని అమరశేషము; ఎల్లన్=అన్నియు; కలఁగఁజేయన్=కలఁతపడునట్లుచేయఁగా; తెలివ=చంద్రిక; ఆకనకమూర్తిన్=ఆ బంగరువంటి దేహముగలరాజును, సంపెఁగనని యర్థాంతరము తోఁచును; తలంచుఁబో=స్మరించునుబో, అనఁగా సంపెఁగ తుమ్మెదలకు విరోధి గావున తత్సాహాయ్యమునఁ దుమ్మెదలబాధ శమించు నని దానిఁ దలంచు ననుట, సుచంద్రసాహాయ్యమునఁ దుమ్మెదల బాధయొక్క యుపశమము సహజము. సుదుష్కరవాలపవనంబు=మిక్కిలియు నివార్యమయిన లేఁతగాడ్పు; "శసయోర్వబయో స్తథా" అనుటచే నిట వకారబకారంబుల కభేదము చెప్పఁబడెను; గాసిపెట్టన్=బాధపెట్టఁగా; మగువ=చంద్రిక; ఆభోగిపైన్=ఆరాజుపైని, ఆసర్పము

పైనని యర్థాంతరము దోఁచును; మనముంచుఁబో=మనస్సునుంచిలపువుబో; అనఁగా సర్పము లు పవనవిరోధులు గావునఁ దత్సాహాయ్యమున మందమారుతబాధను శమింపఁ జేయవచ్చు నని భోగిపై మనముంచు ననుట, సుచంద్రసంగమువలన తద్బాధోపశమము సహజము. నలినారిమరీచిసంఘాతము=చంద్రతేజోనికాయము; ఆలమన్ = ఆక్రమింపఁగా; నారిక=చంద్రిక; మదిన్=చిత్తమందు; కనలి=తపించి; ఇనునిన్= సుచంద్రరాజును, సూర్యునియర్థాంతరముదోఁచును; వినుతింపుఁబో=ప్రశంసింపుఁబో. అనఁగా చంద్రతేజోనికాయము సూర్యప్రకాశమువలన శమించును గావున చంద్రికాబాధోపశమమునకై సూర్యుని నుతించెననుట. సుచంద్రునివలనఁ దద్బాధోపశమము సహజము. ఆరమణి=ఆచంద్రిక; నిత్యమున్=ఎల్లపుడు; హృత్సారసంబు సారసంబుద్ధతాపసంసక్తిన్.—హృత్సారసంబు=మనోంబుజముయొక్క, సార=వేగవాటిన, సంబుద్ధ=స్ఫుటమైన, తాప=సంతాపముయొక్క, సంసక్తిన్ = సంబంధమును; ఇట్లు=ఈప్రకారముగా; ఎనయున్=పొందును.

చ. సతతము తీవ్రహేతిధర•సారసమానవరాజసూనుసం
జితవిరహోగ్రతాపతతి•చేఁ జలియించు నిజాంతరంగకం
జతలము తన్ముఖేందుజిత•సారస మానవరాజసూనుసం
గతముగ నూన్చి కూర్చె నవి•ఖండితసమ్మదవార్ధివీచికన్. 24

టీ. తన్ముఖేందుజితసారస=ముఖచంద్రునిచే గెలువఁబడిన తమ్మిగలయాచంద్రిక; సతతము=ఎల్లపుడు; తీవ్రహేతిధరసారసమానవరాజ సూనుసంజిత విరహోగ్రతాపతతిచేన్.—తీవ్ర=గాఢమైన, హేతిధర=అగ్నిభంగిని, సార=అధికమైన, సమాన=గర్వముతోఁగూడిన, వర=శ్రేష్ఠమైన, అజసూను=మరునిచేత, "అజో హరౌ హరే కామే" అని విశ్వము, సంజిత=కూర్పఁబడిన; విరహోగ్రతాపతతిచేన్=విరహసంబంధియై యుగ్రమైన సంతాపపరంపరచేత; కాదేని, హేతిధరసార=అగ్నిబలముతో, సమ=తుల్యమగు, అనవర=కొదవగాని, అజసూను=మరునిచేతనని యర్థము; చలియించు నిజాంతరంగకంజతలము= కంపించుచున్న తన మనః పద్మతలమును; అఖండిత సమ్మదవార్ధివీచికన్=అవిచ్ఛిన్నమగు సంతోష సముద్రతరంగములను, సముద్రతరంగములవలె నవిచ్ఛిన్నముగ నుదయించుసంతసము ననుట; జాత్యేకవచనము; ఊన్చి=వహింపఁజేసి; మానవరాజసూనుసంగతముగన్=రాజపుత్త్రుండగుసుచంద్రునితోఁ గూడినదానిఁగా; కూర్చెన్=ఘటిల్లఁజేసెను.

అనఁగాఁ జంద్రిక కామాగ్నిసంతప్తమగుతనమనంబు సుచంద్రునిపై నిలిపి ప్రమోదవార్ధిలో మునుఁగఁ జేసె ననుట.

చ. నలినసమాననాధృతిఘు•నత్వ మడంచె రుసార్చి నెమ్మదిన్
మలయసమీరణాళికును•మద్రవజబోధిత భృంగశింజినిన్
నలినసమాననాలసుమ•నశ్వరమండలిఁ గూర్చి నొంచుచున్
మలయసమీరణాఖ్యరథ•మధ్యగుఁడై నననవిల్తుఁ దుద్ధతిన్. 25

టీ. ననవిల్తుఁడు=పుష్పధన్వు; ఉద్ధతిన్=దర్పముచేత; మలయ సమీరణాఖ్యరథమధ్యగుఁడై=మలయమారుతమను పేరిటి తేరి నడుమ నుండినవాఁడై; సమీరణాళికుసుమవ్రజబోధిత భృంగశింజినిన్-సమీరణాళి=మందపవనుచాలుయొక్క, కుసుమవ్రజ = పుష్పపుగుంపుల చేత, బోధిత=మేల్కొల్పఁబడిన, భృంగ=తుమ్మెదల నెడు, శింజినిన్ = అల్లెత్రాటియందు; నలిన్=మిక్కిలి; సమానానాళసుమనశ్శరమండలిన్ = సాటిలేని కాఁడలుగల పువ్వుటమ్ముల యొక్కగుంపును; కూర్చి=సంధించి; నొంచుచున్=నొవ్వఁజేయుచు; మసాల్చి = రోషజ్వాల; నెమ్మదిన్=నిలుమనమునందు; మలయన్=వ్యాపింపఁగా; నళినసమానానాధృతిఘనత్వము.-నలినసమానా=తమ్మినిబోలు మోముగల చంద్రికయొక్క, ధృతి = ధైర్యముయొక్క, ఘనత్వము=ఆధిక్యమును; అడంచెన్=అడఁగఁజేసెను.

అనఁగామలయమారుతభ్రమరఝంకారాదులచేఁ జంద్రికకు సంతాప మెక్కుడై యామెచంద్రసాంద్రుని పొందు లేక నిలువఁ జాల నను నధైర్య ముదిత మయ్యె ననుట.

తే. అంత పతేనికి సహాయ♦మగుచు హితఫలాభికాంక్షి శుకత్రిద♦శాళిసురభి
జగతి సుపట్టె నవసూన♦శాలిసురభి, లామ్రతిలకైకసంగమా♦శాలిసురభి.

టీ. అంతన్=తదనంతరమునందు ; హితఫలాభికాంక్షిశుకత్రిదశాళిసురభి.-హిత=ప్రియములైన,ఫల = పండ్లనెడులాభములను, అభికాంక్షి=కోరుచున్న, శుకత్రిదశ=చిలుకల నెడుదేవతలయొక్క, ఆళి=గుంపునకు, సురభి=కామధేనువైనది, అనఁగా దేవతలకుఁ గామధేనువు కోరినలాభము లిచ్చునట్లు శుకవ్రజమునకుఁ గోరినపండ్లను వసంతమిచ్చుననుట; నవసూనశాలిసురభిలామ్రతిలకైకసంగమాశాలి.- నవ=నూతనములైన, సుమ=కుసుమముల చేత, శాలి=ఒప్పుచున్న, సురభిల=పరిమళించుచున్న, ఆమ్ర=మావులయొక్క, తిలక=బొట్టుగుల యొక్క ఏక=ముఖ్యమగు, సంగమ=సంపర్కమందు, ఆశ=ఆసక్తికలిగిన, అళి=తుమ్మెదలు గలదియనగు; సురభి=వసంతము; పతేనికిన్=కామునికి; సహాయమగుచున్=తోడగుచు; జగతిన్=భూమియందు; కనుపట్టెన్ = అగపడెను.

అనఁగావసంతోదయ మాయె ననుట. ఇటనుండి వసంతవర్ణన మారంభింపఁ బడు చున్నది.

సీ. సుమనోగసమచూత♦సుమనోగణపరీత, సుమనోగణితసార♦శోభితాళి
కలనాసంతాన♦కలనాదసమనూన, కలనాదలితమాన♦బలవియోగి
లతికాంతరితరాగ♦లతికాంతసపరాగ, లతికాంతపరియోగ♦లక్ష్యకాళి
కమలాలయాస్తోక♦కమలాలయదనేక, కమలాలసితపాక♦కలితకోకి

తే. కలకవితానకవితాన♦పాళిభూత
చారుపారిజాతపారిజాత♦తోరణోల్ల
సద్వ్రతతికావ్రతతికావ్ర♦జక్షయాతి
భాసురము పొల్చె వాసంత♦వాసరంబు.

టీ. సుమనోగసమచూతసుమనోగణపరీత సుమనోగణితసారశోభితాళి.—సుమనోగ=కల్పవృక్షముతోడ, సమ=తుల్యమగు, చూత=మావులయొక్క, సుమనోగణ=కుసుమకదంబము చేత, పరీత=వ్యాప్తమైన, ఇదిఅళివిశేషణము, సుమనః=మంచిమనస్సులయందలి, అగణిత=అధికమైన, సార=సామర్థ్యము చేత, శోభిత = ప్రకాశించుచున్న, అళి= తుమ్మెదలుగలది. అనఁగా రసాలకుసుమముల నాశ్రయించినవి మనస్సులయం దగణితసామర్థ్యము గలవి యగు తుమ్మెదలు గల దనుట, ఇది వాసంతివాసరమునకు విశేషణము, యందు నిట్లే తెలియవలయు. కలనాదసంతానకలనాదసమనూనకలనాదళితమానబలవియోగి.—కలనాదసంతాన=కోయిలగుంపుయొక్క, కల=అవ్యక్తమధురమైన, నాద = ధ్వనియొక్క, సమనూన=మిగుల నధికమైన, కలనా=ఆకలనము చేత, అనఁగా వినికిచేత, దళిత = పోఁగొట్టఁబడిన, మానబల=కోపసామర్థ్యముగల, వియోగి = విరహులుగలది. అనఁగా కోకిలాలాపసూకలనము చేత విరహిజనమానబలము పోయిన దనుట. లతికాంతరితరాగలతికాంతసపరాగలతికాంతపరియోగలక్ష్యకాళి.—లతికాంతరిత=తీవలచేతకప్పఁబడిన, రాగ = దాడిమలయొక్క, లతికా=కొమ్మలయొక్క, అంత=మనోజ్ఞమగు, సపరాగ = పుప్పొడితోఁగూడిన, లతికాంత=పువ్వులయొక్క, పరియోగ=సంపర్కము చేత, లక్ష్య=చూడఁదగిన, క=ఉదకములయొక్క, ఆళి=శ్రేణులుగలది. అనఁగా వసంతవాసరమున జలప్రవాహాదులు పుప్పొడితోఁగూడి వ్రాలినదాడిమీకుసుమములచేఁ జూడసొంపుగా నుండుననుట. కమలాలయాస్తోకకమలాలయానేక కమలాలసితపాకకలితకోకి.—కమలాలయ=పద్మాకరములయొక్క, అస్తోక= అధికములగు, ఇదికమల విశేషణము, కమలా=లక్ష్మీదేవికి, ఆలయత్=గృహముపలెనాచరించుచున్న, అనేక అసంఖ్యాకములైన, కమల=పద్మములయందు, ఆలసిత=మిగులఁబ్రకాశించుచున్న, పాక=పిల్లలతోడ, ''పోతః పాకోర్భకో డిమ్భః'' అని యమరుఁడు, కలిత=కూడుకొనిన, కోకి=ఆఁడుజక్కవలుకలది, ఈసమాసముమీఁద సమాసాంతవిధి యనిత్యం బగుటం జేసి ''నద్యృతశ్చ'' అనిక ప్ప్రత్యయము లేదు, కొలఁకులయందు వసంతవాసరమున చక్రవాకస్త్రీలుబిడ్డలతో వసించి రాజిల్లుచుందు రనుట. జాలకవితాన కవితానపాళీభూతచారు పారిజాతపారిజాతతోరణోల్ల సద్వ్రతతికా వ్రతతికావ్రజక్షయాతిభాసురము.—జాలకవితాన=మొగ్గలగుంపనెడు, వితాన = మేలుకట్టుచేతను, పాళీభూత= బారులుగానున్న, చారు=మనోజ్ఞములైన, పారిజాత పారిజాత=మన్మథునికివాహనములైన చిలుకలగుంపనెడు, తోరణ=తోరణముచేతను, ఉల్లసత్=ప్రకాశించుచున్న, వ్రతతి=తీవలయొక్క, కావ్రతతికా= ఈవల్లతలయొక్క, పక్కకొమ్మలయొక్కయనుట ''ఈషదర్థేచ'' అను సూత్రము చేత కుశబ్దమునకు కాదేశము వ్రజ=సంఘములనెడు, క్షయ=గృహములచేత, ''నివేశః శరణం క్షయః'' అని యమరుఁడు అతిభాసురము=మిగులఁ బ్రకాశమానమైనది. అనఁగా వసంతవాసరమున లతాగృహములు మొగ్గగుంపు లనెడు మేలుకట్లచేతను చిలుకలబారుల నెడుతోరణములచేతను విలసిల్లుచుండు ననుట; వాసంతవాసరంబు=వసంతదినము; భాసిల్లెన్=ప్రకాశించెను.

సీ. కినలార్పితానంద•రసలాభకపికాళి, కామనం బబలాప్తకామనంబు
సుమభావిధానోర్వ్యన్య•సమభావయుతరాగ,పర్ణకం బాపత•త్పర్ణకంబు

నవపారిజాతప్రసవపాళిపుష్టాళి, దారకంబు విరహిజనదారకంబు
కురవామితపరాగగురువాసనాకీర్ణ, పుష్కరంబు లసత్ప్రపుష్కరంబు

తే. సారమాకందఫలలగత్కీరమాని,
వీక్షణంబు క్షరద్యామినీక్షణంబు
మంజులానేకకుసుమవద్వంజులాఢి
కాగమము ప్రొల్చె నిలఁ జైత్రికాగమంబు.

టీ. కిసలార్పితానందరసలాభకపికాళికామనంబు.—కిసల=చిగురులచేత, అర్పిత=ఇయ్యఁబడిన, ఆనందరస=ప్రమోదరసము గలదు, లాభక=అవాప్తముగఁ బొందిన, పికాళికా = కోకిలపంక్తులయొక్క, మనంబు=మనస్సుగలది; అబలాప్తకామకంబు=స్త్రీలచేతఁ బొందఁబడిన కాముకులుగలది, "కమనః కామనోభికః" అని యమరుఁడు, వసంతమున వారా స్త్రీలు తప్తకాముక్తరలై కాముకు లైన తమప్రియులతోఁ గలియుదు రనుట; సుమభావిభాన్యోన్యసమభావయుతరాగపర్ణకంబు.—సుమభావిభా=కుసుమకాంతిప్రకాశముచేత, అన్యోన్యసమభావ=పరస్పరతుల్యతతోడ, యుత=కూడిన, రాగ=ఎఱుపులుగల, పర్ణకంబు=మోదుగులుగలది; అపతత్పర్ణకంబు = రాలుచున్న కారాకులుగలది; నవపారిజాతప్రసవపాళిపుష్టాళిదారకంబు.—నవ=నూతనములగు, పారిజాత=పారిజాతములయొక్క, ప్రసవపాళి= పుష్పపంక్తులచేత, పుష్ట=పోషింపఁబడిన, అళిదారకంబు=తుమ్మెదలపిల్లలుగలది; విరహిదారకంబు=విరహిజనభేదకంబయినది; కురవామితపరాగగురువాసనాకీర్ణపుష్కరంబు.—కురవ=గోరంటలయొక్క, అమిత=అధికమైన; పరాగ=పుప్పొడులయొక్క, గురు=అధికమైన, వాసనా=పరిమళముచేత, ఆకీర్ణ=వ్యాపింపఁబడిన, పుష్కరంబు=ఆకాశముగలది; లసత్ప్రపుష్కరంబు=ప్రకాశించుచున్న తామరలుగలది; సారమాకందఫలలగత్కీరమానినీక్షణంబు.—సార=శ్రేష్ఠములైన, మాకంద=తియ్యమావులయొక్క, ఫల=పండ్లయందు, లగత్=లగ్నములగుచున్న, కీరమానినీ=ఆఁడుచిలుకలయొక్క, ఈక్షణంబు=దృష్టులుగలది; క్షరద్యామినీక్షణంబు.—క్షరత్=తగ్గుచున్న, యామినీ=రాత్రియొక్క, క్షణంబు=క్షణములుగలది, రాత్రి తగ్గిపోవుచున్నదనుట; మంజులానేకకుసుమవద్వంజులాఢికాగమము.—మంజుల=మనోజ్ఞములగు, అనేక=అనేకములగు, కుసుమవత్=పుష్పములుగలిగిన, వంజుల=అశోకవృక్షము, ఆఢిక = మొదలుగాఁగల, అగమము=వృక్షములుగలదియునగు; చైత్రికాగమంబు=చైత్రమాసమురాక, "స్యాచ్చైత్రే చైత్రికో మధుః" అని అమరుఁడు; ప్రొల్చెన్ = ప్రకాశించెను.

చ. వరపురుషోత్తమూర్తి వనివారితసైంధవరత్నయుక్తి ని
ర్భరవసుకూటలబ్ధిఁ దనరారి నభోబ్ధిఁ జరించు నుజ్జ్వల
త్తరణి యనంగహారిసఖధామపథంబును బొందె నయ్యెడన్
దరణి యనంగ హారియమనాథదిశానిలజాలధారచేన్. 29

టీ. వరపురుషోత్తమాప్తిన్.—వర=శ్రేష్ఠమగు, పురుషోత్తమ = నారాయణమూర్తియొక్క, పురుషశ్రేష్ఠులయొక్క యని యర్థాంతరము, ఆప్తిన్=ప్రాప్తిచేత; అనివారిత సైంధవరత్నయుక్తిన్.—అనివారిత=అడ్డగింపఁబడని, సైంధవరత్న=అశ్వశ్రేష్ఠములయొక్క, సముద్రసంబంధులగు మణులయొక్క యని యర్థాంతరము, యుక్తిన్=కూడికచేత; నిర్భరవసుకూటలబ్ధిన్.—నిర్భర=మిక్కిలి అధికములైన, వసు=కిరణములయొక్క, ధనములయొక్క అని అర్థాంతరము, కూట=రాశియొక్క, లబ్ధిన్=ప్రాప్తిచేత; చరించుచు జ్వాలత్తరణి=సంచరించుచున్న ప్రకాశమానుఁడగు సూర్యుఁడు; అనంగహారిసఖధామపథంబునన్.—అనంగహారిసఖ=శివుని చెలికాఁడైన కుబేరునియొక్క, ధామ=నివాసస్థానముయొక్క, అలకాపురియొక్క యనుట, పథంబునన్=మార్గమును; హారియమనాథ దిశానిలజాలధారచేన్.—హారి = మనోజ్ఞమగు, యమనాథ=యముఁడు నాథుఁడుగాఁగల, దిశా=దిక్కునందలి, అనిల జాలధారచేన్ = వాతజాలపరంపరచేత; తరణియనంగన్=ఓడయట్లు; పొందెన్=పొందెను.

అనఁగా నారాయణమూర్తిచేతను ఉత్తమాశ్వముల చేతను అమూల్యకిరణ సంఘముచేతను దనరారుసూర్యుండు మలయానిలముతోడ నాకాశమునందు దక్షిణదిక్కునుండి యుత్తరదిక్కుఁ జేరెననియు నట్లుచేరుట యుత్తమపురుషులచే నధిష్ఠితమై యమూల్యరత్నములచేతను ధనములచేతను ఒప్పియున్నయోడ సముద్రమందు అనిలజాలపరంపరచేత దక్షిణదిక్కునుండి యుత్తరదిక్కుఁ జేరినయట్లున్న దనియు భావము. వసంతర్తువునందు సూర్యుండు దక్షిణదిక్కునుండి యుత్తరపుదిక్కుఁ జేరుట ప్రసిద్ధము.

చ. మొనచిగురాకుమోవిపస ♦ మున్ మగతుమ్మెద చూపుకోపు పెం
పునఁ గలికాకుచోజ్జ్వలత ♦ పొందున నావనలక్ష్మి పొల్చినన్
గని యతనుప్రతాపపరి ♦ కల్పితమోహనిరూఢిమైఁ దలం
గనియతనుప్రతాపగతిఁ ♦ గైకొనె భానుఁడు మందవర్తనన్. 30

టీ. భానుఁడు=సూర్యుఁడు; మున్=తనయెదుట; ఆవనలక్ష్మి=ఆవనసంపద, స్త్రీలింగస్వారస్యమున నొకస్త్రీయని తోఁచును; మొనచిగురాకుమోవిపసన్.—మొనచిగురాకు=చివరయందలి చిగురుటాకనెడు, మోవి=అధరముయొక్క, పసన్=అందముచేతను; మగతుమ్మెద చూపుకోపు పెంపునన్.—మగతుమ్మెద=పురుషభృంగమనెడు, చూపు=దృష్టియొక్క, కోపు=అందముయొక్క, పెంపునన్=అతిశయముచేతను; కలికాకుచోజ్జ్వలత పొందునన్.—కలికా=మొగ్గలనెడు, కుచ=స్తనములయొక్క, ఉజ్జ్వలత పొందునన్ = ప్రకాశసంబంధముచేతను; పొల్చినన్=ఒప్పఁగా; కని=చూచి; అతను ప్రతాపపరికల్పితమోహనిరూఢిమైన్.—అతనుప్రతాప=మదనపరాక్రమముచేత, పరికల్పిత=నిర్మింపఁబడిన, మోహనిరూఢిమైన్=మోహాతిశయముచేత; తలంగనియతనుప్రతాపగతిన్.—తలంగని=తొలఁగిపోనట్టి, అతను = అధికమయిన, ప్రతాప=వేఁడియనెడు సంతాపముయొక్క; గతిన్=ప్రాప్తిని; మందవర్తనన్=మెల్లనిగతిచేత, తెలివిచాలనివానిరీతిచేతనని యర్థాంతరముతోఁచు; కైకొనెన్=స్వీకరించెను.

తోఁగూడిన, భద్రజాతితోఁగూడిన, ఇవి యిభవిశేషణము, మహీభృత్=మలయపర్వతమనెడు, వృషా=నెపముగల, పరసాలాన=మంచికట్టుకంబముయొక్క, వసతి=స్థానమునుండి, అశృంఖలిత=విడిచిపెట్టఁబడిన, చంచత్=ప్రకాశించుచున్న, మాషిత=వాయువనెడు, ఇభంబు=గజము; కేసరసాలానవపత్త్రిముల్.—కేసర=పొన్నలయు, సాల=ఏపెలయు, అనవపత్త్రిముల్=కారాకులను; తులుముచున్=రాల్చుచు; చైత్రాహజాగ్రద్విలాసరసాలానవధిప్రసూనరజముల్.—చైత్రాహ=వసంతదినములయందు, జాగ్రత్=నిస్తంద్రములైన, విలాస=ఒప్పిదముగల; రసాల=తియ్యమావులయొక్క, అనవధి=మేరలేని, ప్రసూనరజముల్ = పుష్పపరాగములు, సారెన్=మాటిమాటికి; పయిన్=మీఁదను; రువ్వుచున్=వెదచల్లుచు; తిమ్మరియెన్=చరించెను.

అనఁగా నొకగజము కట్టుకంబమునుండి విడువఁబడినదియై మ్రాఁకులయొక్క యాకులు రాల్చుచు పరాగములు రువ్వుచు తెరవరులు బెగడొందునట్లు దిమ్మరుచందంబున, మందమారుతము మలయపర్వతమునుండి వెడలి కారాకులు రాల్చుచు పుష్పాదులు సారెకు రువ్వుచు విరహిజనులు బెగడొందు నట్లు ద్రిమ్మరియె ననుట. రూపకకైతవాపహ్నుతులు.

చ. వనచరపాళికానినద◆వారము మించఁగఁ గాననంబులన్
వనచరపాళికాప్తకుహ◆నాశబరాగ్రణి నిల్చి యాశుగా
ళి నలమ సాలసంతతి చ◆లించుచు నంత శుచిచ్ఛదావళుల్
చననిభయాప్తి వైచె నన◆ జాఱె ననంత శుచిచ్ఛదావళుల్. 33

టీ. వనచరపాళికానినదవారము.—వనచరపాళికా = కోకిలసంఘమనెడుకిరాతకుల గుంపుయొక్క, నినదవారము=ధ్వనిసమూహము; మించఁగన్ = అతిశయించుచుండఁగా; కాననంబులన్=అరణ్యములందు ; వనచరపాళికాప్తకుహనాశబరాగ్రణి.—వనచరపాళిక= మీనకేతనునియొక్క, "జీవనంభువనంవనమ్, పాళిః కేతుః" అనియమరుఁడు, ఆప్త=చెలియగువసంతుఁడనెడు, కుహనా=నెపముగల, శబరాగ్రణి = కిరాతపతి; నిల్చి; ఆశుగాళిన్= వాయువులనెడుబాణములయొక్కచాలుచేత ; అలమన్=ఆక్రమింపఁగా; సాలసంతతి=వృక్షనికాయము, తెరువరులగుంపనిధ్వనితార్థము ; చలించుచున్ = కదలుచు; భయముచేతవడఁకుచు; అంతన్=తర్వాత; శుచిచ్ఛదావళుల్ = శుభ్రమైనవస్త్రములపంక్తులను ; చననిభయాప్తిన్=పోనిభయప్రాప్తిచేత ; వైచెన్ = విడిచెను; అనన్=అనునట్లు; అనంతన్=భూమియందు ; శుచిచ్ఛదావళుల్=కారాకులగుంపులు; జాఱెన్=వ్రాలెను.

అనఁగా నడవిలో నొకశబరాగ్రణి తనపరివారకిరాతకు లెల్లఁజుట్టి ధ్వనులు సేయుచుండఁగా బాణము లేయ నత్తఱి తెరువరులు మిగుల భీతిచేత శుభ్రము లగుతమవస్త్రములు విప్పియిచ్చినయట్లు కోయిలలు రొదసేయుచుండఁగా వసంతము కానలయందు వ్యాపించి మందమారుతమును వీవఁజేయఁగా మ్రాఁకులపండుటాకులు భూమిని రాలె నని తాత్పర్యము.

సీ. మధుయంతే విటపిసా◆మజకటమ్ముల వ్రాయ, నలరుగ్గరికరేఖ◆కాళు లనఁగ
హరివిదారితపత్త్రి◆యగునగశ్రేణిపై, నడరుగ్గరికరేఖ◆కాళు లనఁగ

నళిధూమకందళి♦యలమఁ గన్పడుదవాం,గణవిరోచనమయూ♦ఖముల ననఁగ
మును మ్రింగి వెగ్గలై న♦వనతమస్తతిఁ గ్రక్కు, ఘనవిరోచనమయూ♦ఖముల నంగ

తే. నహహా యవ్వేళ పత్త్రితో♦యధితటస్థ
లకనదతిరోహితప్రవా♦ళము లనంగ
నమరె నతిరోహితప్రవా♦ళముల నంగ
కనకకరవాలికాప్రమా♦కరము లగుచు. 34

టీ. మధుయంతి = వసంతమనెడుమావటివాఁడు ; విటపిస్తామజకటస్థలన్ = మ్రాఁకు లనెడు నేనుఁగులయొక్క గండస్థలములయందు; వ్రాయన్ = లిఖింపఁగా; అలఘుగైరికరేఖికాళులు=ఒప్పుచున్న సిందూరరేఖాపంక్తులు; అనఁగన్=అనునట్లుగా;దీనికి ప్రవాళము లమరె ననుదానితో నన్వయము; హరివిదారితపత్త్రి.—హరి = వాయువనెడునింద్రునిచేత, విదారిత= ఖండింపఁబడిన, పత్త్రి = ఆకులనెడుపక్షములుగలది ; అగనగశ్రేణిపైన్ = అగునట్టివృక్షములనెడు కొండలయొక్క చాలున ; అడరుగైరికరేఖికాళులు = ఒప్పుచున్న జేగుఱురేఖలయొక్క చాళ్ళు; అనంగన్=అనునట్లుగా; అళిధూమకందళి = తుమ్మెదలనెడుధూమాంకురము; అలమన్ = ఆక్రమింపఁగా; కన్పడుదవాంగణవిరోచనమయూఖములు.—కన్పడు = చూపట్టుచున్న, దవాంగణ=వనాంతరమనెడు, విరోచన=అగ్నియొక్క, మయూఖములు=జ్వాలలు ; అనంగన్=అనునట్లుగా; మును=తొలుత; మ్రింగి=కబళించి; వెగ్గలైనన్=పెక్కుసముకాఁగా; వనతమస్తతి = వనములనెడురాహులగుంపు ; క్రక్కు—ఘనవిరోచనమయూఖములు = వమనము సేయుసూర్యకిరణములు; అనఁగన్=అనునట్లుగా; పత్త్రితోయధితటస్థలకనదతిరోహితప్రవాళములు.—పత్త్రితోయధి=ఆకులనెడుసముద్రముయొక్క, తటస్థల= దరియందు, కనత్=ఒప్పుచున్న, అతిరోహిత=మిగులనెఱ్ఱనైన, ప్రవాళములు = పవడములు; అనంగన్=అనునట్లుగా; అతిరోహితప్రవాళములు = తిరోహితములుగాని యనఁగాస్ఫుటముగాబయల్పడినపల్లవములు; అనంగకనకకరవాలికాప్రమాకరములు.—అనంగ = మదనునియొక్క, కనకకరవాలికా=బంగరుకృపాణముయొక్క, ప్రమా=యథార్థజ్ఞానమునకు, కరములు=చేయునవి;అగుచున్=అయినవయి; ఆవ్వేళన్=అపుడు; అమరెన్=ఒప్పెను. అహహా=చిత్రము.

నవపల్లవములు పైఁజెప్పిన చొప్పున విలసిల్లె నని తాత్పర్యము.

చ. కలికలరంగదుజ్జ్వలతఁ♦ గన్పడెఁ గాననసీమ ముత్తెముల్
కలి కలరంగ నెంచి నిజ♦గౌరిమచే నడఁగించి చంద్రమః
కలికల రంగమై నవసు♦గంధపరంపర కెల్లఁ జాల ను
త్కలికలరం గనారతముఁ♦ గాంచిన చూపఱచూడ్కి కుంచ్చుచున్. 35

టీ. కలికలరంగదుజ్జ్వలత.—కలికల = కోరకములయొక్క, రంగత్=ఒప్పుచున్న, ఉజ్జ్వలత=ప్రకాశము ; కాననసీమన్ = అరణ్యప్రదేశమందు ; ముత్తెముల్=మౌక్తికములు;

కలికిక్=కలహమునకు; అలరంగన్=ఒప్పఁగా; నోఁచి = నోచ్పించి; నిజగౌరిమచేన్=తన పాండిమచేత; చంద్రమఃకలికలన్=శశికలలను; అపహసించి=అపహసింపఁజేసి; నవసుగంధపరంపరకెల్లన్.—నవ=నూతనమగు, సుగంధ = పరిమళముయొక్క, పరంపరకెల్లన్=సముదయమునకంతయు; రంగమై=ఆశ్రయమై; అనారతమున్ = ఎల్లప్పుడును ; కాంచినచూపఱచూడ్కికిన్=అవలోకించినచూచువారియొక్కదృష్టికి; చాలన్ = మిక్కిలి; ఉత్కలికలరంగన్= వేడుకలయొప్పిదమును; ఉంచుచున్=చేయుచు; కన్పడెన్=అగపడెను.

అనఁగాఁ గలికలు కాననసీమలందుఁ దమపాండిమచే ముత్యములను శశికలలను మించుచు నపూర్వపరిమళమును వాల్చుచు చూచువారలచూడ్కికి నింపు నించుచుఁ గాన్పించెననుట.

చ. విరిగమి పొల్చె సర్వవన♦వీథులఁ దారకదీధితిచ్ఛిదా
పరమహిమానివారణము ♦ పాంథవధూజనదృష్టిమాలికా
పరమహి మానితాళికుల♦భవ్యవిహారనివాస ముజ్జ్వల
త్పరమహిమానికాజయజ♦భాసురచైత్రికకీర్తి యత్తఱిన్. 36

టీ. అత్తఱిన్=అపుడు ; సర్వవనవీథులన్=ఎల్లయడవులపట్టులందు; తారకదీధితిచ్ఛిదాపరమహిమానివారణము.—తారకదీధితి = నక్షత్రకాంతులయొక్క, చ్ఛిదా=ఛేదనమందు, పర = ఆసక్తమైన, మహిమ = సామర్థ్యముచేత, అనివారణము = అడ్డులేనిదియు; పాంథవధూజనదృష్టిమాలికాపరమహి.—పాంథవధూజన = వియోగిస్త్రీలయొక్క, దృష్టిమాలికా= చూపుచాళులకు, పరమహి = శత్రుభూమిరూపమయినదియు; మానితాళికులభవ్యవిహారనివాసము.—మానిత=శ్రేష్ఠములగు, అళికుల = తుమ్మెదగుంపులకు, భవ్యవిహారనివాసము=మనోజ్ఞమగువిహారస్థానరూపమైనదియు; ఉజ్జ్వలత్పరమహిమానికాజయజభాసురచైత్రికకీర్తి.—ఉజ్జ్వలత్=ప్రకాశించుచున్న, పరమ=ఉత్కృష్టమగు, హిమానికా = మంచుగమియొక్క, "హిమానీహిమసంహతిః" అనియమరుఁడు, జయ=గెలుపువలన, జ=పుట్టినట్టి, భాసుర=ప్రకాశించుచున్న, చైత్రికకీర్తి=వసంతునియొక్కకీర్తిరూపమయినదియునగు; విరిగమి=పువ్వులగుంపు; పొల్చెన్=ప్రకాశించెను..

సర్వవనస్థలులయందు నక్షత్రకాంతి నడంచునంతప్రకాశముగలదై విరహిస్త్రీలచూపులకు శత్రుప్రాయం బగుచు మంచును జయించి పొందినచైత్రునికీర్తియో యనునట్లు విరిగమి పొల్చె ననుట. వసంతమందు హిమము నివృత్తి మగుట ప్రసిద్ధంబు.

సీ. ఫలియించెఁ దిలకముల్ ♦ భసలేక్షణమ్ముల
సురసాలశాసము♦త్కారము గాంచెఁ
జివురించె సుమఁబోన్న ♦ నవసూనసంతతి
సురసాలవల్లరుల్ ♦ నరస నవ్వ

నన( జూపెఁ బొగడచాల్ ♦ నవమధుచ్ఛట నింద్ర
సురసాలలితశాఖ ♦ కరము నుమియఁ
గుసుమించె శేఁక్రోవి ♦ కోమరు వీవలి విభా
సురసాలవల్లికల్ ♦ సొరిది నలమ

సితవసురసాలచారుమా♦రుతముఖాప్త
వరులు మెచ్చంగ మధు వల♦ర్పకయ మున్నె
యలరి సురసాలవైఖరిఁ ♦ జెలువుఁ గాంచె
నవు డగ్రశ్రేణి యిట్లు దో♦హదనిరూఢి. 37

టీ. తిలకముల్=బొట్టుగులు; సురసాలతాసముత్కరము.—సురసాలతా=కల్పకలతి వలయొక్క, సముత్కరము=సమూహము; ఘనలేక్షణమ్ములన్ = శేఁకి గాఘ్రుల చేత; కాంచన్=చూడఁగా; ఫలియించెన్=పండెను. నునుపొన్న=సుందరమగు పొన్నవృక్షము; సురసాలవల్లరుల్=లెస్సైనమావిపువ్వుగుత్తులు; నవసూనసంతతిన్=క్రొత్తపువ్వులగమిచేత; సరసన్ = సమీపమునందు; నవ్వన్=నవ్వఁగా; చివురించెన్=పల్లవించెను. పొగడచాల్=పొగడ్రమాఁకులచాలు; ఇంద్రసురసాలలితశాఖ.—ఇంద్రసురసా=వావిలియొక్క, లలిత=మనోజ్ఞమగు, శాఖ=కొమ్మ; నవమధుచ్ఛటన్.—నవ=నూతనమైన, మధు=పుష్పాసవముయొక్క, ఛటన్=పరంపరను; కరమున్=మిక్కిలియు; ఉమియన్=ఉమియఁగా; నన(జూపెన్=కుసుమించెననుట. శేఁక్రోవి=శేఁతకురవకము; కోమరువీవలిన్.—కోమరు=అందమైన, వీవలిన్=వాయువుచేత; విభాసురసాలవల్లికల్.—విభాసుర=ప్రకాశించుచున్న, సాలవల్లికల్=మేపెడ్రమాఁకులతీవలు, అనఁగా శేఁత కొమ్మలు; సొరిదిన్=వరుసగా; అలమన్—కౌఁగిలింపుట చే; కుసుమించెన్=పుష్పించెను. మధువు=వసంతము; సితవసురసాలచారుమారుతముఖాప్తవరులు.—సితవసు=శుభ్రాంశువైన చంద్రుఁడు, రసాల=తియ్యమావులు, చారుమారుత=మనోజ్ఞమైనవాయువు, ముఖ=మొదలైన, ఆప్తవరులు=కూరిమిచెలులు ; మెచ్చంగన్ = ప్రశంసించునట్లుగా ; అలర్పకయమున్నె = వికసింపఁ జేయకముందె; అగ్రశ్రేణి=మ్రాఁకులచాలు; ఇట్లు = పైఁజెప్పినవిధముగ; దోహదనిరూఢిన్ = దోహదముయొక్కయతిశయము చేత; అలరి=ప్రకాశించి; అవుడు=ఆసమయమునందు; సురసాలవైఖరిన్=కల్పవృక్షములతీరున; చెలువుగాంచెన్=అందమునొందెను.

అనఁగా తిలకములకు స్త్రీనిరీక్షణము పొన్నలకు స్త్రీలనవ్వు పొగడలకు కామినీముఖశీధువు కురవకముల కబలాజనాలింగనము దోహదము గావున ఈదోహదములచే వసంతోదయమునకు మున్నె పుష్పఫలాదిభరితములై వేల్పుమ్రాఁకులభంగి చెలువుగాంచె ననుట. ఇట నాలుగు చరణములయందు సురసాలతాసురసాలవల్లరీంద్రసురసాసాలవల్లికలయందు స్త్రీలింగములమహిమచే స్త్రీత్వారోపముఁ జేసి తదీయఘనలేక్షణాదులచే దోహదనిర్వాహము.

చ. తలిరులు దోఁచెఁ గోకిలవి◆తానము వేడుకఁ గాంచ సూనముల్
వొలిచె మిళింద ముబ్బి కడుఁ ◆ బూన నవాంగము మారుతాంకురం
బొలికెఁ బరాగముల్ వని ల◆తోత్కర మాకులపాటునం దగన్
దొలుదొలుతన్ వియోగిసుద◆తుల్ కర మాకులపాటు నందఁగన్. 38

టీ. వనిన్=వనమునందు; కోకిలవితానము=కోకిలలగుంపు; వేడుకన్ = సంతసమున; కాంచన్=పొంపఁగా; తలిరులు=పల్లవములు; తోఁచెన్ = ఉదయించెను. మిళిందము=భృంగము; కడున్=మిక్కిలి; ఉబ్బి=ఉప్పొంగి; నవాంగము = క్రొత్తశరీరమును; పూనన్=వహింపఁగా; అనఁగా సంతోషాతిశయమున నుప్పొంగి క్రొత్తదేహమును తాల్చినట్లుండఁగాననుట ; సూనములు=పుష్పములు; పొలిచెన్=ఉదయించెను. లతోత్కరము=లతలగుంపు; ఆకులపాటునన్=ఆరాకులు రాలుటచేతను; తగన్ = ఒప్పునట్లు; పరాగముల్=పుప్పొడులను; మారుతాంకురము = మందమారుతము; ఒలికెన్=చల్లెను. తొలుదొల్తన్=తొల్తనే; వియోగిసుదతుల్=విరహిస్త్రీలు; కరము=మిక్కిలి; ఆకులపాటున్ = వ్యాకులత్వమును; అందఁగన్ = పొందఁగా. ఇది యన్నిక్రియలతోను నన్వయించును.

అనఁగా వృక్షలతాదులు తొలుతఁ గారాకులు రాలఁగాఁ జిగిరించి కుసుమించి పుప్పొడులు రాలెననుట.

మ. అలరెన్ జైత్రబలాధినేత మదసా◆రంగాళి సద్వాజిమం
డలి రాగంబున మించుక్రొందళములన్ ◆ రమ్యాత్మఁ జేకూర్పఁగాఁ
గలనాదారితమీనమారుతయుతిన్ ◆ గంజాస్త్రుఁ డుద్యత్సహః
కలనాదారితమీనదృక్పురుషజా◆గ్రద్ధైర్యుఁడై యయ్యెడన్. 39

టీ. అయ్యెడన్=అపుడు; చైత్రబలాధినేత=వసంతుఁడనెడుపడవాలు; మదసారంగాళిన్.—మదసారంగ=మదించినతుమ్మెదలనెడు మదపుటేనుఁగులయొక్క, ఆళిన్ = పంక్తిని; సద్వాజిమండలిన్=శ్రేష్ఠములగు పక్షులనెడు మంచిగుఱ్ఱములగుంపును; రాగంబునన్=రక్తిమయనెడు క్రోధముచేత;మించుక్రొందళములన్=అతిశయించు చిగురాకులనెడుక్రొత్తసైన్యములను; రమ్యాత్మన్=మంచిమనస్సుచేత; చేకూర్పఁగాన్ = ఘటిల్లఁజేయఁగా; కంజాస్త్రుఁడు=మరుఁడు; కలనాదారితమీనమారుతయుతిన్.—కలనాద=కోయిలలయొక్కయు, అరి=జక్కవలయొక్కయు, తమీన=చంద్రునియొక్కయు, మారుత=మలయవాతముయొక్కయు, యుతిన్=ప్రాప్తిచేత; ఉద్యత్సహః కలనాదారితమీనదృక్పురుషజాగ్రద్ధైర్యుఁడు ఐ.—ఉద్యత్=పుట్టుచున్న, సహః=బలముయొక్క, "సహోబలశౌర్యాణిస్థామశుష్మఞ్చ" అని యమరుఁడు. కలనా=ప్రాప్తిచేత, దారిత=చీల్పఁబడిన, మీనదృక్=స్త్రీలయొక్కయు, పురుష=పురుషులయొక్కయు, జాగ్రత్ = నిస్తంద్రమైన, ధైర్యుఁడై = ధీరత్వముగలవాఁడై; అలరెన్ = ఒప్పెను.

అనఁగా మరుఁడు తనసేనాధిపతియగు వసంతుఁడు సారంగవాజిరాజిని క్రౌంచశకములను గూర్పఁగా దాను మలయానిలచంద్రాదులతోఁ గూడి స్త్రీపురుషులధీరత్వము నుడిగించెననుట.

మ. కలకంఠీకులపంచమస్వరగృహా♦త్కాంతారవారంబులన్
దలిరా కాకమలేశ్వరాత్మజమహా♦స్త్వంబున్ సుమచ్ఛాయకం
దలి రాకాకమలేశ్వరాత్మజమహా♦స్త్వంబున్ గడుం బూని క
న్నుల కుద్వేలభయంబు గూర్ప మఱి పాం♦థుల్ గుంది రప్పట్టునన్. 40

టీ. అప్పట్టునన్=ఆసమయమందు; కలకంఠీకులపంచమస్వరగృహాత్కాంతారవారంబులన్.—కలకంఠీకుల=కోకిలస్త్రీలగుంపులయొక్క, పంచమస్వర=తజ్జాతినియతమగు పంచమరాగమునకు, గృహాత్=గృహమువలెనాచరించుచున్న, ఆశ్రయమైనయనుట, కాంతారవారంబులన్=అరణ్యసముదయములందు; తలిరాకు=చిగురుటాకు;ఆకమలేశ్వరాత్మజమహాస్త్వంబున్.—ఆకమలేశ్వరాత్మజ=ఆలక్ష్మీపతియైనవిష్ణునితనూజుఁడగుమన్మథునియొక్క, మహాస్త్వంబున్=ప్రతాపభావమును; సుమచ్ఛాయగందలి.—సుమ=కుసుమములయొక్క, ఛాయ=కాంతులయొక్క, ఇట "ఛాయాబాహుల్యే" అనుసూత్రముచేత ఛాయాశబ్దమునకు నపుంసకత్వము, కందలి=మొలక; రాకాకమలేశ్వరాత్మజమహాస్త్వంబున్=పూర్ణిమా చంద్రప్రకాశభావమును, కమలేశ్వరుఁడనఁగా జలాధిపతియగు సముద్రుండు తదాత్మజుండు చంద్రుండు; "సలిలంకమలంజలమ్ పూర్ణేరాకానిశాకరే" అనియమరుఁడు; కడున్=మిక్కిలి,; పూని = వహించి; కన్నులకున్=చూపులకు;ఉద్వేలభయంబు=అధికమైనవెఱపును;గూర్పన్=ఘటిల్లఁజేయఁగా; పాంథుల్=తెరువరులు; మఱి=మిగులను; కుందిరి=దుఃఖించిరి.

అడవులయందుఁ గోకిలాలాపములు నవపల్లవములు కుసుమస్తోమకాంతియుఁ బాంథులకు దుస్సహములై ప్రియావియోగదుఃఖము నతిశయింపఁ జేసె ననుట.

తే. అలవసంతంబున రహించెఁ ♦ దిలకభాస
మానహిందోళగీతని♦స్వాన మహిమ
దీప్త్యుదయకాలగాయికా♦తిలకగీయ
మానహిందోళగీతని♦స్వానమహిమ. 41

టీ. అలవసంతంబునన్=ఆవసంతఋతువునందు; తిలకభాసమానహిందోళగీతనిస్వానము.—తిలక=బొట్టుగులయందు, భాసమాన=ప్రకాశించుచున్న, హిందోళ=తేఁటులయొక్క, గీతనిస్వానము=పాటలధ్వని; అహిమదీప్త్యుదయకాలగాయికాతిలక గీయమానహిందోళగీతనిస్వానమహిమన్.—అహిమదీప్తి=సూర్యునియొక్క, ఉదయకాల=ఉదయించుసమయమందు, గాయికాతిలక=మంచిపాటనేర్చినస్త్రీలచేత, గీయమాన=గానము చేయఁబడుచున్న,హిందోళ=రాగవిశేషముయొక్క, "హిన్దోళా రాగమధుపౌ" అనివిశ్వము, గీత=గానముల సంబంధియగు, నిస్వాన=ఆలాపముయొక్క, మహిమన్=అతిశయముచేత; రహించెన్=ఒప్పెను.

ఈపద్యమున నిస్వానపదము పునరుక్తమైనను దోషంబుకాదు. ఇందులకు "యమకాది ష్వదుష్టం స్యాన్నిహతార్థ న్నిరర్థకమ్। నదుష్టః పునరుక్తశ్చ విశేషావగమో యది॥" అని సాహిత్యచింతామణి చూడవలయు.

చ. నెలవున రాగసంపద వ◆నీరమ చారుపికారవంబునన్
దెలిసి వసంతురాక సుమ◆నీరమహోర్మికఁ దాన మూన్చి పూ
ని లలితసుచ్ఛదాళి నళి◆నీరమణీయసరంబు లూని మేల్
నెలవునఁ బొల్చెఁ గుంజభవ◆నీరమమాణశుకీసఖీవృతిన్. 42

టీ. వనీరమ=వనలక్ష్మి; చారుపికారవంబునన్.—చారు = మనోజ్ఞమగు, పికారవంబునన్=కోకిలస్వనము వలన; వసంతురాక=వసంతుఁడను ప్రియునియొక్క రాకను; తెలిసి=తెలిసికొని; నెలవునన్=పరిచయము నేత; రాగసంపదన్=రక్తిమయనెడు ననురాగముయొక్క సమృద్ధిచేత; సుమనీరమహోర్మికన్.—సుమనీర = పువ్వరసముయొక్క, మహోర్మికన్=నదియందు; తానమూన్చి = స్నానముఁజేసి; లలితసుచ్ఛదాళిన్.—లలిత=మనోజ్ఞములగు, సుచ్ఛద=మంచియాకులనెడువస్త్రములయొక్క, ఆళిన్ పంక్తిని; పూని=వహించి; అళినీరమణీయసరంబులు.—అళినీ=ఆఁడుతుమ్మెదలనెడు, రమణీయ=మనోజ్ఞములగు, సరంబులు=పేరులు; ఊని=వహించి; కుంజభవనీరమమాణశుకీసఖీవృతిన్.—కుంజభవనీ=పొదరిండ్లయందు, రమమాణ=విహరించుచున్న, శుకీ=ఆఁడుచిలుకలనెడు, సఖీ=చెలియలయొక్క, వృతిన్=వ్యాప్తిచేత; మేల్ నెలవునన్=మంచివాసస్థానమునందు; పొల్చెన్=ప్రకాశించెను.

ఇచట వనలక్ష్మి యనెడు స్త్రీ పికారవములచే వసంతుండను ప్రియునిరాక తెలిసికొని స్నానముఁ జేసి శుభ్ర వస్త్రములను రమణీయము లగుహారములను దాల్చి సఖీజనముతోఁ గూడి కేళీగృహమున విలసిల్లె నని చెప్పుటచేత వనలక్ష్మియందు వాసకసజ్జాధర్మము వ్యక్తం బగుచున్నది "ప్రియాగమనవేళాయాం మణ్డయన్తీ ముహుర్ముహుః। కేళీగృహం తథాత్మానం సా స్యా ద్వాసకసజ్జికా" అనివాసకసజ్జాలక్షణము.

సీ. రమ్యపున్నాగోర్వ◆రాజాతిసౌరభా
రూఢిపై నలమ మా◆రుతమునిగుడ
రసఁ బల్లవరుచిధా◆రాజాతిసౌరభా
గారితవంజులా◆గములు దోఁపఁ
బ్రబలుసంభ్రమ మెచ్చ◆ రాజాతిసౌరభా
వలినివాసి శుకౌఘ◆ములు నటింప
రాజత్ప్రకాబ్జక◆రాజాతి సౌరభా
నేహోర్మితారావ◆నియతి మెఱయ

తే. నధ్వగులు గుంది రధికతా♦పార్చి పజువఁ
గాననంబుల నపుడు చ♦క్కని ప్రియాళి
కాననంబులఁ గాంచు మో♦హంబు లాత్మ
కాన నంబుల మారుఁ డు♦ద్ధతి నటింప. 43

టీ. రమ్యపున్నాగోర్వరాజాతిసౌరభారూఢి.—రమ్య=మనోజ్ఞములగు, పున్నాగోర్వరాజ=పొన్నవృక్షములయొక్క, ఉర్వరాజమనఁగాభూమవహంబు, “ఉర్వరాసర్వసస్యాఢ్యా” అనియమరుఁడు, అతిసౌరభ=అధికపరిమళముయొక్క, ఆరూఢి=అతిశయము; పైన్=మీఁదికి; అలమన్=కవియునట్లు; మారుతము=సమీరము; నిగుడన్ = వీచఁగా; రసన్=భూమియందు; పల్లవరుచిధారారాజాతిసౌరభాగారితవంజులాగములు.—పల్లవ=చిగురులయొక్క, రుచిధారా=కాంతిపరంపరలయొక్క, జాతి=సామాన్యము సెడు, సౌర=సూర్యసంబంధియైన, భా=కాంతికి, ఆగారిత=గృహమువలెనాచరించుచున్న, వంజులాగములు=పకుళవృక్షములు; తోఁపన్=చూపట్టఁగా; ప్రబలుసంభ్రమము=అధికమైనసంతోషము; ఎచ్చన్ = అతిశయింపఁగా; రాజాతిసౌరభావళినివాసిశుకౌఘములు.—రాజ=రేలపూలయొక్క, అతిసౌరభ = అతిపరిమళముయొక్క, ఆవళి=పంక్తియందు, నివాసి=నివసించుచున్న, శుకౌఘములు = చిలుకలగుంపులు; నటింపన్=నాట్యముసేయఁగా; రాజత్పికాబ్జకరాజాతి.—రాజత్=ప్రకాశించుచున్న, పికాబ్జకరా=ఆఁడుకోయిలలయొక్క, జాతి = కులము; సౌరభాసేహార్పితారావనియతిన్.—సౌరభాసేహ=వసంతకాలముచేత, అర్పిత=అర్పింపఁబడిన, ఆరావనియతిన్=ధ్వనినియమముచేత; మెఱయన్=ప్రకాశింపఁగా; అధ్వగులు=పాంథులు; అపుడు=ఆసమయమున; అధికతాపార్చి=ఎక్కుడుసంతాపజ్వాల;పజువన్=వ్యాపింపఁగా; కాననంబులన్=అరణ్యములయందు;ఎక్కుడు చక్కనిప్రియాళికాననంబులఁగాంచు మోహంబులు.—చక్కని=అందమైన, ప్రియాళికాననంబులన్=ప్రియాసమూహములముఖములను ; కాంచుమోహంబులు=చూడవలెనను నభిలాషలు; ఆత్మకున్=మదికి; ఆనన్ = నాటఁగా; మారుఁడు = మన్మథుఁడు; అంబులన్=బాణములచే; ఉద్ధతిన్=దర్పముచేత; నటింపన్=నటింపఁగా; కుందిరి=దుఃఖించిరి.

అనఁగా పున్నాగపుష్పరజములతోఁ గూడినమందమారుతము రక్తపల్లవములతోఁ గూడినవకుళవృక్షములు నటించుచున్నశుకౌఘములు కోకిలస్త్రీనినాదములు పాంథులకుఁ గామోద్రేకజనకము లాయె ననుట.

చ. సరససమీరపోతములు ♦ చక్కఁ జరింపఁగఁ జొచ్చె నప్డు సుం
దరవకుళాగకేసరల♦తాసుమనోరసవీచిఁ దేలుచున్
దరుణనమేరుకేసరల♦తాసుమనోనరజంబు లాగుచున్
దరముగ నాగకేసరల♦తాసుమనోరమగంధ మానుచున్. 44

టీ. సరససమీరపోతములు.—సరస=శ్రేష్ఠములైన, సమీరపోతములు=మందమారుతములు; సుందరవకుళాగకేసరలతాసుమనోరసవీచిక్.—సుందర=సుందరములైన, వకుళాగ=పొగడవృక్షములయొక్కయు, కేసర=పొన్నలయొక్కయు, లతా=కొమ్మలయందలి, సుమనః=పుష్పములయొక్క, రస=మకరందముయొక్క, వీచిక్=తరంగములందు; ఇదిజాత్యేకవచనము; తేలుచున్=తేలాడుచు; తరుణనమేరుకేసరలతాసుమనోనరజంబులు.—తరుణ=నూతనములైన,నమేరు=సురపొన్నలయొక్క, కేసర=కింజల్కములయొక్క, లతా=బండిగురివెందలయొక్క "లతాగోళిందినీగుంద్రా" అనియమరుఁడు, సుమ = పువ్వులయొక్క, నోన=అధికమైన,ఇచట నైకధేత్యాదులయందువలెనశబ్దముతో ఊనశబ్దమునకు"సుప్సుపా"అనిసమాసము, రజంబులు=పుప్పొడులను; లాగుచున్=ఆకర్షించుచు;తరముగన్=క్రమముగ;నాగకేసరలతాసుమనోరమగంధము.—నాగకేసరలతా=నాగకేసరపుతీవలయొక్క, సుమనోరమ=మిక్కిలిమనోజ్ఞమైన, గంధము=పరిమళమును; ఆనుచున్=పానముఁజేయుచు; అద్దు=ఆసమయమందు; చక్కన్=బాగుగా; చరింపఁగఁజొచ్చెన్=సంచరింపసాగెను.

ఇట బాలపవనములు వకుళాదిపుష్పనీరమునఁ దేలుచు సురపొన్నలు మొదలగువాని పుప్పొడిలాగుచు నాగకేసరాదిగంధము నానుచుఁ జరింప సాగె నని బాలవృత్తము సమీర పోతములందు వర్ణితం బయ్యె.

సీ. శ్యామోదయము కొంచి♦యము చేయ నేతెంచి
శ్యామోదయమును హెచ్చఁగఁ దనర్చె
సుమనోవిలాసంబు ♦ చూఱవుచ్చఁగఁ జేరి
సుమనోవిలాసంబు ♦ లమరఁ జేసెఁ
దుంగకదంబాభ ♦ దూల్పంగఁ బొడకట్టి
తుంగకదంబాభ ♦ పొంగఁ దార్చె
హైమజాలకరూఢి ♦ నపహరింపఁగఁ బొల్చి
హైమజాలకరూఢి ♦ యడర నూన్చె
తే. శుచిపలాశాళిహృతిఁ గూర్చ ♦ నచల వెలసి
శుచిపలాశాళివర్ధక♦స్ఫూర్తిఁ బొదలె
నహహ కమలేశ్వరాత్మజా♦హైకమైత్రి
కతనఁ జైత్రుండు సమ్మదా ♦ కలన నొంది. 45

టీ. శ్యామోదయము=రాత్రియొక్కయావిర్భావమును; కొంచియము = అల్పమునుగా; చేయన్=చేయుటకు;ఏతెంచి=వచ్చి;శ్యామోదయమును=ప్రేంకణవృక్షములవృద్ధిని; హెచ్చఁగన్=అధికముగునట్లుగా; తనర్చెన్=చేసెను. సుమనోవిలాసంబు = జాజులయొక్కవిలాస

మును; చూఱవుచ్చఁగన్=కొల్లవెట్టుటకు; చేరి=పొంది; సుమనోవిలాసంబులు=పువ్వులవొ ప్పిదములను;అమరన్=అమరునట్లు; చేసెన్=ఒనరించెను. తుంగకదంబాభ.—తుంగ=ఉన్న తములగు, కదంబ=కడుములయొక్క, ఆభ=కాంతిని;తూల్పఁగన్=తూల్చుటకు; పొడకట్టి= ఆవిర్భవించి; తుంగకదంబాభ.—తుంగ = పొన్నలయొక్క, "పున్నాగే పురుషస్తుఙ్గః" అనియమరుఁడు, కదంబ=గుంపులయొక్క, ఆభ=కాంతిని; పొంగన్=అతిశయించునట్లు; తార్చెన్ = చేసెను. హైమజాలకరూఢిన్ = హిమసంబంధులగుబిందువులయొక్కరూఢిని; అపహరింపఁగన్=అపహరించుటకు; పాల్చి=ఉదయించి; హైమజాలకరూఢి=సంపకసంబం ధులగుమొగ్గలరూఢిని; అడరన్=ఒప్పునట్లు; ఊన్చెన్ = చేసెను. శుచిపలాశాళిహృతిన్.— శుచిపలాశ=కారాకులయొక్క, ఆళి = పరంపరలయొక్క, హృతిన్=హరణమును; కూర్పఁ గన్=చేయుటకు; అచలన్ = భూమియందు; వెలసి=ప్రకాశించి; శుచిపలాశాళివర్ధనస్ఫూ ర్తిన్.—శుచిపలాశ=నిర్మలములగుమోదుగులయొక్క, ఆళి=పంక్తియొక్క, వర్ధన=వృద్ధిఁబొం దించుటయందలి, స్ఫూర్తిన్=ప్రకాశముచేత; పొదలెన్ = ఒప్పెను. అహహ=ఆశ్చర్యము! కమలేశ్వరాత్మజాతైకమైత్రికతనన్.—కమలేశ్వర = లక్ష్మీకాంతుఁడైనవిష్ణువుయొక్క, ఆత్మ జాత = పుత్రుఁడగుమరునియొక్క, ఏకమైత్రిక తనన్=ముఖ్యస్నేహమునుబట్టి; చైత్రుండు= వసంతుండు; సమ్మదాకలనన్=సంతోషసంబంధమును; ఒంది = పొంది. పైఁజెప్పినవిధముగఁ జేసె నని క్రింది కన్వయము.

వసంతము శ్యామోదయము కొంచెము సేయుటకు, సుమనోవికాసంబు చూఱపుచ్చు టకు, తుంగకదంబాభ దూల్చుటకు, హైమజాలకరూఢి నపహరించుటకు, శుచిపలాశాళి హృతిఁ గూర్చుటకు, ధరణిఁ జేరియు, తద్విరుద్ధము లైనశ్యామోదయంబు హెచ్చు చేయుట, సుమనోవిలాసంబు లమరఁ జేయుట లోనగుకార్యము లొనరించుటవలన, "శ్లో॥ అన్య త్కర్తు మ్ప్రవృత్తస్య త ద్విరుద్ధకృతి శ్చ సా। గోత్రోద్ధారప్రవృత్తోపి గోత్రో ద్భేద మ్పురా కరోః॥ ఇత్యాదులయందువలె, శ్లేషోత్థాపితాసంగత్యలంకారము. ఇట్లు శ్యా మోదయ సుమనోవిలాసతుంగకదంబాభా హైమజాలకరూఢి శుచిపలాశాళులకు విరోధము సేయ సమకట్టినవసంతుఁడు తద్విపరీతవర్తనమునఁ జెలఁగుట చిత్రము. ఇట్టి దుర్నయమందుఁ బ్రవర్తించినవసంతుఁడు శ్రీనారాయణమూనుండగుమీనకేతనునిసాంగత్యమహిమచే నదిమాని నాఁడనుటవలన "సారూప్యమపి కార్యస్య కారణేన సమం విదుః" అను సమాలంకార భేదమును గలుగును. వసంతవాసరమందు రాత్రి తక్కువ యగుటయు, లతలు వృద్ధిఁ బొందుటయు, జాజులు విలసిల్లకుండుటయు పువ్వులు సమృద్ధములగుటయు కదంబములు పుష్పింపకుంటయు పొన్నలు ప్రకాశించుటయు మంచుబిందు ముడుఁగుటయు, సంపెఁగలు ప్రబలుటయు, పండుటాకులు రాలుటయు, మోదుగులు మోదించుటయు, కొన్నిలోక ప్రసి ద్ధంబులు, కొన్ని కవిసమయసిద్ధంబులు. దీనిం గూర్చి కవికల్పలతయందు "అసతోపి నిబ న్ధేనా నిబన్ధేనసతోపిచ। నియమేన చ జాత్యాదేః కవీనాం సమయ స్త్రిధా। అసతోపి నిబ న్ధోయథా । రత్నాని యత్రకుత్రాద్రౌ హంసా స్స్వల్పజలాశయే। జలేభాద్యన్నభో నద్యా మమ్భోజాద్య న్నదీష్వపి। తిమిరస్య తథాముష్టిగ్రాహ్యత్వం సూచిభేద్యతా।

అఙ్గుళిగ్రాహ్యతా కుమ్భోపవాహ్యత్వం విధుత్విషః । శుక్లత్వం కీర్తిహాసాదౌ కార్ష్ణ్యం చాకీర్త్యఘాదిషు । ప్రతాపే రక్తతోష్ణత్వే రక్తత్వం క్రోధరాగయోః । విభావర్యాం భిన్నతయా వర్తనం చక్రవాకయోః । జ్యోత్స్నాపానం చకోరాణా ఇచ్ఛతుమ్మఙ్చ పయోనిధేః॥ సతో ప్యనిబన్ధో యథా - వసన్తే మాలతీపుష్ప మ్ఫలపుష్పే చ చన్దనే । అశోకే చ ఫలం జ్యోత్స్నాధ్వాన్తే కృష్ణాన్యపక్షయోః । కామదన్తేషు కున్దానా ఙ్కుట్మలేషు చ రక్తతామ్। హారితత్వ న్దివా నీలోత్పలానా ఞ్చ వికాసితమ్ । వర్ణయే న్న సద ప్యేత న్నియమో థ ప్రకాశ్యతే ॥ భూర్జత్వ గ్హిమవ త్యేవ మలయేష్వేవ చన్దనమ్ । రక్తత్వం రక్తబన్ధూకబిమ్బామ్భోజవివస్వతామ్ । తథా వసన్త ఏవా న్యపుష్టానా ఙ్కలకూజితమ్ । వర్షాస్వేవ మయూరాణాం రుత న్న ఋత్వఙ్చ వర్ణయేత్ । నియమస్య విశేషోథ పునః కశ్చి త్ప్రకాశ్యతే॥ ఇత్యాదిగాఁ జెప్పఁ బడినది. వసంతాదులను గూర్చియు నందె యిట్లున్నది. ''సురభౌ దోలాకోకిలమారుతసూర్యగతితరుదలోద్భేదాః । జాతీతర పుష్పచయామ్రమఞ్జరీభ్రమర ఝఙ్కారాః। గ్రీష్మే పాటలమల్లీతాపసరఃపథికశోషవాతోష్ణాః। సక్తుఃప్రపాచతృష్ణామృగతృష్ణామ్రాదిఫలపాకాః। వర్షాసు ఘనశిఖిసదనసమాగమాః పఙ్కకన్దలోద్భేదా । జాతీకదమ్బకేతకఝఝ్ఝానిలనిమ్నగా హాలిప్రీతిః। శరదీన్దురవిపటుత్వ ఞ్జలాచ్ఛతా గస్త్యహంసవృషదర్పాః।సప్తచ్ఛదసితాభ్రంధాన్యంశిఖిపక్షమదపాతాః।హేమన్తే దినలఘుతా శీతయవస్తమ్బమరువకహిమాని।శిశిరే శరీషధూమమాఃకున్దామ్బుజదాహహిమజలోత్కర్షాః॥ ఇత్యాదిగా నున్నది. ఇందు వసంతమున సూర్యగతిమాంద్యమున రాత్రిక్రొంచెమగుటయు, జాజులు వికసిల్లకుండుటయు, కదంబములు వర్షర్తువునందే చెప్పఁదగినవనుటచే నవి లేకుండుటయు జాతీతరసర్వకుసుమములని చెప్పుటచేఁ జంపకాదిపుష్పసమృద్ధి తరుదలోద్భేదము చెప్పుటచేఁ గారాకులురాలుటయు లోనగునవి తెలియవలయు.

చ. అలమధువేళఁ దీవ్రవిర♦హాగ్నిశిఖాపరితప్తగాత్రి యౌ
నలినవిరోధివంశజన♦నాయకపుత్త్రి దలంక సాగె న
త్యలఘుసువర్ణకాననవి♦హార్యసమాశుగకాండధారకున్
హాలహాలధారిదర్పపరి♦హార్యసమాశుగకాండధారకున్. 46

టీ. అలమధువేళన్ = ఆవసంతసమయమందు ; తీవ్రవిరహాగ్నిశిఖాపరితప్తగాత్రి.— తీవ్ర=గాఢమైన, విరహాగ్ని = వియోగమనెడు వహ్నియొక్క, శిఖా = జ్వాలలచేత, పరితప్త=మిక్కిలితపింపఁజేయఁబడిన, గాత్రి = దేహము గలది; ఔనలినవిరోధివంశజననాయకపుత్త్రి=అగునట్టిచంద్రవంశరాజపుత్త్రికయగుచంద్రిక; అత్యలఘుసువర్ణకాననవిహార్యసమాశుగకాండధారకున్.—అత్యలఘు= మిగులనధికమైన, సువర్ణకానన = సంపెఁగతోఁటలయందు, విహారి=సంచరించుచున్న, అసమాశుగకాండ = సాటిలేనిమందమారుతసందోహములయొక్క, ధారకున్ = పరంపరకు ; హాలహాలధారిదర్పపరిహార్యసమాశుగకాండధారకున్.—హాలహాలధారి=రుద్రునియొక్క "హాలాహలంహలహలంహాలహలంహాలాహలం" అని ద్విరూపకోశము, దర్పపరిహారి=గర్వమునుబరిహరించిన మన్మథునియొక్క, అసమ=సాటిలేని, ఆశుగ=బాణములయొక్క, కాండ=సంఘముయొక్క, ధారకున్=అంచునకు; తలంకసాగెన్=వడఁకసాగెను.

తే. బాల యీలీల మదనరో♦పాలికలక
రాలవర్తనచే మనః♦పాలిఁ గలఁకఁ
జెంది కుందంగఁ దన్నేత్ర♦జితచకోరి
చేరి యిట్లను సూక్తిరా♦జితచకోరి. 47

టీ. బాల=చంద్రిక ; ఈలీలన్ = ఈతీరున ; మదనరోపాలికలకరాలవర్తనచేన్.— మదన=మన్మథునియొక్క, రోపాలికల = శరపరంపలయొక్క, "పత్త్రీరోపఇషుర్ద్వయోః" అని యమరుఁడు, కరాలవర్తనచేన్=తీక్ష్ణవర్తనచేత; మనఃపాలిన్=హృదయసీమయందు; కలఁకఁజెంది=కలఁతపాతి; కుందంగన్=దుఃఖింపఁగా; తన్నేత్రజితచకోరిన్ = నేత్రములచే గెలువఁబడిన యాఁడుచకోరములుగలయాచంద్రికను ; సూక్తిరాజిత=సూక్తులచేత ప్రకాశించుచున్న; చకోరి=చకోరియనెడుప్రియసఖి; చేరి=పొంది; ఇట్లనున్ = వక్ష్యమాణప్రకారముగఁబలికెను.

చ. తలఁకెద వేల కీరవని♦తాజనవృత్తి కిఁ దేఁటి రానెలం
తల కెద వేల మీఱునిజ♦ధైర్యము పాయఁగఁ గుంది దేల కో
యిలనవలాలసారరుతి ♦ కింతి మనోజుఁడు సంఘటించుఁ బో
యిల నవలాలసాప్రచయ ♦ మీయెడఁ దన్భజియింప సత్కృపన్. 48

టీ. ఇంతి=ఓచంద్రికా ! కీరవనితాజనవృత్తికిన్=శుకాంగనాజనవర్తనమునకు ; తేఁటిరానెలంతలకున్=మధుపరాజస్త్రీలకు; తలఁకెదవేల = భయపడెదవేల ? కోయిలనవలాలసారరుతికిన్.—కోకిలస్త్రీలయొక్క శ్రేష్ఠధ్వనికి ; ఎదన్=హృదయమందు ; వేలమీఱునిజధైర్యము=మితిమీఱిననీధీరత్వము; పాయఁగన్ = తొలఁగఁగా; కుందెదేల = దుఃఖించెదవేల? ఇలన్=భూమియందు; మనోజుఁడు=మన్మథుఁడు; ఈయెడన్=ఇపుడు; తన్=తన్ను; భజింపన్=సేవింపఁగా; సత్కృపన్=మంచిదయచేత; నవలాలసాప్రచయము.—నవ=నూతనమైన, లాలసా=వేడుకయొక్క, ప్రచయము=ఉత్తరోత్తరాభివృద్ధిని;సంఘటించుఁబో=కూర్చునుబో.

అనఁగా మరుఁడు తన్నుఁ బూజించినవారికి ఉత్తరోత్తరాభివృద్ధిని ఘటిల్లఁజేయును గావున కుందఁ బని లేదని తాత్పర్యము.

తే. కాన నమ్ము నటద్భక్తి♦కలనమునఁ గ
రమ్ము నలినాశుగునిఁ గొల్వ ♦ రమ్య కేళి
కాననమ్మున కోనీల♦కంజనయన
రమ్ము నలి నాశుగతి యిప్డు ♦ ప్రబల ననుచు. 49

టీ. కానన్=అహేతువున; నమ్ము=విశ్వసింపుము.నలినాశుగునిన్=మన్మథుని;కరమ్ము=మిక్కిలి ; నటద్భక్తికలనమునన్ = ప్రకాశించుచున్నభక్తియుక్తిచేత ; కొల్వన్=సేవించు

టకు; రమ్యకేళికాననమ్మునకున్=మనోజ్ఞమగుక్రీడావనమునకు ; ఓనీలకంజనయన=ఓనీలోత్పలాక్షి! నలిన్=మిక్కిలి; ఆశుగతి=శీఘ్రగమనము ; ప్రబలన్ = అతిశయింపఁగా; ఇపుడు=ఈసమయమున; రమ్ము. అనుచున్=ఇటనుచు. దీనికి నుత్తరపద్యముతోనన్వయము.

మ. చెలి కేలందిన మాఱు పల్కక మనశ్చింతాకులస్ఫూర్తిఁ ద
త్కలకంఠీర వనంబుఁ జేర నరిగెన్ దత్పద్మినీమాళి స
త్కళకంఠీరవజాలకంబులు కడున్ గాటంబులై యుజ్జ్వల
త్కలకంఠీరవకామినీనినదరేఖం బల్విజున్ గూర్పఁగన్. 50

టీ. చెలి=సఖియగుచకోరి; కేలందినన్=చేయిఁబట్టఁగా; మాఱుపల్కక= బదులుమాటాడక; మనశ్చింతాకులస్ఫూర్తిన్.—మనశ్చింతా=మనోగతమైనప్రియవిషయకధ్యానముచేతనైన, ఆకులస్ఫూర్తిన్=వ్యాకులత్వప్రకాశముచేత; తత్కలకంఠీరన్.—తత్=ఆ, కలకంఠీ=చకోరియొక్క, ఇరన్=వాక్యముచేత; తత్పద్మినీమాళి=ఆపద్మినీజాతిస్త్రీరత్నమగుచంద్రిక; సత్కలకంఠీరవజాలకంబులు.—సత్=శ్రేష్ఠములైన, కలకంఠీ=కోకిలస్త్రీలయొక్క, రవజాలకంబులు=ధ్వనికదంబములు; కడున్=మిక్కిలి; గాటంబులై=దృఢములై; ఉజ్జ్వలత్కలకంఠీరవకామినీనినదరేఖన్.—ఉజ్జ్వలత్=ప్రకాశించుచున్న, కల=కాంతిగల, కంఠీరవ=సింహములయొక్క, కామినీ=స్త్రీలయొక్క, నినదరేఖన్=ధ్వనిరీతిని; బల్విజున్=గొప్పభయమును; కూర్పఁగన్=ఘటిల్లఁజేయుచుండఁగ; వనంబు=ఉద్యానవనమును; చేరఁగన్ = పొందుటకు; అరిగెన్=పోయెను.

ఆచంద్రిక తననెచ్చెలి యగుచకోరివాక్యమునకు మాఱు మాటాడక దానిచే యూఁతగాఁ గొని యుద్యానమునకు వెడలుచుండఁగా కోకిలస్త్రీస్వరములు సింహనాదములభంగిని భయము గలుగఁజేసె ననుట. అవి యామెకు మిగుల రాగోద్దీపకము లాయె నని ఫలితము.

శా. భ్రాజద్భక్తి నెదుర్కొనంగ వనగోపస్త్రీజనం బాప్తనీ
రేజాస్యానికరంబు తన్ గొలువఁ జేరెన్ గేళికారామ మా
రాజీవాంబక శింజినీనికరగర్జల్ హంసి నేర్వ న్మహో
రాజీవాంబకశింజినీవిరుతిఁ బర్వన్ వేఁడి నిట్టూర్పులున్. 51

టీ. ఆరాజీవాంబక = కమలనయనయగునాచంద్రిక; వనగోపస్త్రీజనంబు; వనగోప=ఉద్యానవనపాలికలగు, స్త్రీజనంబు=స్త్రీలు; భ్రాజద్భక్తిన్=ఒప్పుచున్నభక్తిచేత; ఎదుర్కొనంగన్=ఎదురుగరాఁగా; ఆప్తనీరేజాస్యానికరంబు.—ఆప్త=హితలయిన, నీరేజాస్యానికరంబు=స్త్రీలకదంబము; తన్=తన్ను; కొలువన్=సేవింపఁగా; శింజినీనికరగర్జల్.—శింజినీ=అందెలయొక్క, నికర=గుంపుయొక్క, గర్జల్=ధ్వనులను; హంసి=హంసస్త్రీ; నేర్వన్=అభ్యసింపఁగా; మహోరాజీవాంబకశింజినీవిరుతిన్.— మహాత్ = అధికమైన, రాజీవాంబక = మరునియొక్క, శింజినీ=అల్లెయొక్క, తుమ్మెదలబారుయొక్కయనుట, విరుతిన్=ఝుంకారము

చేత; "శిఞ్జినీనూపురజ్యయోః" అనిరత్నమాల; వేఁడి నిట్టూర్పులన్ =ఉష్ణమైనదీర్ఘ నిశ్వాసములను; పర్వన్ =వ్యాపింపఁగా; కేళి కారామము=క్రీడోద్యానమును; చేరెన్ =పొందెను.

అనఁగా నాచంద్రిక వనపాలికలు భక్తితో నెదుర్కొనఁగా సఖీవర్గము కొలుచుచుండఁగా హంసపలుకులం బోలునందెలచప్పుడుతోఁగూడి తుమ్మెదలఝుంకారములచేఁ గంది వేఁడినిట్టూర్పులు విడుచుచుఁ గేళికావనముం జేరె ననుట.

క. కువలాస్త్రరుజాగతిఁ బొక్కు వలాహకకచకు వనికకోను నయ్యెడఁ బం
త్క్కువలాంబకాళి సుధతేఁకువ లార్పుశుభోక్తిఁ దెల్పెఁ గూరిమి వొదలన్.

టీ. అయ్యెడన్ = ఆసమయమందు; కువలాస్త్రరుజాగతిన్ = మదనజ్వరప్రాప్తిచేత; పొక్కు వలాహకకచకున్ =తపించుచున్నచంద్రికకు; వలాహక మనఁగా మేఘము దానిఁ బోలుకచములు గలది వలాహకకచ; తక్కువలాంబకాళి.—తత్ =ఆ, కువలాంబకాళి=స్త్రీసమూహము; సుధతేఁకువలు.—సుధ=అమృతముయొక్క, తేఁకువలు=ధైర్యములను; అర్పుశుభోక్తిన్ =శమింపఁజేయుశుభమైనవాక్యముచేత; వనికకోను=ఉద్యానముయొక్కయందమును; కూర్మి=ప్రేమను; పొదలన్ =వృద్ధిపొందునట్లుగా; తెల్పెన్ =తెలిపెను.

కామజ్వరముచే వ్రేఁగుచున్న చంద్రికతో నాస్త్రీలు సుధకన్న మధురమైన పలుకులతో నుద్యానవనసౌందర్యముఁ దెల్పి రనుట.

సీ. బాలాంబుజతమాల•మాలాభినవజాల
జాలామృతోల్లోల•మట్ప్రదాఘు
రాగాదిపరమాగ•మాగాంతసుఖరాగి
రాగావరణభాగ•రాళిపవన
కేలీగృహస్థాలి•మాలిస్థితిపికాలి
కాలీనరవలోలి•తాధ్వగాత్మ
రాజీవశరవాజి•వాజీననిరతాజి
తాజీజనకరాజి•తామ్రఫలిక

తే. భవ్యబుతుకాంతకాంతతా•త్పర్యసృష్ట
ఘనవిషమబాణబాణసం•ఘాతకలిత
తిలకమధుగంధగంధసం•చులుకితాళి
కనదచిరధామధామ యీ•వ్వనిక గంటె. 53

టీ. బాలాంబుజతమాలమాలాభినవ జాలజాలామృతోల్లోలమట్ప్రదాఘు.—బాల=తరుణములైన, అంబుజ=పద్మములయొక్కయు, తమాలమాలా = కానుగపంక్తులయొక్కయు,

అభినవ=నూతనములగు, జాలజాల=మొగ్గలగుంపుయొక్క, అమృత=పూఁదేనియయందు, ఉల్లోల=మిక్కిలిఆసక్తములైన, షట్పద=భృంగములయొక్క, ఓఘ=సమూహముగలది; రాగాదిపరమాగమాగాంతసుపరాగరాగాభరణభాగరాళపవన.—రాగాది = దాడిమీవృక్షము మొదలుగాఁగల, పరమ=శ్రేష్ఠములైన, అగమ=వృక్షములయొక్క, అగాంత = పుష్పములయొక్క, సుపరాగ=మంచిపుప్పొడియొక్క, రాగ=రక్తిమయొక్క, ఆవరణ=ఆచ్ఛాదనమును, భాక్=పొందిన, అరాళ=కుటిలములగు, పవన=వాయువులుగలది; కేలీగృహాన్మాలిమాలిస్థితపికాలికాలీనరవలోలితాధ్వగాత్మ.—కేలీగృహాత్=విహారగృహములగుచున్న, మాలి=అశోకవృక్షములయొక్క, మాలి=అగ్రములయందు, స్థిత=ఉండిన, పికాలికా=కోకిలపంక్తులయొక్క, అలీన=స్ఫుటమైన, రవ=ధ్వనిచేత, లోలిత=చలింపఁజేయఁబడిన, అధ్వగ = పాంథులయొక్క, ఆత్మ=మనములుగలది; రాజీవశరవాజి వాజీననిరతాజితాజీజనకరాజితామ్రఫలిక.—రాజీవశర=మన్మథునికి, వాజి=అశ్వములైన, వాజీన=పక్షిశ్రేష్ఠములయొక్క, చిలుకలయొక్క యనుట, నిరతాజిత=ఎల్లప్పుడునోటువడని, ఆజీ=కలహములకు, జనక=హేతువైన, రాజిత=ఒప్పుచున్న, ఆమ్రఫలిక=మావిపండ్లుగలది; భవ్యఋతుకాంతకాంతతాత్పర్యసృష్టఘనవిషమబాణబాణసంఘాతకలితతిలకమధుగంధగంధసంచులికితాశ.—భవ్య=మనోజ్ఞమైన, ఋతుకాంత=వసంతునిచేత, కాంతతాత్పర్య=మంచియాసక్తిచేత, సృష్ట=సృజింపఁబడిన, ఘన = అధికములైన, విషమబాణబాణ=పుష్పములయొక్క, సంఘాత=సముదాయముతో, కలిత = కూడుకొన్న, తిలక=బొట్టుగులయొక్క, మధు=మకరందముయొక్క, గంధ=పరిమళముయొక్క, గంధ=లేశముచేత, ''గన్ధోగన్ధక ఆమోదే లేశేసంబన్ధగర్వయోః'' అని విశ్వము, సంచులుకిత=పుడిసిలింపఁబడిన, ఆశ=దిక్కులుగలదియునగు; ఇవ్వనిక=ఈయుద్యానమును; కనదచిరధామధామ.—కనత్=ఒప్పుచున్న, అచిరధామధామ=మెఱుపువంటికాంతిగలదానా! కంటె=చూచితివా?

నవాంభోజతమాలజాలకములపూఁదేనియయం దాసక్తము లగుతుమ్మెదలుగలదియు, దాడిమి మొదలగుమ్రాఁకుల పుష్పరేణువులచేత వ్యాప్తములగుతెమ్మెరలు గలదియు, బాటసారులచిత్తములను జలింపఁజేయు నశోకవృక్షవాసి కోకిలధ్వనులు గలదియు, ఎల్లప్పుడు చిలుకలకు జగడము గలుగఁజేయు మావిపండ్లు గలదియు, వసంతోదయమున నుదయించిన బొట్టుగులపువ్వులవాసనాలేశముచేఁ బుడిసిలింపఁబడిన దిక్కులుగలదియునగునీవనిని జూడుమనుట.

చ. తలిరుమెఱుంగుచాయ శుక • దారరవ స్తనితంబు లెచ్చని
స్తులతిలకాభ్రముల్ గురియఁ • జొచ్చెఁ బయోజదళాక్షి గాడ్పుచాల్
గలయ మరందదంభమున • గాటపువర్షము గంటె సాంద్రము
త్కలి యమరం దదంభమున • కై యళిచాతకకోటి పర్వఁగన్. 54

టీ. పయోజదళాక్షి=పద్మపత్త్రములఁబోలు కన్నులుగలదానా! నిస్తులతిలకాభ్రముల్ = సాటిలేనితిలకవృక్షములనెడుమబ్బులు; తలిరుమెఱుంగుచాయ = చిగురులనెడు మెఱపుడాలు;

శుకదారరవస్తనితంబులు.—శుకదారరవ=ఆఁడుచిలుకల రవములనెడు, స్తనితంబులు=ఉఱుములు; ఎచ్చన్=మించఁగా; గాడ్పుచాల్=వాయుపరంపర; కలయన్=కూడఁగా; సాంద్రమత్కల=దట్టమైనసంతోషకల; అమరన్=ఒప్పఁగా; తదంభమునకై = ఆమకరందమనెడుజలమునకై; అళిచాతకకోటి=తుమ్మెదలనుచాతకములగుంపు; పర్వఁగన్=వ్యాపింపఁగా; మరందదంభమునన్=మకరందవ్యాజముచేత; గాటపువర్షము = గాఢమైనవర్షమును; కురియన్ చొచ్చెన్=కురియసాగెను. కంటె. రూపకకైతవాపహ్నుతులు.

చ. హితమహిలాలలామ వరి♦యింపఁగ నిప్డు నిరస్తహీరభా
తతికరదీ పికాళివని♦తాశుభగీతి సువర్ణజాలసం
తతికరదీపికాళి వని♦ దార్కొన నామని రాఁగఁ దుంగసౌ
ధతలము లెక్కెఁ గన్గొన ము♦దంబునఁ జిల్కలరాణివాసముల్. 55

టీ. నిరస్తహీరభాతతికరదీ.—నిరస్త=తిరస్కరింపఁబడిన, హీరభాతతిక=వజ్రకాంతిపరంపరకలిగిన, రదీ=దంతములుగలదానా! ఇదిచంద్రికాసంబోధనము; పికాళివనితాశుభగీతిన్.—పిక=కోకిలలయొక్కయు,అళి=తుమ్మెదలయొక్కయు,వనితా=స్త్రీల నెడు స్త్రీలయొక్క, శుభగీతిన్=మంగళమైనపాటతోను; సువర్ణజాలసంతతికరదీపికాళిన్.—సువర్ణజాల=సంపెఁగమొగ్గలయొక్క, సంతతి = సమూహమనెడు, కరదీపికా=కరములయందలిదీపములయొక్క, ఆళిన్=పంక్తితోను; వని=వనమనెడు స్త్రీ; దార్కొనన్=సమీపింపఁగా; ఆమని=వసంతము; హితమహిలాలలామన్.—హిత=ఇష్టమైన, మహిలాలలామన్=ప్రేంకణమనెడుస్త్రీరత్నమును; వరియింపఁగన్=వరియించుటకు; రాఁగన్=వచ్చుచుండఁగా; ఇప్డు=ఈసమయమందు; చిలుకలరాణివాసముల్=శుకాంగనలనెడురాజస్త్రీలు; ముదంబునన్=సంతసముచేత; తుంగసౌధతలములు=పొన్నలయు మోరటసమూహములయు ప్రదేశములనెడు ఉన్నతసౌధప్రదేశములను; ఎక్కెన్=అధిష్ఠించెను.

అనఁగా పికాళివనితలపాటలతోడను సంపెఁగమొగ్గ లనెడుకర దీపికలతోను వని యెదుర్కొన మహోత్సవముగా వసంతుం డనునొకవరుండు ప్రేంకణమనెడు స్త్రీరత్నమును వరించుటకై వచ్చినయట్లున్న దనియు వానిం గాంచ ముదమున శుకాంగనలు తుంగసౌధము లెక్కిన యట్లున్న దనియు భావము.

చ. నలువుగ మొగ్గగుబ్బ లెద♦ నాటఁగఁ గౌఁగిటఁ జేర్చి నేర్పుతో
మలయధరాధరానిలకు♦మారవిటుండు లతాప్రసూనకో
మలయధరాధరాసవము ♦ మాటికి నానుచు నొక్కె మోదముల్
మలయ ధరాధరాగ్రణికు♦మారిక చూపటు నిల్వఁ జేయవే. 56

టీ. ధరాధరాగ్రణికుమారిక=రాజపుత్రికయగుచంద్రికా! మలయధరాధరానిలకుమారవిటుండు.—మలయధరాధర=మలయపర్వతముయొక్క, అనిలకుమార= మందమారుతమనెడు, విటుండు=జారుఁడు; నలువుగన్=ఒప్పిదముగా; మొగ్గగుబ్బలు = మొగ్గలనెడు స్తనములు;

ఎదన్=హృదయమందు; నాటఁగన్=తాఁకునట్లు; కౌఁగిటన్=భుజాంతరమందు; నేర్పుతోన్ = చాతుర్యముచేత; తార్చి=కదియించి; లతాప్రసూనకోమలయధరాధరాసవము.—లతా=లతయ నెడు, ప్రసూనకోమల=స్త్రీయొక్క, అధరాధర=అధరోష్ఠస్థానీయమైన, ఆసవము=మద్యమును; వాటికిన్=సారెకు; ఆనుచున్=పానము చేయుచు; మోదముల్=సంతసములు; మలయన్=వ్యాపింపఁగా; చొక్కెన్=సుఖపరవశుఁడయ్యెను. చూపు=దృష్టిని; అటునిల్వన్ = ఆవైపు నిల్చునట్లు; చేయవే=చేయుమా.

మఱియు మారుతము సేయువిటచరితంబు నాలోకింపు మనుట.

శా. స్ఫీతాళ్యావృతిభూర్యయోవలయల♦క్ష్మిం బూని పాంథాంగనా
జాతాసృక్పరిషిక్తరీతి నరుణ♦చ్ఛాయల్ మనం బొల్చునీ
శాతప్రాససమూహజాలకుల మె♦చ్చన్ జేసెఁ బో చిత్తభూ
శాతప్రాససమూహ జాలజవిభా♦సంజేతృవక్త్రేందుకా. 57

టీ. జాలజవిభాసంజేతృవక్త్రేందుకా.—జాలజ = జలజసంబంధనియగు, విభా = కాంతిని, సంజేతృ=జయించిన, వక్త్రేందుకా=చంద్రునివంటి మోముగలదానా! స్ఫీతాళ్యావృతిభూర్యయోవలయలక్ష్మిన్.—స్ఫీత=అధికమైన, అళి=తుమ్మెదలయొక్క, ఆవృతి = ఆవరణము నెడు, భూరి=అధికమైన, అయోవలయ=ఇనుముతొడుపుయొక్క, లక్ష్మిన్=సంపదను; పూని=వహించి; పాంథాంగనాజాతాసృక్పరిషిక్తరీతిన్.—పాంథాంగనా = విరహిస్త్రీలయొక్క, జాత=సమూహముయొక్క; అసృక్=రక్తముచేత, పరిషిక్తరీతిన్=తడుపఁబడిన దాని రీతిచేత; అరుణచ్ఛాయల్=రక్తకాంతులు; మనన్=కలుగఁగా; పొల్చునీశాతప్రాస సమూహజాలకులము.—పొల్చు = ఉదయించిన, ఈశాతప్రాస = ఈయెఱ్ఱగన్నేరుల సంబంధియైన, సమూహ=గుంపుయొక్క, జాలకులము=మొగ్గలగుంపు; చిత్తభూశాత ప్రాససమూహన్.—చిత్తభూ=మన్మథునియొక్క, శాత=తీక్ష్ణమైన, ప్రాస=ఆయుధవిశేషములనెడు, సమూహన్=మంచివితర్కమును; ఎచ్చంజేసెఁబో=హెచ్చునట్లు చేసెనుగదా!

అనఁగా నెఱ్ఱగన్నేరుమొగ్గలకు తుమ్మెదలు చుట్టుకొనియుండఁగా నవి యినుపతొడుపుతోఁగూడి పాంథస్త్రీరక్తసిక్తమైన మన్మథుని తీక్ష్ణప్రాసాయుధములను బోలియుండె ననుట.

చ. వలదొర మెచ్చఁగా ఘనసు♦వర్ణపలాశకవాసనాగతిన్
గలసి రజస్స్ఫులింగములు♦ గ్రక్కుచు వీవలి వేగ చేరి రా
నలిని భయానఁ దాఱె నసి♦యాడెడునెమ్మది పూని కంటివే
నలి నిభయాన దా రెనసి♦నవ్వ లతల్ తెలిపూలచాలుచేన్. 58

టీ. వీవలి=వాయువు; వలదొర=మరుఁడు; మెచ్చఁగాన్=శ్లాఘింపఁగా; ఘనసువర్ణపలాశకవాసనాగతిన్.—ఘన=అధికమైన, సువర్ణ=చంపకములయొక్కయు, పలాశక=మో

దుగులయొక్కయు, వాసనాగతిన్=సౌరభప్రాప్తిచేత; ఘన = మేఘముయొక్క, సువర్ణ= మంచిరంగువంటిరంగుగల, పలాశ=రక్కసులయొక్క, వాసనాగతిన్=సంస్కారప్రాప్తిచేతనని యర్థాంతరము; రెంటికి నభేదాధ్యవసాయముచేత, వాసనాప్రాప్తియనెడు వాసనాప్రాప్తిచేతనని యర్థము; కలిసి=కూడి; రజస్స్ఫులింగములు=పరాగములనెడు మిణుఁగురులను; గ్రక్కుచున్=వమనముఁజేయుచు; వేగ=శీఘ్రముగా; చేరరాన్=సమీపమునకురాఁగా; అలిని=ఆఁడుతుమ్మెద; భీరువనితోఁచుచున్నది; లతల్=తీవలు; తొఱ=తొము; ఎనసి=కూడుకొని; నలిన్=మిగులను; తెలిపూలచాలు చేన్=తెల్లనిపూబంతిచేత; నవ్వన్=హాసింపఁగా; అసియాడెడు నెమ్మదిన్=కదలుచున్ననిండుమనస్సునను; పూని=వహించి; భయానన్=భయముచేత; తొలెన్=దాఁగెను. ఇభయాన=ఓగజగమనా! కంటివే=చూచితివా.

అనఁగా వీవలి పలాశచంపకవాసనావాసితమై రజస్సనెడుమిణుఁగుఱులను గ్రక్కుచు వచ్చుచున్నదనియు, దానివలన నాఁడుతుమ్మెద వెఱచి డాఁగిన దనియు, పూచినలతలు దానిం జూచి నవ్వునట్లున్న వనియు భావము. చంపకమునకు తుమ్మెద వెఱచుట ప్రసిద్ధము.

మ. అలరెం గొల్వయి కీరభూపతి రసా◆లాస్థానదేశంబునన్
లలితోఁ దాఱనిసొంపు మించ నళిబా◆లారత్నలాస్యైకలీ
ల లితోదారపికాళిగీతవిహృతుల్ ◆ రాజిల్లఁ గన్గొంటివే
లలితోదారనగప్రసూనరసజా◆లద్వేషిదంతాంశుకా. 59

టీ. లలితోదారనగ ప్రసూనరస జాలద్వేషిదంతాంశుకా.—లలిత = మనోజ్ఞమైన, ఉదార=అధికమగు, నగ=వృక్షములయొక్క, ప్రసూనరస=పూఁదేనియయొక్క, జాల=రాశికి, ద్వేషి=పగదైన, దంతాంశుకా = పెదవిగలదానా! అనఁగాఁ దేనియ లాలుకుమోవి గలదానాయనుట; కీరభూపతి=చిలుకయను రాజు; రసాలాస్థానదేశఁబునన్=తియ్యమామిడియను కొలువుకూటపు ప్రదేశమందు; కొల్వయి=కూర్చుండియనుట; లలితోన్=ప్రీతితోడ; తాఱని సొంపు=ఉడివోనిసొంపు; మించన్=అతిశయింపఁగా; అలిబాలారత్న లాస్యైకలీలలు.—అలిబాలారత్న=భృంగబాలికారత్నములయొక్క, లాస్య=లాస్యమండలి, ఏక=ముఖ్యమయిన, లీలలు=విలాసములు; ఇతోదారపికాళిగీతవిహృతుల్.—ఇత=పొందఁబడిన, ఉదార=అధికమైన, పికాళి=పికసమూహముయొక్క, గీత=గానముయొక్క, విహృతుల్ విహారములు; రాజిల్లన్= ప్రకాశింపఁగా; అలరెన్=ఒప్పెను. కన్గొంటివే=చూచితివా?

అనఁగా రసాలమందున్నకీరము సభామందిరమందుఁ గూర్చుండినభూపతిని బోలియున్న దనియు తుమ్మెదలయాటలును గోయిలలపాటలును వనితల లాస్యగానంబులవలె నుండిన వనియు భావము.

చ. అళినికరాందుకాప్తిఁ గిస◆లావళి రాంకవపర్ణలబ్ధిను
జ్వలనుమపద్మయుక్తి మధు◆సాతిరసాప్లుతి నొప్పి చైత్రభూ

తలవరకుంజరాజితవిధానము గైకొనెఁ గాంచు నీలకుం
తల వరకుంజరాజి వెలిఁ దార్చుచుఁ బాంథజనాక్షివీథికిన్. 60

టీ. నీలకుంతల=ఓనీలవేణీ! వరకుంజరాజి.—వర=శ్రేష్ఠమగు, కుంజ=పొదరిండ్లయొక్క, రాజి=చాలు; అళినికరాందుకాప్తిన్.—అళినికర = తుమ్మెదెలగుంపుల నెడు, అందుక=నిగళములయొక్క, ఆప్తిన్=ప్రాప్తిచేత; కిసలావళిరాంకవవస్త్రిలబ్ధిన్.—కిసలావళి=చిగురుటాకులగుంపనెడు, రాంకవవస్త్రి=మృగరోమసంబంధియైన వస్త్రియుయొక్క, లబ్ధిన్=ప్రాప్తిచేత; ఉజ్జ్వలసుమపద్మయుక్తిన్.—ఉజ్జ్వల=ప్రకాశించుచున్న, సుమ=పువ్వులనెడు, పద్మ=బిందువులయొక్క, యుక్తిన్=సంబంధముచేత; "పద్మకంబిన్దుజాలకం" అని యమరుఁడు; మధుసాతిరసాప్లుతిన్.—మధు=మకరందమనెడు, సాతిరస=దానోదకమందు, ఆప్లుతిన్=మునకచేతను; ఒప్పి; పాంథజనాక్షివీథికిన్=పాంథులయొక్క దృక్ప్రదేశమునకు, వెలి=వెలిపుసు; తార్చుచున్; చైత్రభూతలవరకుంజరాజితవిధానమున్.—చైత్ర = వసంతుఁడనెడు, భూతలవర=భూపతియొక్క, కుంజర=ఏనుఁగులయొక్క, అజిత=ఓటువడని, విధానమున్=విధిని; కైకొనెన్=స్వీకరించెను. కాంచు=చూడుము.

అనఁగా నికుంజములు తుమ్మెద లను నిగళములతోను చిగురాకు లనెడు రాంకవములతోను పువ్వు లనెడునిబ్బెపుబొట్టులతోను పూఁదేనియ యనెడుమదోదకముతోను విలసిల్లి పాంథులచూపులకు వెలిపు గల్గించుచు వసంతుఁ డనురాజుయొక్క గజములచాలువలె రాజిల్లె ననుట.

మ. సరసం గాంచవె రూపదర్శనవిధాజాతాత్మవైచిత్ర్యవ
త్సురసారంగము లొందెఁ జెంత విగళత్సూనాసవప్రోజ్జ్వల
త్సురసారంగము లధ్వగాంతరసరఃక్షోభావహోద్వృత్తి భా
సురసారంగము లంగజానలశిఖాస్తోకాన్యధూమాకృతుల్ 61

టీ. రూపదర్శనవిధాజాతాత్మవైచిత్ర్యవత్సుర.—రూప=సౌందర్యముయొక్క, దర్శనవిధా=దర్శనప్రకారమువలన, జాత=పుట్టిన, ఆత్మ=చిత్తములయొక్క, వైచిత్ర్యవత్=ఆశ్చర్యముగలిగిన, సుర=దేవతలుగలదానా! సరసన్=సమీపమందు; అధ్వగాంతరసరఃక్షోభావహోద్వృత్తి భాసురసారంగములు.—అధ్వగ=పాంథులయొక్క, అంతర=హృదయములనెడు, సరః=కొలఁకులకు, క్షోభావహ=క్షోభకరమైన, ఉత్=అధికమైన, వృత్తి=వ్యాపారముచేత, భాసుర = ప్రకాశించుచున్న, సారంగములు = గజములును; అంగజానిలశిఖాస్తోకాన్యధూమాకృతుల్.—అంగజానిల = మదనాగ్నియొక్క, శిఖా = జ్వాలలయొక్క, స్తోకాన్య = అధికమైన, ధూమ = పొగలయొక్క, ఆకృతుల్ = ఆకారములు గలిగినవియునగు; సారంగములు=తుమ్మెదలు; చెంతన్=సమీపమునందు; విగళత్సూనాసవప్రోజ్జ్వలత్సురసారంగములు.—విగళత్=జాఱుచున్న, సూనాసవ=మకరందముచేత, ప్రోజ్జ్వలత్=

మిక్కిలి ప్రకాశించుచున్న; సురసా=సర్పాక్షితీఁగలయొక్క, రంగములు=స్థానములను; ఒందెన్=పొందెను. కాంచవె=చూడుమా.

అనఁగా సర్పాక్షితీవలందుఁ బూఁదేనియ జాఱుచుండఁగానందుఁదుమ్మెదలు వసించిన వనియు నవి పాంథమనంబు లనెడు కోలఁకులను క్షోభపెట్టుటయందేనుఁగులుగాను కామాగ్నిశిఖలధూమంబులుగాను నున్న వనియు భావము.

క. అని వారణయానామణి, కనివారణ వాణిఁ దెలిపి ♦ యవ్వనిసిరి యొ
య్యన సారసగంధివితతి, యనసారసుమప్రతాన♦హారణోత్సుకతన్. 62

టీ. అని=ఉక్తప్రకారముచేత; వారణయానామణికిన్=చంద్రికకు; అనివారణవాణిన్=అడ్డములేని ఫణితిచేత; అవ్వనిసిరిన్=ఆవనసంపదను; తెలిపి=బోధించి; ఒయ్యనన్=తిన్నగా; సారసగంధివితతి = పద్మగంధులైన స్త్రీలసంఘము; అనసారసుమప్రతానహారణోత్సుకతన్.—అనసార = అసారముగాని, అనఁగా శ్రేష్ఠమైన, సుమప్రతాన=పుష్పసంఘముయొక్క, హారణ=కోయుటయందు, ఉత్సుకతన్=ఔత్సుక్యముచేత. దీనికిముందున్న రగడతో నన్వయము.

వృషభగతి రగడ.

చెలువ చెలువపుమొగ్గచాల్కొని ♦ చేరు చేరుగఁ గూర్చు విచ్చుట
నలిని నలినిభకుంతలామణి ♦ నన్నునన్నులు వేఁడ ముచ్చట
తిలకతిలకకులంబు గన్గొన ♦ దివ్యదివ్యాగములపోలిక
నలరు నలరుల నెనయు రోలం♦బాళి బాళి చిగుర్చ బాలిక
యింతి యింతిటఁ జేరఁ దగదె ను♦మేర మేరయె వకుళపాళిని
కాంతకాంతవశరము లల్లవె ♦ కాంత కాంతమె చాల హాళిని
నారి నారికెడంబుచాయల ♦ నవ్వ నవ్వలిపొన్న పూచెను
కోరకోరసిజ రతి నది నేఁ ♦ గోర గోరఁట లజ్జ నాఁచెను
రాగరాగపరాగ మిచ్చె న♦రంగురంగునఁ బొల్చె నెక్కువె
రాఁగ రాగతఁ బట్టుకొనఁ గల♦రవమురవములు దెరల దక్కువె
పొదలుపొదలును దఱిసి నెలఁతలు ♦ బొగడఁ బొగడలమీఁద మాటికి
మదిర మది రహిఁ బెంచ నుమిసిన ♦ మధురమధురస మెనవుఁ బోటికి
కొమ్మ కొమ్మలఁ గోసి విరులు చ♦కోరి కోరినలతలు దూఱుచు
నిమ్మ నిమ్మదితగమి వేఁడిన ♦ నీక నీకనకాళిఁ దాఱుచు
నాన నానవ మాన నీలల♦నాళి నాళిక పిలుచుఁ బెంపున
వాసవాసమదీప్తి గల వన ♦ వనిత వని తగె గోఁగు సొంపునఁ

చేలి చేలి యొనర్చు నలకం♦ కేలి కేలిడి యూఁచుపాళావళి
సాలసాలపనశుకపిక మధు♦పాలిపాలిటి కూర్మికావళి
రామ రామవినీలవంజుల♦రాజి రాజిలు నంశ్రిఫి చేర్చవె
శ్యామ శ్యామలకోరకమ్ములను♦సరసనరసముదయము గూర్చవె
యక్క యక్కనకమున మనె నీ♦యాన యానవకళిక యిత్తతి
నిక్క నిక్కము ద్రుంచి యొసఁగుదు ♦ నీవు నీవు లోసంగ బిత్తరి
ప్రమద ప్రమదతఁగేల నంటఁగ ♦ రమ్మ రమ్మమరంగఁ జూతము
కొమరె కొమరె ఘఁగించు నవసుమ♦కులముకులముల భృంగజాతము
అప్ప యప్పల్లవకదంబక ♦ మాఁగు మా గురుజవము నెగడఁగ
నిప్ప నిప్పద్మాననావ్రజ ♦ మించుమించుపలుకులఁ బొగడఁగ
నలమ నలమదిరాక్షి గౌరవిభ♦లాలి లాలితమైన డాయుచు
కలికి కలికిఁ గడంగె సారస♦కాండకాండచయంబు మ్రోయుచు
వేడు వేడుక నిత్తు నీ కి♦వ్వేళ నే లతికాంతవారము
దాడి దాడిమగమికిఁ జేరఁగఁ ♦ దగునె దగునెడ కరిగెఁ గీరము
తరుణి తరుణికఁ జేరు నెచ్చెలి ♦ దరము దరమున నూర్చు పీవలి
పరువఁ బరువముఁ బొందె వావిలి ♦ బాల బాలచ్ఛదసుమావళి
యీవ యీవరకినలసంతతి ♦ కేవ కేవలరయతఁ జేరకు
మావి మావిభు సూను సేనకు♦మహిమ మహి మను కెంకి దూఱకు
లతిక లతికమనీయవక్వ్వభ♦లమ్ము లమ్మును మున్నె హెచ్చఁగ
రతిని రతినిభ పాటఁబాడఁగ♦రా ధరాధరకుచలు మెచ్చఁగ
యలసి యలసితపత్ర మెనసె ఘ♦నాత్మ నాత్మకు హితము చేకొన
నలికె నలి కెరలంగ వల దిభ♦యాన యానగమాళిఁ బైకొన
నెలమి నెలమి న్నలము నెమ్మిగ ♦ మెత్త మెత్తనికుసుమజాలము
లలినిలలిని నడంచెఁ గను మో ♦ యతివ యతివరకనకసాలము
నలఁచె నలచెలి నతులకీరపి♦కాళికాళిధ్వనులబలువగ
వలయు వలయుతిఁ జిత్రగతి దై♦వాఱువారువహాబాణుఁ గొలువఁగ. 63

టీ. చెలువ=ఓకొమ్మయని సంబోధనము; చెలువపు మొగ్గచాల్=అందమైన మొగ్గలచాలును; కొని=తీసికొని. చేరు=రమ్ము. ఇచ్చటన్=ఈప్రదేశమందు; చేరుగన్ = సరముగాను; కూర్తువు=గ్రథింతువు. నలినిన్=మిక్కిలి; అలినిభకుంతలామణి=స్త్రీరత్నమా; అన్నులు=స్త్రీ)

లు; వేఁడఁగ=ప్రార్థింపఁగా; ముచ్చటన్=అందముచేత; నన్నున్=నను; చేయు అని వెనుక కన్వయము. బాలిక=ఓచిన్నదానా! తిలకతిలకకులంబు = తిలకవృక్షములగుంపు; కనుఁగొనన్=చూడఁగా; దివ్యదివ్యాగములపోలికన్.—దివ్య=సుందరములైన, దివ్యాగముల=కల్పవృక్షములయొక్క, పోలికన్=సామ్యముచేత; అలరున్=ఒప్పును. రోలంబాళి=భృంగపంక్తి; అలరులన్=పువ్వులను, బాళి=అసక్తి; చిగుర్పన్ = చిగిరించునట్లు; ఎనయున్ = పొందును. ఇంతి=ఓనారి! ఇంత=ఇంచుక; ఇటన్=ఇచట; చేరఁదగదె = చేరఁగూడదా? వకుళపాళిన్ = వకుళపుష్పముల చాలునందు; సుమేర = పుష్పరసమునకు; "ఇరాభూవాక్సురాప్సుస్యాత్" అని యమరుఁడు; మేరయె = అవధికలదా? కాంతకాంతవశరములు.—కాంత = మనోజ్ఞములైన, కాంతవ = స్మరసంబంధులైన, "క[illegible]" అణ్ప్రత్యయమువచ్చి కాంతవ అనియైనది, శరములు=బాణములు, అనఁగా పుష్పములనుట; అల్లవె=అవిగో. కాంత=ఓచెలి! చాలఁపాళిని=మిగులప్రీతిచేత; కాంతమె=స్వాంతమా. నారి=చెలి; నారికేడంబుచాయలన్ = టెంకాయచెట్లవైపులను; నవ్వన్=నవ్వఁగా; అవ్వలిపొన్న=అటువైపుననున్న పున్నాగము; పూచెను=పుష్పించెను. కోరకోరసిజ=కలికలవంటిచన్నులుగలదానా! అనిసంబుద్ధి; రతిన్=ఆసక్తిచేత; నేన్=నేను; కోరన్=వాంఛింపఁగా; అది=ఆస్త్రీ; గోరఁటలు=కురవకములను; నాఁచెను=అపహరించెను. అజ్జ=ఆశ్చర్యము! రాగరాగపరాగము=రాగప్రధానమైన దాడిమీపుష్పరజము; అరఁగునంగునన్ = వేడియొప్పున; పొల్చెన్=ఒప్పెను. ఇచ్చన్=యథేచ్ఛగా; ఎక్కువె=అధిష్ఠింపుమా! రాఁగన్=వచ్చుచుండఁగా; రాగతన్=అనురాగముగలుగుటచేత; పట్టుకొనన్=పట్టుకొనఁగా; కలరవము=కోకిలము; రవములు తెరలదు=కూఁతలుడుగదు. అక్కవె=స్త్రీనిఁగూర్చియను నయావచనము; పొదలుపొదలును=ఏపుమీఱిననికుంజములను; తటిసి=సమీపించి; చెలంతిలు=స్త్రీలు; పొగడన్=మెచ్చఁగా; పొగడలమీఁదన్=పొగడవృక్షములపై; మాటికిన్=సారెకు; మదిరన్=మద్యమును; మదిన్=హృదయమందు; రహిన్=ప్రీతి; మించఁగన్=అతిశయింపఁగా; ఉమిసిన్=నిష్ఠీవనము సేయఁగా; పోటికిన్=బదులుగాననుట; మధురమధురసము= తీయనిమకరందరసమును; ఎనపున్=పొందించును. అనఁగాఁ బొగడలమీఁద స్త్రీలుమద్యము నుమియఁగానవిపోటికి మధురసము నిచ్చుననుట. వానికి స్త్రీముఖశీధువు దోహదము గావున స్త్రీలు మద్యము నుమియఁగానే యవి పుష్పించి పూఁదేనియ లొలికె నని భావము. కొమ్మ=ఓస్త్రీ! కొమ్మలన్=శాఖలయందు; విరులు=పువ్వులను; కోసి; చకోరి=చంద్రికచెలి; కోరినపొదలు =మనసువచ్చిననికుంజములను; తూఱంచున్=చొరఁబాఱుచు; ఇమ్మున్=నెలవును; ఇమ్ముదితగమి= ఈ స్త్రీసంఘము; వేఁడినన్=ప్రార్థించినను; ఈకన్=ఒసంగకయు; ఈకనకాళిన్=ఈసంపెఁగచాలునందు; తొలఁచున్=దాఁచును. ఆసన్=ఆశచేత; ఆసవము=మద్యమును; ఆనన్=పానముచేయుటకు; ఈలలనాళి=ఈ స్త్రీలగుంపు; అలికన్=చెలిని; పెంపునన్=అతిశయముచేత; పిలుచున్=ఆహ్వానముఁజేయును. వాసవాసమదీప్తి.—వాసవ=రత్నసంబంధియగు, "వసూరత్నే ధనే వసు" అనియమరుఁడు, అసమ=సాటిలేని, దీప్తి=కాంతి; కలననన్=కలిగినట్టిచిగురుచే; వనిత=ఓలలనా! వని=వనము; గోఁగుసొంపునన్ = గోఁగుచెట్టుయొక్క అందముచేత; తగన్ = ఒప్పెను. కేలిన్=క్రీడయందు; గేలిరొనర్పన్=నవ్వులాడినందునకు; అశోకంకేలిన్=అశోకమందు; కేలిడి=హస్త

గేలి గేలి యొనర్చు నలకం◆ కేలి కేలిడి యూఁచుహావళి
సాలసాలపనశుకపిక మధు◆పాలిపాలిటి కూర్చికావళి
రామ రామవినీలవంజుల◆రాజి రాజిలు సంశ్రిఫి చేర్చవె
శ్యామ శ్యామలకోరకమ్ములను◆సరసనరసముదయము గూర్చవె
యక్క యక్కనకమున మనె నీ◆యాన యానవకళిక యిత్తతి
నిక్కనిక్కము ద్రుంచి యొసఁగుదు◆ నీవు నీవు లోనంగ బిత్తరి
ప్రమద ప్రమదతఁగేల నంటఁగ◆ రమ్మ రమ్మమరంగఁ జూతము
కోమరె కోమరె సఁగించు నవసుమ◆కులముకులముల భృంగజాతము
అప్ప యప్పల్లవకదంబక◆ మాఁగు మా గురుజవము నెగడఁగ
నిప్ప నిప్పద్మాననావ్రజ◆ మించుమించుపలుకులఁ బొగడఁగ
నలమ నలమదిరాక్షి గౌరవిభ◆లాలి లాలితమైన డాయుచు
కలికి కలికిఁ గడంగి సారస◆కాండకాండచయంబు ప్రోయుచు
వేడు వేడుక నిత్తు నీ కి◆వ్వేళ నే లతికాంతవారము
దాడి దాడిమగమికిఁ జేరఁగఁ◆ దగును దగునెడ కరిగెఁ గీరము
తరుణి తరుణికిఁ జేరు నెచ్చెలి◆ దరము దరమున నూర్చు పీవలి
పరువఁ బరువముఁ బొందె వావిలి◆ బాల బాలచ్ఛదనుమావళి
యీవ యీవరకిసలసంతతి◆ కేవ కేవలరయతఁ జేరకు
మావి మావిభు సూను సేనకు◆మహిమ మహి మనుకొంకి దూఱకు
లతిక లతికమనీయపక్వఫ◆లమ్ము లమ్మును మున్నె హెచ్చఁగ
రతిని రతినిభ పాటఁబాడఁగ◆రా ధరాధరకుచలు మెచ్చఁగ
యలసి యలసితపత్ర మెనసె ఘ◆నాత్మ నాత్మకు హితము చేకొన
నలికె నలి కెరలంగ వల దిభ◆యాన యానగమాళిఁ బైకొన
నెలమి నెలమి న్నలము నెమ్మిగ◆ మెత్త మెత్తనికుసుమజాలము
లలినిలలిని నడంచెఁ గనుమో◆ యతివ యతివరకనకనాలము
నలఁచె నలచెలి నతులకీరపి◆కాళికాళిధ్వనులబలువగ
వలయు వలయుతిఁ జిత్రగతి దై◆వాఱువారుహబాణుఁ గొలువఁగ. 63

టీ. చెలువ=ఓకొమ్మయని సంబోధనము; చెలువపుమొగ్గచాల్=అందమైనమొగ్గలచాలును; కొని=తీసికొని. చేరు=రమ్ము. ఇచ్చటన్=ఈప్రదేశమందు; చేరుగన్ = సరముగాను; కూర్తువు=గ్రథింతువు. నలినిన్=మిక్కిలి; అలినిభకుంతలామణి=స్త్రీరత్నము; అన్నులు=స్త్రీ

లు; వేఁడన్=ప్రార్థింపఁగా; ముచ్చటన్=అందము చేత; నన్నున్=నను; చేరు అని వెనుక కన్వయము. బాలిక=ఓచిన్నదానా! తిలకతిలకకులంబు = తిలకశ్రేష్ఠములగుంపు; కనుఁగొనన్=చూడఁగా; దివ్యదివ్యాగములపోలికన్.—దివ్య=సుందరములైన, దివ్యాగముల=కల్పవృక్షములయొక్క, పోలికన్=సామ్యము చేత; అలరున్=ఒప్పును. రోలంబాళి=భృంగపంక్తి; అలరులన్=పువ్వులను, బాళి=ఆసక్తి; చిగుర్పన్ = చిగిరించునట్లు; ఎనయున్ = పొందును ఇంతి=ఓనారి! ఇంత=ఇంచుక; ఇటన్=ఇచట; చేరఁదగదె = చేరఁగూడదా? వకుళపాళిన్ = వకుళపుష్పముల చాలునందు; సుమేర = పుష్పరసమునకు; "ఇరాభూవాక్సురాప్సుస్యాత్" అని యమరుఁడు; మేరయె = అంగీకలదా? కాంతకాంతవశరములు.—కాంత = మనోజ్ఞములైన, కాంతవ = స్మరసంబంధులైన, "కంతుశబ్దముమీఁద అణ్ప్రత్యయమువచ్చి కాంతవ అనియైనది, శరములు=బాణములు, అనఁగా పువ్వులనుట; అల్లవె=అవిగో. కాంత=ఓచెలి! చాలహాళిని=మిగులప్రీతి చేత; కాంతమె=స్వాంతమా. నారి=చెలి; నారికేడంబుచాయలన్ = టెంకాయచెట్లవైపులను; నవ్వన్=నవ్వఁగా; అవ్వలిపొన్న=అటువైపుననున్న పున్నాగము; పూచెను=పుష్పించెను. కోరకోరసిజ=కలికలవంటిచన్నులుగలదానా! అనిసంబుద్ధి; రతిన్=ఆసక్తిచేత; నేన్=నేను; కోరన్=వాంఛింపఁగా; అది=ఆస్త్రీ; గోరఁటలు=కురవకములను; నాఁచెను=అపహరించెను. అజ్జ=ఆశ్చర్యము! రాగరాగపరాగము=రాగప్రధానమైన దాడిమీపుష్పరజము; అరఁగుసంగునన్ = వేదియొప్పున; పొల్చెన్=ఒప్పెను. ఇచ్చన్=యథేచ్ఛగా; ఎక్కువె=అధిష్ఠింపుమా! రాఁగన్=వచ్చుచుండఁగా; రాగతన్=అనురాగముగలుగుట చేత; పట్టుకొనన్=పట్టుకొనఁగా; కలరవము=కోకిలము; రవములు తెరలదు=కూఁతలుడుగదు. అక్కవె=స్త్రీనిగూర్చియను నయువచనము; పొదలుపొదలును=ఏపుమీఱిననికుంజములను; తఱిసి=సమీపించి; కెలంతలు=స్త్రీలు; పొగడన్ = మెచ్చఁగా; పొగడలమీఁదన్ =పొగడవృక్షములపై; మాటికిన్ = సారెకు; మదిరన్ =మద్యమును; మదిన్ = హృదయమందు; రహి=ప్రీతి; మించఁగన్ =అతిశయింపఁగా; ఉమిసినన్=నిష్ఠీవనము సేయఁగా; పోటికిన్=బదులుగాననుట; మధురమధురసము= తీయనిమకరందరసమును; ఎనపున్=పొందించును. అనఁగాఁ బొగడలమీఁద స్త్రీలుమద్యము నుమియఁగానవిపోటికి మధురసము నిచ్చుననుట. వానికి స్త్రీముఖశీధువు దోహదము గావున స్త్రీలు మద్యము నుమియఁగానే యవి పుష్పించి పూఁదేనియ లొలికెనని భావము. కొమ్మ=ఓస్త్రీ! కొమ్మలన్=శాఖలయందు; విరులు=పువ్వులను; కోసి; చకోరి=చంద్రిక చెలి; కోరినపొదలు =మనసువచ్చిననికుంజములను; తూఱుచున్=చొరఁబాఱుచు; ఇమ్మున్=నెలవును; ఇమ్ముదితగమి=ఈ స్త్రీసంఘము; వేఁడినన్=ప్రార్థించినను; ఈకన్=ఒసంగకయు; ఈకనకాళిన్=ఈసంపెఁగచాలునందు; తాఱుచున్=దాఁచును. ఆసన్=ఆశచేత; ఆసవము=మద్యమును; ఆనన్=పానము చేయుటకు; ఈలలనాళి=ఈ స్త్రీలగుంపు; ఆళికన్=చెలిని; పెంపునన్=అతిశయము చేత; పిలుచున్=ఆహ్వానముఁజేయును. వాసవాసమదీప్తి.—వాసవ=రత్నసంబంధియగు, "వసూరత్నేధనేవసు" అనియమరుఁడు, అసమ=సాటిలేని, దీప్తి=కాంతి; కలననన్=కలిగినట్టిచిగురు చేత; వనిత=ఓలలనా! వని=వనము; గోఁగుసొంపునన్ = గోఁగుచెట్టుయొక్క అందము చేత; తగన్ = ఒప్పెను. కేలిన్=క్రీడయందు; గేలియొనర్పన్=నవ్వులాడినందునకు; అలకంకేలిన్=అయశోకమందు; కేలిడి=హస్త

మనూని; ఊఁచుహావళి=ఊఁచునట్టియుపద్రవము; సాలసాలపన శుకపిక మధుపాలిపాలిటికిన్.— సాలసాలపన=అలసాలాపములతోఁగూడిన, శుక=చిలుకలయొక్క, పిక=కోయిలలయొక్క, మధుప=తుమ్మెదలయొక్క, ఆలిపాలిటికిన్=పంక్తిపాలిటికి; ఊర్మికావళి=షడూర్ములచాలు. రామ = ఓనారీ! రామవినీలవంజులరాజిన్.—రామ = ఒప్పుచున్న; వినీలవంజుల = నీలాశోకములయొక్క, రాజిన్ = పంక్తియందు; రాజిలునంఘ్రిన్ = ఒప్పుచున్న చరణమును; చేర్పవె=నిలుపవె. శ్యామ=ఓచెలీ! శ్యామలకోరకమ్ములను = ప్రేంకణములయొక్క మొగ్గల చేత; సరససరసముదయము= శ్లేష్మహారములయొక్క సమూహమును; కూర్పవె. అక్క=ఓ తల్లీ! అక్కనకమునన్=అసంపెఁగయందు; ఆనవకళిక=ఆక్రొత్తమొగ్గ; ఇత్తటిన్ = ఇపుడు; మనెన్=వర్ధిల్లెను. నిక్కన్=నిక్కనట్లు; బిత్తరి=చెలీ! నీవు; నీవులు=మూలధనములను; ఒసంగన్=ఈయఁగా; త్రుంచి=కోసి; ఒసఁగుదున్=ఇత్తును. నిక్క=నిశ్చయము. ప్రమద= ఓ స్త్రీ! ప్రమదతన్=సంతోషముగలుగుటచేత; కేలన్ అంటఁగన్=చేతస్పృశించుటకు; అరమ్ము=వేగము; అమరంగన్= అమరునట్లు; రమ్ము. చూతము=అవలోకింతము. కొమరె=సంబుద్ధి; నవసుమకులముకులములన్.—నవ=నూతనములైన, సుమకుల=పుష్పకులములయందు, ముకులములన్=మొగ్గలయందు; భృంగజాతము=అళికులము; కొమరెసఁగించున్=అందమునతిశయింపఁజేయును. అప్ప=ఓవనితా! అప్పల్లవకదంబకము=ఆచివురుజొంపమును; ఇప్పన్=ఇప్పచెట్టునందు; గురుజవము=అధికమగువేగము; నెగడఁగన్ = వృద్ధిఁబొందఁగా; ఇప్పద్మానవ్రజము= ఈస్త్రీసంఘము; ఇంచున్=చెఱకును; మించుపలుకులన్=అతిశయించువాక్కులచేత; పొగడఁగన్=కొనియాడఁగా; ఆఁగుమా=నిలుపుమా! అనియన్వయము. కొరవిఫలాలి=కొరవిచెట్ల పండ్లు; లాలితము ఐనన్ = ఒప్పిదముకాఁగా; అలమదిరాక్షి=అస్త్రీ; డాయుచున్ = సమీపించుచు; అలమన్=ఆక్రమింపఁగా; కలికి=ఓపడఁతీ! సారసకాండకాండచయంబు.—సారసకాండ= మరునియొక్క, కాండ=అశ్వములగు చిలుకలయొక్క, చయంబు=గుంపు; మ్రోయుచున్= రొదసేయుచు; కలికిన్=జగడమునకు; కడంగెన్. వేఁడు=ప్రార్థింపుము. వేమకన్=సంతతమున; నీకున్; ఈవేళన్=ఇపుడు; వే=శీఘ్రముగా; లతికాంతవారము=కుసుమములగుంపును; ఇత్తున్=ఒసంగుదును. దాడి=ఉపద్రవము; దాడిమగమికిన్=దాడిమీసందోహమునకు; చేరఁగఁదగదు = పొందఁగఁదగదు. కీరము = శుకము; ఏగునెడకున్ = ఉచితమైనప్రదేశమునకు; అరిగెన్ = చనెను. తరుణి = పడుచా! నెచ్చెలి=ప్రియసఖి; కర్త, తరుణికన్= షిన్నకోరకంటకను; దరమదరమునన్ = కొంచెముభయముచేత; చేరున్. ఉర్వీవలిన్=నిశ్వాసమారుతముచేత; వానిలి = వానీరము; బాలచ్ఛదసుమావళి = లేఁతయాకులయొక్కయు పుష్పములయొక్కయుగుంపు; పరువన్ = వ్యాపింపఁగా; పరువమున్ = ప్రాయమును; పొందెన్. బాల=అనిసంబోధనము. ఈవ=నీవే; ఈవరకిసలసంతతికిన్ = ఈశ్రేష్ఠములగు చిగురుటాకులగుంపునకు; ఏవ=రోఁత. కేవలరయతన్=అధికవేగముచేత; చేరకు=పొందకు. మావి=ఆమ్రము; మావిభునూను సేనకున్.—మావిభునూను= మన్మథునియొక్క, సేనకున్= సేనయగుకాముకులకు; మహిమన్ = ఉత్కర్షచేత; మహిన్=భూమియందు; మను చెంకి= [illegible]టు. [illegible]చొరఁబడకు. చొరఁజాలినచో బాధగలుగునసుట. అతికలు=తీవలు; [illegible]మనీయపక్వఫలములు=[illegible]గల మహోక్షములు ఖండితవతియునగు పండ్లను, మున్నె=పూర్వ

మే; హెచ్చఁగన్=మించఁగా; అమ్మన్=విక్రయించును; ఇచ్చునసుట. రతినిభ=రతీదేవితోఁ దుల్యయగుదానా! రతిన్=ఆసక్తిచేత; ధరాధరకుచలు=ఉన్నతకుచలగు స్త్రీలు; మెచ్చఁగన్ పాటపాడఁగన్=పాటపాడుటకు; రా=రమ్ము. అలసితపత్త్రము=ఆహంసము; "హంసాస్తు శ్వేతగరుతః" అనియమరుఁడు; అలి=తుమ్మెద; కెరలంగన్=రేఁగఁగా; ఘనాత్మన్=మేఘమనెడుబుద్ధిచేత; అలసి=బడలి; ఆత్మకున్=మనమునకు; హితము=ఇష్టమును, చేకొనన్=గ్రహించుటకు; అలికెన్=వెఱచెను. ఇభయాన=ఓగజగమనా! ఆనగమాలిన్=ఆవృక్షశ్రేష్ఠమును; పైకొనన్; వలదు=కూడదు. ఎలమిన్=సంతసముచేత; నెలమిన్న అలమునెమ్మొగము=చంద్రుని యుత్కర్షము నాక్రమించునట్టియందమైన మోమును; ఎత్తన్; మెత్తనికుసుమజాలములు=మృదువులైనకుసుమపుంజములు; అలినిలలినిన్=ఆఁడుతుమ్మెదయొక్క వేడుకను; అడంచెన్. అతివరకనకసాలమున్=మిక్కిలి శ్రేష్ఠముగు సంపెఁగవృక్షమును; ఓ యతివ=ఓనారీ! కనుము=చూడుము. అనియన్వయము. అల చెలిన్=ఆచంద్రికను; అతులకీరపికాళికాళి ధ్వనులబలువగ.—అతుల=అధికములగు, కీర=చిలుకలయొక్కయు, పిక=కోయిలలయొక్కయు; ఆళికా=సంఘముయొక్క, అళి=తుమ్మెదలయొక్క, ధ్వనుల=శబ్దములయొక్క, బలువగ=అధికమైనయుంపము; అలఁచెన్=శ్రమపటిచెను. బలయుతిన్=బలముతోడ; చిత్రగతిన్=అశ్చర్యవర్తనచేత; దైనాలువారుపాబాణున్ = ఒప్పుపద్మబాణుని; కొలువఁగన్ = సేవింపఁగా; వలయున్.

చ. అని వనకేళికల్ సలిపి ♦ యమ్మహిళాతిలకాళిరాగపు
  ష్ట్యనువలితాత్మ చాల వెల♦య న్మహిళాతిలకాళి రాగపు
  ష్పనికర మప్డు గైకొనియెఁ ♦ బద్మకరాప్తసుతాపహారిశో
  భనగతిఁ బూని మించ నల♦పద్మకరాప్తసుతార్హణేహచేన్. 64

టీ. అని=ఈప్రకారముగ; వనకేళికల్=వనవిహారములను; సలిపి=చేసి; అమ్మహిళాతిలకాళి=ఆస్త్రీరత్నములచాలు; రాగపుష్ట్యనువలితాత్మ.—రాగపుష్టి=అనురాగపూర్తితో, అనువలిత=కూడుకొన్న, ఆత్మ=చిత్తము; చాలన్=మిక్కిలి; వెలయన్=ప్రకాశింపఁగా; పద్మకరాప్తసుతాపహారి శోభనగతిన్.—పద్మకరా=పద్మములనుబోలు కరములుగలచంద్రికచేత, ఆప్త=పొందఁబడిన, సుతాప=అధిక సంతాపమును, హారి=హరించెడు, శోభనగతిన్=మంగళగతిని; పూని=వహించి; మించన్=అతిశయింపఁగా; అలపద్మకరాప్తసుతార్హణేహచేన్.—అలపద్మకరా=ఆ లక్ష్మీదేవికి, ఆప్తసుత=కూర్మిపుత్త్రుఁడగు మన్మథునియొక్క, అర్హణ=పూజయందు, ఈహచేన్=వాంఛచేత; మహిళాతిలకాళిరాగపుష్పనికరము.—మహిళా = ప్రేంకణముల యొక్క, తిలకాళి=బొట్టుగుచాలుయొక్క, రాగ=దాడిమములయొక్క, పుష్పనికరము= పూలసమూహమును; అప్డు=ఆసమయమందు; గైకొనెన్=స్వీకరించెను.

ఆస్త్రీనికరము వనవిహారానంతరము చంద్రికాసంతాపశాంతిని గోరి స్మరపూజనమునకై యనురాగముతోఁ ప్రేంకణతిలకాదిపుష్పచయాపచయమును జేసె ననుట.

సీ. తలిరాకు ద్రుంపరే ♦ కలకంఠసమవాయు
  దర్పంబు డుఱుఁగనీ ♦ తరుణులార

విరిదుమ్ము దూల్పరే • విస్ఫుటాసమవాయ
వీయాభ దెలిలనీ • వెలఁదులార
యలరులు దునుమరే • యళి విలాసమ పాయఁ
గలఁకచే భ్రమయనీ • చెలువలార
ఫలశాళి గోయరే • చిలుకచాల్ సమవాయ
గతిఁ జాల నడలనీ • యతివలార

తే. యని మనోంబుజవీథిఁ బా•యని మదాప్తి
మారబలరాజ్యవష్టంభ•మారకప్ర
చార మూనుచు నపు డని•చారలీల
రామ లందఱు వెడలి రా•రామపదవి. 65

టీ. తరుణులార! కలకంఠసమవాయదర్పంబు.—కలకంఠసమవాయ = కోయిలల సంఘముయొక్క, దర్పంబు=గర్వము; తలఁగనీ=ఉడుగనీ. కలిరాకుఁ=చిగురాకును; తుంపరే=కోయరే. కోయిలలు కిసలభక్షణములు గాన నది దుంచిన వానిదర్ప ముడుగు ననుట. వెలఁదులార! విస్ఫుటాసమవాయవీయాభ.—విస్ఫుట = మిగుల వ్యక్తమైన, అసమ=సాటిలేని, వాయవీయ=వాయుసంబంధియగు, వాయుశబ్దముమీఁదఛ ప్రత్యయము, ఆభ=కాంతి; తెలిలనీ=తొలఁగనీ; విరిదుమ్ము=పుష్పరజము; తూల్పరే=రాల్పరె. విరిదుమ్ముచేతఁ గూడిన వాయువునకు మొదటి విస్ఫుటాసమకాంతి తొలఁగు ననుట. చెలువలార! అళివిలాసమ.—అళి=తుమ్మెద; విలాసమ=తనయొక్క విలాసము; పాయఁ=పోఁగా; కలఁకచేఁ=కలఁతచేత; భ్రమయనీ=భ్రమనొందనీ. అలరులు=పువ్వులు; తునుమరే=కోయరె. అళి పుష్పలిహము గావున నవి కోసినచో దాని విలాస ముడుగు ననుట. అతివలార! చిలుకచాల్=చిలుకలబారు; సమవాయగతిఁ=నిత్యసంబంధప్రాప్తిచేత; చాలఁ=మిక్కిలి; అడలనీ = దుఃఖింపనీ. ఫలశాళిఁ=పండ్లచాలును; కోయరే=ఛేదింపరే, చిలుకలు ఫలములను భక్షించునవి గావున వానిఁ గోసినయెడ నవి దుఃఖించు ననుట. అని=ఇటని; మనోంబుజవీథిఁ = హృత్పద్మప్రదేశమును; పాయని మదాప్తిఁ=ఎడయని దర్పప్రాప్తిచేత; మారబలరాజ్యవష్టంభమారక ప్రచారము.—మార=మన్మథునియొక్క, బల=సైన్యములగు శుకపికాదులయొక్క, రాజి = పంక్తియొక్క, అవష్టంభ=గర్వమునకు, మారక=సంహారకమైన, ప్రచారము=వ్యాపారమును; ఊనుచుఁ=వహించుచు; అనీచారలీలఁ.—అనీచ=అధికమైన, అరలీలఁ=వేగక్రియచేత; రామలందఱు=స్త్రీలందఱు; ఆరామపదవిఁ=ఉద్యానప్రదేశమందు; వెడలిరి=పైఁజెప్పినపనులుచేయుటకు బయలుదేఱిరి.

క. వరవనకేళీభవదు, స్తరఘనచూళీతనూత•తశ్రీమ ముడిపెన్
సరళలతానరళలతా, విరళలతాంతాప్తపవన•విసరము లంతన్. 66

టీ. అంతన్ = అటుపిమ్మట; సరళలతా సరళలతావిరళలతాంతాప్త పవనవిసరము లు.—సరళ=దేవదారువృక్షములయొక్క, లతా=కొమ్మలయొక్క, సరళ=ఋజువులైన, లతా=బండిగురివెందతీవలయొక్క, అవిరళ=సాంద్రములైన, లతాంత=కుసుమములను, ఆప్త=పొందినట్టి, పవనవిసరములు = వాయువులగుంపులు; వరవనకేళీభవదుస్తర ఘనచూళీతనూతతశ్రమము —వర=శ్రేష్ఠమైన, వనకేళీ=వనవిహారముచేత, భవ=ఉదయించిన, దుస్తర=తరింపరాని, ఈరెండుశ్రమమునకు విశేషణములు, ఘనచూళీ= మేఘమునుబోలుకచములుగల స్త్రీలయొక్క, తనూ = శరీరములయందు, తత = విస్తృతమైన, శ్రమము = ఆయాసమును ; కూడిపెన్ = పోఁగొట్టెను.

ఉ. ఆరమణీలలామనివ♦హంబు గనుంగొనెఁ జెంత నున్నమ
త్సారముదారసాభియుత♦జాలపదార్భకదోలదూర్మికా
సారము దారసావరణ♦సారసశోభితతీర మొక్కకా
సార ముదారసారసని♦శాపవృతాసితఫేనతారమున్. 67

టీ. ఆరమణీలలామని వహంబు=ఆస్త్రీసమూహము; చెంతన్=సమీపమందు ; ఉన్నమత్సారముదారసాభియుతజాల పదార్భకదోల దూర్మికాసారము.—ఉన్నమత్ = పెరుఁగుచున్న, సార=శ్రేష్ఠమైన, ముదారస=సంతోషరసముతో, అభియుత=కూడుకొన్న, జాలపదార్భక=హంసపోతములకు, దోలత్ =ఉయ్యాలలగుచున్న, ఊర్మికా=తిరఁగలయొక్క,ఆసారము = పరంపరలు గలది; దారసావరణసారస శోభితతీరము.—దార = పెంటిపిట్టలచేత, సావరణ=ఆవరణముతోఁగూడిన, సారస=బెగ్గురులచేత, శోభిత=ప్రకాశింపఁజేయఁబడిన, తీరము=ఒడ్డుగలదియు;ఉదారసారసనిశాప వృతాసితఫేనతారమున్.—ఉదార=అధికములగు, సారస=కమలములనెడు, నిశాప=చంద్రుని, వృత=ఆవరించిన, అసితఫేన=మిగుల తెల్లనగునురుఁగులనెడు, తారమున్=రిక్కలుగలదియునగు; ఒక్కకాసారము=ఒకసరస్సును; కనుంగొనెన్=చూచెను.

వ. కనుంగొని యభంగపదాంగదనిస్వానభంగిం దాము వచ్చుతెఱం గెఱింగి యుప్పొంగుచుం దటకటకకాననదేవతాజనంబులు దార్చి నవిడిఁదిపిండులవ డువునం గమనీయకళికాముక్తావళికావితానంబులం గ్రమసమీరసమాగమగళత్కుంకేళి పాళికాప్రసవధూళికారింఛోళికారాంకవాస్తరణవితానంబులం గనకకత్యామార్గభాసమాన పరిపక్వఫలాభిరామరంభాపూగంబులం గనత్సుగంధమరందరసగంధతైలబంధురబంధుజీవకోరకదీపకళికాపూగంబులం గనుపట్టుచు రంగుమీఱుకూలరంగరంగత్కుడుంగంబు లంతరంగంబునకు వేడుక రంగలింప మరాళమందయానాథవళవర్ణపరిపూరితంబై యొప్పుమీఱుప్రతీరశోభనభవనంబుననిస్తులస్థలపద్మవివాహవీథికాసీమంగూర్చు

న్న బెగ్గురుపెండ్లకొడుకునకు సుంకులు చల్ల ఘనవేశికాసమాజంబు విరంజితకింజల్కకలమపుంజసంజితదరవికసితశోణకంజోదూఖలంబునఁ దంచుముసలంబులసొంపునఁ దదంతరంబునం బతనోత్పతనంబు సలుపుమత్తమధుపమాలికలు లోచనానులాసంబు చాలం బొందింపఁ గాసారకళిందనందినీహ్రదప్రదేశంబు చయ్యనం జొరఁబాఱి కాలకమలలతాకాళియకాకోదరపర్యంకంబు మెట్టి తన్మృణాలభోగంబు వలఱెక్కకేలి నందునం బొందుపడ నిందీవరపలాశఫణాముఖంబులమరందవిషపరంపరలు వెడల న్నిజకృష్ణమూర్తిభావంబు సార్థకంబై వర్తిల్ల నర్తనంబు సలుపుకలహంసకులావతంసంబులు ప్రశంసనీయంబులై చూపట్టఁ జందనాచలపవమానకందళీసముద్గతలోహితారవిందరజోవ్రజసమావృతగగనభాగకల్పితసంధ్యాసమయముకుళితపుండరీకాంతరసంవసదమందహిందోలఝంకారంబు లుపాంగంబులుగా నఖిలజగజ్జయసముజ్జృంభితశంబరారిబిరుదగద్యపద్యజిగాసాకలితమానసజలాధిదేవతాజనంబులు పూనినపంసిండికాయల దండియలదండిఁ దిర్యక్ప్రసారితైతైకనాళకైకైకకోశరాజంబులు హర్షోత్కర్షంబు పచరింప మిత్రమండలసంయోజితమహోత్సవంబు నవంబుగా నొంది యాత్మప్రియకామినీయుక్తంబై సారసచారులోచనాశుభగానంబు లనూనంబై దనరఁ గుశేశయనిజనివేశనూతనప్రవేశమంగళ మంగీకరింప నొయ్యనొయ్యన నరుదెంచురథాంగవంశరత్నంబున కెత్త హల్లకినీపల్లవాధరామతల్లికలు పూనిన జాళువాకద లారతిపళ్లెరంబులసొంపున హరిత్పరాగహరిద్రాచూర్ణసంవ్యాప్తతత్ప్రసవరసపూరాంతరదృశ్యమానమానితకేసరభక్తాభిరామంబు లగుహల్లకస్తోమంబులుల్లాసంబు పల్లవింపఁజేయ నిజాంతరంగఖేదకరనిరర్గళఘనాఘనైకప్రకారం బెల్లకాలంబు నెనయ కుండం గోరి కమలకాండభక్షణంబు సలుపుచుఁ గమలాసనాధీనమానసంబునం గరంబు స్వకీయహంసత్వంబు ప్రసిద్ధిం బొందఁ దపంబు సలుపుపోలుపున నస్తోకశోకనదాశ్రమమధ్యంబున నుదాత్తతత్పత్త్రోవీతిహోత్రకీలంబులు చుట్టు వలగొన నఖండానందంబున నక్షియుగం బర మోడ్చి యచలితస్ఫురణంబు వహించి రహించురాయంచలు హృదయాంచలంబున కంచితాద్భుతంబు మించం గావింప నిజవిలోచనసౌందర్యసమాలోకనజనితత్రపాభరంబున ముడింగి యున్నకుముదంబులం గాంచి యుబ్బునఁ దద్విలాసదిదృక్షాగరిమంబు పక్షీకరించియుత్కు

ద్రస్యదంబున నెగసి తద్విభవంబునకు వెఱచి మరలం దాఱుతీరున నుద్వర్తనాపవర్తనంబులం బరఁగు బేడిసమీలపిట్టిపాటు లతికౌతుకంబు పుట్టింప నతిసమీపసంచరచ్చిత్రభాను హేతిజాతంబులఁబరితాపంబు నొంది మందపవనసందోహాందోళితనవీనేందీవరబృంద మధుబిందుసేచనంబు గోరివారిజాతాంతరంబున లీనం బైనయంభోధరపథంబున రోధోదేశవలయిత మనోజ్ఞమాలతీమాధవీమహిలామల్లికా ముఖ్యవల్లికా కీర్ణనీరంధ్రపలాశపాండిత్యంబునంబ్రబద్యోతనద్యోతప్రభావంబుపాయంగను పట్టుత్తారకావారంబుల మురువున నరవిందమందిరాళిందనివాసిసానందమిళిందసుందరీసుందరాపఘనఘనప్రభాక్రాంతజలంబులపయింబొడకట్టుపాండురడిండీరఖండమండలంబులు సంబరంబులు పొదలింప నమరియు నక్కొలంకు మహితాబ్జకామినీజాలపరిభ్రాజితంబు గావున నళిమిథునమీనకుళీరమకరాదిసంయుతం బై మంజులహార్యన్వితార్యమలసద్విహారభాసురంబు గావునఁ గమనీయకాదంబసుమనోవికసనవిరాజితం బై మనోజ్ఞహంసకులాధిరాజరామాభిరామప్రస్థానవిశేషంబు గావున నకుంఠతరతరోవిజృంభమాణనానాప్లవగవీరా రాజ తోకలాహలలీలాచులుకితదిశాంతం బై యొప్పమీఱి చెప్పరానిమోదంబు ముప్పిరిగొనఁజేయ నప్పుడంతు లప్పద్మాలయజలవిహారదోహదంబునఁ జిలువపుత్తడివలువలు నడల్చి పావడలు దాల్చి శృంగంబులు గై కొని యొయ్యనొయ్యనొయ్యారంబు మించ డిగ్గి యపుడు. 68

టీ. కనుంగొని.—దీనికి డిగ్గియను పచనాంత క్రియతోనన్వయము; అభంగపదాంగదని స్వానభంగిక్.—అభంగ = కొట్టుపాటులేని, పదాంగద = కాలియందెలయొక్క, నిస్వానభంగిక్=ధ్వనిరీతిచేత; తాము ; వచ్చుతెఱంగుక్=వచ్చువిధమును ; ఎఱింగి=తెలిసికొని; దీనికి కానన దేవతాజనంబులు కర్తలు; ఉప్పొంగుచుక్=విజృంభించుచు; తటకటకకానన దేవతాజనంబులు.—తట=తీరము నెడు, కటక=రాజధానియందలి, కానన దేవతాజనంబులు = వనదేవతాజనములు ; తార్చినవిడిఁదిపిండులవడువునక్.—తార్చిన=ఒనరించినట్టి, విడిఁది = నివేశస్థానములయొక్క, పిండులవడువునక్ = సమూహముల భంగిని ; కమనీయకళికా ముక్తావళికా వితానంబులక్.—కమనీయ = మనోజ్ఞములగు, కళికా=మొగ్గలనెడు, ముక్తావళికా=ముత్యపుఘాలులయొక్క, వితానంబులక్=మేలుకట్లచేతను; క్రమసమీరసమాగమ గళత్కంకేళిపాళికా ప్రసవధూళికారింఛోళికా రాంకవాస్తరణవితానంబులక్.—క్రమ=ఇంపైన, సమీర=వాయువుయొక్క, సమాగమ=చక్కనిరాకచేత, గళత్=జాఱుచున్న, కంకేళిపాళికా=అశోకవృక్షముల పంక్తులయొక్క, ప్రసవ=పువ్వులయొక్క, ధూళికారింఛో

శికా=పరాగపటలమనెడు, రాంకవాస్తరణ=రత్నకంబళములయొక్క, వితానంబులన్=సమూహములచేతను; కనక కక్ష్యామార్గభాసమాన పరిపక్వఫలాభిరామ రంభాపూగంబులన్.—కనక కక్ష్యా=సంపెఁగచాలనెడు బంగరుహర్మ్యప్రకోష్ఠములయొక్క, మార్గ=మార్గములయందు, భాసమాన=ప్రకాశించుచున్న, పరిపక్వఫల=మాఁగినపండ్లచేత, అభిరామ=ఒప్పుచున్న, రంభాపూగంబులన్=అరఁటిపోఁక మ్రాఁకులచేత; కనత్సుగంధమరందరస గంధతైలబంధురబంధుజీవకోరకదీపకలికా పూగంబులన్.—కనత్=ప్రకాశించుచున్న, సుగంధ=పరిమళగంధముగలిగిన, మరందరస=మకరందరసమనెడు, గంధతైల=గందపునూనెచేత, బంధుర=దట్టములైన, బంధుజీవకోరక దీపకలికా=దాసనమొగ్గలనెడు కలికలవంటి దీపములయొక్క; పూగంబులన్=సమూహములచేతను; కనుపట్టుచున్.—చూపట్టుచు; రంగుమీఱుకూలరంగరంగత్కుడుంగంబులు.—రంగుమీఱు=అతిశయించుచున్న, కూలరంగ=తీరప్రదేశమందు, రంగత్=ఒప్పుచున్న, కుడుంగంబులు=పొదరిండ్లు; అంతరంగంబునకున్=చిత్తమునకు; వేడుకన్=ఉత్సవమును; రంగలింపన్=కలయ మెదపఁగానుట; మరాళమందయానాధవళవర్ణపరిపూరితంబై.—మరాళమందయానా = హంసస్త్రీలనెడు స్త్రీలయొక్క, ధవళవర్ణ=శుభ్రకాంతియనెడు ధవళమను గీతములవర్ణములచేత, పరిపూరితంబై=నిండినదియై; ఒప్పుమీఱుప్రతీరశోభన భవనంబునన్.—ఒప్పుమీఱు = ఒప్పిదముచేత మించునట్టి, ప్రతీరశోభన భవనంబునన్=తీరమనెడుకల్యాణగృహమందు; నిస్తులస్థలపద్మవివాహపీఠికాసీమన్.—నిస్తుల=సాటిలేని, స్థలపద్మ= మెట్టదామరయనెడు, వివాహపీఠికా= పెండ్లిపీఁటయొక్క, సీమన్=ప్రదేశమందు; కూర్చున్న బెగ్గురుపెండ్లికొడుకునకున్=కూర్చుండిన బెగ్గురుపక్షియను పెండ్లికొడుకునకు; సుంకులు=వివాహకాలమందు వధూవరులపై చల్లెడువడ్లు; చల్లన్=చల్లుటకు; ఘనవేణికా సమాజంబు.—ఘనవేణికా=గొప్పకాల్వలనెడుస్త్రీలయొక్క, సమాజంబు=సంఘము; విరంజితకింజల్కకమలపుంజసంజితదరవికసితశోణకంజోదూఖలంబునన్.—విరంజిత = మిక్కిలిప్రకాశించుచున్న, కింజల్క=కేసరములనెడు, కమలపుంజ=పద్మరాశిచేత, సంజిత=కూడుకొన్న, దరవికసిత=కొంచెమువిరిసిన, శోణకంజ=రక్తోత్పలమనెడు, ఉదూఖలంబునన్=రోలునందు; దంచుముసలంబుసొంపునన్=దంచెడిరోఁకళ్ళయందంబున; తదంతరంబునన్=ఆకమలమధ్యమున; పతనోత్పతనంబున్=పడుటలేచుటలను; సలుపుమత్తమధుపమాలికలు=చేయుచున్న మదించిన తుమ్మెదబారులు; లోచనానందంబు=నయనానందమును; చాలన్ = మిక్కిలి; పొందింపన్=కూర్పఁగా; కాసారకళిందనందినీహ్రదప్రదేశంబు.—కాసార=సరస్సులనెడు, కళిందనందినీ=యమునానదియొక్క, హ్రదప్రదేశంబు=అగాధజలప్రదేశమును; చయ్యనన్=శీఘ్రముగా; చొరఁబాఱి=చొచ్చి; కాలకమలలతాకాళియకాకోదరపర్యంకంబు.—కాలకమల=నీలోత్పలసంబంధియగు, లతా=తీవయనెడు, కాళియకాకోదర=కాళియుఁడను సర్పముయొక్క, పర్యంకంబు=చుట్టను; మెట్టి=త్రొక్కి; తన్మృణాలభోగంబు.—తత్=ఆకాలకమలసంబంధియగు, మృణాల=తూఁడనెడు, భోగంబు=సర్పశరీరమును; "భోగస్సుఖేస్త్ర్యాదిభృతావహేశ్చఫణకాయయోః" అనియమరుఁడు; వలఱెక్కకేలిసందునన్=కుడిపక్షమనెడు హస్తమధ్యమందు; పొందుపడన్=అమరునట్లు; ఇందీవరపలాశఫణాముఖంబులన్.—ఇందీవరపలాశ=నీలోత్పలదళములనెడు, ఫణాముఖంబులన్=పడగలయొక్కయగ్రభాగములవలన; మరందవిషపరం

పరలు=మకరందమనెడువిషముయొక్క ధారలు; ఎడలన్ =బయలు వెడలునట్లు; నిజకృష్ణమూర్తిభావంబు=తనవల్లనిదేహముకలుగుటయనెడు శ్రీకృష్ణత్వము; సార్థకంబై=అర్థవంతమై; వర్తిల్లన్ = వర్తించునట్లు; నర్తనంబున్ =నాట్యమును; సలుపుకలహంసకులావతంసంబులు=చేయుచున్న ధార్తరాష్ట్రశ్రేష్ఠంబులనుట; ప్రశంసనీయంబులై=శ్లాఘింపఁదగినవియై; చూపట్టన్ = అగపడఁగా; చందనాచలపవమానకందళీసముద్గతలోహితారవిందరజోవ్రజసమావృత గగనభాగకల్పితసంధ్యాసమయముకుళితపుండరీకాంతరసంవసదమందహిందోల ఝుంకారంబులు.—చందనాచలపవమాన=మలయమారుతముయొక్క, కందళీ=మోసులచేత, సముద్గత = మీఁదికివెడలిన, లోహితారవిందరజోవ్రజ = ఎఱ్ఱదామరలపుప్పొడులగుంపుచేత, సమావృత=వ్యాప్తమైన, గగనభాగ=ఆకాశప్రదేశముచేత, కల్పిత=కల్పింపఁబడిన, సంధ్యాసమయ = సాయంకాలముచేత, ముకుళిత=మోడ్పునొందిన, పుండరీక=తెల్లఁదామరలయొక్క, అంతర=మధ్యప్రదేశమందు, సంవసత్ =వసించిన, అమంద=అధికములగు, హిందోళ = తుమ్మెదలయొక్క, ఝుంకారంబులు=మ్రోఁతలు; ఉపాంగంబులుకాన్ = సుతులుకాఁగా; అఖిలజగజ్జయసముజ్జృంభితశంబరారిబిరుదగద్యపద్యజిగాసాకలితమానస జలాధిదేవతాజనంబులు.—అఖిలజగత్ =ఎల్లలోకములయొక్క, జయ=గెలుపుచేత, సముజ్జృంభిత=మిగులనుప్పొంగిన, శంబరారి=మరునియొక్క, బిరుద=జయచిహ్నములతోఁగూడిన, గద్యపద్య=గద్యములయొక్కయుపద్యములయొక్కయు, జిగాసా=గానేచ్ఛతోడ, ఆకలిత = మిగులసంబంధించిన, మానస = చిత్తములుగల, జలాధిదేవతాజనంబులు = జలాధిష్ఠానదేవతలు; పూనినపసిండికాయలదండియలదండిన్.—పూనిన=వహించినట్టి, పసిండికాయల=బంగరుకాయలుగల, దండియలదండిన్=వీణాదండములవిధముగా; తిర్యక్ప్రసారితైకైకనాళకైకైకకోకరాజంబులు.—తిర్యక్ప్రసారిత=అడ్డముగఁజాఁపఁబడిన, ఏకైకనాళక=ఒక్కొకతామరతూఁడుగల, ఏకైకకోకరాజంబులు = ఒక్కొకచక్రవాకశ్రేష్ఠంబు; హర్షోత్కర్షంబు = సంతసంబునతిశయమును; పచరింపన్ =చేయఁగా; అనఁగా మలయమారుతాంకురములచే నెఱ్ఱదామరలపుప్పొడులు గగనభాగము నిండిసంధ్యాకాలమును దోఁపించుచున్న వనియు, అపుడు సంధ్యాసమయభ్రాంతిచేఁ దెల్లఁదామరలలోఁజేరినతుమ్మెదలు రొద సేయుచున్న వనియు, ఆరొద లుజక్కవ లొక్కొక్కటి యొక్కొక్కమృణాళమును బూని, మదనబిరుదగద్యపద్యములు గానము సేయుతలంపున జలాధిదేవతలు పూనినపసిండిదండియలఁ బోలి యుండఁగాఁ దద్దేవతాగానంబులకు సుతులుగా నుండెననియు భావము. మిత్రమండలసంయోజితమహోత్సవంబు.—మిత్రమండల=సూర్యమండలమనెడు సుహృన్మండలముచేత, సంయోజిత=కూర్పఁబడిన, మహోత్సవంబు=ఎక్కుడైనవేడుక; నవంబుగాన్ = అపూర్వమగునట్లు; ఒంది=పొంది; ఆత్మప్రియకామినీయుక్తంబై.—ఆత్మ=తనయొక్క, ప్రియకామినీ=ప్రియస్త్రీతోడ, యుక్తంబై=కూడుకొన్నదై, ఇదిరథాంగవంశరత్నంబునకువిశేషణము; సారసచారులోచనాశుభగానంబు.—సారసచారులోచనా=ఆఁడుబెగ్గురులయొక్క, శుభగానంబు=మంగళమైనపాట; అనూనంబై=అధికమై; తనరన్ =ఒప్పుచుండఁగా; కుశేశయనిజనివేశనూతనప్రవేశమంగళము.— కుశేశయ=శతపత్రమనెడు, నిజనివేశ=తనగృహమందు, నూతనప్రవేశ = నవీనప్రవేశముయొక్క, మంగళము = శుభమును; అంగీకరింపన్ = పొందుటకు; ఒయ్యనొయ్యనన్ =తిన్నతిన్నగా; అరుదెంచురథాంగవంశరత్నంబునకున్.—

అరుదెంచు=వచ్చుచున్న, రథాంగవంశరత్నంబునకున్=చక్రవాకకులశ్రేష్ఠమునకు; ఎత్తన్= ఆరతెత్తుటకు; హల్లకినీపల్లవాధరామతల్లికలు.—హల్లకినీ=చెంగల్వలతలనెడు, పల్లవాధరామతల్లికలు=ప్రశస్తాంగనలు; పూనినజాళువాకదలారతిపళ్యెరంబులసొంపునన్.—పూనిన=వహించినట్టి, జాళువా=స్వర్ణమయములగు, కదలారతిపళ్యెరంబుల=ఒకవిధమైనయారతట్టలయొక్క, వివాహాదిశుభసమయములయందు వధూవరాదులు ప్రవేశించునెడ హారిద్రాజలాదులతోఁ గూడినతట్టలతో నెత్తు నారతికి కదలారతి యని ప్రసిద్ధి, సొంపునన్=అందముచేత; హరిత్వరాగహారిద్రాచూర్ణ సంవ్యాప్తతత్ప్రసవరసపూరాంతర్దృశ్యమాన మానితకేసరభక్తాభిరామంబులు.—హరిత్వరాగ=పచ్చనిపుప్పొడియనెడు, హారిద్రాచూర్ణ = పసపుపొడిచేత, సంవ్యాప్త= పొందఁబడిన, తత్ప్రసవరసపూర=ఆచెంగల్వలపూఁదేనియ వఱదయొక్క, అంతర=మధ్యభాగమందు, దృశ్యమాన=చూడఁబడుచున్న, మానిత=శ్రేష్ఠములగు, కేసర=కింజల్కములనెడు, భక్త=ఓదనముచేత, అభిరామంబులు=ఒప్పుచున్నవి; అగువాల్లకస్తోమంబులు=అగునట్టి చెంగల్వలగుంపులు; ఉల్లాసంబు=సంతసమును; పల్లవింపన్ జేయన్ = చిగిరింపఁజేయఁగా; అనఁగా చక్రవాకశ్రేష్ఠము నిజకామినీసమేతంబై సూర్యోదయపరికల్పితం బగుమహోత్సవంబున కుశేశయమును బ్రవేశించుచుండఁగా నూతనగృహప్రవేశమును మిత్రమండలకృత మహోత్సవం బెవని చేయుచున్నయట్లుండెననియు, అపుడు తుమ్మెదలు ధ్వనిసేయుచుండఁగా స్త్రీలు పాట పాడుచున్నట్లుండె ననియు, చెంగల్వతీవలు పచ్చనిపరాగముతోఁ గూడిమకరందభరితములై కేసరయుక్తంబు లగుచెంగల్వలతోఁ గూడి యుండఁగా నూతనగృహప్రవేశ మొనరించురథాంగదంపతులకు మంగళస్త్రీలు గదలారతెత్తుటకు బంగిరుపళ్యెరములు పూని వానిలోఁ బసపునీరు అన్నపుమెతుకులు వేసికొని యెదురుగ నిల్చినయట్లుండెననియు భావము. నిజాంతరంగఖేదకరనిరర్గళఘనాఘనైకప్రకారంబులు.—నిజాంతరంగ=తనచిత్తమునకు, ఖేదకర=దుఃఖకరమైన, నిరర్గళ=ఆటంకములేని, ఘనాఘన=మత్తగజములనెడు ఘాతుకులయొక్క, ప్రకారంబులు=రీతులు; ఎల్లకాలంబున్ = కలకాలము; ఎనయకుండన్= పొందకుండఁగా; కోరి=వాంఛించి; కమలకాండభక్షణంబు.— కమలకాండ=బిసమనెడునుదకపూరముయొక్క, భక్షణంబు=ఆహారమును; సలుపుచున్=చేయుచు; కమలాసనాధీనమానసంబునన్.—కమలాసన=పద్మాసనమనెడుబ్రహ్మకు, అధీన=వశంవదమైన, మానసంబునన్=మనసుచేత; కరంబు=మిక్కిలి; స్వకీయహంసత్వంబు = తనయుంచతనమనెడు యతిత్వము; ప్రసిద్ధిన్ పొందన్=ఖ్యాతిగాఁచునట్లు; తపంబులుసల్పుపోల్పునన్=తపస్సులాచరించువిధమున; అస్తోకకోకనదాశ్రమమధ్యంబునన్.—అస్తోక=అధికమైన, కోకనద = రక్తోత్పలమనెడు, ఆశ్రమ=ఆశ్రమముయొక్క, మధ్యంబునన్=మధ్యభాగమందు; ఉదాత్తతత్పత్త్రవీతిహోత్రకీలంబులు.—ఉదాత్త=ఉత్కృష్టములగు, తత్పత్త్ర=ఆకోకనదదళములనెడు, వీతిహోత్రకీలంబులు=అగ్నిజ్వాలలు; చుట్టువలగొనన్=చుట్టుకొనఁగా; అఖండానందంబునన్=అవిచ్ఛిన్నానందముచేత; అక్షియుగంబు = నేత్రయుగ్మము; అరమోడ్చి = సగము మూసికొని; అచలితస్ఫురణంబు=కదలకుండుటను; వహించి=పొంది; రహించురాయంచలు = వర్తించుచున్న రాజహంసలు; హృదయాంచలంబునకున్=మనోదేశమునకు; అంచితాద్భుతంబు=ఒప్పుచున్నయాశ్చర్యమును; మించన్=మించునట్లు; కావింపన్=చేయఁగా; అనఁగా నాకొలఁకునందు రాయం

చలు రక్తోత్పలమధ్యమునఁ బద్మములపైఁ గూర్చుండి కమలకాండభక్షణము సల్పుచుఁ గన్నులరమోడ్చికొని కదలకుండఁగా, మేఘము లనెడుదుష్టులవలనఁ దమకుఁ గలకాల మపాయము రాకుండుటకై కోకనద మనునాశ్రమమధ్యమున జలభక్షణము సేయుచు బ్రహ్మను గూర్చి తపం బాచరించుచు నానందమునఁ గన్నులరమోడ్చి కదలకుండఁ దమహంసత్వముఁ బ్రసిద్ధినొందించుచున్న ట్లుండె ననియు, రక్తోత్పలదళములు చుట్టు చుట్టి యుండఁగా నవి యగ్నిశిఖలను బోలి యాహంసలు పంచాగ్నిమధ్యమునఁ గూర్చుండినట్లు తోఁపించుచుండె ననియు భావము. నిజవిలోచనసౌందర్యసమాలోకనజనితత్రపాభరంబునన్.—నిజ = స్వకీయమగు, ఈనిజపదము చంద్రికాసఖీసముదాయపరము, విలోచన = నయనములయొక్క, సౌందర్య=అందముయొక్క, సమాలోకన=సందర్శనముచేత, జనిత=ఉదయించిన, త్రపాభరంబునన్=లజ్జాతిశయముచేత ; ముడింగియున్నకుముదంబులన్ = ముకుళించియున్నకలువలను; కాంచి=చూచి; ఉబ్బునన్ = సంతోషముచేత ; తద్విలాసదిదృక్షాగరిమంబు.—తద్విలాస = ఆస్త్రీనయనవిలాసముయొక్క, దిదృక్షా = దర్శనేచ్ఛయొక్క, గరిమంబు=అతిశయమును ; పక్షీకరించి=స్వీకరించి ; అనఁగా నయనసౌందర్యము చూడవలెనని వాంఛాతిశయము నొందియనుట ; అక్షుద్రస్యదంబునన్=అతివేగముచేత; "రయస్స్యదః" అనియమరుఁడు. ఎగసి=పైకెగిరి; తద్విభవంబునకున్=ఆస్త్రీనయనవిభవమునకు; వెఱచి=భయపడి;మఱలన్;తొలుతీరునన్=మఱుఁగుపడుతీరున;ఉద్వర్తనాపవర్తనంబులన్=ఎగయుటమఱలుటలచేత; పరఁగు బేడిసమీలమిట్టిపాటులు=ఒప్పుచున్నమత్స్యవిశేషములయొక్క యెగిరిపడుటలు;అతికౌతుకంబు=మిక్కిలిసంతోషమును;పుట్టింపన్=చేయఁగా;అనఁగా నాకొలఁకునం గలువలు ముకుళించి మత్స్యము లెగిరిపడుచుండఁగా ఆస్త్రీనయన సౌందర్యమును జూచి సిగ్గుచేతఁ గలువలు ముడిఁగిన ట్లుండె ననియు మత్స్యము లాకుముదములను జూచి తామును దన్నయనసౌందర్యము గాంచఁ దెంగున నెగిరి తన్నయనసౌందర్యమునకు వెఱచి మఱలఁ దాఁగుచున్న ట్లుండె ననియు భావము; అతిసమీపసంచరచ్చిత్రభానుహేతిజాతంబులన్.—అతి సమీపసంచరత్=మిక్కిలిసమీపదేశమునందు చరించుచున్న, చిత్రభాను=సూర్యునియొక్క, హేతిజాతంబులన్=కిరణసమూహములవలన, పరితాపంబున్ = మిక్కిలితాపమును;ఒంది=పొంది;మందపవనసందోహాందోళితనవీనేందీవరబృందమధుబిందుసేచనంబున్.—మందపవనసందోహ=మందమారుతములగుంపుచేత, ఆందోళిత=చలింపఁజేయఁబడిన, నవీనేందీవరబృంద=నూతననీలోత్పల బృందముయొక్క, మధుబిందుసేచనంబున్ = మకరందబిందువులచేతనైన తడుపుటను; కోరి=వాంఛించి;వారిజాతాంతరంబునన్ = కమలమధ్యమందు; లీనంబైనయంభోధరపథంబునన్=దాఁగియున్నయాకాశమందు; రోధోదేశవలయితమనోజ్ఞ మాలతీమాధవీమహిళామల్లికా ముఖ్యవల్లి కాకీర్ణనీరంధ్రపలాశపాండిత్యంబునన్.—రోధోదేశ=తీరప్రదేశమందు, వలయిత=చుట్టుకొన్న, మనోజ్ఞ = మంజులములైన, మాలతీ=జాజి, మాధవీ=బండిగురివెంద, మహిళా=ప్రేంకణము, మల్లికా=మల్లె, ముఖ్య = మొదలుగాఁగలవానియొక్క, వల్లికా=లతలచేత, కీర్ణ=వ్యాప్తములైన, నీరంధ్ర=నిబిడములైన, పలాశ = పొదుగులయొక్క, పాండిత్యంబునన్=అతిశయముచేత; ప్రద్యోతనద్యోతప్రభావంబు.—ప్రద్యోతన=సూర్యునియొక్క,ద్యోత=ప్రకాశముయొక్క, ప్రభావంబు=మహిమ;పాయన్=పోఁగా;

కనుపట్టుతారకావారంబులమురువునన్.—కనుపట్టు = అగపడునట్టి, తారకావారంబుల =
నక్షత్రసముదాయములయొక్క, మురువునన్ = సౌందర్యముచేత; దీనికిపొడకట్టు ననుక్రియతో
నన్వయము ; అరవిందమందిరాళిందనివాసి సానందమిళిందసుందరీసుందరాపఘనఘనప్రభా
క్రాంతిజలంబులపయిన్.—అరవిందమందిర=కమలము లనెడుగృహములయొక్క, అళింద =
చత్వరములయందు, నివాసి=వసించియున్న, సానంద=సంతసముతోఁగూడిన, మిళిందసుం
దరీ = ఆఁడుతుమ్మెదలయొక్క, సుందరాపఘన = చక్కని దేహములయొక్క, ఘనప్రభా =
అధిక కాంతిచేత, ఆక్రాంత=వ్యాప్తమైన, జలంబులపయిన్ =ఉదకములమీఁద; పొడకట్టు
పాండురడిండీరఖండమండలంబులు.—పొడకట్టు=అగపడుచున్న; పాండుర=తెల్లనైన, డిం
డీరఖండ=ఫేనఖండములయొక్క, మండలంబులు=సముదాయములు; సంబరంబులు=సంతో
షములను; పొదలింపఁగ=వృద్ధిచేయఁగా; అనఁగా నాకొలఁకునందుజలము తుమ్మెదలదేహకాం
తిచేత తటద్రుమచ్ఛాయావృతమై నల్లనైయుండఁగా నందుండు ఫేనఖండంబులు, సూర్యుం
డుచెంత నుండుటంజేసి కలిగినతాపాతిశయముచేత నాకసము నీలోత్పలమరందబిందుసేకము
నుగోరి కాసారమును జేరి తటద్రుమసందోహముచేత సూర్యప్రకాశము నెంతయు నొంద
కుండఁగా, నందుఁ జూపట్టు రిక్కలగుంపుచందంబున నుండె నని భావము. అమరియున్=
ఒప్పియుం; అక్కొలంకు = ఆకాసారము; మహితాబ్జకామినీ జాలపరిభ్రాజితంబు.—మహిత=
ఒప్పుచున్న, అబ్జకామినీ = చంద్రునిభార్యలగు నక్షత్రములయొక్క, జాల=సంఘముచేత,
పరిభ్రాజితంబు = ప్రకాశించుచున్నది; కావునన్ = ఆహేతువువలన; అళిమిథునమీనకుళీర
మకరాదిసంయుతంబై.—అళి=వృశ్చికము, మిథున=మిథునము, మీన=మీనము, కుళీర=కట
కము, మకర=మకరము, ఆది=మొదలగురాసులతో, సంయుతంబై=కూడినదై; అనఁగా మహి
తము లైనఅబ్జములనఁగా కమలములు, కామినియనఁగా ఆఁడుజక్కవలు,వీనిసంఘములతోడఁ
గూడియళిమిథునములు మత్స్యములుఎండ్రకాయలు మొసళ్ళు లోనగువానితోఁ గూడి యున్న
దని వాస్తవార్థము; మంజులహర్యన్వితార్యమలసద్విహారభాసురంబు.—మంజుల=మనోజ్ఞమగు,
హరి=సింహరాశితో, అన్విత=కూడుకొన్న, అర్యమ=సూర్యునియొక్క, లసద్విహార=ప్రకా
శించువిహరణముచేత, భాసురంబు=ప్రకాశించునది; కావునన్=అగుటవలన; కమనీయకా
దంబసుమనోవికసనవిరాజితంబై.—కమనీయ=మనోజ్ఞమగు, కాదంబ = కదంబవృక్షసంబంధి
యైన, సుమనః= పువ్వులయొక్క, వికసన = విరియుటచేత, విరాజితంబై = ప్రకాశమానమై;
అనఁగాసరస్సు, మంజు=మనోహరములగు, లహరీ=ప్రవాహమును, అన్విత=పొందినట్టి, అరి=
జక్కవలయొక్క, అమల=నిర్మలమైన, సద్విహారముల చేతఁగూడి, కమనీయములైన, కా
దంబ=బెగ్గురులయొక్క, సు=లెస్సైన, మనః =మనస్సుయొక్క, వికసనముచేతవిరాజితమని
వాస్తవార్థము ; మనోజ్ఞహంసకులాధిరాజరామాభిరామప్రస్థానవిశేషంబు.—మనోజ్ఞ = మనో
హరమైన, హంసకులాధిరాజ=సూర్యకులస్వామియైన, రామ = రామునియొక్క, అభిరామ=
హృద్యమైన, ప్రస్థానవిశేషంబు=యాత్రావిశేషము ; కావునన్ =కాఁబట్టి; అకుంఠితరయతరో
విజృంభమాణనానాప్లవగవీరారాజత్కోలాహలలీలాచులుకితదిశాంతంబై.—అకుంఠిత= మి
గుల అడ్డములేని, తరః=వేగముచేత;విజృంభమాణ=విజృంభించుచున్న, నానా=అనేకప్రకారు
లగు, ప్లవగవీర=వానరవీరులయొక్క, ఆరాజత్=మిగులనొప్పుచున్న, కోలాహల = కలకల

ధ్వనియొక్క, లీలా=విలాసముచేత, చులుకిత=పుడిసిలింపఁబడిన, దిశాంతంబై=దిగంతములు గలదై; అనఁగా నాకొలను, మనోజ్ఞమైన, హంసకులాధిరాజరామా=రాజహంసస్త్రీలచేత, అభిరామ=ఒప్పుచున్న, ప్రస్థానంబు=ప్రకృష్టస్థానవిశేషము, కావున, అకుంఠతరతరళోవిజృంభమాణములైన, ప్లవ=తెప్పలయొక్క, గో=కాంతులచేత, "గోరతద్ధితలుకి" అనిటచ్ ప్రత్యయము ఇచ్చిప్పు వచ్చినపైని ప్లవగవీ యనురూపము సిద్ధమగుచున్నది, రారాజత్ = మిక్కిలి యొప్పుచున్న, కోలాహలములయొక్క లీలచేత, చులుకితదిశాంతములుగలదనివాస్తవార్థము; ఒప్పుమీఱి=అతిశయించి; చెప్పరానిమోదంబు=చెప్పనలవిగానిసంతోషము; ముప్పిరిగొనన్=మూఁడుమడుఁగులగునట్లు; చేయన్=ఒనరింపఁగా; అప్పడంతులు=ఆస్త్రీలు; అప్పద్మాలయజలవిహారదోహదంబునన్.—అప్పద్మాలయ=ఆకొలనియందు, జలవిహార=జలక్రీడయందలి, దోహదంబునన్=వాంఛచేత; "అథదోహదమ్, ఇచ్ఛాకాఙ్క్షా" అనియమరుఁడు; జిలుఁగుపుత్తడిపలువలు=సూక్ష్మములైనకనకాంబరములను; సడల్చి=విడిచి; పావడలు=పరికిణీలను; తాల్చి=ధరించి; శృంగంబులు=కొమ్ములను; కైకొని=స్వీకరించి; ఒయ్యనొయ్యనన్=తిన్నతిన్నఁగా; ఒయ్యారంబు=విలాసంబు; మించన్=అతిశయింపఁగా; డిగ్గి=కొలనియందుఁబ్రవేశించి; అపుడు=ఆసమయమున. దీనికుత్తరపద్యమందున్నయీఁదిరనుక్రియతో నన్వయము.

ఉ. తమ్ములఁ జేరి రోదరశ•తమ్ములఁ గైకొని తావి భృంగపో
తమ్ముల కుంచి యౌవతయు•తమ్ముల మత్తమరాళరాజజా
తమ్ముల మించి చిత్రచరి•తమ్ముల నీఁదిరి కొమ్మ లెల్లఁ జి
త్తమ్ముల వారిదేవతలు • తమ్ము లలిన్ వినుతింప నయ్యెడన్. 69

టీ. అయ్యెడన్=ఆసమయమందు; కొమ్మలెల్లన్=స్త్రీలందఱు; తమ్ములన్=పద్మములను; చేరి; పొంది; రోదరశతమ్ములన్=చక్రవాకశతములను; కైకొని=స్వీకరించి; తావిన్=పరిమళమును; భృంగపోతమ్ములకున్=తుమ్మెదబిడ్డలకు; ఉంచి=నిలిపి; యౌవతయుతమ్ములన్.—యౌవత=యువతిసమూహముతో, యుతమ్ములన్=కూడియుండినట్టి; మత్తమరాళరాజజాతమ్ములన్.—మత్త=మదించిన, మరాళరాజ=రాజహంసశ్రేష్ఠములయొక్క, జాతమ్ములన్=సమూహములను; మించి=అతిశయించి, వారిదేవతలు=జలాధిదేవతలు; చిత్తమ్ములన్=మనస్సులయందు; తమ్మున్: లలిన్=ప్రీతిచేత; వినుతింపన్=శ్లాఘింపఁగా; చిత్రచరితమ్ములన్=ఆశ్చర్యకరమైన వ్యాపారములచేత; ఈఁదిరి=జలక్రీడసల్పిరి.

అనఁగా నాస్త్రీలు కొలను ప్రవేశించి తమ్ము జలాధిదేవతలు కొనియాడునట్లు పైఁజెప్పినవిధముగ నీఁదిరనుట.

మ. తరుణాంభోరుహపీఠిఁ బొల్చి సుమనో•దంతుల్ నవాంభఃపరం
పర పైపైఁ గడుఁ జల్ల సారసముఁ బ్రే•మన్ గేలునన్ బట్టి క
ర్బురసంహారిసుగాత్రికాతిసమతా•స్ఫూర్తిన్ గర మ్మొక్కక
ర్బురసంహారిసుగాత్రికాతిలక మిం•పుల్ గూర్చెఁ దన్నగ్నునన్. 7()

టీ. ఒక్కకర్బురసంహారి సుగాత్రికాతిలకము= ఒక స్త్రీరత్నము, కర్బుర మనఁగా, సువర్ణము దానిని సంహరించెడు అనఁగా తిరస్కరించెడుగాత్రము గలవారు స్త్రీలు వారల లో తిలకరూపయైన దనుట; తరుణాంభోరుహపీఠిక౯ = నవాంబుజమనుపీఠమందు ; పొల్చి= ఒప్పి; సుమనోదంతుల్=స్త్రీలనెడుదివ్యగజములు ; నవాంభఃపరంపరక౯ = నూతనమైనజలప రంపరను; పైపైక౯=మీఁదమీఁదను ; కడుక౯=మిక్కిలి ; చల్లక౯=చల్లుచుండఁగా ; సారస ము౯=పద్మమును; ప్రేమ౯=ప్రేమచేత; కేలునక౯=హస్తముచేత ; పట్టి=ధరించి ; కర్బురసం హారిసుగాత్రికాతిసమతానుస్ఫూర్తిక౯.– కర్బురసంహారి=రాక్షసాంతకుఁడైనవిష్ణుమూర్తియొక్క, సుగాత్రికా=భార్యయైనలక్ష్మీదేవియొక్క,అతిసమతా=అత్యంతసామ్యముయొక్క, స్ఫూర్తిక౯ =ప్రకాశముచేత; తన్నర్గొనక౯=తన్నుఁజూడగా;కరమ్ము=మిక్కిలి; ఇంపుల్ గూర్చెక౯=ఆనం దములనుజేసెను.

అనఁగా జలవిహారసమయమున నొక స్త్రీరత్నము తమ్మిపైఁ గూర్చుండి కేలఁ గమల మును దాల్చియుండఁగా ఇతర స్త్రీలు దానిపై జలపరంపరలు చల్లుచుండి రనియు దానిం జూడఁగాఁ బద్మహస్తయై పద్మాసనయై దేవదంతులచే జలాభిషేకము పొందు లక్ష్మీదేవిని బో లి యుండెననియు భావము. పూర్ణోపమాలంకారము.

చ. అలరుమృణాళవల్లరి స్వయంవరసూనసరాభ వ్రేలఁగా
నలనికటంబుఁ జేరఁగ జన౯ రతిఁ గైకొనె నొక్క పువ్వుకో
మల దమయంతికావనితమాడ్కి మరాళనృపుల్ స్వచిత్తసీ
మలఁ దమయంతికావనిఁ గ్రమంబున నొందిన సంభ్రమింపఁగా౯. 71

టీ. ఒక్కపువ్వుకోమల = పుష్పములవలెకోమలమైనగాత్రముగలఒక స్త్రీ ; మృణాల వల్లరి=వల్లివంటితామరతూఁడు; స్వయంవరసూనసరాభక౯ = స్వయంవరార్థమైనపుష్పమా లికవలె; వ్రేలఁగాక౯=వ్రేలాడఁగా ; మరాళనృపుల్ = రాజహంసలనెడురాజులు; స్వచిత్త సీమలక౯=తమమనఃప్రదేశములయందు; తమయంతికావనిక౯=తమసమీపప్రదేశమును; క్రమం బునక౯=మునగా; ఒందినక౯=పొందఁగా ; సంభ్రమింపఁగక౯=సంతసమునొందఁగా, వేగిర పాటునొందఁగా; దమయంతికావనితమాడ్కిక౯=దమయంతివలె ; నలనికటంబు=పద్మనికట మనెడునలరాజుసమీపమును;చేరగక౯ చనక౯=చేరఁబోవుటకు; రతిక౯=ప్రీతిని; కైకొనెక౯= స్వీకరించెను, చేరెననుట.

అనఁగా నొక స్త్రీమృణాలవల్లరి చేతఁ బుచ్చుకొని పద్మమును గ్రహించుటకుఁ బోవుచుండఁగా దమయంతి నలుని వరించుటకుఁ బుష్పహారము తీసికొని పోవుచున్నట్లుండె ననియు నపుడు మధ్యమార్గమున నున్నమరాళములు ఆ స్త్రీ తమచెంతకు వచ్చె నని సంభ్ర మించుట నలేతరరాజులు దమయంతి దమయంతికమునకు వచ్చె నని సంభ్రమించిన ట్లుండె ననియు భావము. రూపకసంకీర్ణోపమాలంకారము.

సీ. రతిఁ బట్టుకొనఁ జేరె • రాజీవరామానికరము సద్గుణజాల • కలిత యొకతె
రహిఁ ద్రావ్రాల్చె నవదాత • రాజీవరాజిత, రజము పావనవిహా • రయుత యొకతె
యడలించె వడిఁ బుష్క • రాజీవరాజహం, సముల శంపాలోక • సక్త యొకతె
ప్రౌఢి నొంచె రథాంగ • రాజీవరామోద, పటిమ సత్కాంతిసం • భరిత యొకతె

తే. వనజగృహవీథి నిట్టు లా • వర్తనాభి, కాజనంబులు సముచిత • గతి నెసంగె
వారిదేవత లపుడు త • ద్వర్తనాభి, దర్శనస్ఫూర్తి నవ్యహా • ర్దంబు గాంచ.

టీ. సద్గుణజాలకలిత=శ్రేష్ఠగుణసంతతితోఁగూడినట్టి; ఒకతె=ఒకస్త్రీ, మంచిసూత్రములు గలవలతోఁ గూడినయొకస్త్రీ యని తోఁచుచున్నది; రాజీవరామానికరము = మత్స్యస్త్రీగణమును "రాజీవశ్శకులస్తిమిః" అనియమరుఁడు; రతిన్ = ప్రీతిచేత; పట్టుకొనన్= స్వీకరించుటకు; చేరెన్=సమీపమునకుఁబోయెను. మంచిసూత్రములతోఁ గూడినవల గలది గావున మత్స్యములఁ బట్టుకొనఁ బోవుట తగు నని భావము. పావనవిహారయుత = మంచి ప్రచారముతోఁగూడినట్టి; ఒకతె=ఒకస్త్రీ; పవనసంబంధిప్రచారముతోఁ గూడినయొక స్త్రీ యని తోఁచుచున్నది; రహిన్=ప్రీతిచేత; అవదాతరాజీవరాజితరజము.—అవదాతరాజీవ= తెల్లదామరలయందు, రాజిత=ఒప్పుచున్న, రజము=పరాగమును; ద్రావ్రాల్చెన్=తూల్చెను, పవనసంబంధిప్రచారముతోఁ గూడినది గావున రాజీవరాజితరజమును ద్రావ్రాల్చుట తగు నని భావము. శంపాలోకసక్త= మెఱుపులవంటిదృష్టులతోఁ గూడినట్టి; ఒకతె=ఒకస్త్రీ, తటిత్కాంతితోఁ గూడినయొకస్త్రీయని తోఁచుచున్నది; పుష్కరాజీవరాజహంసములన్.— పుష్కర=పద్మములు, ఆజీవ=జీవికగాఁగల, రాజహంసములన్=హంసపక్షులను; వడిన్=వేగముచేత; అడలించెన్=భయపెట్టెను; తటిత్కాంతితోఁ గూడినది గావున పుష్కరాజీవము లగుహంసల నడలించుట తగు నని భావము. తటిత్ప్రకాశముగల వర్షాసమయమందుఁ గొలఁకులు నిండి పద్మములకుఁ గీడు గలుగుఁ గాన నపుడు హంసలు ఎడలి పోవు నని కవి సమయము; సత్కాంతి సంభరిత = మంచికాంతి చేతనింపఁబడినది, నిండినమంచికాంతిగల దనుట; ఒకతె=ఒకస్త్రీ; నక్షత్రములకాంతితోఁ గూడినయొక స్త్రీ యనితోఁచుచున్నది; రథాంగరాజీవరామోదపటిమన్.—రథాంగరాజీ= చక్రవాకపంక్తియొక్క, వర=శ్రేష్ఠమైన, ఆమోదపటిమన్=సంతోషాతిశయమును; ప్రౌఢిన్= నేర్పుచేత; నొంచెన్=నొవ్వఁజేసెను; నక్షత్రకాంతిభరిత గావున రథాంగరాజీ సంతోషపటిమ నొంచుట తగు నని భావము. నక్షత్రప్రకాశముగలరాత్రికాలమందు రథాంగదంపతు లెడఁబాసి ఖేదించు నని కవి సమయము. ఇటులు= ఈప్రకారము; వనజగృహవీథిన్ = కమలాకరమైన కాసారముయొక్క వీథియందు; ఆవర్తనాభికాజనంబులు = స్త్రీజనములు; ఆవర్తనాభికలనఁగా నీటిసుడినిబోలు పొక్కిలిగల స్త్రీలు; అపుడు=ఆసమయమందు; వారిదేవతలు=జలాధిష్ఠానదేవతలు; తద్వర్తనాభిదర్శనస్ఫూర్తిన్.—తద్వర్తన=ఆస్త్రీప్రవృత్తియొక్క, అభిదర్శనస్ఫూర్తిన్=చూచుటయందు; నవ్యహార్దంబు= నూతనప్రీతిని; కాంచన్=పొందఁగా; సముచితగతిన్=పైఁజెప్పినవిధముగ సుచితప్రకారము చేత; ఎసంగెన్=ఒప్పెను. సద్గుణజాలకలితేత్యాదిసాభిప్రాయవిశేష్యముల చేఁ బరికరాంకురాలంకారము.

చ. స్మరమదదంతి నా నొకమ • సారసముల్లసితప్రవేణి త
త్సరమున నత్తఱిం బవన • సారసముల్లలదూర్మిజాతముల్
సరగునఁ జొచ్చి పాదముల • సారసముల్ గర మించె మెట్టుచున్
సరసకలారవాకలన • సారసముల్లహరిన్ హరించుచున్. 73

టీ. అత్తఱిన్=ఆసమయమందు; ఒకమసారసముల్లసితప్రవేణి=నీలములఁభంగిఁ బ్రకాశించుచున్నజడగలయొక స్త్రీ; తత్సరమునన్=ఆకొలఁకునందు; పవనసారసముల్లలదూర్మిజాతముల్.—పవనసార=వాయుసామర్థ్యముచేత, ముల్లలత్=చలించుచున్న, ఊర్మిజాతముల్=తరంగతతులను; సరగునన్=వేగముచేత; చొచ్చి=ప్రవేశించి; పాదములన్=చరణములచేత; సారసముల్=పద్మములను; మెట్టుచున్=త్రొక్కుచు; సరసకలారవాకలనన్.—సరస=శ్రేష్ఠమైన; కల=అవ్యక్తమధురమైన, గజపక్షమున కర=తొండముయొక్కయనియర్థము, ఆరవ = ధ్వనియొక్క, ఆకలనన్ = సంబంధముచేత; సారసముల్లహరిన్.—సారస = బెగ్గురులయొక్క, ముత్=సంతోషముయొక్క, లహరిన్=పరంపరను; హరించుచున్=పోఁగొట్టుచు; స్మరమదదంతి నాన్=మరునిమదపుటేనుఁగో యనునట్లు; కరము=మిక్కిలి; ఇంచెన్=ఇంపారెను.

అనఁగా నొకనీలవేణి యాకొలఁకునందు వీవలివేగమునఁ జలించుచున్న తరఁగలఁ జొచ్చి కమలములను బాదముల మెట్టుచు సరసకలస్వనములచేత బెగ్గురులసంతసమును హరించుచు మరునిమదపుటేనుఁగో యనునట్లు భాసిల్లె నని భావము. గజము సరస్సులు సొచ్చి కమలములు మెట్టుచు బెగ్గురులు లోనగుజలపక్షులమోదము హరించుటసుప్రసిద్ధము. ఉత్ప్రేక్షాలంకారము.

చ. అనుపమరాజహంసభర • ణాదరణాత్మతఁ దత్సరోవరం
బున నలరాజహంససుత • బోటులు మించిరి పూర్వవైరముల్
సన భృతరాజహంసత నె • సంగుదివాక్షణదాధిదేవు లౌ
నని వనరాజహంసగమ • నాళి మనంబున సన్నుతింపఁగన్. 74

టీ. అలరాజహంససుతబోటులు=రాజశ్రేష్ఠుఁడగుక్షణదోదయునిపుత్త్రికయగు చంద్రికయొక్కచెలులు ; తత్సరోవరంబునన్ = ఆసరస్సునందు; అనుపమరాజహంస భరణాదరణాత్మతన్.—అనుపమ=సాటిలేని, రాజహంస=పక్షివిశేషములయొక్క, “రాజహంసాస్తు తే చఞ్చుచరణైర్లోహితైస్సితాః” అనియమరుఁడు, చంద్రసూర్యులయొక్కయనియర్థాంతరముతోఁచును, భరణ=భరించుటయందు, ఆదరణ=ఆసక్తిగల, ఆత్మతన్=చిత్తముగలుగుటచేత; పూర్వవైరముల్=మొదటిద్వేషములు; చనన్=పోఁగా; భృతరాజహంసతన్ = భరింపఁబడిన చంద్రసూర్యులుగలుగుటచేత; ఎసఁగుదివాక్షణదాధిదేవులు=ఒప్పుచున్న దినరాత్ర్యధిదేవతలు. ఔన్=నిశ్చయము; అని=ఇటని; వనరాజహంసగమనాళి = వనమందలిస్త్రీలచాలు, వనపాలికామండలియనుట; మనంబులన్=మనస్సులయందు; సన్నుతింపఁగన్ = కొనియాడఁగా; మించిరి=అతిశయించిరి.

అనఁగాఁ జంద్రికాసఖీజనము సరోవరమున రాజహంసభరణాదరణముతోఁ జెలఁగుచుండఁగా, దివారాత్ర్యధిదేవతలు తమమొదటివైరము మాని సూర్యచంద్రులను బట్టుకొని యుండినట్లు వనపాలికలమనంబులకుఁ దోఁచినదనుట. శ్లిష్టరూపకోత్థాపితోత్ప్రేక్షాలంకారము.

సీ. వాసంతి యనఘాళి♦వరరసంబునఁ గప్పి
వాసంతి యన సము♦జ్జ్వలతఁ బొల్చె
సారంగి యనపాయ♦జలజాంబుతతి నాని
సారంగి యనఁ జాల ♦ సంభ్రమించె
శశిలేఖ యనసార♦చక్రాళి నలయించి
శశిలేఖ యన శుభ♦చ్ఛాయఁ దోఁచె
చక్రాంగి యనవద్య♦చారూర్మికల నూఁగి
చక్రాంగి యన హృద్య♦చర్య మసలె

తే. చూతకళిక యనర్ఘ్యర♦జోవృతిఁ గని
చూతకళిక యనం గడుఁ ♦ జూడ నొప్పె
హారిణి యనరాళకమ్రైక♦పరిచితిఁ గని
హారిణి యన నవ్వనాస్థాని ♦ నవ్వు డలరె 75

టీ. వాసంతి=వాసంతియను పేరుగల చెలి; అనఘాళిన్=అనఘురాలైన చెలిని, ఒచ్చెము లేనితుమ్మెదను, శ్లిష్టరూపకము; వరరసంబునన్=శ్రేష్ఠముగు ప్రీతిచేత, శ్రేష్ఠముగు పుష్పరసముచేత; కప్పి; వాసంతియనన్=బండిగురివెందలతయనఁగా, వాసంతియను నామముగలదనఁగా; సముజ్జ్వలతన్=ప్రకాశముచేత; పొల్చెన్=ఒప్పెను. మాధవీలతవలెననఘాళిని రసమునఁ గప్పుటం జేసి వాసంతీనామము దానికమరిన దనుట. సారంగి=సారంగియనుపడుచు; అనపాయజలజాంబుతతిన్.–అనపాయ=చ్యుతిలేనట్టి, జలజాంబు=పూఁదేనియయొక్క, తతిన్=రాశిని; ఆని=పానము చేసి; సారంగియనన్=ఆఁడుతుమ్మెదయనఁగా, సారంగియను నామముగలదనఁగా; చాలన్=మిగులను; సంభ్రమించెన్=సంతసించెను. భృంగివలెఁ బూఁదేనియ నానుటంజేసి సారంగి యను నామము దాని కొప్పె ననుట. శశిలేఖ=శశిలేఖ యనుపేరిటియబల; అనసారచక్రాళిన్.–అనసార = శ్రేష్ఠములయిన, చక్రాళిన్=చక్రవాకముల చాలును; అలయించి=అలఁతపెట్టి; శశిలేఖయనన్=చంద్రరేఖయనఁగా, శశిలేఖయను నామము గలదనఁగా; శుభచ్ఛాయన్=మంచికాంతిచేత; తోఁచెన్=పొల్చెను. చంద్రరేఖవలె జక్కవల చాలు నలయించుటం జేసి శశిలేఖ యనుపేరు దాని కబ్బె ననుట. చక్రాంగి=చక్రాంగియను పేరిటబోటి; అనవద్యచారూర్మికలన్.–అనవద్య=అదూష్యములగు, చారు=మనోహరములైన, ఊర్మికలన్=తరంగములయందు; ఊఁగి; చక్రాంగియనన్=హంసస్త్రీయనఁగా, చక్రాంగి

యను నామము గలదనఁగా; హృద్యచర్యన్=మనోజ్ఞమైనవృత్తిచేత; మసలెన్=ఒప్పెను, హంసస్త్రీవలెఁ దరంగములయందు నూఁగుటం జేసి చక్రాంగి యను నామము దాని కొప్పె ననుట. చూతకలిక=చూతకలికయను స్త్రీ; అనర్ఘరజోవృతిన్.—అనర్ఘ = అమూల్యమైన. రజోవృతిన్=పరాగవ్యాప్తిని; కని=పొంది; చూతకలికయనన్=మావిమొగ్గయనఁగా, చూతకలికయను నామము గలదనఁగా; కడున్=మిక్కిలి; దూడన్=నాచుటను; ఒప్పెన్=అమరెను. చూతకలికవలె రజోవృతిని గనుటంజేసి చూతకలిక యను నామము దానికొదవె ననుట. హారిణి=హారిణియను పేరుగలవనిత; అనరాళకమలైకపరిచితిన్.—అనరాళ=ఋజువులైన, కమల=పద్మములయొక్క, ఏకపరిచితిన్ = ముఖ్యపరిచయమును, ఋజువులైనజింకలయొక్క ముఖ్యపరిచయముననియర్థాంతరము; కని=పొంది; హరిణియనన్=మృగస్త్రీయనఁగా, హారిణియను నామము గలదనఁగా; అవ్వనాస్థానిన్=ఆనహోజలము ఆస్థానమందు; అపుడు=ఆసమయమందు; అలరెన్=ఒప్పెను. అనఁగా మృగస్త్రీవలెఁ గమలపరిచయముఁ గనుటంజేసి హారిణి యను నామము దానికినఁగె ననుట. శ్లిష్టరూపకము.

అనఁగా జలక్రీడకై కొలను సొచ్చినవాసంతి సారంగి శశిలేఖ చక్రాంగి చూతకలిక హారిణి యను నామములు గల స్త్రీలు పైఁజెప్పినచర్యల నొనరించి రని భావము. రాజాస్థానికలయందు దాసీవర్గమునకు వాసంత్యాదినామము లుండుట ప్రసిద్ధము.

క. నలి నాకరజితకిసలల్, నలినాకర కేళి యిటు లొ•నర్చి జలార్ద్రాం
గలతాళులు హిమవృతకుం, దలతాభం దోఁప నపుడు•దటిసిరి తటముల్.

టీ. అపుడు=ఆసమయమున; కరజితకిసలల్=కరములచే గెలువఁబడిన పల్లవములుగల యా స్త్రీలు; నలిన్=మిక్కిలి; నలినాకరకేళి=జలక్రీడను; ఇటులు=పైవిధముగ; ఒనర్చి=చేసి; జలార్ద్రాంగలతాళులు.—జలార్ద్ర=జలముచేతఁదడుపఁబడిన, అంగలతా=తనులతలయొక్క, ఆళులు=పంక్తులు; హిమవృతకుందలతాభన్=మంచుచే నావరింపఁబడినమొల్లతీవల కాంతివంటి కాంతిచేత; తోఁపన్=ప్రకాశింపఁగా; తటమున్=తీరమును; తటిసిరి=సమీపించిరి.

అనఁగా నా స్త్రీలు జలక్రీడసలిపి యొడ్డుఁ జేరి జలార్ద్రాంగలతలు గలవారై మంచుచే నావరింపఁబడినకుందలతలభంగి నొప్పి రనుట. కుందలతలకు స్త్రీతనువులకు నుపమానోపమేయభావము, హిమమునకు జలమునకు బింబప్రతిబింబభావము.

చ. లలనలు వాఃప్లుతాంశుకము•లన్ సడలించి తగం భరించి మేల్
చలువల నైకజాతిసుమ•జాలసరంబులు వేణిఁ దాల్చి ని
చ్చలు వల నైకనంబడుల•స స్మణిమాలిక లూని పూసి మై
చలువల నైకమత్యగతిఁ • జాలిన తావుల నెవ్వ గంధముల్. 77

టీ. లలనలు=స్త్రీలు; వాఃప్లుతాంశుకములన్=జలముచేఁదడుపఁబడిన వస్త్రములను; సడలించి=విడిచి; మేల్చలువలన్=మంచివస్త్రములను; భరించి=ధరించి; నైకజాతిసుమజాలసరం

బులు.—నైకజాతి=నానాజాతులుగల, సుమజాల=పుష్పసంఘములయొక్క, సరంబులు=హారములను; వేణిన్=జడయందు; తాల్చి=ధరించి; నిచ్చలున్=ఎల్లప్పుడు; వలనై=అనుకూలమై; కనంబడులసన్మణిమాలికలు.—కనంబడు=అగపడుచున్న, లసత్=ప్రకాశించుచున్న, మణిమాలికలు=మణిమయహారములను, ఊని=వహించి; మైచలువలన్ = దేహములయొక్క చల్లఁదనములతో; ఐకమత్యగతిన్=ఐకమత్యముయొక్క పొందికచేతను; చాలినతావులన్=సమృద్ధములైనపరిమళములచేతను; జలక్రీడలాడిన వారిదేహములంతటిచల్లఁదనముతోను అధికమయిన పరిమళముతోను ననుట; ఒప్పుగంధముల్=ఒప్పుచున్నగంధములను; పూసి=లేపనము చేసి. దీనికి గందంబువెట్టిరను పద్యముతోన్వయము.

ముందు నాలుగుపద్యములకు నందె అన్వయము. ఆఱు పద్యములకు నిట నేకక్రియాన్వయము గదితం బయ్యె. దీనిఁకి కుళక మని కవిసంకేతము. ‘‘ద్వాభ్యాం యుగ్మ మితి ప్రోక్తం త్రిభి శ్శ్లోకై ర్విశేషకమ్। కలాపకం చతుర్భి స్స్యా త్తదూర్ధ్వం కుళకం స్మృతమ్’’ అని తల్లక్షణము.

క. అతిపావనచాతురి నా, క్షితిపాలకపుత్త్రిక గయి♦సేసి యలవనిన్
రతినాయకదేవార్చన, రతి నాయక లపుడు పూని ♦ రమ్యోత్కలికన్. 78

టీ. అతిపావనచాతురిన్ = మిగులఁబ్రశస్తమగునేర్పుచేత; ఆక్షితిపాలకపుత్త్రికన్=రాజపుత్త్రికయగు నాచంద్రికను; కయిసేసి=అలంకరించి; అలవనిన్ = ఆయుద్యానమందు; రతినాయకదేవార్చనరతిన్=స్మరదేవపూజాసక్తిచేత; ఆయకలు=ఆస్త్రీలు; అపుడు=ఆసమయమున; రమ్యోత్కలికన్=రమ్యమైనయుత్కంఠను; పూని=వహించి. ఇదిముందుకన్వయించును.

సీ. మాకందములు మహి♦మాకందములు కొన్ని
యింపైన ఫలముల ♦ నిచ్చుచోట
సురసాఘము లుదార♦సురసాఘములు కొన్ని
యురుమకరందంబు ♦ గురియుచోట
సుమనంబు లభిరామ♦సుమనంబు లోకకొన్ని
క్రొన్ననల్ చాలఁ జే♦కూర్చుచోట
రాగంబులు గళత్వ♦రాగంబు లోకకొన్ని
పుష్పాడిధూపముల్ ♦ పూన్చుచోట

తే. నెట్టన యశోకకిసలము ♦ ల్మట్టుమీఱి
యుట్టివడఁ గాయులేయెండఁ ♦ బుట్టి యెలసి
నట్టి చెలువునఁ జూపట్టు♦మెట్టదమ్మి
తీవెగమి తమ్మియారతుల్ ♦ దీర్చుచోట. 79

టీ. మహీమాతక్=భూలక్ష్మికి; అందములు=అందములైన; కొన్ని మాకందములు = కొన్ని తియ్యమావులు; యింపైనఫలములక్=ఇష్టమైనపండ్లను; ఇచ్చుచోటక్= ఒసంగుస్థలమున; ఉదారసురసౌఘములు = అధికమై శ్రేష్ఠమైన మకరందసమూహముగల; కొన్నిసురసౌఘములు=కొన్ని సర్పాక్షితీవలయొక్క గుంపులు; ఉరుమకరందంబు = అధికమైన పువ్వరసమును; కురియుచోటక్=వర్షించుచోట; అభిరామసుమనంబులు=ఒప్పుచున్నపువ్వులుగలిగిన; ఒక కొన్నిసుమనంబులు=కొన్నిజాజులు; క్రొన్ననల్=నవపుష్పములను; చాలక్ = మిక్కిలి; చేకూర్చుచోటక్=ఘటిల్లఁజేయుచోట; గళత్పరాగంబులు=జాఱుచున్నపుప్పొడులుగల; ఒక కొన్నిరాగంబులు=కొన్ని దాడిమీవృక్షములు; పుప్పొడిధూపముల్=పువ్వరజమనెడు ధూపములను; పూన్చుచోటక్=వహించుచోటను; నెట్టన=అనివార్యముగ; అశోకకిసలముల్= అశోకపల్లవములు; మట్టుమీఱి=మర్యాదనతిక్రమించి; ఉట్టిపడక్ = అతిశయింపఁగా ; కాయుతేరయుండక్=కాయుచున్న తరుణాతపముచేత; పుట్టి=ఉదయించి ; ఎలనీనట్టిచెలువునక్=ఉదయించినట్టియందముచేత; చూపట్టుమెట్టదమ్మితీవెగమి=అగపడుచున్న స్థలపద్మినీలతలసముదాయము; తమ్మియారతులక్=పద్మములను నారతులను; తీర్చుచోటక్=చక్కఁబఱచు చోట; దీనికి దిగువ కన్వయము.

చ. అలఘుమరందవర్షమహి♦మాతిశయమ్మున సప్తలాద్యమం
దలతల మంచుపొన్నగమి ♦ దార్కొనుపందిరిక్రింద వేదికం
దలతల మంచు మించుసుమ♦నవ్యరజంబులఁ దార్చి తారలం
దలతల మంచు నొప్పెడుక♦నత్కలికాతతి ముగ్గువెట్టుచుక్. 80

టీ. అలఘుమరందవర్షమహిమాతిశయమ్మునక్.—అలఘు = అధికమైన,మరందవర్ష=మకరందవర్షముయొక్క,మహిమాతిశయమునక్=సామర్థ్యాతిశయమున;సప్తలాద్యమందలతలక్=విరజాజిమొదలగునుత్కృష్టలతలను “సప్తలానవమాలికా” అనియమరుఁడు; మంచుపొన్నగమి=పోషించుచున్నపొన్నలగుంపును; దార్కొనుపందిరిక్రిందక్=సమీపించినపందిరియొక్క దిగువను; వేదికక్=తిన్నెపైని; తలతలమంచుక్=తళుకుతళుక్కుమనుచు; మించుసుమనవ్యరజంబులక్=అతిశయించుచున్న నూతనపువ్వరజములను;తార్చి=ఉంచి; తారలక్=నక్షత్రములను;తలతలమంచుక్=తోఁగుతోఁగుమనుచు;ఒప్పెడు కనత్కలికాతతిక్=ఒప్పుచున్న ప్రకాశించు మొగ్గలగుంపుచేత; ముగ్గువెట్టుచుక్ = రంగవల్లియుంచుచు. దీనికి ముందు కన్వయము.

అనఁగా విరజాజిమొదలగుతీవలతోఁ జుట్టఁబడినపొన్నచెట్టునొద్దఁ బందిరిక్రింద నొకతిన్నెమీఁదఁ బుప్పొడిచల్లి నక్షత్రములవలెఁ బ్రకాశించుమొగ్గలతో ముగ్గుపెట్టియని తాత్పర్యము.

ఉ. జవ్వను లెల్ల నమ్మదము♦ చాల రహింపఁగ నందు వెన్నెలం
జివ్వకుఁ బిల్చుపొందుపటిఁ♦ జిక్కనికస్తురినీటు రాణితో

నవ్వలరాజు నాశుగశ•రాసనయుక్తుని వ్రాసి నేర్పుతో
నవ్వల రాజు నాశుగసు•మాకరముఖ్యుల నిల్పి యత్తఱిన్. 81

టీ. జవ్వను లెల్లన్=స్త్రీలందఱు; సమ్మదము=సంతోషము; చాలన్= మిగులను; రహింపఁగన్=ఒప్పఁగా; అందున్=ఆవేదికయందు; వెన్నెలన్=జ్యోత్స్నను; చివ్వకున్=కలహమునకు; బిల్చుపాండుపటిన్=పిల్చునట్టి తెల్లని వస్త్రమందు; చిక్కనికస్తురినీటన్=చిక్కనైనకస్తూరీజలముచేత; రాణితోన్=రతీదేవితోడ; అవ్వలరాజున్=అమన్మథుని; ఆశుగశరాసనయుక్తునిన్=బాణధనువులతోఁగూడినవానిని; వ్రాసి=లిఖించి; నేర్పుతోన్=చాతుర్యముచేత; అవ్వలన్=తర్వాతను; రాజున్=చంద్రుని;ఆశుగసుమాకరముఖ్యులన్=మందమారుతవసంతాదులను; అత్తఱిన్=ఆసమయమందు; నిల్పి=స్థాపించి. పైపద్యముతో నన్వయము.

సీ. గంధంబు వెట్టి రు•త్కటనీలశరజాత
శరజాతహృతహర•స్వాంతధృతికి
విరిచాలు నించిరి • పరిరోజితనయాన్య
తనయాన్యమితమోహ•ధాతృమతికి
ధూప మర్పించి ర•ద్భుతసంపదబలాప
దబలాపహృతవిష్ణు•దర్పగతికి
దీప మెత్తిరి నైజ•తేజోలహరిభావ
హారిభావయుక్తము•సాౕధిపతికి

తే. తళియ వట్టిరి నిత్యస•త్కాంతమధుప
కాంతమధుపవనాద్యా ప్త•కాండవృతికి
వినతి సల్పిరి శృంగార•జనికి రతిప
తే నమో భవతే యంచుఁ • దెఱవ లపుడు. 82

టీ. ఉత్కటనీలశరజాతశరజాత హృతహరస్వాంతధృతికిన్.—ఉత్కట=అధికమైన, నీలశరజాత=నీలోత్పలములనెడు, శర=బాణములయొక్క, జాత=సంఘముచేత, హృత=హరింపఁబడిన, హరస్వాంతధృతికిన్=రుద్రునిమనోధైర్యముగలవానికి; గంధంబువెట్టిరి=చందనమునర్పించిరి. పరిరోజితనయాన్యతనయాన్యమితమోహధాతృమతికిన్.—పరిరోజిత=కూర్పఁబడిన,నయాన్య=నీతివిరుద్ధమైన,ఇది మోహమునకు విశేషణము,తనయా=కూఁతునందలి,న్యమిత=అత్యధికమైన, మోహ=మోహముగల, ధాతృమతికిన్=బ్రహ్మబుద్ధిగలవానికి; విరిచాలు=పుష్పపంక్తిని; నించిరి=నిండించిరి. అద్భుతసంపదబలాపదబలాపహృతవిష్ణుదర్పగతికిన్.—అద్భుత=ఆశ్చర్యకరమగు,సంపదబలా=లక్ష్మియనెడు, పద=పదముగల, పేరుగలయనుట,బల=సామర్థ్యముచేత,|అపహృత=హరింపఁబడిన, విష్ణుదర్పగతికిన్=విష్ణుమూర్తియొక్క గర్వగతికల

వానికి; ధూపమర్పించిరి = ధూపమును సమర్పించిరి. నైజతేజోలహరిభావ హరిభావయుక్త ఘస్రాధిపతికిన్.—నైజతేజోలహరిభావ=స్వప్రతాప ప్రవాహాసక్తిచేత, హరిభావ=అశ్వత్వముతోడ, యుక్త=కూడిన, ఘస్రాధిపతికిన్=సూర్యుఁడుగలవానికి; ఛాయాదేవి సూర్యునివేఁడిమిఁ దాళ లేక రథమునుండి డిగ్గి యశ్వరూపయై పాఱి పోవుచుండఁగా సూర్యుఁడు కామార్తుఁడయి తాను నశ్వరూపము దాల్చి వెంబడి పఱగెత్తినని పురాణప్రసిద్ధంబు. దీపమెత్తిరి=హారతెత్తిరి. నిత్యసత్కాంతమధుపకాంత మధుపవనాద్యాప్త కాండవృతికిన్.— నిత్య=శాశ్వతమైన, సత్కాంత=చంద్రుఁడు, మధుపకాంత=అళిశ్రేష్ఠములు, మధు=వసంతుఁడు, పవన=వాయువు, ఆది=మొదలుగాఁగల, ఆప్త కాండ=సుహృద్గణముయొక్క, వృతికిన్ = వ్యాప్తిగలవానికి; తళియ=భోజనపాత్రమును; పట్టిరి=ఉంచిరి. శృంగారజనికిన్=శృంగారరసమువలనఁ బుట్టుకగలవానికి; అపుడు=ఆసమయమున; తెలువలు=స్త్రీలు; రతిపతే=రతీశుఁడా; భవతే=నీకొఱకు; నమః=నమస్కారము; అంచున్=ఇట్లనుచు; వినతిసల్పిరి=నమస్కరించిరి.

క. కమలాప్రియసుత కరుణా, కమలాధిప కలితకార్ముకకుసుమ కన
త్కమలాశుగ యని భక్తిన్ । గమలాక్షులు పొగడి రిట్లు ♦ కలరవఫణితిన్. 83

టీ. కమలాప్రియసుత = లక్ష్మికిఁబ్రియకుమారుఁడ ! కరుణాకమలాధిప = దయాసముద్రుఁడ! కలితకార్ముకకుసుమ=ధరింపఁబడినధనువగుచున్న పుష్పముగలవాఁడా ! కనత్కమలాశుగ=ఒప్పెడుతమ్ములమ్ములుగాఁగలవాఁడా! అని=ఇటని; కమలాక్షులు=స్త్రీలు; భక్తిన్=భక్తిచేత ; కలరవఫణితిన్ = అవ్యక్తమధురధ్వనిగలవాక్కుచేత ; ఇట్లు=వక్ష్యమాణప్రకారముగ ; పొగడిరి=స్తోత్రముచేసిరి.

చ. కరము మహాబలావళులు ♦ గాఢతరోవిచరద్ధరీశ్వరో
త్కరము మహాబలావృతవి♦ఖండహితాళులు గొల్వ మించుచున్
సిరి గలసామికిం బొడమి ♦ చెన్నగునీకు సుమంబులు లూన్చుటల్
స్థిరకృప మాధవస్య తుల♦సీదళ మంచు వహింపు మంగజా. 84

టీ. అంగజా=మరుఁడా ! కరము=మిక్కిలి ; మహాబలావళులు=పూజ్యములైనవాయుపరంపరలనెడుగొప్పసేనావళులు ; గాఢతరోవిచరద్ధరీశ్వరోత్కరము.—గాఢ = దృఢమైన, తరః=వేగముచేత, విచరత్=సంచరించుచున్న; హరీశ్వరోత్కరము = శుకశ్రేష్ఠములగుంపనెడునశ్వశ్రేష్ఠములగుంపు ; మహాబలావృతవిఖండహితావళులు.—మహాబలా = అధికలయినస్త్రీలచేత, ఆవృత=కూడుకొన్న, విఖండ = అఖండములైన, హిత=ఇష్టములైన, అళులు=తుమ్మెదలనెడుమహాసామర్థ్యముతోఁగూడుకొన్న యఖండాప్తసంఘములు; గొల్వన్ = సేవించుచుండఁగా; మించుచున్=అతిశయించుచు; సిరిగలసామికిన్=విష్ణుమూర్తికి, సంపదగలరాజునకు ; పొడమి=ఉదయించి ; చెన్నగునీకున్=ఒప్పుచున్ననీకు ; సుమంబులి = కుసుమములను; లూన్చుటల్=ఉంచుటలు; స్థిరకృప=శాశ్వతకరుణగలవాఁడా ! మాధవస్యతులసీదళమంచున్=మాధవునకు తులసీపత్త్ర మని; వహింపుము=తాల్పుము.

అనఁగా దొడ్డవానికడుపునఁ బుట్టి గొప్పస్థితిలో నుండి వెలయు నీ కిది మేము సేయు నుపచారము కొంచెమైనది యైనను దయామతితోడ గ్రహింపు మనుట.

చ. కలరవ మూన్చు నల్లపజ ♦ కప్పుక రా వెనువెంట రాజమం
డలి నడ తేరఁ జైత్రబల♦నాథునిఁ గూడి నిలింపజాలకం
బలరుచు సన్నుతింప విష♦మాంబకమానసశోభిరాగతా
హాళహాళిఁ గూర్చి తౌర విష♦మాంబక మానసమాజవైఖరిన్. 85

టీ. విషమాంబక=పంచబాణుఁడా! కలరవము = అవ్యక్తమధురస్వనమును; ఊన్చు నల్లపజ.—ఊన్చు=చేయునట్టి, నల్లపజ=కోయిలలమూఁకయనుట; కప్పుకరాన్ = ఆవరించికొనిరాఁగా; వెనువెంటన్=వెంబడిగ ; రాజమండలి=చంద్రమండలమనెడునృపమండలము; నడ తేరన్=నడచిరాఁగా; చైత్రబలనాథునిన్ = వసంతుఁడనెడుపడవాలును ; కూడి=చేరి; నిలింపజాలకంబు=దేవబృందము; అలరుచున్ = సంతసించుచు; సన్నుతింపన్ = కొనియాడుచుండఁగా; విషమాంబకమానసశోభిరాగతాహళిహళిన్.—విషమాంబక = విషమలోచనుఁడైన శివునియొక్క, మానస=చిత్తమందు, శోభి=శోభించునట్టి, రాగతా = అనురాగముగలుగుట యొక్క, హాళిహాళిన్=సమ్మర్దమును, ఇదియనుకరణవచనము; మానసమాజవైఖరిన్=గర్వస్థమూహాభంగిచేత; కూర్చితి=ఘటిల్లఁజేసితివి. ఔర=ఆశ్చర్యము!

అట్లు ప్రసిద్ధుం డగుమహేశ్వరునకుఁ గూడ రాగము గల్గించితివి గావున నీశక్తి యు మేయమనుట.

చ. దళమయి చిత్తవీథి సము♦దారరుషారస మెచ్చ నీ వయో
యలహారిదంబరాసహన♦మై తగు గేదఁగిఱేకువంకిచా
యల హారిదంబరావనుల ♦ నన్నిటిఁ గప్పుక పర్వు తేరిమా
యల హారిదంబరాత్మజ మృ♦గాక్షుల నొంపఁ దలంపు గాంతురే. 86

టీ. హారిదంబరాత్మజ = పీతాంబరుండగువిష్ణువుయొక్కపుత్రుఁడా! దళమయి=దట్టమయి; చిత్తవీథిన్=మనోదేశమందు; సముదారరుషారసము=మిక్కిలియధికమగురౌద్రరసము; ఎచ్చన్=అతిశయింపఁగా; నీవు; అలహారిదంబరాసహనము=ఆదిగంబరుఁడగుశివునకుసహింపరానిదై, శివవిరోధియైయనుట;తగు గేదఁగి ఱేకువంకిచాయలన్.—తగు=ఒప్పునట్టి, గేదఁగి ఱేకువంకి=పచ్చనికేతకిఱేకుఅనెడుకత్తియొక్క, చాయలన్=కాంతులనెడుచాయలచేత; హారిదంబరావనులన్=దిగాకాశభూములను; అన్నిటిన్=ఎల్లను ; కప్పుక=ఆవరించికొని ; పర్వు తేరిమాయలన్=వ్యాపించువాయుచూపరథముయొక్కమాయలచేత; మృగాక్షులన్=స్త్రీలను; నొంపన్ తలంపున్=నొప్పించుటకువాంఛను; కాంతురే=పొందుదురా? అయో=ఖేదము!

అనఁగా, మన్మథా! నీవు రుద్రునంతటివాని జయించుట కుపయోగించినసాధనముల చే స్త్రీలను బాధింపఁ దలఁచుట యుక్తము గా దని తాత్పర్యము.

క. కలికాకులకరకుచ కుత్కలికాకుల మిమ్ము రాగ•కలఁ గీరమణీ
కలగీరమణీయోన్నతి, కలగీరమణీలలామ • కలఁగు ననంగా. 87

టీ. కలికాకులకరకుచకున్.—కలికా=మొగ్గలను, ఆకులకర=వ్యాకులములుగాఁజేయునట్టి, కుచకున్=స్తనములుగల చంద్రికకు; ఉత్కలికాకులము=సమ్మదసంఘమును; రాగకలన్=అనురాగకలచేత; ఇమ్ము=ఒనంగుము. అనంగా=మరుఁడా! కీరమణీకలగీరమణీయోన్నతి.—కీరమణీ=శుకశ్రేష్ఠముయొక్క, కల=అవ్యక్తమధురమగు, గీ=వాక్కులయొక్క, రమయణీయ=మనోజ్ఞమగు, ఉన్నతి = అతిశయమువంటి యతిశయము; కలగీరమణీలలామ=కలిగినట్టి సరస్వతియను నుత్తమస్త్రీవంటిదగు చంద్రిక; కలఁగున్=కలఁతనొందును.

చ. అని వనజాతబాణుఁ గొని•యాడి వధూమణు లాదరంబుతో
ననలసమానతీవ్రవిర•హాఖ్యమహాజ్వరరేఖ మించ మే
న నలసమానసం బెనయు•నాతికిఁ గంతున కూన్చినట్టి క్రొ
న్నన లసమానహార్దకల•నంబులు దార్ప గ్రహించి రందఱున్. 88

టీ. అని=ఈప్రకారముగ; అందఱున్=ఎల్లరును; వనజాతబాణున్=మన్మథుని; కొనియాడి=స్తుతించి; వధూమణులు=స్త్రీరత్నములు; ఆదరంబుతోన్=ప్రీతితోడ; అనలసమానతీవ్రవిరహాఖ్యమహాజ్వరరేఖ.—అనలసమాన=అగ్నితోసాటియగు, తీవ్ర=గాఢమైన, విరహాఖ్య=విరహమను పేరుగల, మహాజ్వర=గొప్పజ్వరముయొక్క, రేఖ=పరంపర; మేనన్=శరీరమందు; మించన్ = అతిశయింపఁగా; అలసమానసంబు=బడలినమనుస్సును; ఎనయు నాతికిన్=పొందునట్టిచంద్రికకు; కంతునకున్=మన్మథునకు; ఊన్చినట్టిక్రొన్ననలు = వహింపఁజేసినట్టిక్రొత్త పువ్వులను; అసమానహార్దకలనంబులు.—అసమాన=సాటిలేని, హార్దకలనంబులు=స్నేహసంబంధములను; తార్పన్=కలిగించుటకు; గ్రహించిరి=తీసికొనిరి.

చ. చెలువ మెసంగినట్టియల•చిత్తభవార్పితసూనపాళికల్
బలుమరునారసా లనుచుఁ • బాయనివెవ్వెఱ నాత్మ మించఁగన్
బలుమఱు నారసాధిపకు•మారిక వింతలె దాల్పకుండుటల్
నలి నవి మారయుక్తి గని•నన్ సుమనస్తతి యంటఁ బాత్రమే. 89

టీ. చెలువము=అందము; ఎసంగినట్టియలచిత్తభవార్పితసూనపాళికల్.—ఎసంగినట్టి=అతిశయించినట్టి, అలచిత్తభవ = ఆమన్మథునికొఱకు, అర్పిత = సమర్పింపఁబడిన, సూనపాళికల్=కుసుమపరంపరలు; బలుమరునారసాలు.—బలు=అధికమగు, మరు = మన్మథునియొక్క, నారసాలు=నారాచములు; అనుచున్=ఇటనుచు; పాయని వెవ్వెఱ=తొలంగనియధికభయము; ఆత్మన్=చిత్తమందు; మించఁగన్=అతిశయింపఁగ; పలుమఱున్=మాటిమాటికి; ఆరసాధిపకుమారిక=ఆరాజపుత్రికయగు చంద్రిక; నలిన్=మిక్కిలి; అవితాల్పకుండుటల్=ఆసూనపాళి

కలనుధరింపకుండుటలు; వింతలె=ఆశ్చర్యమా ? వింతలుగావనుట. మారయుక్తిన్=హింసకసాంగత్యమును,మరునితోఁగూడియుండుటను; కనినన్=పొందినమీఁద; సుమనస్తతి=పండితులమండలి,కుసుమగణము;అంటన్=స్పృశించుటకు;పాత్రమే=యోగ్యమా?యోగ్యముకాదనుట.

అనఁగా మరునిప్రసాదమగుపువ్వులు చంద్రికకుబలిష్ఠమగు మన్మథబాణములుగాఁ దోఁచుటచే వానినిదాల్పకుండుటయరదిగాదనుట. సుమనస్సులగువారు మారకసాంగత్యము నొందినచో ముట్టుటకును బాత్రులుగారనియర్థాంతరన్యాసము.

చ. నలినకరాలలామక మ•నస్థభయంబు తలంగఁ జేసి వే
నలి నకరాలసత్ప్రియ మ•నం జలజాస్త్రప్రసాద ముంచి చా
నలినకరాలఘుక్రమము•నన్ దొవతీవియ నా స్మరాశుగా
వలులఁ దలంకుకొమ్మ గొని • వచ్చిరి కేళినిశాంతసీమకున్. 90

టీ. నలినకరాలలామకమనస్థభయంబు.—నలినకరాలలామక= పద్మకరలగుస్త్రీలయందు శ్రేష్ఠురాలైనచంద్రికయొక్క, మనస్థభయంబు=మనోగతమైనభీతి; తలంగన్ చేసి=తొలఁగునట్లుచేసి; వేనలిన్=కొప్పునందు ; అకరాలసత్ప్రియమునన్=అకుటిలమైశ్రేష్ఠమైనప్రీతిచేత; జలజాస్త్రప్రసాదము=మన్మథప్రసాదమును; ఉంచి=నిలిపి; చానలు=స్త్రీలు ; ఇనకరాలఘుక్రమంబునన్.—ఇనకర=సూర్యకిరణములయొక్క, అలఘుక్రమంబునన్ = అధికప్రసరణముచేత; తొవతీవియనాన్=కువలయలతయనునట్లు; స్మరాశుగావలులన్=మదనబాణపరంపరలచేత; తలంకుకొమ్మన్=భయపడుచున్నచంద్రికను; కేళినిశాంతసీమకున్=కేళీగృహప్రదేశమునకు; కొనివచ్చిరి=తెచ్చిరి.

అనఁగా నాస్త్రీలు చంద్రికనూఱడించి యామెమనోగతభీతిని దొలఁగఁ జేసి ప్రీతితోడ స్మరప్రసాదము నామెతురుమునం దుంచి తీవ్రసూర్యకిరణప్రసరణమునకుఁ గలువతీవియవోలె స్మరాస్త్రములకు భీతిల్లునాచంద్రికను గేళికాభవనమునకుఁ దోడితెచ్చి రనుట.

తే. వాసవోపలకచ కేళి•వాస మెనసి
యంత విరిశయ్య మయిఁ జేర్చి • యంతరమున
నరతి రాజిల్లఁ గటువర్త•న రతికాము
నుం డెడయ కుబ్బ విరహార్తి • నుండె నపుడు. 91

టీ. వాసవోపలకచ=ఇంద్రనీలమణులఁబోలుకురులుగలచంద్రిక ; కేళివాసము = కేళీగృహమును; ఎనసి = పొంది; అంతన్ = అటుపిమ్మట ; విరిశయ్యన్ = పుష్పతల్పమందు; మయిన్=దేహమును; చేర్చి=ఉంచి; అంతరమునన్=చిత్తమందు; అరతి = విషయనివృత్తియనెడుస్మరావస్థ; రాజిల్లన్=ఒప్పుచుండఁగా; రతికామనుండు=స్మరుఁడు; కటువర్తనన్=తీక్ష్ణవృత్తిని; ఎడయక=ఎడఁబాయక; ఉబ్బన్=విజృంభించుచుండఁగా ; విరహార్తిన్=విరహదుఃఖప్రాప్తిచేత; అపుడు; ఉండెన్.

ఆచంద్రిక కేళీగృహము చేరి విరిపాన్పుపైఁ బవ్వళించి అరతియను స్మరావస్థచేఁ గుందుచుండె ననుట.

చ. జవగతి మిత్రుఁ డబ్ధిపతి•సన్నిధిఁ జేరఁగ నేగె నత్తఱిన్
రవరవ సంతతత్వగతి • రాజిల మారుఁడు మారుతాళికీ
రవరవసంతముఖ్యబల•రాజియుతిన్ దగి రిత్త యాకలా
రవరవ సంతతంబుఁ బ్రదర•మ్ముల నేఁచఁగ గాంచ నోపమిన్. 92

టీ. మారుఁడు = మన్మథుఁడు; రవరవ = ఆగ్రహము; సంతతత్వగతిన్ = సాతత్య వర్తనచేత; రాజిలన్ = ఒప్పఁగా; మారుతాళికీరవరవసంతముఖ్యబలరాజియుతిన్.— మారుతాళి=మందమారుతపరంపరయొక్కయు, కీరవర = శుకశ్రేష్ఠములయొక్కయు, వసంతముఖ్య=వసంతుఁడు మొదలుగాఁగల,బలరాజి=సైన్యసంఘముయొక్క యు,యుతిన్ = సంబంధముచేత; తగి=ఒప్పి; రిత్త=వ్యర్థముగా; ఆకలారవరవన్ =ఆకోకిలవాణియగుచంద్రికను; సంతతంబున్=ఎల్లప్పుడును; ప్రదరమ్ములన్=సాయకములచే; ఏఁచఁగన్=బాధించుచుండఁగా; కాంచన్ ఓపమిన్=చూడఁజాలమిచేత; అత్తఱిన్=అపుడు; మిత్రుఁడు = సూర్యుఁడు, స్నేహితుఁడనియు తోఁచును; జవగతిన్=జవముతోఁగూడిన గమనముచేత;అబ్ధిపతిసన్నిధిన్= సముద్రసన్నిధిని; చేరఁగన్ ఏగెన్=చేరుటకుపోయెను.

అనఁగా నాచంద్రికను మదనుం డాగ్రహముచే మందమారుతకీర వసంతాదులతోఁ జేరివృథాబాధించుచుండఁగాఁ జూడఁజాలకసూర్యుండు పశ్చిమాంబురాశిచెంత కేగె ననుట, మిత్త్రుఁడు స్వమిత్త్రునిహింసఁ జూడఁజాలక తొలఁగి పోవుట సహజ మని మిత్త్రశబ్దమును బట్టి యర్థాంతరము ధ్వనించుచున్నది. సూర్యుఁ డస్తంగతుఁ డాయె నని ఫలితార్థము. హేతూత్ప్రేక్షాలంకారము.

తే. అమితనిజధామగరిమ పా•య వనజాత
హితుఁడు గాలైకగతిఁ దూల • నిల యనినత,
నంద నభివృద్ధిచేఁ బొల్చు • యవనజాత
బలములో యన నీడచాల్ • ప్రబలె నపుడు. 93

టీ. వనజాతహితుఁడు=సూర్యుఁడు; అమితనిజధామగరిమ.—అమిత=అధికమైన, నిజధామ=తనదీప్తియనెడు ప్రతాపముయొక్క, గరిమ=అతిశయము; కాలైకగతిన్=సంధ్యాకాలప్రాప్తి యనెడు దైవగతిచేత; తూలన్=పడిపోఁగా; ఇల=భూమి; అనినతన్=సూర్యుఁడను రాజాలేనిదగుటను; అందన్=పొందఁగా; అభివృద్ధిచేన్=అభ్యుదయముచేత ; పొల్చు యవనజాతబలములో యనన్=ఒప్పునట్టి యవనులగుంపులో యనునట్లు; నీడచాల్= ఛాయాపరంపర; అపుడు=ఆసమయమున; ప్రబలెన్=అతిశయించెను.

అనఁగా మిగులఁ బ్రతాపశాలి యైన యొకభూపతి కాలగతివలనఁ గడచి పోఁగా బ్రవృద్ధులై యవనులు వ్యాపించునట్లు మిగులఁ దేజశ్శాలి యగు సూర్యుండు సంధ్యాసమయ ప్రాప్తిచేతఁ దూలఁగా మిగులవృద్ధిఁ బొంది ఛాయాకదంబము ప్రబలె ననుట. స్వరూపోత్ప్రేక్ష.

చ. ఉరుతిమిరేభభేదనచ♦ణోగ్రకనత్కరజాతశాలి యౌ
హరి యనివారితాస్తకుధ♦రాధిపశృంగముఁ జేరి యత్తఱిన్
హరి యని వారితాత్మతను ♦ హార్యనుబింబము గాంచి రాగవై
ఖరి వడి గుప్పనం దుముకు♦కై వడిఁ గ్రుంకెఁ బయోనిధిస్థలిన్. 94.

టీ. ఉరుతిమిరేభభేదనచణోగ్ర కనత్కరజాతశాలి.— ఉరు=గొప్పదైన, తిమిరేభ = అంధకారమనెడు నేనుఁగుయొక్క, భేదన=భేదించుటయందు, చణ=నేర్పరియైన, ఉగ్ర=ఉగ్రమగునట్లుగా, కనత్=ఒప్పుచున్న, కరజాత=కిరణసంఘమనెడు గోరులచేత, "పునర్భవః కరరుహః" అని యమరుఁడు, శాలి=ఒప్పుచున్నవాఁడు; ఔ హరి=అగునట్టి సూర్యుఁడనెడు సింహము; అని వారితాస్త కుధరాధిపశృంగమున్.—అనివారిత=నివారింపరాని, అస్తకుధరాధిప=అస్తమనెడు పర్వతరాజుయొక్క, శృంగమున్= శిఖరమును; చేరి = పొంది; అత్తఱిన్=ఆసమయమందు; వారితాత్మతను హార్యనుబింబము.—వాః=ఉదకమును, ఇత = పొందినట్టి, ఆత్మతను=తనశరీరముయొక్క, హారి=మనోహరమగు, అనుబింబము=ప్రతిబింబమును; కాంచి=చూచి; హరియని=ప్రతిసింహమని; రాగవైఖరిన్=రక్తిమయనెడు క్రోధముయొక్కభంగిచేత; వడిన్=వేగముగా; గుప్పనన్ దుముకుకైవడిన్=గుప్పనదుముకునట్లు;పయోనిధిస్థలిన్=సముద్రప్రదేశమందు; క్రుంకెన్=మునిఁగెను.

అనఁగా గజభేదనసమర్థము లైననఖరములతో రాజిల్లు నొకసింహము అచలశిఖరమందుండి నీటిలోఁ బ్రతిఫలించిన తనయంగమును ప్రతిసింహముగా నెంచి కోపముచేత గుప్పన దుమికినట్లు తిమిరవిదారణచణము లగుకిరణములతోఁ గూడినసూర్యుండు చరమాద్రి నుండి రక్తిమతోఁ గూడి పయోబ్ధిని గ్రుంకె ననుట. రూపకోపమాలంకార సంకరము.

సీ. భాస్వద్ధరిక్రమో♦పరిగతాంబుధితటో
జ్జ్వలరక్తకవనీర♦జము లనంగ
నభఃప్రతిబింబితచర♦మాగపద్మాకరా
స్థానరోహితనీర♦జము లనంగ
వనజిని కర్కవ♦ర్తన దెల్ప నెగసి బ
ల్వడి వచ్చు చక్రవా♦లము లనంగ
రవినక్రపదముఁ జే♦రఁగ శ్యామఁ బూన్చును
త్తమదీపచక్రవా♦లము లనంగ

తే. తమి నినుఁడు చేర వరకలా♦పము లనంగ
సీమ వారుణి దాల్ప రా♦జిలుతదీయ
విమలమణికావిభాకలా♦పము లనంగ
నహహా నవసాంధ్యరాగమ్ము♦ లపుడు పొలిచె. 95

టీ. అపుడు=సూర్యుఁడు గ్రుంకినసమయమందు; నవసాంధ్యరాగమ్ములు=నూతనములగు సంధ్యాకాలికారుణ్యములు; భాస్వద్ధరిక్రమోపరిగతాంబుధితటోజ్జ్వల రక్తకవనీరజములు.— భాస్వత్=సూర్యునియొక్క, హరి=గుఱ్ఱములయొక్క, క్రమ=పాదవిక్షేపముచేత, ఉపరిగత=మిన్నందినట్టి, ఇది రజమునకువిశేషణము, అంబుధితటోజ్జ్వల = సముద్రతీరమున వెలయు, రక్తక=మంకెనలయొక్క; వనీ=వనములయొక్క, రజములు=పరాగములు; అనంగన్=అనునట్లుగా; అభ్రబింబిత చరమాగపద్మాకరాస్థానరోహితనీరజములు.—అభ్ర=ఆకసమందు, బింబిత=ప్రతిబింబించిన, ఇది నీరజములకువిశేషణము, చరమాగ=అస్తాద్రియందలి, పద్మాకర=కొలనియందు, ఆస్థాన=స్థితిగల, రోహిత నీరజములు=ఎఱ్ఱదామరలు; అనంగన్=అనునట్లుగా; వనజినికిన్=తామరతీవకు; అర్కవర్తన్=సూర్యునివృత్తాంతమును; [illegible]న్= తెలియఁజేయుటకు; ఎగసి=పైకెగసి; బల్వడిన్=అతివేగముచే; వచ్చు [illegible]క్రవాల[illegible] = వచ్చునట్టిజక్కవల గుంపులు; రేఫలకారముల కభేదముచే వాల మనుచో వార మ[illegible]ంపఁబడిరి; అనంగన్=అనునట్లుగా; రవి=సూర్యుఁడు; నక్రపదమున్=సముద్రమును చేరఁగన్=పొందఁగా; శ్యామ=రాత్రియనెడుస్త్రీ; పూన్చునుత్తమదీప చక్రవాలములు.—పూన్చు=ఉంచునట్టి, ఉత్తమ=శ్రేష్ఠములైన, దీప=దీపములయొక్క, చక్రవాలములు=మండలములు; అనంగన్=అనునట్లుగా; తమిన్=ఆసక్తిచేత; ఇనుఁడు=సూర్యుఁడను నాయకుఁడు; చేరన్ = పొందఁగా; వర కలాపములు=శ్రేష్ఠమైనభూషణములను; వారుణి = ప్రతీచి; స్త్రీత్వనిర్దేశముచేత నొకస్త్రీయని తోఁచుచున్నది; అంగసీమన్=దేహప్రదేశమందు; తాల్పన్=ధరింపఁగా; రాజిలుతదీయవిమలమణికావిభాకలాపములు.—రాజిలు=ప్రకాశించుచున్న, తదీయ=ఆభూషణ సంబంధియగు, విమల=స్వచ్ఛములైన, మణికా=మణులయొక్క, విభా=కాంతులయొక్క, కలాపములు = సమూహములు; అనంగన్=అనునట్లుగా; పొలిచెన్=ప్రకాశించెను. అహహా=అద్భుతము!

అనఁగా సాంధ్యరాగములు సూర్యాశ్వగతివలన గగనతలమంటిన సముద్రతీరపుమంకెనవనము లందలిపుష్పాదుల ట్లున్న వనియుఁ జరమాద్రియందలికొలఁకులం దుండి గగనతలమందుఁ బ్రతిఫలించిన యెఱ్ఱదామరల ట్లున్న వనియు సూర్యుం డస్తమించె నని పద్మినికిఁ జెప్ప గగనతలమున కెగసి వచ్చుచున్న చక్రవాకముల గుంపులవలె నున్న వనియు సూర్యుం డస్తమింపఁగా రాత్రియనుస్త్రీ యమర్చిన దీపమండలిని బోలి యున్న వనియు సూర్యుఁ డనుభర్తను జేరఁ బ్రతీచియనుస్త్రీ దాల్చినభూషణముల మణికాంతులభంగి నొప్పిన వనియు భావము. ఉత్ప్రేక్షాలంకారముల సంసృష్టి.

చ. ఘనకమలోదయం బెడయుఁ♦ గాలగతి న్వన మందుచు న్రథాం
గనల గవాధినేత పనఁ♦గాఁ గడుఁ దత్సతి యాత్మఁ జింత పొం

గనలఁగ వారి కన్నుఁగవఁ • గ్రమ్మఁ దనూస్థలి తాపభోగిచేఁ
గనలఁగ వాడుచు న్వెమకెఁ • గాంతునిఁ గాననమండలంబునన్. 96

టీ. ఇందు జక్కవపరమైన యర్థము నలచక్రవర్తిపరమైన యర్థము గలుగుచున్నవి. ఘనకమలోదయంబు.— ఘన=అధికమైన, కమల=పద్మములయొక్క, లక్ష్మియొక్కయని యర్థాంతరము; ఉదయంబు=ఆవిర్భావము; కాలగతిన్=సంధ్యావశముచేత, కాల = కలిసంభవమైన, గతిన్=దశావిశేషముచేత; ఎడయన్=పాయఁగా; వనము = ఉదకమును, అడవిని; అందుచున్=పొందుచు; రథాంగనలగవాధినేత=చక్రవాకమనెడు నలరాజు; చనఁగాన్ = పోఁగా; కడున్=మిక్కిలి; తత్సతి=దానిపెంటి, దమయంతియని యర్థాంతరము; ఆత్మన్= చిత్తమందు; చింత=ఆధ్యానము; పొంగన్=మించఁగా; నలఁగన్=నలఁతపొందఁగా; వారి= అశ్రులు; కన్నుఁగవన్=నేత్రయుగ్మమందు; క్రమ్మన్=పైకుబుకఁగా; తనూస్థలి=దేహప్రదేశము; తాపభోగిచేన్=సర్పమువంటిసంతాపముచేత; కనలఁగన్ = మండుచుండఁగా; వాడుచున్=మ్లానమగుచు, కాననమండలంబునన్=అరణ్యప్రదేశమునందు; కాంతున్=ప్రియుని; వెమకెన్=వెదకెను. నలార్థమందు పనూస్థలి తాపభోగిచేన్ సంతాపకరమగుసర్పముచేత! కనలఁగన్=మండఁగా; వాడుచున్=మ్లానుఁడగుచు;నలగవాధివేత సనఁగ నని యోజింపవలెను. కానిచో దమయంతియందుఁ దాపభోగిచేఁ గనలుట సంభవింపక యసంగత మగును.

ఉ. మక్కువసారసాకరస•మాజము చేరుచుఁ బట్టఁబూనుఁ బో
జక్కవనాతి మానితని•జప్రతిబింబము గాంచి భర్తయం
చక్కట పిల్చుఁబో పతి వ•నావళి కుంజచయంబు దూఱుచున్
జక్కవనాతిమానితత•సమ్మదసంపద లెల్ల నత్తఱిన్. 97

టీ. జక్కవనాతి = చక్రవాకస్త్రీ; మక్కువన్ = ప్రేమచేత; సారసాకరసమాజము= పద్మాకరసమూహము; చేరుచున్ = పొందుచు; చక్కన్ = బాగుగా; వనాతిమానితనిజప్రతిబింబము.— వన = జలమందు, అతిమానిత = మిక్కిలియొప్పుచున్న, నిజప్రతిబింబము=తనప్రతిబింబమును; కాంచి=చూచి; భర్తయంచున్=తనప్రియుఁడనుచు;పట్టన్=పట్టుకొనుటకు; పూనుఁబో=యత్నించుజూమీ: అక్కట = ఖేదము! వనావళిన్=అరణ్యపంక్తియందు; కుంజచయంబు=పొదరిండ్లగుంపును;దూఱుచున్=చొచ్చుచు;తతసమ్మదసంపదలెల్లన్.— తత=విస్తృతములగు, సమ్మద సంపదలెల్లన్=సంతోషసమృద్ధులన్నింటిని; అత్తఱిన్=అపుడు; మాని==త్యజించి; పతిన్=ప్రియుని; పిల్చుఁబో=ఆహ్వానము చేయునుజూమా.

సూర్యాస్తానంతరమునఁ జక్రవాకస్త్రీ కాసారములచెంతకుఁ బోయి తన ప్రతిబింబమును జూచి భర్తయను తలంపునఁ బట్టఁ బూను ననియు అరణ్యప్రదేశములయందు పొదలు దూఱుచు సంతోషమును మాని పతిని బిల్చుచుండుననియు భావము.

సీ. చక్రభయాపాది•సమయఘనాఘనా
లిసుతనూవ్యక్తమా•లిన్య మనఁగ
పరినటచ్ఛివకటీ•భ్రష్టఘనాఘనా
త్మకదానవాజినాం•శుక మనంగ
ద్యుమణిరథాంగహా•త్యుత్థఘనాఘనా
శ్మమయాస్తగిరినితం•బరజ మనఁగ
నిశ్శేషబంధకీ•నికరఘనాఘనా
శరతీశసృష్టశాం•బరిక యనఁగఁ

తే. ప్రకటదివసాత్యయాఖ్యన•భస్యకాల
కలితసాంద్రఘనాఘనా•కలికయనఁగ
నార యతినీలదీప్తిజా•లానుపూర్తి
నమరె నవ్వేళ నిర్వేల•తిమిరరాశి. 98

టీ. చక్రభయాపాది సమయ ఘనాఘనాళిసుత నూవ్యక్తమాలిన్యము.—చక్ర=చక్రవాకమనెడురాష్ట్రిమునకు, భయాపాది=భయసంపాదకమైన, సమయ=సంధ్యాకాలమనెడు, ఘనాఘనాళి=ఘాతుకపంక్తియొక్క, సుతనూ= దేహములయందు, వ్యక్త = బయలుపడిన, మాలిన్యము=మలినత; అనఁగన్=అనునట్లు; పరినటచ్ఛివకటీభ్రష్ట ఘనాఘనాత్మకదానవాజినాంశుకమనంగన్.—పరినటత్=మిక్కిలి నటించుచున్న, శివ=ఈశ్వరునియొక్క, కటీ=కటిప్రదేశమువలన, భ్రష్ట=జాఱిన, ఘనాఘనాత్మకదానవ=గజాసురునియొక్క, అజిన=చర్మమనెడు, అంశుకమనంగన్=వస్త్రమనఁగా; శివుఁడు ప్రదోషసమయమునఁ దాండవము సల్పుట ప్రసిద్ధము; ద్యుమణిరథాంగహాత్యుత్థ ఘనాఘనాశ్మమయాస్తగిరినితంబరజమనంగన్.—ద్యుమణిరథాంగ=సూర్యరథచక్రముల చేతనైన, హతి=కొట్టుటచేత, ఉత్థ=పుట్టిన, ఇది రజమునకు విశేషణము, అతిఘనాఘనాశ్మమయ=మిగులఘనములైన పాషాణప్రచురమగు, అస్తగిరినితంబ=అస్తాచలకటకముయొక్క, రజమనఁగన్=పరాగమనునట్లు; నిశ్శేషబంధకీనికర ఘనాఘనాశరతీశసృష్ట శాంబరికయనఁగ.—నిశ్శేషబంధకీ=అశేషజారిణులయొక్క, నికర = సంఘముయొక్క, ఘన=అధికమైన, అఘ=పాపముయొక్క, నాశ=నాశముకొఱకు, రతీశసృష్ట=మన్మథుని చేసృజింపఁబడిన, శాంబరికయనఁగన్= మాయయనునట్లు; ప్రకట దివసాత్యయాఖ్యనభస్యకాలకలితసాంద్ర ఘనాఘనాకలిక.—ప్రకట=వ్యక్తమైన, దివసాత్యయాఖ్య=దివసావసానమను పేరుగల, నభస్యకాల=భాద్రపదసమయమందు, వర్షర్తుసమయమందనుట, కలిత = ఒప్పుచున్న, సాంద్ర=దట్టములగు, ఘనాఘన=వర్షుకాబ్దములయొక్క, కలిక అనఁగన్=కాంతియనునట్లు; “ఘనాఘనో ఘాతుకమత్తదన్తినోః వివరన్తరే దానవవర్షుకాబ్దయోః” అని విశ్వము; అవ్వేళన్=ఆసమయమందు; నిర్వేలతిమిరరాశి=అడ్డములేని చీఁకటిగుంపు; అతినీలదీప్తి జాలాను

పూర్తిన్=మిక్కిలి నల్లనగుకాంతి జాలముయొక్క పరిపూర్తిచేత; అమరెన్=ఒప్పెను. ఔర=ఆశ్చర్యము!

అనఁగా నప్పుడు చీఁకటులగుంపు చక్రములకు భయముగలిగించునట్టి సంధ్యాకాలమనెడు ఘాతుకసమూహముయొక్క దేహనైల్యమో యనునట్లును, శివుఁడు ప్రదోషసమయమునఁ దాండవముసేయఁగా జాఱినయతనిగజచర్మోత్తరీయమో యనునట్లును, సూర్యరథచక్రంబుల తాఁకుడుచే నస్తాద్రిశిలలు పొడియై రేఁగినధూళిపుంజమో యనునట్లును, జారిణులపాపము పాయుటకై మన్మథుఁడు కల్పించిన మాయయో యనునట్లును, సాయంకాలమనెడువర్షాకాలమందుఁ దోఁచుమేఘపంక్తియో యనునట్లును, వెలసెనని తాత్పర్యము.

చ. ఇనుఁ డతిదూరదేశమున • కేగఁ దదాగమనంబుఁ గోరి పా
వనజలతాళితాంగపరి•వారితపంకనికాయయై తమిన్
వనజలతాళి గప్పఁగలు•వన్ మధుసూదని నావహించి స
ద్వనజలతాళిగాత్రి కథ • వల్కఁగ మోడ్చెఁ బయోజహస్తముల్. 99

టీ. వనజలతాళి=తామరతీవలగుంపు, స్త్రీత్వనిర్దేశమున నొకస్త్రీ యని తోఁచుచున్నది; ఇనుఁడు=సూర్యుండనెడుభర్త; అతిదూరదేశమునకున్=మిగుల దూరదేశమునకు; ఏగన్=పోఁగా; తదాగమనంబున్=ఆయినునిరాకను; కోరి=ఇచ్ఛించి; పావనజలతాళితాంగ పరివారితపంకనికాయయై.—పావన=పవిత్రమగు, జల=జలముచేత, తాళిత=అనఁగా డలలక భేదమునుబట్టి తాడితమైన, ఇది పంకవిశేషణము, అంగపరివారిత = శరీరమునకుఁ బరివారమువలె నావరించుచున్న, పంకనికాయయై=కర్దమచయమనెడు పాపసంఘముకలదై; తమిన్=రాత్రియందు, ఆసక్తిచేత, శ్లిష్టరూపకము; కప్పఁగలువన్=నల్లగలువయందు; మధుసూదనిన్=లక్ష్మీదేవిని; ఆవహించి=ఆవాహనముచేసి; సద్వనజలతాళిగాత్రి.—సత్=శ్రేష్ఠమైన, వనజలతా= వనమందుఁబుట్టిన లతలయందలి, అళిగాత్రి=తుమ్మెదయను గాయకురాలు; కథవల్కన్ =కథఁజెప్పఁగా; పయోజహస్తముల్=కమలములనెడు హస్తములను; పయోజములవంటి హస్తములనని ప్రోషిత పతికాపరమైనయర్థము; మోడ్చెన్=ముకుళించెను.

అనఁగాఁ బ్రోషితభర్తృక దేశాంతరముననుండు తనభర్తరాకను గోరిపుణ్యతీర్థస్నానముచే గతకల్మషయై యాసక్తిచేత నొకపద్మమందు లక్ష్మీదేవి నావహించి పూజించి యొకపుణ్యాంగన కథ చెప్పుచుండఁగాఁ జేలు మోడ్చియుండు నట్లు తామరతీవ సూర్యుఁ డస్తమింపఁగా నిర్మలజలముచేఁ గర్దమచయము పోఁగొట్టికొనినదై రాత్రియందునల్లగలువయందు శ్రీ నావహించి తుమ్మెదలు పాడుచుండఁగా పద్మములు మోడ్చెననుట. సూర్యుఁ డస్తమించినపిదపఁ గమలములు ముకుళించె ననియు కలువలు సిరి యొప్పార రాజిల్లె ననియు వానిచెంతఁ దుమ్మెదలు మ్రోయుచుండె ననియు ఫలితార్థము.

సీ. నటదీశవహ్ని ది•జ్ఞారులు చల్లుమం
గళసితాక్షతజాల•కంబు లనఁగ

నచలావపతనవే♦ళాభ్రిలగ్నతమఃక
దంబాపగాజాల♦కంబు లనఁగ
వనరాశి రవి మాధ♦వతఁ దోఁప నంబరా
గమునఁ బొల్చినజాల♦కంబు లనఁగఁ
దఱి రా శుభము వేల్పు♦తెఱవచాల్ గన నాక
ఘనకుడ్యకృతజాల♦కంబు లనఁగ

తే. గురుసరశ్శ్రేణిరాజీవ♦కులము నడఁచి
యంబరస్థలి నాఱి ది♦ష్టాఖ్యమైని
కతతి పఱచిన వరజాల♦కంబు లనఁగఁ
జొక్క మగుమింటఁ గనుపట్టె♦ రిక్క లపుడు. 100

టీ. నటదీశమౌళిన్.—నటత్=నటించుచున్న, ఈశ=ఈశ్వరునియొక్క, మౌళిన్=శిరస్సునందు; దిఙ్నారులు=దిగంగనలు; చల్లుమంగళ సితాక్షత జాలకంబులనఁగన్.—చల్లు=చల్లునట్టి, మంగళ=శుభకరములైన, సితాక్షత=తెల్లనియక్షతలయొక్క, జాలకంబులు అనఁగన్=సంఘములనునట్లుగా; అచలావపతనవేళాభ్రలగ్నతమఃకదంబాపగాజాలకంబులు.—అచలా=భూమియందు, అవపతనవేళా=పడుటయొక్క సమయమందు, అభ్రి=ఆకాశమందు, లగ్న=సంబంధించిన, తమః కదంబాపగా=తిమిరసంఘమనెడు నదియొక్క, జాలకంబులు=బిందువులు; అనఁగన్=అనునట్లుగా; వనరాశిన్=సముద్రమను నరణ్యాకదంబమందు; రవి=సూర్యుఁడు; మాధవతన్=విష్ణుత్వమనెడు వసంతభావముచే, సంధ్యయందు సూర్యుఁడు విష్ణురూపుఁ డనుట యాగమప్రసిద్ధము; తోఁపన్=తోఁపఁగా; అంబరాగమునన్=అంతరిక్షమనెడు వృక్షమందు; పొల్చినజాలకమ్ములనఁగన్=ఉదయించిన మొగ్గలనునట్లుగా; తఱి=సంధ్యాసమయము; రాన్=రాఁగా; వేల్పుతెఱవచాల్=దేవతాస్త్రీసంఘము; శుభము=రాఁబోవుశుభమును; కనన్=చూచుటకు; నాకఘన కుడ్యకృతజాలకంబులు అనఁగన్.—నాక=అంతరిక్షమనెడు, ఘనకుడ్య=గొప్పగోడయందు, కృత=చేయఁబడిన, జాలకంబులనఁగన్=గవాక్షములనఁగా; గురుసరశ్శ్రేణిన్=గొప్పలగు కాసారముల సంఘమందు; రాజీవకులమున్ = పద్మసమూహమను మత్స్యములగుంపును; అడఁచి=అడఁగించి; అంబరస్థలిన్=ఆకాశప్రదేశమందు; ఆఱన్ = తడియాఱుటకు; దిష్టాఖ్యమైనికతతి=కాలమను పేరుగల మత్స్యఘాతుకులయొక్క గుంపు; మీనశబ్దముపై "పక్షిమత్స్యమృగాన్హన్తి" అను సూత్రముచే ఠక్ప్రత్యయము; పఱచినవరజాలకంబులు=పఱచినట్టి క్రొత్తవలలు; అనఁగన్=అనునట్లుగా; అపుడు=ఆసమయమందు; చొక్కమగుమింటన్=నిర్మలమగు నాకాశమందు; రిక్కలు=నక్షత్రములు; కనుపట్టెన్ = చూపట్టెను.

అనఁగా నపుడు నక్షత్రములుదయించినవై, సంధ్యాకాలమున నాట్యము సేయుచుండు శివునిశిరమున దిగంగనలు చల్లినతెల్లనియక్షత లనునట్లును, అంధకార మనెడునది యాకాశ

మునుండి దిగువఁబడునపుడు గగనలగ్నము లగుబిందువు లనునట్లును, వనరాశియందు సూర్యుఁ డనువసంతుఁడు. తోఁపఁగా గగన మనువృక్షమందుఁ బుట్టినమొగ్గ లనునట్లును, దేవాంగనలు సంధ్యాసమయము రాఁగాఁ గలిగెడు శుభమును గన్గొనుటకు గగన మనుకుడ్యమందుఁ జేయఁబడినగవాక్షము లనునట్లును, సంధ్యాకాల మనెడు మీనఘాతుకతతి సరస్సులయందు రాజీవములనెడు మత్స్యములఁబట్టి గగనమం దాఱవేసినవల యున్నట్లును భాసిల్లె నని భావము.

మ. శరజద్వేషి నిశావధూటి వరణేచ్ఛ రాఁగ మున్మున్నె బల
త్త్వరఁ గాలోపధికారు లూనునవచంద్రజ్యోతిరాళీలస
త్పరివర్ణ్యస్వకవర్ణనిర్ణిహతచంద్రజ్యోతిరాళీలస
ద్గరిమం బెంపయి దోఁచెఁ బ్రాచి నవదాతత్విట్కులం బయ్యెడన్. 101

టీ. శరజద్వేషి=కమలవిరోధియగుచంద్రుఁడు; నిశావధూటివరణేచ్ఛన్=రాత్రియనెడుస్త్రీని వరించుకోర్కిచే; రాఁగన్=వచ్చుచుండఁగా; మున్మున్నె = ముందుముందే; బలత్త్వరన్=అతివేగముచేత; కాలోపధికారులు=కాలమనెడునెపముగలశిల్పులు; ఊనునవచంద్రజ్యోతిరాళీలసత్పరివర్ణ్యస్వకవర్ణనిర్ణిహతచంద్రజ్యోతిరాళీలసద్గరిమన్.—ఊను=వహించునట్టి, నవ=నూతనములైన, చంద్రజ్యోతిః=కర్పూరదీపములయొక్క, "ఘనసారశ్చన్ద్రసంజ్ఞః" అనియమరుఁడు, ఆళీ=పంక్తులవలె, లసత్ = ప్రకాశించుచున్న, పరివర్ణ్య = వర్ణింపఁదగిన, స్వక=స్వకీయమైన, వర్ణ=కాంతిచేత, నిర్ణిహత = అఖండితమైన, చంద్రజ్యోతిరాళీ=పగలువత్తులపంక్తులయొక్క, లసత్=ఒప్పుచున్న, గరిమన్=అతిశయముచేత; అవదాతత్విట్కులంబు = శుభ్రకాంతిపుంజము; అయ్యెడన్ = అపుడు; ప్రాచిన్ = తూర్పున; పెంపయి=అధికమై; తోఁచెన్=అగపడెను.

అనఁగా చంద్రుఁ డనునాయకుఁడు నిశ యను స్త్రీని వరింప వచ్చుచుండఁగా ముందుముందే శిల్పకారులు పట్టినపగలువత్తులవలెఁ దూర్పునఁ దెల్లనికాంతిపుంజముఁ దోఁచె ననుట. తూర్పునఁ జంద్రకిరణపుంజము గనిపించె నని ఫలితార్థము.

సీ. గగనబాలుం డూర్ధ్వగతరశ్మి దివియఁ బైఁ
జక్కఁ జేర్చుపసిండిచక్ర మనఁగఁ
బాంథభీకరలీలఁ బ్రబలునిశాభూత
వతి గొన్నయాలాతచక్ర మనఁగ
చీఁకటిపాలదిండిమూఁక గూల్పఁగఁ గాల
శౌరి చేనెత్తినచక్ర మనఁగ

నినుఁడు పోయినదారిఁ ♦ గనఁ బూర్వగిరిశిఖా
స్థల మెక్కి నిల్చిన ♦ చక్ర మనఁగఁ
తే. ప్రాచి తెలిచాయ యనుమంచు ♦ ప్రబల భాస్వ
దంశుకవిహీనఁ గానఁ దా ♦ నందు కోర్వఁ
జాల కూన్చిననవకీలి ♦ చక్ర మనఁగ
నపుడు దొలికెంపుతోఁ సార ♦ సారి పొలిచె. 102

టీ. గగనబాలుండు=ఆకసమనుచిన్నవాఁడు ; ఊర్ధ్వగతరశ్మిన్.—ఊర్ధ్వగత=ఉపరిగతములగు, రశ్మిన్=కిరణమను త్రాటిని; తివియన్=ఆకర్షించుటకు; పైన్=ఉపరిభాగమందు; చక్కన్=బాగుగా; చేర్చుపసిండిచక్రము అనఁగన్=చేర్చునట్టిబంగరుచక్రమనునట్లుగా; పాంథభీకరలీలన్=పథికులకుభయంకరమగుక్రియచేత ; ప్రబలునిశాభూతసతి=ప్రబలుచున్న రాత్రియనెడుపిశాచాంగన ; కొన్నయాలాతచక్రము అనఁగన్.—కొన్న=కొనినట్టి, అలాత=కొఱవిసంబంధియైన, చక్రమనఁగన్=భ్రమణమనునట్లుగా; చీఁకటిపోలదిండిమూఁకన్=అంధకారమనెడురాక్షసులగుంపును ; కూల్పఁగన్=కూల్చుటకు ; కాలశౌరి = కాలమనెడువిష్ణువు; చేన్=హస్తముచేత; ఎత్తినచక్రము అనఁగన్=పైకెత్తినచక్రాయుధమనునట్లుగా; ఇనుఁడు=సూర్యుఁడు; పోయినదారిన్=పోయినతెరువును; కనన్=చూచుటకు ; పూర్వగిరిశిఖాస్థలము=ఉదయపర్వతాగ్రప్రదేశమును ; ఎక్కి=అధిష్ఠించి ; నిల్చినచక్రమనఁగన్ = నిలిచియుండిన చక్రవాకమనునట్లుగా ; ప్రాచి=ప్రాగ్దిక్కనెడు స్త్రీ ; తెలిచాయయనుమంచు=శుభ్రకాంతియనెడుహిమము;ప్రబలన్=అతిశయింపఁగా;భాస్వదంశుకవిహీన.—భాస్వదంశుక=సూర్యకిరణములనెడుప్రకాశించుచున్నవస్త్రముచేత,విహీన=హీనురాలు;కానన్=అగుటచేత;తాను; అందుకున్=ఆహిమమునకు; ఓర్వఁజాలక=సహింపఁజాలక ; ఊన్చిననవకీలిచక్రమనఁగన్ = చేసినట్టి నూతనమైనహుతాశనసమూహమనునట్లుగా; అపుడు=ఆసమయమందు; సారసారి=చంద్రుఁడు; తొలికెంపుతోన్=తొలుతటియారుణ్యముతోడ; పొలిచెన్=ఉదయించెను.

అనఁగాఁ జంద్రబింబము, గగన మనుబాలుఁ డుపరిగతమైన కిరణమను త్రాటి నాకర్షింపఁజేర్చినసువర్ణచక్రమును బోలియు నిశ యనుపిశాచాంగన పాంథులు భీతిల్లునట్లు త్రిప్పుచున్న కొఱవినిబోలియుఁ గాలమనెడువిష్ణుమూర్తి చీఁకటి యనురాక్షసులగుంపును సంహరింపఁబైకెత్తినచక్రాయుధమును బోలియు సూర్యుఁడు పోయినదారి గన నుదయగిరిశిఖరము నెక్కినచక్రవాకమును బోలియు తెలిచాయ యనెడుమంచు ప్రబలఁగా భాస్వదంశుకవిహీన యగు ప్రాగ్దిగంగన దాని కోర్వఁజాలక పెట్టినమంటను బోలియు ప్రాథమికమైనయరుణకాంతితోఁ గూడి యుదయించె ననుట. చంద్రోదయ మాయె నని ఫలితార్థము. శ్లో॥ ప్రథమమరుణచ్ఛాయ స్తావ త్తతః కనకప్రభ స్తదను విరహోత్తామ్య త్తన్వీకపోలతలద్యుతిః । ఉదయతి తతో ధ్వాంతధ్వంసక్షమః క్షణదాముఖే సరసబిసినీకందచ్ఛేదచ్ఛవిర్మృగలాంఛనః॥ ఇత్యాదికవివ్యవహారములచే నుదయకాలమందుఁ జంద్రున కారుణ్యముండునని దెలియవలయును.

చ. ఒనరఁగ రాజ వయ్యు నిర ♦ నుంచితి తమ్ముల సాధుచక్రమో
దనహృదయంబు నందితని ♦ దార్కొన దుస్తరచింతనాధునిం
దనహృదయంబు నందితని ♦ తాంతబుధాత్మకలాకుఁ డాసుధా
జని కడు వెల్లఁబాఱె ననుఁ ♦ జాడ్పునఁ బాండిమ నొప్పె నయ్యెడన్. 103

టీ. నందితనితాంతబుధాత్మకలాకుఁడు.—నందిత=సంతోషపెట్టఁబడిన, నితాంత=గాఢమైన, బుధాత్మ=దేవతలచిత్తముగల,కళాకుఁడు=కళలుగలవాఁడు, సంతోషపెట్టఁబడినవిద్వచ్చిత్తములు గలవిద్యలు గలవాఁ డనియర్థాంతరము స్ఫురించును ; సుధాజని=చంద్రుఁడు; ఒనరఁగన్=ఒప్పునట్లు; రాజవయ్యున్ = ప్రభువవయ్యు, రాజనామముకలవాఁడవయ్యుననియర్థాంతరము; ఇరన్=జలమందు; తమ్ములన్=సోదరులను, పద్మములను ; ఉంచితి = అడంచితివి; సాధుచక్రమోదనహృదయంబును.—సాధుచక్ర=సత్పురుషులసంఘముయొక్క, మంచిచక్రవాకములయొక్క, మోదన=సంతసమును, హృత్=హరించెడు , అయంబును=శుభావహవిధిని: అంగితి=పొందితివి ; అని = అనితలఁచి; ఇచటఁజంద్రుఁడు తనకుఁదాన సంబోధించికొని పలికెనని గ్రహింపవలయును. తనహృదయంబు = తనచిత్తము ; దుస్తరచింతనాధునిన్ = తరింప రానిచింతయనెడునదిని; దార్కొనన్ = ప్రవేశింపఁగా; కడున్ = మిక్కిలి; వెల్లఁబాఱెనను చాడ్పునన్=వైవర్ణ్యమొందెననురీతిచేత; అయ్యెడన్=అపుడు; పాండిమన్=శుభ్రత్వముచేత; ఒప్పెన్=ఒప్పెను.

ఒకప్రాజ్ఞుఁడైనవాఁడు తాను రాజయ్యును దనసహోదరులను సత్పురుషసంఘమోదమును హరించి వెనుక నాచింతచే సంతాపితహృదయుఁడై వెలవెలఁబాఱునట్లు కళానిధియైనచంద్రుఁడు తాను రాజశబ్దమును బొందియుఁ దమ్ముల నొంచుటను సాధుచక్రమోదమును హరించుటను దలఁచి చింతాక్రాంతుఁడై వెలవెలఁబాఱెనా యను నట్లు పాండిమ నొందె ననుట. చంద్రుఁ డుదయించి ధావళ్యము నొందె ననియు పద్మములు ముకుళించె ననియుఁ జక్రవాకములకు సంతోషము దొలంగె ననియు ఫలితార్థము. ఉత్ప్రేక్షాలంకారము.

మ. మునుమున్ చంద్రఘటిన్ భరించి యమృత ♦ మ్ముల్ నించె వేళా ప్రపా
వనశాలాక్షి తిరోహితాన్యహితభా ♦ వశ్రీ మరుత్వద్దిశా
వనశాలాక్షి తిరోహితాంశుసురభి ♦ వ్యాపారముల్ దూల నూ
తనసంధ్యాతపశక్తి డప్పి గొను జ్యో ♦ త్స్నాపాయిపాంథాళికిన్. 104

టీ. వేలాప్రపావనశాలాక్షి.—వేలా = సమయమనెడు, ప్రపా = చలిపందిరియొక్క, అవన=రక్షించెడు, శాలాక్షి=మీననేత్ర, "రోహితో మద్గురశ్శాలో రాజీవశ్శకులస్తిమిః" అనియమరుఁడు; తిరోహితాన్యహితభావశ్రీన్.—తిరోహితాన్య=అతిరోహితమైన, అనఁగాప్రత్యక్షమైన, హితభావ = ఆప్తత్వముయొక్క, శ్రీన్ = సంపదచేత ; మరుత్వద్దిశావనశాలాక్షితిన్.—మరుత్వద్దిశా=తూర్పుదిక్కనెడు, వనశాలాక్షితిన్=అటవీగృహప్రదేశమందు ; రోహితాంశుసురభివ్యాపారముల్.—రోహితాంశు =సూర్యుఁడనెడు, సురభి = వసంతముయొక్క,

వ్యాపారముల్=క్రియలు; తూలన్=నశింపఁగా; నూతనసంధ్యాతపశక్తిన్.—నూతన= క్రొత్తదైన, సంధ్యా=సంధ్యాకాలమనెడు, తప=గ్రీష్మర్తువుయొక్క, శక్తిన్= సామర్థ్యముచేత; దప్పిగొనుజ్యోత్స్నాప్రపాయిపాంథాళికిన్=తృష్ణనొందుచకోరము లనెడుబాటసారులగుంపునకు; మునుమున్ =ముందుముందుగనె; చంద్రఘటిన్=చంద్రుఁడనెడుఘటమును; భరించి=పోషించి; అమృతమ్ముల్=సుధయనెడుజలములను; నించెన్=పూరించెను.

అనఁగా వేళ యనెడుప్రపాపాలిక సూర్యుఁడనువసంత ముడిగి పోఁగా సంధ్యయను గ్రీష్మర్తువున తూర్పుదిక్కనెడువనశాలాప్రదేశమందు తృష్ణనొందినచకోరము లనుపాంథుల కొఱకు ముందుగనే చంద్రుఁ డనుఘటమం దమృత మనుజలమును నించి యుంచె ననుట. అనఁగా ప్రాగ్దిగంగ నచకోరములకై నించి యుంచినయమృతఘటమువలెఁజంద్రుఁడు రాజిల్లెనని భావము.

మ. తనరెన్ వెన్నెల దిష్టవిష్ణుకృప సద్బాలోదయాసక్తమై
తనయాశాబల మెల్లఁ జేకుఱ శశిస్థాలి న్మనోజ్ఞాదితీ
తనయాశాబల మెల్లమెల్లనె ముదాత్మం బొంగలి స్పెట్టఁ జా
ల నవీనోదయరాగకీలధరకీలం బొంగుదుగ్ధాళి నాన్. 105

టీ. మనోజ్ఞాదితితనయాశాబల.—మనోజ్ఞ=హృద్యమైన, అదితితనయ = ఇంద్రునియొక్క, ఆశా=దిక్కనెడు, అబల=స్త్రీ; దిష్టవిష్ణుకృపన్=కాలమనెడు విష్ణుమూర్తియొక్కదయచేత; సద్బాలోదయాసక్తమై.—సద్బాల=చుక్కలనెడుశ్రేష్ఠశిశువులయొక్క, ఉదయ=ఆవిర్భావమందు, ఆసక్తమై=ఆసక్తికలదై; తనయాశాబలము = తనకోరికయొక్కసామర్థ్యము; ఎల్లన్=అంతయు, చేకుఱన్=సిద్ధింపఁగా; శశిస్థాలిన్=చంద్రుఁడనుపాత్రయందు; మెల్ల మెల్లనె=తిన్నతిన్నగా; ముదాత్మన్=సంతోషచిత్తముచేత; పొంగలిన్ పెట్టన్; నవీనోదయరాగకీలధరకీలన్.—నవీన=నూతనమైన, ఉదయరాగ=చంద్రోదయకాలి కారుణ్యమనెడు, కీలధర=అగ్నియొక్క, కీలన్=జ్వాలచేత; చాలన్=మిక్కిలి; పొంగుదుగ్ధాళినాన్=ఉప్పొంగుక్షీరపరంపరయనునట్లుగా; వెన్నెల=చంద్రిక; తనరెన్=ఒప్పెను.

అనఁగా పూర్వదిక్కనెడుస్త్రీ కాల మనెడువిష్ణువుయొక్కప్రసాదముచే సత్సంతాన మనుగోరిచుక్క లనెడుశిశువులు గలిగి తనయిష్టము ఫలించె నని చంద్రుఁ డనుపాత్రయందు పొంగలిపెట్టఁగా నుదయరాగ మనెడు నగ్నిజ్వాలచే పొంగివెలిఁ బరవినక్షీరపూరమువలె వెన్నెలవిలసిల్లె ననుట. రూపకసంకీర్ణోత్ప్రేక్షాలంకారము.

సీ. మలినాన్యశిఖిహారి న్నలినాంచితాక్షీజ
ఘనసారసనహీర కాంతి నెగడి
సుకరాశరాశాసి తకరాననరోజ
ఘనసారహారమో గము భజించి

వరవాయుకకుబంబు♦ధరవాలికావక్త్ర
ఘనసారతిలకస♦ఖ్యము వహించి
యతికాంతశివదిశా♦లతికాతనూవేణి
ఘనసారసుమపాళి ♦ గౌఁగిలించి

తే. మేదినీదేశపాటలా♦మోదినీభృ
తాతిఘనసారసావతం♦సాభఁ బెంచి
యపుడు పొడసూపెఁ బథికభ♦యప్రదసుమ
హాదినేంద్రాతపంబు చం♦ద్రాతపంబు. 106

టీ. మలినాన్యశిఖిహరిన్నలినాంచితాక్షీజఘనసారసనహీరకాంతిక్.— మలినాన్య= నిర్మలమగు, ఇది హీరకాంతికి విశేషణము, శిఖిహరిత్=అగ్నిదిక్కనెడు, నలినాంచితాక్షీ= స్త్రీయొక్క, జఘన=కటిప్రదేశమందలి, సారసన=మొలనూలియొక్క, హీర=వజ్రములయొక్క, కాంతిక్=ప్రభచేత; నెగడి=వృద్ధిఁబొంది; సుకరాశరాశా సితకరాననో రోజఘనసారహారయోగముక్.—సుకర=మంచిప్రకాశముగల, ఇదిహారమునకు విశేషణము, ఆశరాశా= నిర్వృతిదిశయనెడు, సితకరాననా=స్త్రీయొక్క, ఉరోజఘన = తాళపుచిప్పలవంటి స్తనములయందలి ‘‘కాంస్యంతాలాదికంఘనమ్’’ అని యమరుఁడుఁడు, సార = బలిష్ఠములగు, హార=ముత్యంపుపేరులయొక్క, ‘‘హారోముక్తావలీ’’ అని నామలింగానుశాసనము, యోగము=సంబంధమును; భజించి=పొంది; వరవాయుకకు బంబుధరవాలికావక్త్రఘనసార తిలకసఖ్యము.—వర=శ్రేష్ఠమగు, వాయుకకుప్=వాయువుదిక్కనెడు, అంబుధరవాలికా=మేఘమునుబోలు కచములుగల స్త్రీయొక్క, వక్త్ర=ముఖమందలి, ఘనసారతిలక=కర్పూరతిలకముతోడి, సఖ్యము=మైత్రిని; వహించి=తాల్చి; అతికాంతశివదిశాలతికాతనూవేణి ఘనసారసుమపాళి.—అతికాంత=మిగులమనోజ్ఞమైన, శివదిశా=ఈశానదిక్కనెడు, లతికాతనూ=స్త్రీయొక్క, వేణిఘన = మేఘమునుబోలుజడయందలి, సార=శ్రేష్ఠములగు, సుమపాళి = కుసుమసమూహమును; కౌఁగిలించి=ఆలింగనముఁజేసి; మేదినీదేశపాటలామోదినీ భృతాతిఘనసారసావతంసాభక్.—మేదినీదేశ=భూస్థలియనెడు, పాటలామోదినీ=స్త్రీచేత, భృత=భరింపఁబడిన, అతిఘన=మిగులనధికమగు, సారసావతంస = కుముదరూపమైనకర్ణాభరణముయొక్క, ఆభక్=కాంతిని; పెంచి=వృద్ధినొందించి; పథికభయప్రదసుమహాదినేంద్రాతపంబు.—పథిక =తెరువరులకు, విరహులకనుట, భయప్రద=భీతినిచ్చెడు, సుమహాత్=అత్యధికమగు, దినేంద్రాతపంబు=సూర్యాతపరూపమైన; చంద్రాతపంబు=వెన్నెల; అపుడు=ఆసమయమున; పొడసూపెక్=పొడసూపెను.

అగ్నిదిగంగనాజఘన సారసనహీరకాంతిచేఁబోషింపఁబడి నిర్వృతిదిగంగనాస్తనతటమందలి ముక్తాహారముతోఁగలసి వాయవ్యదిగ్వనితయొక్క ముఖమందలి కర్పూరతిలకముతో మైత్రినొంది యీశాన్యదిశాకాంతకుఱుమునం దుతిమినట్టి పువ్వులను గౌగిటఁజేర్చి భూమియనెడు స్త్రీచేత భరింపఁబడిన సారసావతంసములం బోషించి విరహులకు మహాత

పమువలె భయముగలిగించుచు వెన్నెల సిలసిల్లెనని భావము. వెన్నెల సర్వదిక్కులు వ్యాపించి విలసిల్లెనని ఫలితము.

వ. వెండియు నాపండు వెన్నెల దండం బఖండకాండజారి మండల మాయామాత్రికమయ భద్రాసన సమాసీన నీలాంకలంకావరాహితపట్టాభిషేచనావర సమయ మహర్షిరాజాభిషిక్త గంగాదిపుణ్యతరంగిణీ విశద జలప్రవాహంబుల పోలికం బ్రవహించుచు, నస్తాచల సంగతాహిమాంశు కిరణకూటతృణాంకుర నికరంబుల నన్నింటి మేసి దర్పించి రథాంగజనంబులకు వైకల్యంబు చేకూర్చి సముజ్జృంభమాణ సత్ప్రతిభావాప్తిం జెలరేఁగు నిశానైచికిం బట్టి చకోరవత్సంబులు గుడువం జేఁపుతారాధవ్రాధస్థలపరిదృశ్యమాననవాంశుకస్తనంబుల ధరిత్రీపాత్రి దిష్టగోపాలకుండు పిదికిన నవీనపయఃపరంపరలదారిం జూపట్టుచు, దినాంతపర్యంతం బొక్కఁబ్రొద్దుండి యతికాంత కాసారసోపానోపాంత శశికాంత సంతానమరీచికా వీచికావతీవీచికాజాతంబులం జొచ్చి యెడలి వికసితారుణశరజపీఠి వసించి కమలాహితధ్యాన కలితాంతరంగంబున నున్నచకోరసువాసినీ జనంబులకు వ్రతఘ్నంబు లగువిశదాపూపంబులు సమకూర్పఁ దత్ప్రియశ్యామాప్రకాండంబు పూర్వదిశావదాత శోభాచ్ఛాదనంబుపైఁ జంద్రఘురట్టంబు వెట్టి యొయ్యనొయ్యనం దారాసుభద్రాపటలంబులు నైచి విసరం బ్రసరించు తదీయపిష్టధట్టంబులచందంబునం జెంపొందుచు, నెట్టుకొని గట్టుగములతటంబులం బొడకట్టు నెలచట్టులం గరంగి మట్టుమీఱం గురియు వెన్నీటి బలుసొద యభంగతరంగనినాదంబును ముందుముందుగ మందగతిం దోఁతెంచు చందనాచల పవనకందళిం దరళితంబులై నిండార విరిసినబొండుమల్లియవిరులపిండులు పాండురడిండీరఖండ మండలంబులును మదిఁగదురు ముదమునఁ దమతమనుదతులఁ గవగూడి యెదుర్కొను రేవులుఁగు కొలము లెదురెక్కు సమానవతీకమీనవితానంబులునుం గాఁగ ననూనపథికమానినీ మానసాల మూలసమున్మూలనంబు సేయం బరఁగి దినాంతవిలయకాలమ్మున వేలాతిగం బైనపాలవెల్లిపొడవునం బొడసూపుచుఁ, గోకనదపరాగమహోదయరాగ విలసనంబునం గోరకితనీరజ తారకాసముత్సేకంబునం గోమలశ్యామలేతర కుముదవలయ సుధాకరధామ విశేషంబునం గొమ రొంది తద్రజనీసమయ భాసమాన పయోధరపథంబున కన్నమున్నమున్న కన్నులకు వెగ్గలంబై దొలంకుకొలంకుగమిం బాసి సన్నంపు వెన్నెలమిన్న చొరరానిలతా నివాసంబుల దాఁగం బోవుచుఁ దదంతర పంఫుల్యమాన మల్లికావల్లికా మతల్లికా ప్రసవధవళ ద్యుతిప్ర

ఖాండంబులు నిండి రేయెండ మెండుకొనఁ జేయ దాఁగ వచ్చిన చోటఁ
దలవరు లున్న తెఱం గొయ్యనఁ గని ఖేదించు రోదరతలోదరీ వారమ్ముల
నయనమ్ముల జాలుగా జాఱు ననావిలజల మాలికలతో మేలంబు లాడుచుఁ,
దళతళమను నెలచలువగిన్నెలయెడలం గలయ నించిన యతిబంధురసౌ
గంధిక సుగంధధురంధరగంధోత్తమారసంబు దమతమరమణుల కెమ్మోవి
పండు లుపదంశమ్ములుగా నాదారం గ్రోలి తదీయ మాహాత్మ్యకల్పితమా
నస విభ్రమంబునఁ దత్పాత్రల నరగ నెఱమించు నిగనిగల మఱలఁ సలి
లంబు లూర మదిర నించినా రని గైకొని యచటం బ్రతిఫలించు పల్దెర
వాసనకు నిడిన కెందలిరుటాకని దివిచియు విలోచనమాలికలు వానితా
వికిం జేరు తుమ్మెద లని గదిమియు ముదంబునఁ బ్రియుల కంపేయం బో
వుమందగామినీబృందమ్ముల హస్తారవింద సందీపితహీరకటక శోభాధట్టంబు
లం జెట్టవట్టుచు, ననూనపానశాలాచత్వరంబుల విమలాసవంబు లాలస
మెచ్చం ద్రావి నిర్మితహర్మ్యరాజంబులఁ జేరం బోవునెడఁ జంద్రికాహా
లాపానలీలాగతి నంబరంబునం జరించుచుఁ దత్సమర్పిత మదఘూర్ణితంబు
లగు చకోరకోరకకుచానిచయంబుల కటాక్షతారళ్యంబులు నెఱమించులై
కోకనదకోటర కోటిలీనమధుకర ఝుంకారంబులు గర్జనంబులై నిగుడం
బొడసూపు వెన్నెల జడివానగాఁ దలంచి యాదలలఁ బయ్యెదలు గప్పి నె
చ్చెలికేలు కైలాగుఁ బూని బుడిబుడి రయం బడర నడచు పడఁతిమి
న్నల యున్నతస్తనాంతర విలంబమాన ముక్తాహార గౌరరుక్తితిం బునరు
క్తం బగుచు, వెగ్గలమై నెమ్మదిఁ గ్రమ్ము సిగ్గు వెనుకకుఁ దివియ నగ్గలిక మ
రుండు వైచు మొగ్గములికిగములు ముంగలికి నూకం గరంబు మదంబున
దూఁగియాడు వలదొర పట్టంపుటేనుంగురంగునఁ జూపట్టుచు నెచ్చెలుల కు
శలత్వంబున మందమందకలనంబునఁ గేళికామందిరంబులు చేరి యధిపుఁ
డు కరంబు పట్టి శయ్యనుంచి ముత్తియంపుపేరు లంటుపేరఁ జన్నులు
ముట్టుచు మురిపెంపు నెమ్మోమున మడుపు నందిచ్చుదారిఁ గెమ్మోవి
నొక్కుచు దమి రేఁచి బంధురబంధవిశేష సంబంధంబున ననవిల్తుక
య్యంబునఁ జొక్కించి చొక్కంపుఁగళల యిక్కువ లెఱింగి మిక్కిలి
గలయ గ్రక్కున వెక్కసంబై తనువునఁ జెమటలు గ్రిక్కిఱిసిన మద
నమాయావిలసనంబునం బొడమిన ప్రోడతనంబున నెంతగమ్మంబు గ్ర
మ్మె నని పతులకుఁ దెలియకుండం బలుకుచుఁ జేలచెఱంగున విసరికొను
నవోఢానికరంబుల ధవళాంబరాంచల విభాతరంగంబులం బొంగి పొరలు
చుఁ, దొలుతటికలయిక్కల మన మలరఁ గలసిన చెలువరతనంబులఁ దలఁపునం

దలఁచుచు నలమరాని విరాళిం గొని నెలవ్రేడుపు వెనుక నలరువాల్దొరక
లికిఁ జెలరేఁగఁ దమినేతెంచినపతు లపుడు తమయెడఁ బొడముమమత ని
దుర గదియమిఁ గెంజిగిం గదురుకొను కనుతుదలును దనుతలమ్మునఁ దొలఁ
కుగురు విరహజ్వరభరంబున విరిపాన్పునం బొరలఁ జిక్కువడు మణిసరం
బులును మరుని యిరువాఁడికైదువు పేరెదం జుఱుకు చుఱుక్కున నాటఁ
దాళక, నెఱపు నిట్టూర్పులునుం బరయువతితిలక సంపర్కప్రకారంబు తో
రంబుగా నెఱింగింప నలివి యవలి మొగంబై శయనించి మాటిమాటికి
బోటికత్తెలపలుకుల నిజప్రేమాతిశయజనిత వియోగవేదనా కార్యంబులు
గాఁ దెలిసి యినుమడికూటముల నలమి రతిబడలిక వాయఁ గరం బురం
బులఁ జల్లులాడు పువ్వుఁబోఁడుల శయకుశేశయ సమాక్షిప్తఘన సారక్షో
దంబులం బతీకరించుచు, నలరుమల్లియవిరిసరులు దుఱిమి యమలమౌక్తిక
దామంబులు దాల్చి కపురంపుబొట్టులు దీర్చి కమనీయమలయజ కర్దమం
బలంది కలికి తెలిచలువ లూని వెన్నెలం దలవరులు గనకుండ సంకేతనికే
తనంబులకుఁ బోవుత్రోవం బొంచి కమల కలికాసం లగ్నమధుపనినా
దవలయ ఘీంకారసంకలిత మృణాళయష్టికరం బూని యడ్డమ్ము పఱ
తెంచువా రెవ్వ రెవ్వరనఁ దలంగు మనంబున ఘుట్టకుటికం బ్రభాతం
బగు దారియమ్యో నని మాఱు వలుక నేరక మూలమూలల నొ
దుఁగుచుఁ దలంకునెడఁ గిలకిలనవ్వుచుఁ దమ్మెఱుఁగఁ జేయ నొక్కింత
చిగిరించు నలుక నభిసారికా జనంబులు ప్రియులపై రువ్వ మవ్వంపు
విరిగుత్తులం జివ్వకుఁ బిలుచుచు, వన్నె గలవెన్నెలబయిట నెన్నరానివేడుక
వన్నిదంబులు వన్ని సుహృన్నికరంబులతోఁ బెన్నేర్పున జూదంబు లాడు
చున్నకతంబునఁ గొంతదడ వగుటఁ బటుతరమహానటమన స్తటనానట
ధైర్యవిపాటనాటోప సముత్కటశంబరప్రతిభటకృపీటజకోరక శరపటల
ధారాదోధూయమాన మానసంబుతో విచ్చలవిడిం బెచ్చుపెరుఁగు
తాపంబున వెచ్చనూర్చుచు నెమ్మదిం గ్రచ్చుకొని హెచ్చుమోహంబున
నెచ్చెలిచేతికి నచ్చంపుగుఱు తిచ్చి మచ్చికల వల్లభుం దోడ్కొని రమ్మంచు
నంచి యంచితబహిరంగణప్రదేశంబుల నిలిచి పతిరాక కెదురుచూచునది
యును నెయ్యంపుఁబొదలతూఁగుటుయ్యెలపై నొయ్యారంబునం గూర్చుండి
ప్రియుండు పసిండిదండియఁ బూని సుతి మీట విభునిచెంత వసియించి
చిన్నికిన్నెరం బూని పంచశరదేవతావిజయప్రపంచసమంచితంబు లగు
నూతనగీతంబులు పలికించి చెలులఁ జొక్కించునదియును నడుగు లొర

యంగొనసాగ నల్లినజడకుఁ జుట్టినమొల్లవిరితావి యెల్లెడలకుం బరవ మంజులచరణకంజసంజితకంజరాగమంజీరశింజారవంబులు కర్ణగ్లాని మాన్ప నెఱ దొఱపినవలదొరపగువంపుఁగ్రొందుప్పుటెఱుఁగున నిండార దువ్వలువ గప్పి కాంతునిశాంతంబునకుఁ బోటులవెంటం జనునదియును దనమనం బలరఁగలసి కళలఁ దేలించి మేలుంచి యేలిననాయకునియెడ నెడయని ప్రియమ్మునఁ దఱిసి విరిసరులు దుఱిమి చలువ వెదచల్లుకలపం బలఁది యంతంతం బొడముమోహమ్ముల నలమి కెమ్మోవి నొక్కి పునారతులకు వేడుక రేఁచి పైకొనునదియును నై వెలయువెలయువిదలగళితచందనచర్చాపాలికలం గనత్తరదరహాసవిభారించోళికలం గర్ణావతంసితకైరవపత్త్రమంజరికావిభాళికలం గబరికాభివేష్టితలతాంతమాలికలం గలసి మెలఁగుచు, మహోత్పలమండలత్రాణైకవిహారవిలాసాంచితం బయ్యును మహోత్పలమండలహరణైకవిలాసాంచితంబై యసమకాండచండప్రతాపనాశకనిజోదయం బయ్యును నసమకాండచండప్రతాపసంవృద్ధికరనిజోదయంబై దివ్యచక్రచిత్తానందసంధాయకం బయ్యును దివ్యచక్రచిత్తానందభేదకంబై రాజిల్లుచు ద్రుహిణాండకరండంబునకు వెండి జలపోసనంబు దారిం బ్రకాశించె నయ్యవసరంబున. 107

టీ. వెండియున్ = మఱియు; ఆపండువెన్నెలదండంబు = ఆ నిండువెన్నెలయొక్క పరంపర; అఖండకాంశజారిమండలమాయామౌక్తికమయభద్రాసనసమాసీననీలాంకలంకావరాహితపట్టాభిషేచనావరసమయమహర్షిరాజాభిషిక్తగంగాదిపుణ్యతరంగిణీవిశదజలప్రవాహంబులపోలికన్.—అఖండ=అవిచ్ఛిన్నమగు, కాంశజారిమండల=చంద్రమండలమనెడు, మాయా = నెపముగల, మౌక్తికమయభద్రాసన=ముక్తావికారమగుసింహాసనమందు, సమాసీన=కూర్చుండిన, నీలాంక=నల్లనికలంకమనెడు, లంకావరాహిత = రావణాంతకుఁడగురామభద్రునియొక్క, పట్టాభిషేచనావరసమయ = పట్టాభిషేకముఖ్యసమయమందు, మహర్షిరాజ=ఋషిశ్రేష్ఠులచేత, అభిషిక్త = అభిషేకముచేయఁబడిన, గంగాదిపుణ్యతరంగిణీ=జాహ్నవిమొదలగుపవిత్రనదులయొక్క, విశదజల=శుభ్రమగుజలముయొక్క, ప్రవాహంబులపోలికన్=వఱదలభంగిని; ప్రవహించుచున్=పాఱుచు; అనఁగా చంద్రుఁడను మౌక్తికసింహాసనమందుఁ గళంకమనెడుశ్రీరామమూర్తి కూర్చుండియుండఁగాఁ దత్పట్టాభిషేకమహోత్సవసమయమున మహర్షులు తెచ్చి యభిషేకముఁ జేయు గంగాదిపుణ్యనదీజలప్రవాహముభంగి నాపండువెన్నెలపిండు రాజిల్లెనని భావము. అస్తాచలసంగతాహిమాంశుకిరణకూటతృణాంకురనికరంబులన్.—అస్తాచల=చరమాద్రిని, సంగత=సంబంధించినట్టి, అహిమాంశుకిరణ=సూర్యకిరణములనెడు, కూట=కపటముగల; తృణాంకుర=లేఁగసువులయొక్క, నికర

కంబులన్=గుంపులను; అన్నింటిన్; మేసి=భక్షించి; దర్పించి=గర్వించి; రథాంగజనంబులకున్=చక్రవాకములను ప్రజలకు; వైకల్యంబు చేకూర్చి = వికలత్వముఘటిల్లఁ జేసి; సముజ్జృంభమాణసత్ప్రభావాప్తిన్=మించినమంచిసామర్థ్యముయొక్క ప్రాప్తిచేత, సత్=రిక్కలయొక్క, ప్రభా=కాంతియొక్క, అవాప్తిన్ = ప్రాప్తిచేత; చెలరేఁగునిశానైచికిన్ = విజృంభించు రాత్రియనెడు మంచియావును; "ఉత్తమాగోషు నైచికీ" అనియమరుఁడు; పట్టి=బంధించి; చకోరవత్సంబులు = వెన్నెలపులుఁగులనెడుదూడలు; కుడువన్=చీకుటకు; చేఁపుతారాధవోధస్స్థలపరిదృశ్యమానవాంశుకస్తనంబులన్.—చేఁపు=పాలుద్రవించుచున్న, తారాధవోధస్స్థలపరిదృశ్యమాన=చంద్రుఁడనెడు పొదుఁగునందుఁ జూడఁబడుచున్న, నవాంశుకస్తనంబులన్ = క్రొత్తకిరణములనెడు చన్నులనుండి; ధరిత్రీపాత్రిన్ = భూమియనెడు పాత్రమునందు; దిష్టగోపాలకుండు = కాలమనెడు నావులకాపరి; పిదికిననవీనపయఃపరంపరలదారిన్ = పిండినక్రొత్త క్షీరపరంపరలతీరున; చూపట్టుచున్ = అగపడుచు; అనఁగాఁ గాలమనెడుగోపాలకుండు రాత్రి యనెడుగోవు చరమాచలమందు సూర్యకిరణము లనెడుకసవు మేసి దర్పించి చక్రవాకములనెడు ప్రజకు వ్యాకులత గలుగఁ జేయుచుండఁగా దానిఁ బట్టి తెచ్చి చకోరము లనెడుదూడలు త్రాగుటకు చంద్రమండలమనుపొదుఁగునందుకిరణము లనెడుచన్నుల నుండి పిదికిన క్షీరపూరమును బోలి వెన్నెలయున్న దని భావము. దినాంతపర్యంతంబు=సంధ్యాకాలమువఱకు; ఒక్కప్రొద్దుండి=ఉపవసించి; అతికాంతకాసారసోపానోపాంతశశికాంతసంతానమరీచికావీచికావతీవీచికాజాతంబులన్.—అతికాంత=మిగులమనోజ్ఞమగు, కాసారసోపానోపాంత=కొలఁకుయొక్కసోపానసమీపమందలి, శశికాంతసంతాన=చంద్రకాంతమణులగుంపుయొక్క, మరీచికా=కాంతియనెడు, వీచికావతీ=నదియొక్క, వీచికాజాతంబులన్ = తరంగసమూహములను; చొచ్చి=ప్రవేశించి; అనఁగా నానదియందుస్నానము చేసియనుట; ఎడలి=బయలుదేతి; వికసితారుణశరజపీఠిన్=వికసించినరొట్టగలువయనెడుపీఠమందు; వసించి=ఉండి; కమలాహితధ్యానకలితాంతరంగంబునన్.—కమలాహిత=చంద్రుఁడనెడుకమలకుహితుఁడైనవిష్ణువుయొక్క, ధ్యాన=చింతతోడ, కలిత=కూడుకొన్నట్టి, అంతరంగంబునన్=చిత్తముచేత; ఉన్నచకోరసువాసినీజనంబులకున్=ఉండినట్టిచక్రవాకస్త్రీలకు; యవ్రతఘ్నంబులు=వ్రతదూషకములు కానివి; అగువిశదాపూపంబులు=అగునట్టితెల్లనియపూపములను; సమకూర్పన్ = చేకూర్చుటకు; తత్ప్రియశ్యామాప్రకాండంబు=ఆచకోరసువాసినులకుహితలైనరాత్రులనెడుస్త్రీలకదంబము; పూర్వదిశావదాతశోభాచ్ఛాదనంబుపైన్ = తూర్పుదిక్కనెడు తెల్లనివస్త్రముమీఁద; చంద్రఘరట్టంబు=చంద్రుఁడనుతిరుగలిని; పెట్టి=ఉంచి; ఒయ్యనొయ్యనన్ = తిన్నతిన్నగా; తారాసుభద్రాపటలంబులు=నక్షత్రములనెడుగుమ్మడివిత్తులగుంపులను; వైచి=వేసి; విసరన్=త్రిప్పఁగా; ప్రసరించుతదీయపిష్టఘట్టంబులచందంబునన్=ప్రసరించుచున్నవానిపిండిపిండులచందిని; పెంపొందుచున్=వృద్ధిఁబొందుచు; అనఁగాఁ జకోరస్త్రీ ప్రదోషమువఱకు నుపవాస ముండిసూర్యాస్తానంతరము కొలఁకులసోపానముల నున్న చంద్రకాంతమణిమరీచి యనెడునదియందు స్నానము చేసి రొఱ్ఱగలువ యనునాసనముపైఁ గూర్చుండియుండఁగా నామెయుపవాసవ్రతమున కుచితమైన తెల్లని యపూపములు సేయ రాత్రియనెడుతదీయప్రియస్త్రీజనంబు తూర్పనెడు తెల్లని

వస్త్రిముపైఁ జంద్రుఁ డనెడుతియగలి నుంచి రిక్క లనెడుగుమ్మడివిత్తులు వోసి విసరఁగాఁ బ్రసరించువానిపిండిపిండును బోలి వెన్నెల యుల్లసిల్లె ననుట. నెట్టుకొని=త్రోసికొని; గట్టుగములతటంబులఁ = పర్వతసంఘములదరులందు; పొడకట్టు నెలచట్టులఁ = చూపట్టుచున్నచంద్రకాంతములవలన; కరంగి = ద్రవించి; మట్టుమీఱఁ = మితిమీఱునట్లుగా ; కురియు పెన్నీటిబలురొద = కురియుచున్నగొప్పజలముయొక్కబలిష్ఠమగుధ్వని ; అభంగతరంగనినాదంబును = అధికమైనతరంగధ్వనియు; ముందుముందుగఁ = తొలుదొలుతనె; మందగతిఁ = తిన్ననిగమనముచేత; తోఁతెంచుచందనాచలపవనకందళిఁ = కనఁబడుమలయమారుతాంకురమువలన; తరళితంబులై=చలింపఁజేయఁబడినవై ;నిండారవిరిసినబొండుమల్లియవిరులపిండులు.—నిండారవిరిసిన = బాగుగవికసించిన, బొండుమల్లియవిరుల = బొండుమల్లెపూలయొక్క, పిండులు=గుంపులు; పాండురడిండీరఖండమండలంబులును=తెల్లనిఫేనఖండములగుంపులును; మదిఁ=చిత్తమందు; కదురుముదమునఁ=కలుగునట్టిసంతసముచేత; తమతమసుదతులఁ=తమతమప్రియురాండ్లను; కవకూడి=జతగాఁగలిసి; ఎదుర్కొను రేపులుఁగుకొలము = ఎదురుగఁబోవుచకోరసంఘము ; ఎదురెక్కుసమానవతీకమీనవితానంబులును = ఎదురెక్కుచున్నవియు మానవతులతోఁగూడినవియునగు మీనములగుంపులును; కాఁగ= అగుచుండఁగా ; అనూనపథికమానినీమానసాలమూలసమున్మూలనంబు.—అనూన = అధికమగు, పథికమానినీ = పథికస్త్రీలయొక్క, మాన = ఈర్ష్యయనెడు, సాల = వృక్షములయొక్క, మూలసమున్మూలనంబు = మూలోచ్ఛేదమును ; చేయఁ = ఒనరించుటకు ; పరఁగి=ఒప్పి, దినాంతవిలయకాలంబునఁ = సాయంకాలమనెడు ప్రళయకాలమున; వేలాతిగంబైన పాలవెల్లిపొడవునఁ = వేలమీఱిన క్షీరసముద్రముభంగిని; పొడసూపుచుఁ=అగపడుచు; అనఁగా నావెన్నెల ప్రళయకాలమందు వేల మీఱి సాలసమున్మూలనము గావించుచు మించుక్షీరాంబురాశిని బోలి సంధ్యాకాలమున మానినీమానసమున్మూలనము గావించుచు మించిన దనియు, దానియందు వెన్నెలవలనఁ బర్వతంబులనుండి గరఁగి పడు చంద్రకాంతజలప్రవాహము రొదలు తరంగధ్వనులుగా నుండె ననియు, మలయమారుతాంకురమున నిండార వికసించిన బొండుమల్లియలపిండులు నురుఁగుతునియలను బోలియుండె ననియు, సంతసమునఁ దమతమప్రియురాండ్రతోఁ గూడి యెదురెక్కుచకోరములు జతగూడి యెదురెక్కుమీలఁ బోలియుండె ననియు భావము. కోకనదపరాగమహోదయరాగవిలసనంబునఁ,—కోకనదపరాగ=రక్తోత్పలసంబంధియగు పుప్పొడియనెడు, మహాత్=అధికమైన, ఉదయరాగ=ఉదయకాలికారుణ్యముయొక్క, విలసనంబునఁ=ప్రకాశముచేత; కోరకితనీరజతారకాసమున్మేషంబునఁ.—కోరకిత=ముకుళితములగు, . నీరజ=పద్మములనెడు, తారకా=నక్షత్రములయొక్క, సమున్మేషంబునఁ=ప్రకాశముచేత; కోమలశ్యామలేతరకుముదవలయసుధాకరధామవిశేషంబునఁ.—కోమల=మృదులమై, శ్యామలేతర=శుభ్రమగు, కుముదవలయ=కల్వలగుంపనెడు, సుధాకర=చంద్రునియొక్క,ధామవిశేషంబునఁ=కాంతి విశేషముచేత; కొమరొంది=అందముగాంచి;తద్రజనీసమయభాసమానపయోధరపథంబునకన్నఁ= ఆరాత్రికాలమున విలసిల్లు నాకసమునకన్నను; మున్నుమున్న=ముందుముందుగనె;కన్నెలకుఁ; వెగ్గలంబై=మిక్కుటమై, తొలంకు కొలంకుగమిఁ = చెలఁగుట్టి కాసారసంఘమును;

పాసి=వదలి; సన్నంపు వెన్నెలమిన్న=లేఁతరేయెండమిన్న; చొరరానిలతానివాసంబులన్=చొరఁబొఱనలవిగాని లతాగృహములయందు; దాఁగన్=దాఁగుటకు; పోవుచున్=ఏగుచు; తదంతరసంఫుల్ల్యమాన మల్లికావల్లికామతల్లికాప్రసవధవళద్యుతిప్రకాండంబులు.— తదంతర = ఆలతాగృహాంతరమున, సంఫుల్ల్యమాన = మిగుల వికసిల్లిన, మల్లికా వల్లికామతల్లికా=ప్రశస్తమల్లికాలతలయొక్క, ప్రసవ=పువ్వులయొక్క, ధవళద్యుతి=శుభ్రకాంతులయొక్క, ప్రకాండంబులు=గుంపులు; నిండి; రేయెండ మెండుకొనన్=చంద్రాతపముమిక్కుటమగునట్లు; చేయన్=ఒనరింపఁగా; దాఁగన్ వచ్చినచోటన్=దాఁచుకొనవచ్చినస్థలమున; తలవరులు=తలారివాండ్లు; ఉన్నతెఱంగు=ఉన్నరీతిని; ఒయ్యనన్=తిన్నగా; కని=చూచి; ఖేదించుకోదరతలోదరీవారమ్ములనయనమ్ములన్=దుఃఖించుచున్న చక్రవాకస్త్రీలగుంపుల నేత్రములందు; జాలుగాన్=ప్రవాహముగా; జాఱునవావిలజల మాలికలతోన్=జాఱుచున్నట్టియు నకలుషములైనట్టి జలపరంపరలతోడ; మేలంబులు=పరిహాసములను; ఆడుచున్=సలుపుచు; అనఁగాఁ జక్రవాకస్త్రీలకు కోలఁకులు రక్తోత్పలపరాగ మనెడు సంధ్యారాగముచేతను, పద్మముకుళము లనెడురిక్కలచేతను, తెల్లగల్వపూలగమి యనెడుసుధాంశుధామస్తోమంబుతోను వెలసి యట్లు దయరాగనక్షత్రచంద్రకాంతులతోఁ గూడినయాకసమునకన్న మున్న గన్నెలకు వెగ్గలంబులు గాఁగా, వానిం బాసి సన్నవెన్నెల చొరరానిలతానికుంజములకు నవి దాఁగం బోయిన వనియు, నందును మల్లికాకుసుమధవళద్యుతులు నిండి వెన్నెల మెండుకొన్నట్లు సేయఁగా దాఁగఁబోయినచోట తలవరు లున్నట్లిటను సుఖము లేకపోయెఁగదా యని ఖేదించుచున్న వనియు నట్టిచక్రవాకస్త్రీలనిర్మలనయనాంబువులతో మేలము లాడుచు వెన్నెల చెలంగినదనియు భావము. తళతళమను నెలచలువగిన్నెలయెడలన్=ప్రకాశించుచున్న చంద్రకాంతపుగిన్నెలయందు; కలయన్=అంతటను; నించినయతిబంధురసౌగంధికసుగంధధురంధరగంధోత్తమారసంబు.— నించిన = పూరించినట్టి, అతిబంధుర = మిగులదట్టమగు, సౌగంధికసుగంధ = కల్హారముల మంచిగంధముయొక్క, ధురంధర = భారమువహించిన, తద్గంధముగలవి యనుట, గంధోత్తమారసంబు=మద్యముయొక్క రసమును; తమతమరమణులకెమ్మోవిపండులు=తమతమప్రియుల యధరముల నెడు ఫలములను; ఉపదంశమ్ములుగాన్=నంచుకొను భోజనసాధకవిశేషములుగాఁ గాననుట; నాదారన్ = తనివి తీరునట్లనుట; క్రోలి=పానముఁజేసి; తదీయమాహాత్మ్యకల్పితమానసవిభ్రమంబునన్.—తదీయమాహాత్మ్య=ఆమద్యసంబంధియగు ప్రభావముచేత, కల్పిత=చేయఁబడిన, మానస=మనస్సంబంధియగు, విభ్రమంబునన్=భ్రాంతిచేత; తత్పాత్రలన్=ఆచంద్రకాంతపుగిన్నెలందు; సరగన్=వేగముగా; నెఱమించునిగనిగలన్=మిగులనతిశయించు ప్రకాశముచేత; మరలన్, సలిలంబులు=జలంబులు; ఊరన్=ఊరఁగా; మదిరన్=మద్యమును; నించినారని=పూరించినారని; కైకొని=స్వీకరించి; అచటన్=ఆనీటియందు; ప్రతిఫలించుపద్దెరన్ = ప్రతిబింబించినయధరమును; వాసనకున్=పరిమళమునకు; ఇడిన కెందలిరుటాకని=ఉంచిన రక్తపల్లవమని; తివిచియున్=లాగియు; విలోచనమాలికలు=నయనపంక్తులు; వానితావికిన్ = వానిపరిమళమునకు; చేరుతుమ్మెదలని=చేరుచున్న తుమ్మెదలని; గడిమియున్ = భర్త్సనముచేసియు; ముదంబునన్ = మోదముతోడ; ప్రియులకున్ = భర్తలకు; అందీయన్ = అందిచ్చుటకు; పోవు మందగామి

నీ బృందంబుల హస్తారవిందసందీపిత హీరకటకశోభాధట్టంబులన్.—పోవు = పోవుచున్న, మందగామినీబృందంబుల=స్త్రీసంఘంబులయొక్క, హస్తారవింద = కరకమలములయందు, సందీపిత=మిగులఁబ్రకాశింపఁజేయఁబడిన,హీరకటక=వజ్రమయములగు కడియములయొక్క, శోభాధట్టంబులన్=కాంతిపుంజములను; చెట్టపట్టుచున్=హస్తావలంబము సేయుచు; అనఁగా నపుడు స్త్రీలు చంద్రకాంతమణిపాత్రలలో మద్యముపోసికొని వల్లభాధరములుపదంశములుగా నాదారంగ్రోలి తదనుగుణగుణ సాంగత్యమునవిలసిల్లుచు వెన్నెలకాపాత్రలయందూరుచున్న నీరు చూచిమద్యమని భ్రమించి మఱలఁ దత్పానమునకై వానింగైకొనియందుఁ బ్రతిఫలించిన తమయధరములను పల్లవము లనియు నేత్రములను తుమ్మెద లనియు నెంచి వానిని దివియుచు నామద్యమునుతమప్రియులకందీయహస్తము లెత్తి యుండఁగా నాహస్తములయందున్న వజ్రమణిమయములగు వలయముల కాంతి సంతతిని వెన్నెల హస్తావలంబముగాఁ జేయునట్లు విలసిల్లెననుట, వజ్రకటకకాంతి వెన్నెలకాంతితో ధావళ్యసామ్యమునఁ దెలియరాకుండఁ గలిసినదని ఫలితము. అనూనపానశాలా చత్వరంబులన్.— అనూన=అధికమగు, పానశాలా = ప్రపలయొక్క, చత్వరంబులన్=ముంగిటిభూములయందు; విమలాసవంబు=ప్రశస్తమైనమద్యమును; లాలనమెచ్చన్=వాంఛావిశేష మతిశయింపఁగా; త్రావి=పానముఁజేసి; నిర్మితహర్మ్యరాజంబులన్=నిర్మింపఁబడిన ప్రాసాదములను; చేరన్=చేరుటకు; పోవునెడన్=పోవునపుడు; చంద్రికాహాలాపానలీలాగతిన్=వెన్నెలయను మద్యముయొక్క పానమునకైన విలాసగమనముచేత; అంబరంబునన్=ఆకాశమందు; చరించుచున్=తిరుగుచు; తత్సమర్పితమదఘూర్ణితంబులు.—తత్సమర్పిత=ఆమద్యముచేతఁ జేయఁబడిన, మద=దర్పముచేత, ఘూర్ణితంబులు=త్రిప్పఁబడినవి, అగుచకోరకోరకకుచానిచయంబుల కటాక్ష తారళ్యంబులు.— అగు=అగునట్టి, చకోరకోరకకుచా=చకోరస్త్రీలయొక్క, నిచయంబుల=గుంపులయొక్క, కటాక్ష=క్రేగంటిచూపులయొక్క, తారళ్యంబులు=చాంచల్యములు; నెఱమించులై=అధికములగు మెఱపులై; కోకనదకోటరకోటిలీన మధుకరఝంకారంబులు.—కోకనదకోటరకోటి=ఎఱ్ఱగల్వలతొఱ్ఱ గుంపులయందు, లీన=దాఁగియున్న, మధుకర = భృంగములయొక్క, ఝంకారంబులు=నాదములు; గర్జనంబులై=ఉఱుములై; నిగుడన్=ఒప్పఁగా ; పొడసూపువెన్నెలన్=పొల్చునట్టిచంద్రికను; జడివానగాన్ = జడివానయని; తలంచి = ఎంచి; కొదలలన్=తలలమీద; పయ్యెదలన్=పైటవస్త్రములను; కప్పి=ఆచ్ఛాదించి; నెచ్చెలికేలు = సఖియలహస్తములను; కైలాగున్=ఆలంబనమునుగా; పూని=వహించి ; బుడిబుడిరయంబు=అతిత్వరతోఁగూడినవేగము; బుడిబుడియనునది నడకలోఁగల యనుకరణశబ్దము; ఆడరన్ = ఒప్పఁగా;నడచు పడఁతిమిన్నలయున్నతస్తనాంతరవిలంబమాన ముక్తాహారగౌరరుక్తతిన్.— నడచు=గమనము సేయుచున్న,పడఁతి మిన్నల=స్త్రీరత్నములయొక్క, ఉన్నతస్తనాంతర=మిట్టలగు స్తనములమధ్యభాగమందు, విలంబమాన=వ్రేలాడుచున్న, ముక్తాహార= ముత్యంపుపేరులయొక్క, గౌరరుక్తతిన్=శుభ్రకాంతి పుంజముచేత; పునరుక్తంబు = ఇనుమడియైనది; అగుచున్; అనఁగానపు డుత్తమస్త్రీలు పానశాలలచెంత విమలాసవమును గ్రోలి మేడలు చేరఁ బోవుచుండఁగా వెన్నెల యనుమద్యము ద్రావి గగనమందుఁ జరించు చకోరస్త్రీలకటాక్షతారళ్యములు మెఱపులుగాను ఎఱ్ఱగల్వలలోఁదాఁగిన తుమ్మెదల మ్రోఁత ఉఱుములుగాను

వెన్నెల జడివానగాను వారలకుఁ దోఁచి తలలపైఁ బయ్యెదలు గప్పికొని చెలియల కైలాగుఁబూని వడిగ బుడిబుడిం బోవుచున్నా రనియు వారలయున్నతస్తనాంతరములనున్న ముత్యంపుపేరుల తెల్లనికాంతి సంతతితో వెన్నెలరెట్టించి వెలింగెననియు భావము. వెగ్గలమైన=అధికమైన; నెమ్మదిన్=నిండుమనస్సునందు; క్రమ్ముసిగ్గు=క్రమ్మెడులజ్జ; వెనుకకున్ తివియన్=వెనుకకాకర్షింపఁగా; అగ్గలికన్=శౌర్యముచేత; మరుండు=కాముఁడు ; వైచుమొగ్గములికిగములు=ప్రయోగించుమొగ్గలనెడు బాణములగుంపులు; ముంగలికిన్ = ముందునకు; నూకన్=త్రోయఁగా; కరంబు=మిక్కిలి; మదంబునన్=మదముచేత; తూఁగియాడువల దొరపట్టంపుటేనుంగురంగునన్=తూఁగుచున్న మదుని పట్టపుటేనుఁగుతీరున; చూపట్టుచున్= అగపడుచు; ఇదినవోఢానికరంబులకు విశేషణము; నెచ్చెలులకుశలత్వంబునన్=ప్రియసఖీజనుల నేర్పుచేత; మందమందకలనంబునన్=మెల్ల మెల్లని క్రియలతో; కేళికామందిరంబులు = క్రీడామందిరంబులను; చేరి=పొంది; అధిపుఁడు=ప్రియుఁడు; కరంబుపట్టి= హస్తమునుబట్టికొని; శయ్యన్=పాన్పునందు; ఉంచి=ఉండఁజేసి; ముత్తియంపుపేరులు=మౌక్తికహారములను; అంటుపేరన్=ముట్టునెపమున; చన్నులు=స్తనములను; ముట్టుచున్ = స్పృశించుచు; మురిపెంపునెమ్మోమునన్ = కులుకుమోమునందు; మడుపున్ = విడెమును; అందిచ్చుదారిన్ = అందిచ్చుతీరున; కెమ్మోవిన్=కెంపైన పెదవిని ; నొక్కుచున్=కొఱుకుచు; తమిరేఁచి = రాగోద్రేకముగలిగించి; బంధురబంధవిశేష సంబంధంబునన్ = దట్టమైన బంధభేదముల సంబంధముచేత; నవవిల్తుకయ్యంబునన్=సురతమందు; చొక్కించి=సుఖపారవశ్యమునొందించి; చొక్కంపు కళలయిక్కలు=మంచికలాస్థానములను; ఎఱింగి=తెలిసి; మిక్కిలి = అధికముగ; కలయన్=కూడఁగా; గ్రక్కునన్=వేగముగ; వెక్కసంబై=వెగటై; తనువునన్=శరీరమందు; చెమటలు=స్వేదములు; క్రిక్కిఱిసినన్=నిబిడముకాఁగా; మదనమాయావిలసనంబునన్=మన్మథ మాయాప్రకాశముచేత; పొడమిన ప్రోడతనంబునన్=ఉదయించిన ప్రౌఢత్వముచేత; ఎంతగమ్మంబు=ఎంతస్వేదము; క్రమ్మెన్=కలిగెను; అని; పతులకున్ = ప్రియులకు; తెలియకుండన్=బయల్పడకుండునట్లు; పలుకుచున్=వచించుచు; చేలచెఱంగునన్=వస్త్రాంచలముచేత; విసరికొను నవోఢానికరంబుల ధవళాంబరాంచలవిభాతరంగంబులన్.—విసరికొను=విసరికొనుచున్న, నవోఢానికరంబుల=నవోఢలగుంపులయొక్క, ధవళ=శుభ్రములగు, అంబర=వస్త్రములయొక్క, అంచల=అగ్రములయొక్క, విభాతరంగంబులన్= కాంతిపరంపరలచేత; పొంగి=ఉప్పొంగి; పొరలుచున్=వెలిపర్వుచు; అనఁగా నపుడు నవోఢలు తమతమప్రియులయొద్దకుఁ బోవుసమయమున లజ్జావశమున వెనుదీయుచు కామమున ముందు కడుగుపెట్టుచుండఁగా వలదొరపట్టంపుటేనుఁగు చందంబున నుండి రనియు నెచ్చెలులు తమనేర్పునఁ దిన్నతిన్నగాఁ గేళిగృహమునకుఁ గొనిపోఁగా నటకుఁ బోయి ప్రియులు తమనేర్పున నొనరించు బాహ్యాభ్యంతరరతులచేఁ జొక్కి కలాస్థానము లెఱింగి పతులు మిగులం గలయ మిక్కుటంబై తనువునిండార స్వేదంబుపొడమ నెంత చెమ్మటగ్రమ్మెనని తిన్నగఁబలుకుచు వస్త్రాంచలముచే విసరికొనుచుండి రనియు వారి శుభ్రాంశుకప్రభాజాలంబులతోఁ బండువెన్నెలలు పొంగి పొరలి నట్లుండె ననియు భావము. నవోఢలు ముగ్ధావాంతరభేదములోఁ జేరిననాయికలు. దీనింగూర్చి రసమంజరియందు. "తత్రాజ్ఞాతయౌవనా ముగ్ధాసాచ ద్వివిధా జ్ఞాతయౌవ

నా అజ్ఞాతయౌవనా చేతి, సైవక్రమశో లజ్జాభయపరాధీనరతి ర్నవోఢా సైవ సప్రశ్రయా విస్రబ్ధనవోఢా" అని వ్రాయంబడినది. "ఆదౌ రతం బాహ్య మిహ ప్రయోజ్యం తత్రాపి చాలిఙ్గనపూర్వ మేవ" అని రతిరహస్యోక్త ప్రకారమున నిటఁ దొలుత నాలింగనాధరచుంబనాది బాహ్యరతియు వెనుకసురత రూపాభ్యంతరరతియు వర్ణింపఁబడినది, స్తనసంస్పర్శనోక్తిచే నాలింగనమే చెప్పఁబడిన దని యెఱుంగవలయు. "అఙ్గుష్ఠే పదగుల్ఫజానుజఘనే నాభౌచ వక్షస్స్థలే కక్షే కణ్ఠకపోలదన్తవసనే నేత్రాలకే మూర్ధని । శుక్లాశుక్లవిభాగతో మృగదృశా మఙ్గేష్వనఙ్గస్థితీ రూర్ధ్వాధోగమనేన వామవదనాః పక్షద్వయే లక్షయేత్" అని కళాస్థానములు రతిరహస్యముననె చెప్పఁబడినయవి. తొలుతటి కలయికలన్=ప్రథమసమాగమములయందు; మనములగన్=మనస్సు సంతసించునట్లు; కలసిన చెలువరతనంబులన్=కూడినస్త్రీరత్నములను; తలఁపునన్=అంతరంగమందు; తలఁచుచున్=స్మరించుచు; అలమరానివిరాలిన్=ఆక్రమింపరాని విరహమును; కొని; నెలపొడుపువెనుకన్=చంద్రోదయానంతరమున; అలరువాల్దొరకలికిన్=రతికి; చెలరేఁగన్=విజృంభించుటకు; తమిన్=ఆసక్తిచేత; ఏతెంచినపతులు = వచ్చినట్టిప్రియులు; అపుడు; తమయెడన్ = తమయందలి; పొడముమమతన్=ఉదయించిన యనురాగముచేత; నిదురగదియమిన్=నిద్రరాకపోవుటచేత; కెంజిగిన్=అరుణకాంతిచేత; కదురుకొను కనుతుదలును=అతిశయించుచున్న నేత్రాంతములును; తనుతలమ్మునన్=శరీరప్రదేశమున; తొలఁకుగురు విరహజ్వరభరంబునన్=నిండిన యధికమైన వియోగజ్వరాతిశయముచేత; విరిపాన్పునన్=పుష్పశయ్యపై; పొరలన్=పరివర్తనము సేయఁగా; చిక్కువడుమణి సరంబులును=చిక్కువడిన మణిహారములును; మరునియిరువాఁడికైదువు=మన్మథునియొక్క యిరుప్రక్కలపదునుగల యాయుధము; పేరెదన్=విశాలవక్షమునందు; చుఱుకుచుఱుక్కనన్=ఇట్టిధ్వనిగలుగునట్లుగా; నాటన్=గ్రుచ్చుకొనఁగా; తాళక=ఓర్వఁజాలక; నెఱపునిట్టూర్పులునున్=వ్యాపింపఁజేయు నిశ్వాసములును; పరయువతితిలకసంపర్కప్రకారంబు=ఇతర స్త్రీసాంగత్యభంగిని; తోరంబుగాన్=అధికముగా; ఎఱింగింపన్=తెలుపఁగా; అలివి=కోపించి; అవలిమొగంబై=పెడమొగమై; శయనించి=పరుండి; మాటిమాటికిన్=సారెసారెకు; బోటికత్తెలపలుకులన్=చెలికత్తెలమాటలచేత; నిజప్రేమాతిశయజనితవియోగవేదనాకార్శ్యంబులుగాన్.—నిజ = తమయందలి, ప్రేమాతిశయ = అనురాగాతిశయముచేత, జనిత=పుట్టినట్టి, వియోగవేదనా = విరహవేదనయొక్క, కార్శ్యంబులుగాన్=కార్శ్యములని; తెలిసి=తెలిసికొని; ఇనుమడికూటములన్=ద్విగుణితసురతములచేత; అలమి = ఆక్రమించి; రతిబడలిక=రతివలననైనశ్రమము; పాయన్=పోవుటకు; కరంబు=మిక్కిలి; ఊరంబులన్=ఱొమ్ములమీఁద; చల్లులాడుపువ్వుఁబోఁడులశయకుశేశయసమాక్షిప్తఘనసారక్షోదంబులన్.—చల్లులాడు = చల్లుచున్న, పువ్వుఁబోఁడుల = స్త్రీలయొక్క, శయకుశేశయ=పద్మమువంటి హస్తముచేత, "పంచశాఖశ్శయః పాణిః" అనియమరుఁడు, సమాక్షిప్త = వెదచల్లఁబడిన, ఘనసార=కర్పూరముయొక్క, క్షోదంబులన్=చూర్ణములను; పక్షీకరించుచున్=ఆత్మీయముగాఁజేసికొనుచు; అనఁగా నపుడు పురుషులు స్మరార్తులై నిద్రాభావమున నెఱ్ఱనికన్నులు, విరహజ్వరభరమున విరిశయ్యపైఁబొరలుటచేఁ జిక్కువడినమణిహారములు స్మరవరాయుధాహతిచేత నిట్టూర్పులుగలవారై, స్త్రీల చెంతకుఁ బోఁగా వారు చూచి పరయువతిసాంగత్యముచేసి వచ్చి

సా రని యలిగి యవ్వలి మొగముగలవారై శయనించి యుండి మాటిమాటికి బోటికత్తెలు చెప్పుటచేత స్వవిషయకానురాగమున నె యట్లున్నా రని నిశ్చయించి యిరువడికూటముల నలమి రతిశ్రమాపనోదనమునకై వారిబొమ్మలమీఁద చల్లుకర్పూర చూర్ణముతోఁ బండువెన్నెల దండము మెలఁగి విరాజిల్లె నని భావము. అలరుమల్లియవిరిసరులు.—అలరు=ప్రకాశించునట్టి, మల్లియవిరిసరులు=మల్లెపూలదండలు; తుఱిమి = కొప్పులలోఁ దుఱిమికొని; అమలమౌక్తికదామంబులు=నిర్మలములైనముత్యంపుపేరులను; తాల్చి=ధరించి; కపురంపుబొట్టులు=కర్పూరతిలకములను; తీర్చి=దిద్ది; కమనీయమలయజకర్దమంబు=మనోజ్ఞమగు శ్రీగంధమును; అలంది=పూసికొని; కలికితెలిచలువలు=అందమైనశుభ్రవస్త్రములను; ఊని=వహించి; వెన్నెలన్=చంద్రికయందు; తలవరులు=తలారులు ; కనకుండన్ = తమ్ము చూడకుండ ; సంకేతనికేతనంబులకున్=సంకేతస్థానములకు; పోవుత్రోవన్=పోవుదారిని ; పొంచి = కనిపెట్టి ; కమలకళికాసంలగ్నమధుపనినాదవలయఘీంకార సంకలిత మృణాలయష్టి.— కమలకళికా = పద్మముకుళమునందు, సంలగ్న=సంబంధించినట్టి, మధుప=తుమ్మెదలయొక్క, నినాద=ధ్వనులనెడు, వలయఘీంకార = కడియములయొక్క ఘీమనుశబ్దములతోడ, సంకలిత = కూడుకొన్న, మృణాళయష్టి=తామరతూఁడనెడుదండమును; కరంబు = మిక్కిలి; ఊని = వహించి ; అడ్డంబు పఱతెంచువారు=అడ్డముగవచ్చుచున్నవారు ; ఎవ్వరెవ్వరు ; అనన్=అనఁగా ; తలంకుమనంబునన్=చలించుచున్నమనస్సునందు ; ఘట్టకుటిన్ ప్రభాతంబుఅగుదారి=సుంకరకట్టయందుఁ ప్రాతఃకాలమాయెననురీతి ; అనఁగా నొకనరకుఁ దెచ్చువర్తకుండు సుంకరకట్ట దప్పించుకొని పో వలయు నని రాత్రి పోవుచుండఁగా సుంకరకట్ట దగ్గఱకుఁ బోవువఱకె తెల్లవాఱిన దని తదర్థము; అయ్యోన్ అని; మాఱుపలుకన్ నేరక = బదులుమాటచెప్పఁజాలక; మూలమూలన్=ప్రతిమూలయందు; ఒదుఁగుచున్=చొచ్చుచు ; తలంకునెడన్=భయపడుసమయమున; కిలకిలనవ్వుచున్ = కిలకిలయనునట్లునవ్వుచు; తమ్మెఱుంగఁజేయన్=తమ్ము తెలుపఁగా ; ఒక్కింతచిగిరించునలుకన్ = కొంచెమంకురించుకోపముచేత ; అభిసారికాజనంబులు = జ్యోత్స్నాభిసారికలు ; ప్రియులపైన్=తమవల్లభులపైని ; రువ్వుమవ్వంపువిరిగుత్తులన్=విసరివైచు మనోహరములయినపూగుత్తులను, చివ్వకున్=జగడమునకు ; పిలుచుచున్=ఆహ్వానముసేయుచు; అనఁగా నపు డభిసారికలు జ్యోత్స్నానురూపము లైనతెల్లనిమల్లికామాల్యమౌక్తికదామకర్పూర తిలకచందనచర్చికాదులు పూని తలవరుల కగపడఁ గూడ దని పోవుచుండఁగా ప్రియులు వారు పోవుదారిం గాచి కమలముకుళమున వసించిన తుమ్మెదలనాదము లనెడుకడియములచప్పుడుతోఁ గూడిన మృణాళయష్టినింబూని యడ్డముగా వచ్చువా రెవ్వరని యడిగి వారేమియుఁ జెప్పఁజాలక మూలమూలనొదుఁగుచు భయపడునెడఁ గిలకిల నవ్వఁగా వా స్త్రీలకుఁ గొంచెము కోప మంకురించి మవ్వంపువిరి గుత్తులు వారిపై రువ్వినా రనియు నాగుత్తులఁ బండువెన్నెల చివ్వకుఁ బిలిచిన దనఁగాఁ దత్తుల్యమై యొప్పె ననియు భావము. “మదనానలసంతప్తా యాభిసారయతి ప్రియమ్ । జ్యోత్స్నీతమస్వినీ యానయోగ్యాంబరవిభూషణా । స్వయం వాభిసరే ద్యాతు సాభవేదభిసారికా। కాన్తాభిసరణే స్త్రీయా లజ్జానాశాదిశఙ్కయా। వ్యాఘ్రహుఙ్కారసంత్రస్తమృగశాబవిలోచనా । నీలాదిరక్తవసనరచిజ్ఞాగావగుణ్ఠనా । స్వాఙ్గే విలీనావయవా నిశ్శబ్దపద

చారిణీ । సుస్నిగ్ధైకసఖీమాత్రయుక్తా యాతి సముత్సుకా" అని యభిసారికాసామా[illegible] శేషలక్షణములు తెలియవలయు. వెన్నెలగలవెన్నెలన్=ప్రకాశమానమగువెన్నెలయందు ; బయటన్=నిరావరణదేశమున; ఎన్నరానివేడుకపన్నిదంబులు=అగణితములగువేడుకపందెములను; పన్ని=చేసి; సుహృన్నికరంబులతోన్ = మిత్రమండలములతోడ ; పెన్నేర్పునన్=మిగుల చాతుర్యముచేత; జూదంబులు=ద్యూతములను; ఆడుచున్నకతంబునన్=ఆడుచుండినహేతువుచేత; కొంతదడవగుటన్ = కొంచెమువిలంబమగుటచేత; పటుతరమహానటమస్తటనానటద్ధైర్యవిపాటనాటోప సముత్కటశంబర ప్రతిభటకృపీటజకోరక శరపటల ధారాదోధూయమానమానసంబుతోన్.—పటుతర = సమర్థుఁడగు, మహానట=శివునియొక్క, మస్తట = హృత్ప్రదేశమందు, నానటత్ = మిక్కిలి నటించుచున్న, ధైర్య=ధీరత్వము యొక్క, విపాటనాటోప = భేదనాతిశయముచేత, సముత్కట = మిగులవిజృంభించినట్టి, శంబరప్రతిభట=శంబరాసురవైరియగుమరునియొక్క, కృపీటజకోరకశర = పద్మకలికలనెడుబాణములయొక్క, పటల = సమూహముయొక్క, ధారా=అంచులచేత, దోధూయమాన=మిగులఁగంపించునట్టి, మానసంబుతోన్=చిత్తముతోడ;విచ్చలవిడిన్=యథేచ్ఛముగా; పెచ్చుపెరుఁగుతాపంబునన్=మిక్కిలిపెరుఁగునట్టిసంతాపముచేత; వెచ్చన్=వేఁడిగా;ఊర్పుచున్=ఊర్పులువుచ్చుచు; నెమ్మదిన్=మంచిమనమునందు; క్రచ్చుకొని=దట్టమయి; హెచ్చుమోహంబునన్=అతిశయించువలపుచేత; నెచ్చెలిచేతికిన్=ప్రియసఖీహస్తమునకు ; అచ్చంపుగుఱుతు=మంచియానవాలు; ఇచ్చి ; మచ్చికలన్ = ప్రేమలచేత ; వల్లభున్=ప్రియుని; తోడ్కొనిరమ్ముఅంచున్ = తోడితెమ్మనుచు, అంచి=పంపి ; అంచితబహిరంగణప్రదేశంబులన్ =ఒప్పుచున్నముంగిలిభూములయందు ; నిలిచి=ఉండి; పతిరాకకున్=ప్రియునిరాకకు; ఎదురుచూచునదియును=నిరీక్షించుచున్నదియును, ఇది వెలయువిదలకు విశేషణము; నెయ్యంపుఁబొదల తూఁగుటుయ్యెలపైన్ = మనోహరములగునికుంజములయందలి తూఁగుచున్నడోలికపై; ఒయ్యారంబునన్=శృంగారగర్వముచేత; కూర్చుండి ; ప్రియుండు=వల్లభుఁడు; పసిండీదండియున్=బంగరువీణాదండమును; పూని=వహించి ; నుతిమాటన్=నుతిచేయఁగా; విభునిచెంతన్=ప్రియునొద్ద;వసియించి=ఉండి;చిన్నికిన్నెరన్ పూని=చిన్నవీణియను చేకొని; పంచశరదేవతావిజయప్రపంచసమంచితంబులు.—పంచశరదేవతా=అనంగునియొక్క,విజయ=గెలుపుయొక్క, ప్రపంచ=విస్తారముచేత, సమంచితంబులు=ఒప్పుచున్నవి; అనఁగా శృంగారరసప్రతిపాదకములగునవి; అగునూతనగీతంబులు=అయినట్టిక్రొత్తపాటలను;పలికించి=కిన్నెరలోఁబలికించి; చెలులన్=సకియలను;చొక్కించునదియును=సుఖపారవశ్యమునొందించునట్టిదియును; అడుగులు=జడయొక్కకాళ్ళు; ఒరయన్=ఒరసికొనునట్లు; కొనసాగన్=తుదిముట్టునట్లు; అల్లినజడకున్=అల్లినట్టివేణికి; చుట్టినమొల్లవిరితావి = పరివేష్టించినమొల్లపూలపరిమళము; ఎల్లెడలకున్=అంతటను ; పరవన్=ప్రసరింపఁగా ; మంజులచరణకంజసంజితకంజరాగమంజీరశింజారవంబులు.—మంజుల=మనోజ్ఞములగు, చరణకంజ=పాదపద్మములందు, సంజిత=సంబంధింపఁజేయఁబడిన, కంజరాగ=పద్మరాగమణులయొక్క, మంజీర=అందెలయొక్క, శింజారవంబులు=గజ్జెలచప్పుడులు ; కర్ణగ్లానిన్ = శ్రోత్రములహర్షాభావమును; మాన్పన్=

ప్పోఁగొట్టఁగా, కర్ణసుఖసంపాదకంబులు కాఁగాననుట; ఒఱదోఁపినవలదొరపరువంపుకైదువు తెఱఁగునన్.—ఒఱదోఁపిన=కోశమునందుదోఁపిన, వలదొర=మదనునియొక్క, పరువంపు=తరుణమైన, కైదువుతెఱఁగునన్=ఆయుధమురీతిచేత; నిండారన్ = నిండునట్లు; దువ్వలువన్ = దుప్పడమును; కప్పి=కప్పికొని; కాంతునికాంతంబునకున్ = ప్రియునిగృహమునకు; బోటులవెంటన్ = చెలియలవెంట; చనునదియున్=పోవునదియును; తనమనంబు = తనచిత్తము; అలరన్=సంతసించునట్లు; కలసి=కూడి; కళలన్=కామశాస్త్రప్రసిద్ధానంగకళలయందు; తేలించి=సుఖపెట్టియనుట; మేలుంచి=శుభముకల్గించి; ఏలిననాయకునియెడన్=పోషించినప్రియునిమీఁద; ఎడయనిప్రియమ్మునన్=తొలఁగనిప్రీతిచేత; తఱిసి=సమీపించి; విరిసరులు=పుష్పహారములు; తుఱిమి=చెరివి; చలువన్ = శైత్యమును; వెదచల్లుకలపంబు = వ్యాపింపఁజేయునట్టిగంధమును; అఱఁది=పూసి; అంతంతన్=అంతకంతకు; పొడముమోహములన్=ఉదయించునను రాగములతోడ; అలమి=ఆక్రమించి; కెమ్మోవిన్=ఎఱ్ఱనిపెదవిని; నొక్కు=కొఱికి; పునారతులకున్ = ద్వితీయసురతములకు; పునఃరతులుఅనుచోటన్ సంస్కృతసంధివశమునవిసర్గలోపము పునశ్శబ్దాంతిమాకారమునకుదీర్ఘముగలిగినది; వేడుక = ఉత్సాహమును; రేఁచి=అతిశయింపఁజేసి; పైకొనునదియును = ప్రియునిపైకిఁగ్రమ్మునదియును; ఐవెలయువెలయువిదలగలితచందనచర్చాపాళికలన్ = అయివెలయువెలయాండ్రయొప్పిదమగుచందనచర్చికలగుంపులతోను; కనత్తరదరహాసవిభారింఛోళికలన్ = ఒప్పుచున్నమందహాసములకాంతిపుంజములతోను; కర్ణావతంసితకైరవపత్త్రమంజరికావిభాళికలన్ = కర్ణభూషణములుగాఁజేయఁబడినకలువఱేకుల తేజఃపరంపరలతోను; కబరికావేష్టితలతాంతమాలికలన్ = కొప్పునఁజుట్టినపూలసరములతోను; కలసి = కూడి; మెలఁగుచున్ = ఒప్పుచు; అనఁగా నపుడు వెలయాండ్రలో నొకతె తనప్రియుఁడు వెన్నెలబైట మిత్రమండలితో జూదము లాడుచుఁ దడవుసేయఁగా ¡ మదనశరములచే బాధితయై నెచ్చెలిచేతి కచ్చంపునానవాలిచ్చి ప్రియునిఁ దోడితెమ్మని యంచి ముంగిటఁ గూర్చుండి పతిరాక కెదురుచూచునదియు నొకతె పొదరింటిలోఁ దూఁగుటుయ్యలపైఁ గూర్చుండి ప్రియుఁడు పసిండిదండియఁ బూని సుతి మీటఁగా సంభోగసమయ సముచితములైన క్రొత్తపాటలు పాడి చెలులఁ జొక్కించునదియు నొకతె జాఱు విడిచిన జడ నల్లిన మొల్లలవాసన నలుదెసలు గ్రమ్మఁగాఁ బద్మరాగమణిమయము లగుకాలియందెలఁ బొందుపఱిచిన గజ్జెలచప్పుడులఁ గర్ణానందము లగుచుండఁగా నిండార దువ్వలువ గప్పి చెలియలఁ గూడి ప్రియనికేతనమునకుఁ బోవునదియు నొకతె తన్ను వివిధరతములతో సంతసింపఁ జేసిననాయకు నొద్దఁ బ్రీతితోఁ జేరి పూదండలు కొప్పునఁ దుఱిమి మిగులఁ జలువ యైనకలపంబుఁ బూసి యంతంత కుదయించురాగమున మఱలరతమునకై పైకొను నదియునై యుండఁగా వారలు పూసికొన్న గంధపరంపరలతోను వారి మందహాసకాంతి సంతతితోను కర్ణాభరణములుగా నుంచికొన్న తెలికలువఱేకుల తేజఃపుంజముతోను కొప్పుల నొప్పుగ నుంచికొన్న కుసుమముల దీధితివితానముతోను కలసి మెలఁగుచు వెన్నెల చెన్నారె నని భావము. ఇందు వన్నెగలవెన్నెల యను తొలుతటివాక్యమున విరహోత్కంఠితయు రెండవదానియందు నాలుగవదానియందును స్వాధీనపతికయు మూఁడవదానియం దభిసారికయు నగును. "అనాగసి ప్రియతమే చిరయ త్యుత్సుకాతుయా।విరహో

త్కంఠితా భావవేదిభిః స్వసుహృత్సా। ఆసన్నాయత్తరమణా హృష్టాస్వాధీనవల్లభా” అని విరహోత్కంఠితా స్వాధీనపతికల లక్షణములు. అభిసారికాలక్షణము వ్రాయఁబడినదై యైన వేశ్యాభిసారికను గూర్చి విశేషము “వేశ్యాభిసారికా త్వేతి హృష్టా వైశికనాయకమ్। ఆవిర్భూతస్మితముఖీ మదఘూర్ణితలోచనా। అనులిప్తాఖిలాఙ్గీచ విచిత్రాభరణాన్వితా। స్నేహాఙ్కురితరోమాఞ్చస్ఫుటీభూతమనోభవా। సంవేష్టితా పరిజనైః శ్లోభ్గోపకరణాన్వితైః। రశనారావమాధుర్యదీపితానఙ్గవైభవా। చరణామ్బుజసంలగ్నమఞ్జుమఞ్జీరమఞ్జులా” అని రసార్ణవసుధాకరమున వ్రాయఁబడినది. మహోత్పలమండలత్రాణైకవిహారవిలాసాంచితంబు అయ్యును.—మహాత్ = అధికమగు, ఉత్పలమండల=కల్వలగుంపుయొక్క, త్రాణ = రక్షణమందు, ఏక=ముఖ్యమయిన, విహారవిలాస=విహరణప్రకాశము చేత, అంచితఁబయ్యును=ఒప్పుచున్నదైనను; మహోత్పలమండలామోదహరణైకవిలాసాంచితంబు ఐ.—మహోత్పల=అరవిందములయొక్క, “అరవిన్దమ్మహోత్పలమ్” అని యమరుఁడు, మండల=సంఘముయొక్క, ఆమోద=సంతసముయొక్క, హరణ=హరించుటయొక్క, ఏకవిలాసాంచితంబై=ముఖ్యవిలాసముచెత నొప్పుచున్నదై, రాత్రి కలువలు వికసిల్లుటయుఁ బద్మములు ముడుగుటయుఁ బ్రసిద్ధము. అసమకాండచండప్రతాపనాశకనిజోదయంబు అయ్యును.—అసమకాండ=సూర్యునియొక్క, చండప్రతాప=తీవ్రమగు వేఁడికి, నాశక=ధ్వంసముచేయునదియగు, నిజోదయంబు=తనయుదయముగలది అయ్యును; అసమకాండచండప్రతాపసంవృద్ధికరనిజోదయంబై.—అసమకాండ = మరునియొక్క, చండప్రతాప=ఉగ్రప్రతాపముయొక్క, సంవృద్ధికర=రక్షకమగు, నిజోదయంబై=తనయావిర్భావముగలదై; వెన్నెల యుదయించునపుడు సూర్యతాప ముడిగి మదనతాపము మించు ననుట; దివ్యచక్రచిత్తానంద సంధాయకంబు అయ్యును.—దివ్యచక్ర=సురనికరముయొక్క, ఆనంద సంధాయకంబు = సంతోషజనకమయ్యును; దివ్యచక్ర చిత్తానందభేదకంబై=సుందరములైన చక్రవాకముల చిత్తానందమునకు భేదకమై; సురలు సుధఁ గ్రోలువారు గాన వెన్నెల వారి కానందజనక మగుటయు చక్రవాకమోదనాశక మగుటయుఁ దెల్లము; రాజిల్లుచున్=పైఁజెప్పినవిధమున విలసిల్లుచు; ద్రుహిణాండకరండంబునకున్=బ్రహ్మాండమనెడు బరణికి; వెండిజలపోసనంబుదారిన్=వెండినీరుయొక్క పైపూఁతవలె; ప్రకాశించెన్=విలసిల్లెను. అయ్యవసరంబునన్ ఇదిముందు కన్వయించును.

మ. అలపాంచాలకుమారి యేపటి సువర్ణాంచత్పరాగాళికిన్
నెలవై రా నలకాండధామగతి కెంతేఁ దోఁచి పెల్లేఁచ వె
న్నెల వైరానలకాండధామనయనోన్మేషస్ఫురత్కోకిలా
బల ప్రేమోయర్ణ వెలినూని మున్ సితరుచిన్ బల్కున్ విరోధోక్తులన్.

టీ. అలపాంచాలకుమారి = ఆచంద్రిక; సువర్ణాంచత్పరాగాళికిన్.—సువర్ణ=చంపకపుష్పములయొక్క, అంచత్=ఒప్పుచున్న, పరాగాళికిన్ = పుప్పొడిచాలునకు; ఏపటిన్=దప్పిని; వెన్నెల=జ్యోత్స్న; ఎంతేన్ = మిక్కిలి; తోఁచి = పొల్చి; నలకాండ ధామగతికిన్.—నల

కాండ=పక్షబాంధవుఁడగు మరునియొక్క, ధామ=ప్రతాపముయొక్క, కతికిన్=వ్యాప్తికి; సెలపై=స్థానిమై; పెల్లు=మిక్కిలి; ఏఁచన్=బాధించుటకు; రాన్=రాఁగా; వైరానలకాండధామనయనోన్మేషస్ఫురత్కోకిలాబల.—వైర=విరోధము సెడు, అనలకాండ=అగ్నిపుంజమునకు, ధామ=ఆశ్రయమగుచున్న, నయనోన్మేష=నేత్రవికసనముచేత, స్ఫురత్=ప్రకాశించుచున్న, కోకిలాబల=కోకిలస్త్రీ, కోయిలలకుఁ గన్నులెఱ్ఱగ నుండుట ప్రసిద్ధము; మ్రోయన్=కూయఁగా; వెఱన్=భయమును; ఊని=వహించి; ముక్=తోలుత; సితరుచిన్ = చంద్రునిగూర్చి; విరోధోక్తులన్=విరోధవాక్కులను; పల్కున్=వచించును.

అనఁగా నట్లువెన్నెల గాయుచుఁ జంద్రికను మిక్కిలి బాధించె ననియుఁ గోకిలారవము మిక్కిలి దుస్సహమైన దనియు దానివలనఁ జంద్రిక చంద్రాదులను దూషింపఁ దొడంగె ననియు భావము.

చ. కమలక యౌర్వహేతితతి • గాఢనవోదయరాగకీలిచేఁ
దెమలక రాహువక్త్రసము•దీర్ణవిషాగ్ని నడంగ కున్నమ
త్కమలకరాళికాధికశి•ఖాహతిఁ దూలక పొల్చి తక్కటా
కమలకరాళికాధిగత•కాలుషి నేమన వచ్చు జాబిలీ. 109

టీ. జాబిలీ=ఓచంద్రుఁడా! ఔర్వహేతితతిన్=బడబాగ్ని జ్వాలా సమూహముచేత; కమలక=కందక; గాఢనవోదయరాగకీలిచేన్.—గాఢ=దట్టమైనట్టి, నవ=నూతనమైన, ఉదయరాగ=ఉదయకాలి కారుణ్యమ సెడు, కీలిచేన్=అగ్నిచేత; తెమలక = చలింపక; రాహువక్త్రసముదీర్ణవిషాగ్నిన్.—రాహువక్త్ర=రాహుముఖమందలి, సముదీర్ణ=అత్యుత్కటమైన, విషాగ్నిన్=విషమ సెడు వహ్నిచేత; అడంగక=నశింపక ; ఉన్నమత్కమలకరాళికాధికశిఖాహతిన్.—ఉన్నమత్=పైకెగయుచున్న, ఇది యగ్నికి విశేషణము, కమలకర= లేడిహస్తమునందుఁగల శివునియొక్క, అళిక=ఫాలస్థలమందలి, అధిక=అధికమగు, శిఖా=జ్వాలయొక్క, హతిన్=కొట్టుటచేత; తూలక=పడిపోవక; పొల్చితి=ఉదయించితివి. అక్కటా=ఖేదము! కమలకరాళికాధిగతకాలుషిన్.—కమలకరా=స్త్రీలయొక్క, ఆళికా=శ్రేణిచేత, అధిగత=పొందఁబడిన, కాలుషిన్=పాపమును; ఏమనవచ్చున్=ఏమనిచెప్పవచ్చును.

అనఁగా బడబాగ్న్యుదయరాగాగ్ని రాహువక్త్రవిషాగ్ని హరఫాలనేత్రాగ్నిశిఖలచేతఁ జంద్రుఁడు నశింపక యుదయించుట స్త్రీలు చేసినపాపముచేతనే గాని వేఱుగా దనుట.

శా. స్వచ్ఛా యన్ వనితాళిఁ దూల్చుటలు దీ•వ్యచ్ఛక్రమోదచ్ఛిదా
స్వచ్ఛందోహ యమానధామహృతచం•చత్తావకోజ్జోఖిల

స్వచ్ఛందోహాయమాన మేఁచుటలో యు♦ష్మ ద్భేదనాఢ్యాంఘ్రిభా
స్వచ్ఛందోహాయమాన మేఁచుటలో ని♦చ్చల్ దల్పుమా హృత్థ్సలిన్.

టీ. దీవ్యచ్చక్రమోదచ్ఛిదా స్వచ్ఛందోహ.—దీవ్యత్=ఒప్పుచున్న, చక్ర=చక్రవాకములయొక్క, రాష్ట్రములయొక్క—యని యర్థాంతరము తోఁచుచున్నది, మోద=సంతోషముయొక్క, ఛిదా=ఛేదనమందు, స్వచ్ఛంద=స్వాభీష్టమగు, ఊహా=తలంపుగలవాఁడా! ఇది చంద్రసంబోధనము; స్వచ్ఛాయన్=నిజకాంతిచేత; వనితాళిన్=అబలా కదంబమును; తూల్చుటలు=తూలఁజేయుటలు; అమానధామహృత చంచత్తావకౌజోఖిల స్వచ్ఛందోహాయమానము.—అమాన=అధికములగు, ధామ=ప్రతాపముచేత, హృత=హరింపఁబడిన, చంచత్=ఒప్పుచున్న, తావక=నీసంబంధియైన, ఓజః=తేజస్సనెడు, అఖిలస్వ=సకలధనముగలవానియొక్క, అనఁగా సూర్యునియొక్క యని గాని రాహువుయొక్క—యని గాని భావము, ఈపదము నేయార్థమైనను "యమకాది ష్వదుష్టం స్యాన్నిహతార్థం నిరర్థకం" ఇత్యాదిగా వెనుక వ్రాయఁబడిన ప్రమాణముచేఁ గావ్యదోషము ప్రసరింప దని తెలియవలయు, ఛందః=అభిప్రాయముయొక్క, హాయ=వేగముయొక్క, మానము=మర్యాదను; ఏఁచుటలో=భంగపఱచుటలో; యుష్మద్భేదనాఢ్యాంఘ్రిభాస్వచ్ఛందోహాయమానము.—యుష్మత్ = నీయొక్క, నిందయందు బహువచనము. భేదన=భేదనమందు, ఆఢ్య=సమర్థమైన, అంఘ్రి=పాదములచేత, భాస్వత్=ఒప్పుచున్న, ఛందోహాయ=శివునియొక్క, మానము=గర్వమును; ఏఁచుటలో=భంగపఱచుటలో; నిచ్చల్=ఎల్లప్పుడుఁ; హృత్థ్సలిన్=హృదయసీమయందు; తల్పుమా=చింతింపుమా.

అనఁగా నీసర్వస్వము హరించునట్టి సూర్యునిజోలికిఁ బోక నిన్నుఁ గాలితోఁ దన్నిన శివు నేమియు చేయఁజాలక నీవు చక్రసంతోషముఁ బోఁగొట్టునట్టివాఁడవు కావున యబలల బాధించుచున్నావు. ఇది నీకు యుక్తము గాదని తాత్పర్యము. శివుఁడు దక్షయాగధ్వంసమునఁ జంద్రునిఁబాదముతోఁ దన్నినట్లు పురాణసిద్ధము.

సీ. అనురక్తి ప్రౌఢల ది♦వ్యాబ్జచార్యునవలా ల
లితకంతుకేళికా♦గతిఁ దెమల్చి
మాతంగసఖ్య మే♦మఱక గన్నవలాల
నేలుమారుని చెల్మి ♦ నెడయ మాని
చక్రవిప్రవర తే♦జం బెల్ల నవలాల
సారూఢిఁ గరశక్తి ♦ నపహరించి
పరమలింగాప్తిఁ జూ♦పట్టుతానవలాల
సద్దీప్తిఁ బౌమండ♦సరణిఁ దాల్చి

తే. మలినతరకీర్తిజాతంబు ♦ లిల నలర్చి
ప్రోడి గను నిన్నుఁ దిలకింప ♦ రోహితాంశ

పతి కడుపు మండకుండునే ♦ బాడబాగ్ని
రూఢ కీలా పరంపర ♦ రోహితాంక. 111

టీ. రోహితాంక = చంద్రుఁడా ; దివ్యాచార్యునవలాన్ = అమానుషుఁడగునుపాధ్యాయునిస్త్రీని, బృహస్పతిపత్నినని వాస్తవార్థము; లలితకంతుకేళికాగతిన్.—లలిత = మనోజ్ఞమయిన, కంతుకేళికా = కామక్రీడయొక్క, గతిన్=ప్రాప్తిచేత; అనురక్తిపొదలన్=అనురాగమొప్పునట్లు; తెమల్చి=చలింపఁజేసి; మాతంగసఖ్యము=చండాలసాంగత్యము, గజసాంగత్యమని వాస్తవార్థము; ఏమఱక=పొరపడక; కన్నవలాలన్=పొందినబలములను; తుమ్మెద లననుట; తుమ్మెదలు కామసైన్యములోఁజేరిన వగుటప్రసిద్ధము; ఏలుమారుని చెలిమిన్=పోషించు ఘాతుకునియొక్క సఖ్యమును, మరునియొక్క సఖ్యమునని వాస్తవార్థము; ఎడయక్=ఎడఁబాయను; మాని=వదలి; చక్రవిప్రవర తేజంబు.—చక్ర=రాష్ట్రములయందలి, విప్రవర=బ్రాహ్మణశ్రేష్ఠులయొక్క, చక్రవాకములనెడు పక్షిశ్రేష్ఠములయొక్క యని వాస్తవార్థము, తేజంబు=తేజస్సును; ఎల్లన్=అంతను; నవలాలసారూఢిన్.—నవ=నూతనమయిన, లాలసారూఢిన్=ఔత్సుక్యాతిశయము చేత; కరశక్తిన్=హస్తసామర్థ్యము చేత, కిరణసామర్థ్యము చేతనని వాస్తవార్థము; అపహరించి=పోఁగొట్టి; పరమలింగాప్తిన్.—పరమ=ఉత్కృష్టమైన, లింగాప్తిన్=లింగధారణము చేతననుట; ఉత్కృష్టమయినచిహ్నమును బొందుట చేతనని వాస్తవార్థము; చూపట్టుతానవలాలసద్దీప్తిన్.—చూపట్టు=అగపడుచున్న, తానవ=తనుసంబంధియైన, లాలసత్=మిగులఁబ్రకాశించుచున్న, దీప్తిన్=కాంతి చేత; పాషండసరణిన్=పాషండునిదారిని; తాల్చి=వహించి; మలినతరకీర్తిజాతంబులు.—మలినతరకీర్తి=అపకీర్తులయొక్క, జాతంబులు=సమూహములను, నల్లగలువలననివాస్తవార్థము; "కీర్తిర్యశసికర్దమే" అని విశ్వము; ఇలన్ = భూమియందు; అలర్చి=వికసింపఁజేసి; ప్రోదిగనునిన్నున్ = వృద్ధిఁబొందుచున్న నిన్ను; తిలకింపన్ = వీక్షింపఁగా; రోహితాంకపతికడుపు = సముద్రునియుదరము; బాడబాగ్నిరూఢకీలాపరంపరన్ = బడబాగ్నియొక్క యధికమైన జ్వాలాసంతతి చేత; మండకుండునే = ఎరియకుండునా ?

అనఁగా రాగాతిశయము చేత గురుపత్నీగమనము చేసి మాతంగసఖ్యముగన్న సైన్యము నేలుఘాతుకునిచెలివై లింగధారణము చేసి పాషండుఁడవై లోక మెల్ల నపకీర్తి నెఱపిననిన్నుఁ జూచి నీతండ్రి యగుసముద్రునకు బడబాగ్నిజ్వాలల చేతఁ గడుపుమండు ననుట.-చంద్రుఁడు బృహస్పతిభార్యను పొందుట, గజములఁబొందుతుమ్మెదల నేలుమారునిచెలి యగుట, తనదేహకాంతి చేత చక్రవాకమోద మపహరించుట, కళంకమును దాల్చుట, నల్లగలువల వికసింపఁజేయుట, సముద్రోదరము బడబానలముగలిగియుండుట, స్వభావము.

మ. అలరం గామవిమోహనైకవిఖ్యాతుల్ ♦ ప్రాంచన్నలశ్రీగతుల్
దలఁగన్ రాజిలునీమహాభ్యుదయ మా♦త్మం జూడఁగా విస్ఫుర

త్కలికాలాభ మనంగఁ జెందునె సుదృగ్వ్రాతంబు చాల న్నవో
త్కలికాలాభ మనంగశత్రునిటలోగ్రజ్వాలితుల్యద్యుతీ. 112

టీ. అనంగశత్రునిటలోగ్రజ్వాలితుల్యద్యుతీ.—అనంగశత్రు=శివునియొక్క, నిటల=ఫాలమందున్న, ఉగ్రజ్వాలి=భయంకరమయినఅగ్నితోడను, తుల్యద్యుతీ=సమానమయినకాంతిగలవాఁడా! ఇది చంద్రసంబోధనము; కామవిమోహానైకవిహృతుల్.—కామ=మన్మథుని యొక్క, విమోహాన=మోహింపఁజేసెడు, ఏక=ముఖ్యములగు, విహృతుల్=విహారములు; కామ=మిక్కిలి, వి=పక్షియొక్క, మోహాన=భ్రమింపఁజేసెడు, ఏకవిహృతుల్=ముఖ్యవిహారములు; అని అర్థాంతరముతోఁచును; అలరన్=ఒప్పఁగా; ప్రాంచన్నలశ్రీగతుల్.—ప్రాంచత్=ఒప్పుచున్న, నల=పద్మములయొక్క, నలరాజుయొక్కయని యర్థాంతరము, శ్రీగతుల్=కాంతిగతులు, సంపద్గతులు; తలఁగన్=తొలఁగిపోఁగా; రాజిలునీమహాభ్యుదయము.—రాజిలు=ప్రకాశించుచున్న, నీమహాభ్యుదయము=నీగొప్ప యావిర్భావము, సమృద్ధి; ఆత్మన్ = చిత్తమందు; చూడఁగాన్=భావింపఁగా; విస్ఫురత్కలికాలాభన్.—విస్ఫురత్=ప్రకాశించుచున్న, కలికాల=కలియుగముయొక్క, కలిపురుషునియొక్కయనుట, ఆభన్=కాంతిచేత; మనంగన్=వృద్ధిపొందఁగా; సుదృగ్వ్రాతంబు=స్త్రీగణము, పండితమండలమని యర్థాంతరము; చాలన్=మిక్కిలి; నవోత్కలికాలాభము.—నవ=నూతనమగు, ఉత్కలికా=వేడుకలయొక్క, లాభము=ప్రాప్తిని; చెందునె=పొందునా?

అనఁగా కలిపురుషుఁడు పక్షియొక్కవ్యామోహవిహారములచే నలచక్రవర్తిసిరులు తొలఁగఁ జేసి విరాజిల్లుచుండఁగా సజ్జనులు సంతసింపనట్లు నీవు మరునిభ్రామకవిహారము లలరుచుండఁగాఁ బద్మములసిరులు తొలఁగుచుండఁగా రాజిల్లుటకు స్త్రీలు సంతసింప రనుట.

సీ. కల నూపి తొలుదొల్త • గాంచితో మేమవా
హాలసమానార్చిశ్చ•యస్ఫురణము
వెనువెంటఁ జనుచుఁ జ•య్యన లాగితో సదో
హాలసమానవ్యహో•త్కటాంశుమహిమ
జడల నడుమనుండి • పడసితో కందర్ప
హాలసమాతతనిట•లాగ్నిశక్తి
ననుజుండ ననుచుఁ బొ•లందితో ఘనహాలా
హాలసమాభీలకీ•లాలిరూఢి

తే. నకట చల్లనిరాజ వీ • వట్టినీకుఁ
బొనఁగె నేదారి నీసర్వ•భువనజాత
సుఖదతేజంబు నన నిట్లు • శుంభదార్వ
పుంజనిభధామ మవధూత•భువనజాత. 113

టీ. అవఘాతభువనజాత = తిరస్కరింపఁబడిన లోకసమూహము గలవాఁడా! తిరస్కరింపఁబడిన జలజాతములుగలవాఁడా యని వాస్తవార్థము; తొలుదొల్తన్ = మొట్టమొదట; కలనూఁపి = విద్యమెఱయించి, కల నిచ్చి అని వాస్తవార్థము; "ప్రథమాంపిబతేవహ్నిః" అని యాగమప్రసిద్ధము; మేషవాహాలసమానార్చిశ్ఛయస్ఫురణము.— మేషవాహ=అగ్నియొక్క, లసమాన=ప్రకాశించుచున్న, అర్చిశ్ఛయ=తేజస్సంఘముయొక్క, స్ఫురణము=స్ఫూర్తిని; కాంచితో=పొందితివో. వెనువెంటన్=వెంటవెంటనె; చనుచున్=పోవుచు; సదోహాలసమాన్యహాయోత్కటాంశుమహిమన్.—సదోహాల = ఉత్సాహముతోఁగూడిన, సమాన్యహాయ=సప్తాశ్వుఁడయినసూర్యునియొక్క, ఉత్కట=అధికములయిన, అంశు=కిరణములయొక్క, మహిమన్=అతిశయమును; చయ్యనన్=శీఘ్రముగా; లాగితో=ఆకర్షించితివో; జడలనడుమన్=జటామధ్యభాగమందు; ఉండి=వసించి; కందర్పహాలసమాతతనిటలాగ్నిశక్తిన్.—కందర్పహాల=శివునియొక్క, రేఫలకారాభేదముపట్టిహాలశబ్దముచే హరశబ్దముగ్రాహ్యము, సమాతత మిగులనధికమయిన, నిటలాగ్నిశక్తిన్ = ఫాలాగ్నిసామర్థ్యమును; పడసితో = పొందితివో; అనుజుండననుచున్ = తమ్ముండననుచు; ఘనహాలాహాలసమాభీలకీలాలిరూఢిన్.—ఘన=అధికమయిన, హాలాహాల=కాలకూటముయొక్క, సమాభీల=మిగులభయంకరమగు, కీలాలి = జ్వాలాసమూహముయొక్క, రూఢిన్ =అతిశయమునందు; పాలందితో=భాగమందితివో. ఈవు=నీవు; చల్లనిరాజవు=చల్లనిదొరవు, చల్లనిచంద్రుఁడవు. అట్టినీకున్=అట్టివాఁడవైననీకు; ఈసర్వభువనజాతసుఖదతేజంబు.—ఈసర్వ=ఈసమస్తమైన, భువనజాత=లోకసమూహమునకు, సుఖద=సుఖమునిచ్చెడు, తేజంబు=కాంతి; చనన్=పోఁగా; ఇట్లు=ఈప్రకారముగ; శుంభదౌర్వపుంజనిభధామము.—శుంభత్=ప్రకాశించుచున్న, ఔర్వపుంజ = బడబాగ్నికదంబముతోడ, నిభ=సదృశమయిన, ధామము=తేజస్సు; ఏదారిన్=ఏరీతి; పొసఁగెన్=ఒప్పెను.

అనఁగా చల్లనిరాజ వగునీకు బడబాగ్నిపుంజసమాన మగు నిట్టితేజస్సు,అగ్నికిఁ దొలుతకలఁజూపి అతనితేజశ్ఛయము గాంచుటనా? సూర్యునివెంటఁ బోవుచు నాతనియుత్కటతేజోమహిమను లాగుటనా? శివునిజటామధ్యమునసుండి తన్నిటలాగ్నిశక్తిఁ బడయుటనా? కాలకూటమున కనుజన్ముండవై దానియాభీలకీలారూఢి పాలందుటనా? వీనిలో దేనివలనఁ గలిగె ననుట. ఇటఁ జంద్రతేజఃపుంజమునందు అగ్న్యాద్యన్యతమసంబంధిత్వప్రశ్నవ్యాజముచే తత్తాదాత్మ్యదృఢీకరణమువలనను బూర్వావస్థకన్న నుత్కర్షాపకర్షములు చెప్పమివలనను "చంద్రజ్యోత్స్నావిశదపులినే సైకతేస్మిన్సరయ్వాః" ఇత్యాదులయందువలె ననుభయతాదాత్మ్యరూపకము "విషయ్యభేదతాద్రూప్యరఞ్జనం విషయస్య యత్। రూపకం తత్త్రిధాధిక్యన్యూనత్వానుభయోక్తిభిః" అని తల్లక్షణము.

క. ఈలీలఁ జంద్రు ననిల, క్ష్మాలలనాతనయుఁ బలికెఁ • గినుక మధుపరా
జాలక శరభవజాలక, జాలకశరభవదురంత•సంతాపితయై. 114

టీ. ఈలీలన్=ఈప్రకారముగ; చంద్రున్=చంద్రునిగూర్చి; అని=పలికి; మధుపరాజాలక.—మధుపరాజ=తుమ్మెదలమిన్నలనుబోలు, అలక=ముంగురులుగలచంద్రిక; శరభవజాలకజాలకశరభవ దురంతసంతాపికయై.—శరభవ = కమలములయొక్క, జాలక=మొగ్గలయొక్క, జాలక = సమూహములు, శర=బాణములుగాఁగల మన్మథునివలన, భవ = పుట్టిన, దురంత=అపారమయిన, సంతాపికయై = సంతాపముకలదై; లక్ష్మీలలనాతనయున్ = లక్ష్మీకుమారుఁడగు మన్మథునిగూర్చి; కినుకన్=కోపముచేత; పలికెన్=వచించెను.

చ. కలుగునె నీకు సద్యశ మ♦ఖండరుషాగతి నిస్వనద్గుణో
జ్జ్వలవిశిఖాసముక్తశిత♦సాయకధారఁ గృపీటజాంబకా
వలిఁ గర మేఁచఁ ద్వద్బలని♦వారకసారకృపీటజాంబకా
తులితభుజాసహోమహిమఁ ♦ దూల్చినఁ గాక కృపీటజాంబకా. 115

టీ. కృపీటజాంబకా=ఓపద్మబాణుఁడైన మరుఁడా; త్వద్బలనివారక సారకృపీటజాంబకాతులితభుజాసహోమహిమన్.—త్వద్బల=నీసామర్థ్యమునకు, నివారక= వారించునదియైన, సార=శ్రేష్ఠమైన, కృపీటజాంబక=వహ్నినేత్రుఁడైన శివునియొక్క, అతులిత =సాటిలేని, భుజాసహః=బాహుబలముయొక్క, "సహోబలశౌర్యాణి" అని యమరుఁడు, మహిమన్= అతిశయమును; దూల్చినన్ కాక=దూలఁజేసిననేకాని; అఖండరుషాగతిన్=అవిచ్ఛిన్నరోషప్రాప్తిచేత; నిస్వనద్గుణోజ్జ్వలవిశిఖాసముక్త శితసాయకధారన్.—నిస్వనత్ = మ్రోయుచున్న, గుణ=అల్లెత్రాటిచేత, ఉజ్జ్వల = ప్రకాశించుచున్న, విశిఖాస = ధనుస్సుచేత, ముక్త=విడువఁబడిన, శితసాయక=తీక్ష్ణములైనబాణములయొక్క, ధారన్=అంచుచేత; కృపీటజాంబకావలిన్.—కృపీటజ=జలజములవంటి, అంబకా=నేత్రములుగలవారియొక్క, స్త్రీలయొక్క యనుట, ఆవలిన్=సమూహమును; కర మేఁచన్=మిగులబాధింపఁగా; నీకున్; సద్యశము=మంచిఖ్యాతి; కలుగునె=జనించునా?

నిన్నుదహించిన శివుని జయించిననే నీకు యశస్సుకలుగును గాని, యట్లుగాక, స్త్రీలబాధసేయుచున్నచోఁ గలుగదని భావము.

సీ. తరుణతురంగాయి♦తశుకాండజాతము
లృంజరకారలోఁ ♦ బడక యున్న
సతతనారాచిత♦సితకాండజాతముల్
కడు నిశాతత్వంబుఁ ♦ గాంచియున్న
మది ఘనభయరేఖ ♦ మధుకాండజాతము
ల్లలితపత్త్రిబలంబు ♦ గలఁగ కున్నఁ

జక్కఁ దేరైన పృ•షత్కాండజాతముల్
పొదలుచాంచలి మూల • నొదుఁగ కున్న

తే. సారకాంతాలసాయకా•సన మఖండ
తాగతి భజించి యున్న నీ•ధాత్రి నవమ
సారకాంతాలకాపాళి • ఘోరతావ
కీనధాటికి బ్రతుకునే • సూనబాణ. 116

టీ. సూనబాణ = ఓకుసుమాయుధుఁడా; తరుణతురంగాయితశుకాండజాతముల్.—తరుణ=నూతనములయిన, తురంగాయిత=అశ్వములవలె నాచరించుచున్న, శుకాండజాతముల్=శుకములనుపక్షులు; పంజరకారలోన్ = పంజరమనెడుకారాగృహములో; పడకయున్నన్=పడినవికాకుండినయెడ; దీనికి గీతియం దున్న బ్రతుకునే యనుక్రియతో నన్వయము; ముందుచరణములయందు నిట్లే తెలియవలయు; సతతనారాచితసితకాండజాతముల్.—సతత=ఎల్లపుడు, నారాచిత=బాణములుగాఁ జేయఁబడిన, సిత=తెల్లనయిన, కాండజాతముల్=జలజములు, అనఁగాఁబుండరీకములు; కడున్=మిక్కిలి; నిశాతత్వంబున్=తీక్ష్ణత్వమును, రాత్రియొక్కస్వరూపమునని వాస్తవార్థము; కాంచియున్నన్=పొందియున్నయెడ; మధుకాండజాతముల్లలితపత్త్రిబలంబు.—మధుకాండ=వసంతసమయమందు, జాత=ఉదయించిన, ముత్=సంతసముచేత, లలిత = ఒప్పుచున్న, పత్త్రి = పక్షులనెడు, అనఁగా కోయిలలనెడు, బలంబు=సైన్యము; మదిన్ = మనస్సునందు; ఘనభయరేఖన్ = అధికభీతిపరంపరచేత, మేఘమువలననైన భీతిపరంపరచేతనని వాస్తవార్థము; కలఁగకున్నన్ = కలఁతపడకున్నయెడ; తేరైన పృషత్కాండజాతముల్ = రథమయినవాయుసమూహములు; జక్కన్ = బాగుగా; పొదలుచాంచలిన్=ఒప్పుచున్నచాంచల్యముచేత; మూలన్=గొందిని, విదిక్కునందని వాస్తవార్థము; ఒదుఁగకున్నన్=దాఁగకున్నయెడ; సారకాంతాలసాయకాసనము.—సార=శ్రేష్ఠమైన, కాంతాల=చెఱకనెడు, రేఫలకారంబులకభేదమునుబట్టి కాంతారశబ్దము గ్రహింపవలయు, సాయకాసనము=ధనుస్సు; అఖండతాగతిన్ = అభంగత్వమును, ఖండములు కాకుండుటను; భజించియున్నన్= పొందియున్నయెడ; ఈధాత్రిన్=ఈభూమియందు; నవమసారకాంతాలకాపాళి.—నవ=క్రొత్తవైన, మసార=నీలమణులభంగి, కాంత=ఒప్పుచున్న, అలకా=ముంగురులుగలవారియొక్క, అనఁగా స్త్రీలయొక్కయనుట, ఆళి=పంక్తి; ఘోరతావకీనధాటికిన్.—ఘోర=భయంకరమైన, తావకీనధాటికిన్=నీదాడికి; బ్రతుకునే=జీవించునా?

అనఁగా నీయశ్వము లైనచిలుకలు పంజరము లనుకారాగృహమందుఁ బడకయుండి నీబాణము లైనతెల్లదామరలు నిశాతత్వముగాంచి యుండి కోయిలలనుసైన్యములు చిత్తమందు ఘనభయమును బొందకుండి నీరథ మైనమందమారుత మొకమూల నొదుఁగకుండి నీచెఱకువిల్లు తునియలు కాకుండినచో లోకమునందు స్త్రీజనము బ్రతుక దనుట. చిలుకలు పంజరబంధమునుబొందుటయుఁ దెల్లదామరలు రాత్రితత్వము నెఱుంగకుండుటయుఁ గోయిలలు మేఘము

లవలన ఛీతిల్లుటయు వాయువు చంచలమై వాయవ్యమూలయం దొదిగి యుండుటయు నిత్తువు ఖండములగుటయుఁ బ్రసిద్ధము.

క. మదనానాపికకలగితి, మదనాహతనాదరేఖ ♦ మసల నిటులు మ
మ్మదనా యేఁచఁగ నీయెడ,మదనావిలవినుతి నలరి ♦ మన్పవె మదనా. 117

టీ. మదనా = మన్మథుఁడా! మదనానాపికకలగతి మదనాహతస్నాదరేఖ.— మద=మదప్రధానములగు, నానాపిక= అనేకవిధములైన కోకిలములయొక్క, కలగతిమత్= అవ్యక్తమధురప్రకారముగల, అనాహత=అప్రతిహతమగు, నాదరేఖ=ధ్వనిపరంపర; మసలక్=ఒప్పఁగా; ఇటులు=ఈప్రకారముగ; మమ్మున్ ఏఁచక్=మమ్ముబాధించుటకు; అదనా= సమయమా? కాదనికాకువు. ఈయెడక్ = ఇపుడు; మదనావిలవినుతిక్.—మత్ = నాయొక్క, అనావిల = అకలుషమగు, వినుతిక్=స్తోత్రముచేత; అలరి=సంతసించి; మన్పవె= రక్షింపుమా.

సీ. పరమరుత్పరమారి♦పరమారిధర్తయై
కర్తయై వెలయుశ్రీ♦భర్త యుండఁ
బరిణతాసురరాజ♦సురరాజపాళియై
శీలియై తగుతమ్మి♦చూలి యుండ
సముదారశమనాత్మ♦శమనాత్మభారియై
హారియై మించు ద♦క్షారి యుండ
దళితోగ్రబలమాన♦బలమానవాదియై
మోదియై మనుశైల♦భేది యుండ
తే. నకటకట సక్కదంబవై ♦ శాస్తిఁ బొల్చి
చెలఁగుచైత్రికుతోఁ జెల్మి ♦ నలరు టెల్ల
ధరణి నార్యాళిమథనవ♦ర్తనముఁ గాదె
వారి నెవ్వారిఁ గానవే ♦ వారిజాస్త్ర.  118

టీ. పరమరుత్పరమారిపరమారిధర్తయై.—పర=శత్రువులగు, మరుత్పర=దేవవిరోధులగు రక్కసులను, మారి=సంహరించెడు, పరమ=శ్రేష్ఠమగు, అరి=చక్రముయొక్క, ధర్తయై=ధారకుఁడై; కర్తయై=జగత్కర్తయై; వెలయుశ్రీభర్త=ఒప్పుచున్న నారాయణుండు; ఉండక్= ఉండఁగా; పరిణతాసురరాజ సురరాజపాళియై.— పరిణత=మిగులనమ్రమైన, అసుర=రక్కసులు, రాజ=యక్షులు, సురరాజ=దేవశ్రేష్ఠులు, వీరియొక్క, పాళియై=పరంపరగలవాఁడై; శీలియై=సద్వృత్తముగలవాఁడై; తగుతమ్మిచూలి=తగునట్టిబ్రహ్మ; ఉండక్=ఉండఁగా; సము దార

శమనాత్మ శమనాత్మభారియై.—సముదార=మిక్కిలియధికమగు, శమన=యమునియొక్క, ఆత్మ=ధైర్యమునకు, "ఆత్మాదేహమనోబ్రహ్మ స్వభావధృతిబుద్ధిషు" అని విశ్వము, శమన=నాశకమగు, ఆత్మ=బుద్ధిని, భారియై=భరించుచున్నవాఁడై; హారియై=మనోహరుఁడై; మించుదతహారి=అతిశయించుశివుఁడు; ఉండన్=ఉండఁగా; దళితోగ్రబలమాన బలమానవాదియై.—దళిత=నఱకఁబడిన, ఉగ్ర=తీక్ష్ణమగు, బలమాన = సామర్థ్యము గర్వముగల, బలమానవాది=బలాసురుఁడుగలవాఁడై; మోదియై=సంతోషముగలవాఁడై; మనుశైలభేది = ఒప్పుచున్నయింద్రుఁడు; ఉండన్=ఉండఁగా; సత్కదంబవైరాప్తిన్.— సత్కదంబ=మంచి కడుములనెడు సత్పురుషగణములయొక్క, వైరాప్తిన్=విరోధప్రాప్తిచేత; పొల్చి=ఉదయించి; చెలఁగు చైత్రికుతోన్=ఒప్పుచున్న వసంతుఁడనెడుచిత్తరువువ్రాయువానితో; చెల్మిన్=సఖ్యముతోడ; అలరుటెల్లన్=ఒప్పుటంతయు; ధరణిన్ = భూమియందు; నార్యాళిమథనవర్తనకున్.—నార్యాళి ఆర్యాళియనియు విభాగము, ఆర్యాళి = ఆర్యుల సమూహముయొక్క, నార్యాళి=స్త్రీసమూహముయొక్క, మథనవర్తనకున్=మథించువృత్తికి; కాదె=కదా! వారినెవ్వారిఁగానవే = వారినెవరిని జూడవా ? అకటకట=ఖేదము !

అనఁగా నసురసంహారి యగువిష్ణుమూర్తియు సురాసురాదిసేవితుఁడగు బ్రహ్మయు కాలాంతకుఁ డగురుద్రుఁడును బలవైరి యగునింద్రుఁడు నుండఁగా వారితోఁ జెలిమిఁ గాంచక సత్కదంబవైరి యగుచైత్రికునితోఁ జెలిమి గాంచుట భూమియందు నార్యాళిమథనకే కదా యనుట, సత్కులసంపన్నుఁడుగాని చిత్తరువు పనివానితోఁ జెలిమి గాంచుట ఆర్యాళిమథనమునకేయని ధ్వని. వసంతమందుఁ గడంబములు నిలసల్లమి వెనుక వ్రాయంబడిరి.

వ. అని యానారి శంబరారిం దూటి యమ్మారున కెక్కుడై పైఁ జేరుసమీరు నిట్లనియె. 119

టీ. అని=ఇట్లని; ఆనారి=ఆచంద్రిక; శంబరారిన్=మన్మథుని; దూటి = దూషించి; అమ్మారునకున్=ఆమన్మథునకు; ఎక్కుడై=వాహనమై; పైఁజేరుసమీరునిన్ = మీఁదికివచ్చువాయువునుగూర్చి; ఇట్లనియెన్=వక్ష్యమాణప్రకారముగఁ బలికెను.

ఆ. మలయఁ జెంత నీవు • మహి నొప్పపటుతరుల్
సారె వడఁక నెంత • భీరు లనఁగ
నలఁప రాఁగ వల దనిల విజృంభితకోణ
నలపరాగవలద•నలకణాళి. 120

టీ. అనిల=మారుతమా! నీవు; చెంతన్=సమీపమందు; మలయన్=తిరుగుచుండఁగా; మహిన్=భూమియందు; ఒప్పపటుతరుల్ = ఒప్పుచున్నపటువులైన వృక్షములనెడు మిక్కిలి పటుర్థులు; సారెన్=మాటిమాటికి; వడఁకన్=కంపింపఁగా; భీరులు=స్త్రీలనెడుభయపడువారు;

అనఁగన్=అనఁగా; ఎంత = ఎంతటివారు? విజృంభితశోణనలపరాగవలదనలకణాళిన్.— విజృంభిత=వికసించినట్టి, శోణనల=ఎఱ్ఱగలువలయొక్క, పరాగ=పుప్పొడియనెడు, వలత్=తిరుగుచున్న, అనలకణాళిన్=స్ఫులింగపరంపరలచేత; నలఁపన్ = నలఁతపొందించుటకు; రాఁగన్ వలదు=రాఁగూడదు.

అనఁగా నీవు సమీపమున సంచరించుటచేత సమస్తులైనవారే వడఁకుచున్నపుడు మాబోఁటిభీరువు లెంతటివారు? కావునఁ గోకనదపరాగ మనెడు నగ్నికణాళితో నలఁత పొందించుటకు రాఁగూడ దనుట. ఇట దైన్య మనుసంచారిభావము వ్యజ్యమాన మగుచున్నది. "సత్త్వత్యాగాదనౌద్ధత్యం దైన్యంకార్పణ్య సంభవమ్" అని తల్లక్షణము.

సీ. గురుకలకంఠికా♦పరిరక్తిమాధవా
  శయము రాజిలుట గాం♦చంగ లేదొ
  విప్రయోగుల నొంచు♦విధ మూను మాధవా
  పత్యహృద్రీతి చూ♦పట్ట లేదొ
  యనవద్యవసుహారి ♦ యగుచు శ్యామాధవా
  త్మ రహించుటల్ చాలఁ♦దలఁప లేదొ
  యఖిలభృంగాంతర♦వ్యాపృతిమాధవా
  దృతి నిచ్చ చెలరేఁగు ♦ టెఱుఁగ లేదొ
తే. కటకటా యట్టివారితోఁ ♦ గరము నంటు
  గని మలినపంకజాతవా♦నన చిగుర్ప
  ధర సుదృక్పాళి దూలింపఁ♦ దగవె పవన
  కడు ననఘవృత్తిఁ దగునదా♦గతికి నీకు. 121

టీ. పవన=ఓమారుతుఁడా! మాధవాశయము = వసంతునిహృదయము; గురుకలకంఠికాపరిరక్తిన్.—గురుకలకంఠికా=గురుపత్నియందలి, పరిరక్తిన్=ఆసక్తిచేత; అధికములగు కోకిలస్త్రీలయందలి యనురాగముచేత నని వాస్తవార్థము; రాజిలుట=ప్రకాశించుట; కాంచంగ లేదొ=చూడలేదో; విప్రయోగులన్=బ్రాహ్మణతాపసులను, విరహిజనులనని వాస్తవార్థము; నొంచువిధము=అడంచుతీరును; ఊను మాధవాపత్యహృద్రీతి.—ఊను=వహించునట్టి, మాధవాపత్య=కాముని యొక్క, హృద్రీతి=హృదయప్రకారము; చూపట్టలేదొ=అగపడలేదొ. శ్యామాధవాత్మ; శ్యామాధవ=చంద్రుని యొక్క, ఆత్మ=బుద్ధి, శరీరమనియర్థాంతరము; అనవద్యవసుహారి.— అనవద్య=నిర్దుష్టమైన, వసు=సువర్ణమును, హారి=హరించునది, అనవద్యములైన కిరణములచేత మనోహరమైనదని శరీరపరమైనయర్థము; అగుచున్; చాలన్=మిక్కిలి; రహించుటల్=ఒప్పుటలు; తలఁపలేదొ=స్మరింపలేదొ. అఖిలభృంగాంతరవ్యాపృతి= అఖిలములైన తుమ్మెదల హృ

దయవ్యాపారము; మాధవాదృతిన్.—మాధవ=మద్యసంబంధియైన, ఆదృతిన్=ఆదరముచేత; పుష్పరస సంబంధియైన యాదరముచేత ననివాస్తవార్థము; "మధుమద్యేపుష్పరసే" అనియ మరుఁడు; నిచ్చ=ఎల్లపుడు; చెలరేఁగుట=విజృంభించుట; ఎఱుఁగలేదా. కటకటా=కష్టము! ఇట్టివారితోన్=ఈవిధమైన వసంతాదులతో; అంటుగని=సంపర్కముగాంచి; మలినపంకజాతవాసన=మలినమైనపాపకదంబముయొక్క సంస్కారము, నీలోత్పలముల పరిమళమనివాస్తవార్థము; చిగుర్పన్=పల్లవింపఁగా; ధరన్=భూమియందు; సుదృక్పాళిన్=పండితసంఘమును, స్త్రీకదంబమునని యర్థాంతరము; తూలింపన్=తూలఁజేయఁగా; కడునవవృత్తిన్=మిక్కిలిపాపరహితవృత్తిచేత, మిక్కిలి నిర్మలవృత్తిచేత, వాయువు నిర్మలమగుట స్వభావము; తగుసదాగతికిన్=ఒప్పునట్టి సజ్జనగతియగు, ఒప్పునట్టి సదాగమనముగలవానికి, వాయు వెల్లపుడు చరించునది యగుట ప్రసిద్ధము; నీకున్; తగవె=యుక్తమా?

అనఁగాఁ బాపరహితుఁడవగునీవు గురుదారగమనము సేయువసంతుఁడు బ్రహ్మహత్య చేయుమరుఁడు స్వర్ణస్తేయి యగుచంద్రుఁడు మద్యపాయి యగుభృంగము వీరితో సహవాసము మంచిదికా దనుట. "బ్రహ్మహత్యా సురాపానం స్తేయం గుర్వఙ్గనాగమః" అని చెప్పఁబడిన మహాపాతకములుగలవారితో సాంగత్యము చేసిననీకు, "తత్సంయోగీచపఞ్చమః" అని మహాపాతకులలోఁ జేరిక గలుగుఁ గానఁ దత్సహవాసము మాని సుదృక్పాళిని రక్షింపుమని హృదయము.

తే. అంతరమున నటించుపే•రాస మీఱఁ
దోడ్త భజియింతు మాకు సం•తోస మీర
సారెఁ బయిఁ గ్రమ్మి యిప్పు డే•చకు సమీర
ణాంకురాభాంగ మింపుఁ బో•యఁగ సమీర. 122

టీ. సమీర=మారుతుఁడా! అంతరమునన్=ఆత్మయందు; నటించుపేరాస=ఉప్పొంగుచున్న పెద్దయాశ; మీఱన్=మించఁగా; తోడ్తన్=వెంటనె; భజియింతున్=కొల్తును. సంతోసమీర=సంతసమిమ్మురా! సారెన్=మాటికి; పయిన్=మీఁదను; క్రమ్మి=ఆక్రమించి; సమీరణాంకురాభాంగము.— సమీరణాంకుర=మరువపుమొలకయొక్క, ఆభ=కాంతివంటికాంతిగల, అంగము=శరీరము; ఇంపుఁ బోయఁగన్=సొంపువీడునట్లు; ఇప్పుడు; ఏఁచకు=బాధింపకుము.

అనఁగా నామనోరథసిద్ధికాఁగానే నిను భజియించెద నిపుడు బాధింప కనుట.

క. అని యాజలజేక్షణ యిట్లనిలాదులఁ జాల దూఱి • యపుడు కిసలజీ
వనగోవిభుసూను మధుప, వనగోవిభుసూను మధుప•వారము లేఁచన్. 123

టీ. అని=ఇటని; ఆజలజేక్షణ=ఆచంద్రిక; ఇట్లు=ఈప్రకారముగ; అనిలాదులన్=మలయపవనాదులను; చాలన్=మిక్కిలి; దూఱి=దూషించి; అపుడు; కిసలజీవనగోవిభుసూను

మధుపవన గోవిభుసూనుమధుపవారములు.— కిసలజీవన=కోయిలలు, గోవిభుసూను=భూభర్తయగు విష్ణువుకొడుకైనమరుఁడు, మధు=వసంతుఁడు, పవన=మలయానిలము, గోవిభుసూను=సముద్రపుత్త్రుఁడైనచంద్రుఁడు, మధుపవారములు=తుమ్మెదలగుంపులు; ఏఁచన్=బాధింపఁగా; దీనికి ముందుపద్యమందలిచొరఁబాఱులో నగుక్రియలతో నన్వయము.

సీ. వకులాగనవపల్ల♦వకులాలిఁ జొరఁబాఱుఁ
గఱకుకైదువులపై ♦ నుఱుకుపగిది
సుమనోజ్ఞచాంపేయ♦సుమనోరజముఁ దూఱు
ఘోరాగ్నిమండలిఁ ♦ జేరుపగిది
మధుపాదపానూన♦మధుపాళిఁ దిలకించు
ఘనవిషోదక మానఁ ♦ గాంచుపగిది
లతికానికరగౌర♦లతికాంతతతి మున్గు
మించుపెన్నదిఁ బ్రవే♦శించుపగిదిఁ

తే. దోడ్తఁ బలుమాఱు బలుమారు♦దోర్బలమున
నాత్మ వలవంత వలవంత ♦ మగుచు నిగుడఁ
జటులకలనాదకలనాద♦పటలి కలికి
బడలి యారామ యారామ♦పదవి నెనసి. 124

టీ. ఆరామ=ఆచంద్రిక; తోడ్తన్=వెంటనే; పలుమాఱు=సారెకు; బలుమారుదోర్బలమునన్=అధికమగుమదనునిభుజబలము చేత ; ఆత్మన్=హృదయమందు; వలవంత=దుఃఖము; వలవంతము అగుచున్=బలవంతమగుచు, ఇటవబలక భేదము ; నిగుడన్=అతిశయింపఁగా ; చటులకలనాదకలనాదపటలికిన్.—చటుల = చంచలములగు, కలనాద = కోయిలలయొక్క, కల=అవ్యక్తమధురమగు, నాదపటలికిన్=ధ్వనిపరంపరకు; అలికి=భయపడి ; బడలి=అలసి; ఆరామపదవిన్ = తానున్నకేళీమందిరమునుండి యుద్యానవనవీథిని; ఎనసి=చేరి ; వకులాగనవపల్లవకులాలిన్.—వకులాగ=పొగడచెట్లయొక్క, నవ=నూతనమగు, పల్లవకుల=చిగురుజొంపములయొక్క, ఆలిన్=పంక్తిని; కఱకుకైదువులపైన్=తీక్ష్ణములగుశస్త్రములపైని ; ఉఱుకుపగిదిన్=ఉతికెడుతీరున; చొరఁబాఱున్ = ప్రవేశించును. సుమనోజ్ఞచాంపేయసుమనోరజమున్.—సు=మిక్కిలి, మనోజ్ఞ=మనోహరమగు, చాంపేయ=నాగకేసరములయొక్క, సుమనోరజములు=పుప్పొడులను ; ఘోరాగ్నిమండలిన్ = భయంకరమైననిప్పులకుప్పను ; చేరుపగిదిన్=చొచ్చువిధమున; దూఱున్=ప్రవేశించును. మధుపాదపానూనమధుపాళిన్.—మధుపాదప=ఇప్పచెట్లయొక్క, అనూన=అధికమగు, మధు = మకరందముయొక్క, పాళిన్ = సమూహమును; ఘనవిషోదకము=అధికమైనవిషజలమును ; ఆనన్=పానముచేయుటకు ; కాంచుపగిదిన్=చూచునట్లు; తిలకించున్=వీక్షించును, లతికానికరగౌరలతికాంతతతిన్.—లతి

శ్రేణినికర=బండిగురివెందతీవెగుంపులయొక్క, గౌర=శుభ్రములగు, అతికాంతతతిన్=కుసుమనివహమందు; మించుపెన్నదిన్=అతిశయించుపెద్దయేటిని; ప్రవేశింపఁగిదిన్=ప్రవేశించురీతిని; మున్గున్=మునకవేయును.

అనఁగా నాచంద్రిక యట్లు విరహానలసంతప్తయై మనోరథసిద్ధి గామిచే సంతాపమంతంతకు మిక్కుటము కాఁగాఁ దాళఁజాలక తనశరీరమందు విసువు పుట్టి ప్రాణత్యాగమునకై యాయుధప్రాయముగఁ దోఁచువకుళపల్లవాళిఁ బ్రవేశించుటయు, నిప్పులకుప్పగాఁ దోఁచునాగకేసరములపుష్పాశితిప్పలు చేరుటయు, విషజలముగఁ దోఁచునిప్పవూఁదేనియ నానఁ జూచుటయుఁ, బెన్నదిగాఁ దోఁచుబండిగురివెందలపూజొంపముల మున్గుటయు నొనరించె నని భావము. అప్పుడామె కవన్నియుఁ బ్రాణాపాయము సేయఁగల్గు నన్నంత దుస్సహము లైన వని ఫలితార్థము. అవస్థాదశకములోని మరణావస్థ యిందు గదితంబయ్యె. తల్లక్షణతత్కార్యము లిట్లు. "తైస్తైః కృతైః ప్రతీకారై ర్యది న స్యా త్సమాగమః। మరణ స్మరణోద్యోగః కామాగ్నే స్తత్ర విక్రియాః। లీలాశుకచకోరాదిన్యాస స్స్నిగ్ధసఖీకరే। కలకణ్ఠకలాలాపశ్రుతి ర్మన్దానిలాశ్రయః। జ్యోత్స్నాప్రవేశమాకన్దమఞ్జరీవీక్షణాదయః" అని తెలియవలయు.

చ. లలన సమీరధార పొదలన్ బొదలన్ వడిఁ దూఱు శారికా
కులములు మ్రోయఁ జాలఁ గలఁగుం గలఁగుండువడన్ మనంబు గో
ర్కు లెడయ హాయటంచుఁ బలుకుం బలుకుందపుమొగ్గచిల్కుటు
మ్ములు మరుఁ డేయఁ బూనుఁ దరముం దరముం జెలి చెంతఁ జేరినన్.

టీ. లలన=చంద్రిక; సమీరధార=మలయమారుతపరంపర; పొదలన్=ఏపుమీఱఁగా; పొదలన్=నికుంజములను; వడిన్=వేగముగా; తూఱున్=చొచ్చును. శారికాకులములు=గోరువంకలగుంపులు; మ్రోయన్=కూయఁగా; మనంబు=మనస్సు; కలగుండువడన్=ఆకులతపొందఁగా; చాలన్=మిక్కిలి; కలఁగున్=కలఁతఁబొందును. కోర్కులు=మనోరథములు; ఎడయన్=ఎడఁబాయఁగా; హాఅటంచున్ పలుకున్ = హాయనివచించును. బలుకుందపుమొగ్గచిల్కుటమ్ములు.—బలు=అధికములగు, కుందపుమొగ్గ = మొల్లమొగ్గలనెడు, చిల్కుటమ్ములు=అలుఁగుతోఁగూడినబాణములను; మరుఁడు=మన్మథుఁడు; ఏయన్=ఏయఁగా; చెలి=సఖి; చెంతన్ చేరినన్ = సమీపించినను; తరమున్=వేగిరపాటును; దరమున్=భయమును; పూనున్ = పొందును.

వ. ఇట్లు పంచబాణబాణపంచకప్రపంచితవిరహసంతాపంబునం భ్రమించు నమ్మించుఁబోఁడిం దోడ్తెచ్చి మచ్చిక గ్రచ్చుకొన నెచ్చెలిచెలువపిండు లచ్చంపుఁజలువ వెదచల్లు మొల్లవిరిసజ్జ నుంచి ప్రియకథానులాపంబులం బ్రొద్దు గడపునవసరంబున.

టీ. ఇట్లు = ఈప్రకారముగ ; పంచబాణబాణపంచకప్రపంచితవిరహసంతాపంబునన్.—పంచబాణబాణపంచక=కామశరపంచకముచేత, ప్రపంచిత= విస్తరిల్లఁజేయఁబడిన, విరహసంతాపంబునన్=వియోగవేదనచేత, భ్రమింపుచున్మించుఁబోఁడిన్=భ్రమనొందునాచంద్రికను; తోడ్తెచ్చి=తీసికొనివచ్చి; మచ్చికఁగ్రుచ్చుకొనన్=ప్రేమమీఱునట్లుగా ; నెచ్చెలిచెలువపిండులు=ప్రియసఖీవర్గములు; అచ్చంపుఁజలువన్=మంచిచల్లఁదనమును; వెదచల్లుమొల్లవిరిసజ్జన్=వ్యాపింపఁజేయుమొల్లపూలపాన్పునందు ; ఉంచి; ప్రియకథానులాపంబులన్=ఇష్టకథలుచెప్పుటచేత; ప్రొద్దుగడపువసరంబునన్=ప్రొద్దుపుచ్చునప్పుడు. దీనికిముందుపద్యముతోనన్వయము.

చ. కనికర మింత లేక సమ♦కాండుఁడు శ్యామ నలంప వేఁడ్కఁ జ
క్కనికర హేతిధారఁ గలఁ♦గన్ ఘటియింపఁగఁ బాడి గాదు మా
కని కర మాత్మఁ దత్పరత ♦ నందుచుఁ జయ్యన నేఁగె నప్డు లో
కనికరతాపహారి యుడు♦కాంతుఁడు వారిధినేతఁ జేరఁగన్. 127

టీ. అసమకాండుఁడు=మరుఁడనుసూర్యుఁడు ; శ్యామన్=చంద్రికయనురాత్రిని ; కనికరము=దయ; ఇంతలేక=ఇంచుకైనలేక; వేడ్కన్=సంతసముచేత; అలంపన్ = శ్రమపెట్టఁగా: చక్కనికరహేతిధారన్=మంచికిరణములనెడుఖడ్గధారచేత; కలఁగన్=కలఁతఁబాఱునట్లు; ఘటియింపఁగన్=చేయుటకు; మాకున్; పాడిగాదు=ధర్మముగాదు. అని=ఇట్లుతలఁచి; కరము=మిక్కిలి; ఆత్మన్=చిత్తమందు; తత్పరతన్=ఆసక్తిని ; అందుచున్=పొందుచు ; అప్డు ; లోకనికరతాపహారి=లోకములసమూహమునకు తాపము శమింపఁజేయునట్టి; ఉడుకాంతుఁడు = చంద్రుఁడు; వారిధినేతన్ = సముద్రరాజును; చేరన్=పొందుటకు; చయ్యనన్ = శీఘ్రముగా; ఏగెన్=పోయెను.

సూర్యుఁడు రాత్రిని బాధించినట్లు మరుఁడు చంద్రికను బాధించుచుండఁగా మనము బాధించుట ధర్మము గాదని చంద్రుఁడు లోకతాపమును బోఁగొట్టువాఁడు గాన దయ దలఁచి పశ్చిమసముద్రముఁ జేరఁ బోయె నని భావము. చంద్రుఁ డస్తమించె నని ఫలితము. గమ్యోత్ప్రేక్షాలంకారము.

క. ఆరామ కపుడు శుభవా,ర్తారాగతిఁ దెలిపె నొక్క♦తరుణి వరకళా
వారనిశాంత మితవు నలు, వార నిశాంతమితిరహిత♦హారివిభవమున్.

టీ. అపుడు;ఆరామకున్=ఆచంద్రికకు; వరకళావారనిశాంతము.—వర=శ్రేష్ఠములగు, కళా=విద్యలయొక్క,వార=సంఘమునకు, నిశాంతము=నెలవగు; ఒక్కతరుణి=ఒకస్త్రీ; ఇతవు=కూరిమి; నలువారన్=ఒప్పుగా; నిశాంతమితిరహితహారివిభవమున్.—నిశాంత=ప్రాతఃకాలము

యొక్క, మితిరహిత=అమితమగు, హారివిభవముఁ=మనోహరమైనసమృద్ధిని; శుభవాగ్ధారాగతిఁ=మంచిమాటలవరుసచేత; తెలిపెఁ.

ఇట నుండి సూర్యోదయసమయవర్ణన మారంభింపఁబడుచున్నది.

చ. వెలసెఁ బదాయుధార్భటులు • వింటివె యోయధరానులిప్తసా
విలసిత పుష్కరారి పృథి•వీపతి పాంథపరాళి గెల్చి తా
విలసితపుష్కరాధిపన•వీనపురేశముఁ జేరఁగాఁ జనన్
దొలుత నుషోభటధ్వనిత•దుస్తరకాహళికాధ్వనుల్ బలెన్. 129

టీ. ఓయధరానులిప్తసావిలసిత = అధరమందుఁబూయఁబడిన యకలుషమగుచక్కెరగలయోచంద్రికా! చక్కెరవంటిపెదవిగలదానాయనుట. పుష్కరారిపృథివీపతి = చంద్రుఁడనెడురాజు; పాంథపరాళిఁ=విరహులనెడుశత్రువులపంక్తిని; గెల్చి=జయించి; తాఁ=విలసితపుష్కరాధిపనవీనపురేశముఁ.—విలసిత = ప్రకాశించుచున్న, పుష్కరాధిప=సముద్రమనెడు, నవీన = నూతనమగు, పురేశముఁ = నగరశ్రేష్ఠమును; చేరఁగాఁ=పొందుటకు; చనఁ=పోవుచుండఁగా; తొలుతఁ = మొదల ; ఉషోభటధ్వనితదుస్తరకాహళికాధ్వనుల్ బలెఁ.—ఉషోభట=ప్రభాతమనెడుభటునిచేత, ధ్వనిత=మ్రోఁగింపఁబడిన, దుస్తర=అధికమైన, కాహళికాధ్వనుల్ బలెఁ=బూరగలధ్వనులవలె; పదాయుధార్భటులు=కుక్కుటధ్వనులు; వెలసెఁ=విలసిల్లెను. వింటివె.

అనఁగా నొకరాజు శత్రువులను గెలిచి నూతనపురప్రవేశముఁ జేయుచుండఁగా భటులు సేయుకాహళీధ్వనులు వెలయుభంగిఁ జంద్రుఁడు పాంథులఁ గుందించి పశ్చిమాంబురాశిఁ జేరఁ బోవుచుండఁగాఁ గుక్కుటధ్వనులు వెలసె ననుట. రూపకాలంకారము.

మ. స్ఫురదాజాండఘటి న్నిశాతపపయ•స్సుల్ పేరఁ బూర్వావనీ
ధరగోపాలతనూజమాళి గని దో•డ్తం జంద్రమండంబు వా
పి రహిం దద్దధిఖండ మూనె నన నొ•ప్పెం గంటివే ప్రాగ్దిశా
ధర గోపాలతనూజ వాసవహరి•త్ప్రద్యావిలాసాబ్జమై. 130

టీ. స్ఫురదాజాండఘటిఁ.—స్ఫురత్=ప్రకాశించుచున్న, అజాండ=బ్రహ్మాండమనెడు, ఘటిఁ=ఘటమందు; నిశాతపపయస్సుల్=వెన్నెలయనుక్షీరములు ; పేరఁ=ఘనీభవింపఁగా; పూర్వావనీధరగోపాల తనూజమాళి=తూర్పుకొండయనెడు శ్రీకృష్ణుండు; కని=చూచి; తోడ్తఁ=వెంటనే; చంద్రమండంబు = చంద్రుఁడనుమీఁగడను; "మండందధిభవమ్మస్తు" అని యమరుఁడు; వాపి=కాఁచేవి; రహిఁ=ఆసక్తిచేత; తద్దధిఖండము=ఆపెరుఁగుగడ్డను; ఊనెనన్=వహించెనన్నట్లు; ప్రాగ్దిశాధర=పూర్వదిక్సీమ, కర్త్రి); వాసవహరిత్ప

ద్మావిలాసాబ్జమై.—వాసవహరిత్పద్మా=ప్రాచీలక్ష్మికి, విలాసాబ్జమై=లీలారవిందమై; ఒప్పెన్=ప్రకాశించెను. గోపాలతనూజ=రాజపుత్త్రివగుచంద్రికా! కంటివే=చూచితివా?

అనఁగా బ్రహ్మాండమనెడు ఘటమందు వెన్నెలయను పాలు పేరి చంద్రుఁడు దానిపై మీఁగడవలెనుండఁగా నుదయపర్వతమనెడు శ్రీకృష్ణుఁడు చంద్రుఁడను నామీఁగడను మ్రింగి చేతఁబుచ్చుకొన్న యాపేరిన పెరుఁగుగడ్డను బోలియు పూర్వదిక్కనెడు లక్ష్మికి విలాసార్థమైన పద్మమును బోలియుఁ బ్రాగ్దిశావని విలసిల్లెనని భావము. తూర్పున సూర్యోదయ సంబంధియైన తెలిచాయతోఁచెనని ఫలితార్థము. రూపకసంకీర్ణస్వరూపోత్ప్రేక్షాలంకారము.

మ. ఘనమిత్త్రైకవసుప్రతానముల రా•గ శ్రీ గొనం గజ్జలా
భ నఘవ్రాతము చేర గేహకుముదా• ప్తగ్రావధామద్యుధా
మనదీపాళికఁ దాన మంద శుచితం • బాటిల్లె నాఁ బాండిమల్
మన దీపాళి కదా నమందగుణసీ•మా మించె నీక్షింపవే. 131

టీ. అమందగుణసీమా = అధికములైన గుణములకు మేరయైనదానా! దీపాళిక = దీపములచాలు; ఘనమిత్త్రైకవసుప్రతానములన్.—ఘన=శ్రేష్ఠములగు, మిత్త్ర=సఖునియొక్క, సూర్యునియొక్క, ఏక=ముఖ్యమగు, వసుప్రతానములన్=ధనములగుంపులను, కిరణముల గుంపులను; రాగశ్రీన్=లోభసమృద్ధిచేత, శోణకాంతిచేత; కొనన్=హరింపఁగా; కజ్జలాభన్=కాటుకకాంతిచేత; అఘవ్రాతము=పాపసంఘము; చేరన్=పొందఁగా; గేహకుముదాప్తగ్రావధామద్యుధామనదీపాళికన్.—గేహ=గృహసంబంధులగు, కుముదాప్తగ్రావ= చంద్రకాంతమణులయొక్క, ధామ=కాంతియనెడు, ద్యుధామనదీ=స్వర్గంగయొక్క, పాళికన్ = ప్రదేశమందు; "పాళిస్త్ర్యశ్ర్యంకపఙ్క్తిషు" అని యమరుఁడు; తానము=అవగాహనమును; అందన్=పొందఁగా; శుచితన్=శుద్ధతచేత; పాటిల్లెనాన్=ఒప్పెననునట్లు; పాండిమల్=తెల్లఁదనములు; మనన్=వర్ధిల్లఁగా; తాన్; మించెన్=అతిశయించెను. ఈక్షింపవే=చూడుమా.

అనఁగా సూర్యుఁడనుమిత్త్రునికిరణములను ధనములను హరించి నందున మషీరూపముగాఁ దత్పాపము గలుగఁగా గృహచంద్రకాంతధామస్తోమమనుగంగాప్రవాహములో దీపావళి స్నానము చేయఁగా గతకల్మషయై వర్తించినట్లు తెల్లనికాంతులతో రాజిల్లెనని భావము. ప్రభాతమున దీపములు కాంతిహీనములయ్యెనని ఫలితము. స్వర్ణస్తేయాదులు చేసినవారు గంగాస్నానము చేయఁగాఁ దత్పాపమోచన మగుట ప్రసిద్ధము. సూర్యుండు దనకాంతిని రాత్రి యగ్నియందుంచి పోవునని యాగమసిద్ధము, "రుచిధామ్ని భర్తరి భృశం విమలాః పరలోకమభ్యుపగతే వివిశుః। జ్వలనం త్విషః కథమివేతరథా సులభో న్యజన్మని స ఏవ పతిః" అని మాఘకావ్యమున వర్ణింపఁబడినది.

మ. తనుమధ్యా గను రోదసిం గముచుజ్యో•త్స్నావల్లికల్ కల్యహా
తనికాయాహతిఁ దూలఁ ద్రెళ్ళఁ దొలుతం • బాదప్రసూనవ్రజం

బనవద్యామృత పూరపూరితనవో•దారప్రసూనవ్రజం
బన డిందెక్ శశి పత్త్రిమండలరవం•బుల్ గ్రమ్మె నల్దిక్కులన్. 132

టీ. తనుమధ్యా=ఓచంద్రికా! రోదసిన్=ద్యావాభూములయందు; కముచుజ్యోత్స్నా వల్లికల్ = క్రమ్మినట్టివెన్నెలయనుతీవలు ; కల్యవాతనికాయాహతిన్.—కల్య = ప్రభాతమనెడు, వాత=వాయువులయొక్క, నికాయ=సంఘముయొక్క, ఆహతిన్=కొట్టుటచేత; తూలన్=నేలఁబడఁగా; తొలుతన్=మొదలనే; తారప్రసూనవ్రజంబు=నక్షత్రముల నెడు పువ్వులగుంపులు; ప్రె క్కెన్ = వ్రాలెను. శశి=చంద్రుఁడు; అనవద్యామృతపూరపూరిత నవోదార ప్రసూనవ్రజంబు.—అనవద్య=శ్రేష్ఠమగు, అమృత=సుధయొక్క, పూర=ప్రవాహము చేత,పూరిత=నింపఁబడినట్టి, నవ=నూతనమై, ఉదార=ఉత్కృష్టమైన, ప్రసూనవ్రజంబు=ఫలములగుంపు; "ప్రసూనంపుష్పఫలయోః" అని నామలింగానుశాసనము; అనన్= అనునట్టుగా;డిందెన్=పడెను.

అనఁగా వెన్నెల యనులతలు ప్రభాత మనువాతముచేఁ దూలఁగా రిక్క లనుపువ్వులు చంద్రుఁ డనుపండ్లగుంపు వ్రాలి పోయె నని భావము. అపుడు వెన్నెలయు రిక్కలును చంద్రుఁడును పోయె నని ఫలితము.

మ. అలపెన్ వేగురుఁజుక్క పేరియతి దీ•వ్యత్పాండుభాభూతి మైఁ
జెలువారంగఁ దరోర్జితస్థితి వియ•త్సీమం జనం గంటివే
చెలువా రంగదరోర్జితస్థితిదినా•స్యైకసంధ్యాంశుకూ
టలసచ్చాటిక తన్మనుస్ఫురణ వెం•టన్ బర్వెఁ జిత్రంబుగన్. 133

టీ. చెలువా=ఓచంద్రికా! అలపెన్ వేగురుఁ జుక్క పేరియతి = ఆపెద్దవేగుఁ జుక్కయనెడుసన్యాసి; దీవ్యత్పాండుభాభూతి=ప్రకాశించుచున్న తెల్లనికాంతియనెడు భస్మము; మైన్=దేహమందు; చెలువారంగన్ = ఒప్పఁగా; తరోర్జితస్థితిన్.—తరః=వేగముచేత, అర్జిత=ఆర్జింపఁబడిన, స్థితిన్=సత్త్వచేత; వియత్సీమన్=గగనదేశమందు; చనన్=పోఁగా; తన్మనుస్ఫురణన్=ఆయన మంత్రసామర్థ్యముచేత; రంగదరోర్జిత స్థితిదినాస్యైక సంధ్యాంశుకూటలసచ్చాటిక.—రంగత్=ఒప్పుచున్న, అర=చెఱఁగులయొక్క,అంచులయొక్కయనుట, ఊర్జితస్థితి = అధికస్థితిగల, ఇదిశాటికయం దన్వయించును, దినాస్యైయ = ప్రభాతసంబంధియగు, ఏక=ముఖ్యమగు, సంధ్యాంశు = సంధ్యాకాంతుల నెడు, కూట = సమూహముగల, లసత్ = ఒప్పుచున్న, శాటిక = కాషాయవస్త్రము; చిత్రంబుగన్ = ఆశ్చర్యమగునట్లు; పర్వెన్ = వ్యాపించెను.

అనఁగా వేగురుఁజుక్కయనెడుయతి తెల్లనికాంతి యనెడుభస్మ పూసికొని వేగముగఁ బోఁగా నాయనమంత్రసామర్థ్యమునఁ దదీయశాటివలె నెఱ్ఱనికాంతిపుంజము ప్రసరించె నని

భావము. సూర్యోదయమునకు ముందు వేగుఁజుక్క పోయినవెనుక నెట్టినికాంతి ప్రసరించెనని ఫలితము.

మ. ననుచున్ మోదము కోకవిప్రతతి చం॥ద్రద్యోతరాజీవలో
కన మెల్లన్ జన జోడు గూడి నిలువం॥ గంగొమ్ము రాజీవలో
కనికారేక్షణ నాళభూమివరసం॥ఘాతంబు రాజీవలో
కన మాకుళ్యము జాఱ మేలుకనియెన్॥గాసారశయ్యాస్థలిన్. 134

టీ. రాజీవలోకనికారేక్షణ.—రాజీవలోక = మత్స్యగణమును, నికార=తిరస్కరించు, ఈక్షణ=చూపులుగలదానా! కోకవిప్రతతి=చక్రవాకములను బ్రాహ్మణులగుంపు; చంద్రద్యోతరాజీవలోకనము.—చంద్రద్యోత=వెన్నెలయొక్క, రాజీ=పంక్తియొక్క, వలోకనము=దర్శనము; ఎల్లన్=అంతయు; చనన్=పోఁగా; జోడుగూడి = జతగూడి; నిలువన్=నిలిచియుండఁగా; నాళభూమివరసంఘాతంబు=బిసములను రాజులగుంపు; రాజీవలోకనమాకుళ్యము=పద్మములనెడు లోచనములయొక్క నిమీలనము; జాఱన్=పోఁగా; కాసారశయ్యాస్థలిన్=కొలఁకనెడుపాన్పుపైని; మేలుకనియెన్=మేల్కాంచెను. కంగొమ్ము=చూడుము. మోదము=సంతసమును; ననుచున్=వృద్ధిఁ బొందించును.

అనఁగా విప్రులు జతగూడి యెదుట నిలిచి యుండఁగా రాజబృందము పాన్పుపై నిద్ర లేచి కన్నులు దెఱచినట్లు కొలఁకులయందుఁ జక్రవాకములు జతగూడి యెదుట నుండఁగా బిసములు పద్మములను వికసింపఁ జేసె ననుట. అపుడు పద్మములు వికసిల్లె ననియు వానియెదుటఁ జక్రవాకమిథునము లుండె ననియు భావము. "కన్యా గౌ ర్భేరి శబ్దం దధి ఫలకుసుమం పావకం దీప్యమానం యానంవా విప్రయుగ్మమ్" అనుటచేత విప్రయుగ్మ దర్శనము మంగళ మని రాజు లట్లొనరించుట ప్రసిద్ధము.

మ. అమలాంగీమణి కాంచు వేళ యనునై॥జాప్తాళి మేల్ నేర్పునం
గమలాగారముఁ దా రయాత్మ నలరం॥గావింపఁ గా నచ్చటం
గమలాగార ముదారసంబు మదిఁ బొం॥గం గొల్వు గూర్చుండె ను
త్తమభృంగీమిషగాయికావితతి గీ॥తవ్రాతముల్ పాడఁగన్. 135

టీ. అమలాంగీమణి=ఓచంద్రికా! కమలాగార=పద్మాలయయగు లక్ష్మీదేవి; వేళ యను నైజాప్తాళి.—వేళయను=ప్రభాతసమయమను, నైజ=స్వీయమగు, ఆప్తాళి=సఖీవర్గము; మేల్ నేర్పునన్=మంచిచాతుర్యముచేత; కమలాగారమున్=పద్మమనుగృహమును; తాన్; రయాత్మన్=వేగిరపడుచిత్తముచేత; అలరన్=ఒప్పునట్లు; కావింపఁగాన్=చేయఁగా; అచ్చటన్=అచ్చోటను; ఉత్తమభృంగీమిషగాయికావితతి=శ్రేష్ఠమగు నాఁడు తుమ్మెదలనెడు నెపముగల గానము చేయు స్త్రీలగుంపు; గీతవ్రాతముల్=అనేకములగుపాటలను; పాడఁగన్=పాడుచుం

డగా; ముదారసంబు=సంతోషరసము; మదిన్=మనమునందు; పొంగన్= ఉప్పొంగఁగా ; కొల్వుగూర్చుండెన్=కొలువై యుండెను.

అనఁగాఁ బ్రభాతవేళ యనెడు చెలియు కమల మనెడుగృహము నొప్పునట్లొనరింపఁగా నందు లక్ష్మీదేవి కొలువై యుండె ననియు నచట వాఁడుతుమ్మెదలు మ్రోయుచుండఁగా గాయకస్త్రీలు గానము సేయున ట్లుండె ననియు భావము. కమలములు వికసింపఁగానె యందు సిరి యొప్పారు ననుట తెల్లము.

చ. హరినిలయంబు తూర్పుదెస•యై మనుటన్ సమయాఢ్యవాళి వి
స్ఫురితతదంతికోచ్ఛ్రతర•పూర్వబలాహకకూట భూరిగో
పురమునఁ గైశ్యగుప్తసమ•పూర్వబలాహకకూటభూరిగో
వరమిషరీతి నిల్పె ననివా•ర్యమణీకలశంబుఁ గాంచితే. 136

టీ. కైశ్యగుప్తసమపూర్వ బలాహకకూట=కొప్పుచే రక్షింపఁబడిన క్రొత్తమబ్బుగ మిగలదానా! మబ్బుకన్న మిన్నయగు నీలిమగల కొప్పుగలదానా యనుట; హరినిలయంబు=ఇంద్రునివాసస్థానమైనపురము; తూర్పు దెసయై=తూర్పుదిక్కై; మనుటన్=వర్ధిల్లుట చేత; సమయాఢ్యవాళి=ప్రాతఃకాలమనెడు ప్రధానశ్రేష్ఠుఁడు; స్ఫురితతదంతి కోచ్ఛ్రతరపూర్వ బలాహకకూట భూరిగోపురమునన్.—స్ఫురిత=ప్రకాశించుచున్న, తదంతిక=ఆనగరసమీపమునందలి, ఉచ్ఛ్రతర=మిగులగొప్పదియైన, పూర్వబలాహక=పూర్వపర్వతముయొక్క, కూట= శిఖరమనెడు, భూరి=స్వర్ణమయమగు, గోపురమునన్=ఊరివాకిటియందు; "పురద్వారంతుగోపురమ్" అనియమరుఁడు; భూరిగోవరమిషరీతిన్.—భూరి=అధికమగు, గోవర=సూర్యుఁడనెడు, మిషరీతిన్=వ్యాజప్రకారము చేత ; అనివార్యమణీ కలశంబున్.— అనివార్య=నివారింపనలవిగాని, అధికమైనయనుట, మణీకలశంబున్=మణిమయమగుకలశమును ; నిల్పెన్=ఉంచెను. కాంచితే=చూచితివా ?

అనఁగా సూర్యుఁ డుదయించె ననియు నతఁ డుదయగిరిశిఖరముననుండినవాఁడై తూర్పున నున్నయింద్రపురిద్వారముపైఁ బ్రాతఃకాల మనెడుప్రధానునిచే నిలుపఁబడినమణికలశముసు బోలి యుండె ననియు భావము.

తే. అనుచుఁ జెలి విన్నవింప న•య్యంబుజాక్షి
చాపుసుమశయ్య డిగ్గి త•త్సమయకృత్య
మెల్లఁ గావించి గురు భజి•యించి రవికు
లోత్తము వరియించుతలఁపుఁ గోరు•చుండె నంత. 137

కృత్యము=ఆప్రాతఃకాలోచితమగు కార్యమును; ఎల్లన్=అంతయు; కావించి=చేసి; గురున్ భజియించి=గురుసేవ చేసి; అంతన్=అటుతర్వాత; రవికులోత్తంసున్=సూర్యవంశీయుఁడ గుసుచంద్రుని; వరియించుతఱిన్=పెండ్లియాడుసమయమును; కోరుచున్ ఉండెన్=అది యెపుడు ఘటిల్లునో యని ప్రార్థించుచుండె నసుట.

## ఆశ్వాసాంత పద్యములు.

మ. సతతానందితనంద నందనవనీ•సంచారజాగ్రత్ప్రియో
ద్ధతకౌతూహలకంద కందసుషమో•దారాంగసాక్షాత్క్రియా
రతినందన్ముచికుంద కుందరదనా•రత్నాంఘ్రిలాక్షాంకగుం
భితవక్షస్త్విడమంద మందరధరా•భృద్భూరిభారాంచితా. 138

టీ. సతతానందితనంద=ఎల్లపుడు సంతసింపఁజేయఁబడిన నందుఁడుగలవాఁడా! నందనవనీసంచార జాగ్రత్ప్రియోద్ధతకౌతూహలకంద.—నందనవనీసంచార=నందనవన సంచారము చేత,జాగ్రత్=నిస్తంద్రమైన,ప్రియా=సత్యభామయొక్క, ఉద్ధత=మిక్కుటమగు,కౌతూహల=సంతసమునకు, కంద=కారణమగువాఁడాయనుట; కందసుషమోదారాంగ సాక్షాత్క్రియా రతినందన్ముచికుంద.—కంద=మేఘముయొక్క, సుషమా=పరమశోభవంటి శోభ చేత, ఉదార=ఉత్కృష్టమగు, అంగ=శరీరముయొక్క, సాక్షాత్క్రియా=ప్రత్యక్షకరణమందలి, రతి=ఆసక్తి చేత, నందత్=సంతసించుచున్న, ముచికుంద=ముచికుందుఁడను భక్తుఁడుగలవాఁడ! కుందరదనారత్నాంఘ్రి లాక్షాంకగుంభిత వక్షస్త్విడమంద.—కుందరదనారత్న=స్త్రీరత్నమగు లక్ష్మీదేవియొక్క, అంఘ్రిలాక్షాంక=పాదయావకచిహ్నముల చేత; గుంభిత=కూర్పఁబడిన, వక్షః=ఉరముయొక్క, త్విట్=కాంతి చేత, అమంద=అధికుఁడయినవాఁడా! మందరధరా భృద్భూరిభారాంచితా = మందరాచలముయొక్క యధికమగుభారము చేత నొప్పెడివాఁడా! ఈకృతిపతి సంబోధనములకు నుత్తరపద్యములందలి తత్సంబోధనములకు నాశ్వాసాంతగద్యముతో నన్వయము. ముక్తపద గ్రస్తమను శబ్దాలంకారము.

క. చక్రప్రహరణ రక్షశ్చక్రప్రహరణవిహార•సారంగద్వి
ణ్ణక్రప్రమథన జ్ఞానా, వక్రప్రమథనతశంభు•వర్ణితవిభవా. 139

టీ. చక్రప్రహరణ = చక్రమేయాయుధముగాఁగలవాఁడా! రక్షశ్చక్రప్రహరణవిహార=రాక్షస సమూహముయొక్క సంహారమేవిహారముగాఁగలవాఁడా! సారంగద్విణ్ణక్రప్రమథన.—సారంగద్విట్=గజద్వేషియగు, నక్ర=ముసలికి, ప్రమథన=సంహర్తయగువాఁడా! జ్ఞానావక్రప్రమథనత శంభువర్ణితవిభవా.—జ్ఞాన=జ్ఞానము చేక, అవక్ర=సరళులగు, ప్రమథ=ప్రమథుల చేత, నత=నమస్కరింపఁబడిన, శంభు=శివుని చేత, వర్ణిత=వర్ణింపఁబడిన, విభవా=వైభవముగలవాఁడా! శివుఁడు విష్ణువల్లభుఁడు గానఁ దద్విభవమును గొని యాడు నసుట.

ఉత్సాహ. వారణప్రభూతదంత•వైరిదోర్విసారణా
సారణాంకమానిరాజ•చక్రతోషకారణా
కారణప్రభాతిఘోర•కంసమల్లమారణా
మారణద్దనుప్రభూత•మండలీనివారణా. 140

టీ. వారణప్రభూతదంతవైరిదోర్విసారణా.—వారణ=కువలయాపీడముయొక్క, ప్రభూత=గొప్పలగు, దంత=దంతములకు, వైరి=శత్రువులగు, దోర్విసారణా = భుజప్రసారణము గలవాఁడా! సారణాంకమానిరాజచక్రతోషకారణా.—సార=శ్రేష్ఠమగు, ణ=జ్ఞానమె,అంక=చిహ్నముగాఁగల, మానిర్రాజచక్ర=మునిరాజమండలియొక్క, తోష=సంతోషమునకు, కారణా=హేతువైనవాఁడా! "ణంసరోజదశేజ్ఞానేత్రిషుని స్తలవస్తుని" అని రత్నమాల; కారణప్రభాతిఘోరకంసమల్లమారణా.—కారణ=కరణసంబంధియగు, ప్రభా=కాంతిచేత,అతిఘోర=మిగులభయంకరుఁడగు, కంసమల్ల=చాణూరునకు,మారణా=సంహర్తయైనవాఁడా! మారణద్దనుప్రభూతమండలీనివారణా.—మా=లక్ష్మిచేత, రణత్=ధ్వనించుచున్న, సంపత్సమృద్ధులైనయనుట, దనుప్రభూత=దనుజులయొక్క, మండలీ=గుంపునకు, నివారణా=నివారకుఁడా!పాదసంధియమకవిశేషము.

గద్యము. ఇది శ్రీమదనగోపాలప్రసాదసమాసాదితోభయభాషాకవిత్వ కళాకళత్ర రేచెర్లగోత్రపవిత్ర సురభిమల్లక్ష్మాపాలసత్పుత్ర కవిజనవిధేయ మాధవరాయ ప్రణీతం బైన చంద్రికాపరిణయం బనుమహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.



గద్యము. ఇది శ్రీసతీరమణకరుణాసమాసాదితసర్వసౌభాగ్య భాగ్యనగర మహారాజ్యసంకలిత శ్రీజటప్రోలు సంస్థానప్రాజ్యసకలసామ్రాజ్య శ్రీ రేచెర్ల గోత్రపవిత్ర కవిజనగేయ శ్రీ వేంకటజగన్నాథరాయ సత్పుత్త్రి సత్సంప్రదాయ శ్రీసురభివేంకటలక్ష్మణరాయ పరిపోష్య సరసవైదుష్య తదాస్థానతలమండిత శేషసదాశివపండిత విరచిత శరదాగమ సమాఖ్యవ్యాఖ్యయందుఁ జతుర్థాశ్వాసము.



శ్రీయైనమః.

శ్రీలక్ష్మీనరసింహాయనమః.

# చంద్రికాపరిణయము, సవ్యాఖ్యానము

## పంచమాశ్వాసము.



క. సుభగంభావుకఘనకౌ,స్తుభ సాధ్వవనసహాకృత్వ◆దుర్దమచక్రా
ప్రభవాసురసర్వంకష, విభవమ్మన్యప్రతాప◆వృత గోపాలా. 1

టీ. సుభగంభావుకఘనకౌస్తుభ.—సుభగంభావుక = మనోజ్ఞమగు, ఘనకౌస్తుభ = ఉత్కృష్టమగుకౌస్తుభమణిగలవాఁడా! సాధ్వవన సహాకృత్వదుర్దమచక్రా —సాధు=సత్పురుషులగుమున్యాదులయొక్క, అవన=రక్షణమందు, సహాకృత్వ=సహాయమగు, దుర్దమచక్రా=దుర్దాంతమగుచక్రముగలవాఁడా! ప్రభవాసురసర్వంకషవిభవమ్మన్యప్రతాపవృత.—ప్రభవ=సమర్థులగు, అసుర=రాక్షసులకు, సర్వంకష=నాశకమగు, విభవమ్మన్య=విభవము నుగాఁదన్నుదలఁచెడి, ప్రతాప=పరాక్రమము చేత, వృత = కూడుకొన్నవాఁడా! గోపాలా=శ్రీమదనగోపాలస్వామీ! ఈ కృతిపతిసంబోధనమున కుత్తరపద్యస్థమగు చిత్తగింపుమనుక్రియతో నన్వయము.

తే. చిత్తగింపుము శౌనకా◆ద్యుత్తమర్షి, సమితి కిట్లను రోమహ◆ర్షణతనూజుఁ
డువిద తద్రాజచంద్రైక◆వివరిషావి,ధానపాణింధమాత్మ చేఁ◆దనరునపుడు. 2

టీ. చిత్తగింపుము=అవధరింపుము. శౌనకాద్యుత్తమర్షిసమితికిన్=శౌనకుఁడు మొదలుగాఁగలమహర్షిసంఘమునకు; ఇట్లు=వక్ష్యమాణప్రకారముగా; రోమహర్షణతనూజుఁడు=సూతుఁడు; అనున్=వచించెను. ఉవిద=చంద్రిక ; తద్రాజచంద్రైకవివరిషావిధానపాణింధమాత్మచేన్.—తద్రాజచంద్ర=ఆసుచంద్రునియొక్క, ఏక=ముఖ్యమగు, వివరిషా=వరియించునిచ్ఛయొక్క, విధాన=ప్రకారమునకు, పాణింధమ=జ్ఞాపకమగు, "ఉగ్రమ్పశ్యేరమ్మదపాణింధమాశ్చ" దీననీరూపమగు, ఆత్మచేన్=మానసము చేత; తనరునపుడు=ఒప్పుసమయమందు. దీనికుత్తరపద్యస్థక్రియతో నన్వయము.

మ. సుతతారుణ్యశుభోదయస్థితి తద◆స్తోకాశయాలంబితే
హితము న్బోటులచే నెఱింగి తదమూ◆ల్యేష్టార్థసంసిద్ధికై
చతురత్వంబునఁ దత్స్వయంవరవిధిన్ ◆ జాటింపఁ బంచెన్ భట
ప్రతతి న్స్వేక్షణదోదయేశ్వరుఁ డతి◆ప్రహ్లాత్తిలిప్తాత్ముఁడై. 3

టీ. క్షణదోదయేశ్వరుఁడు = క్షణదోదయరాజు ; అతిప్రహ్లత్తిలిప్తాత్ముఁడై=అత్యానంద ముచేఁ బూయఁబడినచిత్తము గలవాఁడై, సుతతారుణ్యశుభోదయస్థితిన్.—సుత = కొమా ర్తె యగుచంద్రికయొక్క, తారుణ్య=యౌవనముయొక్క, శుభోదయ = శుభమగునావిర్భావము యొక్క, స్థితిన్ = సత్తను ; తదస్తోకాశయాలంబితేహితమున్.—తత్=ఆచంద్రికయొక్క, అస్తోక=అధికమగు, ఆశయ=అభిప్రాయమందు, "అభిప్రాయశ్ఛన్ద ఆశయః" అని అమ రుఁడు, ఆలంబిత=లగ్నమగు, ఈహితమున్ = కోరికను ; బోటులచేన్=స్త్రీలచేత; ఎఱిం గి=తెలిసి; తదమూల్యేష్టార్థసంసిద్ధికై.—తత్=ఆచంద్రికయొక్క, అమూల్య=వెలలేని, ఇష్టార్థ= మనోరథముయొక్క, సంసిద్ధికై = ప్రాప్తికొఱకు ; ఒతురత్వంబునన్ = చాతుర్యము చేత ; తత్స్వయంవరవిధిన్.—తత్ = ఆచంద్రికయొక్క, స్వయంవర = స్వయంవరముయొక్క, విధిన్=విధానమును; చాటింపన్ = చాటించుటకై; భటప్రతతిన్.—భట=బంట్లయొక్క, ప్రతతిన్=సమూహమును; వే=శీఘ్రముగ; పంచెన్ = ఆజ్ఞాపించెను.

క్షణదోదయరాజు తనకొమార్తె యగుచంద్రికయొక్క యిష్టార్థమును ఆపెయౌవనా విర్భావమును స్త్రీలవలనఁ దెలిసికొని స్వయంవరమునకై యత్నించి చాటింప భటులం బంచెనని భావము.

మ. ధరణీనాథభటచ్ఛటాముఖరితో◆ద్యచ్చంద్రికైకస్వయం
వరకర్ణేజపడిండిమాదికమహా◆వాదిత్రనాదంబు దు
స్తరమై యత్తఱిఁ బొల్చె నద్భుతగతి ◆ సప్తార్ణవీమధ్యభూ
వరకోటీపుటభేదనౌఘవిశిఖా◆వల్గుప్రఘాణంబులన్. 4

టీ. ధరణీనాథభటచ్ఛటాముఖరితోద్యచ్చంద్రికైకస్వయంవరకర్ణేజపడిండిమాదిక మ హావాదిత్రనాదంబు.—ధరణీనాథ = క్షణదోదయునియొక్క, భటచ్ఛటా = బంట్లగుంపుచే, ముఖరిత=మ్రోయింపఁబడినట్టియు, ఉద్యత్ = ప్రకాశించుచున్నట్టియు, చంద్రికా=చంద్రిక యొక్క, ఏక = ముఖ్యమైనట్టి, స్వయంవర = స్వయంవరోత్సవమునకు, కర్ణేజప = సూచక మగు, ఇచట "స్తమ్బకర్ణయోారమిజపోః" అనిప్రత్యయము, "తత్పురుషేకృతిబహుళ" మని విభక్తిలోపము లేదు, డిండిమాదిక=డిండిమము మొదలుగాఁగల, మహావాదిత్ర = అధిక మగునాతోద్యముయొక్క, "వాదిత్రాతోద్యనామక" మని యమరుఁడు, నాదంబు=ధ్వని; సప్తార్ణవీమధ్యభూవరకోటీపుట భేదనౌఘవిశిఖావల్గుప్రఘాణంబులన్.—సప్తార్ణవీ=సప్తసము ద్రములయొక్క, సప్తానా: మర్ణవానాం సమాహారః అను విగ్రహమునందు "అకారాంతో త్తరపదోద్విగుస్త్రియామిష్టః" అను వార్తికమువలన స్త్రీత్వము, టిడ్ఢాణఞిత్యాదిసూత్రమువలన స్త్రీప్రత్యయము వచ్చినదనియెఱుంగునది, మధ్య=మధ్యభాగమునందున్న, భూవర=రాజుల యొక్క, కోటీ=సమూహముయొక్క, పుటభేదన = పట్టణములయొక్క, ఓఘ=సంఘముయొ క్క,విశిఖా=రాజమార్గములందలి, వల్గు=సుందరమగు, ప్రఘాణంబులన్=అళిందములయందు; అద్భుతగతిన్=ఆశ్చర్యకరమగురీతిచేత; దుస్తరమై = అధికమైనదై ; అత్తఱిన్=ఆసమయ మందు; పొల్చెన్=ఒప్పెను.

క్షుణదోదయరాజభటులచే మ్రోయింపఁబడినస్వయంవరసూచకమగుడిండిమారవము సప్తసముద్రమధ్యముననుండు భూపతులప్రఘాణంబులందు నొప్పెనని భావము. రాజధానుల యందంతటను డిండిమములు మ్రోయించిరని ముఖ్యాశయము.

మ. శ్రవణాభ్యుత్సవపోషయిత్నుసముదం•చద్భూరిభేరీసము
ద్భవభాంకారము లప్డు మేల్కొన నదభ్ర•ప్రావృషేణ్యాంబుదా
రవభంగి న్సుమకాండకోదయసమ•గ్రత్వంబు చాలం దలం
ప విచిత్రం బొకొ చిత్తవీథి నవనీ•పశ్రేణికిం జేరుటల్. 5

టీ. శ్రవణాభ్యుత్సవపోషయిత్నుసముదంచద్భూరిభేరీసముద్భవభాంకారములు.—శ్రవణ=వీనులకు, అభ్యుత్సవ=ఆనందమును, పోషయిత్ను=పోషించు, సముదంచత్ = మిక్కిలి యొప్పుచున్న, భూరి=విశాలమగు, భేరీ=దుందుభులవలన, సముద్భవ=పుట్టిన, భాంకారములు=భాంకారధ్వనులు; అప్డు=ఆసమయమందు; మేల్కొనన్=మేలుకొనఁగా; అదభ్రప్రావృషేణ్యాంబుదారవభంగిన్.—అదభ్ర=అధికమగు, ప్రావృషేణ్య=వర్షాకాలమందుఁబుట్టిన, "ప్రావృషఏణ్యః" అని ఏణ్యప్రత్యయము, అంబుద=మేఘములయొక్క, ఆరవ=ధ్వనులయొక్క, భంగిన్=రీతిచేత ; సుమకాండకోదయసమగ్రత్వంబు.—సుమకాండక = పుష్పసంఘముయొక్క, ఉదయ=ఆవిర్భావముయొక్క, సమగ్రత్వంబు = పరిపూర్ణత; నవనీపశ్రేణికిన్.—నవ=నూతనమగు, నీప=కడిమిచెట్లయొక్క, శ్రేణికిన్=పంక్తికి; చేరుటల్ = పొందుటలు; చిత్తవీథిన్=హృదయమందు; చాలన్=మిక్కిలి; తలంపన్=ఆలోచింపఁగ; విచిత్రంబొకో=విచిత్రమా? యనికాకువు. ఇచట అవనీపశ్రేణికిన్.—అవనీప=రాజులయొక్క, శ్రేణికిన్=సమూహమునకు; సుమకాండకోదయ సమగ్రత్వంబు.—సుమకాండక=పూఁదూపులుగలవలరేనియొక్క, ఉదయ=ఆవిర్భావముయొక్క, సమగ్రత్వంబు=పరిపూర్ణత; చేరుటలు చిత్రముకాదనిస్వభావార్థము.

అనఁగా వర్షాకాలికమేఘగర్జితశ్రవణము కాఁగానే కడిమిలకుఁ గుసుమములు గలిగినట్లు స్వయంవరోత్సవసూచకమగు భేరీనినాదము చెవిసోఁకగానే భూపతులకు మన్మథావేశము గలిగె నని భావము.

చ. కమలశరుండు ప్రాప్తకట•కాముఖవైఖరి నిక్షుచాపప
ర్యము గొని గూర్చుబంభరగు•ణారవ మెంతయు నాత్మనాద్వితీ
యమయి యెసంగ దేశవసు•ధాధిపముఖ్యపురీలలామబృం
దములఁ జెలంగెఁ దత్పటహ•నవ్యగభీరనినాద మత్తఱిన్. 6

టీ. తత్పటహనవ్యగభీరనినాదము.—తత్=ఆస్వయంవరోత్సవసంబంధియగు, పటహ=వాద్యవిశేషముయొక్క, నవ్య=నూతనమగు, గభీర=గంభీరమగు, నినాదము=ధ్వని; అత్తఱిన్=ఆసమయమందు; కమలశరుండు=మదనుఁడు; ప్రాప్తకటకాముఖవైఖరిన్.—ప్రాప్త=పొందఁబడిన, కటకాముఖ=నడిమివ్రేళ్లసందున బొటనవ్రేలు చొప్పించి యుఱచేతివాయ వ్రాల్చ

యుంగరపుఁ వ్రేలిని చిటికెనవ్రేలిని నించుకంత వంచి పొడవుగా పట్టినహ స్తవిశేషముయొక్క, వైఖరిచే=రీతిచేత; ఇక్షుచాపవర్యము = చెఱకువింటిని; కొని = గ్రహించి; కూర్పుబంభరగు ణారవము = జతపఱచుతుమ్మెదయల్లెత్రాటిమ్రోఁత; ఎంతయున్=మిక్కిలి; ఆత్మనాద్వితీయ ముఅయి = తనచేతరెండవదై; "ఆత్మనశ్చపూరణే" అని తృతీయకులుక్కులేదు; ఎసంగన్=అతిశయింపఁగ; వసుధాధిపముఖ్యపురీ లలామబృందములన్.—వసుధాధిప = రాజుల యొక్క, ముఖ్యపురీలలామ = రాజధానీశ్రేష్ఠములయొక్క, బృందములన్ = సమూహముల యందు; చెలంగెన్=ఒప్పెను.

మ. మునుతాత స్తతలోకవాగమృతసం•భూతిం గడుం జంద్రికా
వనితామోహముఁ గాంచి మన్మథశర•జ్వాలావళిం గుందువి
శ్వనరాధీశ్వరకోటికిం ద్వర యిడె • న్స్వాంతప్రియంభావుకా
తనుతద్ఘోషము తత్స్వయంవరముఁ జెం•దం బోవ నప్పట్టునన్. 7

టీ. మును=పూర్వమందు; తాత స్తతలోకవాగమృతసంభూతిన్.—తాత స్తత=అక్క డక్కడనుండివచ్చిన, ఇచట "తతఅగతః" అని అణ్ప్రత్యయము "అవ్యయానాం భమాత్రే టిలోపః" యని టిలోపము వచ్చినది, లోక=జనులయొక్క, వాగమృత=అమృతమువంటి వచనమువలన, సంభూతిన్=పుట్టుకగల; కడున్=అధికముగ ; చంద్రికావనితామోహము.— చంద్రికావనితా=చంద్రికయను పేరుగల స్త్రీయందలి, మోహమున్=వలపును ;కాంచి=పొంది; మన్మథశరజ్వాలావళిన్.—మన్మథశర=మరుతూపులయొక్క, జ్వాలా=మంటలయొక్క, ఆవళిన్=బంతిచే; కుందువిశ్వనరాధీశ్వరకోటికిన్.—కుందు = పరితపించు, విశ్వనరాధీశ్వర = ప్రపంచమునందుండురాజులయొక్క, కోటికిన్=సమూహమునకు, స్వాంతప్రియంభావుకాతనుతద్ఘోషము.—స్వాంత=హృదయములకు, ప్రియంభావుక=ప్రియమగు, అతను = అధికమగు, తద్ఘోషము=ఆస్వయంవరసూచకమగు భేరీనాదము; తత్స్వయంవరమున్=ఆచంద్రికాస్వయంవరమును; చెందన్ పోవన్=చేరఁబోవుటకు; అప్పట్టునన్=ఆసమయమందు; త్వర=వేగిరపాటును; ఇడెన్=ఇచ్చెను.

అనఁగా నచ్చటచ్చటనుండి వచ్చుచున్న జనులవలన క్షీణపోదయరాజకుమారికయగుచంద్రికయొక్కచక్కఁదనమువిని వలపుచెందియుండిన రాజు లాచంద్రికాస్వయంవరోత్సవసూచకమగు భేరీనినాదమును విని సంతసించి యాస్వయంవరోత్సవమునకుఁ బోవనుద్యమించిరని భావము.

మ. వరభంభాకులనిస్వనప్రతతి స•ద్వావామావతంసస్వయం
వరభద్రోన్నతి యెయ్యెడ న్దెలిసె నో • వైశంబె యువ్వేళ న
వ్వరతిశ్రీగతి నేగఁ గాఁ దొడఁగె వి•శ్వోర్వాట్కులం బొర యు
ర్వ్వర నేమంచు నుతింప వచ్చు జలజా•స్త్రస్ఫీతమాయావిధిన్. 8

టీ. వరభంభాకలనిస్వనప్రతతిన్.—వర=శ్రేష్ఠమగు, భంభాకల=భంభయనుధ్వని సమూహముగల, నిస్వన=ధ్వనులయొక్క, ప్రతతిన్=సమూహముచేత; అవ్యాజావతంసస్వయంవరభద్రోన్నతి.—అవ్యాజావతంస=వాగ్శ్రేష్ఠ యగునాచంద్రికయొక్క, స్వయంవరభద్ర=స్వయంవరమంగళముయొక్క, ఉన్నతి=అతిశయము; ఎయ్యెడన్=ఏసమయమందు; తెలిసెనో; వైళంబె=శీఘ్రముగ; అవ్వేళన్=ఆసమయమందు; నవ్యరతిశ్రీగతిన్.—నవ్య=నూతనమగు, రతి=అనురాగముయొక్క, శ్రీ=సంపదయొక్క, అనఁగ నను రాగాతిశయముయొక్క యనుట, గతిన్=ప్రాప్తిచేత; విశ్వారాట్కులంబు=నరపతిసమూహము; "విశ్వస్యవసురాటోః" అను సూత్రమువలన, విశ్వశబ్దమునకు దీర్ఘమని తెలియునది; ఏగఁగాన్=పోవుటకు; తొడఁగెన్=ప్రయత్నించెను. ఔర=ఆశ్చర్యము! జలజాస్త్రస్ఫీతమాయావిధిన్.—జలజాస్త్ర=మన్మథుని యొక్క, స్ఫీత=అధికమగు, మాయావిధిన్=మాయావిధానమును; ఉర్వరన్=పుడమియందు; ఏమంచున్=ఏమనుచు; నుతింపవచ్చున్=కొనియాడవచ్చును?

అనఁగ స్వయంవరోత్సవసూచకమగు భేరీనినాదము విని నతోడనే నరపతిసంఘము చంద్రికయం దనురాగముఁ బూని యాయుత్సవమునకుఁ బోవ నుపక్రమించిరి. మన్మథునిమాయ నేమని కొనియాడవచ్చునని భావము.

చ. నెలఁత వరించుఁ దమ్మిదియె • నిక్క మటంచుఁ దలంచి వేడుక
న్గలసి పయోజబాణజయ•కారణరూపసహాయత న్విరా
జిలుసకలాంతరీపనృప•శేఖరు లెల్లఁ బ్రయాతుకాము లై
వెలలిరి దంతిచక్రపద•వీతిపదాతిసమూహసంవృతిన్. 9

టీ. నెలఁత=చంద్రిక; తమ్మున్; వరించున్=కోరును. ఇదియెనిక్కము=ఇదియే నిశ్చయము. అటంచున్=ఆప్రకారమనుచు; తలంచి=ఎంచి; వేడుకన్=సంతసముచేత; కలసి=పెనఁగి; పయోజబాణజయకారణరూపసహాయతన్.—పయోజబాణజయ=మన్మథజయమునకు, కారణ=హేతువగు, రూప=సౌందర్యముయొక్క, సహాయతన్=సహాయత్వముచేత; విరాజిలుసకలాంతరీపనృపశేఖరులెల్లన్.—విరాజిలు=ప్రకాశించుచున్న, సకల=సమస్తమగు, అంతరీపనృపశేఖరులు=ద్వీపాంతరాధిపతు లగురాజశ్రేష్ఠులు; ఎల్లన్=అందఱును; ప్రయాతుకాములై=పోనిచ్ఛగలవారయి; "తుంకామమనసోరపి" యనుదానివలన తుమున్నకారమునకు లోపమని యెఱుంగునది; దంతిచక్రపదవీతిపదాతిసంవృతిన్.—దంతి=ఏనుఁగులయొక్క, చక్రపద=రథములయొక్క, వీతి=గుఱ్ఱములయొక్క, పదాతి=కాల్బలములయొక్క, సంవృతిన్=కూడికచేతను; వెలలిరి=బైలుదేఱిరి.

అనఁగ నీచంద్రిక మమ్మేవరించు ననినమ్మి సంతసముతో మన్మథునినిరసించుసౌందర్యముగలసకలద్వీపాధిపతు లగురాజులు సేనలతోఁ గూడి వెడలి రని భావము.

మ. సకి యెవ్వాని వరించిన న్నిజశితాఁస్త్రవ్యాజవాతంధయా
ళికిఁ దజ్జీవసమీరపానమును హాఁళి న్జేర్చి యాతామ్రకం
జకర న్గైకొని వత్తు మంచుఁ దలఁ పెఁచ్చన్ గొంద ఱుర్వీశపు
త్త్రిక లేతెంచిరి లేఖవర్ణ్యపృతనాఁవ్రాతంబు సేవింపఁగన్. 10

టీ. కొందఱుర్వీశపుత్త్రికలు=కొంతమందిరాజకుమారులు: సకి=చంద్రిక, ఎవ్వానిన్=ఎవనిని; వరించినన్=కోరినను; నిజశితాస్త్రవ్యాజవాతంధయాళికిన్.—నిజ = తమసంబంధులగు, శిత=తీక్ష్ణములయిన, అస్త్ర=బాణములను, వ్యాజ=కపటముగల, వాతంధయ=సర్పములయొక్క, ఆళికిన్=సమూహమునకు; తజ్జీవసమీరపానమును.—తత్=వారలయొక్క, జీవసమీర=ప్రాణవాయువులయొక్క, పానమును=త్రాఁగుటను; హాళిన్=ఆసక్తిచే; చేర్చి=కూర్చి; ఆతామ్రకంజకరన్=ఎఱ్ఱదామరవంటిహస్తముగల యాచంద్రికను; కైకొని=తీసికొని; వత్తుమంచున్=వత్తుమని ; తలఁపు=కోరిక; ఎచ్చన్=అతిశయింపఁగ; లేఖవర్ణ్యపృతనావ్రాతంబు.—లేఖ=దేవతలచే, వర్ణ్య=పొగడఁదగిన, పృతనా=సేనయొక్క, "పృతనానీకినీచమూః" అని యమరుఁడు; వ్రాతంబు=సమూహము; సేవింపఁగన్=కొలువఁగ; ఏతెంచిరి=వచ్చిరి.

అనఁగఁ గొందఱు రాజపుత్త్రికలు చంద్రిక యెవని వరించినను వాని ప్రాణవాయువులను మాబాణములను సర్పములకుఁ ద్రాగించియనఁగా వానిని హింసించి యయినను నాచంద్రికను దీసికొని వత్తు మని స్వయంవరోత్సవమునకు ననేకసేనలతోఁ గూడి యేతెంచి రని భావము.

చ. సొగసు చెలంగ నప్డు శతశోమణిభూషణభూషితాంగులై
యగణితహస్తిరాజవృతిఁ నంచితభద్రగజాధిరూఢులై
ద్విగుణితహర్షయుక్తి నరుఁదెంచిరి కొందఱు దేశవల్లభుల్
నగకుచ నన్యదీయఁగఁ దఁనర్పదు మద్రమ యంచు నెంచుచున్. 11

టీ. కొందఱుదేశవల్లభుల్=కొందఱుదేశాధిపతులు; సొగసు=అందము ; చెలంగన్=ప్రకాశింపఁగా; అప్డు=ఆసమయమందు; శతశోమణిభూషణ భూషితాంగులై.—శతశః= అనేకప్రకారములగు, మణిభూషణ=రత్నభూషణములచేత, భూషిత=అలంకరింపఁబడిన, అంగులై=శరీరములుగలవారై; అగణితహస్తిరాజవృతిన్.—అగణిత=లెక్కపెట్టుట కలవిగాని, హస్తిరాజ=గజశ్రేష్ఠములయొక్క, వృతిన్=ఆవృతిచేత ; అంచిత భద్రగజాధిరూఢులై.—అంచిత=ఒప్పుచున్న, భద్ర=భద్రజాతిగల, గజ=ఏనుఁగులను, అధిరూఢులై=ఎక్కినవారై; ద్విగుణితహర్షయుక్తిన్.—ద్విగుణిత=రెట్టింపఁబడిన, హర్ష=ఆనందముయొక్క, యుక్తిన్=సంబంధముచేత; నగకుచన్=గుబ్బలులవంటిపాలిండ్లుగల చంద్రికను; మద్రమ.—మత్=నాయొక్క, రమ=సంపద; అన్యదీయఁగన్=ఇతరసంబంధినియైనదానినిఁగ; తనర్పదు=చేయదు. అంచున్=అని; ఎంచుచున్=తలఁచుచు ; అరుదెంచిరి=వచ్చిరి.

అనఁగఁ గొందఱు దేశాధిపతులు బహువిధభూషణాలంకృతులై అనేకగజములతోఁ గూడి భద్రగజముల నెక్కి సంతసముతో చంద్రికను మావిభవంబు మఱియొకనిని గోర నియ్యదని యెంచుచు వచ్చి రనిభావము.

మ. మఱియున్ వచ్చిరి దేశనాయకులు భా♦మామంగళస్ఫూ ర్తి న
త్తఱి వీక్షింప సురేంద్రనీలరథసం♦తానంబుపై నెక్కి శ్రీ
మెఱయ న్వారిధరాళిపైఁ దగుధరా♦మిత్రుల్ బలె న్వేడుకల్
దొఱయ న్సంగరపారదృశ్వబలసం♦దోహంబుతోఁ జయ్యనన్. 12

టీ. దేశనాయకులు=దేశాధిపతులు; సురేంద్రనీలరథసంతానంబుపైన్.—సురేంద్రనీల=ఇంద్రనీలమణిమయములగు, రథ=స్యందనములయొక్క, సంతానంబుపైన్=సమూహముమీఁద; ఎక్కి=అధిష్ఠించి; శ్రీ=సంపద; మెఱయన్=ప్రకాశింపఁగ; వారిధరాళిపైన్.—వారిధర=మేఘములయొక్క, ఆళిపైన్=బంతిమీఁద; తగుధరామిత్రుల్ బలెన్= ఒప్పుచున్నపర్వతశత్రువులగు నింద్రులవలెనె; వేడుకల్=సంతోషములు; దొఱయన్=కలుగఁగ; సంగరపారదృశ్వబలసందోహంబుతోన్.—సంగర=యుద్ధముయొక్క, పారదృశ్వ=అంతమునుగన్నవారియొక్క, అనఁగ రణపండితులయొక్కయనుట, బల=సేనలయొక్క, సందోహంబుతోన్=సమూహముతోడ; చయ్యనన్=శీఘ్రముగ; అత్తఱిన్ = ఆసమయమందు; భామామంగళస్ఫూర్తిన్.—భామా = చంద్రికయొక్క, మంగళ=స్వయంవరరూపమగు మంగళముయొక్క, స్ఫూర్తిన్=అతిశయమును; వీక్షింపన్=చూచుటకు; మఱియున్=ఇంకను; వచ్చిరి.

అనఁగ మఱియుం గొందఱు నరపతులు ఇంద్రనీలమణిమయములగురథముల నెక్కి మేఘపంక్తిపై నెక్కిన యింద్రులవలెఁ బ్రకాశించుచుఁ జంద్రికాస్వయంవరోత్సవమును జూచుటకై సేనలతోఁ గూడి వచ్చిరని భావము.

చ. మొనసినయెక్కుచక్కఁదన♦ముం నెఱినీటును మించ మోదపూ
ర్తి నపుడు వచ్చురాజసుత♦బృందము గన్గొన నయ్యె మారు నొ
క్కనిఁ గని యుబ్బు లచ్చిపయి♦గాటపుటీసు భజించి ధాత్రి నూ
తనవనజాస్త్రకోటుల ను♦దారమహాత్మతచే సృజించె నాన్. 13

టీ. ధాత్రి=భూమి; మారున్=మన్మథుని; ఒక్కనిన్=ఒకనిని; కని=ప్రసవించి; ఉబ్బులచ్చిపయిన్=సంతసించులక్ష్మీదేవిపై; గాటపుటీసున్.—గాటపు=గాఢమగు, ఈసున్=అసూయను; భజించి=పొంది; నూతనవనజాస్త్రకోటులన్=అభినవమన్మథకోటులను; ఉదారమహాత్మతచేన్.—ఉదార=ఉత్కృష్టమగు, మహాత్మతచేన్=మహిమచేత; సృజించెనాన్=సృష్టిచేసెనోయనునటులు; మొనసిన యెక్కుచక్కఁదనమున్.— మొనసిన=కలిగిన, ఎక్కు చక్కఁదనమున్=అధికమగునందమును; నెఱినీటును=నిండినమురిపెమును; మించన్=అతిశయిం

పఁగ; మోదపూ ర్తిన్.—మోద=సంతోషముయొక్క, పూర్తిన్=పరిపూర్ణతచేత; అపుడు= ఆస మయమందు; వచ్చురాజసుతబృందము=ఏతెంచురాకొమరులగుంపు; కన్గొనన్=చూచుటకు; అయ్యెన్=అయెను.

కలిమిజవరా లొకవూవిలుకానిని గని విజ్ఞులెఁగఁగాఁ బుడమి యొలచ్చిపై యీసున నెన్నిక లేని క్రొత్తవూవిలుకాండ్రను గనెనో యనునటులు చక్కఁదనమున మించు పెక్కు రాకొమరు లేతెంచి రని భావము. ఇందు నుత్ప్రేక్షాలంకారము.

మ. జగతీమార్గము లెల్ల నిండి యిసుము ♦ ల్చల్లన్ ధరం జేర న
ట్టుగ నేతెంచిరి రాజపుత్త్రకులు నీ♦టుల్ మీఱ నప్పట్టునన్
జగదంధంకరణాఢ్యసైన్యవిధుత♦క్ష్మాధూళిమేఘాళికిన్
మిగుల న్గర్జలఁ గూర్ప మర్దళజధిం♦ధిమ్యార్భటీపేటికల్. 14

టీ. జగతీమార్గములు=భూమార్గములు; ఎల్లన్=అంతయు; నిండి=కప్పుకొని; ఇసుముల్= ఇసుకలు: చల్లన్=వెదచల్లఁగ; ధరన్=భూమిని; చేరనట్టుగన్=పొందనట్టుగా; రాజపుత్త్రకులు; రాకొమరులు; నీటుల్ మీఱన్=మురిపెములతిశయింపఁగ; అప్పట్టునన్ = ఆసమయమందు; జగదంధంకరణాఢ్యసైన్యవిధుతక్ష్మాధూళి మే ఘాళికిన్.—జగత్=లోకమునకు, అంధంకర ణ=అంధ్యమును జేసెడి, ఆఢ్య=సంపన్నమగు, సైన్య = సేనచే, విధుత=ఎగురఁగొట్టఁబడిన, క్ష్మాధూళి=భూపరాగమనెడు, మేఘాళికిన్=మేఘపంక్తికి; మిగులన్=మిక్కిలి; మర్దళ జధిం ధిమ్యార్భటీ పేటికల్.—మర్దళజ=మద్దెలవలనఁబుట్టిన, ధింధిమ్యార్భటీ = ధింధిమియను ధ్వను లయొక్క, పేటికల్=బృందములు; గర్జలన్ = గర్జాధ్వనులను; కూర్పన్=జతపఱుపఁగ; ఏతెంచిరి=వచ్చిరి.

అనేక రాకొమరులు భూమార్గములెల్ల నిసుక చల్లినను గ్రిందఁబడనియటులునిండుకొని వారలసైన్యపరాగ మను మేఘాళికి మద్దెలధ్వనులు గర్జారావము లగుచుండఁగా నేతెంచి రని భావము.

చ. వనితస్వయంవరోత్సవము ♦ వాసిగఁ గన్గొన వచ్చు భూమికాం
తనికర మప్డు దోఁచెఁ గరి♦నాయకపాళులపై నిజైకతై
క్ష్ణ్యనియతి మాని చల్లఁదన ♦ మంది మహోదయశైలకోటులన్
దినముఖవేళఁ జూడఁ బడు♦దీధితిరాజసమూహమై ఖరిన్. 15

టీ. వనిత స్వయంవరోత్సవము=చంద్రికాస్వయం వరోత్సవమును; వాసిగన్=బాగు గ; కన్గొనన్=చూచుటకు; వచ్చుభూమికాంతనికరము=వచ్చుచున్న రాజబృందము; అప్డు= ఆసమయమందు; కరినాయకపాళులపైన్=గజబృందములమీఁద; నిజైకతైక్ష్ణ్యనియతిన్.— నిజ=తమసంబంధియగు, ఏక=ముఖ్యమగు, తైక్ష్ణ్య = తీక్ష్ణభావముయొక్క, నియతిన్ = నియమ

మును; మాని=విడిచి; చల్లఁదనము=శీతస్వభావమును; అంది=పొంది; మహోదయశైలకోటులన్=ఉదయగిరిశిఖరములందు; దినముఖవేళన్=ఉదయకాలమందు; చూడఁబడుదీధితిరాజసమూహవైఖరిన్.—చూడఁబడు=కనఁబడుచున్న, దీధితిరాజసమూహ=సూర్యసమూహముయొక్క, వైఖరిన్=రీతిచేత; తోఁచెన్=కానిపించెను.

అనఁగా నాకలికిస్వయంవరోత్సవమునకు నేనుఁగులపై నెక్కియేతెంచుపుడమిఱేఁడు లపుడు తీక్ష్ణభావముమాని చల్లఁదనంబవలంబించి పొడుపుఁగొండకొనలపైఁ జూపట్టుదినముఖసూర్యబింబములపగిదిఁ గాన్పించి రని భావము. గజబృందముల నధిష్ఠించియున్న రాజబృందములను ఉదయగిరిశిఖరగతభానుమూర్తులనఁగా నుత్ప్రేక్షించుటచే వస్తూత్ప్రేక్షాలంకారము.

మ. నెఱి నంకాంచితమూర్తు లందఱు కళానీకైకరోచిష్ణు లం
దఱు సత్పాలనదక్షు లందఱు దగన్ శ్యామాభిరామాత్ము లం
దఱు గానం బఱతెంచురాసుతులు నేత్రప్రీతి చేకూర్చి ర
త్తఱి నానా నన విశ్వరూపగతిచేతం దోఁచుచంద్రస్థితిన్. 16

టీ. పఱతెంచు రాసుతులు = వచ్చుచున్న రాకొమరులు; అందఱు = ఎల్లరును; నెఱిన్ = క్రమముగా ; అంకాంచితమూర్తులు.—అంక = రాజచిహ్నములచేత, అంచిత = ఒప్పుచున్న, మూర్తులు=శరీరముగలవారు; "మూర్తిః కాఠిన్యకాయయోః" అని యమరుఁడు; అంకాంచితమూర్తులు.—అంక = కలంకముచేత, అంచిత = ఒప్పుచున్న, మూర్తులు = దేహములుగలవా రనిచంద్రపరమైనయర్థము ; అందఱు = ఎల్లరును ; కళానీకైకరోచిష్ణులు.—కళానీక = విద్యాసమూహముచేత, ఏక = ముఖ్యముగా, రోచిష్ణులు = ప్రకాశించువారు; కళానీకైకరోచిష్ణులు.—కళానీక= షోడశకళాసముదాయముచేత, ఏక=ముఖ్యముగా, రోచిష్ణులు = ప్రకాశించువారు ; అందఱు = ఎల్లరును ; సత్పాలనదక్షులు.—సత్ = సత్పురుషులయొక్క, పాలన = పరిపాలనమందు, దక్షులు = సమర్థులు ; సత్పాలనదక్షులు.—సత్ = నక్షత్రములయొక్క, పాలన = పరిపాలనమందు, దక్షులు = సమర్థులని చంద్రపరమైనయర్థము; అందఱు = ఎల్లరును; తగన్ = ఒప్పునట్లు ; శ్యామాభిరామాత్ములు.—శ్యామా = స్త్రీలకు, అభిరామ = మనోజ్ఞమగు, ఆత్ములు = దేహములుగలవారు; శ్యామాభిరామాత్ములు.—శ్యామా = రాత్రులయందు, అభిరామ = ప్రకాశించుచున్న, ఆత్ములు = శరీరములుగలవా రనిచంద్రపరమైనయర్థము; కానన్ = కావుటవలన ; ఆత్తఱిన్ = అప్పుడు ; విశ్వరూపగతిచేతన్ = సమస్తరూపములపొందుటచే; తోఁచు చంద్రస్థితిన్.—తోఁచు = కనిపించుచున్న, చంద్రస్థితిన్ = చంద్రునియొక్క సత్తచేత ; ఔనౌనన్ = ప్రశంసించునట్టులు; నేత్రప్రీతి = చక్షుఃప్రీతిని; చేకూర్చిరి = ఒదవించిరి.

అనఁగా స్వయంవరోత్సవమునకుఁ బఱతెంచు రాసుతు లెల్లరు బహురూపములను ధాల్చిన చంద్రునిపగిదిఁ జూపఱకు నేత్రానందము నొసర్చిరని భావము.

చ. వనజశరు న్హసించుపరు•వంపువిలాసము లేనివాఁడు నూ
తనవరరత్నభూషణవి•తానము దాల్పనివాఁ డుదారపా
వనబలయుక్తి రాజిలని•వాఁ డొకఁడైన నయారె తోఁపఁ డ
య్యె నపుడు పన్నిదంబున కి•లేశసుతావళిలోనఁ గన్గొనన్. 17

టీ. ఇలేశసుతావళిలోనన్=రాసుతులగుంపునందు; అపుడు=ఆసమయమందు; వనజశరున్=మన్మథుని; హసించుపరువంపువిలాసము.—హసించు=నవ్వుచున్న, పరువంపు=నూతనమగు, విలాసము=అందము; లేనివాఁడు=లేనట్టివాఁడు; నూతనవరరత్నభూషణవితానము.—నూతన=నవీనమగు, వర=శ్రేష్ఠమగు, రత్నభూషణ=మణిమయభూషణములయొక్క, వితానము=సమూహము; తాల్పనివాఁడు=ధరింపనివాఁడు; ఉదారపావనబలయుక్తిన్.—ఉదార=ఉత్కృష్టమగు, పావన=వాయుదేవునిసంబంధియగు, బల=సత్త్వముయొక్క, యుక్తిన్=యోగముచేత; రాజిలనివాఁడు=ప్రకాశింపనివాఁడు, వాయువుతో సమమైనబలము లేనివాఁడని భావము; పన్నిదంబునకున్ = పందెమునకైన; కన్గొనన్= చూచుటకు; ఒకఁడైనన్=ఒక్కఁడైనను; తోఁపఁడయ్యెన్=కనఁబడఁడాయెను.

అనఁగ నాస్వయంవరోత్సవమునకు నేతెంచియున్న రాసుతులలో నొకఁడైనను మన్మథునినిరసించునందము లేనివాఁడును మణిభూషణములను ధరింపనివాఁడును మారుతునకు సమమైనబలము లేనివాఁడును బందెమునకైన లేఁడని భావము.

చ. శరజహితాన్వయేంద్రుఁడు సు•చంద్రధరాధిపచంద్రుఁ డప్పుడ
త్తరుణిస్వయంవరోత్సవవి•ధానము దా విని త న్వరించుఁ బో
హరిమణివేణి యంచు ముద • మాంతరవీథికఁ గందళింపఁ గి
న్నరవిభుఁ డాత్మసఖ్యకల•న న్వెనుపాయక కొల్వ వే తగన్. 18

టీ. శరజహితాన్వయేంద్రుఁడు.—శరజహితాన్వయ=సూర్యవంశమునకు, ఇంద్రుఁడు=అధిపతియగు; సుచంద్రధరాధిపచంద్రుఁడు=సుచంద్రుఁడను పేరుగల రాజచంద్రుఁడు; అప్డు=ఆసమయమందు; తత్తరుణి స్వయంవరోత్సవ విధానము.—తత్తరుణి = ఆ చంద్రికయొక్క, స్వయంవరోత్సవ = స్వయంవరోత్సవముయొక్క, విధానము = ప్రకారమును ; తాన్—సుచంద్రుఁడు; విని=ఆకర్ణించి; తన్=తన్ను; హరిమణివేణి = ఇంద్రనీలమణివంటి జడగల చంద్రిక; వరించున్ పో=నిజముగ కోరును. అంచున్=ఈ ప్రకారముతలఁచుచు ; ముదము=సంతసము; అంతరవీథికన్=చిత్తప్రదేశమునందు; కందళింపన్=అంకురింపఁగా; కిన్నరవిభుఁడు=కిన్నరశ్రేష్ఠుఁడగుకుముదుఁడు; ఆత్మసఖ్యకలనన్.—ఆత్మ=తనయొక్క, సఖ్య=సఖిత్వముయొక్క, కలనన్ = ప్రాప్తిచేత; వే = శీఘ్రముగ; వెనుపాయక = వెంబడించియునుట; కొల్వన్=సేవింపఁగా; తగన్=ఒప్పునట్లు. దీని కుత్తరపద్యస్థక్రియతో నన్వయము.

మ. ద్విరదాధీశ్వరు నెక్కి పౌరవసుగాస్త్రీరత్నవారంబు క్రొ
వ్విరిసేసల్ బయి నింప విప్రతతి దీవింప న్నవానేకపాం
డురపట్టాతపవారణావృతముఖుండుఁ జారుభూషావిభా
స్వరగాత్రుండును నై పురి న్వెడలి తేవ న్వచ్చె నప్పట్టునన్. 19

టీ. ద్విరదాధీశ్వరున్=గజశ్రేష్ఠమును; ఎక్కి=అధిష్ఠించి; పౌరవసుగాస్త్రీరత్నవారంబు=పురస్త్రీరత్న బృందము; క్రొవ్విరిసేసల్=క్రొత్తపుష్పములను నక్షతలను; పయిన్=శరీరముమీఁద; నింపన్=నిండింపఁగా; విప్రతతి=బ్రాహ్మణులగుంపు; దీవింపన్=ఆశీర్వదింపఁగా; నవానేకపాండురపట్టాతపవారణావృతముఖుండున్.—నవ=నూతనములగు, అనేక=అనేకములగు, పాండుర=శుభ్రములైన, పట్టాతపవారణ=పట్టుగొడుగులచేత, ఆవృత=ఆవరింపఁబడిన, ముఖుండున్=ముఖముగలవాఁడును; చారుభూషావిభాస్వరగాత్రుండునున్.—చారు=మనోజ్ఞమగు, భూషా=ఆభరణములచే, విభాస్వర=ప్రకాశించు, గాత్రుండునున్ = శరీరముగలవాఁడును; ఐ=అయినవాఁడై; పురిన్=తనరాజధానినుండి; వెడలి = బైలుదేఱి; అప్పట్టునన్; ఆసమయమందు; తేవన్=ఒప్పిదముగను; వచ్చెన్=వచ్చెను.

అనఁగ సుచంద్రుఁడు పురకాంతలు పుష్పాక్షతలు చల్లుచుండఁగ విప్రులు దీవించుచుండఁగ భూషణభూషితాంగుఁడై యేనుఁగు నెక్కి పురము వెడలె నని భావము.

చ. అసురవిదారి కాంచనశతాంగరథాంగపరిభ్రమిప్రకా
రసముదితారవంబు లిభరాట్పటలీఘనబృంహితంబు లు
ల్లసితమహాచమూకలకలంబు జగత్త్రితయంబు గప్ప సం
తసమున సర్వదేశజననాథులు గన్గొన వచ్చె నత్తఱిన్. 20

టీ. అసురవిదారి = సుచంద్రుఁడు కాంచనశతాంగరథాంగ పరిభ్రమి ప్రకారసముదితారవంబులు.— కాంచనశతాంగ = సువర్ణమయరథములయొక్క, రథాంగ = చక్రములయొక్క, పరిభ్రమి=భ్రమణములయొక్క, ప్రకార=రీతిచేత, సముదిత=పుట్టిన, ఆరవంబులు=ధ్వనులు; ఇభరాట్పటలీఘన బృంహితంబులు.—ఇభరాట్పటలీ=గజబృందములయొక్క, ఘన అధికములగు, బృంహితంబులు=గర్జాధ్వనులు; "బృంహితంకరిగర్జిత" మనియమరుఁడు; ఉల్లసితమహాచమూకలకలంబు.—ఉల్లసిత=ప్రకాశించుచున్న, మహాచమూ=మహాసేనలయొక్క, కలకలంబు=కోలాహలధ్వని; జగత్త్రితయంబు=ముల్లోకములను; కప్పన్=వ్యాపింపఁగ; సంతసమునన్=సంతోషముచేత; సర్వదేశజననాథులు=సమస్తదేశపురాజులు; కన్గొనన్=చూచుచుండఁగ; అత్తఱిన్=ఆసమయమందు; వచ్చెన్=వచ్చెను.

అనఁగ సుచంద్రుఁడు రథనేమిధ్వనులు కరిగర్జితములు సేనాకలకలంబును ముల్లోకములు వ్యాపించుచుండఁగా నరపతు లెల్లరు చూచుచుండ స్వయంవరోత్సవమునకు వచ్చె నని భావము.

చ. ఘనకమలేశ్వరాత్మజవి॰కస్వరదీప్తివిలాసహారిపా
వనరుచిజాలలబ్ధి దయి॰వాఱుచుఁ దోఁచినయట్టిలోకబం
ధు నతని విస్మయంబునఁ గ॰నుంగొని రయ్యెడ నప్డు చక్కఁ బ
ద్మిని తదధీనగాఁ దమమ॰తిం దలఁ పుంచిరి రాజు లందఱున్. 21

టీ. ఘనకమలేశ్వరాత్మజవికస్వరదీప్తివిలాసహారిపావనరుచిజాలలబ్ధిన్.—ఘన=అధికమగు,కమలేశ్వరాత్మజ=మన్మథునియొక్క, వికస్వర=వికసించుచున్న, దీప్తి=కాంతియొక్క, విలాస=విలాసమును, హారి=హరించుచున్న, పావన=పరిశుద్ధములగు, రుచి=కాంతులయొక్క, జాల=పుంజములయొక్క, లబ్ధిన్=ప్రాప్తిచేత; దైవాఱుచున్=ప్రకాశించుచు; ఇచట, ఘనమగు, కమలేశ్వరాత్మజ=చంద్రునియొక్క, వికస్వరమగు, దీప్తియొక్కవిలాసమును, హారి=హరించు, పావనరుచులయొక్క, జాల=పుంజములయొక్క, లబ్ధిచేత; దైవాఱుచున్=ప్రకాశించుచు నని సూర్యపరమైనయర్థము, సూర్యుఁడు తనకాంతులచే చంద్రునిరుచుల గ్రహించుటయును నిచ్చుటయును ప్రసిద్ధము; తోఁచినయట్టి లోకబంధున్=కనిపించుచున్నట్టి లోకప్రియుఁడగు, సూర్యుననితోఁచుచున్నది; అతనిన్=ఆసుచంద్రుని; ఎయ్యెడన్=ఏసమయమందు; రాజులందఱున్=నరపతులెల్లరు;విస్మయంబునన్=వింతచేత;కన్గొనిరి=చూచిరో; అప్డు=ఆసమయమందు; చక్కన్=ఋజువుగ; పద్మినిన్=చంద్రికను; పద్మలత నని తోఁచుచున్నది;తదధీనగాన్=ఆసుచంద్రుని స్వాధీనయైనదానినిఁగ; తమమతిన్=తమబుద్ధియందు;తలఁపు=అభిప్రాయమును; ఉంచిరి=ఉనిచిరి.

స్వయంవరోత్సవమునందుఁ జేరి యున్నరాజు లందఱును మన్మథాతిశాయిసౌందర్యము గల యాసుచంద్రునికి చంద్రిక సూర్యునికి పద్మలతయునుబోలె నాయత్తయైనదానిఁగాఁ దలంచి రని భావము.

మ. అతులంబై యనవద్యమై కువలయో॰దారప్రమోదప్రదా
త్మత సంధించి కరంబు రాజిలు సుచం॰ద్రప్రాజ్యతేజోవ్రజం
బతివేలం బగుచున్ వెలుంగఁగ నసం॰తాస్థాని నాక్షత్రసం
తతి చూపట్టె సముజ్ఝితస్వకమహా॰ధామాళిచే నయ్యెడన్. 22

టీ. అతులంబై = అధికమైనదై; అనవద్యమై = నిర్దుష్టమైనదై; కువలయోదారప్రమోదప్రదాత్మతన్.—కువలయ = భూవలయమునకు, ఉదార = ఉత్కృష్టమగు, ప్రమోద= సంతసమును, ప్రద = ఇచ్చుచున్న, ఆత్మతన్ = స్వభావము గలవాఁడగుటను, సర్వదా భూమండలమును సంతసింపఁ జేయుస్వభావము గలవాఁ డగుటననుట; కువలయ = కలువలకు, ప్రమోద ప్రదమగు స్వభావముగలవాఁ డగుటనని చంద్రపరమైనయర్థము; సంధించి=పొంది; కరంబు = మిక్కిలి; రాజిలు సుచంద్రప్రాజ్యతేజోవ్రజంబు.— రాజిలు = ప్రకాశించు, సుచంద్ర = సుచంద్రమహారాజుయొక్క, ప్రాజ్య = అధిక

మగు, తేజోవ్రజంబు=కాంతిపుంజము; అతివేలంబగుచుఁ = అధికమైనదగుచు; "అతివేల భృశాత్యర్థ" అని యమరుఁడు; వెలుంగఁగన్=ప్రకాశింపఁగ; అనంతాస్థానిన్.—అనంత= అధికమగు, ఆస్థానిన్ = ఆస్థానమందు; నాక్షత్రసంతతి=రాజబృందము; అనంత=ఆకసమనె డు, ఆస్థానిన్=సభయందు; నాక్షత్రసంతతి=రిక్కలసంబంధియగుగుంపు అని చంద్రపర మైన యర్థము; సముజ్ఝితస్వక మహాధామాళిచేన్.—సముజ్ఝిత=విడువఁబడిన, స్వక=తమసంబంధి యగు, మహత్=అధికమగు, ధామ=కాంతులయొక్క, ఆళిచేన్=పుంజముచేత; అయ్యెడన్ =ఆసమయమందు; చూపట్టెన్=కనిపించెను.

అనఁగఁ జంద్రునికాంతి పుంజము సన్నిధిఁ దేజోహీన మగురిక్కలగుంపుపగిది సుచం ద్రుని తేజము సన్నిధిని నితరరాజబృందము గనుపట్టెనని భావము:

తే. ఇట్టు లపు డేగుదెంచిన • యట్టిసకల
మనుజకాంతులఁ బాంచాల•జనవిభుండు
రహి నెదుర్కొని యభినవ్య•రత్నమయమ
హోన్నతనివేశపాళుల • నునిచె నంత. 23

టీ. ఇట్టులు=ఈప్రకారము; అపుడు=ఆసమయమందు; ఏగుదెంచిన యట్టిసకలమను జకాంతులన్=వచ్చినసమస్తనరపతులను; పాంచాలజనవిభుండు=ద్రుపదోదయరాజు; రహిన్= ప్రీతితో; ఎదుర్కొని=ఎదురుగానేగి; అభినవ్యరత్నమయమహోన్నతని వేశపాళులన్.— అభినవ్య=నూతనమగు; రత్నమయ=మణిమయమగు, మహోన్నత=మిక్కిలియెత్తుగానున్న, నివేశపాళులన్=విడుదులపంక్తులయందు; ఉనిచెన్=ఉంచెను.

అనఁగ బాంచాలభూపతియగు ద్రుపదోదయుఁడు స్వయంవరోత్సవమునకై యేగుదెం చుజనపతుల నెదుర్కొని సన్మానించి మణులచే రచియించిన యత్యున్నతములగు నివేశస్థాన ములయందు దించెనని భావము.

చ. అవనితలేంద్రు లెల్లఁ బ్రమ•దాతిశయంబునఁ దత్స్వయంవరో
త్సవదినవేళ దివ్యమణి•జాతవినిర్మితమంచమండలిన్
బ్రవిమలచిత్తపద్ములయి • బాగుగఁ జేరి వసించి రంగనా
నివహము చామరుల్ వలయ•నిక్వణనంబులు మించ వీవఁగన్. 24

టీ. అవనితలేంద్రులెల్లన్=రాజులందఱు; ప్రమదాతిశయంబునన్=సంతోషాతిశయము చేత; తత్స్వయంవరోత్సవదినవేళన్.—తత్=ఆచంద్రికయొక్క, స్వయంవరోత్సవ=స్వయంవరో త్సవముయొక్క, దినవేళన్=దివసమునందు; దివ్యమణిజాతవినిర్మితమంచమండలిన్.—దివ్యమణి= శ్రేష్ఠమణులయొక్క, జాత=సమూహముచే, వినిర్మిత=రచియింపఁబడిన, మంచ=మంచములయొ

కన్, మండలిన్=సమూహమందు; ప్రవిమలచిత్త పద్ములయి.—ప్రవిమల=మిక్కిలిస్వచ్ఛమగు, చిత్తపద్ములయి=చిత్తకమలములుగలవారై; బాగుగన్=రమణీయముగ; చేరి=సమీపించి;అంగనానివహము=స్త్రీసమూహము; వలయనిక్వణనంబులు.—వలయ = కంకణములయొక్క, నిక్వణనంబులు=ధ్వనులు; మించన్=మీఱునటులు; చామరల్ = వింజామరలను; వీవఁగన్=విసరుచుండఁగ; వసించిరి=కూర్చుండిరి.

అనఁగ స్వయంవరోత్సవమునకు నేతెంచి యున్న రాజు లందఱు మణిమయ మంచాసనములపై నువిదలు కంకణధ్వనులు చెలరేఁగ వీచోపులు వీచుచుండఁగ విమలచిత్తులయి నివసించి రని భావము.

మ. అలవేళన్ హరిపుత్త్ర హారకమహుం●డై నిస్తులాహీనహా
రలతాశోభితమూర్తియై తగుసుచం●ద్రఖ్యాతలేంద్రుండు ని
ర్మలపాండుద్యుతిమన్మణీమయమహా●మంచాగ్రభద్రాసన
స్థలిఁ దాఁ జేరి వసించె రూప్యగిరిఁ గా●త్యాయనన్యధీశుం డనన్. 25

టీ. అలవేళన్=ఆసమయమందు;హరిపుత్త్రహారకమహుండువై.—హరిపుత్త్ర=జయంతుని, హారక=హరించిన, మహుండై=తేజస్సుగలవాఁడై, హరిపుత్త్ర=మన్మథుని, లేదా, యముని, హారక=హరించిన,మహుండై=తేజస్సుకలవాఁడై యని శివపర మైనయర్థము; నిస్తులాహీనహారలతా శోభితమూర్తివి.—నిస్తుల=సరిలేని, అహీన=శ్రేష్ఠమగు,హారలతా=లతలవంటిహారములచే, శోభిత=ప్రకాశించుచున్న, మూర్తియై=శరీరముగలవాఁడై;నిస్తులమగు,అహీనహారలతా=శేషుఁడనెడిహారలతచేత,శోభితమగుమూర్తిగలవాఁ డని శివపర మైనయర్థము;తగుసుచంద్రఖ్యాతలేంద్రుండు.—తగు=ఒప్పుచున్న, సుచంద్రఖ్యాతలేంద్రుండు=సుచంద్రమహారాజు ; నిర్మలపాండుద్యుతిమన్మణీమయమహామంచాగ్రభద్రాసనస్థలిన్.—నిర్మల=స్వచ్ఛమగు, పాండు ద్యుతిమత్=తెల్లనికాంతిగల, మణీమయ=రత్నమయమగు, మహామంచాగ్ర=గొప్పపర్యంకాగ్రమనెడు,భద్రాసనస్థలిన్=సింహాసనస్థలమందు; తాన్=సుచంద్రుఁడు; చేరి=సమీపించి; రూప్యగిరిన్=కైలాసపర్వతమందు; కాత్యాయనన్యధీశుండుఅనన్=శంకరుఁడాయనునట్లు; వసించెన్=కూర్చుండెను.

తెల్లనిమణులతో రచియించి యున్నమంచముపైఁ గూర్చుండియున్న యాసుచంద్రుండు వెండికొండపైఁ గూర్చుండి యున్నముక్కంటిపగిది విలసిల్లె నని భావము. ఇచట సుచంద్రుని శివునిఁగా నుత్ప్రేక్షించుటచే నుత్ప్రేక్షాలంకారము.

మ. ఘనముక్తామణికాసనంబున సిరిం● గన్పట్టునాదైత్యభే
దనుఁ డారార నుతింప నయ్యె ఖరరు●క్త్రైణ్యంబుచేత న్వికర్తనబింబమ్మున నుండుట న్నడలి శీ●తచ్ఛాయబింబంబు చే
రిన వారాశిసుతామనోహరునిదా●రిం బూని యప్పట్టునన్. 26

టీ. ఘనముక్తామణికాసనంబునన్.—ఘన=గొప్పలగు, ముక్తామణికా=ముత్తెములయొక్క, ఆసనంబునన్=సింహాసనమందు; పిరిన్=కాంతిచే; కన్పట్టు నా దైత్యభేదనుఁడు=కాన్పించు నా చంద్రుఁడు; ఖరరుక్తైక్ష్ణ్యంబుచేతన్=తీక్ష్ణకిరణముల వేఁడిమిచేత; వికర్తనబింబంబునన్=సూర్యబింబమందు; ఉండుటన్=ఉనికిని; సడలి=వదలి; శీతచ్ఛాయబింబంబు=చల్లని కాంతిగల చంద్రబింబమును; చేరిన వారాశిసుతామనోహరునిదారిన్.—చేరిన=పొందిన, వారాశిసుతా=లక్ష్మీదేవికి, మనోహరునిదారిన్=భర్తయగు విష్ణుమూర్తియొక్క రీతిని ; పూని=వహించి ; అప్పట్టునన్=ఆసమయమందు; నుతింపనయ్యెన్=స్తుతించుట కాస్పదుఁడాయెననుట. ఔరౌర=ఆశ్చర్యమాశ్చర్యము !

అనఁగ ముక్తామయభద్రాసనంబునఁ గూడి యున్న సుచంద్రుఁడు, మిక్కిలి వేఁడిగల సూర్యబింబమును విడిచి చల్లనిచంద్రబింబంబుఁ జేరినవిష్ణుమూర్తియో యని పొగడఁబడె నని భావము. నారాయణమూర్తి సూర్యబింబమం దుండుట ప్రసిద్ధము.

సీ. సురగణ్యలావణ్య♦గరిమ రాజులకుఁ బాం
చాలినిరాశ హె♦చ్చంగఁ జేయ
మణిమంచబింబితా♦త్మచ్ఛాయ తనుఁ గొల్వఁ
దఱియుమన్మథుబుద్ధి ♦ దనరఁ జేయ
హీరభూషణవిభా♦వారంబు వెన్నెల
వలగొన్న రేఱేనిఁ ♦ దలఁపఁ జేయ
వందికంఠధ్వను ♦ లైశ్వభవశ్రీ నభి
మెనసి చూచుసురాళి ♦ కెఱుక చేయ

తే. కంకణక్రేంకృతు ల్పర్వఁ ♦ బంకజాస్య
లలరువింజామరలు వీవ ♦ యక్షనేత
పార్శ్వమునఁ గొల్వ బుధపాళి ♦ ప్రస్తుతింప
మంచతటి నాసుచంద్రుండు ♦ మించె నపుడు. 27

టీ. సురగణ్యలావణ్యగరిమ.—సుర=దేవతలచే, గణ్య=పొగడఁదగిన, లావణ్య=అందముయొక్క, గరిమ=అతిశయము; రాజులకున్=ఇతరరాజులకు; పాంచాలినిరాశన్=చంద్రికయందు ఆశయొక్కయభావమును ; హెచ్చంగఁజేయన్=మించునటులు చేయుచుండఁగ; మణిమంచబింబితాత్మచ్ఛాయ.—మణిమంచ=మణిమయమగు మంచమునందు, బింబిత=ప్రతిఫలించిన, ఆత్మచ్ఛాయ=తననీడ; తనుఁగొల్వన్=తన్ను సేవించుటకు; తఱియుమన్మథుబుద్ధిన్=సమీపించియున్న మన్మథుఁడనుబుద్ధిని; తననీడ మన్మథునిభంగి నున్న దనుట; తనరన్=ఒప్పునటులు; చేయన్ = ఒనరించు చుండఁగ ; హీరభూషణవిభావారంబు.— వజ్రాల సా

ష్ముల యొక్క కాంతిపుంజము ; వెన్నెలవల గొన్న రేఁటనిన్ = వెన్నెలచేఁ జుట్టఁబడిన చంద్రుని ; తలఁపన్ = స్మరించు నటులు ; చేయన్ = చేయఁగా ; వందికంఠధ్వనులు.— వంది = పొగడుచుండెడి వారియొక్క, "వన్దినః స్తుతిపాఠకాః" అనియమరుఁడు, కంఠధ్వనులు=గళధ్వనులు; వైభవశ్రీన్ = విభవముయొక్కయతిశయమును ; అభ్రమెనసి=మిన్నంది; చూచుసురాళికిన్ = చూచుచున్న దేవతలబృందమునకు; ఎఱుకచేయన్=తెలియఁజేయుచుండఁగా ; కంకణక్రేంకృతులు = కడియములయొక్కక్రేంకారధ్వనులు; పర్వన్=వ్యాపించునటులు; పంకజాస్యలు=స్త్రీలు; అలఘువింజామరలు=ప్రకాశించుచున్న చామరములను; వీవన్=విసరుచుండఁగ; యక్షనేత=కుముదుఁడనుకిన్నరుఁడు; పార్శ్వమునన్ = ప్రక్కను; కొల్వన్=సేవించుచుండఁగా; బుధపాళి=విద్వద్బృందము ; ప్రస్తుతింపన్=పొగడుచుండఁగా; మంచతటిన్ =మంచప్రదేశమునందు; ఆసుచంద్రుండు=ఆసుచంద్రమహారాజు ; అప్పుడు=ఆసమయమందు; మించెన్ =అతిశయించెను.

అనఁగ తనసౌందర్యాతిశయము ఇతరరాజులకు చంద్రికమీఁది యాశను పోఁగొట్టుచున్న దనియు మణిమయపీఠమునందు ప్రతిబింబించినతననీడ మరుం డనుజ్ఞానమును కలుగఁ జేయుచున్న దనియు మగరాలసొమ్ముల కాంతులు వెన్నెలవ లగొన్న కలువలదొరయో యను బుద్ధిని జేయుచున్న దనియు స్తుతిపాఠకులకంఠధ్వనులు తనవైభవమును మిన్ను చేరి చూచువేల్పుల కెఱుకచేయుచున్నవనియు, ఇరుప్రక్కల స్త్రీలు వీచోపులు విసరుచుండ వారికరకంకణధ్వనులు వ్యాపించుచున్న వనియు, కుముదుఁడు కొలుచుచుండఁగ బుధులు నుతింపఁగనట్టి సుచంద్రుఁడు మంచముమీఁద ప్రకాశించె ననియు తాత్పర్యము.

క. నరనాయకకులమంచాంతరముల వలిగాడ్పు మసలెఁ • దపనతనయమం
దిరకేళీవనపాళీ, సురసాళీవాసనాభి•శోభితగతియై. 28

టీ. నరనాయకకులమంచాంతరములన్.—నరనాయకకుల = నరపతిసంఘములయొక్క, మంచాంతరములన్ = మంచములయొక్కమధ్యములందు ; వలిగాడ్పు = చల్లనిమందమారుతము; తపనతనయమందిరకేళీవనపాళీసురసాళీవాసనాభిశోభితగతియై.—తపనతనయ=యమునియొక్క, మందిర=గృహముయొక్క, కేళీవన=క్రీడావనములయొక్క, పాళీ=పంక్తులయందున్న, సురసాళీ=సర్పాక్షీపుష్పపుంజములయొక్క, వాసనా=పరిమళముచే,అభిశోభిత=ప్రకాశించు, గతియై=గతిగలదై; మసలెన్=విసరెను.

వ. అంత ననంతకాంచనమంచాగ్రసమంచితసింహాసనసమాసీన మానవనాయకసేవాసమాగామితత్తత్సేనాధిపసంఘపరస్పరసంఘర్షణ సముత్తిష్ఠచ్ఛిరత్నరత్నాంగదపరాగపూగతామ్రపట్టపటాస్తరణ విభ్రాజితంబును,నంతరీపకాంతశిరోవిభాసితానంతచరనాథమణిమయమకుటతటనరీనృత్యమానవినీలకాంతిప్రరోహకుహనాధూపధూమపూరితంబును, శంబరాక్షీకదంబకకరాం

భుజసముద్గచ్ఛదరుణాంబరశుభాడంబరకంకేళికుసుమ గుళుచ్ఛరించ్ఛోళికావితానవిభూషితంబునునై యొప్పమీఱు గగనాస్థానంబునఁ బాకారి పావకపద్మాప్తసుతపలాశపయోధీశపవమానపౌలస్త్యపార్వతీపతిపరివృతుండై తదుత్సవంబు వీక్షింప నిండుపేరోలగం బుండె. గాలవశాండిల్యకౌశికవసిష్ఠప్రముఖమహర్షులు హర్షోత్కర్షంబునఁ జూడందొడంగిరి. గరుడకిన్నరగంధర్వసిద్ధసాధ్యముఖ్యు లంతంతం గాంచి సంతసిల్లిరి. అపుడు రాజసభాస్థలం బపరిమితవేత్రధరసాహోవానినాదవాచాలంబై అభినవభూషణ మరీచికావిహారవాటంబై యతులితంబై యతిశయిల్లం గనుంగొని యాక్షణదోదయక్ష్మాధ్యక్షుండు నెమ్మనంబున నీస్వయంవరమునకు వచ్చిన ధరాధిపతులయన్వయగుణాదికంబులు పేర్కొని కుమారి కెఱింగింపఁ నెవ్వరు చాలుదు రఖిలజగజ్జనని గిరిరాజతనుజ గాక యని తలంచి యప్పుడు. 29

టీ. అంతక్=అటుపిమ్మట; అనంతకాంచనమంచాగ్రసమంచితసింహాసనసమాసీనమానవనాయక సేవాసమాగామితత్తత్సేనాధిపసంఘ పరస్పరసంఘర్షణసముత్తిష్ఠచ్చిరత్నరత్నాంగదపరాగపూగ తామ్రపట్టపటాస్తరణ విభ్రాజితంబును.—అనంత = అధికమగు, కాంచన=సువర్ణముయొక్క, మంచాగ్ర = మంచాగ్రములందు, సమంచిత=ఒప్పుచున్న, సింహాసన=భద్రాసనములందు, సమాసీన=కూర్చుండియుండు, మానవనాయక=నరపతులయొక్క, సేవా=కొలువునకై, సమాగామి=వచ్చుచున్న, తత్తత్సేనాధిప = ఆయాదళవాయులయొక్క, సంఘ=గుంపుయొక్క, పరస్పరసంఘర్షణ=ఒండొరులయొక్క యొరయికలవలన, సముత్తిష్ఠత్ = మీఁదికెగయుచున్న, చిరత్న=పురాతనమగు, రత్నాంగద=రత్నమయమగుభుజకీర్తులయొక్క, పరాగపూగ=రజఃపుంజమనెడు, తామ్ర=ఎఱ్ఱనగు, పట్టపట = పట్టువస్త్రముయొక్క, ఆస్తరణ = పఱచుటచే, విభ్రాజితంబును = ప్రకాశించుచున్నదియును; అంతరీపకాంతశిరోవిభాసితానంతచరనాథమణిమయమకుటతటనరీనృత్యమానవినీలకాంతిప్రరోహకుహనా ధూపధూమపూరితంబును.—అంతరీపకాంత=ద్వీపాధిపతులయొక్క, శిరః=మస్తకములందు, విభాసిత=ప్రకాశించు, అనంతచరనాథమణిమయ = ఇంద్రనీలమణిమయములగు, మకుట=కిరీటములయొక్క, నరీనృత్యమాన = మిక్కిలి నాట్యముఁజేయుచున్న, వినీల = మిక్కిలినల్లని, కాంతి=తేజములయొక్క, ప్రరోహ=అంకురమనెడు, కుహనా=కపటముగల, ధూప=ధూపముయొక్క, ధూప మనఁగా వాసనకై వేయు నగరువుమొదలగు పరిమళవస్తువులయొక్క పొగ, ధూమ=పొగచేత, పూరితంబును=నింపఁబడినదియును; శంబరాక్షీకదంబకకరాంబుజసముద్గచ్ఛదరుణాంబరశుభాడంబరకంకేళికుసుమగుళుచ్ఛరించ్ఛోళికావితానభూషితంబును.—శంబరాక్షీకదంబక=మృగాక్షీసమూహముయొక్క, కరాంబుజ=కేలుదామరలవలన, సముద్గచ్ఛత్ = మీఁదికెగయుచున్న, అరుణాంశుక=ఎఱ్ఱనికాంతియనెడు, శుభాడంబర = మంగళప్రదమగు విజృంభణముగల, కంకేళికుసుమ=అశోకపుష్పములయొక్క, గుళుచ్ఛ=గుత్తులయొక్క, రించ్ఛోళి

కా=సమూహముల నెడు, వితాన=మేలుకట్లచేత, విభూషితంబును=అలంకరింపఁబడినదియును; ఐ=ఐనదై; ఒప్పుమీఱుగగనాస్థానంబునన్.-ఒప్పు=అందము చేద, మీఱు=అతిశయించు, గగనాస్థానంబునన్ = ఆకాశమనుసభయందు ; పాకారి = ఇంద్రుఁడు; పావకపద్మాప్తసుతపలాశపయోధీశపవమానపౌలస్త్యపార్వతీపతిపరివృతుండునై.-అగ్నియమనిరృతి వరుణవాయు కుబేరశంకరులచేఁ గూడుకొన్నవాఁడై ; తదుత్సవంబు = ఆస్వయంవరోత్సవమును ; వీక్షింపన్=చూచుటకు; నిండుపేరోలగంబు=గొప్పకొలువుదీరి; ఉండెన్=ఉండెను. గాలవశాండిల్యకౌశికవసిష్ఠప్రముఖమహర్షులు = గాలవుఁడు శాండిల్యుఁడు కౌశికుఁడు వసిష్ఠుఁడు మొదలుగాఁగల మహామునులు; హర్షోత్కర్షంబునన్ = సంతోషాతిశయముచేత ; చూడన్ = వీక్షించుటకు ; తొడంగిరి = ప్రయత్నించిరి. గరుడకిన్నరగంధర్వసిద్ధసాధ్యముఖ్యులు = గరుడులు కిన్నరులు గంధర్వులు సిద్ధులు సాధ్యులు మొదలుగాఁగలవారు; అంతంతన్ గాంచి = అచ్చటచ్చటఁజూచి ; సంతసిల్లిరి = ఆనందించిరి. అపుడు=అసమయందు; రాజసభాస్థలంబు=రాజసభయొక్క ప్రదేశము ; అపరిమితవేత్రధరసాహోనినాదవాచాలంబు.-అపరిమిత=మితిలేని, వేత్రధర = బెత్తపువారియొక్క, సాహోనినాద=హెచ్చరికమాటలయొక్క ధ్వనులచేత, వాచాలంబు = ముఖరితంబు ; ఐ=అయినదై ; అభినవభూషణమరీచికావిహారవాటంబై.-అభినవ=నూతనమగు, భూషణ = ఆభరణములయొక్క,మరీచికా=కాంతులయొక్క,విహార=క్రీడయొక్క, వాటంబై=ప్రదేశమై;అద్భుతంబై=ఆశ్చర్యకరమైనదై; అతులితంబై=దీటులేనిదై ; అతిశయిల్లన్=విజృంభింపఁగా; కనుంగొని=చూచి; అక్షుణదోదయక్ష్మాధ్యక్షుండు=అక్షుణదోదయరాజు ; నెమ్మనంబునన్=తనమనసునందు;ఈస్వయంవరమునకున్=ఈస్వయంవరోత్సవమునకు;వచ్చినధరాధిపతులయన్వయగుణాదికంబులు=చేరియున్న రాజులవంగడములుగొనంబులుమొదలగువానిని; పేర్కొని=నామములు గ్రహించి; కుమారికిన్=చంద్రికకు ; ఎఱింగింపన్=తెలుపుటకు; అఖిలజగజ్జనని=సమస్తలోకమాతయగు; గిరిరాజతనుజాత=పార్వతీదేవితప్ప; ఎవ్వరుచాలుదురు=ఎవ్వరుసమర్థులగుదురు? అవిఁతలంచి=ఈప్రకారముస్మరించి; అప్పుడు=ఆసమయమందు.

మ. పరిపూతాత్మసమన్వితుం డగుచుఁ దత్పాంచాలధాత్రీతలే
శ్వరచంద్రుండు కరాబ్జము ల్మోగిచి శశ్వద్భక్తివైపుల్య మాం
తరవీథిం దళుకొత్త నిల్చి వినయాత్మ న్సన్నుతించె న్మహీ
ధరసమ్రాట్సుతనిర్మలామృతధునీధారాళధారోక్తులన్. 30

టీ. తత్పాంచాలధాత్రీతలేశ్వరచంద్రుండు=అక్షుణదోదయమహారాజు ; పరిపూతాత్మసమన్వితుండగుచున్.-పరిపూత = పరిశుద్ధమగు, ఆత్మ=మనస్సుచేత, సమన్వితుండు=కూడుకొన్నవాఁడు, అగుచున్=అయినవాఁడై; కరాబ్జముల్మోగిచి=కేలుదామరలుమోడ్చి;శశ్వద్భక్తివైపుల్యము.-శశ్వత్ = ప్రకాశించుచున్న, భక్తి=భక్తియొక్క, వైపుల్యము=అతిశయము; అంతరవీథిన్=హృదయవీథియందు; తళుకొత్తన్=మిక్కిలిప్రకాశింపఁగ ; నిల్చి=నిలుచుకొని;

వినయాత్మకన్ = వినయముతోఁగూడుకొన్న మనముచేత ; నిర్మలామృతధునీధారాళధారోక్తులన్.—నిర్మల=స్వచ్ఛమగు, అమృత=సుధయొక్క, ధునీ = ప్రవాహముయొక్క, ధారాళ= అడ్డము లేని, ధారా=ఆసారములవంటి, ఉక్తులన్=వాక్యములచేత; మహీధరసమ్రాట్పుత్రికన్= హిమవంతునికూఁతురగుపార్వతీదేవిని; సన్నుతించెన్=పొగడెను.

అనఁగా తుణదోదయరాజు భక్తిచేఁ గరంబులు మోడ్చి జగన్మాత యగునాపార్వతీదేవి నమృతధారాసమంబు లగుసూక్తులచే నుతియించె నని భావము.

దండకము. జయ జయ జగతీనాయికే, భక్తలోకేష్టసంధాయికే, నిత్యబిన్దుత్రికోణాష్టకోణాదికోణావళీవిస్ఫురచ్చక్ర సింహాసనోద్ద్యోతమానాత్మికే, సర్వమన్త్రాత్మికే, సద్వటానోకహైకాంతసీమావసద్బోధముద్రాన్వితాశామ్బరస్వాంతనిద్రాళుపఞ్చాశుగోన్మీలనాకారకాపాఙ్గసంచారభఙ్గీసముద్భూతసర్గాదికార్యత్రయీసక్తవైధాణ్డభాణ్డప్రకాణ్డే, దయాత్రాతయోగిప్రకాణ్డే, వినీలాజ్కరేఖావృతాజ్ఞారిబిమ్బోపమానస్మితశ్రీకణ్ఠే భూతహీరోపలప్రోత కోదణ్డదణ్డోత్తమోదాత్తశైత్యప్రకారోజ్జ్వల ద్గోనికాయోపభుక్తోగ్రధూమాగ్రితుదర్పచ్ఛలధ్వాన్తికే వార్షికామ్భోదజిత్కాన్తికే రోచమానాత్మభూమితత్రితారాహితీయుక్త చిత్రక్రియాసంచరన్మధ్యపట్టమ్భ విధ్వంసనోగార లక్ష్మీకనిదాఘపహార్యద్భుతక్రీడనాశాలిమాయాఘనప్రక్రియాభ్యఞ్చితే సత్కులాళీనిరాకుఞ్చితే, మత్తదన్తీన్ద్రనగ్రామృదఙ్గప్రజధ్వానదైత్యేన్ద్రసేనావళీ సింహనాదాఖ్యగానాభిరఙ్గన్మహాజన్యరఙ్గస్థలీనృత్యదుగ్రాసివల్లీనటీప్రాపితాప్రత్నపుష్పాఞ్జలీభూతశుమ్భాదికక్రవ్యభుఙ్మౌళికానిర్గళన్మౌక్తికశ్రేణికే, పుణ్యమర్త్యోత్కరారోహసౌభాగ్యసోపానపఙ్క్తిరాజన్నిఖైకదివ్యోదార కారుణ్యనిశ్రేణికే, శివగృహిణి నిజోపమ్యలీలానిశోజ్జృమ్భమాణేన్దుజాయాపరివ్యక్తజాగ్రత్కుధాబ్జాకరశఙ్కాసమాపాదిలాక్షారసోల్లిఙ్గి తాంఘ్రిద్వయాబ్జదీవ్యన్నఖవ్రాతవిభ్రాజితే, దేవతాపూజితే, నిత్యసత్కాన్తసంసేవ్యపాదామ్బుజాతాధరీభూతపద్మాకరోదఞ్చితామ్భోజహైమవ్యక్రియావాచి శిఞ్జారవప్రోద్భాసిమఞ్జీరభూషానుషఙ్గే, కనఙ్జాఙ్ఘిక క్రీడితోద్యన్మనోభూనిషఙ్గే, మహాయోగవేనాళీకమల్లాధిభూకేళికాస్తమ్భసంవిత్ప్రదాత్రూరుకాణ్డే, సరోరాజసౌభాగ్యజిన్నాభికుణ్డే, వలగ్నస్థలీకార్శ్యజిజ్ఞాసువుష్పేషుబద్ధస్ఫురన్ముష్టికాబన్ధనప్రోత్థగమ్భీరనాభీగుహాన్తర్గతధ్వాన్తరేఖాంమనీషాప్రదశ్యామరోమాళికే, సారశృఙ్గారవారా

శిఖఙ్గప్రమాకృద్వళీపాళికే, చారుతారుణ్యమాయామహాకుమ్భికుమ్భద్వయీద్వాపరద్వారవక్షోభవే, పాణిభాత్రాతపాథోభవే, సంతతాసక్తసర్వజ్ఞదృగ్జాతపాతక్రియాజాయమానాత్మలావణ్యకూలఙ్కషాబుద్బుదశ్రేణికారూపముక్తావళీభాసమానే, శుభామోదికాశ్మీరకస్తూరికాపఙ్కచర్చాపరిద్యోతమానే,మనోజ్ఞాస్యపద్మాహితార్చాపరామ్భోజబాణప్రతిష్ఠాపితామూల్యశఙ్ఖీభవత్కన్ధరే, పాణితప్రాణ బన్ధూభవద్భవ్య వాగ్బన్ధురే, సలలితఖగచక్రాఙ్గకాణ్డద్విజావిక్షతాఙ్కాన్వితప్రస్ఫురత్పక్వబిమ్బప్రతీకాశరమ్యోష్ఠబిమ్బే, నవాదర్శసద్గర్వనిర్వాపణోద్యుక్తగణ్డద్వయాంచన్మరీచీకదమ్బే, స్వకశ్రీసమఙ్కారిత త్రాసయోగాటవీ లీన కున్దోపరి వ్యక్త నవ్యానుకమ్పా రసోహాసరాశ్రాన్త వీటీరసవ్యాప్త దన్తాళికాద్వైతవా ద్యుజ్జ్వలద్దాడిమీబీజజాలే, సునాసాజితామూల్యసౌవర్ణ జాలే, లసత్కజ్జలాఙ్కోపధిత్రోటికాయుక్తరమ్యాస్యలావణ్యకేళీవనీవీథికా సంచరత్ఖఞ్జరీటాయమానోల్లసల్లోచనే, భ్రూలతాయుగ్మ సంప్రాపితానఙ్గచాపత్విషామోచనే, భవ్యకాశ్మీరభూచిత్రకాకార ఫాలాన్తర భ్రాజమానానిలాప్తేక్షణే, వక్త్రతేజఃపరిక్షీణపూర్ణక్షపానాథకాన్తిక్షణే, సంతతాభ్యర్ణ సీమావస ద్వేణికారావహాసందర్శనోద్విగ్న చేతస్క చూడామణీభూత శీతాంశురేఖా గళత్పాణ్డురస్వేదపాథః పృషన్మాలికా మోహ దానర్ఘ్య ముక్తాలలన్తీలతాలంకృతే, రత్నతాటఙ్కయుగ్మాన్వితే, కాలకణ్ఠాన్తరఙ్గ ప్రమోదప్రదాప్రత్న చామ్పేయదామాఖ్య సౌదామినీవల్లికా యుక్తవేణీపయోదాభిరామే,నతాగారిరామే, సతత మగజే త్వమే వాత్మమాతా శివే త్వాం భజే దేవదేవి త్వయా రక్షితోహం విశాలాక్షి తుభ్యం మనోభక్తివిత్తం దదామ్యమ్బికే, నాశ్రయామి త్వదన్యాం, మహాకాళి దాస్యం తవ ప్రాపయాజ్ఞావతంసే, త్వదీయే పదాబ్జద్వయే సంవస త్వస్మదీయాశయో, గారి రక్షాద్య మాం, దేవి తుభ్యం నమో, యోగిమృగ్యోజ్జ్వలచ్చిత్కళాయై నమో గోధిభాశికృత్తరాత్రీట్కలాయై నమో శేషగీర్వాణనిత్యోత్సవాయై నమో నిత్యపూతామితప్రాభవాయై నమో హస్తసంబద్ధనీరేశయాయై నమో దేవతారూపశయ్యాశయాయై నమస్తే సఖీభూతపద్మాలయాయై నమస్తే స్వభక్తాళిచిత్తాలయాయై నమస్తే మృగాధీశవాహోత్తమాయై నమస్తే పయోజాస్త్రశత్రూత్తమాయై నమః కాన్తిమత్యై నమః కాన్తమత్యై నమ

స్సర్వసూత్యై నమ స్సామ్యభూత్యై నమ శ్శర్మదాయై నమ శ్శైలజాయై నమః కామదాయై నమః కాళికాయై నమ స్తే నమ స్తే నమః. 31

టీ. అథేదానీం కవిః ప్రకృతోపయోగిత్వేన సకలపురుషార్థసంపాదినీం దేవీం ప్రస్తౌతి.—జయజయజగతీత్యాదినా*జయజయ నిరతిశయేనోత్కర్షేణవర్తస్వ అత్ర నిత్యవీప్సయోరితి ద్విర్భావః* జగతీనాయికే జగతః ప్రపంచస్య నాయికే ఈశ్వరి*భక్తలోకేష్ట సంధాయికే.—భక్తలోకస్య భక్తజనస్య, ఇష్టస్య పురుషార్థచతుష్టయస్య, సంధాయికే సంపాదయిత్రి * నిత్యబిన్దు త్రికోణాష్టకోణాది కోణావళీవిస్ఫుర చ్చక్రసింహాసనో ద్ద్యోతమానాత్మికే-నిత్యం వినాశరహితం చక్రవిశేషణ మేతత్ బిన్దు స్సుధాబిన్దు స్తత్పరిత స్త్రికోణ స్తదభితోఽష్టకోణ మేతదాదీనాం కోణా స్తత్త ద్దేవతాధిష్ఠానరేఖాః తేషా మావళ్యా స్ఫుర త్ప్రకాశమానం చక్రం శ్రీచక్రం తదేవ సింహాసనం తత్రోద్ద్యోతమాన ఆత్మా స్వరూపం యస్యా స్సా తథోక్తా-శ్రీచక్రలక్షణంతు "బిన్దు త్రికోణవసుకోణ దశారయుగ్మ మన్వశ్ర నాగదళ సంయుత షోడశారమ్ । వృత్తత్రి భూపురయుతం పరిత శ్చతుర్ద్వా శ్రీచక్ర మేత దుదితం పరదేవతాయాః ఇతి*సర్వమన్త్రాత్మికే - సర్వమన్త్రాత్మ్యేన ఆత్మా స్వరూపం యస్యా స్సా తథోక్తా-అథ దేవ్యా మాహాత్మ్య మభివర్ణయతి న దిత్యాదినా—*సద్వటానోకహోపాన్త సీమావసద్బోధముద్రాన్వితా శామ్బరస్యాన్త నిద్రాళు పఞ్చాశుగోన్మీల నాకారకాపాఙ్గ సంచారభఙ్గీ సముద్భూత సర్గాదికార్యత్రయీ నక్తవై ధాణ్డభాణ్డప్రకాణ్డే - సతో వటానోకహస్య ఉపాన్తసీమాయాం సమీపభూమౌ వసన్ యో బోధముద్రయా అన్విత స్సంగత ఆశామ్బరో దక్షిణామూర్తి స్తస్య వటతరుమూలవసతి ర్జ్ఞానముద్రా చాగమప్రసిద్ధా - వటవిటపి సమీపే బోధముద్రాం దధాన ఇతి - తస్య స్వాన్తే హృదయే నిద్రాళో రజాగ్రతః "నిద్రాతేరాళుచ్" పఞ్చాశుగస్య కామస్య - ఉన్మీలనాయాః వికసనస్య-కారకస్య - అపాఙ్గస్య కటాక్షస్య సంచారో వలనం తస్య భఙ్గీ ప్రకారః తయా సంభూతాని జాతాని సర్గాదీని సృష్టిస్థితిప్రళయా స్తా న్యేవ కార్యాణి తేషాం త్రయీ త్రితయం తయా సక్త స్సంగతః విధేరిమానివై ధాని తస్యేదమిత్యణ్ తానిచ తా న్యణ్డాని తాని భాణ్డా నీవ తేషాం ప్రకాణ్డ స్సంఘాతో యస్యా స్సా తథోక్తా—*దయాత్రా తయోగిప్రకాణ్డే.—దయయా త్రాతా రక్షితా యోగిప్రకాణ్డా స్సంయమిశ్రేష్ఠా యస్యా స్సా తథోక్తా "ప్రకాణ్డ ముద్ఘతల్లజా" ఇత్యమరః* వినీలాబ్జరేఖా వృతాబ్జారి బిమ్బోపమాసమ్మిళత్కుణ్డలీభూత హీరోపలప్రోత కోదణ్డదణ్డోత్త మోద్యాన్త శైత్యప్రకారో జ్జ్వలద్గోనికాయోపభుక్తోగ్ర ధూమ్రాక్ష దర్పచ్ఛలధ్వాన్తికే-విశిష్టా నీలా అన్తః ఖచితనీలమణయో యస్య సతథోక్తః కోదణ్డోత్తమవిశేషణ మేతత్ అబ్జస్య కలఙ్కస్య రేఖయా వృత మాక్రాన్త మబ్జారిబిమ్బం చన్ద్రమణ్డలం తేనోపమాసామ్యం తయా సంమిళన్ సంగతః కుణ్డలీభూతశ్చక్రీభూతో హీరోపలైః ప్రోత స్స్యూతః కోదణ్డోత్తమ స్తేనోద్యాన్తై ర్నిర్గమితై శ్శైత్యస్య నిశితత్వస్య అన్యత్ర శీతత్వస్య ప్రకారేణవిధయా ఉజ్జ్వలన్తో గోనికాయా శ్శరసంఘా అన్యత్ర కిరణనిచయా స్తై రుపభుక్తం భక్షితం వినాశితమిత్యర్థః ఉగ్రస్య ధూమ్రాక్షస్యరక్షసో దర్పచ్ఛలం ధ్వాన్తం

యస్యా స్సా తథోక్తా-* వార్షికామ్భోదజిత్కాన్తికే - వర్షతీతి వార్షుకః అభినతసదస్థాభూ
వృషేత్యాదినా ఉకఞ్ ప్రత్యయః తం అమ్భోదం మేఘం జయతీతి జిత్ తాదృశీ కాన్తి
ర్యస్యా స్సా తథోక్తా దేవ్యాః కృష్ణవర్ణత్వ మాగమప్రసిద్ధమ్ తథా చ సనామ్బురుహాలోచనా
మభినవామ్బుదశ్యామలాం త్రియమ్బకకుటుమ్బినీం త్రిపురసున్దరీ మాశ్రయే- *రోచమానాత్మ
భూమిత్రతారాహితీయుక్త చిత్రక్రియా సంచరన్మధ్వవష్టమ్భవిధ్వంసనోదార లక్ష్మీశనిద్రా
పహార్యద్భుతక్రీడనాశాలి మాయాఘన ప్రక్రమాభ్యఞ్చితే - రోచమానః ప్రకాశమాన ఆత్మ
భువో బ్రహ్మణో మిత్రతా మైత్రీ తస్యా రాహితీ రాహిత్యం తయాయుక్తా సంగతా చిత్ర
క్రియా అద్భుతచేష్టా తాడనపీడనాదిః తయా సంచరన్ యో మధుర్దానవ స్తస్య అవష్టమ్భ
గర్వం తస్య విధ్వంసనే ఉదారా లక్ష్మీశనిద్రాయా అపహారిణీ నివారికా అద్భుతక్రీడనా
తయా శాలత ఇతి తచ్ఛాలినీ యా మాయా తస్యా ఘనప్రక్రమ స్తేనాభ్యఞ్చితే* సత్కలా
ళీనిరాకుఞ్చితే.—సతీనాం కలానాం సౌరాదికలానా మాళీ పఙ్క్తిః తయానిరాకుఞ్చితే అన
ల్పే-*మత్తదన్తీన్ద్రగర్జామృదఙ్గప్రవజధ్వాన దైత్యేన్ద్రసేనావళీ సింహనాదాఖ్యగానాభిరఙ్గన్మ
హాజన్యరఙ్గస్థలీ నృత్యదుగ్రాసివల్లీ నటీప్రాపితాప్రత్నపుష్పాఞ్జలీ భూతశుమ్భాదిక్రవ్యభు
గ్మాళికా నిర్గళన్మౌక్తికశ్రేణికే॥ మత్తాః మదవిశిష్టాః యే దన్తీన్ద్రాః గజశ్రేష్ఠాస్తేషాం గర్జా
బృంహితాని తా ఏవ మృదఙ్గప్రవజధ్వానా మర్దలసంఘాతనినదా దైత్యేన్ద్రాణాం రక్షోవరా
ణాం యా సేనావళీ వాహినీపరంపరా తస్యా స్సింహనాదాః క్ష్వేడనానితదాఖ్యాని గానాని
తైశ్చ అభిరఙ్గత్ శోభమానం మహత్ అధికం జన్యం యుద్ధం తస్యరఙ్గః స్థానం స ఏవ రఙ్గో నాట్య
శాలా తస్య స్థలీ అకృత్రిమభూమిః జానపదేత్యాదినా జీష్ తత్ర నృత్యన్తీ ఉగ్రా యా అసివల్లీ
సైన నటీ నర్తకీ తయా ప్రాపితా అప్రత్నా పుష్పాఞ్జలిః రఙ్గప్రసాధనవిశేషః తద్భూతా శుమ్భ
ఏవ ఆది ర్యేషాంతే శుమ్భాదికా స్స్వార్థే కః యే క్రవ్యభుజో రాక్షసా స్తేషాం మాళికాస్తా
భ్యో నిర్గళన్తీ మౌక్తికశ్రేణిః యస్యా స్సా తథోక్తా- * పుణ్యమర్త్యోత్కరారోహ్య సౌభాగ్య
సౌధార్పితోదార కారుణ్యనిశ్రేణికే॥ పుణ్యాః పవిత్రా మర్త్యోత్కరా మానుషనివహా స్తై రా
రోహ్య ఆరోఢుం శక్యా సౌభాగ్య మేవ సౌధ స్తత్ర అర్పితా ఉదారం గమ్భీరం కారు
ణ్యం కరుణాతదేవ నిశ్రేణికా అధిరోహణీ యస్యా స్సా తథోక్తా-*శివగృహిణి శివభార్యే-*
నిజౌపమ్యలీలానిశోజ్జృమ్భణేన్దు జాయాపరివ్యక్త జాగ్రత్క్రుధాఙ్కార శఙ్కాసమాపాదిలా
క్షార సోల్లిఙ్గితాంఘ్రిప్లబ్జ దీవ్యన్నఖవ్రాత విభ్రాజితే-భగవత్యా నఖాదికచాన్తానా మవ
యవానాం లోకాతిశాయి సౌన్దర్యం వర్ణయతి నిజేత్యాదినా-నిజం స్వీయ మౌపమ్యం తస్య
లీలాక్రియా తయా అనిశం సంతత ముజ్జృమ్భమాణా ఇన్దుజాయా స్తారకా స్తాభిః పరివ్యక్తం
స్ఫుటం యథా జాగ్రత్ నిస్తన్ద్ర శ్చ యః క్రుధాఙ్కారో రోషప్రరోహ స్సఇతి శఙ్కా
మాపాదయతీతి తథోక్తః లాక్షారసో యావకద్రవ స్తేనోల్లిఙ్గితంచి హ్నితమ ఙ్ఘ్రిరబ్జమి
వ అఙ్ఘ్రిప్లబ్జం తత్ర దీవ్యన్తః ప్రకాశమానాశ్చ యే నఖా స్తేషాం వ్రాతేన సమూహేన
విభ్రాజితే॥* దేవతా పూజితే॥*నిత్యసత్కాన్త సంసేవ్యపాదామ్బుజాతా ధరీభూత పద్మాకరో
దఞ్చితామ్భోజహైహన్యక్రియా హాచిశిఞ్జారవోద్భాని మఞ్జీరభూషానుషఙ్గే.—నిత్యం యథాతథా
సత్కాన్తై స్సజ్జనశేఖరైః చన్ద్రిణేతిచ గమ్యతే సేవ్యే భజనీయే పాదా వమ్బుజే ఇవ పా

దామ్బుజే తాభ్యా మధరీభూతాని తిరస్కృతాని పద్మాకరోదఞ్చితా న్యమ్బుజాని తేషాంత్రా న్యక్రియాం వక్తీతి తథ్యాపి సహాసా శిఞ్జారవో ధ్వనివిశేషః భూషణానాంతు శిఞ్జిత మి త్యమరః తేన ఉద్భాసితా యా మఞ్జీరా నూపురా తా వేవ భూషా. భూషణే తాభ్యా మను షఙ్గ స్సంబన్ధో యస్యా స్సా తథోక్తా-*కనజ్జాఙ్ఘిక క్రీడితోద్యన్మనో భూనిషఙ్గే-కనన్తీ ప్రకాశమానా జాఙ్ఘికాజఙ్ఘామా క్రత్యస్థితా యా క్రీః తయా జితా ఉద్యన్తా యా మ నోభువో మదనస్య నిషఙ్గా తూణీరా యస్యా స్సా తథోక్తా-*మహాయౌవనాశోకమల్లాధిభూ కేళికా స్తమ్భసంవిత్ప్రదాత్రూరుకాణ్డే మహాత్ పూర్ణం యౌవన మేవ అశోకమల్లాధిభూ ర్మిథ్యామల్లనాయక ఃఅధిభూ ర్నాయకో నేతేత్యమరః తస్య కేళికా స్తమ్భః క్రీడార్థదా రువిశేషః స ఇతి సంవిదః జ్ఞానస్య ప్రదాతారౌ ఊరుకాణ్డౌ యస్యా స్సా తథోక్తా-*స్మరో రాజసౌభాగ్య జిన్నాభికుణ్డే స్మరో రాజస్య కాసారశ్రేష్ఠస్య రాజాహ స్సఖిభ్యశ్చ జితి టచ్ ప్రత్యయః తస్య సౌభాగ్యం సుభగత్వం తజ్జయ తీతి తజ్జిత్ నాభిః కుణ్డ మివ నాభికు ణ్డం యస్యాస్సా తథోక్తా-*వలగ్నస్థలీకార్శ్య జిజ్ఞాసుపుష్పేషు బద్ధస్ఫురన్ముష్టికా బన్ధనప్రో త్థ గమ్భీర నాభీగుహాన్తస్తట ధ్వాన్తరేఖామనీషా ప్రదశ్యామరోమాళికే॥ వలగ్నస్థల్యా మధ్యదేశస్య య త్కార్శ్యం సూక్ష్మత్వం త జ్జిజ్ఞాసు ర్జ్ఞాతుమిచ్ఛు ర్జ్ఞానాతే స్సన్ప్రష్టా దు

చ్ఛ్రియః తేన పుష్పేషుణా స్మరేణ బద్ధం గ్రథితం యత్ స్ఫురన్త్యా ముష్టికాయా బన్ధనం నిపీడనం తేన ప్రోత్థా య ద్వళీముఖేన ప్రసృతా ఇదం. రేఖావిశేషణం గమ్భీరాయా అగా ధాయా నాభిగుహాయా అన్త స్తట స్తస్య గర్భప్రదేశస్య యా ధ్వాన్తరేఖా తిమిరరాజి స్సేతి మనీషా ధీ స్త త్ప్రదా శ్యామా మేచకా రోమాళికా యస్యా స్సా తథోక్తా- *సారశృఙ్గారవారాశిభఙ్గప్రమాకృద్వళీపాళికే-సార శ్శ్రేష్ఠ శ్శృఙ్గార శ్శృఙ్గారరస ఏవ వారాశి రుదధి స్తస్య భఙ్గా స్తరఙ్గా ఇతి ప్రమాం బుద్ధిం కరోతీతి తత్కృత్ తా దృశీ వళీ పాళికా యస్యా స్సా తథోక్తా-*చారుతారుణ్యమాయామహాకుమ్భికుమ్భద్వయీద్వా పరద్వారవక్షోభవే॥ చారు ఉజ్జ్వలం య త్తారుణ్యం యౌవనం తదేవ మాయా మహాకుమ్భి భద్రగజ స్తత్కుమ్భద్వయీ శిరఃకూటద్వయం సేతి ద్వాపర స్సందేహ స్తస్య ద్వారే నిర్గ మనమార్గా కారణే ఇతి యావత్ తాదృశౌ వక్షోభవౌ యస్యాస్సా తథోక్తా-*పాణిభాత్రాత పాథోభవే-పాణ్యో ర్హస్తయో ర్భా కాన్తి స్తయా త్రాతాని రక్షితాని పాథోభవాని పద్మాని యస్యాస్సా తథోక్తా-*సంతతాసక్తసర్వజ్ఞ దృగ్జాతపాతక్రియా జాయమానాత్మలావ ణ్యకూలఙ్కషా బుద్బుదశ్రేణికారూపముక్తావళీ భాసమానే-సంతతం నిరన్తర మాసక్తస్య రతస్య సర్వజ్ఞస్య శివస్య దృశాం యజ్జాతం సంఘాత స్తస్య పాతక్రియయా పతనకర్మణా జాయమానా సముత్పద్యమానా శ్రేణికా విశేషణ మేతత్ ఆత్మన స్స్వస్య యల్లావణ్యం సౌన్దర్యం తదేవ కూలఙ్కషా తటినీ తస్యా బుద్బుదానాం శ్రేణికా తద్రూపా యా ముక్తా వళీ తయా భాసమానే-*శుభామోదికాశ్మీరకస్తూరికా పఙ్కచర్చాపరిద్యోతమానే॥ శుభో మఙ్గళ ఆమోదః పరిమళః సోస్యా స్తీతి తథోక్తా కాశ్మీరం కుఙ్కుమం కస్తూరికా మృగమద స్త యోః పఙ్కః యః కర్దమ స్తస్యచర్చా అనులేపనం తేన పరిద్యోతమానే*-మనోజ్ఞాస్యపద్మాహి తార్చాపరామ్భోజబాణప్రతిష్ఠాపితా. మూల్యశిక్షీభవత్కన్ధరే। మనోజ్ఞం సున్దర మాస్య

మాననం తదేవ పద్మాహిత శ్చన్ద్రః విష్ణురితిచ వ్యజ్యతే త స్యార్చా పూజనం తత్ర పర ఆస
క్తః అమ్భోజబాణో మదన స్తేన ప్రతిష్ఠాపితః అమూల్యః అనర్ఘ శ్శఙ్ఖః కమ్బు రస స్సంప
ద్యమానః శఙ్ఖీభవన్ అభూతతద్భావేచ్విః చ్వౌ చేతి దీర్ఘః తాదృశీ కన్ధరా శిరోధి
ర్యస్యా స్సా తథోక్తా - *పాణితప్రాణబన్ధూభవద్భవ్యవాగ్బన్ధురే । పాణితస్య ఖణ్డశ
ర్కరాయాః “ మత్స్యండీపాణితంఖండ ఇత్యమరః । ప్రాణబంధుః అతిసుహృత్ తత్త్వే
న సంపద్యమానయా భవ్యయా మనోజ్ఞయా వాచా బంధురే- *సలలితఖగచక్రాంగ
కాండద్విజా విక్షతాంకాన్వితప్రస్ఫురత్పక్వబింబప్రతీకాశరమ్యోష్ఠబింబే॥ సలలిత స్సవిలా
సః ఖగ స్తార్క్ష్య స్సఏవ చక్రాంగో రథో యస్య స విష్ణు రిత్యర్థః స కాణ్డో బాణో య
స్యేతి బహువ్రీహిః. శివ ఇత్యర్థః స ఏవ ద్విజ శ్శుక స్తేన ఆవిక్షతాని సమన్తా ద్విద్ధాని
అఙ్కాని చిహ్నాని తై రన్వితః ప్రస్ఫురన్ పక్వబిమ్బో బిమ్బఫలం తేన ప్రతీకాశో నిభః
రమ్యోష్ఠబిమ్బో యస్యా స్సా తథోక్తా-అథవా సలలితః ఖగో వాయు ర్మలయానిల ఇత్యర్థః
సఏవ చక్రాఙ్గో రథో యస్య స మదన స్తస్య కాణ్డా అశ్వా శ్శుకా స్తేచ తేద్విజాశ్చతై
రా విక్షతాని అఙ్కాని తై రన్వితః ప్రస్ఫురన్ పక్వబిమ్బ స్తస్య శుకముఖావిద్ధపక్వబిమ్బఫల
స్యేతి భావః ప్రతీకాశో రమ్యోష్ఠబిమ్బో యస్యా స్సా తథోక్తా-*నవాదర్శసద్గర్వనిర్వాపణో
ద్యుక్తగణ్డద్వయాచ్ఛన్మరీచీకదమ్బే-నవాదర్శస్య నూతనదర్పణస్య యోదర్ప స్తస్య సద్గర్వస్య
నిర్వాపణే నాశనే ఉద్యుక్తం సన్నద్ధంగణ్డద్వయం తేన అచ్ఛాత్ మరీచీకదమ్బం యస్యా స్సా
తథోక్తా।* స్వకశ్రీసముజ్జృమ్భితత్రాసయోగాటవీలీనకున్దోపరివ్యక్త నవ్యానుకమ్పారసోహ
కశాక్రాన్త వీటీరసవ్యాప్తదన్తాళికాద్వైత వాద్యుజ్జ్వలద్దాడిమీబీజజాలే॥ స్వకశ్రియాస్వీ
యకాన్త్యా సముజ్జృమ్భితో జాతో యస్త్రాసః భయం తస్య యోగా త్సంబన్ధాత్ అటవ్యాం
లీనాని కుందాని మాఘ్యాని తేషా ముపరి వ్యక్తః పరిస్ఫుటో నవ్యో నూతనః అనుకమ్పారసో
దయారస స్స ఇత్యూహాం బుద్ధిం కరోతతి తత్కరః అక్రాన్తవీటీరసః నిరన్తరతామ్బూల
రస స్తేన వ్యాప్తా ఆక్రాన్తా దన్తాళికా తస్యా అద్వైతం వదతీతి తద్వాది య దుజ్జ్వల
త్ప్రకాశమానం దాడిమ్యా బీజజాలం యస్యా స్సా తథోక్తా-సునాసాజితామూల్యసౌవర్ణ
జాలే-సునాసయా జితా న్యమూల్యా న్యనర్ఘాణి సౌవర్ణానిచమ్పకసంబన్ధీని జాలాని ముకుళాని
యస్యా స్సా తథోక్తా॥ *లసత్కజ్జలాంకోపధిత్రోటికాయుక్త రమ్యాస్యలావణ్యకేళీవనీవీ
థికా సంచరత్ఖంజరీటాయమానోల్లసల్లోచనే-లసతః కజ్జలస్య అంకః చిహ్నం స ఇత్యుపధిః
ఛద్మ యస్యా స్సా త్రోటికా చంచూ స్తయా యుక్తా ఖంజరీటవిశేషణ మేతత్ రమ్యస్య
ఆస్యస్య లావణ్యం సౌందర్యం తదేవ కేళీవనం ప్రమదవనం తస్య వీథికా అత్ర సంచరం
తౌ ఖంజరీటౌ ఇవాచరన్తీ కర్తరిక్యఙ్ ఖఞ్జరీటాయమానే ఉల్లసల్లోచనే యస్యా స్సా
తథోక్తా-భ్రూలతాయుగ్మసంప్రాపితానంగచాపత్విషామోచనే॥ భ్రువౌ లతేవ భ్రూలతే
తయో ర్ద్వంద్వేన ప్రాపితస్య అనంగస్య చాపః ధను స్తస్య త్విషః కాన్తిః సాలంతలక్షణటా
బంతోయం తస్యా మోచనం నివృత్తి ర్యస్యా స్సా తథోక్తా- *భవ్యకాశ్మీరభూచిత్రకాకార
ఫాలాంతరభ్రాజమానానిలాప్తేక్షణే భవ్యం మనోజ్ఞం కాశ్మీరభూచిత్రకం కుంకుమతిలకం తస్య
ఆకారో ఆకృతి ర్యస్య తత్ ఈక్షణవిశేషణ మేతత్ ఫాలాంతరే భ్రాజమానం ప్రకాశమా
నం అనిలాప్తేక్షణం అగ్నినయనం యస్యా స్సా తథోక్తా- *వక్త్రతేజఃపరిక్షీణపూర్ణక్షపానాథ

కాంతిక్షణే - వక్త్రతేజసా పరిక్షీణా పూర్ణక్షపానాథస్య పూర్ణచన్ద్రస్య కాంతిః తస్యాఃక్షణో యస్యాః సా తథోక్తా *-సంతతా భ్యర్ణ సీమావసద్వేణికా రాహుసం దర్శనోద్విగ్న చేతస్క- చూడామణీభూతశీతాంశు రేఖాగళత్పాణ్డుర స్వేదయాదః పృషన్మాలికా మోహదానర్ఘ్యముక్తాలలంతికాలంకృతే॥ సంతత మనారత మభ్యర్ణసీమాయాం వసన్ వేణికైవ రాహుః తస్య సందర్శనేన ఉద్విగ్నం భీతం చేతః యస్యాః సా ఉరఃప్రభృతిత్వాత్ కప్ తాదృశచేతస్క- శ్చూడామణీభూత శ్శీతాంశుః తస్య రేఖా శకలం తస్యా గళన్తీ ప్రసరన్తీ పాండుర స్వేదయాదః పృషతాం మాలికా పంక్తి స్సైతి మోహందదాతీతి తథోక్తా తాదృశానర్ఘ్యయా ముక్తాలలంతికయా లలాటే వసీమంతాంతర లంబమానహార యష్ట్యా అలంకృతే *-రత్నతాటంకయుగ్మాన్వితే-రత్నతాటంకయో ర్యుగ్మం తేనాన్వితే॥* కాలకణ్ఠాన్తరఙ్గ ప్రమోదప్రదాప్రత్నచాంపేయదామాఖ్య సౌదామినీవల్లికాయుక్తవేణీ పయోదాభిరామే। కాలకణ్ఠస్య శివస్య అన్తరంగం హృదయం తస్య ప్రమోదప్రదా సంతోషదాయినీ అప్రత్నా నూతనా చాంపేయదామేతి చంపకమాలికేతి ఆఖ్యా ప్రసిద్ధిః యస్యా స్సాతాదృశీ సౌదామినీ వల్లికా తటిల్లతా తయా యుక్తా వేణీ సైవ పయోదః కాలామ్బుద స్తేనాభిరామే।*నతాగారిరామే-నతా అగారిరామా శచీ యాం సా తథోక్తా-*ఆత్మమాతా ఆత్మనో మమ మాతా జననీ-*దేవస్య శివస్య దేవీ పత్నీ*తుభ్యం భవత్యై*భక్తి ర్భజనం తదేవ ధనం తుభ్య మిత్యత్ర కర్మణే త్యాదినా సంప్రదానసంజ్ఞయా చతుర్థీ*త్వత్ భవత్యా*అన్యాం దేవతాం తరం అన్యారాదితిపంచమీ-*దాస్యం కింకరత్వం*ప్రాపయ గమయ మా మితి శేషః।* తుభ్యం భవత్యై *నమః నమ స్స్వస్తీతి చతుర్థీ-*యోగిమృగ్యోజ్జ్వలచ్చిత్కలాయై-యోగిభిః సంయమిభిః మృగ్యా అన్వేషణీయా ఉజ్జ్వలన్తీ చిత్కలా సంవిత్ప్రకాశః తద్రూపాయై-* గోధిభాఃకృత్తరాత్రీటక్కలాయై।గోధి ర్లలాటం। లలాట మలికంగోధిత్యమరః తస్య భాసా తేజసా కృత్తా ఖండితా రాత్రీశః చన్ద్రస్య కలా శకలం యయా సా। *నిత్యపూతామితప్రాభవాయై-నిత్యం పూతం అమితం అవేలం ప్రాభవం సామర్థ్యం యస్యా స్సా-*హస్తసంబద్ధనీరేశయాయై-హస్తే పాణౌ సంబద్ధం సంలగ్నం నీరేశయం కమలం యస్యా స్సా-*దేవతారూపశయ్యాశయాయై దేవతాః బ్రహ్మాదయో మంచతాం ప్రాప్తా ఇత్యాగమ ప్రసిద్ధిః-*పయోజాస్త్రశత్రూత్తమాయై। పయోజాస్త్రశత్రు శ్శివ స్తస్యోత్తమా వరవర్ణినీ తస్యై-*కాన్తిమత్యై కలావత్యై-* కాన్తిమత్యై కాన్తామనోజ్ఞా మతి ర్బుద్ధిర్య స్యా స్సా-*సర్వసూత్యై సర్వస్య ప్రపంచస్య సూత్యై జనన్యై-*సౌమ్యభూత్యై సౌమ్యా అకరాళా భూతి స్సంపత్ యస్యా స్తస్యై-* శర్మదాయై సుఖదాయై-* శైలజాయై అగజాతాయై.

" విద్వాంసులెల్లన్ హకారంబెకానీసకారంబెకా నీనకారంబెకానీ వచింపంగ దగున్మందుగానిందుగా దేని నాదిందకారంబుఁ గల్పించియామీఁద నెల్లం దకారంబులే మెండుగా నిచ్చకున్వచ్చునందాక నిర్మించి గుర్వంతముం జేసినన్ దండకంబండ్రు " అనియపకవీయమునందు దండకలక్షణము.

సీ. మొదలఁ దళుదళు • క్కనురిక్క ఱేనితోఁ
గూర్మి పైఁ గ్రమ్ముక • న్గొనలతోడ

నెమ్మోముతమ్మిపై ♦ నిగుడులేనవ్వుతో
నుదుటిచూపున నొప్పు♦నుదుటితోడ
పాలిండ్ల నొరయుము♦త్యాలసరాలతోఁ
బూలదండఁ దనర్చు♦కేలితోడ
నడుగుల జీరుపు♦త్తడివలిపెమ్ముతోఁ
దావి గ్రమ్మెడు మేని♦తీవతోడ

తే. నలరి వలిగట్టుపట్టి త♦న్గొలిచి వేల్పు
టింతితలమిన్న లేతేర ♦ నెల్లవారు
గాంచి యబ్బురు మదిఁ జాల ♦ నుంచఁ బుడమి
సామిముంగల నపుడు సా♦క్షాత్కరించె. 32

టీ. ఔదలన్=శిరమునందు; తళుతళుక్కను = తళతళయని ప్రకాశించు; రిక్కఱేని తోన్=రేఱేనితోడ; కూర్మి=కరుణ; పైక్రమ్ముకన్గొనలతోడన్ = పైకొనునట్టి కటాక్షములతో; నెమ్మోముతమ్మిపైన్=సుందరమగు ముఖపద్మమునందు; నిగుడులేనవ్వుతోన్= వ్యాపించుచిఱునగవుతోడ; నుదుటిచూపునన్=లలాటలోచనముచేత; ఒప్పునుదుటితోడన్ = ప్రకాశించునొసటితోడ; పాలిండ్లన్=కుచములను;ఒరయుముత్యాలసరాలతోన్.—ఒరయు=రాయుచున్న, ముత్యాలసరాలతోన్=ముక్తాహారములతో; పూలదండన్=పూసరముచే; తనర్చుకేలితోడన్=ప్రకాశించుకరముచేత; అడుగులన్ = పాదములయందు; జీరుపుత్తడివలిపెమ్ముతోన్=జీరాడు బంగరుమడుగువస్త్రముతో;తావిక్రమ్మెడు మేనితీవతోడన్=వలపుకొనునట్టిలతవలెనున్న శరీరముతో; అలరి=సంతసించి; వలిగట్టుపట్టి=హిమవంతునకు కూఁతురగు పార్వతీదేవి; తన్గొలిచి=తన్ను సేవించి; వేల్పుటింతితలమిన్నలు=శ్రేష్ఠలగుదేవాంగనలు; ఏతేరన్= వచ్చుచుండఁగ; ఎల్లవారు=సమస్తజనులు; కాంచి=చూచి ; అబ్బురున్ = అద్భుతమును; మదిన్=మనమునందు; చాలన్=మిక్కిలి;ఉంచన్=ఉంచుచుండఁగా;పుడమిసామిముంగలన్= క్షణదోదయరాజునెదుట; అపుడు=ఆసమయమందు; సాక్షాత్కరించెన్=ప్రత్యక్షమాయెను.

అనఁగా శిరమునందుఁ బ్రకాశించుచంద్రుఁడును దయారసము నొలుకుకను తుదలును చిఱునగవును ఫాలలోచనమును చనుఁగవనొరయుముత్యపుసరులును పూసరముచే నొప్పుకేల్దమ్మియును బంగరువస్త్రమును పరిమళించునంగలతికయు నొప్పార నెల్లరు వింత నొంది చూచుచుండ గట్టురాపట్టి పుడమియొడయనియెదుటఁ బ్రత్యక్ష మాయె నని భావము.

ఉ. ఇట్టు లపారతత్పరత ♦ హెచ్చఁగ నాసెగకంటివేల్పురా
పట్టపుదేవి తద్ధరణి♦పాలకుముంగలఁ దోఁప వేడుక

ల్మట్టె గయ న్మహీశ్వరులు • మంచతలంబుల నిల్చి భక్తిఁ జే
పట్టి లలాటవీథిఁ గర• పంకరుహాంజలు లుంచి రందఱున్. 33

టీ. ఇట్టులు=ఈప్రకారము; తత్పరత=ఆసక్తి; హెచ్చఁగన్ = అతిశయింపఁగ; అ
గకంటి వేల్పురాపట్టపుదేవి=వీతిహోత్రుఁడు నేత్రముగాఁగల దేవదేవునికిఁ బట్టపురాణియగ
పార్వతి; తద్ధరణిపాలకుముంగలన్=ఆ పుడమిసామియెదుట; తోఁపన్=కనుపట్టఁగా; వేడు
కల్=వినోదములు; మట్టెగయన్=మితిమీఱఁగా; మహీశ్వరులు = రాజులు; మంచతలంబు
లన్=మంచప్రదేశములయందు; నిల్చి=నిలుచుకొని; భక్తిన్=భక్తిని; చేపట్టి=గ్రహించి; లలా
టవీథిన్=నొసటిపట్టున; అందఱున్=ఎల్లరును; కరపంకరుహాంజలులు=కేలుదామరమోడ్పుల
ను; ఉంచిరి=ఉనిచిరి.

అనఁగా నాక్షణదోదయునియెదుటఁ బార్వతి ప్రత్యక్షము కాఁగానె రాజు లందఱు
మంచములపై నిలుచుండి భక్తిచేఁ గేలు మోడ్చి రని భావము.

శా. ఆవేళన్ క్షణదోదయక్షితితలా•ధ్యక్షుండు తత్పాదరా
జీవద్వంద్వము మౌళిఁ జేర్చి వినయ•శ్రీఁ జంద్రికం దన్మహా
దేవప్రేయసి కప్పగింప నటఁ దో• డ్తెప్పించె వేగ న్వయ
స్యావారంబుల నాత్మలోచనకృత•వ్యాపారము ల్పంపఁగన్. 34

టీ. ఆవేళన్=ఆసమయమందు; క్షణదోదయక్షితితలాధ్యక్షుండు=క్షణదోదయరాజు; త
త్పాదరాజీవద్వంద్వము.—తత్=ఆపార్వతీదేవియొక్క, పాదరాజీవ ద్వంద్వము=పదపద్మ
యుగమును; మౌళిన్=శిరమునందు; చేర్చి=కదియించి; వినయశ్రీన్ = వినయసంపదతో;
చంద్రికన్=చంద్రికను; తన్మహాదేవప్రేయసికిన్ = శంకరునికిఁ బ్రియురాలగునాపార్వతీదేవికి;
అప్పగింపన్=ఒప్పగించుటకై; అటన్=అటుపిమ్మట; వయస్యావారంబులన్=చెలికత్తెలగుం
పులను; ఆత్మలోచన కృతవ్యాపారముల్.—ఆత్మ=తనయొక్క, లోచన=నేత్రములచేత, కృ
త=చేయఁబడిన, వ్యాపారముల్=పనులు; పంపఁగన్=ఆజ్ఞాపింపఁగ; వేగన్ =శీఘ్రముగ; తో
డ్తెప్పించెన్=తోడ్కొని రప్పించెను.

అనఁగా క్షణదోదయరాజు ప్రత్యక్షమయిన నా పార్వతీదేవికి నమస్కరించి వినయం
బునఁ జంద్రిక నప్పగించుటకై కంటిసైగచేఁజెలులంబనిచి చంద్రికను బిలిపించెనని భావము.

సీ. నానావనీపాళి• నవ్యరాగోత్సవ
సంధాయకామూల్య• చైత్రవేళ
రతిసర్గవిలసనో• దితచాతురీకనీ
రజసూతికల్పిత• రత్నపుత్రి

యద్రికన్యాబ్ధిము•ఖ్యవిధావినిర్యాత
పాంచాలభూపాల•భాగ్యలక్ష్మి
దివ్యాళిపరివార•దేవతాజనమధ్య
తలరోచమానకం•దర్పవిద్య

తే. తనువిభాద్విగుణీభూత•ధాగధగ్య
సంగతానర్ఘమణిపరి•ష్కారయుక్త
తన్మహారాజపుత్త్రిక • ధరణినాయ
కాజ్ఞ సొగ సెచ్చ నాస్థాని • కపుడు వచ్చె. 35

టీ. నానావనీపాళి నవ్యరాగోత్సవ నంధాయకామూల్య చైత్రవేళ.— నానా=అనేకములగు, అవనీపాళి=రాజబృందమునకు, నవ్య=నూతనమగు, రాగ = అనురాగమనెడు, ఉత్సవ=పండుగను, సంధాయక=ఘటిల్లఁజేయు, అమూల్య=వెలలేని, అనఁగనుత్కృష్టమగుననుట, చైత్రవేళ=వసంతకాలము; ఇచట నానా=అనేకవిధములగు, వనీ=కాననములయొక్క, యను నర్థాంతరము దోఁచుచున్నది; రతిసర్గవిలసనోదిత చాతురీకనీరజ నూతికల్పితరత్నపుత్రి.—రతి=మన్మథునిభార్యయగు రతీదేవియొక్క, సర్గ=సృష్టిచేతనైన, విలసన= ప్రకాశముచేత, ఉదిత=పుట్టిన, చాతురీక=చాతుర్యముగల, ఇచటనద్యుదితశ్చేతి కప్రత్యయము, నకపీతినిషేధముచే హ్రస్వము లేదు, నీరజనూతి = నలువచే, కల్పిత=రచియింపఁబడిన, రత్నపుత్రి=రత్నపుబొమ్మ; అద్రికన్యాబ్ధిముఖ్యవిధా వినిర్యాతపాంచాలభూపాలభాగ్యలక్ష్మి.—అద్రికన్యా=పార్వతీదేవియనెడు, అబ్ధిముఖ్యా=పాలమున్నీటియొక్క, విధా=ప్రకారమువలన, వినిర్యాత = వెల్వడిన, పాంచాలభూపాల = తుఃణదోదయునియొక్క, భాగ్యలక్ష్మి = సుకృలక్ష్మి;చంద్రిక పార్వత్యనుగ్రహమువలన నీతుఃణదోదయరాజునకు జన్మించుటచే పార్వతియనునముద్రమునుండి వెడలినదని చెప్పఁబడినది; దివ్యాళిపరివార దేవతాజనమధ్యతలరోచమానకందర్పవిద్య.—దివ్య=సుందరులగు, ఆళి=సఖులనెడు, పరివార దేవతాజన= అంగదేవతాజనములయొక్క, మధ్యతల=మధ్యప్రదేశమందు, రోచమాన=ప్రకాశించుచున్న, కందర్పవిద్య=మన్మథవిద్య; తనువిభాద్విగుణీభూతధాగధగ్య సంగతానర్ఘ మణి పరిష్కారయుక్త.—తనువిభా=దేహకాంతిచేత, ద్విగుణీభూత=రెట్టింపుగాఁ జేయఁబడిన, ధాగధగ్య = ధగధగయనుప్రకాశముతో, సంగత=కూడుకొన్న, అనర్ఘ = అమూల్యమగు, మణి=మణులయొక్క, పరిష్కార=అలంకారములతో, యుక్త=కూడుకొన్నదగు;తన్మహారాజపుత్రిక=తుఃణదోదయరాజుకూఁతురగునాచంద్రిక; ధరణినాయకాజ్ఞక = తుఃణదోదయునిపంపున; సొగసు=అందము;ఎచ్చక =అతిశయింపఁగ; ఆస్థానికిక=ఆస్థానమునకు; అపుడు=ఆసమయమందు; వచ్చెక = వచ్చెను.

అనఁగా రాజు లనువనపాళికి సామినివలె, రతిని జేసి జాణతనము నొందిననలువచేఁ గల్పిత యగుమణిపుత్రికవలె, గట్టురాపట్టి యనుపాలమున్నీటివలన వెడలినట్టి తుఃణదోదయ

సుకృతలక్ష్మివలె, అంగదేవతల నడుమనవంగవిద్యవలె చెలికత్తెలనడుమం బ్రకాశించుచు, తనదేహకాంతిచే రెట్టింపఁబడియున్న కాంతిగల మణిభూషణంబులచే నొప్పు నాచంద్రిక రాజునాజ్ఞచే నాస్థానమునకు వచ్చె నని భావము.

ఉ. వచ్చుసువర్ణగౌరి జన♦వర్యకుమారి విలోచనంబులం
గ్రచ్చుక పట్టి యచ్చటిధ♦రాపతిసూనునికాయ మయ్యెడ
న్మెచ్చి నుతించె నిశ్చలత ♦ మేనులఁ గన్నుల సమ్మదాశ్రువు
ల్మచ్చిక లాత్మ నౌదలఁ జ♦లాచలభావము నివ్వటిల్లఁగన్. 36

టీ. వచ్చుసువర్ణగౌరిన్.—వచ్చు=వచ్చుచున్న, సువర్ణగౌరిన్=పసిఁడివన్నెగల; జనవర్యకుమారిన్=చంద్రికను; అచ్చటి ధరాపతిసూనునికాయము=ఆస్థలమందున్న రాకొమరుల గుంపు; విలోచనంబులన్=కన్నులచే; గ్రచ్చుకపట్టి = చుట్టిపట్టుకొని; మేనులన్=దేహములందు; నిశ్చలత=చాంచల్యము; కన్నులన్=కనులయందు; సమ్మదాశ్రువుల్= ఆనందబాష్పములు; ఆత్మలన్=మనస్సులయందు; మచ్చికలు=మోహములు; ఔదలన్=శిరమునందు; చలాచలభావము=చంచలత్వమును; నివ్వటిల్లఁగన్=అతిశయింపఁగ; మెచ్చి=మెచ్చుకొని; అయ్యెడన్=ఆసమయమందు; నుతించెన్=శ్లాఘించెను.

సీ. క్రొమ్మించుతీవయో ♦ క్రొమ్మించుతీవకు
నిశ్చలాంగద్యుతి ♦ నెగడు టెట్లు
జాళువాబొమ్మయో ♦ జాళువాబొమ్మకు
మేనఁ జల్లనితావి ♦ మెలఁగు టెట్లు
మందారవల్లియో ♦ మందారవల్లికి
మందయానంబు పెం♦పొందు టెట్లు
మరుఁ డెక్కుదంతియో ♦ మరుఁ డెక్కుదంతికిఁ
బలువాక్యనైపుణుల్ ♦ గలుగు టెట్లు
తే. లౌర యీనారిచారుశృం♦గారభంగి
బళిరె యీచానసౌందర్య♦విలసనంబు
లహహ యీబోటిబిబ్బోక♦హావగరిమ
మనుచు కొందఱు వర్ణించి ♦ రనుపమోక్తి. 37

టీ. క్రొమ్మించుతీవయో = క్రొత్తమెఱుఁగుతీవయా ? క్రొమ్మించుతీవకున్ = క్రొత్తమెఱుఁగుతీఁగకు; నిశ్చలాంగద్యుతి.—నిశ్చల = చలింపని, అంగ = శరీరముయొక్క, ద్యుతి =

కాంతి; నెగడు టెట్లు = పెంపొందు టెట్లు ? కనుక మెఱపుతీవ కాదని భావము. జాళువా బొమ్మయో = బంగరుబొమ్మయా ? జాళువాబొమ్మకున్ = బంగరుబొమ్మకు ; మేనన్ = దేహమునందు ; చల్లనితావి = చల్లనివాసన; మెలఁగుట = కలసియుండుట ; ఎట్లు=ఏరీతి ? మందారవల్లియో=పారిజాతలతయో; మందారవల్లికిన్ = పారిజాతలతకు ; మందయానంబు= తిన్ననినడక; పెంపొందుట=వృద్ధిఁబొందుట ; ఎట్లు=ఏవిధము ? మరుఁడెక్కుదంతియో.— మరుఁడు=మన్మథుఁడు, ఎక్కుదంతియో=ఎక్కునట్టిగజమో; మరుఁడెక్కుదంతికిన్=మన్మథుఁ డెక్కుగజమునకు; పలువాక్యనైపుణుల్ = నానావిధములగువచనములందలిజాణతనములు; కలుగుటెట్టులు=చేకూఱుటెట్లు ? ఈనారిచారుశృంగారభంగి=ఈచంద్రికయొక్కమనోహర మగునలంకారపురీతి; ఔర=ఆశ్చర్యము ! ఈచానసౌందర్యవిలసనంబులు.—ఈచాన=ఈచంద్రికయొక్క, సౌందర్య=చక్కఁదనముయొక్క, విలసనంబులు=ప్రకాశములు;బళిరె=బళా! ఈబోటిబిబ్బోకహావగరిమము.—ఈబోటి=ఈచంద్రికయొక్క, బిబ్బోక=స్త్రీలకునిష్టవస్తువులయందుఁగలిగెడు ననాదరము,హావ=కటాక్షభ్రూవిక్షేపాదులచేనంగనలు దెలుపుమనోవికారము, గరిమము=పైరెంటియొక్కయతిశయము; అహహా=ఆశ్చర్యము! అనుచున్=ఈప్రకారమువచించుచు; కొందఱు=కొందఱురాసుతులు; అనుపమోక్తిన్=నిస్సమానమగునుక్తిచేత; వర్ణించిరి=నుతించిరి. ‘‘ఇష్టే ప్యనాదరో గర్వా న్మానా ద్బిబ్బోక ఉచ్యతే। భావ ఈషత్ప్రకాశో య స్స హావ ఇతి కథ్యతే’’ ‘‘అని బిబ్బోకహావలక్షణములు.

అనఁగాఁ గొందఱు రాకొమరులు చంద్రికను జూచి మెఱపుఁదీవయా యని సంశయించి మెఱపుఁదీవకుఁ జలింపనిదేహకాంతు లెక్కడి వనియు కాదేని బంగరుబొమ్మయో యని దానికి శరీరమందుఁ జల్లనివలపు లెట్లుదయించు ననియు లేదా మందారలతయా యని యాతీవకు మెల్లనినడక లెట్లు చేకూఱు ననియు మదనునిగజమాయని యాగజమునకు పలువిధములగుపలుకు లెట్లు నమకూడు ననియు నిట్లు నుతించిరని భావము.

ఈపద్యమునందు సందేహాలంకారము. ‘‘స్యాత్స్మృతిభ్రాన్తిసందేహై స్తదఙ్కాలంకృతిత్రయమ్’’ అని దాని లక్షణము.

చ. పలుచనివారికిం బొడమి ♦ భాసురపుణ్యజనాహితాత్మునిం
గలసి చెలంగ నొప్ప దని ♦ కల్మివెలంది దలంచి ధాత్రి ని
య్యలఘునకు స్జనించె నము♦దంచితపుణ్యజనాప్తు నొక్కరా
జు లలి వరింపఁ గోరి యని ♦ సొంపుగ నెంచిరి కొంద ఱాత్మలన్. 38

టీ. కల్మివెలంది=లక్ష్మీదేవి; పలుచనివారికిన్=తక్కువవారికి; పొడమి=పుట్టి; భాసురపుణ్యజనాహితాత్మునిన్.—భాసుర=ప్రకాశించు, పుణ్యజన=సాధుజనమునకు, అహిత=అప్రియముగు, ఆత్మునిన్=మనసుగలవానిని; ఇచటపలుచనివారి కనఁగ పలుచనినీటి కనియు పుణ్యజనాహితాత్ముని ననఁగా, పుణ్యజన=రాక్షసులకు, ‘‘యాతుధానఃపుణ్యజనః’’ అనియమరుఁడు,

అహితమగుమనస్సుగలవిష్ణుమూర్తి యనియు స్వభావార్థము; కలని=పెనఁగి; చెలంగన్=చెలఁగుట; ఒప్పదు=తగదు. అనితలంచి = ఈప్రకారమునిశ్చయించుకొని ; ధాత్రిన్ = భూమియందు ; ఇయ్యలఘునకున్ = ఈగొప్పకులమందుఁబుట్టినఘనునికి ; సముదంచితపుణ్యజనావ్రతున్ = మిక్కిలియొప్పుచున్న సాధుజనహితుఁడగు, మిక్కిలియొప్పుచున్న పుణ్యజనుఁడనఁగా యక్షుఁడైనకుముదునకు హితుఁడగుఅనితోఁచుచున్నది ; ఒక్కరాజున్ = ఒకరాజును; లలిన్=ఆసక్తిచేత; వరింపఁగోరి=వరియింపఁదలఁచి; జనించెన్ = పుట్టెను. అని=ఈప్రకారము; కొందఱు=కొంతమందిరాజులు; ఆత్మలన్=మనములయందు; సొంపుగన్=సంతోషముచేత; ఎంచిరి=కొనియాడిరి.

అనఁగా కొందఱు రాజులు ఈచంద్రికను చూచి లక్ష్మి తక్కువ యగుకులమువారికిఁ బుట్టి పుణ్యజనవిరోధి యగువానిని జెట్టవట్టి యుండుట కన్నఁ బుడమిలో సాధుజనహితుఁడగునొకయొడయుని వివాహమాడి యుండుట మంచి దని దలఁచి ఈఘనునికి జనించె నని నుతించి రని భావము. కుముదుఁ డను యక్షునకు హితుఁ డైనచంద్రుని వరింపఁ గోరి పుట్టె నని ధ్వని.

సీ. అఖిలవర్ణితచర్య ♦ యగునార్యఁ గర్కశా
కృతికి రాతికిఁ బుట్ట ♦ నెనపినసడి
యసమకళాజాల♦వసతికి రతి కనం
గవిలాసనంలబ్ధి ♦ గఱపు రట్టు
ఘనరసోదయయుక్తిఁ ♦ దనరుసుర్వరఁ బంక
సంకులంగాఁ దార్పఁ ♦ జాలు మాట
సుమనోవనాథ్యవృ♦త్తి మహేంద్రవనిత స్వ
శ్శ్రీయుక్తగాఁ ఘటిం♦చినకొఱంత
తే. సత్కులోద్భవ వరవిలా♦సయుత ననఘ
మానితశ్రీవిరాజిత ♦ నీనెలంతఁ
గోరి నిర్మించి వారించి♦కొనియె నలువ
యనుచు నెంచిరి కొందఱిం♦పెనయ వేడ్క. 39

టీ. నలువ=బ్రహ్మదేవుఁడు; అఖిలవర్ణితచర్య.—అఖిల=ఎల్లవారిచేత, వర్ణిత=నుతింపఁబడిన. చర్య=చరిత్రగలది; అగునార్యన్=అగునట్టిపార్వతిదేవిని, పూజ్యురాలను అనునర్థము స్ఫురించుచున్నది ; కర్కశాకృతికిన్ = కఠినమగునాకారముగల ; రాతికిన్=చట్టునకు; కర్కశాకృతికిరాతికిన్=కఠినాకారముగలనొకకిరాతస్త్రీకని యర్థము స్ఫురించుచున్నది ; పుట్టన్ = జన్మించునటులు; ఎనపినసడిన్ = పొందించినట్టియపకీర్తిని; అసమకలాజాలవసతికిన్.—అసమ=నిస్సమానములగు, కలా=కాంతులయొక్క, జాల=సమూహములయొక్క, వస

తికిన్=నివాసమైన; రతికిన్=రతీదేవికి; సాటిలేనివిద్యలకు నివాసమయిన యువిదకనునర్థము దోఁచుచున్నది; అనంగవిలాససంలబ్ధిన్.—అనంగ=మన్మథునియొక్క, విలాస=లీలయొక్క, సంలబ్ధిన్=ప్రాప్తిని; కలుపురట్టున్=అభ్యసింపఁజేయునిందను; అనంగవిలాస=అంగములులేని విలాసములయొక్కయనియర్థముదోఁచుచున్నది; ఘనరసోదయయుక్తిన్.—ఘన=అధికమగు, రస=శృంగారముయొక్క, ఉదయ=ఆవిర్భావముయొక్క, యుక్తిన్=సంబంధముచేత, ఘనరస=జలముయొక్క, "మేఘపుష్పంఘనరస" మ్మనియమరుఁడు, ఉదయ=ఆవిర్భావముయొక్క, యుక్తిన్=సంబంధముచేత ననిస్వభావార్థము; తనరునుర్వరన్ = ఒప్పుచున్నభూమిని, ఒకకాంత నని యర్థము దోఁచుచున్నది; పంకసంకులఁగాన్.—పంక = పాపముచేత, సంకులఁగాన్=వ్యాకులయయినదానినిగా, ఇచట, పంక=బురదచేతననిస్వభావార్థము; తార్పఁజాలుమాటన్=చేయఁజాలునట్టియపకీర్తిని; సుమనోవనాఢ్యవృత్తిన్.—సుమనోవన=నందనవనముచేత, లేదా, దేవసంరక్షణముచేత, ఆఢ్య = సంపన్నమైన, వృత్తిన్ = వ్యాపారముకల; మహేంద్రవనితన్=శచీదేవిని; ఇచట, సుమనోవన=విద్వత్సంరక్షణమందు, సంపన్నమైన వృత్తిగల, మహేంద్రవనితన్=పరమైశ్వర్యముగలపురుషునికాంతననునర్థము దోఁచుచున్నది; స్వశ్రీయుక్తఁగాన్.—సు=అధికమగు, అశ్రీ=అలక్ష్మితో, యుక్తఁగాన్=కూడినదానినిగా; స్వశ్రీ=స్వర్గసంపదతో, కూడినదానినిగాననిస్వభావార్థము; ఘటించినకొఱంతన్ = చేసినకొఱఁతను; గీతియందుఁ గ్రమముగానన్వయము తెలియవలయు; సత్కులోద్భవన్ = శ్రేష్ఠకులమందుఁబుట్టినదియు; వరవిలాసయుతన్=శ్రేష్ఠమగువిలాసములుగలదియు; అనఘన్=పాపరహితయు; మానితశ్రీవిరాజితన్=పూజ్యమగుసంపదచేతఁబ్రకాశించునదియునగు; ఈనెలంతన్=ఈచంద్రికను; నిర్మించి=చేసి; వారించికొనియెన్=పోఁగొట్టుకొనెను.

అనఁగా లోకోత్తరయగునార్యను కఠిన మగుచట్టునకుఁ బుట్టునటులుచేసినయపకీర్తిని రతీదేవి కనంగవిలాసముకల్గించినరట్టును ఉర్వరను పంకమలినయైనదానినిగాఁ జేసిన యపవాదమును శచీదేవిని సంపదలేనిదానినిఁగాఁ జేసిన కొఱఁతను, నలువ, చంద్రికను సత్కులప్రసూతత్వాదిగుణములుగలదానినిగాఁ జేసి వారించికొనియె నని భావము.

క. అని యీగతి నృపతతి తి, య్యనిపలుకులు వెలయఁ బొగడు♦నయ్యెడ నాళీ
జనములు చెంతలఁ గొలువఁగఁ, గనకలతాగాత్రి జనకుఁ♦ గదిసెముదమునన్.

టీ. అని ఈగతిన్=ఈరీతిగ; నృపతతి=రాజబృందము; తియ్యనిపలుకులు=మధురమగుమాటలు; వెలయన్=ప్రకాశించునట్లు; పొగడునయ్యెడన్ =నుతించుసమయమందు; ఆళీజనములు=సకియలు; చెంతలన్=ఇరుప్రక్కలయందు; కొలువఁగన్ = సేవింపఁగ; కనకలతాగాత్రి=బంగరుతీవవంటిమేనుగలచంద్రిక; ముదమునన్ = సంతసముచేత; జనకున్=తండ్రిని; కదిసెన్=చేరెను.

ఇట్లు రాజులు నుతింపఁగ చెలులు చెంతల సేవించుచు రాఁగాఁ జంద్రిక జనకునిఁ జేరె నని భావము.

మ. తరుణీతల్లజ మిట్లు తన్నృపతిచెం • తం జేరి యవ్వేళ భ
క్తి రహింపం దదనుజ్ఞఁ గంతురిపుపం • కేజాక్షికి న్మ్రొక్కె ని
ర్భరవీక్షాగతి మార • కాండపరిస • ర్గం బూన్చి యుర్వీశదు
ష్కరమానంబు హరించుమంతుఁ గని చ • క్కం బాపు మన్పోలికన్.

టీ. తరుణీతల్లజము=వనితలయందుఁ బ్రశస్తయగు చంద్రిక; "మతల్లికా మచర్చికా ప్రకాండ ముద్ధతల్లజౌ ప్రశస్తవాచకాన్యమూని" అనియమరుఁడు; ఇట్లు=ఈప్రకారము, తన్నృపతి చెంతన్=ఆక్షణదోదయ రాజు చెంగటను; చేరి=పొంది; అవ్వేళన్=ఆసమయమందు; భక్తిరహింపన్=భక్తియతిశయింపఁగా; తదనుజ్ఞన్=ఆరాజు నాజ్ఞ చేత; కంతురిపుపంకేజాక్షికిన్.—కంతురిపు=ఈశ్వరునియొక్క, పంకేజాక్షికిన్=కాంతయగు పార్వతీదేవికి; నిర్భరవీక్షాగతిన్—నిర్భర=పరిపూర్ణమగు, వీక్షా=కటాక్షములయొక్క, గతిన్=ప్రచారము చేత; మారకాండపరిసర్గంబు.—మార=మన్మథులయొక్క, కాండ=సమూహములయొక్క, పరిసర్గంబు=సృష్టిని, ఊన్చి=చేసి, మన్మథసమూహములయొక్క సృష్టినని భావము; ఉర్వీశదుష్కరమానంబు.—ఉరు=అధికుఁడైన, ఈశ=శంకరునియొక్క, దుష్కర=అనివార్యమయిన, మానంబు = మానమును, ఉర్వీశ=రాజులయొక్క, దుష్కరమగుమానంబుననిస్వభావార్థము; హరించుమంతున్=అపహరించునట్టియపరాధమును; కని=చూచి; చక్కన్=చక్కఁగ; పాపుమన్పోలికన్=పోఁగొట్టుమన్న రీతిగ; మ్రొక్కెన్=నమస్కరించెను.

అనఁగాఁ జంద్రిక క్షణదోదయు నియాజ్ఞ చేఁ బార్వతీదేవిని స్వకటాక్షప్రచారముల వలనఁ బెక్కండ్ర మన్మథుల సృజించి ఉర్వీశ మానమును హరించునట్టి యపరాధమును బోఁగొట్టుమనియో యన్నట్లు నమస్కరించెనని భావము.

తే. నతి యొనర్చిన చెలువ క • న్నగతనూజ
యపు డభీష్టార్థసంసిద్ధి • ర స్తటంచు
హాళి దీవించి కౌఁగిట • నలమి కనక
మంగళాక్షతపాళికల్ • మౌళిఁ దార్చె. 42

టీ. నతి=నమస్కారమును; ఒనర్చినచెలువకున్=చేసినచంద్రికకు; అన్నగతనూజ = ఆ పార్వతీదేవి; అపుడు=ఆసమయమందు; అభీష్టార్థసంసిద్ధిః.—అభీష్ట=కోరఁబడిన, అర్థ = ప్రయోజనముయొక్క. "అర్థోభిధేయ రై వస్తు ప్రయోజననివృత్తిషు" అని యమరుఁడు, సంసిద్ధిః= ప్రాప్తి; అస్తు=అగుఁగాక; అటంచున్=అని; హాళిన్=ప్రీతితో; దీవించి=ఆశీర్వదించి; కౌఁగిటన్=కౌఁగిలియందు; అలమి=ఆక్రమించి; కనకమంగళాక్షత పాళికల్=కనకవర్ణములగు మంగళప్రదములైనయక్షతలయొక్క సమూహములను; మౌళిన్=శిరమునందు; తార్చెన్= ఉంచెను.

వ. అంతఁ జతురంతయానంబున నాకాంతాశిరోమణి నుండ నియోగించి యంచిత మనోంచలనిరాకుంచితప్రమదసమాజయై యాగిరిరాజతనూజ సఖీజనంబులు వెనువెంట నడువ నెచ్చెలిచెలు వూని తత్పార్శ్వంబున నడచుచు రాజసభముఖంబుఁ జేరి యభంగమేరుశృంగంబులం దోఁచుసింగంపుఁగొదమల తెఱంగునఁ గాంచనమంచనికాయంబులం జూపట్టుసకలాంతరీపానంతాకాంతలతాంతసాయక సంతానంబులం జూపి క్రమంబున నొక్కొక్కని దేశాదికంబులు దేటపడఁ జాతుర్యంబున నిట్లనియె. 43

టీ. చతురంతయానంబునన్=ఎనమండ్రుమోయు వాహనవిశేషమునందు; ఆకాంతాశిరోమణిన్=నారీచూడామణియగు నాచంద్రికను; ఉండన్=ఉండుటకు; నియోగించి=ఆజ్ఞాపించి; అంచితమనోంచల నిరాకుంచిత ప్రమద సమాజయై.—అంచిత=ప్రకాశించుచున్న, మనోంచల=మనోవీథియందు, నిరాకుంచిత=వికసించిన, ప్రమద=సంతసములయొక్క, సమాజయై=సమూహముగలదియై; ఆగిరిరాజతనూజ=గట్టురాపట్టియగు యాపార్వతీదేవి; సఖీజనంబులు=సకియలు; వెనువెంటనడువన్=వెంబడినడుచుచుండఁగ; నెచ్చెలిచెలువుఊని=ప్రియసఖివిధమువహించి; తత్పార్శ్వంబునన్=ఆచంద్రికప్రక్కను; నడచుచున్; రాజసభముఖంబుఁజేరి = రాజసభయొక్క పూర్వభాగమునుజేరి; అభంగమేరు శృంగంబులన్.— అభంగ = అప్రతిహతములగు, మేరుశృంగంబులన్ = సుమేరు శిఖరములయందు; తోఁచుసింగంపుఁగొదమల తెఱంగునన్=కాన్పించు సింగపుపిల్లలపగిది; కాంచనమంచనికాయంబులన్ = బంగరు మంచముల గుంపులమీఁద; చూపట్టుసకలాంతరీపానంతాకాంతల తాంతసాయక సంతానంబులన్.—చూపట్టు=కనిపించుచున్న, సకల = ఎల్ల, అంతరీపానంతాకాంతల తాంతసాయక=మన్మథులవంటిద్వీపాధిపతులయొక్క, సంతానంబులన్=సమూహములను; చూపి=ప్రదర్శించి; క్రమంబునన్=వరుసగా; ఒక్కొక్కని దేశాదికంబులు = ఒక్కొక్కరాజుయొక్క దేశము మొదలగువానిని; తేటపడన్=తెల్లమగునటులు; చాతుర్యంబునన్=జాణతనముచేత; ఇట్లు=వక్ష్యమాణప్రకారముగా; అనియెన్=వచించెను.

మ. కనుఁగొంటే విరిగల్వకంటి మహితో•త్కంఠాసముద్భాతి నీ
జననాథాగ్రణి నుజ్జ్వలాంఘ్రిసరసీ•జాతద్వయవ్యాప్తనూ
తనసామంతనృపచ్ఛటామకుటము•క్తాకాంతిసూనోత్కరు
న్వినుతామర్త్యనికాయుఁ బుష్కరమహా•ద్వీపావనీపాలకున్. 44

టీ. విరిగల్వకంటి=విరిసినకలువపూలవంటి కన్నులుగలచంద్రికా; ఉజ్జ్వలాంఘ్రిసరసీజాతద్వయ వ్యాప్తనూతనసామంత నృపచ్ఛటామకుట ముక్తాకాంతిసూనోత్కరున్.—ఉజ్జ్వల=ప్రకాశించు, అంఘ్రిసరసీజాత=పాదకమలములయొక్క, ద్వయ=కవను, వ్యాప్త = ఆవ

రించిన, నూతన=నవీనమగు, సామంతనృప=ఇరుగుపొరుగురాజులయొక్క, ఘటా=సమూహము యొక్క, మకుట=కిరీటములందున్న, ముక్తాకాంతి=ముత్యపుప్రకాంతుల నెడు, సూన=పుష్పముల యొక్క, ఉత్కరున్=సమూహముగలిగినవాఁడును; వినుతామర్త్యనికాయున్.—వినుత=పొగడిన, అమర్త్య=దేవతలయొక్క, నికాయున్ = సమూహముగలవాఁడును; పుష్కరమహాద్వీపావనీపాలకున్ = పుష్కరద్వీపాధిపతియునగు ; ఈజననాథాగ్రణిన్ = ఈ రాజశ్రేష్ఠుని; మహితోత్కంఠాసముద్భూతిన్.—మహిత=అధికమగు, ఉత్కంఠా="సర్వేన్ద్రియసుఖాస్వాదో యత్రాస్తీత్యభిమన్యతే తత్ప్రాప్తీచ్ఛాం ససంకల్పా ముత్కంఠాం కవయో విదుః" ఇత్యుక్తలక్షణమగు నుత్కంఠయొక్క, సముద్భూతిన్ = అతిశయముచేత; కనుఁగొంటే = చూచితివా?

అనఁగా సామంతరాజమకుటములం దున్న ముత్యములకాంతు లనెడు కుసుమబృందము చేఁ గప్పఁబడినపాదకమలములు గలపుష్కరద్వీపాధిపతి యగునీరాజశ్రేష్ఠుని జూచితివా యని భావము.

మ. పరరాజప్రబలప్రభావహరణ◆ప్రౌఢస్థితిం బొల్చునీ
నరనాథోత్తమదోఃప్రతాపకుహనా◆నాళీకమిత్రుండు దా
ధర నిర్మించుఁ జుమీ యమస్వస మిళిం◆దద్వేషిధమ్మిల్ల త
త్పరమారాతివధూసకజ్జలదృగ◆బ్జాతాంబుధారాగతిన్. 45

టీ. పరరాజప్రబలప్రభావహరణప్రౌఢస్థితిన్.—పరరాజ= శత్రురాజులయొక్క, ఉత్కృష్టుఁడగు చంద్రునియొక్క, ప్రబల=అధికమగు, ప్రభావ=ప్రతాపముయొక్క, హరణ=హరించుటయందు, ప్రౌఢస్థితిన్=సమర్థస్థితిచే; పొల్చునీనరనాథాగ్రణిదోఃప్రతాపకుహనానాళీకమిత్రుండు.—పొల్చు=ఒప్పుచున్న, ఈనరనాథాగ్రణి=ఈరాజశ్రేష్ఠునియొక్క, దోఃప్రతాప=భుజసంబంధియగు ప్రతాపమనెడు, కుహనానాళీకమిత్రుండు=కపటముగలసూర్యుఁడు; తాన్=తాను; మిళిందద్వేషిధమ్మిల్ల=భృంగములకు శత్రువగు కొప్పుగల చంద్రికా! తత్పరమారాతివధూసకజ్జలదృగబ్జాతాంబుధారాగతిన్.—తత్=ప్రసిద్ధులగు, పరమ=ఉత్కృష్టులగు, అరాతి=శత్రువులయొక్క, వధూ=స్త్రీలయొక్క, సకజ్జల=కాటుకతోఁగూడియున్న, దృగబ్జాత=నేత్రకమలములయొక్క, అంబుధారా=ఉదకధారయొక్క, గతిన్=ప్రాప్తిచేత; ధరన్=భూమియందు; యమస్వసన్ = యమునానదిని; నిర్మించున్=సృజించును. చుమీ= సత్యము!

అనఁగ పుష్కరద్వీపాధిపతి యగునీనరపతియొక్క ప్రతాప మనెడు సూర్యుఁడు శత్రురాజప్రతాపమును హరించి యుద్దామస్థితిని పొంది శత్రువనితలయొక్క కజ్జలసహితము లగు నేత్రజలములచేఁ బుడమి యమునానదిని నిర్మించు నని భావము.

మ. అతులాంభోరుహపీఠిఁ బొల్పెసఁగు స◆త్యస్వామికిన్ వియ్యలా
పతితోడ న్సహిఁ బెండ్లిమొక్కుఁ ఘటియిం◆పం జేర నీ కూన్పుఁ బో

యతఁ డాత్మేష్టఫలంబు లంతకయ ము•న్నబ్జాక్షి యాత్రోవ నూ
ర్జితశాఖావళి సాఁచి వాని వటధా•త్రీజాత మర్పింపఁగన్. 46

టీ. అబ్జాక్షి=చంద్రికా! అతులాంభోరుహపీఠిన్.—అతుల=అసమానమగు, అంభోరుహపీఠిన్=కమలాసనమందు; పొల్పెసఁగు సత్యస్వామికిన్.—పొల్పెసఁగు=మిక్కిలియొప్పుచున్న, సత్యస్వామికిన్=సత్యలోకాధిపతియగు నలువకు; ఈవు = నీవు; ఇయ్యిలాపతితోడన్=ఈభూపతితోడ; రహిన్=ప్రీతితో; పెండ్లిమ్రొక్కు=వివాహదీక్షాంతమందుఁ జేయునమస్కారమును; ఘటియింపన్=చేయుటకు; చేరన్=సమీపింపఁగ; నీకున్; అతఁడు=ఆనలువ; ఆత్మేష్టఫలంబులు.—ఆత్మ=తనకు, ఇష్ట=అనుకూలమైన, ఫలంబులు=ఫలములను; ఈన్చెబో=ఇచ్చును. ఆత్రోవన్=ఆబ్రహ్మదేవాలయమార్గమందు; అంతకయమున్న= నలువఫలము లియ్యకమునుపే; వటధాత్రీజాతము=వటవృక్షము; ఈపుష్కరద్వీపమందు నలువస్థానము త్రోవయందు ఫలంబు లొసంగుమఱ్ఱిచెట్టుండుట ప్రసిద్ధము. ఊర్జితశాఖావళిన్.—ఊర్జిత=దృఢమగు, శాఖా=కొమ్మలయొక్క, ఆవళిన్=పంక్తిని; చాఁచి=చాఁగించి; వానిన్=ఆఫలములను; అర్పింపఁగన్=ఇచ్చుచుండఁగ. దీని కీన్చు ననుక్రియతోఁ బైకన్వయము.

అనఁగ నీపుష్కరద్వీపాధిపతిని నీవు పెండ్లిచేసికొని యాద్వీపమందున్న నలువకుఁ బెండ్లిమ్రొక్కిడ నేగుతతి నాత్రోవ నున్న మఱ్ఱిచెట్టు నీవు కోరినఫలంబుల నలువకన్న మున్నొసంగు నని భావము.

చ. సరసతపాగమంబున ని•శాకరసోదరదాస్య యీమహీ
శ్వరుఁ గవగూడి నీవు విల•సజ్జలఖేల నొనర్పఁ జేరఁగా
వరసరసీభవద్విమల•వారిపయోనిధివీచు లారతుల్
కరము ఘటించుఁ గా కరుణ•కంజకరమ్ముల నాళి పాడఁగన్. 47

టీ. సరసతపాగమంబునన్.—సరస=మనోజ్ఞమగు, తపాగమంబునన్=గ్రీష్మకాలమందు; "నిదాఘఉష్ణోపగమ ఉష్ణఊష్మాగమ స్తపః" అనియమరుఁడు; నిశాకరసోదరదాస్య=చంద్రునికి సోదరునివలెనున్న ముఖముగలదానా! చంద్రునివలెనున్న ముఖముగలదని తాత్పర్యము; ఇచట సోదరశబ్దము ఇవార్థకము, "దేశీయదేశ్యరిప్వాభ సోదరాద్యా ఇవార్థకాః" అని కవికల్పలతయందున్నది; ఈ మహీశ్వరున్=ఈ పుష్కరద్వీపాధిపతిని; కవగూడి = జతగూడి; నీవు; విలసజ్జలఖేలన్.—విలసత్=ప్రకాశించుచున్న, జలఖేలన్=జలక్రీడను; ఒనర్పన్= చేయుటకు; చేరఁగాన్=సమీపింపఁగ; వరసరసీభవద్విమలవారిపయోనిధివీచులు.—వర=శ్రేష్ఠమగు, సరసీభవత్=కొలనగుచున్న, విమల=స్వచ్ఛమగు, వారి=ఉదకముగల, పయోనిధి=సముద్రముయొక్క, వీచులు=తరఁగలు; ఇచట స్త్రీత్వనిర్దేశము చేత స్త్రీలనియర్థము దోఁచుచున్నది; అరుణకంజకరమ్ములన్.—అరుణకంజ=ఎఱ్ఱదామరలనెడు, కరంబులన్=హస్తములచేత; ఆళి=అళిబృందమను చెలి; పాడఁగన్=పాటపాడుచుండఁగ; ఆరతుల్=ఆరతులను; కరంబు=మిక్కిలి; ఘటించుఁగాక=ఘటిల్లఁజేయును గాక.

అనఁగ నీవు గ్రీష్మకాలమందు నీపుష్కరద్వీపాధిపతిని గూడి స్వాదు సముద్రమ్మందు జలక్రీడ సేయంజనఁగా తరఁగలు కెందామర లనుహస్తంబులచేఁ దుష్మైదతండము పాటఁబాడఁగా నారతు లిచ్చునని భావము.

తే. అని తెలిపి హైమవతి యాల•తాంగిచిత్త
సారసము తజ్జనాధీశ•చంద్రరక్తి
నలర లేకున్కి తెలిసియు • నవ్వలఁ జనఁ
జేసె శిబికాధురంధర•శ్రేణి నపుడు. 48

టీ. ఆలతాంగి చిత్తసారసము = తీవవంటిమేనుగలయా, చంద్రిక చిత్తకమలము; తజ్జనాధీశచంద్రరక్తిన్.—తజ్జనాధీశచంద్ర = ఆరాజచంద్రునియొక్క, రక్తిన్ = అనురాగము చేత ; అలరలేకున్కిన్ = వికసింపకయుంటను ; తెలిసియున్=గుర్తించియు; హైమవతి = పార్వతీదేవి; అని=పూర్వోక్తప్రకారముగ; తెలిపి=పుష్కరద్వీపాధిపతి గుణంబులఁదెలియఁ జేసి; శిబికాధురంధరశ్రేణిన్=పల్లకిమోయుచున్నవారి గుంపును; అవ్వలఁజనన్=ఆవలఁబోవునటులు; అపుడు=ఆసమయమందు; చేసెన్=ఒనరించెను.

అనఁగా పార్వతీదేవి పుష్కరద్వీపాధిపతి యగుతజ్జనాధీశచంద్రుననురాగముచే చంద్రికచిత్తసారసము వికసింపకుండుటచేత నాందోళికను మోయువారిని ముందు చన నియోగించె నని భావము. చంద్రునివలన సారసము ముకిళించును గాని వికసించుట లోకమం దప్రసిద్ధ మని సూచించుటకుఁ జంద్రసారసపదంబుల నిటఁ గవి ప్రయోగించెను.

వ. చెంత నొక్కమహీకాంతునిం జూపి యక్కాంతువిరోధికాంత యాళికుంత
రాజయాన కిట్లనియె. 49

టీ. ఆళికుంతరాజయానకున్=హంసలవంటినడకలుగలయాచంద్రికకు ; అక్కాంతువిరోధికాంత=ఆపార్వతీదేవి ; చెంతన్=సమీపమందు ; ఒక్కమహీకాంతున్=ఒకరాజును; చూపి=కనఁబఱచి; ఇట్లు=వక్ష్యమాణప్రకారము; అనియెన్=పలికెను.

మ. జలజాతచ్ఛదదేశ్యనేత్ర కనుమీ • శాకాంతరీపేశు ను
జ్జ్వలధామౌఘవృతాశు నీఘను బుధ•స్వామివ్రజస్తుత్యుఁడై
యలరు న్వీనిసుకీర్తిశీతకిరణా•స్యామాళి వేధోండవం
క్తులు మేల్మేలిమి గుండ్లపేరుగతి క•న్గొనొప్ప నెల్లప్పుడున్. 50

టీ. జలజాతచ్ఛదదేశ్యనేత్ర=తామరరేకులవంటినేత్రములుగలదానా! ఇచట నీషదసమాప్తియందు దేశ్యప్రత్యయము; ఉజ్జ్వలధామౌఘవృతాశున్.—ఉజ్జ్వల=ప్రకాశించుచున్న, ధామ=తేజస్సుయొక్క, ఓఘ=సమూహముచే, వృత=ఆవరింపఁబడిన, ఆశున్=దిక్కు

ఋథల; శాకాంతపేపషన్ = శాకద్వీపాధిపతియగు; ఈఘనున్ = ఈగొప్పవానిని; కనుమీ=చూడుమా. ఫీనిసుకీర్తిశీతకిరణాస్యామాళి=వీనికీర్త్యంగన; వేధోండపంక్తులు=బ్రహ్మాండసమూహములు; మేల్మేలిమి గుండ్లపేరుగతిన్=అతిశ్రేష్ఠముగుగుండ్లదండరీతిగ; ఎల్లప్పుడున్=ఎల్లకాలము; కన్గొనొప్పన్=చూచుటకు నొప్పుచుండఁగ; బుధస్వామి వ్రజ స్తుత్యయై=దేవతాశ్రేష్ఠులయొక్క సంఘముచేతఁ గొనియాడఁదగినదియై; అలరున్=ఒప్పును.

ఈశాకద్వీపాధిపతి కీర్తికాంతకు బ్రహ్మాండములు గుండ్లహారమువలె నొప్పునని తాత్పర్యము, అత్యుక్త్యలంకారము. అత్యుక్తి రద్భుతాతథ్య శౌర్యౌ దార్యాదివర్ణనమ్''అని తల్లక్షణము.

మ. ధర నేతన్మహిపాలచంద్రకృతని•త్యస్పర్శనాంభఃపరం
పర లప్రత్నమహాంబురాశిగతిఁ దోఁ•పం గొమ్మ నిచ్చల్ తదం
తరవీథి న్బడబాగ్నికీలతతి యం•దం బూని భర్మావనీ
ధరము న్మౌక్తికరీతిఁ దాల్చి యుడుసం•తానంబులుం జూ పడున్. 51

టీ. ధరన్=భూమియందు;ఏతన్మహిపాలచంద్రకృతనిత్యస్పర్శనాంభఃపరంపరలు.—ఏతన్మహిపాలచంద్ర=ఈరాజచంద్రునిచేత, కృత=చేయఁబడిన, నిత్యస్పర్శనాంభః=నిత్యదానోదకములయొక్క, పరంపరలు=సమూహములు;అప్రత్నమహాంబురాశిగతిన్=క్రొత్తమున్నీటి భంగి; తోఁపన్=తోఁచుచుండఁగా; కొమ్మ=చంద్రికా ! నిచ్చల్=ఎల్లపుడు ; తదంతరవీథిన్=ఆసముద్రమధ్యమందు; భర్మావనీధరమున్=మేరు పర్వతమును ; బడబాగ్నికీల తతి యందంబు=బడబానల జ్వాలాసమూహమురీతిని; ఊని=పొంది; ఉడుసంతానంబులున్=రిక్కలగుంపులును; మౌక్తికరీతిన్ = ముత్యములయాకృతిని; తాల్చి = ధరించి ; పడున్=పడును. చూ=చూడుము.

అనఁగ నీశాకాంతరీపాధిపతియొక్క దానోదకములు నూతన సముద్రమువలె భాసిల్లుచుండ నాసముద్రమధ్యమునంబడిన మేరు పర్వతము బడబాగ్నిగాను నక్షత్రపుంజములు మౌక్తికములుగాను జూపట్టు నని భావము. ఈరాజు దానోదకము పుడమి గప్పుకొని మిన్నంటినదని ముఖ్యాశయము.

సీ. పవనాహతోర్మికా•నవనాదయుతపయో
ర్ణవనాథఖేలనా•రమ్యగతులు
కలశాబ్ధిసంక్షోభి•బిలశాయిపర్యంక
తలశాయిపురుషసం•దర్శనములు
సరసాత్మహితసుమో•త్కరసారఫలదళా
కరసాలవల్లికా•పరివిహృతులు

చరమాన్యనగవనీ♦వరమార్గచారి కి
న్నరమానినీమణి♦పరిచయములు

తే. తావకపురాణపుణ్యసం♦తానకలనఁ
బారిమాండల్యవన్మధ్య ♦ చేరు నీకు
మహితసుమదామకమున నీ♦మానవాధి
కాంతపుంగవుకంఠంబు ♦ గట్టు మిపుడు. 52

టీ. పారిమాండల్యవన్మధ్య=పరమాణు పరిమాణముగల నడుముగలదానా! పారిమాండల్యశబ్దమునకు పరమాణువర్థము, పరమాణు వనఁగా "జాలసూర్యమరీచిస్థం సూక్ష్మం యద్దృశ్యతే రజః, తస్యషష్ఠతమో భాగః పరమాణుస్స ఉచ్యతే" అని దాని లక్షణము, గవాక్షరంధ్రంబునఁ జొరఁబాఱు నెండలోఁ జూపట్టురజముయొక్క షష్ఠతమ మగుఖండము పరమాణు వని దానియర్థము ; తావకపురాణపుణ్యసంతానకలనన్.—తావక=నీసంబంధియగు, పురాణపుణ్య = ప్రాచీనపుణ్యములయొక్క, పూర్వజన్మసంచితపుణ్యములయొక్క యనుట, సంతాన=సంచయముయొక్క, కలనన్=ప్రాప్తిచేత ; నీకున్ ; పవనాహతోర్మికానవనాదయుతపయోర్ణవనాథఖేల నారమ్యగతులు.—పవన=వాయువుచేత, ఆహత=కొట్టఁబడిన, ఊర్మికా=తరఁగలయొక్క, నవ=నూతనమగు, నాద=ధ్వనితోడ, యుత=కూడుకొన్న, పయోర్ణవనాథ=పాలకడలియొక్క, ఖేలనా=విహారములయొక్క, రమ్యగతులు=మనోజ్ఞమగు రీతులు, కలశాబ్ధిసంశోభిబిలశాయిపర్యంక తలశాయిపురుషసందర్శనములు.— కలశాబ్ధి = పాలకడలియందు, సంశోభి=మిక్కిలి వెలయుచున్న, బిలశాయి=ఆదిశేషుఁడనెడు, పర్యంకతల=మంచమునందు, శాయి=పవళించిన, పురుష=పురాణపురుషునియొక్క, సందర్శనములు=చూపులు ; సరసాత్మహితసుమోత్కరసారఫలదళాకరసాలవల్లికాపరివిహృతులు.— సరస=మకరందముతోఁగూడిన, ఆత్మహిత=మనసునకు హితములగు, సుమోత్కర=పూదండములకు, సారఫల=శ్రేష్ఠఫలములకు, దళ=ఆకులకు, ఆకర=ఉనికిపట్టగు, సాల=వృక్షములయందు, వల్లికా=తీవలందు, పరివిహృతులు=విహారములు, క్రీడలనుట; చరమాన్యనగవనీవర మార్గచారికిన్నరమానినీమణిపరిచయములు.—చరమాన్యనగ=పొడుపుకొండయొక్క, వనీవర=శ్రేష్ఠమగువనముయొక్క, మార్గ=త్రోవయందు, చారి=సంచరించు, కిన్నరమానినీమణి=కింపురుష స్త్రీరత్నములయొక్క, పరిచయములు=స్నేహములు ; చేరున్=ఘటిల్లును. ఇపుడు=ఈసమయమందు; మహితసుమదామకమునన్.—మహిత=పూజ్యమగు, సుమదామకమునన్ = పుష్పమాలికచేత ; ఈమానవాధికాంతపుంగవుకంఠంబు = శాకద్వీపాధిపతియగు నీరాజపుంగవునియొక్క కంఠమును ; కట్టుము=బంధింపుము.

అనఁగ నీశాక ద్వీపాధిపతిని వరించితివేని పాలకడలియందలి క్రీడలును అచట శయనించియుండు శ్రీవిష్ణుమూర్తి దర్శనములును ఫలపుష్పదళాదులచే నిండియుండు వనంబుల విహారములును, పూర్వపర్వతమునం దుండుకిన్నరస్త్రీల స్నేహములును నీకు ఘటిల్లునని భావము.

మ॥ అని యాశాంకరి వల్కఁ ముంగలికి వే♦గారూఢిచే నేగున
వ్వనజాస్యామణి దృష్టి తన్నృపతిని♦ర్వాంఛావిధిం దెల్పఁ జ
య్యనఁ దద్యానధురీణు లందఱొకగో♦త్రాధీశునిం జేర్చి న
య్యనఘుం జూపి యపర్ణ యిట్లనియె మ♦త్స్యండీసమానోక్తులన్. 53

టీ. అని=ఈప్రకారము; ఆశాంకరి=ఆపార్వతీదేవి; పల్కన్=పలుకఁగా; ముంగలికిన్=ముందుకు; వేగ్గారూఢిచేన్ = వేగిరపాటుయొక్క నిరూఢిచేత; ఏగునవ్వనజాస్యామణిదృష్టి.—ఏగు=పోవుచున్న, అవ్వనజాస్యామణీ=ఆచంద్రికయొక్క, దృష్టి=చూపు; తన్నృపతినిర్వాంఛావిధిన్=ఆరాజునందు వాంఛలేమియొక్కరీతిని; తెల్పన్=తెలియఁజేయఁగా; చయ్యనన్=శీఘ్రముగ; తద్యానధురీణులు=ఆవాహనమును మోచువారు; అందఱు = ఎల్లరు; ఒకగోత్రాధీశునిన్=ఒకభూపతిని; చేరన్=పొందఁగా; అయ్యనఘున్=ఆఘనుని; చూపి=ప్రదర్శించి; అపర్ణ=పార్వతీదేవి; మత్స్యండీసమానోక్తులన్.—మత్స్యండీ=శర్కరకు, సమాన=తుల్యమగు, ఉక్తులన్ = వాక్యములచేత; ఇట్లు=వక్ష్యమాణప్రకారము; అనియెన్=పలికెను.

శా. పాంచాలాత్మజ గాంచు వీని దధిరూ♦పత్సాపటప్రావృత
క్రౌంచద్వీపధరాధురంధరుని నీ♦రాజన్యదానాంబు ల
ర్పించున్ వాశ్చరపాళి కెంతయు మహా♦ర్ధిన్ వానిపై నీసుతో
మించన్ బోలె నమూల్యలావణి తదు♦న్మేషంబు గూల్చున్ గడున్. 54

టీ. పాంచాలాత్మజ=చంద్రికా! దధిరూపత్సాపటప్రావృతక్రౌంచద్వీపధరాధు రంధరునిన్.—దధిరూపత్సాపట=పెరుఁగుమున్నీటిచే, ప్రావృత=ఆవరింపఁబడిన, క్రౌంచద్వీప= క్రౌంచద్వీపముయొక్క, ధరాధురంధరునిన్=భూభర్తయగు; వీనిన్=ఈరాజును; కాంచు = చూడుము. ఈరాజన్యదానాంబులు=ఈభూపతియొక్క దానోదకములు; వాశ్చరపాళికిన్=జలచరశ్రేణికి; ఎంతయున్=మిక్కిలి; మహర్ధిన్=అధికమగువృద్ధిని; అర్పించున్ = ఇచ్చును. వానిపైన్=ఆజలచరశ్రేణిపయి; ఈసుతోన్=ఈర్ష్యతో; మించంబోలెన్ = అతిశయించుటకువలెనె; అమూల్యలావణి=అధికమగుసౌందర్యము, ఇదికర్త; తదున్మేషంబు = ఆవాశ్చరపాళియొక్క యభివృద్ధిని, కడున్=మిక్కిలి; కూల్చున్=పోఁగొట్టును. అనఁగ నీపద్యమందు నారాజుదానోదకములు వాశ్చరపాళి కభివృద్ధి నొనరించినను వానికిఁ దత్సౌందర్యము మిక్కిలి యభివృద్ధిని బోఁగొట్టుట ఘటిల్లదు గాన వాశ్చరపాళికనఁగ, వాశ్చర=మత్స్యము, పాళి=చిహ్నముగాఁగల, ''పాళిస్త్ర్యశ్ర్యఙ్కపఙ్క్తిషు'' అని యమరుఁడు, అనఁగ మీనుని డేము గల మన్మథున, కున్మేషమును బోఁగొట్టు ననుట.

ఈక్రౌంచ ద్వీపాధిపతియొక్క దానోదకము జలచరముల కభివృద్ధిఁ జేయు ననియు తత్సౌందర్యము మన్మథుని నిరసించు ననియు నభిప్రాయము.

చ. వరహరిజాత్యఖండరుచి♦వారము నొంచి మహాబ్జమండలి
స్థరణి నడంగఁ ద్రొక్కి వని♦తామణి యీవిభుసద్యశోవిభాం

కురహరుఁ డొప్పఁ గుండలిత•కుండలినేత పదాంగదంబునై
శరదపథంబు దంత్యసుర•చర్మమునై చెలువార నెప్పుడుఁన్. 55

టీ. వనితామణి=చంద్రికా! ఈవిభుసద్యశోవిభాంకురహరుఁడు.—ఈవిభు=ఈ క్రౌంచద్వీపాధిపతియొక్క, సత్=శ్రేష్ఠమగు, యశః=యశముయొక్క, విభా=కాంతియొక్క, అంకుర=మొలకపెడు, హరుఁడు=ఈశ్వరుఁడు; కుండలితకుండలినేత.—కుండలిత=చుట్టుకొన్న, కుండలినేత=శేషుఁడు; పదాంగదంబునై=పాదమునకుఁదియ యైనవాఁడై; శరదపథంబు=మిన్ను; దంత్యసురచర్మమునై.—దంత్యసుర=గజాసురునియొక్క, చర్మమునై=చర్మమైనదై; చెలువారన్=ప్రకాశింపఁగ; ఎప్పుడున్=ఎల్లపుడు; వరహరిజాత్యఖండరుచివారమున్.—వర=శ్రేష్ఠుఁడగు, హరిజ=మన్మథునియొక్క, అఖండ=అఖండమైనే, రుచివారమును=కాంతిపుంజమును; నొంచి=నొప్పించి; హరిజాతి=సింహజాతియొక్క, అఖండరుచివారము నొంచి యనునర్థము దోఁచుచున్నది; మహాబ్జమండలిన్.—మహత్=అధికమగు, అబ్జమండలిన్=చంద్రమండలమును, తెల్లదామరగుంపుననియుఁ దోఁచుచున్నది; ధరణిన్=భూమియందు; అడంగఁ ద్రొక్కి=అడఁగునటులుద్రొక్కి; ఒప్పున్=ప్రకాశించును.

అనఁగా నీక్రౌంచద్వీపాధిపతియశోంకురము, ఆదిశేషుఁడు పాదకటకముగాను ఆకాశము గజచర్మముగాను శెలంగఁగా, హరిజాతిరుచిని జయించి అబ్జమండలము ద్రొక్కి శివునివలెఁ బ్రకాశించు ననిభావము. శివుఁడు దక్షాధ్వరధ్వంసమునందుఁ జంద్రుని త్రొక్కెనాఁ డనుట పురాణప్రసిద్ధము. ఇతనియశస్సు బ్రహ్మాండ మంతయు వ్యాపించిన దని ముఖ్యాశయము.

మ. సరసీజోపమగంధి సంతతము క్రౌం•చద్వీపసంవాసి శం
కరపూజాగతి మించెనా నలరు ని•క్కం బీనృపాలుండు శం
కరభావమ్మున సద్గణావృతియు రం•గద్భూతియు న్విద్విష
త్పురసంభేదనవృత్తియు న్సమగుణ•స్ఫూర్తి న్విజృంభింపఁగన్. 56

టీ. సరసీజోపమగంధి=పద్మగంధమువంటి గంధముగల చంద్రికా! ఈనృపాలుండు=ఈభూపతి; సంతతము=ఎల్లపుడు; క్రౌంచద్వీపసంవాసి శంకరపూజాగతిన్.—క్రౌంచద్వీపసంవాసి=క్రౌంచద్వీపమందు నివసించునట్టి, శంకర=శితికంఠునియొక్క, పూజా=అర్చనయొక్క, గతిన్=ప్రాప్తిచేత; శంకరభావమ్మునన్=శివత్వముచేత, సుఖకరస్వరూపముచేతనని నరపతి పరమగునర్థము; మించెనాన్=అతిశయించెనోయనునట్లు; సద్గణావృతియున్.—సత్=సత్పురుషులయొక్క, గణ=బృందముయొక్క, ఆవృతియున్=కూడికయును, ప్రమథగణములయొక్క కూడికయునని శివపరమయిన యర్థము; రంగద్భూతియున్.—రంగత్=ప్రకాశించుచున్న, భూతియున్=ఐశ్వర్యమును, ప్రకాశించుచున్న భూతియు ననఁగ భస్మము నని శివపరమగునర్థము; "భూతిర్భస్మనిసంపది" యని యమరుఁడు; విద్విషత్పురసంభేదన వృత్తియున్.—విద్విషత్=శత్రువులయొక్క, పుర=శరీరములయొక్క, సంభేదనవృత్తియున్=బద్దలుచేయునట్టి వ్యాపారమును; విద్విషత్=శత్రువులగుచు

, స్ఫు,పుర = త్రిపురములయొక్క, సంభేదనవృత్తియునని శివపరమైన యర్థము; సమగుణస్ఫూర్తిన్.—సమ=సమానమగు, గుణ=గుణములయొక్క, స్ఫూర్తిన్ = అతిశయము చేత; విజృంభింపఁగన్=ప్రకాశింపఁగ; అలరున్=ప్రకాశించును. నిక్కంబు=సత్యము.

అనఁగ క్రౌంచద్వీపాధిపతి యగు నీనృపాలుఁడు శివపూజామహిమవలన శివభావమునొంది సద్గణానృతియు భూతియు విద్విషత్పురసంభేదన వృత్తియుఁ జెందెనో యనునట్లు ప్రకాశించునని భావము.

చ. అవిరళరత్నకూటములఁ ♦ హారిమహాసుమనోవితానవై
భవములఁ బొల్చుక్రౌంచగిరి ♦ బంధురనూతనబంధుజీవబాం
ధవరదనాంశుకామణి య♦నారత మింపగుఁ గాక నీకుఁ బ్రో
త్సవకరకేళికాకనక♦సౌధవిధానముఁ దాల్చి యెంతయున్. 57

టీ. అవిరళరత్నకూటములన్.—అవిరళ=సందులేని,రత్న=రత్నమయములగు, కూటములన్ = శిఖరముల చేత; హారిమహాసుమనోవితానవైభవములన్.—హారి = మనోహరమగు, మహత్=అధికమగు, సుమనోవితాన=పూగుంపులయొక్క, వైభవములన్ = విభవముల చేత; పొల్చుక్రౌంచగిరి=ఒప్పుచున్నక్రౌంచపర్వతము; బంధురనూతనబంధు జీవబాంధవరదనాంశుకామణీ.—బంధుర=దట్టమగు, నూతన=నవీనమగు, బంధుజీవ=జపాకుసుమమునకు, బాంధవ=సమానమగు, బాంధవసగోత్రజ్ఞాతిబంధ్వాదిశబ్దములు ఇవార్థకము లని చెప్పఁబడియున్నది, రదనాంశుకా=దంతచ్ఛదములుగలకాంతలలో, మణి = రత్నతుల్యవగునోచంద్రికా! నీకున్=నీకు; ప్రోత్సవకరకేళికాకనకసౌధవిధానము.—ప్రోత్సవకర=వేడుకనుజేయునట్టి, కేళికా=విలాసార్థమగు, కనకసౌధ=బంగరుమేడయొక్క, విధానము=రీతిని; తాల్చి = ధరించి; ఎంతయున్=మిక్కిలి; అనారతము=ఎల్లప్పుడు; ఇంపగుఁగాక=ఆనందకరమగుఁగాక.

అనఁగ నీక్రౌంచద్వీపమునం దుండుక్రౌంచపర్వతము రత్నమయకూటముల చే మనోహరపుష్పకదంబములచే నొప్పినదై నీకుఁ గ్రీడాసౌధమురీతిని ధరించి ప్రకాశించు నని భావము.

వ. అని యయ్యిందుధరసుందరి యెఱింగింప నన్నృపపురందరునిపై నక్కుందరదన డెందంబుఁ బొందుపడ కున్కి తెలిసి యానధర్యు లమందరయంబున వేఱొక్కమహీశకందర్పుఁ జేరం జన నందు నతనిం జూపి యాగోత్రధరపుత్త్రి తన్మేచకశతపత్త్రనగోత్రనేత్ర కిట్లనియె. 58

టీ. అని=ఈప్రకారముగా; అయ్యిందుధరసుందరి = పరమేశ్వరునకుపత్నియగు పార్వతీదేవి; ఎఱింగింపన్=తెలియఁజేయఁగా; అన్నృపపురందరునిపైన్=ఆరాజేంద్రునిమీఁద; అక్కుందరదన డెందంబు=మొల్లలవంటి పలువరుసగల యా చంద్రికయొక్క చిత్తము; పొం

దుపడకున్కి=పొందకయుండుటను; తెలిసి=తెలిసికొని; యానధుర్యులు=పల్లకిని మోయువారు; అమందరయంబునన్=అతివేగముచేత; వేళాకమహీశకందువ్బన్=మఱియొక రాజమన్మథుని; చేరంజనన్=సమీపమునకుఁబోఁగా; అందు=ఆస్థలమందు; అతనింజూపి=ఆరాజునుజూపి; ఆగోత్రధరపుత్రి=హిమవంతునకుకొమార్తెయగు పార్వతీదేవి; తన్మేచకశతపత్ర సగోత్రనేత్రకున్=నల్లదామరలవంటి నేత్రములుగల యాచంద్రికతో; ఇట్లనియెన్=వక్ష్యమాణప్రకారముగఁ బలికెను.

చ. నెలఁత కుశాంతరీపధర♦ణీరమణీంద్రుఁడు వీఁడు వీనియా
దలపయి నుంచు మీవు కర♦తామరసార్జితమౌక్తికాళి ని
య్యలఘుఁడు మారవీరవిశి♦ఖౌఘవిలోడితచిత్తధైర్యుఁడై
దలఁచుఁ జుమీ నిరంతరము ♦ త్వత్కుచదుర్గము లాశ్రయింపఁగన్. 59

టీ. నెలఁత=చంద్రికా! వీఁడు=ఈరాజు; కుశాంతరీ పధరణీరమణీంద్రుఁడు=కుశద్వీపభూపతుఁడు; వీనియాదలపయిన్=వీని శిరముమీఁద; ఈవు=నీవు; కరతామరసార్జిత మౌక్తికాళిన్.—కరతామరస=కేలుదామరచే, ఆర్జిత=గ్రహింపఁబడిన, మౌక్తికాళిన్ = ముత్యములపేరును; ఉంచుము=ఉనుచుము. ఇయ్యలఘుఁడు=ఈఘనుఁడు; మారవీరవిశిఖౌఘవిలోడితచిత్తధైర్యుఁడై.—మారవీర=మన్మథవీరునియొక్క, విశిఖౌఘ=బాణబృందముచేత, విలోడిత=కలఁపఁబడిన, చిత్త=హృదయముయొక్క, ధైర్యుఁడై=ధైర్యముగలవాఁడై; నిరంతరము=ఎల్లప్పుడు; త్వత్కుచదుర్గములు.—త్వత్=నీయొక్క, కుచదుర్గములు = పాలిండ్లనెడు కొండలను; ఆశ్రయింపఁగన్=చేరుటకు; తలఁచున్=స్మరించును. చుమీ=సత్యము !

అనఁగ చంద్రికా! వీఁడు కుశద్వీపమునకు రాజు, వీనిశిరమునందు నీకేలనున్నఁడు మౌక్తికహారమునుంచుము, ఈరాజు ఎల్లపుడు మన్మథబాణములచేఁ గుంది నీకుచములను పర్వతములనాశ్రయింపఁగోరుచున్నాఁడు, నిజమని భావము.

చ. నిరుపమవిశ్రవస్తనయ♦నిగ్రహకృద్ద్రవిణాఢ్యుఁడై మహా
హరిబలసంయుతుండయి బు♦ధార్చితరామసమాఖ్య నొప్పు నీ
నరకులసార్వభౌముని మ♦నం బలర న్వరియింప మేదినీ
వరసుత నీకు నెంచ నని♦వార్యకుశోదయ మబ్బు టబ్రమే. 60

టీ. నిరుపమ విశ్రవస్తనయని గ్రహకృద్ద్రవిణాఢ్యుఁడవి.—నిరుపమ=సాటిలేని, విశ్రవస్తనయు=కుబేరునియొక్క, నిగ్రహ=నిరసనమును, కృత్=చేయుచున్న, ద్రవిణ=ధనముచేత, ఆఢ్యుఁడై=ధనికుఁడైనవాఁడై; నిరుపమ=సాటిలేని, విశ్రవస్తనయ=రావణాసురునియొక్క, నిగ్రహమును జేయు, ద్రవిణ=బలముచేత, "ద్రవిణంకాంచనేవిత్తే ద్రవిణంచపరాక్రమే" యని విశ్వము; ఆఢ్యుఁడైనవాఁడని, శ్రీరామపరమైనయర్థము; మహాహరిబల సంయుతుండయి.—మహాత్=అధికమగు, హరిబల=సింహబలముతో, సంయుతుండయి=కూడుకొన్నవాఁడయి; కూ

రిబలి=వానరసైన్యముతో, నని రామపరమైనయర్థము; బుధార్చితరామసమాఖ్యన్.— బుధ=విద్వాంసుల చేత, అర్చిత=మన్నింపఁబడిన, రామ = మనోజ్ఞమగు, సమాఖ్యన్ = కీర్తిచేత; బుధ=దేవతలచేత, అర్చిత=పూజింపఁబడిన, రామసమాఖ్యన్=రామయను నామము చేత, నని రామపరమైనయర్థము; ఒప్పు నీనరకులసార్వభౌమునిన్=ప్రకాశించు నీనరకుల చక్రవర్తిని, శ్రీరాముని; మనంబు=మానసము; అలరన్=సంతోషించునటులు; వరియింపన్ = కోరఁగా; మేదినీవరసుత.— మేదినీవర=భూభర్తయగు తుణదోదయునికి, సుత=కూఁతురవగుచంద్రికా! భూపుత్రియగుసీతాదేవియనునర్థము దోఁచుచున్నది; నీకు; ఎంచన్=విచారింపఁగా; అనివార్యకుశోదయము.—అనివార్య=నివారించుట కశక్యమగు, కుశ=కుశద్వీపముయొక్క, ఉదయము=ఉన్నతి; అబ్బుట=లభించుట; అబ్రమే=ఆశ్చర్యమా ? కాదనుట. అనివార్యమగు, కుశ=కుశుఁడనుపుత్రునియొక్క, ఉదయము, అబ్బుట చిత్రముగాదని తోఁచుచున్నది.

అనఁగా కుబేరునికన్న నెక్కువ ధనము గలవాఁడును సింహబలుఁడును పండితశ్లాఘ్యమయినకీర్తి గలవాఁడు నగునీకుశద్వీపాధిపతిని వరియింతువేని నీకు కుశద్వీప మబ్బు నని భావము. రావణునిఁ బరాక్రమముచే నిగ్రహించినవాఁడును వానరసైన్యముగలవాఁడును రామనామముగలవాఁడు నగుదాశరథిని వరించిన సీతాదేవికిఁ గుశుఁ డనుపుత్త్రుఁడు గలిగె నని యర్థాంతరపక్షమున భావము.

మ. బలజూటీమణిదీప్తిదీపకులసం♦భారాప్తయా జన్యమం
గళగేహాంగణవీథి వీఁడు గుణటం♦కారాఖ్యమంత్రధ్వనుల్
సెలఁగ న్సాహసలక్ష్మిఁ గూడి కరనా♦ళీకంబుల న్గూర్చుఁ బో
నలి మై నాకబలిన్ ద్విషత్కరిశిరో♦నర్ఘోరుముక్తాతతిన్. 61

టీ. వీఁడు=కుశద్వీపాధిపతి; బలజూటీమణి దీప్తిదీపకుల సంభారాప్త యాజన్యమంగళగేహాంగణవీథిన్.— బల=సేనలయొక్క, జూటీమణి=శిరోమణులయొక్క, దీప్తి=కాంతులనెడు, దీప=దీవియలయొక్క, కుల=సమూహమనెడు, సంభార=పదార్థసంచయము చేత, ఆప్త=పొందఁబడినది, ఔ=అగునట్టి, జన్య=యుద్ధమనెడు,మంగళగేహ=కల్యాణగృహముయొక్క, అంగణవీథిన్=ముంగిటిభూమియందు; గుణటంకారాఖ్య మంత్రధ్వనుల్.—గుణ=అల్లెత్రాటియొక్క, టంకార=టంకారధ్వనియనెడు, ఆఖ్య=ప్రసిద్ధిగల, మంత్రధ్వనుల్=మంత్రముల రొదలు; చెలఁగన్=ఒప్పుచుండఁగ; సాహసలక్ష్మిన్=తెగువయనెడులక్ష్మిని ; కూడి=పొంది, వివాహమయియనుట; నలిమైన్=యోగ్యముగా; ద్విషత్కరిశిరోనర్ఘోరు ముక్తాతతిన్.—ద్విషత్కరి=శత్రుగజములయొక్క, శిరః=శిరములయందుండు, అనర్ఘ=అమూల్యములగు, ఉరు=గొప్పలగు, ముక్తా=ముత్యములయొక్క, తతిన్=సమూహము చేత; నాకబలిన్=వివాహాంగభూతమగు నాకబలియను కృత్యమును; కరనాళీకంబులన్= కరకమలములచేత, కరమందుండు బాణముల చేత ననిగాని యర్థము; కూర్చున్=ఒనరించును. పో=సత్యము.

అనఁగ నీకుశద్వీపాధిపతి యగురాజు సైనికులయొక్క శిరోమణికాంతు లనెడుదీపములచే నలంకరింపఁబడియున్న యుద్ధభూమి యనెడు మంగళగృహమందు అనఁగా వివాహ

గృహమందు అల్లెత్రాటిమ్రోఁత యనెడు మంత్రములు వెలయుచుండఁగ సాహసలక్ష్మిఁ బెండ్లియై శత్రుగజంబుల శిరములయం దుండు ముత్యములచే సాకబలిం జేయునని భావము

మ. వరభోగాన్వితుఁ డీనృపాలకుఁడు ప్రోవన్ నిచ్చలు న్మించు స
ర్పిరపాంపత్యభివేష్టితోర్వర ధరాభృద్భేదిసంత్రాతని
ర్జరపుర్యుత్తమలీల నిత్యసుఖవిభ్రాజద్బుధశ్రేణికా
పరిపఙ్క్తిన్ హితదాయిరాజమణిసంప్రాప్తిం గురంగేక్షణా. 62

టీ. కురంగేక్షణా=చంద్రికా! వరభోగాన్వితుఁడు.—వర=శ్రేష్ఠమగు, భోగ= గృహము శయ్య ఆభరణము వస్త్రము స్త్రీ పుష్పము గంధము తాంబూలము అను నీయెనిమిదిభోగములతో, అన్వితుఁడు=కూడినవాఁడు; ఈనృపాలకుఁడు=కుశద్వీపాధిపతియగు నీరాజు; ప్రోవన్=రక్షింపంగా; సర్పిరపాంపత్యభివేష్టితోర్వర.—సర్పిరపాంపతి=సర్పిస్సముద్రముచేత, అభివేష్టిత=చుట్టఁబడిన, ఉర్వర=పుడమి; ధరాభృద్భేది సంత్రాతనిర్జరపుర్యుత్తమలీలన్.—ధరాభృద్భేది=ఇంద్రునిచేత, సంత్రాత=రక్షింపఁబడిన, నిర్జరపురీ=అమరావతియొక్క, ఉత్తమలీలన్=శ్రేష్ఠమగు విలాసముచేత; నిత్యసుఖవిభ్రాజద్బుధశ్రేణికాపరిపఙ్క్తిన్.—నిత్య=శాశ్వతమగు, సుఖ=సుఖముచేత, విభ్రాజత్=ప్రకాశించుచున్న, బుధ=విద్వాంసులయొక్క, దేవతలయొక్క, శ్రేణికా=పంక్తియొక్క, పరిపఙ్క్తిన్=సంబంధముచేత; హితదాయిరాజమణి సంప్రాప్తిన్.—హితదాయి= హితమునొసఁగు, రాజమణి=రాజశ్రేష్ఠులయొక్క, సంప్రాప్తిన్=ప్రాప్తిచేత; హితమగుదానినిచ్చు చింతామణియొక్క సంప్రాప్తిచేత; మించున్=ప్రకాశించును.

అనఁగ నీకుశద్వీపాధిపతిచేఁ బోషింపఁడుపుడమి యమరావతివలెఁ బ్రకాశించుచున్నదని భావము.

క. అని తెలుప మనం బచ్చట, మొనయమి శిబికాధరాళి ముదిత నొకమహీ
శునిచెంతఁ జేర్ప శివ యి, ట్లను నావిభుఁ జూపి చెలువ కమృతజిదుక్తిన్. 63

టీ. అని=ఈప్రకారము; తెలుపన్=తెలియఁజేయఁగ; మనంబు = డెందము; అచ్చటన్=ఆరాజానందు; మొనయమిన్=పూనకుండుటవలన; శిబికాధరాళి= పల్లకినిమోయువారి గుంపు; ముదితన్=చంద్రికను; ఒకమహీశునిచెంతన్=ఒకభూపాలుని సమీపమును; చేర్పన్=పొందింపఁగ; శివ=పార్వతీదేవి; చెలువకున్=చంద్రికకు; ఆవిభున్=ఆరాజును; చూపి=ప్రదర్శించి; అమృతజిదుక్తిన్ = సుధనుజయించిన వచనముచేత; ఇట్లు = వక్ష్యమాణప్రకారముగ; అనున్=పలికెను.

శా. ఓపద్మానన గాంచు మీనృపతి రమ్యోత్కంఠమై శాల్మలి
ద్వీపత్రాణచణుం డితం డితనివిద్విట్కాంతకు త్పాత్నకే
ళీపిచ్ఛందకవైఖరి స్వలయశైలీమోదుకూటంబు లా
లీపాళీగతి భిల్లరాడ్యువతిహాళిశ్రేణి పాల్పన్ గడున్. 64

టీ. ఓ పద్మానన=ఓ చంద్రికా! ఈనృపతిన్=ఈరాజును; రమ్యోత్కంఠమైన్=మనోహరమగు సంతసముచేత; కాంచుము=చూడుము. ఇతండు=ఈరాజు; శాల్మలిద్వీపత్రాణచణుండు=శాల్మలీద్వీపమును పాలించువాఁడు; ఇతని విద్విట్కాంతకున్=ఇతని శత్రుకాంతకు; వలయశైలీయోరుకూటంబులు.—వలయశైలీయ=చక్రవాళపర్వత సంబంధులగు, ఉరు=అధికములగు, కూటంబులు=శిఖరములు; ఉత్ప్రత్న కేళీపిచ్ఛందక వైఖరిన్.—ఉత్=ఉన్నతమైన, ప్రత్న=పురాతనమగు, కేళీపిచ్ఛందక=క్రీడాగృహముయొక్క, వైఖరిన్=రీతిని; భిల్లరాడ్యువతి పాళిశ్రేణి=ఎఱుకు దొరలయొక్క స్త్రీసమూహము; ఆళీపాళీగతిన్=సకియలగుంపురీతిని; కడున్=మిక్కిలి; పొల్చున్=ఒప్పును.

అనఁగ నీశాల్మలీద్వీపాధిపతియొక్క శత్రుస్త్రీలకు మేడలు లోకాలోక పర్వతశిఖరము లనియు వారికి సకియలు ఎఱుకుస్త్రీ లనియును భావము.

మ. కలుమున్నీ రను పెన్కొలంకునడుమ న్గన్పట్టి వీఁడేలు శా
ల్మలికాద్వీపము శ్రీయుతిం దనరుఁ గొమ్మా తమ్మి నా మధ్యసం
స్థలి జ్యోతిర్లతికాఖ్య కేసరవృతోద్యత్కర్ణికాస్ఫూర్తి రా
జిల ద్రోణాద్రి తదగ్రగాభ్రి మళిరాజిస్థేమఁ జూపట్టఁగన్. 65

టీ. కొమ్మా=చంద్రికా! వీఁడేలుశాల్మలికాద్వీపము=ఈరాజు పాలించు శాల్మలిద్వీపము; కలుమున్నీరను పెన్కొలంకునడుమన్.—కలుమున్నీరను=సురాసముద్రమనెడు, పెన్కొలంకునడుమన్=పెద్దమడుఁగునడుమ; కన్పట్టి=కనిపించి; ద్రోణాద్రి=ద్రోణపర్వతము; మధ్యసంస్థలి జ్యోతిర్లతికాఖ్య కేసరవృతోద్యత్కర్ణికాస్ఫూర్తిన్.—మధ్యసంస్థలి=మధ్యప్రదేశమందలి, జ్యోతిర్లతికా=జ్యోతిర్లతలనెడు, ఆఖ్యా=పేరుగల, కేసర=కింజల్కములచేత, వృత=ఆవరింపఁబడిన, ఉద్యత్=ప్రకాశించుచున్న, కర్ణికా=తామరదుద్దుయొక్క, స్ఫూర్తిన్=అతిశయముచేత; రాజిలన్=ప్రకాశింపఁగ; తదగ్రగాభ్రము=దానిపైనున్నమబ్బు; అళిరాజిస్థేమన్=భృంగసమూహాకృతిచేత; చూపట్టఁగన్=కనిపింపఁగా; తమ్మినాన్=కమలమోయనునటులు; శ్రీయుతిన్=కాంతితోఁగూడుటచేతను, లక్ష్మితోఁగూడుటచేతననియుఁ దోఁచుచున్నది; తనరున్=ప్రకాశించును.

అనఁగ సురాసముద్ర మనెడుగొప్పకొలనునడుమఁ గాన్పించునీశాల్మలిద్వీపము నడుమ జ్యోతిర్లతిక లనుకేసరములతోఁ జేరియున్న ద్రోణాద్రి తామరదుద్దువలెనుండఁగ నాపర్వతముమీఁద నున్న మేఘము భృంగరాజివలె నుండఁగ గొప్పమడుగునందు భృంగరాజితోఁ జేరి యున్నకమలమువలె నాద్వీపము ప్రకాశించునని భావము. సముద్రమధ్యగతద్వీపమును హ్రదమధ్యగతకమలముగా నుత్ప్రేక్షించుటచే నుత్ప్రేక్షాలంకారము.

మ. తరుణీ వీనియశోవదాతశుక ముద్యచ్ఛక్తి మిన్నొంది బం
ధురతారాకులగోస్తనీఫలములం దోడ్తో భుజింప న్విభా

వరి తద్దైన్యముఁ జెంద దేతదతిదీ♦వ్యజ్జైత్రభేరీరవో
త్కరఘక్కద్ద్రుహిణాండకర్పరగళ♦ద్బాహ్యాంబుబిందుచ్ఛటన్. 66

టీ. తరుణీ=చంద్రికా! వీనియశోవదాతశుకము=ఈశాల్మలిద్వీపాధిపతియొక్క యశస్సనెడు తెల్లనిశుకము; ఉద్యచ్ఛక్తిన్=మీఁదికెగయుచున్న శక్తిచేత; మిన్నొంది=ఆకాశమునుపొంది; బంధురతారాకులగోస్తనీఫలములన్.—బంధుర=ఎడములేని, తారాకుల=రిక్కలగుంపనెడు, గోస్తనీఫలములన్=ద్రాక్షాఫలములను; తోడ్తోన్=వెంట్టనె; భుజింపన్= తినఁగా; విభావరి=రాత్రి; ఏతదతిదీవ్యజ్జైత్రభేరీరవోత్కర ఘక్కద్ద్రుహిణాండకర్పరగళ ద్బాహ్యాంబు బిందుచ్ఛటన్.—ఏతత్=ఈశాల్మలిద్వీపాధిపతియొక్క, అతిదీవ్యత్= మిక్కిలిప్రకాశించుచున్న, జైత్రభేరీ=జయభేరియొక్క, రవోత్కర=శబ్దబృందముచేత, ఘక్కత్=పగిలిన, ద్రుహిణాండ=బ్రహ్మాండముయొక్క, కర్పర=పుఱ్ఱెవలననుండి, గళత్=జాఱుచున్న, బాహ్యాంబు= బ్రహ్మాండమునకు వెలుపటనుండు జలముయొక్క, బిందు = బిందువులయొక్క, ఛటన్= సమూహముచేత; తద్దైన్యము.—తత్=ఆనక్షత్రములయొక్క, దైన్యము=శూన్యతను; చెందదు=పొందదు.

అనఁగ నీశాల్మలిద్వీపాధిపతియొక్క యశమనెడు తెల్లనిచిలుక మిన్నొంది నక్షత్రములను ద్రాక్షాఫలములను తినినను రాత్రి వీని జయభేరీనినాదములవలన బ్రహ్మాండకర్పరము పగిలి స్రవించు జలబిందుసందోహముచే రిక్కలయొక్క లేమిని జెందదని భావము. యశమును శుకమునుగా రిక్కలను ద్రాక్షాఫలములనుగా జలబిందువులను రిక్కలనుగా వర్ణించుటచే రూపకాలంకారము.

ఉ. ఈవసుధేశుఁ గూడి హరి♦ణేక్షణ నీవు ముదంబు నిక్క వే
లావనవాటికావిహృతు♦లం జరియించుచు మించువేళ నీ
పై వలగొన్న సంభ్రమస♦మాజము దూలఁగఁ బొల్చుఁ గాక హా
లావనరాశివారికణకు♦లస్థగితానిలపోతజాతముల్. 67

టీ. హరిణేక్షణ=కురంగముయొక్క కనులవంటి కనులుగలయోచంద్రికా! ఈవసుధేశున్=ఈశాల్మలిద్వీపాధిపతిని; కూడి=కలసికొని; నీవు; ముదంబు=సంతసము; నిక్కన్= అతిశయింపఁగా; వేలావనవాటికావిహృతులన్.—వేలా=చెలియలికట్టయొక్క, వన=అడవియొక్క, వాటికా=పంక్తులయందు, విహృతులన్=విహారములచేత; చరియించుచున్=క్రుమ్మరుచు; మించువేళన్=అతిశయించుసమయమందు; నీపైన్=నీశరీరమందు; వలగొన్న సంభ్రమసమాజము.—వలగొన్న=చుట్టుకొన్న, సంభ్రమ=శ్రమలయొక్క, సమాజము=సమూహము; తూలఁగన్ = పోవునటులు; హాలావనరాశివారికణకులస్థగితానిలపోతజాతముల్.—హాలావనరాశి= సురాసముద్రముయొక్క, వారికణ=ఉదకకణములయొక్క, కుల=సమూహముచేత, స్థగిత=

కప్పఁబడిన, అనిలపోత=మందమారుతముల యొక్క, జాతముల్=సమూహములు: పోల్పఁగాక=ఒప్పఁగాక.

ఓచంద్రికా! నీవు శాల్మలిద్వీపాధిపతిని గూడి వేలావనవిహారమును జేయుచుండు తఱి నీశరీరశ్రమను కలుమున్నీటి నీటితుంపరలతోఁగూడిన తెమ్మెరలు తొలఁగఁజేయునని భావము.

వ. అని యప్పంచాస్యపంచాస్యమధ్య యెఱింగించిన నాకాంచనాంగినేత్రాం
చలం బతనిపైఁ బ్రవర్తింప దయ్యె నది యెఱింగి వేఱొక్క మహీశపుంగ
వుఁ జేర నియోగించి యారాజేంద్రుం జూపి యన్నెలఁత కన్నెలతాల్పువే
ల్పు పట్టపుదేవి యిట్లనియె. 68

టీ. అని=ఈప్రకారముగఁబలికి; అప్పంచాస్యపంచాస్యమధ్య.—పంచాస్య=ఈశ్వరునికి, పంచాస్యమధ్య=సింహమువంటినడుముగల యనఁగా శివకాంతయగు నాపార్వతీదేవి; ఎఱింగించినన్=తెలియఁజేయఁగా; ఆకాంచనాంగినేత్రాంచలంబు=ఆచంద్రికయొక్కకటాక్షము; అతనిపైన్=ఆశాల్మలిద్వీపాధిపతిమీఁద; ప్రవర్తింపదయ్యెన్ = ప్రసరింపదాయెను. అదియెఱింగి=అదిదెలిసి; వేఱొక్కమహీశపుంగవున్=మఱియొకరాజశ్రేష్ఠుని ; చేరన్=సమీపించునటులు; నియోగించి=ఆజ్ఞాపించి; ఆరాజేంద్రుఁజూపి; అన్నెలఁతకున్=ఆచంద్రికకు; అన్నెలతాల్పువేల్పు పట్టపుదేవి=చంద్రునిధరించిన యీశ్వరునకుఁ బట్టపుదేవియగు పార్వతీదేవి; ఇట్లు=వక్ష్యమాణప్రకారము; అనియెన్=పలికెను.

మ. అరిజన్యాంబుధిసంభవజ్జయరమాహాసాంకురత్కీర్తి నీ
శరజాస్త్రోపమమూర్తిఁ గాంచు చెలి ప్లక్షద్వీపభూభర్త స
ప్తరసాభృద్ధరణీయయై పొదలు గోత్రం దాల్చు నీమేటి భా
స్వరదోర్యష్టి భుజాంగదాగ్రఖచితాంచచ్ఛక్రనీలోపధిన్. 69

టీ. చెలి=చంద్రికా! అరిజన్యాంబుధిసంభవజ్జయరమాహాసాంకురత్కీర్తిన్.—అరి=శత్రువులయొక్క, జన్య=యుద్ధమనెడు, అంబుధి=సముద్రమందు, సంభవత్ = జన్మించిన, జయరమా=జయలక్ష్మియొక్క, హాసాంకురత్=చిఱునగవువలెనాచరించు, కీర్తిన్ = యశముగల; ప్లక్షద్వీపభూభర్తన్=ప్లక్షద్వీపరాజైన; ఈజలజాస్త్రోపమమూర్తిన్=మన్మథునికిసమానమగు దేహముగలవీనిని; కాంచు=చూడుము. ఈమేటి=ఈఘనుడు; సప్తరసాభృద్ధరణీయయై.—సప్తరసాభృత్=సప్తకులాచలముల చేత, ధరణీయయై=ధరింపఁదగినదియై; పొదలుగోత్రన్ = వృద్ధిఁబొందుచున్నభూమిని; భాస్వరదోర్యష్టిభుజాంగదాగ్రఖచితాంచచ్ఛక్రనీలోపధిన్.—భాస్వర=ప్రకాశించుచున్న, దోర్యష్టి = భుజదండములయొక్క, భుజాంగద = కేయూరములయొక్క, అగ్ర=చివరయందు, ఖచిత=చెక్కఁబడిన, అంచత్=ప్రకాశించుచున్న, శక్రనీల=ఇంద్రనీలములయొక్క, ఉపధిన్ =కపటముచేత; తాల్చున్=ధరించును.

అనఁగ నీప్లక్షద్వీపాధిపతి సప్తకులాచలములు మోయుచున్న భూమిని తన బాహుపురియందలి చెక్కియున్న యంద్రనీలమణి యనువ్యాజముచే ధరించి యున్నాఁడనిభావము. భూమి నల్లని దనుటకు విష్ణుమూర్తి వక్షమునందు ధరియించియున్న కస్తురిని లక్ష్మీదేవిసమీపమందు భూదేవిని బ్రీతితో సంగొనా యున్నటులు పురాచరిత్రయం దుత్ప్రేక్షింపఁ బడియున్నది.

మ. అనిశంబు న్బుధవర్ణ్యకల్పతరుదీవ్యద్వాసనాలబ్ధిఁ జే
కొని యద్వైతరుచిం గరంబు మను నీతక్షోణీస్థలాక్షీశవ
ర్యునికీర్తిప్రకరంబు మించ నకి యోహోహాపూర్వపక్షావలం
బనత న్రాజిలు నట్టిధ్వాంతపరధామం బెచ్చునే యెచ్చటన్. 70

టీ. అనిశంబున్=ఎల్లప్పుడు; బుధవర్ణ్యకల్పతరుదీవ్యద్వాసనాలబ్ధిన్.—బుధ=దేవతలచేత, వర్ణ్య=వర్ణింపఁదగిన, కల్పతరు=కల్పవృక్షములయొక్క, దీవ్యత్=ప్రకాశించుచున్న, వాసనా=వలపుయొక్క, లబ్ధిన్=ప్రాప్తిని; చేకొని=గ్రహించి; అద్వైతరుచిన్=అద్వితీయకాంతిచేత; కరంబు=మిక్కిలి; మనునీక్షోణీస్థలాధీశవర్యునికీర్తిప్రకరంబు.—మను=వృద్ధిఁబొందుచున్న, ఈక్షోణీస్థలాధీశవర్యునికీర్తిప్రకరంబు=ప్లక్షద్వీపాధిపతియగు నీరాజశ్రేష్ఠునియొక్క కీర్తిపుంజము; మించన్=అతిశయింపఁగా; ఓహోహాసకి=ఓమాచంద్రికా! పూర్వపక్షావలంబనతన్=అపసిద్ధాంతము ఆశ్రయముగాఁగలుగుటచేత; పూర్వపక్ష=శుక్లపక్షము, అవలంబనతన్=ఆశ్రయముగాఁ గలుగుటచేత నని స్వభావార్థము; రాజిలునట్టి ధ్వాంతపరధామంబు.—రాజిలునట్టి=ప్రకాశించునట్టి, ధ్వాంతపర=చంద్రునియొక్క, ధామంబు=తేజము; ఎచ్చటన్=ఏప్రదేశమందైన; ఎచ్చునే = అతిశయించునా? ఇచట, అనిశంబున్ = ఎల్లప్పుడు; బుధ=విద్వాంసులచేత, వర్ణ్య=పొగడఁదగిన, కల్పతరు=కల్పతరువను వేదాంతగ్రంథముయొక్క, దీవ్యత్=ప్రకాశించుచున్న, వాసనా=అనుభూతస్మృతియొక్క, లబ్ధిన్=ప్రాప్తిని; చేకొని=గ్రహించి; అద్వైతరుచిన్ = బ్రహ్మాత్మైక్యమందలియాసక్తిచేత; మను=అతిశయించు, కీర్తిప్రకరంబు, పుల్లింగస్వారస్యమువలన నొకపురుషుఁ డని తోఁచుచున్నది; మించన్=అతిశయింపఁగ; పూర్వపక్షావలంబనతన్..పూర్వపక్ష=అపసిద్ధాంతము, అవలంబనతన్=ఆశ్రయముగాఁగలుగుటచేతను; రాజిలునట్టి ధ్వాంతపరధామంబు.—రాజిలునట్టి=ప్రకాశించునట్టి, ధ్వాంతపరధామంబు="ధ్వాంతః అస్తేయస్యసః ధ్వాన్తః" అనఁగాధ్వశబ్ద మంతమందుఁగల మాధ్వశబ్దమర్థము, తద్వాచ్యులు=ద్వైతులు; అట్టి ద్వైతులయొక్క, పరధామంబు=ముఖ్యమగుసిద్ధాంతము; ఎచ్చునే? ఎచ్చదని భావము. ధ్వాంత=అజ్ఞానముయొక్క, ధామంబెచ్చునె యనియు చెప్పఁబడును.

అనఁగ నోచంద్రికా! ప్లక్షద్వీపాధిపతియొక్క కీర్తిపుంజము కల్పతరుకాంతితో సెకీభవించినకాంతి గలదై మించఁగ శుక్లపక్షమం దుండుచంద్రుని తేజము హెచ్చునా? హెచ్చదని భావము.

అద్వైతసిద్ధాంతపరు లగువిద్వాంసులచేఁ బ్రశంసింపఁ బడినకల్పతరువను వేదాంత గ్రంథముయొక్క మన నాదులచే నుదయించిన వాసనను చేకొని బ్రహ్మాత్మైక్యానుసంధానము చేవిజృంభించువిద్వాంసుఁ డతిశయింపఁగ పూర్వపక్షమతము నవలంబించియున్న మాధ్వసిద్ధాంతము హెచ్చ దని ధ్వని.

చ. సరససితోపమాధర రసాలపయోనిధిరాజవేష్టితో
ర్వర కధినేత నీపతి నవారితవైభవశాలి నీమహీ
శ్వరు నవలాలసాతిలకవల్లికచయ్యనఁ బల్లవింప స
త్వరగతిఁ గాంచవే నయనవారిరుహాంతమునం బ్రియంబునన్. 71

టీ. సరససితోపమాధర.— సరస = మనోజ్ఞమగు, సిత = చక్కెరతో, ఉపమా పోలిక గల, అధర = ఓష్ఠముగలచంద్రికా! రసాలపయోనిధిరాజవేష్టితోర్వరకున్.—రసాలపయోనిధిరాజ = ఇక్షుసముద్రరాజుచేతను, వేష్టిత=వలగొనఁబడిన, ఉర్వరకున్ = పుడమికి; అధినేతన్=ఒడయుని; ఈపతిన్=రారాజును; అవారితవైభవశాలిన్.—అవారిత=అనివార్యమగు, వైభవ=విభవముచేత, శాలిన్=ప్రకాశించుచున్నవాని; ఈమహీశ్వరున్=ఈస్లక్షద్వీపాధిపతిని; నవలాలసాతిలకవల్లిక.—నవ=నూతనమయిన, లాలసా=వేడుకయనెడు, తిలకవల్లిక=బొట్టుగుతీవ; చయ్యనన్=శీఘ్రముగ; పల్లవింపన్=చిగిరించునటులు; నయనవారిరుహాంతమునన్=కమలమువంటి. నేత్రముయొక్క అంతముచేతను; ప్రియంబునన్=ప్రేమతో; సత్వరగతిన్=అతిశీఘ్రముగ; కాంచవే=చూడుము.

ఓచంద్రికా! ఇక్షుసముద్రముచేఁ జుట్టఁబడియున్నట్టి పుడమి కధిపతి యగునీరాజును వేడుకయను తిలకలత పల్లవించునటు లతివేగముగా నేత్రాంతముచే నవలోకింపు మని భావము స్త్రీదృష్టిచే బొట్టుగు చిగిరించునని కవిసమయము.

వ. అని యిట్టు లాగట్టుదొరపట్టి వివరించిన నారాచపట్టి యాదిట్టపై వైరాగ్యంబు దెలుపు చిన్నినవ్వు నవ్వ నవ్వనిత దరహాసచంద్రిక తదీయసంతాప కారణంబై ప్రవర్తిల్లె నంత యానావలంబకకదంబకంబు జంబూద్వీపభూపాలలోకంబుఁ జేర్ప నన్నగాధిరాజకుమారి యోనారి నేరెడుదీవియ రాజులు వీరు వీరిలో నొక్కరాజకుమారునిపైఁ జూపు నిలుపు మమ్మహాత్మునిగుణంబులు వర్ణించెద నని యానతిచ్చిన నాకాంత యఖిలదేశనాయకగుణ శ్రవణ కౌతూహలపూర్యమాణస్వాంతయై శాలీనతాభరంబున నూరకుండె నది యెఱింగి సర్వమంగళ యక్కురంగనేత్ర కందఱం దెలుపునదియై వారిలో నొక్కరాజుం జూపి యి ట్లనియె. 72

టీ. అని ఇట్టులు=ఈప్రకారముగ ; ఆగట్టుదొరపట్టి = హిమవంతునకు పుత్రికయగు పార్వతీదేవి; వివరించినన్ = వక్కాణింపఁగ; ఆరాచపట్టి=ఆరాజపుత్త్రి; ఆదిట్టపైన్=అప్లక్షద్వీపాధిపతిమీఁద; వైరాగ్యంబు=అనురాగాభావమును; తెలుపుచిన్నినవ్వున్ = తెలియఁజేయుచిఱునగవు; నవ్వున్=నవ్వఁగా; అవ్వనితదరహాసచంద్రిక.—అవ్వనిత=ఆచంద్రికయొక్క, దరహాసచంద్రిక=చిఱునగవువెన్నెల; తదీయసంతాపకారణంబై.—తదీయ=అప్లక్షద్వీపాధిపతిసంబంధియగు, సంతాప=పరితాపమునకు; కారణంబై=హేతువై; ప్రవర్తిల్లెన్ = ప్రవర్తించెను. అంతన్ = అటుమీఁద; యానావలంబక కదంబకంబు = పల్లకిమోయువారియొక్క గుంపు. జంబూద్వీప భూపాలలోకంబున్=నేరేడుదీవియందుండు పుడమి దొరలగుంపును ; చేర్పన్=పొందింపఁగ; అన్నగాధిరాజకుమారి = హిమవంతునకు పుత్త్రికయగు నప్పార్వతీదేవి; ఓసారి=ఓచంద్రికా ! వీరు నేరెడు దీవియరాజులు=వీరు జంబూద్వీపంబునందు రాజులు;వీరిలోన్=ఈరాజులలో; ఒక్కరాకుమారునిపైన్=ఒకరాజపుత్త్రునిమీఁద ; చూపు=దృష్టిని; నిలుపుము=ఉంచుము. అమ్మహాత్ముని గుణంబులు=ఆమహానుభావుని శౌర్యాదిగుణములను; వర్ణించెదన్ = నుతించెద. అని = ఈప్రకారము; ఆనతిచ్చినన్ = సెలవియ్యఁగా; ఆకాంత = ఆచంద్రిక; అఖిలదేశనాయక గుణశ్రవణకౌతూహల పూర్యమాణస్వాంతయై,—అఖిలదేశనాయక = సమస్తదేశాధిపతులయొక్క, గుణ=శౌర్యాది గుణములయొక్క, శ్రవణ=వినుటయందు, కౌతూహల=సంతసముచేత; పూర్యమాణ=నింపఁబడిన; స్వాంతయై= చిత్తముగలదై; శాలీనతాభరంబునన్=లజ్జాగౌరవముచేత; ఊరకుండెన్=ఏమనకయుండెను. అదిచెలిచెఱింగి=అదిదెలిసికొని; సర్వమంగళ=పార్వతీదేవి; అక్కురంగనేత్రకున్=ఆచంద్రికకు; అందఱందెలుపునదియై=ఎల్లరను దెలియఁజేయునదియై ; వారిలోన్=ఆరాజులలో ; ఒక్కరాజున్; ఒకభూభర్తను; చూపి=ప్రదర్శించి; ఇట్లు=వక్ష్యమాణప్రకారము; అనియెన్=పలికెను.

చ. పొలఁతుక గౌడదేశనర•పుంగవుఁ డీతఁడు వీనిఁ గాంచు మి
య్యలఘుఁడు నిత్యసద్గుణచ•యస్ఫురణన్ శుభకీర్తిపుత్త్రికా
వలి నటియింపఁ జేయుఁ గడు• వాగ్రమణాండము లెల్లఁ గంచుకుం
డలగతిఁ బాయ కూని భ్రమ•ణక్రమణంబులు చక్కఁ జేకొనన్. 73

టీ. పొలఁతుక=చంద్రికా ! ఈతఁడు = ఈరాజు ; గౌడదేశనరపుంగవుఁడు=గౌడదేశాధిపతి ; వీనిన్=ఈరాజును; కాంచుము=చూడుము. ఇయ్యలఘుఁడు=ఈఘనుఁడు; నిత్యసద్గుణచయస్ఫురణన్.—నిత్య = ఎల్లపుడు, సద్గుణ = దానదాక్షిణ్యాదిగుణములయొక్క, శ్రోత్రులయొక్క, యని యర్థాంతరము, చయ=సమూహముయొక్క, స్ఫురణన్=ప్రకాశముచేతను, చలనముచేతనని యర్థాంతరము; శుభకీర్తిపుత్త్రికావలిన్.—శుభ=సుందరములైన, కీర్తిపుత్త్రికా = కీర్తియనెడు బొమ్మలయొక్క, ఆవలిన్ = పంక్తిని; కడున్=మిక్కిలి; వాగ్రమణాండములు=బ్రహ్మాండములను; ఎల్లన్=అన్నిటిని; కంచుకుండలగతిన్= కంచుకుండలరీతిగా; పాయక=విడువక; ఊని=గ్రహించి; అనఁగ నాట్యోపయోగి ఘటములపగిది బ్రహ్మాండములను

గ్రహించి యని భావము; భ్రమణక్రమణంబులు.–భ్రమణ = తిరుగుటవలననైన, క్రమణంబులు=పాదవిన్యాసములను; చక్కఁగన్ = చక్కఁగా; చేకొనన్ = గ్రహించునటులు; నటియింపఁజేయున్=నాట్యము నొనరింపఁజేయును.

అనఁగా నీగౌడదేశాధిపతి బ్రహ్మాండములు కంచుకుండలుగా గ్రహించి తనమంచిగుణములను త్రాళ్లయొక్క చలనముచేత తనకీర్తులను బొమ్మలను భ్రమణ క్రమణంబులునేయు నటులు నటింపఁ జేయునని భావము. లోకములోనాట్యమందు ప్రవీణత గలవారు కుండలయందు నాట్య మొనరించుట ప్రసిద్ధము. ఈరాజుకీర్తి సమస్తబ్రహ్మాండములను వ్యాపించిన దని వ్యంగ్యము. ఈపద్యమందు రూపకాలంకారము.

మ. సమిదుద్ద్యోతితహేతిభృద్దళనవి♦స్ఫారప్రభావాప్తిమై
 క్షమఁ బెంపొంది యుదగ్రజిష్ణుయుతి ని♦చ్చల్ బల్మొన ల్మాపు శం
 బముపై ధాటికిఁ జయ్యన న్వెడల నీ♦త్క్ష్మాభర్తృధామాగ్నికి
 ర్యమబింబోపధి నారతిచ్చు నహర♦శ్శ్రీవాస యాత్రోవలన్. 74

టీ. సమిదుద్ద్యోతితహేతిభృద్దళన విస్ఫారప్రభావాప్తిమైన్.—సమిత్= యుద్ధమందు; ఉద్ద్యోతిత=ప్రకాశించుచున్నట్టి; హేతిభృత్=ఖడ్గధారులయొక్క; దళన=బ్రద్దలుచేయుటచేత; విస్ఫార=అధికమగు; ప్రభావ=మహిమయొక్క; ఆప్తిమైన్=ప్రాప్తిచేతను;సమిత్=ఇంధనములచేత, ఉద్ద్యోతిత=జ్వలించునట్టి, హేతిభృత్=అగ్నియొక్క; దళన=తిరస్కారముచేత;విస్ఫార=అధికమగు;ప్రభాముయొక్కప్రాప్తిచేత నని యర్థాంతరము;క్షమన్=భూమియందు; పెంపొంది=వృద్ధిఁబొంది;ఉదగ్రజిష్ణుయుతిన్.—ఉదగ్ర=ఉత్కృష్టుఁడగు;జిష్ణుయుతిన్=ఇంద్రసంగతిచేతను; జయశీలునియొక్క సంబంధముచేతనని యర్థాంతరము;నిచ్చల్=ఎల్లపుడు; పల్మొనల్=నూరంచులను; అనేకసైన్యములను; మాపుశంబముపైన్=కనఁబడుచున వజ్రాయుధముమీఁదికి; ధాటికిన్=జైత్రయాత్రకు; చయ్యనన్=శీఘ్రముగ; వెడలన్=బయలుదేఱఁగా; ఈత్క్ష్మాభర్తృధామాగ్నికిన్=ఈ గౌడదేశపురాజుయొక్క, ప్రతాపాగ్నికి ; అహరాశ్శ్రీవాస=దినలక్ష్మి; ఆత్రోవలన్=అమార్గములయందు; అర్యమబింబోపధిన్ = సూర్యబింబవ్యాజముచేత; ఆరతిన్=నీరాజనమును; ఇచ్చున్=చేయును.

ఈగౌడదేశాధిపతిప్రతాపాగ్ని పుడమి నూరనిబర్హణముచే వృద్ధి నొంది; జయశీలుని గూడి అనేకసేనలను జూపు వజ్రాయుధముమీఁదికి యుద్ధమునకు వెడలఁగా, దినలక్ష్మి మార్గమందు ప్రతాపాగ్నికి సూర్యబింబ మనునెప మిడి యారతిచ్చుచున్న దని భావము. సూర్యబింబము ప్రతాపాగ్నికి నీరాజనదీపము న్నటు లున్నదని పద్యమందు వ్యంగ్యము.

చ. వనజగృహంబుల న్వీడిచి ♦ వారిధిరాజకుమారి యీమహీ
 శనయనపద్మసీమముల ♦ సంతతము న్వసియింపఁ బాడు గై

కొనినతదాలయాళి సుమ॰కోమల బల్రొద నివ్వటిల్లఁగా
ననిశము మొత్తు లాడు మలి॰నాత్మకబంభరదంభభూతముల్. 75

టీ. సుమకోమల=కుసుమమువలె మృదువైనదానా! వారిధి రాజకుమారి = లక్ష్మీదేవి; వనజగృహంబులన్=పద్మగృహములను ; విడిచి=వదలి; ఈమహీశనయన పద్మసీమలన్=ఈ దొరకనుదామరల కొనలయందు; సంతతమున్=ఎల్లపుడు; వసియింపన్=నివసింపఁగా; పాడుగైకొనిన తదాలయాళిన్=పాడుపడిన యాలక్ష్మీ గృహములయందు; బల్రొద= అధికమగు కోలాహలధ్వని; నివ్వటిల్లఁగాన్=అతిశయింపఁగా; అనిశము=ఎల్లపుడు; మలినాత్మకబంభరదంభ భూతముల్.—మలినాత్మక=నల్లనిదేహముగల, పాపభూయిష్ఠమగు మనముగలయను నర్థము దోఁచుచున్నది, బంబర దంభ=తుమ్మెదలను కపటముగల, భూతముల్ = పిశాచములు; మొత్తులాడున్=కొట్లాడును.

ఓచంద్రికా! లక్ష్మీదేవి తనగృహములను విడిచి యీరాజు నపాంగములయందు వసియింపఁగ నామెగృహములు పాడుపడి వానియందు ఘోరధ్వనులను జేయుచు నల్ల నిశరీరములు గల తుమ్మెద లనుపిశాచము లెల్లప్పుడును గొట్లాడుచుండు నని భావము. రాజుల నేత్రాంతములయందు కలిమి నెలంత యునికియు కమలములు లక్ష్మీనివాసము లనుటయు నందు భృంగము లుండుటయుఁ బ్రసిద్ధము.

తే. అనిన ద్వైతార్థమునకు వే॰దాంత మనఁగ
వనిత స్వాంతం బలజనేంద్రు ॰ నెనయ కున్కి-
వేఱొకనిచెంతఁ జేర్చి య॰వ్వేలఁది కద్రి
తనయ యారాజుఁ జూపి యి॰ట్లనియె నపుడు. 76

టీ. అనినన్ = ఈప్రకారము చెప్పఁగా; ద్వైతార్థమునకున్=జీవాత్మ పరమాత్మలకు భేదముగలదను నర్థమునకు; వేదాంతమనఁగన్ = అద్వైతార్థ ప్రతిపాదకము లగునుపనిషత్తులనునట్లు; వనితస్వాంతంబు = చంద్రికాచిత్తము ; అలజనేంద్రున్ = ఆనరనాథుని; ఎనయకున్కిన్ = పొందకుండుటచేత ; వేఱొకనిచెంతన్ = మఱియొకరాజు సమీపమును; చేర్చి=పొందించి; అవ్వేలఁదికిన్ = ఆచంద్రికకు; అద్రితనయ = పార్వతీదేవి; ఆరాజున్= ఆమధురానగరపతిని; చూపి = ప్రదర్శించి; ఇట్లు = వక్ష్యమాణప్రకారము; అనియెన్= పలికెను. అపుడు=ఆసమయమందు. దీని కుత్తరపద్యస్థక్రియతో నన్వయము.

" అనఁగా ద్వైతార్థము అద్వైతార్థప్రతిపాదకములగు నుపనిషత్తులయందు ఏరీతి సమన్వితము కాదో ఆరీతిఁ జంద్రికాచిత్త మారాజునందు లగ్నము కా దని భావము.

చ. రతి దళుకొత్తఁ గాంచు మధు॰రానగరీపరిపాలనక్రియో
ర్జితమతి నీమహీపతి వి॰శేషకలక్షణశోభితాస్య సం

భృతతపనీయమేఖలిక • నీనరపాలకుఖడ్గపుత్రి న
ద్భుతగతిఁ గాంచి శత్రుతతి • పూను నని న్నవమోహ మాత్మలన్. 77

టీ. రతి=అనురాగము; తళుకొత్తన్=ప్రకాశించునట్లు; మధురానగరీపరిపాలన క్రియో ర్జితమతిన్.—మధురానగరీ=మధురాపట్టణముయొక్క, పరిపాలనక్రియా = పాలన వ్యాపార మందు, ఊర్జితమతిన్=దృఢమగుబుద్ధిగల; ఈమహీపతిన్=ఈరాజును; కాంచు=చూడుము. విశేషకలక్షణ,శోభితాస్యన్.—విశేషక=విలక్షణమగు, లక్షణ=గుఱిచేత, శోభిత=ప్రకాశిం చుచున్న, ఆస్యన్=ముఖముగల; విశేషక = తిలకముచేతను, లక్షణ = శుభచిహ్నముల చే తను, ప్రకాశించుచున్న, ముఖముగలయని యర్థాంతరము; సంభృత తపనీయమేఖలి కన్.—సంభృత=భరింపఁబడిన, తపనీయ=బంగరుయొక్క, మేఖలికన్ = ఖడ్గబంధముగల, ఒడ్డాణముగల, "మేఖలా ఖడ్గబన్ధే స్యాత్కాఞ్చ్యాం శైలనితమ్బయోః" అని విశ్వము;ఈనరపా లకు ఖడ్గపుత్రిన్.—ఈనరపాలకు=ఈనరపతియొక్క;ఖడ్గపుత్రిన్=చూరకత్తిని;లేదా; ఖడ్గమ నుసుతను; అనిన్=యుద్ధమందు; శత్రుతతి=శత్రుబృందము; అద్భుతగతిన్=ఆశ్చర్యరీతిచేత; కాంచి=చూచి; ఆత్మలన్=మనములందు; నవమోహము.——నవ=నూతనమైన, మోహము=మూ ర్ఛను, అనురాగమును; పూనున్=పొందును.

అనఁగా యుద్ధమం దీమధురాపుర నరపతి ఖడ్గపుత్రిని జూచి శత్రుబృందము మోహ మును బొందు నని తాత్పర్యము.

సీ. మధురాపురీమణి•మహనీయసౌవర్ణ
హర్మ్యసందోహవి•హారములకు
ననవద్యబృందావ•నాంతాంతలతికాంత
లతికాంతహరణఖే•లాగతులకు
కలితసారసమిత్ర•కన్యకాకల్లోల
మాలికాపాలికా• కేలికలకు
చారుగోవర్ధనా • చలకందరామంది
రాళినిగూహన • వ్యాపృతులకుఁ

తే. దరుణచపలాయమానకై•తకదళాప్త
కబరికాబంధ యాకాంత • గలగె నేని
నీధరాధీశకులవశాలి • నెనయఁ జేయు
మలఘు లజ్జావలద్దృష్టి•విలసనంబు. 78

టీ. తరుణచపలాయమానకైతకదళాప్త కబరికాబంధ.—తరుణచపలాయమాన = క్రొ క్రొక్కు మెఱుపువలె నాచరించుచున్న; కైతకదళ=గేదఁగిరేకుచేత; ఆప్త=పొందఁబడిన; క

బరికాబంధ=కొప్పుగల చంద్రికా! మధురాపురీమణి మహనీయసౌవర్ణ హర్మ్యసందోహవిహారములకున్.—మధురాపురీ=మధురానగరముయొక్క; మణి=మణులతోఁ గూడిన, మహనీయ=శ్లాఘ్యములగు, సౌవర్ణ=సువర్ణవికారములగు, హర్మ్య=మేడలయొక్క, సందోహ = సమూహమునందలి; విహారములకున్ = క్రీడలకు; అనవద్య బృందావనాంతకాంతలతికాకాంతహరణఖేలాగతులకున్.—అనవద్య=నిర్దుష్టములగు, బృందావనాంత=బృందావనమధ్యమందున్న; లతికా=తీవలయొక్క; అంత=మనోహరములగు; లతికాంత=పుష్పములయొక్క;హరణ=కోయుటయందైన; ఖేలాగతులకున్ = క్రీడాగతులకు; కలితసారసమిశ్ర కన్యకాకల్లోలమాలికా పాలికాకేలికలకున్.— కలిత=ఒప్పుచున్న; సారసమిశ్రకన్యకా=యమునానదియొక్క; కల్లోల=తరఁగలయొక్క, మాలికా=పంక్తులయొక్క, పాలికా=పరంపరలయందు; "పాలిస్త్ర్యశ్ర్యఙ్క్రపఙ్క్తిషు" అని అమరుఁడు; కేలికలకున్=విహారములకు, జలక్రీడలకనుట; చారు గోవర్ధనాచల కందరామందిరాళినిగూహన వ్యాపృతులకున్.—చారు=సుందరములగు; గోవర్ధనాచల= గోవర్ధనపర్వతముయొక్క; కందరామందిర=గృహములవంటి గుహలయొక్క; ఆళి=పఙ్క్తులయందు, నిగూహనవ్యాపృతులకున్=డాఁగిలిమూఁతలనువ్యాపారములకు; ఆకాంక్ష=కోరిక; కలిగనేనిన్=పుట్టెనేని; ఈధరాధీశకుల మౌళిన్=ఈరాజును; అలఘులజ్జావలద్దృష్టి విలసనంబు.—అలఘు=అధికమగు, లజ్జా=సిగ్గుచేత, వలత్=చలించుచున్న, దృష్టి=చూపులయొక్క, విలసనంబు=విలాసమును; ఎనయఁజేయుము= కలయునటులు చేయుము.

అనఁగ మధురాపురసౌవర్ణసౌధములయందుఁ గలుగుక్రీడలను బృందావనపుష్పహరణములను యమునానదీజలక్రీడలను గోవర్ధనపర్వతగుహలయందు డాఁగిలిమూఁతలనుక్రీడలను కోరుదువేని నీరాజమౌళియందుఁ గటాక్షముల నెఱపు మని తాత్పర్యము.

చ. కువలయసంభ్రమప్రదత♦కు న్నెలవై పరచక్రదర్పవై
భవహరణాఢ్యవర్తనకుఁ ♦ బాదయి యీవిభుదోర్మహంబు గో
త్ర వెలయఁ దత్తులావిరహి♦తాజనితోరుమలీమసత్వ మో
యువతి వసద్రమేశతను♦భోపధిఁ బర్వు దినేంద్రుమేనునన్. 79

టీ. ఓయువతి=ఓచంద్రికా! ఈవిభుదోర్మహంబు=ఈరాజుభుజప్రతాపము; కువలయసంభ్రమప్రదతకున్.—కువలయ=కలువలకు, భూవలయమునకు, సంభ్రమప్రదతకున్ = సంతసమునిచ్చుటకు, త్రొట్రుపాటునిచ్చుటకు; నెలవై=నివాసస్థానమై; పరచక్రదర్పవైభవహరణాఢ్యవర్తనకున్.—పర=శ్రేష్ఠములగు, చక్ర=జక్కవలయొక్క, దర్పవైభవ=గర్వాతిశయముయొక్క, హరణ=పోఁగొట్టుటయందు, ఆఢ్య=పూర్ణమగు, వర్తనకున్=వ్యాపారమునకు; పాదయి=ఉనికిపట్టయి; గోత్రన్=భూమియందు; వెలయన్=ప్రకాశింపఁగా; తత్తులావిరహితాజనితోరుమలీమసత్వము.—తత్తులా=తత్సామ్యముయొక్క, విరహితా=రాహిత్యముచేత, జనిత=పుట్టింపఁబడిన, ఉరు=అధికమగు, మలీమసత్వము=మాలిన్యము, నైల్యమనుట; వసద్రమేశతనుభోపధిన్.—వసత్ = నివసించియున్న, రమేశ = నారాయణమూర్తియొక్క, తనుభా=

దేహకాంతియనెడు, ఉపధిన్ = వ్యాజముచేత ; దినేంద్రుమేనునన్ = సూర్యశరీరమందు ; పర్వున్=వ్యాపించును.

అనఁగ నీరాజుప్రతాపము కువలయసంభ్రమప్రదమును పరచక్రదర్పము నడఁగించునదియు నగుటచే, కువలయసంతోషమును బోఁగొట్టువాఁడును బరచక్రదర్పమునుసతిశయింపఁజేయువాఁడునగు సూర్యుఁడు ఏతద్రాజప్రతాపసామ్యముపొందమి నుదయించునైల్యమును,తనశరీర మందుండు నారాయణమూర్తియొక్క శరీరకాంతి యనెడునెపముచే ధరించునని తాత్పర్యము. వాస్తవికమగు సూర్యశరీరగతనారాయణమూర్తిదేహకాంతిని,ప్రచ్ఛాదించి సామ్యాభావప్రయుక్తలోపమువలన జన్మించునైల్యమును గాఁ జెప్పుటచేఁగైతవాపహ్నవాలంకారము.

తే. అని యెఱింగింప నపుడు పక్ష్మాంచలములు
ప్రాల్ప శిబికాధరు లద్విరక్తి నెఱిఁగి
వేఱొకనృపాలుఁ జేర్ప నావెలఁది కగజ
యమ్మహీశునిఁ జూపి యిట్లనుచుఁ బలికె. 80

టీ. అని=ఈప్రకారము, ఎఱింగింపన్=తెలియఁజేయఁగా; అప్పుడు=ఆసమయమందు; పక్ష్మాంచలములు.—పక్ష్మ=ఱెప్పలయొక్క, అంచలములు=అగ్రములు; ప్రాల్పన్ = వంపఁగా; శిబికాధరులు = పల్లకిని మోయువారు ; తద్విరక్తిన్.—తత్=ఆరాజునందు, విరక్తిన్=విరాగమును; ఎఱిఁగి=తెలిసికొని ; వేఱొకనృపాలున్=వేఱొకరాజును ; చేర్పన్=పొందింపఁగా ; ఆవెలఁదికిన్=ఆచంద్రికకు; అగజ=పార్వతీదేవి; అమ్మహీశునిన్=ఆరాజును; చూపి=ప్రదర్శించి; ఇట్లు=వక్ష్యమాణప్రకారముగ; అనుచున్. పలికెన్=వచించెను.

మ. వలజాలోకలలామ గన్గొనవె యీవారాణసీరాజు ను
జ్జ్వలతేజోదినరాజు నిప్పతి భుజావష్టంభరేఖ న్ద్విష
ద్బలకోటి న్మథియించి నిల్పె విజయస్తంభంబు లాశాగజా
వలికి న్నిచ్చలు కట్టుఁగంబములశోభ న్దోఁప దిగ్వీథులన్. 81

టీ. వలజాలోకలలామ=సుందరులగుస్త్రీలమండలములోశ్రేష్ఠురాలా! "వలజావల్గుదర్శనా" యనియమరుఁడు;ఉజ్జ్వలతేజోదినరాజున్.—ఉజ్జ్వల=ప్రకాశించుచున్న, తేజః=తేజమునందు, దినరాజున్=సూర్యునితోసమానుఁడగు;ఈవారణసీరాజున్ = ఈకాశీరాజును;, కన్గొనవె=చూడుమా ! ఇప్పతి=ఈకాశీరాజు ; ఇదికర్తృపదము ; భుజావష్టంభరేఖన్.—భుజావష్టంభ=భుజగర్వముయొక్క, "దర్పోవలేపోఽవష్టంభః" అనియమరుఁడు ; రేఖన్=శ్రేణి; ద్విషద్బలకోటిన్.— ద్విషద్బల = శత్రుసేనలయొక్క, కోటిన్ = సమూహమును ; మథియించి=సంహరించి; విజయస్తంభంబులు=జయస్తంభములను ; దిగ్వీథులన్=దిక్ప్రదేశముల

యందు; ఆశాగజావలికిన్ = దిగ్గజములసమూహమునకు; నిచ్చలు=ఎల్లప్పుడుం ; కట్టుఁగంబముల రేవన్=కట్టివేయుకంబములయొక్క-రీతిచే ; తోఁపన్ = కనిపించునటులు; నిల్పెన్=నిలువఁ బెట్టెను.

అనఁగ నోచంద్రికా ! యీకాశిరాజును కనుఁగొనుము, ఈరాజు తనభుజవీర్యముచేత పగతురఁ బరిమార్చి దిక్కు-లయందు దిగ్గజములకుఁ గట్టుకంబములపగిది నున్నవిజయస్తంభముల నిలిపె నని భావము.

మ. వరదానంబు ననల్పసౌకరియు శశ్వద్భోగసంపత్తి ని
బ్బరపుంగూటపుమేల్మి యీపతియెడం భాసిల్ల నశ్రాంత ము
ర్వర తాఁ జేరి పయోజలోచన కరిస్వామిం గిరిస్వామి నా
హరిరాజున్ గిరిరాజు నెంచక ప్రమోదావాప్తి మించు న్గడున్. 82

టీ. వరదానంబున్.—వర=శ్రేష్ఠమగు, దానంబున్=వితరణమును, మదోదకమును ; అనల్పసౌకరియున్.—అనల్ప=అధికమగు, సౌకరియున్=సుకరత్వమును, సూకరత్వమును; శశ్వద్భోగసంపత్తి.—శశ్వత్ = ఎల్లప్పుడు, భోగసంపత్తి=ఉపభోగసంపద, పడగలయొక్క-సంపద ; నిబ్బరపుంగూటపుమేల్మి = అధికమగుబాణములయొక్క- మేలిమి, శిఖరములయొక్క-మేలిమి; ఈపతియెడన్ = ఈరాజునొద్ద; భాసిల్లన్ = ప్రకాశింపఁగా; అశ్రాంతము=ఎల్లపుడు; ఉర్వర=పుడమి ; తాన్=తాను ; చేరి=పొంది ; పయోజలోచన=చంద్రికా ! సంబుద్ధి; కరిస్వామిన్=గజరాజును; కిరిస్వామిన్=ఆదివరాహమును; ఆహరిరాజున్=అయాదిశేషుని; గిరిరాజున్=కులాచలమును; ఎంచక=లెక్క-పెట్టక; ప్రమోదావాప్తిన్ = సంతోషప్రాప్తిచేత; కడున్=మిక్కి-లి; మించున్=అతిశయించును.

అనఁగా భూదేవి, కరికిరిహరిగిరిస్వాములయం దుండు దానసౌకర్య భోగకూటములు ఈరాజునందుఁ బ్రకాశింపఁగ, వారిని గణింపక యీభూపతిని జేరె నని తాత్పర్యము. ఇచట, కరిస్వామి గిరిస్వామి హరిరాజు గిరిరాజు అని గికారప్రయోగముచే, కరిస్వామి ప్రభృతులయందు అపకర్షము దోఁచుచున్నది.

మ. అవనీనాయకపద్మసాయకుని దివ్యానందకాంతారవ
న్యవిహారాన్వితు వీని నీయురముఁ జెందం జూడవే దృష్ట్యలే
హ్యావలగ్నామణి నీకు గాంగజలఖేలాభోగముల్ హస్తిదా
నవవిద్వేషిపదాబ్జసేవనవిధానం బబ్బు నశ్రాంతమున్. 83

టీ. అవనీనాయకపద్మసాయకునిన్.—అవనీనాయక=రాజులయందు, పద్మసాయకునిన్=మన్మథునివంటివానిని; దివ్యానందకాంతారవన్యవిహారాన్వితున్.—దివ్య=ప్రశస్తమగు, ఆనందకాంతార=ఆనందవనమందలి, వన్యవిహార=వనవిహారములతోడ, అన్వితున్=కూడినట్టి; వీనిన్=ఈ

రాజును; నీయురము=నీవక్షమును; చెందక=పొందునటులు, ఆలింగనము చేసికొనునటులనుట; దృష్ట్యశేష్యావలగ్నామణి!= దృష్టికగోచరమైనమధ్యభాగముగల స్త్రీలయందుత్తమురాలవగు చంద్రికా! చూడవే= చూడుమూ. నీకుక; గాంగజలఖేలాభోగముల్=జాహ్నవీజలక్రీడలయొక్క పరిపూర్ణతలును; హస్తిదానవవిద్వేషిపదాబ్జసేవనవిధానంబు.—హస్తిదానవవిద్వేషి = విశ్వేశ్వరునియొక్క, పదాబ్జ=పాదకమలములయొక్క, సేవన=పరిచర్యయొక్క, విధానంబు=విధానమును; అశ్రాంతముక=ఎల్లప్పుడు; అబ్బుక=చేకూఱును.

అనఁగ నో చంద్రికా! యీరాజును వరించితివేని గంగానదీజలవిహారములు గలుగుటయేగాక శ్రీవిశ్వేశ్వరస్వామిపాదకమలములసేవయు నెల్లప్పుడుఁ జేకూఱు నని భావము.

క. అని తెలుప వినియు నలజవ్వని విననటు లుండ యానవహులొక్కనృపా
లునిఁ జేర్ప గౌరి యావిభు, వనజాక్షికిఁ జూపి యిటులు పల్కె వేడ్కక. 84

టీ. అని=ఈప్రకారము ; తెలుపక=తెలియఁజేయఁగా; వినియుక=ఆకర్ణించియు ; అలజవ్వని=ఆచంద్రిక; విననటులుండక=విననిదానివలెనుండఁగా ; యానవహులు = పల్లకిని మోయువారు ; ఒక్కనృపాలునిక=ఒకరాజును; చేర్పక = చేర్పఁగ ; గౌరి=పార్వతీదేవి ; ఆవిభుక=ఆరాజును; వనజాక్షికిక=చంద్రికకు; చూపి=ప్రదర్శించి; ఇటులు=ఈప్రకారము; వేడ్కక=సంతసముచేత; పల్కెక.

శా. కర్ణాటేశ్వరుఁ డీతఁ డిమ్మనుజలోకస్వామి వీక్షింపుమా
కర్ణాంతాయతనేత్ర వీనిజయజాగ్రద్భర్మ్యభంభాకులో
దీర్ణధ్వానము దిక్ప్రభిత్తిపరిభిత్తిస్ఫూర్తిఁ జేపట్టఁగాఁ
దూర్ణం బుర్వరఁ ద్రెళ్లు వైరినృపసందోహంబు చిత్రంబుగక. 85

టీ. కర్ణాంతాయతనేత్ర = శ్రుత్యంతమువఱకు విశాలములగునేత్రములుగలచంద్రికా! ఈతఁడు=ఈరాజు; కర్ణాటేశ్వరుఁడు=కర్ణాటభూపతి. ఇమ్మనుజలోకస్వామిక=ఈనరపతిని ; వీక్షింపుమా=చూడుమా. వీనిజయజాగ్రద్భర్మ్యభంభాకులోదీర్ణధ్వానము.—వీని=ఈరాజుయొక్క, జయ=జయముచేత, జాగ్రత్=మేల్కొనిన, భర్మ్య = సువర్ణమయమగు, భంభాకుల = జయభేరీబృందముయొక్క, ఉదీర్ణ=ఉత్కటమగు, ధ్వానము=నాదము;దిక్ప్రభిత్తిపరిభిత్తిస్ఫూర్తిక.—దిక్ప్రభిత్తి=దిగ్భిత్తులయొక్క, పరిభిత్తి=భేదనముయొక్క, స్ఫూర్తిక=అతిశయమును; చేపట్టఁగాక = గ్రహింపఁగా; వైరినృపసందోహంబు.—శత్రురాజబృందము ; చిత్రంబుగక=విచిత్రముగ;తూర్ణంబు=శీఘ్రముగ; ఉర్వరక=భూమియందు; త్రెళ్లుక=పడును.

చంద్రికా! కర్ణాటభూమి కధినేత యగునీరాజును వీక్షింపుము, వీని జయభేరీనినాదము దిగ్భిత్తులను భేదింపఁగానే యతనిశత్రువులు భూమిపైఁబడుదురని భావము. ఈ పద్యమునం దతిశయోక్తి భేదము.

మ. బలభిన్నీలసహోదరచ్ఛికుర యీ◆పట్టాభిషిక్తేంద్రు హృ
త్స్థలి వర్ణింపఁ దరంబె యిప్పతి తను◆చ్ఛాయాగతిన్ మన్మథుం
గలనం గెల్చి తదంకమండలముఁ జ◆క్కం గైకొనెం గానిచోఁ
దలఁప న్వీనికిఁ జెల్ల నేర్చునె సము◆ద్యన్నక్రకేతుచ్ఛటల్. 86

టీ. బలభిన్నీలసహోదరచ్ఛికుర=ఇంద్రనీలములకుసమానములగుకురులు గలచంద్రికా! ఈపట్టాభిభిషిక్తేంద్రున్=ఈమూర్ధాభిషిక్తుని; హృత్స్థలిన్=హృదయప్రదేశమందు; వర్ణింపన్=నుతియించుటకు; తరంబె=శక్యమా? ఇప్పతి=ఈరాజు; తనుచ్ఛాయాగతిన్=దేహకాంతిరీతి చేత ; కలనన్ = యుద్ధమందు, మన్మథున్ = మరుని ; గెల్చి=జయించి ; తదంకమండలమున్.—తత్=ఆమన్మథునియొక్క, అంక=చిహ్నములయొక్క, మండలమున్=సమూహమును; చక్కన్=చక్కఁగ; కైకొనెన్=గ్రహించెను. కానిచోన్=అట్లు గ్రహింపనియెడల ; తలఁపన్=విచారింపఁగ; వీనికిన్=ఈరాజునకు; సముద్యన్నక్రకేతుచ్ఛటల్.—సముద్యత్=మీఁదికిలేచిన, నక్రకేతు = మకరధ్వజములయొక్క, ఛటల్ = సమూహములు; చెల్ల నేర్చునె= చెల్లునా ?

అనఁగ నారాజు తనసొబగుచే మరునిఁ బోరున గెలిచి వాని మకరధ్వజముల గ్రహించెను. అట్లుగానిచో వీనికి మకరధ్వజములు చెల్లునా యని భావము.

చ. ఇనకులనుత్యరాజపర◆మేశ్వరలక్షణశాలి యివ్విభుం
డనిశము చక్రహార్దమహా◆వసుదాన మొనర్ప నేర్చువాం
ఛ నెనయుచంద్రుఁ డౌఁ జుము ర◆సావలయాతపవారణంబు త
ద్ఘనజవజశ్రమాంబుకణి◆కల్ సుము ముత్తెపుకుచ్చు లెంచఁగన్. 87

టీ. ఇనకులనుత్యరాజపరమేశ్వరశాలి.—ఇనకుల=నృపసమూహముచేత, నుత్య=కొనియాడఁదగిన, రాజపరమేశ్వర=రాజరాజులయొక్క, లక్షణ=సులక్షణములచేత, అనఁగా భాగ్యచిహ్నములచేతననుట, శాలి=ప్రకాశించుచున్న; ఇవ్విభుండు=ఈరాజు; అనిశము=ఎల్లపుడు; చక్రహార్దమహావసుదానము.— చక్ర=జక్కవలకు, రాష్ట్రమునకు, హార్ద=ప్రేమము నిచ్చు, మహావసుదానము=గొప్పకిరణములయొక్క, ధనముయొక్క, యిచ్చుటను; ఒనర్పన్=చేయఁగా; నేర్చువాంఛన్=అభ్యసించుకోరికచేత; ఎనయు చంద్రుఁడు=పొందినచంద్రుఁడే; రసావలయాతపవారణంబు=భూచక్రచ్ఛత్రము; ఔన్=అగును. చుము=సత్యము. ముత్తెపుకుచ్చులు = మౌక్తికగుచ్ఛములు; ఎంచఁగన్=విచారింపఁగ; తద్ఘనజవజశ్రమాంబుకణికల్.—తత్=ఆచంద్రునియొక్క, ఘన=అధికమగు, జవజ=వేగమువలనఁబుట్టిన, శ్రమాంబుకణికల్= శ్రమోదక బిందువులు, చెమటబిందువులనుట. చుము=సత్యము.

ఈరాజన్యునిభూచక్రాకారమగుగొడుగు గొడుగుగాదు, మఱియే మనఁగా చక్రమునకు వసుదాన మియ్య నేర్చిన యీపతిచెంగట, జక్కవలకు వసుదానము మియ్య నేరని వాఁడగు

టచే చక్రమునకు వసుదాన మియ్య నేర్చికొను వాంఛతోఁ జేరినచంద్రుఁడే; ఈముత్యపుగుత్తులు అతివేగముతోఁ జేరినచంద్రుని చెమటబిందువులె యని భావము. ఈ పద్యమందు అభేదరూపకాలంకారము.

మ. వరసామ్యంబు ఘటిల్లె నంచు నృపతు ♦ ల్వర్ణింప రాజాధిరా
జు రవిద్యోతనరూపతేజు నితని ♦ న్సోమాస్య యుద్వాహమై
నిరతం బొప్పుము సర్వభూపహారిణీ♦నేత్రాశిరోరత్నది
వ్యరుచుల్ త్వత్పదవీథి యావకరసా♦న్వాదేశముం బూనఁగన్. 88

టీ. వరసామ్యంబు=వరుని యనురూపత, అనురూపుఁడయిన వరుఁడనుట; ఘటిల్లెనంచున్=చేకూరెననుచు; నృపతుల్=రాజులు; వర్ణింపన్=నుతియింపఁగా; రాజాధిరాజున్=రాజులకురాజయినట్టి;రవిద్యోతన రూప తేజున్.—రవిద్యోతనరూప=సూర్యకాంతితుల్యమగు, తేజున్=కాంతిగల; ఇతనిన్=ఈకర్ణాటభూపతిని; సోమాస్య.—సోమ=చంద్రునివంటి, ఆస్య=ముఖముగలచంద్రికా! ఉద్వాహమై=పెండ్లిచేసికొని; నిరతంబు=ఎల్లపుడు; సర్వభూపహారిణీనేత్రాశిరోరత్న దివ్యరుచుల్.—సర్వభూపహారిణీనేత్రా=సమస్తరాజాంగనలయొక్క, శిరోరత్న=చూడామణులయొక్క,దివ్య=మనోహరములగు,రుచుల్=కాంతులు; త్వత్పదవీథిన్=నీపాదప్రదేశమందు; యావకరసాన్వాదేశమున్.—యావకరస=లాక్షారసమునకు, అన్వాదేశమున్=పౌనరుక్త్యమును; "కించి త్కార్యం విధాతు ముపాత్తస్య కార్యాన్తర విధానాయ పునరుపాదాన మన్వాదేశః" అని వైయాకరణసంకేతము, ఒక కార్యమును విధించినదానినే మరలఁ గార్యాంతరమును విధించుటకై గ్రహించుట అన్వాదేశపదార్థముగాన పౌనరుక్త్యము ఫలితార్థము; పూనఁగన్=వహింపఁగా; ఒప్పుము=ప్రకాశింపుము.

చంద్రికా! నీవితనిఁ బెండ్లియై యొప్పఁగా సమస్తరాజాంగనల చూడామణి మరీచులచే నలంకృతంబు లగునీపాదములకు లాక్షారసము పునరుక్తప్రాయమై యుండు ననిభావము.

వ. అని తెలిపి యాయుర్వీశుపై మనంబు పర్వ కునికి నాశర్వప్రేయసి సుపర్వరాజగర్వాపహావైభవధూర్వహుం డగునొక్కరాజకులోద్వహుం జేర నియోగించి యాపర్వేందువదన కతనిం జూపి యిట్లనియె. 89

టీ. అని తెలిపి = ఈప్రకారము తెలియఁజేసి; ఆయుర్వీశుపైన్ = ఆరాజుమీఁద; మనంబు=చిత్తము; పర్వకునికిన్=ప్రాఁకకుండుటచే; ఆశర్వప్రేయసి=ఆపార్వతీదేవి; సుపర్వరాజ గర్వాపహావైభవ ధూర్వహుండు.—సుపర్వరాజ=ఇంద్రునియొక్క, గర్వ=అహంకారమును, అపహా=పోఁగొట్టునట్టి, వైభవ=విభవముయొక్క,ధూర్వహుండు=భారమును వహించినవాఁడు; అగు నొక్క రాజకులోద్వహున్=అయినట్టి యొకరాజశ్రేష్ఠుని; చేరన్=పొందుటకు; నియోగించి=ఆజ్ఞాపించి; ఆపర్వేందువదనకున్=ఆచంద్రికకు; అతనింజూపి=ఆరాజునుజూపి; ఇట్లనియెన్=వక్ష్యమాణప్రకారముగఁ బలికెను.

మ. వనితా కన్గొను కాశిరా జితఁడు దై♦వాఱు న్మహిన్ రాజరా
జన నార్యేశ్వరమైత్రి సద్ద్రవిణధు♦ర్యత్వంబు నాత్మాంఘ్రిసే
వనతాత్పర్యయుతాప్తపుణ్యజనశ♦శ్వత్సంపదాపాదకాం
చనధీవృత్తియు సార్వభౌమనిభృతా♦శాగుప్తియుం బూనుచున్. 90

టీ. వనితా=చంద్రికా! ఇతఁడు=ఈభూపతి; కాశిరాజు=కాశిదేశాధిపతి; మహిన్=భూమియందు; రాజరాజనన్=కుబేరుఁడనఁగ, రాజశ్రేష్ఠుఁడన; దైవాఱున్=అతిశయించును. ఆర్యేశ్వరమైత్రిన్=పార్వతీపతియొక్క, సత్పురుషశ్రేష్ఠులయొక్క, మిత్రత్వమును; సద్ద్రవిణధుర్యత్వంబున్.—సత్=శ్రేష్ఠమగు, ద్రవిణ=ధనముయొక్క, బలముయొక్క, ధుర్యత్వంబును=ధురీణత్వమును; ఆత్మాంఘ్రిసేవన తాత్పర్యయుతాప్తపుణ్యజన శశ్వత్సంపదాపాద కాంచనధీవృత్తియున్.—ఆత్మ=తనయొక్క, అంఘ్రిసేవన=పాదసేవనమందు, తాత్పర్య=తత్పరత్వముచేత, యుత=కూడుకొన్న, ఆప్త=ఇష్టులగు, పుణ్యజన= పుణ్యపురుషులకును, యక్షులకును, శశ్వత్=ఎల్లకాలము, సంపదాపాదక=ఐశ్వర్యము నిచ్చునట్టి, అంచన=ప్రకాశించు చున్నట్టి, ధీవృత్తియున్=చిత్తవృత్తిని; సార్వభౌమనిభృతాశాగుప్తియున్.—సార్వభౌమ=చక్రవర్తిత్వముచేత, నిభృత=పోషింపఁబడిన, ఆశా=దిక్కులయొక్క, గుప్తిన్=పాలనమును; సార్వభౌమ=సార్వభౌమమను దిగ్గజముచేత, నిభృత=భరింపఁబడిన, ఆశా=ఉత్తరదిక్కుయొక్క, గుప్తియున్=పాలనమును; పూనుచున్=గ్రహించుచు; దైవాఱున్=ప్రకాశించును.

అనఁగ నీరాజు కుబేరునిపగిది నార్యేశ్వరమైత్రి సద్ద్రవిణధుర్యత్వమును పుణ్యజనసంపదాపాదకత్వమును సార్వభౌమనిభృతాశాగుప్తిని పొంది ప్రకాశించు నని భావము.

సీ. గురుపద్మినీరాగ♦గుంభితస్వాంతంబుఁ
గని యొప్పుఁ జక్రప♦క్షప్రతాన
మతివేల మధుపాళి♦కాప్తిచే నెవ్వేళ
నలరారుఁ బారిజా♦తాగమాళి
బాడబవర్ధన♦ప్రౌఢిప్రచారంబు
భాసిల్లుఁ గడుఁ బొంగుఁ ♦ బాలకడలి
సద్వసుహారియై ♦ సంలబ్ధదోషాను
స్మృతిఁ బొల్చు వానతే ♦ యీశ్వరుండు
తే. తత్సమాసక్తిఁ బంకసం♦తతిఁ గరంబు
ను విరళశ్రీ వహించుఁ గై♦రవచయంబు
ననఘమై మించు నీమేటి♦యుశముతోడ
సాటి యగు నెట్లు సారస♦జ్ఞాతినయన. 91

టీ. సారసజ్జాతినయన=కమలములవంటి నేత్రములుగల చంద్రికా! చక్రపక్షప్రతానము=హంసలగుంపు; గురుపద్మినీరాగగుంభితస్వాంతంబుల్.—గురుపద్మినీ=గురుభార్యయందు, రాగ=అనురాగము చేత, గుంభిత=పూరితమగు, స్వాంతంబుల్ = చిత్తమును; కని=పొంది; ఒప్పున్=ఒప్పును. గురు = అధికమగు, పద్మినీ=పద్మలతయందు, రాగ = అనురాగము చేత, నని స్వభావార్థము. పారిజాతాగమాళి = కల్పవృక్షము; అతివేలమధుపాళికాప్తిచేన్.—అతివేల= అధికమగు, మధుపాళికా= మద్యపాయులబృంగముయొక్క, ఆప్తిచేన్=ప్రాప్తిచేత; ఎవ్వేళన్=ఎల్లకాలము; అలరారున్=ప్రకాశించును. మధుపాళికా=భృంగపంక్తియొక్క, ప్రాప్తిచేత నని స్వభావార్థము. పాలకడలి = క్షీరసముద్రము ; బాడబవర్ధనప్రౌఢిప్రచారంబు.—బాడబ=బ్రాహ్మణులయొక్క,వర్ధన=ఛేదనమందు, ప్రౌఢి=నేర్పుయొక్క,ప్రచారంబు=ప్రచారము;భాసిల్లన్=ప్రకాశింపఁగ; కడున్=మిక్కిలి; పొంగున్=ఉబుకును. బాడబ=బడబాగ్నియొక్క, వర్ధన = వృద్ధినిబొందించుటయందు, ప్రౌఢి ప్రచార మనిస్వభావార్థము. వాసతేయాశ్వరుండు=చంద్రుఁడు ; “వసతిర్వాసతేయీచశ్యామా రాత్రిశ్చకథ్యతే” అనిహలాయుధుఁడు ; సద్వధహారియై=సత్పురుషులద్రవ్యమునుహరించినవాఁడై; సంలబ్ధదోషానుసృతిన్.—సంలబ్ధ=పొందఁబడిన, దోష=పాపములయొక్క, అనుసృతిన్=అనుసరణముచేత; పొల్చున్=ఒప్పును. సద్వసుహారియై=రిక్కలకాంతిహరించినవాఁడై; సంలబ్ధదోషానుసృతిన్ = పొందఁబడినరాత్రియొక్క, అనుసరణము చేత నని స్వభావార్థము. కైరవచయంబు.—కైరవ = తెల్లగలువలయొక్క, చయంబు = గుంపు; తత్సమాసక్తిన్.—తత్=అదోషాకరునియొక్క, సమాసక్తిన్=సంబంధము చేతను ; పంకసంతతిన్=పాపబృందము చేత; కరంబును=మిక్కిలి; విరళశ్రీన్=విరళకాంతిని; వహించున్ = పొందును. తత్సమాసక్తిన్=చంద్రసంబంధమును; పంకసంతతిన్ = బురదగుంపును; విరళశ్రీన్ = రాత్రియందుకాంతి నని స్వభావార్థము ; అనఘమై = పాపరహితమై ; మించునీమేటియశముతోడన్.—మించు = ప్రకాశించు, ఈ మేటియశముతోడన్=ఈఘనునియొక్కకీర్తితోడను; సాటి=సమానము; ఎట్లు=ఏరీతి ; అగున్=అగును? కాదనుట.

అనఁగ నోచంద్రికా గురుపద్మినియం దనురాగము గలిగి రాగవర్తనచే నుండుహంసవితతి, మధుపాయులబృందముచే నావరింపఁబడి మించువేల్పులమ్రాఁకు, బాడబవర్ధనప్రచారంబున మించుపాలకడలి, సద్వసువులను హరించి దోషాకరుఁడగు చంద్రుఁడు, దోషాకరసంబంధముచేతను పంకసంబంధముచేతను స్వల్పకాంతిని బొందియున్న కైరవచయము, నిర్దుష్టమై పాపరహితమై యెల్లపుడును మించునీఘనునికీర్తికి సాటి కా వని భావము.

చ. వలదొర మీఱురూపు దయి•వాఱఁగ రాజిలు నిర్జరాధిపో
పలనిభనీలవర్ణ మహీ•పాలకశేఖరు వీనిఁ బెండ్లియై
నెలఁతుక యీమహోత్సు నెద • నిచ్చలుఁ బాయక యుండు మంజనా
భలతటభాసమానసవ•చంపకవల్లి తెఱంగు పూనుచున్. 92

టీ. వలదొరమీఱురూపు.—వలదొరన్ = మన్మథుని, మీఱు = అతిశయించిన, రూపున్ — చక్కఁదనము ; దయివాఱఁగన్ = అతిశయింపఁగా ; రాజిలునిర్జరాధిపోపలనిభనీలవర్ణున్.— రాజిలు = ప్రకాశించుచున్న, నిర్జరాధిపోపల = ఇంద్రనీలమణులకు, నిభ = సమానమగు, నీల వర్ణున్ = నల్లనికాంతిగల; మహీపాలశేఖరున్ = రాజశ్రేష్ఠుఁడగు; వీనిన్ = ఈరాజును; పెండ్లి యై = వివాహము చేసికొని; నెలఁతుక = చంద్రికా! అంజనాచలతటభాసమాననవచంపకవల్లి తెఱంగు.—అంజనాచల = నీలాద్రియొక్క, తట = ప్రదేశమందు, భాసమాన = ప్రకాశించు, నవ = నూతనమగు, చంపకవల్లి = సంపెఁగతీవయొక్క, తెఱఁగు = రీతిని; పూనుచున్ = పొందుచు; ఈమహోత్తునెదన్ = రాజువక్షస్థలమందు; నిచ్చలున్ = ఎల్లకాలముఁ; పాయక = వీడక; ఉండుము.

ఇంద్రనీలవర్ణముగలిగి మన్మథునిఁ దిరస్కరించు రూపు గలయీరాజును బెండ్లిచేసికొని వీని యురమునందు, అంజనాచలముమీఁదనున్న చంపకవల్లి తెఱంగునఁ బ్రకాశింపు మని భావము ఉపమాలంకారము.

తే. అనఁగ నమ్మాట వినియును ♦ నలర కున్కి
తెలిసి మఱియొక్క భూపాల♦తిలకుఁ జేరఁ
దార్చి శర్వాణి రాజనం♦దనను బలికెఁ
దద్గుణశ్రేణి యమృతజి♦ద్భవ్యవాణి. 93

టీ. శర్వాణి = పార్వతీదేవి; అనఁగన్ = ఈప్రకారముపలుకఁగ; అమ్మాటన్ = ఆవచనము ను; వినియును = ఆకర్ణించియు; అలరకున్కి = సంతసింపకుండుటను; తెలిసి = ఎఱిఁగి; మఱియొక్క భూపాలతిలకున్ = మఱియొకరాజశ్రేష్ఠుని; చేరన్ = పొందునటులు; తార్చి = చేసి; రాజనందన న్ = చంద్రికనుగుఱించి; అమృతజిద్భవ్యవాణిన్ = సుధను తిరస్కరించువచనముచేత; తద్గుణ శ్రేణి = ఆరాజుగుణములపంక్తిని; పలికెన్ = వచించెను.

మ. అనవద్యద్యుతి నంగభూమిపతి నో♦యబ్జాక్షి వీక్షింపు మె
య్యన నేతన్నృపధాటికానవకథా♦వ్యాఖ్యాతృభేరీకుల
స్వనసంద్రావితనాథవద్రిపుపురీ♦జాతంబు కాంతారత
స్మనఁ జిత్రం బగుఁ గాదె గోత్ర కవనీ♦నామంబు చేకూఱుటల్. 94

టీ. ఓయబ్జాక్షి = ఓచంద్రికా! అనవద్యద్యుతిన్.—అనవద్య = నిర్దుష్టమగు, ద్యుతిన్ = కాంతిగల; అంగభూమిపతిన్ = అంగదేశాధిపతిని; ఒయ్యనన్ = తిన్నగ; వీక్షింపుము = చూడు ము. ఏతన్నృపధాటికా నవకథావ్యాఖ్యాతృభేరీకుల స్వనసంద్రావితనాథ వద్రిపుపురీజాతం బు.— ఏతన్నృప = ఈఅంగపతియొక్క, ధాటికా = జైత్రయాత్రయొక్క, నవ = నూతనమగు, కథా = ప్రబంధమును, వ్యాఖ్యాతృ = వ్యాఖ్యానముచేయుచున్న, భేరీకుల = రణభేరీబృందము యొక్క, స్వన = ధ్వనిచేత, సంద్రావిత = పాఱఁగొట్టఁబడిన, నాథవత్ = ప్రభువులుగల, రిపు

పురీజాతంబు=శత్రుపురబృందము; కాంతారతన్=అరణ్యత్వముచేత; మనన్ = వృద్ధిఁబొంద౯గా; గోత్రకున్=పురభూమికి; అవనీనామంబు=అడవికానిదను పేరు, అవనియనిభూమికి నామాంతరము; చేకూఱుటల్=సమకూఱుటలు; చిత్రంబగుఁగాదె=చిత్రంబగునుగదా!

అనఁగ నంగభూపాలునిరణభేరీనినాదమునువిని శత్రురాజులు పాఱిపోవుటవలనఁదత్పురబృందము వనమయి పోయినను భూమికి యవని యని పేరుండుట చిత్రం బని తాత్పర్యము, అనఁగ శత్రుపురములు అరణ్యప్రాయములయిన వని ముఖ్యాశయము.

సీ. అభ్రంబు రాయుపు♦ణ్యజనాలయంబులఁ
గమలించి తగుకీలి♦ నమరుశూలి
సరసచక్రము లాత్మ♦సాధ్వసం బంద వి
షచ్ఛ్రేణుల నొసంగు♦జలధరంబు
కడు సదాళుల మోద♦గరిమఁ బెంప నెసంగు
నతనుశస్త్రము లూను♦నమరతరువు
ఘనబుధద్యుమ్నంబు ♦ గొని యజ్ఞహితభావ
మలర ధాత్రి రహించు♦బలిసురారి

తే. లలి గురుక్షేత్రము హరించి ♦ చెలఁగురాజు
నితరరామలరసగతి ♦ నెనయునుదధి
యింతి మదిలో ననాతతా♦యిత వహించు
నిర్విభుని సాటి గా నీగి ♦ నెన్నఁ దరమె. 95

టీ. అభ్రంబురాయుపుణ్యజనాలయంబులన్.—అభ్రంబురాయు=మిన్నొరయు, పుణ్యజన=పుణ్యాత్ములయొక్క. ఆలయంబులన్=గృహములను; కమలించి = కాల్చి; తగుకీలిక్=ఒప్పుచున్నవహ్నిచేత; అమరుశూలి=ఒప్పుచున్నశంకరుఁడు; పుణ్యజన = రాక్షసులయొక్క. త్రిపురాసురులయొక్కయనుట; ఆలయంబులన్ = త్రిపురములను; కాల్చియగ్నినేత్రముగలవాఁడనిస్వభావార్థము; సరసచక్రములు = రసికబృందములు; ఆత్మన్=మనమునందు; సాధ్వసంబు=భయమును; అందన్=పొందునటులు; విషచ్ఛ్రేణులన్ = గరళపంక్తులను ; ఒసంగుజలధరంబు=ఇచ్చుచున్నమేఘము; శ్లేష్మము లగుహంసలు మనమున భయ మొందునటులు జలధారల నొసఁగు నని స్వభావార్థము ; కడున్ = మిక్కిలి; సదాళులమోదగరిమన్.—సత్=సత్పురుషులయొక్క, ఆళుల=పంక్తులయొక్క, మోద=సంతసముయొక్క, గరిమన్=అతిశయమును; పెంపన్ =ఖండించుటకు; నెసంగునతనుశస్త్రములు.—ఎసంగు=విజృంభించుచున్న, అతనుశస్త్రములు=అధికములగుశస్త్రములను; ఊనునమరతరువు=పొందినట్టివేల్పులమ్రాఁకు; కడున్=మిక్కిలి, సదా=ఎల్లప్పుడు, అళుల=తుమ్మెదలయొక్క, సంతోషాతిశయమును, పెంపన్=వృద్ధిఁబొందించుట

ను, ఎసంగు=ఒప్పుచున్న, అతనుశస్త్రములు=వింటలను, బొందునని స్వభావార్థము; ఘనబుధద్యుమ్నంబు.—ఘన=అధికమగు; బుధ=విద్వాంసులయొక్క, ద్యుమ్నంబు=అర్థమును ; కొని=గ్రహించి; అజ్ఞహితభావము —అజ్ఞ=మూఢులకు, హిత=అనుకూలమగు, భావము=అభిప్రాయము; అలరన్=ఒప్పునట్లు ; ధాత్రిన్=భూమియందు; రహించు. బలిసురారి=ఒప్పుచున్న బలిచక్రవర్తి; దేవతలయొక్క ద్రవ్యము గొని జన్నమునకు హితమగు భావమలర నొప్పుచున్న వాఁడని స్వభావార్థము; లలిన్=ఆసక్తిచేత; గురుక్షేత్రము=ఆచార్యునిభూమిని, హరించి=అపహరించి; వెలుఁగురాజు=ప్రకాశించుచున్న చంద్రుఁడు; బృహస్పతిభార్యనుహరించియొప్పినవాఁడని స్వభావార్థము; ఇతరరామలన్=పరస్త్రీలను; రసగతిన్ = అనురాగరీతిచేత; ఎనయుంబుదధి=పొందుచున్న సముద్రుఁడు; ఇత=పొందఁబడిన, రర=ధ్వనిగల, అమల=స్వచ్ఛమగు, రస=ఉదకముయొక్క, గతిన్=ప్రాప్తిని; పొందినట్టివాఁడని స్వభావార్థము ; ఇంతి=చంద్రికా! మదిన్=మనమునందు; అనాతతాయితన్ = ఆతతాయు లనఁగా "అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణి ర్ధనాపహః" ఇత్యాదివచనమందుఁ జెప్పఁబడినవారు; వీరు కానివాఁడ నాతతాయి వీని ధర్మ మనాతతాయిత ఈధర్మమును ; వహించునివ్విభునిసాటిగాన్=వహించుచున్న యీ రాజునకుసమానముగా; ఈగిన్=వితరణమందు; ఎన్నఁదరమె=లెక్కఁబెట్టఁదరమా! కాదనుట.

అనఁగా త్యాగశీలుండై యనాతతాయియగునీరాజుతో నీగియందునజ్జన గృహములను గాల్చినశివుండును, నరసబృందమునకువిషంబిడిన జలధరుండును, అతనుశస్త్రములైన పారిజాతతరువును, పరద్రవ్యమునుహరించినబలియు, గురుక్షేత్రమునపహరించినచంద్రుఁడును, పరస్త్రీలఁబొందెననిన సముద్రుండును ఆతతాయులగుటచే సాటి గా రని భావము.

మ. పరసత్యప్రియభావభావుకలసద్వర్ణాంచితశ్రీద్విజో
త్కరసంరక్షణదక్షిణాశయుని లోకస్వామి నిమ్మేటి నం
బురుహాత్మన్యముఖీమచర్చిక జగంబుల్ మే లనం బెండ్లియై
సరసీజాసనుఁ బల్కుచాన యన నిచ్చల్ మించు ముత్కంఠతోన్. 96

టీ. పరసత్యప్రియభావ భావుకలసద్వర్ణాంచిత శ్రీద్విజోత్కర సంరక్షణ దక్షిణాశయునిన్.—పర=శ్రేష్ఠమగు, సత్య=నిజమందు, ప్రియ=ప్రీతిగల, భావ=భావము చేత, భావుక=భవ్యమగు, లసత్=ప్రకాశించుచున్న, వర్ణ=యశము చేత, అంచిత=ఒప్పుచున్న, శ్రీ = సంపదయును, ద్విజ=బ్రాహ్మణులయొక్క, ఉత్కర=సమూహముయొక్క, సంరక్షణ=పాలించుటయందు, దక్షిణాశయునిన్=ఉదారమగు నాశయమును గలవానిని; శ్రేష్ఠమగు సత్యలోకమందు, ప్రియభావభావుకములై, సత్‌వర్ణ= శుక్లవర్ణము చేత, అంచిత = ఒప్పుచున్న, శ్రీ. =కాంతితోఁగూడిన, ద్విజోత్కర=హంసబృందముయొక్క, సంరక్షణమందు, దక్షిణాశయుఁ డనినలువపర మైనయర్థముదోఁచుచున్నది; లోకస్వామిన్=నరపతిని, నలువను; "హిరణ్యగరర్భోలోకేశః" అని యమరుఁడు, ఇమ్మేటిన్=ఈఘనుని; అంబురుహాత్మన్యముఖీమచర్చిక=(అమ్బురుహాత్మానం మన్యత ఇతి అమ్బురుహాం మన్యంముఖంయస్యాసా. అంబురు

పద్మన్యముఖీ) తన్ను కమలమువలెఁదలఁచు ముఖముగలస్త్రీలలో ప్రశస్తవగుచంద్రికా! జగంబులు=లోకములు; మేలనన్=మేలనఁగా; సరసీజాసనుఁ బల్కుచానయనన్=నలువను సరస్వతియనునటులు; పెండ్లియై=వివాహమాడి; నిచ్చల్=ఎల్లప్పుడు; ఉత్కంఠతోన్=సంతోషముతో; మించుము=అతిశయించుము.

నలువను సరస్వతి పెండ్లియై నిచ్చలు మించుపగిది నీవీలోకస్వామిని వివాహమై యుత్కంఠతో నుండు మని భావము.

న. అని యెఱింగింప ననంగీకారభంగి నయ్యంగనయంతరంగం బెసంగిన నాచెంత నొక్క నరపుంగవుం జూపి సారంగధారిసారంగయాన తరంగ వళీమణిం గుఱించి యిట్లనియె. 97

టీ. అని=ఈప్రకారముగ; ఎఱింగింపన్ = తెలియఁజేయఁగ ; అనంగీకారభంగిన్= ఒప్పికొనమియొక్క రీతిచేత; ఆయ్యంగనయంతరంగంబు= ఆచంద్రికచిత్తము; ఎసంగినన్= ఒప్పఁగా; ఆచెంతన్=ఆసమీపమందు; ఒక్కనరపుంగవున్=ఒకనరపతిని; చూపి=ప్రదర్శించి; సారంగధారి సారంగయాన.– సారంగధారి=శంకరునియొక్క, సారంగయాన=పత్నియగుపార్వతీదేవి ; తరంగవళీమణింగుఱించి = తరఁగలవంటి వళులుగల చంద్రికనుగూర్చి; ఇట్లు=వక్ష్యమాణప్రకారముగ; అనియెన్=పలికెను.

చ. ఇనకులమౌళి కేరళమహీపతి యీతఁడు గాంచు ప్రీతితో
మనఁగ నపారిజాతమహిమంబున రాజిలు నివ్విభుఁ డుర్వరన్
మను ననపారిజాతమహిమంబునఁ గుందరదాలలామ పా
వనసుమనోహృదిష్టఫల వారవితీర్ణికలాచమత్కృతిన్. 98

టీ. కుందరదాలలామ=చంద్రికా ! ఈతఁడు=ఈరాజు; ఇనకులమౌళి=రాజమౌళియగు; కేరళమహీపతి=కేరళదేశమునకు నధిపతి. ప్రీతితోన్=ప్రేమతో ; కాంచు=చూడుము. అపారిజాతమహిమంబునన్.–అపారిజాత=పారిజాతాభావముయొక్క, మహిమంబునన్=సామర్థ్యముచేత;అపగతమైన శత్రుసంఘముయొక్క మహిమచేతనని స్వభావార్థము; మనఁగన్= వర్తించుటచే; రాజిలునివ్విభుఁడు=ప్రకాశించునట్టియీరాజు; పావనసుమనోహృదిష్ట ఫలవారవితీర్ణికలాచమత్కృతిన్.–పావన=పరిశుద్ధులైన, సుమనః=విద్వాంసులయొక్క, హృత్= మనమునకు, ఇష్ట=ప్రియములైన, ఫల=లాభములయొక్క, వార=సమూహముయొక్క, వితీర్ణి=ఇచ్చుటయనెడు, కలా=విద్యయొక్క, చమత్కృతిన్=చమత్కారముచేత ; దేవతలయొక్క మనమునకు నిష్టమగు ఫలములనొసంగుటయను విద్యయొక్క చమత్కృతిచేతనని వేల్పుప్రమాఁకుపర మగునర్థముతోఁజెడి; ఉర్వరన్ = భూమియందు; అనపారిజాత మహిమంబునన్; అనపారిజాత = అపారిజాతభావాభావముయొక్క, పారిజాతముయొక్కయనుట, మహిమంబునన్=మహిమచేత; మనున్=వర్తించును.

ఈరాజు అపారిజాతుఁ డయినను దానశౌండతచే ననపారిజాతమహిమంబునఁ బ్రకాశించుచున్నాఁ డనిభావము.

మ. అనిశం బీఘనుకీర్తి ధామయుగళం • బన్యోన్యవైరాప్తినో
యన నం దొక్కటి ప్రోవ వేఱొకటి వ•జ్రారూఢిఁ గూల్చుక్ విరో
చను వేఱొక్కటి యేఁచ నందొకటి మిం•చం జేయు హంసోన్నతిక్
మును మున్నొక్కటి నింప వేఱొకటి మ•న్పుం గొమ్మ చిత్రంబుగక్. 99

టీ. కొమ్మ=చంద్రికా! అనిశంబు=ఎల్లప్పుడు; ఈఘనుకీర్తిధామయుగళంబు.— ఈఘనునియొక్క, కీర్తిప్రతాపములజంట!; అన్యోన్యవైరాప్తినోయనక్=పరస్పరవైరము చేతనో యనునటులు; అందుక్=కీర్తిప్రతాపములలో; ఒక్కటి=ఒకకీర్తిగాని ప్రతాపముగాని; ప్రోవక్=పాలింపఁగ; వేఱొకటి; వజ్రారూఢిక్=వజ్రాయుధముయొక్కరూఢిచేత; కూల్చుక్=చంపును. విరోచనుక్=సూర్యుని; వేఱొక్కటి = వానిలోనొకటగుప్రతాపము; ఏఁచక్=బాధింపఁగా; అందొకటి = దానిలోనొకటగుకీర్తి; విరోచనునిమించంజేయును=ఇచటవిరోచనుఁడనఁగ చంద్రుఁడని యర్థమును గ్రహించి విరోధపరిహారము నెఱుంగ వలయు; "చంద్రాగ్న్యర్కావిరోచనాః" అనివిశ్వము; హంసోన్నతిక్.— హంస = సూర్యునియొక్క,ఉన్నతిక్ = అతిశయమును; మునుమున్న = మొట్టమొదట; ఒక్కటి = దానిలోనొకటియగు ప్రతాపము; నింపక్=నొవ్వఁజేయఁగా; వేఱొకటి = మఱియొకటియగు కీర్తి; హంసోన్నతిక్=సూర్యోన్నతిని;చిత్రంబుగక్=ఆశ్చర్యముగా;మన్పుక్=పోషించును. ఇచట హంసశబ్దమునకు, రాజహంస యర్థము గాన రాజహంసల యున్నతిని, కీర్తి పోషించు నని పరిహారము.

అనఁగ నీరాజుకీర్తి చంద్రుని హంసలను పోషించు ననియు ప్రతాపము సూర్యునిఁ దిరస్కరించు ననియు భావము.

చ. సలలితచక్రసంభరణ•సక్తమహాశయు దేవవర్ణితో
జ్జ్వలదయుఁ బూరుషోత్తము ని•శాచరసాధ్వసకృత్సమాఖ్యు ని
య్యలఘునిఁ జెట్టవట్టి హరి • నంబుధిరాజతనూజ వ్రాలె ని
చ్చ లురముఁ బాయ కింపున నె•సంగుము వాసవనీలకుంతలా. 100

టీ. వాసవనీలకుంతలా=ఇంద్రనీలమణులవంటి కురులుగలచంద్రికా! సలలిత చక్రసంభరణ సక్తమహాశయుక్.—సలలిత=మనోజ్ఞమగు, చక్ర=దండుయొక్క, సంభరణ=భరించుటయందు, సక్త=ఆసక్తిగల, మహాశయుక్=అధికమగు నభిప్రాయముగల; సలలితమగు; చక్ర=సుదర్శనముయొక్క, సంభరణమందు, సక్తమగు, మహాత్=గొప్పయగు, శయుక్=హస్తముగలవాఁ డని విష్ణుపరమైనయర్థము; దేవవర్ణితోజ్జ్వలదయుక్=దేవతలచేఁ గొనియాడఁబడిన కృపగల; పూరుషోత్తముక్=పురుషశ్రేష్ఠుని, విష్ణుమూర్తిని; నిశాచరసాధ్వసకృత్స

మాఖ్యునిన్.—నిశాచర=రక్కసులకు, సాధ్వసకృత్=భయము గలుగఁజేయు, సమాఖ్యునిన్=ప్రసిద్ధిగల, నామముగల; ఇయ్యలఘునిన్=ఈఘనుని; చెట్టవట్టి=వివాహమాడి; హరిన్=విష్ణువు; అంబుధిరాజతనూజవోలెన్=కలిమి నెలంతవలె; నిచ్చలు=ఎల్లపుడు, ఉరముఁబాయక=ఎదవదలక; ఇంపునన్=సుఖముచేత; ఎసంగుము=ఒప్పుము.

అనఁగ నోచంద్రికా! కరివేల్పు నురముఁ బాయ కెప్పుడు నివసించియుండు లచ్చినెలంతవోలె నీ వీరాజును బెండ్లియై వీనియురముఁ బాయక సుఖముగ నుండుమని భావము.

ఉ. నా విని కొమ్మ యక్షివల♦నంబునఁ దన్నృపచంద్రనిస్పృహా
శ్రీ వెలయింప ముంగలికిఁ ♦ జేర ఘటించె వయస్యయోర్తు దో
డ్తో వరయానధుర్యతతి♦తోఁ వివరించుచు నప్పు డొక్కపృ
థ్వీవిభుఁ జూపి గౌరి సుద♦తిం బలుకుం బ్రియవాక్యనైపుణిన్. 101

టీ. నాన్=అనఁగా; విని=ఆకర్ణించి; కొమ్మ=చంద్రిక; అక్షివలనంబునన్=నేత్రచలనముచేత; తన్నృపచంద్రనిస్పృహాశ్రీన్.—తన్నృప చంద్ర=ఆరాజచంద్రునియందు, 'నిస్పృహాశ్రీన్=నైరాశ్యరచనను; వెలయింపన్=ప్రకాశింపఁజేయఁగా; ముంగలికిన్=పురోభాగమునకు; చేరన్=పొందునటులు; వయస్యయోర్తు=ఒకచెలికత్తె; ఘటించెన్=చేసెను. తోడ్తోన్=వెంటనే; వరయానధుర్యతతితోన్.—వర=శ్రేష్ఠములగు, యానధుర్య=పల్లకినిమోయువారియొక్క, తతితోన్=సమూహముతో; వివరించుచున్=విశదపఱచుచు; అప్పుడు=ఆసమయమందు; ఒక్క పృథ్వీవిభున్=ఒకరాజును; చూపి=ప్రదర్శించి; గౌరి=పార్వతీదేవి; సుదతిన్=చంద్రికతో; ప్రియవాక్యనైపుణిన్.—ప్రియవాక్య=ప్రియములగుపలుకులయొక్క, నైపుణిన్=జాణతనముచేత; పలుకున్=వచించెను.

క. నాళీకనయన పార్థివ, మాళీమణిఁ గాంచు దహాళ♦మహీవిభు రతిరా
ట్కేళీనూత్నకళాసా,శీలీమన్మనుజలోక♦శేఖరు వీనిన్. 102

టీ. నాళీకనయన=చంద్రికా! పార్థివమాళీమణిన్=రాజమాళిరత్నమును; దహాళమహీవిభున్=దహాళభూపాలుఁడును; రతిరాట్కేళీనూత్న కళాసాశీలీమన్మనుజలోకశేఖరున్.—రతిరాట్కేళీ=మన్మథక్రీడలయొక్క, నూత్నకళా=నూతనవిద్యయును, సాశీలీమత్=సచ్చరిత్రవత్తయుఁగల, మనుజలోకశేఖరున్=మనుష్యలోకమునందు శ్రేష్ఠుఁడగు; వీనిన్=ఈరాజును; కాంచు=చూడుము.

చ. నెలఁత గభీరపుష్కరధు♦నీపరిగాహనముల్ సురాగమం
డలఫల భక్షణంబులు క♦నత్సుమనోమహిలాని కేతన
స్థలపరివాసముల్ సమతఁ ♦ దాల్చు భయాభయయుక్తిఁ బొల్చుని
య్యలఘునిశత్రుకోటి కచ♦లావళిలేఖపురుల్ విచిత్రతన్. 103

టీ.. నెలఁత=చంద్రికా! భయాభయయుక్తిన్.—భయ=భయముయొక్క, అభయ=భయాభావముయొక్క, యుక్తిన్=సంబంధముచేత; పాల్చునియ్యలఘుని శత్రుకోటికిన్.—పాల్చు=ఒప్పుచున్న, ఇయ్యలఘునిశత్రుకోటికిన్=ఈరాజు శత్రుబృందమునకు; అచలావళి లేఖపురుల్.—అచలావళి=పర్వతబృందమును, లేఖపురుల్=అమరావతియును; విచిత్రతన్=చమత్కృతిచేత; గభీరపుష్కరధునీపరిగాహనముల్.—గభీర=గంభీరమగు, పుష్కరధునీ=మిన్నేటియందు, పరిగాహనముల్=స్నానములను; పుష్కర=కమలములుగల, ధునీ=నదులయందు, పరిగాహనములనని రెండవయర్థము; సురాగమండలఫలభక్షణముల్.—సురాగ=వేల్పుమ్రాఁకులయొక్క, మండల=గుంపుయొక్క, ఫల=పండ్లయొక్క, భక్షణములు=తినుటలను; సురాగ=ఈఁతచెట్లయొక్క, మండల=గుంపుయొక్క, ఫలభక్షణములనని రెండవయర్థము; కనత్సుమనోమహిళానికేతనస్థలపరివారముల్.—కనత్=ప్రకాశించుచున్న, సుమనోమహిళా=దేవాంగనలయొక్క, నికేతన=గృహములయొక్క, స్థల=ప్రదేశములందు, పరివాసముల్=నివాసములను; సుమనః=పుష్పములుగల, మహిళా=ప్రేంకణపువృక్షములయొక్కయని యర్థాంతరము; సమతన్=సమత్వముచేత; తాల్చున్. ధరించును.

అనఁగ నీరాజునకు భయపడినశత్రువులు వనవాసముఁ జేసి రనియు భయపడనిశత్రువులు యుద్ధమందు నిహతులై స్వర్గనివాసముఁ జేసి రనియు భావము.

సీ. దరిసించుచో నెల్లఁ ♦ దాఁటించుఁ దాప మీ
యవనీంద్రుచూపు చం♦ద్రాతపంబొ
ఎనసినచో నెల్ల ♦ మనుపు నామోద మీ
రారాజుచిత్తంబు ♦ సారసంబొ
నెరసినచో నెల్ల ♦ దొరపు దేవత్వ మీ
యరిభేదిమాట న♦వ్యామృతంబొ
యుంచినచో నెల్ల ♦ నించు నిష్టంబు లీ
ధీరునిపాణి మం♦దారలతయొ

తే. యనుచు సత్కవిలోకంబు ♦ లభినుతింప
నలరు నేపాళోర్వరా♦ధ్యక్షురత్న
మతివ నీభాగధేయంబు♦కతన నిటకు
వచ్చె వరియింపు మితని భా♦వము చిగుర్ప. 104

టీ. దరిసించుచోన్=చూచినచోట; ఎల్లన్=అంతట; తాపము=సంతాపమును; తాటించున్=పోఁగొట్టును; ఈయవనీంద్రుచూపు=ఈరాజుచూపు; చంద్రాతపంబో=వెన్నెలయో. ఎనసినచోన్=పొందినచోట; ఎల్లన్=అంతట; ఆమోదము=సంతసమును, పరిమళమని తోఁచుచు

న్నదియు; మను పుట్ = వృద్ధిఁబొందించును. ఈరారాజు చిత్తంబు = ఈరాజరాజుమనము; సారసంభోతమ్మియో. సెరసినచోట్ = వ్యాపించినచోట, ఎల్లన్ = అంతట; దేవత్వము = రాజత్వమును, వేల్పుతనమును; దొరపుట్ = కలుగఁజేయును. ఈయరిభేదిమాట = ఈరాజుమాట; నవ్యామృతంబో = నూతనమగు సుధయో. ఉంచినచోట్ = ఉనిచినచోట; ఎల్లన్ = అంతట; ఇష్టంబులు = కోరికలను; నించుట్ = పూరించును. ఈధీరుపాణి = ఈరాజుహస్తము; మందారలతయో = కల్పలతయో. అనుచుట్ = ఇట్లువచించుచు; సత్కవిలోకంబులు = విద్వద్బృందములు; అభినుతింపన్ = పొగడఁగ; అలరుట్ = ఒప్పును. ఈదహళోర్వరాధ్యక్షరత్నము = ఈదహళభూపతి; అతివ = చంద్రికా! నీభాగధేయంబుకతనన్ = నీభాగ్యంబుకతన; ఇటకుట్ = ఇచ్చటికి; వచ్చెన్ = వచ్చెను. ఇతనిన్ = ఈరాజును; భావము = చిత్తము; చిగుర్పన్ = పల్లవింపఁగా; వరియింపుము = కోరుము.

ఈరాజు చూచె నాయెనా సమస్తతాపములను బోఁగొట్టునుగాన నితనిచూపు వెన్నెలయేమో, ఇతనిచిత్తము కలిసెనేని ఆమోదము నిచ్చునుగానఁ గమలమో యేమో, ఇతనిమాట సెరసినచో దేవత్వ మిచ్చునుగాన అమృతమేమో, ఇతనిచే యుంచినచో నెల్లకోరికల నిచ్చుఁగాన కల్పలతయో యేమొ, యీరీతి సమస్తవిద్వజ్జనులు నితని నుతింతురు గాన నీరాజును వరియింపు మని భావము. సందేహాలంకారము.

వ. అనిన నయ్యొప్పులకుప్ప యప్పుడియెడం జిత్తం బొప్పింపకున్కి దెలిసి యాచాయ నొక్కనృపతిం జూపి నొసలిచూపువేల్పు జవరా లాచివురాకుఁబోఁడికిట్లనియె. 105

టీ. అనినన్ = ఈప్రకారముపలుకఁగా; అయ్యొప్పులకుప్ప = అందములకు కుప్పయగు నా చంద్రిక; అప్పుడియెడన్ = ఆరాజునెడ; చిత్తంబొప్పింపకున్కి = మనసియ్యకుండుటను; తెలిసి = తెలిసికొని; ఆచాయన్ = ఆప్రదేశమందు; ఒక్కనృపతింజూపి = మఱియొక రాజును జూపి; నొసలిచూపువేల్పు జవరాలు = ఫాలలోచనునకు భార్యయగు పార్వతీదేవి; ఆచివురాకుఁ బోఁడికిన్ = ఆ చంద్రికకు; ఇట్లనియెన్ = ఈప్రకారము పలికెను.

చ. కనుఁగొను బోటి భోటనర • కాంతశిఖామణి ధామధిక్కృతా
తనుఘృణి వీఁడు జన్యవసు • ధాస్థలి శింజిని కార్తిపొందు దా
ర్చిన నరి తద్భృతిం గనుఁ బ • రిస్ఫుటకాండనికాయముల్ నిగి
డ్చిన నవి తద్వ్యథాటి నిగి • డించుఁ గనుంగవ నద్భుతంబుగన్. 106

టీ. బోటి = చంద్రికా! భోటనరకాంత శిఖామణిన్ = భోటదేశరాజశిఖామణిని; ధామధిక్కృతాతనుఘృణిన్. — ధామ = తేజస్సుచేత, ధిక్కృత = తిరస్కరింపఁబడిన, అతనుఘృణిన్ = సహస్రకిరణుని; కనుఁగొను = చూడుము. వీఁడు = ఈరాజు; జన్యవసుధాస్థలిన్ = యుద్ధభూమియందు; శింజినికిన్ = అల్లెత్రాటికి; ఆర్తి పొందుదార్చినన్ = ధనుష్కోటిసంబంధము

నుజేయఁగా; అరి=శత్రువు; తద్ధృతిన్=ఆయార్తిభరణమును, పీడాభరణమునననుట;కనున్=పొందును. పరిస్ఫుటకాండనికాయముల్.—పరిస్ఫుట = వ్యక్తమగు; కాండ = బాణములయొక్క, నికాయముల్=సమూహములను; నిగిడ్చినన్=ఎక్కుపెట్టఁగా; త్వద్ధాటి = ఆశత్రుకాంత; కనుంగవన్ = కనుదోయియందు; అద్భుతంబుగన్ = ఆశ్చర్యముగ; అవి=ఆకాండనికాయములను, నీళ్లసమూహములననుట,బాష్పములనని భావము; నిగిడించున్=నించును.

అనఁగ నీరాజు యుద్ధభూమియందు వింటికొప్పున నల్లెత్రాటిని జేర్చుటచే శత్రుబృందము దుఃఖమును బొందు ననియు అల్లెత్రాటియందు బాణంబులు నిగిడ్చిన వారికాంతలు కనుఁగవనీరుంతు రనియుభావము. ఈపద్యమందు శత్రుప్రాణవియోగకారణం బగుశరసంధానమును తత్కార్యరూప మగుశత్రుకాంతానయన బాష్పముల నొక్కమ్మడి హేతుకార్యముల వర్ణించుటచేనక్రమాతిశయోక్తి యను నలంకారము."అక్రమాతిశయోక్తి స్స్యాత్సహత్వే హేతుకార్యయోః" అని దానిలక్షణము.

చ. ఉరగమువక్రవృత్తి నచ◆లోత్తముసత్పథరోధకోన్నతి
స్ఫురణఁ గిరీంద్రుపంకరత◆బుద్ధి ధులీశుజడప్రచారమున్
కరిపతిదుర్మదక్రమము ◆ గన్గొని రోసి ధరిత్రి తద్గుణే
తరగుణశాలి నివ్విభునిఁ ◆ దన్వి వరించి చెలంగు నిచ్చలున్. 107

టీ. ఉరగమువక్రవృత్తిన్=శేషునికుటిలస్వభావమును; శేషుఁడు సర్పము గావఁ గుటిలగతి సహజ మని భావము; అచలోత్తముసత్పథరోధకోన్నతిస్ఫురణన్.—అచలోత్తము=కులాచలముయొక్క, సత్పథరోధక=సత్పురుషులమార్గమునకు నిరోధకమగు, ఉన్నతిస్ఫురణన్=ఔన్నత్యస్ఫురణమును; కులాచలమునకు, సత్పథ=ఆకాశమునకు, రోధకమగు నున్నతిస్ఫురణము సహజమని భావము. కిరీంద్రుపంకరతబుద్ధిన్.—కిరీంద్రు = ఆదివరాహముయొక్క, పంక=పాపమందు, రత=ఆసక్తిగల, బుద్ధిన్=మతిని ; పంక=బురదయందురతమగు బుద్ధి కిరీంద్రునకు సహజ మని భావము; ధులీశుజడప్రచారమున్=ఆదికూర్మముయొక్కమూర్ఖులతోఁగూడినప్రచారమును, ఇచట డలలకు భేదంబులేమి ఆదికూర్మమునకు జలమందు ప్రచారము సహజ మని స్వభావార్థము;కరిపతిదుర్మదక్రమమున్.—కరిపతి=గజపతియొక్క,దుర్మదక్రమమున్=దుర్గర్వక్రమమును, గజపతికి దుర్మదక్రమమనఁగ, మదోదకము కూడియుండుట సహజ మని భావము; కన్గొని=చూచి; రోసి=విసిగి; ధరిత్రి=భూమి; తద్గుణేతరగుణశాలిన్:—తత్=ఆయురగాదులయొక్క, గుణేతర=గుణములకన్న భిన్నమయిన, గుణ=మంచిగుణములచే, శాలిన్=ప్రకాశించుచున్న; ఇవ్విభునిన్=ఈరాజును; తన్వి=చంద్రికా! వరించి=కోరి; నిచ్చలున్=ఎల్లకాలము; చెలంగు=ఒప్పును.

ఓచంద్రికా! యురగాచలకిరిధులీశులల దుర్గుణములకుఁ బుడమి రోసి యీసుగుణశాలిని జేరె నని భావము.

ఉ. ఇన్నరనాథచంద్రు వరి•యించి ముదంబున నేగుదెంచునిం
గన్నులపండువై యలరఁ • గన్గొని నీపయి నించుఁ గాక యే
తన్నగరీవధూమణివి•తానము సౌధచయంబు లెక్కి యు
ద్యన్నవమౌక్తికాక్షతసు•మావళికాకలికాకులంబులన్. 108

టీ. ఇన్నరనాథచంద్రున్=ఈరాజచంద్రుని; వరియించి=కోరి; ముదంబునన్=సంతసముచేత; ఏగుదెంచునిన్=వచ్చుచున్ననిన్ను; కన్నులపండువై=కన్నులపండుగై; అలరన్=ప్రకాశింపఁగ; కన్గొని=చూచి; నీపయిన్=నీమీఁద; ఏతన్నగరీవధూమణివితానము=ఈతనిపురమునందలిస్త్రీరత్నసమూహము; సౌధచయంబులెక్కి=మేడలపైనెక్కి; ఉద్యన్నవమౌక్తికాక్షతసుమావళికాకలికాకులంబులన్.—ఉద్యత్=ఎత్తఁబడిన, నవ=నూతనమయిన, మౌక్తికాక్షత=ముక్తాక్షతలయొక్క, సుమావళికా=పువ్వుబృందముయొక్క, కలికా=మొగ్గలయొక్క, కులంబులన్=సమూహములను; నించుఁగాక=నిండించుఁగాక.

క. అనఁగ తూష్ణీంస్థితి భజించె • నంబుజాక్షి
తన్మనోమోహదుర్విధ•త్వంబు దెలిసి
యప్పు డాచెంత వేత్రిక్క • యధిపుఁ జూపి
యింతి కమ్మేనకాపుత్రి • యిట్టు లనియె. 109

టీ. అనఁగన్=ఈప్రకారముపలుకఁగ; తూష్ణీంస్థితిన్=ఊరకుండుటను; అంబుజాక్షి=చంద్రిక; భజించెన్=పొందెను. తన్మనోమోహదుర్విధత్వంబు.—తత్=ఆచంద్రికయొక్క, మనః=మనమునందు, మోహ = మోహముయొక్క, దుర్విధత్వంబు = దారిద్ర్యమును; తెలిసి=తెలిసికొని; అప్పుడు=ఆసమయమందు; ఆచెంతన్=ఆసమీపమందు; వేత్రిక్కయధిపున్=మణిరయుకరాజును; చూపి; ఇంతికిన్=చంద్రికకు; అమ్మేనకాపుత్రి=ఆపార్వతీదేవి; ఇట్టులు=వక్ష్యమాణప్రకారము; అనియెన్=పలికెను.

మ. తులకింపం బ్రమదంబు కన్గొనుము సిం•ధుస్వామి నీదంటఁ బ
క్ష్మలనేత్రామణి పాండుకాండయుతశుం•భద్వాహినీమద్రణ
స్థలకాశి న్రిపుకోటి చేరి కడు మిం•చ న్దివ్యరామోపదే
శలసద్వృత్తి ఘటించు వీనియసియ•జ్ఞధ్వంసి నిక్కంబుగన్. 110

టీ. పక్ష్మలనేత్రామణి=చంద్రికా! ప్రమదంబు=సంతసము; తులకింపన్ = ప్రకాశింపఁగా; సింధుస్వామిన్=సింధుదేశాధిపతియగు ; ఈదంటన్ = ఈదిట్టతనముగలవానిని; కన్గొనుము=చూడుము. వీని యసియజ్ఞధ్వంసి=ఈరాజుయొక్కఖడ్గమను శంకరుఁడు; పాండుకాండయుత శుంభద్వాహినీమద్రణస్థలకాశిన్.—పాండు=తెల్లనగు, కాండ=గుఱ్ఱములతో,

యుత=కూడుకొన్న, శుంభత్=ప్రకాశించుచున్న, వాహినీమత్=సేనగల, రణస్థల=యుద్ధభూమియనెడు, కాశిక్=వారాణసిని; ఇచట, పాంసు=తెల్లనగు, కాండ=జలముచేత, యుత=కూడుకొన్న, శుంభత్=ప్రకాశించుచున్న, వాహినీమత్=గంగగల, యని కాశీపరముయనయర్థము దోఁచుచున్నది; రిపుకోటి=శత్రుసంఘము; చేరి=పొంది; భజియింపన్=సేవింపఁగా; దివ్యరామోపదేశలసద్వృత్తిక్.—దివ్యరామా=దేవాంగనలయొక్క, ఉపదేశ=సమీపప్రదేశమునందు, లసత్=ప్రకాశించుచున్న, వృత్తిక్=వర్తనను, ఉనికిననుట; ఇచట దివ్య=అమోఘమయిన, రామ=రామతారకముయొక్క, లేదా పరబ్రహ్మముయొక్క, ఉపదేశముచేత నని దోఁచుచున్నది; ఘటించున్=ఘటిల్లఁజేయును.

అనఁగా నోచంద్రికా! ఈసింధుదేశాధిపతియొక్క యని యను శంకరుఁడు రణస్థలమను వారాణసియందుఁ జేరి యున్నశత్రులకు దివ్యరామోపదేశమును జేయు నని భావము. పరంపరితరూపకాలంకారము.

చ. అలఘుశరౌఘవృత్తిమహి•మాభిహతప్రతికూలు సంతతా
తులితగభీరభావభరి•తు న్సుమనోజనమోదకారిని
ర్మలమణిదాత నియ్యవని•రాజకులాజరరాజు నాత్మ నో
నెలఁతుక సింధురా జనుచు• నిచ్చ నుతింపఁగఁ జెల్ల కుండునే. 111

టీ. అలఘుశరౌఘవృత్తిమహిమాభిహతప్రతికూలున్.—అలఘు=అధికమయిన, శరౌఘ=బాణసంఘముయొక్క, వృత్తి=వర్తనమువలననైన, మహిమ=సామర్థ్యముచేత,అభిహత=కొట్టఁబడిన, ప్రతికూలున్=శత్రువులుగల; ఇచట, శరౌఘ=జలప్రవాహముయొక్క, మహిమాభిహతమగు, ప్రతికూలున్=ఎదురుదరిగలయను సముద్రపర మయినయర్థము దోఁచుచున్నది; సంతతాతులితగభీరభావభరితున్.—సంతత=ఎల్లపుడు, అతులిత=నిస్సమానమగు, గభీర=గంభీరమగు, భావ=అభిప్రాయముచే, భరితున్=పరిపూర్ణుఁడగు; సంతతము, అతులితమగు, గభీరభావ=లోఁతుచేఅని సముద్రపరమైనయర్థము;సుమనోజనమోదకారి నిర్మలమణిదాతన్.—సుమనోజన=విద్వాంసులకు, మోదకారి=సంతసమునుచేయు, నిర్మల=స్వచ్ఛమగు, మణి=మణులయొక్క, దాతన్=వదాన్యుఁడగు, దేవతలకు సంతసమును జేయుచింతామణిని ఇచ్చినవాఁ డని సముద్రపర మైనయర్థము; రాజకులాజరరాజున్=రాజకులేంద్రుని; ఇయ్యవనిన్=ఈభూమియందు; ఆత్మన్=మనమునందు; ఓనెలఁతుక=చంద్రికా! సింధురాజనుచున్=సింధుదేశపురాజని, సముద్రుఁడనితోఁచుచున్నది; నిచ్చన్=ఎల్లపుడు; నుతింపఁగన్=కొనియాడుటకు; చెల్లకుండునే=చెల్లకుండునా? అనికాకువు.

ఈసింధురాజు బాణములచేఁ బ్రతికూలులను వధించువాఁ డనియు గంభీరభావమును వహించినవాఁ డనియు విద్వత్సంఘమునకు పెక్కుమణుల నిచ్చినవాఁ డనియు గాన నితఁడు వరణీయుఁడని భావము.

చ. సకి రతివేళ నీవు గళ•సంయుతనిస్వనబృంహితార్భటుల్
కరమయి మీఱఁ గంతుకరి•రాజనిరూఢి విశృంఖలైకవృ
త్తికఁ దగ నీమహీతలప•తిచ్ఛలయంత ఘటించుఁ గాక తా
వకకుచకుంభవీథి నని•వార్యనఖాంకుశఘాతజాతముల్. 112

టీ. సకి=చంద్రికా! రతివేళన్=సురతసమయమందు; గళసంయుతనిస్వనబృంహితార్భటుల్.—గళ=కంఠమందు, సంయుత=కూడుకొన్న, నిస్వన=రతికూజితములనెడి, బృంహితార్భటుల్ = గజధ్వనులు; కరమయి = అధికమయి; మీఱన్ = మించఁగ; నీవు; కంతుకరిరాజనిరూఢిన్=మరునేనుఁగుపగిది; విశృంఖలైకవృత్తికన్.—విశృంఖల =నిగళములులేనట్టి, ఏక=ముఖ్యమగు, వృత్తికన్=వ్యాపారముచేత; తగన్ = ఒప్పఁగా; ఈమహీతలపతిచ్ఛలయంత.— ఈమహీతలపతి=ఈభూపతియను, ఛల=కపటముగల, యంత=మావటీవాఁడు; తావకకుచకుంభవీథిన్.—తావక=నీసంబంధియగు, కుచకుంభ=కుచములనెడు కుంభములయొక్క, వీథిన్=ప్రదేశమందు; అనివార్యనఖాంకుశ ఘాతజాతముల్.—అనివార్య=నివారించుట కశక్యమగు, నఖ=గోళ్ళనెడు, అంకుశ=అంకుశములయొక్క, ఘాత=పోట్లయొక్క, జాతముల్=సమూహములను; ఘటించుఁగాక=చేయుఁగాత.

చంద్రికా నీవు రతివేళ గళసంయుతము లగురతికూజితము లను బృంహితములు విపులముగాఁ జేయుచు విశృంఖల మదనగజరాజమువలె నుండఁగా నపుడు ఈమహీపతి యను మావటీవాఁడు నీకుచము లనుకుంభస్థలములయందు గోళ్ళను నంకుశములచే ఘాతములఁ జేయునని భావము.

తే. అనిన నెమ్మోము మరలిచె • వనజవదన
యదె కనుంగొని గిరిజ య•ప్పదవిఁ గుకురు
వరునిఁ జేచాయఁ జూపి య•వ్వనిత కిట్టు
లనియె మహతీరవామిత్ర•నినదకలన. 113

టీ. అనిసన్=ఈప్రకారముపలుకఁగా; నెమ్మోము=సుందరమగు ముఖమును; వనజవదన=చంద్రిక; మరలిచెన్=త్రిప్పెను. అదికనుంగొని=అదిచూచి; గిరిజ=పార్వతి; అప్పదవిన్=ఆదారియందు; కుకురువరునిన్=కుకురుదేశాధిపతిని; చేచాయన్=చెయిజాడచే; చూపి=ప్రదర్శించి; అవ్వనితకున్=అచంద్రికకు; మహతీరవామిత్రనినదకలనన్.—మహతీ=నారదవీణయొక్క, రవ=స్వనమునకు, అమిత్ర=విరోధియగు, నినద=ధ్వనియొక్క, కలనన్=ప్రాప్తిచేత; ఇట్టులు=వక్ష్యమాణప్రకారమునగ; అనియెన్=పలికెను.

చంద్రిక యానరపతిమీఁద మనంబు పొందకున్కి మోము ద్రిప్పఁగానె గౌరీదేవి యచటఁ గుకురుదేశరాజుం జూపి వీణారవమునకు సమాన మగువచనమునఁ బలికె నని భావము.

చ. చెలి కుకురుక్షమారమణ•శేఖరుఁ డీతఁడు వీనిఁ గాంచు మీ
జలజశరోపమానునెఱ•చక్కఁదనంబు జగంబు లెంచ ని
చ్చలు నెదఁ గుందఁ జేయుఁ దొవ•సామి వనావళిఁ దోలు నామనిన్
దలఁచుఁ దృణంబుగా నలజ•నప్రభుఁ దా నెగఁబట్టు వాసవిన్. 114

టీ. చెలి=చంద్రికా! ఈతఁడు; కుకురుక్షమారమణశేఖరుఁడు= కుకురురాజశ్రేష్ఠుఁడు. వీనిన్=ఈరాజును; కాంచుము=చూడుము. ఈజలజశరోపమానునెఱచక్కఁదనంబు=ఈమన్మథతుల్యుఁడగు రాజుయొక్క నిండుసౌందర్యము; జగంబు లెంచన్=లోకములు స్తుతియింపఁగా; తొవసామిన్ = కలువలరాయిని; నిచ్చలు = ఎల్లప్పుడు; ఎదన్ = హృదయమందు; కుందఁజేయున్=దుఃఖించునటులు చేయును, తగ్గునటులు చేయునని స్వభావార్థము, కృష్ణపక్షమందుఁ జంద్రుఁడు తగ్గుట సహజ మని భావము. ఆమనిన్=వసంతుని; వనావళిన్=వనసంక్తినిగూర్చి; తోలున్=పంపును, మిక్కిలి చక్కఁదనము గలవసంతుని నడవికిఁ బాఱిపోవునటులు చేయునని భావము, వసంతుఁడు వనావళియం దుండుట సహజమని భావము. నలజనప్రభున్=నలచక్రవర్తిని; తృణంబుగాన్=గడ్డిపోఁచగా; తలఁచున్, నలుని తిరస్కరించు ననుట, నలశబ్దమునకు తృణ మర్థము గాన తృణముగాఁ దలఁచుట సహజ మని భావము; వాసవిన్=జయంతుని; ఎగఁబట్టున్=ఎగఁజిమ్మును, తిరస్కరించుననుట, ఆకాశగమన మతనికి సహజము.

చ. సరసమహాత్మత న్భువన•జన్మవినాశనహేతు వైనయీ
నరపతికీర్తి దైవము గ•నం బ్రతికూలతచేఁ జరింప ని
ర్జరతరుపాళి కేపు తన•చాయ పొసంగునె చుట్టమై కడున్
ఖరదనుజారికిం బగయ•గా దొకొ కట్టినకోఁక యెంచఁగన్. 115

టీ. సరసమహాత్మతన్.—సరస=శ్రేష్ఠమగు, మహాత్మతన్=ప్రభావముచేతను; భువనజన్మవినాశనహేతువైన.—భువనజన్మ=జలజములయొక్క, వినాశన= నశింపఁజేయుటయందు, హేతువైన=కారణమైన; ఈనరపతికీర్తిదైవము= ఈరాజుయొక్క కీర్తియను దైవము; ఇచట, భువన=ప్రపంచముయొక్క, జన్మ=ఉత్పత్తికి, వినాశన=నాశమునకు, హేతువైన, యని దైవపక్షమున నర్థము; కనన్=చూడఁగా; ప్రతికూలతచేన్=ప్రాతికూల్యముచేత; చరింపన్=వర్తింపఁగ; అనఁగ కీర్తి దైవము ప్రతికూలము కాఁగానే యనుట; నిర్జరతరుపాళికిన్ = కల్పతరుబృందమునకు; తనచాయ = తననీడ; కడున్ = మిక్కిలి; చుట్టమై = బంధువై; ఏపున్=విజృంభణమును; పొసంగునె=చేయునాయని కాకువు, కీర్తి ప్రతికూలము కాఁగానె కల్పతరుపాళికి తననీడ యేపుఁ జేయకయుండె ననుట, చెట్లు తెల్లవివైనను నీడ నల్లనిదిగాన ననుకూలము గాకపోయెనని భావము; లోకమందు దైవము ప్రతికూలము కాఁగానె చుట్టము ప్రతికూలించునని భావము; ఖరదనుజారికిన్=బలరామునికి; ఎంచఁగన్=విచారింపఁగ; కట్టినకోఁక=కట్టువస్త్రము; పగయగాదొకో=శత్రువెగాదాయని కాకువు, బలరామునికి కట్టువ

స్త్రము నల్లని దని భావము. ఏతత్కీర్తిదైవము ప్రతికూలించుటచేఁ గట్టువస్త్రముగూడ బలరామునకుఁ బ్రతికూలించెననుట.

క. అని పాంచాలక్షితివర, తనయామణి కద్రిరాజతనయ తెలుపఁగా
నెనయింప దయ్యె నపుడా, ఘనుపైఁ గలకంఠి చిత్తగతరాగంబున్. 116

టీ. అని=పూర్వోక్తప్రకారము; పాంచాలక్షితివర తనయామణికిన్ = క్షణదోదయ రాజపుత్రికయగు చంద్రికకు; అద్రిరాజతనయ=పార్వతీదేవి; తెలుపఁగాన్ = తెలియఁజేయఁగా; అపుడు=ఆసమయమందు; ఆఘనుపైన్=ఆ రాజుమీఁద; కలకంఠి=చంద్రిక; చిత్తగతరాగంబున్=మనోగతమైన యనురాగమును; ఎనయింపదయ్యెన్=పొందింపదాయెను.

వ. అంత నయ్యనంతజూటనీలకుంతల యక్కాంత కిట్లు సకలదేశకాంతసంతానంబులం గ్రమక్రమంబునం దెలుపుచుం జని చని యారాజసభమధ్యంబున నక్షత్రనికరాంతరద్యోతమానరాకాసుధాకరుండునుంబోలె నమూల్యలక్షణలక్షితగాత్రుండును ననుపమానకలాపాలికాసమన్వితుండును జకోరలోచనానందసంధాయకతేజస్సాంద్రుండును నగుచుఁ జూపట్టుసుచంద్రమనుజేంద్రుం జూపి తదీయచిత్తంబు తదాయత్తం బగుట దెలిసి యాకనకగౌరి కాగౌరి యిట్లనియె. 117

టీ. అంతన్=అటువిమ్మట; అయ్యనంతజూటనీలకుంతల = వ్యోమకేశునికాంతయగు పార్వతీదేవి; అక్కాంతకున్=ఆచంద్రికకు; ఇట్లు=పూర్వోక్తప్రకారము; సకలదేశకాంతసంతానంబులన్.—సకలదేశకాంత=సమస్తదేశాధిపతులయొక్క, సంతానంబులన్ = సమూహములను; క్రమక్రమంబునన్=వరుసగా; తెలుపుచున్=తెలియఁజేయుచు; చనిచని=అరిగియరిగి; ఆరాజసభమధ్యంబునన్=ఆరాజసభనడుమ; నక్షత్రనికరాంతరద్యోతమానరాకాసుధాకరుండునుంబోలెన్.—నక్షత్రనికర=రిక్కగుంపుయొక్క, అంతర=మధ్యప్రదేశమందు, ద్యోతమాన=వెలుఁగుచున్న, రాకాసుధాకరుండునుంబోలెన్ = పున్నమచందురునివలె; అమూల్యలక్షణలక్షితగాత్రుండునున్.—అమూల్య = వెలలేని, లక్షణ = శుభచిహ్నములతో, లక్షిత=కూడుకొన్న, గాత్రుండునున్=శరీరముగలవాఁడును; అమూల్యమైన, లక్షణ=కలంకముచేత, నని చంద్రపరమగునర్థము; అనుపమానకలాపాలికాసమన్వితుండును.—అనుపమాన = సాటిలేని, కలా=విద్యలయొక్క, పాలికా = పంక్తితో, సమన్వితుండునున్ = కూడినవాఁడును; అనుపమానమగు, కలాపాలికా= కాంతిపంక్తులతో, సమన్వితుఁడనిచంద్రపరమైనయర్థము; చకోరలోచనానందసంధాయకతేజస్సాంద్రుండునున్.—చకోరలోచనా=స్త్రీలకు, ఆనందసంధాయక=సంతసమును ఘటిల్లఁజేయు, తేజః = తేజస్సులచేత, సాంద్రుండునున్ = నిండినవాఁడును; చకోర=వెన్నెలపులుఁగులయొక్క, లోచనములకు, ఆనందసంధాయకమగు, తేజముతోఁ గూడినవాఁ డనిచంద్రపర మైన యర్థము; అగుచున్ = ఈప్రకారమయినవాఁడై; చూపట్టు

సుచంద్రమనుజేంద్రుఁ=కనిపించుసుచంద్రరాజును; చూచి; తదీయచిత్తంబు=చంద్రికసంబంధమైనమనసు; తదాయత్తంబు=సుచంద్రునధీనము; అగుటన్; తెలిసి=ఎఱిఁగి; అకనకగౌరికిన్=బంగరువలెగౌరవర్ణముగలయాచంద్రికకు; గౌరి=పార్వతీదేవి; ఇట్లు=వక్ష్యమాణప్రకారము; అనియెన్=పలికెను.

మ. లలనా కన్గొనుమీ రవిప్రభు విశా♦లారాజధానీప్రభు
న్లలిమై నీపతి యొప్పుఁ గాక యెద ప్రే♦లం ద్వత్కరాంభోరుహ
స్థలి రాజిల్లుప్రసూనదామకము చం♦చద్వైజయంతీభృతిం
జెలువుం బూనురమావిభుం డన సుర♦శ్రేణుల్ ప్రమోదింపఁగన్. 118

టీ. లలనా=చంద్రికా! ఈరవిప్రభున్ = ఈసూర్యకాంతిగల; విశాలారాజధానీప్రభున్=విశాలాపురపతిని; కన్గొనుము=చూడుము. లలిన్=ప్రేమచేత; ఈపతి=ఈరాజు; త్వత్కరాంభోరుహస్థలిరాజిల్లుప్రసూనదామకము.—త్వత్కరాంభోరుహస్థలిన్= నీకరకమలప్రదేశమందు, రాజిల్లు=ప్రకాశించు, ప్రసూనదామకము=పూదండ; ఎదన్=వక్షస్థలమందు; ప్రేలన్=ప్రేలాడఁగా; చంచద్వైజయంతీభృతిన్.—చంచత్=ప్రకాశించుచున్న, వైజయంతీ=వనమాలయొక్క, భృతిన్ = భరణముచేత; చెలువున్=అందమును; పూనురమావిభుండనన్=పొందినట్టినారాయణమూర్తియనునట్లు; సురశ్రేణుల్=దేవసంఘములు; ప్రమోదింపఁగన్=సంతోషింపఁగా; ఒప్పుఁగాక=ప్రకాశించుఁగాక.

చంద్రికా! వనమాలచే విష్ణువుప్రకాశించునట్లు నీచేతిపూదండను వక్షమున ధరించి యీ విశాలాపురాధిపతి ప్రకాశించుఁ గాక యని భావము.

చ. నెలఁతుక యీసుచంద్రధర♦ణీపతి శాతశరచ్ఛటం బలా
ద్బలగళరక్త మర్ఘ్యముగఁ♦ దత్కరికుంభమహామణు ల్సుమాం
జలిగఁ దదాతపత్రములు♦ చక్కనియార్తులుగాఁ దనర్చుచున్
బలి రణచండి కూన్చె ముని♦పాళి నుతింపఁ దమిస్రదానవున్. 119

టీ. నెలఁతుక=చంద్రికా! ఈసుచంద్రధరణీపతి=ఈసుచంద్రభూపాలుఁడు; శాతశరచ్ఛటన్.—శాత=తీక్ష్ణమైన, శరచ్ఛటన్ = బాణపుంజముచేత; బలాద్బలగళరక్తము.—బలాద్బల=రాక్షసబలముయొక్క, గళరక్తము = కంఠశోణితము; అర్ఘ్యముగన్=పూజార్హమైనవస్తువుగా; తత్కరికుంభమహామణుల్.—తత్=ఆదానవులయొక్క, కరికుంభ=గజకుంభములయందున్న, మహామణుల్=అధికములగుమణులు; సుమాంజలిగన్ = కుసుమాంజలిగ; తదాతపత్రములు=వారిగొడుగులు; చక్కనియార్తులుగాన్=సుందరములగునారతులుగా;తనర్చుచున్= చేయుచు; రణచండికిన్=రణదుర్గకు; తమిస్రదానవున్=తమిస్రాసురుని;మునిపాళినుతింపన్= మునిసంఘములుకొనియాడఁగ; బలిన్=బలిగా; ఊన్చెన్=చేసెను.

"అనఁగా నో చంద్రికా! ఈసుచంద్రుఁడు రాక్షసులయొక్క కంఠరక్తము నర్ఘ్యము గాను వారి గజకుంభములనుండి వెడలిన ముత్తెములను కుసుమాంజలిగాను వారి గొడుగులను హారతులుగను జేయుచు అర్ఘ్యము మొదలగుపూజాద్రవ్యములను జతపఱచి రణదుర్గను పూజించి తమిస్రాసురుని బలియిచ్చెనని భావము.

మ. అని నేతద్విభుసాయకాభిహతి మిన్నంటం బయిం బర్వి శ
త్రునృపాళీమకుటీవలక్షమణిపంక్తుల్ ద్రెళ్ళుటల్ పొల్చు వ
ర్ణన సేయం జెలి నిర్భరానకరవభ్రశ్యన్మహోడుస్థితిన్
ఘనలేఖోత్కరవర్షితాభ్రతరురంగత్కోరకవ్యాపృతిన్. 120

టీ. అనిన్=యుద్ధమందు ; ఏతద్విభుసాయకాభిహతిన్.—ఏతద్విభు=ఈసుచంద్రుని యొక్క, సాయక=బాణములయొక్క, అభిహతిన్=కొట్టుటచేత; మిన్నంటన్=ఆకాశమంటునటులు; పయిన్=ఊర్ధ్వభాగమందు; పర్వి=వ్యాపించి; శత్రునృపాళీమకుటీవలక్షమణిపంక్తుల్.—శత్రునృప=శత్రురాజులయొక్క, ఆళీ=పంక్తులయొక్క, మకుటీ = కిరీటమందున్న, వలక్షమణి=రవలయొక్క, పంక్తుల్=శ్రేణులు; ద్రెళ్ళుటల్ = పడుటలు; వర్ణనసేయన్=నుతియింపఁగా ; చెలి=చంద్రికా ! ఘనలేఖోత్కరవర్షితాభ్రతరురంగత్కోరకవ్యాపృతిన్.—ఘన=గొప్పవారైన, లేఖ=దేవతలయొక్క, ఉత్కర=సమూహముచేత, వర్షిత=వర్షింపఁజేయఁబడిన, అభ్రతరు=కల్పవృక్షముయొక్క,రంగత్=ప్రకాశించుచున్న,కోరక=మొగ్గలయొక్క, వ్యాపృతిన్=మేళనముచేత; నిర్భరానకరవభ్రశ్యన్మహోడుస్థితిన్.—నిర్భర = పరిపూర్ణమగు, ఆనక=పటహముయొక్క, రవ=ధ్వనిచేత, భ్రశ్యత్=జాఱుచున్న, మహోడు=గొప్పనక్షత్రములయొక్క, స్థితిన్=భంగిచే; పొల్చున్=ఒప్పును.

ఈసుచంద్రునియొక్క బాణహతిచే శత్రుమకుటతటఘటితమణులు మిన్నంటి యంతట వ్యాపించి దేవతలు వర్షించుకల్పతరుకలికలతోఁ గూడి పుడమి ద్రాలుచు రణభేరీరవమునకుఁ గూలురిక్కలగుంపులవలె నొప్పి యుండెనని భావము.

చ. జలజదళాక్షి యీపతి సుచంద్రసమాహ్వయ మెట్లు పూనెనో
తెలియఁగ రాదు ధాత్రిఁ బరదేవమనఃప్రమదాపహారి ని
శ్చలకరకాండుఁడై భువనజాతనవోత్సవదాయకోదయో
జ్జ్వలుఁడయి సద్బుధాప్తుఁడయి సంతతముం నలువారుచుండఁగన్. 121

టీ. జలజదళాక్షి=చంద్రికా! ధాత్రిన్=భూమియందు; పరదేవమనఃప్రమదాపహారి.—పర=ఉత్కృష్టమగు, దేవ=దేవతలయొక్క, మనఃప్రమద = మనస్సంతోషమును, అపహారి=హరించువాఁడును, పరదేవ = శత్రురాజులయొక్క, మనఃప్రమదాపహారియనిస్వభావార్థము; నిశ్చలకరకాండుఁడై.—నిశ్చల=చలింపని, కర=కిరణములయొక్క, కాండుఁడై=సమూహము గలవాఁడై, నిశ్చలమగు, కరమందున్న, కాండుఁడై = బాణములు గలవాఁడై యని స్వభా

వార్థము; భువనజాతనవోత్సవదాయకోదయోజ్జ్వలుఁడయి.—భువనజాత = కమలములకు, నవ=నూతనమగు, ఉత్సవ=వికాసరూపోత్సవమును, దాయక=ఇచ్చుచున్న, ఉదయ=ఆవిర్భావముచేత, ఉజ్జ్వలుఁడయి=ప్రకాశించుచున్నవాఁడై; భువనజాత=లోకబృందమునకు, నవమగునుత్సవమును, దాయక=ఇచ్చుచున్న, ఉదయ=అభివృద్ధిచేత, ఉజ్జ్వలుఁడయి యని స్వభావార్థము సద్బుధాప్తుఁడయి.—సత్=రిక్కలకు, బుధ=బుధునికి, ఆప్తుఁడయి=ఇష్టుఁడయినవాఁడై; బుధునకు ప్రసిద్ధచంద్రుఁడువిరోధి యనుట బృహజ్జాతకమందుఁ బ్రసిద్ధము. శ్లో॥ మిత్రే తే సౌరిసితౌ బుధస్య హిమగుశ్శత్రు స్సమా శ్చాపరే॥ అని తత్ప్రమాణము ; సత్=శ్రేష్ఠులయిన, బుధ=విద్వాంసులకు, ఆప్తుఁడయినవాఁడని స్వభావార్థము; సంతతముక్=ఎల్లప్పుడును; నలువారుచుండఁగన్=ఒప్పుచుండఁగ; ఈపతి=ఈరాజు; సుచంద్రసమాహ్వయము=సుచంద్రుఁడను పేరును; ఎట్లుపొందెనో=ఏరీతిఁబొందెనో; తెలియఁగరాదు=తెలియదు.

అనఁగ నీనరపతి పరదేవుల సంతసము గూర్చియు నిశ్చలకరకాంఁడుఁడయ్యు భువనజాతోత్సవ ప్రదుఁడయ్యు సద్బుధాప్తుఁడయ్యుఁజుడమి సుచంద్రుఁ డనుపాము పెట్లు పొందెనో తెలియ దని భావము.

ఉ. మానిని యీనృపాలకర♦మానుతుసుందరతాలవంబు చా
మానుగ నంది చంద్రుఁ డస♦మానమహాస్థితి మిన్ను ముట్టఁగా
నౌనన కేలొకో మధు వ♦హంకృతిచే సుమనోవిరోధముం
బూని ఘనుల్ గరంపఁ గర♦ము న్వని రూపఱుఁ బెంపు వాయఁగన్. 122

టీ. మానిని=చంద్రికా! ఈనృపాలకరమానుతు సుందరతాలవంబున్.—ఈనృపాలకరమానుతు=ఈరాజమన్మథునియొక్క, సుందరతా=సౌందర్యముయొక్క, లవంబున్=లేశమును; చంద్రుఁడు=హిమాంశుఁడు; తాన్=తాను; మానుగన్=మనోజ్ఞముగ ; అంది=పొంది; అసమానమహాస్థితిన్.—అసమాన=నిస్సమానమగు, మహాస్థితిన్=తేజస్సుయొక్క స్థితిచేత; మిన్నుముట్టఁగాన్=విఱ్ఱవీఁగఁగా, ఆకాశముముట్టఁగా నని స్వభావార్థము; మధువు=వసంతుఁడు, అహంకృతిచేన్=అహంకారముచేత; ఔనన క=ఒప్పుకొనక; ఏలొకో=ఎందుకో; సుమనోవిరోధము=విద్వద్విరోధమును; పూని=పొంది; ఆమని జాతీవిరోధియనుట నవాజమని భావము; వసంతమునందు జాతీపుష్పములు లేవనుట కవిసమయము; ఘనుల్=పెద్దలు, మేఘములు; కరము=మిక్కిలి; కరంపన్=అహంకారమును పోఁగొట్టఁగా; వర్షాకాలమందు మేఘములుదయింపఁగానే వసంతకాలము పోవునని భావము; వనిన్=వనమందు; పెంపువాయఁగన్=అతిశయము వీడునటులు; రూపఱున్=నశించును.

సీ. ఏలోకమిత్రుభా♦మాలోక మరిరాజ
సమ్మోదవర్ధన♦చ్ఛాయ వెలయు
నేరాజు నెమ్మేని♦తోరంపుసిరి పద్మి
నుల మానగతి నెల్లఁ♦ దలఁగఁ జేయు

ఏసద్గుణాంభోధి • భాసుర దాన వై
ఖరి బుధావళి మహో • త్కంఠఁ గూర్చు
నేధరోద్ధారువి • శ్వైషణీయసమాఖ్య
భువనమాలిన్యంబు • పొడ వడంచు

తే. నమ్మహాభావుఁ డీతఁ డో • యబ్జపత్ర
బాంధవన్నేత్ర సకలభూ • భరణశాలి
వీనిపై నీమనం బిప్పు • డూనఁ జేసి
యతనుసామ్రాజ్యసంలబ్ధి • నతిశయిలుము. 123

టీ. ఏలోకమిత్రుధామాలోకము.— ఏలోకమిత్రు=జగన్మిత్రుఁడగునే సుచంద్రునియొక్క, ధామాలోకము=ప్రతాపముయొక్కదీప్తి; అరిరాజసమ్మోదవర్ధనచ్ఛాయన్.—అరిరాజ=శత్రురాజులయొక్క, సంమోద=సంతసముయొక్క, వర్ధన=ఛేదనముయొక్క, ఛాయన్ = రీతిచేత; వెలయున్=ప్రకాశించునో. లోకమిత్రు=సూర్యునియొక్క, ధామాలోకము=తేజఃప్రకాశము; అరిరాజసమ్మోద=జక్కవలసంతసముయొక్క, వర్ధన=అభివృద్ధియొక్క, ఛాయచేత, వెలయు ననునర్థము దోఁచుచున్నది; ఏరాజునెమ్మేనితోరంపుసిరి—ఏరాజు=ఏసుచంద్రునియొక్క, నెమ్మేని=సుందరమగు శరీరముయొక్క, తోరంపు = అధికమగు; సిరి=కాంతి; పద్మినులమానగతిన్=పద్మినీజాతిస్త్రీలయొక్క యభిమానగతిని; ఎల్లన్=సర్వము; తలఁగఁజేయున్=పోఁగొట్టునో; చంద్రునియొక్కతోరంపుసిరి పద్మలతయొక్క గర్వాతిశయమును పోఁగొట్టు ననునర్థము దోఁచుచున్నది. ఏసద్గుణాంబోధి భాసురదానవైఖరి.—ఏసద్గుణాంబోధి=మంచిగుణములకు సముద్రుఁడగు యేసుచంద్రునియొక్క, భాసుర=ప్రకాశించుచున్న, దాన=త్యాగముయొక్క; వైఖరి=రీతి; బుధావళిమహోత్కంఠన్=విద్వద్బృందముయొక్క సంతోషమును; కూర్చున్=కలుగఁజేయునో. భాయుక్తమై, అసుర=రక్కసులయొక్క, దాన=ఖండనముయొక్క, వైఖరి; దేవతలయొక్క, ఆవళికి, మహోత్కంఠను గూర్చునని గాని ప్రథమార్థము; సద్గుణ=మంచిగుణముగల, అంభోధి=సముద్రునియొక్క; భా=కాంతియుక్తమగు, సురదాన=అమృతదానముయొక్క, వైఖరి, దేవబృందమునకు, మహోత్కంఠను గూర్చు నను నర్థము స్ఫురించుచున్నది; ఏధరోద్ధారు=ఏరాజుయొక్క, విశ్వైషణీయసమాఖ్య.—విశ్వ=లోకమునకు, ఏషణీయ=కోరఁదగిన, సమాఖ్య=కీర్తి; భువనమాలిన్యంబు.——భువన=లోకములయొక్క, మాలిన్యంబు=పాపమును, నైల్యమును; పొడవడంచున్=రూపుమాపునో; ఓధరోద్ధారు=ఏయాదికూర్మముయొక్క, విశ్వైషణీయసమాఖ్య, భువనమాలిన్యంబు=జలమాలిన్యమును; పొడవడంచుననునర్థముదోఁచుచున్నది. అమ్మహాభావుఁడు=అట్టిగొప్పమనస్సుగలవాఁడు; ఈతఁడు=ఈసుచంద్రుఁడు; ఓయబ్జపత్రబాంధవన్నేత్ర=తామరపత్రములకుచుట్టమగు నేత్రములుగలదానా! కమలదళములకు సమానములగు నేత్రములుగలదానాయని తాత్పర్యము; సగోత్రబాంధవజ్ఞాతిశబ్దములు ఇవార్థకములని యిదివఱలో వ్రాయఁబడి యున్నది; సకలభూభరణశాలి.—సకల=సమస్తమగు, భూభరణ=భూమినిభరింపుంచుటచేత, శాలి=ప్రకాశించువాఁడు. వీనిపైన్ = ఈరాజునందు; నీమనంబు=

నీమనమును; ఇప్పుడు=ఈతఱి; చేసి=పొందునటులుచేసి; అతనుసామ్రాజ్యసంలబ్ధిన్.— అతను=అధికమగు, సామ్రాజ్య=సమ్రాట్టుతనముయొక్క, సంలబ్ధిన్=ప్రాప్తిచేత; అతిశయిలుము=అత్యుత్కర్షముగానుండుము; అతను=మన్మథునియొక్క, సామ్రాజ్యసంలబ్ధిచేత, నతిశయిల్లుమనునర్థము దోఁచుచున్నది.

ఏరాజుయొక్క ప్రతాపము, శత్రురాజులయొక్క సంతతినము గూల్చుచున్నదో, ఏరాజుయొక్క సౌందర్యాతిశయము పద్మినీజాతిస్త్రీలయొక్క మానసము తొలఁగఁజేయునో ఏరాజుయొక్క దానవైఖరి పండితులకు నుత్కంఠఁ జేయునో ఏరాజుకీర్తి జగన్మాలిన్యమును పోనాడునో అట్టిప్రసిద్ధిని బొందినవాఁడు వీఁడే గాన వీని వరియించి యతనుసామ్రాజ్య సుఖము నొందుము అని భావము.

తే. సకలనుత్యకళాశాలి • సౌరవంశ
 మాళి నిమ్మేటి వరియింపు • మామకోక్తి
 నీమనఃపద్మ మామోద•నిభృతి మీఱ
 బింబవిమతోష్ఠి యింక వి•లంబ మేల. 124

టీ. సకలనుత్యకలాశాలిన్.—సకల=సమస్తజనులచేత,నుత్య=కొనియాడఁదగిన,కలా=విద్యలచేత, శాలిన్=ప్రకాశించువాఁడగు; సౌరవంశమాళిన్ = సూర్యవంశశ్రేష్ఠుఁడగు; ఇమ్మేటిన్=ఈయధికుని; మామకోక్తిన్=నావచనముచేత; నీమనఃపద్మము=నీమనోంబుజము; ఆమోదనిభృతిన్ = సంతసమువహించుటచే; మీఱన్ = అతిశయించునటులు; వరియింపుము=కోరుము. బింబవిమతోష్ఠి=దొండపండునకు విరోధియగు మోవిగలదానా! ఇంకన్=మీఁద; విలంబమేల=తడవేల?

వ. అని యాలోకజనని యానతిచ్చిన నాచంద్రిక తత్సుచంద్రరాజ చంద్రసద్గుణగణశ్రవణ సంజాయమానకౌతూహలయును, దన్మహీపవర్య సౌందర్యలహరీ పరివర్తమానలోచనమీనయును, దల్లోకరమణాలోక సముజ్జృంభమాణసాత్త్వికభావ సంభావితయును, దజ్జనేంద్రసమీపస్థితి ప్రకార సంఫుల్ల్యమానలజ్జాంకురయును, దన్మనోనాయక సంవరణసముద్వేగవలమానమానసయును నై, యమ్మహాదేవిముఖంబు గన్గొని తదనుజ్ఞాగౌరవంబున.

టీ. అని=పూర్వోక్తప్రకారముగ; ఆలోకజనని=జగన్మాతయగు నాపార్వతీదేవి; ఆనతిచ్చినన్=సెలవియ్యఁగా; ఆచంద్రిక; తత్సుచంద్రరాజచంద్రసద్గుణగణశ్రవణ సంజాయమానకౌతూహలయును.—తత్సుచంద్రరాజచంద్ర = రాజశ్రేష్ఠుఁడగు నాసుచంద్రునియొక్క, సద్గుణగణ—సుగుణబృందముయొక్క, శ్రవణ=వినుటవలన, సంజాయమాన=పుట్టిన, కౌతూహలయునున్=సంతసముగలదియును, తన్మహీపవర్యసౌందర్యలహరీ పరివర్తమాన లోచనమీన

యును.—తన్మహిపపర్య=ఆసుచంద్రునియొక్క, సౌందర్యలహరీ = చక్కఁదనమను ప్రవాహమందు, పరివర్తమాన = తిరుగుచున్న, లోచనమీనయును = కన్నులను చేఁపలు గలదియును; తల్లోకరమణాలోకసముజ్జృంభమాణ సాత్త్వికభావ సంభావితయును.—తల్లోకరమణ=ఆసుచంద్రునియొక్క, ఆలోక=దర్శనముచేత, సముజ్జృంభమాణ=ఉప్పొంగుచున్న, సాత్త్వికభావ=సాత్త్వికభావములచేత, సాత్త్వికభావములనఁగా నాయికానాయకులయొక్క పరస్పరదర్శన స్పర్శనాదులచే నుదయించు స్తంభాదులు, అవి, శ్లో. తే స్తమ్భస్వేదరోమాఞ్చాస్స్వరభేదశ్చ వేపథుః । వైవర్ణ్య మశ్రుప్రళయా విత్యష్టౌ పరికీర్తితాః'' అని శింగభూపాలీయమునందుఁ జెప్పఁబడియున్నవి, సంభావితయును = సంభావింపఁబడినదియును; తజ్జనేంద్ర సమీపస్థితిప్రకారసంఫుల్ల్యమానలజ్జాంకురయును.— తజ్జనేంద్ర = ఆసుచంద్రునియొక్క, సమీపస్థితి=సమీపమునందుండుటయొక్క, ప్రకార = రీతిచేత, సంఫుల్ల్యమాన= వికసించిన, లజ్జాంకురయును=సిగ్గుయొక్క మొలకగలిగినదియును; తన్మనోనాయకసంవరణసముద్వేగవలమానమానసయును.—తన్మనోనాయక=ఆసుచంద్రునియొక్క, సంవరణ=వరియించుటవలననయిన, సముద్వేగ=అవ్యవస్థితచిత్తతచేత, వలమాన=కదలుచున్న, మానసయునున్=చిత్తముగలదియును; ఐ=అయినదియై; అమ్మహాదేవిముఖంబు=ఆపార్వతీదేవిముఖమును; కన్గొని=చూచి; తదనుజ్ఞాగౌరవంబునన్=ఆపార్వతీదేవియొక్క ఆజ్ఞాగౌరవముచేత; దీని కుత్తరపద్యముతో నన్వయము.

చ. కనకవిమాన మప్డు డిగి • కన్గొన సర్వనరేంద్రలోకము
 ల్మనమున వేడ్క నిండఁ గయి•లాగొసఁగం గిరిరాజకన్య యా
 ఘననిభవేణి తన్మహిత•కాంచనమంచక మెక్కి నిల్పె నా
 మనుజకులేంద్రుకంఠమున • మంజులమంగళపుష్పదామమున్. 126

టీ. కనకవిమానము=సువర్ణవిమానమునుండి; అప్డు=ఆసమయమందు; డిగి=దిగి; సర్వనరేంద్రలోకముల్=సమస్తరాజులు; కన్గొనన్=చూడఁగా; మనమునన్ = హృదయమందు; వేడ్క=సంతసము; నిండన్=నిండఁగా; గిరిరాజకన్య = పార్వతీదేవి; కయిలాగొసఁగన్=కైదండ నొసఁగఁగా; ఆఘననిభవేణి=ఆచంద్రిక; తన్మహితకాంచనమంచకము.—తత్=ఆసుచంద్రునియొక్క,మహిత=పూజితమగు, కాంచనమంచకము=సువర్ణమంచమును; ఎక్కి=ఆరోహించి; ఆమనుజకులేంద్రుకంఠమునన్=ఆసుచంద్రునికంఠమందు; మంజులమంగళపుష్పదామమున్.—మంజుల=మనోజ్ఞమగు, మంగళ=శుభప్రదమగు, పుష్పదామమున్=పూదండను; నిల్పెన్=ఉంచెను.

అనఁగ తనవిమానము దిగి రాజు లెల్లరు చూచుచుండఁగ సుచంద్రుమంచము నెక్కి యతనికంఠమందు మంగళప్రద మగుపూలదండ నుంచె నని భావము.

ఉ. ఆవనజాక్షి యంతటి నజాంగన•యానతిఁ దత్సుచంద్రభూ
 పతివిభుని న్వరించి యల•రెన్నలు భైమి యనంగ నమ్మద

శ్రీ వెలయంగఁ జిత్తముల • జిష్ణువిరోచనసూర్యసంతతీ
రావరు లెల్ల సమ్మతిఁ గ•రంబు మనంబున సంతసిల్లఁగన్. 127

టీ. అనజాక్షి=ఆచంద్రిక; అతఁడున్=ఆసమయమందు; అజాంగనయానతిన్.—అజ=శంకరునికి, అంగన=కాంతయగు పార్వతీదేవియొక్క "అజావిష్ణుహరచ్ఛాగాః" అని యమరుఁడు, ఆనతిన్=ఆజ్ఞ చేతను; తత్సుచంద్రధాత్రీవిభుఁడున్ = ఆసుచంద్రభూపతిని; నలున్=నలమహారాజును; భైమియనంగన్ = దమయంతియన్నట్లు; వరించి = సమ్మదశ్రీవెలయంగన్.—సమ్మద=సంతసముయొక్క, శ్రీ=అతిశయము, వెలయ్యంగన్=ప్రకాశింపఁగా; చిత్తములన్ = మనములందు; జిష్ణువిరోచనసూర్యసంతతీరావరులెల్లన్.—జిష్ణు = జయశీలురగు, విరోచన=చంద్రునియొక్క, సూర్య=ఆదిత్యునియొక్క, సంతతి=కులముగల, ఇరావరులెల్లన్=రాజులందఱు; సమ్మతిన్=అంగీకారము చేత; కరంబు=మిక్కిలి; మనంబున = మనసునందు; సంతసిల్లఁగన్=సంతోషింపఁగా; అలరెన్=ఒప్పెను.

ఆచంద్రిక పార్వతీదేవియాజ్ఞవలన నలుని దమయంతి వరించినటులు సుచంద్రుని వరియించి సూర్యచంద్రవంశపురాజు లెల్ల సంతసింపఁగా నలరె నని భావము.

ఉ. నించిరి వేలుపుల్ ప్రియము • నిక్కఁగఁ గ్రొవ్విరిసోన చక్కఁ దీ
వించిరి తాపసాధిపు ల•వేలమృదంగరవాళి మించ సం
ధించిరి నాట్యవృత్తి సుర•నీరజనేత్రలు చిత్రవీథి మో
దించిరి సర్వదేశజగ•తీరమణుల్ నిరసూయ మెచ్చఁగన్. 128

టీ. వేలుపుల్=దేవతలు; ప్రియమునిక్కఁగన్.—సంతసముపొంగఁగా; క్రొవ్విరిసోనన్=క్రొత్తపువ్వువర్షమును; నించిరి=పూరించిరి. తాపసాధిపులు=మునీశ్వరులు; చక్కన్=చక్కఁగా; దీవించిరి=ఆశీర్వదించిరి. సురనీరజనేత్రలు=సురాంగనలు; అవేలమృదంగరవాళి మించన్.— అవేల=మేరలేని, మృదంగ=మురజములయొక్క, రవ=ధ్వనులయొక్క, ఆళి=సమూహము; మించన్=అతిశయింపఁగా; నాట్యవృత్తిన్=నాట్యముయొక్కవ్యాపారమును; సంధించిరి=చేసిరి. సర్వదేశజగతీరమణుల్=సమస్తదేశాధిపతులు; నిరసూయము = అసూయయొక్కయభావము; ఎచ్చఁగన్=అతిశయింపఁగా; మోదించిరి=సంతసించిరి.

మ. తనుమధ్యామణి వైచినట్టిసుమనో•దామంబు వక్షస్థలిన్
గనుపట్టం బొలిచె న్దినేంద్రకులభూ•కాంతేశుఁ డప్పట్టునన్
ఘనతారావళికాధరుం డయినరా•కాయామినీకాముకుం
డన శ్యామానయనోత్పలోత్సవకరో•దారప్రభాసంభృతిన్. 129

టీ. తనుమధ్యామణివైచినట్టి సుమనోదామంబు.—తనుమధ్యామణి=చంద్రిక, వైచినట్టి=వేసినట్టి, సుమనోదామంబు=పూవంజు; వక్షస్థలిన్=ఎడయందు; కనుపట్టన్ = కాననచ్చు

చుండఁగా; దినేంద్రకులభూషాకాంతేశుఁడు=సుచంద్రుఁడు; అప్పట్టునన్ = ఆసమయమందు; ఘనతారావళికాధరుండు.—ఘన=గొప్పలైన, తారావళికా=నక్షత్రపంక్తులను, ధరుండు ధరియించినవాఁడు; అయినరాకాయామినీకాముకుండు.—అయిన=అయినట్టి, రాకాయామినీకాముకుండు=పూర్ణచంద్రుఁడు; అనన్=అనునటులు; శ్యామానయనోత్పలోత్సవకరోదారప్రభాసంభృతిన్.—శ్యామ=చంద్రికయొక్క, రాత్రియొక్క, నయనోత్పల=కలువలవంటికన్నులకు, కన్నులయినకలువలకని రాత్రిపరమైనయర్థము, ఉత్సవకర=ఆనందకరమగు, ఉదార=ఉత్కృష్టమగు, ప్రభా=కాంతియొక్క, సంభృతిన్=భరణముచేతను; పొలిచెన్=ఒప్పెను.

చంద్రిక యుంచినపూదండ వక్షస్థలమందుఁ బ్రకాశించుచుండఁగా సుచంద్రుఁడు రిక్కలగుంపుతోఁగూడిన పూర్ణచంద్రునివలె ప్రకాశించె నని తాత్పర్యము. ఉత్ప్రేక్షాలంకారము.

మ. వికసచ్చంద్రకలాపయుక్తయయి శ్రీఀవి న్దేవయోషామణి
ప్రకరంబుల్గొలువంగఁ జేరి యలగోఀత్రాభృత్కులాధీశక
న్యక తన్ను న్వరింపఁ దత్కుసుమమాఀలాప్తి న్విరాజిల్లె సూ
ర్యకులోత్తంసము సద్గణోత్సవము లాఀర న్దక్షిణామూర్తినాన్. 130

టీ. వికసచ్చంద్రకలాపయుక్తయయి.—వికసత్=ప్రకాశించుచున్న, చంద్రకలాప=సువర్ణభూషణములతో, యుక్తయయి=కూడుకొన్నదై; చంద్రుఁడను, కలాప=భూషణముతో, నని పార్వతీదేవిపరమైన యర్థము; శ్రీవితోన్=వైభవముతో; దేవయోషామణిప్రకరంబుల్.—దేవయోషామణి=రాజస్త్రీలయొక్క, ప్రకరంబుల్=సమూహములు, దివ్యస్త్రీసంఘము అని యీశ్వరిపరమైన యర్థము; కొలువంగన్=సేవింపఁగా; చేరి=సమీపించి; అలగోత్రాభృత్కులాధీశకన్యక.—గోత్రాభృత్కులాధీశ=రాజచంద్రుఁడగు క్షణదోదయునియొక్క, కన్యక=చంద్రిక; ఆప్రసిద్ధహిమవంతునికూఁతురగు పార్వతీదేవి; వరియింపన్=కోరఁగా; తత్కుసుమమాలాప్తిన్.—తత్కుసుమమాలా=అపూదండయొక్క, ఆప్తిన్=ప్రాప్తిచేత; సూర్యకులోత్తంసము=సుచంద్రుఁడు; సద్గణోత్సవములు.—సద్గణ=విద్వత్సంఘమునకు, ప్రమథగణమునకు, ఉత్సవములు=వేడుక; ఆరన్=అతిశయింపఁగా; దక్షిణామూర్తినాన్=శివావతారవిశేషమోయన; విరాజిల్లెన్=ప్రకాశించెను.

చంద్రుఁడు భూషణముగాఁగలపార్వతీదేవిచే దివ్యస్త్రీలు సేవించుచుండఁగా వరియింపఁబడినదక్షిణామూర్తియో యనునట్లుచంద్రికచే వరియింపఁబడినసుచంద్రుఁడు ప్రకాశించె ననిభావము. ఈపద్యమందు నుత్ప్రేక్షాలంకారము.

చ. మగువ దవిల్చినట్టిసుమఀమాలిక తావికిఁ జేరు తేఁటిదం
టగమిరొద లెన్నెలంగఁ బొగఀడ న్మలినాత్మత మున్ను మన్మథా
నుగుణత నేఁచు మంతువు గఀనుంగొన కిట్టిసుమార్పణంబుచేఁ
దగ మముఁ బ్రోవవే యనుచుఁ ఀ దత్పతికై వివరించుపోలికన్. 131

టీ. మగువఁడవిల్చినట్టి సుమమాలికతావికిన్.—మగువ = చంద్రిక, తవిల్చినట్టి=తగిలించినట్టి, సుమమాలిక=పూదండయొక్క, తావికిన్=పరిమళమునకు; చేరుతేఁటిదంటగమిరొదల్.—చేరు=సమీపించిన, తేఁటిదంట=తుమ్మెదదంటలయొక్క, గమి=సమూహముయొక్క, రొదల్=ధ్వనులు; పొగడన్=పొగడఁగా; మలినాత్మతన్=కుటిలచిత్తముచేత, నల్లనిదేహకాంతిచేత నని స్వభావార్థము; మున్ను=పూర్వమందు; మన్మథానుగుణతన్ —మన్మథ=మదనునికి, అను=అనుసరించిన, గుణతన్ = అల్లెత్రాడగుటచేత, మన్మథున కనుకూలములగుటచేతనని స్వభావార్థము; ఏఁచుమంతువున్ = శ్రమపెట్టినయపరాధమును; కనుఁగొనక = చూడక, గణింపకయనుట; ఇష్టసుమార్పణంబుచేన్.—ఇష్ట = అనుకూలమగు, సు=లెస్సయగు, మా=సంపదయొక్క, అర్పణంబుచేన్ = సమర్పణముచేత; ఇష్టమగు ద్రవ్యమును కానుకగా నిచ్చుటచేత నని తాత్పర్యము; అనుకూలకు సుమార్పణముచేతనని స్వభావార్థము; తగన్=తగునటులు; మనుప్=మమ్ము; ప్రోపవేయనుచున్ = కాపాడవేయుచు; తత్పతికై=యాసుచంద్రునకై; వివరించుపోలికన్ = చెప్పుచున్నదానివలెనె; చెలంగెన్ = ప్రకాశించెను.

చంద్రిక సుచంద్రునికంఠమందు వైచినపూదండతావికిఁజేరియున్న తుమ్మెదలగుంపుల రొదలు పూర్వము సుచంద్రునివిరహకాలమందు మలినాత్మతచేనఁగఁ గుటిలచిత్తముచేత మన్మథానుగుణతచే బాధించినయపరాధమును, కానుకగా సుమార్పణముచేసి మన్నింపు మని యానరపతిం బ్రార్థించునటులొప్పె నని భావము.

చ. నరపతిదేహదీప్తి సుమ•నస్సరవల్లరి శోణభాధురం
ధర యయి చూడ రాజిలె నె•దం దను నేలఁ దలంచుచంద్రికా
తరుణికటాక్షభాస్వదమృ•తచ్ఛట పర్వఁగ నిల్వ లేక దు
ష్కరమదనాస్త్రపావకశి•ఖాలత వెల్వడుదారిఁ బూనుచున్. 132

టీ. నరపతిదేహదీప్తిన్.—నరపతి=సుచంద్రునియొక్క, దేహదీప్తిన్=శరీరకాంతిచేత; సుమనస్సరవల్లరి=తీవవంటిపూదండ; శోణభాధురంధరయయి.—శోణభా=ఎఱ్ఱనికాంతియొక్క, ధురంధరయయి=భారమును వహించినదియై; చూడన్=చూడఁగా; ఎదన్=హృదయమందు; తనున్=తన్ను; ఏలన్=పోషింపను; తలంచు చంద్రికాతరుణి కటాక్షభాస్వదమృతచ్ఛట.—తలంచుచంద్రికాతరుణి = తలఁచినట్టిచంద్రికయొక్క, కటాక్ష=అపాంగములనెడు, భాస్వత్=ప్రకాశించుచున్న, అమృతచ్ఛట=జలపుంజము; పర్వఁగన్=ప్రసరింపఁగా; నిల్వలేక=ఉండలేక; దుష్కరమదనాస్త్రపావకశిఖాలత.—దుష్కర=అసాధ్యమగు, మదన=మరునియొక్క, అస్త్రపావక=బాణాగ్నియొక్క, శిఖాలత=తీవవంటిజ్వాల; వెల్వడుదారిన్=వెళ్ళివచ్చినరీతిని; పూనుచున్=ఊనుచు; రాజిలెన్=ప్రకాశించెను.

అనఁగా చంద్రిక సుచంద్రుని వక్షస్థలమం దుంచిన సుమనస్సరవల్లరి సుచంద్రునిదేహకాంతిచే నెఱ్ఱనయి దానిం బోషించుటకై చంద్రిక కటాక్షము లను జలపుంజములు పర్వఁగా

సుచంద్రునిహృదయమం దుండు మదనాగ్నియొక్క జ్వాల నిలువ లేక వెలువడినదో యనునటులు ప్రకాశించె నని భావము. సుచంద్రవక్షస్స్థలగత సుమమాలికను చంద్రికాకటాక్ష జలసేకముచే బహిర్గతమగుమదనాగ్నిశిఖాలతనుగా నుత్ప్రేక్షించుటచే వస్తూత్ప్రేక్షాలంకారము.

చ. జనవరసార్వభౌముసెద • సామ్యనుబింబితమై నెలంత యుం
   చినసుమదామకంబు గనఁ • జేర్చె ముదంబు తదంతరంబునం
   దెనసి కలంచునట్టికుసు•మేషుశరాళులఁ బట్టి తెత్తుఁ జ
   య్యన నిఁక నిల్వఁ జేయుదు న•టంచు వడిం జొరఁ బాఱుకై వడిన్. 133

టీ. జనవరసార్వభౌముసెదన్=సుచంద్రుని వక్షస్థలమందు; సామ్యనుబింబితమై=అర్ధముప్రతి ఫలించినదై; నెలంతయుంచిన సుమదామకంబు = చంద్రికయుంచిన పూదండ; కనన్ = చూడఁగా; తదంతరంబునందున్ = ఆసుచంద్రునిరొమ్ములోపల; ఎనసి = పొంది; కలంచునట్టి కుసుమేషుశరాళులన్ = కలఁతపఱచుచున్న మరుబాణపంక్తులను; పట్టితెత్తున్= పట్టుకొని తేఁగలను. చయ్యనన్ = శీఘ్రముగా; ఇఁకన్=ఈమీఁద; నిల్వఁజేయుదును=నిలుచునటులు చేయుదును. అటుఅంచున్=ఈరీతిఁబలుకుచు; వడిన్=వేగముతో; చొరఁబాఱుకైవడిన్ =చొరఁబడురీతిగ; ముదంబు = సంతసమును; చేర్చెన్=చేసెను.

అనఁగ సుచంద్రునివక్షస్థలమందు చంద్రిక వైచినపూసరము సగము ప్రతిఫలించినదై యతనిహృదయమునందు కలంచు మన్మథబాణంబుల దీసికొని చయ్యన రాఁగల ననిహృదయమందుఁ జొరఁబడురీతిగ ప్రకాశించె నని భావము.

చ. పుడమిమగండు దాలిచిన•పువ్వులదండ తదంగకాంతిచేఁ
   గడుఁ గనకప్రసూనసర•గౌరవ మూనఁగఁ దుమ్మెద ల్భయం
   బడరఁగ జాఱ సాగె నచ•లాధిపకన్య వరించె నీశునిన్
   గడిమికిఁ జేర కింక నని • కంతునకు న్వివరింప నో యనన్. 134

టీ. పుడమిమగండు=భూభర్తయగుసుచంద్రుఁడు; తాలిచిన పువ్వులదండ=ధరించినపూదండ;తదంగకాంతిచేన్=ఆసుచంద్రునిదేహకాంతిచేత;కడున్=మిక్కిలి; కనకప్రసూనసరగౌరవము.—కనకప్రసూన=సంపెఁగ పూవులయొక్క,సర=దండయొక్క, గౌరవము=గొప్పతనమును, అనఁగఁ దత్సామ్యము ననుట; ఊనఁగన్=పొందఁగా; తుమ్మెదలు=భృంగములు; భయంబు = భీతి; అడరఁగన్ = అతిశయింపఁగా; అచలాధిపకన్య = చంద్రిక; పార్వతీదేవియని తోఁచుచున్నది; ఈశునిన్ = సుచంద్రుని, శంకరుని నని తోఁచుచున్నది; వరించెన్ = కోరెను. కడమికిన్ = పరాక్రమమునకు; చేరకు=పోవలదు. ఇంకన్ = ఈమీఁద; అని=ఈప్రకారము; కంతునకున్=మన్మథునకు; వివరింపనోయనన్ = తెలియఁజేయుటకో యనునట్లు; జాఱసాగెన్=వీడెను.

సుచంద్రుఁడు ధరించినపూదండ యతనిదేహకాంతిచే సంపెంగపూలదండ యని భ్రమ పడి, తుమ్మెదలు జాఱుచుండఁగా నవి సుచంద్రునిఁ జంద్రిక వరియించెఁ గాన నీవు సుచంద్రునిఁ బొడువఁ బోఁబనిలేదని మదనునకుఁజెప్పుటకై పోవుచున్నటుండె నని భావము. ఈపద్యమం దుత్ప్రేక్షాలంకారము.

మ. ఘనపంకేరుహరాగహారరుచిరేఖావ్యాప్తమై యింతి వై
చినయాక్రొవ్విరిదండ భర్తయెదఁ బొల్చెన్ దన్మృగాక్షీవినూ
తనరాగేందిర చేరి యద్ధరణినేత న్గౌఁగిటం దార్చి సం
తనె కన్గొనగుతద్భుజావసులతాద్వంద్వైకబంధంబనన్. 135

టీ. ఘనపంకేరుహరాగహారరుచిరేఖావ్యాప్తమై.—ఘన=అధికమైన, పంకేరుహరాగ=పద్మరాగములయొక్క, హార = సరముయొక్క, రుచి=కాంతియొక్క, రేఖా = శ్రేణిచేత, వ్యాప్తమై=పొందఁబడినదై; ఇంతివైచినయాక్రొవ్విరిదండ = చంద్రికవైచినయాపూదండ; భర్తయెదన్ = సుచంద్రునివక్షమందు; తన్మృగాక్షీ వినూతనరాగేందిర.— తన్మృగాక్షీ=ఆచంద్రికయొక్క, వినూతన=మిక్కిలినూతనమగు, రాగేందిర=అనురాగలక్ష్మి; చేరి=పొంది, అద్ధరణినేతన్ = ఆసుచంద్రుని; కౌఁగిటన్ = కౌఁగిలియందు; దార్చిసంతనె = దార్చినమాత్రముచేతనే; కన్గొనగుతద్భుజావసులతాద్వంద్వైకబంధంబనన్.- కన్గొనగు = కనిపించుచున్న, తత్ = ఆరాగేందిరయొక్క, భుజావసులతా = బంగరుదీవెవంటి భుజములయొక్క, ద్వంద్వ=జంటయొక్క, ఏక=ముఖ్యమైన; బంధంబనన్=బంధమాయనునటులు; పొల్చెన్ = ప్రకాశించెను.

సుచంద్రునికంఠమునందుఁ జంద్రికవైచినహారము, పద్మరాగమణిసరములకాంతిచే వ్యాప్తమై సుచంద్రునివక్షమునందు,నాచంద్రికరాగలక్ష్మి చేరి సుచంద్రునిఁ గౌఁగిలింపఁగాఁ గానవచ్చునారాగేందిరబాహులతాయుగమో యనం బ్రకాశించె నని భావము. ఈపూసరమును సుచంద్రునిఁ గౌఁగలించిన రాగేందిరభుజాద్వంద్వము నా నుత్ప్రేక్షించుటచే వస్తూత్ప్రేక్షాలంకారము.

చ. అలవిరిదండచాయ కర మయ్యెడఁ బర్వఁగఁ దన్నృపాలహా
రలతలచాయ గాంచఁగ విరాజిల దయ్యెఁ దలంప నా విని
ర్మలమహిరాట్సుతాంచితకరస్థితి మించుచుఁ జేరువారి మేల్
చెల్వువము చెంగటన్ ధరణిఁ జిల్లరవేరులవన్నె హెచ్చునే. 136

టీ. అలవిరిదండచాయ = ఆపూదండకాంతి; కరము=మిక్కిలి; అయ్యెడన్=ఆసమయమందు; పర్వఁగన్ = వ్యాపింపఁగ; తన్నృపాలహారలతలచాయ.—తన్నృపాల = ఆసుచంద్రునియొక్క, హారలతలచాయ = లతలవంటి హారములయొక్కకాంతి; కాంచఁగన్ = చూడఁగ; విరాజిలదయ్యెన్ = ప్రకాశింపదాయెను. తలంపన్ = విచారింపఁగా; ఆ =

-యుక్తమేయగును, ప్రకాశింపక యుండుట యుక్తమెయనుట. ఏలయనఁగా; వినిర్మలమహీరాట్సుతాంచితకరస్థితిన్.—వినిర్మల=స్వచ్ఛమగు, మహీరాట్సుతా= చంద్రికయొక్క, అంచిత = ఒప్పుచున్న, కర = హస్తమందు, స్థితిన్ = వాసముచేత; మించుచున్ =అతిశయించుచు; చేరువారి మేల్చెలువము చెంగటన్.——చేరువారి = పొందినవారియొక్క, మేల్ = శ్రేష్ఠమగు, చెలువము = కాంతియొక్క, చెంగటన్ = సమీపమందు; ధరణిన్ = పుడమియందు; చిల్లర పేరులవన్నె = స్వల్పహారములయొక్క కాంతి; హెచ్చునే= అతిశయించునా ? గొప్పపేరులచెంగట, చిల్లలపేరుల = చిల్లరనామములయొక్క, వన్నె = కాంతి; హెచ్చునా యని తోఁచుచున్నది.

చంద్రిక సుచంద్రునియం దుంచిన పూదండకాంతి ముందర, నితరములగుసరముల కాంతి ప్రకాశింపదు. అట్లు ప్రకాశింపకుండుట యుక్తమని ద్వితీయవాక్యముచే సమర్థించుచున్నాఁడు. ఎటులనఁగా చంద్రికకరమం దునికిచే మించుకాంతి గలవారి యొద్ద చిల్లరపేరులకాంతి యతిశయించునా? అతిశయింప దనుట. సామాన్యముచే విశేష సమర్థనరూపమగు నర్థాంతరన్యాసాలంకారము.

మ. హరిమధ్యార్పితసూనదాముఁడయి గోత్రాధీశ్వరుం డత్తఱిన్
చిరకాలేహితకాంక్షయంతయును దం జేరం బ్రమోదాశ్రుసం
భరితాక్షిద్వయితో గళద్విరహతాపశ్రీకచిత్తంబుతో
నురులోమాంచపినద్ధవిగ్రహముతో నొప్పారెఁ జిత్రంబుగన్. 137

టీ. గోత్రాధీశ్వరుండు= సుచంద్రుఁడు; హరిమధ్యార్పిత సూనదాముఁడయి.—హరిమధ్యా = సింహమధ్యముగల చంద్రికచేత, అర్పిత = ఉంచఁబడిన, సూనదాముఁడయి = పూదండగలవాఁడై; అత్తఱిన్=ఆసమయమందు; చిరకాలే హితకాంక్షయంతయును.—చిరకాల = బహుకాలమునుండి, ఈహిత = కోరఁబడిన, కాంక్షయంతయును = కోరికంతయును; తన్=తన్ను; చేరన్=పొందఁగా; ప్రమోదాశ్రుసంభరి తాక్షిద్వయితోన్ = ఆనందబాష్పములచేనిండియున్నకనుదోయితో;గళద్విరహసంతాప శ్రీకచిత్తంబుతోన్.—గళత్=జాఱినట్టి, విరహతాప=విరహాగ్నితాపముయొక్క, శ్రీక=అతిశయముగల,చిత్తంబుతోన్=హృదయముతోడ; ఉరులోమాంచపినద్ధవిగ్రహముతోన్.—ఉరు=అధికమైన,లోమాంచ=గగుర్పాటుచేత, పినద్ధ=కప్పఁబడిన, విగ్రహముతోన్=శరీరముతో; చిత్రంబుగన్=ఆశ్చర్యముగ; ఒప్పారెన్=ఒప్పిదమును పొందెను.

వ. అయ్యెడ నయ్యగరాజకుమారి యాసన్నసముద్రమధ్యరాజలోక వర్ణనానమయోరరీకృతమానుషాకారంబు దూరంబు కావించి యుదంచిత చంచరీకకులాకర్షణప్రకారభావసంమిళిత పరిమళమిళిత పారిజాతకుసుమమాలికాసంవేష్టితవేణీకలాపయును జూడావలంబితచూడారత్నాయమానతారావళ

యును భుజాచతుష్టయసంభృతపాశాంకుశరసాలశరాసనప్రసవరోపయును, నిజచరణసరసిజ భజనాపరాయణ సకలభువనజనోప బహిర్నిర్గతానురాగ మోహదగౌరాంగరాగయును ఆత్మోపఘనఘన ప్రభాలింగిత దివ్యమణిభూషణపూగయును సముజ్జ్వలజ్జ్వలనమయ నయనకలితఫాలభాగయును నగుచు జగదద్భుత తేజోవిలసనంబున నమ్మహారాజేంద్రుముముంగల నిలిచి మంగళకరంబు లగుననేకవరంబు లొసంగి వెండియును జాపకవిబుధమహాన్నత్యతంత్రం బగునొక్కమంత్రంబు దెలుపం దలఁచి యన్నృపతి కిట్లనియె.

టీ. అయోధ్యయన్=అసమయమందు; అయ్యగరాజకుమారి=ఆపార్వతీదేవి; ఆసప్తసముద్రమధ్యరాజలోక వర్ణనాసమయోరరీకృత మానుషాకారంబు.—ఆసప్తసముద్రమధ్య=సప్తసముద్రమధ్యమందున్న, రాజలోక=నృపతులయొక్క, వర్ణనాసమయ = స్తుతిసమయమందు, ఉరరీకృత=అంగీకరింపఁబడిన, మానుషాకారంబు=మనుష్యాకృతిని; దాల్చి=నడల్చి; ఉదంచితచంచరీకకులాకర్షణ ప్రకారభావసంమిళితపరిమళ మిళితపారిజాతకుసుమమాలికా సంవేష్టిత వేణీకలాపయును.—ఉదంచిత=ఒప్పుచున్న, చంచరీకకుల=తుమ్మెదగుంపులయొక్క, ఆకర్షణప్రకార= ఆకర్షించురీతిగల దానియొక్క, భావ=ధర్మముచేత, సమ్మిళిత=కూడుకొన్న, పరిమళ=వలపుచేత, మిళిత=కూడుకొన్న, పారిజాతకుసుమ=పారిజాతపుష్పములయొక్క, మాలికా=దండచేత, సంవేష్టిత=చుట్టఁబడిన, వేణీకలాపయున్ = వేణీభూషణముగలదియును; చూడావలంబిత చూడారత్నాయమాన తారావరయును.—చూడావలంబిత=కొప్పునాశ్రయించిన, చూడారత్నాయమాన = చూడామణివలె నాచరించుచున్న, తారావరయును=చంద్రుఁడు గలదియును; భుజాచతుష్టయ సంభృతపాశాంకుశ రసాలశరాసన ప్రసవరోపయును.—భుజాచతుష్టయ=నలుభుజములచేత, సంభృత=భరింపఁబడిన, పాశ= పాశాయుధమును, అంకుశ=అంకుశమును, రసాలశరాసన = చెఱకువిల్లును, ప్రసవరోపయును=పుష్పబాణములు గలదియును; నిజచరణసరసిజభజనా పరాయణ సకలభువనజనోపబహిర్నిర్గతానురాగ మోహదగౌరాంగరాగయును.—నిజ=స్వకీయమగు, చరణసరసిజ=పాదకమలములయొక్క, భజనా=సేవయందు, పరాయణ=ఆసక్తులగు, సకలభువన=సమస్తలోకములయందుండు, జన=జనులయొక్క, ఉపబహిః=బాహ్యోపకంఠమందు, నిర్గత=వెడలిన, అనురాగ=ప్రేమయొక్క, మోహద=భ్రాంతినిచ్చుచున్న, గౌర=ఎఱ్ఱనైన, అంగరాగయును = అనులేపనముగలదియును; ఆత్మోపఘనఘన ప్రభాలింగిత దివ్యమణిభూషణ పూగయును.—ఆత్మ=తనయొక్క, ఉపఘన=శరీరముయొక్క, ఘనప్రభా=అధికకాంతిచేత, ఆలింగిత=కాఁగిలింపబడిన, దివ్య = శ్రేష్ఠమగు, మణిభూషణ= రత్నమయభూషణములయొక్క, పూగయున్=సమూహముగలదియును; సముజ్జ్వలజ్జ్వలనమయ నయనకలిత ఫాలభాగయును.—సముజ్జ్వలత్ =ప్రకాశించుచున్న, జ్వలనమయ = అగ్నిమయమగు, నయన = నేత్రముచేత, కలిత=ఒప్పుచున్న, ఫాలభాగయున్ = ఫాలస్థలముగలదియును; అగుచున్= అయినదై; జగదద్భుత తేజోవిలసనంబునన్.—జగత్=లోకములకు, అద్భుత=ఆశ్చర్యకరమ

గు, తేజః=తేజస్సుయొక్క, విలసనంబునన్=ప్రకాశము చేత; అమ్మహారాజేంద్రుముంగలన్=ఆసుచంద్రునియెదుట; నిలిచి=నిలుచుండి; మంగళకరంబులు=శుభకరములు; అగుననేకవరంబులు=అగునట్టి పెక్కువరములను; ఒసంగి=ఇచ్చి; వెండియును=మఱియును; పావకవిబుధమహానన్యత్యతంత్రంబు.—పావక=పవిత్రమగు, విబుధ=దేవతలయొక్క, మహానన్యత్య=మిక్కిలి యతిశయమునకు, తంత్రంబు=ముఖ్యకారణము; అగునొక్కమంత్రంబు=అయినట్టి యొకమంత్రమును; తెలుపన్=ఉపదేశించుటకు; తలంచి=సమకట్టి; ఆనృపతికిన్=ఆసుచంద్రునకు; ఇట్లు=వక్ష్యమాణప్రకారముగ; అనియెన్=పలికెను.

మ. నిరవద్యంబయి నిష్కలంకమహమై నిర్వాపితాఘౌఘమై
హరమాయాలవకాంచితాత్మమయి నిత్యంబై మహేంద్రాదిని
ర్జరసేవ్యంబయి యిష్టదంబయి యజస్రమ్మొక్కమంత్రం బిలన్
అరిసంభేదన మించుఁ జుమ్ము భువనేశ్యాఖ్యాసముజ్జృంభియై. 139

టీ. నిరవద్యంబయి=నిర్దుష్టమై; నిష్కలంకమహమై=పాపరహితమగు తేజముగలదై; నిర్వాపితాఘౌఘమై=పోఁగొట్టఁబడిన పాపబృందముగలదై; హరమాయాలవకాంచితాత్మమయి హర=గగనముచేత, మాయా=శక్తిచేత, లవక=అంకుశముచేత, బీజత్రయముచేతననుట; అంచిత=ఒప్పుచున్న, ఆత్మమయి=స్వరూపముగలదియై; నిత్యంబై=అవ్యయమైనదై; మహేంద్రాదినిర్జరసేవ్యంబయి=ఇంద్రుఁడు మొదలుగాఁగలదేవతలచే సేవింపఁదగినదియై; అజస్రమ్ము=ఎల్లపుడు; ఇష్టదంబయి=కోరఁబడినదానినిచ్చునదియై; భువనేశ్యాఖ్యాసముజ్జృంభియై.—భువనేశ్యాఖ్యా=భువనేశ్వరియను పేరుచేత, సముజ్జృంభియై=అతిశయించినదియై; ఒక్కమంత్రంబు=ఒకమంత్రము; అరిసంభేదన=సుచంద్రుఁడా! ఇలన్=భూమియందు; మించున్=అతిశయించును. చుమ్ము=సత్యము.

ఉ. అమ్మహనీయమంత్రము రసాధిప నీకిపు డిత్తు దానిఁ గై
కొమ్ము త్వదీహితమ్ము లొనగూర్చుఁ బఠించినమాత్రఁ దత్ప్రకా
రమ్ములు సద్గురుప్రవరరమ్యవచోగతిచే నెఱింగి ని
త్యమ్ము జపింపుమీ దినకరాభ్యుదయావసరమ్ములన్ మదిన్. 140

టీ. రసాధిప=సుచంద్రుఁడా! అమ్మహనీయమంత్రము = పూజ్యమగునామంత్రమును; నీకున్; ఇపుడు=ఈసమయమందు; ఇత్తున్=ఒసంగుదును. దానిన్=ఆమంత్రమును; కైకొమ్ము=గ్రహింపుము. త్వదీహితమ్ములు.—త్వత్=నీయొక్క, ఈహితమ్ములు=ఇష్టార్థములను; పఠించినమాత్రన్=చదివినమాత్రముననే; ఒనగూర్చున్=కలుగఁజేయును. తత్ప్రకారమ్ములు.—తత్=ఆమంత్రరాజముయొక్క, ప్రకారమ్ములు=రీతులు; సద్గురుప్రవరరమ్యవచోగతిన్.—సద్గురుప్రవర=సద్గురుశ్రేష్ఠునియొక్క, రమ్య=మనోహరమగు, వచోగతిన్=వాగ్రీతిచే; ఎఱింగి=

తెలిసికొని; మదిన్=మనమునందు; దినకరాభ్యుదయావసరమ్ములన్=సూర్యోదయసమయము లయందు; నిత్యమ్ము=ప్రతిదినమందు; జపింపుమీ=జపము చేయుమా.

నే నుపదేశించుమంత్రమును, సద్గురువులవలన తద్విధిని జక్కఁగఁదెలిసికొని, సూర్యోదయసమయములందుఁ బ్రతిదినమును జక్కఁగ జపింపు మని భావము.

చ. అని భువనేశి యామనుకు♦లాభరణమ్మున కున్నమత్కృప
న్మనుతిలకంబు నిచ్చి నృప♦మౌళి లలిన్ ఘటియించుమ్రొక్కు గై
కొని యలచంద్రికావనితఁ♦గూడి హరిప్రమదాదిలేఖిక
ల్తను భజియింపఁగా నెనసెఁ♦దత్పురరాజము సంతసంబునన్. 141

టీ. అని=ఈప్రకారముపలికి; భువనేశి=భువనేశ్వరి; ఆమనుకులాభరణమ్మునకున్=వైవస్వతమనుకులాభరణమగు నాసుచంద్రునికి; ఉన్నమత్కృపన్.—ఉన్నమత్ = అతిశయించిన ;కృపన్=దయచేత; మనుతిలకంబున్=మంత్రశ్రేష్ఠమును;ఇచ్చి; నృపమౌళి; సుచంద్రుఁడు; లలిన్=ప్రేమచేత; ఘటియించుమ్రొక్కున్=చేయునట్టినమస్కారమును; కైకొని=గ్రహించి; అలచంద్రికావనితన్=ఆచంద్రికను; కూడి=కలిసికొని; హరిప్రమదాదిలేఖికల్=లక్ష్మీదేవిమొదలుగాఁగల దేవాంగనలు; తనున్=తన్ను; భజియింపఁగాన్=సేవింపఁగా; తత్పురరాజము=ఆపట్టణశ్రేష్ఠమును; సంతసంబునన్=కుతూహలముచేత; ఎనసెన్=పొందెను.

చ. అపుడు నిజాత్మలాలసిక♦యంతయుఁ జేకుఱ నాసుచంద్రభూ
మిపతి నిజాప్తబంధునృప♦మిత్రజనంబులు చేరి రా సువ
ర్ణపటహరావ మెచ్చ శిబి♦రస్థలిఁ జేరె నెలంత లెల్ల న
చ్ఛపురతనాలయారతులు♦చక్క నొసంగఁగ నాత్మ నుబ్బుచున్. 142

టీ. సుచంద్రభూపతి=సుచంద్రుఁడు; అపుడు=ఆసమయమందు; నిజాత్మలాలసిక.—నిజ=తనయొక్క, ఆత్మ=మనమునందుండు, లాలసిక=అధికేచ్ఛ; అంతయున్=సర్వము; చేకుఱన్=సమకూరఁగా; నిజాప్తబంధునృపమిత్రజనంబులు.—నిజ=తనసంబంధులగు, ఆప్త=ఇష్టులగు; బంధు=బాంధవులు; నృప=రాజులు, మిత్రజనంబులు = స్నేహితులు; చేరి=సమీపించి; రాన్=రాఁగా; సువర్ణపటహరావము = సువర్ణమయమగు పటహముయొక్కధ్వని; ఎచ్చన్=అతిశయింపఁగా; నెలంతలెల్లన్=వనితలెల్ల; అచ్ఛపురతనాలయారతులు=స్వచ్ఛమగురత్నములహారతులను; చక్కన్=చక్కఁగా; ఒసంగఁగన్=ఇయ్యఁగా; ఆత్మన్=మనమునందు; ఉబ్బుచున్ = ఉబుకుచు; శిబిరస్థలిన్ = పటమండపప్రదేశమును; చేరెన్ = పొందెను.

మ. సకలాంభోనిధిమధ్యదేశవసుధా♦శవాసిత మవ్వేళఁ జం
ద్రిక యామేటి వరించుటల్ గరము ని♦ర్ణిద్రప్రమోదోర్మిదా

ాయకతన్ మించఁ దదీయశోభనదిదృ♦క్షాయత్తచిత్తంబులన్
స్వకరాజచ్ఛిబిరాళిఁ జేరి నిలిచెన్ ♦ సైన్యేశ్వరుల్గొల్వఁగన్. 143

టీ. సకలాంభోనిధిమధ్యదేశవసుధేశవ్రాతము.—సకల=సమస్తమగు, అంభోనిధి=సముద్రములయొక్క, మధ్యదేశ=మధ్యప్రదేశమందున్న, వసుధేశవ్రాతము=రాజులసమూహము; అవ్వేళన్=ఆసమయమందు; చంద్రిక; ఆమేటిన్=ఆసుచంద్రుని; వరించుటల్=కోరుటలు; కరము=మిక్కిలి; నిర్ణిద్రప్రమోదోర్మిదాయకతన్.—నిర్ణిద్ర=మేలుకొన్న, ప్రమోద = సంతసముయొక్క, ఊర్మిదాయకతన్=తరంగములనిచ్చుటచేత; మించన్ = అతిశయింపఁగా; తదీయశోభనదిదృక్షాయత్తచిత్తంబులన్.—తదీయ=చంద్రికాసుచంద్రులసంబంధియగు, శోభన=శుభకరమగు వైవాహికాదులకు, దిదృక్షా = చూచుటయందు, ఆయత్త = అధీనమగు, చిత్తంబులన్=హృదయములచేత; స్వకరాజచ్ఛిబిరాళిన్.—స్వక=తమసంబంధియగు, రాజత్=ప్రకాశించుచున్న, శిబిర=పటమండపములయొక్క, ఆళిన్=పంక్తిని; చేరి=పొంది; సైన్యేశ్వరుల్=సేనాధిపతులు; కొల్వఁగన్=సేవించుచుండఁగా; నిలిచెన్=వసించెను.

మ. జననాథేంద్రు సుచంద్రుఁ జంద్రిక వరిం♦ప న్నేఁడుగా మత్కృతా
తనుపుణ్యంబు ఫలించె నంచు ముద మా♦త్మ న్గాంచి పాంచాలభూ
వనితావల్లభమౌళి వేగ మహిదే♦వశ్రేణి రావించి శో
భనలగ్నం బలరాత్రివేళ ఘటియిం♦పం జేసె నప్పట్టునన్. 144

టీ. పాంచాలభూవనితావల్లభమౌళి=పాంచాలభూపతిశ్రేష్ఠుఁడగు నాత్మణదోదయుఁడు; జననాథేంద్రున్=రాజశ్రేష్ఠుఁడగు;సుచంద్రున్=సుచంద్రుని; చంద్రిక;వరింపన్=కోరఁగా; నేఁడుగా=ఈదినముగదా;మత్కృతాతనుపుణ్యంబు.—మత్=నాచేత,కృత=చేయఁబడిన, అతను=అధికమయిన, పుణ్యంబు=సుకృతము; ఫలించెనంచున్=పండెననుచు; ముదము=సంతసమును; ఆత్మన్=మనమునందు; కాంచి=పొంది; వేగ=శీఘ్రముగ; మహిదేవశ్రేణిన్=బ్రాహ్మణబృందమును; రావించి=రప్పించి; శోభనలగ్నంబు=శుభలగ్నమును; అలరాత్రివేళన్=ఆరాత్రియందె; అప్పట్టునన్=ఆసమయమందు; ఘటియింపన్ = ఏర్పఱచునట్లు; చేసెన్ = ఒనరించెను.

మ. తనుభానారద నారదాదివినుతో♦ద్దామాహవప్రక్రియా
ఘనతాశారద శారదాపకృతజా♦గ్రద్గోపవత్సప్రగో
పనభాసారద సారదానవభిదా♦ప్రాంచద్యశోనిర్జితా
తనుసత్పారద పారదాత్మచరిత♦ధ్వస్తాఖిలాఘోదయా. 145

టీ. తనుభానారద=దేహకాంతిచేత మేఘమువంటివాఁడా! నారదాదివినుతోద్దామాహవప్రక్రియాఘనతాశారద.—నారదాది=నారదుఁడు మొదలుగాఁగలవారిచేత, వినుత=కొని

యాడఁబడిన, ఉద్దామ=మిక్కిలిగొప్పయగు, ఆహవ=యుద్ధముయొక్క, ప్రక్రియా=ప్రసంగమందు, ఘనతా=ఆధిక్యముచేత, శారద=నూతనమైనవాఁడా! "శారదః పీతముద్గే నాప్రత్యగ్రే భినవే త్రిషు" అని రత్నమాల; పనులతో రణము సలుపుతచే నితఁడు అపూర్వముగ వగపడునట్టివాఁ డని తాత్పర్యము; శారదాపకృతజాగ్రద్గోపవత్సప్రగోపనభాసారద.—శారదాప=నలువచేత, కృత=చేయఁబడిన, జాగ్రత్=నిస్తంద్రమగు, గోప = గొల్లలయొక్క, వత్స=దూడలయొక్క, ప్రగోపన=దాఁచుటయొక్క, భా=సామర్థ్యముయొక్క, సార=సారమును, ద=ఖండించినవాఁడా! గోవులను గోపులను దాఁచుటకుఁబూనిన బ్రహ్మకుభంగమ్ముకల్గించినవాఁడనిభావము. సారదానవభిదాప్రాంచద్యశో నిర్జితాతను సత్పారద.—సార=బలిష్ఠులగు, దానవ=రక్కసులయొక్క, భిదా=భేదనమందు, ప్రాంచత్=ఒప్పుచున్న, యశః=కీర్తిచేత, నిర్జిత=జయింపఁబడిన, అతను=అధికమైన, సత్=శ్రేష్ఠమైన, పారద=పాదరసముగలవాఁడా! ఇతనియశము పాదరసముకన్న మిగులఁ దెల్లనై యున్న దని భావము. పారదాత్మచరితధ్వస్తాఖిలాఘోదయా.—పారద=తిరింపఁజేయునట్టి, ఆత్మ=తనయొక్క, చరిత=చరిత్రచేత, ధ్వస్త=పోఁగొట్టఁబడిన, అఖిల=సమస్తమైన, అఘ=పాపములయొక్క, ఉదయా=ఆవిర్భావముగలవాఁడా! ఇతనిచరిత్రలు స్మరించినమాత్రన పాపముల నశింపఁ జేయు నని భావము.

క. శరధీనశరధిఘనభా,స్వరధీవిషయా నిబద్ధ♦శరధీ స్వరధీ
శరమావలంబ శంబర, పరమాకరకరణభరణ♦పరమాభరణా. 146

టీ. శరధీనశరధిఘనభాస్వరధీవిషయా.—శరధీన=సముద్రుఁడై, శరధి = తూణీరము గాఁగలశంకరునియొక్క, ఘన=అధికమగు, భాస్వర=ప్రకాశించుచున్న, ధీ=బుద్ధికి, విషయా=లక్ష్యమైనవాఁడా! అనఁగా శివునకుఁ గేశవుఁడు పత్నీభూతుఁడు గాన ఎల్లప్రుడు శంకరునిచిత్తమందు మెలఁగుచున్నవాఁ డనిభావము. "ఏకాపి శక్తిఃపరమేశ్వరస్య హ్యుపాధిభేదా దభవ చ్చతుర్ధా,భోగేభవానీ సమరేచ దుర్గా కోపేచ కాళీత్వవనేచవిష్ణుః" అను శ్రీభాగవతము ప్రమాణము. శరధీనశరధి=శంకరుఁడే, ఘనభాస్వరధీవిషయా=అధికమై ప్రకాశించుచున్న బుద్ధికివిషయముగాఁ గలవాఁడా! నిబద్ధశరధీ.—నిబద్ధ=కట్టఁబడిన;శరధీ=సముద్రముగలవాఁడా;రామావతారమందు బంధింపఁబడినసముద్రముగలవాఁడని భావము;స్వరధీశరమావలంబ.—స్వరధీశ=ఇంద్రునియొక్క, రమా=సంపదకు, అవలంబ=ఆధారమైనవాఁడ! శంబరపరమాకరకరణభరణ.—శంబరపర=మరునియొక్క, మా=సంపదకు, అనఁగా సౌందర్యమునకనుట, ఆకర=స్థానమగు, కరణ=దేహమును "కరణం సాధకతను క్షేత్రగాత్రేన్ద్రియేష్వపి" అని యమరుఁడు, భరణ=వహించినవాఁడ! అనఁగా మరునికితుల్యమగు చక్కఁదనము గలదేహమ్ము గలవాఁ డని భావము; పరమాభరణా=ఉత్కృష్టమైన యాభరణములుగలవాఁడా!

పంచచామరము. ధరాధరా ధరారిమౌళి♦ధామధామసత్పదా
పరావరా పరాగపూత♦భామ భామహాజ్వల
చ్ఛరాశరాశరాజదస్త్ర♦సార సారభేదనా
దరాదరా దళాన్వితౌఘ♦తార తారకౌస్తుభా. 147

టీ. ధరాధరా=భూమినిధరియించినవాఁడా! ధరారిమౌళిధామధామసత్పదా.—ధరి=ఇంద్రునియొక్క, మౌళి=కిరీటముయొక్క, ధామ=కాంతికి, ధామ=స్థానమగు, సత్పద=మంచిచరణములుగలవాఁడా! పరాపరా=అవిద్యావ్యతిరిక్తుఁడగువాఁడా! పరాగపూతభామ.—పరాగ=చరణరేణువుచేత, పూత=పవిత్రయగు, భామ=అహల్యగలవాఁడా! భామహోజ్జ్వలచ్ఛరాశరాశరాజదస్త్రసార.—భా=కాంతిచేత, మహోజ్జ్వలత్=మిగులవెలుఁగుచున్న, శర=బాణములుగల, ఆశర=రక్కసులను, ఆశ=భక్షించునట్టి, రాజత్=ప్రకాశించుచున్న, అస్త్రసార=అస్త్రబలముగలవాఁడా! సారభేదనా.—సాల=సాలవృక్షములను, ఇచటఁ లశ భేదములేదని తెలియవలయును, భేదనా=భేదించినవాఁడా! దరాదరా=పాంచజన్యమశంఖమునందు ఆదరముగలవాఁడా! దరాన్వితౌఘతార.—దరాన్విత=భయముపొందినవారి, తార=తరింపఁజేయువాఁడా! తారకౌస్తుభా=ఉత్తమమయిన కౌస్తుభముగలవాఁడా!

"జరజ్రజజంబులుం గముం బొసంగి తొమ్మిదింటిపై।
విరామ మొంది సత్కవుల్ ప్రవిస్తరంబు సేయఁగాఁ।
బరాత్పరుండు మాధవుండు పంచచామరంబునన్।
బ్రరూఢగుంభనంబులందుఁ బాడ నొప్పు ధాత్రిలోన్"

అని యప్పకవీయమునందుఁ బంచచామరలక్షణము.

గద్యము. ఇది శ్రీమదనగోపాలప్రసాదసమాసాదితోభయభాషాకవిత్వ
కళాకళత్ర రేచెర్లగోత్రపవిత్ర సురభిమల్లక్షమాపాలసత్పుత్త్ర
కవిజనవిధేయ మాధవరాయ ప్రణీతంబైన
చంద్రికాపరిణయంబునందుఁ
బంచమాశ్వాసము.

---

గద్యము. ఇది శ్రీసతీరమణకరుణాసమాసాదితసర్వసౌభాగ్య భాగ్యనగర మహారాజ్యసంకాశ
శ్రీజటప్రోలు సంస్థానప్రాజ్యసకలసామ్రాజ్య శ్రీరేచెర్ల గోత్రపవిత్ర కవిజనగేయ
శ్రీవేంకట జగన్నాథరాయ సత్పుత్త్రి సత్సంప్రదాయ శ్రీసురభి వేంకట
లక్ష్మణరాయ పరిపోష్య సరసవైదుష్య తదాస్థానతలమండిత శేష
సదాశివపండిత విరచిత శరదాగమ సమాఖ్యవ్యాఖ్యయందుఁ
బంచమాశ్వాసము.



శ్రీరస్తు నమః.

శ్రీలక్ష్మీ నరసింహాయనమః.

# చంద్రికాపరిణయము, సవ్యాఖ్యానము.

## షష్ఠాశ్వాసము.



క. శ్రీమజ్జటప్రోలుపురీ, ధామ సుధాధామతిగ్మ◆ధామస్ఫూర్జ
త్కోమలనయనద్వయ యు, ద్దామగుణాభీల శ్రీమ◆దనగోపాలా. 1

టీ. శ్రీమజ్జటప్రోలు పురీధామ.— శ్రీమత్ = సంపద్యుక్తమగు, జటప్రోలుపురీ=జటప్రోలనునగరము, ధామా=నివాసముగాఁగలవాఁడా! సుధాధామతిగ్మధామ స్ఫూర్జత్కోమలనయనద్వయ.—సుధాధామ=చంద్రుఁడును, తిగ్మధామ=సూర్యుఁడును, స్ఫూర్జత్=ప్రకాశించుచున్న, కోమల=సుందరమైన, నయనద్వయ=కనుదోయిగాఁగలవాఁడా! ఉద్దామ గుణాభీల.—ఉద్దామ=ప్రౌఢమైన, గుణ=శౌర్యాదిగుణములచే, ఆభీల=భయంకరుఁడైనవాఁడా! శ్రీమదనగోపాలా = లక్ష్మీయుక్తుఁడగు మదనగోపాలస్వామీ! ఈపద్యమున కుత్తరపద్యస్థక్రియతో నన్వయము.

తే. చిత్తగింపుము శౌనకా◆ద్యుత్తమర్షి
సమితి కిట్లను రోమహా◆ర్షణతనూజుఁ
డలనృపతి రేయి శుభలగ్న ◆ మనువుపఱిచి
పురము గయిసేయ శిల్పినో◆త్కరముఁ బనుప. 2

టీ. చిత్తగింపుము=అవధరింపుము. శౌనకాద్యుత్తమర్షిసమితికిన్ = శౌనకుఁడు మొదలుగాఁగల శ్రేష్ఠమునిసంఘమునకు; రోమహర్షణతనూజుఁడు=సూతుఁడు; ఇట్లు=వక్ష్యమాణప్రకారముగా; అనున్=పలికెను; అలనృపతి=ఆక్షణదోదయుఁడు, రేయి=రాత్రియందు; శుభలగ్నము=శుభముహూర్తమును; అనువుపఱిచి=అనుకూలింపఁజేసి; పురము=నగరమును; కయిసేయన్=అలంకరించుటకు; శిల్పినోత్కరమున్=శిల్పిసమూహమును; పనుపన్=ఆజ్ఞాపింపఁగా. ఉత్తరపద్యముతో నన్వయము.

అనఁగా క్షణదోదయుఁడారాత్రియందు శుభలగ్నము నిర్ణయించి పుర మలంకరింప శిల్పుల కాజ్ఞాపించెనని తాత్పర్యము.

సీ. చంద్రవితానముల్ ◆ చక్కఁగాఁ దార్చి రా
స్థానాజిరముల సౌ◆ధవ్రజముల

రామాకృతిశ్రేణిఁ ♦ బ్రబలఁ జిత్రించిరి
కురుఁజుల నవమణి♦కుడ్యతటుల
హరిణకేతుచయంబు ♦ వరుసఁ బొందించిరి
సాలాగ్రముల గృహ♦స్తంభతతులఁ
దోడ్తో నమేరు ల♦ద్భుతముగా నిల్పిరి
రాజవీథికల ద్వా♦రప్రతతులఁ

తే. విలసితచ్ఛదగుచ్ఛమం♦డలముఁ బూన్చి
రంగడులఁ దోరణస్రగ్ల♦తాంతరముల
నప్పురంబున సకలదే♦శాధిరాజ
శేఖరులు మెచ్చ నవ్వేళ ♦ శిల్పివరులు. 3

టీ. అప్పురంబునన్ = ఆపురమందు; సకలదేశాధిరాజశేఖరులు = సమస్తదేశప్రభువులు; మెచ్చన్=మెచ్చునటులు; అవ్వేళన్ = ఆసమయమందు; శిల్పివరులు = చిత్రరువ్రాయువారు. చంద్రవితానముల్.—చంద్ర=కర్పూరముయొక్క, వితానముల్=సమూహములను; చంద్ర=బంగరుయొక్క, వితానముల్=మేలుకట్లను; వరుసన్=క్రమముగా; ఆస్థానాజిరములన్=రాజసభలయొక్క చత్వరములయందును; సౌధవ్రజములన్=మేడలగుంపులయందును; చక్కఁగాన్=సుందరముగా; తార్చిరి = పొందించిరి. రామాకృతిశ్రేణిన్.—రామాకృతి=స్త్రీప్రతిమలయొక్క, శ్రేణిన్=బంతిని, రామాకృతి=శ్రీరామప్రతిమలయొక్క శ్రేణిని; కురుఁజాలన్=దూలములమీఁది గుజ్జులయందును; నవమణికుడ్యతటులన్=నూతనమగు రత్నాలగోడలయందును; ప్రబలన్=అతిశయించునటులు; చిత్రించిరి=వ్రాసిరి. హరిణకేతుచయంబు.—చంద్రసమూహమును, తెల్లనిటెక్కెములను; వరుసన్ = క్రమముగా; సాలాగ్రములన్.—సాల=ప్రాకారములయొక్క, అగ్రములన్ = అగ్రభాగములయందును; గృహస్తంభతతులన్.—గృహ=సదనములయొక్క, స్తంభతతులన్=కంబములగుంపులయందును; పొందించిరి. తోడ్తోన్=వెంటనె; నమేరులు=సురపొన్నలను; తోడ్తోన, మేరువులుఅనియు విభాగము, మేరులు, మేరులు = శిఖరమణులను; వరుసన్ = క్రమముగ; రాజవీథికలన్ = రాజమార్గములయందును; ద్వారప్రతతులన్ = ద్వారములయొక్క సమూహములయందును; అద్భుతముగాన్=వింతగా; నిల్పిరి=ఉంచిరి. విలసితచ్ఛదగుచ్ఛములు.—విలసిత=ప్రకాశించుచున్న, ఛద=వస్త్రములయొక్క, గుచ్ఛ=గుత్తులయొక్క, మండలము=సమూహమును; ఛద=పర్ణములయొక్క, గుచ్ఛములయొక్క, మండలమును; వరుసన్=క్రమముగా; అంగడులన్ = మళిగలయందు; తోరణస్రగ్లతాంతరములన్.—తోరణ = బహిర్ద్వారముయొక్క, స్రగ్లతా=తీవలవంటిదండలయొక్క, అంతరములన్=మధ్యప్రదేశములయందు; పూన్చిరి=ఉంచిరి.

అనఁగా నాస్థానాజిరములయందు రంగవల్లిరూపముగా కర్పూరచూర్ణమును సౌధములయందు బంగరుమేలుకట్లను ఉంచి రనియు కురుఁజాలయందుఁ గుడ్యములయందు

స్త్రీప్రతిమలను దాశరథిప్రతిమలను క్రమముగ వ్రాసిరనియు కోటగోడలయందును కంబము లయందును చంద్రబింబములను తెల్లని టెక్కెములను క్రమముగ నుంచిరనియు రాజవీథు లయందు సురపొన్నలను ద్వారములయందు మేకపులను నుంచిరనియు మళిగలయందు వస్త్ర ములను తోరణములయందు పర్ణగుచ్ఛములను కట్టిరనియుఁ జూపఱెల్ల మెచ్చునట్లు అలం కరించిరనియు భావము.

మ. అలఘుస్వర్ణసుచేలకాప్తి ఘనము♦క్తాళీసమాసక్తిను
జ్జ్వలపద్మోద్ధృతి వైజయంత్యభియుతిన్ ♦ సంధించి యప్పట్టునన్
బలునేర్పుల్మనశిల్పిరాజి ఘటియిం♦పం బొల్చె నెంతేఁ గురుం
జులచా లచ్యుతరూపవైభవమునన్ ♦ సొంపొంది తద్వీథులన్. 4

టీ. అప్పట్టునన్=ఆకాలమునందు; తద్వీథులన్ = ఆనగరవీథులయందు; కురుంజుల చాలు=గుజ్జులబంతి; శిల్పిరాజి=చిత్తరువువ్రాయువారియొక్క శ్రేణి; అలఘుస్వర్ణసుచేలకా ప్తిన్.—అలఘు=అధికములగు, స్వర్ణ=బంగరుయొక్క, సుచేలక=సమీచీనమగు వలిపెముల యొక్క, ఆప్తిన్=ప్రాప్తిచేత; పీతాంబరముయొక్కయని విష్ణుపరమైనయర్థము; ఘనముక్తా ళీసమాసక్తిన్.—ఘన=గొప్పవయిన, ముక్తా=ముత్యములయొక్క, ఆళీ = శ్రేణియొక్క, స మాసక్తిన్=సంబంధముచేతను; గొప్పవారలగు ముక్తులయొక్క సమూహముయొక్క, సమాస క్తిన్=సంబంధముచేతను; ఉజ్జ్వలపద్మోద్ధృతిన్.—ఉజ్జ్వలపద్మా = శృంగారలక్ష్మియొక్క, ఉద్ధృతిన్=ధారణముచేతను, ప్రసిద్ధశ్రీదేవిధారణముచేతనని విష్ణుపరమైనయర్థము; వైజయం త్యభియుతిన్.—వైజయంతీ=టెక్కెములయొక్క, అభియుతిన్ = సంబంధముచేతను; వైజ యంతీ=వనమాలయొక్క, యభియుతిచేతనని విష్ణుపరమైనయర్థము; సంధించి=కలిగించి; పలునేర్పుల్=పలువిధమైన జాణతనములు; మనన్=అతిశయిల్లునట్లు; ఘటియింపన్=నిర్మిం పఁగా; అచ్యుతరూపవైభవమునన్.—అచ్యుత = నాశములేని, రూప = శుక్లాదిరూపముల యొక్క, వైభవమునన్=అతిశయముచేత; అచ్యుతరూప=విష్ణుమూర్తిస్వరూపముయొక్కయని యర్థాంతరము; సొంపొంది=చెలువమునుబొంది; ఎంతేన్=మిక్కిలి; పొల్చెన్=ప్రకాశించెను.

అనఁగా నీకురుఁజులచాలు స్వర్ణసుచేలకాదులచే నచ్యుతునిరూప వైభవము నంది విలసిల్లెనని భావము.

చ. సరససుధాప్లుతంబు లగు♦చక్కనిగోడల శిల్పిరాజి భా
స్వరకనకద్రవప్రతతి ♦ వ్రాసినచిత్రపుబొమ్మ లొప్పెఁ ద
త్పరిణయరీతిఁ గాంచ వడిఁ ♦ బౌటులఁ జేరి వధూటికాసము
త్కరశుభగీతిఁ జొక్కి సుర♦కాంతలు నైశ్చలి నిల్చిరో యనన్. 5

టీ. శిల్పిరాజి=శిల్పకారసమూహము; సరససుధాప్లుతంబులు.—సరస = శ్రేష్ఠమైన, సు ధా=సున్నముచేత, ఆప్లుతంబులు=తడుపఁబడినవి; అగుచక్కనిగోడలన్ = అయినట్టిసుందర

ములగు కుడ్యములయందు; భాస్వరకనకద్రవప్రతతిన్.—భాస్వర=ప్రకాశించుచున్న, కనకద్రవ=బంగరునీరుయొక్క, ప్రతతిన్ = సమూహముచే; వ్రాసినచిత్రపుబొమ్మలు = లిఖియించిన విచిత్రములగు బొమ్మలు; తత్పరిణయరీతిన్.—తత్ = ఆచంద్రికాసుచంద్రులయొక్క, పరిణయరీతిన్=వివాహభంగిని; కాంచన్=చూచుటకు; వడిన్=వేగముచేత; పాటులన్=శ్రమములచే; చేరి=వచ్చి; వధూటికాసముత్కర శుభగీతిన్.—వధూటికా = స్త్రీలయొక్క, సముత్కర=సమూహముయొక్క, శుభగీతిన్=మంగళకరమగు గానముచేత; చొక్కి=పరవశతనొంది; సురకాంతలు=దేవాంగనలు; నైశ్చలిన్=నిశ్చలత్వముచేత; నిల్చిరోయనన్=నిలుచుండిరోయనునటులు; ఒప్పెన్=ప్రకాశించెను.

అనఁగా సున్నముఁ బూసి యున్నగోడలయందుఁ జిత్తరువు వ్రాయువారు బంగరునీటితో వ్రాసినబొమ్మలు, ఆవివాహమహోత్సవంబును జూచుటకై యతివేగముతోఁ జేరుటచే శ్రమనొంది గానముచేఁ జొక్కి నిలిచియున్న దేవాంగనలో యనునటులు ప్రకాశించె నని భావము. చిత్తరువునం దుండుబొమ్మల సురకాంతలనుగా నుత్ప్రేక్షించుటచే నుత్ప్రేక్షాలంకారము.

మ. తళుకుం బంగరుకుచ్చుడాలు నవసం•ధ్య న్నీలగుచ్ఛప్రభా
వళి యిర్లన్ సుమదామదీధితి యుడు•వ్రాతంబుల న్వజ్రకుం
భలసచ్ఛాయ సితాంశుకీప్తి నిగిడిం•ప న్శిల్పికు ల్దార్చుమే
రులు ధాత్రిం గన నద్భుతంబె క్షణదా•రూఢి న్విజృంభించుటల్. 6

టీ. శిల్పికులు=శిల్పులు; తార్చుమేరులు.—తార్చు=కదియించునట్టి, మేరులు=ద్వారముల మీఁదనుండుకలశములు; ధాత్రిన్ = భూమియందు; కనన్ = చూడఁగా; తళుకుంబంగరుకుచ్చుడాలు = ప్రకాశించుచున్న బంగరుగుత్తులకాంతి; నవసంధ్యన్.—నవ=నూతనమగు, సంధ్యన్=సంజను; నీలగుచ్ఛప్రభావళి.—నీల=ఇంద్రనీలమణులయొక్క, గుచ్ఛ=స్తబకముల యొక్క, ప్రభావళి=కాంతిశ్రేణి; ఇర్లన్=చీఁకటులను; సుమదామదీధితి=పూసరములయొక్క కాంతి; ఉడువ్రాతంబులన్=చుక్కలగుంపులను; వజ్రకుంభలసచ్ఛాయ.—వజ్రకుంభ=రవలకుండలయొక్క, లసచ్ఛాయ = ప్రకాశించుకాంతి; సితాంశుకీప్తిన్=చంద్రకాంతిని, వెన్నెల ననుట; నిగిడింపన్ = విజృంభింపఁజేయఁగా; క్షణదారూఢిన్.—క్షణ=ఉత్సవములను, ద=ఇచ్చునట్టి, ఆరూఢిన్=రూఢిచేత; రాత్రియొక్క రూఢిచేత నని దోఁచుచున్నది; విజృంభించుటల్=అతిశయించుటలు; అద్భుతంబె=ఆశ్చర్యమా? కాదనుట.

అనఁగా బంగరుగుచ్ఛములయొక్క ఎఱ్ఱనికాంతి సంధ్యాకాలమును జేయఁగా ఇంద్రనీలమణికాంతి తిమిరకదంబమును జేయుచుండఁగా పూదండలకాంతి నక్షత్రపుంజములను జేయుచుండఁగా వజ్రకుంభకాంతి వెన్నెలను జేయుచుండఁగా నీశిల్పులు రచియించిన మేరులు క్షణదారూఢిచే విజృంభించుట చిత్రము గా దని తాత్పర్యము.

చ. కువలయరాజచక్రములకుం ♦ బెనువేడుక సంఘటించుకాం
తివితతి మించ శిల్పికులు ♦ దీర్చిననూతనచంద్రసూర్యకో
టి వెలిఁగె ధూపకైతవప♦టిష్ఠతమస్తతి గాంచి యోర్వ మిం
చవనికిఁ జేరు నైకవపు♦రాత్తతమీశదినేశులో యనన్. 7

టీ. కువలయరాజచక్రములకున్.—కువలయ = భూవలయమందుండు, రాజచక్రములకున్=నృపసంఘములకు; కువలయ=కలువలకు, రాజ=ఒప్పుచున్న, చక్రములకున్ = చక్రవాకములకు; పెనువేడుకన్=మిక్కిలిసంతసమును; సంఘటించుకాంతివితతిన్.—సంఘటించు=ఘటిల్లఁజేయునట్టి, కాంతివితతిన్=కాంతిపుంజముచేత; మించన్=అతిశయించునట్లు; శిల్పికులు=శిల్పకారులు; తీర్చిననూతనచంద్రసూర్యకోటి.—తీర్చిన=దిద్దిన, నూతన=నవీనమైన, చంద్రసూర్య=చంద్రసూర్యులయొక్క, కోటి=సమూహము; ధూపకైతవపటిష్ఠతమస్తతిన్.—ధూప=అగరుధూపమనెడు, కైతవ=వ్యాజముగల, పటిష్ఠ = అధికమైన, తమస్తతిన్ = చీఁకటిగుంపును; కాంచి=చూచి; ఓర్వమించుచున్=సహింపమనుచు; అవనిన్=భూమికి; చేరునైకవపురాత్తతమీశదినేశులోయనన్.—చేరు=సమీపించిన, నైకవపుః=అనేకశరీరములను, ఇచట నశబ్దముతోసమాసము అని తెలియవలెను, ఆత్త=పొందిన, తమీశదినేశులోయనన్=సూర్యచంద్రులోయనునట్లు; వెలిఁగెన్=ప్రకాశించెను.

శిల్పకారులు చిత్తరువందువ్రాసిన చంద్రసూర్యులు, ఈపురమందు అగరుధూపమనెడి గాఢాంధకారమును చూచి సహింపక పుడమిఁ జేరునట్టి ప్రసిద్ధచంద్రసూర్యులో యనునట్లు ప్రకాశించిరని భావము. చిత్రగతచంద్రసూర్యబింబములను ప్రసిద్ధచంద్రసూర్యులనుగాను ప్రేక్షించుటచే నుత్ప్రేక్షాలంకారము.

చ. ధరణిజనంబు మెచ్చఁగ ము♦దంబున శిల్పికులంబు చిత్రవై
ఖరిఁ గయిసేయ నప్డలరెఁ ♦ గన్గొన నంచితవైజయంతయై
పరిభృతచిత్రరేఖయయి ♦ భవ్యమహాసుమనోవితానభా
స్వరయయి దృశ్యరంభయయి ♦ చక్కఁగ నప్పురి వేల్పువీ డనన్. 8

టీ. ధరణిన్=భూమియందు; జనంబు=లోకము; మెచ్చఁగన్ = పొగడునటులు; ముదంబునన్=సంతసముచేత; శిల్పికులంబు=శిల్పకారబృందము; చిత్రవైఖరిన్=విచిత్రరీతిగా; కయిసేయన్=అలంకరింపఁగా; అప్డు=ఆసమయమందు; అప్పురి=ఆపట్టణము; అంచితవైజయంతయై.—అంచిత = ఒప్పుచున్న, వైజయంతయై = ఇంద్రునిమేడగలదై; ధ్వజములుగలదై యనిస్వభావార్థము; పరిభృతచిత్రరేఖయయి = భరింపఁబడినచిత్రరేఖయను దేవాంగనగలదియై, విచిత్రమగు గీఁతలు గలదియై యని స్వభావార్థము; భవ్యమహాసుమనోవితానభాస్వరయయి.—భవ్య=మనోజ్ఞమగు, మహాత్ = అధికమగు, సుమనోవితాన = దేవసంఘముచేత,

భాస్వరయయి=ప్రకాశించినదియై ; సుమనోవితాన = పుష్పసమూహము చేతఁగాని, లేదా, విద్వద్బృందము చేతఁగాని, యనిస్వభావార్థము ; దృశ్యరంభయయి.—దృశ్య = కనఁబడుచున్న, రంభయయి=రంభయను దేవాంగనగలదియై, అనఁటులుగలదియై యనిస్వభావార్థము; చక్కఁగన్=బాగుగా; వేల్పువీడనన్=స్వర్గమాయనునటులు; అలరెన్=ప్రకాశించెను.

శిల్పు లలంకరింపఁగా నీపురము వైజయంతచిత్రరేఖాదులతోఁ గూడియున్నందున నమరావతి యనునట్లు ప్రకాశించె నని భావము.

మ. ప్రసవస్రక్పరివీతయై పరికన•త్పాటీరకాశ్మీరగం
ధసముల్లిప్తపయోధరాధ్వయయి నూ•త్నస్వర్ణచేలాప్తయై
పొసఁగెం దన్నగరీలలామ యపు డొ•ప్పల్మిఁ దన్గాంచుమా
త్ర సముత్థాతనుసంభ్రమస్ఫురణ గో•త్రాలోకము ల్దోఁపఁగన్. 9

టీ. ప్రసవస్రక్పరివీతయై.—ప్రసవస్రక్=పుష్పమాలికల చేత, పరివీతయై=చుట్టఁబడినదియై ; పరికనత్పాటీరకాశ్మీరగంధసముల్లిప్తపయోధరాధ్వయయి.—పరికనత్ = ప్రకాశించుచున్న, పాటీర=చందనముయొక్క, కాశ్మీర=కుంకుమముయొక్క, గంధ=పరిమళము చేత, సముల్లిప్త=పూయఁబడిన, పయోధరాధ్వయయి = ఆకాశముగలదియై, స్తనమార్గముగలదియై యనియర్థాంతరము;నూత్నస్వర్ణచేలాప్తయై.—నూత్న=నవీనమైన,స్వర్ణచేల=బంగరువస్త్రమును, ఆప్తయై=కూడినదియై; తన్నగరీలలామ=ఆపురవరము, ఇందు స్త్రీత్వనిర్దేశము చేత నొకస్త్రీయని దోఁచుచున్నది; అపుడు=ఆసమయమందు; ఒప్పల్మిఁ అన్=ఒప్పిదములుమీఱునటులు;తన్గాంచుమాత్రన్ = తన్నుఁజూచినంతమాత్రముననె ; సముత్థాతనుసంభ్రమస్ఫురణన్.—సముత్థ=ఉదయించిన, అతను=అధికమైన, సంభ్రమ=సంతోషముయొక్క, స్ఫురణన్=ఆవిర్భావము చేత; అతను = మన్మథునియొక్క, సంభ్రమ = వేగముయొక్క, స్ఫురణ చేతననిదోఁచుచున్నది; గోత్రాలోకముల్ = భూమియందలిజనులు; తోఁపఁగన్ = తోఁచుచుండఁగా; పొసఁగెన్= ఒప్పెను.

అనఁగా నాగరీలలామ హారములచేఁ జుట్టఁబడిన దనియు పాటీరకాశ్మీరాదిపరిమళద్రవ్యములయొక్క గంధముచేఁ బూయఁబడినగగనమార్గము గల దనియుఁ దన్నుఁ జూచినమాత్రమున అధికసంభ్రమమును జేయుచున్న దనియు భావము. పాటీరాదులచేఁబూయఁబడిన స్తనమార్గముగలది యనియు మన్మథసంభ్రమమును జేయుచున్న దనియు స్త్రీపరమైనయర్థమందు భావము.

చ. తొడిఁబడి దిక్ప్రతీరములఁ • దూల్చుచు నద్రిబిలాంతరంబులన్
సుడిగొనుచున్ ధరిత్రిఁ గల•చోటుల ముంచుచు నభ్రపద్ధతిం
దొడరి తరంగితం బగుచు • దుస్తరవర్తనమై మొలంగె న
ప్డు పురి భద్రవాద్యకుల•భూరిరవౌఘము చిత్రవైఖరిన్. 10

టీ. అప్పుడు=ఆసమయమందు ; పురిన్ = నగరమందు; భద్రవాద్యకులభూరిరవౌఘము.—భద్రవాద్య=మంగళవాద్యములయొక్క, కుల = సమూహముయొక్క, భూరి=అధికమైన, రవౌఘము=ధ్వనిప్రవాహము; తోడ్తోఁబడి=తొట్రుబడి; దిక్ప్రతీరములన్ = దిక్తటములను; తూల్చుచున్=తూలఁజేయుచు ; అద్రిగుహాంతరంబులన్ = పర్వతగుహామధ్యప్రదేశములయందు; సుడిగొనుచున్=తిరుగుడుపడుచు; ధరిత్రిఁగలచోటులన్=భూమియందుఁగల ప్రదేశములను; ముంచుచున్ = మునుఁగఁజేయుచు; అభ్రపద్ధతిన్ = ఆకాశమార్గమునందు; తోడరి=పూని; తరంగితంబగుచున్ = సంజాతతరంగములుగలదై; దుస్తరవర్తనమై = దాఁటనలవిగానివ్యాపారముగలదయి; చిత్రవైఖరిన్=విచిత్రరీతిగా; మెలంగెన్=వర్తించెను.

అనఁగా భద్రవాద్యధ్వనులయొక్క సమూహములు దిక్తటములను భేదించుచుఁ బర్వతగుహామధ్యప్రదేశములయందు సుడివడుచు పుడమి నెల్లఁ గప్పుకొని మిన్నంటి ప్రకాశించె నని వాద్యధ్వనుల పరమైనభావము. దిగంతములవఱకువ్యాపించి పర్వతగుహాలను జలములచే నించుచు నావర్తములను గ్రహించుచు భూప్రదేశముల నించుచు తరంగములు గలదై జలప్రవాహమొప్పె నని ప్రవాహపరమైన భావము. ప్రకృతాప్రకృతార్థముల కౌపమ్యము గమ్యము.

మ. అనఘంబై సుమనోనికాయసముదా♦రామోదసంవర్ధకం
బునునై శోభితనైకరాగయుతమై ♦ ప్రోద్యత్సువర్ణాఢ్యమై
ఘనమధ్వభ్యుదయంబు దెల్పు గిరిజా♦కల్యాణ మప్పట్టునన్
వినతాంగనికరంబు పాడెఁ గలకం♦ఠీకంఠనాదోపమన్. 11

టీ. అనఘంబై=శ్లాఘ్యమై; రమ్యమై యని ఆమనిపరమైనయర్థము; సుమనోనికాయసముదారామోదసంవర్ధకంబునునై.—సుమనోనికాయ=విద్వద్బృందముయొక్క, సముదార=ఉత్కృష్టమగు, ఆమోద=సంతసమునకు, సంవర్ధకంబునునై = వృద్ధికరమైనదై; సుమనోనికాయ=పుష్పసంఘముయొక్క, సముదారమగు, ఆమోద=పరిమళమునకు, సంవర్ధకంబునునై యని యామని పరమైనయర్థము; శోభితనైకరాగయుతమై.—శోభిత=ప్రకాశింపఁజేయఁబడిన, నైక=అనేకములగు, ఇచటనశబ్దముతో సమాస మని యెఱుంగునది, రాగ=భైరవితోడిమొదలైనరాగములతో, యుతమై=కూడినదయి; నైకములైన, రాగ=పల్లవాద్యారుణ్యములతో, యుతమై యని యామని పరమైనయర్థము; ప్రోద్యత్సువర్ణాఢ్యమై.—ప్రోద్యత్=ప్రకాశించుచున్న, సువర్ణ=శ్రేష్ఠములగు తానవర్ణచౌకవర్ణాదులచే, ఆఢ్యమై=ఒప్పినదయి; సువర్ణ=సంపెఁగపూలచేత, ఆఢ్యమైయని ఆమనిపరమైనయర్థము; ఘనమధ్వభ్యుదయంబుదెల్పుగిరిజాకల్యాణము.—ఘన=అధికమగు, మధు = మాధుర్యముయొక్క, అభ్యుదయంబు = సమృద్ధిని, తెల్పు=దెలియఁజేయుచున్న, గిరిజాకల్యాణము=గౌరీకల్యాణము; ఘనమగు, మధు=ఆమనియొక్క, అభ్యుదయంబుదెల్పుగిరిజాకల్యాణమనియామనిపరమైనయర్థము; అప్పట్టునన్=ఆస్థలమందు; వినతాంగనికరంబు= స్త్రీకదంబము, కలకంఠీకంఠనాదోపమన్.—కలకంఠీ=కోయిలలయొక్క, కంఠనాద=కంఠధ్వనితో, ఉపమన్=సామ్యముచేత; పాడెన్=పాడెను.

అనఁగా నపస్వరాదిదోషములు లేక విద్వాంసులకు నానందజనకముగ ననేకవిధములగురాగములతోను ననేకవర్ణాదులతోనుం గూడి మధురమగుగౌరికల్యాణమును స్త్రీలుపాడిరని భావము.

ఉ. ఆయెడ గౌరిపంపున సు♦రాంబుజనేత్ర లఖండ హార్దధా
రాయతి వెల్లి మీఱఁ దల♦యంటఁగ మజ్జన మాచరింపఁ గై
సేయఁగఁ జంద్రికావనితఁ♦జేరిరి నవ్యఫలాక్షతాదికం
బాయతహేమపాత్రనిచ♦యంబులఁ బూని రయంబు మీఱఁగన్. 12

టీ. ఆయెడన్=ఆసమయమందు; గౌరిపంపునన్=పార్వతీదేవియొక్కయాజ్ఞచేతను; సురాంబుజనేత్రలు = దేవాంగనలు; అఖండహార్దధారాయతి.—అఖండ = ఎడతెగని; హార్దధారా=ప్రేమధారయొక్క, ఆయతి=అతిశయము; వెల్లిమీఱన్ = మేరమీఱఁగా; తలయంటన్=తలయంటుటకు; మజ్జనమాచరింపన్ = స్నానముఁజేయించుటకును; కైసేయఁగన్=అలంకరించుటకును; ఆయతహేమపాత్రనిచయంబులన్.—ఆయత = విశాలమగు, హేమపాత్ర=సువర్ణపాత్రలయొక్క, నిచయంబులన్ = సమూహములయందు; నవ్యఫలాక్షతాదికంబు.—నవ్య=నూతనమగు, ఫల=పండ్లు, అక్షత=అక్షతలు, ఆదికంబు = మొదలుగాఁగలవానిని; పూని=గ్రహించి; చంద్రికావనితన్=చంద్రికను; చేరిరి=పొందిరి.

పార్వతీదేవియానతిచేఁ గొందఱు దేవాంగనలు బంగరుపాత్రలయందు ఫలాక్షత లుంచుకొని తలయంటుటకును స్నానముఁ జేయించుటకును అలంకరించుటకును చంద్రికను జేరిరని భావము.

శా. ఆనారీమణు లంత శోభనవిత♦ర్ద్యగ్రస్థలిన్ సూత్కృతర
త్నానీకం బగుపెండ్లిపీఁట నిడి యం♦దాభూపకన్యామణి
న్వ్యానమ్రాననచంద్ర నుంచి శిర సం♦టం జేరి రింపెచ్చ శో
భానే శోభనమే యటంచు విబుధా♦బ్జాతాననల్ పాడఁగన్. 13

టీ. అంతన్=అంతట; ఆనారీమణులు = ఆ స్త్రీలు; శోభనవితర్ద్యగ్రస్థలిన్.—శోభనవితర్ది=మంగళకరమగువివాహవేదికయొక్క, అగ్రస్థలిన్ = పైభాగమందు; సూత్కృతరత్నానీకంబు= చెక్కఁబడినరత్నసమూహములుగలది; అగుపెండ్లిపీఁటన్ = అగునట్టిపెండ్లిపీఁటను; ఇడి=ఉంచి; అందున్ = దానియందు; వ్యానమ్రాననచంద్రన్.—వ్యానమ్ర = వంగిన, ఆనన చంద్రన్=ముఖచంద్రుఁడుఁగల; ఆభూపకన్యామణిన్=ఆచంద్రికను; ఉంచి=కూర్చుండఁబెట్టి; శోభానేశోభనమేయటంచున్=శోభానేశోభనమేయని; విబుధాబ్జాతాననల్=దేవాంగనలు; పాడఁగన్=పాడుచుండఁగా; ఇంపెచ్చఁగన్=సొంపెచ్చఁగా; శిరసంటన్=తలయంటుటకు; చేరిరి=పొందిరి.

అనఁగా నామీఁద సురాంగనలు వివాహవేదికయందుఁ బెండ్లిపీఁటనుంచి దాని యందుఁ జంద్రికను గూర్చుండఁ బెట్టి శోభనపాటలు పాడుచుఁ దలయంట నుద్యమించిరని భావము.

సీ. సొగ సెచ్చ నీధరే•శునిపట్టి తలయంటఁ
దగు నీకళానిధి • దంట యనుచు
నీకంజకర కభి•షేకంబు సవరింప
నీసుమనోదంతి • యెఱుఁగు ననుచు
నలువుగా నీకొమ్మ•నలుఁగు గావింప నీ
సురభిచరిత్ర నే•ర్పరి యటంచు
మహితాళి యివ్వేళ • మసలఁగా నేటికే
యీశ్యామ సేవ కే • వేగు మనుచు
తే. సరసముగ నీగతులఁ బర•స్పరము పలికి
కొనుచు నారార్తికంబు నొ•య్యన నొసంగి
వీడియం బంజలి ఘటించి • వేడ్క మీఱఁ
మదిరలోచన శిర సంటఁ • గదిసి రపుడు. 14

టీ. సొగసెచ్చన్ = అందమతిశయించునటులు ; ఈధరేశునిపట్టితలయంటన్.—ఈధరేశునిపట్టి= ఈక్షణదోదయునికూఁతురగు చంద్రిక యొక్క, తలయంటన్ = తలయంటుటకు ; ఈకలానిధిదంట=విద్యానిధియగునీకాంత; తగున్=ఒప్పును. అనుచున్ = ఈప్రకారముగఁ బలుకుచు; ఇచట నీధరేశునిపట్టి తలయంటన్ = ఈపార్వతితలయంటుటకు; ఈకళానిధి = ఈ చంద్రుఁడు. దంట యనునర్థము దోఁచుచున్నది. ఈకంజకరకున్ =తామరసములవంటిచేతులు గల యీచంద్రికకు; అభిషేకంబు=స్నానమును; సవరింపన్ =అనుకూలపఱచుటకు;ఈసుమనోదంతి= జాజిమొగ్గలవంటిదంతములుగలయీకాంత ; ఎఱుఁగున్ = తెలియును. అనుచున్ = ఈప్రకారముగఁ బలుకుచు;ఇచట, ఈకంజకరకున్ =లక్ష్మీదేవికి,అభిషేకంబు సవరింపన్,ఈసుమనోదంతి=దేవగజము,ఎఱుఁగునను నర్థముదోఁచుచున్నది. నలువుగాన్ =ఒప్పిదముగా; ఈకొమ్మ నలుఁగుగావింపన్ =ఈ చంద్రికకునలుఁగుఁబెట్టుటకు ; ఈసురభిచరిత్ర=ఈపతివ్రత ; నేర్పరి=జాణతనముకలది;అటంచున్ =ఈప్రకారముపలుకుచు;ఈకొమ్మకు నలుఁగు గావింపన్ =ఈశాఖకునలుఁగుఁబెట్టుటకు; ఈసురభిచరిత్ర=వసంతచరితము; నేర్పరియనునర్థముదోఁచుచున్నది. మహితాళి=పూజ్యవగు చెలీ! నీవు; ఇవ్వేళన్ =ఈసమయమందు; మసలఁగాన్ =తడయఁగా; నేటికే=ఎందుకు? తడవుసేయ నేల యనితాత్పర్యము. ఈశ్యామసేవకున్ = ఈచంద్రికసేవకు; ఏగుము=పొమ్ము. అనుచున్ = ఈప్రకారముగాఁబలుకుచు; ఇచట, మహితాళి=మహితమగు తుమ్మెదా! మసలఁగా నేటికే ? నీవు=ఈశ్యామసేవకున్ =ఈప్రేంకణపుతీవసేవకు; ఏగుమనునర్థము.

దోఁచుచున్నది. ఈగతులన్=ఈరీతులచే; సరసముగన్ = రసయుక్తముగునటులు; పరస్పరము=ఒండొరులనుగూర్చి; పలికికొనుచున్=సంభాషించుకొనుచు; ఆరాత్రికంబులు = ఆరతులను; ఒయ్యనన్=తిన్నగా; ఒసంగి=ఇచ్చి; అంజలిన్=దోసిలియందు; వీడియంబు=తాంబూలమును; ఘటించి=ఉంచి; వేడ్కమీఱన్ = వేడుకమించునటులు; మదిరలోచనశిరసంటన్= చంద్రికతలయంటుటకు; అపుడు=ఆసమయమందు; కదిసిరి=దగ్గఱవచ్చిరి.

అనఁగా నీకాంత కలానిధి గాన ధరేశునిపట్టితలయంటుటకుఁ దగు ననియు ఈచంద్రిక కంజకర గాన నీపెకు నభిషేకముఁ జేయ సుమనోదంతి తగు ననియు, ఈకొమ్మకు నలుఁగుఁ బెట్టుటకు సురభిచరిత్ర తగిన దనియు, మహితాళి గాన నిది శ్యామయొక్క సేవకు సరియయిన దనియు నొండొరులు సరసోక్తులు పలుకుచు నారతులిచ్చి యంజలియందు తాంబూలము ఘటించి చంద్రికతలయంటఁ బోయి రని భావము.

చ. కురు లర వీడ దివ్యమణి • కుండలరోచులు గండభాగభా
ఝురముల నోలలాడఁ గుచ • శైలయుగంబున ఘర్మవాఃకణో
త్కరములు గూడ మధ్యమప • థం బసియాడ ముదంబుతోడఁ జా
తురిఁ దగు నొక్కప్రోడ యల • తొయ్యలికిన్ శిర సంటె నూనియన్. 15

టీ. కురులు=ముంగురులు; అరవీడన్=సగముజాఱఁగా; దివ్యమణికుండలరోచులు.—దివ్య=మనోజ్ఞమగు, మణికుండల = మణిమయకుండలములయొక్క, రోచులు=కాంతులు; గండభాగభాఝురములన్.—గండభాగ=గండస్థలములయొక్క, భా=కాంతియనెడు, ఝురములన్=ప్రవాహములయందు; ఓలలాడన్=మునుఁగుచుండఁగా; కుచశైలయుగంబునన్= పర్వతములవంటిపాలిండ్లయొక్క జంటయందు; ఘర్మవాఃకణోత్కరములు=చెమటబిందువుల సమూహములు; కూడన్=చేరఁగా; మధ్యమపథంబు=కౌను; అసియాడన్ = చలింపఁగ; ముదంబుతోడన్=సంతసముచేత; చాతురిన్ = చాతుర్యముచేత; తగునొక్క ప్రోడ=ఒప్పునట్టియొక ప్రౌఢాంగన; తొయ్యలికిన్=చంద్రికకు, నూనియన్=నూనెచేత; శిరసంటెన్=తలయంటెను.

ఉ. భాసురరక్తిమైఁ గలమ • పాళికఁ గుందెన నించి కంకణౌ
ఘాసమనిస్వనాళి వెల • యంగ నయోగ్రము లూని సువ్విసు
వ్వీ సువి సువ్వి లాలి యని • వింతగఁ బాడుచు దంచి పుణ్యగో
త్రాసురకామినుల్ సతిశి • రంబున సుంకులు చల్లి రత్తఱిన్. 16

టీ. అత్తఱిన్=ఆసమయమందు; పుణ్యగోత్రాసురకామినుల్.—పుణ్య=పవిత్రలగు; గోత్రాసురకామినుల్=భూసురకాంతలు; భాసురరక్తిమైన్.—భాసుర=ప్రకాశించు, రక్తిమైన్= అనురాగముచేత; కుందెనన్=కుందెనయందు; కలమపాళికన్=వడ్లను; నించి=పూరించి; కంకణౌఘాసమనిస్వనాళి.—కంకణ=కంకణములయొక్క, ఓఘ=సమూహముయొక్క, అసమ=సాటిలేని; నిస్వన=ధ్వనులయొక్క, ఆళి=సమూహము; వెలయంగన్=ప్రకాశింపఁగా; అయో

గ్రములు=ముసలములను; "అయోగ్రంముసలో స్త్రీస్యాత్" అని యమరుఁడు; ఊని=గ్రహించి; సువ్విసువ్వీసువిసువ్విలాలియని=సువ్వి సువిసువ్విలాలి యని; వింతగన్=చిత్రముగ; పాడుచున్=గానముఁ జేయుచు; దంచి; సతిశిరంబునన్=చంద్రికశిరమునందు; సుంకులు = సుంకువడ్లను; చల్లిరి=ఉంచిరి.

అనఁగాఁ జంద్రికను గూర్చుండఁ బెట్టి బ్రాహ్మణస్త్రీలు కుందెనకు వడ్లునించి దంచి చంద్రిక శిరంబున సుంకులుచెరిగిరని తాత్పర్యము.

క. బాలామణి యపు డొకచెలి, కైలా గొసఁగం దమీశ♦కాంతమయపయ
శ్శాలాంతర మెనసె మరు, త్కాలాహికచాలలామ♦కములు భజింపన్.

టీ. అపుడు=ఆసమయమందు; బాలామణి=చంద్రిక; ఒకచెలి=ఒకసకియ; కైలాగొసఁగన్=హస్తావలంబమునీయఁగా; తమీశకాంతమయపయశ్శాలాంతరము.—తమీశకాంత మయ=చంద్రకాంతమయమగు, పయశ్శాలా=నీళ్లయింటియొక్క, అంతరము = మధ్యమును; మరుత్కాలాహికచాలలామకలు = ఉత్తమదేవాంగనలు; భజింపన్ = సేవించుచుండఁగా; ఎనసెన్=పొందెను.

చ. నెలజిగిభీతి నిర్లు ధర♦ణీధరకందరఁ దజ్జయాప్తికై
బలుతప మూన్చి కైశ్యగతి♦బాగుగఁ బుట్టఁగ జ్యోత్స్నికాదనా
కలనము నేర్ప వాని లలిఁ♦గైకొని మేపుపురాతపోరమా
కల యనఁ బెట్టె గంధ మొక♦కాంత వధూటిశిరోజపాళికన్. 18

టీ. ఇర్లు=చీఁకటులు; నెలజిగిభీతిన్.—నెల=చంద్రునియొక్క, జిగి=కాంతివలన, భీతిన్=భయముచేత; ధరణీధరకందరన్.—ధరణీధర=పర్వతముయొక్క, కందరన్=గుహయందు; తజ్జయాప్తికై.—తత్=చంద్రకాంతియొక్క, జయాప్తికై—జయప్రాప్తికొఱకు; బలుతపము=అధికమగుతపమును; ఊన్చి=చేసి; కైశ్యగతిన్=కేశసమూహరూపముతో; బాగుగన్=ఒప్పిదముగ; పుట్టఁగన్=జన్మింపఁగా; జ్యోత్స్నికాదనాకలనము.—జ్యోత్స్నికా=వెన్నెలయొక్క, అదనా=భక్షణముందలి, ఆకలనము=అలవాటును; నేర్పన్=అభ్యసింపఁజేయుటకై; వానిన్=ఆవెన్నెలలను; లలిన్=ప్రేమతో; కైకొని=గ్రహించి; మేపుపురాతపోరమాకలయనన్—మేపు = భుజింపఁజేయుచున్న, పురాతపోరమా = పూర్వతపోలక్ష్మియొక్క, కలయనన్=కలయనువట్లుగా; ఒకకాంత=ఒకయంగన; వధూటిశిరోజపాళికన్=చంద్రికయొక్క తలవెండ్రుకలసమూహమునందు; గంధము=గంధమును; పెట్టెన్=పెట్టెను.

చీఁకటులు చంద్రకాంతికి భయపడి దాని జయించుటకు పర్వతగుహాలయమందు తపం బొనరించి కైశ్యరూపముగ జన్మింపఁగా వానికా వెన్నెలలను తిన నేర్పుటకై యావెన్నెలలను

చేతఁబట్టి నోటి కిచ్చునట్టి పూర్వజన్మతపోలక్ష్మి నా నొకకాంత చంద్రిక వెంట్రుకలయందు గంధముఁ బూసె నని భావము.

తే. ఘనపయోధరపదవి న◆క్షత్రమాలి
కారుచులు పర్వ శ్యామ యొ◆క్కర్తు చంద్ర
కలశిఁ బూని నవామృత◆మ్ములఁ జకోర
చపలనయనకు వేలార్చె◆ సమ్మదమున. 19

టీ. శ్యామ=యౌవనమధ్యస్థయగు; ఒక్కర్తు=ఒకకాంత; చంద్రకలశిఁబూని= స్వర్ణకలశముదీసికొని; నవామృతమ్ములన్.—నవ=నూతనమగు, అమృతమ్ములన్ = ఉదకములను; ఘనపయోధరపదవిన్.—ఘన=గొప్పలగు, పయోధరపదవిన్ = స్తనప్రదేశమందు; నక్షత్రమాలికారుచులు.—నక్షత్రమాలికా=ఇరువదియేడుముత్తికములుగల సరముయొక్క, రుచులు=కాంతులు; పర్వన్=వ్యాపింపఁగా; చకోరచపలనయనకున్=చంద్రికకు; సమ్మదమునన్=సంతోషముతో; వేలార్చెన్=సమ్మరించెను. ఇచట, శ్యామ=రాత్రి; ఘనమగు, పయోధరపదవిన్=ఆకాశమందు; నక్షత్రమాలికారుచులు=ఉడుపంక్తికాంతులు; పర్వన్=వ్యాపింపఁగా; చంద్రకలశిన్=చంద్రుఁడనుకలశమును; పూని = గ్రహించి; నవమైన, అమృతమ్ములన్ = సుధలను; వేలార్చె ననువర్థముస్ఫురించుచున్నది.

అనఁగా నొకకాంత సువర్ణకలశోదకముతో జంద్రికను స్నానముఁ జేయించె నని భావము. రాత్రి చంద్రకిరణామృతములచే చకోరములను తృప్తిపఱిచెనని యర్థాంతరమునకు భావము.

మ. కనకాంగీజన మారతు ల్పొనరుపం◆ గంజద్విషత్కాంత మ
జ్జనశాలాకలశాంబుధి న్వెడలి తే◆జం బెచ్చ నాపద్మపా
ణి నవీనచ్ఛదమండలీవృతి సము◆న్నిద్రాళి గేయాభిపూ
ర్తిని జూపట్టెడు పుష్కరాఖ్యగలవే◆దిం బొల్చె నప్పట్టునన్. 20

టీ. కనకాంగీజనము=స్త్రీజనము; ఆరతుల్ = ఆరతులను; పొనరుపన్ = ఈయఁగా; కంజద్విషత్కాంతమజ్జనశాలాకలశాంబుధిన్.—కంజద్విషత్కాంత మజ్జనశాలా = చంద్రకాంతమణులుగల స్నానాలయమనెడి, కలశాంబుధిన్ = పాలకడలినుండి; వెడలి=బయలుదేఱి; తేజంబు=కాంతి; ఎచ్చన్=అతిశయింపఁగా; ఆపద్మపాణి=కమలములవంటిహస్తములుగల చంద్రిక; నవీనచ్ఛదమండలీవృతిన్.—నవీన = నూతనమగు, ఛద = వస్త్రములయొక్క, మండలీ=సమూహముయొక్క, వృతిన్=ధారణముచేతను; సమున్నిద్రాళిగేయాభిపూర్తిని.—సమున్నిద్ర=విజృంభించుచున్న, ఆళి=చెలియలయొక్క, గేయ=గానముయొక్క, అభిపూర్తిని=పరిపూర్తిచేత; చూపట్టెడు పుష్కరాఖ్యగలవేదిన్.—చూపట్టెడు = కాన్పించుచున్న,

పుష్కరాఖ్యగలవేదిన్=పద్మాకృతులుగలరంగవల్లి యొక్క ప్రసిద్ధిగలవివాహవేదికయందు, "అలంకృతా స్వస్తికపద్మశఙ్ఖైః" యను వసిష్ఠవచనము, రంగవల్లితో పద్మశంఖాకృతులు చేసి వివాహవేదిక నలంకరించుటకుఁ బ్రమాణము; అప్పట్టునన్=ఆసమయమందు; పాల్చెన్=ఒప్పెను. ఇచట, పద్మపాణి=లక్ష్మీదేవి; కలశాంబుధిన్=పాలకడలినుండి; వెడలి=బయిలుదేఱి; నవీనచ్ఛదమండలీవృతి సమున్నిద్రాళిగేయాభిపూర్తిని.—నవీన=నూతనమైన, ఛద=దళముల యొక్క, మండలీ=సమూహముయొక్క, వృతిన్=ఆవరణముచేత, సమున్నిద్ర=జాగరూకములగు, అళి=తుమ్మెదలయొక్క, గేయ=గానముయొక్క, అభిపూర్తిని=పరిపూర్తిని; చూపట్టెడు పుష్కరాఖ్యగల=కాన్పించెడి పద్మమను పేరుగల; వేదిన్=తిన్నెయందు, పాల్చెన్=ఒప్పెనను నర్థముదోఁచుచున్నది.

అనఁగా కాంతలు ఆరతు లియ్యఁగా స్నానాలయము వెడలి నూతనవస్త్రముల ధరించి సకులు పాటలు పాడుచుండఁగ పుష్కర మనుపేరుగల వేదికయందుఁ బొల్చె నని భావము.

సీ. కనకదామముఁ జేర్చి ♦ వనితకు జడ యల్లె
నళిపాళికలఁ గేర ♦ నబల యొకతె
వరచంద్రరేఖ సుం♦దరినెమ్మొగంబునఁ
దీర్చెఁ దామర నొవ్వఁ ♦ దెలివ యొకతె
చలువగందంబు తో♦య్యలిమేన నెనపెఁ జం
పకవల్లిఁ గికురింపఁ ♦ బడఁతి యొకతె
ఘనకంకణమ్ము లం♦గనకరమ్ముల నుంచెఁ
జిగురాకు నెగ్గింపఁ ♦ జెలువ యొకతె

తే. చారుపత్రమ్ము లెడయ కొ♦ప్పార భూరి
వజ్రమాలిక నెలకొల్పె ♦ వనిత గబ్బి
గుబ్బకవ గుబ్బలులయుబ్బు ♦ కొంచెపఱుప
దంటతన మొప్ప విరిదమ్మి♦కంటి యొకతె. 21

టీ. అబలయొకతె=ఒకకాంత; అళిపాళికలన్=తుమ్మెదబంతులను; కేరన్=పరిహసించుటకై; వనితకున్=చంద్రికకు; కనకదామము=సంపెఁగపూసరము; చేర్చి=జతపఱిచి; జడయల్లెన్=జడవేసెను. ఇచట, తుమ్మెదలబంతిని జడ స్వయమే కేరుచుండఁ జంపకసాహాయ్యమేల యనుశంక నిరసించుటకై కనకదామము బంగరుత్రాడు లేదా జడ బంగరుగాని యర్థము చేయవలయుం. తెలివయొకతె=ఒకస్త్రీ; తామర=తామరపువ్వు; నొవ్వన్=నొచ్చునట్టుగా; సుందరినెమ్మొగంబునన్=చంద్రికముఖమందు; వరచంద్రరేఖన్.—వర=శ్రేష్ఠమగు, చంద్రరేఖన్=చందమామబొట్టును; తీర్చెన్=దిద్దెను. ఇచట, చంద్రికముఖము స్వభావముగ తామర

పూవును తిరస్కరించుచుండఁగ కమలవైరి సాహాయ్యమును గోరుటయేల యనుశంక నిరసించుటకై, వరచంద్రరేఖ.—వర=కుంకుమముయొక్క, "కాశ్మీరజన్మాగ్నిశిఖంవరమ్" అని యమరుఁడు, చంద్ర=పచ్చకర్పూరముయొక్క, రేఖను దీర్చెనను నర్థ మున్నదని గ్రహింపవలయును. పడఁతియొకతె=ఒక కాంత; తొయ్యలిమేనన్ = చంద్రికశరీరమందు; చంపకవల్లిన్=సంపెఁగతీవను; కికురింపన్=వంచించుటకు; చలువగందంబు = చల్లనిగందమును; ఎనపెన్=కలియఁబూసెను. ఇచట చంద్రికయంగలత తనంతనె చంపకతీవను తిరస్కరించుచుండ తల్లతావిరోధియగు చలువగందము సాహాయ్యమేల యను శంక నిరసించుటకై చలువగందం బనుచోట, చలువన్=ఉదికినవస్త్రమును, గందమును నెనపెనను నర్థ మున్నదని గ్రహింపవలయును. చెలువయొకతె=కాంతయొకర్తు; చిరురాకున్=లేయాకును; ఎగ్గింపన్=తిరస్కరించుటకు; అంగనకరమ్ములన్=చంద్రికహస్తములయందు; ఘనకంకణమ్ములన్.—ఘన=మేఘముయొక్క, కంకణంబులన్=యుదకబిందువులను; ఉంచెన్=ఉంచెను; ఇచట, చంద్రికకరములు స్వయమే చిగురుటాకులఁ దిరస్కరించుచుండఁగా చిగురాకువిరోధు లగునుదకకణముల నుంచు టేల యనుశంక నిరసించుటకై ఘనకంకణమ్ము లనుచోట, ఘనములైన, కంకణములను=వలయముల నుంచెననునర్థము దోఁచుచున్నది. విరితమ్మికంటియొకతె=వికసించినకమలములవంటి నేత్రములుగలయొకస్త్రీ; గుబ్బలులయుబ్బు = పర్వతములయొక్క అతిశయమును; కొంచెపఱుపన్=తగ్గించుటకై; దంటతనమొప్పన్ = ప్రౌఢత్వమొప్పునట్లుగా; వనితగబ్బిగుబ్బకవన్.—వనిత=చంద్రికయొక్క, గబ్బి=ఘనమైన, గుబ్బకవన్= చనుదోయియందు; చారుపత్రంబులన్.—చారు=సుందరమైన, పత్రంబులన్= ఱెక్కలను; ఎడయక = ఎడఁబాయక; ఒప్పారన్=అతిశయించునట్లుగా; భూరివజ్రమాలికన్.—భూరి=అధికమగు, వజ్రమాలికన్—వజ్రాయుధశ్రేణిని; నెలకొల్పెన్=నిలిపెను: ఇచట, పర్వతములను తిరస్కరించుటకై కుచములకు పక్షములను భూరివజ్రమాలికల నెలకొల్పుటవలన నాకుచములకు స్వసామర్థ్యము లేనటులు దోఁచుచున్నది గాన, పత్రశబ్దమునకు మకరికాపత్రము లనియు భూరివజ్రమాలికాశబ్దమునకు, భూరి=సువర్ణమయమగు, వజ్రమాలికన్=రవలసరమును, నెలకొల్పెనను నర్థ మున్నదని యూహింపవలయును.

ఈపద్యమందు భూషణములచేఁ జెలులు చంద్రిక నలంకరించి రని భావము.

మ. లలనామాళి శివార్పితంబు లగుమేల్కట్టాణిముత్యంపుక
మ్మలు దాల్చె న్భవదాస్యదీప్తిగతి కాత్మ న్గుందు రేజేని ని
స్తులపీయూషామృతధారచే మనుపు మంచు న్వేగ తచ్చంద్రమం
డలడింభంబులు భక్తి విన్నపముఁ బూన్పన్ జేరుదారిం దగన్. 22

టీ. లలనామాళి=చంద్రిక; శివార్పితంబులు = పార్వతీదేవిచేనియ్యఁబడినవి; అగు మేల్కట్టాణి ముత్యంపుకమ్మలు.—అగు=అయినట్టి, మేల్కట్టు=మంచిబంధసమూగల, అణిముత్యంపుకమ్మలు=గుండ్రపుముత్యములుగల కర్ణభూషణములను; భవదాస్యదీప్తిగతికన్.—భవత్=

నీయొక్క, ఆస్య=ముఖముయొక్క, దీప్తి=కాంతియొక్క, గతికిన్=రీతికి; ఆత్మన్=మనసునందు; కుందురేఁ జెనిన్= వ్యసనపడుచున్న రేరాజును; నిస్తులపీయూషామృతధారచేన్=సాటిలేనిచూపులను నమృతధారలచే; మనుపుము=రక్షింపుము; అంచున్=ఇట్లనుచు; వేగ=శీఘ్రముగ; తచ్చంద్రమండలడింభంబులు = ఆచంద్రమండలమాణవకములు ; భక్తివిన్నపము=భక్తియుక్తమగు విజ్ఞాపనమును; పూన్పన్=చేయుటకు; చేరుదారిన్=సమీపించురీతిగా; తగన్=ఒప్పునట్లు; తాల్చెన్=ధరించెను.

చంద్రిక పార్వతీదేవి యొసంగిన ముత్యపుకమ్మలు ధరించుట, నీముఖకాంతికిఁ గుందుచున్న చంద్రుని రక్షింపు మని యతనిపిల్లలు విన్నవించుటకై చేరినవోయనునట్లుండె నని భావము. చంద్రికకమ్మలు చంద్రమండలశిశువులయట్లున్న వని ముఖ్యాశయము.

ఉ. చక్కఁ మఘోని యత్తఱి నొసంగిన సారమసారహారముల్
చక్కెరబొమ్మచన్గవఁ బొసంగె వధూమణి శ్యామ గావునం
జొక్కపుగుత్తు లన్నమునఁ జొన్పఁగ గుబ్బలు నిబ్బరంపు మేల్
మక్కువ నందు వ్రాలునళిమాణవకప్రకరంబులో యనన్. 23

టీ. చక్కన్=సుందరముగా, మఘోని=శచీదేవి; అత్తఱిన్=ఆసమయమందు; ఒసంగినసారమసారహారముల్.–ఒసంగిన=ఇచ్చిన, సార=శ్రేష్ఠమగు, మసార=ఇంద్రనీలములయొక్క, హారముల్=పేరులను; వధూమణి=చంద్రిక; శ్యామ కావునన్=శ్యామయగుటవలన; శ్యామాలక్షణము, "శీతకాలేసుఖోష్ణాయా గ్రీష్మేతు సుఖశీతలా। తప్తకాఞ్చనసంకాశా సా శ్యామేతి కథ్యతే॥" అని, ప్రేంకణపుతీవయను నర్థముదోఁచుచున్నది; గుబ్బలు=స్తనములు; చొక్కపుగుత్తులన్నమున్=స్వచ్ఛమైనగుత్తులను భావమును; చొన్పఁగన్=పొందఁజేయుఁగా; అందున్=ఆపూగుత్తులయందు; నిబ్బరంపు మేల్మక్కువన్=గాఢమగుప్రేమతో; వ్రాలునళిమాణవకప్రకరంబులో యనన్.–వ్రాలు=పడునట్టి, అళి=తుమ్మెదలయొక్క, మాణవక=పిల్లలయొక్క, ప్రకరంబులో యనన్=గుంపులో యనునట్లు; చక్కెరబొమ్మచన్గవన్=చంద్రికయొక్క కుచయుగమునందు; పొసంగెన్=ఒప్పెను.

అనఁగా శచీదేవి యొసంగిన యింద్రనీలమణులహారము, లతవలె నున్న చంద్రికయొక్క పాలిండ్లు పూగుత్తులనుతలంపున వ్రాలినతుమ్మెదగుంపులో యనునట్లు చంద్రికకుచయుగంబునఁ బ్రకాశించెనని భావము.

ఉ. ఆయరవిందగంధి చరణాంబురుహంబులఁ దాల్పఁ బొల్చె న
గ్నాయి యొసంగినట్టి యభినవ్యవిదూరజనూపురంబు లో
రా యవి హంసకత్వమున రాజిలుటం బలె నిస్సమస్వర
శ్రీయుతి నొంది డాలెనసి చెల్వము బూని నటించు నెంచఁగన్. 24

టీ. అగ్నాయి=స్వాహాదేవి, వృషాకప్యగ్నితిసూత్రమువలన నైజాదేశజీప్వులువచ్చిన వని తెలియవలెను; ఒసంగినట్టియభినవ్యవిదూరజనూపురంబులు.—ఒసంగినట్టి=ఇచ్చిన, అభినవ్య=మాతనమైన; విదూరజ=వైడూర్యములయొక్క, నూపురంబులు=అందెలు; అయరవిందగంధి=చంద్రిక; చరణాంబురుహంబులన్=అడుగుదమ్ములయందు; తాల్పన్=ధరింపఁగా; అవి=ఆయందెలు; హంసకత్వమునన్=పాదకటకభావముచేత; అంచతనముచేత; రాజిలుటంబలెన్=ప్రకాశించుటచేతనో అన్నట్లు; నిస్సమస్వరశ్రీయుతిన్.—నిస్సమ = సాటిలేని, స్వర=ధ్వనియొక్క, శ్రీ=సంపదతో, యుతిన్=కూడుటను; ఒంది = పొంది; డాలు = కాంతిని; ఎనసి=పొంది; చెల్వమున్=అందమును; పూనెన్=వహించెను; ఔరా=బళీ! అటంచు నెంచఁగన్=అట్లనిపొగడఁగా; పొల్చెన్=ఒప్పెను.

స్వాహాదేవి యొసంగిన వైడూర్యనూపురములు చంద్రిక యడుగుదమ్ములయందుఁ దమ కుఁగల హంసకత్వముచేతనో యనునట్లు నిస్సమాన ములధ్వనులతోఁ గూడి ప్రకాశించె నని భావము.

ఉ. అంగన యంతకీపరిస♦మర్పితరోహితకాండపాండుర
త్నాంగదముల్ వహించె శుభ♦హారమసారకదృష్టిడాలురే
ఖం గన నుజ్జ్వలేందిర వి♦కస్వరపల్లవకోరకాళికా
సంగతిఁ దద్భుజాతిలక♦సాలలతల్ వడిఁ బూనుచాడ్పునన్. 25

టీ. అంగన=చంద్రిక; అంతకీపరిసమర్పితరోహితకాండపాండురత్నాంగదముల్.—అంతకీ=యమభార్యచేత, పరిసమర్పిత=ఈయఁబడిన, రోహితకాండ=కెంపులగుంపుయొక్క, పాండురత్న=రవలయొక్క, అంగదముల్=భుజకీర్తులును; ఉజ్జ్వలేందిర=సౌందర్యలక్ష్మి; శుభహారమసారకదృష్టిడాలురేఖన్.—శుభ=మంగళకరమైన, హార=కంఠహారమందలి, మసారక=ఇంద్రనీలమణులనెడు, దృష్టి=చూపుయొక్క, డాలు=కాంతులయొక్క, రేఖన్=పంక్తితో; కనన్=చూడఁగా; వికస్వరపల్లవకోరకాళికా సంగతిన్.—వికస్వర=వికసించిన, పల్లవ=చిగుళ్లయొక్క, కోరక.—మొగ్గలయొక్క, ఆళికా=శ్రేణియొక్క, సంగతిన్=కూడికను; భుజాతిలకసాలలతల్.—భుజా=భుజములనెడు, తిలకసాల=బొట్టుగుచెట్లయొక్క, లతల్=తీఁవలు; వడిన్=వేగముతో; పూనుచాడ్పునన్=ధరించుతెఱంగున; వహించెన్.

అనఁగాఁ జంద్రిక, యమభార్య యొసంగిన కెంపులరవలతోఁ జేరి యున్న యంగదములు సౌందర్యలక్ష్మీహారగతములగు నింద్రనీలమణులను వీక్షణములచేఁ జూడఁగా నాచంద్రికయొక్క భుజములనెడుబొట్టుగుతీవలు ఎఱ్ఱనిలేయాకులును వెల్ల మొగ్గలును పూనెనో యనునటులు ధరించె నని భావము. స్త్రీవీక్షణములు బొట్టుగు చెట్లకు దోహద మని వ్రాయఁబడి యున్నది.

చ. సకియ తమీచరాబల యొ♦సంగినచొక్కపుమ్రుత్తియంపుబా
సీకము ధరింపఁ బొల్చె నది♦ చిక్కనిడాలు నిశాప్తిఁ గాంచి బా

లికయలికస్థలంబు స్వకు•లీనత మించఁగఁ గాంచఁ జేరి చం
ద్రకళ ప్రియంబు మించఁ బరి•రంభముఁ దార్చినదారిఁ బూనుచున్. 26

టీ. సకియ=చంద్రిక; తమీచరాబల=నిర్‌ృతిభార్య; ఒసంగినచొక్కపు ముత్తియపుబాసికము.—ఒసంగిన=ఇచ్చినట్టి, చొక్కపు=స్వచ్ఛమైన, ముత్తియంపుబాసికము=ముత్యములబాసికము, లలామకమనుట; ధరింపన్=తాల్పఁగా; అది=ఆబాసికము; బాలికయలికస్థలంబు=చంద్రికనొసలు; నిశాప్తిన్.—నిశా=రాత్రియొక్క,పసపుయొక్క, ఆప్తిన్=ప్రాప్తిచేత; చిక్కనిడాలు=దట్టమగుకాంతిని; కాంచి=పొంది; స్వకులీనతన్=శ్రేష్ఠమగుతనకులధర్మముతో; మించఁగన్=అతిశయింపఁగా; చంద్రకళ=నెలవంక; కాంచఁజేరి=చూడదగ్గతి; ప్రియంబు=ఇంపు; మించన్=అతిశయింపఁగా; పరిరంభమున్=కౌఁగిలింతను; తార్చినదారిన్=చేయురీతిని; పూనుచున్=వహించుచు; పొల్చెన్=ప్రకాశించెను.

నిర్‌ృతిభార్య యొసంగినముక్తాలలామకము చంద్రిక ధరింపఁగా,నొసలు నిశాప్తి నెననీ వెలుంగుటయు స్వీయవక్రత్వమును బొంది యుండుటయును మొదలగు తనకులధర్మము లుండుట గని ప్రియమొంది చంద్రకళ డగ్గఱి కౌఁగిలించెనా యనునట్లు ప్రకాశించె నని భావము

చ. నలిననిభాస్య మౌళి వరు•ణాని వితీర్ణము కెంపురాగమిం
దళతళ మంచు రాజిలు సు•దర్శన మెంతయు నొప్పెఁ గందర
మ్ములఁ దప మాచరించి తమ•ముల్ కచలీల జనించి భానుమం
డలి గ్రహియించెఁ జు మ్మనుమ•నంబు సఖీతతి కొందఁ జేయఁగన్. 27

టీ. వరుణానివితీర్ణము= వరుణదేవునిభార్యచే ఇయ్యఁబడినది; కెంపురాగమిందళతళమంచుచూపుడు సుదర్శనము.—కెంపురాగమిందళతళమంచురాజిలుసుదర్శనము = పద్మరాగమణుల గుంపుచేఁ దళతళమని ప్రకాశించు చక్రాకారభూషణము; నళిననిభాస్యమౌళిన్=చంద్రికశిరమునందు; తమముల్=ఇర్లు; కందరమ్ములన్=గుహాలయందు; తపము=తపస్సును; ఆచరించి=ఒనరించి; కచలీలన్=వెండ్రుకలరూపముతో; జనించి=పుట్టి; భానుమండలిన్=సూర్యమండలమును;గ్రహియించెన్=పట్టికొనెను, చుమ్ము=సత్యము. అనుమనంబు=అనునట్టిబుద్ధి; తమములు సూర్యమండలమును గ్రహియించెననుబుద్ధియనుట; సఖీతతికిన్=చెలులగుంపునకు; ఒందఁజేయఁగన్=కలుగఁజేయఁగా; ఒప్పెన్=ప్రకాశించెను.

అనఁగా వరుణునిభార్య యొసంగినచక్రాకారమగు భూషణము, అనఁగా రాకిణి, యిర్లు గుహాలలోఁ దపం బొనరించి చంద్రికాకచరూపమున జన్మించి సూర్యమండలమును గ్రహించెనా యనుసందేహము చెలులమనంబునకుఁ గలుగఁజేయుచుఁ చంద్రికశిరమునందుఁ బ్రకాశించె నని భావము.

మ. తరళాక్షీమణి యప్డు మారుతవధూదత్తంబు ముత్తెంపుముం
గర నాసన్ ధరియించి చెల్వెనసెఁ జక్కన్ వేగుఁజుక్క న్వహిం
చి రసం దోఁచుదినాస్యలక్ష్మి యన నక్షీణాంగరాగంబు ని
ర్భరసంధ్యారుచియై సురేంద్రమణిహారచ్ఛాయ లిర్లై తగన్. 28

టీ. తరళాక్షీమణి=స్త్రీరత్నమగుచంద్రిక; అప్డు=ఆసమయమందు; మారుతవధూదత్తంబు=వాయుకాంతచే నీయఁబడిన; ముత్యంపుముంగర = ముక్తామయమగు నాసాభూషణము; నాసన్=ముక్కునందు; ధరియించి=తాల్చి; అక్షీణాంగరాగంబు=తఱుఁగని మైపూఁత; నిర్భరసంధ్యారుచియై=హెచ్చగు సంజవెలుఁగై; సురేంద్రమణిహారచ్ఛాయలు = ఇంద్రనీలమణిసరకాంతులు; ఇర్లై=చీఁకటులై; తగన్ = ఒప్పుచుండఁగా; చక్కన్=సరిగా; వేగుఁజుక్క=శుక్రనక్షత్రమును; వహించి = పూని; రసన్=పుడమియందు; తోఁచుదినాస్యలక్ష్మి యనన్=కనఁబడుచున్న దినముఖలక్ష్మియో యన్నట్లు; చెల్వెనసెన్=ప్రకాశించెను.

అనఁగాఁ దనయంగరాగము సంధ్యారాగమయి, ఇంద్రనీలమణికాంతులు చీఁకటులయి దోఁచుచుండఁగా, చంద్రిక వాయుదేవుని భార్యచే నీయఁబడిన నాసాభూషణమును ధరించి వేగుఁజుక్కను వహించి ప్రకాశించుదినముఖలక్ష్మి యన్నట్లు ప్రకాశించె నని భావము.

మ. నవలా యైలబిలీసమర్పితము నానారత్నసంయోజితం
బవు నొడ్డాణము దాల్ప నొప్పె నది తారాధ్వస్థలీరీతిఁ దొ
ల్త విమర్శించితి నిప్డు మధ్యపథలీలం గాంతుఁ బో యంచు మిం
చువడిం జేరు ననేకవర్ణపరిధిస్ఫూర్తిన్ విజృంభించుచున్. 29

టీ. నవలా=చంద్రిక; ఐలబిలీసమర్పితము=కుబేరుని భార్యచే నీయఁబడినట్టి; నానారత్నసంయోజితంబు=అనేకరత్నఖచితంబును; అవు నొడ్డాణము=అయినట్టి మేఖలను; తాల్పన్=ధరింపఁగా; అది=ఆయొడ్డాణము; తారాధ్వస్థలీరీతిన్=నక్షత్రమార్గవిధంబును; తొల్తన్=మొదట; విమర్శించితిన్=పరికించితిని. ఇప్డు=ఈసమయమందు; మధ్యపథలీలన్=భూలోకముయొక్కవిలాసమును; మధ్యభాగమును; కాంతుఁబో యంచున్=వీక్షింతునని; మించువడిన్=అతిశయించు వేగముచే; చేరున నేకవర్ణపరిధిస్ఫూర్తిన్ = ప్రవేశించుచున్న పెక్కువన్నెలు గల పరివేషముయొక్క ఆకృతితో; ఒప్పెన్=వెలసెను; "పరివేషస్తుపరిధిః" అని అమరుఁడు.

అనఁగా మొదట నంతరిక్షపదమును పరీక్షించితి నిపుడు మధ్యపథలీలను బరికింపవలె నని వన్నెలు గలపరివేషము చేరెనో యనునట్లు కుబేరుని భార్యచే నీయఁబడినయొడ్డాణము నానారత్నములతోఁ గూడి చంద్రికవలగ్నమందుఁ బ్రకాశించె నని భావము.

మ. అలగోత్రాపతిపుత్రి యిట్లు గిరిక•న్యాముఖ్యదిగ్గేశరా
ణ్ణలినాస్యాజనతాసమర్పితమహా•నానామణీభూషణా
వళిశృంగారితగాత్రియై ద్విజసతీ•వారంబు దీవింపఁ దో
య్యలు లారాత్రికముల్ ఘటింప నవమో•దారూఢి మించెం గడున్. 30

టీ. అలగోత్రాపతిపుత్రి=క్షణదోదయభూపతియొక్క కూఁతురగు నాచంద్రిక; ఇట్లు=పూర్వోక్తప్రకారము ; గిరికన్యాముఖ్యదిగ్గేశరాణ్ణలినాస్యాజనతా సమర్పితమహానానామణీభూషణావళిశృంగారితగాత్రియై.—గిరికన్యా=పార్వతీదేవి, ముఖ్య=ఆదిగాఁగల, దిగ్గేశరాట్=దిక్పతులయొక్క, నలినాస్యాజనతా=కాంతాజనసమూహముచే, సమర్పిత=ఈయఁబడిన, మహాత్=అధికమయిన, నానా=అనేకవిధములగు, మణీభూషణ=మణిమయభూషణములయొక్క, ఆవళి=పంక్తిచేత, శృంగారిత = అలంకరింపఁబడిన, గాత్రియై = శరీరముగలదై; ద్విజసతీవారంబు=బ్రాహ్మణస్త్రీసమూహము; దీవింపన్=ఆశీర్వదిఁపఁగా; తొయ్యలులు=స్త్రీలు; ఆరాత్రికముల్=హారతులను; ఘటింపన్=ఈయఁగా; నవమోదారూఢిన్.—నవ=నూతనమగు, మోద=సంతసముయొక్క, ఆరూఢిన్=రూఢిచేత; కడున్=మిక్కిలి; మించెన్=అతిశయిల్లెను.

తే. అంతకయ మున్ను బంధువ•యస్యదండ
నాథముఖ్యులు తత్సుచం•ద్రక్షితీంద్రుఁ
బెండ్లికొడుకు నొనర్ప ద•ర్పించువేడ్కఁ
గడఁగి శుభలీల నాళిసం•ఘములఁ బనుప. 31

టీ. అంతకయమున్ను=చంద్రికాలంకారమునకన్న పూర్వమందు; బంధువయస్యదండనాథముఖ్యులు.—బంధు=చుట్టములు, వయస్య=చెలికాండ్రు, దండనాథ = సేనానాయకులు, ముఖ్యులు=మొదలుగాఁగలవారు; తత్సుచంద్రక్షితీంద్రున్=ఆసుచంద్రభూపతిని; పెండ్లికొడుకునొవర్పన్=పెండ్లికుమారునిఁ జేయుటకు;దర్పించువేడ్కన్=మించుసుల్లాసముతో;కడఁగి=పూని; శుభలీలన్=శుభలీలచేత; ఆళిసంఘములన్=చెలులగుంపులను; పనుపన్=పంపఁగా; దీనికుత్తరపద్యస్థక్రియతో నన్వయము.

చ. తరుణులు చేరి కాంచనవి•తర్దిక శోభనపీఠిఁ బెట్టి భూ
వరు వసియింపఁ జేసి ద్విజ•వారిజలోచన లెల్లఁ గోకిల
స్వరమునఁ బాట పాడ నని•వారితమంగళవాద్యనిస్వనో
త్కరములు చాల బోరుకొన•గ్రక్కున నారతు లెత్తి రయ్యెడన్. 32

టీ. తరుణులు=చేడెలు; చేరి=కూడి; కాంచనవితర్దికన్=బంగరువేదికయందు; శోభనపీఠిన్=పెండ్లిపీఁటపై; పెట్టి=యుంచి; భూవరున్=సుచంద్రుని;వసియింపఁజేసి=కూర్చుండఁ

బెట్టి; ద్విజవారిజలోచనలెల్లక్ = బ్రాహ్మణస్త్రీలందఱు; కోకిలస్వరమునక్ = కోయిలస్వరము వంటిస్వరముతో; పాటపాడక్ = పాటఁబాడఁగా; అనివారితమంగళవాద్యనిస్వనోత్కరములు.—అనివారిత=వారింపఁబడని, మంగళవాద్య=శుభవాద్యములయొక్క, నిస్వనోత్కరములు=ధ్వనికదంబములు; చాలక్ = మిక్కిలి; బోరుకొనక్ = మ్రోఁగఁగా; గ్రక్కునక్ = శీఘ్రముగా; ఆరతులెత్తిరి=హారతులిచ్చిరి. అయ్యెడక్ = ఆసమయమందు. దీని కుత్తరపద్యస్థక్రియతో నన్వయము.

సీ. అఱచందమామపై ♦ కుఱుకుచీఁకటిపిల్ల
లన ఫాలతటిఁ గుంత♦లాళి జాఱ
మదిపేరిమరుమేడఁ ♦ బొదలుధూపము పర్వు
పోల్కిఁ గ్రొందావియూ♦ర్పులు జనింప
నన నూఁగువేడ్కఁ జే♦కొని మ్రోయు తేఁటిచాల్
సరి నీలవలయముల్ ♦ చాల మొరయ
లవలియాకులఁ గ్రమ్ము♦నవహైమకణముల
గతిఁ జెక్కుల శ్రమాంబు♦కణిక లుబ్బ
తే. సరులు నటియింప నునుఁగౌను ♦ సంచలింప
గుబ్బకవ రాయిడింప స♦కులు నుతింప
చూపునెఱమించు మించుమే♦ల్సొగసు నింప
నమ్మహీపాలుశిర సంటెఁ ♦ గొమ్మ యొకతె. 33

టీ. అఱచందమామపైకిక్ = అర్ధచంద్రునిమీఁదికి; ఉఱుకుచీఁకటిపిల్లలనక్ = పరుగెత్తు నంధకారపుబిడ్డలో యన్నట్లు; ఫాలతటిక్ = నుదుటిభాగమందు; కుంతలాళి=ముంగురులగుంపు; జాఱక్ = ఒఱఁగఁగా; మదిపేరిమరుమేడక్ = మనస్సను పేరుగల మన్మథునిసౌధమందు; పొదలుధూపము=వృద్ధిఁబొందుపొగ; పర్వుపోల్కిక్ = వ్యాపించువిధమున; క్రొందావియూర్పులు= క్రొత్తవాసనగల నిట్టూర్పువాయువులు; జనింపక్ = పుట్టుచుండఁగా; ననసూఁగువేడ్కక్ = చిగురాకునందుయ్యెలలూఁగువేడుకను; చేకొని=గ్రహించి; మ్రోయు తేఁటిచాల్ సరి=అఱచుచున్న తుమ్మెదలబంతితో సాటిగా; నీలవలయముల్ = ఇంద్రనీలమయములగు కంకణములు; చాలక్=మిక్కిలి; మొరయక్=మ్రోఁగుచుండఁగా; లవలియాకులక్ = ఏలకియాకులయందు; క్రమ్మునవహైమకణములగతిక్ = చుట్టుకొను క్రొత్తమంచు బిందువులవలె; చెక్కులక్ = చెంపలయందు; శ్రమాంబుకణికలు=చెమటనీటిబొట్టులు; ఉబ్బక్ = అతిశయింపఁగా; సరులు=దండలు; నటియింపక్ = చలింపఁగా; నునుఁగౌను=అల్పమగు నడుము; సంచలింపక్ = ఆడఁగా; గుబ్బకవ=కుచదోయి; రాయిడింపక్ = ఒరయఁగా; సకుల్ = చెలులు; నుతింపక్ = పొగడఁగా; చూపు [illegible]మించు=చూపుయొక్క యధికమయినప్రకాశము; మించుమేల్సొగసుక్ = మెఱుపుయొక్క

మంచియంపమును; నింప=నిండింపఁగా; అమ్మహీపాలుశిరసు = ఆరాజుశిరమును; అంటెన్ = అంటినదాయెను.

బాలచంద్రునిమీఁదికిఁ జిఱుచీఁకటు లుతికినటులు ఫాలమునిమీఁద కురులు వ్రాలుచుండఁగా, మనసను పేరుగల మన్మథుమేడయందు వ్యాపించు పొగపగిది నూర్పులు చెలంగఁగా, చిగురాకునం దుయ్యేల లూఁగుతుమ్మెదచాలుపగిది కరములనీలమణికంకణములు మొరయఁగ, ఏలకియాకులయందుఁ బర్విన మంచుబొట్టులరీతిగ చెక్కుల్లయందుఁ జెమటబిందువు లతిశయింపఁగా, దండలు గదలుచుండ, సన్ననినడుము కదలుచుండఁగా, కుచయుగ మొరయుచుండఁగా, సకియలు పొగడఁగ నొకచెలి సుచంద్రునకుఁ దలయంటె నని భావము.

తే. అంత నప్పురుషోత్తముఁ • డంఘ్రియుగళి
నడరుమిన్కులపావాలు • దొడిగి కమల
హస్తకర మూని ఘనవేణి• కాళికాభి
కలితపాథోగృహాము మంద•కలన నెనసి. 34

టీ. అంతన్ = అటుపిమ్మట; అప్పురుషోత్తముఁడు = పురుషశ్రేష్ఠుఁడగు నాసుచంద్రుఁడు; అంఘ్రియుగళిన్ = అడుగుదోయియందు; అడరుమిన్కులపావాలు.—అడరు=ఒప్పుచున్న, మిన్కుల పావాలు=తళుకులుగల పాదుకలను; తొడిగి; కమల హస్తకరము=కమలమువంటి హస్తముగల చెలియొక్క కేలును; ఊని=వహించి; ఘనవేణికాళికాభికలితపాథోగృహము.— ఘనవేణికా=మబ్బువంటిజడగల చేడియలయొక్క, ఆళికా=శ్రేణిచేత, అభికలిత=పొందఁబడిన, పాథోగృహము=మజ్జనగృహమును; మందకలనన్ = మెల్లనినడకతో; ఎనసి=పొంది; పైపద్యముతో నన్వయము. ఇచట, పురుషోత్తముండు = నారాయణమూర్తి; అంఘ్రియుగళమందు, మిన్కులపావాలు=వేదమయపాదుకలను; తొడిగి; కమలహస్తకరమూని=లక్ష్మీదేవియొక్క హస్తమును బట్టుకొని; ఘనవేణికాళికాభికలితపాథోగృహము.—ఘనవేణికా=గొప్పనదులయొక్క, ఆళికా=శ్రేణిచేత, అభికలిత=పొందఁబడిన, పాథోగృహము=సముద్రమును; ఎనసి యను నర్థము దోఁచుచున్నది.

చ. అళినిభవేణి యొార్తు మహీ•పాగ్రణికైశికవీథిఁ జందనా
మలకము వెట్టి యొక్క సుకు•మారలతాసమగాత్రి కోష్ణవాః
కలశములన్ మజ్జనంబున సమ•కూర్చి మనోభవరాజ్య మందఁగాఁ
జెలువుగఁ గట్టఁ బట్టె మభి•షేక మొనర్చినచాయ నయ్యెడన్. 35

టీ. అళినిభవేణియొార్తు = తుమ్మెదలతో సమానమగు జడగల యొకకాంత; మహీపాగ్రణికైశికవీథిన్.—మహీపాగ్రణి=రాజశ్రేష్ఠుఁడగు సుచంద్రునియొక్క, కైశికవీథిన్ = కేశసమూహముయొక్క ప్రదేశమందు; చందనామలకము = చందనమిశ్రితమైన యుసిరికపిండి;

పెట్టన్ = ఉంపఁగా; ఒక్కసుకుమారలతాసమగాత్రి = మెత్తనిలతతో సమమైన మేనుగల యొకకాంత; చెలువుగన్ = సొంపుగా; మనోభవురాజ్యము = మన్మథుని ప్రభుత్వము; అందఁగాన్ = పొందుటకై; పట్టము = ముఖపట్టమును; కట్టన్ = బంధించుటకొఱకు; అభిషేకమొనర్చిన చాయన్ = స్నానము చేయించిన తెఱంగున; కోష్ణవాఃకులములన్ = గోరువెచ్చనయినయుదకపూరములతో; మజ్జనంబు = స్నానమును; సమకూర్చెన్ = చేయించెను.

చ. చెలువ యొకర్తు చెందిరిక♦చేల మయిం దడి యొత్తి వైచి ని
స్తులవిశదాంబరం బొసఁగఁ♦ దోడనె దాల్చి సదప్రియంబు మ
త్సులలితరోహితాంశుపటి♦ సుమ్ము ని దాని సడల్చి వెన్నెలన్
వలనుగఁ బూని తోఁచురవి♦వైఖరి నప్పతి యొప్పె నంతటన్. 36

టీ. చెలువయొకర్తు = ఒకచెలియ; చెందిరిక చేలన్ = చంద్రకావి వస్త్రముతో; మయిన్ = శరీరమందు; తడియొత్తివైచి = తడిదుడిచి; నిస్తులవిశదాంబరంబు.—నిస్తుల = సాటిలేని, విశదాంబరంబు = తెల్లనివస్త్రమును; ఒసఁగన్ = ఈయఁగా; అప్పతి = ఆసుచంద్రుఁడు; తోడనె = వెంటనె; తాల్చి = ధరించి; మత్సులలితరోహితాంశుపటి.—మత్ = నాయొక్క, సులలిత = మిక్కిలిమనోజ్ఞమగు, రోహిత = ఎఱ్ఱనగు, అంశు = కిరణములనెడు, పటి = వస్త్రము; సదప్రియంబు = సజ్జనులకు ఇష్టముకానిది; సుమ్ము = సత్యము, రిక్కలకున ప్రియమని స్వభావార్థము; అని = ఇట్లని; దానిన్ = ఆరోహితాంశుపటమును; సడల్చి = విడిచి; వెన్నెలన్ = కౌముదిని; వలనుగన్ = నేర్పుగా; పూని = ధరించి; తోఁచురవివైఖరిన్ = కనుపట్టు సూర్యునివిధంబుగా; ఒప్పెన్ = ప్రకాశించెను.

అనఁగా నొకచెలి శుభ్రవస్త్రమునీయఁగా నారాజు శుభ్రవస్త్రమునుధరించి సదప్రియంబని రోహితాంశుపటమును సడల్చి వెన్నెలను ధరించినరవిపగిదిఁ బ్రకాశించె నని భావము.

చ. అలజలశాలిక న్వెడలి♦ యాజననాయకుఁ డబ్జరాగవ
ద్వలభివిభాజటాయుతి న♦వారితమౌక్తికకుడ్యదీప్తి ని
ర్మలగగనాపగాప్తిఁ గడు♦ రాజిలు పూఁజవికె న్వసించెఁ గ
ల్వలదొర యబ్ధి వెల్వడి శి♦వాపతియౌదలఁ జేరుపోలికన్. 37

టీ. ఆజననాయకుఁడు = ఆసుచంద్రుఁడు; అలజలశాలికన్ = ఆస్నానగృహమునుండి; వెడలి = బయలుదేఱి; అబ్జరాగవద్వలభివిభాజటాయుతిన్.—అబ్జరాగవత్ = పద్మరాగములుగల, వలభివిభా = చూరులకాంతులనెడు, జటా = జడలయొక్క, యుతిన్ = కూడికచేత; అవారితమౌక్తికకుడ్యదీప్తినిర్మలగగనాపగాప్తిన్.—అవారిత = నివారింపనలవిగాని, మౌక్తిక = ముక్తామయమైన, కుడ్య = గోడయొక్క, దీప్తి = వెలుంగనెడు, నిర్మల = స్వచ్ఛమైన, గగనాపగా = మిన్నేటియొక్క, ఆప్తిన్ = ప్రాప్తిచేతను; కడున్ = మిక్కిలి; రాజిలుపూఁజవికన్ = వెలుఁగుచున్న పువ్వులమండపమునందు; కల్వలదొర = చంద్రుఁడు; అబ్ధిన్ = సముద్రమునుండి; వెల్వడి = బయలుదేఱి;

శివాపతియౌదలన్ = పార్వతీవల్లభునితలయందు; చేరుపోలికన్ = కూడు తెఱంగున; వసిం
చెన్ = నివసించెను.

భూపాలుఁడు జలశాలవెడలి పద్మరాగమణిమయమగు చూపట్టెలనెడి జటాజూట
ముతో ముక్తామయకుడ్యకాంతియనెడు మిన్నేటితోఁగూడి శంకరునిశిరముపగిదిఁ గానవచ్చుచు
న్నపూఁజవికెను, సముద్రమువెల్వడిచంద్రుఁడు శంకరునిశిరముఁ జేరినరీతిగాఁ జేరెననిభావము.

సీ. తడి యొత్తి నేర్పు గ♦న్పడ నఖాంకురపాళి
నెఱులు చిక్కెడలించె ♦ నెలఁత యొకతె
యింపు రెట్టింపఁ జొ♦క్కంపుసాంబ్రాణి ధూ
పపుఁదావిఁ బొందించెఁ ♦ బడఁతి యొకతె
తళుకుఁగుంచియఁ బూని ♦ కలయ నెఱుల్ దువ్వి
సొగసుగా సిగ వైచె ♦ మగువ యొకతె
మొగలిరేకులదంట ♦ మొనసినబొండుమ
ల్లియపూసరులు చుట్టె ♦ లేమ యొకతె

తే. దివ్యతర రత్నజాలాప్తిఁ ♦ దేజరిల్ల
నబ్ధికన్యామనోహరుం ♦ డాత్మశక్తి
మహిమ సృజియించి యంచిన♦మంజుమకుటి
నప్పతి కలంకరించెఁ గం♦జాస్య యొకతె. 38

టీ. నెలఁతయొకతె = ఒకచెలియ; తడియొత్తి = తేమనొత్తి; నేర్పుగన్పడన్ = జాణతనము
కానవచ్చునట్లు; నఖాంకురపాళిన్.—నఖాంకుర = మొలకలవంటి గోళ్ళయొక్క, పాళిన్ = బంతి
చేత; నెఱులు = కురులను; చిక్కెడలించెన్ = చిక్కుదీసెను. పడఁతియొకతె = ఒకవనిత; ఇంపురె
ట్టింపన్ = సొంపు ఇబ్బడింపఁగా; చొక్కంపు సాంబ్రాణిధూప పుతావిన్.—చొక్కంపు = శ్రే
ష్ఠమైన, సాంబ్రాణి = గంధద్రవ్యవిశేషముయొక్క, ధూపపుతావిన్ = పొగవాసనను; పొందిం
చెన్ = అనువుపఱిచెను. మగువయొకతె = మఱియొకలేమ; తళుకుఁగుంచియన్ = మెఱుఁగైనదువ్వె
నను; పూని = చేపట్టి; కలయన్ = కలియునట్లు; నెఱులు = వెంట్రుకలను; దువ్వి; సొగసుగాన్ =
అందముగా; సిగ = కొండె; వైచెన్ = వేసెను. లేమయొకతె = ఒక మగువ; మొగలిరేకుల
దంటన్ = మొగలిపూవులయొక్క జంటతో; మొనసినబొండు మల్లియపూసరులు = కూడిన
బొండుమల్లియపూదండలు; చుట్టెన్ = చుట్టెను. కంజాస్యయొకతె = కమలముఖియొకతె; దివ్య
తర రత్నజాలాప్తిన్.—దివ్యతర = మిగుల మేలైనట్టి, రత్నజాల = మణిజాలములయొక్క,
ఆప్తిన్ = ప్రాప్తిచేత; తేజరిల్లన్ = వెలయఁగా; అబ్ధికన్యామనోహరుండు = విష్ణుమూర్తి; ఆత్మశక్తి
మహిమన్ = తనసామర్థ్య మహిమచేత; సృజియించి = పుట్టించి; అంచినమంజుమకుటిన్ =
పంపినయందమగుకిరీటమును; అప్పతికిన్ = ఆరాజునకు; అలంకరించెన్ = కైసేసెను.

ఒక కాంత సుచంద్రునకు కుసుమచిక్కుదీసె ననియు నొకలేమ సాంబ్రాణిధూప మేసె ననియు నొకపడఁతి కుసుమలు దువ్వి సిగ ముడివైచె ననియు నొకచాన మొగలిపూఱేకులతోఁ జేరియున్న మల్లెపూసరములు సిగకుఁ జుట్టెననియు నొకకంజాస్య విష్ణుమూర్తి తనమహిమచే సృజించి పంపిన కిరీటమును సుచంద్రుని కలంకరించె ననియు భావము.

క. అలనృపమణి కస్తూరీ
తిలకము దాఁ దీర్చె నిరత♦దీప్తికళాసం
కలితమయి మించు మోమను
కలువలదొర యందుఁ జిన్నె♦కరణి వహింపన్. 39

టీ. అలనృపమణి=రాజరత్నమగునాసుచంద్రుఁడు;నిరతదీప్తికళాసంకలితము.—నిరత=నిరంతరము, దీప్తి=తేజోరూపమగు, కళా=షోడశకళలతోడ, సంకలితము = కూడుకొన్నది; అయిమించుమోమనుకలువలదొరయందున్.—అయి మించుమోము=అయినదై యతిశయించు ముఖము, అనుకలువలదొరయందున్=అనునట్టి చంద్రునియందు; చిన్నెకరణిన్=కలంకవిధమును; వహింపన్=పూనునటులు; కస్తూరీతిలకమున్=కస్తురిబొట్టును; తాన్=తాను;తీర్చెన్=దిద్దెను.

సుచంద్రుఁడు దీప్తిచేఁ బ్రకాశించుచున్న తనముఖ మను చంద్రునియందుఁ గలంకము కైవడిఁ గస్తురిబొట్టు దీర్చె నని భావము.

క. జనపతివీనుల హరి యంపినముత్తెపుటొంటు లలరెఁ ♦ జేరువ లగ్నం
బెనసె విలంబం బిఁక నే, లని దెలుపఁగఁ జేరుకవిసు♦రాచార్యు లనన్.40

టీ: లగ్నంబు=ముహూర్తము; చేరువన్=సమీపంబును; ఎనసెన్=పొందెను. విలంబంబు=ఆలస్యము; ఇఁక నేలని=ఇఁక నెందుకని; తెలుపఁగన్ = ఎఱింగించుటకై; చేరుకవిసురాచార్యులనన్.—చేరు=దగ్గఱు, కవి=శుక్రుఁడు, సురాచార్యులు=బృహస్పతి, అనన్=అన్నట్లు; హరి=ఇంద్రుఁడు; అంపినముత్యాపుటొంటులు = పంపిన ముత్యాలయంటుజోళ్లు; జనపతివీనులన్=రాజుచెవులయందు; అలరెన్=ఒప్పెను.

ఇంద్రుఁడు పంపినముత్యపుటొంటులు రాజుచెవులందు లగ్నము సమీపించినది విలంబ మేలయని తెలియఁజేయుగురుశుక్రు లన్నట్లు ప్రకాశించెనని భావము. ఉత్ప్రేక్షాలంకారము.

క. వీవలి చెలి వనిచినము, క్తావళితో విభునివక్షు ♦ మలరారెన్ దా
రావిసరప్రతిఫలన, శ్రీవిలసితకనకధరణి♦భృత్తటిపోల్కిన్. 41

టీ.—వీవలిచెలి=వాయుసఖుండగునగ్ని; వనిచినముక్తావళితోన్=పంపినముత్తెములపేరుతో; విభునివక్షము=రాజువక్షము; తారావిసరప్రతిఫలన శ్రీవిలసితకనకధరణీభృత్తటి

పాళిక్రియన్.—తారా=ముక్కలయొక్క, విసర=గుంపుయొక్క, ప్రతిఫలన శ్రీ=ప్రతిబింబకాంతిచే, విలసిత = ప్రకాశించుచున్న, కనకధరణిభృత్ = మేరుపర్వతముయొక్క, తటిపాళిక్రియన్=తటమువలె; అలరారెన్=ప్రకాశించెను.

అగ్ని పంపినముక్తాహారముతో సుచంద్రుని ఱొమ్ము ఆకసమందున్న చుక్కలు ప్రతిఫలించిన మేరు పర్వతముయొక్క చఱియవలెఁ బ్రకాశించె నని భావము. ఇచట ఉపమాలంకారము.

క. జముఁ డంచినమణిహంసక
   మమరెం బతియఙ్ఘ్రిఁ ద్వత్పరాళికృతశ్వ
   భ్రముఁ బాపుము ధామవిభా
   ఘముచే నని యడుగునొందు కంజాప్తక్రియన్. 42

టీ. జముఁడు=యమధర్మరాజు; అంచినమణిహంసకము.—అంచిన = పంపిన, మణిహంసకము=మణిమయగు కాలియందె; పతియఙ్ఘ్రిన్=ఱేనియడుగునందు; త్వత్పరాళికృతశ్వభ్రమున్.—త్వత్=నీయొక్క, పర=శత్రువులయొక్క, ఆళి=శ్రేణిచేత, కృత = చేయఁబడిన, శ్వభ్రమున్ = రంధ్రమును; ధామవిభౌఘముచేన్.—ధామ = ప్రతాపముయొక్క, విభా = కాంతులయొక్క, ఓఘముచేన్ = గుంపుచేత; పాపుము = పోఁగొట్టుము. అని = ఇట్లని; అడుగునొందు కంజాప్తక్రియన్.—పాదములనుపొందునట్టి = సూర్యునిపగిది; అమరెన్=ఒప్పెను.

అనఁగా యమధర్మరాజుచేఁ బంపఁబడినకాలియందె సుచంద్రునిపాదమందు, నీచేరణమందుఁ గూలినశూరులు గావించిననామండలముయొక్క రంధ్రమును నీప్రతాపకాంతిపుంజముచేఁ గప్పుమని యడుగులందు వ్రాలిన సూర్యబింబముకైవడిఁ బ్రకాశించె నని భావము. "శ్లో॥ద్వా విమౌ పురుషౌ లోకే సూర్యమణ్డలభేదినౌ పరివ్రాడ్యోగయుక్తశ్చ రణే చాభిముఖో హతః" అనియొదిరించి రణమందుఁ గూలినవారు సూర్యమండలమును భేదింతు రనుటకుఁ బ్రమాణము.

క. పలభుజుఁ డంచినరతన, మ్ములపతకము నృపతి దాల్పఁ, బొసఁగెం జిత్త
   స్థలచంద్రికానురాగా, వలి పెగ్గల మగుచుఁ బైకి వడి వెడలె ననన్. 43

టీ. పలభుజుఁడు = నిరృతి; అంచినరతనమ్ములపతకము = పంపిన రత్నమయపతకము; నృపతి=సుచంద్రుఁడు; తాల్పన్ = ధరింపఁగా; చిత్తస్థలచంద్రికానురాగావళి.—చిత్తస్థల=హృదయప్రదేశమందున్న, చంద్రికా=చంద్రికావిషయమగు, అనురాగ=అనురక్తియొక్క, ఆవళి=శ్రేణి; పెగ్గలమగుచున్=అతిశయితంబగుచు; పైకిన్=బైటికి; వడిన్=వేగముగా; వెడలెననన్=వచ్చెనన్నట్లు; పొసఁగెన్=ఒప్పెను.

నిర్వృతి పంపి యున్న రత్నమయ మగుపతకము సుచంద్రుఁడు,వక్షమున ధరింపఁగా, చంద్రికావిషయ మయినయనురాగ మధికిపైఁ బర్వె నన్నట్టు లొప్పెనని భావము. ఈపద్య మందు మకారపకారములకు యతి చెల్లకయుండినను మకారయుతులలో పుఫుబుభులకు మాకొమ్ము చెల్లునని యప్పకవి యంగీకరించినందున మకారమునకు పొ అనుదానికి యతిచే యఁబడియున్నది. క॥ "హెచ్చరికను పుఫుబుభులకు నచ్చపు మాకొమ్ము లేమఁ బోకవులాదిన్ | మెచ్చులుగ నిలిపి రచ్చట । నచ్చటను మకారయతు లంటంచును గృతులన్" అని అప్ప కవీయము ఉత్ప్రేక్షాలంకారము.

క. శరధీశప్రేషితభా, స్వరమౌక్తికశుభికఁ దాల్చె • జనపతి శుభికే
శిర ఆరోహ యటంచున్, ధరణీసురపాళి సుస్వనంబునఁ బలుకన్. 44

టీ. జనపతి=సుచంద్రుఁడు; శరధీశప్రేషితభాస్వరమౌక్తికశుభికన్.—శరధీశ=వరుణు నిచే, ప్రేషిత=పంపఁబడిన, భాస్వర=వెలుంగుచున్న, మౌక్తిక=ముత్తియములయొక్క, శుభి కన్=బాసికమును; శుభికేశిరఆరోహయటంచున్=శుభికేశిర ఆరోహయను మంత్రము నుచ్చ రించుచు; ధరణీసురపాళి=బ్రాహ్మణశ్రేణి; సుస్వనంబునన్=మేలయినధ్వనితో; పలుకన్= వచించుచుండఁగా; తాల్చెన్=ధరించెను.

అనఁగా వరుణుండుపంపిన ముత్తియంపుబాసికమును బ్రాహ్మణులు మంత్రములు చదు వుచుండఁగా సుచంద్రుఁడు ధరించె నని భావము.

క. మరుదర్పితమణిముద్రిక, నరనాథుకరాంగుళికఁ దనర్చెఁ బ్రవాళేం
దిర తనచెల్మికి రా భా, సురభద్రాసనము నిచ్చుసొంపు వహింపన్. 45

టీ. మరుదర్పితమణిముద్రిక=వాయుదేవునిచే నీయఁబడిన కెంపుటుంగరము; నరనా థుకరాంగుళికన్=సుచంద్రునివ్రేలియందు; ప్రవాళేందిర=పగడపుకాంతియనులక్ష్మి; తనచెల్మి కిన్=తననేస్తమునకు, అనఁగా రాజు కేలినేస్తమునకు; రాన్=రాఁగా; భాసురభద్రాసనము నిచ్చుసొంపు=మేలయినసింహాసనము నిచ్చినందమును; వహింపన్=పూనునట్లు; తనర్చెన్= ఒప్పెను.

అనఁగా వాయుదేవుఁడు పంపిన కెంపుటుంగరము సుచంద్రుఁడు హస్తమున ధరిం పఁగా నది ప్రవాళలక్ష్మి సుచంద్రుకేలి చెలిమిఁ గోరి రాఁగా బహూకరించుటకుఁగా కేలు దానికిచ్చిన భద్రాసనమురీతిఁ జూపట్టుచు నొప్పె నని భావము.

క. పతి దాల్పఁ బొలిచె ధనదా, ర్పితహీరాంగదము తనధరిత్రీభారో
ద్ధృతి కలరి భుజాభజనా, దృతిఁ గుండలితాహి నేత • యొనసినపోల్కిన్.46

టీ. ధనదార్పితహీరాంగదము=కుబేరునిచే నీయఁబడిన రవలబాహుపురి; పతి = సు చంద్రుఁడు; తాల్పన్=ధరింపఁగా; తనధరిత్రీభారోద్ధృతికిన్=తాను మోయుచున్న భూభా రముయొక్క యెత్తుటకు; అలరి=సంతసించి;భుజాభజనాదృతిన్.—భుజా=భుజములయొక్క,

భజన=కొలుచుటయందు, ఆదృతిన్ =ఆదరముచేత; కుండలితాహినేత=వలయితమైనచిలువదొర; ఎనసినపోల్కిన్ =పొందినరీతిగా; పొలిచెన్ =ప్రకాశించెను.

అనఁగాఁ గుబేరుఁడిచ్చినహీరాంగదము సుచంద్రుఁడు భుజములందు ధరియింపఁగా నది తాను మోయు భూభారమును నీభుజములు మోయుచున్న వని యాదరించుటకయి చేరియున్న యాదిశేషునిపగిదిఁ గాన వచ్చె నని భావము.

క. హరుఁ డంచినవకనకాం, బర మయ్యెడఁ గప్పి నృపతి • భాసిల్లెను బం
ధురసాంధ్యరాగవృతుఁడై, ధరణిం గనుపట్టుశిశిర•ధామునిచాయన్. 47

టీ. అయ్యెడన్ =ఆసమయమందు; హరుఁడు=ఈశానుఁడు; అంచిననవకనకాంబరము.— అంచిన=పంపిన, నవకనకాంబరము=నూతనమగుబంగరువస్త్రమును; కప్పి=కప్పుకొని; నృపతి=సుచంద్రుఁడు; బంధురసాంధ్యరాగవృతుఁడై = సొంపగు సంజకెంపువన్నెతోఁగూడినవాఁడై; ధరణిన్ =భూమియందు; కనుపట్టుశిశిరధామునిచాయన్ = కనఁబడు చంద్రునివిధంబుగా; భాసిల్లెన్ = మెఱసెను.

ఈసుచంద్రుఁడు, ఈశానుఁడు పంపినకనకాంబరమును ధరియించి, సంధ్యారాగముతోఁగూడుకొన్నవాఁడయి పుడమిఁ జేరినచంద్రునివలెఁ బ్రకాశించె నని భావము.

వ. ఇవ్విధంబున సకలదిగ్రాజనియోజిత నానావిధదివ్యమణివిభూషణభూషితగాత్రుండగుచు నాసుచంద్రధరాకళత్రుండు నిశాముఖకృత్యంబులు నిర్వర్తించిమించినముదంబున వేల్పుదొర యంచినచౌదంతి నెక్కి యుదయనగవజ్రశృంగాగ్రవిద్యోతమానుండగునరుణభానుండో యననఖిలచక్రిలోచనసమ్మోదసంపాదక మహాస్ఫురణంబునం బొలుపొందుచు, నభినవ్యశాతకుంభకుంభవారాంచిత పాండురాతపత్రసహస్రంబు చుట్టు వలగొన నరుణమణిగణ సంస్ఫూర్యతఫణిరమణ ఫణాదశశతమధ్యస్థితుం డగునృసింహదేవుం డునుం బోలె నపరిమితవిబుధమనఃపథజరీజృంభ్యమాణ మహాద్భుతసంవర్ధకవిగ్రహప్రకాశంబునం బొగ డొందుచు, నాత్మోత్సవ సందర్శనలాలసానానంద్యమాన పౌరమానవతీ జనంబులు చల్లుమల్లికామాఘ్యావల్లికాది కోరకవారంబులు చుట్టు నావరింప శీతశైల హిమాధి దేవతావికీర్యమాణమిహికాఘటికాపటల సంవృతమూర్తి యగుదక్షిణామూర్తి తెఱంగున దిగ్దళనకలనావరీవృత్యమాన సద్గణకోలాహలంబుల కింపుఁబూనుచుఁ, బార్శ్వద్వయ పరిభ్రాజమాన గజాధి రాజాధిరోహిసామంత మహీకాంతసం

వీజ్యమాన ధవళవాలవ్యజనంబు లసమానపవమాన మందయాన వైఖరిఁ
జాంచల్యమాన నవీనకాళమాలిక లన్మనంబుఁ బొదలింప మహీతలంబు
నం దోఁచినశరద్దినదైవంబు తెఱంగున ననేకరాజహంససంసేవ్యమానుం
డయి రాజిల్లుచు, నగణేయతపనీయ భంభికాతుత్తుంభికా తమ్మటతమ్మాకికా
ప్రముఖ బహుముఖవాద్య నిస్వానంబుల నలరి తదేకమంగళం బవలోకిం
పఁ దివ్యర షడ్ద్వయవిభాకరులు తమతమప్రియజనంబుల కరంబుల కొప్ప
గించి యుంచిన నేతెంచి నిలుచు గుమసమాతత తేజోవిలాస లాలస్యమా
న తత్కుమారశతశతంబులదారిం దైవాఱు పరిచారక పాణిభృతగంధతై
లధారాదేదీప్యమానదీపికాసమూహంబులవీక్షాలక్ష్యంబులుగా నొనర్చుచు,
నిరుగడ నెడ యీక యడరునెయ్యారంబున నడచుగణికాగణంబులం గ
నుంగొని తొంగలించుమోహంబునఁ దదేకతానతం బొలుచు నభోవితర్ది
కాసీననిర్జరస్తోమంబులపైఁ గంతుఁడు తత్సమయ సముచిత బహురూపం
బు లంగీకరించి ప్రయోగించు నిర్వేలజ్వాలాకుల జాజ్వల్యమానకలంబక
దంబకంబులడంబున యంత్రకారవారంబు లొక్కుమొత్తంబుగా ముట్టిం
పఁ బఱచునాకాశబాణంబుల నవలోకించుచు, సర్వసర్వంసహాజన శ్రవణ
పర్వంబుగా నిజానవద్య పద్యగద్యంబులు చదువుచుం బఱతెంచుయాచ
కకవీశలోకంబుల కాత్మీయ బంధుమిత్రదండనాథ పురోహితముఖ్యులు
దోయిళ్ళ ముంచి వెదచల్లు నవరత్నసువర్ణజాలంబులతో వైమత్యం బూ
నుకారునికరకరశృంగ సముత్పాత్యమాన చారుధమనికాశిఖ స్ఫులింగికాని
కాయంబులం గాంచి వేడుకఁ బూనుచు, నుత్తుంగమాతంగ చక్రాంగసం
ఘాత సంఘటితజయపతాకాగ్రతటహాటక పటాంచల శేటిక్యమానపవ
మాన ధారానిర్ధూతంబై స్వాశ్రయరూపజలదవ్రాతంబు దెసలకుం బాఱి
చన నంబరాంతరంబున నిలువ నోపక దివిజరాజ రాజధాని కారావరుద్ధ
ముదిరంబులఁ గదియం బఱచు శంపాలతావితానంబుల మేనులం గురి
యుతత్ప్రయాణ జంజన్యమాన స్వేదోదబిందు సందోహంబుల యందంబు
న నతుతత్రిమార్గాభి యాయినతుత్రి బాణగణపాపట్యమాన గర్భస్థలీ సనీ
పరిస్యమాన పాండుజ్వలన గుళికాజాతంబులపైఁ జూపులు నిలువుచు, నశే
మణిగజ్జనజేగీయమాన చిత్రిసృజనాపాటీణ లోహకారకాశిక వారంబు లపరి
మితంబుగా నిజమనోహరాకారంబునం బుట్టింపఁ జట్టఁ జాలమిం బగులువే

ధ్రోండ భాండమండలంబువలన బలువడి వెడలి నలుదిక్కులకుఁ బఱచు నుజ్జ్వలజ్జ్యోతి ర్జాతంబులతీరున బంభజ్యమాన ఘటబాణపటలంబుల నిర్గమించు నానాళిబాణంబులం గాంచి మెచ్చుచుఁ, గబరికావిన్యస్తచాంపేయ ప్రసవచరీచర్యమాణ పరాగపాళికావలయంబులుం గమనీయ ధూమప్రరోహాంతరాంతర బనీభ్రశ్యమానతనుతరానల కణాలికావలయంబులుం బరస్పరంబు నతీర్థ్యత్వంబునం జూపట్ట నుదారభ్రమణ యంత్రంబుల గుండ్రవరునలు దిరుగు తెఱగంటి తెఱగంటికంటితో నద్వైతవాదంబులు సేయు ననల్పశిల్పికర యష్టికాగ్రబం భ్రమ్యమాణ చక్రబాణచక్రంబులఁ జూపునఁ నాక్రమించుచుఁ, దమోరిపుతీ్రయ మహామహాహూనివహంబులు తృణీకరించి నిరర్గళనీరంధ్ర పట్టాతపవారణచ్ఛాయా కపటంబునఁ బుడమి నంతయు నాక్రమించు కటికిచీఁకటి గని భయంబుపుట్టఁ బాతాళంబుఁజొరఁ బాఱె యనేక దేశాధినాయక చమూసహాచరణన్యాసంబున నచ్చట నిలువ లేక యవారిత వారవాణ సాహూనినాదపాఫల్య మానధరాభాగంబున నొక్క మొత్తంబుగా గ్రక్కునం బైకి వెడలు తైజసత్ర్యణుక పరంపరల పెంపున భ్రాంతి పుట్టింప నిగుడు బిఱుసులమిణుంగుఱుల వీక్షించుచు, నిరతసురతతివర్ణ్యమాన వితీర్ణిచాతురీ పోవుమ్యమాణంబు లగురారణ్యమానమానితబిరుదశంఖ ధ్వానంబులఁ దనశుభంబు దెలిసి యది తిలకింప నేతెంచిన నత్కీర్తిప్రవాహంబు పోలికం బ్రకాశించు నహార్వర్తికామరీచి ధట్టంబుల దృగ్ధామంబులం గట్టుచు, నిర్వేలసూర్య జ్యోతిః ప్రభావనద్యోంతర్హితుండగుట నన్నెలమిన్నం గన్నులఁగానక తాతప్యమానాంతరంబున వియత్తలంబున నంబుజారిబింబసత్వం బైనఁ గనుంగొనుదుము గాక యని చయ్యన నెగసి యగణితపారలోక సంఘనంఘర్షణోత్పతద్భుజాంగదమణిమూర్ణ పరంపర నిండారఁ గప్పిన నచ్చటం జూడనోపమి సంజాతమూర్ఛామహత్త్వంబున గ్రక్కునం దెళ్లినీలోత్పలకులంబు చెలువున వలుఁదకెంబరంబులపయి నుండి జల్లున రాలు నీలోత్పలబాణకులంబులం గని యలరుచు, సుకరభ్రమరక ప్రకరణభాగ్యంబును, సురచిరకైరవదళ మోచనసమ్మదకృత్స్నరూపవైఖర్యంబును, సుందరకిం జల్కమాంజుల్యంబును, శోభిల్ల సుల్లసిల్లు నల్లకీపల్లవాధరామతల్లికల సరసకళాపాళి.శాలో చమానకువల. యేళి సేవామనోరథంబున నేతెంచినకుముదలతికలం

గాఁ దలంచి నభోంతరవావస్యమానమరున్మానవతీ పాతితసంతాన లతాంత జాగళ్యమానమరందబిందుసందోహకుహనా మహితహిమపృషద్వర్షంబుల కెట్టు లోర్చు నని తన్మైత్రీగౌరవంబున నీడఁ జేరిన చంద్రాతపమండలంబు బెడంగునఁ గురంగలోచనామణులపై నెత్తినయుల్లాభంబుపై దృష్టి వెల్లి విరియించుచు, నభంగురమార్దంగికమృదంగధిమిర్ధిమిధ్వానంబులు నతివేల తాళికతాళనిస్వానంబులు ననూనవాంశికవంశికానేక రాగతానంబులు నసమానగాయకగానంబులు నతిశయిల్లు నాట్యీయతాండవవిలాస ప్రీతి మాన భావభావనానరీనృత్యమానసుర మీనలోచనాజనంబుల మీఁదికిం గుప్పించి తిరస్కరించి మరలం జేరుతీరున లాఁగులు వైచుచుం బఱతెంచు బిరుదుపాత్రిల నేత్రంబునానుచు, ననదృశంబును నవాఙ్మనసగోచరంబు ను నత్యద్భుతంబును నభూతపూర్వంబును ననితరలభ్యంబును నగువైభ వంబునఁ బాంచాలభూపాలమందిరంబు చేరం జనుసమయంబున. 48

టీ. ఇవ్విధంబునన్ = ఇత్తెఱంగున; సకలదిగ్రాజనియోజితనానావిధదివ్యమణివిభూష ణభూషితగాత్రుండు.—సకల=ఎల్ల, దిగ్రాజ=దిక్పాలకులచే, నియోజిత=పంపఁబడిన, నానావి ధ=పలుతెఱంగులగు, దివ్యమణివిభూషణ=శ్రేష్ఠమగుభూషణములచే, భూషిత=అలంకరింపఁబడి న, గాత్రుండు=శరీరముకలవాఁడు; అగుచున్ = అయి; ఆసుచంద్రధరాకళత్రుండు=ఆసుచంద్ర భూపతి, ఈపదమునకుఁ "చేరంజనుసమయంబునన్" అనువచనాంతముతో నన్వయము; నిశాముఖకృత్యంబులు=సాయంకాలమందుఁ జేయఁదగినవి; నిర్వర్తించి=తీర్చి; మించినముదం బునన్ = హెచ్చినసంతోషంబుతో; వేల్పుదొర=ఇంద్రుఁడు; అంచినచౌదంతిన్ = పంపినయైరా వతమును; ఎక్కి=ఆరోహించి; ఉదయనగవజ్రశృంగాగ్రవిద్యోతమానుండు.—ఉదయనగ= పొడుపుకొండయొక్క, వజ్రశృంగ=రవలసిగరముయొక్క, అగ్ర=తుదియందు, విద్యోతమా నుండు=వెలుంగుచున్నవాఁడు; అగునరుణభానుండో యనన్ = అయినసూర్యుఁడో యన; అఖిల చక్రలోచనసమ్మోదసంపాదకమహాస్ఫురణంబునన్.—అఖిల=సమస్తమైన, చక్ర=చతురంగ బలముయొక్కయు, జక్కవలయొక్కయు, లోచన=కన్నులకు, సమ్మోద=సంతసమును, సం పాదక=కూర్చు, మహః=ప్రతాపముయొక్క, తేజస్సుయొక్క, స్ఫురణంబునన్=వ్యాప్తిచే; పొలుపొందుచున్ = ఇంపొందుచు; అభినవ్యశాతకుంభకుంభవారాంచితపాండురాతపత్రసహ స్రంబు.—అభినవ్య=మిగులక్రొత్తయగు, శాతకుంభ=బంగరుయొక్క, కుంభ=గుబ్బలయొక్క, వార=గుంపుచే, అంచిత=ఒప్పిన, పాండుర=తెల్లని, ఆతపత్ర = గొడుగులయొక్క, సహస్రం బు=వేయి; చుట్టువలగొనన్ = తనచుట్టుఁజుట్టుకొనియుండఁగా; అరుణమణిగణసంస్యూతఫణి రమణఫణాదళశతమధ్యస్థితుండు.—అరుణమణి = కెంపులయొక్క, గణ = గుంపుచే, సం స్యూత = కూర్పఁబడ్డ, ఫణిరమణ = ఆదిశేషునియొక్క, ఫణా = పడగలయొక్క, దళ

శత=వేయింటియొక్క, మధ్యస్థితుండు = నడుమనున్నవాఁడు; అగునృసింహదేవుండుసుం బోలెన్ = అయిన నరసింహస్వామియువలె; అపరిమితవిబుధమనః పథజరీజృంభ్యమాణ మహాద్భుత సంవర్ధక విగ్రహ ప్రకాశంబునన్.– అపరిమిత = మితిలేని, విబుధ=పండితులయొక్క, దేవతలయొక్క, మనః=చిత్తముయొక్క, పథ = మార్గమందు, జరీజృంభ్యమాణ = మిక్కిలి విజృంభించుచున్న, మహాద్భుత = గొప్పయబ్బురమునకు, సంవర్ధక= పోషకముగు, విగ్రహ=యుద్ధముయొక్క, శరీరముయొక్క, ప్రకాశంబునన్ = కాంతిచేత; పొగడొందుచున్=మెప్పువడయుచు; ఆత్మోత్సవ సందర్శనలాల సానానంద్యమానపౌరమాన వతీజనంబులు చల్లుమల్లికామాఘ్యాది వల్లికా కోరకవారంబులు.–ఆత్మ=తనయొక్క, ఉత్సవ=వేడుకయొక్క,సందర్శన=దర్శనమందు, లాలసా=ఔత్సుక్యముచేత, నానంద్యమాన=మిక్కిలిహర్షించుచున్న, మానస=మనస్సుగల, పౌరమానవతీజనంబులు=పురస్త్రీలు, చల్లు= వెదచల్లుచున్న, మల్లికా=మల్లెలు, మాఘ్య = కుందములు, ఆది=మొదలుగాఁగల, వల్లికా=తీవలయొక్క, కోరక=మొగ్గలయొక్క, వారంబులు=సమూహములు; చుట్టున్=ఎల్లెడల; ఆవరింపన్=వలగొనఁగా; శీతశైలహిమాధి దేవతావికీర్యమాణ మిహికాఘటికా పటలసంవృతి మూర్తియగు దక్షిణామూర్తి తెఱంగునన్.–శీతశైల=హిమవత్పర్వతముయొక్క,హిమ= మంచునకు, అధిదేవతా=అధిష్ఠానదేవతచేత, వికీర్యమాణ=చల్లఁబడిన, మిహికా = మంచుయొక్క, ఘటికా=బలపములయొక్క, పటల = సమూహముచే, సంవృత = ఆవరింపఁబడిన, మూర్తి = శరీరముగలవాఁడు, అగుదక్షిణామూర్తి తెఱంగునన్ = అయినట్టిదక్షిణామూర్తి పగిది; దిగ్దళనకలనా వరీవృత్యమానసద్గణకోలాహలంబులకున్.–దిక్ = దెసలయొక్క, దళన=భేదనమను, కలనా=వ్యాపారముచే, వరీవృత్యమాన=మిక్కిలివర్తించుచున్న, సద్గణ = విద్వద్బృందముయొక్క, ప్రమథగణములయొక్క, కోలాహలంబులకున్ = కలకలధ్వనులకు; ఇంపుఁబూనుచున్=సంతోషమును బొందుచు; పార్శ్వద్వయపరిభ్రాజమానగజాధిరాజాధిరోహిసామంతమహీకాంత సంవీజ్యమానధవళవాలవ్యజనంబులు.–పార్శ్వద్వయ = ఇరుప్రక్కలయందు,పరిభ్రాజమాన=మిక్కిలివెలుఁగుచున్న, గజాధిరాజ=గజరాజములను, అధిరోహి =ఎక్కిన, సామంతమహీకాంత = సమీపదేశాధిపతులచేత, సంవీజ్యమాన=లెస్సగావీవఁబడిన, ధవళ=తెల్లని, వాలవ్యజనంబులు=చామరములు; అసమానపవమానమందయానవైఖరిన్.– అసమాన=సాటిలేని, పవమాన=వాయువుయొక్క, మందయాన = తిన్ననినడకయొక్క, వైఖరిన్=రీతిచేత; చాంచల్యమాననవీనకాశమాలికలు.–చాంచల్యమాన=కదలుచున్న, నవీన=క్రొత్తలగు, కాశమాలికలు=కాశకుసుములదండలు; అన్వమనంబు=అనుభావమును; పొదలింపన్=అతిశయింపఁజేయఁగా; మనమునకు కాశమాలిక లని తోఁచునటులు చేయఁగానని భావము; మహీతలంబునన్=భూతలమందు; తోఁచినశరద్దినదైవంబు తెఱంగునన్.–తోఁచిన=కనుపడిన, శరద్దినదైవంబు తెఱంగునన్=శరత్కాలాధిదేవతవిధంబున; అనేకరాజహంససంసేవ్యమానుండయి.– అనేక=పెక్కులగు, రాజహంస=రాజశ్రేష్ఠులచేతను, రాయంచలచేతను, సంసేవ్యమానుండయి=కొలువఁబడుచున్నవాఁడయి; రాజిల్లుచున్=వెలుఁగుచు; అగణేయతపనీయభంభికాతుత్తుంభికాతమ్మటతమామికాప్రముఖబహుముఖవాద్యనిస్వానంబులన్.–అగణేయ=ఎన్నరాని,తపనీయ=బంగారుమయమైన, భంభికా=భేరులు, తుత్తుంభికా=తుతారాలు,తమ్మట=తప్పెటలు,తమామికా=

డమారములు, ప్రముఖ = మొదలుగాఁగల, బహుముఖ=అనేకవిధములైన, వాద్య=వాద్యములయొక్క, నిస్వానంబులన్ =ధ్వనులచేత; అలరి=సంతసించి; తదేకమంగళంబు.—తత్ =ప్రసిద్ధమైన, ఏక=ముఖ్యమైన, మంగళంబు=వివాహరూపమంగళమును; అవలోకింపన్ = చూచుటకై; తివురన్ =ప్రయత్నింపఁగా; షడ్ద్వయవిభాకరులు=పన్నిద్దఱుసూర్యులు; తమతమప్రియజనంబులకరంబులకున్ =తమతమయిష్టజనులచేతులకు; ఒప్పగించియుంచినన్ =స్వాధీనపఱచిపంపఁగా; ఏతెంచి=వచ్చి; నిలుచుగురుసమాతతతేజోవిలాసలాలస్యమాన తత్కుమారశతశతంబులదారిన్.—నిలుచు=నిలుచుండినట్టియు, గురు=తండ్రులగునాదిత్యులవలెనే, సమాతత=విశాలమగు, తేజః=కాంతులయొక్క, విలాస=విలాసముచేత,లాలస్యమాన=మిగులవెలుఁగుచున్న, తత్ =ఆద్వాదశాదిత్యులయొక్క, కుమార=పుత్రులయొక్క, శతశతంబులదారిన్ =పదివేలవిధంబున; దయివాఱుపరిచారకపాణిభృతగంధతైలధారా దేదీప్యమానదీపికాసమూహంబులన్.—దయివాఱు=ఒప్పుచున్నట్టియు, పరిచారక=కొలువుకాండ్రయొక్క, పాణి = కరములందు, భృత=భరింపఁబడిన, గంధతైల = గందపునూనెయొక్క, ధారా=ఆసారముచే, దేదీప్యమాన=మిగులవెలుఁగుచున్న, దీపికా=దివిటీలయొక్క, సమూహంబులన్ = గుంపులను; వీక్షాలక్ష్యంబులుగాన్ =చూపులకుగోచరంబులనుగా; ఒనర్చుచున్ =చేయుచు; ఇరుగడలన్ =ఇరుప్రక్కలయందు; ఎడయీక=ఎడఁబాయక; అడరు=ఒప్పుచున్న; ఒయ్యారంబునన్ =విలాసముచేత; నడచు గణికాగణంబులన్ = నడచునాగవాసములను ; కనుంగొని = చూచి ; తొంగలించుమోహంబునన్ =అతిశయించుమోహముచేత; తదేకతానతన్ =తదేకాయత్తచిత్తతచేత; పొలుచునభోవితర్దికాసీననిర్జరస్తోమంబులపైన్.— పొలుచు = ఒప్పుచున్న, నభోవితర్దికా = ఆకాశమనువరఁగునందు, ఆసీన = కూర్చున్న, నిర్జరస్తోమంబులపైన్ = వేల్పుగములపై; కంతుండు = వలరాజు; తత్సమయసముచితబహు రూపంబులు.—తత్సమయ = ఆవేళకు, సముచిత=తగినట్టి, బహురూపంబులు = పలువిధములగురూపములను; అంగీకరించి = కైకొని; ప్రయోగించునిర్వేలజ్వాలాకుల జాజ్వల్యమానకలంబ కదంబకంబులడంబునన్.—ప్రయోగించు = విడుచునట్టి, నిర్వేల = మేరలేని, జ్వాలా = మంటలయొక్క, కుల=సమూహముచేత, జాజ్వల్యమాన=మండుచున్న, కలంబ=బాణములయొక్క, "కలంబమార్గణశరాః" అని అమరుఁడు,కదంబకంబుల=సమూహములయొక్క,డంబునన్ =విధమున; యంత్రకారవారంబులు = బాణయంత్రములు చేయువారియొక్కసమూహములు; ఒక్కమొత్తంబుగాన్ =ఒక్కుమ్మడిగా; ముట్టింపన్ =అంటింపఁగా; పఱచునాకాశబాణంబులన్.—పఱచు=పాఱుచున్న, ఆకాశబాణంబులన్ = ఆకాశచివ్వలను ; అవలోకించుచున్ =చూచుచు; సర్వసర్వంసహాజనశ్రవణపర్వంబుగాన్.—సర్వసర్వంసహా=ఎల్లపుడమియందుఁగల, జన=నరులయొక్క, శ్రవణపర్వంబుగాన్ =వీనులకుపండుగగా; నిజానవద్యపద్యగద్యంబులు.—నిజ=తనసంబంధులయిన, అనవద్య = నిర్దుష్టములైన, పద్యగద్యంబులు = పద్యములుగద్యములు ; చదువుచున్ =పఠించుచు; పఱతెంచుయాచకకవీశలోకంబులకున్.—యాచక=అర్థులకును; కవీశలోకంబులకున్ = కవులకును; ఆత్మీయబంధుమిత్ర దండనాథపురోహితముఖ్యులు.—ఆత్మీయ=తనసంబంధులగు, బంధు=బందుగులు, మిత్ర = నేస్తకాండ్రును, దండనాథ = సేనాపతులు, పురోహిత=పురోహితులు, ముఖ్యులు = అధిగాఁగలవారు ; దోయిళ్ళన్ = అంజలు

లచే; ముంచి= నించి; వెదచల్లునవరత్న సువర్ణ జాలంబులతోన్.—వెదచల్లు= పొఱలఁజల్లుచున్న, నవరత్న = నవరత్నములయొక్క, సువర్ణ = బంగరు నాణ్యములయొక్క, జాలంబులతోన్ =సమూహములతో; వైమత్యంబు=విరోధమును;ఊను కాముని కరకరశృంగసముత్పాత్యమానచారుధమనికాశిఖి స్ఫులింగి కానికాయంబులన్.—ఊను = పొందుచున్న, ఇది స్ఫులింగనికాయములకు విశేషణము, కాము= బాణములనుజేయు శిల్పులయొక్క, నికర = సమూహములయొక్క, కర = హస్తమందున్న, శృంగ = కొమ్ములవలన , సముత్పాత్యమాన = ఎగయింపఁబడిన, చారు=సుందరమగు, ధమనికా=గొట్టములయొక్క, శిఖి=అగ్నియొక్క, స్ఫులింగికా = మిడుఁగుఱులయొక్క, నికాయంబులన్=సమూహములను; కాంచి=చూచి, వేడుకఁబూనుచున్=సంతసమును బూనుచు; ఉత్తుంగమాతంగ చక్రాంగ సంఘాతసంఘటిత జయపతాకాగ్రతట హాటకపటాంచల కేటిక్యమాన పవమానధారా నిర్ధూతంబై.—ఉత్తుంగ= ఉన్నతమగు, మాతంగ = గజములయొక్క, చక్రాంగ = రథములయొక్క, సంఘాత = సమూహమందు, సంఘటిత = చేర్పఁబడిన, జయపతాకా=విజయధ్వజములయొక్క, అగ్రతట = అగ్రభాగమందున్న, హాటకపట = బంగరువస్త్రముయొక్క, అంచల = పార్శ్వభాగములను, కేటిక్యమాన = పొందుచున్న, పవమాన=వాయువులయొక్క, ధారా=ఆసారముచేత, నిర్ధూతంబై = ఎగయింపఁబడినదియై; స్వాశ్రయరూపజలద వ్రాతంబు.—స్వ=తనకు,ఆశ్రయరూప= ఉనికిపట్టగు, జలదవ్రాతంబు = మబ్బులగుంపు; దెసలకున్ = దిక్కులకు; పాఱి = పఱచి; చనన్ = పోఁగా; అంబరాంతరంబునన్ = ఆకసమునడుమ;నిలువనోపక = నిలుచుండలేక; దివిజరాజ రాజధాని కారావరుద్ధ ముదిరంబులన్.—దివిజరాజ రాజధాని = వేల్పులరాచవీడుయొక్క, కారావరుద్ధ = చెఱయుందుంపఁబడిన, ముదిరంబులన్ =మబ్బులను, "ఘనజీమూత ముదిరాః" యని అమరుఁడు; కదియన్ = పొందుటకై; పఱచు శంపాలతా వితానంబుల మేనులన్.—పఱచు—పాఱుచున్న, శంపాలతా = మెఱుపుతీవలయొక్క, వితానంబుల = సమూహంబులయొక్క, మేనులన్=శరీరములయందు; కురియుం తత్ప్రయాణ జంజన్యమాన స్వేదోదబిందుసందోహంబుల యందంబునన్.—కురియుం=వర్షించుచున్న, తత్ =ఆ మెఱుపుతీవలయొక్క, ప్రయాణ=ప్రకృష్టగమనమువలన, జంజన్యమాన= మిక్కిలిపుట్టుచున్న, స్వేదోదబిందు=చెమటనీటిబిందువులయొక్క, సందోహంబుల= సమూహములయొక్క, అందంబునన్ =సొంపుచేత; నక్షత్రమార్గాభియాయి నక్షత్రబాణగణ పాపట్యమాన గర్భస్థలీ సనీస్రస్యమాన పాండుజ్వలనకుళికాజాతంబులపైన్.—నక్షత్రమార్గ = ఆకాశమార్గమును, అభియాయి=పొందుచున్న, నక్షత్రబాణ=నక్షత్రబాణములయొక్క, గణ=సమూహముయొక్క, పాపట్యమాన=పగులుచున్న, గర్భస్థలీ= కడుపుపట్టులనుండి, సనీస్రస్యమాన = జాఱుచున్న, పాండు=తెల్లనైన, జ్వలనకుళికా=అగ్నియుండలయొక్క, జాతంబులపైన్ = సమూహములమీఁద; చూపులు=వీక్షణములను; నిలుపుచున్ = ఉంచుచు; అశేషజగజ్జన జేగీయమానచిత్రసృజనా పారీణ లోహాకారకాశిక వారంబులు.—అశేష=సమస్తమగు, జగత్=లోకములయందుండు, జన = నరులచేత, జేగీయమాన=నుతింపఁబడిన, చిత్రసృజనా=విచిత్రమగు పదార్థముల సృష్టియందు, పారీణ=పారంగతులగు, లోహాకార కాశిక వారంబులు =లోహకారులనువిశ్వామిత్రులసమూహములు; అపరిమితరంబులగున్ =పరిమితిలేనటులు; నిజచమూచక్రంబునన్.—నిజ=స్వకీయమగు,చమూచక్రం

బునన్ = చమత్కృతి చేత; పుట్టింపన్ =సృష్టి చేయఁగా; పట్టఁజాలమిన్ =ఇముడఁజాలకుండుటవలన; పగులువేధోండభాండమండలంబువలనన్.—పగులు=చీలిన, వేధోండభాండ=బ్రహ్మాండభాండముయొక్క, మండలంబువలనన్ = మండలాకారములవలన; బలువడిన్; వెడలి=వెలువడి;నలుదిక్కులకున్=నాలుగుదిక్కులకు; పఱచునుజ్జ్వలజ్యోతిర్జాతంబులతీరునన్.—పఱచు=పాఱుచున్న, ఉజ్జ్వలత్=ప్రకాశించుచున్న, జ్యోతిర్జాతంబుల తీరునన్ = రిక్కగుంపులపగిది; బంభజ్యమాణఘటబాణ పటలంబులన్.—బంభజ్యమాన = పగిలిన, ఘటబాణ = కుండబాణములయొక్క, పటలంబులన్ - సమూహములవలననుండి; నిర్గమించు నానాళిబాణంబులన్,—నిర్గమించు=బయలుదేఱుచున్న, నానా=అనేకవిధములగు, అళిబాణంబులన్.—తుమ్మెదబాణములను, లేదా, తేలుబాణములను; కాంచి=చూచి; మెచ్చుచున్=శ్లాఘించుచు; కబరికావిన్యస్తచాంపేయప్రసవచరీచర్యమాణపరాగపాళికావలయంబులున్ —కబరికా=ధమ్మిల్లమందు, విన్యస్త=ఉంచఁబడిన, చాంపేయప్రసవ=సంపెఁగపూలయందు, చరీచర్యమాణ=మిక్కిలిప్రసరించుచున్న, పరాగపాళికా=పుప్పొడిబంతులయొక్క, వలయంబులున్=కడియములును;అనఁగసంపెఁగపుష్పములయొక్క వలయాకృతినిబూనినపరాగములనిభావము;కమనీయధూమప్రరోహాంతరాంతరబనీభ్రశ్యమాన తనుతరానలకణాళికావలయంబులున్.—కమనీయ=మనోహరమగు, ధూమ=పొగయొక్క,ప్రరోహ=అంకురముయొక్క, అంతరాంతర=నడుమనడుమ, బనీభ్రశ్యమాన=పడుచున్న, తనుతర=అతిసూక్ష్మమగు,అనలకణ=అగ్నికణములయొక్క, ఆళికా=శ్రేణులయొక్క,వలయంబులులు=కడియములును;పరస్పరంబు=అన్యోన్యము;సతీర్థ్యత్వంబునన్=ఏకగురుత్వము చేత,అనగాసామ్యము చేతననుట;చూపట్టన్=చూపట్టుచుండఁగా; ఆపరాగపాళికావలయంబులును,అనలకణాళికావలయంబులును నొకటికొకటిసమానమై చూపట్టుచుండఁగ నని భావము; ఉదారభ్రమణయంత్రంబులన్.—ఉదార=ఉత్కృష్టమగు, భ్రమయంత్రంబులన్=తిరుగుయంత్రములయందు,మనుష్యులువిలాసార్థముగ నెక్కి గుండ్రముగఁదిరుగుయంత్రవిశేషములయందనుట; గుండ్రవరుసలు=గుండ్రముగాఁదిరుగుక్రమములను; తిరుగుతెఱగంటితెఱగంటికంటితోన్=తిరుగుచున్నమత్స్యమువంటినేత్రములుగలదేవాంగనతో; అద్వైతవాదంబులు=అభేదవాదములను; చేయుననల్పశిల్పికరయష్టికాగ్రబంభ్రమ్యమాణచక్రబాణచక్రంబులన్.—చేయు=తనర్చుచున్న,అనల్ప=అధికమగు,శిల్పి=శిల్పకారులయొక్క,కర=హస్తమందుండు, యష్టికా=దండములయొక్క, అగ్ర=అగ్రభాగమందు, బంభ్రమ్యమాణ=తిరుగుచున్న, చక్రబాణ=చక్రబాణములయొక్క, చక్రంబులన్ = సమూహములను; చూపునన్=దృష్టిచేత; ఆక్రమించుచున్ = అలముచు; తమోరిపుత్రీయమహామహోనివహంబులు.—తమః=అంధకారమునకు, అరి= శత్రుఁడగు సూర్యునియొక్క, పుత్రీయ=పుత్రుఁడగుయమునిసంబంధియగు, లేదా శనిగ్రహసంబంధియగు, మహత్=అధికమగు, మహః = కాంతులయొక్క, నివహంబులు=సమూహములను, అనఁగా నల్లనికాంతిసమూహములను; తృణీకరించి = తిరస్కరించి; నిరర్గళనీరంధ్రపట్టాతపవారణచ్ఛాయాకపటంబునన్.—నిరర్గళ = అప్రతిహతమగు, నీరంధ్ర=దట్టమగు; పట్టాతపవారణ= పట్టుగొడుగులయొక్క, ఛాయా = నీడయొక్క, కపటంబునన్=వ్యాజము చేత; పుడమినంతయున్=నేలనంత; ఆక్రమించు కటికిచీఁకటిన్=అలముచున్న గాఢాంధకారమును; కని=చూచి;భయంబు=వెఱపు; పుట్టన్=తోఁపఁగా; పాతా

ళంబు=పాతాళలోకమును; చొరఁబాఱి=ప్రవేశించి; అనేకదేశాధినాయక చమూసహచరణన్యాసంబులన్.—అనేక=అనేకులగు, దేశాధినాయక=దేశాధిపతులయొక్క, చమూ = సేనలయొక్క, సహచరణన్యాసంబులన్ = యుగపచ్చరణవిన్యాసములచేత; అచ్చటన్ = అయధోభువనమందు; నిలువలేక = నిలుచుండలేక; అవారిత వారవాణసాహోనినాద పాఫల్యమానధరాభాగంబునన్.— అవారిత = నివారించుటకుశక్యముగు, వారవాణ = కంచుకులయొక్క, "కంచుకో వారవాణోస్త్రీ" అని అమరుఁడు, సాహోనినాద=పరాకను ధ్వనులచేతను, పాఫల్యమాన = చీలిన, ధరాభాగంబునన్ = భూదేశమందు; ఒక్కమొత్తంబుగాన్ = ఒకసమూహముగా; గ్రక్కునన్ = శీఘ్రముగ; పైకిన్=మీఁదికి; వెడలు తైజస త్ర్యణుక పరంపరల పెంపునన్.—వెడలు = బయలుదేఱుచున్న, తైజస = తేజస్సంబంధులగు, త్ర్యణుక=త్రసరేణువులయొక్క, పరంపరల పెంపునన్ = పరంపరలయొక్క యతిశయమోయనునటులు; భ్రాంతిపుట్టింపన్ = భ్రమగలుగఁజేయునటులు; నిగుడుబిఱుసుల మిణుంగుఱులన్.—నిగుడు = వ్యాపించు, బిఱుసుల=బిఱుసులయొక్క, మిణుంగుఱులన్=మిడుఁగుఱులను; వీక్షించుచున్ = చూచుచు; నిరతసురతతివర్ణ్యమాన వితీర్ణిచాతురీ పోష్యమాణంబులు.—నిరత = నిరంతరము, సురతతి = వేల్పులగమిచేత, వర్ణ్యమాన = పొగడఁబడుచున్న, వితీర్ణి=దానముయొక్క, చాతురీ=చాతుర్యముచేత, పోష్యమాణంబులు=మిక్కిలి పోషింపఁబడినవి ; అగురారణ్యమాన మానితబిరుదశంఖ ధ్మానంబులన్.— అగు = అయినట్టియు, రారణ్యమాన = మిగుల మ్రోయుచున్న, మానిత=శ్రేష్ఠమగు, బిరుదశంఖ = సామర్థ్యచిహ్నములయొక్క, ధ్మానంబులన్ = ధ్వనులచేత ; తనశుభంబు = తనయొక్క శుభమును; తెలిసి=గుర్తెఱిఁగి; అదితిలకింపన్=ఆమంగళమును జూచుటకై; ఏతెంచిన సత్కీర్తిప్రవాహంబుపోలికన్.—ఏతెంచిన = చనుదెంచిన, సత్కీర్తి = శ్రేష్ఠమగు కీర్తియొక్క, ప్రవాహ=ప్రవాహముయొక్క, పోలికన్=రీతిచేత; ప్రకాశించున హార్వర్తికా మరీచి ధట్టంబులన్.—ప్రకాశించు=వెలుఁగుచున్న, అహర్వర్తికా=పగలువత్తులయొక్క, మరీచి=కాంతులయొక్క, ధట్టంబులన్ = సమూహములను; దృగ్ధామంబులన్.—దృక్ = దృష్టులయొక్క, ధామంబులన్=కాంతులచేత; కట్టుచున్=బంధించుచు; నిర్వేలసూర్యజ్యోతిః ప్రభావసద్యోంతర్హితుండగుటన్.—నిర్వేల=అధికమగు, సూర్యజ్యోతిః=బాణవిశేషములయొక్క, ప్రభావ=మహిమచేత, సద్యః = తత్కాలమందు, అంతర్హితుండగుటన్ = మఱుఁగుపడినవాఁడగుటచే; అన్నెలమిన్ననున్=చంద్రుని; కన్నులంగానక=చూడక; తాతప్యమానాంతరంబునన్.—తాతప్యమాన=పరితపించుచున్న, అంతరంబునన్=మనస్సుచేత ; వియత్తలంబునన్=ఆకసముపట్టున ; అంబుజారిబింబసత్త్వంబైనను.—అంబుజారిబింబ=చంద్రబింబముయొక్క, సత్త్వంబైనన్=సత్తైనను; కనుఁగొనుదుముగాక యని = చూచెదమని; చయ్యనన్=శీఘ్రముగ ; ఎగసి = పైకిలేచి; అగణితపారలోక సంఘసంఘర్షణోత్పతద్భుజాంగద మణిచూర్ణపరంపర.—అగణిత=లెక్కపెట్టరాని, పారలోక = పరలోకమందలి నిర్జరాదులయొక్క, సంఘ=సమూహముయొక్క, సంఘర్షణ=ఒరయుటచేత, ఉత్పతత్=ఎగయుచున్న, భుజ=బాహువులయొక్క, అంగద = కేయూరములయొక్క, మణి=మణులయొక్క, చూర్ణ = పొడియొక్క, పరంపర= సమూహము; నిండారన్=పరిపూర్ణముగ; కప్పినన్= కప్పఁగా; అచ్చటన్ = ఆస్థలమందు;

చూడనోపమిన్=చూడఁజాలమివలన; సంజాతమూర్ఛామహత్త్వంబునన్.—సంజాత=పుట్టిన, మూర్ఛా=మూర్ఛయొక్క, మహత్త్వంబునన్=మహిమచేత; గ్రక్కునన్=శీఘ్రముగ; ద్రెళ్లు నీలోత్పలకులంబుచెలువునన్.—ద్రెళ్లు=పడుచున్న, నీలోత్పల=నల్లగలువలయొక్క, కులంబు చెలువునన్=గుంపుయొక్క యందముచేత; వలుఁదకంబంబుల పయిన్.—వలుఁద=స్థూలమగు, కంబంబులపయిన్=స్తంభములమీఁదనుండి; జల్లునరాలు నీలోత్పలబాణకులంబులన్.—జల్లు నరాలు=జల్లుమనుశబ్దముతోఁబడుచున్న, నీలోత్పలబాణ=నల్లగలువబాణములయొక్క, కులంబులన్=సమూహములను; కని=చూచి; అలరుచున్=సంతోషించుచు; సుకరభ్రమరకప్రకరభాగ్యంబును.—సుకర=సులభమగు, భ్రమరక=ముంగురులయొక్క, తుమ్మెదలయొక్క, ప్రకర=సమూహముయొక్క, భాగ్యంబును=అతిశయమును; సురుచిరకైరవదళలోచన సమ్మదకృత్స్వరూపవైఖర్యంబును.—సురుచిర=మిక్కిలి మనోహరమైన, కైరవదళలోచన = తొవ రేకులవంటి కన్నులచేత, తొవ రేకులనెడుకన్నులచేతనని కుముదినీపరమగు నర్థము, సమ్మదకృత్=సంతసమునుజేయుచున్న, స్వరూప=ఆకృతియొక్క, వైఖర్యంబును=రీతియును; సుందరకింజల్క మాంజుల్యంబును.—సుందర=మనోజ్ఞమగు, కింజల్క=అకరువుయొక్క, కేసరములయొక్కయని కుముదినీపరమగునర్థము, మాంజుల్యంబును=చక్కఁదనమును; శోభిల్లన్=ప్రకాశించునటులు; ఉల్లసిల్లుసల్లకీపల్లవాధరామతల్లికలన్.—ఉల్లసిల్లు=ప్రకాశించు, సల్లకీపల్లవాధరామతల్లికలన్=అందుగుచిగురాకువంటిమోవిగలశ్రేష్ఠస్త్రీల యందు; సరసకళాపాళికారోచమానకువలయేశ సేవామనోరథంబునన్.—సరస=శ్రేష్ఠమగు, కళా=కాంతులయొక్క, పాళికా=శ్రేణిచేత, రోచమాన=ప్రకాశించు, కువలయేశ=చంద్రునియొక్క, సేవా మనోరథంబునన్=సేవింపవలెనను కోరికచేతను; ఏతెంచినకుముదలతికలంగాన్.—ఏతెంచిన=వచ్చిన, కుముదలతికలంగాన్ = కలువతీవలనుగా; తలంచి=తలఁచి; కుముదలతికలను భ్రాంతిచేత నని భావము; నభోంతరవావస్యమాన మరుస్నానవతీపాతిత సంతానలతాంతజాగళ్యమానమరందబిందుసందోహకుహనా మహితహిమపృషద్వర్షంబులకున్.—నభోంతర=ఆకాశమధ్యమందు, వావస్యమాన=నివసించియున్న, మరుస్నానవతీ=దేవాంగనలచేత, పాతిత=పడవైవఁబడిన, సంతానలతాంత=కల్పతరుపుష్పములవలన, జాగళ్యమాన=మిక్కిలి స్రవించుచున్న, మరందబిందు=మకరందపు చినుకులయొక్క, సందోహ=సమూహమనెడి, కుహనా = కపటముచే, మహిత = ఒప్పిన, హిమపృషత్ = మంచుబొట్లయొక్క, వర్షంబులకున్=వానలకు; ఎట్లోర్చునని=ఎటులుసహించునని; తన్మైత్రీగౌరవంబునన్.—తత్=ఆతొవతీవలయొక్క, మైత్రీ=మిత్రత్వమందు, గౌరవంబునన్=ఆదరముచేత; నీడగాఁజేరినచంద్రాతపమండలంబు బెడంగునన్.—నీడగాన్=అచ్ఛాదనగా, చేరిన=పొందిన, చంద్రాతపమండలంబు బెడంగునన్=వెన్నెలమండలంబు పగిది; కురంగలోచనామణులపైన్=స్త్రీలమీఁద; ఎత్తినయుల్లాభంబులపైన్=ఎత్తినమేలుకట్టులమీఁద; దృష్టి=చూపు; వెల్లవిరియించుచున్ = ప్రవహింపఁజేయుచు; అభంగురమార్దంగిక మృదంగధిమిర్ధిమిధ్వానంబులును.—అభంగుర=అధికములగు, మార్దంగిక=మృదంగమువాయించు వారియొక్క, మృదంగ=మృదంగ సంబంధులగు, ధిమిర్ధిమి ధ్వానంబులును=ధిమిర్ధిమిధ్వనులును; అతివేలతాళికతాళనిస్వానంబులును.—అతివేల = అధికమగు, తాళిక = తాళమును వాయించువారియొక్క, తాళ=తాళములయొక్క, నిస్వానంబులును = ధ్వనులును; అనూనవాంశికవంశికానేకరాగతా

నంబులును.— అనూన=అధికమగు, వాంశిక = వేణువాద్యము వాయించువారియొక్క, వంశిక = వేణువాద్యములయొక్క, అనేక=అనేకములగు, రాగ=భైరవ్యాదిరాగములును. తానంబులును= తయను యక్షరమును జేర్చి పాడునట్టి పాటలును; అసమానగాయక గానంబులును.—అసమాన= సరిలేని, గాయక=గానముఁ జేయువారియొక్క, గానంబులును=గీతములును; అతిశయిల్లన్ = అతిశయింపఁగ; ఆత్మీయతాండవ విలాసప్రతిమానభావనరీనృత్యమాన సురమీనలోచనా జనంబులమీఁదికిన్.—ఆత్మీయ=తమసంబంధియగు, తాండవ=నాట్యముయొక్క, విలాస = క్రీడతోఁటి, ప్రతిమానభావ = సాదృశ్యముయొక్క, భావనా = భావనచేత, నరీనృత్యమాన = మిగుల నాట్యముఁజేయుచున్న, సురమీనలోచనా జనంబులమీఁదికిన్=వేల్పుమచ్చెకంటుల మీఁదికి; కుప్పించి = ఎగసి; తిరస్కరించి = తెగడి; మరలంజేరుతీరునన్ = మరలవచ్చు పగిది; లాఁగులువైచుచున్ = గంతులువేయుచు; పఱతెంచు బిరుదుపాత్రలన్ = ఏతెంచునట్టి సామర్థ్యముగలవేశ్యలను; నేత్రంబులన్ = కన్నులచేత; ఆనుచున్ = క్రోలుచు, చూచుచునని భావము; అసదృశంబును = సరిలేనిదియును; అవాఙ్మన సగోచరంబును = మనోవాక్కులకు గోచరముగానిదియును; అత్యద్భుతంబును=అతివిస్మయకరంబును; అభూతపూర్వంబును=మున్నెన్నఁడునులేనిదియును; అనితరలభ్యంబును=ఒరులకుఁబొంద నలవిగానిదియును; అగువైభవంబునన్=అగునట్టి విభవముచేత; పాంచాలభూపాలమందిరంబు=క్షణదోదయరాజగృహమును; చేరంజనుసమయంబునన్=చేరఁబోవుసమయమందు. దీనికుత్తర పద్యప్రక్రియతో నన్వయము.

శా. ఛద్మాన్యాంకురితత్రపాభరయుతేక్షారీతి నాలేఖరా
ట్పద్మిం జక్కఁగ నెక్కి వచ్చుధరణీభర్తం గనం దత్పురీ
పద్మాస్యామణు లెల్ల సమ్మదము లొప్పం జేరి రంచు న్శిర
స్సద్మౌఘంబుల నూపురార్భటిక లోజం జాటె వేగస్థితిన్. 49

టీ. ఆలేఖరాట్పద్మిన్=ఐరావతమును; చక్కఁగన్=సుందరముగా; ఎక్కి=అధిష్ఠించి; వచ్చుధరణీభర్తన్ = వచ్చుచున్నసుచంద్రుని; ఛద్మాన్యాంకురితత్రపా భరయుతేక్షారీతిన్.—ఛద్మాన్య=అకపటముగా, అంకురిత=పొడమిన, త్రపా=లజ్జయొక్క, భర = అతిశయముతో, యుత=కూడుకొన్న, ఈక్షారీతిన్=వీక్షణములయొక్క భంగిచేత; కనన్=చూచుటకు; తత్పురీపద్మాస్యామణులెల్లన్=ఆపురకాంతలెల్లరు; సమ్మదములు=సంతసములు; ఒప్పన్= అతిశయింపఁగా; శిరస్సద్మౌఘంబులన్.—శిరస్సద్మ=మేడలయొక్క, ఓఘంబులన్ = సమూహములయందు; చేరిరంచున్=వచ్చిరనుచు; నూపురార్భటికలు.— నూపుర=అందెలయొక్క, ఆర్భటికలు = కోలాహలములు; ఓజన్=క్రమమున; వేగస్థితిన్ = శీఘ్రముగ; చాటెన్ = చాటించెను.

సుచంద్రుఁడు వేల్పుటేనుఁగు నెక్కి పురవీథియందు వచ్చుచుండఁగాఁ దత్పురకాంతలెల్లరు నారాజచంద్రుని సమ్మదమునఁ జూచుటకు మేడ లెక్కిరని యాకాంతలనూపురార్భటి యెల్లరికిని దెలియుటకై చాటి వినిచెనని భావము.

సీ. పుణ్యవాసన పొంగి ♦ పొరలె నాఁ జెమట పై
కొనఁ గప్పురపుఁబూఁత ♦ గుమ్మురనఁగఁ
బరువూనుబుద్ధి వెం♦బడిఁ బర్వురాగంబు
గతిఁ జలన్మణిహార♦కాంతి నిగుడఁ
త్వర నేగ దృక్ప్రేషి♦తవయస్య దెల్పు దా
రి వతంసితాబ్జాత♦భృంగి మ్రోయ
మోమునభఃకాల♦మునఁ గైశ్యఘనసీమ
సొరుమించ న హైమ♦సరము వ్రాల

తే. నలక లరవీడఁ దనుఁ జూచి ♦ యలరి వాడ
సకులు గొనియాడ నంఘ్రుల ♦ జవము గూడఁ
జొక్కమగు మేడ కేతెంచె ♦ నొక్కప్రోడ
యింపు దొలఁకాడ గోత్రామ♦రేంద్రుఁ జూడ. 50

టీ. పుణ్యవాసన.—పుణ్య=మనోజ్ఞమైన, వాసన=వలపు; పొంగి=ఉబికి; పొరలెనాన్=పొర్లినోయన; చెమట=స్వేదము; పైకొనన్=కలియఁగా; కప్పురపుఁబూఁత=కర్పూరగంధము; గుమ్మురనఁగన్=గుమ్మనివాసనగొట్టఁగా; పరువూనుబుద్ధి వెంబడిన్=పరుగెత్తుచున్నమతివెంట; పర్వురాగంబుగతిన్=వ్యాపించునట్టిఅనురాగముపగిది; చలన్మణిహారకాంతి=కదలుచున్నమణిసరములయొక్క కాంతి; నిగుడన్=వ్యాపింపఁగా; త్వరన్=త్వరచేత; ఏగన్=పోవుటకు; దృక్ప్రేషితవయస్య దెలుపు దారిన్=దృష్టిచేతపంపఁబడినచెలియ దెలుపుపగిది; వతంసితాబ్జాతభృంగి.—వతంసిత=అవతంసముగాఁజేయఁబడిన, అబ్జాత=కమలమందలి, భృంగి=ఆఁడుతుమ్మెద; మ్రోయన్=మొరయఁగా; మోమునభఃకాలమునన్=ముఖమనువర్షాకాలమందు; కైశ్యఘనసీమన్=కేశసంఘమను మేఘమునందు; సొరుమించనన్=మనోజ్ఞమగు మెఱపునట్లు; హైమసరము=చంపకసరము; వ్రాలన్=ఒఱగుచుండఁగా; అలకలు=ముంగురులు; అరవీడన్=సగమువీడఁగా; తనున్=తన్ను; చూచి, అలరి=సంతసించి; వాడసకులు=పొరుగుచెలులు; కొనియాడన్=పొగడఁగా; అంఘ్రులన్=అడుగులయందు; జవముగూడన్=వేగము చేరఁగా; ఇంపు=సొంపు; తొలఁకాడన్=అతిశయింపఁగా; గోత్రామరేంద్రుఁజూడన్=నుచంద్రుఁడను పేరుగలభూలోకదేవేంద్రునిచూచుటకై; ఒక్కప్రోడ=ఒకప్రౌఢస్త్రీ; చొక్కమగు మేడకున్=శ్రేష్ఠమగుసౌధమునకు; ఏతెంచెన్=వచ్చెను.

మంచిపరిమళము పొంగెనా యనఁజెమట పైకొనఁ గర్పూరగంధపువాసన పరిమళించుచుండఁగా, పరుగెత్తుబుద్ధి వెంబడి ననురాగము వలెనెమణిహారకాంతివ్యాపించుచుండఁగా, (మణికాంతి బుద్ధివెంబడిపోవుచున్న అనురాగమున్నటులున్నదని హృదయము) త్వరగాఁబోవుటకై

దృష్టిచేఁ బంపఁబడిన చెలియ దెలుపు పగిది అలంకారార్థము ధరియించిన తామరలోనున్న భృంగము అఱచుచుండఁగా, ముఖమను వర్షాకాలమందు కైశ్యమను మేఘమందు మెఱుపువలెఁ జంపకసరము వ్రేలాడఁగా, ముంగురులు వీడఁగ, పోవుచున్న తన్నుఁ జూచి పొరుగు చెలియ లందఱు కొనియాడుచుండఁగ, సుచంద్రుని జూడ, నొకకాంత వచ్చెనని భావము.

చ. తిలకము దీర్చి దీర్పక స • తీమణి యొక్కతె హీరదర్పణం
బలరఁ గరంబునం జనవ • రాగ్రణిఁ గన్గొన వచ్చె ధామమం
డలి నిను లోకబాంధవు ఖ • డాఖడి నేఁచినయట్టిచల్లమిం
చులదొరఁ బట్టి తెచ్చితిని • చుమ్మని చేరు దినాధిదేవినాఁ. 51

టీ. సతీమణి యొక్కతె=స్త్రీరత్నమగు నొకకాంత; తిలకము దీర్చి దీర్పక=బొట్టు దిద్ది దిద్దకయె; హీరదర్పణంబు=వజ్రమయమగు నద్దము; కరంబునన్ = కేలున; అలరన్=ఒప్పుచుండఁగా; జనవరాగ్రణిన్ = రాజశ్రేష్ఠుఁడగు సుచంద్రుని; కన్గొనన్=చూచుటకై; ధామమండలిన్.—ధామ=కాంతి యొక్క, మండలిన్=సమూహముచేత, ప్రతాపపుంజముచేతననిదోఁచుచున్నది; లోకబాంధవున్=లోకప్రియుఁడవగు, సూర్యుఁడని తోఁచుచున్నది; నినున్=నిన్ను; ఖడాఖడి=కఠినముగా; ఏఁచినయట్టిచల్లమించులదొరన్.—ఏఁచిన=శ్రమపెట్టిన, అట్టిచల్లమించులదొరన్=అటువంటి చంద్రుని; పట్టి=పట్టికొని; తెచ్చితిని = తీసికొనివచ్చితిని; చుమ్మని=చూడుమనుచు; చేరు దినాధిదేవినాన్ = సమీపించిన దినాధిదేవతయో యనునటులు, వచ్చెన్=వచ్చెను.

ఒకకాంత రవలయద్దము కేలఁ బూని బొట్టు దిద్ది దిద్దకయె, నిన్నుఁ బూర్వము బాధించిన చంద్రుని బట్టి తెచ్చితిఁ జూడుమని వచ్చు దినాధిదేవతయో యనునటులు, సుచంద్రునిఁ జూచుటకై వచ్చెనని భావము. ఈపద్యమందు త్ప్రేక్షాలంకారము.

చ. తరుణి యొకర్తి వేగజని • తశ్రమవాఃపరిపృక్తమానితాం
బరయయి పైఁట జాఱ నెదఁ • బాణి ఘటించి మహిస్థలీపురం
దరుఁ గన నేగుదెంచెఁ గడు • దక్కితి నీకని నిర్మలాత్మతో
నిరుపమచిత్తవాసగత • నీరరుహాంబక ముట్టుపోలికన్. 52

టీ. తరుణి యొకర్తి=ఒకయువతి; వేగజనితశ్రమవాఃపరిపృక్తమానితాంబరయయి.—వేగ=వేగముచేత, జనిత=పుట్టింపఁబడిన, శ్రమవాః=స్వేదోదకముచేత, పరిపృక్త=తడుపఁబడిన, మానిత=శ్రేష్ఠమగు, అంబరయయి=వస్త్రముగలదియై; పైఁట=పయ్యెద; జాఱన్=జాఱుచుండఁగా; ఎదన్=ఱొమ్మున; పాణిన్=హస్తమును; ఘటించి=ఉంచి; మహిస్థలీపురందరున్=భూలోకదేవేంద్రుని; కనన్=చూచుటకై; కడున్=మిక్కిలి; నీకు దక్కితిన్ = నీకు స్వాధీనయయితిని. అని=ఈప్రకారము చెప్పి; నిర్మలాత్మతోన్=నిర్మలాంతఃకరణముతో; నిరుప

మచిత్తవాసగత నీరరుహాంబకున్.—నిరుపమ=నిస్సమానమగు, చిత్త=హృదయమునందు, వాస=వసతిని, గత=పొందిన, నీరరుహాంబకున్=కమలాక్షుని, కమలబాణములుగల మన్మథునినని స్వభావార్థము; ముట్టుపోలికన్=స్పృశించుపగిది; ఏగుదెంచెన్=వచ్చెను.

ఒకకాంత సుచంద్రుని జూచుటకై అతివేగమువలన నైన చెమటచేఁ దడుపఁబడిన వస్త్రముగలదై పైఁటకొంగు వేగిరపాటుచే జాఱఁగా దానిసవరించుటకై ఎదఁబాణిఁజేర్చి వచ్చుచుండఁగా, హృదయగత నీరరుహాంబకుని స్పృశించి నిక్కముగ నీకు దక్కితినని చెప్పిన దానివలె, నుండె నని భావము. అనఁగా నార్ద్రవస్త్రముతో భగవంతుని ముట్టిప్రమాణము చేసి నిక్కముగ నీకుదక్కితినని చెప్పుచున్నదానిపగిది వచ్చెనని ముఖ్యాశయము.

మ. కనకాంగీతిలకం బొకర్తు పతి సిం◆గారించుచుం గేల నూ
తనముక్తావళి వ్రేల వచ్చె నలగో◆త్రాకాంతు వీక్షింపఁ జ
క్కనిక్రొమ్మొగ్గలపేరు పూని లలిమైఁ◆గందర్పసామ్రాజ్యల
క్ష్మి నవేహ న్వరియింపఁ జేరె నని నె◆మ్మిం జూపఱు ల్మెచ్చఁగన్. 53

టీ. కనకాంగీతిలకంబు=నారీతిలకమగు; ఒకర్తు=ఒకకాంత; పతిన్=పెనిమిటిని; సింగారించుచున్=అలంకరించుచు; కేలన్=హస్తమందు; నూతనముక్తావళి=క్రొత్తముత్యపుపేరు; వ్రేలన్=వ్రేలాడుచుండఁగా; అలగోత్రాకాంతున్=ఆసుచంద్రుని; వీక్షింపన్=చూచుటకై; చక్కనిక్రొమ్మొగ్గలపేరు=అందమగు క్రొత్తమొగ్గలసరమును; పూని=గ్రహించి; లలిమైన్=ప్రేమచేత; కందర్పసామ్రాజ్యలక్ష్మి.—కందర్ప=మన్మథునియొక్క, సామ్రాజ్య=సమ్రాట్టుతనముయొక్క, లక్ష్మి=కమల; నవేహన్.—నవ=నూతనమైన, ఈహన్=వాంఛచేత; వరియింపన్=కోరుటకు; చేరెన్=వచ్చెను. అని=అనుకొనుచు; నెమ్మిన్=ప్రేమతో; చూపఱుల్=చూచుచుండువారు; మెచ్చఁగన్=పొగడఁగా; వచ్చెన్=ఏతెంచెను.

అనఁగా నొకనారీతిలకము తనపతినలంకరించుచుఁ గరమందు ముక్తాసరమును గైకొని యాసుచంద్రునిఁ జూడ మదనసామ్రాజ్యలక్ష్మి యితనిని వరియించుటకు మొగ్గలదండదీసికొని వచ్చెనని చూపఱులు మెచ్చునట్లు వచ్చెనని భావము.

చ. తరళితపారిజాతసుమ◆దామకవాసన పిక్కటిల్ల వి
స్ఫురదహిశత్రురత్నమయ◆భూషణదీధితి పర్వ నొక్కసుం
దరి నృపుఁ గాంచ వచ్చె వడిఁ◆దద్విభవంబు సురేంద్రవైభవేం
దిర నెకసక్కెమాడ జగ◆తిం గన నొందుమఘోని తీరునన్. 54

టీ. తరళితపారిజాతసుమదామకవాసన.—తరళిత=చలించిన, పారిజాతసుమదామక=పారిజాతపుష్పసరముయొక్క, వాసన=వలపు, వేల్పులప్రాఁకు పువ్వులసరముయొక్కవలపని

శచీపరమగునర్థము;పిక్కటిల్లన్=అతిశయింపఁగా;విస్ఫురదహిశత్రురత్నమయభూషణదీధితి.—విస్ఫురత్=ప్రకాశించుచున్న, అహిశత్రురత్నమయ=గరుడపచ్చలమయమైన,భూషణ=ఆభరణములయొక్క,దీధితి=కాంతి,ఇంద్రనీలమణిమయ భూషణకాంతియని శచీపరమైన యర్థము, పర్వన్=వ్యాపింపఁగా; ఒక్కసుందరి=ఒకకాంత; నృపున్=సుచంద్రుని;కాంచన్=చూచుటకై; వడిన్=వేగముతో; జగతిన్=భూమియందు; తద్విభవంబు=ఆసుచంద్రునిసంపద; సురేంద్రవైభవేందిరన్=ఇంద్రవిభవలక్ష్మిని; ఎకసక్కెమాడన్=పరిహసించుచుండఁగా; కనన్=చూచుటకై; ఒందుమఘోనితీరునన్=వచ్చుశచీదేవివలె; వచ్చెన్=వచ్చెను.

అనఁగా నొకకాంత పారిజాతసుమసరముయొక్క వాసన పర్వుచుండఁగా అహిశత్రురత్నమయ భూషణములకాంతి అతిశయింపఁగానీసుచంద్రునిజూడఁ,బుడమి నింద్రసంపదను హసించు నీసుచంద్రుని సంపదను జూడ వచ్చినశచీదేవివలె వచ్చె ననిభావము.

మ. అనురాగంబునకన్న మున్ను హృదయం • బాసన్నసౌవీథిక
న్నను ము న్వీక్షణపంక్తి యంతకును ము • న్పాదప్రవేగంబు చా
ల నహంపూర్విక నొంద వచ్చె నతిహే • లావైభవశ్రీయుతిన్
ఘనవేణీతిలకం బొకర్తు ధరణీ • కాంతాగ్రణిం గన్గొనన్. 55

టీ. ఘనవేణీతిలకంబు=కాంతాతిలకమగు;ఒకర్తు=ఒకకాంత; ధరణీకాంతాగ్రణిన్=భూపతిశ్రేష్ఠుఁడగు సుచంద్రుని; కన్గొనన్=చూచుటకై; అతిహేలావైభవశ్రీయుతిన్.—అతిహేలా=అతి విలాసముయొక్క, వైభవ=విభవముయొక్క, శ్రీ=కాంతియొక్క, యుతిన్=యోగము చేత; అనురాగంబున కన్నన్=అనురక్తికంటె; మున్ను=ముందు; హృదయంబు=చిత్తము;ఆసన్నసౌవీథికన్నను=ఆమేలిహృదయప్రదేశమునకన్న;మున్=ముందు; వీక్షణపంక్తి=దృక్శ్రేణి; అంతకునున్=అంతకంటెముందు; పాదప్రవేగంబు=అంఘ్రులజవము; చాలన్=మిక్కిలి; అహంపూర్వికన్ = నేనుముందు నేను ముందనుటను; ఒందన్ = పొందఁగా; వచ్చెన్=వచ్చెను.

ఒకకాంత మిక్కిలి విలాసముతో ననురాగహృదయవీక్షణపాదవేగములు అహంపూర్వికనొందునట్లు వచ్చెనని భావము.

మ. సకిచాలిట్లుశుభాప్తి వచ్చుపతిఁ గాం • చం జేరి యవ్వేళ మౌ
క్తికజాలాక్షతపాళిఁ జల్లె నలధా • త్రీనేతపై మల్లికా
ప్రకరంబుల్ మధుమాసలక్ష్మి వరియిం • పం బెంపుతో వచ్చుచై
త్రికుమీఁదన్ సుమజాలకేసరము లెం • తే వైచుచందంబునన్. 56

టీ. సకిచాలు=సకియలబంతి; ఇట్లు=వక్ష్యమాణప్రకారముగ; శుభాప్తిన్=శుభలక్షణప్రాప్తిచేత; వచ్చుపతిన్=వచ్చుచున్న సుచంద్రుని; కాంచన్=చూచుటకై; చేరి=పొంది;

అప్వేళన్ = ఆసమయమందు; మౌక్తికజాలాక్షతపాళిన్.— మౌక్తికజాల = ముత్యములగుంపును, అక్షతపాళిన్ = అక్షతశ్రేణిని; అలధాత్రీనేతపైన్ = ఆసుచంద్రునిమీఁద; మధుమాసలక్ష్మి = వసంతలక్ష్మి; వరియింపన్ = వరించుటకై; పెంపుతో వచ్చుచైత్రికుమీఁదన్ = అతిశయముతో వచ్చువసంతునిమీఁద; మల్లికాప్రకరంబుల్ = మల్లికాకుసుమ సమూహములను; సుమజాలకేసరములు = పుష్పజాలకింజల్కములను; ఎంతేన్ = మిక్కిలి; వైచుచందంబునన్ = చల్లువిధముగ; చల్లెన్ = చల్లెను.

అనఁగా వసంతలక్ష్మి వరియించుటకై వచ్చుచైత్రునిమీఁద తెల్లనిమల్లికలను పచ్చని కుసుమకేసరములను చల్లువిధముగ నీసుచంద్రునిపై చూడవచ్చినపురకాంతలు మౌక్తికములను అక్షతలను చల్లి రని భావము.

మ. జలజాప్తాన్వయమౌళి యప్పు డలపాంచాలేంద్రచంచన్మణీ
నిలయాభ్యంతికసీమ లేఖవరదంతిం డిగ్గి యష్మేటి యు
త్కలికాసంపదచే నెదుర్కొన లతాగాత్రీశిరోరత్నమం
డలి యారాత్రికముల్ ఘటింప బుధసంతానంబు దీవింపఁగన్. 57

టీ. జలజాప్తాన్వయమౌళి = సూర్యవంశశ్రేష్ఠుఁడగు సుచంద్రుఁడు; అప్పుడు = ఆసమయమందు; అలపాంచాలేంద్రచంచన్మణీనిలయాభ్యంతికసీమన్.— అలపాంచాలేంద్ర = ఆక్షణదోదయునియొక్క, చంచత్ = ప్రకాశించుచున్న, మణీనిలయ = మణిమయగృహముయొక్క, అభ్యంతికసీమన్ = సమీపప్రదేశమందు; లేఖవరదంతిన్.— లేఖవర = ఇంద్రునియొక్క, దంతిన్ = ఐరావతమును; డిగ్గి = దిగి; అష్మేటి = అక్షణదోదయుఁడు; ఉత్కలికాసంపదచేన్ = సంతోషాతిశయముచేత; ఎదుర్కొనన్ = ఎదురుకొనఁగా; లతాగాత్రీశిరోరత్నమండలి = నారీశిరోమణుల సమూహము; ఆరాత్రికముల్ = ఆరతులను; ఘటింపన్ = ఘటిల్లఁజేయఁగా; బుధసంతానంబు = విద్వాంసులయొక్క సమూహము; దీవింపఁగన్ = ఆశీర్వదింపఁగా. దీకి నుత్తరపద్యస్థక్రియతో నన్వయము.

చ. లలితసువర్ణవేత్రికకులంబు బరాబరి యూన్పఁ జెంతలం
గలసి నిజాప్తబంధుమహీకాంతచయుం బరుదేర నెక్కొనె
చ్చెలికయిదండఁ జేకొని వచింపఁగ రానియొయార మెచ్చ ని
ర్మలినవివాహరత్నమయమండపరాజముఁ జేరె నయ్యెడన్. 58

టీ. లలితసువర్ణవేత్రికకులంబు, లలిత = మనోజ్ఞమైన, సువర్ణవేత్రిక = బంగరుబెత్తపువారలయొక్క, కులంబు = సమూహము; బరాబరి = హెచ్చరికను; ఊన్పన్ = చేయుచుండఁగా; చెంతలన్ = ఇరుప్రక్కలయందు; కలసి = కలిసికొని; నిజాప్తబంధుమహీకాంతచయంబు.— నిజ = స్వకీయులగు, ఆప్త = మిత్త్రులును, బంధు = బంధుగులు, మహీకాంత = రాజులు, చయంబు = వీరల

యొక్క సమూహము; అరుదేరఁగ = ఎచ్చుచుండఁగా; ఒక్కనెచ్చెలికయిదండఁ = ఒకసేస్తకానిహస్తమును; చేకొని = గ్రహించి; వచింపఁగరానియొయ్యారము = చెప్పనలవిగానివిలాసము; ఎచ్చన్ = అతిశయింపఁగా; నిర్మలినవివాహరత్నమయమండపరాజము.—నిర్మలిన = పరిశుద్ధమగు, వివాహ = వివాహసంబంధియగు, రత్నమయ = మణిమయమగు, మండపరాజమున్ = మండపశ్రేష్ఠమును; చేరెన్ = పొందెను. అయ్యెడన్ = ఆసమయమందు. పైపద్యముతో నన్వయము.

క. నరపతి పాంచాలక్షితి, వరుపనుపునఁ గనకపీఠి • వసియించి యన
ర్ఘ్యరుచిఁ గనుపట్టెఁ బ్రాజ్య
హి,ధరవీథిం బొలుచుతుహిన • ధాముని చాయన్.

టీ. నరపతి = సుచంద్రుఁడు; పాంచాలక్షితివరుపనుపునన్ = క్షణదోదయునియాజ్ఞ చేత; కనకపీఠిన్ = బంగరుపీఁటయందు; వసియించి = కూర్చుండి; అనర్ఘ్యరుచిన్.—అనర్ఘ్య = వెలలేని, రుచిన్ = కాంతి చేత; ప్రాజ్యహిధరవీథిన్ = పొడుపుకొండపట్టున; పొలుచుతుహినధామునిచాయన్ = కానవచ్చుచున్న చందమామపగిది; కనుపట్టెన్ = చూపట్టెను.

సుచంద్రుఁడు క్షణదోదయునిపంపున బంగరుపీఁటమీఁద కూర్చుండి ఉదయపర్వతమందుఁ గానవచ్చుచంద్రునివలెఁ జూపట్టె నని భావము. ఉపమాలంకారము.

చ. విమలబుధాంతరంగనవ • విస్మయదంబు మహాసదృక్షరా
ట్ప్రమదకరంబు లై దనరు • భవ్యమహంబునఁ బొల్చుపూరుషో
త్తముపద ముల్లసత్ప్రియవి • ధానముతోఁ గడిగెం బ్రజేశుఁ డా
త్మమహిళ నించుదివ్యజల • ధారలఁ గాంచనపాత్రి నత్తఱిన్. 60

టీ. విమలబుధాంతరంగనవవిస్మయదంబు.—విమల = స్వచ్ఛమైన, బుధ = విద్వాంసులయొక్క, అంతరంగ = మనమునకు, నవవిస్మయదంబు = నూతనమగునచ్చెరువు నిచ్చుచున్నదియు; మహాసదృక్షరాట్ప్రమదకరంబులై.—మహాత్ = అధికులగు, అసదృక్ష = సరిలేని, రాట్ = రాజులకు, ప్రమదకరంబులై = సంతసము నిచ్చుచున్నదియునై; తనరుభవ్యమహంబునన్.—తనరు = ఒప్పుచున్నదియు, భవ్య = మంగళకరమైన, మహంబునన్ = తేజస్సు చేత; పొలుచుపూరుషోత్తముపదము = ప్రకాశించుచున్న పురుషశ్రేష్ఠుఁడగు సుచంద్రునియొక్క పాదమును; ఉల్లసత్ప్రియవిధానముతోన్.—ఉల్లసత్ = ప్రకాశించుచున్న, ప్రియ = ప్రియమగు, విధానముతోన్ = విధిచే, శాస్త్రచోదితమార్గము చేననుట; ప్రజేశుఁడు = క్షణదోదయరాజు; ఆత్మమహిళ = తనయొక్క కాంత; నించుదివ్యజలధారలన్.—నించు = పూరించుచున్న, దివ్య = మనోజ్ఞమగు, జలధారలన్ = ఉదకధారలచేత; కాంచనపాత్రిన్ = సువర్ణపాత్రయందు; కడిగెన్ = కడిగెను. ఇచట, విమలమగు, బుధ = దేవతలయొక్క, యంతరంగమునకు, నవవిస్మయదంబును; మహాత్ = అధికుఁడగు, సత్ = శ్రేష్ఠుఁడగు, ఋక్షరాట్ = చంద్రునకు, ప్రమదకరంబును; పూరుషోత్తముపదము = విష్ణుపాదమును; ప్రజేశుఁడు = బ్రహ్మ; ఆత్మమహిళ = సరస్వతీదేవి నించుదివ్యజలధారలచేత కడిగెనను నర్థాంతరము దోఁచుచున్నది. అత్తఱిన్ = ఆసమయమందు. దీనికి క్రింది షద్యముతో నన్వయము.

చ. యువతులు పాటఁ బాడఁగ న♦వోత్కలికన్ శుభమంత్రజాలకం
బవనిసురాళిక ల్దెలుప ♦ నాక్షణదోదయరాజొసంగునిం
పవుమధుపర్కమన్నృపకు♦లాగ్రణికుత్సవమూన్చెఁ జంద్రికా
ధవళవిలోచనాధరసు♦ధారస మిట్టిదె యన్న కైవడిన్. 61

టీ. యువతులు=కాంతలు; పాటఁబాడఁగన్=పాటపాడుచుండఁగా; అవనిసురాళికల్=భూసురసంఘములు; నవోత్కలికన్.— నవ=నూతనమగు, ఉత్కలికన్=సంతసముచేత; శుభమంత్రజాలకంబు.—శుభ=మంగళకరమగు, మంత్ర=మంత్రములయొక్క, జాలకంబు=సమూహమును; తెలుపన్=తెలియఁజేయఁగా; ఆక్షణదోదయరాజు; ఒసంగు నింపవు మధుపర్కము.—ఒసంగు=ఇచ్చిన, ఇంపవు=మనోహరమగు, మధుపర్కము=పెరుఁగుతోకలిసిన తేనె మొదలగునది, వివాహమందు వరునికి కన్యాదాత మధుపర్కము నొసంగుట ప్రసిద్ధము; అన్నృపకులాగ్రణికిన్=ఆసుచంద్రునకు; ఉత్సవము=వేడుకను; చంద్రికాధవళవిలోచనాధరసుధారసము.—చంద్రికాధవళవిలోచనా=చంద్రికయనుకాంతయొక్క, అధరసుధారసము = మోవియొక్కయమృతరసము; ఇట్టిదె=దీనికిసమమైనదె; అన్నకైవడిన్ = అనినరీతిగా; ఊన్చెన్ = చేసెను.

సుచంద్రునకు క్షణదోదయుఁ డొసంగినమధుపర్కము చంద్రికయొక్కమోవితేనె యిట్టిదే యనితెలిపినపగిది సంతసమూన్చె ననిభావము.

చ. కనకపుగద్దె నొప్పుమహీ♦కాంతునిముంగల నప్డు చక్కఁ దా
ర్చినబలుచెంద్రకావితెర ♦ జిష్ణుదిశాధరభాసమానసూ
ర్యనికటశోభిసాంధ్యరుచి♦యందము గైకొనెఁ బద్మినీవిలో
చనకమలానుమోదరస♦జాతము మిక్కిలి హెచ్చఁ జేయుచున్. 62

టీ. అప్డు=ఆసమయమందు; కనకపుగద్దెన్ = బంగరుపీఠమందు; ఒప్పుమహీకాంతునిముంగలన్ = ఒప్పుచున్నసుచంద్రునియెదుట; తార్చినబలుచెంద్రకావితెర = రచియించిన గొప్పచెంద్రకావివన్నెగల కాండపటము; పద్మినీవిలోచనకమలానుమోదరసజాతము.—పద్మినీ=పద్మినీజాతి స్త్రీలయొక్క, పద్మలతలయొక్క, విలోచనకమల = తామరలవంటికన్నులకు, కన్నులవంటి తామరలకు, అనుమోదరస=సంతోషరసములయొక్క, జాతము=గుంపును; హెచ్చఁజేయుచున్ = అతిశయింపఁజేయుచు; తార్పన్=రచియింపఁగా; జిష్ణుదిశాధరభాసమానసూర్యనికటశోభి సాంధ్యరుచియందము.—జిష్ణుదిశాధర=పొడుపుకొండయందు, భాసమాన=వెలుఁగుచున్న, సూర్య = సూర్యునియొక్క, నికట=సమీపమందు, శోభి=ప్రకాశించుచున్న, సాంధ్య=ఉదయసంధ్యాసంబంధియగు, రుచి=కాంతియొక్క, అందము=సౌందర్యమును ; కైకొనెన్=గ్రహించెను.

బంగరుపీఠమందుఁ గూర్చున్న సుచంద్రునియెదుటఁ జంద్రకావితెరఁ బట్టియుండఁగా నది పొడుపుకొండపైఁ బొలుచు సూర్యునిముందర వెలుంగుచున్న యుదయరాగముపగిదిఁ

బవ్మినీలోచన కమలములకు వికాసమును జేయుచుఁ బ్రకాశించెనని భావము. ఇచట నుపమాలంకారము.

శా. ఆవేళన్ క్షణదోదయక్షితివరా♦భ్యర్ణస్థలిం జేర నా
లీవారంబుల కెచ్చరించి బలుహో♦ళిం దత్పురోధుం డుమా
దేవీసన్నిధిఁ బొల్చుభూపసుతఁ దో♦డ్తెచ్చెన్ వరశ్రీ మమా
గ్నేవర్చోవిహవేషు యంచు సరసో♦క్తి న్భూసురుల్ పల్కఁగన్. 63

టీ. ఆవేళన్=ఆసమయమందు; క్షణదోదయక్షితివరాభ్యర్ణస్థలిన్=క్షణదోదయరాజసమీపమును; చేరన్=పొందుటకు; పురోధుండు = పురోహితుఁడు; ఆలీవారంబులకున్=వయస్యాసమూహములకు; ఎచ్చరించి=ఎచ్చరికఁజేసి; బలుహోళిన్=అత్యాసక్తిచేత ; ఉమాదేవీసన్నిధిన్=పార్వతీదేవి సన్నిధానమునందు; పొల్చుభూపసుతన్ = ఒప్పియున్న చంద్రికను ; వరశ్రీన్ = శ్రేష్ఠమగుశోభ చేత, మమాగ్నే వర్చోవిహవేషుయంచు సరసోక్తిన్.—మమాగ్నే వర్చోవిహవేషుయంచున్, = ఈమంత్రరూపమగు, సరసోక్తిన్ = ఉత్తమవాక్యమును; భూసురుల్ = బ్రాహ్మణులు ; పల్కఁగన్=వచింపఁగా ; తోడ్తెచ్చెన్=తోడుకొని వచ్చెను.

సీ. నిఖిలాద్భుతముగ ము♦న్నీటిమన్నీని వె
ల్వడి తోఁచులచ్చినె♦లంత యనఁగఁ
దళతళ మనుచుక్క♦చెలిచాలు వలగొనఁ
గనుపట్టుశీతాంశు♦కళ యనంగ
నధికయత్నమున నె♦య్యన నడ తెంచురతీశునిపట్టంపు♦ శేనుఁ గనఁగ
భువనైకమోహంబు ♦ పొదలాడ నలువయంతిక మొందుమోహినీ ♦ దేవి యనఁగ

తే. చారుకులదేవతానివా♦సమ్ము వెడలి
యజరవనితాళి చుట్టు రా ♦ నాళి యత్న
రీతి నొల్లన నడుచుచు ♦ నృపులు గాంచి
నిశ్చలత నిల్వ గురుఁ జేరె ♦ నెలఁత యపుడు. 64

టీ. నిఖిలాద్భుతముగన్.-నిఖిల=సమస్తజనులకు; అద్భుతముగన్=ఆశ్చర్యకరముగా; మున్నీటిమన్నీనిన్=సముద్రరాజగుపాలకడలిని; వెల్వడి = వెడలి; తోఁచులచ్చినెలంతయనఁగన్.-కనఁబడులక్ష్మీదేవియనఁగ; తళతళయనుచుక్క చెలిచాలు=తళతళయని ప్రకాశించు

రిక్కలను కాంతలశ్రేణి; వలగొనన్=చుట్టుకొనఁగా; కనుపట్టు శీతాంశుకళ యనంగన్ = చూపట్టుచున్న చందమామకళ యన్నట్టుగా; అధిక యత్నమునన్=బహుప్రయత్నముచేత; ఒయ్యనన్=తిన్నగా; నడతెంచు రతీశునిపట్టంపు టేనుఁగ నఁగన్=నడచుచున్న మన్మథుపట్టపుగజమో యనునట్లు; భువనైక మోహంబు.—భువన=లోకములకు, ఏక=ముఖ్యమగు, మోహంబు=వలపు; పొదలాడన్ = వర్ధిల్లునట్లు; నలువయంతిక మొందు మోహినీదేవియనఁగన్.—నలువయంతిక మొందు = బ్రహ్మసమీపము పొందుచున్న, మోహినీదేవియనఁగన్ = మోహినీదేవియనునట్లు; చారుకులదేవతానివాసమ్ము.—చారు=సుందరమైన, కులదేవతా=కులదేవతయొక్క, నివాసమ్ము=ఉనికిపట్టునుండి; వెడలి= బైలుదేఱి; అజరవనితాళి=దేవవనితాసంఘము; చుట్టురాన్=చుట్టుకొనిరాఁగా; ఆళియత్నరీతిన్.—ఆళి=సకియలయొక్క, యత్న = ప్రయత్నముయొక్క, రీతిన్= భంగిచేత; ఒల్లనన్=తిన్నగా; నడుచుచున్; నృపులు = రాజులు; కాంచి=చూచి; నిశ్చలతన్ =అచంచలతచేత; నిల్వన్=నిలువఁగ; అప్డు=అసమయమందు; నెలఁత=చంద్రిక; గురున్=తండ్రిని; చేరెన్=సమీపించెను.

అనఁగా నెల్లరకు నచ్చెరువును గలుగఁజేయుచుఁ, బాలకడలినుండి వెడలినకలిమి నెలంతవలె రిక్కలు వలగొన్న చంద్రకళవలె నతిప్రయత్నముతో నడిపించు మరునిపట్టపుగజమువలె నలువచేరువకుఁబోవు మోహినీదేవివలె, నాచంద్రిక కులదేవతా స్థానమును విడిచి తండ్రిసవిధముఁ జేరె నని భావము.

మ. కనకాంగీమణి యాత్మదృగ్రిపుమహాకంజావళి న్మెట్టుతీ
రునఁ జొక్కమ్మగు మెట్టుఁబ్రాల్పుటిక నంఘ్రుల్దార్చి యవ్వేళ నా
జననాథాగ్రణిముంగలన్ నిలువ నోజ న్భూసురుల్మంజుల
ధ్వనిఁ గన్యావరణంబుఁ జెప్పిరి ప్రమోదం బూన బంధుల్మదిన్. 65

టీ. కనకాంగీమణి=కాంతారత్నమగుచంద్రిక ; ఆత్మదృగ్రిపు మహాకంజావళిన్.—ఆత్మ=తనయొక్క, దృక్=నేత్రములకు, రిపు=శత్రువగు, మహత్=అధికమగు, కంజావళిన్= తామరపూబంతిని; మెట్టుతీరునన్=త్రొక్కురీతిగ; చొక్కమ్మగు మెట్టుఁబ్రాల్పుటికన్=శ్రేష్ఠమగు తలఁబ్రాలుపుటికయందు; అంఘ్రుల్=అడుగులను ; తార్చి=ఉంచి; ఆవేళన్=ఆసమయమందు; జననాథాగ్రణిముంగలన్=సుచంద్రునియెదుట ; నిలువన్ = నిలుచుండఁగా; ఓజన్ = క్రమముగ ; భూసురుల్ = బ్రాహ్మణులు; మంజులధ్వనిన్.—మంజుల = మనోజ్ఞమగు, ధ్వనిన్=ధ్వనిచేత; కన్యావరణంబు = కన్యావరణమును ; బంధుల్ = బంధుజనులు; ప్రమోదంబు = సంతసమును; మదిన్ = మనమునందు ; ఊనన్ = పూనునట్లుగా; చెప్పిరి = వచించిరి.

అనఁగా చంద్రిక తననేత్రములకు శత్రువగు కమలశ్రేణిని పాదముతోఁ ద్రొక్కుచున్నదానివలెఁ దలఁబ్రాలుపుటికయం దడుగు లిడి సుచంద్రునెదుట నిలువఁగా బ్రాహ్మణులు కన్యావరణముఁ జెప్పిరని భావము.

మ. వనజాక్షుల్ధవళంబుఁ బాడఁగ మహావాదిత్రనాదంబు బో
రొ్కనఁ జారూక్తిఁ బురోహితుండు సహారిః కుర్యాత్సదా మఙ్గళ
మ్మని చిత్రంబుగ మంగళాష్టకము నెయ్యం బొప్పఁగాఁ జెప్పి శో
భనలగ్నం బదె చేరె నంచు వివరింపన్ సంభ్రమౌఘస్థితిన్. 66

టీ. వనజాక్షుల్=స్త్రీలు; ధవళంబు=ధవళమను పాటను; పాడఁగన్=పాడఁగా; ముహూర్తకాలమందు స్త్రీలు కొన్నిదేశములలో ధవళ మనుపాటను బాడుట ప్రసిద్ధము "పడఁతుల ధవళములు పెండ్లిపాటలు చెలఁగన్" అని ప్రాచీన గ్రంథములయందుఁ జెప్పఁబడియున్నది; మహావాదిత్రనాదంబు.—మహత్= అధికమగు, వాదిత్ర = తతము ఆనద్ధము సుషిరము ఘనము అనునీవాద్యచతుష్టయముయొక్క, నాదంబు=ధ్వని; బోర్కొనన్= బోరనిధ్వనిఁజేయఁగా; చారూక్తిన్.—చారు = రమణీయమగు, ఉక్తిన్ = వచనముచేత; పురోహితుండు = పురోహితుఁడు; సహారిః కుర్యాత్సదామంగళమ్మని.—సహారిః కుర్యాత్సదామంగళమ్మనుచు; చిత్రంబుగన్ = వింతగ; మంగళాష్టకము = మంగళముల రెనిమిదింటిని; నెయ్యంబు = ఇంపు; ఒప్పఁగాన్ = ఒప్పునటులు; చెప్పి = చదివి; శోభనలగ్నంబు= శుభలగ్నము; అదెచేరెనంచున్ = అదె సమీపించెననుచు; సంభ్రమౌఘస్థితిన్ = ప్రవాహమువంటి సంతసమందునికిచేత, అతిసంతోషముచేతననుట; వివరింపన్ = విశదపఱుపఁగా. పై పద్యముతో నన్వయము.

మ. జలజాప్తాన్వయు దైత్యభేదిగఁ దనూజ న్వారిరుట్పాణిగాఁ
గలితైకాత్మఁ దలంచి యత్తఱి నిమాం కన్యాం ప్రదాస్యామి యం
చలపాంచాలుఁడు దారఁ బోసెఁ దనకన్యం దత్సుచంద్రావనీ
వలజానేతకు లేఖపాళి ప్రసవవ్రాతంబు వర్షింపఁగన్. 67

టీ. జలజాప్తాన్వయున్ = సూర్యవంశజుఁడగు సుచంద్రుని; దైత్యభేదిగన్ = నారాయణునిఁగాను; తనూజన్ = కూఁతురగుచంద్రికను; వారిరుట్పాణిగాన్ = లక్ష్మీదేవినిగాను; కలితైకాత్మన్=ఒప్పుచున్నఏకచిత్తముతో; తలంచి=ధ్యానించి; అత్తఱిన్=ఆసమయమందు; ఇమాంకన్యాం ప్రదాస్యామియంచున్ = ఇమాంకన్యాం ప్రదాస్యామియను మంత్రము నుచ్చరించుచు; అలపాంచాలుఁడు = ఆతుణదోదయరాజు; తత్సుచంద్రావనీవలజానేతకున్ = సుచంద్రుఁడను పేరుగల యాభూపతికి; లేఖపాళి = సురసంఘము; ప్రసవవ్రాతంబు = పుష్పసంఘమును; వర్షింపఁగన్ = కురియఁగా; దారఁబోసెన్ =ఉదకధారాపూర్వకముగఁ గన్యాదానముఁ జేసెను.

అనఁగా సుచంద్రుని నారాయణమూర్తినిగాను చంద్రికను లక్ష్మీదేవినిగాను ఏకచిత్తముతోఁ దలఁచి సుచంద్రునకుఁ జంద్రికను తుణదోదయుం డుదకధారాపూర్వకముగ దానము చేసెనని భావము.

చ. ధరణిఁ బరస్పరోక్తి జవ♦దాఁటక యుండ ఘటింపఁ గర్త తో
యరుహశరుండు గావునఁ ద♦దాత్మ సన న్సరిగా వధూవరు
ల్శిరముల నుంచి రప్డు గుడ♦జీరకము ల్పతి మున్ను దార్చె సుం
దరి యట మున్నె చేర్చె నని ♦ తత్ప్రియబాంధవు లుగ్గడింపఁగన్. 68

టీ. ధరణిన్ = పుడమియందు; పరస్పరోక్తిన్.—పరస్పర = ఒండొరులయొక్క, ఉక్తిన్ = వచనమును; జవదాఁటకయుండన్=మీఱకుండునటులు; ఘటింపన్ = కలుగఁజేయుటకు; తోయరుహశరుండు = కమలశరుండగుమరుఁడు; కర్త = స్వతంత్రుఁడు; కావునన్ = ఆహేతువుచేత; తదాత్మనవన్=ఆమన్మథునియత్నముచేతనోయనునట్లు;సరిగాన్ = సమానముగా; వధూవరుల్ = చంద్రికా సుచంద్రులు; అప్డు = ఆసమయమందు; గుడజీరకముల్ = గుడమును జిలకఱ్ఱను; శిరములన్ = శిరస్సులయందు; పతి = పెనిమిటియగు సుచంద్రుఁడు; మున్ను = పూర్వము; తార్చెన్=ఉంచెను; సుందరి=చంద్రిక; అటమున్నె = అంతకుముందరనే; చేర్చెన్ = ఉంచెను; అని=అనుచు; తత్ప్రియబాంధవులు.—తత్ = ఆవధూవరులయొక్క, ప్రియబాంధవులు=ప్రియులగు బంధుగులు; ఉగ్గడింపఁగన్=వచించునట్లు; ఉంచిరి = ఉంచినవారలైరి.

అనఁగా మన్మథుఁడు వధూవరులను ప్రేమాతిశయమున నొండొరులమాట నతిక్రమింపకుండునటులు చేయువాఁడు గాన నామన్మథుని ప్రయత్నముచే నుంచిరా యనునటులు బెల్లము జిలకఱ్ఱ యేకకాలమందు వధూవరులొండొరుల శిరములం దుంచి రనిభావము. పతి పత్నిశిరమున గుడజీరకములు ముందు చేర్చినఁ బతిమాటకుఁ బత్ని జవదాఁటకుండు ననియు పత్ని పతిశిరమున గుడజీరకములు ముందు చేర్చినఁ బత్నిమాటకు పతి జవదాఁటక యుండు ననియు నొక వార్త గలదు గానఁ దత్ప్రియబాంధవులు పతి మున్ను చేర్చె ననియు పత్ని అంతకుమున్నె చేర్చె ననియు వచించి రని భావము.

క. అలమహిపతి మది సమ్మద, మలరన్ మాంగల్యతంతు ♦ నానేన యటం
చెలమిఁ బురోధుఁడు దెలుపఁగఁ,గలకంఠికిఁ దాళిబొట్టు ♦ గట్టెన్ జక్కన్. 69

టీ. అలమహిపతి=ఆసుచంద్రుఁడు; మదిన్=మనసునందు; సమ్మదమలరన్ = సంతసమొప్పఁగా; మాంగల్యతంతునానేనయటంచున్ = మాంగల్యతంతునానేనయనుమంత్రమును చెప్పుచు; ఎలమిన్=సంతోషముతో; పురోధుఁడు=పురోహితుఁడు; తెలుపఁగన్=తెలియఁజేయఁగా; కలకంఠికిన్=చంద్రికకు; తాళిబొట్టు=మంగళసూత్రమును; చక్కన్=చక్కఁగా; కట్టెన్=కట్టెను.

మ. సకిపై నానృపవాళి నింప నలకం♦జాతాక్షి గోత్రాధినా
యకుపై నింపఁగ సేసఁ బ్రాల్దనరె సా♦మ్యస్ఫూర్తి నవ్వేళఁ ద

తత్సుకరాలంకృతినాదవాదములు దోడ్తో మించ సాహిత్యపో
షకుఁ డజ్ఞాస్త్రుఁడు దార్చునర్జునమణీజాలాభిషేకం బనన్. 70

టీ. సకిపైన్=చంద్రికమీఁద; ఆన్నృపమౌళి=ఆసుచంద్రుఁడు; నింపన్=సేసలునింపఁగా; అలకంజాతాక్షి=ఆచంద్రిక; గోత్రాధినాయకుపైన్=సుచంద్రునిమీఁద; నింపన్=నింపఁగా; సేసఁబ్రాలు=తలఁబ్రాలు; సామ్యస్ఫూర్తిన్=సమానస్ఫూర్తిచేత; ఆవేళన్=ఆసమయమందు; తత్సుకరాలంకృతినాదవాదములు.—తత్=ఆవధూవరులయొక్క, సు=శ్రేష్ఠమగు, కర=హస్తమండలి, అలంకృతి=కంకణాద్యలంకృతులయొక్క, నాద=నాదములనెడు, వాదములు=వాగ్వివాదములు; తోడ్తోన్=వెంటనె; మించన్=అతిశయింపఁగా; సాహిత్యపోషకుఁడు.—సాహిత్య=సాంగత్యమునకు, పోషకుఁడు=అభివృద్ధిపఱచునట్టివాఁడు; అజ్ఞాస్త్రుఁడు=మరుఁడు; ఇచట, తత్సుకరాలంకృతినాదవాదములు.—తత్=ప్రసిద్ధమగు, సుకర=మనోజ్ఞమగు, అలంకృతి=ఉపమాద్యలంకారములు, నాద=ధ్వనులను, వాదములు, సాహిత్యపోషకుఁడు=సాహిత్యవిద్యకుఁబోషకుఁడనువర్థము దోఁచుచున్నది; తార్చునర్జునమణీజాలాభిషేకంబు.—తార్చు=చేయునట్టి, అర్జునమణీ=వజ్రములయొక్క, జాల=సమూహముయొక్క, అభిషేకంబనన్=అభిషేకమోయనునట్లు; తనరెన్=ఒప్పెను.

చంద్రికాసుచంద్రు లొకరిపై నొకరు నించు సేసఁబ్రాలు సామ్యస్ఫూర్తిచేత నొండొరులకు సానుకూల్యమును బోషించు మరుఁడు సేయు రవలరాశియొక్కయభిషేకమో యనునటు లొప్పె ననిభావము- వస్తూత్ప్రేక్షాలంకారము.

మ. కపిలావాచనభద్రవేళఁ దగి రాకాంతావిభుల్ సేసము
త్తెపుచాల్ దారొక్కనుమెట్టుఁబ్రాల్పుటికలుద్దీపించు పెన్కాఁడితోఁ
దపనీయాంశుకసూనుసంభృతతులాత్మం బూన లావణ్యభా
గ్యపటుశ్రీసమరీతిఁ దెల్ప సరి దూఁగ న్నిల్చుచందంబునన్. 71

టీ. కపిలావాచనభద్రవేళన్.—కపిలావాచన=వివాహాంగభూతమగు క్రియావిశేషముయొక్క, భద్రవేళన్=శుభవేళయందు; ఆకాంతావిభుల్=ఆవధూవరులు; సేసముత్తెపుచాల్=సేసముత్యములయొక్క శ్రేణిని; తారొక్కనుమెట్టుఁబ్రాల్పుటికలు=కడిపినతలఁబ్రాలుపుటికలు; ఉద్దీపించు=ప్రకాశించు; పెన్కాఁడితోన్=గొప్పకాఁడిమ్రాఁకుతో, యుగముతో ననుట; తపనీయాంశుకసూనుసంభృతతులాత్మన్.—తపనీయాంశుకసూను=విష్ణుపుత్రుఁడగు మరునిచే, సంభృత=భరియింపఁబడిన, తులా=త్రాసుయొక్క, ఆత్మన్=స్వరూపమును; పూనన్=గ్రహింపఁగా; లావణ్యభాగ్యపటుశ్రీసమరీతిన్.—లావణ్య=చక్కఁదనముయొక్క, భాగ్య=భాగ్యముయొక్క, పటు=సమర్థమగు, శ్రీ=కాంతియొక్క, సమరీతిన్=సామ్యమును; తెల్పన్=తెలుపుటకు; సరిదూఁగన్=సరిగాతులఁదూఁగుటకు; నిల్చుచందంబునన్=నిలుచురీతిగా; తగిరి=ఒప్పిరి.

అనఁగా చంద్రికాసుచంద్రులు, మెట్టుఁబ్రాల్పటికలువధూవరులయొద్దనుంచుకాఁడి బ్రాఁకుతో చూపఱకు మన్మథుండు దూఁచుత్రాసువలెనొప్పఁగా, అందు తమలావణ్యాద్యులను దెలుపుటకై సరిగాఁదూఁగినట్లు సమముగ నొప్పి రని భావము.

చ. అలయినసన్మహస్స్ఫురణ • నందుచు శ్యామయు నాకలాపినీ
కులతిలకోత్సవాకలనఁ • గూడుచు నాహరివంశనాయకుం
డలరి యజస్రము న్వెలయ • నయ్యెడ నంచితమంత్రశక్తిఁ ద
త్కలితకరాంబుజస్థలులఁ • గట్టిరి కంకణము ల్ధరామరుల్. 72

టీ. అలయినసన్మహస్స్ఫురణన్.—అలయిన = ఆసుచంద్రునియొక్క, సత్ = శ్రేష్ఠమగు, మహః=ప్రతాపముయొక్క, స్ఫురణన్=ప్రకాశమును; అందుచున్=పొందుచు; శ్యామయున్=చంద్రికయును; ఇచట, అలఇన=ఆసూర్యునియొక్క, మహఃస్ఫురణన్=ప్రకాశాతిశయమును; అందుచున్; శ్యామయున్=రాత్రియును అనువిరోధార్థము దోఁచుచున్నది; ఆకలాపినీకులతిలకోత్సవాకలనన్.—ఆకలాపినీకులతిలక=ఆచంద్రికయొక్క, ఉత్సవ = వేడ్కయొక్క, ఆకలనన్=ప్రాప్తిని; కూడుచున్=పొందుచు; ఆహరివంశనాయకుండు=ఆసూర్యవంశనాయకుండగు సుచంద్రుఁడు; ఇచట, కలాపినీకులతిలక = మయూరీశ్రేష్ఠముయొక్క, ఉత్సవాకలనఁగూడుచున్; ఆహరివంశనాయకుండు=సర్పశ్రేష్ఠము అనువిరోధార్థము దోఁచుచున్నది; అలరి= సంతసించి; అజస్రమున్=ఎల్లపుడు; వెలయన్=ప్రకాశించుటకై; ఆయ్యెడన్ = ఆసమయమందు; అంచితమంత్రశక్తిన్.—అంచిత=ఒప్పుచున్న, మంత్రశక్తిన్ = మంత్రసామర్థ్యముచేత; తత్కలితకరాంబుజస్థలులన్.—తత్=ఆవధూవరులయొక్క, కలిత=ఒప్పుచున్న, కరాంబుజస్థలులన్=కేలుదామరలయొక్కప్రదేశములందు; ధరామరుల్=బ్రాహ్మణులు; కంకణముల్=కంకణములను, ప్రతిసరములనుట; కట్టిరి.

అనఁగా సూర్యస్ఫురణచే రాత్రి వెలయునటులు మయూరీమహోత్సవమును గూడి సర్పశ్రేష్ఠము సంతసించునటులు మంత్రశక్తిచే బాపలు వధూవరులకరంబులయందు కంకణములు గట్టి రని భావము. సూర్యవంశశ్రేష్ఠుఁడగుసుచంద్రునిప్రతాపమునకు చంద్రిక సంతసించునటులు చంద్రికామహోత్సవమును గూడి సుచంద్రుఁడెల్లపుడు సంతసించునటులు కంకణములఁ గట్టి రని స్వభావాభిప్రాయము.

చ. అలిచికురాసువర్ణవస • నాంచలసంగ్రథితాంశుకాంతుఁడై
యలనరపాలమౌళి విమ • లాంబుజరాగవివాహపీఠికా
స్థలి వసియించి భాజనము • దాయమున న్నిఖిలాము పుణ్యాన్నను
త్కలిక చెలంగ భూసురవి • తానము మంత్రము లుగ్గడింపఁగన్. 73

టీ. అలనరపాలమౌళి=ఆసుచంద్రుఁడు; అలిచికురాసువర్ణవసనాంచలసంగ్రథితాంశుకాంతుఁడై.—అలిచికురా=భృంగములవంటి కుంతలములుగలచంద్రికయొక్క, సువర్ణవసన=

బంగరువస్త్రముయొక్క, అంచల=అంచుచేత, సంగ్రథిత=కట్టఁబడిన, అంశుకాంతుఁడై=వస్త్రముయొక్క యగ్రముగలవాఁడై; విమలాంబుజరాగవివాహపీఠికాస్థలిన్.—విమల=స్వచ్ఛములగు, అంబుజరాగ=పద్మరాగములయొక్క, వివాహపీఠికా=పెండ్లిపీఁటయొక్క, స్థలిన్=ప్రదేశమందు; వసియించి=కూర్చుండి; లాజసముదాయమునన్.—లాజ=లాజలయొక్క, సముదాయమునన్=సమూహముచేతను; శిఖిన్=అగ్నియందు; హోమము=హవనమును; ఉత్కలిక=సంతసము; చెలంగన్=ఒప్పఁగా; భూసురవితానము=బ్రాహ్మణసమూహము; మంత్రములు=మంత్రములను; ఉగ్గడింపఁగన్=వచించుచుండఁగా; ఒనర్చెన్=ఒనరించెను.

అనఁగా సుచంద్రుఁడు చంద్రికావస్త్రముతోఁ దనవస్త్రమునకు ముడి వేసికొని పద్మరాగమయపీఠమందుఁ గూర్చుండి బ్రాహ్మణులు మంత్రముల నుగ్గడించుచుండఁగ లాజహోమము నగ్నియందుఁ జేసె నని భావము.

మ. సనెకల్ హత్తఁగఁ జేసె నంఘ్రి చెలి చం•చత్కుడ్యచిత్రాత్మ ని
ల్చినకంతుండు పురాకృతాగము సనం•జిత్తంబులో నిల్పి యం
చనరక్తిం దనుఁ బ్రోవు మంచుఁ దదను•చ్ఛాయోపధిం డాసి వం
దన మూన్పం గని ప్రోతు నం చభయపా•దం బూను చందంబునన్. 74

టీ. చంచత్కుడ్యచిత్రాత్మన్.— చంచత్=ప్రకాశించుచున్న, కుడ్య=గోడయందు, చిత్రాత్మన్=చిత్తరుపురూపముతో; నిల్చినకంతుండు=నిలుచుండిన మదనుఁడు; పురాకృతాగము=ముందుచేసినయపరాధము; చనన్=పోవుటకు; చిత్తంబులోనిల్పి=హృదయమున నుంచి; అంచనరక్తిన్.—అంచన=ఒప్పుచున్న, రక్తిన్=ప్రేమచేత; తనున్; ప్రోవుము; అంచున్=పాలింపుమనుచు; తదనుచ్ఛాయోపధిన్.—తత్=ఆసనెకంటియొక్క, అనుచ్ఛాయా=ప్రతిచ్ఛాయయొక్క, ఉపధిన్=వ్యాజముచేత; డాసి=దగ్గఱి; వందనము=నమస్కారమును; ఊన్పన్=చేయఁగా; కని=చూచి; ప్రోతునంచున్=పాలింతుననుచు; అభయపాదంబు=అభయమునిచ్చుపాదమును; ఊనుచందంబునన్=ఉంచుతెఱంగున; చెలి=చంద్రిక; అంఘ్రి=పాదమును; సనెకల్=సనెకంటిని; హత్తఁగఁజేసెన్=ఆక్రమించునటులు చేసెను.

చంద్రిక, సప్తపదియందు నెదుట నుంచినసనెకంటియందు గోడమీఁద వ్రాసియున్న మదనుఁడు ప్రతిఫలించునెపంబునఁ దాను పూర్వమం దొనరించినట్టి యపరాధమును పోఁగొట్టుటకైనన్నుఁ జిత్తమం దుంచి రక్షింపు మని నమస్కరింపఁగాఁ గాపాడుదు నని యొప్పుకొన్నదానివలె, పాదముచే సనెకంటిని స్పృశించె నని భావము.

చ. జనపతి వరాళి భూసురులో•నంగుళుల శుభాక్షతపాళిఁ జల్లి తరుం
గనలు ఘటించునారతులు•గన్గొని యంత వధూకరాత్తహ
స్తనళినుఁడై వటాదంబున ల•సత్కులదేవగృహంబుఁ జేర నొ
య్యనఁ జనియెన్ గలధ్వనుల•నైదువ లింపుగఁ బాటఁ బాడఁగన్. 75

టీ. జనపతిమౌళి=సుచంద్రుఁడు; భూసురులు=బ్రాహ్మణులు; ఒసంగుశుభాక్షతపాళిన్.—ఒసంగు=సమర్పించిన, శుభ=మంగళకరమైన, అక్షతపాళిన్=మంత్రాక్షతశ్రేణిని; తాల్చి=ధరించి; అంగనలు=కాంతలు; ఘటించువారతులు = ఇచ్చునట్టిహారతులను; కన్గొని = చూచి; అంతన్=అమీఁద; వధూకరాత్తహస్తనళినుఁడై.—వధూకర=చంద్రికహస్తమును, ఆత్త=పొందిన, హస్తనళినుఁడై=కరకమలముగలవాఁడై; ముదంబునన్=సంతసముచేత; లసత్కులదేవగృహంబు.—లసత్=ప్రకాశించుచున్న, కులదేవగృహంబు=కులదేవతామందిరమును; చేరన్=పొందుటకై; ఒయ్యనన్=తిన్నఁగ; కలధ్వనులన్ = అవ్యక్తమధురమగుధ్వనులచేత; ఐదువులు=సువాసినులు; ఇంపుగన్=సొంపుగ; పాటఁబాడఁగన్=పాటఁబాడుచుండఁగా; చనియెన్=పోయెను.

ఉ. మ్రొక్కు ఘటింపఁ బెండ్లికొమ◆రుం డబలాయుతి నేగుదేరఁగా
నక్కులదేవతాజనుల◆యంచున వే యెదు రేగుదెంచి మేల్
నిక్కఁగ నిల్చి తత్సఖులు◆నీటున వారల నిల్పి రంగునన్
గ్రక్కునఁ దత్సమాఖ్యలఁ బ◆రస్పరవాణి వినంగ నయ్యెడన్. 76

టీ. పెండ్లికొమరుండు=సుచంద్రుఁడు; అబలాయుతిన్=చంద్రికయొక్క కూడికచేతను; మ్రొక్కుఘటింపన్=నమస్కరించుటకై; ఏగుదేరఁగాన్=రాఁగా; అక్కులదేవతాజనులయంచునన్=ఆకులదేవతలవిధమున; తత్సఖులు = ఆవధూవరులసకియలు; వే=శీఘ్రముగ; ఎదురేగుదెంచి=అభిముఖముగవచ్చి; మేల్ నిక్కఁగన్=శుభమతిశయింపఁగ; నిల్చి; గ్రక్కునన్=శీఘ్రముగ; తత్సమాఖ్యలన్=చంద్రికాసుచంద్రులనామములను; పరస్పరవాణిన్=ఒండొరులమాటచేత; వినంగన్ = వినుటకై; అయ్యెడన్=ఆసమయమందు; నీటువన్=మురిపెముచేత; వారలన్=ఆచంద్రికాసుచంద్రులను; అంగునన్=అందముగా; నిల్పిరి=నిలువఁజేసిరి.

చంద్రికను గూడి సుచంద్రుఁడు కులదేవతలకు నమస్కరించుటకై బెలుదేఱఁగా, నీవధూవరులనామములు పరస్పరవచనంబుల వినఁ గోరి, తత్కులదేవతలవలె వారిసఖులడ్డమువచ్చి, చంద్రికాసుచంద్రుల నిల్పి రని భావము.

చ. తెలుపుము చంద్రికాఖ్య జగ◆తీవర యన్న విభుండు నవ్వునం
దెలుపక తెల్ప లో నెఱిఁగి◆నీరజలోచన యాళు లందఱుం
దెలుపు సుచంద్రనామము స◆తీ యన నెమ్మిగ మెత్తి దానిచేఁ
దెలిపె సకుల్ ధరన్ సహజ◆దీపితకౌశల లౌదురే కదా. 77

టీ. జగతీవర=సుచంద్రుఁడా! చంద్రికాఖ్యన్=చంద్రికనామమును; తెలుపుము=తెలియఁజేయుము, అన్నన్=అనఁగా; విభుండు=సుచంద్రుఁడు; నవ్వునన్=నగవుచేతనె; తెలుపక

తెల్పక్=తెలుపకయే తెలుపఁగా, అనఁగా నానగవె చంద్రిక యని నోటఁజెప్పక నవ్వుచే. చంద్రికనామమును ఎఱింగించె నని భావము, స్మితము చంద్రికారూప మనుట ప్రసిద్ధము; నీరజలోచన=చంద్రికా; లోన్=అంతరంగమందు; ఎఱిఁగి=తెలిసికొని, చంద్రికనామము వచింపు మన నానగవె చంద్రిక యని యుక్తితోఁ దెలిపిన కౌశల్యమును గుర్తెఱిఁగి యని భావము; ఆళులందఱున్=చెలులందఱు; సుచంద్రనామము = సుచంద్రునిపేరును; సతీ=చంద్రికా! తెలుపు=తెలుపుము. అనన్=అనఁగా; నెమ్మొగము=సుందరమగుముఖమును; ఎత్తి=ఎత్తినదై; దానిచేన్=ముఖము నెత్తుటచేతనె; తెలిపెన్=తెలియఁజేసెను. చంద్రునివలె ముఖ ముండుటచే నాముఖమే సుచంద్రుఁ డని యుక్తితోఁ దెలిపె నని భావము. సకుల్=స్త్రీలు; ధరన్=పుడమియందు; సహజదీపితకౌశలలు=స్వభావముచేఁ బ్రకాశించుచున్న జాణతనముగలవారు; కౌదురేకదా=కౌదురుగదా!

చ. చెలి సుముఖోక్తిఁ దెల్పు నృపశేఖరుపే రని డాసి వెండియుం
గలరవ లెల్ల వేఁడ సుముఖం బని నేర్పునఁ బల్కె నీవు మున్
దెలిపినఁ దెల్పుఁ గొమ్మ పతి దెల్పవె యీవనితాఖ్య కాంతవా
క్కులన నటన్నఁ గాంత యనఁగా మది మెచ్చిరి తద్వచోర్థముల్. 78

టీ. కలరవలెల్లన్=కాంతలందఱు; వెండియున్ = మఱియు; డాసి = సమీపించి; చెలి=చంద్రికా! సుముఖోక్తిన్.—సు=సమీచీనమైన, ముఖోక్తిన్=ముఖవచనముచేత; నృపశేఖరుపేరు=సుచంద్రునినామమును; తెల్పు=తెలియఁజేయుము; అని వేఁడన్=ఈప్రకారము వేఁడుకొనఁగా; సుముఖంబు=సుముఖము; అని=అనుచు; నేర్పునన్ = కౌశల్యముచేత; పల్కెన్ = పలికెను. సుచంద్రునినామము సుముఖ మని తెలిపె ననఁగా సు అనుశబ్దము ముఖమందున్నది గాన సుముఖ మని తాత్పర్యము. పతి=సుచంద్రుఁడా! నీవుమున్ దెలిపినన్=నీవు మొదట చంద్రికపేరు దెలుపఁగా; కొమ్మ=చంద్రిక; తెల్పున్=తెలుపును; ఈవనితాఖ్యన్=ఈచంద్రికనామమును; కాంతవాక్కులనన్.—కాంత=మనోహరమైన, వాక్కులనన్=వాక్కుసంబంధముచేత; తెల్పవేయటన్నన్ = తెలియఁజేయుమా యనఁగా; కాంతయనఁగాన్=కాంత యనిచెప్పఁగా, అనఁగా చంద్రికనామము కకారాంతమైనదని భావము; తద్వచోర్థముల్.—తత్=ఆవధూవరులయొక్క, వచః = మాటలయొక్క, అర్థముల్ = అర్థములను; మదిన్ = మనమందు; మెచ్చిరి=బహూకరించిరి.

ఈ పద్యమందు శ్లేషచే నర్థాంతరకల్పన యుండుటం జేసి వక్రోక్త్యలంకారము.

ఉ. వెన్నెల కెద్ది పేరు పృథివీవర తెల్పఁ గదే య టన్నచో
నన్నృపమౌళి జ్యోత్స్న యను నంగన యొప్పగురాజుపే ర దే
మన్న సుశీతరశ్మి యను నబ్రము చంద్రిక యంచు భర్త యా
కన్నె సుచంద్ర యంచుఁ బలుక న్మది నాఁగిరి లజ్జపెంపునన్. 79

టీ. పృథివీవర=సుచంద్రుఁడా! వెన్నెలకున్ ఎద్దిపేరు=ఏదినామము? తెల్పఁగ దేయుట న్నచోన్=తెలుపుమనఁగా; అన్నృపమౌళి=ఆసుచంద్రుఁడు; జ్యోత్స్నయనున్=జ్యోత్స్నయని చెప్పును. అంగన=చంద్రికా! ఒప్పగురాజు పేరు=సుందరుండగు చంద్రుని పేరు; అదేమన్నన్= అదియేమనఁగా; సుశీతరశ్మియనున్=సుశీతరశ్మియని చెప్పును. అబ్రము=ఆశ్చర్యము! భర్త= సుచంద్రుఁడు; చంద్రికయుంచున్=చంద్రికయని; అకన్నె=ఆచంద్రిక; సుచంద్రయుంచున్= సుచంద్రుఁడని; పలుకన్=వచించుటను; మదిన్=చిత్తమందు; లజ్జపెంపునన్ = వ్రీడాతిశయ ముచే; ఆఁగిరి=మానిరి.

అనఁగా చెలులు సుచంద్రునిఁ జంద్రిక పేరు యుక్తిగఁ జెప్పించుకై వెన్నెలపే రడిగిన సుచంద్రుఁడు చంద్రిక యనక జ్యోత్స్న యనియు చంద్రికను ఒప్పిద మగురాజు పే రడిగిన నా పెసుచంద్రుఁ డనక సుశీతరశ్మి యనియు, చెప్పి రని భావము.

చ. మును హృదయాలయాభివృత♦మోహానిరూఢిఁ బరస్పరాఖ్య లిం
పున ననిశంబుఁ బిల్చునల♦భూపతియున్ సతియున్ బ్రియాళికా
జనములు దెల్పు మన్న నొక♦సారి వచింపఁగ నేర రౌర యే
మనఁ దగుఁ దత్త్రపాజలరు♦హాశుగశాంబరికావిలాసముల్. 80

టీ. మును = పూర్వమందు; హృదయాలయాభివృతమోహానిరూఢిన్.— హృదయాల యు=మనోవీథియందు, అభివృత=ఆవరింపఁబడిన, మోహ=వలపుయొక్క, నిరూఢిన్ = దృఢత చేత; పరస్పరాఖ్యలు=ఇండొరుల నామములను; ఇంపునన్ = ఇష్టముచేత; అనిశంబు=ఎల్ల ప్పుడు; పిల్చుఆలభూపతియున్ సతియున్=పిలుచునట్టి ఆసుచంద్రుఁడును చంద్రికయును; ప్రియాళికాజనములు=సకియలు; తెల్పుమన్నన్ = తెలుపుమని యడుగఁగా; ఒకసారి = ఒకపరియు; వచింపఁగన్ = వచించుటకు; నేరరు. ఔర = ఆశ్చర్యము! తత్త్రపాజ లరుహాశుగశాంబరికావిలాసముల్.—తత్త్రపా=ఆలజ్జయను, జలరుహాశుగ=మన్మథునియొక్క, శాంబరికా=మాయయొక్క, విలాసముల్=విలాసములను; ఏమనఁదగున్=ఏమనవచ్చు?

అనఁగా పూర్వము చంద్రికాసుచంద్రులు పరస్పర మొకరినామ మొకరు పలుమఱుఁ బలుకుచుండియు నిపుడు చెలులు పలుమఱు వేఁడినను ఒకసారియైన నొండొరుల నామము వచింపరు. ఈలజ్జ యను మన్మథమాయ నేమన వచ్చు నని భావము.

చ. అలతతి నాళియత్నగతి♦నంచితమంథరవాజ్ఞిరూఢిఁ జే
రులు వచియించి భక్తి మదిఁ♦బ్రగుమ్మర దేవుల మ్రొక్కి బాసిక
ముల సడలించి బంధువృతి♦నుద్ధగ బువ్వము లారగించి తో
య్యలియు విభుండు ముంచిరి నిరర్గళసంభ్రమ వైభవంబులన్. 81

టీ. అలతతిన్=ఆసమయమందు; ఆళియత్నగతిన్.—ఆళి=చెలికత్తెలయొక్క, యత్న= ప్రయత్నముయొక్క, గతిన్ = రీతిచేత; అంచితమంథరవాజ్ఞిరూఢిన్.—అంచిత=ఒప్పుచు

న్న, మంధర=మెల్లనగు, వాఙ్నిరూఢిళ్=వచనరూఢిచేత; పేరులు=ఒండొరులనామములను; వచియించి=చెప్పి; భక్తి=దేవతావిషయక ప్రేమ; మదిళ్=మనమునందు; క్రమ్మరళ్=తిరుగఁగా; దేవులళ్=కులదేవతలను; మొ్రొక్కి=నమస్కరించి; బాసికమ్ములు=బాసికములను; సడలించి=విడిచి; బంధువృతిళ్.—బంధు=బాంధవులయొక్క, వృతిళ్ = కూడికచేతను; ముద్దుగళ్=మనోజ్ఞముగ; బువ్వములు=బువ్వపుబంతిభోజనములను; ఆరగించి = భుజించి; తొయ్యలియుళ్=చంద్రికయును; విభుండుళ్=సుచంద్రుఁడును; నిరర్గళసంభ్రమవైభవంబులళ్.—నిరర్గళ=అడ్డములేని, సంభ్రమవైభవంబులళ్=సంతోషవిభవములచేత; మించిరి=అతిశయించిరి.

అనఁగ నీవధూవరులు చెలికత్తెల నిర్బంధముచేత తిన్నఁగ నొండొరుల నామములు చెప్పి కులదేవతలకు నమస్కరించి బాసికములు విడిచి బువ్వపుబంతిభోజనముల భుజించి సంతోసముచే మించి రని భావము.

క. ఈలీల నశేషనిలిం, పాళీనుతతత్కరగ్రహచతుర్థస్రీ
వేలాంచితవిభవము హే, రాళంబై వెలయ నాధరాపతి యలరెళ్. 82

టీ. ఈలీలళ్=ఈరీతిగ; అశేషనిలింపాళీనుత తత్కరగ్రహ చతుర్థ స్రీవేలాంచితవిభవము.—అశేష = సమస్తమగు, నిలింపాళీ = సురశ్రేణిచేత, నుత = పొగడఁబడిన, తత్కరగ్రహ = ఆవివాహముయొక్క, చతుర్థస్రీ = నాలుగుదినములను, చతుర్ణాంఘ్రస్రాణాం సమాహారశ్చతుర్థస్రీ, అకారాంతోత్తర పదోద్విగుస్త్రియామిష్టః అని స్త్రీత్వము వచ్చినదని యెఱుంగునది, వేలా = మేరచేత, అంచిత = ఒప్పుచున్న, విభవము = ఉత్సవము; హేరాళంబై = అధికమై; వెలయళ్ = ప్రకాశింపఁగా; ఆధరాపతి=ఆసుచంద్రుఁడు; అలరెళ్=సంతసించెను.

ఉ. వేదవిధానముం బుడమివేల్పులు దెల్పఁగ నంత శేషహోమా
మాదికమంగళాచరణ లన్నియుఁ దీర్చి చెలంగునాధరి
త్రీదయితామరేంద్రునకు దివ్యమహర్షికులాగ్రగణ్యు లా
మోదముతో నభీష్టకరము ల్వరము ల్గటియించి రందఱుళ్. 83

టీ. పుడమివేల్పులు = భూసురులు; వేదవిధానముళ్ = వేదవిధిని; తెల్పఁగళ్ = తెలియఁజేయఁగా; అంతళ్ = అటుపిమ్మట; శేషహోమాదిక మంగళాచరణములు.—శేషహోమాదిక = శేషహోమము మొదలుగాఁగల, మంగళ = మంగళకార్యములయొక్క, ఆచరణములు=ఆచరించుటలను; అన్నియుళ్ = అన్నిటిని; తీర్చి= సమాప్తినొందించి; చెలంగునాధరిత్రీదయితామరేంద్రునకుళ్.—చెలంగు = ప్రకాశించుచున్న, ఆధరిత్రీదయితామరేంద్రునకుళ్ = ఆసుచంద్రునకు; దివ్యమహర్షి కులాగ్రగణ్యులు.—దివ్య = శ్రేష్ఠులగు, మహర్షికుల = ఋషిసంఘమందు, అగ్రగణ్యులు=పూజ్యులగుమునులు, అందఱుళ్ = ఎల్లరును; ఆమోదముతోళ్ =

సంతోషముతో; అభీష్టకరముల్ = కోరిన కోరికలఁజేయునట్టి; వరముల్=వరములను; ఘటించిరి=ఇచ్చిరి.

అనఁగా శేషహోమాది వివాహాంగక్రియలు నిర్వర్తించి మించి యున్న పుడమి ఱేనికి నామహర్షిసంఘము లెల్లఁ గోరినవరముల నిచ్చి రని భావము.

ఉ. వేఁడినకోరికల్ గురియు•వింతగుమానికము ల్జగంబులం
జోడొకచోట లేని పలు•సొమ్ములు హెచ్చగు పైఁడివల్వలు
న్వేడుక పొంగ వీడు చది•వించిరి బంధులు సర్వదేశస
మ్రాడమరేంద్రులున్ హితులు • మంత్రులు తన్మహినేత కయ్యెడన్. 84

టీ. తన్మహినేతకున్ = ఆసుచంద్రునకు; అయ్యెడన్=ఆసమయమందు; బంధులు=చుట్టములు; సర్వదేశసమ్రాడమరేంద్రులు=ఎల్లదేశములదొరలు దేవశ్రేష్ఠులు; హితులు = నేస్తకాండ్రు; మంత్రులు=సచివులు; కోరినకోరికల్=అభీష్టవస్తువులను; కురియువింతగు మానికముల్.—కురియు=వర్షించు, వింతగు=చిత్రమగు, మానికముల్ = మణులను; జగంబులన్=లోకములందు; జోడు=జత; ఒకచోటన్=ఒకస్థలమందు; లేనిపలుసొమ్ములు = లేనట్టిపలువిధమగు నగలను; హెచ్చగుపైఁడివల్వలన్=అధికమైన బంగరువస్త్రములను; వేడుక=కుతూహలము; పొంగన్=అతిశయింపఁగ; వీడు=కట్నమును; చదివించిరి=ఇచ్చిరి.

వివాహాంతమందు సుచంద్రునకు బంధుగులు సర్వదేశరాజులు హితులు మొదలగువారు మణులు మొదలగు కట్నములు చదివించి రని భావము.

సీ. అహికి లోఁబడనిది•వ్యగజంబు బృంహితా
ర్భటిఁ గేరుభద్రవా•రణశతముల
ననికి వేలుపుతేజి • నలరుకైజామోర
యల్లార్పఁ జేఁ జీరు•హయకులముల
వేగంటితేరికా•వి మెఱుంగు వడగవి
వలిఁ జాయఁ జేయును•జ్జ్వలరథముల
తెఱగంటితెఱవల•తీ రెల్ల బెళుకుచూ
పులన వోనాడు పూఁ•బోఁడిగముల
తే. తులకు జేజెలరతనంబు • దొడర సుగుణ
భారగతి నెగఁబట్టు సు•దారమణుల
నపుడు పాంచాలుఁ డొసగెఁ ద•ద్వీపులవిభవ
జనితహర్షాప్తమతికిఁ ద•న్మనుజపతికి. 85

టీ. అహికిలోఁబడనిదివ్యగజంబున్.—అహికిన్=వృత్రాసురునకు, లోఁబడని=వశపడనట్టి, దివ్యగజంబున్=ఐరావతమును; బృంహితార్భటిన్=బృంహిత=కరిగర్జితములయొక్క, ఆర్భటిన్=ప్రోఁతచేతను; కేరుభద్రవారణశతములన్.—కేరు=పరిహసించు, భద్రవారణశతములన్=భద్రగజములనూఱులను; ఇంద్రశత్రువగువృత్రాసురునకు వశముగానియైరావతమునుతమ ధ్వనులచేఁ బరిహసించుచున్న పెక్కుగజములను పాంచాలుఁడు సుచంద్రున కిచ్చె నని భావము; అనికిన్=యుద్ధమునకు; వేలుపుతేజిన్=ఉచ్చైశ్శ్రవమును; అలరుకైజామోరయల్లార్పుచేన్.—అలరు=ఒప్పుచున్న, కైజా=కళ్లెమునకుఁగట్టఁబడినత్రాటిచేఁబిగింపఁబడిన, మోర=ముఖముయొక్క, అల్లార్పుచేన్=కదలించుటచేత; చీరుహయకులములన్=పిలుచుగుఱ్ఱములగుంపులను; ముఖచలనముచేనింద్రహయమును యుద్ధమునకుఁ బిలుచును త్తమాశ్వములను సమర్పించె నని భావము. వేగంటితేరికావి మెఱుంగున్.—వేగంటితేరి=ఇంద్రునిరథములను మేఘములయొక్క, కావి మెఱుంగున్=ఎఱ్ఱనికాంతిని; పడగపీవలిన్=ధ్వజమారుతముచేత; పాయఁజేయునుజ్జ్వలరథములన్ = పోఁగొట్టుప్రకాశించుచున్నరథములను; తమనిడెముయొక్క గాలిచేతనె మేఘములమెఱుఁగును బోఁగొట్టునట్టి రథంబుల నిచ్చె నని భావము; తెఱగంటి తెఱవలతీరెల్లన్=వేల్పుచెలులచక్కఁదనమునంతయు; బెళుకుచూపులనె=తళతళమనిప్రకాశించువీక్షణములచేతనే; పోనాడుపూఁబోఁడిగములన్=పోఁగొట్టుచున్నస్త్రీబృందములను; దేవాంగనలతీరును తమనేత్రకాంతిచేఁబోఁగొట్టుచున్న వనితల నిచ్చె ననిభావము; తులకున్=త్రాసునకు; జేజేలరతనంబు=చింతామణి; తొడరన్=పూనఁగా; సుగుణభారగతిన్.—సుగుణ=మంచిగుణములయొక్క, భార=బరువుయొక్క, గతిన్=రీతిచేత; ఎగఁబట్టునుదారమణులన్ = ఎగయఁజేయునుత్కృష్టమగుమణులను, చింతామణి తమతోఁ తులదూఁగఁగా తమగుణములచేనట్టిచింతామణిని బరువునందు చులకఁ జేయుమణుల నిచ్చె నని భావము. అప్పుడు=ఆసమయమందు; పాంచాలుఁడు=క్షణదోదయుఁడు; తద్విపులవిభవజనిత హర్షాప్తమతికిన్.—తత్=ఆక్షణదోదయునియొక్క, విపుల=విశాలమగు, విభవ=సంపదచేత, జనిత=పుట్టింపఁబడిన, హర్ష=సంతసముచేత, ఆప్త=పొందఁబడిన, మతికిన్=మనముగల; తన్మనుజపతికిన్= ఆసుచంద్రునకు; ఒసఁగెన్=ఇచ్చెను.

సీ. సన్మణిచాప మొ♦సంగెఁ ద న్గను నరి
మండలి కిది యా ర్తి ♦ మన్పు ననుచు
నాశుగాఘ మొసంగె ♦ నాశువ ర్తన నిది
పరవాహినుల భంగ ♦ పఱచు ననుచు
శాతహేతి నొసంగె ♦ సమిదుజ్జ్వలిత వీర
తరులను నిది మాయఁ ♦ దార్చు ననుచు
ఘనవల్లి నొసఁగె వే♦గ మహామహీతాళుల
కిది సుమనోయోగ ♦ మెనపు ననుచు

తే. మఱియు దివ్యాయుధంబు ల◆ త్తఱి నొసంగె
నవ్యవిజయేందిరానిదా◆నమ్ము లనుచు
హాళి దళుకొత్త నలకూకు◆దావతంస
మవ్విభున కిట్లు దెలుపుచు ◆ నాదరమున. 86

టీ. సన్మణిచాపము.—సత్=శ్రేష్ఠమగు, మణిచాపము=మణిమయమగుధనుస్సును; తన్=తన్ను; కనునరిమండలికిన్=చూచుశత్రు బృందమునకు; ఇది=ఈవిల్లు; ఆర్తిన్=పీడను; మన్పున్=వృద్ధిపఱచును. అనుచున్=ఈప్రకారము చెప్పుచు; ఒసంగెన్=ఇచ్చెను. ఇచట, సన్మణిచాపము=ఇంద్రధనుస్సు; తన్గనునరిమ్మండలికిన్=తన్నుఁ జూచుచక్రవాకకదంబమునకు, ఆర్తిమన్పునను నర్థముదోఁచుచున్నది. యుద్ధమందుఁ దనుఁ జూచినశత్రుమండలికి నీవిల్లుఆర్తిని గలిగించుననుచుఁజెప్పుచు నాచాప మొసంగెనని భావము. ఆశువర్తనన్=అతిశీఘ్రవర్తనచే; ఇది=ఈబాణపుంజము; పరవాహినులన్.—పర=శత్రులయొక్క, వాహినులన్=సేనలను; భంగపఱచున్=భంగపెట్టును. అనుచున్=ఈప్రకారము చెప్పుచు; ఆశుగౌఘము=బాణసంఘమును; ఒసంగెన్=ఇచ్చెను. ఇచట, ఆశుగౌఘమ్ము = వాయుబృందము ; పరవాహినులన్.— పర=ఉత్కృష్టలగు, వాహినులన్=నదులను; భంగపఱచున్ = తరఁగలుగలవానిగాఁ జేయు నను నర్థము దోఁచుచున్నది; ఈ బాణబృందము శత్రువులసేనల భంగపఱచునట్టి సామర్థ్యము గలదని చెప్పి యిచ్చె నని భావము. సమిదుజ్జ్వలితవీరతరులనున్.— సమిత్ = యుద్ధమందు, ఉజ్జ్వలిత = మిగుల వెలుఁగుచున్న, వీరతరులనున్ = వీర శ్రేష్ఠులను; ఇది = ఈహేతి ; మాయన్ = నశించునట్లు ; తార్చున్ = చేయును. అనుచున్ = ఈప్రకారము చెప్పుచు ; శాతహేతిన్.— శాత = వాఁడిగల, హేతిన్ = ఖడ్గమును; ఒసంగెన్=ఇచ్చెను.. ఇచట, సమిత్=సమిధలచే, ఉజ్జ్వలిత = మిక్కిలిప్రకాశించు; వీరతరులనున్ = ఏఱుమద్దిచెట్లను, మాయఁదార్చును = నశింపఁజేయునని; శాతహేతిన్=తీక్ష్ణమగు అగ్నిజ్వాలను; ఒసంగె నను నర్థము దోఁచుచున్నది. యుద్ధమునందు ప్రతివీరుల మాయఁజేయునట్టిసామర్థ్యము గల దని తెలిపి యొకఖడ్గము నిచ్చె నని భావము. మహాహితాళులకున్.—మహాత్=అధికులగు, అహిత=శత్రువులయొక్క, ఆళులకున్=శ్రేణులకు; ఇది=ఈముద్గరము; సుమనోయోగము.—సుమనః=దేవతలయొక్క, యోగము=సంబంధమును; ఎనపున్=పొందించును. అనుచున్=ఈప్రకారము చెప్పుచు; ఘనవల్లిన్=తీఁగవంటిముద్గరమును; వేగ=వేగముగ; ఒసఁగెన్=ఇచ్చెను. ఇచట, మహాహితాళులకున్.—మహాహితమగు, అళులకున్=తుమ్మెదలకు; ఘనవల్లి=ఘనమగు తీవ, సుమనోయోగమును = పువ్వులయొక్క సంబంధము ననునర్థము దోఁచుచున్నది, ఈముద్గరము యుద్ధమందు శత్రులఁ గూల్చి వారికి దేవత్వ మొసఁగు నని చెప్పి యీముద్గరము సుచంద్రున కిచ్చె నని భావము. దివ్యవిజయేందిరానిదానమ్ములు=మనోజ్ఞమగుజయలక్ష్మికి నాదికారణములు. అనుచున్=చెప్పుచు; మఱియున్=వెండియు; దివ్యాయుధంబులు.—దివ్య=అప్రతిహతమగు, ఆయుధంబులు = ఆయుధములను; ఆత్తఱిన్=ఆసమయమందు; హాళిదళుకొత్తన్.—హాళి=ఆసక్తి, దళుకొత్తన్=

ప్రకాశింపఁగ; అలకాకుభానతంపము=కన్యకలంకరించి దానముఁజేసినవానిలో శ్రేష్ఠుఁడగుక్షణదోదయుఁడు; "సత్కృత్యాలంకృతాం కన్యాం యో దదాతి స కూకుదః" అని అమరుఁడు; అవ్విభునకున్ =ఆసుచంద్రునకు; అట్లు తెలుపుచుకా=అరీతి తెలియఁజేయుచు; ఆదరమునన్=ప్రేమచేత; ఇట్లంగిక్=ఇచ్చెను.

చ. అసమబుధప్రకాండయుతి • నాతతనిర్మలపుష్కరాపగా
ప్తి సరసపారిజాతజగ•తీరుహశోభితసౌధయుక్తి ని
వ్వసుధ మరుత్పురస్ఫురణ • పాటిలుభవ్యపురీశతంబులా
బసుపున కిచ్చె నయ్యవని•పాలుఁడు పుత్త్రికి సమ్మదంబునన్. 87

టీ. అసమబుధప్రకాండయుతిక్.—అసమ=సరిలేని, బుధప్రకాండ=విద్వచ్ఛ్రేష్ఠులయొక్క, యుతిక్=కూడికచేతను; బుధప్రకాండ=దేవసంఘముయొక్క, యుతిక్=కూడికచేతనని స్వర్గపరముగునర్థము; ఆతతనిర్మలపుష్కరాపగాప్తిక్.—ఆతత=విశాలముగు, నిర్మల=స్వచ్ఛమగు, పుష్కర=కమలములుగల, ఆపగా=నదులయొక్క, ఆప్తిక్ = ప్రాప్తిచేతను; పుష్కరాపగా = స్వర్గంగయొక్క, ప్రాప్తిచేతనని స్వర్గపరమగునర్థము; సరసపారిజాతజగతీరుహశోభితసౌధయుక్తిక్.—సరస=శ్రేష్ఠమగు, పారిజాతజగతీరుహ = పారిజాతవృక్షముల చేత, శోభిత=ప్రకాశించుచున్న, సౌధయుక్తిక్=మేడలయొక్కసంబంధముచేతను; పారిజాతజగతీరుహ=కల్పవృక్షముచేతనని స్వర్గపరమగునర్థము; ఇవ్వసుధన్=ఈభూమియందు; మరుత్పురస్ఫురణ.—మరుత్పుర= స్వర్గముయొక్క, స్ఫురణ = ప్రకాశము; పాటిలుభవ్యపురీశతంబులక్.—పాటిలు=కలుగుచున్నట్టి, భవ్య=మనోజ్ఞమగు, పురీశతంబులన్=పురశతములను; ఆయ్యవనిపాలుఁడు=ఆక్షణదోదయుఁడు; పుత్త్రికిన్=పుత్త్రికయగుచంద్రికకు; పసుపునకున్=పసుపుకుంకుమకుఁగాను; సమ్మదంబునన్=సంతసముచేత; ఇచ్చెన్=ఇచ్చెను.

అవఁగా క్షణదోదయుఁడు తనపుత్త్రికయగు చంద్రికకు స్వర్గతుల్యములగుపురశతములను పసుపుకుంకుమకుఁగా నిచ్చె నని భావము.

మ. ధరణిన్ మేల్ రతనాలసొమ్ములును జ•ల్తార్చీరలుం గ్రొత్తక
స్తురివీణెల్ ఘనసారసాంద్రధమనీ•స్తోమంబు లవ్వేళ ని
ర్భరచామీకరపేటికోత్కరములం • బన్నించి కాన్ వెండియున్
దరుణీమాళి కొసంగె నయ్యవనికాం•తాభర్త చిత్రంబుగన్. 88

టీ. ధరణిన్=భూమియందు; మేల్ రతనాలసొమ్ములును = శ్రేష్ఠముగురత్నభూషణములైననగలును; జల్తార్చీరలున్=సరిగంచుచీరలును; క్రొత్తకస్తురివీణెల్=నూతనముగుకస్తురివీణెలు; ఘనసారసాంద్రధమనీస్తోమంబులు —ఘనసార = పచ్చకర్పూరముచేత, సాంద్ర = నిండిన, ధమనీస్తోమంబులు=క్రోవులగుంపులు; ఆవ్వేళన్=ఆసమయమునందు; నిర్భరచామీకరపేటికోత్కరములన్.—నిర్భర=అధికమగు, చామీకర=బంగరుయొక్క, పేటికా=పెట్టెలయొక్క, ఉత్కరములన్=సమూహములయందు; బన్నించి=ఉంచి; కాన్=కాను; వెండియున్=మఱి

యు; తరుణీమాలికకున్=చంద్రికకు; అయ్యవనికాంతాభర్త=ఆక్షణదోదయరాజు; చిత్రంబుగన్=వింతగ; ఒసంగెన్=ఇచ్చెను.

అనఁగ నాక్షణదోదయుఁడు చంద్రికకు రత్నాభరణములను సరిగంచువస్త్రములను కస్తురిపీణెను పచ్చకప్పురపుక్రోవులను బంగరుపెట్టెలనించి యిచ్చె నని భావము.

చ. స్థిరతమభక్తి మ్రొక్కి తమ•చెంగట నిల్చినఁ గ్రొత్తపెండ్లికూఁ
తురు కడుం బుజ్జగించి లలి•తో మునికామిను లెల్ల నాసువ
ర్ణరుచికిఁ జాల నైదువత•నం బతిదీర్ఘతరాయురున్నతుల్
సరసతనూజలాభము నొ•సంగిరి తత్పరతాయుతాత్మచేన్. 89

టీ. క్రొత్తపెండ్లికూఁతురు=క్రొత్తగా పెండ్లియయిన చంద్రిక; స్థిరతమభక్తిన్ = దృఢతరమగు భక్తిచేత; మ్రొక్కి = నమస్కరించి; తమచెంగటనిల్చినన్ = తమసమీపమందు నిలుచుండఁగా; కడున్=మిక్కిలి; బుజ్జగించి=లాలనచేసి; లలితోన్=ప్రేమతో; మునికామినులెల్లన్=మునిపత్నులందఱు; ఆ సువర్ణరుచికిన్ = బంగరువన్నెగల యా చంద్రికకు; చాలన్=మిక్కిలి; ఐదువతనంబు = సువాసినీత్వమును; అతిదీర్ఘతరాయురున్నతుల్ = మిక్కిలి యధికమగు ఆయుస్సుయొక్క అతిశయములను; సరసతనూజలాభమున్.—సరస = శ్రేష్ఠుఁడగు, తనూజ=పుత్రునియొక్క, లాభమున్=ప్రాప్తిని; తత్పరతాయుతాత్మచేన్.—తత్పరతా=తత్పరత్వముతో, యుత=కూడుకొన్న, ఆత్మచేన్=బుద్ధిచేత; ఒసంగిరి=ఇచ్చిరి.

అనఁగా మునిభామ లెల్లరు చంద్రికకు నాసక్తిచేత నైదువతనంబును పుత్రప్రాప్తిని బూర్ణమగు నాయుస్సును ఇచ్చిరని భావము.

సీ. అలఘుభోగసమృద్ధి • నర్పించెఁ బౌలోమి
యనుపమౌజశ్శ్రీల • నొసఁగె ననలి
ధర్మైకబుద్ధి నొం•దఁగఁ జేసె యమభామ
యుత్తరమ్యోత్సవం • బిచ్చె నసురి
కమలాభ్యుదయముఁ బొం • దమరించెఁ బాశిని
సుస్పర్శనాసక్తిఁ • జొన్పెఁ బవని
రాజపూజోన్నతిఁ • బ్రబలించె ధనరాజ్ఞి
యీశభక్తి ఘటించె • మృడవధూటి
తే. మఱియుఁ దక్కిననిర్జరీ•మణు లుదార
కలితసౌభాగ్యవిభవము • ల్గలుగఁ జేసి
రప్పుడు పాణిగ్రహణమంగ•ళానురచిత
కౌతుకనై శ్రీ రహించు నా•క్షితిపసుతకు. 90

టీ. పౌలోమి=శచీదేవి; అలఘుభోగసమృద్ధి.—అలఘు=అధికమైన, భోగ=అష్టభోగములయొక్క, సమృద్ధిన్=సంపదను; అర్పించెన్=ఒసంగెను, శచీదేవి యింద్రునిభార్య గాన తమ కున్నభోగముల నిచ్చె నని భావము. అనలి=స్వాహాదేవి; అనుపమౌజశ్శ్రీలన్ —అనుపమ=సాటిలేని, ఓజశ్శ్రీలన్=తేజస్సంపదలను; ఎసఁగెన్=పొందించెను, అగ్నిభార్య గాన తేజస్సమృద్ధి నిచ్చె నని భావము. యమభామ=యమునిభార్య; ధర్మైకబుద్ధిన్.—ధర్మ=పుణ్యమందు, ఏక=ముఖ్యమగు, బుద్ధిన్=మతిని; ఒందఁగన్=పొందునటులు; చెసెన్= ఒనర్చెను. యమభార్య ధర్మబుద్ధి నిచ్చె నని భావము. అసురి = నిరృతిభార్య; ఇష్టరమ్యోత్సవంబు.—ఇష్ట=అనుకూలమగు, రమ్య=మనోజ్ఞమగు, ఉత్సవంబు=వేడుకను; ఇచ్చెన్=ఒసఁగెను. కామరూపము చేత నలభ్యోత్సవములను బొందుచున్న రాక్షసునిభార్య గాన ఇష్టరమ్యోత్సవంబుల నిచ్చెనని భావము. వారుణి=వరుణునిభార్య; కమలాభ్యుదయముపొందు.—కమలా=సంపదయొక్క, అభ్యుదయముపొందు=ఆవిర్భావముయొక్క పొందికను; సమరించెన్=కలిగించెను. లక్ష్మి తమయింటఁ బుట్టినది గాన సులభముగా నిచ్చె నని భావము. వరుణుఁడు జలాధిష్ఠానదేవత గాన జలజంబుల నిచ్చె నని యర్థము దోఁచుచున్నది. పవని=వాయుదేవునిభార్య; సుస్పర్శదానసక్తిన్.—సు=సమీచీనమగు, స్పర్శ=దానమందు, ఆసక్తిన్=వాంఛను; చొనిపెన్ = కలుగఁజేసెను. స్పర్శగుణము గలవాయుభార్య గాన సుఖస్పర్శను నిచ్చె నని దోఁచుచున్నది. వాయుదేవునిభార్య దానమందు ఆసక్తి గల బుద్ధి నిచ్చె నని భావము. ధనదాంగన = కుబేరునిభార్య; రాజపూజోన్నతిన్.—రాజ=రాజుల చేత, పూజ్య=పూజింపఁదగిన, ఉన్నతిన్ = అతిశయమును; ప్రబలించెన్ = బలపఱచెను. ఈమె రాజరాజుభార్య గాన రాజపూజ్యోన్నతి నిచ్చె నని భావము. మృడవధూటి=పార్వతీదేవి; ఈశభక్తిన్ .—ఈశ = భర్తయందు, భక్తిన్=భక్తిని; ఘటించెన్=ఘటిల్లఁజేసెను, పార్వతీదేవి ఈశ్వరునిభార్య గాన స్వపురుషునియందు భక్తిని ఘటిల్లఁజేసె నని భావము. శంకరునియందు భక్తి గలుగఁ జేసె నని దోఁచుచున్నది. మఱియున్=వెండియు; తక్కిన నిర్జరీమణులు=తక్కిన దేవాంగనలు; ఉదారకలితసౌభాగ్యవిభవముల్.—ఉదార అధికముగా, కలిత=కూడుకొన్న, సౌభాగ్య=సుభగత్వముయొక్క, విభవముల్ = అతిశయములను; పాణౌకరణమంగళానురచితకుతుకలై.—పాణౌకరణమంగళ = వివాహమంగళము చేత, అనురచిత=పుట్టింపఁబడిన, కుతుకలై=సంతోషముగలదియై; శ్రీన్=శోభ చేత; రహించు నాక్షితిపసుతకున్=ఒప్పుచున్న కృష్ణరాయనిపుత్రిక యగు నాచంద్రికకు; అప్పుడు=ఆసమయమందు; కలుగఁజేసిరి=సిద్ధించునటులు చేసిరి.

మ. మనుజాధీశసతుల్ నుతింప ననుకం•పాలక్ష్మి నవ్వేళఁ గం
ధినిషంగప్రియభామ యాత్మమహిమ•న్నిత్యాంగరాగంబు సే
యనిసింగారము వాడనట్టివిరి పా•యన్లేనితారుణ్యవ
ర్తనము న్వీడనిసొంపుపెంపు కలుగ•న్దార్చె న్వరం బింతికిన్. 91

టీ. కంధినిషంగప్రియభామ=జలధితూణీరము గాఁగల యీశ్వరునిభార్యయగు పార్వతీదేవి; అవ్వేళన్=ఆసమయమందు; అనుకంపాలక్ష్మిన్=కృపాసంపద చేత; మనుజాధీశసతు

లో=రాజపత్నులు; నుతింపఁగ=పొగడఁగా; ఆత్మమహిమన్.—ఆత్మ=తనయొక్క, మహిమన్=సామర్థ్యము చేత; నిత్యాంగరాగంబు=అకృత్రిమమై సార్వకాలీనమగునంగరాగమును, అనఁగా మైపూఁతనుట; చేయనిసింగారము=అకృత్రిమాలంకారమును; వాడనట్టివిరి=వాడనిపువ్వును; పాయన్లేనితారుణ్యవర్తనమున్ = నివర్తింపని యౌవనమును; వీడనిసొంపు పెంపు=వర్తింపని సౌందర్యాతిశయమును; కలుగన్ = కలుగునటులు; ఇంతికిన్=చంద్రికకు; వరంబు=వరమును; తా ర్చెన్=ఇచ్చెను.

అనఁగాఁ బార్వతీదేవి దయతోఁ జంద్రికకు నెల్లపుడు నిత్యాంగరాగమును చేయనిసింగారమును వాడనట్టికుసుమంబు పాయనితారుణ్యము వీడనిసొంపును గలుగునటులు వరంబిచ్చెనని భావము.

చ. పలుకులఁ దేనె లుట్టిపడ భావిశుభంబులు దెల్పు నేర్పుమైఁ
బొలయలుక ల్మరల్పి చెలిపోలిక నీవిభు నిన్నుఁ గూర్చు ని
చ్చలు భవదిష్ట మంతయుఁ బొసంగఁ దనర్పు నెఱుంగు మంచు ను
త్కలిక వచించి యొక్కచిలుకం గిరికన్య యొసంగెఁ గొమ్మకున్. 92

టీ. పలుకులన్=మాటలయందు; తేనెలు=మకరందములు; ఉట్టిపడన్=ఊడిపడునటులు; భావిశుభంబులు.—భావి=కాఁబోవునట్టి, శుభంబులు=మంగళములను; నేర్పుమైన్=చాతుర్యము చేత; తెల్పున్=తెలియఁజేయును. పొలయలుకల్=ప్రణయకలహారిబులను; మరల్పి=త్రిప్పి; చెలిపోలికన్=సకియవలె; నీవిభున్=నీపెనిమిటిని; నిన్నున్=నిన్నును; కూర్చున్=కూడఁబెట్టును. నిచ్చలు=ఎల్లపుడును; భవదిష్టమంతయున్=నీకోరికనంతయు; పొసంగన్=అనుకూలించునటులు; తనర్పన్=చేయుటకు; ఎఱుంగునంచున్=తెలియుననుచు; ఉత్కలికన్=సంతసము చేత; వచించి=చెప్పి; ఒక్కచిలుకన్=ఒక శుకమును; గిరికన్య=పార్వతీదేవి; కొమ్మకున్=చంద్రికకు, శాఖ కని తోఁచుచున్నది; ఒసంగెన్=ఇచ్చెను.

భవిష్యచ్ఛుభములను దెలుపునదియు దంపతులను ప్రణయకలహముచు పోఁగొట్టి కూర్చునదియు కోరిన కోర్కుల నెఱవేర్చునదియు నగు నొకశుకంబును పార్వతీదేవి చంద్రికకొసంగెనని భావము.

మ. సురభి న్బొన్నలతావి మల్లియలతేజు న్వేసవి న్జాతిపై
ఖరి వర్షాది శరద్దినాళి ననసోఁకుస్ఫూర్తి సేమంతిదా
ల్వర హేమంతముఖంబున న్శిశిరవేళ న్మల్లచాల్పెంపు దా
ల్చి రహిం గూర్చు నటంచు నొక్క విరి నిచ్చె న్గౌరి యజ్ఞాత్మికిన్. 93

టీ. సురభిన్=ఆమనియందు; పొన్నలతావిన్=పొన్నపూలపరిమళమును; వేసవిన్=గ్రీష్మర్తువునందు; మల్లియలతేజున్=మల్లికాకుసుమములయొక్కయొప్పును, అనఁగా దానిపరిమళమునుటు; వర్షాదిన్=వర్షాకాలముయొక్కప్రారంభమునందు; జాతిపైఖరిన్=మాలతీకుసుమములయొక్కరీతిని, అనఁగా దానిపరిమళము ననుట; శరద్దినాళిన్=శరత్కాలదివసములు

హాయనందు; అనసాఘనస్ఫూర్తిన్ = సర్జకపుష్పములయొక్క అతిశయమును; వరహేమంతముఖంబునన్.—వరహేమంత = శ్రేష్ఠమగు హేమంతకాలముయొక్క, ముఖంబునన్ = ఆదిభాగమందు; సేమంతి డాల్ = చేమంతిప్రకాశమును, దానిపరిమళంబుననుట; శిశిరవేళన్ = శిశిరకాలమందు; మొల్లచాల్పెంపున్ = కుందశ్రేణియొక్క అతిశయమును, అనఁగ దానిపరిమళమును; తాల్చి = ధరించి; రహిన్ = ఆనందమును; కూర్చును. అటంచున్ = ఈప్రకారము వచించుచు; ఒక్కవిరిన్ = ఒకపుష్పమును; గౌరి = పార్వతీదేవి; అబ్జాక్షికిన్ = చంద్రికకు; ఇచ్చెన్ = ఒసంగెను.

అనఁగా వసంతగ్రీష్మశరద్ధేమంతశిశిరంబులందు వరుసగాఁ బున్నాగమల్లికామాలతీసర్జక సేమంతికాకుందప్రసూనంబులపరిమళంబు ధరించునట్టి యొకపుష్పంబును గౌరీదేవి చంద్రిక కిచ్చె నని భావము.

చ. తలఁచినకోరిక ల్గురియు • దాని మెఱుంగుమెఱుంగుమిన్నలం
దళతళమంచు మించుజిగి • దాని ధరించినమాత్ర దేవకాం
తలఁ గికురించుసొం పెసఁగు • దాని నొకానొకరత్నమాలికన్
జలరుహలోచనామణి కొ • సంగె గిరీంద్రకుమారి యత్తఱిన్. 94

టీ. తలఁచినకోరికల్ = కోరినకోరికలను; కురియుదానిన్ = వర్షించునట్టిదానిని, ఒసంగుచున్నదాని నని భావము; మెఱుంగుమెఱుంగుమిన్నలన్ = కాంతిగల శ్రేష్ఠములయిన మెఱుపులను; తళతళమంచున్ = తళతళమని మెఱయుచు; మించుజిగిదానిన్ = మీఱినకాంతిగలదానిని; ధరించినమాత్రన్ = ఆసరమును తాల్చినంతట నె; దేవకాంతలన్ = దేవాంగనలను; కికురించుసొం పెసఁగుదానిన్ = వంచించునందముచేత నతిశయించుదానిని; ఒకానొకరత్నమాలికన్ = ఒకానొకరత్నహారమును; గిరీంద్రకుమారి = పార్వతీదేవి; అత్తఱిన్ = ఆసమయమందు; జలరుహలోచనామణికిన్ = నారీరత్నమగుచంద్రికకు; ఒసంగెన్ = ఇచ్చెను.

అనఁగా నిష్టార్థముల నిచ్చునదియు మెఱపుతీవను దిరస్కరించుకాంతితోఁ గూడినదియు ధరించినంతమాత్రమున దేవాంగనలకన్న నెక్కువయందము గల్గించునదియునగు నొకరత్నసరమును పార్వతీదేవి చంద్రిక కిచ్చె నని భావము.

చ. మఱియు నమూల్యవాంఛితస • మాజము లాదృతిచే ఘటించి యా
. తెఱవఁ గవుంగిలించి నర • దేవకుమారిక పోయి వత్తు ని
త్తఱి నని చెల్పి యాగిరిశ • తన్వి ముదంబున నేగ వేలుపుల్
తఱిగొని వెంట నొంద రజ • తక్షితిభృన్నిలయంబుఁ జేరఁగన్. 95

టీ. మఱియున్ = వెండియు; అమూల్యవాంఛితసమాజములు.—అమూల్య = వెలలేని, అనఁగ శ్రేష్ఠములయినట్టివని భావము, వాంఛిత = ఇష్టార్థములయొక్క, సమాజములు = సమూహములను; ఆదృతిచేన్ = ఆదరముతో; ఘటించి = ఇచ్చి; ఆతెఱవన్ = ఆచంద్రికను; కవుంగిలించి = కౌఁగిలించి; నరదేవకుమారిక = చంద్రికా! ఇత్తఱిన్ = ఇప్పుడు; పోయివత్తున్ = పోయివచ్చెదను.

అని తెల్పి=ఈప్రకారము తెలియఁజేసి; ఆగిరిశతన్వి=శంభుకాంతయగు నాపార్వతీదేవి; ము దంబునన్=సంతసము చేత; వేలుపుల్=దేవతలు; తిఱిగొని = పూని; వెంటన్ = వెంబడి; ఒందన్=పొందఁగా; దేవాంగనలు వెఁట రాఁగా నని తాత్పర్యము; రజతక్షితిభృన్నిలయం బు=కైలాసగిరియను గృహమును; చేరఁగన్=పొందుటకు; ఏగెన్=అరిగెను.

అనఁగా పార్వతీదేవి చంద్రికకుఁ గోరినకోరిక లెల్ల నొసఁగి కౌఁగిలించి పోయి వత్తు నని వచించి దేవతలం గూడి కైలాసనిలయంబుఁ జేరె నని తాత్పర్యము.

ఉ. అంత సుచంద్రమానవకు♦లాగ్రణిచే క్షణదోదయక్షమా
కాంతునిచే బహూకృతులు♦ గైకొని తత్సకలాంతరీపరా
ట్సంతతు లెల్ల నైజపుర♦జాతముఁ జేరఁగ నేగె మానసా
భ్యంతరసీమఁ దచ్ఛుభమ♦హావిభవోన్నతి సన్నుతించుచున్. 96

టీ. అంతన్=అపిమ్మట; సుచంద్రమానవకులాగ్రణిచేన్=మనువంశశ్రేష్ఠుండగు సుచం ద్రునివలన; క్షణదోదయక్షమాకాంతుని చేన్=క్షణదోదయ రాజువలన; బహూకృతులు=బ హుమతులను; కైకొని=గ్రహించి; తత్సకలాంతరీపరాట్సంతతు లెల్లన్.—తత్ = ప్రసిద్ధులగు, సకల=ఎల్ల, అంతరీపరాట్=ద్వీపాధిపతులయొక్క, సంతతు లెల్లన్=సమూహము లెల్ల; మాన సాభ్యంతరసీమన్=చిత్తమధ్యప్రదేశమందు; తచ్ఛుభమహావిభవోన్నతిన్=ఆవివాహమహో త్సవముయొక్క యతిశయమును; సన్నుతించుచున్=పొగడుచు; నైజపురజాతమున్=నిజపత్తన బృందమును; చేరన్=పొందుటకు; ఏగెన్=చనెను.

అనఁగా వివాహమహోత్సవమునకై చనుదెంచి యున్న సకలదేశరాజులును సుచం ద్రునివలన క్షణదోదయునివలన బహుమతుల నొంది యావివాహోత్సవము నెన్నుచు స్వ పురంబులు చేరఁ బోయిరని భావము.

మ. అలపాంచాలవిభుండు పుత్త్రి కధికాం♦తావాసనూత్నప్రవే
శలసన్మంగళ మొనర్పఁగాఁ దలఁచి త♦త్సారంగదేశీయకుం
తలఁ దాఁ గౌఁగిటఁ జేర్చి యంకవసతిం♦ దార్కొల్పి నవ్యాశ్రుసం
కులమై కన్గవ దోఁప నచ్చెలువఁ బ♦ల్కుం బ్రీతిచే నత్తఱిన్. 97

టీ. అలపాంచాలవిభుండు=ఆక్షణదోదయుఁడు; పుత్త్రికిన్=చంద్రికకు; అధికాంతా వాసనూత్నప్రవేశలసన్మంగళము.—అధికాంతావాస = భర్తృగృహమునకు, నూత్నప్రవేశ= నూతనప్రవేశరూపమగు, లసత్=ప్రకాశించుచున్న, మంగళము=కల్యాణమును; ఒనర్పఁగాన్= చేయుటకు; తలఁచి=మనమునందుయత్నించి; తత్సారంగదేశీయకుంతలన్=భృంగములవంటి కురులుగలయాచంద్రికను; ఇచట సీమదసమాప్తియందు దేశీయర్ప్రత్యయము; తాన్=క్షణదో దయుఁడు; కౌఁగిటఁజేర్చి=కౌఁగిలియందుఁజేర్చుకొని; అంకవసతిన్=ఉత్సంగస్థానమును; దార్కొల్పి=పొందఁజేసి; కన్గవ = కనుదోయి; నవ్యాశ్రుసంకులమై.—నవ్య = నూతనమగు,

అశ్రుల=కన్నీటిచేత, సంకులమై=వ్యాకులమయినదై; తోఁపఁగన్=తోఁచుచుండఁగ; అచ్చెలువన్=ఆచంద్రికతో; అత్తఱిన్ = ఆసమయమందు; ప్రీతిచేన్ = ప్రేమతో; పల్కెన్=పలికెను

అనఁగా క్షణదోదయుండు చంద్రికకు భర్తృగృహప్రవేశముఁ జేయఁ దలఁచి యా చంద్రికను దొడపై నిడుకొని కన్నీ రిడుచు చంద్రికతో నిట్లు పలికె నని భావము.

క. నిచ్చలు పుట్టినయింటికిఁ, జొచ్చినయింటికి నపూర్వ♦శుభకీర్తితతుల్
హెచ్చ మెలంగవె తల్లి భ, వచ్చరితము భువనపుణ్య♦వైఖరిఁ బొదలన్.

టీ. నిచ్చలు=ఎల్లపుడు; పుట్టినయింటికిన్=జనకగృహమునకు; చొచ్చినయింటికిన్=తాను ప్రవేశించినయింటికి, అనఁగా భర్తృగృహమునకు; అపూర్వశుభకీర్తితతుల్.—అపూర్వ=నూతనములగు, శుభ=మంగళకరములగు, కీర్తితతుల్=కీర్తిపుంజములు; హెచ్చన్ = అతిశయించునటులు; తల్లి=చంద్రికా! భవచ్చరితము.—భవత్=నీయొక్క, చరితము=సచ్చరిత్రము; భువనపుణ్యవైఖరిన్,—భువన=ప్రపంచమందు, పుణ్యవైఖరిన్=పవిత్రమగురీతిచే; పొదలన్=వృద్ధిఁబొందునటులు; మెలంగవె=వర్తింపుము.

అనఁగా జనకగృహమునకు భర్తృగృహమునకును కీర్తి యతిశయించునటులు నీచరితము లోకములందు పవిత్రమని పేరొందఁబడునటులు వర్తింపు మని భావము.

సీ. వంశధర్మనిరూఢి ♦ వఱలించె నీనారి
మహితశాస్త్రాధిగ♦మంబుకలిమి
గురుతరులకు వన్నె ♦ గూరిచె నీశ్యామ
ఘనసుమనోవిక♦ననముచేత
నిను నుదయంబున ♦ నెనఁగు నీపద్మిని
మంజులామోదనా♦మగ్రి మెఱయ
ద్విజరాజిఁ బోషించి ♦ దీపించు నీకొమ్మ
భాసురఫలదాన♦పటిమఁ బూని
తే: యనుచు జగమెల్ల నుల్లాస ♦ మతిశయిల్ల
సంతతము మెచ్చ మను మమ్మ ♦ తమకు జన్మ
పేద మనఁ దనర్చు నంభోజ♦పాణిజీవ
నమ్మ జీవన మని యెంచు ♦ మమ్మ కొమ్మ. 59

టీ. ఈనారి=ఈకాంత; మహితశాస్త్రాధిగమంబుకలిమిన్.—మహిత=అధికమగు, శాస్త్ర=ఆస్తికశాస్త్రముల యొక్కటియొక్క, అధిగమంబు=ప్రాప్తియొక్క, కలిమిన్ = సంపద

చేత; వంశధర్మనిరూఢిన్.—వంశధర్మ=కులాచారధర్మముయొక్క, నిరూఢిన్=ప్రసిద్ధిని; వఱలించెన్=ప్రకాశింపఁజేసెను. ఇచట, ఈనారి=ఈయల్లెత్రాడు; మహితశాస్త్రాధిగమంబు కలిమిన్.—మహితమగు, శాస్త్ర=బాణపుంజముయొక్క, అధిగమంబు=ప్రాప్తియొక్క, కలిమిన్=కలుగుటచేత; వంశధర్మనిరూఢిన్ = వెదురుధనువుయొక్కనిరూఢిని; వఱలించె నను నర్థము దోఁచుచున్నది; అనఁగా నీకాంత సమస్తశాస్త్రములు చదివి కులాచారధర్మమును చక్కఁగ నభివృద్ధిచేసె నని తాత్పర్యము. ఈశ్యామ=ఈచంద్రిక; ఘనసుమనోవికసనము చేతన్.—ఘన=ఘనులగు, సుమనః=విద్వాంసులయొక్క, వికసనము చేతన్=ఆనందము చేత; గురుతరులకున్=తండ్రిమొదలగుపూజ్యులకు; వన్నెన్ = అలంకారమును; కూరిచెన్ = ఒనరించెను. ఇచట, ఈశ్యామ=ఈప్రేంకణపుతీవ; ఘనసుమనోవికసనము చేతన్=ఘనమగుపుష్పవికాసము చేత; గురుతరులకున్=గొప్పవృక్షములకు; వన్నెగూర్చెననునర్థము దోఁచుచున్నది. అనఁగా నీచంద్రిక విద్వాంసులను సంతసింపఁజేయుటచే తండ్రి మొదలగువారి కందఱికిని మిక్కిలి యలంకారమును గలుగఁజేసెనని భావము. ఈపద్మిని=ఈచంద్రిక; ఇనునుదయంబునన్=పతియొక్కయుత్కర్షము చేత; మంజులామోదసామగ్రి.—మంజుల=మనోజ్ఞమగు, ఆమోదసామగ్రి=సంతోషసామగ్రి; మెఱయన్=ప్రకాశించునటులు; ఎసఁగున్=ఒప్పును. లోకమందు పతి సంతోషించినచో పత్ని సంతోషించుటయు వ్యసనపడినచో వ్యసనపడుటయు ముఖ్యపతివ్రతాధర్మము, అందుకు "ఆర్తార్తే ముదితే హృష్టా ప్రోషితే మలినా కృశా" యని ప్రమాణము; ఇచట, పద్మిని=పద్మలత; ఇనునుదయంబునన్=సూర్యోదయమందు; మంజులామోదసామగ్రి మెఱయన్.—మంజులమగు, ఆమోదసామగ్రి=పరిమళసామగ్రి, మెఱయునటులు; ఎసఁగు నని యర్థాంతరము దోఁచుచున్నది. ఈకొమ్మ=ఈచంద్రిక; భాసురఫలదానపటిమన్.—భాసుర=ప్రకాశించుచున్న, ఫల=లాభములయొక్క, దాన=త్యాగముయొక్క, పటిమన్=సామర్థ్యమును; పూని=పొంది; ద్విజరాజిన్=బ్రాహ్మణశ్రేణిని; పోషించి=కాపాడి; దీపించున్=ప్రకాశించును. ఇచట, ఈకొమ్మ=ఈశాఖ, భాసురమగు, ఫల=పండ్లయొక్క, దానపటిమను బూని, ద్విజరాజిన్=పక్షిశ్రేణిని, పోషించి, దీపించుననునర్థము దోఁచుచున్నది. అనఁగ నీచంద్రిక షోడశమహాదానంబు లిచ్చి బ్రాహ్మణులఁ గాపాడుచు ప్రకాశించుచున్న దని భావము. కొమ్మ=చంద్రికా! అనుచున్=పూర్వోక్తప్రకారమువచించుచు; జగమెల్లన్=లోకమంతయు; ఉల్లాసము = సంతోషము; అతిశయిల్లన్ = హెచ్చఁగా; సంతతము=ఎల్లపుడు; మెచ్చన్=శ్లాఘించునటులు; మనుచుండుమమ్మ=వర్తింపుమమ్మ. క్షమకున్=శాలీనతకు; జన్మపదము=పుట్టుకపట్టు; అనన్=అనునట్లు; తనరుచునంభోజపాణిజీవనమ్మ.—తనరుచు = ఒప్పుచున్న, అంభోజపాణి=స్త్రీయొక్క, జీవనమ్మ=బ్రతుకే; జీవనమని=బ్రతుకని; ఎంచుమమ్మ=తలంపుమమ్మ. ఇచట, క్షమకున్=భూమికి, జన్మపదమనన్=జన్మస్థానమనునటులు, తనరుచునంభోజపాణిజీవనమ్మ.—తనరుచున్న, అంభోజ=కమలములుగల, పాణి=ముత్తైపునీరువంటి, జీవనమ్మ=జలమె, జీవనమని=జలమని, ఎంచుమమ్మ యనునర్థము దోఁచుచున్నది. ఈకవి "అద్భ్యః పృథివీ" యన్న శ్రుతి ననుసరించె నని యూహింపఁగునది.

క. అట్టియెడ నశ్రు లక్షులఁ, దొట్టఁగ నవనమితవదన♦తోయజ యగునా
పట్టిఁ దనయంకపాళిం, బట్టి నయం బొప్ప జనని ♦ పలికె న్గరుణన్. 100

టీ. అట్టియెడన్=ఆసమయమందు; అక్షులన్=కనులందు; అశ్రులు=కన్నీళ్లు; తొట్టఁగన్=స్రవింపఁగ; అవనమితవదనతోయజయగునాపట్టిన్.—అవనమిత = వంపఁబడిన, వదనతోయజయగు = ముఖకమలముగలదగు, ఆపట్టిన్=ఆబిడ్డను; తనయంకపాళిన్ = తనతొడమీఁద; పట్టి=ఇడుకొని; నయంబు=నీతి; ఒప్పన్=తగునటులు; జనని=తల్లి; కరుణన్ = దయతో; పలికెన్=వక్ష్యమాణప్రకారముగఁబలికెను.

మ. అలశైలేంద్రతనూజ యంతసతి న♦ర్ధాంగీకృతం జేసె శీ
తలరోచిర్మకుటుండు గానఁ జెలులం ♦ దత్తత్తదాత్వోచితో
జ్జ్వలకృత్యంబుల మెచ్చి మెచ్చరు ధరా♦చక్రంబునన్ భర్తలై
న లతాంగీమణి పూతధర్మసరణి ♦ న్వర్తింప మే లెంతయున్. 101

టీ. శీతలరోచిర్మకుటుండు=చంద్రమౌళియగుశంకరుండు; అలశైలేంద్రతనూజయంతసతిన్=ఆపార్వతీదేవియంతకాంతను, పార్వతీదేవియంతపతివ్రతననితోఁచుచున్నది; అర్ధాంగీకృతన్=సగమగునట్టులంగీకరింపఁబడినదానినిగాను, అర్ధాంగిగాఁజేయఁబడినదానినిగా ననితోఁచుచున్నది; కానన్=ఆహేతువుచేత; చెలులన్ = భార్యలను; తత్తత్తదాత్వోచితోజ్జ్వలకృత్యంబులన్.—తత్తత్=ఆయా, తదాత్వ = తత్కాలమందు, "తత్కాలస్తుతదాత్వంస్యా" త్తనియమరుఁడు, ఉచిత=యోగ్యమగు, ఉజ్జ్వల=ప్రకాశించు, కృత్యంబులన్=పనులయందు; భర్తలు=పతులు; ధరాచక్రంబునన్=పుడమియందు; మెచ్చిమెచ్చరు=శ్లాఘించిశ్లాఘింపరు. ఐనన్=అటులైనను; లతాంగీమణి=స్త్రీరత్నమగుచంద్రికా! పూతధర్మసరణిన్=పవిత్రమగుకులధర్మమార్గమున; వర్తింపన్=వర్తించుట; ఎంతయున్=మిక్కిలి; మేలు=శుభము.

అనఁగ నోచంద్రికా! యీశ్వరుండును పతివ్రతాశిరోమణి యగుపార్వతీదేవియంతదానిని అర్ధాంగీకృతను జేసె, లోకమందు తఱచుగ పతులైనవారు తమకాంతలను ఆయాపనులయందు ఆయాసమయములశ్లాఘింపరు, అయినను కులకాంతలు ధర్మమార్గమందుఁ జరించుట మేలని భావము.

ఉ. కైరవకోటికూటములు ♦ గా వని చక్ర మవక్రకౌతుకో
దారత మీఱ సద్వరవి♦తానము లెల్ల మహోమహంబులన్
భూరివికాసవైఖరులఁ ♦ బూనఁగఁ జేయుచు లోకచిత్రగం
భీరచరిత్రవై జగతిఁ ♦ బెంపు వహింపఁ గదమ్మ చంద్రికా. 102

టీ. చంద్రికా—సంబుద్ధి, జ్యోత్స్నయనితోఁచుచున్నది; కైరవకూటికోటములు.—కైరవ=పిశునులయొక్క, కోటీకూటములు=అనేకబృందములు "కైరవంకుముదేపిస్యాత్కుటి

లేతు పుమా నయన్'' అనియుత్పలము, కలువలయొక్క కోటికూటములనియర్థాంతరముదోఁచు చున్నది; కావని=సరిగావని, అనఁగ నిరసించియనుట; ప్రసిద్ధచంద్రిక కైరవకోటులఁగా పొడునట్టిస్వభావముగల దనియు, నీచంద్రిక తద్వ్యతిరేకముగ కైరవకోటులఁదిరస్కరించునది యనియుం భావము. చక్రము=జక్కవ; అవక్రకౌతుకోదారతన్.—అవక్ర = అకుటిలమగు, కౌతుక=కుతుకముయొక్క, ఉదారతన్ = ఔదార్యముచేత; మీఱన్ = అతిశయింపఁగ; అనఁగ ప్రసిద్ధచంద్రిక చక్రములకుకౌతుకమును బోఁగొట్టునదియనియు నీచంద్రికచక్రముసంతసించునటులు చేయునదియనియువ్యతిరేకము, చక్ర మనఁగ రాష్ట్రము సంతోషించునటులు వర్తించున దని నిసర్గతాత్పర్యము. సద్వరవితానములు.—సత్=రిక్కలయొక్క, వర=శ్రేష్ఠములగు, వితానములు=సమూహములు; ఎల్లన్=అన్నియు; మహామహంబులన్ = అధికకాంతులచేత; భూరివికాసవైఖరులన్.—భూరి=అధికమగు, వికాస=వికసనముయొక్క, ప్రకాశముయొక్కయనుట, వైఖరులన్=రీతులను; పూనఁగన్ = పొందునటులు; చేయుచున్= ఒనరించుచు; సద్వరవితానములు=సత్పురుషసంఘములు; మహామహంబులన్ = అధికోత్సవములచేత; భూరి=అధికమగు, వికాస=సంతసముయొక్క, వైఖరులఁబూనునటులు చేయునది యని స్వభావార్థము; ప్రసిద్ధచంద్రిక సద్వరవితానమునకు వికాసము నడఁగఁ జేయు ననియు నీచంద్రిక యాసద్వరవితానమునకు వికాసమును జేయు ననియు వ్యతిరేకము; లోకచిత్రగంభీరచరిత్రవై.—లోక=భువనములయందు, చిత్ర = ఆశ్చర్యకరమగు, గంభీర=గభీరమగు, చరిత్రవై=చరిత్రగలదానవై; జగతిన్=భూమియందు; సెంపున్=వృద్ధిని; వహింపఁగదమ్మ= వహింపుమా.

అనఁగ నోచంద్రికా! నీవు ప్రసిద్ధచంద్రికవలెఁ గాక కైరవపుంజముల నిరసించునవియు చక్రమును సంతసింపఁజేయునవియును సద్వితానములఁ బ్రకాశింపఁజేయునవియునగు విచిత్రగుణములు గలదానవై పుడమి వృద్ధిఁ బొందు మని భావము.

క. ఘనవేణి నిన్ను నీశుఁడు, దనమూర్తిగఁ దలఁచి మిగుల ♦ దయచేసినచో
 వినయంబ పూని విశ్వభు, వనపూజ్యత మెలఁగవమ్మ ♦ వసుమతిలోనన్. 103

టీ. ఘనవేణి=మబ్బువంటిజడగలచంద్రికా! నిన్నున్=నిన్ను; ఈశుఁడు=నీభర్త; తనమూర్తిగన్=తనశరీరముగ; తలఁచి=ఎంచి; మిగులన్ = అధికముగ; దయచేసినచోన్= అనుగ్రహించినయెడ; వినయంబ=భక్తినే; పూని=గ్రహించి; వసుమతిలోనన్=భూమియందు; విశ్వభువనపూజ్యతన్.—విశ్వ=సమస్తమైన, భువన=లోకములయందు, పూజ్యతన్=పూజ్యత్వముచేత; మెలఁగవమ్మ=వర్తింపుమా. ఇచట, ఘనవేణి=జాహ్నవి! నిన్నున్; ఈశుఁడు=శంకరుఁడు; తనమూర్తిగన్ = అష్టమూర్తులలోనొకదానినిగా; తలఁచి; దయచేసినచోన్; వినయంబ=నమ్రీభావమునే; పూని; విశ్వభువనపూజ్యతన్.—విశ్వ = సమస్తమగు, భువన = ఉదకములచేత, పూజ్యతన్ = మాన్యతచే; మెలఁగవమ్మ యనునర్థాంతరము దోఁచుచున్నది.

అనఁగ నీభర్త మిగులఁ బ్రీతితో నిన్నుఁ దనమూర్తిగఁ దలఁచినను నీవు మిగుల వినయము సేవూని యెల్లజగములలో పూజ్యతను వహింపు మని భావము.

సీ. కవగూడి సత్పతిఁ ♦ గువలయంబు చెలంగ
నలరుశ్యామయె శ్యామ ♦ యవని నెంచఁ
బురుషరత్నముఁ జెంది ♦ సురభివృత్తి సుమనో
గుణ మూనుకొమ్మయే ♦ కొమ్మ తలఁప
సర్వమంగళ యధీ♦శ్వరునకు సామేన
యనఁ దగు సతి సతి ♦ యగు నుతింప
నినపాదసేవనం♦బున ఘనామోదంబు
నెనయుపద్మినియె ప♦ద్మిని నుతింప

తే. సుచిరముగ సుమనోవృత్తి ♦ సొబగుఁ బూని
కలదినంబులు ప్రియుమదిఁ ♦ గలసి మెలసి
నడచుకామిని కామిని ♦ నళినయన
తెలిసి నీవింకఁ బతిచెంత ♦ మెలఁగు మమ్మ. 104

టీ. సత్పతిన్.—సత్=సత్పురుషుఁడగు, పతిన్ = భర్తను ; కవఁగూడి=జతఁగూడి ; కువలయంబు=భూవలయము; చెలంగన్=ఒప్పునటులు ; అవనిన్=పుడమియందు; ఎంచన్=విచారింపఁగా ; అలరుశ్యామయె.—అలరు=ఒప్పుచున్న; శ్యామయె = కాంతయె ; శ్యామ=ఉత్తమస్త్రీ. ఇచట, సత్పతిన్=చంద్రుని; కవగూడి;కువలయంబు చెలంగన్=కలువవికసించునటులు ; అలరుశ్యామయె=ఒప్పుచున్న రాత్రియె; శ్యామ=రాత్రియనునర్థాంతరము దోఁచుచున్నది.అనఁగ నెట్లు చంద్రసహితమై కలువను వికసింపఁజేయు రాత్రి రాత్రి యనఁబడునో యట్లు పతిఁగూడి జగము మెచ్చఁజెలంగు కాంతయే కాంత యనఁబడునని భావము. పురుషరత్నమున్=పురుషశ్రేష్ఠుని; చెంది=పొంది; సురభివృత్తిన్=పరిమళించువ్యాపారముచేత, శ్లాఘ్యసౌశీల్యాదివృత్తి చేతననుట; సుమనోగుణము.—సు=శ్రేష్ఠమగు, మనః=హృదయమందు, గుణము=గుణమును;ఊనుకొమ్మయె=పొందునట్టి కాంతయె;తలఁపన్=విచారింపఁగ; కొమ్మ=కాంత; ఇచట, పురుషరత్నము=పున్నాగవృక్షమును ; చెంది=కూడి; సురభివృత్తిన్=వసంతప్రవర్తనచేత; సుమనోగుణము = పుష్పములనుగుణమును ; ఊను = పొందునట్టి; కొమ్మయె=శాఖయె; తలఁపన్=విచారింపఁగ ; కొమ్మ=శాఖ. అనఁగ నామనియందుఁబుష్పించి పున్నాగమును జేరినకొమ్మయె కొమ్మ యనునట్లు పురుషశ్రేష్ఠుని గూడి సౌశీల్యాదిగుణములుగల కాంతయె కాంత యనఁబడు నని భావము. సర్వమంగళ=సమస్తశుభములుగలదై; అధీశ్వరునకున్=తన పతికి ; సామేనయనన్ = అర్థశరీరమే యనునటులు ; తగుసతియె = ఒప్పుచున్న కాంతయె; నుతింపన్ = వర్ణింపఁగ; సతి = కాంత; అగున్ = అగును. ఇచట, సర్వమంగళ = సర్వ

మరిగళయనునామాంతరముగలదై; అధీశ్వరునకున్ = శంకరునకు; సామేన = అర్ధశరీరమే అనన్=అనునటులు; తగుసతి = ఒప్పుచున్న పార్వతియు; సతియగున్ = పతివ్రతయగు నన నర్థము దోఁచుచున్నది. అనఁగ నీశ్వరున కర్ధాంగియై చెలఁగుపార్వతీదేవిపగిది తనపెనిమిటికి నర్ధాంగివలె నొప్పుచున్న వనితయు వనిత యనం బడు నని భావము. ఇనపాదసేవనంబునన్.—ఇన=పెనిమిటియొక్క; పాదసేవనంబునన్=చరణసేవచేత; ఘనామోదంబు.—ఘన=అధికమగు, ఆమోదంబున్ = కుతూహలమును; ఎనయుపద్మినియు = చెందుచున్నపద్మినీజాతికాంతయు; నుతింపన్ = వర్ణింపఁగ; పద్మిని = పద్మినీజాతికాంత. ఇచట, ఇనపాదసేవనంబునన్ = సూర్యకిరణస్పర్శచేత; ఘనమగు; ఆమోదంబున్ = పరిమళమును ఎనయు పద్మినియు=పొందుపద్మలతయు; పద్మిని = పద్మలతయనునర్థాంతరము దోఁచుచున్న అనఁగ సూర్యకిరణ స్పర్శముచే తామరతీవ ఘనామోదంబు చెందురీతిఁ దనపతిచరసేవచే మిక్కిలి సంతసించు కాంతయు కాంత యనఁ బరఁగు నని భావము. సుచిరముగన్=ఎల్లకాలము; సుమనోవృత్తిన్.—సు=సమీచీనమగు, మనోవృత్తిన్=మనోవ్యాపారముచేత; సొబగున్=అందమును; పూని=గ్రహించి; కలదినంబులు=కలకాలము; ప్రియుమదిన్=పతిమనమును; కలసి మెలసి=కలసివర్తించి; నడుచుకామిని=నడుచుచున్నకాంతయు; కామిని=కాంత. నళిననయన=చంద్రికా! నీవు; తెలిసి=గుర్తెఱిఁగి; ఇంకన్=ఈమీఁద; పతిచెంతన్=పెనిమిటియొద్ద; మెలఁగు మమ్మ=వర్తింపుమమ్మ.

మ. అని వా రంబుజనేత్ర నంప నటఁ ద◆త్ప్రాణేశ్వరీయుక్తుఁడై
జననాథేంద్రుఁడు కాంచనాంచితమణీ◆జాజ్వల్యమానప్రభా
జనితక్ష్మాచరదైనబింబధిషణా◆సంస్థాన మాస్యందనం
బున నాత్మీయపురీలలామకము నా◆మోదంబుమైఁ జేరఁగన్. 105

టీ. అని=పూర్వోక్తప్రకారముగఁ జంద్రికకు నీతిఁ గఱపి; వారు=తలిదండ్రులు; అంబుజనేత్రన్=చంద్రికను; అంపన్=పంపఁగా; అటన్=ఆమీఁద; తత్ప్రాణేశ్వరీయుక్తుఁడై=ఆప్రాణేశ్వరియగు చంద్రికతోఁగూడినవాఁడై; జననాథేంద్రుఁడు = సుచంద్రుఁడు; కాంచనాంచిత మణీజాజ్వల్యమాన ప్రభాజనితక్ష్మాచరదైన బింబధిషణా సంస్థానము.—కాంచన=సువర్ణము చేత, అంచిత=ఒప్పుచున్న, మణీ=మణులయొక్క, జాజ్వల్యమాన=మిక్కిలి వెలుంగుచున్న, ప్రభా=కాంతి చేత, జనిత=పుట్టింపఁబడిన, క్ష్మాచరత్=భూమియందుచరించుచున్న, ఇనబింబ=సూర్యబింబముయొక్క, ధిషణా=బుద్ధికి, సంస్థానము=నెలవైనది; ఔ స్యందనంబునన్=అగునట్టి రథముచేత; ఆత్మీయపురీల లామకమున్ = తనరాజధానీశ్రేష్ఠమును; ఆమోదంబుమైన్=సంతసముచేత; చేరఁగన్=ప్రవేశింపఁగా. పైపద్యముతో నన్వయము.

అనఁగఁ జంద్రికకుఁ దలిదండ్రులు నీతి బోధించి పంపఁగ సుచంద్రుఁడు మణికాంతులచేఁ బుడమిఁ జరించుఇనబింబ మనుమతి నొసఁగురథంబునఁ జంద్రికఁ గూడి నిజపురంబుఁ బ్రవేశింపఁగ నని భావము.

సీ. వరవర్ణసంపత్తి • నిరుపమశ్రీఁ బూను
సాంగనానాకళా•చక్ర మనఁగ
వసుకలాపవిభూతిఁ • బస మీఱుశ్రీవధూ
రమణీయతరతనూ•రాజి యనఁగ
స్ఫుటతరతారకా•పటిమఁ గౌతుక మూన్పు
బహుకీర్తినవవప్ర•పాళి యనఁగ
ఘనజఘనోదార•గరిమ నింపులు నింపు
వివిధభూమ్యవతార•వితతి యనఁగ

తే. పౌరవరవర్ణినీకోటి • బారు దీరె
ధర్మమయహర్మ్యవీథులఁ • బార్థివేంద్రుఁ
డసమసుమపేశలాలాభ•హర్షభార
వారకర్ణేజపానుభా•వముల రాఁగ. 106

టీ. వరవర్ణసంపత్తిన్.—వర=శ్రేష్ఠమగు, వర్ణ=కాంతియొక్క, వర= శ్రేష్ఠములగు, వర్ణ=అక్షరములయొక్క, సంపత్తిన్=సంపదచేత; నిరుపమశ్రీన్.—నిరుపమ=సాటిలేని, శ్రీన్=కాంతిని, శ్రీకారమును; పూను సాంగనానాకళాచక్రమనఁగన్.— పూను = వహించినట్టి, సాంగ=అంగసహితమగు, నానాకళా=అనేకవిద్యలయొక్క, చక్రమనఁగన్=సమూహమను నట్లు; అనఁగ శ్లాఘ్యమగు వర్ణసంపత్తిగల పురాంగనాబృందము వర్ణసంపత్తితోఁ జేరియున్న కళాబృంద మనునటులు బారు దీరె నని భావము. ఇచట కళాచక్రమునకు కాంతాబృంద మునకును కేవల శబ్దసాధర్మ్య మున్న దని తెలియవలెను. వసుకలాపవిభూతిన్.—వసుకలాప=రత్నభూషణములయొక్క, ధననిచయముయొక్క, విభూతిన్=ఐశ్వర్యముచేత; పస = మీఱు శ్రీవధూరమణీయతరతనూరాజియనఁగన్.—పసమీఱు=సమృద్ధిచే నతిశయించుచు న్న, శ్రీవధూ=లక్ష్మీదేవియొక్క, రమణీయతర=మిగులమనోజ్ఞమగు, తనూరాజియనఁగన్= శరీర శ్రేణియో యనునట్లు; అనఁగ వసుకలాపవిభూతిచేత లక్ష్మీదేవి వహించినపెక్కు శరీరములా యనునట్లు బారు దీరి రని భావము. స్ఫుటతరతారకాపటిమన్.—స్ఫుటతర తారకా=స్త్రీలయొక్క, పటిమన్ = సామర్థ్యముచేత; స్త్రీలరూపముచేతననుట; కౌతుక ము=సంతసమును; ఊన్పు బహుకీర్తినవవప్రపాళియనఁగన్.—ఊన్పు=చేయుచున్న, బహుకీర్తి= అధికమగుకీర్తియొక్క, నవ=నూతనమగు, వప్ర=కోటలయొక్క, పాళియనఁగన్= బంతియ నునట్లు; అనఁగ స్ఫుటతర తారకారూపముచే నొప్పు కీర్తులయొక్క కోట లనునట్లు పౌర కాంతలు బారు దీరి రని భావము. ఘనజఘనోదారగరిమన్.—ఘన జఘనా = అధికమగు కటిపురోభాగముగల స్త్రీలయొక్క, ఉదార=ఉత్కృష్టమగు, గరిమన్ = గొప్పతనముచేత, విపుల జఘనముగల స్త్రీల రూపముచేతననుట; ఇంపులు = ఆనందములను; నింపువివిధ

భూమ్యవతార వితతియనఁగన్.—నింపు = పూరించుచున్న, వివిధ = నానావిధములగు, భూమి=పుడమియొక్క, అవతార = రూపాంతరములయొక్క, వితతియనఁగన్ = సమూహమనునట్లు, అనఁగ పుడమి యెత్తిన యనేకస్త్రీరూపములయొక్క సమూహమనునట్లు పురకాంతలు బారు దీరి రని భావము. పార్థివేంద్రుఁడు = సుచంద్రుఁడు; అసమసుమపేశలాలాభహర్షభార వారకర్ణేజపానుభావములన్.—అసమ=సాటిలేని, సుమపేశలా=చంద్రికయొక్క, లాభ=ప్రాప్తివలననైన, హర్ష=సంతసముయొక్క, భార=అతిశయముయొక్క, వార=సమూహమునకు, కర్ణేజప=సూచకములగు, "కర్ణేజప స్సూచక స్స్యాత్ పిశునో దుర్జనః ఖలః" అని యమరుఁడు, అనుభావములన్=కటాక్షాదులచేత; రాఁగన్=వచ్చుచుండఁగ; ధర్మమయహర్మ్యవీథులన్= బంగరుమేడలయొక్క ప్రదేశములయందు; పౌరవరవర్ణినీకోటి=పురకాంతలబృందము; బారుదీరెన్=వరుసదీరెను.

చ. సకలజగన్మనోహరు సు • చంద్రునిఁ జంద్రికఁ జూడ నిట్లు కౌ
తుకమునఁ జేరి పౌరనవ • తోయదవేణిక లెల్ల నుల్లస
చ్చకచకతాసమానమణి • సంకులకంకణరాజి గల్లన
న్వికసితమల్లికావితతి • నింపుచు నింపులు పెంపు మీఱఁగన్. 107

టీ. పౌరనవతోయదవేణికలెల్లన్=పురకాంతలందఱు;సకలజగన్మనోహరున్.—సకల=సమస్తమగు, జగత్=జగమునకు,మనోహరున్=మనోజ్ఞుఁడగు; సుచంద్రునిన్=సుచంద్రభూపతిని; చంద్రికన్=చంద్రికను; చూడన్=చూచుటకై; ఇట్లు = ఈప్రకారము ; కౌతుకమునన్=సంతసముచేత; చేరి=పొంది; ఉల్లసచ్చకచకతా సమానమణి సంకులకంకణరాజి.—ఉల్లసత్=ప్రకాశించుచున్న, చకచకతా=చకచకత్వముచేత; చకచకయని మెఱయుటచేత ననుట, అసమాన=తులలేని, మణి=రత్నములచేత, సంకుల=వ్యాప్తమగు, కంకణ=వలయములయొక్క, రాజి=శ్రేణి; గల్లనన్ = గల్లుమనిమ్రోయఁగ; వికసితమల్లికావితతిన్.—వికసిత=వికసించిన, మల్లికా = మల్లికాపుష్పములయొక్క, వితతిన్=సమూహమును; నింపుచున్=పూరించుచు; ఇంపులు=ఆనందములు; పెంపుమీఱఁగన్=అతిశయింపఁగ. దీని యుత్తరపద్యస్థక్రియతో నన్వయము.

అనఁగఁ బురకాంతలు సుచంద్రునిఁ జంద్రికను జూచుటకైవచ్చి బారిపై మల్లికాపుష్పములను మణికంకణములు గల్లుమని మ్రోయఁగ నించుచు నానందములు మీఱఁగ నని భావము.

సీ. చట్టుకూఁతు నొకర్తు • సర్వజ్ఞుఁ డగుమహే
శ్వరునితోఁ జార్చిన • వామరచన
ఖరపాదు రసవదం • తర మైనపద్మిని
తోన గూర్చినపవ • లైనచెయ్వు

లలకుముద్వతి మనో♦హారి యౌసత్పతి
తో ఘటించినయాప్ర♦దోషసృష్టి
చిరపూరుషుని వసు♦స్ఫురితాంగి యగులక్ష్మి
తో నెనయించున♦తుల్యసర్గ

తే. మన్నియు జగంబు మఱవ న♦య్యబ్జజన్ముఁ
డతులధీచాకచక్యంబు ♦ ననమరూప
మానుకూల్యంబు ననురూప♦యౌవనంబు
నమర నిద్దంపతులఁ జేసె ♦ ననఘశక్తి. 103

టీ. చట్టుకూఁతునోకర్తన్=వివేకశూన్యురాలైన లోకకాంతను; సర్వజ్ఞుఁడు=సర్వము దెలిసినవాఁడు; అగుమహేశ్వరునితోన్=అయినట్టిశంకరునితో; తార్చిన = కూర్చిన; వామరచన=వక్రరచన; చట్టుకూఁతున్=హిమవంతునకు కూఁతురగు పార్వతీదేవిని; మహేశ్వరునితోఁదార్చిన; వామరచన=వామభాగమందురచన యని స్వభావార్థము; ఖరపాదున్=గర్దభపాదములుగలవానిని; రసవదంతర.—రసవత్ = శృంగారరసయుక్తమగు; అంతర=హృదయముగలది; వినపద్మినితోన = అయినట్టిపద్మినీజాతికాంతతోడనే; కూర్చిన పవలైనచెయ్వులు=కూర్చినట్టి విరోధముగల పనులు; ఖరపాదున్=సూర్యుని; రసవదంతర=మకరందము గర్భమందుఁగలది;వినపద్మినితోన=అయినట్టి పద్మలతతోడనే; కూర్చిన=జతపఱచిన;పవలు=దినమందు; వినచెయ్వులు=అయినట్టిపనులు అని స్వభావార్థము, అలకుముద్వతిన్=అట్టికుత్సితమగు సంతనముగలదానిని; మనోహారి=మనోహరుఁడు; ఔసత్పతితోన్=అయినట్టి మంచినాయకునితో; ఘటించిన = కూర్చిన; అప్రదోషవృష్టి = ప్రకృష్టదోషములుగల యానిర్మాణము; అలకుముద్వతిన్=అతోవతీవను; సత్పతితోన్ = చంద్రునితోడ; ఘటించిన; ప్రదోషదృష్టి=ప్రదోషకాలమందలి సృష్టియని స్వభావార్థము; చిరపూరుషునిన్=ముదుసలివానిని; వసుస్ఫురితాంగి.—వసు=సువర్ణమువలె, స్ఫురిత=ప్రకాశించుచున్న, అంగి=శరీరముగలది; అగులక్ష్మితోన్=అయినట్టి లక్ష్మియనుపేరుగల కాంతతో, ఎనయించు=పొందించు, అతుల్యసర్గము=ఈడుగాని సృష్టి; చిరపూరుషునిన్ = పురాణపురుషుఁడగు విష్ణుమూర్తిని; వసుస్ఫురితాంగి = ధనముచేఁ బ్రకాశించుచున్న అంగముగల, అనఁగ ధనరూపిణియగుననుట, లక్ష్మితోన్=లక్ష్మీదేవితో; ఎనయించినట్టియ తుల్యసర్గమని స్వభావార్థము; జగంబు=లోకము; అన్నియు మఱవన్=పూర్వోక్త వామరచనాదుల నన్నింటిని మఱచునటులు; అయ్యబ్జజన్ముఁడు=.. అనబ్రహ్మ; అతులధీచాకచక్యంబునన్ ... అతుల=సాటిలేని, ధీచాకచక్యంబునన్=బుద్ధిచాతుర్యముచేత; సమరూపము=సాటిలేనిరూపమును; ఆనుకూల్యంబున్=అనుకూలతయు; అనురూపయౌవనంబున్=అనుగుణమగు యౌవనమును; అమరన్=పొందునటులు; ఇద్దంపతులన్ = ఈ చంద్రికాకుచంద్రులను; అనఘశక్తిన్.—అనఘ=నిర్దుష్టమగు, శక్తిన్ = సామర్థ్యముచేత; చేసెన్=సృజించెను.

అనఁగ వివేకశూన్యురా లైనదానిని సర్వజ్ఞుఁడగు శంకరునికి ఘటించిన వక్రరచన ను, ఖరపాదుని పద్మినితోఁ గూర్చిన విపరీతసృష్టిని, కుముద్వతిని నత్పతితోఁద్బారిన ప్రకో పసృష్టిని, వసుస్ఫురితాంగియగులక్ష్మిని మధుసలివానితోఁ గూర్చిన యతుల్యసర్గమును,వీని న న్నింటిని జగము మఱచునటులు ఈనలువ జాణతనముచేత నసమరూపాది గుణంబులు కలుగు నట్లు ఈచంద్రికాసుచంద్రుల సృజించె నని భావము.

చ. క్షమ నొకకిన్నరాగ్రసరు♦సఖ్యముఁ బూని మహానటుండు నా
నమరి తపస్విరాజవని♦తాళి వ్రతంబులు దూల్చినట్టి యా
కమలకరుఁ వరించుగిరి♦కన్యక నవ్వఁగఁ జాలుఁ జంద్రికా
కమలదళాక్షి సద్గుణని♦కాయపయోధి సుచంద్రుఁ జేరుటన్. 109

టీ. క్షమన్=పుడమియందు; ఒకకిన్నరాగ్ర సరుసఖ్యము=ఒకానొక కుత్సితపురుషుని నేస్తమును; పూని = గ్రహించి; కుబేరునిసఖ్యముఁ బూని యని స్వభావార్థము; మహానటుండు నాన్=దొడ్డనట్టువుండనువట్లు, మహానటుఁడని యీశ్వరునికి నామాంతరమని స్వభావార్థ ము; అమరి=ఒప్పి; తపస్విరాజవనితాళివ్రతంబులు.—తపస్విరాజ=మునిరాజులయొక్క,వనితా= కాంతలయొక్క, ఆళి=శ్రేణియొక్క, వ్రతంబులు=నియమములను, పతివ్రతాధర్మములనను ట; తూల్చినట్టి= పోఁగొట్టినట్టి;ఆకమలకరున్=లేడికరమందుఁగల యాశంకరుని; శంకరుండు దారుకావనమందు దిగంబరుఁడై తిరుగుచుండఁగ మునికాంతలు చూచిమోహించుటయు నామునులు శంకరునిశేఫము పుడమిం దెగిపడునటులు శపింప నాశేప మట్లె పడఁగా దాని సర్వలోకములు వహింపలేకయున్నంజూచి విష్ణువు యోనిరూపము ధరించిదానిం గైకొనెనని పురాణమందు ప్రసిద్ధము; వరించు గిరికన్యకన్=కోరినట్టి పార్వతీదేవిని; చంద్రికాకమలద ళాక్షి = చంద్రికయనుపేరుగల కమలలోచన; సద్గుణనికాయపయోధిన్=శ్రేష్ఠగుణపుంజము నకు రత్నాకరుండగు; సుచంద్రున్ = సుచంద్రుని; చేరుటన్= చేరుటవలన; నవ్వఁగన్= పరిహసించుటకు; చాలున్=ఓపును.

అనఁగ కిన్నరసఖ్యమునుబూని మహానటుఁడనంబరఁగి మునికాంతలకు వ్రతభంగముఁ జేసినశివుని వరించియున్న పార్వతీదేవిని, చంద్రిక గుణనిధి యగుసుచంద్రుని వరించుటచే పరిహసింపఁ జాలునని భావము.

మ. కమలావాప్తి మలీమసాంతరమున♦ నన్పట్టు మిన్నందు దు
ర్గమవృత్తిం జరియించుఁ దద్వ్యయమున♦గ్గాంచు న్విరూపంబు మే
ఘము తద్వ్యక్తిఁ బొసంగె నాకచిరరు♦ క్త్యం బంచు నామించు తాఁ
గమలాలోకనయై యుదారగుణవ♦త్కాంతాప్తిఁ బొల్చెన్ ధరన్. 110

టీ. కమలావాప్తిన్=సంపదకలుగుటచేత; మలీమసాంతరమునన్.—మలీమస=మలిన మగు, అంతరమునన్=హృదయముచేత ఉదకప్రాప్తిచేత; నల్లనియంతరముచేత నని మే

ఘపర మగునర్థము; కన్పట్టున్=కానవచ్చును. మిన్నందున్=ఉప్పొంగును, ఆకసమంటు నని మేఘపర మగు నర్థము. దుర్గమవృత్తిన్=పొందరాని నడవడిచేత, గిరిశిఖరాదులయందు వర్తనముచేత నని మేఘ పర మగు నర్థము ; చరియించున్=నడచును. తద్వ్యయమునన్.- తత్=ఆసంపదయొక్క, ఆజలముయొక్క, వ్యయమునన్=నాశముచేతను; విరూపంబు=వైవర్ణ్యమును, తెల్లఁబోవుటను. మేఘము=పుల్లింగసారస్యమువలన నొకపురుషుండని తోఁచుచున్నది; కాంచున్=పొందును ; తద్యుక్తిన్.-తత్=ఆపురుషునియొక్క, యుక్తిన్ = సంబంధముచేత; తత్=ఆమేఘముయొక్క, యుక్తిన్=సంబంధముచేత; నాకున్; అచిరరుక్త్వంబు= నిలువనికాంతిగలుగుట, తటిద్భావము; పొసంగెన్=కలిగెను. అంచున్=ఈప్రకారమనుచు; ఆమించు=ఆమెఱపు ; తాన్=తాను; ధరన్=భూమియందు; కమలాలోకనయై=చంద్రికయై, అనఁగఁ జంద్రికారూపముతోఁబుట్టియనుట; ఉదారగుణవత్కాంతాప్తిన్.-ఉదార=ఉత్కృష్టమగు, గుణవత్=మంచిగుణములుగల, కాంత=ప్రియునియొక్క, ఆప్తిన్ = ప్రాప్తిచేత; పొల్చెన్=ఒప్పెను.

అనఁగా లోకమం దొకపురుషుండు సంపద రాఁగానె విఱ్ఱవీఁగుచు నాసంపద నశింప వెలవెలఁబోవుచు దుర్గమవృత్తిచేఁ జరించునటులు ఈమేఘము జలప్రాప్తి తదభావములవలన మలీమసత్వమును తెల్లనగుటయును పొంది దుర్గమవృత్తి గలిగియుండుటచేదీనిసంబంధమువలన నాకచిరరుక్త్వంబు పొసంగెనని మెఱుపుదీఁగ భూమియందుఁ జంద్రికారూపముతో జనించి ఉత్కృష్టగుణములు గల సుచంద్రునిఁ జేరి యొప్పె నని భావము.

వ. అనునవ్వారకామినీకలాపాలాపప్రపంచంబున కుదంచితం బగుమనోంచలంబున దట్టం బగుమోదంబు రెట్టింప నొకశుభముహూర్తంబున భగవదనంగవిద్య యగునయ్యనవద్యాంగియుం దాను ననేకరంభాసంభ్రమవిజృంభితంబు, నగణ్యమఘవదలంకృతంబు, నపరిమితసుమనోవితానవిద్యోతితంబు, నసంఖ్యకవిజనవిభ్రాజితంబు, ననుపమగురుసమాజసంకులంబు, నకలంకకలానిధిధురంధరంబు, నపారశుచిధర్మపుణ్యజనరసాధీశమండితంబు, నచంచలసదాగతిధనదమహేశ్వరరాజివిరాజితంబునై, యమందవిభవజితపురందరమందిరం బగునాత్మీయనివేశనంబు ప్రవేశించి, యాసుచంద్రధరణీచంద్రుండు, పక్షపాతపరాఙ్ముఖప్రచారుండయి, మహనీయవసుకలాపంబున నభిరూపచక్రంబున కవక్రప్రమోదంబు గూర్చుచు, సద్గుణంబుల కోహీనద్యుమ్నంబు లొసంగుచుఁ, బద్మినీసముదయంబున కభ్యుదయంబుఘటించుచు, నపూర్వవితరణపాండితీధురంధరుండై కువలయంబునకుఁబోలె దుర్వారశార్వరవ్రాతంబున కామోదవర్ధనంబుఁ జేయుచు నభంగమంగళతరంగితం బగునొక్కసమయంబున. 111

టీ. అనునపార కామినీకలాపాలాపప్రపంచంబునకున్.—అను = పూర్వోక్తప్రకారముగఁబలుకుచున్న, అపార కామినీకలాప=శ్రేష్ఠలగునాపుర కాంతలయొక్క, ఆలాప=సల్లాపములయొక్క,ప్రపంచంబునకున్=అతిశయమునకు; ఉదంచితంబు=మిక్కిలియొప్పుచున్నది; అగుమనోంచలంబునన్=అగునట్టిహృదయప్రదేశమందు; దట్టంబు=సాంద్రము; అగుమోదంబు=అగునట్టిసంతసము; రెట్టింపఁగ=ఇనుమడింపఁగ;ఒకశుభముహూర్తంబునన్=ఒకమంగళముహూర్తమందు; భగవదనంగవిద్య = మహిమగలమన్మథవిద్య ; అగునయ్యానవద్యాంగియున్=అగునట్టియీచంద్రికయును; తానును=సుచంద్రుఁడును; అనేకరంభాసంభ్రమవిజృంభితంబును.—ఇది మొదలుకొని యీచంచలసదాగతియనువఱకు నీవిశేషణములచే నుపమానభూతపురందరమందిరంబున కన్న వ్యతిరేకమును జూపుచున్నాఁడు.—అనేక = పలువురగు, రంభా=స్వర్వేశ్యలవలననైన, సంభ్రమ=సంతసముచేత, విజృంభితంబును = ప్రకాశించునదియును, కదళీవృక్షములచేతఁ బ్రకాశించునదియని స్వభావార్థము; అగణ్యమఘవదలంకృతంబును.—అగణ్య=లెక్కిడరాని; మఘవత్=ఇంద్రులచేత, ఈమఘవచ్ఛబ్దముమతుబంతము, "హావి ర్గక్షతి నిశ్శంకో మఖేషు మఘవా నసౌ । తత్రైకో మఘవా నమత్ర బహావః" అని ఇట్లు మతుబంతమునకుఁ బెక్కుప్రామాణికప్రయోగంబులుగలవు; అలంకృతంబును=అలంకరింపఁబడినదియును, పెక్కండ్రగు జన్నముఁజేసినవారిచే నలంకరింపఁబడిన దని స్వభావార్థము; స్వర్గమందొకరంభయు నొకయింద్రుఁడును నిచట ననేకు లున్నారని భావము. అపరిమితసుమనోవితానవిద్యోతితంబును.—అపరిమిత=మితిలేని, సుమనోవితాన=దేవసంఘములచేత, విద్యోతితంబును=ప్రకాశించుచున్నదియును, మితిలేనిపూఁజప్పరములచేఁ బ్రకాశించుచున్నదనిస్వభావార్థము;స్వర్గమందు ముప్పదిమూఁడుకోట్లసంఖ్య గల దేవత లున్నారనియు నిచట మితి లేనిదేవతాబృంద మున్నదనియు భావము. అసంఖ్యకవిజనవిభ్రాజితంబును = అనేకులగు శుక్రులచేఁ బ్రకాశించుచున్నదియు; అసంఖ్యులగువిద్వజ్జనులచేఁ బ్రకాశించుచున్నదని స్వభావార్థము; స్వర్గమం దొకకవి యున్నాఁ డనియునిచట ననేకకవు లున్నారనియు భావము; అనుపమగురుసమాజసంకులంబును.—అనుపమ=సాటిలేని, గురు = బృహస్పతులయొక్క, సమాజ=గణముచేత, సంకులంబును = వ్యాప్తమైనదియును; గురు=పిత్రాదులగుపెద్దలయొక్కసమాజముచేత, సంకులంబైన దనిస్వభావార్థము ; అనఁగ స్వర్గమం దొక గురువున్నాఁ డనియు నిచట ననేకు లున్నారనియు భావము. అకలంకకలానిధిధురంధరంబును.—అకలంక=కలంకరహితులగు, కలానిధి = చంద్రులయొక్క, ధురంధరంబును=భారమునువహించినదియును ; అనఁగ స్వర్గమందొకఁ డయ్యును సకలంకుఁ డగుకలానిధి యున్నాఁ డనియు నిచట నిష్కలంకులైన కలానిధులు గలరనియుభావము; అకలంక=పాపరహితులగు, కలానిధి = విద్యలకుస్థానభూతులగుపండితులయొక్క, భారమునువహించినదని స్వభావార్థము ; అపారశుచిధర్మపుణ్యజనరసాధీశమండితంబును.—అపార = అంతములేని, శుచి=అగ్నులచేతను, ధర్మ=యమధర్మరాజులచేతను, పుణ్యజన=నిర్‌ఋతులచేతను, రసాధీశ=వరుణులచేతను, మండితంబును = అలంకరింపఁబడినదియును ; అపార = అధికమగు, శుచి= పరిశుద్ధమగు, ధర్మ=న్యాయముచేత, పుణ్య = మనోజ్ఞులగు, జన=నరులచేతను, రసాధీశ=రాజులచేతను, మండితంబనిస్వభావార్థము; స్వర్గమం దగ్ని మొదలగువా రొకరొకరే యున్నా

రనియు నిచట ననేకులు గలరనిభావము. అచంచలసదాగతిధనదమహేశ్వరరాజివిరాజితంబునై.—అచంచల=స్థిరుఁడగు, సదాగతి=వాయువులయొక్క, ధనద=కుబేరులయొక్క, మహేశ్వర = శంకరులయొక్క, రాజి = శ్రేణిచేత, విరాజితంబునై=ప్రకాశించునదియునై ; అచంచల=చలింపని, సత్=శ్రేష్ఠమగు, ఆగతి=ఆదాయముగల, ధనదమహేశ్వర=వదాన్యశ్రేష్ఠులయొక్క, రాజి = శ్రేణిచేత, విరాజితం బని స్వభావార్థము ; స్వర్గమందు కుబేరాదు లొక్కరొక్కరె యున్నారనియు నిచటఁ బెక్కండ్రున్నా రనియు భావము. అమందవిభవజితపురందరమందిరంబు.—అమంద=అధికమగు, విభవ=సంపదచేత, జిత=జయింపఁబడిన, పురందరమందిరంబు=స్వర్గముగలది ; అగుసాత్మీయనివేశనంబు=అగునట్టిస్వగృహమును ; ప్రవేశించి=చొచ్చి ; అనుచంద్రధరణీచంద్రుండు = అనుచంద్రమహారాజు ; కవి ప్రసిద్ధచంద్రునికన్న యీయనుచంద్రునియందు గుణోత్కృష్టతను చెప్పుచున్నాఁడు.—పక్షపాతపరాఙ్ముఖప్రచారుండయి=సుచంద్రుఁడు నిష్పక్షపాతప్రచారము గలవాఁ డనియు, ప్రసిద్ధచంద్రుఁడు శుక్లపక్షమందుఁ బక్షపాతము గలవాఁ డని యర్థము, పక్ష=కృష్ణపక్షమందు, పాత = పడుటచేత, పరాఙ్ముఖ = అభిముఖముగాని, ప్రచారముగలవాఁడనిస్వభావార్థము, చంద్రుఁడు కృష్ణపక్షమందు క్షీణించుటచేఁ బరాఙ్ముఖుఁ డని తాత్పర్యము ; మహనీయవసుకలాపంబునన్.—మహనీయ=ఉత్కృష్టమగు, వసు = కిరణములయొక్క, కలాపంబునన్ = సమూహముచేత ; అభిరూపచక్రంబునకున్.—అభిరూప=మనోజ్ఞమగు, చక్రంబునకున్=చక్రవాకమునకు; అవక్రప్రమోదంబున్.—అవక్ర=అకుటిలమగు, ప్రమోదంబున్=సంతసమును;కూర్చుచున్=చేయుచు; మహనీయవసుకలాపంబునన్=మహనీయమగుధనపుంజముచేత;అభిరూపచక్రంబునకున్=విద్వద్బృందమునకు; అవక్రప్రమోదమునుగూర్చువాఁ డని స్వభావార్థము; ప్రసిద్ధచంద్రుఁడు వసుకలాపముచేత అభిరూపచక్రమునకు కీడొనరించువాఁడనియు నీరాజు వానికి సంతసమును జేయువాఁ డనియుభావము; సద్గణంబులకున్=రిక్కలగుంపునకు, అహీనద్యుమ్నంబులు=ఉత్కృష్టమగుకాంతులను; ఒసంగుచున్=ఇచ్చుచు; సద్గణంబులకున్=సత్పురుషసంఘమునకు; అహీనమగు,ద్యుమ్నంబులు=ధనములను;"ద్యుమ్నమర్థౌ రై విభవా అపి" అనిఅమరుఁడు;ఒసంగుచునని స్వభావార్థము; ప్రసిద్ధచంద్రుఁడు సద్గణంబులకు కాంతిని పోఁగొట్టువాఁ డనియు నీరాజు అహీనమగుద్యుమ్నంబు నిచ్చువాఁడనియు తాత్పర్యము.పద్మినీసముదయంబునకున్=తామరతీవగుంపునకు; అభ్యుదయంబున్ = అధికమగువృద్ధిని; ఘటించుచున్ = చేయుచు ; పద్మినీసముదయంబునకున్=పద్మినీజాతిస్త్రీసంఘమునకు ; అభ్యుదయమును జేయువాఁ డని స్వభావార్థము ; ప్రసిద్ధచంద్రుఁడు పద్మినీసముదయమునకు, నభ్యుదయమును జేయనివాఁ డనియు నీరాజు చేయువాఁ డనియు భావము; అపూర్వవితరణపాండితీధురంధరుండై.—అపూర్వ=మున్నెన్నఁడును లేని, వితరణ = త్యాగముయొక్క, పాండితీ = పాండిత్యముయొక్క, ధురంధరుండై= భారమువహించినవాఁడై; కువలయంబునకున్ పోలెన్=కలువకువలెనె; దుర్వారశార్వరవ్రాతంబునకున్.—దుర్వార=నివారించుటకశక్యమగు, శార్వర=చీఁకటులయొక్క, వ్రాతంబునకున్=సమూహమునకు ; కువలయంబునకుఁబోలెన్= భూవలయంబునకునువలెనె ; దుర్వార=నివారించుటకశక్యమగు, శార్వర=దుష్టులయొక్క, వ్రాతంబునకున్ = సమూహమునకు ; ఆమోదవర్ధనంబుఁజేయుచున్.—ఆమోద = పరిమళమునకు, సంతసమునకు, వర్ధనంబు=

అభివృద్ధిని, ఛేదమును ; చేయుచుకా=ఒనర్చుచు ; అనఁగా ప్రసిద్ధచంద్రుఁడు కువలయంబునకు నెటు లామోదవర్ధనముఁ జేయునో ఆరీతి నీసుచంద్రుఁడును కువలయ మనఁగ భూవలయమునకు నామోదవర్ధన మనఁగా సంతోషాభివృద్ధిని జేయుననియు, ప్రసిద్ధచంద్రుఁడు శార్వరవ్రాతంబునకు, అనఁగా, చీఁకటులగుంపునకు, ఆమోదవర్ధనమును, అనఁగా, సంతోషచ్ఛేదమును జేయునట్లు సుచంద్రుఁడు శార్వరవ్రాతంబునకు అనఁగా దుర్మార్గులసమూహమునకు, ఆమోదవర్ధనంబును అనఁగా సంతోషవిచ్ఛేదమును జేయుచున్నాఁ డని భావము. అభంగమంగళతరంగితంబు=అప్రతిహతమయిన శుభపరంపరతోఁ గూడినది; అగు నొక్కసమయంబునకా=అయినట్టి యొకకాలమందు. పైపద్యముతో నన్వయము.

సీ. తెలుగంటిరారాలఁ • దీర్చినకంబాల
జతఁ గూడి యున్నవ•జ్రంపుబోది
యల నంటఁ దార్చినఁ • దలుకు లీనెడుజాతి
గుజరాతికెంపురా•కులుకుతమ్మి
మొగడలలోయంత్ర•ముల జాఱుపన్నీటి
పలుచనితుంపురుల్ • పడఁగ మీఱు
జాళువాబొమ్మల•కేల నుండెడువట్టి
వేరులనురటీల•వీజనంబు

తే. విరళవిరళంబులై దెస • ల్పరిమళింపఁ
జేయ గారుత్మతగవాక్ష•సీమసంఘ
టితభరణినాఁ గ శుద్ధాప•వితతిచేత
గమ్మనువిహారగేహప్ర•ఘాణమందు. 122

టీ. తెలుగంటిరారాలకా=ఇంద్రనీలమణులచేత; తీర్చినకంబాలజతకా=చేసినకంబములజంటయందు; కూడియున్న వజ్రంపుబోదియలకా=చేరియున్నట్టి రవలబోదెలయందు; అంటకా=తగులునటులు;తార్చినకా=కదియింపఁగాననుట;తలుకులు=మిక్కిలిప్రకాశములను;ఈనెడుజాతి గుజరాతి కెంపురాకులుకు తమ్మి మొగడలలో యంత్రములకా.—ఈనెడు=ప్రసవించుచున్న, జాతి=ఉత్తమజాతిగల, గుజరాతికెంపురా = గుజరాతిదేశమందుఁబుట్టిన కెంపులయొక్క, గుజరాతిదేశమందుత్తమజాతికెంపులుపుట్టుట ప్రసిద్ధము, "గుజరాతికెంపులు గోమేధికంబులు" అని ప్రాచీనకవులును ప్రయోగించియున్నారు, కులుకు=సుందరమగు, తమ్మిమొగడల=తామరమొగ్గలయొక్క, లోయంత్రములకా=లోపలనుండు యంత్రమువలనమండి ; జాఱుపన్నీటి పలుచనితుంపురుల్.—జాఱు=స్రవించుచున్న, పన్నీటి=పన్నీరుయొక్క, పలుచనితుంపురుల్=సూక్ష్మశీకరములు; పడఁగకా=పడుచుండఁగ;మీఱుజాళువా బొమ్మలకేలకా.—మీఱు=అతిశయించుచున్న, జాళువాబొమ్మల = బంగరుబొమ్మలయొక్క, కేలకా = కరములందు ; ఉండెడు వట్టివేరుల నురటీల వీజనమునకా.—ఉండెడు=ఉన్నట్టి,వట్టివేరుల=వట్టివేళ్ళయొక్క,

సురటీల = విసనకఱ్ఱలయొక్క, వీజనంబు = విసరుట ; విరళవిరళంబులై = పలుచనైనవై; దెసల్=దిక్కులు; పరిమళింపన్ = పరిమళించునటులు; చేయన్=చేయఁగా; గారుత్మతగవాక్షసీమసంఘటిత భరణినాఁగన్.—గారుత్మత=మరకతమణులయొక్క, "గారుత్మతం మరకతమశ్మగర్భోహరిన్మణిః" అని అమరుఁడు, గవాక్షసీమ=వాతాయనప్రదేశములతో, సంఘటిత=కూడుకొన్న, భరణినాన్ =కరండమో యనునట్లు; గళద్ధూపవితతిచేతన్.—గళత్=జాఱుచున్న, ధూప=ధూపముయొక్క, ధూపమనఁగ కేశసంస్కారమునకై పరిమళించునటులు వేయు నగరుమొదలగుదానిపొగ, వితతిచేతన్=సమూహముచేత ; గమ్మను విహారగేహప్రఘాణమందున్.—గమ్మను=పరిమళించుచున్న, విహారగేహ = క్రీడాగృహముయొక్క, ప్రఘాణమందున్=అళిందమునందు. పైపద్యముతో నన్వయము.

అనఁగా నింద్రనీలమణులతోఁ జేసి యున్న స్తంభములమీఁద నున్న రవలబోదెలయందుఁ గదియించిన కెంపు తామరమొగ్గల కుక్షియం దమర్చిన పన్నీటియంత్రముల నుండి జాఱుచున్న పన్నీటితుంపురులు మీఁదఁ బడుచుండ నచట నిలిపి యున్న బంగరుబొమ్మల కరములం దున్నవట్టివేరులసురటీలు విసరుట దిక్కులఁ బరిమళింపఁజేయు ధూపవితతిచేనొప్పినదై మరకతమణిమయ గవాక్షులు గల బరణియో యనునటు లుండు క్రీడాగృహప్రఘాణమునం దని భావము. ఇచట క్రీడాగృహాళిందమును కరండముగా నుత్ప్రేక్షించుటచే నుత్ప్రేక్షాలంకారము.

సీ. రతిరహస్యాధిదే♦వత తదాశ్రయ మంది
    శృంగారకళ బయల్♦చేసె ననఁగ
మరురాజ్యరమ నిన్న♦ మరగి డాసితి నంచు
    మచ్చికమైఁ గరం♦బిచ్చె ననఁగ
మధులక్ష్మి ప్రాచీన♦మంతువు మఱపింప
    వెసఁ బరిచర్య గా♦వించె ననఁగ
రతి భర్త కభయంబు♦ మతిఁ గోరి తద్దేమ
    నిశితశస్త్రి నెదుట♦ నిలిపె ననఁగ

తే. లీల నలువంక వేర్వేఱఁ♦ గీలుబొమ్మ
    లగరుధూపంబు లిడ తెల♦నాకుమడుపు
    నొసఁగఁ బువ్వుల సురటిచే♦ విసర రత్న
    దీపిక గ్రహింప నెమ్మది♦ ధృతి రహింప. 113

టీ. రతిరహస్యాధిదేవత.—రతిరహస్య=సురతరహస్యముయొక్క, అధిదేవత= అధిష్ఠానదేవత; తదాశ్రయము.—తత్=ఆచంద్రునియొక్క, ఆశ్రయము = గృహమును; అంది=పొంది; శృంగారకళన్.—శృంగార=శృంగారరసముయొక్క, కళన్=కాంతిని; బయల్ చే

సెనవ్వఁగన్ = ప్రకటింపఁజేసెనో యనునటులు; మరురాజ్యరమ=మన్మథ రాజ్యలక్ష్మి; నిన్న=నిన్నే; మరగి=ఆశపడి; డాసితిన్=సమీపించితిని. అంచున్=అనుచు; మచ్చికమైన్=మోహము చేత; కరంబు=హస్తమును; ఇచ్చెననఁగన్=ఒసంగెనో యనునట్లు; మధులక్ష్మి=వసంతలక్ష్మి; ప్రాచీనమంతువున్=పూర్వమందుఁ జేసిన యపరాధమును; మఱపింపన్=మఱచునట్లు చేయుటకై; వెసన్=వేగముగ; పరిచర్యన్=సేవను; కావించెననఁగ=చేసెననునట్లు; రతి=రతీదేవి; భర్తకున్=పెనిమిటియగు మరునకు; అభయంబు = భయములేమిని; మతిన్=మనమునందు; కోరి=కాంక్షించి; తద్ధేమని శితశస్త్రిన్.—తత్=ఆమరునియొక్క, హేమ=బంగరుమయమగు, లేదా, సంపెఁగపువ్వయెడు, నిశిత=వాఁడిగల, శస్త్రిన్=శస్త్రమును, ఎదుటన్=ముందర; నిలిపెననఁగన్=నిలువఁబెట్టెనో యనునట్లు; లీలన్=విలాసము చేత; నలువంకన్=నలుదిక్కులయందు; వేర్వేఱన్=ప్రత్యేకముగ కీలుబొమ్మలు=కీళ్లతోఁ జేసినబొమ్మలు; అగరుధూపంబున్=అగరుపొగను; ఇడన్=ఇచ్చుచుండఁగ; తెలనాకుమడుపున్= నన్ననితమలపాకుమడుపును; ఒసఁగన్=ఇయ్యఁగ; పువ్వులసురటి చేన్=పూలవిసనకఱ్ఱచేత; విసరన్=వీచుచుండఁగ; రత్నదీపికన్=రత్నప్రదీపమును; గ్రహింపన్ = తీసికొనఁగ ; అగరుధూపము మొదలగునవినాలుగింటికి పైచరణములందు క్రమముగ నన్వయం బెఱుంగునది; నెమ్మదిన్=మనమునందు ; ధృతి=ధైర్యము; రహింపన్=ఒప్పఁగా. దీనికుత్తరపద్యస్థక్రియతో నన్వయము.

అనఁగా రతిరహస్యాధిదేవత సుచంద్రునిగృహము నొంది శృంగారకళను బ్రకటింపఁజేసెనో యనునటు లొకబొమ్మ యగరుధూపంబు నిడె ననియు మదనలక్ష్మి నిన్నే మరగితి నని మోహముచేత తనకరంబు సుచంద్రుని కొసంగెనా యను నట్లు ఒకబొమ్మ యాకుమడుపు లిచ్చె ననియు వసంతలక్ష్మి తాను పూర్వమందు సుచంద్రునికిఁ జేసినయపకారమును మఱపింపఁ బరిచర్య చేసెనో యన నొకబొమ్మ సురటిచే విసరె ననియు రతి తనపతి యగు మరునకు సుచంద్రునివలన నభయంబు గోరి యామదనునికాంచనబాణమును నెదుట నుంచెనా యనునట్లు ఒకబొమ్మ రత్నదీపమును గ్రహించె ననియు భావము. లోకములో యుద్ధమం దభయము గోరినవాఁడు తనకత్తిని ప్రతివీరునియెదుట నుంచుట ప్రసిద్ధము.

చ. ప్రకటితచిత్తభూబిరుద • పద్యములం బలె వింతఅంతులన్
సకినము లుగ్గడించు నెర • చాయలఁ బాయని కెంపుకోళ్ళతోఁ
జికిలిచొకాటపుస్మెఱుఁగు • చిక్కని పెందెరతో విధూతవృం
తకుసుమతల్పమై సిరులఁ • దార్కొనుశయ్య వసించినంతటన్. 115

టీ. ప్రకటితచిత్తభూబిరుదపద్యములంబలెన్. — ప్రకటిత = వెల్లడి చేయఁబడిన, చిత్తభూ=మరునియొక్క, బిరుద=జయచిహ్నములగు, పద్యములంబలెన్ = శ్లోకములవలెనె ; వింతఅంతులన్=ఆశ్చర్యకరములగు కలకలధ్వనుల చేత, సకినములు = శుభసూచకములగు వాక్కులను; ఉగ్గడించు=వచించునట్టి; నెరచాయలన్=శ్రేష్ఠములగు కాంతులను; పాయని కెంపుకోళ్ల తోన్ = వీడని కెంపుకోళ్ళ చేత; చికిలిచొకాటపుస్మెఱుఁగు చిక్కని పెందెరతోన్.—చికిలి=

తుడిచివైచిన, చొకాటపు=శ్రేష్ఠమగు, మెఱుఁగు = తళతళయనుకాంతిగల, చిక్కని పెం దెరతోన్ = దట్టమగుగొప్పతెరతోడను ; విఘాతవృంతకుసుమతల్పమై.—విఘాత = పోఁగొట్టఁబడిన, వృంత=తొడిమగల, కుసుమ = పువ్వులయొక్క, తల్పమై = తల్పముగలదై ; సిరులన్=కాంతులను ; తార్కొనుశయ్యన్=కదియునట్టిశయ్యను ; వసించినంతటన్=నివసించినంతట. పైపద్యముతో నన్వయము.

అనఁగా శ్రేష్ఠము లగుకాంతులు గలకెంపులకోళ్ళు మరునిబిరుదపద్యంబులపగిది వినంబడుధ్వనులచే శుభశకునములఁదెలుపుచుండఁగా, చికిలిచేసినమెంచితెరతో తొడిమలు దీసిన పువ్వులు పఱచియున్నతల్పముతో నమరియున్న పఱుపుపైఁ గూర్చుండినంతలోనని భావము

క. చిత్తప్రభూతకలహా, యత్తతఁ గడుఁ దత్తఱించు•నాత్మన్ వ్రీడో
ద్వృత్తి నడంచుచుఁ దగున,బ్బిత్తరిఁ గని పల్కి రపుడు•ప్రియసఖులెల్లన్.

టీ. చిత్తప్రభూతకలహాయత్తతన్=సురతాయత్తతచేతను ; కడున్=మిక్కిలి ; తత్తఱించువాత్మన్=త్వరపడువ్పాదయమును ; వ్రీడోద్వృత్తిన్ = లజ్జాతిశయముచేత ; అడంచుచున్=అడఁచుచు ; తగునబ్బిత్తరిన్=ఒప్పుచున్నయాచంద్రికను ; కని = చూచి ; ప్రియసఖులెల్లన్=సకియలందఱు ; అపుడు=ఆసమయమందు ; పల్కిరి=వక్ష్యమాణప్రకారమువచించిరి.

తే. పురుషమణిఁ గూడి యామోద•గరిమఁ బూను
నట్టిలతకూనసౌమన•స్యంబుఁ బొగడ
నౌనె యాకల్పకంబైనఁ•గానఁ దరుణి
తాల్పు మాకల్పకస్ఫూర్తి•ధవునిఁ గదియ. 116

టీ. పురుషమణిన్=శ్రేష్ఠమగుపున్నాగవృక్షమును, పురుషశ్రేష్ఠుని ; కూడి=కలసికొని ; ఆమోదగరిమన్=పరిమళముయొక్క యతిశయమును, సంతోషాతిశయమును ; పూనునట్టిలతకూనసౌమనస్యంబు=పొందునట్టిబాలలతయొక్కకుసుమవాసనను, పొందునట్టికాంతయొక్క మంచిమనసుగలుగుటను ; పొగడన్=నుతించుటకు ; ఆకల్పకంబైనన్=కల్పపర్యంతమైనను ; ఔనె=అగునాయనికాదువు. కానన్=అదువలన ; తరుణి=చంద్రికా! ధవునిఁగదియన్=భర్తనుచేరుటకు ; ఆకల్పకస్ఫూర్తిన్=అలంకారస్ఫూర్తిని ; తాల్పుము=ధరింపుము.

అనఁగఁ బున్నాగవృక్షమును జేరి పరిమళాతిశయమును బూని యున్న బాలలతయొక్క పరిమళమును కల్పపర్యంతంబైనఁబొగడ నలవిగాదు కనుక నీవును పున్నాగవృక్షమును గలసికొనిన బాలలతపగిది ప్రియునిఁ గదియ నలంకారమును ధరియింపు మని భావము.

తే. అని చెలులు ఘనమణికలా•పాళి భాస్వ
దంశుకంబున నలరించి•యద్భుతముగఁ

జంద్రిక నృపాంబకాబ్జము • ల్సంతసిల్ల
నతనిఁ జేర్పంగఁ దలఁచి దీ•వ్యన్నవోక్తి. 117

టీ. చెలులు=చెలికత్తెలు; అని=పూర్వోక్తప్రకారముగఁబలికి ; చంద్రికన్=చంద్రికను, జ్యోత్స్నను ; నృపాంబకాబ్జముల్=సుచంద్రునినేత్రకమలములు ; సంతసిల్లన్=సంతోషించునటులు; అద్భుతంబుగన్ = చిత్రంబుగ ; ఘనమణికలాపాళిన్.—ఘన=శ్రేష్ఠమగు, మణికలాప=మణిభూషణములయొక్క, ఆళిన్=పంక్తిచేత ; ఘనమణి=మేఘశ్రేష్ఠములయొక్క, కలాప=సమూహముయొక్క, ఆళిన్=పంక్తిచేత ; భాస్వదంశుకంబునన్=ప్రకాశించువస్త్రముచేత; భాస్వత్=సూర్యునియొక్క, అంశుకంబునన్=కిరణముచేత ; అలరించి=అలంకరించి ; అతనిన్=సుచంద్రుని ; చేర్పంగన్=చేర్చుటకు ; తలఁచి=యత్నించి; దీవ్యన్నవోక్తిన్.—దీవ్యత్=ప్రకాశించుచున్న,నవోక్తిన్=నూతనమగువచనముచేత.దీని కుత్తరపద్యస్థక్రియతో నన్వయము.

అనఁగా చెలికత్తెలు చంద్రికను మేఘపంక్తిచేతను సూర్యకిరణములచేతను సుచంద్రుని నేత్రములు సంతసించునట్లు అలంకరించి రని భావము. చంద్రికకు విరోధులగు మేఘపంక్తి సూర్యకిరణములచే నలంకరించుటయు నాచంద్రికను నృపాంబకాబ్జములు సంతసించునటు లలంకరించుటయు చిత్రమనిభావము. మణిభూషణములచేఁ బ్రకాశించువస్త్రములచే చంద్రిక నలంకరించి రని స్వభావతాత్పర్యము.

చ. చనుదము లెమ్ము శ్యామ యిఁక • ద్క్ష్మాధరచంద్రుని డాయఁగా వలెన్
మన మలరంగఁ దత్కరవి•మర్దము దక్కినఁ దెల్వి దక్కునే
యని నయ మొప్పఁ దచ్ఛయము • నంటి తెమల్చిన లజ్జపెంపునన్
వనజదళాక్షి నమ్రముఖ•వారిజయై నిలఁ బూన వెండియున్. 118

టీ. శ్యామ=చంద్రికా ! మనమలరంగన్=హృదయముసంతసించునటులు; ఇఁకన్=ఈమీఁద; క్ష్మాధరచంద్రునిన్ = రాజచంద్రుండగుసుచంద్రుని ; డాయన్ కావలెన్= సమీపింపవలయును, అనఁగ సుచంద్రునిఁజేర వలయు ననుట. చనుదము=పోదము.లెమ్ము. తత్కరవిమర్దము.—తత్ = ఆసుచంద్రునియొక్క, కర = హస్తముయొక్క, విమర్దము = సమ్మర్దము; తక్కినన్ = విడువఁగా; తెల్విదక్కునె=తెల్వికలుగునా ? కలుగదనుట. అనఁగ పురుషకరసమ్మర్దము కాంతలకు మిగుల శోభావహ మని భావము. "సురతమృదితా బాలవనితా । తనిమ్నా శోభంతే గళితవిభవా శ్చార్థిషు నృపాః" అనిప్రాచీనవచనము; అని=ఈప్రకారముపలికి; నయ మొప్పన్=నీతియొప్పునటులు; తచ్ఛయమునంటి=ఆచంద్రికకరంబుఁబట్టుకొని; తెమల్చినన్=లాగఁగా; లజ్జపెంపునన్=వ్రీడాతిశయముచేత; వనజదళాక్షి = చంద్రిక; నమ్రముఖవారిజయై.—నమ్ర=వంగిన, ముఖవారిజయై = ముఖకమలముగలదై; నిలన్=నిలుచుటకు; పూనన్=ప్రయత్నింపఁగ;వెండియున్=మరల. దీనికుత్తరపద్యస్థక్రియతో నన్వయము.

శ్యామ=రాత్రి; త్క్ష్మాధరచంద్రునిన్=పొడుపుకొండమీఁదిచంద్రుని; డాయఁగావలెన్=సమీపింపవలయును. తత్కరవిమర్దముతక్కినన్ = ఆచంద్రకిరణసంపర్కములేనియెడ; తెలివిదక్కునె=ప్రకాశముగలుగునా? అను నర్థము ధ్వనించుచున్నది.

అనఁగ శ్యామా! నీవు సుచంద్రుని గలిసికొనుము, తత్సంపర్కము నీకు మిగుల శోభావహము అని చెలులు పలికి చంద్రికకరముఁ బట్టి లాగఁగా లజ్జాతిశయముచే చంద్రిక ముఖమువంచుకొని నిలువఁగ మఱియు వక్ష్యమాణప్రకారముగఁ బలికిరని భావము.

సీ. తొయ్యలి నీచన్ను♦దోయి చక్రము గెల్చు
నదియె రాజపరిగ్ర♦హంబు లేక
వెలఁది నీకటిసీమ ♦ విషమగోత్రము నొంచు
నదియె దేవేశలీ♦లాప్తి లేక
కాంత నీకనుఁగవ ♦ కైరవావళి మీఱు
నదియె యినాలోక ♦ మొదవ కున్నఁ
గలికి నీమయికాంతి ♦ కైతకంబుల మించు
నదియె యీశ్వరయుతిఁ ♦ బొదలకున్నఁ

తే. గాన నీవింత హిత మాత్మఁ ♦ గాంచ లేక
గోలవయి యేల యీవేళఁ ♦ గోమలాంగి
మొక్కలము చేసె దని పల్కి ♦ ముదిత లెల్ల
తోడితేఁ గాంత పడకిల్లు ♦ దొరయ వచ్చె. 119

టీ. తొయ్యలి=చంద్రికా! నీచన్నుదోయి=నీచనుఁగవ ; రాజపరిగ్రహంబు లేక=సుచంద్రుఁడను చంద్రుని యనుగ్రహము లేక; చక్రమున్=చక్రవాకమును; గెల్చునదియె? గెలువదనుట; ఇచట, రాజపరిగ్రహము లేక=రాజుయొక్క గ్రహణము లేక; చక్రము=రాష్ట్రమును; గెలుచునా యను నర్థము దోఁచుచున్నది; లోకములో రాజును బట్టుకొనినఁగాని తద్రాష్ట్రము వశపడ దని భావము.చంద్ర సాహాయ్యమున్నంగాని చక్రవాకములు వశపడ వని తాత్పర్యము. వెలఁది=చంద్రికా! నీకటిసీమ=నీకటిప్రదేశము; విషమగోత్రమును=దుష్టకులమును; దేవేశలీలాప్తి లేక.–దేవేశ=సుచంద్రునియొక్క, లీలాప్తి లేక=విలాసప్రాప్తి లేక; నొంచునదియె=నొప్పించునా? నొప్పింపఁజాలదనుట. అనఁగ సుచంద్రలీలాప్తి గలిగినేని దుష్టకులముల నడంప వచ్చునని భావము.విషమగోత్రమును=విషమపర్వతమును;దేవేశలీలాప్తి లేక=ఇంద్రలీలాప్రాప్తి లేక;నొంచునదియె యను నర్థము దోఁచుచున్నది.కాంత=చంద్రికా! నీకనుఁగవ=నీకనుదోయి;ఇనాలోకము=సుచంద్రదర్శనము;ఒదవకున్నన్=కలుగకున్న;కైరవావళిన్=పిశునసమూహమును; మీఱునదియె=అతిక్రమించునదియా? కాదనుట. అనఁగ నీకనుదోయి సుచం

ద్రదర్శనముఁ జేయుకున్నఁ బిశునుల జయింపఁ జాలదని భావము. నీకనుదోయి ; ఇనాలోకము=సూర్యదర్శనము; కలుగకున్నన్ ; కైరవావళిన్=తొవబంతిని; మీఁఱునదిరయె యనునర్థము దోఁచుచున్నది. కలికి=చంద్రికా! నీమయికాంతి=నీదేహకాంతి; ఈశ్వరయుతిన్ = సుచంద్రసంబంధము చేత; పొదలకున్నన్=అతిశయింపకున్నచో ; కైతకంబులన్=క్షుద్రశత్రువులను, "క్షుద్రద్విషి చకైతక" మ్మ నిహాలాయుధుఁడు; మించునదరయె=అతిశయించునదియా? అతిశయింపదనుట. అనఁగ నీదేహకాంతి సుచంద్రయుతిచేఁ బొదలకున్న క్షుద్రులఁ దిరస్కరింపఁజాల దని భావము. నీదేహకాంతి; ఈశ్వరయుతిన్=శంకరుని సంబంధము చేత; పొదలకున్నన్ ; కైతకంబులన్=కేతకీపుష్పములను; మించునాయను నర్థము దోఁచుచున్నది. కానన్=అందువలన; నీవు=ఈవు; ఇంతహితము=ఇంతమాత్రము హితమును; ఆత్మన్=మనమునందు; కాంచలేక=చూడక; గోలవయి=మూఢురాలవై; ఏల=ఎందుకు ; ఈవేళన్ = ఈసమయమందు; కోమలాంగి=చంద్రికా ! మొక్కలము=ముష్కరత్వమును; చేసెదు = చేయుచున్నావు? అనిపల్కి=ఈప్రకారముపలికి; ముదితలెల్లన్=కాంతలందఱు; తోడితేన్ = తోడ్కొనిరాఁగ; కాంత=చంద్రిక; పడకిల్లుదారయన్=పానుపుటిల్లు ప్రవేశించుటకు; వచ్చెన్=వచ్చెను.

మ. అమరేశాశ్మవిజేతృకుంతల వయస్యాయత్నయుక్తి న్విహా
రమహాగేహము సొచ్చి యచ్చట మసారస్తంభపార్శ్వంబునం
దు మొగి న్నిల్వఁగ రాగయుక్తి నది దోడ్తోఁ దెల్పె భూభర్తకు
న్రమణి న్నిత్యమహాశుచిప్రకృతికి న్నైజంబు పోఁబోవునే. 120

టీ. అమరేశాశ్మవిజేతృకుంతల=ఇంద్రనీలమణుల జయించిన కుంతలములుగల చంద్రిక; వయస్యాయత్నయుక్తిన్.—వయస్యా=సకియలయొక్క, యత్న = ప్రయత్నముయొక్క, యుక్తిన్=సంబంధము చేతను; విహారమహాగేహము=క్రీడాగృహమును; చొచ్చి=ప్రవేశించి; అచ్చటన్=ఆగృహమందు; మసారస్తంభపార్శ్వంబునందున్.—మసారస్తంభ=ఇంద్రనీలమణిస్తంభముయొక్క, పార్శ్వంబునందున్=ప్రక్కయందు; మొగిన్=పూనికచేత; నిల్వఁగన్=నిలుచుండఁగా; రాగయుక్తిన్.—రాగ=చంద్రికాంగసంగతారుణ్యముయొక్క, యుక్తిన్=సంబంధముచేత, క్రోధసంబంధముచేత నని యర్థాంతరము; అది = ఆకంబము; రమణిన్=చంద్రికను; భూభర్తకున్= సుచంద్రునకు; తోడ్తోన్=వెంటనె; తెల్పెన్=తెలియఁజేసెను. నిత్యమహాశుచిప్రకృతికిన్.—నిత్య=నిరంతరము, మహాశుచి=అత్యంతా పరిశుద్ధమగు, ప్రకృతికిన్=స్వభావముగలవారికి; నిత్య=నిరంతరము, మహత్ అశుచి=అత్యంతము నల్లని, ప్రకృతికిన్=స్వభావముగలదానికని స్వభావార్థము; నైజంబు=స్వభావము; పోఁబోవునే = పోఁగలదా? పోవదనుట.

చంద్రిక సకియలప్రయత్నముచేఁ గ్రీడాగృహము సొచ్చి యచట నుండు నింద్రనీలస్తంభముయొక్క పార్శ్వమందు నిలుచుండఁగా నా స్తంభము రాగముచే నిచటఁ జంద్రిక

వచ్చి నిలుచున్నదని సుచంద్రునకుఁ దెలిపెను.లోకమందు నిత్యమహాశుచిప్రకృతి గలవారు క్షేమ స్వభావము విడువ రని భావము.చంద్రిక యింద్రనీలమణుల జయించిన కుంతలములు గలది గాన ద్వేషముచే రమణిని రాజునకుఁదెలిపినదని ముఖ్యాశయము.అర్థాంతరన్యాసాలంకారము.

ఉ. అత్తఱిఁ దత్సఖీజన మ•నావిలధీయుతి వాఱ్త్తి మీర లి
ప్పొత్తడిబొమ్మ రాజమణి•పుత్త్రికలార భజించుచుండుఁడీ
చిత్తము వొంగ నం చొకవి•శేషవిధానము నెంచి వంచనా
యత్తత నేగె దాని జల•జాక్షి యథార్థము కా గణింపఁగన్. 121

టీ. అత్తఱిన్=ఆసమయమందు; తత్సఖీజనము.—తత్=ఆచంద్రికయొక్క, సఖీజనము=సకురాండ్రు; అనావిలధీయుతిన్.—అనావిల=అకలుషమగు, ధీయుతిన్ = బుద్ధియోగముచు; వాఱ్త్తి=కూడి; రాజమణిపుత్త్రికలార=రాజశ్రేష్ఠతనూజలార ! చంద్రకాంతపుబొమ్మలారాయని యర్థాంతరము; మీరలు=మీరు; ఇప్పొత్తడిబొమ్మన్=ఈబంగరుబొమ్మను, చంద్రికననుట; చిత్తము=మనస్సు; పొంగన్=ఉబుకునటులు; భజించుచుండుఁడీ=సేవించుచుండుఁడీ. అంచున్=ఈప్రకారము పలుకుచు; ఒకవిశేషవిధానమున్=ఒకవిశేషకార్యమును, ఎంచి=గణించి; వంచనాయత్తతన్ = మోసముచేత; దానిన్=అమాటను; జలజాక్షి=చంద్రిక; యథార్థము=సత్యమే;కాన్=అగునటులు; గణింపఁగన్=ఎంచఁగా; ఏగెన్=పోయెను.దీని కుత్తరపద్యస్థక్రియతో నన్వయము.

అనఁగాఁ జంద్రికను బడకింటిలో విడిచి యచట నున్న రాజమణి పుత్రికలకు మీరు చంద్రికను సేవించుచుండుఁడీ యని వచించి వంచనచేఁ దత్సఖీజనము సనిరియనని భావము.

సీ. సుమశరప్రావృడా•గమశక్తి నంబుద
శ్రేణిఁ గన్పడుతటి•ద్రేఖ యనఁగఁ
బతిపూన్కి గ్రహియింప • భావజుండు పునర్గ్రి
హాణ మూన్చునుమచాప•యష్టి యనఁగ
సాహిణి రా నిగ్గ • సాధించు నావల
రాజుక్రొత్తచిలుక • తేజి యనఁగ
వనపాలుదోటినే•ర్పున వచ్చు శృంగార
ధరణిజభూరిమం•జరిక యనఁగ

తే. నపుడు నృపుకన్నెఁగవ నాంగి•కాభ నలమి
యతఁడు దివియంగ వెనుదీసి • యంత రాక
గబ్బి యయి నిల్చె తత్కరా•కర్షణమునఁ
గదిసె వక్త్రాంత తల్ప మ•క్కంబ మొడసి. 122

టీ. సుమశరప్రావృడాగమశక్తిన్.—సుమశర=మన్మథుఁడనెడు, ప్రావృడాగమ=వర్షాకాలప్రాప్తియొక్క, శక్తిన్=సామర్థ్యముచేత; అంబుదశ్రేణిన్= మేఘపంక్తియందు; కన్పడుతటిద్రేఖయనఁగన్=కాన్పించు మెఱపుతీవయో యనునటులు; పతి=భర్తయగు సుచంద్రుఁడు; పూన్కిన్=ప్రయత్నమును; గ్రహియింపన్ = పొందుటకై; భావజుండు = మరుఁడు; పునర్గ్రహణము=పునస్స్వీకారమును; ఊన్చు సుమచాపయష్టియనఁగన్ = చేయుచున్న పూవింటియొక్క, దండమో యనునటులు సాహిణి=గుఱ్ఱపువాఁడు; రాన్ = వచ్చుటకై; ఇగ్గన్=ఆకర్షింపఁగా; సాధించు నావలరాజు క్రొత్త చిలుక తేజియనఁగన్.—సాధించు=ఎదిరించు, ఆవలరాజు=అమరునియొక్క, క్రొత్తచిలుక తేజియనఁగన్ = నూతనమగు శుకాశ్వమో యనునటులు; వనపాలుదోటి నేర్పునన్.—వనపాలు=వనపాలకునియొక్క, దోటి నేర్పునన్=దోటియొక్క జాణతనముచేత, దోటియనఁగా చేతికందని తరులతాదిఫల పుష్పంబుల నాకర్షించు దండవిశేషము; వచ్చు శృంగార ధరణిజభూరిమంజరిక యనఁగన్.—వచ్చు = వచ్చునట్టి, శృంగార ధరణిజ=శృంగారవృక్షముయొక్క, భూరి=అధికమగు, మంజరికయనఁగన్=గుచ్ఛమోయను నటులు; అపుడు=ఆసమయమందు; ఇచట పైచరణములయందు క్రమముగ నన్వయింపవలయును. నృపుకన్నుఁగవన్=సుచంద్రుని కనుదోయిని; ఆంగికాభన్=దేహసంబంధియగుకాంతిచేత; అలమి=ఆక్రమించి, అనఁగా మరుఁడను వర్షాకాల ప్రాప్తిచేత మేఘములయందుఁ జూపట్టుచున్న మెఱపుతీవయో యనునటులు సుచంద్రునికనుదోయిం దన దేహకాంతిచే నలమియని భావము. అతఁడు=సుచంద్రుఁడు; తివియంగన్=ఆకర్షింపఁగా; వెనుదీసి=వెనుకకుమరలి; అనఁగా మరుఁడు మరల సుచంద్రునిపై నాకర్షించిన పూవింటి దండమో యనునటులు వెనుకకు వంగినదని భావము. అంతన్=ఆమీఁద; రాక= రానిదై; గబ్బియయి=గర్వముగలదియై; నిల్చి=నిలుచుండి; గుఱ్ఱపువాఁ డిగ్గఁగ సాధించుచున్న మరునిక్రొత్తచిలుక గుఱ్ఱమో యనునటులు రాక గబ్బియయి నిలిచినదని భావము. తత్కరాకర్షణమునన్.—తత్=ఆసుచంద్రునియొక్క, కర=హస్తముయొక్క, ఆకర్షణమునన్=ఆకర్షణముచేత ; ఆకాంత=ఆచంద్రిక; అక్కంబమెడసీ=ఆస్తంభమును విడిచి; తల్పము = శయ్యను; కదిసెన్ =పొందెను.అనఁగ వనపాలుఁడు దోటితోఁ దీసిన వచ్చినట్టి శృంగారభూజ పుష్పగుచ్ఛమో యనునటులు సుచంద్రుని కరాకర్షణముచేత నాచంద్రిక స్తంభమును వదలి తల్పమును జేరెనని భావము.

మ. సదనాధారసమగ్రవాసనను తత్సాధ్వీవతంసంబు తా
నుదితస్తంభతఁ గాంచెఁ దత్కలన నయ్యుర్వీశరత్నంబు తా
నదియే తాల్చెఁ దదాత్వమం దగుఁ గదా శ్యామాతిభూమప్రభా
స్పదమూర్తిన్ భజియించి తద్గుణతతిన్ సంధింప రెవ్వారిలన్. 123

టీ. సదనాధారసమగ్రవాసనన్.—సదనాధార = స్తంభముయొక్క, సమగ్ర=పరిపూర్ణమగు, వాసనన్=అనుభూతార్థస్మృతిచేతను; తత్సాధ్వీవతంసంబు=ఆచంద్రిక; తాన్=తా

ను; ఉదితస్తంభతన్.—ఉదిత=ఉదయించిన, స్తంభతన్ = స్తంభముగలుగుటను, నిశ్చేష్టతనుట; కాంచెన్=పొందెను. తత్కలనన్.—తత్=ఆచంద్రికయొక్క, కలనన్=సంబంధముచేత; అయ్యుర్వీశరత్నంబు=ఆసుచంద్రుఁడు; తాన్ = తాను; తదాత్వమందున్= ఆసమయమందు; అదియె=ఆనిశ్చేష్టతనె; తాల్చెన్=ధరియించెను. అగుఁగదా = అగునుకదా! సత్యముకదాయనుట. శ్యామాతిభూమప్రభాస్పదమూర్తిన్.—శ్యామ=మలినమైన,అతిభూమ=అధికమగు, ప్రభా=కాంతికి, ఆస్పద=స్థానభూతమగు, మూర్తిన్=శరీరముగలవారిని, నల్లనికాంతిగలయింద్రనీలస్తంభమునని భావము; శ్యామా=స్త్రీలయొక్క, అతిభూమిప్రభా=అధికకాంతికి, ఆస్పదమగు, మూర్తినని యర్థాంతరము; భజియించి=సేవించి; తద్గుణతతిన్.—తత్ = ఆమలినవస్తువుయొక్క, ఆస్త్రీలయొక్క, గుణతతిన్ = గుణకదంబమును; ఇలన్=భూమియందు; ఎవ్వారు=ఎవరు; సంధింపరు=పొందరు? సమస్తజనులుపొందుదురనుట.

అనఁగా చంద్రిక యింద్రనీలమణిస్తంభముయొక్క, వాసనచేతనో యనునట్లు తాను ఉదితస్తంభతను దాల్చె ననియు నాసుచంద్రుఁడును అపుడు చంద్రికసంబంధముచేత తాను ను ఉదితస్తంభతఁ దాల్చె ననియు భావము. ఈయర్థమునె దృష్టాంతముతో దృఢపఱచుచున్నాఁడు. లోకమందు శ్యామాతిభూమప్రభాస్పదమూర్తిని సేవించి తద్గుణములను ఎవరు పొందరు ? అందఱుపొందుదు రనిభావము. ఇచట నర్థాంతరన్యాసాలంకారము.

చ. జలరుహనేత్రగాత్రమహి ♦ సాంద్రమహాంకురపాళి యంటఁ ద
త్కలితమనస్తటాకమును ♦ గాఢశరాళి నగల్చి చిత్తజుం
డలరుమహారసోత్కరము ♦ నచ్చటఁ దారిచె నాఁగ నత్తఱిం
బులకిత మైనమైఁ బొరలి ♦ పొంగె నవోదితఘర్మవాశ్ఛటల్. 124

టీ. జలరుహనేత్రగాత్రమహిన్.—జలరుహనేత్ర = చంద్రికయొక్క, గాత్రమహిన్= శరీరమనుభూమియందు; సాంద్రమహాంకురపాళి.—సాంద్ర=దట్టమగు, మహాత్ = అధికమగు, అంకుర=మొలకలయొక్క, పులకలయొక్కయని యర్థాంతరము దోఁచుచున్నది, పాళి=శ్రేణి; అంటన్=సంబంధింపఁగా; తత్కలితమనస్తటాకమునన్.—తత్= ఆచంద్రికయొక్క, కలిత = ఒప్పుచున్న, మనస్తటాకమును = హృదయమనుచెఱువును; గాఢశరాళిన్.—గాఢ = దృఢమగు, శర = బాణములయొక్క, వాయువులయొక్క, ఆళిన్ = శ్రేణిచేత; చిత్తజుండు = మరుఁడు; అగల్చి = ఛేదించి; అలరుమహారసోత్కరమున్.—అలరు = ఒప్పుచున్న, మహారస = గొప్పఅనురాగమను నుదకముయొక్క, ఉత్కరము = సమూహమును; అచ్చటన్ = ఆగాత్రమనుభూమియందు; తారిచెనాఁగన్ = ఉంచెనో యనునట్లు; అత్తఱిన్ = ఆసమయమందు; పులకితము = సంజాతపులకములుగలది; ఐనమైన్=అయినట్టిశరీరమందు;నవోదితఘర్మవాశ్ఛటల్.—నవ=నూతనమగునట్లు,ఉదిత=పుట్టిన, ఘర్మవాః=స్వేదోదకములయొక్క,ఛటల్=సమూహములు; పొరలి=పొర్లి; పొంగెన్=ఉబికెను.

అనఁగా చంద్రికశరీర మనుభూమియందు సాంద్ర మగుమొలక లుదయింపఁగానె యా చంద్రికయొక్క హృదయ మనుతటాకమును శరాళిచే భేదించి మదనుఁడు మహారసోత్కరమును తార్చెనో యనునట్లు పులకలతోఁ గూడి యున్నశరీరమందు స్వేదోదకము పొరలి పొంగె నని భావము.

చ. చెలిచెలు లందఱుం జనిన • సి గ్గది పోవక యున్న దేమి తాఁ
జలముప నంచు నెంచి యతి•సాంద్రరుషాయుతిఁ బోలె ఘర్మవాః
కలికలఁ దోఁగి శోణరుచి • గన్పడ నెయ్యన జాఱి తద్వధూ
కులమణిసమ్ముఖం బెడసెఁ • గుంకుమబొట్టురసంబు చయ్యనన్. 125

టీ. చెలి చెలులందఱున్.—చెలి=చంద్రికయొక్క; చెలులందఱున్ = చెలికత్తెలందఱును; చనినన్=పోయినను; సిగ్గుఅది=ఆవ్రీడ; తాన్=తాను; చలమునన్=మాత్సర్యము చేత; పోవక యున్నది=చనక ఉన్నది; ఏమి=ఏమి కారణము? అంచున్=అనుచు; ఎంచి=గణించి; అతిసాంద్రరుషాయుతిఁబోలెన్.—అతిసాంద్ర=మిక్కిలి గాఢమగు, రుషాయుతిఁబోలెన్=క్రోధముతోఁగూడిక చేతవలెను; ఘర్మవాఃకలికలన్=ఘర్మోదబిందువులయందు; తోఁగి = మునిఁగి; శోణరుచిగన్పడన్=ఎఱ్ఱనికాంతిచూపట్టుచుండఁగా; నెయ్యనన్=తిన్నఁగ; జాఱి = స్రవించి; తద్వధూకులమణిసమ్ముఖంబు.—తద్వధూకులమణి=ఆచంద్రికయొక్క, సమ్ముఖంబు = ముఖమును, సన్నిధిని అని తోఁచుచున్నది; కుంకుమబొట్టురసంబు = కుంకుమతిలకముయొక్క జలము; చయ్యనన్=శీఘ్రముగ; ఎడసెన్=ఎడఁబాసెను.

అనఁగా చంద్రికసఖురాండ్రు చనినను ఈసిగ్గు ఏల పోక యున్నది? యని రోషముతోఁ గూడియున్నదానివలెను స్వేదోదబిందువులయందు మునిఁగి ఎఱ్ఱనికాంతితో కుంకుమబొట్టురసంబు చంద్రికసమ్ముఖంబును ఎడఁబాసె నని భావము.

చ. జలజశరాశుగ ప్రచుర•చంక్రమణంబు లమందతం గనన్
గలికి తమిన్ ద్రపాంబుదము • గప్పిన నాననచంద్రదర్శనం
బలవడ కున్కి నత్తఱి ని•జాక్షిచకోరకయుగ్మ మాఁకటం
దఱఁకుచు నుండ నద్ధరణి•నాథుఁడు పల్కె రసోత్తరంబుగన్. 126

టీ. జలజశరాశుగ ప్రచురచంక్రమణంబులు.—జలజశర=మదనునియొక్క, ఆశుగ=బాణములను వాయువులయొక్క, ప్రచుర=అధికమగు, చంక్రమణంబులు=సంచారములు; అమందతన్=అతిశయముగ; కనన్=పొందఁగా; కలికితమిన్.—కలికి=చంద్రికయొక్క, తమిన్=ఆసక్తియను చీఁకటి రాత్రియందు; త్రపాంబుదము=సిగ్గనుమబ్బు; కప్పినన్=ఆచ్ఛాదింపఁగ; ఆననచంద్రదర్శనంబు=ముఖచంద్రుని చూపు; అలవడకున్కిన్=కనిపింపకుండుట చేత; అత్తఱిన్=ఆసమయమందు; నిజాక్షిచకోరకయుగ్మము.—నిజ=తనసంబంధియగు, అక్షిచకోరక=నేత్రములను చకోరములకు

క్కా, యుగ్మము=జంట; ఆఁకటన్=ఆకలిచేత; తలఁకుచునుండన్ = చలించుచుండఁగా; అద్ధరణినాథుఁడు=ఆసుచంద్రుఁడు; రసోత్తరంబుగన్=అనురాగాతిశయముచేత; పల్కెన్=పలికెను.

అనఁగ సుచంద్రుఁడు, మన్మథాశుగసంచారము లతిశయింపఁగానె చంద్రికయొక్కయాసక్తి యనెడు రాత్రిని లజ్జ యను మేఘము కప్పఁగా ముఖచంద్రుఁడు గనిపింపమి నాసమయమందుఁ దన యక్షిచకోరములు ఆఁకలితో చలించుచుండఁగా నన్నురాగముసఁ జంద్రికతోఁబలికె నని భావము.

సీ. వరశంఖపూగసం♦పద గళస్థము నీకు
సతి పోఁకముడి సుంత ♦ సడల రాదె
కువలయశ్రీ నేలు♦కొను నేత్రరుచి నీకుఁ
దోయ్యాలి రెం డూరు ♦ లియ్య రాదె
ఘనకుందవిభవంబు ♦ గను దంతములు నీకు
బిసబాహ యొక రేఖ ♦ యొసఁగ రాదె
బహుదివ్యఫలలక్ష్మిఁ ♦ బరఁగువాతెఱ నీకు
నింతి మంజులకుచం ♦ బిడఁగ రాదె

తే. రాజవిజయంబు చేసె నీ ♦ రమ్యముఖము
లేమ యవనతవృత్తి చా ♦ లింప రాదె
నిరుపమరుచిరమణికి నీ ♦ కరయుఁ దగునె
వరవటులరీతి చే విడు ♦ వఁగను రాదె. 127

టీ. వరశంఖపూగసంపద.—వర=శ్రేష్ఠమగు, శంఖపూగసంపద = శంఖములయొక్కపూగములయొక్క సంపదయనెడు శంఖసంఖ్యగల పోఁకలసమృద్ధి; నీకున్=నీకు; గళస్థము=గళమందున్నది, కలస్థమనియువిభాగము, రేఫలకారంబుల కభేదమునుబట్టి కరస్థమనుకొనవలయు; పోఁకముడి=నీవియనెడు పోఁకలమూటను; సుంత=ఇంచుకంత; సతీ=చంద్రికా! సడలరాదె=వదలరాదా? అనఁగ శంఖసంఖ్యాకమగు పూగసమృద్ధిగలవారించుకపోఁకముడి సడలుట తగు నని భావము. నీవిగ్రంథిని సడలింపు మని ప్రకృతాభిప్రాయము. "ద్వ్యర్థైః పదైః పిశునయేచ్చ రహస్యవస్తు" అను కామశాస్త్రమర్యాద ననుసరించి కవిప్రార్థనీయరహస్యవస్తువును శ్లిష్టపదములతో సూచించి యున్నాఁడు, ఇట్లితరచరణములయందును గ్రహింపవలయును. తొయ్యాలి=చంద్రికా! నీకున్=నీకు; కువలయశ్రీన్=కుముదసంపదయనెడు భూతలముసంపదను; ఏలుకొను నేత్రరుచి=పాలించెడునయనకాంతి. కలదు.. రెండూరులు=రెండు

తొడ లనెడు రెండుగ్రామములను; ఇయ్యరాదె=ఒసంగరాదా? భూవలయము నేలువారు రెండుగ్రామముల నిచ్చుట తగు నని భావము. ఊరువుల నొసంగు మని ప్రకృతాభిప్రాయము. బిసబాహ=తామరతూఁడువంటిబాహువులుగలదానా! నీకున్=నీకు; ఘనకుందవిభవంబున్.—ఘన=అధికమగు, కుందవిభవంబున్=మొల్లమెగ్గలవిభవమనెడు నిధివిశేషముయొక్క విభవమును; "మహాపద్మశ్చపద్మశ్చ శంఖోమకరకచ్ఛపౌ। ముకుందకుందనీలాశ్చ వరశ్చ నిధయోనవ" యని అమరుఁడు; కనుదంతములు = పొందునట్టి దశనములు; కలవు. ఒకరేఖ=ఒకతుతమనెడు అల్పద్రవ్యమును; ఒసఁగరాదె = ఈయరాదా! కుందవిభవము గలవారు స్వల్పద్రవ్యము నొసంగుటయుక్త మని భావము. దంతక్షతి నీయు మని ప్రకృతాభిప్రాయము. ఇంతి=చంద్రికా! నీకున్=నీకు; బహుదివ్యఫలలక్ష్మిన్.—బహు = అనేకములై, దివ్య.—మనోజ్ఞములగు, ఫల=లాభములనెడు పండ్లయొక్క, లక్ష్మిన్=లక్ష్మిచేత; పరఁగువాతెఱ=ఒప్పునట్టిమోవి; కలదు. మంజులకుచంబు=మంజులమైనకుచమనెడు మంజువైన లకుచమును అనఁగా గజనిమ్మపండును; ఇడఁగరాదె=ఈయరాదా? అనేకఫలములు గలవారు ఒక్కఫలము నిచ్చుట యుక్త మని భావము. కుచముని మ్మని ప్రకృతాభిప్రాయము. లేమ=చంద్రికా! నీరమ్యముఖము=నీసుందరమగుముఖము; రాజవిజయంబున్=చంద్రుఁడనెడుభూపాలునియొక్క గెలుపును; చేసెన్=ఒనర్చెను. అవనతవృత్తిన్=నమ్రభావమును; చాలింపరాదె=మానరాదా? లోకమందు రాజును జయించినవాఁడు తలయెత్తి యుండుట యుక్త మని భావము. లజ్జ విడిచి తల యెత్తు మని ప్రకృతాభిప్రాయము. నిరుపమరుచిరమణికిన్=నిరుపమమైరుచిరమైన మణివంటిదానవగు;నీకున్;వరపటలరీతి.—వర=శ్రేష్ఠమగు,పటలరీతి=వస్త్రాకర్షణము చేయుదానిరీతియనెడు పటలాఖ్యమణిదోషరీతి;అరయన్=విచారింపఁగా;తగునె=యుక్తమా? శ్రేష్ఠమణులకు పటలదోషము యుక్తముగా దని భావము. వస్త్రమును గ్రహింపకు మని ప్రకృతాభిప్రాయము. చేవిడువఁగనురాదె = కరము వస్త్రమునుండి విడువుమనుట.

క. అనునయపూర్వకముగ న, వ్వనజానన నిటులు పలికి • వసుధాపతి త
ద్ఘనరమ్యాంగకసంస్ప, ర్శనలాలసవృత్తి యగుట • సంభ్రమ మెసఁగన్.

టీ. వసుధాపతి=సుచంద్రుఁడు; అవ్వనజాననన్=ఆచంద్రికనుగూర్చి; ఇటులు=ఇట్లు; అనునయపూర్వకముగన్=ఉపలాలనపురస్సరముగ; పలికి=వచించి; తద్ఘనరమ్యాంగక సంస్పర్శనలాలసవృత్తి.—తత్=చంద్రికయొక్క, ఘన=బిగువైన, రమ్య=మనోజ్ఞములగు, అంగక=అవయవములయొక్క, సంస్పర్శన=స్పృశించుటయందు, లాలస=అధికతృష్ణగల, వృత్తి=వ్యాపారముగలవాఁడు; అగుటన్=ఐనహేతువుచేత; సంభ్రమము=త్రొట్రుపాటు; ఎసఁగన్=అతిశయించునటులు. దీనికుత్తరపద్యస్థక్రియతో నన్వయము.

చ. నృపతిమహాబలోత్కరము • నేర్పున వళ్యధిరోహిణిన్ సమ
గ్రపటిమ లగ్గ కెక్కుతఱిఁ • గంపము నొందు సతీకుచాద్రి దు
ర్గపదవి నాక్రమించి యట • రంజిలునాయకరత్నముం గ్రహిం
చి పరమకౌతుకం బతని•చిత్తమునన్ ఘటియించె నత్తఱిన్. 129

టీ. నృపతిమహాబలోత్కరము.—నృపతి = సుచంద్రునియొక్క, మహాత్ =అధికమగు, బల=బలముచేత, ఉత్ =ఎత్తఁబడిన, కరము=హస్తము; నృపతియొక్క, మహాబల=అధిక సేనలయొక్క, ఉత్కరము=సమూహము; నేర్పునన్ = జాణతనముచేత; వళ్యధిరోహిణిన్.—వళి=త్రివళియనెడు, అధిరోహిణిన్=నిచ్చెనచేత; సమగ్రపటిమన్.—సమగ్ర=పరిపూర్ణమగు, పటిమన్=సామర్థ్యముచేత; లగ్గకెక్కుతఱిన్ =ముట్టడించుటకై కోటనెక్కునప్పుడు; కంపమున్=కళవళమును, భయమును; ఒందుసతీకుచాద్రిదుర్గపదవిన్.—ఒందు = పొందుచున్న, సతీ = చంద్రికయొక్క, కుచాద్రి = పర్వతములవంటి స్తనములనెడు, దుర్గ = కోటయొక్క, పదవిన్=స్థానమును; ఆక్రమించి=ఆవరించి; అటన్=అచ్చట; రంజిలునాయకరత్నమున్=ప్రకాశించుప్రభుశ్రేష్ఠుని, ప్రకాశించుహారమధ్యమణిని; గ్రహించి=పట్టుకొని, పరమకౌతుకంబు.—పరమ=ఉత్కృష్టమగు, కౌతుకంబు = సంతసమును, అతనిచిత్తమునన్= ఆసుచంద్రునిహృదయమందు; అత్తఱిన్=ఆసమయమందు; ఘటించెన్=ఘటిల్లఁజేసెను.

అనఁగా సుచంద్రునియొక్క మహాబలముగలకర మనెడు బలోత్కరము, అనఁగ సేనాబృందము జాణతనముతో త్రివళియను నిచ్చెనచేత నెక్కి ముట్టడించుతఱి కళవళ మందు చంద్రికాకుచము లను దుర్గమును ఆవరించి యం దున్న నాయక మణిని పట్టుకొని సుచంద్రునిచిత్తమునకు అత్యానందమును జేసె నని భావము. సుచంద్రునికరము దొలుతఁ ద్రివళిని స్పృశించి పిదప గుచముల నాక్రమించి యచ్చట నున్న నాయకరత్నమును స్పృశించి యత్యానందమును జేసె నని ప్రకృతాభిప్రాయము.

తే. అటులు నేత్రాహరణయుక్తిఁ నతిశయిల్లు
రాజమౌళికి నీవి కరస్థ మయ్యె
నైనపిమ్మటఁ దానె తదంగసీమ
యతనిఁ బొదివి సుఖించె సాంద్రానురక్తి. 130

టీ. అటులు=పూర్వోక్తప్రకారముగాను; నేత్రాహరణయుక్తిన్.—నేత్ర=వస్త్రముయొక్క, ఆహరణ=ఆకర్షణముయొక్క, యుక్తిన్=యోగముచేత, నేత్రాహరణ = నాయికాకర్షణముయొక్క, యుక్తిన్=సంబంధముచేత; అతిశయిల్లురాజమౌళికిన్ = అతిశయిల్లుచున్న సుచంద్రునకు, రాజశ్రేష్ఠునకు; నీవి=పోఁకముడి, మూలధనము, "నీవీపరిపణంమూలధన"మ్మని యమరము; కరస్థమయ్యెన్ =కరగతమాయెను. ఐనపిమ్మటన్=అయినవెనుక; తానె=తనంతటనె; తదంగసీమ.—తత్ =ఆచంద్రికయొక్క, అంగసీమ=శరీరప్రదేశము, ఆరాజుయొక్క అంగదేశమని యర్థాంతరము; అతనిన్=ఆసుచంద్రుని, ఆరాజును; పొదివి=పొంది, కప్పియనుట; సాంద్రానురక్తిన్.—సాంద్ర=దట్టమగు, అనురక్తిన్=అనురాగముచేతను; సుఖించెన్=సుఖపడెను.

అనఁగ, రాజును బట్టుకొని, అతిశయిల్లుచున్న రాజశ్రేష్ఠునకు మూలధనము కరస్థమయినపిదపఁ, దనంతటనె ఆరాజాంగదేశము అతనిఁ బొంది సుఖించె ననిభావము. వస్త్రా

కర్షిణము చేత నతిశయిల్లు సుచంద్రునకు బోఁకముడి కరగతమయినపిదపఁజంద్రిక యంగ ప్రవేశము సుచంద్రునిఁ జెంది సుఖించె నని ప్రకృతాభిప్రాయము.

తే. అపు డతర్కితసంప్రాప్త ♦ మగుపరస్ప
రాంగసాంగత్యసౌఖ్యంబు ♦ ననుభవించు
జంపతుల కెన్నఁ దత్త్రప ♦ సదృశయైన
యాళి యగుఁ గావె మఱి జగ ♦ త్పాళియందు. 131

టీ. అపుడు=ఆసమయమందు; అతర్కితసంప్రాప్తము=ఊహింపకయే వచ్చినది; అగు పరస్పరాంగసాంగత్యసౌఖ్యంబున్ = అగునట్టియొండొరులశరీరసంబంధమువలననైనసుఖము ను; అనుభవించుజంపతులకున్=ఉపభోగించుజాయాపతులకు; ఎన్నఁగన్=పరికింపఁగా; త త్త్రప=ఆచంద్రికయొక్కలజ్జ; మఱి = మఱియు; జగత్పాళియందున్ = జగత్సమూహమునం దు; సదృశయైనయాళి=అనుకూలయైనచెలికత్తె; అగుఁగాదె=అగునుగదా!

అనఁగ లజ్జవలన నతర్కితసంప్రాప్త మగునంగసాంగత్యసుఖంబు ననుభవించునీదంప తులకు నాలజ్జ చెలికత్తె యనఁదగదా యనిభావము.

మ. జలజాతాప్తకులావతంస మటఁ ద♦త్సారంగనేత్రాధర
చ్ఛలబింబీఫలచుంబనంబువలనన్ ♦ సద్యస్సముద్భూతపి
చ్ఛిలమోహాఢ్యుండయి చన్ను లంటి తగ నా♦శ్లేషంబు నూన్పం గన
త్పులకంబై యది చేసెఁ గంచుకభిద♦న్భూయస్త్రపాయుక్తిగన్. 132

టీ. జలజాతాప్తకులావతంసము=సూర్యవంశావతంసమగు సుచంద్రుఁడు;అటన్=అ టుపిమ్మట; తత్సారంగనేత్రాధరచ్ఛల బింబీఫలచుంబనంబువలనన్.—తత్సారంగనేత్రా=ఆ చంద్రికయొక్క, అధర=ఓష్ఠము నెడు, ఛల = వ్యాజముగల, బింబీఫల = దొండపండుయొ క్క, చుంబనంబువలనన్ = ముంబనమువలన; సద్యస్సముద్భూతపిచ్ఛిలమోహాఢ్యుండయి.—సద్యః= తత్కాలమందు, సముద్భూత=ఉదయించిన, పిచ్ఛిల=దట్టమైన, మోహాఢ్యుండయి = మోహము గలవాఁడై; చన్నులు=కుచములను; అంటి=స్పృశించి; తగన్=అనుకూలముగ ; ఆశ్లేషంబు= కౌఁగిలింతను; ఊన్పన్=చేయఁగ; కనత్పులకంబై.—కనత్=ప్రకాశించుచున్న, పులకంబై= పులకలుగలదై; అది=ఆకౌఁగిలింత; కంచుకభిదన్.—కంచుక=రవికయొక్క, భిదన్ = భేద మును; భూయస్త్రపాయుక్తిగన్=మరలలజ్జ గలుగునటులు; చేసెన్ = ఒనరించెను.

అనఁగ సుచంద్రుఁడు చంద్రికాధరచుంబనంబున గాఢ మగుమోహము గలవాఁడై పాలిండ్లఁబట్టి కౌఁగిలింపఁగ నాకౌఁగిలింత పులకలుగలిగించి మరల లజ్జవచ్చునటులు కంచు కమును భేదించెనని తాత్పర్యము.

చ. క్రమమున రాజమౌళి యెడ♦ గాననిధౌతపటంబు దీయఁ ద
త్కమలదళాక్షి బెగ్గడిలి♦ క్రమ్మఱ రాఁ గొను సారెసారెకున్
విమలపయస్తరంగతతి♦ వేమరు నేగుచు నాఁగుచుండఁగా
నమరెడు గాంగసైకతము♦నందమునన్ జఘనంబు మీఱఁగన్. 133

టీ. క్రమమునన్=క్రమముగా; రాజమౌళి=సుచంద్రుఁడు; ఎడగాననిధౌతపటంబున్=ఎడఁబాయనిధౌతవస్త్రమును; తీయన్=ఆకర్షింపఁగా; తత్కమలదళాక్షి= ఆచంద్రిక; బెగ్గడిలి=భయపడి; క్రమ్మఱన్=మరల; సారెసారెకున్=మాటిమాటికి; విమలపయస్తరంగతతి.— విమల=స్వచ్ఛమగు, పయః=ఉదకముయొక్క, తరంగ=తరఁగలయొక్క, తతి=సమూహము; వేమరున్=మాటిమాటికిని; ఏగుచున్=పోవుచు; ఆఁగుచుండఁగాన్ = అణఁగుచుండఁగా; అమరెడుగాంగసైకతము నందమునన్=ఒప్పుచున్న జాహ్నవీపులినముయొక్క సౌందర్యముచేత;జఘనంబు=కటిపురోభాగము;మీఱఁగన్=అతిశయింపఁగా; రాఁగొనున్=ఆకర్షించును.

అనఁగ సుచంద్రుఁడు చంద్రికయొక్క యెడఁబాయని వస్త్రమును దీయఁగా చంద్రిక భయపడి మాటిమాటికి వస్త్రము నాకర్షించుకొనఁగా, తజ్జఘనము, నిర్మలజలతరంగములు కప్పుచు నణఁగుచుండఁగా ప్రకాశించు గంగాపులినమువలెఁ బ్రకాశించెనని భావము.

సీ. చానచెక్కులిపేరి♦చంద్రఖండమున భా
స్వత్కరజక్షతి♦ వఱల నీక
జలజాక్షిగుబ్బగు♦బ్బలుల సద్వ్రజశ
యోన్నతసమ్మర్ద♦మొంద నీక
సతిరదనాంశుక♦చ్ఛలనుమానసవమున
నలరుద్విజావళి♦ నాన నీక
నెలఁతతనూపద్మి♦ని విగాఢదోషాను
బంధనిర్బంధంబుఁ♦ బడయ నీక

తే. తార్చెఁ బర్వంబు పక్షపా♦తంబుఁ గూర్చి
నుంచె నామోద మొసఁగెఁ బ♦ద్మోదయంబు
నంత సుమశస్త్రశాస్త్రర♦హస్యతత్వ
మదనభుండు సుచంద్రక్షి♦మావిభుండు. 134

టీ. అంతన్=అటుపిమ్మట; సుమశస్త్రశాస్త్రరహస్యతత్త్వమదనభుండు.—సుమశస్త్రశాస్త్ర=కామశాస్త్రముయొక్క,రహస్య=రహస్యముయొక్క,తత్త్వ=యథార్థమునందు,మదనభుం

డు=మన్మథుని సామర్థ్యమువంటి సామర్థ్యముగల;సుచంద్రక్ష్మావిభుండు=సుచంద్రభూపతి; చాన చెక్కిలిపేరిచంద్ర ఖండమునన్=చంద్రికయొక్క గండస్థలమను పేరుగల చంద్రఖండమునందు; భాస్వత్కరజక్షతిన్.—భాస్వత్=సూర్యునియొక్క, కరజ=కిరణమువలనఁగలుగు, క్షతిన్=ఉపద్రవమును; భాస్వత్=ప్రకాశించుచున్నట్టి, కరజ=నఖములయొక్క, క్షతిన్=ప్రహారమునని స్వభావార్థము;వఱలనీక=ప్రకాశింపనీయక;సూర్యకిరణప్రసారము గలిగినయెడఁజంద్రఖండమునకు క్షయముగలుగునని చెక్కిలియను చంద్రఖండమునకు భాస్వత్కరజక్షతి కలుగనీయఁడయ్యెనని భావము. జలజాక్షి గుబ్బగుబ్బలులన్=చంద్రిక స్తనములను పర్వతములయందు; సద్వజ్రశయోన్నతసమ్మర్దమే.—సత్=శ్రేష్ఠుఁడగు, వజ్రశయ=ఇంద్రునియొక్క, ఉన్నత ఎచ్చైన, సమ్మర్దము=రాయిడిని; సత్=శ్రేష్ఠమయిన, వజ్ర=వజ్రరేఖగల, శయ=హస్తముయొక్క, ఉన్నతసమ్మర్దమునని స్వభావార్థము; ఒందనీక=పొందనీయక; పర్వతములకు ఇంద్రునిరాయిడి తగిలినచో నాశముగలుగును గావున గుబ్బగుబ్బలులకు వజ్రశయసమ్మర్దముగలుగనీయఁడయ్యెనని భావము. సతిరదనాంశుకచ్ఛలసుమాసవమునన్.—సతి=చంద్రికయొక్క, రదనాంశుక=అధరమను, ఛల=వ్యాజముగల, సుమాసవమునన్=పూఁదేనియయందు:అలరుద్విజావళిన్=ఒప్పుచున్న భృంగపంక్తిని, ఒప్పుచున్నదంతపంక్తినని స్వభావార్థము; ఆననీక=త్రాగనీయక, తగులనీయకని స్వభావాభిప్రాయము. పూఁదేనియ భృంగములాని నచోఁదఱిఁగిపోవునని రదనాంశుక సుమాసవమున ద్విజావళి వాన నీయఁడయ్యెనని భావము. నెలఁతతనూ పద్మినిన్=చంద్రికయొక్క దేహమను పద్మలతను; విగాఢదోషానుబంధ నిర్బంధంబున్.—విగాఢ=అధికమగు, దోషా=రాత్రియొక్క, అనుబంధ=సంబంధముచేతఁగలుగు, నిర్బంధంబున్=కష్టమును; విగాఢ=అధికమగు,దోషా=బాహువులయొక్క,అనుబంధ=సంబంధముచేఁగలుగు, నిర్బంధంబున్=కష్టమునని స్వభావార్థము; పడయనీక=పొందనీయక; రాత్రిసంబంధముగలిగినయెడఁ దామరతీఁగ కాంతిహీనమగునని చంద్రికాశరీర పద్మలతకుదోషానుబంధనిర్బంధముగల్గింపఁడయ్యెనని భావము. ఈ సీసము నాలుగు చరణములకును పైగీతమునందలి వాక్యములకును యథాసంఖ్యముగ నన్వయము.పర్వంబు=పున్నమయు,ఉత్సవమును;తార్చెన్=కలిగించెను. చెక్కిలిచంద్రఖండ మువూర్ణముగాఁ బ్రకాశించునట్లు పున్నమకల్గించెనని భావము, చంద్రికకుత్సవముగలిగించెనని స్వభావాభిప్రాయము. పక్షపాతంబు = రెక్కలపడుటను, ప్రీతిని; కూర్చెన్=కలిగించెను, గుబ్బగుబ్బలులకు సుఖముగాఁ బక్షపాతము కలిగించెనని భావము, చంద్రికకు ప్రీతికలిగించెనని స్వభావాభిప్రాయము. ఆమోదము=పరిమళమును, సంతోషమును; ఉంచెన్=కలిగించెను, అధరసుమాసవమునకామోదము కలిగించెనని భావము, సంతోషము కలిగించెనని స్వభావాభిప్రాయము. పద్మోదయంబు=కమలములయావిర్భావమును, కాంతియొక్క యతిశయమును; ఒసఁగెన్ =ఇచ్చెను, చంద్రికాశరీరమునందుఁబద్మోదయము నిచ్చెననఁగా, చంద్రిక మేని కధికకాంతి కలుగునట్లు గావించెనని స్వభావాభిప్రాయము.

ఈచంద్రుఁడు సుకుమారాంగియగు చంద్రికను [illegible] చతురుండు [illegible] [illegible] కల్పించెనని భావము.

తే. అతనుశాస్త్రవిభేదంబు ♦ నాదిఁ గాంచి
యంత నద్వయభావనా♦యత్తవృత్తి
నలరి తత్ప్రియసాయుజ్య ♦ మంది పొందె
ననదృశానందమయత న♦బ్జాక్షి యపుడు. 135

టీ. అతనుశాస్త్ర విభేదంబు.—అతను=మరునియొక్క, శాస్త్ర=శస్త్రసంఘమువలన, విభేదంబు=భేదమును; ఆదిన్=మొదట; కాంచి=చూచి; అతను=అధికమగు, శాస్త్రములయొక్క, విభేదంబు=పరస్పరభేదప్రకారము నని యర్థాంతరము దోఁచుచున్నది. అంతన్=అపిమ్మట; అద్వయభావనాయత్తవృత్తిన్.—అద్వయభావనా=అభేదభావనయందు, ఆయత్త=స్వాధీనమగు, వృత్తిన్=వ్యాపారముచేత; అలరి=సంతసించి; తత్ప్రియసాయుజ్యము.—తత్ ప్రియ=ఆప్రియుఁడగు సుచంద్రునియొక్క, సాయుజ్యము=సాంగత్యమును; అంది=పొంది; తత్ప్రియ=ఆయద్వితీయబ్రహ్మముయొక్క, సాయుజ్యము=ఐక్యమును; అంది=పొందియని యర్థాంతరము; ఇచట "అస్తి భాతి ప్రియం రూపం నామ చేత్యంశపఞ్చకమ్। అద్యత్రయం బ్రహ్మరూపం మాయారూప మతోద్వయమ్" అనెడి వార్తికముచేత ప్రియశబ్దవాచ్యము పరబ్రహ్మము; అపుడు=ఆసమయమందు; అబ్జాక్షి=చంద్రిక; అనదృశానందమయతన్.—అనదృశ=సరిలేని, ఆనందమయతన్ = సంతోషప్రాచుర్యమును, మోక్షమునని యర్థాంతరము ; పొందెన్ = పొందెను.

అనఁగ నాచంద్రిక మొదట మదనబాణప్రహారములను పొంది పిదప నభేదభావనాయత్తవృత్తిచే నాశ్రయించి పిమ్మట ప్రియసాయుజ్యము నొంది బ్రహ్మానందతుల్యమగు నానందమును పొందెనని భావము. అర్థాంతరమునకు భావము స్పష్టము.

చ. తొలుత దృశావిలాసములు ♦ తోరపుటాననవిభ్రమంబు ల
వ్వల నటుమీఁద నావయవ ♦ వైఖరులుం గనుపట్ట నాన యం
బలుతెర నారతిస్ఫురులు ♦ వట్టి సడల్పఁ గ్రమంబున న్వధూ
తిలకము రాజమౌళికి ముదిస్మద మానిచె నర్తకీగతిన్. 136

టీ. తొలుతన్=మొదట; దృశావిలాసములు=దృగ్విలాసములును; అవ్వలన్=ఆమీఁద; తోరపుటాననవిభ్రమంబులు=అధికమగు ముఖవిలాసములును; అటుమీఁదన్; ఆవయవవైఖరులున్=అవయవసంబంధరీతులును, అంగాభినయములని యర్థాంతరము; కనుపట్టన్=చూపట్టుచుండఁగ; నానయంబన్=సిగ్గనెడు; బలుతెరన్=అధికమగు కాండపటమును; అరతిస్ఫురులు=అరతిస్ఫూర్తులు; వట్టిసడల్పన్=వట్టిసడలింపఁగ; క్రమంబునన్=క్రమముగ; అవ్వధూతిలకము=ఆచంద్రిక; రాజమౌళికిన్=సుచంద్రునకు; నర్తకీగతిన్=నటివలె; ముదిన్=సంతోషముచే; మదము=సంతోషమును; ఒసఁగెన్=ఒసరించెను;

క. కంతుకలాపారగ మగు, స్వాంతమునం దిటులు రాగ•వల్లిక మెఱయన్
గాంతుఁడు కాంతావాళికి, నెంతయు సంతసమునూన్చె•హితనవరతులన్.

టీ. కంతుకలాపారగము.—కంతుకలా=మన్మథవిద్యయొక్క, పారగము = అంతము నొందినది; అగుస్వాంతమునందున్ = అగునట్టిమనమునందు; ఇటులు=ఈప్రకారముగ; రాగవల్లిక=అనురాగమనుతీవ; మెఱయన్=ప్రకాశింపఁగ; కాంతుఁడు=సుచంద్రుఁడు; కాంతావళికిన్=చంద్రికకు; ఎంతయున్=మిక్కిలి; హితనవరతులన్=హితమగు నూతన సురతములచేత; సంతసమును=సంతోషమును; ఊన్చెన్=చేసెను.

సీ. మంజులాహీనహా• ర్మ్యప్రదేశంబుల
శుచిగరుత్మల్లీలఁ • జూచికొనుచుఁ
గలధౌతమయశై ల•కందరాస్థలుల మ
హానందిహారిలీల • లరసికొనుచు
సుమనోనివాసభా • సురనగాగ్రములందు
దివ్యసారంగాభ • దెలిసికొనుచుఁ
బుష్కరవీథులఁ • బొలుపొందు నేకచ
క్రరథవిస్ఫూర్తిని • గాంచికొనుచుఁ

తే. గమల దైత్యారి శర్వాణి • కమలవైరి
ధారి పౌలోమి యుర్వరా • ధరవిదారి
ఛాయ హారి యన నలరిరి • సకలకాల
సముచితాఖేలనంబుల • నతియుఁ బతియు. 138

టీ. మంజులాహీనహార్మ్యప్రదేశంబులన్.—మంజుల=మనోజ్ఞమగు, అహీన=శేషుఁడనెడి, హార్మ్యప్రదేశంబులన్=మేడలయొక్క ప్రదేశములయందు; శుచిగరుత్మల్లీల.—శుచి=పరిశుద్ధమగు, గరుత్మత్=గరుడునియొక్క, లీల = విలాసమును; మంజులమగు, అహీన = అధికమగు, హార్మ్యప్రదేశములయందు, శుచి = శుభ్రమగు, గరుత్మత్ = కపోతాదులయొక్క, లీలవని ప్రకృతార్థము; చూచికొనుచున్ = చూచుచు; కలధౌతమయశైలకందరాస్థలులన్.— కలధౌతమయశైల = కైలాసముయొక్క, "కలధౌతంరూప్యహేమ్నోః" అని యమరుఁడు, కందరాస్థలులన్ = గుహలయందు; మహానందిహారిలీలలు.—మహానంది = అధికమగు వృషభమనెడి, హారి = అశ్వముయొక్క, లీలలు = చేష్టలను; అరసికొనుచున్ = విచారించికొనుచు; కలధౌతమయశైల = బంగరుకొండయొక్క, కందరాస్థలులయందు, మహానందిహారిలీలలు = మిగుల నానందముగల చిలుకల

యొక్క విలాసములనని ప్రకృతార్థము; సుమనో నివాసభాసుర నగాగ్రములందుఁ = దేవతాస్థానమగు ప్రకాశమానమగు మేరువుయొక్క అగ్రములందు; దివ్యసారంగాభ.— దివ్యసారంగ = ఐరావతముయొక్క, ఆభ = కాంతిని; తెలిసికొనుచుఁ = తెలియుచు; పుష్పములకు నివాసమై, భాసురమైన, పర్వతాగ్రములందు, మనోహరమగు, సారంగాభఁ = తుమ్మెదకాంతిని, తెలిసికొనుచు నని ప్రకృతార్థము; పుష్కరవీథులఁ = ఆకాశమార్గములయందు; పొలుపొందు నేక చక్రరథవిస్ఫూర్తిని.—పొలుపొందు = ఒప్పుచున్న, ఏకచక్రరథ = ఒంటికంటి రథముయొక్క, విస్ఫూర్తిఁ = ప్రకాశమును; కాంచికొనుచుఁ = చూచుచు; పుష్కరవీథులఁ = జలమార్గములయందు; పొలుపొందుచున్న, ఏకచక్రరథవిస్ఫూర్తిఁ.—ఏక = ముఖ్యమగు, చక్ర = జక్కవలయొక్క, రథ = శరీరములయొక్క, విస్ఫూర్తిని గాంచికొనుచు నని ప్రకృతార్థము; కమలదైత్యారి = లక్ష్మీ నారాయణుఁడు; శర్వాణీకమలవైరిధారి=రుద్రాణిరుద్రుఁడు; పౌలోమియుర్వరాధరవిదారి=ఇంద్రాణియు నింద్రుఁడును; ఛాయహరి=ఛాయాదేవిసూర్యుఁడు; అనఁ=అనునటులు; పతియుఁ పతియు = చంద్రికయు నుచంద్రుఁడు; సకలకాలసముచితాఖేలనంబులఁ.—సకలకాల=సమస్తకాలములకు, సముచిత = అనుకూలమగు, ఆఖేలనంబులఁ = విహారములచేత; అలరిరి=సంతసించిరి.

అనఁగ నీచంద్రికాసుచంద్రులు లక్ష్మీనారాయణులో యనునట్లు అహీనపార్శ్వప్రదేశములయందు గరుత్మల్లీలను చూచుచు, రుద్రాణీరుద్రులో యనునట్లు కలధౌతశైలకందరములయందు మహానందివారిలీలలు చూచుచు, ఇంద్రాణీంద్రులో యనునట్లు సుమనోనివాసభాసురనగాగ్రములయందు సారంగాభలఁ దెలిసికొనుచు, ఛాయాదేవీ సూర్యులో యనునట్లు పుష్కరవీథులయందు ఏకచక్రరథవిస్ఫూర్తిని గాంచికొనుచు,సర్వకాలముల కనుకూలములగు విహారంబులచే సంతసించి రని భావము.

సీ. ఆధరాధిపు యశో♦హారి జగత్తటి ప్రాల
నుడిగె ఘనాఘనా♦భ్యుదయలీల
లామహీభృతుధామ♦ధామనిధిస్ఫూర్తి
ధరఁ దూలె శార్వర♦పరవిభూతి
యారాజువితరణ♦భూరిభూరిజలాళిఁ
జనె దుర్గదుర్గతి♦శాదపటిమ
హూర్తసాపతితర♦వారివారిద రేఖ
నడఁగె శాత్రవహంస♦హంసపాళి

తే. య్యాసుచంద్రుఁడు ధర్మంబు ♦ నాశ్రయించి
నీతి దయివాఱఁ గాంచి య♦నీతి నొంచి

యరిది జగ మెల్లఁ బాలించు•నపుడు సకల
జనులు శుభసమ్మదస్ఫూర్తి • మనిరి వేడ్కఁ. 139

టీ. అధరాధిపుయశోహాని.—ఆసుచంద్రునియొక్క యశమను సింగము; జగత్తటిన్=జగమనుకొండచఱియందు; వ్రాలన్=పడఁగ; ఘనాఘనాభ్యుదయలీల.—ఘనాఘన=ఘాతుకులను మత్తగజములయొక్క, "ఘనాఘనా ఘాతుకమత్తదన్తినా" అని విశ్వము, అభ్యుదయ=అభివృద్ధియొక్క, లీలలు=విలాసములు; ఉడిగెన్=ఉపశమించెను; సుచంద్రునియొక్క యశము జగత్తును గప్పుకొనఁగ దుర్మార్గులుసళించిరనిభావము. అమహీభృతుధామధామనిధిస్ఫూర్తిన్.—అమహీభృతు=ఆసుచంద్రునియొక్క, ధామ=ప్రతాపమనెడు, ధామనిధి=సూర్యునియొక్క, స్ఫూర్తిన్=ప్రకాశముచేత; ధరన్=పుడమియందు; శార్వరవిభూతి.—శార్వర = అంధతమసమనెడు, ఘాతుకులయొక్క, పర=ఉత్కృష్టమగు, భూతి=సంపద; తూలెన్=పడెను. "శార్వరంత్వంధతమసే ఘాతుకేతు పుమానయం" అని హలాయుధుఁడు, సుచంద్రుని ప్రతాపమనెడు రవి ప్రకాశముచేత; దుష్టులను చీఁకటులు, తూలెనని భావము. ఆరాజు వితరణభూరిభూరిజలాళిన్.—ఆరాజు=ఆసుచంద్రునియొక్క, వితరణ=త్యాగముయొక్క, భూరి=అధికమగు, భూరి=సువర్ణమనెడు, జల=ఉదకముయొక్క, ఆళిన్=శ్రేణిచేత; దుర్గదుర్గతికాదపటిమము.—దుర్గ=పోనలవిగాని, దుర్గతి=దారిద్ర్యమనెడు, కాద=బురదయొక్క, "పంకోస్త్రీ శాదకర్దమౌ" అని యమరుఁడు" పటిమము=సామర్థ్యము; చనెన్=పోయెను. ఈసుచంద్రుని త్యాగసంబంధియగు సువర్ణమనెడు జలముచేత దారిద్ర్యమనెడు బురద నివర్తిల్లెనని భావము. అరసాపతితరవారివారిదరేఖన్.—అరసాపతి=ఆసుచంద్రునియొక్క, తరవారి=కత్తియనెడు, వారిదరేఖన్=మేఘపంక్తిచేత; శాత్రవహంసహంసపాళి.—శాత్రవహంస=శత్రుశ్రేష్ఠులనెడు, హంసపాళి=అంచలగుంపు; అడఁగెన్=ఉపశమించెను, చంద్రునియొక్క కత్తియనెడు మేఘపంక్తిచే శత్రువులను హంస లడంగెనని భావము. ఆసుచంద్రుఁడు ; ధర్మంబున్=ధర్మమును ; ఆశ్రయించి=పొంది; నీతి=రాజనీతిమొదలగు నీతి; దైవాఱన్=అతిశయించునట్టులు; కాంచి=పొంది; అనీతిన్=దుర్నీతిని; పొంచి=పోఁగొట్టి; అరిది=చిత్రముగ; జగమెల్లన్=లోకమంతయు; పాలించునపుడు = రక్షించునపుడు; సకలజనులు = సమస్తనరులు; శుభసమ్మదస్ఫూర్తిన్ = మంగళప్రయుక్తమగుసంతోషాతిశయముచేత ; వేడ్కన్=వేడుకచేత ; మనిరి=వర్తించిరి.

సుచంద్రుఁడు ధర్మనిష్ఠుఁడై నీతితో జగంబును పాలించుచుండఁగ శుభసంతోషములతో నెల్లపుడు జనులు వర్తించిరని భావము.

క. అని రోమహర్షణాత్మజుఁ, డనఘ మఖండైకచరిత • మంతయుఁ దెలుపన్
విని శౌనకాదిమునిచంద్రనికాయము గాంచె నధిక•తరహర్షంబున్. 140

టీ. అని=పూర్వోక్తప్రకారముగాను; రోమహర్షణాత్మజుఁడు=సూతుఁడు; అనఘము=పాపరహితమైన; అఖండైకచరితము.—అఖండ=విచ్ఛిత్తిలేనట్టి, ఏక=ముఖ్యమగు, చరితము=సు

చంద్రచరితమును; అంతయుఁ=పూర్ణముగ; తెలుపఁ = తెలియఁజేయఁగ; శౌనకాదిముని చంద్రనికాయము=శౌనకాదిముని శ్రేష్ఠులయొక్క సమూహము; విని=విన్నదై ; అధికతరహర్షంబుఁ=అధికసంతోషమును; కాంచెఁ=పొందెను.

అనఁగ సూతుండు శౌనకాదిమునుల కెల్ల సుచంద్రచరితంబు వివరింపఁగ నామునులు విని మిక్కిలి సంతసించిరని భావము.

మ. పరవిద్రావణ రావణప్రబలహృ♦త్పత్త్రీశ పత్త్రీశభా
స్వరయానక్రమ నక్రమర్దనవిధా♦సచ్చక్ర సచ్చక్రసం
భరణశ్రీధర శ్రీధరప్రభుమహా♦పర్యంక పర్యంకదు
స్తరసాళ్వాదన వాదనప్రమదవ♦త్సత్యాత్మ సత్యాత్మకా. 141

టీ. పరవిద్రావణ=శత్రువులను పాఱఁదోలెడివాఁడా ! రావణప్రబల హృత్పత్త్రీశ.—రావణ=రావణాసురునియొక్క, ప్రబల=సామర్థ్యమును, హృత్=హరించిన, పత్త్రీశ=బాణశ్రేష్ఠములుగలవాఁడా ! పత్త్రీశ భాస్వరయానక్రమ.—పత్త్రీశ=గరుడుఁడను, భాస్వర=ప్రకాశించుచున్న, యాన=వాహనముచేత, క్రమ=సంచారముగలవాఁడా ! నక్రమర్దనవిధాసచ్చక్ర.—నక్ర=మొసలియొక్క, మర్దనవిధా=ఖండనవిధియందు, సత్=శ్రేష్ఠమగు, చక్ర=సుదర్శనముగలవాఁడా ! సచ్చక్రసంభరణశ్రీధర.—సచ్చక్ర=సత్పురుష సంఘముయొక్క, సంభరణ=పోషించుటయొక్క, శ్రీ=సిరిని, ధర=ధరించినవాఁడా ! శ్రీధరప్రభుమహాపర్యంక.—శ్రీధరప్రభు=శేషుఁడే,మహాపర్యంక=గొప్పశయ్యగాఁగలవాఁడా ! పర్యంకదుస్తరసాళ్వాదన.—పర్యంక=యుద్ధమందు, దుస్తర=దుస్తరుఁడగు, సాళ్వ=సాళ్వరాజునకు, అదన=అంతకుఁడగువాఁడా ! వాదనప్రమద వత్సత్యాత్మ.—వాదన=వచనముచేతఁగలిగిన, ప్రమదవత్=సంతసముగల, సత్యాత్మ = సత్యభామయొక్క హృదయముగలవాఁడా ! సత్యాత్మకా= సత్యస్వరూపుఁడా !

క. గణనాతిగాప్తరక్షణ, క్షణదాంబుజినీకళత్ర♦సారసవైరీ
క్షణ వృజినకూటతక్షణ, క్షణఖండితనిర్జరారి♦ఘనసైన్యగణా. 142

టీ. గణనాతిగాప్తరక్షణ.—గణనాతిగ=లెక్కకుమీఱిన, ఆప్త=ఇష్టులను, భక్తులననుట, రక్షణ = రక్షించువాఁడా! క్షణదాంబుజినీకళత్రసారసవైరీక్షణ.— క్షణద = ఉత్సవమునిచ్చెడి, అంబుజినీకళత్ర=సూర్యుఁడు,సారసవైరి=చంద్రుఁడు, ఈక్షణ=నేత్రములుగాఁగలవాఁడా! వృజినకూటతక్షణ.—వృజినకూట=పాపసమూహములను,తక్షణ=ఖండించువాఁడా ! క్షణఖండితనిర్జరారిఘనసైన్యగణా —క్షణ=క్షణమాత్రమందు,ఖండిత=నఱకఁబడిన,నిర్జరారి=రాక్షసులయొక్క, ఘన = అధికమగు, సైన్యగణా = సేనావ్యూహముగలవాఁడా !

మాలిని. శకటదనుజభీమా ♦ క్షాళితాఘౌఘనామా
వికటబకవిరామా ♦ విశ్వసంపూర్ణధామా

స్వకపరినుతసోమా ♦ శక్రకోటీరధామా
వికలచరణసీమా ♦ విద్విషద్ధ్వాంతభామా. 143

టీ. శకటదనుజభీమా = శకటాసురునకు భయంకరుఁడగువాఁడా! క్షాళితాఘౌఘనామా.—క్షాళిత=పోఁగొట్టఁబడిన, అఘౌఘ=పాపసంఘములుగల, నామా=పేరుగలవాఁడా! వికటబకవిరామా.—వికట=దుష్టుఁడగు, బక=బకాసురుని, విరామా=అంతమునొందించినవాఁడా! విశ్వసంపూర్ణధామా.—విశ్వ=ప్రపంచమందు, సంపూర్ణ=నిండిన, ధామా=తేజస్సుగలవాఁడా! స్వకపరినుతసోమా.—స్వక=తనచేత, పరినుత=స్తుతింపఁబడిన, సోమా=శంకరుఁడుగలవాఁడా! లేదా, తన్ను స్తుతించిన శంకరుఁడుగలవాఁడా! శక్రకోటీరధామావికల చరణసీమా.—శక్ర=ఇంద్రునియొక్క, కోటీర=కిరీటముయొక్క, ధామ=కాంతిచేత, అవికల=ఎడఁబాయని, చరణసీమా=పాదప్రదేశముగలవాఁడా! విద్విషద్ధ్వాంతభామా.—విద్విషత్=శత్రువులను, ధ్వాంత=చీఁకటులకు, భామా=సూర్యునివంటివాఁడా!

గద్యము. ఇది శ్రీమదనగోపాల ప్రసాదసమాసాది తోభయభాషాకవిత్వ
కళాకళత్ర రేచెర్లగోత్రపవిత్ర సురభిమల్లక్ష్మాపాలసత్పుత్ర
కవిజనవిధేయ మాధవరాయ ప్రణీతం బైనచంద్రికా
పరిణయం బనుమహాప్రబంధంబునందు

సర్వంబును

షష్ఠాశ్వాసము.

---

గద్యము. ఇది శ్రీసతీరమణకరుణాసమాసాదితసర్వసౌభాగ్య భాగ్యనగర మహారాజ్య
సంకలిత శ్రీజటప్రోలు సంస్థానప్రాజ్యసకలసామ్రాజ్య శ్రీరేచెర్ల గోత్రపవిత్ర
కవిజనగేయ శ్రీ వేంకటజగన్నాథరాయ సత్పుత్త్రి సత్సంప్రదాయ
శ్రీసురభి వేంకటలక్ష్మణరాయ పరిపోష్య సరసవైదుష్య తదా
స్థానతలమండిత శేషసదాశివపండిత విరచిత శర
దాగమ సమాఖ్య వ్యాఖ్యయందు

సర్వంబును

షష్ఠాశ్వాసము.



| పేజీ. | పంక్తి. | అశుద్ధము. | శుద్ధము. |
|---|---|---|---|
| 615 | 27 | ఆయ్యజ్ఞ | అయ్యబ్జ |
| 618 | 16 | సర్గమం | స్వర్గమం |
| 622 | 6 | ఆభయంబు | అభయంబు |
| 623 | 23 | అదువలన | అందువలన |
| 641 | 13 | నక్రవర్ధన | నక్రమర్దన |

| పంక్తి. | అశుద్ధము. | శుద్ధము. |
|---|---|---|
| 29 | చలువర్యైవ | చలువర్యైన |
| 2 | సెలప్పై | సెలవై |
| | స్థానిమై | స్థానమై |
| 16 | మాసము | మానము |
| 22 | ఆగ్ని | అగ్ని |
| 8 | లయిన | లయిన |
| 27 | ఆరామకుజ | ఆరామముజ |
| 8 | ఆధర | అధర |
| 15 | నమృద్ధి | సమృద్ధి |
| 30 | పామర్థ్యశ్రీ | సామర్థ్యశ్రీ |
| 6 | గాసార్య | గాసార |
| 12 | గలదాయనుట | గలదానాయనుట |
| | పంచమాశ్వాసము. | |
| 20 | అసురనిదారి | అసురవిదారి |
| 29 | శేష్ఠ | శ్రేష్ఠ |
| 26 | ఇత్యుమరః | ఇత్యమరః |
| 25 | జృంభకొందు | జృంభమాణొందు |
| 28 | త్ర్పకాశమాన | త్ప్రకాశమాన |
| 2 | యస్సాస్సా | యస్యాస్సా |
| 31 | అపకవీయ | అప్పకవీయ |
| 21 | ధావము | భావము |
| 17 | తెఱంగుక న | తెఱంగునక |
| 30 | సరరీజాత | సరసీజాత |
| 21 | ముత్రుండు | మిత్రుండు |
| 18 | పోషింపడు | పోషింపఁబడు |
| 28 | ద్ధిఁబొందుచు | వృద్ధిఁబొందుదు |
| 20 | స్త్రీదృష్టిచే | స్త్రీ)దృష్టిచే |
| 22 | కాల్చియగ్ని | కాల్చునగ్ని |
| 24 | స్చరిత్ర | సచ్చరిత్ర |
| 30 | ఘలీకులల | ఘులీకుల |
| 29 | మీఁద | ఈమీఁద |
| 27 | శుభ్రప్రద | శుభప్రద |
| 24 | వేడుక | వేడుకలు |
| 29 | కడమికీ | కడిమికీ |

| పేజీ. | పంక్తి. | అశుద్ధము. | శుద్ధము. |
|---|---|---|---|
| | | **షష్ఠాశ్వాసము.** | |
| 548 | 9 | లలామ యపుడు | లలామమపుడు |
| | 16 | లలామ | లలామము |
| | 23 | [redacted] | నగరీ లలామము |
| | 28 | అద్రిబిలా | అద్రిగుహా |
| 552 | 30 | సమూహాముక్క | సమూహాముయొక్క |
| 553 | 20 | జయాస్త్రికై | జయాప్తికై |
| 554 | 17 | యర్ధాంతరము | యర్థాంతరము |
| 556 | 9 | చిరురాకు | చిగురాకు |
| 557 | 4 | భక్తివిన్నము | భక్తివిన్నపముకా |
| 558 | 3 | మాతనమైన | నూతనమైన |
| | 20 | మపార | మసార |
| | 23 | మెంక్గల | మొగ్గల |
| 559 | 6 | పసపు | పసుపు |
| | 23 | ధాను | ధామ |
| 560 | 7 | ఆక్షీణ | అక్షీణ |
| 561 | 21 | నౌవర్పక | నౌనర్పక |
| 567 | 12 | మయగు | మయమగు |
| 569 | 24 | మాఘ్యావల్లి | మాఘ్యవల్లి |
| 571 | 26 | సురచిర | సురుచిర |
| 572 | 5 | ధిమిర్ధిమి | ధిమిద్ధిమి |
| 573 | 6 | పోషకముగు | పోషకమగు |
| 574 | 8 | విరాహరూప | వివాహరూప |
| 576 | 12 | యొడ్క | యొక్క |
| | 17 | వలయంబులులు | వలయంబులు |
| | 21 | భ్రమయంత్ర | భ్రమణయంత్ర |
| 577 | 3 | అయథో | ఆయథో |
| 579 | 5 | భావవరీ | భావభావనానరీ |
| | 12 | అవాఙ్మనస | అవాఙ్మనస |
| 580 | 14 | కలియుఁగా | కవియుఁగా |
| 584 | 21 | దీకి | దీనికి |
| 597 | 6 | అడము లేని | అడ్డము లేని |
| 603 | 1 | శచేదేవి | శచీదేవి |
| 608 | 7 | సమనః | సుమనః |
| 612 | 10 | చరసేవ | చరణసేవ |

# శుద్ధాశుద్ధపత్రము.

## ప్రథమాశ్వాసము.

| పేజీ. | పంక్తి. | అశుద్ధము. | శుద్ధము. |
|---|---|---|---|
| 2 | 23 | భవేత్స | భజేత |
| 10 | 30 | ఆహాతి | అహూతి |
| 11 | 2 | భాఃప్రభావే | భాప్రభావే |
| 36 | 13 | ఆనుభావుక్ | అనుభావుక్ |
| 44 | 9 | ఆపహ | అపహ |
| 46 | 8 | ఆమృత | అమృత |
| 56 | 17 | ఆకార | అకార |
| 73 | 21 | రచనార్థశోభా | రచనాశోభా |
| 95 | 1 | నంతతి | సంతతి |
| 96 | 21 | సుభ్రమద | విభ్రమద |
| 99 | 29 | బోలియున్నదనియు | బోలియున్నవనియు |
| 104 | 14 | ఆదరమున | ఆదరమున |
| 123 | 16 | తురంగరవ | తుంగరవ |
| | 17 | తురంగరవ | తుంగరవ |
| 124 | 19 | ఆకారముగల | అకారముగల |

## ద్వితీయాశ్వాసము.

| పేజీ. | పంక్తి. | అశుద్ధము. | శుద్ధము. |
|---|---|---|---|
| 148 | 17 | పుష్పఫలసంపదచేత | పుష్పసంపదచేత |
| 149 | 34 | మధ్యగంధో | మద్యగంధో |
| 151 | 13 | రత్నంబైనకుముదుండు | రత్నంబు |
| 152 | 17 | యనధ్వని | యనుధ్వని |
| 153 | 23 | వికసన్మణి | వికనన్మణి |
| 154 | 23 | ఒయ్యనొయ్యనపొన్న | ఒయ్యనొయ్యనఁబొన్న |
| 155 | 4 | ఒయ్యనొయ్యన | ఒయ్యనొయ్యనక్ |
| 171 | 3 | శిఖ్రిముగ | తిన్నగ |
| 180 | 5 | మంకెన | కడిమి |
| | 29 | దిచిల్కల | ఁజిల్కల |
| 183 | 21 | ఘంటివంటి | ఘంటవంటి |

| పేజీ. | పంక్తి. | అశుద్ధము. | శుద్ధము. |
|---|---|---|---|
| 195 | 9 | రిప్పనమగ | రిప్పనిమగ |
| 200 | 12 | ఘుట్టిల్లనుగాని | ఘుటిల్లనుగాని |
| | | యఘుప్రదము | యఘుప్రదము |
| | 13 | ఘుట్టిల్లనని | ఘుటిల్లనని |
| | 23 | అవ్యయముమీద | అవ్యయమువిూఁద |
| 207 | 5 | షనస్థైస్ర్యంబు | మనస్థైర్యంబు |
| | 22 | బొనరించున్న | బొనరించుచున్న |
| 208 | 25 | మొదలగునవి | మొదలగునవి |
| | 27 | మొదగునవి | మొదలగునవి |
| | 30 | కాకాక్ష | కాఁగాక్ష |

## తృతీయాశ్వాసము.

| పేజీ. | పంక్తి. | అశుద్ధము. | శుద్ధము. |
|---|---|---|---|
| 226 | 28 | సకినులదోడల | సకినుందోడల |
| 231 | 22 | కావ్యవహారము | కావ్యవ్యవహారము |
| | 25 | హస్తిహస్తములు | హస్తిహస్తనికరంబులు |
| | 26 | తొండములు | తొండములగుంపులు |
| 233 | 8 | తపసాపతపంబు | తపసాతపంబు |
| | 26 | అనఁగా | అనఁగా |
| 237 | 19 | రూగముగా | రూపముగా |
| 238 | 26 | రంధ్రిమువలె | రంధ్రములె |
| 239 | 20 | మొర్గలు | మొగ్గలు |
| 246 | 21 | మగుయు | ముగుటయు |
| 253 | 28 | ధృతి॥ | ధృతిః |
| 254 | 23 | చకోరంబుబు | చకోరంబులు |
| | 32 | భవంత్యేతే | భవంత్యేతా |
| 259 | 29 | అనఁగా | అనఁగా |
| | 29 | సూర్యుఁడే | సూర్యుఁడే |
| 260 | 5 | అనఁగా | అనఁగా |
| | 6 | స్వేదో | స్వేదో |
| 263 | 13 | నపుడం | నపుడు |
| 264 | 23 | కుకరమ్యు | కరమ్యు |
| 266 | 11 | సౌంద్యము | సౌందర్యము |
| | 18 | శ్లత్ష | శ్లక్ష్ణ |
| 269 | 17 | వాలకమ్మురా | వాలకమ్ములా |

| పంక్తి. | అశుద్ధము. | శుద్ధము. |
|---|---|---|
| 1 | పామర్థ్యము | సామర్థ్యము |
| 2 | విరించను | విరించను |
| 20 | క్షాపచంద్రుండిలన్ | క్ష్మాపచంద్రుండిలన్ |
| 17 | ధ్వని | ధ్వని |
| 19 | స్నాతానమ్ | స్నాతానవన్ |
| 28 | వికాసరూవ | వికాసరూప |
| 15 | అన్యోన్యవ్య | అన్యోన్యాన్య |
| 27 | అనియ | అనియు |
| 17 | పూర్వాసురాగాఖ్యో | పూర్వానురాగాఖ్యో |
| 3 | కరమునని | కరములని |
| 25 | అనుచున్ | అనుచున్ |
| 30 | సన్నుతించవన్ | సన్నుతింపన్ |
| 24 | సుచద్రుని | సుచంద్రుని |
| 14 | చేయున్న | చేయుచున్న |
| 1 | సురాపాళి | సురారిపాళి |
| 16 | ఆమిత | అమిత |
| 1 | శివునిర్తన | శివునివర్తన |
| 26 | విరేకులు | రావిరేకులు |
| 24 | రారావి | రావి |
| 22 | రథముదు | రథముముందు |
| 6 | పంచమర | పంచచామర |
| 4 | సమయముప | సమయమున |
| 3 | మొకశూలము | మొకశూలము |
| 9 | ఒక్క శూలము | ఒకశూలము |
| 33 | అధకమగు | అధికమగు |
| 20 | గంధర్వపతులు | గంధర్వసతులు |
| 1 | సూతసూర్య | నూతనసూర్య |
| | చతుర్థాశ్వాసము. | |
| 22 | స్వరవ్యఞ్జన [పతి. | స్వరవ్యఞ్జన |
| 25 | ఇట్లనుచు; భూవిభుండు సుచంద్రభూ | ఇట్లనుచు |
| 26 | ఆర్తి | ఆర్తి |
| 4 | అలమన్ | అలమన్ |
| 2 | మధ్యగుడై | మధ్యగుండై |
| 23 | చుందురనుట | చుండుననుట |

| పేజీ. | పంక్తి. | అశుద్ధము. | శుద్ధము. |
|---|---|---|---|
| 358 | 31 | నరసనవ్వ | సరసనవ్వ |
| 361 | 29 | ఉదరాంచు | ఉదయించు |
| 366 | 16 | దూమమహః | ధూమహః |
| 368 | 20 | ఆవి[illegible] | అవియామె |
| 373 | 4 | పరాగములసెడు | పరంగములసెడు |
| | 18 | వ్రసూనరస | ప్రసూనరస |
| 377 | 5 | అసక్తి | ఆసక్తి |
| | 31 | అహ్వానము | ఆహ్వానము |
| | 35 | నవ్వులాడి | నవ్వులాడి |
| 378 | 8 | అసంపెఁగయుండు | ఆసంపెఁగయందు |
| 379 | 13 | యుందము | యందము |
| 382 | 13 | పంసిండికాయల | పసిండికాయల |
| 389 | 8 | ఆప్పద్మా | అప్పద్మా |
| 392 | 7 | ముల్లలత్ | సముల్లలత్ |
| | 8 | తతుళను | తతులను |
| 393 | 30 | పేరిటబోటి | పేరిటిబోటి |
| 395 | 4 | దేహోముల | దేహాముల |
| | 6 | దేహోముల | దేహాముల |
| 398 | 5 | పరుగెత్తినని | పరుగెత్తైనని |
| 399 | 12 | కాళిహాళి | హాళహాళి |
| 402 | 1 | [illegible]యను | అరతియను |
| 405 | 13 | పనూస్థలి | తనూస్థలి |
| | 14 | వేత | సేత |
| 412 | 4 | చంద్రుఁడవెడు | చంద్రుఁడసెడు |
| | 27 | కంసకీర్ణ | కసంకీర్ణ |
| 414 | 1 | బిలసిల్లె | విలసిల్లె |
| 415 | 7 | నరగ | సరగ |
| 417 | 22 | లశావరాహిత | లంశావరాహిత |
| 419 | 17 | మున్నాలనంబు | ముస్తాలనంబు |
| | 27 | విలసనంబువక్ | విలసనంబునక్ |
| | 35 | లగుట్టి | లగునట్టి |
| 421 | 4 | సేయును | సేయుచు |
| 423 | 23 | అవలి | అవ్వలి |
| 426 | 13 | వినర్గ | విసర్గ |
| | 26 | చప్పుడుల | చప్పుడులు |